# శ్రీ మద్భాగవతము

## (పురాణ కథాస్రవంతి)

తెలుగు అనువాదం

ఖరిడేహాల్ వేంకటరావు

ఆంగ్లమూలం

శ్రీమతి కమలా సుబ్రహ్మణ్యం

# శ్రీమద్భాగవతము

ఆంగ్ల మూలం : శ్రీమతి కమలా సుబ్రహ్మణ్యం

తెలుగు అనువాదం : ఖరిడేహల్ వేంకటరావు



ప్రథమ ముద్రణ : ౧౦౦౦ ప్రతులు

మే, ౧౯౯౪



*కంప్యూటర్ టైపు సెట్టింగ్ :*
శ్రీరామా డి.టి.పి. వర్క్స్
అమీర్‌పేట
హైదరాబాదు

*ముద్రణ :*
ఓం సాయి గ్రాఫిక్స్
నారాయణగూడ
హైదరాబాదు
ఫోన్: ౬౬౩౩౩౫, ౬౬౪౧౪౧, ౬౬౧౯౮౧

వెల : రు. 100

*For Copies :*
**K. VENKATA RAO**
Plot No. 2
R & D Defence Enclave
Sikh Village,
Secunderabad - 500 009.

## విషయసూచిక


| | పుట |
|---|---|
| ఆమోదం | i |
| మనవి | xvii |
| విఘ్నేశ్వర ప్రార్థన | xxi |
| సరస్వతి ప్రార్థన | xxi |


## కృతజ్ఞత


ఈ పుస్తకము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణ సహాయ పథకము క్రింద ప్రచురితమైనది. సకాలములో సహాయము నందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతలు.



| | | |
|---|---|---|
| 13. | నారదుడు హస్తినాపుర | 25 |
| 14. | అర్జునుడు ద్వారక నుండి తిరిగివచ్చుట | 26 |
| 15. | గోవు – కుంటి ఎద్దు | 28 |
| 16. | కలి ప్రభావము | 31 |
| 17. | శృంగి శాపము | 32 |

తృతీయ స్కంధము

| | | |
|---|---|---|
| 18. | పవిత్ర గంగానదీ తీరము | 34 |
| 19. | ధారణ | 36 |
| 20. | ప్రభాసలో దారుణకాండ | 38 |
| 21. | ప్రారంభములో | 41 |
| 22. | ఆదివరాహము | 43 |

23. దక్ష పుత్రిక దితి 45
24. ద్వారపాలకులు 47
25. హిరణ్యాక్ష వధ 48
26. కర్దముని తపస్సు 51
27. దేవహూతి ఆగమనము 53
28. ఆదర్శపత్ని 54
29. కపిల వాసుదేవుడు 56
30. కపిలుని బోధలు - 1 58
31. కపిలుని బోధలు - 2 61
32. దేవహూతి మరణము 63


## చతుర్థ స్కంధము


33. ఆకూతి పుత్రుడు 64
34. దత్తాత్రేయుడు 65
35. దక్షుని ఆగ్రహము 66
36. కైలాసములో కలహము 68
37. సతీదేవి ఆత్మ త్యాగము 70
38. మహాదేవుని ఆగ్రహము 71
39. మహాదేవుని క్షమ 72
40. బాలుని ప్రతిజ్ఞ 74
41. ధ్రువుని తపస్సు 77
42. ధ్రువతార 80
43. వేనుడు జన్మించుట 81
44. వేనుని రాజ్యపాలనము 83
45. పృథు మహారాజు 84
46. పృథువు ఆగ్రహము 86
47. భూదేవి నుండి పాలు పిండుట 88
48. తొంబదితొమ్మిది అశ్వమేధములు 89
49. ప్రాచీన బర్హి 91
50. పురంజన వృత్తాంతము 93
51. పురంజనుని సుఖ జీవితము 96
52. అవిజ్ఞాతుడు తిరిగివచ్చుట 98
53. కథలోని అంతరార్థము 100
54. స్వేచ్ఛా మార్గము 102

## పంచమ స్కంధము


| | | |
|---|---|---|
| 55. | ' చేతస సోదరులు | 104 |
| 56. | ' యవ్రతుడు | 106 |
| 57. | ' యవ్రతుని పరిపాలన | 108 |
| 58. | ఋషభుని జన్మము | 108 |
| 59. | ఋషభుని బోధలు | 110 |
| 60. | భరతుడు | 112 |
| 61. | లేడిగా జన్మించిన భరతుడు | 114 |
| 62. | జడ భరతుడు | 114 |
| 63. | పల్లకి మోసిన భరతుడు | 116 |
| 64. | భరతుడు బ్రహ్మవిద్య బోధించుట | 118 |


## షష్ఠమ స్కంధము


| | | |
|---|---|---|
| 65. | అజామీళుని మరణము | 122 |
| 66. | యముని వివరణ | 125 |
| 67. | దక్షుని వంశీయులు | 127 |
| 68. | వృత్రాసురుని జననము | 129 |
| 69. | ఇంద్రునకు వజ్రాయుధము లభించుట | 131 |
| 70. | ఇంద్ర వృత్రాసురుల యుద్ధము | 133 |
| 71. | వృత్రాసురుని వధ | 135 |
| 72. | బ్రహ్మహత్యాపాపము | 136 |
| 73. | చిత్రకేతు మహారాజు | 137 |
| 74. | రాకుమారుని మృతి | 139 |


## సప్తమ స్కంధము


| | | |
|---|---|---|
| 75. | బ్రహ్మవిద్య | 143 |
| 76. | సతీదేవీ శాపము | 145 |
| 77. | మరుత్తుల జననము | 146 |
| 78. | యుధిష్ఠిరుని సందేహము | 148 |
| 79. | హిరణ్యకశిపుడు | 150 |
| 80. | హిరణ్యకశిపునకు వరప్రసాదము | 151 |
| 81. | ప్రహ్లాదుడు | 154 |
| 82. | ప్రహ్లాదుడు నేర్చిన పాఠములు | 156 |
| 83. | ప్రహ్లాదుడు నారాయణు నెరిగిన తీరు | 158 |

84. అంతిమ ఘట్టము 160
85. నృసింహావతారము 162
86. ప్రహ్లాదుడు నృసింహుని స్తుతించుట 164

అష్టమ స్కంధము

87. గజేంద్రుని వృత్తాంతము 169
88. మోక్షము 172
89. అమృత మథనము 173
90. సాగర మథనము – కూర్మావతారము 175
91. కాలకూటము 176
92. లక్ష్మీదేవి ఆవిర్భవించుట 177
93. అమృతము లభించుట 178
94. యుద్ధము పునఃప్రారంభము 181
95. బలి చక్రవర్తి 183
96. వామనావతారము 185
97. బలి చక్రవర్తి యజ్ఞము 188
98. శుక్రుని అభ్యంతరము 190
99. మూడడుగుల భూమి 193
100. బలి మాట నిలబెట్టుకొనుట 195
101. మత్స్యావతారము 197

నవమ స్కంధము

102. మార్కండేయుడు 200
103. మార్కండేయుడు చూచిన దృశ్యము 203
104. సుకన్య 205
105. నాభాగుడు 207
106. అంబరీషుడు 208
107. కాకుత్స్థులు 212
108. సగరుని కుమారులు 215
109. అంశుమంతుడు 216
110. గంగా – భాగీరథి 217
111. సౌదాస మహారాజు 219
112. శ్రీరాముడు 221
113. చంద్రవంశము 224

114. పురూరవుడు 226
115. పరశురాముడు 228
116. కార్తవీర్యుడు 230
117. కౌశికునకు వసిష్ఠుని ఆతిథ్యము 232
118. కౌశికుని నిరుత్సాహము 235
119. కౌశికుని తపస్సు 236
120. త్రిశంకు మహారాజు 239
121. త్రిశంకు స్వర్గము 240
122. శునశ్శేపుడు 243
123. కౌశికుని తప్పిదము 246
124. బ్రహ్మర్షి విశ్వామిత్రుడు 248
125. నహుషుడు 249
126. వాగ్వాదము 251
127. దేవయానిని రక్షించిన రాజు 252
128. దేవయాని పగ 253
129. యయాతి దేవయానిని వివాహమాడుట 255
130. శర్మిష్ఠ 258
131. దేవయాని ఆగ్రహము, శుక్రశాపము 261
132. యయాతి పుత్రులు 264
133. అసంతృప్తి 266
134. దుష్యంతుడు 267
135. శకుంతల 269
136. దుష్యంతుడు శకుంతలను వివాహమాడుట 271
137. శకుంతల ఒప్పుకొనుట 273
138. శకుంతల వేచియుండుట 275
139. శకుంతల ఆశ్రమము విడిచివెళ్లుట 276
140. తల్లి, కుమారుడు 279
141. దుష్యంతుని నిరాదరణ 281
142. పశ్చాత్తప్తుడైన రాజు 284
143. రంతిదేవుడు 286
144. గంగ, వసువులు 288
145. యాదవ వంశము 289

146. అధర్మము ప్రబలుట 292
147. ఆకాశవాణి 294
148. సంకర్షణుడు 296
149. శ్రీకృష్ణ జననము 298
150. శ్రీకృష్ణుని గోకులమునకు గొనిపోవుట 300
151. విష్ణుమాయ 302
152. కంసుని ప్రచారము 304
153. భూలోక స్వర్గము 306
154. పూతన 307
155. శకటాసురుడు, తృణావర్తుడు 310
156. నామకరణము 313
157. కృష్ణుని చిలిపి చేష్టలు 315
158. యశోద చూచిన దృశ్యము 316
159. యశోద కృష్ణుని కట్టివేయుట 318
160. రెండు వృక్షములు 320
161. గోకులములో కృష్ణుడు 322
162. ఆరణ్యక ఫలములు 324
163. గోకులము నుండి బృందావనము 325
164. వత్సుడు, బకుడు 326
165. అఘాసురుడు 328
166. బ్రహ్మదేవుని సంశయము 331
167. సంవత్సరకాలము సత్యము మరుగుపరచి యుంచుట 333
168. బ్రహ్మదేవుని విచారము 335
169. బలరాముడు ధేనుకుని చంపుట 336
170. విషపూరితమైన సరస్సు 338
171. కాళీయుడు 340
172. కాళీయ మర్దనము 343
173. రమణక ద్వీపములో యుద్ధము 345
174. ప్రలంబుడు 347
175. అరణ్య దహనము 348
176. వర్ష ఋతువు 349
177. శరదృతువు 351
178. కృష్ణుని వేణునాద మహిమ 353
179. గోపికలకు కృష్ణుని వాగ్దానము 354

180. బ్రాహ్మణ పత్నుల భక్తి 357
181. బ్రాహ్మణుల పశ్చాత్తాపము 361
182. గోవర్ధన పర్వతము 362
183. ఇంద్రుని ఆగ్రహము 365
184. గోవిందుడుగా పట్టాభిషిక్తుడైన కృష్ణుడు 368
185. వరుణుని నుండి నందుని రక్షించుట 370
186. వెన్నెల రాత్రి 371
187. గోపికలు, కృష్ణుడు 373
188. పోయిన ప్రేమకై వెదకుట 376
189. ప్రేమ బోధ 377
190. రాసక్రీడ 379
191. సుదర్శనుడు, విద్యాధరుడు 380
192. అరిష్టుని మరణము 381
193. కంసుని వద్దకు నారదుని పునరాగమనము 382
194. కంసుడు అక్రూరుని పిలిపించుట 385
195. కేశి వధ 387
196. నారదుడు కృష్ణుని వద్దకు వచ్చుట 388
197. అసురులలో చివరివాడైన వ్యోముడు 390
198. అక్రూరుడు బృందావనము చేరుట 390
199. క్రూరుడైన అక్రూరుడు! 394
200. అక్రూరుడు గాంచిన దృశ్యము 397
201. మధురా నగర వీధులలో బలరామకృష్ణులు 399
202. త్రివక్ర (కుబ్జ) 401
203. ధనుర్భంగము 403
204. కువలయాపీడము హతమారుట 404
205. కంస వధ 406
206. బలరామకృష్ణులు తల్లిదండ్రులను కలుసుకొనుట 410
207. సాందీపుని ఆశ్రమము 413
208. ఉద్ధవుని బృందావనమునకు పంపించుట 415
209. ఉద్ధవుడు గోపికలకు ఉపశమనము కలిగించుట 418
210. అక్రూరుడు హస్తినాపురమునకు వెళ్లుట 422
211. ప్రఖ్యాతి పొందిన హస్తినాపురము 424
212. అక్రూరుని హితబోధ 426
213. జరాసంధుడు మధురను ముట్టడించుట 427
214. కాలయవనుడు 429

5. ముచుకుంద మహారాజు 432
6. ముచుకుందునకు మోక్షము ప్రసాదించుట 435
7. జరాసంధుని మోసగించుట 437
8. కాలయవనుని చరిత్ర 438
9. విదర్భ రాజపుత్రి రుక్మిణి 439
0. రుక్మిణి దూతను పంపుట 441
1. గులాబి వర్ణములో నున్న ద్వారకానగరము 442
2. రుక్మిణి సందేశము 444
3. రుక్మిణి నిస్పృహ చెందుట 446
4. రాకుమారి దేవాలయమునకు నడచివెళ్లుట 449

దశమ స్కంధము – ఉత్తరభాగము

5. రుక్మి నిరాశ చెందుట 451
6. ప్రద్యుమ్నుడు 452
7. మాయావతి 455
8. కృష్ణుడు దొంగిలించి యుండవచ్చు 456
9. ఎలుగుబంటి గుహ 458
0. గౌరవము దక్కించుకొనుట 460
1. సత్రాజిత్తు వధ 461
2. శతధన్వుడు 463
3. అక్రూరుని ఔదార్యము 464
4. ద్రౌపదీ స్వయంవరము 466
35. కాళింది, మిత్రవింద, సత్య 467
36. భద్ర, లక్షణ 471
37. నరకాసురుడు 472
38. బాణాసురుడు 475
39. ఉషా పరిణయము 476
40. బాణాసురుని నగరముపై దాడి 479
41. నృగ మహారాజు 480
42. బలరాముని ఆగ్రహము 482
43. పౌండ్రక వాసుదేవుడు 484
44. బలరాముడు ద్వివిదుని వధించుట 487
45. దుర్యోధనుని పుత్రిక లక్షణ 488
46. కృష్ణునికి విన్నపములు 491
47. చర్చలు 495

248. జరాసంధుడు 497
249. జరాసంధుడు ద్వంద్వ యుద్ధము చేయుట 499
250. రాజసూయ యాగము 501
251. చేది రాజు శిశుపాలుడు 503
252. సాళ్వుడు ద్వారకను ముట్టడించుట 505
253. యుద్ధరంగములో కృష్ణుడు 507
254. సుధాముడు 509
255. జ్ఞాపకమున్నదా? 512
256. పిడికెడు అటుకులు 514
257. భవిష్యద్దర్శనము 515
258. భూతకాలపు ప్రతిధ్వనులు 518
259. ఋషులు గౌరవము తెలుపుట 519
260. దేవకి కోరిక 522
261. సుభద్రాపహరణము 523
262. శ్రుతదేవుడు, బహులాశ్వుడు 525
263. పరీక్షిత్తు సందేహము 526
264. వృకుని వృత్తాంతము 529
265. ముగ్గురిలో ఉత్తముడు 530
266. అర్జునుడు ప్రమాణము చేయుట 531


ఏకాదశ స్కంధము


267. ఋషుల శాపము 535
268. మహా సంగ్రామము 536
269. బలరాముని తీర్థయాత్ర 538
270. దేవతలు ద్వారకను సందర్శించుట 540
271. కృష్ణుడు, ఉద్ధవుడు 542
272. అవధూత గీత - 1 544
273. అవధూత గీత - 2 547
274. అవధూత గీత - 3 551
275. యాదవ కుటుంబము అంతమొందుట 555
276. చివరి గడియ 557


ద్వాదశ స్కంధము


277. శ్రీకృష్ణుని నిర్యాణానంతరము 560
278. పరీక్షిత్తు అంతము 561

279. ఉద్ధవుని విచారము 563
280. ఉండదగు లక్షణములు 565
281. స్వేచ్ఛా మానవుడు 568
282. భక్తి- నిర్వచనము 571
283. కర్మయోగ భక్తియోగములు 572
284. హంస అవతారము 574
285. భక్తి- మరొకసారి 576
286. భగవంతుని విభూతులు 579
287. వివిధ మార్గములు 581
288. మూడు మార్గములు 583
289. ప్రారంభము - సృష్టి 585
290. భక్తియోగము - పునరవలోకనము 587
291. సాంఖ్యము 590
292. ఆది అవతారము - పురుషుడు 593
293. వేదములు వర్ణించిన విరాట్ పురుషుడు 594
ఫలశ్రుతి 596

# ఆమోదం

## ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు

> ''భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
> శూలికైన దమ్మిచూలికైన
> విబుధజనుల వలన విన్నంత కన్నంత
> దెలియవచ్చినంత దేటపఱుతు''.

అన్నాడు మహాకవి, మహాభక్తుడు, సహజ పాండిత్యుడు బమ్మెర పోతనామాత్యుడు. తన పురాకృత శుభాధిక్యం చేతనే ఈ అవకాశభాగ్యం తనకు లభించిందనీ ఇందుచేతనే నన్నయ తిక్కనాదికవులు శ్రీమద్భాగవతాన్ని తెలుగు చేయలేదనీ దీన్ని తెలిగించి తన జననాన్ని సఫలం చేసుకొని పునర్జన్మ లేకుండా చేసుకొంటాననీ ఆయన ఆనందించాడు. దీనికి తగినట్లుగానే, తాను మహేశ్వరధ్యానంలో ఉండగా సాక్షాత్కరించి ''మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబు దెనుఁగు సేయుము నీకు భవబంధంబులు దెగునని'' రామభద్రుడు ఆనతి ఇయ్యడం జరిగింది.

అయితే, భాగవతం తెలిసి పలకడం సామాన్య విషయం కాదు. అది — హరునకు, బ్రహ్మకు కూడా అలవికాని పని! కనుకనే ఇక్కడ పోతన ''చిత్రంబు'' అని ప్రయోగించడం జరిగింది. కేవలం పాండిత్య విషయం అయితే ''కష్టంబు'' అనే వాడేమో! కాని, ఇది పాండిత్య విషయం కాదు. తెలుసుకోవలసిన వస్తువు సర్వాంతర్యామియై, తెలుసుకొనేవాడు, పలికేవాడు దానిలో భాగాలే అయినప్పుడు — తెలియడం, పలకడం చిత్రమైన విషయాలేగదా! దైవానుగ్రహం వల్లనే జరిగేపని ఇది అని అంతరార్థం! దీన్ని సూచించడానికే — ''పలికెడిది భాగవతమట'' అన్నాడు! అంటే, భాగవతమే — పోతనద్వారా పలుకుతోంది గాని ఆయన పలకడం లేదు! శ్రీరామ నారాయణుడే భాగవతమందలి అంతర్యామి అని తెలియజేయడానికే ''పలికించెడివాడు రామభద్రుండట'' అంటాడు వెంటనే! తననోట వెంట వెలువడుతోంది గనుక ''నే బలికిన భవహరమగునట!'' అని చేర్చాడు. ఈ పవిత్రకార్యంలో తన పురుష ప్రయత్నం నిమిత్త మాత్రం అని పోతన సూచించాడు. ఈ విధంగా వ్యక్తం చేసి తన రచన ''అపౌరుషేయం'' అని ధ్వనింపజేసినంత దూరం పోయాడు సహజకవి భక్తపోతన!

తనకు కొంత అయినా భాగవత సంబంధమైన జ్ఞానం కలగడానికి ''విబుధజనుల'' ప్రవచనాదులు వినడం ఒక కారణంగా పేర్కొన్నాడు. శ్రీమద్భాగవతం — సంస్కృత భాగవతమే ఆనాటికి — చాలా కష్టమైన గ్రంథం, దీన్ని గురించి ''భాగవతశాస్త్రం'' అని వ్యాఖ్యాతృ చక్రవర్తి శ్రీధరస్వామి అన్నాడు. పండితలోకంలో ''విద్యావతాం భాగవతే పరీక్షా''

కూడా అంత సులభమైనది కాదను కోవడానికి వీలుగా, ''భాగవతాన్ని తెలుసుకొన్న వారెవరు?'' అనే ప్రశ్నకు పండితలోకంలో ప్రసిద్ధంగా ఈ శ్లోకం ఉంది.

> ''వ్యాసోవేత్తి శుకోవేత్తి రాజావేత్తిన వేత్తివా ।
> శ్రీధరః సకలం వేత్తి శ్రీ నృసింహ ప్రసాదతః ॥''

వ్యాసునకు తెలుసును, శుకునకు తెలుసును, రాజైన పరీక్షిత్తునకు తెలుసునో తెలియదో! శ్రీ నృసింహప్రసాదం వల్ల శ్రీధరునకు సకలం తెలుసును. శ్రీమద్భాగవతానికి అద్వైతపరంగా వ్యాఖ్యానం వ్రాసిన శ్రీధరస్వామి నృసింహోపాసకుడు గనుక ఆయనకు అంతా తెలుసునన్న మాట! ''విబుధజనుల వల్ల విన్నంత'' దాని నుండి తాను తెలుసుకొన్నంత వ్రాశాడు. ఇంక తాను ''కన్నంత'' దాని నుండి తెలుసుకొన్నంత కూడా వ్రాశాడు. సచ్చిదానంద రూపమైన నిర్గుణ పరబ్రహ్మం, సత్త్వరజస్తమో గుణాల నంది సగుణమై త్రిమూర్తులుగా సృష్టి స్థితిలయా లను నిర్వహిస్తుందని వేదాంత దర్శనం తెలుపుతుంది. భాగవతంలో సగుణ బ్రహ్మ అయిన శ్రీ విష్ణువి అవతారలీలలు తద్భక్తి మార్గాలు విపులంగా వర్ణితాలయ్యాయి. వీటి మూలంగా విశుద్ధ మనస్కులైన భక్తులకు, నిర్గుణ పరబ్రహ్మ జ్ఞానం అనుభూతమై కైవల్యం ప్రాప్తిస్తుంది. మూర్తిత్రయం వెనుకగాని, రామకృష్ణాద్యవతారాల వెనుకగాని నిలిచి ఉన్న అంతశ్చైతన్యయుత మైన పరతత్త్వం ఒక్కటే అనే జ్ఞానం వారికి కలుగుతుంది. నామరూపాదికం, ఉపాధ్యాశ్రయం అని అనుభూతమై తదతీతమైన పరతత్త్వం గోచరిస్తుంది. ఈ పరమసత్యాన్ని విబుధజనుల వల్ల ''విన్న'' పోతన, తన పురాకృత పుణ్యవిశేషం చేత సిద్ధించిన కవితాసమాధిలో ''కన్న'' పరమసత్యంతో జోడించి ''తెలియవచ్చినంత'' తేటబరిచాడు. ఇది ఆయన వినయానికి ప్రతీక!

ఈ అంతర్దర్శనం — ఈ ''కనడం'' — ప్రతి మహాకవికి సహజం. శ్రీమద్రామాయణ రచనకు ముందుగా మహర్షి వాల్మీకి ధర్మతత్త్వాన్ని ''కన్నాడు'' — దర్శించాడు:

> ''తతఃపశ్యతి ధర్మాత్మా తత్సర్వం యోగమాస్థితః ।
> పురాయత్తత్రనిర్వృత్తం పాణావామలకం యథా ॥ ''

సర్వాన్ని కరతలామలకంగా దర్శించాడు వాల్మీకి. ఇదే విధంగా మహాభారత రచనకు ముందు వ్యాసమహర్షి ఇదే విధంగా సర్వాన్ని దర్శించాడు:

> ''శుచిః సనియమో వ్యాసః శాంతాత్మా తపసి స్థితః
> భారతస్యేతిహాసస్య ధర్మేణాన్వీక్షితాం గతిం
> ప్రవిశ్యయోగం జ్ఞానేన సోపశ్యత్సర్వమంతతః''

ఇందువల్లనే పెద్దలు ''వాన్మషిః కురుతేకావ్యమ్'' అన్నారు.

శ్రీమద్భాగవతం బయలుదేరిన తరువాతనే గదా దాని వైశిష్ట్యాన్ని గురించి చెప్పుకోవడం జరుగుతుంది! దాన్ని అనువదిస్తున్నప్పుడు గాని, అనుసరించి కథాకథనం చేస్తున్నప్పుడుగాని రచయిత ఎదుర్కొనే సమస్యలను కష్టాలను గూర్చి చెప్పడం కూడా అప్పుడే గదా! ఈ విధంగా చెప్పిన మొదటి తెలుగు మహాకవి పోతన. ఇందువల్లనే భాగవతం విషయంలో ఆయనకున్న అభిప్రాయాల వివరణతో ఈ ''ఆమోదం'' ప్రారంభమయింది. మహాకవి పోతనకే శ్రీమద్భాగవతం అలా కనబడితే ఇంక సామాన్యుల విషయంలో చెప్పేదేముంది? అయితే, సామాన్యులు రసిక భావవిదులు ''వేద కల్పవృక్షవిగలితమై, శుకముఖసుధా ద్రవమున మొనసియున్న భాగవతపురాణ ఫలరసాస్వాదన'' చేయడం ఎలాగ? దానికి మార్గంలేదా? ఉంది! అది భక్తిమార్గం! దీన్ని అనుసరిస్తే ''శ్రీమద్భాగవత పరమార్థం'' కరతలామలకం అవుతుంది. పెద్దలు చెప్పనే చెప్పారు, ''భక్త్యాభాగవతం జ్ఞేయం'' అని. ఈ భక్తి పుష్కలంగా ఉంటే — శ్రీమద్భాగవత పరమార్థాన్ని ఆకళింపునకు తెచ్చుకొనే విషయంలోగాని, తెచ్చుకొన్న విషయాన్ని పదిమందికి తెలియజెప్పే విషయంలోగాని అడ్డంకులుండవు. ఈ భక్తి కలగడం — పూర్వజన్మ సుకృతం మీద, జన్మించిన వంశాదికం మీద, ఈ జన్మలో చేసిన సత్కృషిమీద — చాలావరకు ఆధారపడి ఉంటుంది. అన్నింటికి పైని ఆ భగవంతుని అనుగ్రహం ఉండవలసి ఉండడం ఉండనే ఉంది!

శ్రీమద్భాగవత కథను తేటతెలుగు వచనంలో వివరించిన ఈ గ్రంథకర్త శ్రీ ఖరిడేహాల్ వేంకటరావునకు భగవదనుగ్రహం ఉండనే అనాలి. లేకపోతే దీన్ని తలపెట్టి ఇంత బృహద్గ్రంథాన్ని (293 అధ్యాయాలు) రసవంతంగా పూర్తిచేయడం అనేది జరిగేదేకాదు. ఈయన్ని నేను విజయనగరం మహారాజావారి కళాశాలలో విద్యార్థి దశ నుండి ఎరుగుదును. అప్పటికే ఆ కళాశాలలో ఉద్యోగిస్తున్న (1942-1959) నాకు తరువాత సహాధ్యాపకుడు కూడా అయ్యారు. ఈయన చదువంతా వాణిజ్య శాస్త్రానికి సంబంధించినది. అయినా, ఆనాటికి భవిష్యమైన ఈనాటి ఆధ్యాత్మిక చింతనకు, రచనాపాటవానికి బీజావాపం ఆనాడే జరిగిందనాలి. సరస్వతీనదిలా అంతర్వాహినిగా ఉన్న ఆధ్యాత్మిక సరస్వతి ఈనాటికి బహిర్గతమై ఈయనచేత — భీష్మగీత (విష్ణుసహస్ర నామటీక — జూలై 1991), Sri Sathya Sai Baba — The Omni All (July 1992), ఆత్మబోధ (రాజా — లక్ష్మి ఫౌండేషన్ ప్రచురణ, నవంబరు 1992) మొదలైన వాటిని వ్రాయించింది. 1993-1994లో బృహద్గ్రంథమైన శ్రీమద్భాగవతం తెలుగువచన రూపంలో వెలువడుతోంది! విజయనగరం, జమ్‌షెడ్‌పూర్, హైదరాబాద్, సింగపూర్, పుట్టపర్తి మొదలైన చోట్ల లౌకిక విద్యా విషయాన్ని బోధిస్తూ జీవితం గడిపినా, అంతర్గతంగా జన్మసిద్ధమైన ఆధ్యాత్మికాగ్ని జ్వలిస్తూనే ఉంది. లేకపోతే, వాణిజ్య శాస్త్రవేత్త నోటి వెంట వేదాంత విచారం వెలువడుతుందా? పురాకృత సుకృతంవల్ల భగవద్భక్తి భాగవతసేవ ఉన్న సద్వంశంలో జన్మించారు. భక్తికి విశేష ప్రాముఖ్యాన్ని ఇచ్చిన వారు, పూర్ణ ప్రజ్ఞదర్శన ప్రవర్తకులైన శ్రీమధ్వాచార్యుల వారు. అనంతర కాలంలో వీరి ద్వైతసిద్ధాంతం, గౌడీయవైష్ణవాది ప్రముఖ భాగవతభక్తి సంప్రదాయాలకు తాత్త్విక నేపథ్యాన్ని

ప్రసాదించిందంటే ఈ "బ్రహ్మ" సంప్రదాయ వైశిష్ట్యం తెలుస్తుంది. వీరి సిద్ధాంతానుయాయు లైన వారి కుటుంబంలో పుట్టిన ఈయనకు వినయ విధేయతలు, భక్తిప్రపత్తులు ఆజన్మసిద్ధాలు. ఈయన జనకులు కీ.శే. ఖరిడేహాల్ వేంకటనరసింగరావు పంతులుగారిని నేనెరుగుదును. ఆయన తమ తండ్రిగారైన కీ.శే. ఖరిడేహాల్ శ్రీనివాసరావు పంతులుగారు 1915లో స్థాపించి తమకు పైతృకంగా అప్పజెప్పిన శ్రీవేద వ్యాస ముద్రాలయ (విజయనగరం) నిర్వాహకులుగా చిరకాలం వ్యవహరించి ఎన్నో సద్గ్రంథాలను ప్రచురించారు. వాటిలో శ్రీమద్బ్రహ్మసూత్ర భాష్యాదులు ఎన్నో ఉన్నాయి. శ్రీవేదవ్యాస ముద్రాలయ రజతోత్సవ సందర్భంగా 1940లో శ్రీవేదవ్యాస సంఘటితాలైన శ్రీమద్ భగవద్గీతా విష్ణు సహస్ర నామాలను నిత్యానుష్ఠాన పఠనయోగ్యంగా ఏక సంపుటిగా ప్రచురించి భక్తులకు ఉచితంగా అర్పించారు. తమ పితృపితామహుల సత్ప్రవర్తనాదులవల్ల, ఆశీర్వాద బలం వల్ల, తమ పూర్వపుణ్య విశేషం చేత శ్రీ వేంకటరావునకు భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయి బాబావారి సేవా భాగ్యం దొరికింది. తత్ఫలితంగా, ఈ గద్య భాగవతాన్ని భగవాన్ కరకమలాలలో సమర్పించే సదవకాశం లభించింది.

శ్రీమద్భాగవతం సామాన్యపురాణం కాదు. శ్రీవిష్ణు స్వరూపులైన శ్రీకృష్ణ ద్వైపాయనులు చిత్తశాంతి కోసం రచించినది. వేదాది విభాగం చేసినా, అనేక పురాణాలు కూర్చినా శ్రీ వ్యాసమహర్షికి మనశ్శాంతి కలుగలేదట! కాతరహృదయుడైన ఆ మహర్షికి చిత్తశాంతిని పరితుష్టిని కలిగించింది భాగవతగ్రథనమని సంప్రదాయ విదుల వాక్కు. ఆయన ద్వారా ఆయన పుత్రుడైన శ్రీ శుకమహర్షికి ఈ మహాపురాణం లభించింది. శాపోపహతుడై ఆసన్నమరణుడైన పరీక్షిన్నృపాలునకు శ్రీ శుకయోగి దీన్ని వినిపించాడు. అక్కడ ఉండి దీన్ని విన్న శ్రీ సూతుడు శౌనకాది మహామునులకు దీన్ని ప్రవచించడం, ఆమునుల పరంపరగా ఇది లోకంలో ప్రసిద్ధికి రావడం జరిగిందని సంప్రదాయజ్ఞుల కథనం. నాటి నుండి నేటి దాకా శ్రీమద్భాగవత పురాణం భక్తజనహృత్తాపహారి. శ్రీమద్రామాయణ మహాభారతాలతోబాటు శ్రీ మద్భాగవతానికి కూడా ఆసేతుశీతనగ వ్యాప్తి ఉంది. కొన్ని సంప్రదాయాలలో దీని కున్న ప్రశస్తి ఇంక దేనికీ లేదు. వీటిలో శ్రీ మధ్వాచార్యులవారి బ్రహ్మ సంప్రదాయాన్ని, శ్రీనింబార్కాచార్యులవారి హంస సంప్రదాయాన్ని, శ్రీవల్లభాచార్యులవారి రుద్రసంప్రదాయాన్ని, శ్రీహితహరి వంశచంద్రాచార్యు లవారి రాధావల్లభ సంప్రదాయాన్ని, శ్రీ చైతన్య మహాప్రభువుల అచింత్యభేదాభేద సంప్రదా యాన్ని — ప్రధానంగా పేర్కొనవచ్చును. శ్రీ వల్లభాచార్యులు శ్రీమద్భాగవతాన్ని — ప్రస్థానత్రయంతో బాటు పేర్కొంటూ అది శ్రీవ్యాసుల వారి "సమాధిభాష" అన్నారు:

"వేదాః శ్రీకృష్ణ వాక్యాని వ్యాస సూత్రాణి చైవహి ।
సమాధి భాషా వ్యాసస్య ప్రమాణం తత్ చతుష్టయమ్" ॥

శ్రీమద్భాగవతానికి "పారమహంసీ సంహితా" అనే వ్యవహారం ఉంది. అధ్యాయాల చివర "ఇతి పారమహంస్యాం సంహితాయాం" అని ప్రామాణికమై ఉంది. అంటే పరమహంసల తో(కు) సంబంధించినది అన్నమాట (పరమహంసానాం ఇయం పారమహంసీ). శ్రీమద్భాగ

వత పురాణవక్త జీవన్ముక్తుడు పరమయోగి అయిన శ్రీ శుకదేవుడు. శ్రోతలు — పరీక్షిన్మహారాజు, అసంఖ్యాక పరమహంస శ్రేణులైన ముని పుంగవులు. ఇంక పరీక్షిత్తు కేవల గృహస్థుడు కాడు. విప్రశాపదగ్ధుడై ఏడునాళ్ళలో మృత్యువును ప్రతీక్షిస్తూ విరక్తుడై ఉన్నాడు. ఇంక శుకుడో పరమ విరాగి. ఈ విరక్తిమూచి తండ్రి వ్యాసుడంతటివాడు ''పుత్రా! పుత్రా!'' అని ఘోషిస్తూ అడవిని పడ్డాడు! శ్రీమద్భాగవత ఆవిర్భావ నేపథ్యం ఇది!

ఇంక ''భాగవత'' శబ్దానికి పండితులు వివిధ రీతులలో అర్థవివరణ చేశారు. ''భగవతః ఇదమ్ — భాగవతమ్'': భగవంతుని కథలను చెప్పేది భాగవతం. భగవంతుని ఏకవింశత్యవతారాలు — ప్రథమస్కంధంలో; శ్రీమన్నారాయణుని లీలావతారవర్ణన — ద్వితీయ స్కంధంలో; శ్రీయజ్ఞవరాహావతార వర్ణన — తృతీయ స్కంధంలో; ఋషభావతారవర్ణన — పంచమస్కంధంలో; శ్రీ నృసింహావతార వర్ణన — సప్తమస్కంధంలో; శ్రీ కూర్మావతార వర్ణన, వామనావతార వర్ణన, మత్స్యావతార వర్ణన — అష్టమస్కంధంలో; శ్రీరామ, పరశురామావతారాల వర్ణన — నవమస్కంధంలో; శ్రీ కృష్ణావతార వైభవ వర్ణన — దశమ స్కంధంలో — ఇతర కథలతో ప్రసంగవశాన కలిసి, కనబడతాయి. ఈ విధంగా ధర్మగ్లాని కలిగినప్పుడు తనకుతానుగా భగవానుడు అవతరించి ధర్మరక్షణ, దుష్టశిక్షణ చేస్తాడు. ధర్మరక్షణతో శిష్టరక్షణ కూడా జరుగుతుంది.

''భాగవతానామ్ ఇదమ్ భాగవతమ్'' అని చెప్పినప్పుడు, భాగవతులైన భగవద్భక్తుల కథలు చెప్పేది భాగవతం. పరమభాగవతోత్తములైన ప్రహ్లాద, నారదాదుల కథలు — జగత్ప్రసిద్ధ కథలు — దీనిలో ఉన్నాయి. అవి తెలియని వారు భారవతావనియందు లేరుగదా! భగవత్స్వరూపమే జగత్తంతా. భాగవతమైన జగద్విషయాలను ఈ గ్రంథం వివరిస్తుంది గనుక ఇది భాగవతం. సనాతన సంప్రదాయానుసారం భారతీయ విజ్ఞానాన్ని భాగవతం ప్రదర్శిస్తుంది. శ్రీ శుకయోగి పరీక్షిన్మహారాజునకు విరాట్ స్వరూపం వివరించడం, నారదునకు బ్రహ్మ ప్రపంచ ప్రకారం చెప్పడం — ద్వితీయ స్కంధంలో కనబడుతుంది. పంచమస్కంధంలో శ్రీ శుకులు చేసిన భూగోళవర్ణన ఉంది. నమమస్కంధంలో భవిష్యద్రాజవంశాల, చంద్రవంశరాజుల వివరణ ఉంది. ద్వాదశ స్కంధంలో శ్రీ శుకయోగి చెప్పిన భావికాలగతులు, యుగధర్మాలు, ప్రాకృతాది ప్రళయ విషయాలు ఉన్నాయి. ధ్రువచరిత్రలో ధ్రువస్థితిని వివరించేటప్పుడు శ్రీ భగవానుడు పలికిన పలుకులు మన పూర్వుల జ్యోతిషజ్ఞానాన్ని తెలిపేవిగా ఉన్నాయి. ఈ సందర్భంలో పోతన ఇలా వ్రాశాడు: ''అట్టి దురాపంబును, నన్యాధిష్ఠితంబును, లోకత్రయ ప్రళయ కాలంబునందు నశ్వరంబుగాక ప్రకాశమానంబునునైన ధ్రువక్షితి యను పదంబు ముందట నిరువదియాఱు వేలేండ్లు నన బ్రాపింతువు..'' దీనివెనుక ''భూ అక్షచలనం'' (Precession of the Earth's axis) అనే ఖగోళ సత్యం ఇమిడి ఉంది! ఈ విధంగా శ్రీమద్భాగవతం భారతీయ విజ్ఞాన సర్వస్వంగాను, భక్తిరసాయన నిధువుగాను, తత్త్వజిజ్ఞాసాకోశంగాను దర్శనమిస్తుంది.

సంస్కృతంలో దేవీభాగవతం కూడా ఉండడం వల్ల, "భాగవతం" అన్నప్పుడు, విష్ణుమూర్తి వారి అవతార విశేషాదులను వర్ణించిన భాగవతాన్ని గ్రహించాలా? లేదా దేవ్యవతార విశేషాలను అభివర్ణించిన దేవీ భాగవతాన్ని గ్రహించాలా? అనే ప్రశ్న పండితలోకంలో ఉదయించింది. అష్టాదశపురాణాలను పేర్కొనేటప్పుడు — "మద్వయం భద్వయం చైవ బ్ర త్రయం వ చతుష్టయమ్ । అ, నా, ప, లిం, గ కూ, స్కా ని పురాణాని పృథక్ పృథక్" — అనే శ్లోకం దేవీ భాగవతం లోనిది గుర్తుగా గ్రహించడం ఉంది. దీన్ని బట్టి — మత్స్య, మార్కండేయ — భవిష్య, భాగవత — బ్రహ్మ, బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త — వరాహ, వామన, వాయు, విష్ణు — అగ్ని, నారద, పద్మ, లింగ, గరుడ, కూర్మ, స్కాంద — పురాణాలు లెక్కకి వస్తాయి. అష్టాదశోప పురాణాలు కూడా ఉన్నాయి. ఇంకా వీటిలో వేటిలోను చేరని చాలా పురాణాలు కాలక్రమంగా బయలుదేరాయి. పంచలక్షణ లక్షితమైనది "పురాణం" అన్నారు; కాని, ఆ నిర్వచనం చాలక దశలక్షణాలను క్రమంగా పేర్కొన్నారు. "పురాణం పంచలక్షణమ్" అని, తాను పరీక్షించిన పురాణాల విషయాన్ని విశ్లేషించి చూచి అమరసింహుడు ఒక నిర్వచనం ఇలా ఇచ్చాడు.

"సర్గశ్చ ప్రతిసర్గశ్చవంశోమన్వన్తరాణిచ ।
వంశానుచరితం చేతి లక్షణానాంతు పంచకమ్ ॥ "

స్థూలంగా చెప్పాలంటే — సర్గంలో ఆది సృష్టి విషయం; ప్రతి సర్గంలో (దీనికి విసర్గం అని కూడా పేరుంది) కల్పాంతంలో జరిగే పునస్సృష్టి విషయాలు; వంశంలో — దేవతల, దేవర్షి బ్రహ్మర్షుల గోత్రానుక్రమం; మన్వంతరంలో — ధర్మశాస్త్ర ప్రవర్తకులైన చతుర్దశమనువుల చరిత్రాదికం; వంశానుచరితంలో — సూర్యచంద్ర వంశాలలో ఆవిర్భవించిన మహారాజుల చరిత్రలు; ఉంటాయన్నమాట. సామాన్యంగా పురాణాలలో — జగదుత్పత్తి వికాస క్రమం; వేదాదుల ననుసరించిన ధర్మానుష్ఠానాలు, వివిధ కాలాలలో వాటి ననుష్ఠించి, అనుష్ఠింపజేసిన మహాపురుషుల జీవిత చిత్రణలు; దుష్టశిక్షణ, శిష్టరక్షణ కర్తవ్యంగా భువినవతరించిన భగవంతుని అవతార విశేషాలు — కనబడతాయి. ఈ పంచలక్షణాల నిర్వచనం అవ్యాప్తి దుష్టమైనట్లుగా భావించి కాబోలు శ్రీమద్భాగవతం, పురాణం దశలక్షణ లక్షితమై ఉండాలనీ, పంచలక్షణాలు అల్పపురాణాల (ఉపపురాణాల) విషయమని చెప్పింది :

"పురాణ లక్షణం బ్రహ్మన్ బ్రహ్మర్షి భిర్నిరూపితమ్ ।
శృణుష్వబుద్ధి మాశ్రిత్య వేదశాస్త్రాను సారతః ॥
సర్గోస్యాథవిసర్గశ్చ వృత్తీరక్షాన్తరాణిచ ।
వంశోవంశాను చరితం సంస్థాహేతురపాశ్రయః ॥
దశభిర్లక్షణైర్యుక్తం పురాణం తద్విదోవిదుః ।
కేచిత్పంచవిధం బ్రహ్మన్ మహదల్పవ్యవస్థయా ॥

(శ్రీమద్భాగవతమ్ XII, అధ్యా: 7; శ్లో — 8, 9, 10)

పంచలక్షణాలకు — వృత్తి, రక్ష, సంస్థ, హేతువు, అపాశ్రయం అనే అయిదింటిని చేర్చింది శ్రీమద్భాగవతం. వివిధ జీవుల జీవకల్పనవర్ణన — వృత్తి ; శ్రీహరి ప్రతియుగంలోను వేద ధర్మోద్ధరణకై ఎత్తే — దేవర్షి నరతిర్యగవతారాల వర్ణన — రక్షణ; వివిధ ప్రళయాల — నిత్యనైమిత్తిక ప్రాకృతికాత్యంతిక ప్రళయాల — నిరూపణ వర్ణన — సంస్థ; అవిద్య చేత కర్మకు కర్తయై సర్గాది విషయాలకు నిమిత్తుడైన జీవుని వర్ణన — హేతువు; సాక్షిరూపంగా అన్వితుడు, సమాధ్యాదులందు వ్యతిరిక్తుడు అయిన పరమాత్మని వర్ణన — అపాశ్రయం. తాను స్వీకరించిన విషయాలకు అనుగుణంగా శ్రీమద్భాగవతం ఈ నిర్వచనం చేసినట్లు కనబడుతుంది. ఈ నిర్వచనం అన్వయించని పురాణాలు ఉన్నాయి. ఈ నిర్వచనం వ్యాప్తి చాలినట్లులేక, బ్రహ్మవైవర్తపురాణం ''దశాధిక లక్షణం'' చెప్పింది.

> ''సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వంతరాణిచ ।
> వంశాను చరితం విప్ర! పురాణం పంచలక్షణమ్॥
> ఏతదుపపురాణానాం లక్షణం చ విదుర్బుధా
> మహతాంచపురాణానాం లక్షణం కథయామితే
> సృష్టిశ్చాపి విసృష్టిశ్చస్థితిస్తేషాంచ పాలనమ్
> కర్మణాంవాసనావార్తా మనూనాంచ క్రమేణచ
> వర్ణనం ప్రలయానాంచమోక్షస్యచ నిరూపణమ్
> ఉత్కీర్తనం హరే రేవ దేవానాం చ పృథక్ పృథక్
> దశాధికలక్షణం చ మహతాం పరికీర్తి తమ్ ॥ ''
>
> (బ్రహ్మవైవర్తపురాణమ్ — శ్రీకృష్ణజన్మఖండం)

దీనిలో చెప్పిన — సృష్టి, విసృష్టి, మను ప్రకాశ క్రమాలు పంచలక్షణాలలోని సర్గ, ప్రతిసర్గ మన్వంతరాల వంటివే! స్థితి, పాలనలు వంశవంశాను చరితాలను పోలినవే! భాగవతం చెప్పిన ''సంస్థ''లో చేరిపోతుంది ప్రళయ వర్ణన. హరికీర్తనం, ఇతర దేవతల గుణవర్ణన మొదలైనవి బ్రహ్మవైవర్తపురాణానికి సంబంధించిన విశిష్ట విషయాలేగాని పురాణ సామాన్యానికి అన్వయించవు. మత్స్యపురాణంలో కూడా పురాణ నిర్వచనం కనబడుతోంది. ఇవన్నీ, తమలో విశిష్టంగా ఉన్నవాటిని పంచలక్షణోక్త విషయాలతో కలిపి చెప్పి పురాణ సామాన్యలక్షణాలుగా చెప్పాలని ప్రయత్నించాయి.

పూర్వమీమాంసకుడు కుమారిలభట్టు కూడా పురాణ ప్రసక్తిని తన తంత్రవార్తికంలో తప్ప — అవి చతుర్విధపురుషార్థసాధనకు సాధకాలనీ, స్మృతులకు పురాణాల వల్లనే ప్రామాణికత్వం సిద్ధిస్తుందనీ, వాటిలో వేదంలోని విషయాలే సోదాహరణంగా నిరూపితాలనీ, వాటిలో లౌకిక మైనవీ అలౌకికమైనవి అనేకం ఉంటాయనీ — విపులంగా వివరించాడు. ఈ విపుల వ్యాఖ్యానం చూస్తే, పురాణాలలో లేనిదేదీ ఉండదనిపిస్తోంది (''తేన సర్వ స్మృతీనాం ప్రయోజనవతీ ప్రామాణ్యసిద్ధిః । తత్రయావద్ధర్మమోక్ష సంబంధితద్వేద ప్రభవం । యత్త్వర్థ

సుఖ విషయం తల్లోకవ్యవహార పూర్వకమితి వివేక్తవ్యం। ఏషైవేతిహాసపురాణ యోరప్యుపదేశ వాక్యానాంగతిః। ఉపాఖ్యానానిత్వర్థ వాదేషు వ్యాఖ్యాతాని। యత్తు పృథివీవ్యాపార కథనం తద్ధర్మాధర్మ స్మరణమూలం। దేశకాల పరిమాణమపిలోక జ్యోతిః శాస్త్ర వ్యవహార సిద్ధ్యర్థం దర్శనగణిత సంప్రదాయానుమాన పూర్వకమ్। భావి కథనమపి త్వనాదికాల ప్రవృత్తయుగస్వ భావ ధర్మాధర్మానుష్ఠానఫల విపాకవైచిత్ర్య జ్ఞాన ద్వారేణ వేదమూలమ్....॥ '')

ఇంత విస్తృత పరిధిలో విషయ వివరణ చేసే స్వభావమున్న పురాణాలను పరిమిత సూత్రబద్ధం చేసి నిర్వచించడం అనూహ్యం అనవచ్చును. వాటి విషయం — కేవలం శ్రుతిస్మృతులకు మాత్రమే సంబంధించినది కాదు. వాటికి అవిరోధమైన సమస్త విషయాలు పురాణానికి ఉపాదేయాలే! ఇది గుర్తించిన నారదీయ పురాణం — పురాణాన్ని గురించి ఇలా అంది:

> ''యన్నదృష్టం హి వేదేషు తత్సర్వం లక్ష్యతేస్మృతౌ।
> ఉభయోర్యన్నదృష్టం హి తత్పురాణైః ప్రణీయతే॥ ''

శ్రుతిస్మృతులలో దృష్టం కాని అనేక విషయాలు పురాణాలలో కనబడతాయి. దేశకాల పాత్రానుసారంగా వివిధ విషయాల వివరణ పురాణాలలో ఉంటుంది. అన్నీ అన్ని పురాణాలలో ఉండాలి అనే నియమం లేదు. అన్ని లక్షణాలు అన్ని పురాణాలకు పట్టాలి అని లేదు. ఇట్టి పరిస్థితులలో ఏ నిర్వచనం చేసినా దానికి అవ్యాప్తి దోషం గాని, అతి వ్యాప్తి దోషం గాని పట్టవచ్చును. కాబట్టి నిర్వచనాలను కొండ గురుతులుగానే గ్రహించవలసి ఉంటుంది.

ఇంక పురాణాన్ని సరిగా అర్థం చేసుకొనే విషయంలో వాడిన భాషకు విశేష ప్రాముఖ్యం ఉంది. ఈ భాషను గూర్చి ''పురాణ సంహిత'' ఇలా అంటోంది:

> ''సమాధిభాషా ప్రథమా, లౌకికీతితథా పరా।
> తృతీయాపరకీయేతి, శాస్త్రభాషా త్రిధాస్మృతా॥''

విషయగాంభీర్యాన్ని పురస్కరించుకొని ప్రయోగించిన భాషనిట్లు వింగడించారు పెద్దలు. సమాధి గమ్యాలైన గహనగంభీర తాత్త్విక విషయాల నిరూపణ జరిగిన భాష — సమాధి భాష. ఈ విషయాలనే సులభంగా గ్రహించడానికి వీలుగా లౌకిక విషయాల పోలికతో రూపకాద్యలంకారాలతో వివరించి చెప్పిన భాష — లౌకికి లేదా లౌకిక భాష. కథేతిహాసాల తోడ్పాటుతో ఉదాహరణలను జోడించి గంభీర విషయాలను, ధార్మిక విషయాలను సోపపత్తి కంగా వివరణాత్మకంగా చెప్పడం — పరకీయభాష. వేదోపనిషత్తులు మొదలుకొని పురాణా దుల వరకు గల సమస్త వాఙ్మయ ప్రపంచంలో ఈ త్రిభాషలు గోచరిస్తాయి. అధికారుల తారతమ్యాన్ని బట్టి ఈ భాషా ప్రయోగం ఉంటుంది. ఈ మూడింటి ప్రయోగ బాహుళ్యంలో తరతమ భావం ఉండ వచ్చును. ఒక విధంగా ఇవి సత్త్వరజస్తమోగుణాల హెచ్చు తగ్గుల

వలె భాసిస్తాయి. విషయానుకూలంగా ఒకే గ్రంథంలో ఈ మూడూ చోటు చేసుకోవచ్చును. ధార్మికనైతిక తాత్త్విక విషయాల ప్రబోధం ఏ భాషలో లేదా ఏ భాషలలో చేస్తే బహుజనహితం జరుగుతుందో ఆ భాషను లేదా ఆ భాషలను మహర్షికల్పులైన ప్రాచీనకవులు తమ రచనలలో ప్రయోగించారు. శ్రీమద్భాగవతాన్ని గురించి వ్రాస్తూ శ్రీవల్లభాచార్యులు, అది — ''సమాధి భాషా వ్యాసస్య'' అన్నప్పుడు దాని వైశిష్ట్యం చెప్పడం ఆయన దృష్టి.

పురాణం దశ లక్షణ లక్షితమై ఉండాలని చెప్పిన శ్రీమద్భాగవతమే ''అష్టాదశ పురాణాల''ను పేర్కొంది కూడా :

''బ్రాహ్మం పాద్మం వైష్ణవం చ శైవం లైంగం చ గారుడమ్ ।
నారదీయం భాగవత మాగ్నేయం స్కాంద సంజ్ఞితమ్ ॥
భవిష్యద్బ్రహ్మ వైవర్తం మార్కండేయం స వామనమ్ ।
వారాహమాత్స్య కౌర్మాణి బ్రహ్మాండాఖ్యమితి త్రిషట్ ॥''

(శ్రీమద్భాగవతమ్ XII అధ్యా: 7; శ్లో - 23,24)

చెప్పిన వరుసలో కొంత భేదం ఉన్నా పరంపరయా వ్యాప్తిలో ఉన్న అష్టాదశ పురాణాలే ఇందులోను ఉన్నాయి.

ప్రాచీన పురాణాలు — అష్టాదశ పురాణాల పేర్లను చెప్పడంతో తృప్తిపడక వాటిని — సత్త్వరజస్తమో గుణాత్మకంగా విభజించాయి కూడాను. పద్మపురాణంలోని గుణత్రయ విభాగం ఈ విధంగా ఉంది: సాత్త్విక పురాణాలు — శ్రీమన్నారాయణ పారమ్యాన్ని వ్యక్తీకరిస్తాయి. ఇవి మోక్ష ప్రదాలు. వీటిలో — వైష్ణవ, నారదీయ, భాగవత, గారుడ, పాద్మ, వారాహ పురాణాలు గణనకు వస్తాయి. రాజస పురాణాలు — స్వర్గప్రదాలు. వీటిలో ప్రధానంగా — సరస్వతీ చతుర్ముఖుల, అగ్నిదేవతాస్తుతులుంటాయి. వీటిలో — బ్రహ్మాండ, బ్రహ్మవైవర్త, మార్కండేయ, భవిష్య, వామన, బ్రాహ్మ పురాణాలు చేరతాయి. తామసపురాణాలు పఠన యోగ్యాలు కావనడం ఉంది. వీటిలో — మాత్స్య, కౌర్మ, లైంగ, శైవ, స్కాంద, ఆగ్నేయ పురాణాలున్నాయి. ఈ పేర్లే చెప్పేటట్లు ఆయా పురాణాలలో ఆయా దేవతల ప్రాముఖ్యం అభివర్ణితమైనది.

ఈ విభజనను స్కాందపురాణం అంగీకరించక శివపారమ్యాన్ని తెలియజేయాలా అన్నట్లు — శివపారమ్యాన్ని తెలియజేసేవి పది ఉన్నాయనీ; బ్రహ్మను గూర్చి చెప్పేవి నాలుగున్నా యనీ; హరిని గురించి, దేవిని గురించి చెప్పేవి చెరి రెండూ అని తన పక్షపాత బుద్ధిని ప్రదర్శించింది:

''అష్టాదశ పురాణేషు దశ భిర్గీయతే శివః ।
చతుర్భిర్భగవాన్ బ్రహ్మాద్వాభ్యాం దేవీ తథాహరిః ॥''

స్కాంద పురాణం వ్యక్తం చేసిన అభిప్రాయంతో ఏకీభవించేవారు అత్యంతాల్ప సంఖ్యాకులు

అనడంలో సంశయం లేదు. ఏవి సాత్త్విక పురాణాలు, ఏవి రాజసిక తామసికాలు లనే వాటి విషయంలోను అభిప్రాయభేదాలున్నాయి. ఈ విషయమై ప్రాచీన పురాణమైన మత్స్యపురాణం ఇలా అంది :

> సాత్త్వికేషు పురాణేషు మాహాత్మ్య మధికం హరేః ।
> రాజసేషు చ మాహాత్మ్య మధికం బ్రహ్మణోవిదుః ॥
> తద్వదగ్నేశ్చ మాహాత్మ్యం తామసేషు శివస్యచ ।
> సంకీర్ణేషు సర్వస్యత్యాః పితౄణాం చ నిగద్యతే ॥

ఈ పురాణం — సాత్త్విక, రాజసిక, తామసిక విభజనతో తృప్తిచెందక 'సంకీర్ణ' అనే నాల్గవ విభాగాన్ని తెచ్చి దానిలో సరస్వతి, పితృదేవతల మహిమలను చేర్చింది.

ఆధునికులలో శ్రీహర ప్రసాదశాస్త్రి పురాణ వాఙ్మయాన్ని తలస్పర్శగా పరిశీలించి, విషయాన్ని అనుసరించి ఆ వాఙ్మయాన్ని ఆరు విభాగాలుగా వర్గీకరించారు. ఈనాడు విద్వాంసులందరు ఈ విభజనను అంగీకరిస్తున్నారు. దీని ప్రకారం విజ్ఞాన సర్వస్వాలనదగిన పురాణాలు — గారుడ, ఆగ్నేయ, నారదీయ పురాణాలు; తీర్థవ్రత మాహాత్మ్య వర్ణనాత్మక పురాణాలు — పాద్మ, స్కాంద, భవిష్య పురాణాలు; విశేషంగా పూర్వోత్తర భాగాలలో ప్రక్షిప్తాలున్న పురాణాలు — బ్రాహ్మ, భాగవత, బ్రహ్మ వైవర్త పురాణాలు; ఐతిహాసిక ప్రసంగ బాహుళ్యమున్న పురాణాలు — బ్రహ్మాండ, వాయు పురాణాలు; మతశాఖా ప్రాధాన్యమున్న పురాణాలు — శైవమత సంబంధి లైంగం, వామనం — శాక్తేయ విషయాత్మకమైన మార్కండేయ పురాణం; విష్ణ్వవతార నామాత్మక పురాణాలు — మాత్స్య, కౌర్మ, వారాహ పురాణాలు.

ఏ అంశాన్ని మానదండంగా గ్రహించి విభజన చేసినా కొంత అవ్యాప్తి, కొంత అతి వ్యాప్తి తప్పదనిపిస్తోంది. దీనికి ముఖ్య కారణం — పురాణాలలోని సంకీర్ణ విషయ సామగ్రి — అని చెప్పాలి. అచ్చులేని ఆ దినాలలో — పాఠభేదాలు, ప్రక్షిప్తాలు, చేర్పులు, మార్పులు, ప్రాంతీయ ఆలోచనా విధానాల ననుసరించి సవరింపులు — ప్రతి పురాణంలోను చేటుచేసుకొన్నాయి అనాలి. ఇవిగాక, వివిధ ధార్మిక శాఖలుద్భవించి పురాణాలను ఆధారంగా చేసుకొని తమతమ సిద్ధాంతాలను ప్రచారం చేసుకోవడం ప్రారంభించడంతో; ఏ పురాణంలోను — అంగాంగి సామరస్యం, ఐక్యలక్షణం, ఆఖ్యానాల పూర్వాపర సంబంధం — నిష్కర్షగా కనబడడంపోయింది. పురాణాలు బృహత్కాయాలయ్యాయి. పాతకొత్తలు — మేలు కలయికగా కాకపోయినా — కలిసిపోయాయి. ఈ పరిస్థితులలో పురాణాలు ''కలగూరగంపలు'' కాక తప్పదు గదా! అయినా, ఆధునిక విద్వాంసుల దృష్టిలో — వాయు, బ్రహ్మాండ, మత్స్య, విష్ణుపురాణాలు — మిగిలిన పురాణాల కంటె ప్రాచీనమైనవని. ' ' ప్రక్షిప్తాలు తక్కువగా ఉన్న పురాణాలు — విభిన్న విషయ బాహుళ్యంతో ఉన్న పురాణాల కంటె

— ప్రాచీనమైనవని ఈ విద్వాంసులు నిర్ణయించుకొన్నారన్న మాట!

అష్టాదశ పురాణాల పట్టికల నిచ్చిన అన్ని పురాణ పట్టికలలోను — శ్రీమద్భాగవతం ఇచ్చిన పట్టికలో కూడా — ''భాగవతం'' అనే ఉంది గాని, దాని విషయాన్ని తెలియజేసే విధంగా ఏ విశేషణం కనబడదు. ఇలాంటి అనిశ్చిత స్థితిలో ఆ పట్టికలలోని ''భాగవతం'', విష్ణుపారమ్యాన్ని బోధించే ''శ్రీమద్భాగవతమా'' లేదా ''శ్రీదేవీభాగవతమా''? అనే సంశయం కొందరిని బాధించినా, శతాబ్దులుగా శ్రీమద్భాగవతానికి వచ్చిన ప్రచారం, ఔత్తరాహ వైష్ణవ సంప్రదాయాలన్నీ ఏక కంఠంతో తమ పరమ పవిత్ర గ్రంథం, విష్ణు పారమ్యాన్ని ప్రవచించే శ్రీమద్భాగవతమే అష్టాదశ పుహాపురాణాలలో పేర్కొనబడిన ''భాగవతం'' అని విశ్వసించడంతో, ఈ ప్రశ్నకు శాశ్వతమైన సమాధానం లభించింది అనాలి. శ్రీమత్ అనే దానితో కలిపి భాగవతాన్ని వ్యపదేశించడం ఆచారమయింది.

''కృష్ణస్తు భగవాన్ స్వయమ్'' అని విశ్వసించే భాగవత సంప్రదాయానుయాయులకు — హరి, విష్ణువు, నారాయణుడు — అనే పేర్ల కంటె ''కృష్ణ'' నామమే మధురం. శ్రీ, లక్ష్మి, రుక్మిణీ, సత్యభామాది నామాలకంటె రాధా నామమే ఎక్కువ ప్రీతికరం. రోచకం. బ్రహ్మ సూత్రాలకు వేరే భాష్యం అక్కరలేదనీ, శ్రీ మద్భాగవతమే భాష్యమని వీరి దృఢ విశ్వాసం. అవతారాలన్నీ శ్రీ కృష్ణుడే ఎత్తాడని వారి నమ్మకం. శ్రీ మద్భాగవతమే వ్యాస సూత్రాలకు భాష్యంగా గ్రహించడం వల్లనే ''అచింత్య భేదాభేదం'' అనే శ్రీ చైతన్య సంప్రదాయం వారికి 18వ శతాబ్దిలో బలదేవ విద్యాభూషణుడు ''గోవిందభాష్యం'' వ్రాసేవరకు దాని ఆవశ్యకం కనబడలేదు. గౌడీయ వైష్ణవులకు సంప్రదాయ భాష్యం ఇదే అయింది. అంతకు పూర్వం షడ్గోస్వాములు ఆ సంప్రదాయంలో ఉన్నవారే! భాష్యం వ్రాయగలిగిన వారే! అనావశ్యకమని మానుకొన్నారు! రాజపుత్ర స్థానంలోని జయపూరు రాజసభలో అక్కడి గోవింద విగ్రహానికి సేవాధికారం ఎవరికి ఉంది అనే వివాదం వచ్చినప్పుడు, గౌడీయులకు సంప్రదాయ భాష్యం లేదు గనుక అర్హత లేదనే నిర్ణయం తీసుకోబడుతూ ఉన్న క్లిష్ట సమయంలో, శ్రీ గోవిందుని అనుగ్రహం వల్ల ఒక నెలరోజులలోనే ''గోవింద భాష్యం'' వ్రాసి ఆ సంప్రదాయ ప్రతిష్ఠను ఈయన కాపాడాడు! ఆయన గోవిందానుగ్రహాన్ని గురించి ఇలా అన్నాడు : ''విద్యారూపం భూషణం మేప్రదాయ, ఖ్యాతిం నిన్యే తేనయోమాముదారః, శ్రీ గోవింద స్వప్న నిర్దిష్ట భాష్యో రాధాబంధుర్బంధురాంగః స జీయాత్''. శ్రీ కృష్ణుడే అవతారాలన్నీ ఎత్తినాడనే నమ్మకాన్ని శ్రీ జయదేవుడు గీత గోవిందంలో ''దశాకృతి కృతే కృష్ణాయ తుభ్యం నమః'' అని దశావతార స్తోత్ర శ్లోకాన్ని ముగించడం తెలియజేస్తోంది!

ఏ విషయాలు విశిష్టంగా వర్ణితాలయితే ''భాగవతం'' అనే పేరు సముచితం అనే ప్రశ్న ఉదయించినప్పుడు సమాధానంగా మత్స్యపురాణం ''పురాణ దాన ప్రస్తావన''లో ఇలా చెప్పింది :

''యత్రాధి కృత్యగాయత్రీం వర్ణ్యతే ధర్మ విస్తరః
వృత్రాసుర వధోపేతం తద్భాగవత మిష్యతే''.

గాయత్రీ వర్ణన, ధర్మ వివరణ, వృత్రాసుర వధ దీనిలోని ముఖ్య విషయాలు. వృత్రాసురుడు గొప్ప భక్తుడు; భాగవతుడు. శ్రీ పార్వతీ శాపం వల్ల రాక్షసుడై ఇంద్రుని చేతిలో మరణించి తిరిగి పూర్వమున్న స్థితిని పొందినవాడు. స్కాంద పురాణంలో ఇంకా కొంత వివరణ కూడా ఉంది : ''గ్రంథోష్టాదశ సాహస్రో ద్వాదశస్కంధ సంయుతః, హయగ్రీవ బ్రహ్మవిద్యా యత్ర వృత్రవధస్తథా గాయత్ర్యాచ సమారంభః తద్వై భాగవతం విదుః'' పద్దెనిమిది వేల శ్లోకాలు, పండ్రెండు స్కంధాలు, హయగ్రీవ బ్రహ్మ విద్య, వృత్రాసుర వధ, గాయత్రీ సమారంభం — అనేవి భాగవత ప్రధాన లక్షణాలు. ఇవన్నీ శ్రీమద్భాగవతంలో చోటుచేసుకొన్నాయి. సంస్కృత భాగవతంలోని ప్రథమ శ్లోకం ఇది :

''జన్మాద్యస్య యతోన్వయాదితరతశ్చార్థే ష్వభిజ్ఞ స్స్వరాట్
తేనే బ్రహ్మహృదాయ ఆది కవయే ముహ్యంతియత్సూరయః
తేజోవారి మృదాం యథావినిమయో యత్ర త్రిసర్గోమృషా
ధామ్నా స్వేనసదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి''

దీనికి, దీని ననుసరించిన ఇతర శ్లోకాలకు పోతన తెలుగులో ఇలా అనువాదం చేశాడు. ఇష్ట దేవతా ప్రార్థనాదికం, స్వవంశ వర్ణనాదికం, శ్రీరామచంద్ర సాక్షాత్కారం మొదలైనవి తెలుగు భాగవతంలో ఉన్నా, కథా ప్రారంభం ఈ శ్లోకానువాదంతో మత్స్యపురాణం చెప్పిన లక్షణ నిర్దేశాలతో అవుతుంది. ఇదిగాక, ఈ పురాణమే భాగవతమని పోతన కంఠోక్తిగా చెప్పాడు:

సీ. ''విశ్వ జన్మస్థితి విలయంబులెవ్వని
వలన నేర్పడు ననువర్తనమున
వ్యావర్తనమున, గార్యములందభిజ్ఞు డై
తాన రాజగుచు జిత్తమున జేసి
వేదంబులజునకు విదితముల్ గావించె
నెవ్వడు, బుధులు మోహింతు రెవ్వ
నికి, నెండమావుల నీళ్ల గాచాదులు
నన్యోన్య బుద్ధి దానడరునట్లు
త్రిగుణ సృష్టి యెందు దీపించి సత్యము
భంగి దోచు, స్వప్రభానిరస్త
కుహకుడెవ్వ డతని గోరి చింతించెద
ననఘు సత్యు బరుని ననుదినంబు.

వచనము — ఇట్లు ''సత్యం పరం ధీమహి'' యను గాయత్రీ ప్రారంభంబున గాయత్రీ నామ

బ్రహ్మస్వరూపంబై మత్స్యపురాణంబులోన గాయత్రినధికరించి ధర్మ విస్తరంబును వృత్రాసుర వధంబును నెందు జెప్పంబడునదియ భాగవతంబని పలుకుటం జేసి యీ పురాణంబు శ్రీ మహాభాగవతంబన నొప్పుచుండు''.

సంస్కృత శ్లోకంలోని ''సత్యం'' అనే మాట, గాయత్రీ మంత్రంలోని ''తత్'' శబ్దానికి; ''జన్మాదస్యయతః'' అనేది ''సవితుః'' శబ్దానికి; ''స్వరాట్'' అనేదానికి ''దేవస్య'' అని. ''వరేణ్యం భర్గః'' అనేదానికి ''పరం, ధామ్నాస్వేన నిరస్తకుహకం'' అనేదనీ; ''ధియోయో నః'' అనేదానికి ''తేనేబ్రహ్మహృదా'' అనేదనీ; ''ధీమహి'' అనేదానికి ''ధీమహి'' అని అన్వయం చూపిస్తారు. కొందరు కొంచెం మార్పుతో — సవితుర్దేవస్య = జన్మాద్యస్యయతః; అభిజ్ఞం స్వరాట్ = భర్గః; తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే = ధియోయోనః ప్రచోదయాత్; వరేణ్యం = పరం; సత్యం = తత్; ధీమహి = ధీమహి — అని అర్థం చెప్తుతారు. పిండితార్థం అంతా పరబ్రహ్మలో పర్యవసించవలసినదే! శ్రీధరస్వామి తన వ్యాఖ్యలో ''గాయత్ర్యాఖ్య శ్రీపర బ్రహ్మరూప మేతత్పురాణ మితిసిద్ధం అత ఏవ భాగవతం నామ అన్యదితి నశంకనీయమ్'' గాయత్రి ద్వారా స్తుతింపబడిన దేవుడు — సవితృమండలవర్తి శ్రీమన్నారాయణుడే అని శిష్ట సంప్రదాయం :

> ''ధ్యేయః సదాసవితృ మండల మధ్యవర్తీ
> నారాయణః సరసిజాసన సన్నివిష్టః
> కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటి
> హారీహిరణ్మయ వపుః ధృతశంఖ చక్రః'' ||

అష్టాదశ పురాణాలలోని భాగవతం, శ్రీమద్భాగవతమే అని నిర్ద్వంద్వంగా, గారుడ పురాణం ప్రకటించింది :

> ''అర్థోయం బ్రహ్మసూత్రాణాం భారతార్థ వినిర్ణయః
> గాయత్రీ భాష్య రూపోసౌవేదార్థ పరిబృంహితః
> పురాణానాం సామరూపః సాక్షాద్భాగవతో దితః
> ద్వాదశస్కంధయుక్తోయం శత విచ్ఛేద సంయుతః
> గ్రంథోష్టాదశ సాహస్రః శ్రీమద్భాగవతాభిధః ||''

ఈ శ్లోకాలు శ్రీ మద్భాగవత వైశిష్ట్యాన్ని సంపూర్ణంగా చెప్పాయి.

ఇక్కడ చెప్పబడిన హయగ్రీవ బ్రహ్మ విద్య దధీచి చేత ప్రవర్తితమైన ''నారాయణ కవచం'' వృత్రాసుర వధ సాహచర్యంతో హయగ్రీవ బ్రహ్మవిద్య అన్నప్పుడు అది శ్రీ నారాయణ కవచమే. దధీచి హయగ్రీవత్వం షష్ఠస్కంధంలో ''యద్వా అశ్వ శిరోనామ'' అని సూచింపబడింది.

శ్రీమద్భాగవత ప్రారంభంలో "సత్యం పరం ధీమహి" శ్లోకాంతంలో వచ్చినట్లే, ద్వాదశ స్కంధం చివర కూడా (XII, 13 అధ్యాయం; 18 శ్లోకం) "సత్యం పరంధీమహి" వచ్చే శ్లోకం ఉంది :

> "కస్మైయేన విభాసితోఽయమతులో జ్ఞానప్రదీపః పురా
> తద్రూపేణ చ నారదాయ మునయే కృష్ణాయతద్రూపిణా
> యోగీంద్రాయతదాత్మనాథ భగవద్రాతాయ కారుణ్యతః
> తచ్ఛుద్ధం విమలం విశోక మమృతం సత్యం పరం ధీమహి" ॥

ఈ విధంగా శ్రీమద్భాగవతాన్ని గాయత్రీ మంత్ర సంపుటితమైన దానినిగా గ్రహించాలి.

అనంతర కాలంలో వైష్ణవ సంప్రదాయాలలో దీనికున్న ప్రాముఖ్యాన్ని బట్టి దీని కనేక వ్యాఖ్యలు బయలుదేరినా మొట్టమొదట వచ్చిన అద్వైతపరమైన శ్రీధరస్వామి వ్యాఖ్య చాలా పేరు పొందింది. శ్రీ చైతన్య మహాప్రభువు సంప్రదాయం దీనికి భిన్నమైనదైనా, ఆయన ఇతరులొకరు వ్రాసిన వ్యాఖ్యను గూర్చి "నీ వ్యాఖ్య స్వామిగామిని కాదు; కనుక వ్యభిచారిణి" అని అన్నట్లుగా నానుడి ఉన్నది. ఈ వ్యాఖ్య కింతకంటె "బిరుదు" ఏమికావాలి. శ్రీమద్భాగవ తార్థం, ఈయనకే తెలుసునన్న విశ్వాసాన్ని గురించి ముందే చెప్పుకొన్నాము.

శ్రీమద్భాగవతానికి వందకంటె ఎక్కువగానే వ్యాఖ్యలున్నట్లు చెప్తారు. మొదటి శ్లోకానికి "నూరు" అర్థాలు చెప్పాడు వంశీధరుడు. ఈయన శ్రీధరస్వామి వ్యాఖ్యానికి వ్యాఖ్య వ్రాసినవాడు. ఇది చాలక ఆయన "లీలాకల్పద్రుమం" అనే గ్రంథంలో ఇంకో ఇరవై అయిదు అర్థాలు చేర్చాడంటారు. భక్తిరసామృత సింధువైన భాగవతానికి, ద్వైతమతానుయాయులు చాలా వ్యాఖ్యానాలు వ్రాశారు. శ్రీమధ్వాచార్యులు వారే భాగవత తాత్పర్య నిర్ణయం అనే ఉద్గ్రంథాన్ని వ్రాశారు. సత్యధర్మతీర్థులు టీక వ్రాశారు. ఉత్తరాది మఠ స్వాములు. శ్రీ యాదవార్యులు 1,5,7 స్కంధాలకు టిప్పణి వ్రాశారు. శ్రీనివాస తీర్థులు భాగవతంలోని ఏకాదశ స్కంధానికి వ్యాఖ్య వ్రాశారు. విజయధ్వజ తీర్థులు పూర్ణంగా వ్యాఖ్య వ్రాశారు. సత్యాభినవ తీర్థులు విరోధోద్ధార మనే పేరుతో 367 శ్లోకాలకు — పూర్వాపర సంబంధం కల్పించుకొని వ్యాఖ్య వ్రాశారు. శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయానికి చెందిన సుదర్శన సూరి అనువారు శుక పక్షీయము, వీరరాఘవాచార్యులు భాగవత చంద్ర చంద్రిక వ్రాశారు. నింబార్క సంప్రదాయానికి చెందిన శుకదేవాచార్యులు సిద్ధాంత ప్రదీపము వ్రాశారు. శ్రీవల్లభాచార్య సంప్రదాయానికి చెందిన గిరిధరాచార్యులు ఆధ్యాత్మిక టీక వ్రాశారు. శ్రీవల్లభులే సుబోధిని టీక రచించారు. శ్రీ చైతన్య సంప్రదాయానికి చెందిన సనాతన గోస్వామి బృహద్వైష్ణవతోషిణి (దశమ స్కంధం), జీవగోస్వామి క్రమ సందర్భం రచించారు. విశ్వనాథ చక్రవర్తిసారార్థదర్శిని వ్రాశారు. ఇన్ని వ్యాఖ్యలున్నా భాగవత సారాన్ని శ్రీరామకృష్ణ పరమహంస చెప్పినట్లుగా "The Bhagavata is fried in the butter of Jnana and soaked in the syrup of Bhakti"

(వారి వంగ మూలానికి మతం వారి ఆంగ్ల గ్రంథంలోని అనువాదం) ఎవరూ చెప్పలేదనాలి.

ప్రముఖులైన త్రిమతాచార్యులు ప్రస్థాన త్రయానికి వారివారి సంప్రదాయాలకు అనుకూలంగా మూలసూత్రాలు, వాక్యాలు మొదలైన వాటికి అన్వయాదులు చెప్పి — అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంతాలను ప్రతిపాదించినట్లే, శ్రీమద్భాగవతానికి వ్యాఖ్యలు వ్రాసిన వారందరు తమతమ సిద్ధాంతాలకు అనుకూలంగా శ్రీమద్భాగవతం ఉందని స్థాపించడానికి ప్రయత్నం చేశారు. అన్ని సంప్రదాయాలకు అనుకూలంగా ఉన్నవి, లేనివి కూడా ప్రస్థాన త్రయంలో ఉన్నట్లే శ్రీమద్భాగవతంలోను ఉన్నాయి. శ్రీమద్భాగవతాన్ని చతుర్థ ప్రస్థానం అన్నవారున్నారు. వీటిని సమన్వయించడం ఆయా వ్యాఖ్యాతలకు కష్టమైనట్లు స్పష్టమయ్యే భాగాలు మనకు కనబడతాయి. అయితే భక్తి ప్రాధాన్యం గ్రంథంలో — ఇంచుమించుగా — సర్వే సర్వత్ర కనబడుతూ ఉండడం వల్ల సిద్ధాంత రీత్యా అద్వైతులైనవారు కూడా, శ్రీ శంకరాచార్యుల వారు వివేక చూడామణిలో చెప్పినట్లు "మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అనేదాన్ని అనుసరించినట్లు భక్తిని కూడా ప్రకటిస్తూ రచనలు చేశారు. వీరిలో శ్రీ మధుసూదన సరస్వతులు — భక్తిరసాయన రచయితలు — ప్రముఖులు. వీరు "జ్ఞానాదేవకైవల్యమ్" అని విశ్వసించడంలోను, భక్తిని కలిగి ఉండడంలోను వైరుధ్యం చూడలేదు. సిద్ధాంతాలను స్థాపించవలసిన ఆవశ్యకం లేని భక్తులకు ఈ మార్గం అధికంగా ఆమోదయోగ్యం అనడం అసహజం కాదు.

మా వంశంలో కూడా మా మాతామహులు స్వర్గీయ విష్ణువఝుల రామకృష్ణశాస్త్రిగారు, కడచిన శతాబ్ది చివరి దశాబ్దులలో పిఠాపురం మహారాజా వారైన రావు గంగాధర రామారావు గారి ఆస్థానంలో సంవత్సరానికొకసారి శ్రీమద్భాగవతం పురాణం చెప్పి వార్షికం అందుకొనే వారని తెలుస్తోంది. ఆ సంప్రదాయమే శ్రీమద్భాగవతం మీద నాకు భక్తిశ్రద్ధలను కలిగించాయి. దానికి ఫలితంగా ఈ "ఆమోదం" వ్రాసే భాగ్యం కలిగింది. భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి గళసీమ నలంకరించే ఈ గద్యాంధ్ర భాగవత మందార దామంలో దారంగా నైనా నేనుండే ఈ అవకాశం మిత్రులు శ్రీ ఖరిడేహాల్ వేంకటరావుగారు కల్పించారు. వారికి కృతజ్ఞతాపూర్వక వందనాలు. శ్రీ భగవాన్‌నకు ప్రణామాలు.

> "వంశీ విభూషిత కరాన్నవనీరదాభాత్
> పీతాంబరాదరుణ బింబఫలాధరోష్ఠాత్
> పూర్ణేందు సుందర ముఖాదరవిందనేత్రాత్
> కృష్ణాత్పరంకిమపి తత్త్వమహం నజానే!"

— శ్రీ మధుసూదన సరస్వతి

# మనవి

శ్రీమద్భాగవతము తెలుగువారందరకు సుపరిచితమైన పురాణ గ్రంథము. భాగవతము పేరు వినగానే పోతనగారు జ్ఞప్తికి వచ్చెదరు. వ్యాసుడు రచించిన సంస్కృత భాగవతముకన్న శ్రీ బమ్మెర పోతన గారి భాగవతమే తెలుగువారి మనస్సులలో యెక్కువగా నాటుకున్నది. చాలమంది తెలుగువారికి పోతన గారి భాగవతములోని కొన్ని పద్యములు చెరగని ముద్ర వేసినవి. ఉదాహరణకు గజేంద్ర మోక్షములోని ''ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల...'', ''లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె...'', ''అల వైకుంఠ పురంబులో నగరిలో నా మూల సౌధంబు...'', ''సిరికిం జెప్పడు శంఖ చక్ర యుగముం జేదోయి సంధింపడే....'', యనునవి; ప్రహ్లాద చరిత్రలోని ''కంజాక్షునకు గాని కాయంబు కాయమే? పవగ గుంభిత చర్మ భస్త్రి గాక...'', ''తన్ను నిశాచరుల్ వొడువ దైత్య కుమారుడు మాటి మాటికో పన్నగశాయి!...'', ''ఇందుగల డందులేడని, సందేహము వలదు...'' మున్నగునవి అత్యంత ప్రాముఖ్యము వహించినవి. తేట తెనుగు పదములతో కూడిన పోతనగారి శైలి యిందుకు ప్రధాన కారణము.

భాగవతములోని కథ లన్నియు భగవంతునికి భక్తులపై గల అమిత ప్రేమను వెల్లడించుచు న్నవి. అనన్య భక్తితో నారాయణుని శరణు జొచ్చిన వారందరు యెట్లు రక్షణ పొంది మోక్షము నంది యున్నారో భాగవతము ప్రకటించుచున్నది. భక్తులను రక్షించి ఉద్ధరించుటే గాక దుష్టులను శిక్షించుట కూడ భాగవతము నందలి అనేక కథలలో వెల్లడి యగుచున్నది. శిష్ట రక్షణ, దుష్ట శిక్షణ ప్రతి అవతారము యొక్క ప్రధాన ధ్యేయమని భాగవతములోని కథలు స్పష్టపరచుచున్నవి. మరియు, అహంకారము గర్వము తలయెత్తినపుడు, వారు యింద్రాది దేవతలైనను, వారి అహంకారము గర్వము అణగిన సందర్భములు, వారి తప్పును వారు తెలుసుకుని సరిదిద్దుకొనుట, భాగవతము నందలి కథలలో విస్పష్టముగా గోచరించును. అంతేకాక అసురులుగ జన్మించినప్పటికిని దివ్య భావములు కలిగినట్టి ప్రహ్లాదుడు, బలి చక్రవర్తి బాణాసురుడు మున్నగువారు నారాయణుని అనుగ్రహము పొంది ఉత్తమస్థితిని చేరుకొగలిగిరి. నారాయణుని అనుగ్రహము పొందుటకు వయస్సు, జాతి, లింగ భేదములు లేవని భాగవతము నిరూపించుచున్నది. ప్రహ్లాదుడు, ధ్రువుడు అతి పిన్న వయసులోనే నారాయణానుగ్రహము నకు పాత్రులైరి. అసుర జాతిలో జన్మించినను వృత్రుడు, బలి, బాణుడు నారాయణుని అనుగ్రహము పొంది ధన్యులైరి.

'భాగవతము' నందు అయిదు అక్షరములు గలవు. మొదటి అక్షరము 'భా' భక్తికి, రెండవ అక్షరము 'గ' జ్ఞానమునకు, మూడవ అక్షరము 'వ' వివేక వైరాగ్యములకు, నాలుగవ అక్షరము 'త' తపస్సుకు, ఆఖరిది అయిదవ అక్షరము 'ము' ముక్తికి సంకేతములు. అనగా భక్తి జ్ఞాన

వైరాగ్యములు పెంచుకుని తపస్సు చేసి ముక్తి నందవలెనని భాగవతము సూచించుచున్నది. అందుచేతనే భాగవతము ప్రశస్తమైన పురాణ గ్రంథమని పోతనగారు యెలుగెత్తి చాటినారు.

స్వార్థ పరత్వము, ప్రాపంచిక విషయ భోగలాలసత, దేహ మనోబుద్ధులే తాను అనెడి భ్రాంతి, యీనాటి మానవులలోనే కాదు, ఆనాటి మానవులలో కూడ ప్రబలముగా యుండెడి వను విషయము భాగవతములో అనేక చోట్ల మనకు గోచరమగుచున్నది. అరిషడ్వర్గ ప్రభావము మిక్కుటముగా కనుపిస్తుంది. ధనమదము, విద్యామదము, కులమదము మానవుని యెంతగా దిగజార్చునో భాగవతము నందలి కథలు స్పష్టముగా తెలియజెప్పుచున్నవి. అందులకే మానవులు పురోగమించుటకు, ఆంతర్య కల్మషములను తొలగించుకొనుటకు భాగవతములోని కథలు తోడ్పడగలవని విజ్ఞులు విశ్వసించెదరు.

సత్పురుషులతోడి సత్సాంగత్యము, భాగవత పురాణ పఠనము లేక శ్రవణము వలన మానవులు తమలోని దుశ్చింతనలను వీడి, సచ్చింతనలను పెంపొందించుకుని ఉత్తమస్థితిని చేరగలరు. హృదయావేదనతో సతమతమగుచున్న వ్యాసమహర్షి, నారద మహర్షిచే ప్రేరేపితుడై, భాగవత పురాణ కావ్యము రచించి, వేదనకు దూరుడై, మహదానందము పొందెను. వ్యాస మహర్షి పుత్రుడైన శుకబ్రహ్మ గళము నుండి వెలువడిన భాగవత పురాణ కథలను పరీక్షిత్తు మహారాజు అత్యంత శ్రద్ధతో విని తరించెను.

భాగవతము కేవలము పురాణ కథా స్రవంతి మాత్రమే గాదు, అది యొక అగాధమైన ఆధ్యాత్మిక విజ్ఞాన సర్వస్వము. కపిలునిగా అవతరించిన నారాయణుడు, మాతృమూర్తి దేవహూతికి చేసిన బోధలందును, ఉద్ధవుడు గోపికలకు చేసిన ఉపదేశము లందును, విదుర-మైత్రేయ సంవాదము నందును, ఉద్ధవ గీత, అవధూత గీత లందును, ఆధ్మాతిక విషయముల ప్రస్తావన విశేషముగా గోచరించును. ఈ విషయములు అన్ని కాలములకు, అన్ని దేశములకు, అందరు మానవులకు వర్తించును. ఆదర్శ జీవిత మార్గము నభిలషించుగోరు వారికందరకు అత్యుత్తమమైన సందేశమును భాగవతము అందించుచున్నది.

ఈనాడు భగవదవతారముగా వెలసిన శ్రీ సత్యసాయి బాబా వారు అనేక పర్యాయములు తమ ఆధ్యాత్మిక ప్రసంగములలో భాగవతము యొక్క ఉత్కృష్టతను తెలుపుచు, 'భాగవతము' అను పదమును పలుసార్లు ఉచ్చరించినచో, ఆ ఉచ్చారణ వేగమునకు 'బాగవుతాము' యని వినిపించగలదని సెలవిచ్చిరి. భాగవతమును పఠించినన్నూ, లేక మరొకరు పఠించగా దానిని వినినన్నూ, మానవులు భవరోగమను వ్యాధి నుండి విముక్తులగుట నిస్సంశయము. ఏది మంచో, యేది చెడో తెలియక అభాగ్యుల వలె సంచరించుచున్న మానవాళికి భాగవతము కాంతి దీపమై, జ్ఞాన మార్గములో పయనించుటకు తోడ్పడగలదు.

ఆనాడు శ్రీ బమ్మెర పోతన గారు, విష్ణు అవతారముగా వెలసిన శ్రీరామభద్రుడే తనచేత భాగవతమును వ్రాయించినారని తెలిపినారు. ''పలికెడిది భాగవతమట, పలికించువిభుడు రామభద్రుండట నే బలికిన భవహరమగునట, పలికెద వేఱొండు గాథ బలుకగ నేలా'' యని తాను కేవలము నిమిత్త మాత్రుడనని అత్యంత వినయముతో విన్నవించుకున్నారు. దైవ ప్రేరణ లేనిదే యిట్టి మహత్తరమైన పురాణ గ్రంథములను రచించుట యెవ్వరికిని అలవికాదు. సంస్కృత భాషతో పరిచయము లేకుండుట చేత వ్యాస విరచిత భాగవత కార్యమును పఠించు భాగ్యము నాకు కలుగలేదు. పోతన గారి తెలుగు భాగవతము చదివితిని. మరియు, యిటీవల భారతీయ విద్యాభవన్ వారు శ్రీమతి కమలా సుబ్రహ్మణ్యం గారు ఆంగ్లములో రచించిన భాగవతమును ప్రచురించినారు. ఆ పుస్తకము చదువుచున్నపుడు, మనసులో తెలుగు వాక్య ములు స్ఫురింపజొచ్చినవి. వాటికొక రూపమును కల్పించవలెనను సంకల్పము కలిగినది. పోతనగారిచే పలికించిన ఆ రామభద్రుడే యీనాడు సాయిరామునిగా అవతరించి నాలోని యీ సంకల్పమునకు అంకురార్పణ గావించినాడని దృఢముగా విశ్వసించుచున్నాను. దాని పరిణామమే యీ భాగవత పురాణ కథా స్రవంతి.

భాగవతమును అనేకులు వచన శైలిలో అందించియున్నారు. అయితే యీ భాగవత పురాణ కథా స్రవంతి రచనకు శ్రీమతి కమలా సుబ్రహ్మణ్యంగారు ఆంగ్లములో వ్రాసిన భాగవతమును చదివి ప్రభావితుడ నగుటయే ప్రధాన కారణము. భాగవతము చదివినను వినినను 'బాగవుతా ము'' అని శ్రీ సత్యసాయి బాబా గారు చెప్పినట్లు యింతకు ముందు తెలిపియున్నాను. దానిని వ్రాయుటచేత కూడ బాగవుతామను భావన కలిగి అందుకు పూనుకున్నాను. కనీసం నేను 'బాగవుతా'నను నమ్మకముతో యీ రచనను చేపట్టినాను. ఈ పుస్తకము వ్రాయునపుడు, ప్రూఫులు దిద్దుచున్నపుడు పదే పదే భగవంతుని అవతార గాథలను, లీలలను చింతించుట జరిగినది. నిత్యమూ భగవచ్చింతన గలిగి యుండుటే ప్రధానమని భాగవతములో మొదటి నుండి చివర వరకు గోచరించు భావము నాకు యీ అనుభవము ద్వారా సిద్ధించినది. అది యొక మహద్భాగ్యముగా భావించుచున్నాను.

వ్రాత ప్రతిని ఆమూలాగ్రము చదివి, దానిని పరిష్కరించి యెన్నో మెరుగులు దిద్దిన శ్రీమచ్ఛ్రీరంగం నల్లాన్ చక్రవర్తి రామానుజాచార్యుల అయ్యావార్ల గారికి మిక్కిలి కృతజ్ఞుడను. శ్రీ రామానుజాచార్యులు గారు పెక్కు సూచనలు చేసినారు. వారి సూచనల ప్రకారము వ్రాతప్రతిని సవరించుట జరిగినది. అత్యంత శ్రద్ధతో అతి తక్కువ కాలములో సుమారు 850 పుటల వ్రాతప్రతిని సవరించి సూచన లిచ్చుట సామాన్యమైన కార్యము గాదు. ఈ గ్రంథమున కొక రూపము కల్పించుటలో వారి సహాయ సంపత్తులు అమూల్యము, వారికి నేనెంతో ఋణపడి యున్నాను.

శ్రీమతి కమలా సుబ్రహ్మణ్యంగారు ఆంగ్లములో రచించిన శ్రీమద్భాగవతమును తెలుగులో వ్రాయుటకు భారతీయ విద్యాభవన్ నిర్వాహకులు అంగీకారము నొసగిరి వారికి నేను కృతజ్ఞుడను.

ఆంధ్ర సాహితీ ప్రపంచములో ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు గారు ప్రముఖ పరిశోధకులుగా విమర్శకులుగా ప్రసిద్ధి గాంచినవారు. మహారాజ కళాశాలలో వారు నాకు గురువులు అదే కళాశాలలో తరువాత వారితో కలిసి ఉపన్యాసకునిగా పనిచేయు భాగ్యము కలిగినది అతి పిన్నవయసులోనే విజయనగర మహారాజు కళాశాలలో ప్రధానోపన్యాసకులుగా ప్రారంభించి, తదుపరి ఢిల్లీ విశ్వవిద్యాలయము, అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయము, తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాదులోని కేంద్రీయ విశ్వవిద్యాలయములలో ఆచార్య పదవులు నిర్వహించారు. కొంతకాలము తెలుగు అకాడమిలోను, ఆంధ్రప్రభుత్వ అధికార భాషా సంఘ అధ్యక్షులుగను పనిచేసిరి. సి పి. బ్రౌన్ ఆంధ్ర భాషకు చేసిన సేవ గురించి ఆచార్య వీరభద్రరావుగారు సలిపిన పరిశోధన మిక్కిలి ప్రసిద్ధి పొందినది. శ్రీ వీరభద్రరావుగారు శిష్య వాత్సల్యముతో నేను కోరిన వెంటనే యీ పుస్తకమునకు 'ఆమోదం' అను పేరుతో తొలిపలుకు వ్రాయుట కంగీకరించి యిచ్చినారు. వారికి నా కృతజ్ఞతా పూర్వక వందనములు

ఈ పుస్తకమునకు ముఖచిత్రమును అందముగా తీర్చిదిద్దిన శ్రీ కె వి భీమారావుగారు భారతప్రభుత్వ సంస్థ ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియాలో సాంకేతిక నిపుణులు చిత్రకళలో మిక్కిలి అభిరుచి గలవారు. పరిశ్రమల యాజమాన్యము, నిర్వహణ, ఉత్పాదకత మున్నగు అంశములపై శ్రీ భీమారావుగారు వేసిన కార్టూనులు బహుముఖ ప్రశంసల నందుకున్నవి. నా కోరిక మేరకు ముఖచిత్రము వేసిన శ్రీ భీమారావుగారికి కృతజ్ఞుడను

ఈ పుస్తకము వ్రాయ సంకల్పించి నప్పటినుండి విశేషమైన ఉత్సాహ। త్సాహము లందించిన మిత్రులలో ముఖ్యులు శ్రీ వై.బి తాతారావుగారు. శ్రీ తాతారావుగారు ఆం। విశ్వవిద్యాలయములో నాకు సహాధ్యాయులు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో ప్రముఖ న్యాయవా . శ్రీ తాతారావుగారు ఆస్తికులు, భక్తిపరులు. మన ప్రాచీన సనాతన ధర్మముపై వారికి విశేషమైన గౌరవము, విశ్వాసము కలవు. వేనింతకు పూర్వము రచించి చురించిన భీష్మగీత, ఆత్మబోధలను చదివి మెచ్చుకుని, ప్రస్తుతం యీ భాగవత పురాణ కథా। వంతి ప్రచురణకు సహాయ సహకారము లందించుటకు ముందుకు వచ్చిన శ్రీ తాతారావుగా కి కృతజ్ఞుడను.

భగవాన్ శ్రీసత్యసాయి బాబా వారి అనుగ్రహబలము చేత 1991 లో భీష్మగీత, 1992 లో **Sri Sathya Sai Baba — The Omni All,** ఆత్మబోధ అను పుస్తకములను రచించి ప్రచురించడమైనది. వారియొక్క అనుగ్రహము చేతనే యీ భాగవత పురాణ కథాస్రవంతిని వ్రాయుట కుపక్రమించి పూర్తి చేయగలిగితిని. ఈ పుస్తక రచనకు స్ఫూర్తిని శక్తిని ప్రసాదించిన శ్రీ సత్యసాయి బాబా వారి పాదపద్మములకు దీనిని సమర్పించుచున్నాను ఇంతకు పూర్వము రచించి ప్రచురించిన పుస్తకముల నాదరించిన తీరులోనే పాఠకులు యీ భాగవత పురాణ కథాస్రవంతిని ఆదరించగలరని ఆశిస్తున్నాను.

ఫాల్గుణము, శ్రీముఖ

మార్చి, 1994 ఖరిడేహాల్ వేంకటరావు

## విఘ్నేశ్వర ప్రార్థన

శుక్లాం బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోప శాంతయే.

## సరస్వతీ ప్రార్థన

అమ్మల గన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడు పాఱడి పుచ్చినయమ్మ తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల [illegible] మ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యీవుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.

(పోతన భాగవతము, ప్రథమ స్కంధము, పద్యము 8)

# ప్రథమ స్కంధము

## 1 నైమిశారణ్యము

హిమవత్పర్వత దక్షిణ దిక్కువైపు తొందరగా అతడు అడుగులు వేయుచూ యేకాకిగా నడచుచుండెను ఆకాశముపై కెగుయుచున్న పొగలను చూసి ఆ ప్రదేశము యెంత దూరమో అంచనా వేయజొచ్చెను అది యెక్కువ దూరములో లేదని గ్రహించి, తొందర తొందరగా అడుగులు వేయుచు, ఆ ప్రదేశము చేరుకొనెను అచట అనేక ఆశ్రమములు కలవు అది నైమిశారణ్యము అతనిని చూచి అచ్చటి ఋషులు లేచి నిలబడి సంతోషముగా స్వాగతము పలికిరి అతనికి అర్ఘ్య పాద్యములు సమర్పించి, అతడు సేదదేరిన పిమ్మట అత్యంత వినయముగా అతని కుశల మడిగి తెలిసికొనిరి అచ్చట చేరిన ఋషులందరిలో పెద్దవాడైన శౌనకుడు లేచి నమస్కరించి అతనితో నిట్లనెను ''మా ఆశ్రమములు రోమహర్షణుని కుమారులైన ఉగ్రశ్రవుని రాకచేత పావనమైనవి మహర్షి వ్యాసులవారు మీ తండ్రిగారికి గురువులు. వ్యాసుని దగ్గర మీ తండ్రిగారు సకల పురాణములు నేర్చినారు మీరు సూత పౌరాణికులుగా మిక్కిలి ప్రఖ్యాతి గాంచి యున్నారు మీ పాదముల చెంత కూర్చుని మీరు ప్రవచించు అనేక పురాణ గాధలను వినుటకు మేమెంతో ఆత్రముతో యెదురు చూచుచున్నాము వాటిని మాకు వివరంగా చెప్పవలసినదిగా వేడుకొనుచున్నాము'' సూతుడు విని చిరునవ్వుతో యిట్లు చెప్పదొడంగెను ''మీరు బ్రహ్మ సత్రమను యజ్ఞమును నిర్వహించుటకు సన్నద్ధులుగా నున్నట్లు వినియున్నాను ఇది వేయి సంవత్సరములు జరుగిగలదని తెలియవచ్చినది ద్వాపర యుగము అంతమై కలియుగము ప్రారంభము కానున్నది కలియుగమందు యీ భూమిపై అధర్మము, అన్యాయము విచ్చలవిడిగా నాట్యము చేయును కాని యీ పవిత్ర ప్రదేశముపై కలి ప్రభావము ఉండబోదు అందుకే నేనిక్కడకు వచ్చితిని మీకు నేను యే విధముగా సహాయపడగలనో సెలవివ్వండి నా శక్తి మేరకు మీకు సంతోషము కల్గించుటకు ప్రయత్నించెదను''

''కలియుగమందు యీ భూలోకపు దారుణస్థితి నూహించుకుని భయము చెందుచున్నాము'' అని శౌనకుడు పలికెను ''మానవులు నూరు సంవత్సరముల నిండు జీవితము జీవింపలేరు రోగముల చేత యౌవనము తీరకమునుపే అనేకులు మృతి చెందగలరు అనేక యాతి బాధలచేత ప్రజలు వ్యధ చెందుదురు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే అరిషడ్వర్గము చేత మానవుల మనస్సులు కలుషితమగును వీటి మూలముగా అనేక దుష్ట ప్రభావములకు లోనగుదురు అజ్ఞానముచేత బుద్ధిహీనులై ప్రవర్తించెదరు. ఈ అజ్ఞానము (మాయ) నుండి తేరుకుని, పాప రహితమైన జీవితము గడపవలెనన్నచో, వేదములు పురాణములు ధర్మశాస్త్రములును అధ్యయనము చేయవలసి యున్నది కాని యీనాటి మానవులకు తగిన సమయముగాని పరనాసక్తిగాని లేవు అందుచేత, యే గొప్ప కావ్యమును అధ్యయనము చేసిన మానవులు పరిశుద్ధులై కర్మబంధ విముక్తులగుదురో కరుణించి తెలియజేయ గోరెదము

''సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు అవతారమైన శ్రీకృష్ణుడు ద్వాపర యుగమందు యీ భూమిపై ఆవిర్భవించి నాడు. శ్రీకృష్ణుడు అవతారము చాలించి తిరిగి వెళ్ళిపోయినాడు అతడు యీ భూమి నుండి నిష్క్రమించుటతో డనే ధర్మము అడుగంటినది ప్రజలు అజ్ఞానమనే అంధకారములో చిక్కుకుని యున్నారు ఓ మహర్షీ! శ్రీకృష్ణుని

అనంతరము ధర్మము యెచ్చట కేగినది? ఈ విషయము వివరముగా మాకు తెలియజెప్ప గోరెదము''

ఉగ్రశ్రవుడు, శౌనకుని ప్రశ్నలు శ్రద్ధగా విని, చిరునవ్వుతో యిట్లనెను ''శ్రీకృష్ణుని నిర్యాణానంతరము ధర్మము యెచ్చట ఆశ్రయము పొందినదో మీకు వివరించెదను ఈ కలియుగమున మానవుని మనస్సునందుండే అంధకారమును పోగొ ఆ సూర్యుడే భాగవత పురాణముగా వెలసినాడు ఈ భాగవత పురాణమును మహర్షి వేదవ్యాసుడు రచించినాడు భగవంతుడు యీ భూమిపై ధర్మము స్థాపించుటకు పెక్కు అవతారములు ధరించినాడు ఆ అవతార గాధలే భాగవతముగా రూపొందెను భగవంతుడు అనంతుడు, అగ్రాహ్యుడు. కార్య కారణముల కతీతుడు సామాన్య మానవులవలె సంసార బంధమునకు కట్టుబడక, జనన మరణములు లేనివాడు అతడు సర్వాతీతుడు భగవంతుని అఖండ వైభవమును సామాన్యులు గుర్తించలేరు మానవుని దృష్టి పరిమితము, బుద్ధి పరిమితము, ఇంద్రియ శక్తులు పరిమితము. తన పరిమిత శక్తులతో భగవంతుని వైభవమును మానవుడు తనకు గల గుణములు, బుద్ధి మేరకు మాత్రమే ఊహించ గలుగును మానవుల పరిమితత్త్వమును గుర్తించి, కరుణా స్వరూపుడైన భగవంతుడు యిదివరలో మానవులు చూచుటకనువుగా అనేక అవతారము లెత్తినాడు పెక్కుమారులు యీ భూమిపై అవతరించి పదే పదే మానవుడు మాధవుడుగా మారుటకు సహాయపడుతూ వచ్చెను ధర్మమునకు హాని సంభవించినపుడు యీ భూమిపై అవతరించి తిరిగి ధర్మమును పునరుద్ధరించెను

''పాప పంకిలమైన జీవితము గడిపే యీనాటి మానవులకు భగవంతుని ధ్యానించుట అసాధ్యమగుచున్నది అయితే మిక్కిలి పాపి కూడను భగవదవతార కథలను వినినచో తరింపగలడు భగవదవతార కథల సంకలనమే భాగవతము భక్తియే భగవంతుని చేరుటకు అతి సులభ మార్గము అన్ని అవతారములందు భక్తి ప్రధాన మార్గమని స్పష్టముగా తెలియ వచ్చినది భాగవతము ఒక జపమాల వంటిది ఒకొక్కపూస ఒకొక్క అవతార గాధను వివరిస్తున్నది దీని నాధారముగా చేసికొని భగవంతుని చేరవచ్చును వ్యాసులవారు మానవ శ్రేయస్సు ప్రధానముగా దృష్టి యందుంచుకుని యీ భాగవత పురాణమును సమకూర్చినారు అది యేవిధంగా వచ్చినదీ నేను మీకు వివరించెదను''

## 2 నారదాగమనము

సరస్వతీ నది మెల్లగా ప్రవహిస్తున్నది ఆ నది ఒడ్డున శ్రీ వ్యాస మహర్షి ఆశ్రమమున్నది. అది సాయం సమయం నదీ తీరపు ఇసుక తిన్నెలపై వ్యాసుడు కూర్చుని నదిలోని అలలను రెప్పవాల్చక చూచుచుండెను అతని కనులు విచారమును, ముఖము యేదో కీడును సూచిస్తున్నది అతని కనులలో యేదో అగాధమైన బాధ ప్రతిబింబిస్తున్నది అతడక్కడ అట్లే చాలసేపు కూర్చుని యుండెను

అంతవరకు అతని చుట్టూ ఆవరించియున్న నిశ్శబ్దము పటాపంచలయ్యెను మధుర వీణానాదము వ్యాసుని చెవులను సోకెను. వీణానాదముతోపాటు నారాయణుని కీర్తనము అతని చెవుల పడెను. వ్యాసుడు మధుర గానము వినిపిస్తున్న దిక్కువైపు ఆత్రముగా చూచెను. నారద మహర్షి తనవైపుగా వచ్చుట గమనించెను. వ్యాసుడు సంభ్రమముతో లేచి నిల్చుని, నారద మహర్షిని సాదరముగా ఆహ్వానించి, ఉచితాసనముపై

కూర్చుండబెట్టెను బ్రహ్మ మానసపుత్రుడైన నారదుని పాదముల చెంత వ్యాసుడు కూర్చుండెను.

నారదుడు వ్యాసునివైపు చూచి చిరునవ్వు నవ్వి యిట్లు పలుకరించెను ''నీకు కుశలమే గదా! ఎట్టి అనారోగ్యము లేక నీవు క్షేమముగా ఉంటున్నావు గదా! ప్రశాంత సరస్సువలె నుండే నీ మనస్సుకు యెటువంటి అలజడులు కలుగట లేదు కదా! మహాభారత రచన పూర్తిచేసి మిక్కిలి సంతోషముగా నున్నావని భావించెదను. మహాభారత గ్రంధము నిజముగా ఒక విజ్ఞాన సర్వస్వము దీని మూలముగా ఒక గొప్ప ప్రయోజనము నెరవేరినది భావిపౌరులకు దీనివలన యెంతో మేలు చేకూరగలదు అదియుగాక నీవు బ్రహ్మ విద్యను సంపూర్ణముగా యెఱిగినవాడవు నీ కెట్టి విచారము ఉండుటకు తావులేదు'' నారదుడు పలికిన పలుకులు విని వ్యాసుడు నిశ్శబ్దముగా ఊరకొని యుండెను తిరిగి నారదుడు యిట్లు పలికెను. ''నీవు యేదో విచారముతో నున్నట్లు తోచుచున్నది సాధించవలసినదేదో సాధింపలేని వానివలె నీవు నా కగపడుచున్నావు. ఎంతో సాధించినప్పటికీ, యింకా యేదో కొరత యున్నట్లు నీవు బాధపడుచున్నావని తెలియుచున్నది నిన్ను బాధించుచున్న విషయమేమిటి? విచారముగా నుండుటకు కారణమేమి?'' అంతట వ్యాసుడు, ''మీరన్నది అక్షరాలా నిజము నాకు గల సందేహములను మీరు మాత్రమే తీర్చగలరు తమరు మిక్కిలి బుద్ధిశాలురు, మరియు బ్రహ్మ మానసపుత్రులు నిత్యము ఆ శ్రీమన్నారాయణుని కీర్తించు మీ బుద్ధికి అతీతమైనది ఏదియులేదు సూర్యునివలె ముల్లోకములను చూడగలరు. యోగశక్తిచేత, వాయువువలె, మానవులందు ప్రవేశించి వారి మనస్సులో యేమున్నదో తెలుసుకొనగలరు నేను విచారముగా నుండుటకుగల కారణము మీకు తెలిసియే యుండును'', అని పలికెను

వ్యాసుడు మరల యిట్లనెను. ''చాలాకాలము క్రితము నేను ధ్యానములో నిమగ్నుడైయున్నాను నా మనో నేత్రముతో భవిష్యత్తులో ప్రపంచపు తీరును పరికించాను. ధర్మము క్షీణించుటయు, మానవులు పతనము చెందుటయు చూచినాను కలి ప్రభావముచేత యీ భూమిపై పాపము విస్తరించుట చూచియున్నాను గత వైభవము, సాంప్రదాయము క్రమేపి దిగజారుట కాంచియున్నాను కలియుగములో జన్మించే మానవుల దుస్థితి

-                         ·యంత విచారము కలుగుచున్నది వారిని ఉద్ధరించుటకు తోడుపడవలెనని నిశ్చయించు కున్నాను. వేదములను పరిష్కరించి, నాలుగు భాగములుగ విభజించి వాటిని నా శిష్యులకు బోధించినాను పైల మహర్షి ఋగ్వేదమును, జైమిని సామవేదమును అభ్యసించిరి వైశంపాయనుడొక్కడు మాత్రమే యజుర్వేద మును సంపూర్ణముగా నేర్చి ప్రావీణ్యము గడించెను. అధర్వ వేదమును సుమంతుడు నేర్చెను రోమహర్షణునికి పదిహేడు పురాణములు, ఇతిహాసములును బోధించితిని నేను బోధించిన వేదములను నా శిష్యులు తిరిగి వాటిని విభజించి వారి శిష్యులకు బోధించగా వారు మరల వారి శిష్యులకు బోధింపదొడగిరి

''నేను యింతవరకు సాధించినది చాల తక్కువ వేదములను అధ్యయనము చేయలేనివారు, అధ్యయనము చేయుటకనర్హులైన వారు కూడ రక్షణ పొందవలెను కదా! అందుచేత వేదములు ఘోషించిన ధర్మములను మహాభారత కథయందు జొప్పించి రచించితిని ఈ విధముగా మానవాళిని ఉద్ధరింప బూనుకున్నాను

''అయినప్పటికీ, ఓ నారదా! ఇది నాకు సంతృప్తి నిచ్చుట లేదు నేను చేసినది సరియైనదగుచో నాకు మనశ్శాంతి కలుగవలెను కదా! కాని నాకు మనశ్శాంతి కలుగుట లేదు. నా కర్తవ్యమేదో సెలవియ్యండి ఏది చేసిన నాకు మనశ్శాంతి లభించగలదు? కృపతో చెప్పండి మనశ్శాంతి లేకుండుటచేత నాకు మిక్కిలి విచారము కలుగుచున్నది''

నారదుని మోము దరహాసముతో ప్రకాశించెను. చిరునవ్వు నవ్వి, నారదుడు ''నాకు తెలుసును నీవు సాధించినది అతి స్వల్పము'' అనెను

ఆశ్చర్యముతో వ్యాసుడు, ''అతి స్వల్పమా? నా శక్తి మేరకు ప్రయత్నించి చేయగల్గినది చేసినాను నేను చక్కగా ఆలోచించి మానవుల శ్రేయస్సుకు అవసరమైన ధర్మ మార్గమును వివరించినాను ఇంకను మిగిలినదే మిటో దయచేసి తెలియచెప్పు''డని ప్రార్థించెను.

''నీవు సాధించినది అతి స్వల్పము'' అని నారదుడు మరొకసారి స్పష్టముగా తెలిపి, మరల యిట్లు చెప్ప నారభించెను. ''నీవు సాధించవలసినది మరికొంత యున్నది. ఆ పిమ్మటనే నీకు శాంతి చేకూరకలదు మహాభారతము రచించి మానవాళికి యెంతో సేవచేసినావు. అందులో యెటువంటి సంశయము లేదు అయితే ఆ మహా కావ్యములో ఒక లోపమున్నది ''

గురువు చెప్పునది శిష్యుడు శ్రద్ధగా యెట్లు వినునో, అదే రీతిగా వ్యాసుడు నారదుని పలుకులను వినుచుండెను మహాభారతమందు లోపమా! అది యేమిటో తెలుసుకొనవలెనని వ్యాసుడు కుతూహలపడుచు న్నాడు వ్యాసుడు యేమీ పలుకలేదు కాని అతని కనులు మాత్రము యీ విధముగా ప్రశ్నించునట్లు ఉండెను. ''కరుణించి వివరించండి. ఆ లోపమెట్టిదో దానిని యే విధముగా సరిదిద్దగలనో సెలవీయండి అది తెలుసుకొ మన్నది''

నారదుడు యీ విధముగా చెప్ప మొదలిడెను. ''ప్రపంచ శ్రేయస్సును కోరి, పాండవులు యే విధముగా ధర్మవర్తనులై చరించినదీ, చివరకు ధర్మము జయించిన తీరును మహాభారత కథయందు వివరించినావు అంతేకాక యెచ్చట కృష్ణుడు ఉండునో అచ్చట ధర్మము విలసిల్లగలదని తెలిపినావు ఈ ముఖ్య విషయము ప్రజలు గ్రహించగలరు. మొదటి నుండి చివరవరకు మహాభారతములో మానవుని విధ్యుక్త ధర్మములు, నిస్స్వార్థముగా వాటిని నిర్వర్తించ వలసిన విధము తెలియపరిచినావు భగవద్గీత, యితర ప్రవచనములు ధర్మ, కర్మముల ప్రాముఖ్యమును వి క్రీ లేదు భగవంతుని చేరుటకు భక్తిమార్గము అతి సులభమైనదని నీకు తెలియనిది కాదు ఇతర మార్గములు అతిక్లిష్టమైనవి.

''నారాయణుని కీ లేకున్నప్పటికీ, లేక సుస్వరముతో గానము చేయలేకున్నప్ప టికీ, భగవదనుగ్రహము మానవులకు కలుగునను మాటలో యెట్టి సంశయము లేదు కదా! అరణిని చిలుకగా మొదట పొగవచ్చి తర్వాత మంటపుట్టి ఆ మంటచే కట్టె దగ్ధమైన రీతిగా, నిరంతరము నారాయణ కీర్తన గానము చేయుట వలన మానవుని మనస్సులోని దుష్టబుద్ధులు వెలుపలికి వచ్చును సహజమైన సాత్త్విక స్వభావము అగ్నివలె ప్రజ్వలించి, కర్మ ఫలముల నశింపజేసి, విముక్తిని కలిగించును

''మహాభారతము వొక నాటకముగా చిత్రించినావు ప్రతి పాత్రయందు నీవు ప్రవేశించినావు ఆ పాత్రలను చిత్రించినపుడు, నీ సత్సంకల్పములు, దుష్ట సంకల్పములు వాటియందు ప్రతిబింబింపజేసినావు సందర్భోచిత ముగా భగవంతుని కీర్తించినావు కాని భగవంతుని కీర్తించునపుడు, అనన్యమైన భక్తిని భగవంతుని యెడల నీవు ప్రదర్శించలేదు ఈ లోపమును నీవు సరిదిద్దుకోవలెను నారాయణుని కీర్తించి గానము చేయుము ప్రపంచములోని మానవాళికి భగవంతుని విశ్వరూపమును విరాట్ రూపమును, అతని అవతార విశేషములను తెలియజెప్పుము దీనివలన నీకు నిస్సంశయముగా శాంతి చేకూరగలదని అభయమిస్తున్నాను అవతార

రహస్యములను ప్రజలకు తెలియజెప్పుము

''భగవంతుడు యెట్లు ద్వంద్వాతీతుడో, అనంతుడో, పరమపురుషుడో, సర్వ జీవులకు ప్రాణాధారముగా నున్నాడో ప్రజలకు వివరించుము ఏల రూప నామములతో యీ భూమిపై జన్మించి మనందరివలె సంచరించుచున్నాడో, త్రిగుణములతో సామాన్య మానవులవలె వర్తించుచున్నాడో విశదముగా తెలియజెప్పుము ప్రతి అవతార వైభవమును కీర్తించుము శ్రీమన్నారాయణుని వైభవమును కీర్తించు పదములు తప్ప యితరమైన దేదియు నీ పెదవుల నుండి రాకూడదు దీనిని నీవు సాధించినచో శాంతి తప్పక చేకూరును

''ఈ లోకమందలి ప్రజలకు నారాయణ కీర్తన ప్రాముఖ్యమును సుస్పష్టముగా వివరింపుము. మానవులు తమ విధులను నిర్వర్తించుటలో విఫలమైనప్పటికీ, వేదములు నిర్దేశించిన కర్మలను ఆచరింపకున్నప్పటికీ, అధర్మవర్తనులై సంచరించినప్పటికీ, వారి హృదయమందు భగవంతునిపై భక్తి ప్రేమలు కలిగియున్నచో, వారి పాపములన్నీ ప్రక్షాళితములై, భగవంతుని అనుగ్రహము పొందగలరు నీవు నారాయణుని అవతారమన్న విషయము జ్ఞప్తియందుంచుకొనవలెను. మానవోద్ధరణకై నీవు జన్మించినావు. అయినప్పటికీ, నీవు అందరివలె భావోద్రేకములకు వశుడవై మాయలో పడుచున్నావు. నీవెవరో గుర్తించుకొనవలెను నీ నిజ స్వభావమును మరిచి నిద్రలో నున్నావు. ఈ నిద్ర నుండి తేరుకుని నారాయణుని వివిధ అవతార విశేషములను ప్రతి ఒక్కరికి తెలియజెప్పుము. అంతేకాక భగవంతు డవతరించుటకు గల కారణములను విశద పరుపుము పదే పదే నారాయణుని కీర్తింపుము ఆ విధముగా చేసినచో నీ లక్ష్యమును, అనగా శాంతిని సాధించగలవు''

## 3 నారదుని పూర్వ జన్మ వృత్తాంతము

కొంతసేపు యిద్దరూ మౌనముగా కూర్చుని యుండిరి ప్రక్కనే ప్రవహిస్తున్న సరస్వతీ నది అలలు వెలయించే సంగీతపు ధ్వని తప్ప యింకే యితర శబ్దములు వినిపించుటలేదు మధ్య మధ్య నారదుడు వీణ తీగెలను మీటగా వచ్చు నాదము నిశ్శబ్దమును భంగపరచుచున్నది ఉన్నట్లుండి వ్యాసునివైపు తిరిగి నారదుడు చిరునవ్వుతో యిట్లనెను. ''నేను యే విధముగా శ్రీమన్నారాయణునిచే కర్మబంధ విముక్తుడనైతినో తెలుసుకొనుటకు నీవు కుతూహలముతో నున్నావని భావించెదను నా పూర్వ జన్మ వృత్తాంతము నీవు యెఱుగక పోవచ్చు''

వ్యాసుని ముఖమందు ఒక విధమైన ఆశ్చర్యము ప్రస్ఫుటముగా గోచరించెను ''ఏమిటి మీకు పూర్వ జన్మయా? మీరు బ్రహ్మ కుమారులు గదా! ఇంతకు ముందు మీకు ఒక జన్మ యెట్లు కలిగెను? నాలో కుతూహలము రగిలించినారు ఆ విషయమేదో పూర్తిగా యెఱిగింపుడు'' అని వ్యాస మహర్షి పలికెను.

''వెనుకటి కల్పము గురించి నేను చెప్పుచున్నాను'' అని నారదుడు పలికెను అతని కనులలో వెనుకటి జ్ఞాపకములు గోచరిస్తున్నవి ''ఒక శూద్ర వనిత ఋషుల ఆశ్రమములలో పనిచేయుచుండెడిది. నేను ఆమె యేకైక పుత్రుడను. ఒక పర్యాయము వర్ష కాలములో కొంతమంది ఋషులు సమూహంగా నా తల్లి పనిచేయుచున్న ఆశ్రమమునకు వచ్చిరి. అచ్చట నాలుగు మాసములుండుటకు వారు వచ్చిరి అప్పుడు

నాకు అయిదేండ్ల వయస్సు వచ్చిన అతిథుల అవసరములను కనుగొనుటకై నా తల్లి నన్ను నియమించినది. రోజంతయు నేను వారికి - అందరి బాలురవలె గాక నేను విద్యాధారమైన బాలుడుగా నుండెడివాడను. నేను యెక్కువగా మాట్లాడక, ఆట పాటలపై మక్కువ లేక యుండెడి వాడను అప్పుడప్పుడు నేను మాట్లాడే మాటలు కూడా స్పష్టముగా నుండెడివికావు అతిథులుగా వచ్చిన ఋషులు నన్నెంతో ముద్దుగా చూచెడివారు వారు నాపై జాలి చూపి యెల్లప్పుడూ వారితో నుండుటకు అనుమతించినారు నా స్థితిని చూచి విచారించి వారితోనే యుండుటకు యిష్టపడినారనుకొందును

''ఒక పర్యాయము వంటపాత్రలు కడిగి శుద్ధిచేయునపుడు, ఒక పాత్రలో వారు తినగా మిగిలిన అన్నము నేను భుజించినాను ఆ వెంటనే నా మనస్సు పరిశుద్ధమైనది నాలోని పాపమంతయు పటాపంచలైనది భగవంతుని టి మహత్తరశక్తి యున్నది

''ఆ భక్తులు కీర్తించి గానము చేయుటకే వినియోగించెడివారు వారు చెప్పెడి కథలను విని నేను తన్మయత్వము చెందేవాడను ఆ విధముగా నారాయణుడంటే వెర్రి వ్యామోహము నన్నావరించెను నారాయణుని గొప్పతనము చాటే ఆ కీర్తనలు నన్ను నారాయణుని గురించి ఆలోచించునట్లు చేసినవి ఇంకే యితర ఆలోచనలు కలిగేవి కావు రాత్రింబగళ్ళు నారాయణ చింత తప్ప మరియొకటి లేదు నేను మాయకతీతుడనని, యీ శరీరము నిత్యము కాదని త్వరలోనే గ్రహించగలిగాను నిత్యము హరి కీర్తనలను తెలుసుకోగలిగాను నాలోని రజస్తమో గుణములు పూర్తిగా తొలగిపోయినవి ఇంతలో చాతుర్మాస్యము పూర్తి కాగా, వచ్చిన ఋషులు తిరిగి వెళ్ళుటకు సన్నద్ధులైనారు

''నా కనుల వెంట కారే కన్నీటిని వారు చూచినారు నేనొక ఆదర్శ శిష్యుడనని తెలుసుకుని, వారు తమకు ఉన్నటువంటి అనంతమైన కరుణా వాత్సల్యములతో నాకు సత్యమును తెలుసుకొను రహస్యమును బోధించిరి సమస్త కర్మలను బ్రహ్మార్పణము గావించిన, ఆధ్యాత్మిక, ఆధి దైవిక, ఆధి భౌతికమనే తాపత్రయము నుండి రక్ష బోధించిరి ఈ లోకములో ఫలము నాశించి చేయు కర్మలు మానవులను మాయాజాలములో చిక్కుకొనునట్లు చేయును ఇవే కర్మలను యెట్టి ఫలాపేక్ష లేక, చిత్తశుద్ధితో చేసినచో, తొందరలోనే యీ మాయను ఛేదించి బయటపడవచ్చును బ్రహ్మ జ్ఞానము నంది భక్తిమార్గము నవలంబించి నచో, సమస్త కర్మలను భగవదర్పణ భావముతో చేయుట సులభ సాధ్యమగును అప్పుడు ఆత్మ, ఉపాధుల నుండి విముక్తిపొంది అనంతాత్మలో లీనమగును ఈ విషయములను ఆ మహర్షులు నాకు బోధించిరి

''ఈ ప్రక్రియ చాలా సులభము ఏ పని చేయుచున్నను నారాయణుని చింతించుట వలన, వాని మనసు యెల్లప్పుడూ నారాయణుని యందే లగ్నమైయుండును కర్మ నాచరించుచున్నపుడు, 'ఓ ప్రభూ! నమస్కారము వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, సంకర్షణ అను నామములతో నిన్నే భజించుచున్నాను' అని తలంచవలెను ఆ విధముగా కర్మల నాచరించినచో కర్మ బంధముల నుండి విముక్తిపొంది మోక్ష మార్గమున పయనించుటకు వీలగును ఇటువంటి మహత్తర విషయములను వారు నాకు నేర్పినారు అనంత కరుణా సముద్రుడైన భగవంతుడు, నా మనస్సునందు భగవంతుడొక్కడే సత్యము, తదితరమైనది మాయ అను బీజము దృఢముగా నాటినాడు''

# 4 సత్యాన్వేషణ

''ఋషులు వెళ్ళిపోగా నేనొక్కడనే యున్నాను. నా తల్లి ఆశ్రమములో పనిచేయుచున్నదని యింతకు ముందు చెప్పినాను ఆమె పనికత్తె, అమాయకురాలు, ఆమె యేకైక పుత్రుడనగుటచే ఆమెకు నాపై యెంతో మక్కువ అట్టి తెలివి తక్కువో నేనెఱుగుదును కాని ఆమెను విడిచి వెళ్ళుటకు నాకు సాధ్యము కాలేదు ఆమె పనిచేయుచున్న ఆశ్రమములోనే ఉంటూ భగవంతుని అనుగ్రహమునకై వేచి యున్నాను ఈ యావత్ప్రపంచము భగవంతుని అధీనములో నున్నది ఆయన అవలంబించు మార్గములు మన అవగాహన కతీతములు నిత్యము జరిగే సంఘటనలను చూచుచున్నప్పటికీ, వాటికి యింకేదో కారణముందని ఊహించుకుని యదార్థమును విస్మరిస్తున్నాము

''మానవుని చేతలు తోలు బొమ్మలాట వంటివి తమ తమ యిచ్ఛాపూర్వకంగా చేయుచున్నట్లు కనబడును. కాని అది సరికాదు తోలు బొమ్మలను ఆడించువాడు దారములను లాగి ఆ బొమ్మలను యే విధముగా ఆడించుచున్నాడో, అదే విధముగా మానవులను అతి నైపుణ్యంతో ఆడించేవాడు వేరొకడున్నాడు. అయితే అతడు అగోచరుడు

''ఒకనాడు నా తల్లి ఆశ్రమములోని గోవు పాలు పిదుకుటకై పశువులశాలకు వెళ్ళుచుండెను అది సంధ్యాసమయము ఉన్న కొద్దిపాటి వెలుగు తొందరగా అంతరించుచున్నది ఇంతలో పశువులశాలకు వెళ్ళే మార్గములో నున్న పాము నా తల్లిని కరచినది ఆ వెంటనే నా తల్లి మరణించెను ఈ సంఘటనకు నేను యెక్కువగా విచారించలేదు ఇది భగవంతుని యేర్పాటు అని నాకు తెలుసును ఇంతవరకు నా తల్లి ఒక బంధముగా నుండెను ఈనాడు ఆ బంధ విముక్తి కలిగినది నేను ఆశ్రమము విడిచి ఉత్తర అనేక ప్రదేశములు, అరణ్యములు దాటి ప్రయాణము చేసినాను కసించిన పువ్వులతోనున్న చెట్లను, అడవి యేనుగులు విరిచివేసిన వృక్షములను అరణ్యములలో చూచినాను బంగారు వెండి మెరుగులతో ప్రకాశించే పర్వత పంక్తులను చూడగలిగినాను తేనెటీగలు ఝుమ్మని శబ్దము చేసే అనేక సరస్సులను తిలకించినాను అనేక భయంకరమైన అరణ్యములగుండా ప్రయాణించినాను క్రూర మృగముల అరుపులు, నక్కల కూతలు, రాత్రి గుడ్లగూబలు చేసే హూంకార ధ్వనులు నా చెవులను సోకినవి

''పోయి, పోయి, అలసిపోయి, కాళ్ళు నొప్పులు ప్రారంభమైనవి గొంతు యెండిపోయినది ఆకలి వేయుచున్నది నదీ తీరమునకు వెళ్ళి, ముఖము, శరీరము శుభ్రపరచుకుని, ఆ నదిలో ప్రవహించే తియ్యని నీటిని కడుపు నిండుగా త్రాగినాను ఆ తర్వాత అచ్చట నున్న ఒక మహావృక్షపు నీడలో కూర్చుంటిని. ఋషుల వద్ద నేర్చుకున్న విధంగా పద్మాసనము వేసి కూర్చుని, భగవంతునిపై నా మనసును లగ్నము చేసితిని. ఆ రీతిగా నేను ధ్యానమందు నిమగ్నుడనైతిని.

''నా మనో నేత్రము ద్వారా నారాయణుని స్వరూపమును క్రమముగా చూడగలిగినాను నారాయణ దర్శనముతో నా శరీరము సంతోషముతో పులకరించెను కనుల నుండి ఆనందాశ్రువులు ఏకధారగా జాలువారినవి నా సర్వస్వము ఆనందములో మునిగెను. ఒక క్షణకాలము తర్వాత యీ ఆనందానుభూతి నారాయణుని స్వరూపముతోబాటు అదృశ్యమయ్యెను తిరిగి నేను బాహ్య స్మృతిలోపడి ధ్యానము నుండి

తెరుకున్నాను తిరిగి ధ్యానములో నిమగ్నమగుటకు ప్రయత్నించినాను కాని మనస్సును లగ్నము చేయలేకపో తిని. నారాయణుని రూపము తిరిగి నా మనస్సునందు కానరాలేదు మతిచెడిన వానివలె నుంటిని

''ఇంతలో అకస్మాత్తుగా నాతో యెవరో మాట్లాడుచున్నట్లనిపించినది అతడు నన్ను పిలుచుచున్నాడు అతని కంఠస్వరము అతి ఆప్యాయంగా, మధురంగా, ప్రేమపూర్వకముగా నున్నది అతని కంఠము నాకిట్లు వినిపించెను 'ఓ బాలుడా! ఈ జన్మలో తిరిగి నీవు నన్ను చూడలేవు కామముతో నిండిన నీ యీ రూపమున్నంతవరకు నీవు నన్ను చేరలేవు కాని తుదకు నీవు నన్ను చేరగలవని అభయమిచ్చుచున్నాను. అందుకు నిదర్శనముగా నా దర్శనము నీవు క్షణకాలము అనుభవించగలవు ఒకసారి నన్ను చూచిన తర్వాత, యెవ్వరును యితరమైనదేదియు చూచుటగాని, వాంఛించుట గాని జరుగదు ఇంత చిన్న వయసులోనే ఋషుల సాంగత్యము చేత, కేవలము నన్ను భక్తితో ప్రేమించుట నేర్చినావు నాపై ప్రేమయున్నచో నీ మనస్సునందు యింకెట్టి రాగిములకు తావుండదు ఈ శరీరము వదలి నా చెంతకు రమ్ము ఎల్లప్పుడూ నా చెంతనే యుండెదవు నీకు నాయందు గల ప్రేమ ప్రళయము సంభవించినప్పటికీ చెక్కుచెదరక స్థిరముగా నుండగలదు నీవు నాకు అత్యంత ప్రీతిపాత్రుడవు' అటు తర్వాత ఆ దివ్యవాణి వినిపించలేదు

''అప్పటి నుండి నారాయణుని కీర్తించుచు, గానము చేయుచూ ఒక ప్రదేశము నుండి మరొక ప్రదేశమునకు వెళ్ళుచు కాలము వెళ్ళబుచ్చుచుంటిని ఎటువంటి కోరికలు లేక సంతృప్తితో జీవించుచుంటిని నన్ను ఖైదీగా బంధించి యున్న యీ శరీరమును విసర్జించుటకు తగిన సమయము కొరకు వేచియుంటిని

''రోజులు, నెలలు, సంవత్సరములు గడచినవి. ఇంతలో మృత్యువు సమీపించినది అది ఒక మెరుపువలె వెలుగు తోరణముగా నున్నది పంచభూతములతో కూడిన యీ శరీరము భూమిపై వ్రాలినది సముద్రమందు శ్రీమన్నారాయణుడు పవ్వళించిన దిక్కుగా నేను ప్రయాణించినాను పిమ్మట బ్రహ్మ శ్వాసతో బాటు నేను అతని యందు ప్రవేశించినాను. నాలుగు యుగములు గడచినవి. బ్రహ్మ తిరిగి సృష్టి ప్రారంభించెను నేను మరీచి మున్నగు వారితో బ్రహ్మకు పుత్రుడుగా జన్మించితిని నారాయణా నుగ్రహముచేత భగవంతుని విభూతులను కీర్తించుచు అన్ని లోకములు సంచరించుచున్నాను. దేవతలు మహతి యనే యీ వీణను నాకు ప్రసాదించినారు. ఈ వీణను మీటి గానము చేయుచు భగవత్ప్రేమను ప్రపంచమంతటా ప్రచారము గావించుచు న్నాను

''నారాయణ కీర్తన గానము చేయునపుడు అతని రూపము కనుల యెదుట ప్రత్యక్షమగును పిలిచిన వెంటనే ప్రత్యక్షమగుచున్నాడను భావము కలుగుచున్నది అతని రూపమును యెల్లప్పుడూ చూచుచు యెంతో హాయి ననుభవించుచున్నాను.

''ఇంతకు పూర్వము చెప్పిన విషయములు తిరిగి ప్రస్తావించుచున్నాను మహాభారతములో కర్మయోగ మును బోధించినావు ఉపనిషత్తుల ద్వారా జ్ఞాన యోగమును, వేదముల ద్వారా కర్మకాండను బోధించినావు. కాని యివేవియు మానవునకు కావలసిన శాంతిని అంత సులభముగా అందివ్వలేవు. కేవలం భక్తి యోగము మాత్రమే సులభంగా శాంతినివ్వగలదు ఓ మిత్రమా! బాధా విన్యాహంతో నిండిన యీ భవసముద్రము నుండి మానవాళినిరక్షించి ఒడ్డున జేర్చుటకు అనువైన భక్తికావ్యమను పడవనొక దానిని నీవు సమకూర్చవలెను''

అనంతరము నారదుడు నిష్క్రమించెను చాలాసేపటి వరకు నారదుని వీణానాదము వ్యాసునికి వినిపించు చునే యున్నది నారదుని పలుకులను మననము గావించుకొనుచు చాలాసేపు వ్యాసుడు అక్కడే కూర్చుని యుండెను

వ్యాసుడు కనులు మూసుకుని సమాధిలోనికి వెళ్ళెను. మనో నేత్రము ద్వారా భూత కాలములోని అనేక గొప్ప సంఘటనలను కాంచెను నారాయణుడు అనంతునిపై పవ్వళించిన దృశ్యము చూచెను. సృష్టి ఆరంభము — విరాట్‌పురుషుని నాభి నుండి పద్మము ఆవిర్భవించి దాని నుండి బ్రహ్మ పుట్టుక — తిలకించెను మరియు లోకములు జనించుట, నారాయణుని విభూతులు, అనేక కల్పములలో జరిగిన సంఘటనలు చూచెను

తర్వాత వ్యాసుడు మహాభాగవత పురాణమును రచించెను దీనిని తన ꠰ బోధించగా, శుకుడు మానవ ప్రపంచమందు ప్రచారము గావించెను

# 5 ముగింపు - ప్రారంభము

కురుక్షేత్ర సంగ్రామమున అది ఆఖరిరోజు సూర్యుడు అస్తమించి చాల సేపయినది కురుసార్వభౌముడు దుర్యోధనుడు శమంతపంచకము వద్ద పడియున్నాడు అతని తొడను భీముడు విరుగగొట్టినాడు మరణించబో వుచున్న సమయములో ఆచార్య పుత్రుడు అశ్వత్థామ దుర్యోధనుని వద్దకు వచ్చెను కురుసార్వభౌమునకు జరిగిన అన్యాయమునకు అశ్వత్థామ ఆగ్రహము కట్టలు తెంచుకున్నది దుర్యోధనుని హతమార్చినందుకు ప్రతిచర్యగా పాండవుల నందరనూ రూపుమాపెదనని అశ్వత్థామ ప్రతిజ్ఞ పూనెను

కౌరవ సైన్యము సంపూర్ణముగా నాశనమైనది. మరణించుచున్న దుర్యోధనుడు కాక మరి ముగ్గురు — కృపాచార్యుడు, కృతవర్మ (హార్దికుని కుమారుడు), అశ్వత్థామ — మిగిలినారు ఆ రాత్రి అందరూ నిద్రించుచున్న సమయములో పాండవులున్న శిబిరములవైపు అశ్వత్థామ తొందరగా వెళ్లెను అచ్చట పాండవులు కానరాలేదు పాండవుల పుత్రులు నిద్రపోవుచున్నారు దృష్టద్యుమ్నుడు అతని సోదరులు కూడా ఆ శిబిరములలో ఉన్నారు క్రోధముతోనున్న అశ్వత్థామ ద్రౌపది అయిదుగురు పుత్రులను, ఆమె సోదరులను సంహరించెను తర్వాత శిబిరములకు నిప్పు అంటించి తిరిగి వెళ్ళిపోయెను. ఈ విషయము కురుసార్వభౌము నకు తెలియజేయగా, తన మిత్రుడు చేసిన అత్యాచారమునకు ఖిన్నుడయ్యెను.

మరునాడుదయము యీ వార్త పాండవులకు తెలిసెను ద్రౌపది యీ ఘోరవార్తవిని తట్టుకొనలేకపోయెను ఒక్కరాత్రిలో ఆమె కుమారులు, సోదరులు హతులైనారు. వారి మృతదేహములను చూచినది. బాధతో ఆమె గొంతు గద్గదమై కఠోరమైనది ఆమె కన్నీళ్ళను చూచి, అర్జునుడామెనిట్లు సముదాయించెను "ఓ దేవీ! నీవు విచారింపకుము. పాండవ పుత్రులను చంపినందుకు ప్రతిచర్య గావించెదను వీరిని చంపిన పాపాత్ముని వధించి అతని శిరస్సును నీ పాదముల చెంత ఉంచెదను నా గాండీవము నుండి వెలువడే బాణముల నుండి అతడు తప్పించుకొనలేడు అతడిని పట్టుకుని హతమార్చెదను"

అర్జునుడు తొందరగా వెళ్ళి తన రథము నధిరోహించెను. ఎప్పటివలె శ్రీకృష్ణుడు రథసారథిగా నుండెను. అర్జునుని కంటబడకుండా తప్పించుకొనుటక్కై అశ్వత్థామ అతి తొందరగా పారిపోవుట కృష్ణార్జునులు చూచినారు. క్రోధముతో నిండిన అర్జునుని కనురెప్పలను గాంచి, ఆచార్య పుత్రుడైన అశ్వత్థామ తన శక్తిమేరకు పారిపోవుచుండెను. అయితే అర్జునుని తీవ్ర ప్రతీకారకాంక్ష ముందు అశ్వత్థామ నిస్పృహాయుడయ్యెను. అతని గుర్రములు తొందరగా పరుగెత్తలేక పోవుటచేత అచ్చట నుండి తప్పించుకొన వీలుకాకపోయెను.

ఇక చేయునదిలేక బ్రహ్మశీర్షాస్త్రమును ప్రయోగించి తన ప్రాణమును కాపాడుకొనవలెనని అశ్వత్థామ యోచించెను. అతడు కొంచెము జలము చేకొని ''ఈ ప్రపంచము అపాండవమగుగాక'' అని పలికి అస్త్రమును అర్జునునిపై ప్రయోగించెను.

అస్త్రతాపమునకు ఆకాశము యెర్రగా ప్రకాశించెను. అర్జునుడు తన్ను భయమావహించగా శ్రీకృష్ణునితో యిట్లనెను. ''కృష్ణా! కృష్ణా! ఏమి జరుగుచున్నది? నా శరీరము విపరీతముగా మండుచున్నది? నన్ను భయంకరమైన అగ్ని వెంబడించుచున్నట్లున్నది. అది యేమిటో నాకు తెలియకున్నది. ఈ భయంకరాగ్ని నుండి యెట్లు తప్పించుకొనవలెనో కూడా తెలియకున్నది. నేనేమి చెయ్యవలెనో తొందరగా చెప్పుము''.

విచార ముఖముతో కృష్ణుడిట్లు పలికెను. ''అర్జునా! నీ గురుపుత్రుడు నీపై బ్రహ్మశీర్షాస్త్రమును ప్రయోగించినాడు. భయపడకు. ఈ అస్త్రము యెంతటి దారుణమైనదో ద్రోణుడు నీకు బోధించియుండును. తన పుత్రుడైన అశ్వత్థామకు కూడా బోధించి యున్నాడని నాదృఢ నమ్మకము. అయితే, దీని పర్యవసానము యెంత దారుణముగా ఉండగలదో అశ్వత్థామ యోచించినట్లు కానరాదు. బహుశః యీ ప్రపంచమును సర్వనాశనము గావించవలెనని కోరుచుండవచ్చును. అర్జునా! అదే అస్త్రమును నీవు కూడ ప్రయోగించు. నీపై రానున్న దారుణాస్త్రమును ఛేదించుటకు యిది ఒక్కటే మార్గము''. అర్జునుడు అస్త్రాధిదేవతను స్మరించి అస్త్రమును ప్రయోగించెను. రెండు అస్త్రములు పరస్పరము అభిముఖముగా ప్రయోగించుట చూచినవారికి యీప్రపంచము త్వరలోనే అంతము కానున్నట్లు గోచరించెను. ఊర్ధ్వలోకముల నుండి ఋషులు దిగివచ్చి, ''మీరిద్దరూ మీమీ అస్త్రములను తొందరగా ఉపసంహరించుకొనండి, లేకున్నచో యీ ప్రపంచ వినాశము తప్పదు. ఈ రెండు అస్త్రములు ఒకదానినొకటి తాకరాదు. వెంటనే యీ ప్రళయము నివారించండి'' అని పలికిరి.

వారి మాటలను శిరసావహించి అర్జునుడు వెంటనే తన అస్త్రమును ఉపసంహరించెను. అశ్వత్థామ ఉపసంహరించ లేకుండెను. తన తండ్రి వద్ద అస్త్రప్రయోగము నేర్చినపుడు, దాని విధ్వంసకశక్తి యెంత తీవ్రమైనదో తన తండ్రి తెలియజెప్పినప్పటికీ, దానిని లక్ష్యము చేయక అర్జునునిపై ప్రయోగించెను. తాను చేసిన పాపకర్మలు తన బ్రహ్మ తేజస్సును హరింపజేసినవి. దాని మూలముగా అతడు ప్రయోగించిన అస్త్రము ముందు శక్తిహీనుడయ్యెను. తనను పట్టబెట్టుకొనబోయే ముందు, దానిని పుట్టబోయే పాండవశిశువులవైపు మళ్లించి మున్ముందు యీ ప్రపంచములో పాండవవంశము లేకుండ చేయుటకు నిశ్చయించెను.

అస్త్రము నుపసంహరించిన తర్వాత అర్జునుడు అశ్వత్థామ వద్దకు వడివడిగా వెళ్ళెను. అశ్వత్థామను ఒక త్రాడుతో కట్టివేసి బలి పశువును ఈడ్చినట్లుగా అతడిని ఈడ్చుకొని వచ్చెను. శ్రీకృష్ణుని నేత్రములు యెర్రనై అగ్నిని కురిపిస్తున్నట్లుండెను. ''అర్జునా! నిద్రలో నున్న పాండవపుత్రులను చంపినది యితడే. నీవు యితడిని క్షమించరాదు. ఎట్టి సంకోచము లేక యితడిని నువ్వు వధింపుము. యుద్ధములో పాటించవలసిన ధర్మ

సూత్రములను నీకు నేను జ్ఞప్తి చేయవలసిన పనిలేదు ఈ సూత్రములు బాగా యెఱింగిన వాడు శత్రువు త్రాగి మత్తులోనున్నపుడుగాని, తనను తాను రక్షించుకొనుటలో అజాగ్రత్తగా నున్నపుడుగాని, నిద్రపోవుచున్న పుడుగాని, పాదములపైబడి క్షమాపణ కోరునపుడుగాని, తిరిగి పోరు సలుపుటకు వెనకాడునపుడుగాని, ఓడిపోయి భయపడునపుడుగాని, వధింపడు కాని యీ పాపాత్ముడు తనను తాను రక్షించుకొనుటకై అనేకమందిని నిర్దాక్షిణ్యముగా హతమార్చినాడు. ఇట్టివానికి మరణమే శిక్ష అర్జునా! నీవు యిచ్చిన మాట యింత తొందరగా మరచినావా? నీవు ద్రౌపదితో 'నీపుత్రులను చంపినవాని శిరస్సును నీపాదముల చెంత పడవేయుదు'నని పలికిన మాటలు నేను విన్నాను. నీవు ప్రతిజ్ఞపట్టినావు ఇంక ఆలస్యమెందుకు? అశ్వత్థామను వధించు'' అని కృష్ణుడు పలికెను. కాని అర్జునుడు వధింపకుండెను అంతటి ఉద్రేకములో కూడ, అశ్వత్థామ తన గురుపుత్రుడనియు, సహాధ్యాయియనియు గుర్తుకు వచ్చెను. గురుపుత్రుని చంపుటకు అర్జునుని మనస్సు ఒప్పకుండెను అశ్వత్థామను సోదరునిగా యెంచెను అశ్వత్థామను తీసుకుని ద్రౌపదివద్దకు తక్కినపాండవుల వద్దకు వెళ్ళెను. ''దేవీ! ఈ పాపి నీ యెదురుగా ఉన్నాడు తల యెత్తి నిన్ను చూచు ధైర్యము లేక కనులు దించుకుని యున్నాడు. ఇతనిని యేమి చేయమందువో చెప్పుము ఆ విధముగా చేసెదను'' అని అర్జునుడు ద్రౌపదితో పలికెను

పుత్రశోకము ఆమె మనస్సునుండి చెదరలేదు. అశ్వత్థామ వారిని హతమార్చినాడన్న విషయము కూడ ఆమె మరువలేదు కాని ఆమె కోపము అణగారినది అశ్వత్థామను చూచి జాలిపడి అర్జునునితో యిట్లనెను ''అర్జునా! ఇతనికి కట్టినకట్లను వెంటనే విప్పివేయుము నీ గురుపుత్రుడు యీ విధముగా బంధాలపాలై యుండుట నేను చూచి సహించలేకున్నాను ద్రోణాచార్యులవారు నీకు అస్త్రవిద్యను నేర్పిన గురువు. గురుపుత్రుడు నీకు సోదరుని వంటివాడు. ఆ మహాసాధ్వి కృపి తన యేకైక పుత్రుడు బ్రతికియున్నందువల్ల తన భర్తతో సహగమనము చేయలేదు ఇతనిని నువ్వు చంపినచో, ఆమె తన యేకైక పుత్రుని పోగొట్టుకున్న బాధకు గురియగును ఆమె ఆ విధముగా బాధపడుట నా అభీష్టముకాదు అతని యిష్టము వచ్చిన చోటికి పోనిమ్ము అతనిని విడిచివేయుము''

యుధిష్ఠిరుడు, అర్జునుడు, నకులసహదేవులు ద్రౌపది నిర్ణయమునకు హర్షము వెలిబుచ్చినారు భీముడు మాత్రము కోపముతో మండిపడుచుండెను అశ్వత్థామను విడిచి పెట్టక హతమార్చవలెనని భీముని అభిప్రాయము. కృష్ణుడు చిరునవ్వు నవ్వి అర్జునునితో యిట్లనెను. ''అర్జునా! ఇప్పుడు నీవు సందిగ్ధములో పడినావు, అశ్వత్థామను వధింపకున్నట్లయితే భీముని ఆగ్రహమునకు గురికాక తప్పదు వధించినట్లయితే ద్రౌపది, యితర పాండవుల అసంతృప్తికి కారకుడవవుతావు. ఈ పరిస్థితులలో యేది ఉచితమని నీవు తలంచితే ఆ విధముగా చేయుము. అందరినీ సంతృప్తి పరచుటకు నీ ప్రయత్నము నీవు చేయుము''

అర్జునుడు ఒకసారి అందరివైపు తేరిపార చూచెను కృష్ణుడు చేతులు కట్టుకుని నిలబడియున్నాడు అతని ముఖములో యెట్టి భావము స్పష్టముగా కానవచ్చుటలేదు. యుధిష్ఠిరుడు, ...న్నారు. వారి ముఖములందు ఒక విధమైన అప్రసన్నత కన్పడుచున్నది భీముడు అశ్వత్థామవైపు క్రోధముతో వీక్షించుచున్నాడు కొద్ది క్షణముల తర్వాత అర్జునుడు శ్రీకృష్ణుడు చెప్పినది అర్థమయినట్లు భావించి, తన ఒర నుండి కత్తిని తీసి అశ్వత్థామ శిరస్సుపై నున్న మణిని ఛేదించెను

తన శరీరములో భాగముగా నున్న మణిపోయినది శిశుహత్యా పాపము వల్ల బ్రహ్మతేజస్సు అంతరించినది

ఈ రెండింటిని పోగొట్టుకున్న అశ్వత్థామ వారి మధ్య నిలిచియుండగా, అర్జునుడు అతనికి కట్టిన కట్లను విప్పి ''ఇక నీవు పొమ్మ'' అని పలికెను

బ్రాహ్మణుని తల వెంట్రుకలు తీసివేయుట, అతని సంపదను తీసుకొని, వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపించుట — యివి బ్రహ్మ హత్యకు సమానము. అర్జునుడు సరిగా యిదే నెరవేర్చినాడు అర్జునుని చేతిలో జరిగిన యీ పరాభవము, అశ్వత్థామ మరణమునకన్న మిక్కిలి బాధ కలిగించినది

చూపులు దించుకుని మెల్లగా అడుగులు వేయుచూ పాండవుల సమక్షము నుండి వెడలిపోయెను.

## 6 ఉత్తరాయణము

యుధిష్ఠిరునకు మనశ్శాంతి లేకుండెను శత్రువులందరను జయించి తిరిగి దుర్యోధనుని నుండి రాజ్యమును చేబట్టెను. కాని అతనిలో రాజ్యపాలనా కాంక్షలేదు చాల నిరుత్సాహముతో నుండెను. కౌరవపాండవ యుద్ధ కారణముగా తన సహోదరులు, ఎంతోమంది గొప్ప గొప్పరాజులు మరణించవలసి వచ్చినదను ఆలోచన చాలా దుర్భరముగా ఉండెను అసలు యుద్ధమే జరగకుండా ఉండవలసినదని తలపోసెను ''కేవలం నాకు గల పదవీకాంక్ష, రాజ్యలోభము యీ యుద్ధానికి కారణ''మని యుధిష్ఠిరుడు పదేపదే తలపోసెను. అతనిని స [illegible] ప్రయత్నించెను. ఎన్నో సద్బోధలు చేసెను. యుధిష్ఠిరునిలో మార్పురాకుండుట జూచి కృష్ణుడిట్లనెను ''విధిని యెవ్వరునూ తప్పించలేరు జరిగినదంతయు విధి కృతము దీనికి నీ బాధ్యత యెంతమాత్రము లేదు వారి అధర్మ కృత్యముల చేతనే ధృతరాష్ట్రుని పుత్రులందరూ మరణించినారు. వారు నీ యెడల చేసిన ఘోరకృత్యములను జ్ఞప్తికి తెచ్చుకొనుము నిండుసభలో జుట్టుపట్టుకుని ద్రౌపదిని యీడ్చుకొని వచ్చిన సంగతి మరచిపోతివా? అది గుర్తుకువచ్చినపుడు నీ శరీరంలోని రక్తము ఉరకలు వేయుటలేదా? ఆ ఒక్కపాపమునకే వారందరూ మరణించవలసి వచ్చెను ఓ రాజా! విచారింపకుము. నిన్నెవరునూ నిందించలేరు. వారి దుర్గుణములే వారిని నాశనము గావించినవి ఈ శోకమును విడిచిపెట్టి నీ అన్నదమ్ములకు ద్రౌపదికి ఆనందమును కల్గింపుము. మీరైదుగురు కలిసి తరతరాలుగా సంక్రమించిన రాజ్యమును పరిపాలింపగా నేను చూడదలచితిని. ఇదియే - నిన్ను యీ సింహాసనముపై కూర్చుండబెట్టుట - నా జీవితమున ప్రధాన లక్ష్యము. ఇది నేను సాధించినాను నీ సంతోషమే నీవు నాకివ్వగల్గిన ప్రతిఫలము''.

వ్యాసుడు నారదుడు కూడ కృష్ణుని పలుకులను సమర్థించుచు పలికిరి కాని యెట్టి ప్రయోజనము లేకపోయినది రాధేయుని మరణము యుధిష్ఠిరుని యెక్కువగా బాధించెను రాత్రింబవళ్ళు యిదే తలపోయుచూ విచారించసాగెను. యుధిష్ఠిరుడు విచారముగా నుండుటచేత [illegible] విచారముగా నుండినది.

ఒకరోజున అందరి సమక్షములో నుండగా కృష్ణుడు అకస్మాత్తుగా దీర్ఘాలోచనలో పడెను అది గమనించి యుధిష్ఠిరుడు దానికి కారణమేమని కృష్ణునడిగెను అంతట కృష్ణుడు యిట్లు చెప్పెను. ''అంపశయ్యపై నున్న భీష్ముడు నన్ను తలచుకొని తన పక్కనే యుండవలసినదని కోరుచున్నాడు యుధిష్ఠిరా! అతి త్వరలోనే

భీష్ముడు మరణించనున్నాడు. అతనితోబాటు, యిన్ని యేండ్లుగా అతడు సంపాదించిన జ్ఞానము కూడ వెళ్ళిపోవును నీవు వెళ్ళి రాజ్యము యేవిధముగా పాలించవలెనో, అంతకన్న క్లిష్టమైనది నీ మిగిలిన జీవితము సార్థకము గావించుటకు యేమి చేయవలసి యున్నదో, భీష్ముడిని అడిగి తెలుసుకొనుము. ఉత్తరాయణము త్వరలోనే ప్రవేశించనున్నది కాబట్టి నీవు త్వరగా వెళ్ళవలెను''

మరునాటి ఉదయ వేళలో అందరూ కలిసి కురుక్షేత్రమున అంపశయ్యపై పరుండి మరణమున కెదురు చూచుచున్న భీష్ముని వద్దకు వెళ్ళిరి భీష్ముడు కూలిపోయిన వేలుపువలె నుండెను యుధిష్ఠిరాదులు నమస్కారము చేసి భీష్ముని పక్కనే నిలుచుండిరి యుధిష్ఠిరుని కంటి నుండి కన్నీళ్ళు కారుచుండెను భీష్మపితామహునికి దగ్గరగా జరిగి యుధిష్ఠిరుడిట్లనెను ''నీ మరణమునకు, నీ మనుమలందరి మరణమునకు కారణభూతుడను నేనే మిక్కిలి పాపాత్ముడను నాకు యెటువంటి నరకము ప్రాప్తించునోగదా!'' వృద్ధుడైన భీష్ముడు ఒడిలిపోయిన తన చేతులను యుధిష్ఠిరుని తలపై ఉంచి సముదాయించెను. విచారిస్తున్న యుధిష్ఠిరునకు యుద్ధము అనివార్యమైనదని నచ్చజెప్పి, మరియు యిట్లనెను ''కుమారా! నన్ను చంపి నావన్న భావము రానీయకు ఈ జీవితబంధము నుండి నాకు విముక్తిని కలిగించినావు కురుసింహాసనాన్ని స్థిరముగా ప్రతిష్ఠింపజేసిన పిమ్మటనే నేను మరణించెదనని నాతల్లి సత్యవతికి చాలకాలముక్రిందట మాట యిచ్చితిని నా తల్లికిచ్చిన మాటను నేను నిలుపుకోగల్గినందుకు నీకు నా ధన్యవాదములు అంతేకాక నేను నీకు కృతజ్ఞుడను నేను యీ జీవితములో యెంతగా అలసిపోయినానో యెరుగుదువా! నువ్వు దుఃఖించవలసిన పనిలేదు ఇది నీకు తగదు నీవు మహారాజువు. మహారాజుకు స్వీయ భావన లేవియూ ఉండతగదు మహారాజుకు ప్రజల సమస్యలు, వారి శ్రేయస్సు తప్ప యింకెట్టి ఆలోచనలు ఉండరాదు.''

ఇంతలో శ్రీకృష్ణుడు ''ఓ కురుపితామహా! యుధిష్ఠిరుని యెంతగానో ఓదార్చుటకు ప్రయత్నించి విఫలుడనయాను నారద వ్యాసులు కూడ విచారము తగదని యెంతగానో నచ్చచెప్పుటకు ప్రయత్నించి విఫలులైరి యుధిష్ఠిరుని ఓదార్చి విచారము తగదని మీరు నచ్చచెప్పి, మేము చేయలేని కార్యమును నెరవేర్చి సఫలత్వ మొందగలరని ఆశిస్తున్నాను'' అని పలికెను

భీష్ముని కనులు చెమర్చెను ''కుమారులారా! మీ యందరి విషాదము చూడగా నాకు విచారము కల్గుచున్నది. మీరు పుట్టిన దగ్గర నుండి యెన్నియో బాధలకు గురి అయినారు పాండు మహారాజు చనిపోయిన తర్వాత, మీ తల్లి కుంతీదేవి యెన్నో బాధలు పడి మిమ్మల్ని పెంచి పెద్దవారిని జేసినది. ఆకాశములో మబ్బులు గాలిచేత చెల్లాచెదరయినట్లు, విధి చేతిలో మీరు ఆటబొమ్మలయ్యారు కాకపోతే, సాక్షాత్తు ధర్మమూర్తి పుత్రుడవైన నీవు, మిక్కిలి బలసంపన్నులైన తమ్ముల సహాయముండగా, యింతకాలము రాజ్యమును పరిపాలింపలేకుండుటకు కారణమేమి? విధి వ్రాత యెవ్వరు యెఱుగలేరు. మనకెవ్వరికీ తెలియదు కాని తెలిసినవాడు ఒకే ఒకడున్నాడు. అతడే కృష్ణుడు. అతడు సర్వజ్ఞుడు ఇంతకు పూర్వమే అతనికన్నియు తెలియును. వసుదేవుని కుమారుడు, యాదవ వంశమందు జన్మించినవాడు, మీకు మేనబావ, మిత్రుడు, హితుడు, రాయబారి, రథసారథి అయిన యీ కృష్ణుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే చాల కొద్దిమంది మాత్రమే శ్రీకృష్ణుని వైభవము నెఱుగుదురు ఒకరు నారదమహర్షి, రెండవవారు కపిలమహర్షి.

''ఈ కృష్ణుడే యింతవరకు అన్ని సంఘటనలను జరుగనిచ్చినాడు. అతని కార్యములలోని ఔచిత్యమును నీవు యింకను శంకించుచున్నావా? అతడు ఈశ్వరుడు. అతనికెట్టి కోరికలు లేవు మనవలె రాగద్వేషములు,

అహంకార ఉద్రేకములు లేవు మిమ్మల్ని రక్షించి యీ యుద్ధములో విజయులయేటట్లు తనకు తానుగా బాధ్యత వహించినాడు ఎందుకని యిట్లు చేసినాడు? అతనియందు మీకున్న భక్తిచేతనే మిమ్మల్ని రక్షించుటకు పూనుకున్నాడు మీకు కృష్ణునిపై అపారమైన భక్తికలదు నన్ను చూడండి ప్రస్తుతము మరణశయ్యపై నున్న నా ఆలోచనలన్నీ కృష్ణుని మీదనేయున్నవి. కృష్ణుని కీ సంగతి తెలుసును నాకోరిక తీర్చుటకే యిక్కడకు వచ్చినాడు భక్తియను త్రాళ్ళచేత భగవంతుడు భక్తులకు కట్టుబడిపోతాడు''

కృష్ణుడు అడ్డుపడి, ''ఓ భీష్మా! నీవు నాకొక సహాయము చేయవలసి యున్నది'' అని పలికెను

''ఆజ్ఞాపించండి ప్రభూ!'' అని రెండు చేతులు జోడించి భీష్ముడు పలికెను భీష్ముని చేతులను తన చేతిలోనికి తీసుకుని కృష్ణుడు యిట్లనెను ''ఓ భీష్మా! నీవు గంగా పుత్రుడవు నీవు ఆదర్శనీయుడవైన మహారాజువు కావలెనని, నీకు శాస్త్రములు, రాజ్యపరిపాలనా విధానము, రాజధర్మములు, యింకా యితర ధర్మములను దైవగురువులైన శుక్ర, బృహస్పతులవద్ద నేర్చుకొనుటకు నీ తల్లి యేర్పాటు చేసెను నీవు శరీరమును త్వరలో త్యజించనున్నావు నీ మనుమడైన యుధిష్ఠిరునకు రాజ్యమును పరిపాలించు తీరుతెన్ను లను విశదముగా బోధించగలవా? నీకు తెలిసినదంతయు అతనికి బోధింపుము నీకున్న జ్ఞానమును పొందుటకు అతనికొక్కనికే అర్హత కలదు. నీ జ్ఞానమంతయు నీతో అంతము కారాదు''

''అటులనే కానిండు'' అని భీష్ముడు పలికెను అటుతర్వాత వరుసగా ఏబదినాలుగు రోజులు తాను సంపాదించిన జ్ఞానమును యుధిష్ఠిరునకు బోధించెను

ఎన్నిరోజులుగానో భీష్ముడు మిక్కిలి ఓర్పుతో యెదురు చూచిన ఉత్తరాయణము ప్రవేశించెను. తన శరీరమును వదలుటకు భీష్ముడు సంసిద్ధుడుగా నుండెను భారత మహాసంగ్రామములో పదిరోజులు కౌరవసైన్యమునకు సేనాధిపతిగా నుండి, పదవరోజు సాయంకాలము అంపశయ్యపై వ్రాలెను

అది దక్షిణాయనమగుటచే ఆరోజునే శరీరమును విడుచుటకు యిచ్ఛగించకుండెను దక్షిణాయనములో మరణించువారికి తిరిగి పునర్జన్మ యుండునని చెప్పుదురు పౌరవవంశములో ప్రముఖుడైన భీష్ముడు స్వర్గము చేరుటకు సిద్ధముగా నుండెను. కృష్ణునివైపు చూచి యిట్లనెను ''ఓ ప్రభూ! తుది శ్వాస విడిచేముందు కళ్ళుమూసుకుని మనస్సున భగవంతుని రూపము చిత్రించుకుని ధ్యానించవలెనని చెప్పుదురు. ఆ భగవం తుడు నా పక్కనే యుండుట నా మహద్భాగ్యము ఇంతకుమించిన వైభవము వేరేదైన నుండునా?''

భీష్ముడు పువ్వులతో కృష్ణుని పూజించెను విశ్వబ్రత వహించెను కృష్ణుని గురించిన ఆలోచనలు ప్రవాహమువలె వచ్చుచుండెను ప్రయాణము చివర అలసిపోయిన బాటసారి నిట్టూర్పు విడచినట్లుగా, భీష్ముడు తుది శ్వాస విడిచి, స్వర్గములోని పుణ్యాత్ములలో ఒకడాయెను

# 7 అభిమన్యుని కుమారుడు

యుధిష్ఠిరుడు మహారాజుగా పట్టాభిషిక్తుడయ్యెను కృష్ణుడు యుధిష్ఠిరునితో నిట్లనెను ''నేను కన్న కలలు నిజమైనవి నేను సంకల్పించిన కార్యము పూర్తి అయినది తిరిగి ద్వారకకు వెళ్ళవలెననుకొనుచున్నాను ఇల్లు విడిచి చాలా యేండ్లు గడచినది సాత్యకి, నేను ద్వారకానగరము యెట్లున్నదో పూర్తిగా మరచినాము కనీసం కొంతకాలముపాటు మమ్ములను వెళ్ళనిమ్ము వృద్ధులైన నాతల్లిదండ్రులను, బంధువులను, ప్రజలను చూడవలెను ''

కృష్ణుడు వెళ్ళనున్నాడన్న వార్తవిని అభిమన్యుని భార్య ఉత్తర హుటాహుటిగా కృష్ణుని వద్దకు వచ్చెను కృష్ణుని పాదములపైబడి యేడ్చుచూ యిట్లనెను ''కృష్ణా! కృష్ణా! నీవు జగత్తునకంతటికీ ప్రభువవని అవ్వ చెప్పినది నీవు ఒక్కడివే నాకు సహాయము చేయగలవు. గొప్ప ఆపదలో చిక్కుకుని ఉన్నాను ఏదో బలీయమైనది నన్ను వేధిస్తున్నది దానివలన కలిగే మంట భరించరానిదిగా ఉంటున్నది నా భర్త యుద్ధములో షి నా జీవితము శూన్యమైనది అర్థములేని యీ జీవితముపై నాకు విరక్తికలుగుచున్నది కృష్ణా! అభిమన్యుని బిడ్డ నా గర్భములో పెరుగుచున్నాడు ఈ బిడ్డ మాత్రమే పాండవుల ప్రసాదము, ముమ్ముందు పౌరవ సింహాసనము నధిరోహించగలవాడు నన్ను వేధిస్తున్న తాపాగ్ని చేత యీ బిడ్డ నశించునని భయము కలుగుచున్నది కృష్ణా! యీ బిడ్డను నీవు రక్షించాలి''

కృష్ణుడు కనులు మూసుకొనెను ఆయన మనస్సులో అశ్వత్థామ బ్రహ్మశీర్షాస్త్రము ప్రయోగించిన విషయము మెదలెను మొదట ''ఈ ప్రపంచము అపాండవమగుగాక'' యని అస్త్రమును విడిచెను అటు తర్వాత అస్త్రము నుపసంహరింపకొనలేక, అశ్వత్థామ దానిని పుట్టబోవు పాండవ శిశువులవైపు మరల్చెను ఉత్తరను లేవదీసి కృష్ణుడామెతో యిట్లనెను ''నీవు విచారించవద్దు ఇది నామాటగా విశ్వసింపుము నీ బిడ్డ అభిమన్యునివలె జీవించును నీ బిడ్డ జన్మించువరకు నేనిక్కడనే యుండెదను నేను నిన్ను రక్షించగలను నిన్ను, నీ బిడ్డను వేధిస్తున్న మంటను గురించి ఆందోళనపడక నిశ్చింతగా నుండుము దాని విషయము నేను చూచుకొందును'' మాయాశక్తిచే ఉత్తర గర్భములో శ్రీకృష్ణుడు ప్రవేశించెను అస్త్రము ఆమెలో ప్రవేశించి ఆమె శిశువును నశింపచేయబూను సమయమున కృష్ణుడక్కడ నుండెను తన దివ్యశక్తిచే అస్త్రముతో పోరాడి చివరకు అది నిరర్థకమగునట్లు చేసెను

ఉత్తర గర్భములో నున్న శిశువు అస్త్రమునుండి వెలివచ్చుచున్న ప్రకాశవంతమైన రూపమును కాంచెను అది తనను చుట్టుముట్టి దహించుచున్నట్లు భావించెను ఇంతలో ఆ శిశువు మరియొక రూపమును జూచెను బొటనవ్రేలు పరిమాణములో ఆ రూపము అత్యంత సుందరముగ నుండెను అతని తలపై బంగారు కిరీటము ఉండెను అతని శరీరము మేఘమువలె నీలివర్ణముతో, మెరుపువంటి వస్త్రమును ధరించి యుండెను అతని నాలుగు భుజములు భుజకీర్తులను ధరించి యుండెను. అతని చెవులకున్న కుండలములు బంగారువన్నెతో మెరయగా, అతని కనులు క్రోధముతో యెర్రగా నుండెను అతడు తనచేతిలోని గదను అటునిటు సారించగా, అందునుండి, నిప్పులు వచ్చుచుండెను అతడు శిశువు చుట్టూ తిరుగుచూ, అస్త్రతాపము శిశువు నంటకుండ దూరముగా నుంచెను ఆ విధముగా కొన్నినెలలు శిశువుతోబాటు ఉత్తర గర్భములో నుండి బ్రహ్మశీర్షాస్త్ర శక్తిని పూర్తిగ అణచివేసెను ఇంతలో యెదిగిన శిశువు చూచుచుండగనే కృష్ణుడు అదృశ్యుడయ్యెను.

అభిమన్యుని కుమారుడు జన్మించెను హస్తినాపురవాసులందరూ యెంతో ఆనందించిరి. సాక్షాత్తు భగవంతుడే ఆ శిశువును రక్షించి పౌరవ సింహాసనమునకు వరముగా ప్రసాదించుటచేత, ఆ బిడ్డకు విష్ణురతుడని నామకరణము చేసిరి ఆ బాలుని కృష్ణుడు పరీక్షిత్తు అని పిలుచుచుండెను ఎందుకనగా గర్భములో నుండగనే ఆ బాలుడు విష్ణు స్వరూపుడైన కృష్ణుని జూసి, తనలో తానిట్లనుకొనెను. ''పచ్చని పీతాంబరములు, మెడలో రమ్యమైన వనమాల, చేతిలో గద ధరించి నన్ను సదా రక్షించుచున్న యీ విచిత్రవ్యక్తి యెవరు? ఎవరై యుందురు?'' పుట్టక పూర్వమే భగవంతుని రూపమును గురించి ప్రశ్నించుకొనుట మొదలిడెను

# ద్వితీయ స్కంధము

## 8. శ్రీకృష్ణుని ప్రయాణము

అభిమన్యుని కుమారుడు జన్మించిన అనంతరము యేర్పడిన ఆనంద కోలాహలము క్రమముగా సద్దుమణిగినది. హస్తినాపురములో జీవనము పూర్వమువలె మామూలుగా నుండెను. యుధిష్ఠిరుని రాజభవనములో కూడ సామాన్య పరిస్థితులు నెలకొనెను తన ప్రయాణము అందరికీ అసంతృప్తిని కల్గించునని కృష్ణుడు ముందుగానే ఊహించెను ద్వారకాపురికి తిరిగి వెళ్ళనున్నట్లు వారితో చెప్పబూనెను. హస్తినాపురవాసులు కృష్ణుని యెంతగానో ప్రేమించినారు. కృష్ణుని ప్రయాణమునకు వారంగీకరించరు. కృష్ణుడు కూడా వారినెంతగానో ప్రేమించెను కాని వెళ్ళక తప్పదు

కృష్ణుడు ప్రతి ఒక్కరికి - చెల్లెలు సుభద్రకు, ద్రౌపదికి, వయోవృద్ధులైన గాంధారీ ధృతరాష్ట్రులకు, పాండవులకు - వీడ్కోలు చెప్పెను ప్రతి ఒక్కరి ముఖమునందు కృష్ణుడు వెళ్ళుట యిష్టములేదను సూచనలు కన్పించెను తప్పనిసరిగా, కృష్ణుడు వెళ్ళుటకు యుధిష్ఠిరుడు అంగీకరించెను కుంతి గృహమునకు వెళ్ళి, ఆమె పాదములపైబడి కృష్ణుడిట్లనెను ''నేను ద్వారకకు వెళ్ళుచున్నాను నాశ్రేయస్సుకోరి ఆశీర్వదింపుము''

విచారముతో నవ్వి కుంతి కృష్ణునితో యిట్లనెను ''ఇంకా నువ్వు నా మేనల్లుడవైన కృష్ణుడుగా నటిస్తున్నావు కృష్ణా! నేను అమాయకురాలిని వేదములుగాని బ్రహ్మవిద్యనుగాని నేను నేర్వలేదు. కాని ఒక సత్యము మాత్రము తెలుసును. అదేమనగా, నీవు ప్రభువులకు ప్రభువైన ఈశ్వరుడవు ఎల్లపుడు ఉండు సత్యమే నీవు, సృష్టికర్తవు, ఆదిపురుషుడవు నీ శక్తిచేతనే యీ ప్రకృతి ఉద్భవించినది పంచభూతములతో నిండిన యీ ప్రపంచమంతటా నీవు వ్యాపించి యున్నావు ఎవ్వరూ ఛేదించలేని మాయ అనే తెర నిన్ను మా అందరినుండి మరుగుపరచుచున్నది ప్రతి జీవ జడవస్తువునందు నీ ఉనికిని సామాన్యు [illegible] ము నీవే యీ పంచజ్ఞానేంద్రియములైనమా వాటి శక్తికి అతీతమైన వాడవు ఎందుకనగా వాటి వెనుక నున్న సత్యమే నీవు నాకు తెలిసినది అతి తక్కువ కాని నీవు ఏకైక సత్యమని యెఱుగుదును నీకు నమస్కరించుట తప్ప యింకేమీ చేయజాలను అమాయకురాలనైన నేను, నిన్ను సరియైన పద్ధతిలో ప్రార్థించు విధము కూడ తెలియనిదానను సవినయముగా నీ పాదములకు నమస్కరించుచున్నాను

''రంగస్థలముపై తన పాత్రను చక్కగా పోషించిన నటుడు ప్రేక్షకులకు ఆ పాత్రయే తానను భావమును కల్గించును కృష్ణుని పాత్రను అతి చక్కగా నటించి పోషించినావు నీ నిజస్వభావము అందరకూ తెలియదు 'నేను' 'నాది' అనే రెండింటి చేత భ్రమకులోనైన ప్రజలకు నీవు అదృశ్యుడవు స్వార్థము విడిచి యోగాభ్యాసము చేసి, బ్రహ్మత్వమును పొందుటకు తీవ్రముగా ప్రయత్నించి, ఇంద్రియ శక్తులను పూర్తిగ నిగ్రహించిన ఋషులు సైతము నిన్ను దర్శించలేకున్నారు అటువంటప్పుడు, నావంటి అమాయకస్త్రీలు, 'యోగము' 'భక్తి' అనే పదములకు అర్థము తెలియనివారు నిన్నెట్లు తెలియగలరు? నాకు నీవు దేవకీ వసుదేవుల, నందయశోదల కుమారుడివి బృందావనములో గోవులను పాలించిన గోపబాలకుడివి కాని నాకు తెలుసు, నాభియందు కమలము ఉన్న శ్రీమన్నారాయణుడవే నీవని చాలకాలము క్రిందట కంసుని చంపి, నీ తల్లి దేవకిని

కారాగారము నుండి విడిపించినావు. అయినప్పటికీ, నేను అనేక పర్యాయములు నీచే దుర్భర పరిస్థితుల నుండి రక్షణ పొందినాను. నీవల్లనే నాకుమారులు తిరిగి రాజ్యమును పొందగలిగినారు. వారిని ఉద్ధరించినవాడవు నీవు. మాకు కష్టములు సంభవించినపుడు నీవు రక్షించితివి. నీవు బుద్ధికి అందనివాడవు. నీవు రూపనామములతో మానవునివలె మాకు తోడుగా నుండి యెంతో సహాయము చేసినావు. ఇది మా అదృష్టము. దురదృష్టకర పరిస్థితులు యెదురైనపుడు, నీవు మా చెంతకు వచ్చి రక్షించినావు. మమ్మ యెంతగానో ప్రేమతో చూచినావు.

''కృష్ణా! నేను నిన్ను కోరే వరము ఒక్కటే. అదేమనగా మాకు పదేపదే కష్టములు కలిగించు. ఆ విధముగా నీవు యెల్లపుడూ మాతో ఉండుటకు వీలగును. ఉత్తమ కుటుంబములో జన్మించినవారు, యెక్కువ సంపదగల్గినవారు, బాగా చదువుకున్నవారు, సంపదమూలముగా అధికారము చేజిక్కించుకుని అహంకారముతో వర్తించేవారు, నీ నామమును యెట్లు ఉచ్చరించగలరు? అయినప్పటికీ, నీవు నీకు గల అపారమైన కరుణచేత అటువంటి అనర్హులను కూడా అనుగ్రహించుచున్నావు.

''ప్రభువులకు ప్రభువైన నీకు నమస్కారము. ఈ సృష్టి కారణమైన నీకు కారణము లేదుగదా! నీవే కాలము, ఆది అంతములు లేక నిరంతరము సాగుచునే యుందువు. ఈ మానవ ప్రపంచములో జన్మించుటకు యేల నిశ్చయించుకున్నావు? మలయపర్వత సానువులలో పెరిగే మంచి గంధపు వృక్షము సువాసనను వెదజల్లునట్లుగా, యుధిష్ఠిరుని వైభవమును నలుదిశల ప్రసరింపజేయుటకు నీవు యదువంశములో జన్మించినావని కొందరందురు. సూతప పృష్ణిలకు యిచ్చిన మాటను నిలబెట్టుకొనుటకై నీవు దేవకీ వసుదేవులకు జన్మించినావని మరికొందరందురు. ఈ భూమిపై బరువు తగ్గించమని బ్రహ్మాది దేవతలు నిన్ను వేడగా, నీవు అవతరించినావని మరికొందరు చెప్పుదురు. అయితే రూపనామములతో అనంత పరబ్రహ్మము యెందుకవతరించెనో నాకు తెలియదు. సామాన్య మానవులు లోనయ్యే ద్వంద్వములకు అతీతుడవని నేనెఱుగుదును. నీకు యిష్టానిష్టములు లేవు. నీకు యెవరియందు రాగముగాని ద్వేషముగాని లేదు. ఇష్టానిష్టములతో సతమతమయ్యే సామాన్యులు, నీవు యేప్రయోజనము నాశించి కార్యకలాపములను సాగించుచున్నావో యెఱుగలేరు.

''కృష్ణా! నీవు వెళ్ళిన తర్వాత మేమెట్లు ఉండగలము? ప్రాణము పోయిన పిదప, ఇంద్రియములు పనిచేయగలవా? ఎల్లప్పుడూ నీగురించే ఆలోచించుట కలవాటు పడిన మనస్సు యేవిధముగా యితరమైన వాటిని గురించి ఆలోచించగలదు? కృష్ణా! గంగానది యెన్ని అడ్డంకుల నెదుర్కొన్నప్పటికీ సముద్రమువైపు యే విధముగా ప్రవహించుచున్నదో, అదే రీతిగా నామనస్సు యెల్లప్పుడూ నీయందే లగ్నమై, నిన్ను గురించిన ఆలోచనలతోనే నిండి యుండేటట్లు అనుగ్రహించు''.

తన అనంత మధురమైన మందహాసముతో కుంతీదేవి కన్నీళ్లను తుడిచి, ''అట్లే కానిమ్ము'' అని పలికెను.

ఆ తర్వాత రాజసభకు వెళ్ళి అచ్చట యుధిష్ఠిరుడు, అతని సోదరులు, తాను ద్వారకకు వెళ్ళుచున్న కారణంగా విచారముతో నుండుట గమనించెను. ఇంతలో రథము వచ్చి సౌధద్వారము వద్ద నిలిచి యుండెను. అర్జునుడు రథముపై నిలిచి, తెల్లని గొడుగును కృష్ణుని తలపై యెత్తి పట్టుకొనెను. ఉద్ధవుడు, సాత్యకి చామరములను పట్టుకొనిరి, యుధిష్ఠిర, భీమ, నకుల సహదేవులు రథమున కిరువైపుల నడవసాగిరి. పురములోని ప్రజలు బయటికి వచ్చి వీధి కిరువైపుల నిలిచి, తమకు అత్యంత ప్రేమపాత్రుడైన కృష్ణునకు వీడ్కోలు చెప్పిరి. రథము నగరపు సరిహద్దులు దాటి రాగా, అతికష్టముతో కృష్ణుడు తన మిత్రులకు నచ్చజెప్పి వారివారి యిండ్లవైపు వారిని మరల్చెను. దారుకుడు గుర్రములను అదిలించగా రథము వేగము పుంజుకొని, కనుమరుగయ్యెను.

పాండవ సోదరులైదుగురు అచ్చటనే నిల్చుని, రథము అదృశ్యమైన దిక్కువైపు రెప్పవేయక చూచుచుండిరి

## 9 అశ్వమేధ యాగము

కొన్నిమాసములు గడచినవి మనస్స్థైర్యమును పొందుటలో యుధిష్ఠిరుడు కొంతవరకు కృతకృత్యుడయ్యెను రాజ్యపరిపాలన విషయములందు తన మనస్సును లగ్నము చేయుటచేత యిది సాధ్యమయ్యెను కాని అతని మనస్సులో ఒకమూల అశాంతి మెదలుచునే యుండెను తన కౌరవసోదరులు యితర బంధువులు తన మూలముగనే మరణించినారను విషయమును మరువలేకుండెను

వ్యాసమహర్షి యుధిష్ఠిరుని పద్దకేతెంచి అశ్వమేధయాగము నిర్వర్తించినచో పాపపరిహారము కాగలదని చెప్పెను ఈ సూచనను అందరూ ఆమోదించిరి యుధిష్ఠిరుడు పిలుపనంపగా కృష్ణుడు వచ్చి వ్యాసుని సూచనను బలపరిచెను

యుధిష్ఠిరుడు జరుపబోవు కార్యమున కందరూ సంతోషించిరి ఈ విధముగానైనా యుధిష్ఠిరుని మనస్సు జరిగిన వాటి గురించి ఆలోచించుచు బాధపడక యుండునని అందరూ తలచిరి ముఖ్యముగా అర్జునుడు చాలా ఉత్సాహభరితుడయ్యెను గాండీవము చేతబట్టి అనేక సంవత్సరములు గడచినట్లు అనిపించెను అతని శక్తివంతమైన బాహువులు పోరు సలుపుటకు యిచ్ఛగించుచున్నవి కాని యుధిష్ఠిరుడు అధర్మ యుద్ధమునకు వ్యతిరేకముగా నుండెను సామాన్యముగా సామంతరాజులు చక్రవర్తికి సమర్పించే సుంకములు స్వీకరించుటకు కూడ యుధిష్ఠి ై ''కృష్ణా! ధనము సంపాదించుటకు నేరేదైన మార్గమును సూచింపుము నీ సూచనల ననుసరింతుము'' అని యుధిష్ఠిరుడు పలికెను నిదానముగా ఆలోచించి, కృష్ణుడు పాండవసోదరులను ఉత్తరదిశగా నున్న ఒక ప్రదేశమునకు పంపెను ఆ ప్రదే . రాజు యజ్ఞము చేసి ఆ యజ్ఞమునకు వినియోగించిన బంగారు పాత్రలను, యితర వస్తువులను అక్కడనే విడిచిపోయెను కృష్ణుని సూచన ననుసరించి, పాండవ సోదరులు ఆ ప్రదేశమందు విడిచిన విశేషమైన సంపదను గైకొని తిరిగి వచ్చిరి యుధిష్ఠిరుడు మూడు పర్యాయములు యజ్ఞము జరిపెను వ్యాసుడు యజ్ఞమునకు అధ్వర్యము వహించెను పాండవ సాంప్రదాయము ప్రకారము కృష్ణుడు అర్ఘ్యాది పూజలందెను

యజ్ఞము పూర్తి అయిన తర్వాత కొన్నిరోజులు పాండవులతో గడిపి, తిరిగి కృష్ణుడు ద్వారకకు ప్రయాణమయ్యెను తనతో అర్జునుని తీసుకుని ద్వారకకు వెళ్ళెను.

## 10 విదురుడు ధనుర్బాణములు దిగవిడుచుట

పాండవుల అరణ్యవాసము పదమూడవ సంవత్సరము దాటినది దుర్యోధనుని నుండి అర్ధరాజ్యమును రాబట్టుటకు ప్రయత్నములు జరిగెను ధృతరాష్ట్రుని సభ అంతయు కుటిలముగా కుత్సితముగా నుండెను

పాండవులతో సమస్యను శాంతి యుతముగా పరిష్కరించుకొనవలసినదని భీష్ముడు దుర్యోధనునికి సలహా యిచ్చెను. ద్రోణుడు కూడ అదే విధముగా దుర్యోధనునికి నచ్చజెప్పుటకు ప్రయత్నించెను కాని ప్రయోజనము లేకపోయెను దుర్యోధనుడు యుద్ధమునకు కృతనిశ్చయుడయ్యెను యుద్ధమో లేక తిరిగి అరణ్యవాసమో, యీరెండింటిలో యేదో ఒకటి జరుగవలెనని దుర్యోధనుడు తలచెను ఇది దృష్టిలో నుంచుకుని ధృతరాష్ట్రుడు సంజయుని, ఉపప్లావ్యమను ప్రదేశములో నున్న పాండవుల వద్దకు యుద్ధము నివారించవలసినదని కోరుచూ, రాయబారిగా పంపెను మంచి హృదయము ఉదారస్వభావముకల యుధిష్ఠిరుని రాజ్యకాంక్షను వీడి తిరిగి అరణ్యవాసము చేయమని కోరవలసినదిగా సంజయుని ప్రత్యేకముగా పంపెను. సంజయుడు హస్తినాపురము తిరిగివచ్చి ముసలిరాజు ధృతరాష్ట్రునితో అతని దురాశను నిందించుచు పరుషముగా మాట్లాడెను.

ఆరోజు రాత్రి ధృతరాష్ట్రునికి యెంతప్రయత్నించినను నిద్రరాకుండెను అతని సోదరుడైన విదురునికి కబురంపెను. గుడ్డిరాజైన ధృతరాష్ట్రునిపై విదురునకు విపరీతమైన జుగుప్స మరొకపక్క గుడ్డిరాజుపై జాలి వివారము ధృతరాష్ట్రునితో విదురుడిట్లనెను. ''ప్రియసోదరుడా! నీకు నిద్రవచ్చుటలేదను చున్నావు. ఎందుకు వచ్చుటలేదో నాకు తెలియును మరణించిన నీ సోదరుని కుమారులయెడ నీవు అన్యాయముగా వ్యవహరించు చుంటివి. నీ పాపస్వభావమే నీకు నిద్ర రాకుండ చేయుచున్నది నామాట వినుము మన సోదరుడైన పాండురాజు మృతిచెందిన తర్వాత రోజులు గుర్తుకు తెచ్చుకొనుము కుంతి తన అయిదుగురు పుత్రులతో మన వద్దకు వచ్చిన ఆరోజు నీకు జ్ఞాపకమున్నదా? ఆరోజునుండే ఆ యువకులను నీవు అసహ్యించుకొనుట ప్రారంభించి నావు నాకు తెలుసును. నీవు నీపుత్రుడు దుర్యోధనుడు కలిసి, శకుని సలహాపై, వారణావతమందు వారిని నాశనము చేయుటకు వేసిన పన్నాగము నాకు తెలియును ఆ పురమునకు వారిని పంపి లక్కయింటికి నిప్పంటించిన, వారు నాశనమగుదురని తలపోసినావు నీ దురాలోచనము ముందుగానే యెఱిగి నా సోదరుని పుత్రులను రక్షించినాను అందుకు నీవు నన్ను క్షమించలేదని కూడ నాకు తెలియును నీకు మరొక అవకాశము కలిగినది నీవు దానిని సరిగా వినియోగించుకొన్నావా? లేదు ఖాండవప్రస్థమనే యెడారివంటి మరు భూమిని యుధిష్ఠిరుని కిచ్చినావు

''అయితే యుధిష్ఠిరుడు అతని సోదరులతో కలిసి ఆ ప్రదేశమును అతిసుందరముగా తీర్చిదిద్ది భారత వర్షములోని సామంతరాజులందరి మన్ననలు చూరగొని, రాజసూయ యాగమును విజయవంతముగా జరిపెను. నీ కుమారుడైన దుర్యోధనుడు ఈర్ష్య చెంది, దానిని చేజిక్కించుకొనవలెనని యోచించెను అతని ఆలోచనను నీవు బలపరిచినావు ద్యూతగృహమును నీవు నిర్మించి, అందు నీ తమ్ముని కుమారులను మోసగించినావు. వారు వారితోబాటు రాజ్యమును పోగొట్టుకొనిరి అభాగ్యురాలైన ద్రౌపదిని జుట్టుపట్టుకుని సభలోనికి యీడ్చుకొని వచ్చినపుడు, ఆమె తనకు జరిగిన పరాభవము నుండి కాపాడి న్యాయము చేకూర్చమని నిన్ను ప్రాధేయపడినది ఆమె మాటలను నీవు లెక్కచేయలేదు వారు పండ్రెండు సంవత్సరములు అరణ్యములోనూ, ఒక్క సంవత్సరము అజ్ఞాతముగను గడుపునట్లు చేసినావు అది తప్పుకాదా? ఇప్పుడు యేమి జరిగినది? అప్పుడు విధించిన షరతులు — పండ్రెండేళ్లు అరణ్యవాసము, ఒక సంవత్సరము అజ్ఞాతవాసము, మొత్తము పదమూడు సంవత్సరములు బహిష్కరణ — అన్నియు నెరవేర్చి వచ్చినారు. ఇప్పుడు వారు నిన్ను న్యాయము చేకూర్చమని అడుగుచున్నారు వారు కోరుచున్నది రాజ్యములో వారి భాగము. కాని నీవు, నీ పుత్రులు దురాశతో అక్రమముగా గడించినది దక్కించుకోవలెనని చూచుచున్నారు.

వారు కోరినదానిని నీవు వినుటలేదు. వారిని తిరిగి అరణ్యమునకు పొమ్మని రాయబారము పంపితివి. ఇది అన్యాయము కాదా? ఇప్పటికైనా మించిపోయినదిలేదు వారి దగ్గర నుండి కృష్ణుడు శాంతి సందేశము తీసుకుని రానున్నాడు కృష్ణుని మాటలు వినినట్లయిన యీ వృద్ధాప్యములో నీకు కొంత శాంతి లభించును'' అధర్మవర్తనుడైన గుడ్డిరాజుకు విదురుడు ధర్మమును బోధింప యత్నించెను మరికొన్ని రోజుల తర్వాత కృష్ణుడు హస్తినాపురమునకు వచ్చెను సభలో కృష్ణుడు దుర్యోధన ధృతరాష్ట్రులకు వారి అనుచిత ప్రవర్తనను ఎత్తిచూపి గర్జించెను పెద్దలైన భీష్మద్రోణులు కూడ పాండవులకు న్యాయము చేకూర్చమని నచ్చజెప్పచూడగిరి కాని అవి నిష్ఫలమయ్యెను తదుపరి విదురుడు మాట్లాడెను

విదురుడిట్లు పలికెను ''ప్రియసోదరా! నీకు, నీ పుత్రులకు వాటిల్లనున్న ఘోర ప్రమాదమును నీవు ఊహించలేకున్నావు. నీ తెలివితక్కువతనము చేత, భీముని కఠోర ప్రతిజ్ఞలను మరచినావు కాబోలు భీముడు అతనిసోదరులు, నాగుపాములవలె బుసలు కొట్టుచు, నీ పుత్రులనందరినీ కాటువేయుటకు సిద్ధముగా నున్నారు. యుధిష్ఠిరున కతని రాజ్యభాగము నిచ్చివేయుము మానవరూపములో నున్న భగవంతుడు యీ కృష్ణుడు, పాండవులు తనకు అత్యంత ప్రీతిపాత్రులని ప్రకటించెను అందుచే, దేవతలందరూ పాండవుల పక్షముననే యుందురు. భగవంతుడు యెక్కడ ఉండునో అక్కడ లక్ష్మీదేవి (అనగా సంపద) ఉండునని నీవు యెఱుగవా? నీపాపములన్నీ మూర్తీభవించి నీపుత్రుడు దుర్యోధనుడుగా రూపొందెను కుటుంబ క్షేమము కొరకై వ్యక్తిని, గ్రామక్షేమము కొరకై కుటుంబమును, సంఘ క్షేమముకొరకై గ్రామమును, చివరకు జీవ క్షేమమునకై యీ భూమిని వదలుట శ్రేయస్కరమని కోవిదులందురు దుర్యోధనుని విడిచిపెట్టుము నా సలహా వినుము నీ శ్రేయస్సును కోరి చెప్పుచున్నాను''.

విదురుడు మాట్లాడుట ముగించిన తర్వాత సభ ఒక క్షణకాలము నిశ్శబ్దమయ్యెను ఒక్క క్షణకాలము దుర్యోధనుడు తాను కూర్చున్న చోటునుండి దిగి వచ్చెను అతనితో రాధేయుడు, దుశ్శాసనుడు, శకుని కూడ వచ్చిరి దుర్యోధనుడు పినతండ్రి విదురుని ప్రక్కనే నిలుచుండెను అతని కండ్లు యెఱ్ఱనయ్యెను. పెదవులు కోపముతో కంపించుచుండెను విదురునితో సూటిగా మాట్లాడకుండ, దుర్యోధనుడు యిట్లనెను ''అధమ జాతిలో జన్మించిన యీతనిని యీ సభకు రానిచ్చిన దెవరు? ఇతడు దేశద్రోహి. మహారాజైన నా తండ్రి ఉప్పుతినుచు, సిగ్గువిడచి మా శత్రుపక్షము వహించుచున్నాడు. ఇతడు వెంటనే హస్తినాపురము విడచి వెళ్ళవలెనని మా అభిమతము అతడిక్కడ ఉండుట మాకు సమ్మతముకాదు. పూజ్యులైన మా తండ్రిగారికి సోదరుడగుటచేత, ప్రాణములతో విడిచిపుచ్చుచున్నాము''

విదురుడు అందరినీ ఒకసారి పరిశీలించి, అన్నయైన ధృతరాష్ట్రుని వంకకు దృక్కులు మరల్చెను. సభలో యెవరూ నోరువిప్పి పలుకలేదు. విదురుని ముఖము వివర్ణమై ప్రశాంతముగా నుండెను. అతని పెదవుల నుండి కేవలము సన్నని నిట్టూర్పు మాత్రము వెడలెను. భగవంతుని తలచుకొనగా, అతని మనసు భ్రమ, అనురాగము, బాధ, విచారము — వీని నుండి విముక్తిపొందెను. అతడు తన శక్తివంతమైన ధనుర్బాణములను తీసి సభాద్వారము వద్ద నుంచెను. ''ఈ ధనుస్సుతో బాటు మాయావృతమైన నా దృష్టిని యీ ద్వారమున వదలుచున్నాను; నా సోదరుడు, అతని పుత్రులయెడగల అనురాగము, వారి నిజస్వభావమును మరుగుపరిచి, నన్ను గుడ్డివానిని జేసినది. ఈ అనురాగమనే మాయ యింతకాలము నన్ను యిక్కడ బంధించినది. ఈనాడు ఆ మాయ నుండి బయటపడ గలుగుతున్నాను'' అను సందేశము నందించుచున్నట్లున్నది విదురుని ధనుర్బాణ విసర్జన.

విదురుడు సభనుండి లేచి, వెనుకకు తిరిగి చూడక, వెడలిపోయెను

## 11 యుద్ధానంతరము విదురుని పునరాగమనము

హస్తినాపురము వదలి విదురుడు భారతవర్షములోని పవిత్ర నదీతీరములను దర్శించుచు తీర్థయాత్రలు చేసెను. త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులచే పావనమైన తీర్థములన్నిటిని సందర్శించవలెనని సంకల్పించెను మొదట బృందావనము వెళ్ళి అచట గోవర్ధన పర్వతము దిగువ కొంతకాలము గడిపెను అచ్చటనుండి నర్మదా నదీతీరమునకు వెళ్ళి, నిత్యమూ నిర్మలముగా నుండు నర్మదా జలములో స్నానమాచరించెను అటు తర్వాత, ఒకప్పుడు శ్రీరాముడు సీతాన్వేషణ చేయునపుడు నివసించిన పంపాసరస్సు తీరమును సందర్శించెను. తీర్థములలో పుష్కరమొకటి చెట్లు చేమలతో నిండిన దేశమంతటనూ ప్రయాణించెను శరీరము ధూళిధూసరమయి, తరచు చేయు స్నానములచేతను, కేశపోషణ నిర్లక్ష్యము చేయుటచేతను కేశములు అట్టగట్టుకొని యుండెను అతని మనస్సు నారాయణ పాదములనే ధ్యానించుచున్నది. ఆ ఆలోచనయే నిత్యము మెరలుటచేత, ద్వంద్వముల ప్రలోభములను విడిచి పెట్టి, కొంత మనశ్శాంతిని పొందగలిగెను

కృష్ణునికి ప్రీతిపాత్రమైన ప్రభాస తీర్థమును విదురుడు చేరెను అక్కడ ఉండగా, వెదురు చెట్ల రాపిడి వల్ల కలిగే అగ్నిచేత అరణ్యమంతయూ సర్వనాశనమైనట్లు, ధృతరాష్ట్రుని ' వ్వనాశనమైన దని వినెను భారతవర్షమునకంతకూ యుధిష్ఠిరుడు చక్రవర్తిగా పట్టాభిషిక్తుడైనట్లు వినెను జరిగిన విషయములను గ్రహింప ప్రయత్నించెను

విరక్తిఅనే కవచము విదురుని రక్షించుచున్నప్పటికీ, అతని హృదయము విచారముతో నిండగా సరస్వతీ నదీ తీరము వైపు నెమ్మదిగా నడిచి వెడలెను. అచ్చట నుండి యమునా తీరమువైపు ప్రయాణించెను యమునా నదీతీరము వద్ద ఉద్ధవుని కలుసుకొనెను బ్రహ్మవిద్య నేర్చుకొనుటకై ఉద్ధవుడు విదురుని మైత్రేయ మహర్షి వద్దకు పంపెను. మైత్రేయుని ఆశ్రమములో కొంతకాలము గడిపి అక్కడనుండి హస్తినాపురము వైపు ప్రయాణించెను యుధిష్ఠిరుని అతని తమ్ములను చూడవలెనని సంకల్పించెను ధృతరాష్ట్రుని పాదములపైబడి, అతనిని, గాంధారిని ఓదార్చవలెనని తలంచెను. ఈ కార్యము తాను చేయవలసిన విధి అటుపిమ్మట బదరికాశ్రమము వెళ్ళి తన శరీరము విడచుటకు స్వేచ్ఛకలదని తలపోసెను. తపస్సుచేసి యీ జీవితమనే బంధమునుండి విముక్తి పొందవలెనని విదురుని ఆకాంక్ష అతనికి యెట్టికోరికలు లేవు యుధిష్ఠిరుడు రాజ్యపాలనము చేబట్టి ముప్పదియైదు సంవత్సరములు గడచినవి అతడిప్పుడు వైరాగ్యము నభ్యసించెను 'పరుల కొరకే తాను' ɾ నగాహన చేసుకొనెను. భీష్మ పితామహుడు ఆనాడు చెప్పిన మాటలు - మహారాజా ప్రజలకు చెందినవాడు; మహారాజుకు స్వీయభావములు, ఉద్రేకములు ఉండరాదు - యెంత సత్యమో యీనాడు గ్రహించెను. ప్రజల శ్రేయస్సు అతని ప్రధాన లక్ష్యముగా నుండెను యుద్ధమునకు దారి తీసిన నెనకటి సంఘటనలను గురించి ఆలోచించుటకు యిప్పుడు యుధిష్ఠిరునకు సమయము చిక్కుటలేదు. జరిగిన దానికి తన్ను తాను నిందించుకొనుట సరికాదని, నిష్ఫలమని గ్రహించెను అశ్వమేధ

యాగము జరిగిన తర్వాత యుధిష్ఠిరునకు మనశ్శాంతి కలిగెను. అన్ని పక్కలను సముద్రము ఆవరించిన యీ భూమిని పాలించుచుండెను ఇంద్రుడు స్వర్గమును పరిపాలించురీతిగా నుండెను. యుధిష్ఠిరుని పాలనలో అందరూ సుఖసంతోషములతో నుండిరి పంటలు బాగా పండి, ప్రజలు సంతృప్తితో జీవించుచుండిరి ఆయా ఋతువులలో వర్షములు సక్రమంగా పడి, భూమి సస్యశ్యామలముగా నుండెను గోవులు అమృతము వంటి పాలను విరివిగా యిచ్చుచుండెను. దొంగతనములులేక, రాజ్యమునందు ప్రజలందరూ సద్బుద్ధితో ఆనంద ముతో జీవించుచుండిరి

అకస్మాత్తుగా యుధిష్ఠిరుడు అశుభ శకునములను గాంచెను. ఇదివరలో ఒకసారి యుద్ధమునకు పూర్వము యిటువంటి దుశ్శకునములను చూచెను అప్పటివలెనే గ్రహములు ఆయా రాశులయందు సమకూరి, ప్రపంచమునకే గొప్ప వినాశము కలుగుసూచనలు కన్పడెను ఏమి జరుగనున్నదోయని ఆందోళన చెందుచున్న సమయమున విదురుడు హస్తినాపురమునకు వచ్చెను

యుధిష్ఠిరుడు అచ్చెరువొందెను గొంతునుండి మాటపెగలదాయెను విదురుని రాకకు మిక్కిలి సంతోషిం చెను అత్యంత ప్రీతిపాత్రుడైన పినతండ్రిని చూచినంతనే కనులనుండి అశ్రువులు కారజొచ్చెను రాజకుటుంబ ములోని వారందరు — ధృతరాష్ట్రుడు, గాంధారి, యుయుత్సుడు, సంజయుడు, కృపాచార్యుడు, కుంతి, ద్రౌపది, సుభద్ర, ఉత్తర, కృపి (ద్రోణునిభార్య), పాండవ సోదరులు — విదురునకు స్వాగతమొసంగిరి విదుర ధృతరాష్ట్రుల సమావేశము చాలా సున్నితముగా జరిగెను జీవచ్ఛవముగా నున్న శరీరమునకు ఊపిరి పోసినట్లుగా, విదురుడు లేని లోటు వృద్ధుడైన ధృతరాష్ట్రునికి తీరి, యెంతో శక్తి నిచ్చినది సోదరుడైన విదురుని ప్రేమతో కౌగిలించుకొనెను ప్రారంభములో కలిగిన ఔత్సుక్యము కొంచెము సద్దుమణిగిన తర్వాత, వారందరూ భవనము లోపలి ప్రాంగణములోనికి వెళ్ళిరి విదురుడు భోజనపానాదులు గావించి కొంతసేపు విశ్రమించెను అటు పిమ్మట యుధిష్ఠిరుడు విదురుని కుశల ప్రశ్నలువేసి గడచిన కొలది సంవత్సరములు యెట్లు గడపినదియు వివరింపుమని అడిగెను. ''గడచిన యీ కాలములో మా గురించి తలచేవారా? మీ అభిమానమును మేము యెన్నడూ మరువలేదు మా చిన్నతనములో తల్లిపక్షి తన రెక్కలతో పిల్లలను యెట్లు కాపాడునో ఆ విధముగా మీరు మమ్ములను కాపాడినారు మీరు గక్షించకపోయిన ఆనాడు లక్కయింటిలో మేమందరమూ మా తల్లి కుంతీదేవితో సహా దగ్ధమై యుండేవారము గడచిన కొద్ది సంవత్సరములలో మీరెట్లుండిరి? ఏయే తీర్థములను సందర్శించిరో వివరముగా చెప్పండి భగవంతుని రూపము యెల్లప్పుడూ మనస్సులో మెదిలే మీవంటి పరమపావనులనే తీర్థములుగా పరిగణింతురు సామాన్య మానవులచే కలుషితమైన పుణ్యనదులు మీవంటివారు వాటిని సందర్శించుటవలన అవి పునీతమగుచున్నవి భగీరథుడు గంగను భూమికి తెచ్చునపుడు గంగాదేవి 'ఈ స్వర్గము నుండి భూమికి దిగివచ్చినచో నాలో స్నానమాచరించే పాపులు నన్ను కలుషితమొనర్చి నాలోని నిర్మలత్వమును అపహరింతురు. అట్లు జరుగుటకు వీలు లేదు' అని పలికినట్లు నేను వినియున్నాను అందుకు భగీరథుడు 'నిర్మల మనస్కులైన పవిత్రమానవులు నీయందు స్నానము చేయగలరు. వారునిన్ను పునీతను చేయగలరు వారిని తీర్థరూపులందురు' అని జవాబు చెప్పినట్లుగా వినినాడను మీరు చెప్పు విషయములు వినుటకు యెంతో కుతూహల పడుచున్నాము''

గడిచిన సంవత్సరములు తాను యే విధముగా గడపినదియు వివరించెను. తాను సందర్శించిన పవిత్ర ప్రదేశములను వర్ణించి చెప్పెను. కాలము మిక్కిలి తొందరగా సంతోషముగా గడచిపోయెను

రాజభవనములో కొన్ని రోజులుండెను ఎక్కువ కాలము అభాగ్యుడైన ధృతరాష్ట్రునితో గడిపెను.

## 12 ధృతరాష్ట్రుని చరమదశ

హస్తినాపురములో కొన్నిరోజులు ఉండిన తర్వాత, విదురుడు సమయము మించిపోవుచున్నదని, కాలము వృధా చేయుట అనుచితమని విశ్చయించుకొనెను. తాను వచ్చి చేయవలసిన కార్యము పూర్తికాగా, ఒకరోజు ధృతరాష్ట్రునితో యిట్లనెను ''ప్రియసోదరా! ఆరోజులలో నేను నీకు చెప్పిన సలహాలను ఆలకించలేదు కాని యిప్పుడు నేను చెప్పబోవునది నీవు తప్పక వినవలెను ఈ హస్తినాపురము విడిచిపెట్టి, అరణ్యమునకు వెళ్ళుము. ఈ భోగభాగ్యములను విడిచి, యీ పట్టణమునకు దూరముగా నున్న అరణ్యమున కేగుము.''

ధృతరాష్ట్రుడు తన తమ్మునివైపు తిరిగి యిట్లనెను ''నీవు చెప్పునది నాకర్థమగుటలేదు ఈ వృద్ధాప్యములో అవిటివాడనై, అరణ్యమునకు యేల పోవలెనో తెలుపుము వివరముగా చెప్పుము నీవు యీ విధముగా సూచించుటకు యేదో ఒక కారణము ఉండునని తలంచెదను నన్ను వెళ్ళమని యెందులకు చెప్పుచున్నావు?''

విదురుడు యెంతో సరళమైన స్వరములో యీ విధముగా నచ్చజెప్పదొడంగెను ''భయంకరమైన కాలుడు మిక్కిలి తొందరగా సమీపించుచున్నాడు కాలుని శక్తి ముందు ఏదియు నిలువలేదు ఏవో మాటలు చెప్పి కాలుని వెనుకకు పంపుట అసాధ్యము. మృత్యువు చేరువలో నున్నది కాలుని చెయ్యి స్పృశించునపుడు, నీకు అత్యంత ప్రీతికరమైన యీ జీవితమును త్యజించవలసి యున్నది ఇక యితర ప్రీతికర వస్తువులను గురించి యేమి చెప్పగలము! సంపదా? బంధువులా? అధికారమా? మృత్యువు సమీపించినపుడు యివన్నీ యేమి చేయగలవు? ఈ సందర్భములో నీకు కొన్ని చేదు నిజములను చెప్పనిమ్ము నావారు అని చెప్పుకోదగ్గవారెరూ నీకు లేరు నీ తండ్రి, సోదరుడు, స్నేహితులు, పుత్రులు అందరూ గతించినారు కాలగర్భములో కలిసిపోయినారు వృద్ధాప్యము చేత నీ శరీరము మిగుల శుష్కించినది నీవు ఉంటూన్న యీ గృహము కూడ నీదికాదు నీ పుత్రులందరూ భీమునిచేతిలో మరణించినారు ఆ భీముడు పెట్టే అన్నమునే యిప్పుడు నీవు తినుచున్నావు ఇంతటి అవమానకర పరిస్థితుల్లో జీవిస్తున్నావంటే, జీవితముపై నీకు యెంత వ్యామోహమో తెలియుచున్నది ఈ దుర్భర జీవితము నీకు వ్రాసిపెట్టియున్నది

''లక్క-యింటిలో పాండవులను చంపబూనుకున్నావు. ఆహారములో విషము కలిపి భీముని చంపుటకు సిద్ధపడినావు వారి భార్యయైన ద్రౌపదిని నిండు సభలో అవమానించినావు వారిసంపదను రాజ్యమును అపహరించినావు. ఇన్ని జరిగినప్పటికీ, వారు నీకే జీవితము సమకూర్చినారు ఇట్టి జీవితము వలన యేమి ప్రయోజనము? ఈ జీవితము, యీ భోగభాగ్యములు త్యజించుటకు నీవు యిష్టపడకపోయిననూ, మృత్యువు నిన్ను వదలిపెట్టదు నీకు యిష్టమైనా, అయిష్టమైనా, యీ శరీరము జీర్ణవస్త్రము వలె క్షీణించకమానదు ఈ సత్యములను ఒక్క క్షణము ఆలోచించు ధైర్యము తెచ్చుకొనుము సంపదను, బంధుమిత్రులను, పుత్రులను పోగొట్టుకున్న తర్వాత రహస్యముగా అడవికేగి శరీరమును విడచిపెట్టువాడే ధైర్యవంతుడు కొ [illegible] మరికొందరకు ఒకరు బోధించుట వలన వైరాగ్యము కలుగును కాని మహాధైర్యముతో వైరాగ్యము నవలంబించి, అరణ్యమునకేగి శేషజీవితమును గడుపు మానవుడే అందరిలో

ఉత్తముడు యౌవనములో ధైర్యముగా నుండుట చాలా సులభము. కాని మృత్యువు సమీపిస్తున్నదని గ్రహించి యెట్టి విచారములేక యీ శరీరమును వదలుటకు సంసిద్ధతను ప్రకటించు మానవుడే నిజమైన ధైర్యవంతుడు. బాధాసదృశమైన యీ పురమును మరిచిపొమ్ము లేచి ఉత్తరదిశగా పోయి స్వర్గమార్గమున ప్రయాణించుము''

చాల సేపటివరకు ధృతరాష్ట్రుడు మౌనముగా నుండెను మొట్టమొదటిసారిగా తన జీవితములో ధృతరాష్ట్రుడు, యెట్టి అరమరికలు లేక, విదురుని సలహా పాటించ నిశ్చయించుకొనెను.

రాత్రి రెండవ యామము గడచినది ధృతరాష్ట్రుడు తనపక్కమీద నుండి లేచి, భార్య గాంధారికి తన నిశ్చయమును తెలిపెను ఆ మహాసాధ్వి వివాహము జరిగిన రోజునే, తన భర్త చూడలేని యీ ప్రపంచమును తానుకూడ చూడనని పట్టుబట్టతో కళ్ళకు గంతలను కట్టుకొనెను ధృతరాష్ట్రుడు చెప్పినది విని మారు మాట్లాడక భర్తపక్క నిలుచుండెను ఆ వృద్ధదంపతులు రహస్యముగా యెవరికీ తెలియకుండా విదురుడు తోడురాగా రాజ భవనము విడిచి వెళ్ళిరి

## 13 నారదుడు హస్తినాపురమున కేతెంచుట

ప్రాతఃకాలముననే యుధిష్ఠిరుడు నిద్రనుండి లేచెను కాల్యకృత్యములు తీర్చుకుని, ఉదయపూజలు చేసి, యితర నిత్యకర్మలు పూర్తిచేసి, ధృతరాష్ట్రుడు గాంధారి నివసించే వసతివైపు వెళ్ళెను అతని నిత్యకృత్యములలో యిది ఒకటి అక్కడ చుట్టూ పరికించగా ధృతరాష్ట్రుడు, గాంధారి కానరాలేదు. విదురుడు కూడ కనిపించలేదు అంతటా వెదికెను కానివారి జాడ యెక్కడనూ కానరాలేదు వారి వసతి ముఖద్వారము వద్ద సంజయుడు కూడ తనవలెనే విచారవదనముతో కన్పడెను యుధిష్ఠిరుడు సంజయునడిగెను సంజయుడు ఒక్కమాటయైనను పలుకలేదు సంజయునితో నిట్లు పలికెను ''ఓ సంజయా! వారెక్కడ? మా పెదతండ్రి, పినతండ్రి, పెదతల్లి యెక్కడ నున్నారు? ఎవరిచేతనైన అవమానమొంది, రహస్యముగా యెవరితో చెప్పకుండా వెళ్ళిపోయినారా? లేక, పుత్రశోకము భరించలేక గంగానదిలో దూకి ఆత్మహత్య చేసుకున్నారా? ఏ విషయమునూ తొందరగా చెప్పుము'' కన్నీళ్ళను తుడుచుకుని సంజయుడిట్లు పలికెను. ''నిజముగా యేమి జరిగినదో నాకు తెలియదు వారు యేమి చేయనున్నదీ నాకు తెలియపరచలేదు వారిద్దరునూ విదురుడునూ నన్ను మోసపుచ్చిరి'' ఈ విషాద పరిస్థితిలో మునిగియున్న యుధిష్ఠిరుడు, వీణ మీటుచు వచ్చుచున్న నారదుని చూచెను నారదునికి స్వాగతము పలికి ఉచితరీతిని సత్కరించి యిట్లు పలికెను. ''నేను మరొక ధ్యానలో నున్నట్లు కన్పించినచో క్షమించగోరెదను. నాతండ్రి సోదరులు, నాపెదతల్లి కన్పించకపోవుటచేత మనసు స్థిమితము తప్పియున్నది నన్ను విచారము ఆవరించినది మీరు నన్ను ఓదార్చి, యిట్లు జరుగుటకు అర్థమేమిటో తెలియజెప్పుమని వేడుకుంటున్నాను'' అంత నారదుడిట్లు పలికెను ''యుధిష్ఠిరా! నీవు యెవరి గురించి విచారించవలసిన పనిలేదు ఈ ప్రపంచము భగవంతుని అధీనములో నున్నది కొందరు వ్యక్తులను ఒకచోట జేర్చి, వారు కొంతకాలము జీవించి, తిరిగి ఒకరినొకరు విడిచి వెళ్ళునట్లు చేయునది ఆ భగవంతుడే ఎద్దును చూడు దాని యజమాని దాని ముక్కుకు రంధ్రములు చేసి ఆ రంధ్రములగుండా ఒక త్రాడును వేసి, ఆ తర్వాత దాని వీపుపై బరువులను వేసి దానిని లాగుకుని వెళ్ళును యజమాని ముక్కుత్రాడుసు

యెటులాగితే అటువైపు యెద్దు నడచి, తన వీపుపై యెంత బరువు వేసిన అంత బరువును లాగుకొని పోవును ఈ విషయములో యెద్దుకు మరొక గత్యంతరము లేదు. అదేరీతిగా మానవుడు కొన్ని త్రాళ్లతో కట్టుబడియున్నాడు. వాటినే మానవుడు వర్తించు సూత్రము అందురు అవి యేమనగా: ధర్మము, బ్రహ్మచర్యము, బ్రాహ్మణ్యము. వీటి ననుసరించి తనపై మోపిన బరువు బాధ్యతలను లాగుకొని, భగవంతుని దిశగా పోవును ఏ వ్యక్తికిని తన యిష్టము వచ్చినట్లు సంచరించుటకు స్వేచ్ఛలేదు ఒక బాలుడు ఆటబొమ్మలతో ఆడుకొనునపుడు, కొంతసేపు వాటినొకచోట జేర్చి ఆడుకొనును. మరికొంతసేపటికి తనకు తోచినరీతిగా వాటిని విడదీయును. అదేరీతిగా, భగవంతుడు మానవులను యీ ప్రపంచములో ఒకచోట జేర్చి, తనకు తోచినపుడు వారిని విడదీయును. ప్రతి వ్యక్తి జీవితము యీ సత్యమును నిరూపిస్తున్నది మానవశరీరము అశాశ్వతమని నీకు తెలియును ఆత్మ శాశ్వతము ఏ విధముగా చూచినప్పటికీ, అదృశ్యమైన నీ తండ్రి సోదరులు, పెదతల్లి గురించి విచారించుట తగదు వారిని సంరక్షించుటకు నీవు లేకపోవుటచేత వారు నిస్సహాయులయ్యేరని నీవు తలచవద్దు ఈ భ్రమను విడువుము పంచభూతాత్మకమైన యీ శరీరము కాల, కర్మ, స్వభావములకు కట్టుబడి యున్నది. ఇంకేదియు దానిని సంరక్షింపనూ లేదు, నశింపజేయనూ లేదు

''యుధిష్ఠిరా! జాగ్రత్తగా వినుము భగవంతుడు రూపనామములతో యీ భూమిపై దుష్టశక్తులను నిర్మూలించుటకు అవతరించియున్నాడు. అతని కార్యము పూర్తి అయినది అతడు ఉన్నంతవరకు నీవు యీ భూమిపై ఉండగలవు

''ఇక నీ తండ్రిసోదరులు, పెదతల్లి గురించి వినుము. ధృతరా      చేరెను గంగానది యీ భూమికి దిగివచ్చినపుడు, ఏడు పాయలుగా విడిపోయి ప్రవహించెను ఎక్కడ యేడు పాయలుగా విడిపోయెనో ఆ ప్రదేశమునకు సప్తస్రోతస్సు అని పేరు. ఆ పవిత్ర స్రోతస్సు తీరమున, నీ పెదతండ్రి రాబోవు జీవితమునకు సంసిద్ధుడగుచున్నాడు అయిదు రోజుల తర్వాత అతనికి యీ శరీరము నుండి విముక్తి లభించును. అతని శరీరముతోబాటు గాంధారి శరీరము కూడా ఆ ఆశ్రమము నందు దగ్ధమైపోవును ఇది చూచిన తర్వాత నీ పినతండ్రి విదురుడు మరొకసారి పుణ్యతీర్థములు దర్శించి, బదరికాశ్రమము చేరి అక్కడ తన శరీరమును విడిచిపెట్టును

''నేను చెప్పినదంతయు విని, యీ విచారమును త్రోసిపుచ్చుము'' పాండవుల వద్ద సెలవు తీసుకుని నారదుడు వెడలగా, యుధిష్ఠిరుడు నారదుడు పలికిన పలుకులను మననము గావించుకుని, తనను తాను సముదాయించుకొనెను.

## 14 అర్జునుడు ద్వారక నుండి తిరిగి వచ్చుట

గడచిన కొద్దికాలములో      ధిష్ఠిరుని కలవరపరచెను. కొంతవరకు నారదుని బోధలు అతనికి ఊరట కలిగించెను కాని దుశ్శకునములు గోచరించుచునే యుండెను ఎంతటి మహోత్పాతములు సంభవించునోయని తలంచుచూ భయభ్రాంతుడయ్యెను అతనికి విశ్రాంతి లేకుండెను

నారదుని యీ పలుకులు — ''దుష్టశక్తుల నణచుటకు భగవంతుడు మానవరూపంలో అవతరించెను అతడు వచ్చిన పని పూర్తిఅయినది. అతడు యీ భూమిపై ఉన్నంతవరకు నీవు ఉండగలవు'' — యుధిష్ఠిరుని మదిలో మెదలెను

నారదుని మాటలు యుధిష్ఠిరునికి మిక్కిలి ఆందోళన కలిగించెను కృష్ణునితో వెళ్ళిన అర్జునుడు తిరిగి యింకను రాలేదు వెళ్ళి చాలా నెలలైనది భీమునితో యుధిష్ఠిరుడు తన మనసులోని ఆవేదనను వెలిబుచ్చెను యుధిష్ఠిరుడిట్లనెను ''భీమా! నాకెందుకో యెక్కువ ఆందోళన కలుగుచున్నది. పూజ్యుడైన నారదమహర్షి కృష్ణభగవానుడు అవతరించిన పని పూర్తి అయినదని, తాను ధరించిన యీ మానవశరీరమును, నటుడు తన పాత్రపోషణ పూర్తికాగానే తాను ధరించిన వేషమును వదలివేయునట్లు, త్వరలోనే వదలనున్నాడని చెప్పినప్పటి నుండి నాకెంతో కలవరముగా ఉంటున్నది కృష్ణుడు మనలను విడిచి వెళ్ళిపోవునా? మనందరకు సర్వస్వముగా ఉంటూన్న కృష్ణ భగవానుడు మనలనందరినీ విడిచి వెళ్ళునా? ఇది చాలా తొందరలోనే జరుగగలదని నాకెంతో భయముగా ఉన్నది. చెడుమార్పులు యెంత తొందరగా కలుగుచున్నవో చూడు! ప్రజలు రానురాను అధర్మవర్తను లగుచున్నారు మానవులకు తల్లి తండ్రులయెడ, పెద్దలయెడ ప్రేమ, గౌరవాభిమానములు అడుగంటుచున్నవి. మరింత కుత్సిత బుద్ధులగుచున్నారు కలికాలము ప్రవేశించినదని నాకు తోచుచున్నది కృష్ణుడు తన పవిత్ర పాదములను యీ భూమిపై పెట్టినప్పటి నుండి నేటివరకు కాంచిన యీ వైభవము త్వరలోనే అంతరించనున్నది. భీమా! నాకు మిక్కిలి భయాందోళనలు కలుగుచున్నవి''. ఇంతలో అర్జునుడు ద్వారక నుండి తిరిగి వచ్చెను. నెమ్మదిగా అడుగులు వేయుచూ అన్నగారైన యుధిష్ఠిరుని వైపు నడచెను అర్జునుని కనుల నుండి అశ్రువులు వర్షించుచుండెను ముఖము దించుకుని యుండెను ముఖము కళావిహీనముగా నుండెను అన్న పాదములపై బడి కాళ్ళను గట్టిగా పట్టుకుని లేవకయుండెను యుధిష్ఠిరుడు వణకుచుండెను అతని గుండెలు అసాధారణముగా కొట్టుకొనుచుండెను గద్గద స్వరముతో అర్జునుని లేవనెత్తి యిట్లడిగెను ''అర్జునా! ఏమి జరిగినది? నీకేమి అనారోగ్యము లేదు కద లేక యేదైన మనోవ్యధ నిన్ను వేధిస్తున్నదా? విషయమేమిటో చెప్పుము ద్వారకలో అందరూ కుశలమేనా? మనకు ప్రీతిపాత్రుడైన కృష్ణుని గురించి చెప్పుము'' అర్జునుడు మౌనముగా నుండెను అతని ముఖమందు హృదయములో వలె, ఆనందమంత రించిపోగా, కనులు తుడుచుకొని, చేతులు కట్టుకుని నిలుచుండెను అతని మనస్సు కృష్ణుని గురించి ఆలోచించుచుండగా, అతిగద్గద స్వరముతో ''ప్రభూ! మనము వంచితులమైనాము విధి అతిక్రూరముగా వంచించినది ద్వారలో కృష్ణుడు ఇకలేడు. అంతెందుకు, అసలు ద్వారకయే లేదు'' అని పలికి మూర్ఛపోయి నేలపై పడెను

మూర్ఛనుండి తేరుకుని తెలివివచ్చిన పిదప, అర్జునుడు, తనను కుని, యాదవులం దరూ యేవిధముగా నాశనమైనారో, కృష్ణుని నిర్యాణానంతరము ద్వారకానగరము యెట్లు సముద్రములో మునిగిపోయెనో తెలిపెను

అర్జునుడు పూర్తిగా మూర్ఛనుండి తెలివితెచ్చుకుని, చెప్పిన దుర్భర విషయములను గ్రహించుటకు అక్కడ చేరిన వారందరికీ కొన్ని నిముషములు పట్టెను అటు తర్వాత, ప్రభాసతీర్థములో సంభవించిన దారుణముల గూర్చిన విషయములు ఒక్కటొక్కటే తెలుసుకొనిరి కృష్ణుని గొప్ప వైభవములను గుర్తుకు తెచ్చుకుని వారికి వివరించుచుండగా, అర్జునునికి తన శరీరమంతటా యేదో చెప్పరాని శాంతి పూర్వకమైన అనుభూతి కలిగెను అతని మనస్సు ప్రశాంతముగా నిర్మలముగా నుండి, వైరాగ్యభావము ఆవహించెను భగవంతుని

నిత్యము తలచుచుండుటచేత అతని మనస్సులోని కలవరములు అంతరించెను. చాలా యేండ్లక్రితము రణరంగమందు కృష్ణుడు బ్రహ్మవిద్యను బోధించెను. ఇప్పుడు, యిన్ని సంవత్సరముల తర్వాత, కృష్ణుడు బోధించిన ఆ విషయములు ఒక్కటొక్కటే అర్జునుడు అర్థము చేసుకొనుచుండెను. ద్వంద్వముల ప్రభావము యేవిధముగా జీవుడు, పరమాత్మ వేరను భ్రమ కలిగించి, దుఃఖమునకు దారితీయుచున్నదో గ్రహించెను. ద్వంద్వ భావము కలుగుటకు పంచభూతములతో నిర్మితమైన యీ శరీరము ఒక కారణము. రెండవ కారణము త్రిగుణముల కలయిక. ద్వంద్వ భావమునకు అవిద్య (అసత్యము) ఆధారము. అవిద్య నిర్మూలమై సత్యము గుర్తించినపుడు, ద్వంద్వభావము అదృశ్యమగును.

దారుణమైన కృష్ణుని నిర్యాణ వార్త విన్న యుధిష్ఠిరుడు మూగబోయెను. అతడు ఊహించి భయపడినట్లు గానే ద్వారకలో జరిగిన దారుణ సంఘటనలు, కృష్ణుని నిర్యాణము దుశ్శకునముల ప్రభావము నిర్ధారించి నట్లయ్యెను. నారదుడు వచ్చి వెళ్ళినప్పటి నుండి యుధిష్ఠిరునికి మనశ్శాంతి లేకుండెను. ఇప్పుడు అతనికి మనస్సులో యెట్టి వికారములు, ఆందోళనలు లేక నిశ్చల భావము క్రమ్ముకొనెను. తిరిగి నారదుని మాటలు — ''కృష్ణుడున్నంత వరకు యీ భూమిపై నీవు ఉండగలవు'' — జ్ఞప్తికి వచ్చెను. యుధిష్ఠిరుని ఆలోచనలు పరలోకము వైపు మరలెను. కృష్ణుని నిర్యాణ వార్త విన్న తక్షణమే కుంతీదేవి తనువు చాలించి, నిత్యమునూ కృష్ణుని చింతించుట చేత, అతనితో ఐక్యము చెందెను.

యుధిష్ఠిరుడు తన మహాప్రస్థానమునకు సన్నాహము కావించెను. పరీక్షిత్తునకు పట్టాభిషేకము చేసెను. మధురలో అనిరుద్ధుని కుమారుడైన వజ్రునకు పట్టము గట్టెను. తన సంపదను యుధిష్ఠిరుడు విరివిగా దానము చేసెను. నారచీరలు ధరించి, జడలతో రాజభవనము నుండి నిష్క్రమించెను. ముఖమునందు యెట్టి భావములేక మతిచెడిన వానివలె నుండెను. ఎవరితో మాట్లాడలేదు, చివరకు తన తమ్ములతో గూడ మాట్లాడక యుండెను.

భీమార్జున నకులసహదేవులు, యుధిష్ఠిరు ననుసరించిరి. వారి మనస్సులు భగవంతుని చింతించుచుండగా, ఉత్తరదిశగా నడిచి, యీ భూమిని విడిచి స్వర్గము నలంకరించిరి.

## 15 గోవు, కుంటిఎద్దు

పరీక్షిత్తు జన్మించిన తర్వాత ధౌమ్యమహర్షి, కృపాచార్యుడు అతని జాతకచక్రము వేసిరి. పుట్టినబిడ్డకు ఉజ్జ్వలమైన భవిష్యత్తు కలదని వారు యుధిష్ఠిరునకు చెప్పిరి. ''మనువు పుత్రుడైన ఇక్ష్వాకు వలె నుండు'' నని చెప్పిరి. మరియు, ''బ్రాహ్మణులను గౌరవించి సత్కరించును. శ్రీదశరథ కుమారుడైన శ్రీరామునివలె సత్యమే యెల్లప్పుడును పలుకును. శిబిచక్రవర్తివలె విరివిగా దానధర్మములు చేయును. దుష్యంతుని కుమారుడైన భరతుని కీర్తి వ్యాపించినట్లు, నలుదిశల యితని కీర్తి వ్యాపించగలదు. పాండవార్జున కార్తవీర్యార్జునుల వలె విలువిద్యయందు మిక్కిలి ప్రజ్ఞాశాలియగును. హిమవంతునికున్న నిశ్చలత్వమును, భూదేవికున్న ఓర్పును పూని యుండును. బలిచక్రవర్తికి ఉన్న ధైర్యము, ప్రహ్లాదుని భక్తి కలిగియుండును. అశ్వమేధయాగము జరిపి, వ్యాసపుత్రుడైన శుకమహర్షి వద్ద బ్రహ్మవిద్య నభ్యసించును. సూర్యచంద్రులు యీ భూమిపై ఉన్నంతవరకు అతని పేరు చిరస్థాయిగ నుండగలదు'' అని చెప్పిరి.

## ద్వితీయ స్కంధము

పట్టాభిషిక్తుడైన పరీక్షిత్తు ఋషుల వచనములను ఋజువు చేసెను యుధిష్ఠిరునివలె నేర్పుతో రాజ్యమును పాలించెను ఉత్తర కుమారుని పుత్రికయగు ఐరావతీదేవిని వివాహమాడెను వారి జ్యేష్ఠపుత్రుడు జనమేజయుడు గంగానదీతీరమున అశ్వమేధయాగము నిర్వర్తించెను కలిప్రభావము దినదినము హెచ్చుచుండుట అతనికి విపరీతముగా బాధకలిగించెను కలితో యుద్ధము చేసి అతనిని నాశనము చేసి, తిరిగి యీ భూమిపై తన తాతలు రాజ్యము నేలినప్పటి వైభవమును పునరుద్ధరింప తలచెను

ఒకసారి, సరస్వతీ నదీ తీరమున ఒక ఎద్దు (ధర్మము) ఆవు(భూదేవి)తో సంభాషించుచుండెను ఆవు చిక్కి, తన దూడను కోల్పోయినదానివలె నుండెను. ఆవు కనుల నుండి నీరు కారుచుండెను. ఎద్దు అవిటిగానున్నది. ఒక కాలుతో కుంటుచు ఆవువద్దకు వెళ్ళి యిట్లనెను. ''నీవు యెందుకు యేడ్చుచున్నావు? ఏల విచారముగా కన్పించుచున్నావు? నీవు రోగివలె నున్నావు ఇది యేదో మానసిక వ్యధగా నాకు గోచరించుచున్నది ఏదో తీరని బాధ నిన్ను వేధించుచున్నట్లున్నది నీకు అత్యంత ప్రీతిపాత్రులైన వారు గతించగా, వారికొరకు విచారించుచున్నావా? లేక నా మూడు కాళ్ళు కుంటిగా నుండుట జూచి భరించలేక యేడ్చుచున్నావా? క్షత్రియులకు బదులు అధమజాతిలో జన్మి ' పాలకులు కాగలరని విచారించుచున్నావా? ఇకముందు యజ్ఞయాగములు జరుగవని దేవతలకు హవిస్సులో భాగము లభించదని దుఃఖించుచున్నావా? తల్లీ భూదేవీ! ఇకముందు ఇంద్రుడు వర్షములు కురిపించక పోవుటచేత తేమ యుండదని విచారించుచున్నావా? ధర్మము క్షీణించుచున్నదని విచారమా? ఇకముందు స్త్రీలను పురుషులు రక్షింపలేరని, యువకులు తమ తల్లిదండ్రులను గౌరవించరని భయపడుచున్నావా? సరస్వతీదేవి అపవిత్రులైన బ్రాహ్మణుల యిండ్లలో నుండవలసి వచ్చునని, లేక ఉత్తమ జన్మనందిన బ్రాహ్మణులు వారికంటె అధములైన వారికి నీచపు సేవచేయలసి వచ్చునని బాధపడుచున్నావా? లేక భగవంతుని చింతించక, ' కొరకు పాపకార్యములందు మునిగే మానవుల గురించి శోకించుచున్నావా?

''నీవెందుకు విచారముగా నున్నావో నేనెఱుగుదును. ఇంతవరకు భగవంతుడు నీ తోడనే యుండి నీపై బరువును తొలగించెను అధర్మమును నాశము కావించెను అతడు యీ భూమి నుండి వెడలుటతోడనే ధర్మము కూడ అతని ననుసరించి వెళ్లిపోయెను ఇదియే నీ విచారమునకు తప్పకుండ కారణమై యుండును అందరూ శత్రువుగా పరిగణించే కాలము నీ గతవైభవమును దోచుకున్నది భవిష్యత్తును గురించిన ఆలోచనలే నీ బాధకు కారణమై యుండును. నేను చెప్పినది నిజమేనా?''

అశ్రువులు నిండిన కనులతో ఆవు (భూదేవి) యిట్లనెను ''ఓ ధర్మప్రభువా (ఎద్దు)! నా యీబాధ వెనుక యేమి ఉన్నదో నీకు బాగుగా తెలియును. నీ ప్రశ్నలు నా గాయములను తిరిగి రగిలించినవి. గోపాలుడు (భగవంతుడు) నన్ను విడిచిపోయెను. నేను అతనికై పరితపించుచున్నాను. అతడు వెళ్ళిన తక్షణమే ధర్మము నన్ను విడిచిపోయెను దానితో యింతకాలము నాలో వసించిన ఉదార గుణములు విడిచి పోయెను నీవు యింతవరకు యే ధర్మమునకు ప్రతినిధిగా నిలిచినావో, అది వెళ్ళిపోవుటతో నిన్ను గురించి విచారించుచు న్నాను. సౌందర్యము, మంచితనము, నైర్మల్యము — వీటికి నిలయమైన ఆ భగవంతుడు విడిచివెళ్ళగా, కలి పురుషుని దినదినాభివృద్ధి భయము కల్గించుచున్నది. కృష్ణుని రూపములో భగవంతుడు తన పాదములను నాపై మంచి నడచెను నన్ను పునీతను కావించుటచేత నేనెంతో సుందరముగా నుంటిని నా అదృష్టమునకు నేను గర్వపడితినని కాబోలు, నన్ను విడిచివెళ్ళి యీ విధముగా శిక్షించెను ఏమి చేయుటకు తోచకున్నది అప్పటి వైభవము పదేపదే జ్ఞప్తికి రాగా మరీమరీ దుఃఖము కల్గుచున్నది''.

ఆ విధముగా సంభాషించుచుండగా, యెక్కడి నుండియో ఒక అధమ జాతిలో జన్మించిన వ్యక్తి క్షత్రియ వేషముతో వారికడకు వచ్చెను. తదుపరి వారిని వేధింపజొచ్చెను ఒక కర్రను తీసుకుని, ఎద్దుకున్న ఒకే ఒక కాలిని విరగగొట్ట బూనుకొనెను ఇంతలో పరీక్షిత్తు మహారాజు తన రథముపై ఆ ప్రాంతమునకు రాగా యీ దారుణ దృశ్యము అతని కంటబడెను. వెంటనే అతడా ప్రదేశమునకు వచ్చి, ఒక చేతితో ధనుస్సు యెత్తి తత్క్షణమే రెండవ చేతితో అమ్ముల పొది నుండి ఒక అమ్మును వెలుపలికి తీసెను దీనముగా నున్న గోవును చూడగా పరీక్షిత్తు కనుల నుండి అశ్రువులు ప్రవహింప మొదలిడెను తీక్షణమైన కంఠముతో ఎద్దును గాయపరచుచున్న వానివైపు తిరిగి యిట్లనెను. ''ఎందుకింత క్రూరముగా ప్రవర్తించుచున్నావు? నా రాజ్యములో యిటువంటి అన్యాయము యేల జరుగుచున్నది? ఒకప్పుడు ధర్మమూర్తి యైన యుధిష్ఠిరుడు పాలించిన యీ భూమిపైనా? నేను మహారాజుగా నుండగా, యింతటి దారుణ కార్యము చేయుటకు నీకెట్లు ధైర్యము వచ్చినది?''

గోవును, యెద్దును సేదదేర్చి వారితో పరీక్షిత్తు యిట్లనెను ''మీరెవరు కానీయండి ఈ పాపాత్ముని వలన వేదనకు గురియైన మీరు యిక స్వేచ్ఛగా నుండగలరు. ఈ దుర్మార్గుని యిప్పుడే చంపెదను. మీకు యిక భయము లేదు. నీ అవిటితనమునకు జాలి కలుగుచున్నది నీ మూడు కాళ్ళను యెవరు విరగగొట్టిరి'' అని యెద్దు నడిగెను

ఎద్దు (ధర్మము) పరీక్షిత్తును చూచి యిట్లనెను ''కురువంశములో జన్మించిన నీవు యిట్లు పలుకుట చాలా ఉచితముగా నున్నది భగవంతుడు యెవరికి శాంతి దూతగను, రథసారధిగను సహాయపడెనో అట్టి ఉత్తమోత్తములకు నీవు వారసుడవు. మా యీ ప్రస్తుత స్థితికి యెవరు బాధ్యులో నిజముగా మాకు తెలియదు. నా చుట్టును పరికించి చూచిన, ప్రజలు ధర్మము వివిధ రూపముల గురించి మాట్లాడగా నాకు తెలివి తప్పినట్లుండును నాస్తికులు కొందరు మానవుడే తన దురదృష్టమునకు కారణమందురు ఈ భూమిపై మానవుల జీవితములను నిర్దేశించుటకు భగవంతునకెట్టి శక్తియు లేదనుచుందురు. మానవుల అహంకారమే వారి జీవితమును తీర్చిదిద్దుచున్నది. మరికొందరు అన్నింటికి నవగ్రహముల ప్రభావమే కారణమందురు విధి, గ్రహచారము పర్యాయ పదములని వారి నమ్మకము మరికొందరు కర్మయే ప్రధానమని, అన్నింటికి కర్మయే కారణమని చెప్పుదురు. ఇంకనూ మరికొందరు మంచి చెడులు జరుగుటకు వారివారి స్వభావములే తప్ప యితరమైన దేదియూ కారణము కాదని అందురు కొద్దిమంది, చాలా కొద్దిమంది, భగవంతుడను వాకొకడున్నాడని, అతడు మానవాతీతుడని, అతడే అన్నింటికీ కారణభూతుడని విశ్వసింతురు ఓ రాజా! ఈ అభిప్రాయము లన్నిటినీ చక్కగా యోచించి, యేది యిప్పటి పరిస్థితులకు కారణమో నీకు నీవే నిశ్చయించుకొనుము. నాకైతే నిజముగా తెలియదు''.

ఆ మాటలను విని పరీక్షిత్తు ఒక క్షణము యోచించి చిరునవ్వుతో యిట్లనెను. ''అధర్మపరులేకాక, వారి పేరు సంస్మరించువారు గూడ నరకము పొందుదురని శాస్త్రములు చెప్పుచున్నవి నిజమైన ధర్మశీలురు పాపాత్ముల పేర్లు తలంచరు. నీవు చెప్పిన మాటలు ధర్మము లోతుపాతులు బాగుగా యెఱిగిన వారు చెప్పినట్లున్నవి. నీ పలుకులు విని యోచించగా నీవు ధర్మమూర్తివి తప్ప వేరొకరు కాదని స్పష్టముగా తెలియుచున్నది.

''తపస్సు, శౌచము, దయ, సత్యము ధర్మమునకు నాలుగు పాదములని చెప్పుదురు. తపస్సు నాశమొందు

టకు మదము కారణము. ఇంద్రియానుభవములు, అహంకారము తరువాతి రెండు పాదములు, అనగా శౌచము, దయ నశించుటకు ముఖ్య కారణములు ఈ కలియుగములో సత్యము ద్వారా ధర్మము నవలించించ వచ్చునని చెప్పుదురు ఆ ఒక్క పాదముపైనే నీవు యిప్పుడు నిలిచి యున్నావు. ఈ కలి, సత్యమును వధించి దాని స్థానమున తన ఆయుధమైన అసత్యమును ప్రతిష్ఠించుటకు ప్రయత్నించుచున్నాడు. భూమాత యెందుకు విచారించుచున్నదో నాకు తెలియును భగవంతుడు తనపై నడచినపుడు గడచిన స్వర్ణయుగమును, పాపాత్ములు పాలించు రాబోయే కాలముతో సరిపోల్చి విచారించుచున్నది. భయమును విడువండి. నేను కలిని రూపుమాపబోవుచున్నాను''.

ధనువును క్రిందపెట్టి చేతిలో కత్తి తీసుకుని కలిని చంపుటకు పరీక్షిత్తు ఉద్యమించెను.

# 16 కలి ప్రభావము

తాను ధరించిన వేషము విప్పివైచి, కలి పరీక్షిత్తు మహారాజు పాదములపైబడి క్షమించమని ప్రార్థించెను. అంత పరీక్షిత్తు యిట్లనెను ''నా పాదములపై బడుటచేత నీకెట్టి హానియు చేయనని నీవెఱుగుదువు. అర్జునుని కుటుంబములో జన్మించిన నేను, నా పాదములబడిన వారికి బాధ కలిగించను. కాని నీవు అధర్మమునకు దగ్గర బంధువు అగుటచేత నీవు నా రాజ్యము నుండి దూరముగా వెళ్ళిపొమ్మని ఆజ్ఞాపిస్తున్నాను. నా రాజ్యములో నీవు ఉండతగవు. నీ ఉనికి నేను సహించలేను. ఒకసారి గాని నీవు ఉండుటకు అవకాశమిచ్చినచో నీ సహచరులు — దురాశ, అసత్యము, చౌర్యము, అధర్మము, కుత్సితము, మత్సరము — యింతేల అసహ్యమైన వారందరూ వచ్చి చేరుదురు. మీరెవరూ నా రాజ్యములో ఉండుటకు వీలులేదు''.

భయముతో వణకుచూ కలి యిట్లనెను ''ఓ రాజా! ఈ భూమి అంతయూ నీ పాలనలో ఉన్నది మరి నేనెక్కడికి పోగలను? మంచిని సృష్టించిన భగవంతుడే దానికి నీడగా చెడును కూడ సృష్టించినాడు భగవంతుడు సృష్టించిన నేను యెక్కడో ఒకచోట ఉండక తప్పదు నేనెక్కడకు వెళ్ళవలెనో సెలవిమ్ము నీ ఆజ్ఞ శిరసావహింతును''.

కలి మాటలను విని, కొంతసేపు యోచించి యిట్లనెను ''నీవు పలికినది నిజమే జనులు భగవంతుని నామము పూర్తిగా విస్మరించిన చోటికి వెళ్ళిపొమ్ము ఎక్కడ జూదము, పానము, ఇంద్రియ సుఖాసక్తి, హింస తాండవమాడునో అక్కడికేగుము''

''నువ్వు చెప్పినవన్నియు నున్న ప్రదేశము యెక్కడనున్నదో తెలిపిన నేనక్కడకు వెళ్ళగలను'' అని కలి పలికెను

''బంగారము. బంగారమున్న చోట దురాశ, అసత్యము, అహంకారము, ఇంద్రియ లోలత్వము, ద్వేషము, నిర్దాక్షిణ్యము విచ్చలవిడిగా నుండును ఇవి అన్నియు బంగారమున్నచోట తప్పక ఉండును. కాబట్టి నీవక్కడకు పోయి ఉండవచ్చును'' అని పరీక్షిత్తు అనెను

పరీక్షిత్తు సూచించినట్లు, కలి అక్కడ నుండి వెడలిపోయెను అందుకే కామినీ కాంచనములు ప్రబల శత్రువులని, అవి మానవుని నాశము చేయునని బుధులు చెప్పుదురు. కలి చెప్పిన మాటలు బాగా ఆలోచించదగినవి. తనను భగవంతుడు సృష్టించెను కనుక దాని వెనుక ఒక ప్రయోజనముండి తీరవలెను భగవచ్చింతన యెచ్చటెచ్చట ఉండదో ఆయా ప్రదేశములందు కలి సంచరించునట్లు జేసెను భగవంతుడే విస్మృతి పాలైనాడు. నిజమే కాని కుంతి ''మాకు యెల్లప్పుడూ కష్టములు ఉండినచో నిన్ను యెల్లప్పుడూ చింతించెదము'' అని కృష్ణునితో పలికినది దీని భావమేమి? భౌతిక సుఖముల ననుభవించుటలో మానవుడు నిమగ్నుడై యుంటున్నాడు. జీవితములో విజయము సాధించినచో అది తన ప్రయోజకత్వమని తలచును. అది తన అదృష్టమని భావింపడు. కాని కష్టములు యెదురైనపుడు, దుర్భర స్థితిలో నున్నపుడు మనస్సు మెత్తబడును. బాధలు అహంకారమును కరిగించి ద్రవింపజేయును దేనినైనను సాధించినపుడు, అహంకారము తలయెత్తును. అపజయము కలిగినపుడు, అహంకారము వెనుకకు తరలిపోగా, వినయము ప్రకటితమగును ఆవరణ తొలగిపోగా, హృదయ వాసియైన భగవంతుడు జాజ్జ్వల్యమానముగా ప్రకాశించును సంకట పరిస్థితులు ప్రాప్తించునపుడే భగవంతుని తలచుట జరుగును తనను సృష్టించుటలో యేదో ప్రయోజనము ఉండవచ్చునని కలి పలుకుటలో అంతరార్థ 'వచ్చును. దుష్ట మార్గము ననుసరించు మానవులు పూర్తిగా భగవంతుని విస్మరింతురు. అట్టి వారికి కలి సహాయపడును. కాని దీని వెనుకనున్న సత్యము జీవులను రక్షించుట, కష్టములందు తగుల్కొనిన జీవులు వారి మనస్సును భగవంతునిపై మరల్చగా రక్షపడయుదురు ''చెడు మంచికి నీడ''యని కలి చెప్పుటలోని భావము యిదియే అయి ఉండవచ్చును

## 17 శృంగి శాపము

ఒకరోజు పరీక్షిత్తు మహారాజు వేటకు వెళ్ళెను ఒక లేడిని వేటాడుటలో వెంట తరిమి త్రోవదప్పెను అలసిపోయి ఆకలితో, కొంత దూరములో తొందరగా ఆశ్రమమువైపు నడచి, అందు ప్రవేశించి యెవరైన ఉన్నారాయని కేకవేసెను ఎవ్వరునూ పలుకకపోవుటతో ఆశ్రమములో యెవరూ లేరని తలంచెను. ఆ ప్రదేశములో నడచుచుండగా ధ్యానములో నిమగ్నుడైన ఋషిని కనుగొనెను. అతడు కనులు మూసుకుని యుండెను. అతడు తన ఇంద్రియములను, శ్వాసను అరికట్టి, బాహ్య ప్రపంచముతో సంబంధము లేక యుండెను. అతని తలమీద వెంట్రుకలు జడలుకట్టి యుండెను లేడి చర్మమును ధరించి ధ్యానము చేయుచుండెను పరీక్షిన్మహారాజు ధ్యానములోనున్న ఆ ఋషిని మంచి నీరు యిమ్మని అడిగెను. ఋషి నుండి యెట్టి సమాధానము రాలేదు మరల మరల అడిగెను కాని ఋషి నుండి మౌనమే సమాధానముగా వచ్చెను భౌతికముగా దప్పికచే కలిగిన అలసట, ధ్యానములో నిమగ్నుడైన ఋషి నిర్లక్ష్యము కూడి పరీక్షిత్తు ఓర్పును కోల్పోవునట్లు చేసినవి చుట్టూ పరికించగా చచ్చిపోయిన పాము ఒకటి చేరువలో కానవచ్చెను. మనస్సు వికారము చెందగా, పరీక్షిత్తు తన వింటితో చచ్చిన పామునెత్తి ఋషి మెడలో వైచి, అక్కడ నుండి తరలిపోయెను ఆ ఋషి, శమీక మహర్షి, కదలక మెదలక సమాధియందుండెను

శమీకునకు శృంగియను కుమారుడు గలడు అతని తోటి బాలురు శృంగి వద్దకు వెళ్ళి యిట్లనిరి ''నీవు చాల గొప్పవాడవని గర్వపడుచున్నావు ఇకనుండి నీ గర్వమును దిగమింగుకోవలసియున్నది. ఎందుకనగా

మృత కళేబరములను ధరించిన వానికి నీవు పుత్రుడవు''. శృంగి వారివైపు తీక్షణముగా చూడగా, ఆ బాలురు నవ్వుచూ అతని తండ్రి పరిస్థితిని వివరించిరి; పరీక్షిత్తు మహారాజు వచ్చి ఋషి మెడలో చనిపోయిన పామును వేసిన వృత్తాంతము నివేదించిరి. శృంగి తన ఆగ్రహమును నిగ్రహించుకొనలేక యిట్లనెను. ''అహంకార పూరితుడైన రాజు నా తండ్రిని అవమానించెను. అతనిని శిక్షించెదను. ఈరోజు నుండి యేడవ దినమున తక్షకుడనే భయంకర సర్పము కాటువేయగా మరణించును''.

అటు తర్వాత తండ్రి కడకేగి శృంగి గట్టిగా యేడ్చుచుండెను. తన కుమారుని యేడుపు విని శమీక మహర్షి సమాధి నుండి లేచెను. కనులు విప్పి చూడగా తన మెడలో వేసిన చనిపోయిన పాము కనుపించెను దానిని పక్కకు నెట్టివేసి యిట్లనెను. ''కుమారా! ఎందుకేడ్చుచున్నావు? నిన్నెవరైనా బాధించినారా?''

శృంగి జరిగినదంతము తండ్రికి వివరముగా చెప్పి, రాజును తాను శపించినట్లుగూడ చెప్పెను పుత్రుని తొందరపాటునకు శమీకునకు విపరీతమైన కోపము వచ్చెను. శృంగి తన కోపములో, ఉత్తముడైన పరీక్షిత్తు మహారాజును శపించెనని శమీకుడు గ్రహించి యిట్లనెను. ''నీవు యువకుడవు. నిన్ను నీవెట్లు నిగ్రహించుకోవలెనో నీకు తెలియదు. నీవు చాలా దుడుకుగా ప్రవర్తించినావు. ఉత్తమోత్తముడైన ఆ మహారాజును నీవేల శపించితివి? అతడు చాలా ధర్మపరుడని నీవు యెఱుగవా? ఆకలి దప్పికలతో అలమటించి అతని పిలుపునకు నేను మారు పలుకకపోవుట చేత విసిగి యీ చచ్చిన పామును నా మెడలో వేసెను ఇది కుర్రతనపు చేష్టగా పరిగణించవలెను. నీవు దారుణమైన శాపము నిచ్చుటకు యిది తగిన కారణము కాదు.

''ఈ పౌరవ రాజు తల్లి గర్భములో నుండగా భగవంతుడు రక్షించుటచేత విష్ణురతుడని పేరొందెను ఈ ప్రపంచమును కలి ప్రతాపము బారి నుండి రక్షించుటకు అతడే కారణము నీ అనాలోచిత చర్య వలన ఒక ఉత్తమ పుత్రుని యీ భూమి కోల్పోవనున్నది నీవు తక్షణమే యిక్కడ నుండి వెళ్ళి ఆత్మ నిగ్రహమలవడు వరకు తపస్సు చేయుము. నీ శాప కారణముగా ఉత్తముడైన ఆ రాజు మరణించును నేను వెళ్ళి కనీసం ఆ మహాజుకు కలుగబోయే దారుణ మరణమును ముందుగా తెలియచెప్పి, అతడు పరలోకమునకేగు సన్నాహము చేయుటకు అవకాశము కల్పించెదను ''

ఇంతలో పరీక్షిత్తు మహారాజు తన రాజ్యమునకు తిరిగి వచ్చెను. అతడు చేసిన తెలివి తక్కువ పనికి విచారించుచుండెను క్షమింపరాని పాప కార్యము చేసితినని గ్రహించెను. ఇట్లు తలపోయుచుండగా, గౌరముఖుడను పేరుగల శమీకుని శిష్యుడు వచ్చి శృంగి శాపమును తెలిపెను

# తృతీయ స్కంధము

## 18 పవిత్ర గంగానదీ తీరము

ధర్మ మార్గమునందు శిక్షణ పొంది, ధర్మపరాయణులైన పాండవులకు వారసుడుగా జన్మించిన పరీక్షిత్తు మహారాజు జరిగిన సంఘటనలకు యెక్కువగా విచారించకుండెను. అతనికి భౌతిక విషయములపై ఆసక్తి పోయినది శమీకుని యెడ తాను ప్రవర్తించిన తీరు క్షమించరానిదని గ్రహించి, దానికి మరణమే తగిన శిక్షయని భావించి తన మరణమున కెదురు చూచుచుండెను పరీక్షిత్తు తన కుమారుడైన జనమేజయుని పట్టాభిషిక్తుని జేసి, తాను ధరించిన క్షత్రియ వస్త్రములను వదలి, గంగానదీ తీరమునకు ప్రయాణమయ్యెను అచ్చట పవిత్ర కుశ ఘాసములను పరచి దానిపై కూర్చుండెను. అతడు మరణ మాసన్నమగు వరకు భగవచ్చింతన గావించుచూ ప్రాయోపవేశము చేయుటకు నిశ్చయించుకొనెను అతడు యీ జీవితము చాలించుటకు ప్రయత్నములు చేయ మొదలిడెను. అతనికిది ఒక సాహసకార్యముగా గోచరించెను

గంగా తీరమున నున్న పరీక్షిత్తు వద్దకు అనేకమంది ఋషులు - అత్రి, వసిష్ఠుడు, చ్యవనుడు, శరద్వతుడు, భృగువు, అంగిరసుడు, పరాశరుడు, విశ్వామిత్రుడు, పరశురాముడు, నారదుడు, వ్యాసుడు - వచ్చిరి. వారందరూ ఒకేమారు రావడము చూచి పరీక్షిత్తు ఉప్పొంగిపోయెను అత్యంత ఆనందోత్సాహములతో వారి నాహ్వానించి, సత్కరించి, అత్యంత వినయముతో నిట్లనెను ''నేను యెంతో అదృష్టవంతుడ ననుటకు యెటువంటి సందేహము లేదు నేను పూర్వ జన్మలో యే పుణ్యకార్యములు చేసిన ఫలితముగా తామందరూ ఒకేసారిగా వచ్చి నాకీ దర్శన భాగ్యము కల్గించినారు? మీరు వచ్చినందుకు ప్రాయోపవేశము గావించుటకు నిశ్చయించుకున్న నన్ను ఆశీర్వదించండి. నన్ను శపించిన ఆ బ్రాహ్మణ బాలుడు నిజముగా నాకెంతో మేలు చేసెను. లేకున్న మీవంటి మహాత్ముల సమక్షములో నేను పరలోకమున కేగుట వీలగునా! నేనీ ప్రపంచము నుండి సన్న్యసించి త్వరలోనే రానున్న మరణమునకు సిద్ధముగా నున్నాను కాని నాదొక మనవి. నేను మరణించుటకు ముందు యీ యేడు రోజులు భగవంతుని కీర్తనలు చెవులారా వినగోరుచున్నాను ''

పరీక్షి_ నరూ సంతోషించి యిట్లనిరి. ''కృష్ణుడు నిర్యాణము పొందగానే పాండవులందరూ యీ లోకము విడచిరి అట్టి మహాపురుషుల వంశములో జన్మించిన నీ నిశ్చయము మెచ్చుకోదగినది''.

పరీక్షిత్తు ''నేనొక ప్రశ్న అడగవలెనని కోరుచున్నాను మరణించుటకు సిద్ధముగా నున్నవాడు పాపరహితుడు కావలెనన్న, అతడు అనుసరించవలసిన మార్గము, చేయవలసిన కర్మలు యెట్లుండవలెను?'' అని అడిగెను ఈ ప్రశ్నను విని ఋషులు ఆలోచించుట మొదలిడిరి కొందరు యాగము గురించి, మరికొందరు యోగము గురించి పలికిరి. తపస్సు అత్యుత్తమమైనదని కొందరు చెప్పగా, మరికొందరు సంపదనంతనూ దానము గావించుమనిరి ఎవ్వరునూ నిర్ధారణగా యేదియు చెప్పలేకపోయిరి. అన్ని మార్గములు సవ్యముగానే గోచరించెను. అయితే కాలము మించిపోవుచున్నది ఏడు రోజులు మాత్రమే మిగిలియున్నవి. ఈ యేడు రోజులలో అనుసరించదగు మార్గము రాజునకు సమస్య అయ్యెను. ఏడు రోజులు అతి స్వల్పకాలము. ఇదివరకే అనేక దానములు చేసియుండెను తపస్సునకు కాలము తక్కువ యాగమునకు యోగమునకు కూడ సమయము లేదు

ఋషు లీ విధముగా మాట్లాడుచుండగా వ్యాసుని కుమారుడు శుక మహర్షి అచ్చటికి వచ్చెను అత్యంత వైభవముతో స్వర్ణ వర్ణముతో ప్రకాశించుచున్న శుకుడు వారిముందు నిలిచెను ఇది ఒక గొప్ప సన్నివేశము ఋషులందరూ ఏకముగా లేచి నిలబడి శుక మహర్షిని గౌరవించిరి. అతని పాదములపైబడి కన్నులలో నీళ్ళు చిందగా పరీక్షిత్తు యిట్లనెను ''నేను చాలా చాలా అదృష్టవంతుడను. తల్లి గర్భములో నుండగా రక్షించిన ఆ భగవంతుడు నా శ్రేయస్సునే యిప్పటికీ తలపోయుట నా మహద్భాగ్యము లేకున్న, నావంటి పాపాత్ము డున్న ప్రదేశమునకు శుక బ్రహ్మ వచ్చి అనుగ్రహించునా? మీ వంటి ఉత్తమ జీవులు నా వంటి పాపాత్ములున్న ప్రదేశమునకు వచ్చి పావనము గావింపగా, మా వంటి వారు కూడ సాధువుల వలె పరిశుద్ధులై పూజించుట కర్హులగుదురు మీ వంటి మహాత్ములను తలంచినంత మాత్రముననే ఆ గృహము పావన మగునని చెప్పుదురు ఇక మీరు సందర్శించిన ప్రదేశము గురించి చెప్పవలెనా? నా వద్దకు మీరు వచ్చిరి పాపాత్ముడనైన నా వంటి క్షత్రియుడు నిలిచియున్న యీ ప్రదేశము మీ పవిత్ర పాద స్పర్శచేత పావనమైనది మీరు ఆసీనులై నన్ననుగ్రహింపుడు త్వరలోనే మరణము సంప్రాప్తించనున్న నా పక్కనే శుక బ్రహ్మ ఉండుట నా మహద్భాగ్యము మరణము సమీపిస్తున్న నాకు సరియైన మార్గమేదో తెలియజేయవలసినదని ధైర్యము చేసి అడుగుచున్నాను నారాయణుని పాదములు చేరుటకు నేనేమి చేయవలెనో దయచేసి చెప్పవలెను''

శుకుడు పరీక్షిత్తు నాశీర్వదించెను. శుకుడు ఆసీనుడయ్యెను ఇతర ఋషులు కూడ ఆసీనులైరి. అంతట శుకుడిట్లనెను ''నారాయణుని వైభవమును నీకు వర్ణించి, కీర్తించుటకొరకే నేనిక్కడకు వచ్చితిని ఆ కీర్తనలే వినదగినవి పూజ్యులైన నా తండ్రి భాగవత పురాణమును రచించి దానిని నాకు బోధించెను. ఈ ఏడు రోజులు భగవత్కథలను నీకు వివరించి, నీ జీవితములో యీ ఏడు రోజులు మాత్రమే అత్యంత వైభవోపేతమైనవని నీవు గ్రహించునట్లు చేసెదను ఈ కథలు నీకు చాలా మేలు చేయును. నీకే కాక, ఇకముందు యీ భూమిపై పుట్టబోవు మానవులందరకూ మేలు చేకూర్చును.

''సామాన్య మానవుల జీవితము గురించి యోచింతుము. వారు అనేక బంధములలో — యింటిపై వ్యామోహము, భార్యా పిల్లలపై అనురాగము, ఆస్తిపాస్తులపై మమకారము — చిక్కుకుని యున్నారు వారికి ఆత్మానుభూతిపొందు నేర్పు తెలియదు. జీవించు కొద్ది కాలములో మానవులు యెన్నో విషయములను తెలుసుకొనవలసి యున్నది కాని మానవుడేమి చేయుచున్నాడు? సగము జీవితము నిద్రయందు గడపును మిగిలిన కాలము బాల్య యౌవనములతో గడచిపోవుచున్నది భౌతిక సుఖానురక్తుడై దానివలన కలిగే బాధకు గురియగుచున్నాడు మృత్యువు పొంచియున్నదను సత్యమును గురించి యెన్నడూ ఆలోచించడు ప్రతిరోజూ తనచుట్టూ మరణించు వారిని చూచుచున్నప్పటికీ, తనకు మృతి సంభవించునని తలంపడు కాలము వేగముగా గతించి, మృత్యు సమీపమునకు చేరువవుచున్నానని గ్రహింపడు ఈ ప్రపంచమనే బంధము నుండి ముక్తికోరు వానికి జీవితాంతమందు భగవంతుని చింతించుట యొక్కటే అతి సులభమైన మార్గము బ్రహ్మత్వమును పొందిన ఋషులు కూడ నారాయణుని కీర్తించి పరమానందము పొందెదరు. గతించిన కాలములో భగవంతుని తలచలేదని విచారించవలసిన పనిలేదు. శ్రద్ధతో కేవలం ఒక ముహూర్తకాలము మాత్రమే భగవంతుని స్మరించి తరించవచ్చును

''ఖట్వాంగుడను రాజు ఉండెను. అతడు తాను జీవించుటకు ఒక ముహూర్త కాలము మాత్రమే మిగిలియున్నదని తెలిసికొనెను అప్పుడతడు దేవతలతో స్వర్గమున నుండెను ఖట్వాంగుడు వెంటనే స్వర్గము విడిచిపెట్టి భూలోకమునకు వచ్చెను ఆ ఒక్క ముహూర్త కాలములో భగవంతుని ధ్యానించి,

నారాయణుని పాదములు చేరెను. ఓ పరీక్షిత్తూ! భగవంతుని చింతించుటయను నీ మంచి కార్యము చేయుటకు నీకు నిండు యేడు రోజులున్నవి భగవంతునిపై నీ మనసు లగ్నమగునట్లు నీకు సహాయపడెదను''.

# 19 ధారణ

''మృత్యువు సమీపించుచున్నపుడు మృత్యుభయమును విడనాడవలెను త్యాగమను కత్తితో భార్య, పిల్లలు, ఆస్తిపాస్తులతోనున్న బంధములను తెగనాడవలెను గృహము విడచి, పుణ్య తీర్థములో స్నానమాచరించి ధ్యానమునకు కూర్చొనవలెను. ధ్యానము సలుపు ప్రక్రియను నేను వివరముగా తెలిపెదను

''ప్రాణాయామముతో మనస్సును నిశ్చలముగా ఉంచవలెను 'ఓం' అను యేకాక్షరమును పదే పదే ఉచ్చరించవలెను. మనస్సును నిగ్రహించిన తర్వాత, రథసారథి వలె బుద్ధి కళ్ళెము పట్టుకుని మనస్సును భగవంతుని మననము గావించు మార్గమున తీసుకువెళ్ళగలదు మనస్సు ఇంద్రియములకు వశము కాకుండ చూడవలెను భగవంతునిపై దృష్టిని కేంద్రీకరించుటకు అష్టాంగయోగమనే ప్రాథమిక యోగ ప్రక్రియ సహాయపడును. ఈ యోగము ఎనిమిది గుణములతో కూడుకుని యున్నది ఈ గుణములన్నీ నీలోని అంతర్భాగములు కావలెను. అవి యేవనగా: అహింస - యితరులకు హాని కలిగింపకుండుట; సత్యము - నిజము పలుకుట ; అస్తేయము - యితరురలకు చెందిన వాటిని దొంగిలింపకుండుట, బ్రహ్మచర్యము - ఇంద్రియములను నిగ్రహించుట, అపరిగ్రహము - యితరుల నుండి వస్తువులను గ్రహింపకుండుట, శౌచము - లోపల బయట నిర్మలముగా నుండుట, తపస్సు - సాధన చేయుట; స్వాధ్యాయము - శాస్త్రములను చదివి వాటిని తెలుసుకొనుట ఈ ఎనిమిది గుణములను ధారణ అందురు, యిది తరువాత చేయు ధ్యానమునకు నాంది

''నిశ్చలమైన మనస్సుతో భగవంతుని రూపమును దర్శించవలెను. భగవంతుని రూపమే మనస్సంతా నిండియుండవలెను. ఇది సాధించిన తర్వాత తామస స్వభావము చేత మానవునికి భ్రమ కలుగుట కాని, రాజస స్వభావముచేత ప్రాపంచిక విషయములపై దృష్టి మరలుట గాని జరుగదు. ప్రాణాయామ సూత్రము ననుసరించి సరిగా కూర్చుని సరియైన పద్ధతిలో ఉచ్ఛ్వాస నిశ్వాసములను నియమించుటలో ఆరితేరి ఇంద్రియాల బంధములను త్రెంచుకున్నచో ధారణచేయు శక్తి గలుగును ధారణ చేయునపుడు భగవంతుని రూపము మనస్సున నిశ్చలముగా నుండవలెను. విరాట్ పురుషునే తలంచవలెను

''విరాట్ స్వరూపము భూత భవిష్యద్వర్తమానములతో కూడినది ఇదివరకు జరిగినవి, ప్రస్తుతం జరుగుచున్నవి, ముందు జరుగనున్నవి - అన్నియు విరాట్పురుషుని యందే యుండును విరాట్పురుషుడు యేడు పదార్థముల ఆవరణలో నున్నాడు. వీటిని ఆవరణ అందురు. ఇవి . పృథ్వి - భూమి, అప్పు - జలము, తేజస్సు - అగ్ని, వాయు - గాలి; ఆకాశము - అమహత్తత్త్వము, మహత్తత్త్వము. విరాట్ పురుషుని పాదముల చర్మమే పాతాళము, పాదములే రసాతలము, కాలి వెనుకభాగము మహాతలము; మోకాళ్లు సుతలము; రెండు తొడలు వితల అతలములు; నడుము భూతలము.

''ఆకాశము విరాట్పురుషుని కడుపు, తేలికగానుండు గుండె సువర్లోకము; మెడ మహర్లోకము, ముఖము జనలో ' ' లోకము, సహస్ర శీర్షములు సత్యలోకము ఇంద్ర పాలితులైన దేవతలు విరాట్పురుషుని చేతులు. నాలుగు దిక్కులు అతని చెవులు. అశ్వినులు ముక్కు రంధ్రములు, అగ్ని అతని నోరు, సూర్యుడు అతని నేత్రములు రాత్రి పగలు అతని కంటి రెప్పలు జలము అతని నోటిలోని ఉపరిభాగము. రుచి అతని నాలుక వేదములు అతని తల; యముడు అతని దంతములు చిరునవ్వు మాయ; కనుచూపు సృష్టి సముద్రము కడుపు, పర్వతములు యెముకలు. నదులు అతని శరీరములోని నరములు, వృక్షము లతని వెండ్రుకలు. కాలము దీర్ఘమైన అడుగు; వాయువు అతని శ్వాస; పెక్కు గుణములు అతని లీలలు. మేఘములు అతని చూపులు, సాయం సమయము అతని వస్త్రములు అతని హృదయము అవ్యక్తము, మనస్సు చంద్రుడు, రుద్రుడు అహంకారము స్వాయంభూమనువు అతని బుద్ధి గంధర్వులు చారణులు సంగీత స్వరములు, అప్సరసలు స్మృతులు ఈ పదజాలముతో వేదములు విరాట్ పురుషుని వర్ణించెను. విరాట్ పురుషుని రూపముపై మనసు లగ్నము చేయవలెను

''ఈ విధముగా మనసును లగ్నము చేయుటలో ఆరితేరిన తర్వాత, భగవద్రూపమును హృదయములో దర్శించవలెను అనంతుడనే సర్పముపై, నారాయణుడు పవ్వళించిన రూపమును కాంచవలెను మనస్సును స్తంభింపజేసి లగ్నము చేయగలిగిన మానవుడు యీ రూపమును చూడగలడు దీనిని సాధించిన తర్వాత అతి సులువుగా ప్రాణము శరీరమును వీడి భగవంతుని చేరగలదు. ధారణ ఆఖరి దశ ముందు భగవత్కథలను వింటూ కాలమంతయూ గడపవలెను నారాయణుని కీర్తనలను వినని మానవుని చెవులు రెండు రంధ్రములు మాత్రమే నారాయణుని వైభవము నుచ్చరింపని నాలుక, వర్షా కాలములో బెక బెకమను కప్ప నాలుక కంటె భిన్నము కాదు నారాయణుని పాదములకు వంచనట్టి తల కేవలము బరువు మాత్రమే చేతులకు సుగంధము పూసి అలంకరణలు చేసినప్పటికీ, అవి నారాయణుని పువ్వులతో పూజింపకున్న, శవము చేతుల వంటివే యగును. నారాయణుని సుందర రూపమును కాంచని కనులు నెమలి పింఛముపై నున్న కనుల వంటివే యగును. పవిత్ర తీర్థములకు ప్రయాణము చేయని పాదములు వృక్షముల వేరుల వంటివే యగును

''పుణ్యాత్ముల పాద ధూళిని తన తలపై ధరించని మానవుడు శవముతో సమానము భగవంతుని కథలు వినగా యెవని శరీరము పులకరించక, కనులు చెమర్చక యుండునో, అట్టివాని హృదయము పాషాణమని యెంచవలెను. ఇట్టి మానవులు దురదృష్టవంతులు. కాని వీరు కూడను జీవితాంత్య కాలములో నారాయణుని కథలు విని చింతించినచో తప్పక తరింపగలరు

''కాబట్టి నీకు భాగవత పురాణమంతయు యీ వారము దినములలో వివరముగా తెల్పెదను నీ మూలముగా మానవజాతి కంతకూ భవిష్యత్తులో మేలు కలుగును''.

శుకుడు తన మనస్సునందు నారాయణుని ఆవాహన చేసి, భాగవత పురాణ కర్త, తన తండ్రియైన వ్యాసునకు నమస్కరించెను. అటు తర్వాత భాగవత పురాణమును చెప్పుట ప్రారంభించెను.

# 20 ప్రభాసలో దారుణకాండ

దురదృష్టకరమైన ఆ రోజున హస్తినాపురము విడచి విదురుడు భారత వర్షములోని పుణ్యనదులను సందర్శించవలెనని నిశ్చయించుకొనెను. నారాయణుని పాదములచే పావనమైన పుణ్య తీర్థములన్నిటి యందు స్నానమాచరించవలెనని తలంచెను. మొదట బృందావనము వెళ్ళి, కృష్ణునికి ప్రీతికరమైన గోవర్ధన పర్వతము నీడలో కొంత కాలముండెను. బాల్యమందు అచ్చట కృష్ణుడు గడిపిన విషయము తలచుకొని విదురుడు కొంత మనశ్శాంతి పొందెను. నారాయణుడే కృష్ణుడుగా అవతరించెనని భీష్ముడు చెప్పిన విషయము జ్ఞప్తికి వచ్చి, గోవర్ధన గిరి అదృష్టము తలచుకొనగా విదురుని కనుల నుండి నీరు జాలువారెను. బాల్యమునందు ఇప్పుడున్న బరువు బాధ్యతలు లేకుండ, గోవర్ధన పర్వత సానువులందు సంచరించిన బాలకృష్ణుని తలచుకొనెను భగవంతుని అవతారమైనప్పటికీ, మానవులను రక్షించుటకు వారిలోనొకడుగా సంచరించిన కృష్ణుని తలచుకుని ఆనందించగా, విదురుని ముఖము మందహాసముతో మెరసెను కొన్ని రోజుల తర్వాత బృందావనము నుండి ఉత్తర దిక్కుగా ప్రయాణము జేసెను. అనేక తీర్థములు, క్షేత్రములు సందర్శించెను. దీర్ఘ ప్రయాణము చేసి చివరకు కృష్ణునికి ప్రీతికరమైన ప్రభాస తీర్థము చేరెను అక్కడ ఉండగా కౌరవుల వినాశము, యుధిష్ఠిరుడు చక్రవర్తి యగుట వినెను. వైరాగ్యముతో నున్నప్పటికీ, విచారముతో విదురుని హృదయము ద్రవింపగా, సరస్వతీ నదీతీర ప్రాంతమునకు నడచి వెళ్ళెను. అక్కడ నుండి అనేక తీర్థములు సందర్శించి, తిరిగి యమునా నదీ తీరమునకు వచ్చెను అచ్చట కృష్ణుని చెలికాడైన ఉద్ధవుని కలుసుకొనెను.

వారిరువురు కలుసుకుని చాలా కాలమయ్యెను. వారి కనులలో అశ్రువులు చిందగా ఒకరినొకరు గాఢముగా ఆలింగనము చేసుకొనిరి. విదురుడు తనను తాను సముదాయించుకుని యిట్లనెను ''ఆహా సుదినము! చాలా సంవత్సరముల తర్వాత నిన్ను కలుసుకొనుట సంభవించెను. బలరామకృష్ణులు యెట్లున్నారో చెప్పుము? ద్వారకలో అందరూ యెట్లున్నారు? ఇదివరకు వలెనే సాత్యకి భీకరముగా నున్నాడా? ప్రద్యుమ్నుడెట్లున్నాడు? అందరి విషయమూ విపులముగా చెప్పుము ద్వారకలో అందరి క్షేమము తెలిసి చాలా కాలమైనది. నేను తీర్థములు సందర్శించుచున్నాను అన్నీ తెలుసుకొనవలెనని చాలా ఆత్రముగా నున్నది యుధిష్ఠిరుడు మహారాజైనట్లు వినియున్నాను నా సోదరుడు ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనుడు నన్ను హస్తినాపురము విడిచి వెళ్ళుమని చెప్పిన విషయము వినియుందువు అప్పటి నుండి నేనిట్లు ఒక ప్రదేశము నుండి మరొక ప్రదేశమునకు సంచారము చేయుచున్నాను. నారాయణుడే మానవ రూపములో, ధర్మము ప్రతిష్ఠించుటకు, అహంకారపూరితులైన రాజులను అణచివేయుటకు అవతరించెనని గ్రహించినాను వీరు మూడు రకములైన మదములతో నిండియున్నారు. అవి : విద్యా మదము, ధన మదము, కుల మదము. ఏ ఒక్కటియైనను మానవుని పతనము గావించును. ఇక మూడు ఒకనిలో మూర్తీభవించినచో, అతడు మదమెక్కి చేయు పాపకార్యములు తీవ్రముగా నుండుననుటకు సందేహముండునా? అట్టి రాజు లనేకమంది యీ లోకమున గలరు వారి నొకొక్కరినే భగవంతుడు నిర్మూలించెను. ఈ మహత్తర కార్యము పూర్తిగావించిన తర్వాత బహుశః విశ్రాంతి తీసుకొనుచుండెను కాబోలు. ప్రస్తుతము భగవానుడైన కృష్ణుడు తన విరామ కాలము నెట్లు గడుపుచుండెను? కృష్ణుడు, యాదవులు యెట్లున్నారు?'' ఉద్ధవుడు ఒక క్షణము మౌనము వహించెను అతని ఆలోచనలు బాల్యము నుండి కృష్ణునితో గడపిన రోజులపైకి మరలెను. ఆ ఒక్క క్షణము ఉద్ధవుడు యీ ప్రపంచముతో సంబంధము లేక యుండెను. గతించిన స్మృతులు జ్ఞప్తికి రాగా అతని కనులు ఆనందముతో

చెమర్చెను తిరిగి యీ ప్రపంచములోనికి వచ్చి, కనులు తుడిచికొనుచు యిట్లనెను ''మిత్రమా! నీ ప్రశ్నలు నాకు విచారము కల్గించుచున్నవి నీకెట్లు చెప్పను? కృష్ణుడిక లేడు''.

విదురుడు నిశ్చేష్టుడయ్యెను ఉద్ధవుని పలుకులు సరిగా గ్రహింపలేకుండెను విదురుని పరిస్థితి చూసి ఉద్ధవుడు విచారముతో యిట్లనెను. ''ఇది నిజమే కృష్ణుడు నిర్యాణము చెందెను కృష్ణుని నిర్యాణముతో యీ భూమిపైనున్న వైభవమంతయు అంతరించెను కృష్ణుడు నారాయణావతారమని గుర్తించని యాదవుల అజ్ఞానము నాకు విచారము కలిగించినది ఓ విదురా! సముద్రములో చంద్రుడు ప్రతిబింబించినపుడు సముద్రములోని చేపలకు అది చంద్రుడని తెలియదు అది మరియొక చేప అని అవి భావించును అదే రీతిగా యాదవులు కృష్ణుని మరొక యాదవుడుగా మాత్రమే గుర్తించిరి. వారందరికంటె గొప్పవాడని, తెలివైనవాడని యాదవులకు తెలుసును అందుచేతనే ''యాదవోత్తము''డని కృష్ణుని పిలుచుచుండిరి అంత మాత్రమే యాదవులందరూ మరణించిరి. నేనొక్కడనే మిగిలియున్నాను''

''అదెట్లు సంభవించెను?'' ఆశ్చర్యముతో విదురుడడిగెను ''ఒక్కసారిగా యాదవులందరూ యెట్లు మరణించిరి? అంతయూ వివరముగా చెప్పుము విని నేను భరించగలను''.

ఉద్ధవుడిట్లు చెప్ప మొదలిడెను ''ఒకప్పుడు కొందరు యాదవ యువకులు ద్వారకానగిరమునకు వచ్చిన ఋషులను అగౌరవించి వారికి ఆగ్రహము కలిగించిరి జాంబవతి కుమారుడైన సాంబునికి గర్భముతో నున్న స్త్రీ వేషము వేసి, ఆడబిడ్డ కలుగునా, మగబిడ్డ కలుగునా యని ఋషులను ప్రశ్నించిరి ఋషులు ఆగ్రహావిష్టులై 'ఈమె ముసలమును ప్రసవించును అది యాదవ కులమునంతను సమూలముగా నాశనము చేయు'ననిరి

సాంబుడు ముసలమును ప్రసవించెను, అనగా, సాంబుని స్త్రీ వేషము తీసివేయగా ఒక బరువైన యినుపగుండుగల రోకలిని ఆ యాదవ యువకులు కనుగొనిరి. అది చూచి వారు భయభ్రాంతులై, బలరామకృష్ణుల వద్దకు వెళ్ళి జరిగినదంతయూ వివరించిరి బలరామునికి తీవ్రముగా కోపము వచ్చెను బలరాముడు వారిచేత దానిని పొడి అగునట్లు అరగదీయించి సముద్రములో పారవేయించెను ఆ తర్వాత ఆ విషయము బలరాముడు పూర్తిగా మరచిపోయెను కృష్ణుడు మాత్రము మరువలేదు

''కురుక్షేత్ర సంగ్రామానంతరము, దుర్యోధనుని తల్లి సాధ్వి అయిన గాంధారి కృష్ణుడే ఈ ఘోర యుద్ధమునకు కారణమని తలచి అతనిపై ఆగ్రహము చెందెను 'వెదురు చెట్టు తమయొక్క రాపిడి చేత అడవినంతనూ దగ్ధము గావించునట్లు, అసూయాగ్నిచేత కౌరవవంశము నాశనమైన'దని కృష్ణుడనెను కాని రాజమాత గాంధారి అందుకంగీకరించ లేకపోయెను కృష్ణునితో ఆమె యిట్లనెను 'నీ కుటుంబము కూడ యిదే విధముగా కుటుంబ కలహము వల్లనే నాశనమగును' కృష్ణుడు తలవంచి, చేతులు జోడించి, ఆమె శాపమును తీసుకొని, 'తల్లీ! ఇది వరమే, శాపము కాదు' అనెను.

''కొన్ని సంవత్సరములు గడచెను కులక్షయము సంభవించు రోజు సమీపించినదని కృష్ణుడు తెలుసుకొనెను యాదవులందరినీ ప్రభాస తీర్థమునకు వెళ్ళి అక్కడ కొంతకాలము గడపుడని పంపెను వారందరూ సంతోషముతో వెళ్ళిరి

''ఒకరోజు వారందరూ మద్యము సేవించి మైకముతో నుండిరి ఆ మైకములో వారేమి మాట్లాడునదీ,

వారేమి చేయునదీ వారికే తెలియుటలేదు. ఒకరినొకరు తిట్టుకొనుచూ పోట్లాడుకొనుచుండిరి ఈ పోట్లాట కొంతసేపటికి బాగా విజృంభించి, ఒకరినొకరు చంపుకొనుట మొదలయ్యెను. వారి వద్ద ఆయుధములు లేకపోవుటచేత, అక్కడ సముద్ర తీరమున పెరుగుచున్న పొడుగైన రెల్లు గడ్డిపోచలను ఊడబెరికి వాటితో ఒకరినొకరు కొట్టుకుని చంపుకొనుచుండిరి.

''ఇదివరలో సముద్రములో పారవేసిన ముసలము పొడియే యిప్పుడు పొడుగైన గడ్డిపోచలుగా పెరిగినవి. ఒకొక్క గడ్డి పోచ ఒకొక్క అస్త్రమై యాదవ, భోజ, అంధక వృష్ణి కులములను సమూలముగా నాశనము గావించెను. ఇదంతయు కొద్ది క్షణములలో జరిగెను.

''వారి నుండి కృష్ణుడు దూరముగా వెళ్ళి, ఒక అశ్వత్థ వృక్షము క్రింద కూర్చుండగా నేను చూచితిని కృష్ణునితో నేను కూడ వచ్చెదనని చెప్పగా, నన్ను బదరికాశ్రమము వెళ్ళమనెను నేనందు కంగీకరించక యిట్లంటిని. 'కృష్ణా! నీవు లేని యీ లోకములో నేను జీవింపను. దయచేసి నన్ను నీతో గొనిపొమ్ము' ఇంతలో మైత్రేయ మహర్షి అచటికేతెంచెను

''కృష్ణుడు నావైపు జూచి యిట్లనెను. 'ఉద్ధవా! నా మాట నీవు వినవలెను నీవు నాతో రాతగదు. నీవు చేయవలసిన కార్యమొకటి యున్నది. నీకు సత్యమును బోధించెదను. బ్రహ్మ విద్యను నీకెఱుక పరతును నీవు లోకములో సంచరించి నన్ను చేరుట యెట్లో తెలియని వారందరికీ, ఈ బ్రహ్మ విద్యను బోధించవలెను'

''నాకు బ్రహ్మ విద్యను బోధించి నన్ను వెళ్ళమని చెప్పెను నేను వెళ్ళిన తర్వాత కృష్ణుడు, పద్మాసనము వేసి పాదములను తన తొడలపై బెట్టి, యోగ సమాధిలో నుండెను

''కొంత దూరము నుండి ఒక బోయవాడు తొడపైనున్న యెడమ పాదమును చూచెను గులాబి రంగులో నున్న పాదము, పచ్చని పట్టు వస్త్రమును చూసిన బోయవానికి అది లేడియను భ్రాంతి కలిగెను వెంటనే బాణము విల్లుతీసి ఆ బోయవాడు గురిపెట్టి వదలెను కృష్ణుని పాదములో అది గుచ్చుకొనగా ఆ వెంటనే కృష్ణుడు మరణించెను. అప్పుడు నేను బదరికి వెళ్ళు త్రోవలో నుంటిని''

కనులలో అశ్రువులు యేకధారగా కారుచుండగా విదురుడు వినుచుండెను ఉద్ధవుని చూచి జాలితో నిండిన స్వరములో, ''కృష్ణుడు బోధించిన బ్రహ్మ విద్యను నాకు దయచేసి చెప్పుము. నాకు యిప్పుడు యెంతగా అది అవసరమో నీకు తెలియనిది కాదు''.

ఉద్ధవుడు విదురునితో నిట్లనెను. ''మిత్రమా! నీకు బోధింపవలసినది నేను కాదు మైత్రేయుడు. నీవు మైత్రేయుని ఆశ్రమమునకు వెళ్ళి, అతని వద్ద బ్రహ్మ విద్యను నేర్చవలసినదని నీతో చెప్పమని కృష్ణుడు నాకు చెప్పెను. దయచేసి మైత్రేయుని వద్దకు వెళ్ళి అతని వద్ద నేర్చుకొనుము''. విదురునికి వీడ్కోలు చెప్పి, ఉద్ధవుడు ఉత్తరమున నున్న బదరికాశ్రమము దిక్కుగా పయనించెను లో

చాలా కాలము క్రిందట తపస్సు చేసిరి.

# 21 ప్రారంభములో

గంగా నదీతీరమున నున్న మైత్రేయుని ఆశ్రమము వైపుగా విదురుడు ప్రయాణముచేసి, అచటకు చేరెను మైత్రేయ మహర్షికి ప్రణామము అర్పించి, ఉద్ధవునితో జరిగిన సమావేశము గురించి తెలిపి విదురుడిట్లనెను ''భవగంతుడు ఉద్ధవునకు బోధించిన బ్రహ్మ విద్యను మీ వద్ద నేర్చుకొనుటకై వచ్చితిని. మీరు నాకు బోధించగలరని చెప్పెను నేను మీ వద్ద నేర్చుకొనుట కృష్ణుని అభిమతమని ఉద్ధవుడు చెప్పెను''

అంత మైత్రేయుడిట్లనెను ''నీవు వచ్చుట నాకు సంతోషముగా నున్నది నిన్ను వేధించుచున్న సమస్య చెప్పుము నీ సందేహములు తీర్చుటకు ప్రయత్నించెదను''

విదురుడిట్లు సమాధానమిచ్చెను. ''బుధవర్యా! ఈ లోకములో అనేక రకములైన వ్యక్తులతో యిన్ని సంవత్సరములుగా జీవించియున్నాను. సత్పురుషులను కాపురుషులను గూడ యెఱుగుదును ఈ యిరువు రిలో అనేక భేదములున్నప్పటికీ, ఒక విషయములో వారిరువురికీ భేదము లేకున్నది మానవులు చేయు కార్యముల వెనుకనున్న కోరిక ఒక్కటే - అది ఆనందము. ఇది నేను గమనించిన విషయము కాని విద్దూరమేమనగా, వారి చర్యలు ఆనందము నిచ్చుట లేదు, సరికదా దుఃఖమును కూడ నివారించుట లేదు వారి కర్మలు దుఃఖమునే - ఆనందమును కాదు - ఫలముగా అందిస్తున్నవి దీనిని తప్పించు మార్గము వేరొకటి లేదా? అని నాకు నేనే ప్రశ్నించుకున్నాను అనేక సంవత్సరముల నుండి నన్ను వేధిస్తున్న యీ సమస్యకు యేదైన సమాధానము కలదా?

''తాను చేయు కర్మల ఫలితముగా కలిగే దుఃఖమును నివారించుటకు మానవుడేమి చేయవలెను? నా ప్రశ్నకు సమాధానము లభించినదని భావించినాను భగవత్కథలను వినుచూ, భగవంతుని నిత్యము చింతించినచో యీ దుఃఖమును నివారించవచ్చును. భగవంతుని భక్తులైన మీ వంటి ఉత్తమ పురుషులు ఒకే ఒక్క ప్రయోజనముతో జీవించుచున్నారు అది యేమనగా తప్పుదారి తొక్కు మానవాళిని భగవంతునివైపు మరల్చి, భగవంతుని వైభవమును వివరించు కథలు చెప్పి, వారు భక్తిమార్గము ననుసరించునట్లు చేయుట దయచేసి భగవంతుని చేరు మార్గము నాకు బోధించి, నా ద్వారా యావత్ప్రపంచమునకు తెలియజెప్పవలెనని కోరుతున్నాను భగవత్కథ వినుట యెంతో సంతోషదాయకము. వ్యాసమహర్షి మహా రకూ బోధించెను ఆ కథను వివరించుచు, మానవులు అవలంబించ వలసిన నడవడిని విపులీకరించెను మమకారము దుఃఖమునకు దారితీయునని వ్యాసుడు బోధించెను మరియు అనేక ధర్మ సూక్ష్మములను బోధించెను. కాని యింకను తెలుసుకొనగోరుచున్నాను నారాయణుని కీర్తనములతో తన్మయత్వము చెందవలెనని ఆకాంక్ష. నారాయణుని వివిధ అవతారములకు సంబంధించిన కథలను వివరించి చెప్పవలెను ఏయే కార్యములను భగవంతుడు చేయగా, యీ లోకము మరల మరల పావనమైనదో వాటిని వివరించవలెను.''

మైత్రేయుడు చిరునవ్వుతో ఆమోదపూర్వకముగా యిట్లనెను ''ధర్మమ్మూర్తిగా అవతరించిన నీవంటివారు కాక వేరెవరు యిట్టి ప్రశ్నల నడుగుదురు? నిన్ను చూడగా నాకు ఆనందము కలుగుచున్నది. భగవంతుని కథ సర్వమూ నీకు తెలుపుటకన్న సంతోషింపదగినది వేరేదియులేదు ప్రారంభమునుండి మొదలుపెట్టి చెప్పెదను''

''ఇది గొప్ప ప్రళయానంతరము జరిగినది. భూమి అంతయూ నీటిలో మునిగియుండెను మహాప్రళయము సంభవించిన తర్వాత నారాయణమూర్తి యోగ నిద్రలో నుండెను. ఆదిశేషునిపై పరుండియుండగా, యావత్ప్రపంచము అతనియందు లీనమై కట్టెలో అగ్ని దాగియున్నట్లుండెను

''త్రిగుణములు సమవిభక్తముగా నుండుటచేత యెట్టి కార్యము జరుగకుండెను ఆ విధముగా చాలా కాలముండెను. తర్వాత త్రిగుణములు వ్యత్యస్తమై సమత్వము తప్పెను. అంతట నారాయణుని నాభి నుండి సన్నని కాడ వంటిది ఆవిర్భవించెను. ఇది వ్యక్తమైన రజోగుణ స్వరూపము కొంత కాలమునకిది పెరిగి అందునుండి పద్మము వికసించి ప్రకాశించెను. ఆ పద్మమునందు నారాయణుడు ప్రవేశించి బ్రహ్మగా రూపొందెను. తనకు తానుగా పుట్టినట్లు భావించిన బ్రహ్మ వేదములను క్షుణ్ణముగా తెలిసికొని యున్నట్లు తలంచెను. 'కిగా మన్నట్లు గుర్తించి, విశాలమైన కనులతో చుట్టూ పరికించి చూడగా, తన నాలుగు ముఖములు నాలుగు దిక్కులను చూచుచున్నట్లు గోచరించెను. తన చుట్టూ జలము ఆవరించి యుండుట చూచెను ఇంకేదియు అతనికి కానరాలేదు. సముద్రములో అలలు చేయు శబ్దమును మాత్రము వినెను. క్రిందకు చూడగా తానొక పద్మముపై ఆసీనుడైయున్నట్లు గుర్తించెను. కాని పద్మము యొక్క కాండమునకు మొదలు యెక్కడో చూడలేకుండెను. కాండములో ప్రవేశించి క్రిందకు ప్రయాణము చేసెను అడుగున యేదియు అతనికి కాన రాకుండెను. తిరిగి తన స్వస్థానమునకు చేరుకొనెను. అంతట అతనికొక శబ్దము వినిపించెను. అది ''తప! తప!'' అనుచున్నట్లుండెను. ''తపస్సు చేయుము''. ''తపస్సు చేయగా నీవు అన్వేషించుచున్న దానిని కనుగొనగలవు'' ఆ పద్మము నందే యుండి, నూరు సంవత్సరములు తపస్సు చేసెను. ఆ నూరు సంవత్సరములు ధ్యాన నిమగ్నుడై యుండెను

''అకస్మాత్తుగా అతడు తన మనసులో నారాయణుని రూపము గాంచెను. నారాయణునకు శయ్యగా నున్న ఆదిశేషుడు పద్మ కాండము వలె తెల్లగా నుండెను. అతడే అనగా ఆ నారాయణుడే 'పురుష'డని బ్రహ్మ గ్రహించెను. నారాయణుని చూచిన తక్షణమే బ్రహ్మకు జ్ఞానము కలిగెను. అతడేమి చేయవలెనో తెలిసికొనెను. క్రొత్తగా ప్రపంచమును సృష్టించుటకు పద్మము నుండి రావలసి వచ్చెను. ఎవ్వరును నేర్పకయే అలవడిన పదములతో నారాయణుని పూజించెను. నారాయణుడిట్లు పలికెను 'ప్రపంచములను అందులో జీవరాసులను సృష్టించు కార్యము నీకు అప్పగించుచున్నాను'. 'అటులనే' అని బ్రహ్మ పలికెను.

''బ్రహ్మ మనస్సు నుండి నలుగురు ఋషులు - సనకుడు, సనందుడు, సనాతనుడు, సనత్కుమారుడు - జన్మించిరి. వారితో బ్రహ్మ యిట్లనెను. 'మీరు సృష్టికార్యము చేబట్టి ప్రజోత్పత్తిని గావింపుడు'. వారు నారాయణుని పాదముల చెంత అతనితో ఐక్యము కావలెనని తలచి సృష్టిని విస్తరింపజేయు కార్యమునకు అంగీకరించకుండిరి. బ్రహ్మకు వారిపై విపరీతముగా కోపము వచ్చెను. కాని నిగ్రహించుకొనెను. అతనిలోని వివేకము కోపము నణచి పెట్టినప్పటికీ, అది మరియొక రూపమున బ్రహ్మనుదుటపై ఆవిర్భవించెను. ఆ శిశువు యెరుపు నీల వర్ణము కలిసిన వన్నెతో నుండి, పుట్టిన వెంటనే యేడ్వసాగెను. 'నాకొక పేరు, ఉండుటకు స్థలము' యిమ్మని యేడ్చుచుండగా, బ్రహ్మ యిట్లనెను. 'ఏడ్వకుము. నీవు జన్మించినది మొదలు యేడ్చుచుండుటచేత నిన్ను రుద్రుడని పిలిచెదను. హృదయము, ఇంద్రియములు, ప్రాణము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి, సూర్యుడు, చంద్రుడు, తపస్సు - యీ ప్రదేశములు నీవి. నీవు యిక్కడ నుండి వెళ్ళి నీ ప్రతి రూపములుగా సృష్టిని జరుపుము'. తరువాత తన శరీరము నుండి పదిమంది పుత్రులను సృష్టించెను. వారు : అత్రి, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, దక్షుడు, మరీచి,

వసిష్ఠుడు, నారదుడు ధర్మము, అధర్మము కూడ బ్రహ్మ నుండి జనించెను. తన హృదయము నుండి కామము, రెప్పల నుండి క్రోధము పుట్టెను. అతని నీడ రూపము చెందగా, అతనికి కర్దముడని పేరిడెను. ఈ ప్రపంచము అతని మనస్సు నుండి, శరీరము నుండి సృష్టించెను. అతని నాలుగు ముఖముల నుండి నాలుగు వేదములు పుట్టెను. తర్వాత తన శరీరమును రెండు భాగములుగా విభజించెను. ఒకటి పురుష భాగము, రెండవది స్త్రీ భాగము వారికి స్వాయంభువ మనువు, శతరూపియని పేర్లు పెట్టెను. వారికి అయిదుగురు పిల్లలు కలిగిరి ముగ్గురు పుత్రికలు - ఆకూతి, ప్రసూతి, దేవహూతి, ఇద్దరు పుత్రులు - ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు

ఆకూతి రుచి యను ఋషిని వివాహమాడెను. దేవహూతి కర్దముని, ప్రసూతి దక్షుని వివాహమాడెను వారి సంతతి, ఆ సంతతి సంతతి యీ లోకమున విస్తరించెను

# 22 ఆది వరాహము

స్వాయంభువ మనువు జన్మించిన వెంటనే తన తండ్రిని సమీపించి యిట్లనెను ''నేనేమి చేయవలెనో ఆజ్ఞాపించవలెను మీ ఆజ్ఞను శిరసావహించెదను''. తన కుమారుని పలుకులను విని బ్రహ్మ సంతసించి, సృష్టి కార్యము కొనసాగించమని చెప్పెను. ''తండ్రీ! అట్లే కావించెదను'' అని మనువు జవాబిచ్చెను ''కాని నేను సృష్టించువారు యెచ్చట జీవించవలెనో సూచించవలెను. నేను సృష్టికార్యము చేపట్టుటకు సంసిద్ధుడనై యున్నాను, కాని భూమి ప్రళయమందు నీటిలో అట్టడుగున మునిగిపోయినది భూమిని తిరిగి తెచ్చి స్వస్థానమునందుంచిన, మీరు కోరినట్లు సృష్టి కార్యము కొనసాగించగలను'' అని మనువు పలికెను

బ్రహ్మకు యేమియు తోచకుండెను. తనలో తానిట్లనుకొనెను. ''అట్టడుగున మునిగిపోయిన భూమిని తిరిగి బయటకు తీసుకువచ్చుటెట్లు? సృష్టి కార్యము యెట్లు జరుగగలదు? ఓ నారాయణమూర్తీ సృష్టిచేయమని నీవు నన్నాజ్ఞాపించితివి ఈ సమస్యను నీవే తీర్చవలెను'' మనసులో నారాయణుని తలంచెను నారాయణుని ధ్యానించుచుండగా, ఆకస్మాత్తుగా బ్రహ్మ ముక్కు రంధ్రముల నుండి వేలి గోరు పరిమాణములో నున్న ఒక వరాహము (పంది) ఊడిపడెను. అది పుట్టిన తర్వాత తన పరిమాణమును బాగా విస్తరింపజేసెను. ఈ దృశ్యమును తిలకించిన వారందరూ నారాయణుడే, అట్టడుగున నున్న భూమిని వెలుపలికి తెచ్చుటకు, వరాహ రూపమును దాల్చెనని గ్రహించిరి.

వరాహము విపరీతమైన శబ్దము చేయగా దిక్కులన్నియు ప్రతిధ్వనించెను. ఆ శబ్దమును విని అందరూ ఉప్పొంగిపోయిరి. వారందరూ యేక కంఠముతో నారాయణుని కీర్తించిరి.

తన చుట్టూ ఉన్న వాయువును ముక్కుతో ఆఘ్రాణించి, తరువాత సముద్ర జలమును చవి చూచి, అద్భుతమైన ఆ వరాహము సముద్రములోనికి ప్రవేశించెను అకస్మాత్తుగా ఆ వరాహము సముద్రములో ప్రవేశించిన తీరు యెంతో భయంకరముగా నుండెను. ఆ బరువును మోయలేక సముద్రము ఆయాసపడుచున్న ట్లుండెను. ఆ సముద్రములో యాది నీటి అట్టడుగు భాగము చేరి అచటనున్న భూమిని కాంచెను. భూమిని

తన దంతములతో పైకి యెత్తి మెల్లమెల్లగా సముద్ర ఉపరి భాగమునకు వచ్చుచుండెను. వరాహము భూమినెత్తి పైకి వచ్చుచుండగా ఒక అసురుడు అడ్డుపడుచుండెను. కాని వరాహము అడ్డుపడుచున్న ఆ అసురుని హతమార్చి, తిరిగి మెల్లగా పైకి వచ్చుచుండెను. సనకుడు, అతని సోదరులు, బ్రహ్మ, మరీచి, అతని సోదరులు యెంతో ఆత్రముతో ఊపిరి బిగబట్టి వేచి చూచుచుండిరి.

వారట్లు ఆత్రముతో చూచుచుండగా, భూమిని తన దంతములతో నెత్తి పైకెగయుచున్న వరాహము కన్పించెను తన గట్టి దంతముంచే భూమికి యేర్పడిన గంతలపై భూమిని దించి యుంచెను. బ్రహ్మ మొదలగు వారు వరాహమును కీర్తించిరి వారిట్లనిరి "ప్రభువులకు ప్రభువైన నిన్ను యజ్ఞ పురుషుడని అందరూ పూజింతురు నీవు నాలుగు వేదముల స్వరూపము వరాహ రూపము ధరించిన ఓ నారాయణుడా! నీకు చేతులెత్తి నమస్కరింతుము నీ శరీర చర్మము గాయత్రి, యితర ఛందస్సులతో చేసినది నీ నేత్రములే ఆజ్యము నీ నాలుగు పాదములతో చతుర్హోత్రమను కర్మకాండ రూపొందినది నీవు కావించిన యీ పవిత్ర కార్యమును యెల్లరు చూచుటకు అర్హత లేదు" ఆ తర్వాత వారు వరాహ శరీరములోని ప్రతి అవయవము యజ్ఞ కార్యమున కెంత ముఖ్యమో సరిపోల్చిరి. ఆ పిమ్మట తిరిగి వారిట్లనిరి "నీకు మేము కృతజ్ఞులము నీ దంతములతో పైకి యెత్తిన యీ భూమి అతి రమణీయముగా నుండెను. ఏనుగు తన తొండముతో నెత్తిన తమ్మి మొగ్గవలె భూదేవి కన్పించెను. సృష్టి కావించుటకు ఆధారమైన భూమిని తిరిగి యథాస్థానమునకు తెచ్చియుంచిన నీకు మా ధన్యవాదములు తెలుపుచు ప్రణమిల్లుచున్నాము నీకు, నీ పత్నియైన భూమాతకు నమస్కరించుచున్నాము. జల బిందువులను నీ చుట్టూ ప్రోక్షించుట చేత స్వర్గములన్నీ పావనమైనవి నీ కేశములు విస్తరించిన ప్రదేశములు పవిత్రములై, యజ్ఞములు చేయుట కనువుగా నున్నవి. నీ కరుణాపూరిత దృష్టి యెల్లప్పుడూ మాపై నుండుగాక అని ప్రార్థించుచున్నాము".

వారి మాటలను వింటూ కొంతసేపు అక్కడ ఉండి ఆ తర్వాత వారి యెదుట నుండి వరాహము విశ్రమించెను.

విదురుడు అడ్డుపడి యిట్లనెను "ఓ మహర్షీ ఈ పురాణ గాథ వినుచుండగా నా శరీరము గగుర్పొడుచు చుండెను. వరాహము నెదుర్కొన్న ఆ అసురుడెవరు? వరాహ రూపములో నారాయణుడు హిరణ్యాక్షుడనే అసురుని చంపినట్లు వినియున్నాను. బహుశః అతడే యీ అసురుడై యుండవచ్చు. కేవలము ఒక అసురుని చంపుటకే నారయణుడు దిగి వచ్చెనా? ఆ వృత్తాంతమేదో వివరముగా చెప్పుము".

మైత్రేయుడిట్లనెను. "హిరణ్యాక్షుని వృత్తాంతము తెలుసుకొనవలెనన్న అనేక సంవత్సరములు వెనుకకు వెళ్ళవలసి యున్నది".

# 23 దక్ష పుత్రిక దితి

మరీచి కుమారుడు కశ్యప ఋషి. అతడు దక్షుని పదముగ్గురు పుత్రికలను వివాహమాడెను. వారిలో దితి ఒకతె.

ఒకరోజు సాయం కాలము దితి తన భర్త వద్ద నిలుచుండెను అప్పుడే కశ్యపుడు అగ్నిలో హవిస్సు వేల్చి సాయం పూజ ముగించెను దితి భర్తతో సంయోగము కొరకు ఉవ్విళ్లూరుచున్నది. ఆమె భర్తతో అతి మెల్లగా మృదు స్వరముతో యిట్లనెను. ''నాథా! నా శరీరమును కామాగ్ని దహించుచున్నది నా కోరిక తీర్చి నన్ను సంతోషపెట్టుము. మన్మథ బాధ భరించలేనంతగా ఉన్నది'' కశ్యపుడు మాటాడక మౌనముగా నుండెను. ''దయచేసి నన్ను కరుణించి నా బాధను తీర్పుము'', అని ఆమె మరల పలికెను. ఆమె అవయవ సౌందర్యమును, ఆమె కనులలో ప్రస్ఫుటముగా గోచరించే కామవాంఛను కశ్యపుడు తిలకించెను ఆమెతో ప్రేమ పూర్వకముగా కశ్యపుడిట్లనెను ''ప్రేయసీ! తప్పక నిన్ను సంతోషపెట్టెదను. పురుషుడు జీవిత సముద్రము దాటుటకు భార్య నావ వంటిది జీవితములోని సుఖ దుఃఖములందు భార్య భర్తకు తోడుగా ఉండును అతనితో ఆమె ధర్మము ననుసరించును అందుకే భార్యను సహధర్మచారిణి యందురు. భర్త హృదయములో జనించి అక్కడ ఆమెకొక గౌరవ స్థానముండుటచేత వివాహిత స్త్రీని 'జయ' అందురు నీవు నా కెంతో ప్రేమ పాత్రురాలవు. కాని యిప్పుడే నీ కోరిక తీర్చమని అడగకుము

''ఇప్పుడిది సంధ్యా సమయము. ఇప్పుడిప్పుడే సూర్యుడు తన తీక్ష్ణ కిరణములను ఉపసంహరించి పశ్చిమ దిక్కున అస్తమించుచున్నాడు ఇది పవిత్రమైన సమయం దినమంతటిలో యీ సమయం మహాదేవునికి పవిత్రమైనది ఈ సమయములో ప్రమథగణములు వెంటరాగా నెమ్మదిగా వాహ్యాళికి వెడలును ఈ సమయంలో అతడు తన మూడు కనులతో - సూర్యుడు, చంద్రుడు, అగ్ని - లోకము నంతనూ పరీక్షించును నీ తోబుట్టువు సతి భర్తయైన మహాదేవుడు, శ్మశాన భూమిలోని బూడిద కప్పిన శరీరముతో, చల్లటి గాలికెగిసే యెర్రని ధూళితో నిండి అటు నిటు రేగుతున్న జడలతో, బంగారు వన్నె శరీరము బూడిదతో తెల్లబడి యుండగా, యీ లోకమును వీక్షించుచుండును. రతి క్రియకు యిది సమయము కాదు మహాదేవుని అగౌరవపరచుట యగును కొంచెముసేపు నిదానించుము నిన్ను సంతోషపెట్టెదను. ఇంచుక తాలిమి వహింపుము''

కాని ఆమె వినలేదు కామాగ్నికి తాళలేక ఆమె చెప్పు కారణములకు విసిగి వేసారి, క్రోధోద్దీప్తుడైన భర్త కశ్యపుడు, ఆమె పదే పదే కోరుతూ బలవంతపెట్టగా, ఆమెతో క్రీడించి సంతోషపెట్టెను కామాగ్ని చల్లారి, తిరిగి సవ్యముగా ఆలోచించుసరికి, కశ్యపుడు సూచించిన ప్రమాదము జ్ఞప్తికి వచ్చి ఆమె యిట్లనెను ''కామాగ్నికి తాళలేక, నీ మాటలను నిర్లక్ష్యమును చేసి పరిసరములను గుర్తించకుంటిని. మహాదేవుని అగౌరవపరిచినానేమోనని భయము కలుగుచున్నది పుట్టబోవు బిడ్డకు మహాదేవుని ఆగ్రహము చేత యెట్టి ఆపద కలుగదని అభయమిమ్ము క్షమించి కరుణించమని మహాదేవుని వేడెదను నేను చేసిన యీ పాపము క్షమార్హమని చెప్పుము మహాదేవుడు నా సోదరి సతికి భర్త తప్పక కరుణించ గలడని భావింతును. ఏమి జరుగునో చెప్పుము నాకు భయముగా నున్నది'' చాలాసేపు కశ్యపుడు మౌనము వహించి యుండెను. చివరకు కనులు దించుకుని నిలుచున్న తన భార్యవైపు తిరిగి యిట్లనెను ''నీవు పాపము చేసితివి నా వద్దకు

వచ్చినపుడు నీ మనస్సు తుచ్ఛవాంఛలతో నిండి యుండెను. నా మాట వినకపోతివి. అంతేకాక, మహాదేవునికి గౌరవము చూపక అవమానించితివి. నీకు కలిగే యిద్దరు పుత్రులు పరమ దుర్గార్గులగుదురు. వారు యీ ముల్లోకములను వేధించుదురు. దేవతలకు వారివలన పెక్కు బాధలు కలుగును. వారు యీ భూమిపై ధర్మమును నశింపజేయుదురు. సత్పురుషులను బాధించి నీ పుత్రులు లోక కంటకులయ్యెదరు. నారాయణుడ వతరించి వారి దుష్కృత్యముల నుండి యీ లోకమును రక్షించును''.

ఈ విధముగా జరుగ గలదని దితి తెలుసుకొనెను. కశ్యపుని పాదములపైబడి ఆమె యిట్లనెను. ''నాథా! మిమ్మల్ని ఒక వరమడగవలె ననుకొనుచున్నాను. నా పుత్రులు భగవంతునిచేత మరణించునట్లు చేయుము. అంతేకాని బ్రాహ్మణ శాపము చేత మరణింపకుండునట్లు చేయుము. భగవంతుని చేత మరణించిన వారికి ముక్తి కలుగును. లేకున్న, వారు మరల మరల జన్మించవలసి వచ్చును''.

ఆమె మాటలను విని కశ్యపుడిట్లనెను. ''ఎంతటి పాపమైనను ప్రాయశ్చిత్తము చేత దాని ప్రభావము తగ్గును. జరిగినదానికి నీవు పశ్చాత్తాప పడుచున్నావు. నీ పుత్రుల మరణమునకు నారాయణుడు కారణము కావలెనని కోరుటచేత అతనిని గౌరవించినట్లయ్యెను. మరియు, నన్ను క్షమించమని మహాదేవుని కోరితివి. అందుచేత నీ యిరువురు పుత్రులు నారాయణుని చేత మరణించగలరని అభయమిచ్చుచున్నాను. నీకు సంతోషము గూర్చు మరొక విషయము చెప్పదలచుకున్నాను. నీ మనుమడు నారాయణుని భక్తులలో అగ్రగణ్యుడు కాగలడు. లోకమంతయు అతని భక్తిని కీర్తించును. భగవంతుని నామమును ప్రజలుచ్చరించునంతకాలము, అతని కీర్తి చిరస్థాయిగా నుండును. అగ్నిలో కరగించి మెరుగుపెట్టిన బంగారము మాలిన్యముపోయి యెట్లు ఉండునో, అదే విధముగా మానవుల ప్రాపంచిక వాంఛలు దగ్ధమై నశించి నారాయణుని భక్తుడైన నీ మనుమనివలె నుందురు.

''అతడు ఆదర్శ భక్తుడుగా వెలుగొందును. ఎన్ని ఆటంకములు అంతరాయములు కలిగినను నారాయణు నిపై భక్తి విడువక, రాత్రింబవళ్ళు భగవంతుని స్మరించును. పంచభూతములతో యేర్పడిన తన శరీరము ఉన్నంతవరకు అతనికీ భక్తి యుండును. ఆ పిమ్మట అతడు నారాయణునిలో లీనమగును. అతనికెట్టి బంధములు ఉండవు. మంచి స్వభావము కలిగియుండును. ధైర్యమునకు, కరుణకు నిలయముగా నుండును. క్రోధము, ద్వేషము లేక అందరియెడ సమభావము కలిగియుండును. అతనికి శత్రువులెవరూ ఉండరు. చంద్రునివలె చల్లదనము విరజిమ్మి ప్రకాశించును. మంచి నడవడితో అందరి హృదయములకూ ఆనందము కల్గించును. అతనికొరకై భగవంతు డవతరించును. చర్మచక్షువులతో భగవంతుని దర్శించే కొద్దిమందిలో నీ మనుమడు ఒకడు కాగలడు.

తన తెలివితక్కువ తనము చేత తన పుత్రులకు సంప్రాప్తించిన దురదృష్టము నెవరూ తప్పించలేరని దితి గ్రహించెను. ఇక ఆ విషయమై చింతించి ప్రయోజనములేదని తలంచెను. కాకపోతే తనపుత్రులు నారాయణుని చేతిలో తప్ప యింకెవరి చేతిలోనూ మరణించరని ఊరట చెందెను. అంతేకాక ఆమె మనుమడు సత్పురుషు డుగా ప్రఖ్యాతి గాంచగలడని తెలిసి సంతోషించెను. కనులవెంట నీరు రాగా తలదించుకుని భర్తసముఖమునుండి వెళ్ళిపోయెను.

# 24 ద్వారపాలకులు

దితి గర్భములో పుత్రులు వేగముగా పెరుగుచుండిరి. పాపమామె దేవతలకు, యాలోకమునకు జరుగబోవు కీడు తలచుకుని భయపడెను. అందుచేత ఆమె పుత్రులను ప్రసవించక తన గర్భమునందే యుంచుకొనెను. నూరు సంవత్సరములు ఆమె గర్భమునందు వారుండిరి. ఇంతలో ఒక అద్భుతము జరిగెను. గర్భములో నున్న వారి కాంతి ప్రజ్వలించగా, దానిముందు లోకము కాంతిహీనమయ్యెను. దేవలోకమునూ, అందలి దేవతలును కూడ కాంతి విహీనముగా గోచరించిరి. వారి వైభవము మాసిపోవుచున్నదను ఆందోళనతో, సృష్టికర్తయైన బ్రహ్మవద్దకు వెళ్ళి, యీ విచిత్రమునకు కారణమేమని యడిగిరి. వారిని చూసి చిరునవ్వు నవ్వి యిట్లనెను. ''మీరు ఆందోళన పడవలసిన అవసరములేదు. కనీసం ప్రస్తుతానికి లేదు! దీనికి కారణము మీకు వివరించెదను.

''ఒకప్పుడు వైకుంఠములో నున్న నారాయణుని పూజించుటకు, నా కుమారులు సనకుడు, సనందుడు, సనాతనుడు, సనత్కుమారుడు వెళ్ళిరి. తొందరగా ఆరు ద్వారములు దాటి యేడవద్వారము సమీపించిరి. ఏడవద్వారము సమీపించి, వైకుంఠము ప్రవేశించబోవు తరుణములో ద్వారపాలకులైన జయ విజయులు ఆ ఋషులను అడ్డగించి, 'మీరు ప్రవేశించుటకు వీలులే'దనిరి. ఒక క్షణము ఋషులు వారిద్దరినీ చూచిరి. అందముగా, చక్కని వస్త్రముల నలంకరించుకున్న వారిరువురూ అహంకారస్ఫూరితులై యుండుట ఆ ఋషులు గమనించిరి. ద్వారపాలకుల మాటలను లక్ష్యపెట్టక, ఋషులు యేడవద్వారము దాటి వైకుంఠము ప్రవేశించుటకు ప్రయత్నించిరి. అంత ద్వారపాలకులు తమ చేతులలో నున్న కర్రలనడ్డుపెట్టి 'ప్రవేశించుటకు వీలులే' దనిరి.

''ఋషులకు విసుగుకలిగి కోపము వచ్చెను; క్రోధము కామమునకు తమ్ముడు. జయ విజయులను చూచి ఆ ఋషులిట్లనిరి. 'భగవంతుని సన్నిధిలో యింతకాలముగా ఉంటూన్న మీలో యిట్టి దుర్గుణములుండుట ఆశ్చర్యముగా నున్నది. భగవంతుని సన్నిధిలోనే యున్నామను అహంకారము మీకు ఉన్నట్లు గోచరించుచు న్నది. నారాయణుని సన్నిధి మీకు లేకుండునట్లుగా శపించుచున్నాము. మీరు కామక్రోధాది దుర్గుణములు తాండవమాడే మానవ లోకములో జన్మించెదరు. నారాయణుని సన్నిధిలో నుండుటచేత అహంకారముతో కన్నుమిన్నుగానక, సత్పురుషులను అగౌరవపరచు స్థితికి దిగజారినారు'.

''తమకు సంభవించనున్న ఘోరదుస్థితిని తలచుకుని, జయ విజయులు సనకసనందాది ఋషుల కాళ్ళమీద పడి క్షమించమని ప్రార్థించిరి. వారి పరిస్థితికి విచారించి ఋషులిట్లనిరి. 'మీరీ శాపమునకు తగుదురని శపించితిమి. అయితే యిప్పుడు దీనిని కొద్దిగా సవరించెదము. మీరెత్తబోవు జన్మలలో యెల్లప్పుడూ నారాయ ణుని ద్వేషించుటచేత మీ హృదయములు నారాయణ భావముతో నిండియుండును'. ''జయ విజయులిద్దరూ చెవులు మూసుకుని 'శాంతం పాపం' అని ఆశ్చర్యముతో 'భగవంతుని ద్వేషించుటయా? ద్వేషమా? ఇదియెట్లు సాధ్యము' అని తలచిరి. వారి కన్నుల నుండి అశ్రువులు వర్షించుచుండెను.

''ఆ క్షణములో నారాయణుడచటికి వచ్చెను. ఋషులు అతని పూజించిరి. జయ విజయు లిద్దరూ నారాయణుని పాదములను విడువకుండిరి. వారి కన్నీళ్లతో నారాయణుని పాదములు తడిసెను. వారిని లేవనెత్తి, ఋషులవైపు తిరిగి యిట్లనెను. 'మీ గొప్పతనము గుర్తింపక నా సేవకులైన వీరిద్దరు మిమ్ములను అగౌరవపరచిరి.

మీరు వీరికి శాపమిచ్చుట ఉచితముగా నున్నది. మీరు చేసినది నాకు ఆమోదమే సేవకుని దోషములు యజమానికి వర్తించును, కాబట్టి వారి పక్షమున క్షమించమని వేడుకొనుచున్నాను భక్తులంటె ప్రీతిప్రాతులు నాకు మరియెకరు లేరు. అటువంటి భక్తులకు అవమానము జరిగినచో నాకు ఆగ్రహము కలుగును. మీరు శాసించినట్లుగా వారు మానవలోకములో జన్మించి, తర్వాత నావద్దకు తిరిగి రాగలరు'

''నిగ్రహము కోల్పోయి, నారాయణునికి ప్రేమపాత్రులైన జయ విజయులను తొందరపడి శపించినందు లకు, ఋషులు సిగ్గుపడి వారి తొందరపాటునకు నారాయణుడు మందలించుచుండెనా యని కల్లోలిత మనస్కులై యుండిరి. వారి ఆలోచనను తెలుసుకుని నారాయణుడిట్లనెను. 'మీరు కలవరపడవద్దు ఇంతవరకూ జరిగిన దంతయూ నాకు సమ్మతమే!' ''నారాయణుని అభయ వచనములు విని ఋషులు సంతృప్తులై నారాయణుని పూజించి వెళ్ళిపోయిరి జయ విజయులతో నారాయణుడిట్లనెను 'ఋషుల శాపమును నేను సరిదిద్దగిలను, కాని నేనట్లు చేయను బ్రాహ్మణుల శాపము వృధా కారాదు మీరిద్దరూ మానవలోకములో జన్మించక తప్పదు మీకు మూడు జన్మలు కలుగును మొదటి జన్మములో క్రోధము చేత మీకు వినాశముకల్గును. రెండవ జన్మలో కామము చేతను, ఆఖరి జన్మలో మదము చేతను మీరు చేయు కార్యములు కలుషితమై మీకు వినాశము తెచ్చును. కాని మీకు ఒక హామీ యిచ్చుచున్నాను మీరు నాచేతిలోనే మరణించెదరు చివరకు మీరు తిరిగి నన్ను చేరెదరు. మీరు నాయెడల విశేషమైన ద్వేషముతో వ్యవహరించెదరు. అదియూ ఒక విధమైన యోగమే; భక్తులకన్న మిన్నగా యెల్లప్పుడూ నన్నే తలంచెదరు. ఈ సంభ్రమ యోగము మీ ప్రత్యేకత మీమూడు జన్మలు ద్వాపరయుగాంతముతో పూర్తి యగును'.

''వారి యెదుట నుండి నారాయణు డదృశ్యుడుకాగా, జయ విజయులు భూలోకమున జన్మింపబోయిరి ఈ జయ విజయులే దితి గర్భమున నున్నారని, వారి తేజస్సు చేతనే, భూలోక స్వర్గలోకములు కాంతివిహీనమైనవని, వేదే ని బ్రహ్మ తెలిపెను

నూరు సంవత్సరముల తర్వాత దితికి యిద్దరు కవలు పుట్టిరి వారికి హిరణ్యాక్ష హిరణ్యకశిపులని తండ్రి నామకరణము చేసెను వారు జన్మించునపుడు ప్రపంచమునకు సంభవి ంచునట్లుగా, అనేక దుశ్శకునములు గోచరించెను.

## 25 హిరణ్యాక్ష వధ

కవలిద్దరూ పెరిగి మిక్కిలి బలముతో శక్తివంతులుగా రూపొందిరి వారు బ్రహ్మను గురించి ఘోరతపస్సు చేసి సృష్టికర్తను మెప్పించిరి హిరణ్యకశిపుడు మరణము కలుగకూడదని వరమడిగెను మృత్యువునకు తాను అతీతుడను కానని చెప్పి, ఆ వరము యతను బ్రహ్మ తెలిపెను. అంతట రాక్షసరాజు తన వరమును సవరించి, యిట్లు పలికెను ''నన్ను యే దేవుడుగాని మానవుడుగాని చంపకుండునట్లు వరమిమ్ము. నీవు సృష్టించిన యేవస్తువూ నా మరణమునకు కారణము కారాదు. ఎట్టి ఆయుధముచేత నేను మరణించరాదు ఎట్టి జీవపదార్థముచేతగాని జడపదార్థముచేతగాని నాకు మృత్యువు రారాదు. రాత్రియందు గాని, పగటియందుగాని నాకు మరణము కలుగకూడదు. భూమిపైగాని, ఆకాశమందుగాని, యింటిలోగాని,

యింటిబయటగాని నాకు మరణము సంభవించకూడదు'' మరణము కలుగుటకు సాధ్యమైన వాటినన్నింటినీ ఊహించి వాటినుండి తనకు మరణము తప్పునట్లు వరమడిగెను ''తథాస్తు'' అని బ్రహ్మ పలికి అంతర్ధానమయ్యెను

ఇరువురు సోదరులు లో దేరిరి దేవతలను వారు సులువుగా అణచివేసిరి ఎల్లప్పుడూ తన తమ్మునికి సంతోషము కలిగించుటకై, హిరణ్యాక్షుడు నూతన విధానము అన్వేషించుటకై సంసిద్ధుడయ్యెను నారాయణుడు అన్ని లోకములకు ప్రభువని తెలుసుకుని, అతనిని ద్వేషించుట మొదలిడిరి నారాయణుని నిర్మూలించినచో లోకములన్నీ వారి హస్తగతమగునని భావించిరి.

వరుణు డధిపతిగా నున్న ఊర్ధ్వలోకములో విభావరి అను పట్టణములో హిరణ్యాక్షుడు ప్రవేశించెను వరుణుని యెదుట నిలిచి అహంకారముతో కొద్దిగా తలవంచి, వ్యంగ్య పూరితమగు వినయముతో, ''ప్రభూ! మీరు అతి బలసంపన్నులుగా ప్రసిద్ధికెక్కిరి. మీతో పోరు సలుపు అవకాశమును నాకు ప్రసాదింపుడు ఇదివరలో మీరు దైత్యులందరినీ జయించి, రాజసూయయాగము జరిపి, యీ ఊర్ధ్వలోకమునకు అధిపతి కాగల్గిరి మీతో పోరు సలిపే గౌరవము నాకు కలిగించండి'' అని పలికి హిరణ్యాక్షుడు వికటాట్టహాసము చేసెను వరుణుడు ఆగ్రహమును నిగ్రహించుకుని వినయము నటించుచూ యిట్లు సమాధానమిచ్చెను ''హిరణ్యాక్షా! నాకు వయసు మీరినది చాలా కాలము క్రిందటనే పోరు సలుపుట విరమించితిని, నాకు పోరు సలుపు కోరికలేదు. నీతో పోరు సలుపుటకు తగినవాడు ఒక్కడే; అతడు పురాతనుడైన నారాయణుడు, అందరికీ ప్రభువు అతనితో నీవు తప్పక పోరు సల్పవలెను'' కొంతసేపు మౌనము వహించి, తిరిగి వరుణుడు, ''నీవంటి దుష్టులను హతమార్చుటకు నారాయణుడు అనేక రూపములు ధరించును నీ అహంకారమును పోగొట్టి, అతడు నిన్ను రణరంగమున కుక్కలకు, నక్కలకు ఆహారముగా విడుచును.

నారాయణుడు తనతో పోరు సలుపుటకు యిచ్చగించునని తెలుసుకుని పరమానందభరితుడయ్యెను వరుణుని చివరి వచనములు విస్మరించెను తన ప్రబల శత్రువును అన్వేషించుచూ ఆ రాక్షసరాజు సంచరించుచుండెను అట్లు సంచరించుచుండగా నారదు డెదురయ్యెను, తొందరలో నున్నట్లుగా నారదు డతి వేగముగా యిట్లు పలికెను. ''హిరణ్యాక్షా! నీవు నారాయణుని వెదకుచున్నావని, అతనితోపోరి సంహరింపనున్నావని విన్నాను ఇది నిజమేనా?''

''నిజమే'' అని హిరణ్యాక్షుడు తిరిగి, ''అవును నిజమే అనేక సంవత్సరములుగా, మీరందరూ పిలిచే ప్రభువులకు ప్రభువైన ఆ నారాయణుని అన్వేషించుచున్నానని లోకములో అందరకూ తెలుసు అతడెక్కడ దాగియున్నాడో యెవరైనను తెలియజెప్పిన వారికి నేను కృతజ్ఞుడనై యుండగలను''

''అయితే నీవు నాకు కృతజ్ఞుడవై యుండగలవు'' అని నారదుడనెను ''అతడెక్కడున్నదీ నాకు తెలుసు అది నీకు చెప్పుటకే తొందర తొందరగా నీ వద్దకు వచ్చితిని ప్రళయానంతరము భూమి యేవిధముగా రసాతలమున మునిగినదో నీకు జ్ఞాపకమున్నదా? భగవంతుడు తిరిగి రసాతలమునుండి భూమిని వెలికి తెచ్చి స్వస్థానములో నుంచుటకై వరాహరూపమును ధరించెను అతడు భూమిని బాహువులందిదుకొని సముద్ర ఉపరితలమునకు వచ్చుచుండవచ్చును నీవు తొందరగా వెళ్ళినచో అతనితో పోరు సలుపగలవు''. నారదునికి ధన్యవాదములు తెలిపి, పవిత్ర వరాహమున్న వైపుగా హిరణ్యాక్షుడు అతితొందరగా వెళ్ళెను వరాహమువైపు తిరిగి గట్టిగా అరచుచూ హిరణ్యాక్షుడిట్లనెను ''ఓరీ మృగమా! నామాట వినుము నేను చూచుచుండగా

యీ భూమిని దొంగిలించుకొని పారిపోవచ్చునని తెలివితక్కువగా తలచకుము. రసాతలములో నుండు మాకు బ్రహ్మ యీభూమిని యిచ్చెను. నీవు దానిని తీసుకువెళ్లుటకు వీలులేదు. నీకు భూమిపై యెట్టి హక్కు లేదు. నీవు ఒక దొంగవు. నీవు వరాహరూపము ధరించినటప్పటికీ, నాకు పరమశత్రువైన నారాయణుడవని యెఱుగుదును. నీవు సాధించిన విజయములను వినియున్నాను. ఇంత కాలము మమ్ము మోసగించి నెగ్గుకు రాగలిగినావు. నీ మాయ చేత మమ్ములను హతమార్చినావు. మాలో యెవ్వరితోనూ ముఖాముఖి పోరు సలుపుటకు ధైర్యము లేకపోయినది. అందుకే కాబోలు మాకు శత్రువులైన దేవతలు నిన్ను ప్రభువులకు ప్రభువని గొప్పగా చెప్పుచుందురు. ఇకముందు అట్లు జరుగదు. ఆరోజులు గతించినవి. నీవు నాకు చిక్కితివి నీతో పోరాడకుండా నిన్ను వదిలిపెట్టను. నిన్ను యీరోజే యమునివద్ద క్షమముగా నిలుచున్న నిన్ను తొలగించెదను''

హిరణ్యాక్షుని మాటలు లక్ష్యము చేయక సముద్రము పైకి వచ్చుటకు వరాహము ప్రయత్నించుచుండెను కాని హిరణ్యాక్షుడు వెంబడించుచూ యిట్లనెను ''నీకు సిగ్గులేదు అందుకే నానుండి పారిపోవుటకు ప్రయత్నించుచున్నావు చాలా కాలము నుండి నీకొరకై యెదురు చూచుచుంటిని నిన్ను తేలికగా వదలిపెట్టను. నన్ను తప్పించుకుని పారిపోకుము నీ గురించి వినినప్పటి నుండి నీతో పోరు సలుపుటకు నా భుజములు ఉవ్విళ్లూరుచున్నవి''.

వరాహము సముద్రముపై భూమిని స్థిరముగా నుండునట్లు చేసి, హిరణ్యాక్షునివైపు తిరిగి యిట్లనెను ''నేను మృగము కావటము చేతనే నీ మాటలను విని యూరకున్నాను కుక్కల మొరుగులను జంతువులు మాత్రమే విని యూరకుండును. నీ ప్రగల్భములు విని ధైర్యవంతులెవరు నూరకుండరు, ఊరకుండకూడదు నీవు మృత్యువు చేతిలో నిమిడియున్నావు లేకున్న నీకంటె బల సంపన్నులైన వారితో యిట్లు మాట్లాడవు నీవు యిదివరకు చెప్పినట్లుగా, యెవరూ చూడకుండ యీభూమిని రసాతలమునుండి నేను దొంగిలించి తెచ్చుచుండుట నిజమే కాని యిప్పుడు నీవు నన్ను కనుగొన్నావు రాక్షసుల మార్గములో ముల్లుగా ఉంటూన్న నన్ను తొలగించి, వారి పాదములు రక్తము చిందకుండ నివారించుటకు ప్రతిజ్ఞ పట్టితినని పలికినావు నీ అసుర మిత్రుల పాదములు రక్తము చిందుట చూచి నేను సహించలేను. అంతేకాక నీవంటి ధైర్యశాలి తనమాటను నిలబెట్టుకొనలేకపోవుటకూడ నేను సహించలేను అందుకే నేను ఆగినాను లేకున్న యింతకుముందే పారిపోయియుందును''

కేవలము ఒక మృగముగానున్న వరాహమును గాంచి యేవగింపు జుగుప్సతో కూడిన దాని స్వరమువిని, హిరణ్యాక్షుడు మండిపడెను. తన గదను యెత్తి వరాహమువైపు వడివడిగా వెళ్ళెను సర్పమువలె బుసకొట్టుచుండెను ఆగ్రహముతో అతని తలగిర్రుమని తిరుగుచుండెను. వరాహమును సమీపించి, తన గదతో గట్టిగా కొట్టెను. ఆ దారినుండి పక్కకు మళ్ళి, ఆ గదాఘాతము నుండి, యముని నుండి యోగివలె తప్పించుకొనెను వరాహము గదనెత్తి హిరణ్యాక్షుని నుదుటపై కొట్టెను. హిరణ్యుడు కూడ పక్కకు తొలగి గదాఘాతము నుండి తప్పుకొనెను. ఆ విధముగా వారిరువురూ గదా యుద్ధము కొంతసేపు జరుపగా, అందరూ ఊపిరి బిగబట్టుకుని చూచుచుండిరి. హిరణ్యాక్షుడు అతి బలవంతుడు, అతని ప్రత్యర్థి సాక్షాత్తు నారాయణావతారము. వారి గదా యుద్ధమును వీక్షించుటకు బ్రహ్మ ఋషులు రసాతలమున కేతెంచిరి

తన మనస్సునందు నారాయణుని సంకల్పించి, బ్రహ్మయిట్లనెను. ''ప్రభూ! వారి తపస్సునకు మెచ్చి,

వారి పొగడ్తలకు లొంగిన ఒకానొక క్షణములో పాపాత్ములైన యీ సోదరులిద్దరికీ వరములను ప్రసాదించి ముప్పు తెచ్చితిని. నిన్ను ప్రేమించు వారందరిని వేధించుటకు వారు కృతనిశ్చయులైరి వారివలన యీ లోకము బాధపడుచున్నది అతడు చాలా శక్తిమంతుడు. ఇక అతనిని హతమార్చుటలో జాగు చేయవద్దు చీకటిపడిన తర్వాత అసురులశక్తియినుమడించునని నేను నీకు చెప్పనక్కరలేదు ఈ సమయము అభిజిత్తు, చాలా పవిత్రమైనది ఈ పాపాత్ముని నుండి యీ లోకమును యీ క్షణమే రక్షింపుము''

భగవంతుని చిరునవ్వు యిట్లు చెప్పుచున్నట్లుండెను. ''నేను కాలమును నాకుమారుడైన బ్రహ్మ అభిజిత్తు ముహూర్తము యొక్క పవిత్రతను, రాత్రి అసురుల శక్తి విజృంభించునని తెలుపుట వింతగా నున్నది. నేను హతమారుదునని తలంచుచున్నాడేమో!''

వరాహము తన గదతో హిరణ్యాక్షుని గడ్డముపై గట్టిగా కొట్టెను తన గద నడ్డుపెట్టి హిరణ్యాక్షుడు తప్పించుకొనెను అతి తెలివిగా అతను యుద్ధము చేయుచుండెను భగవంతుని గదను పిప్పిజేసి, నిరాయుధుడైన ప్రత్యర్థితో యుద్ధము చేయుట ధర్మముకాదని తలచి కాబోలు హిరణ్యాక్షుడు కొంతసేపు వేచి యుండెను

ఇంతలో వరాహము తన చక్రమును తలంచగా, అది తత్క్షణమే చేతికందెను హిరణ్యాక్షుడు యింకనూ గదను ప్రయోగించి యుద్ధము చేయుచూ, తుదకు ఆ గదను వరాహము పైకి విసరగా, వరాహము తన యెడమచేతితో దాని నందుకొనెను వరాహము దానిని తిరిగి యివ్వబోగా దానిని తీసుకొనుటకు హిరణ్యాక్షుడు నిరాకరించెను

అనేక ఆయుధములతో పోరు సలిపి, చివరకు ఒకరితొనొకరు మల్లయుద్ధమునకు తలపడిరి. చివరకు తన బలమైన చేతితో వరాహరూపములో నున్న నారాయణుడు హిరణ్యాక్షుని కొట్టి చంపెను.

## 26 కర్దముని తపస్సు

బ్రహ్మ తన పుత్రులైన మనువుతోను, కర్దమునితోను, దక్షునితోను ప్రజోత్పత్తిగావించమని చెప్పగా వారందు కంగీకరించిరి కర్దముడు సరస్వతీ నదీతీరమునకు వెళ్ళి అక్కడ అనేక సంవత్సరములు తపస్సు చేసెను అతని భక్తి ప్రపత్తులకు సంతోషించి నారాయణుడు ప్రత్యక్షమై యేమి కావలెనని అడిగెను కర్దముడు నారాయణుని పాదములపైబడి, కీర్తించి యిట్లనెను. ''నేను చాలా అదృష్టవంతుడను నీవు నాకు ప్రత్యక్షమైతివి. నీవే పరబ్రహ్మము నిన్ను చేరుటకు మహాత్ములు తపస్సు చేసెదరు. నిన్ను చూచిన తర్వాత యింకెట్టి కోరికకు అవకాశము లేదు

''అయినప్పటికీ, ప్రజోత్పత్తి కావించమని నాతండ్రి ఆదేశించుటచేత, తప్పనిసరిగా నిన్ను ఒక వర మడుగ వలసి యున్నది అందుకు నాకొక అత్యుత్తమ స్త్రీని ప్రసాదించవలెను నావిధులను నిర్వర్తించిన తర్వాత, నా సర్వస్వమును నీకు అర్పించెదను

''నీవు కాలస్వరూపుడవు కాలచక్రము తిరుగుటకు పరబ్రహ్మమగు నీవు కీలకుడవు. అనేక వస్తువులతో

చేసిన యీ చక్రమందు పండ్రెండు మాసములనే ఆకులున్నవి. ఇందు మూడువందల అరువది పర్వములు (దినములు) గలవు. చక్రము చట్రము ఆరు ఋతువులతో కూడియున్నది చక్రము అంచున కోట్లకొలది క్షణములనే వల్లు గలవు. చట్రము నాలుగు భాగములు ఒకొక్క భాగము మూడు మాసములకు సమానము

''కాలచక్రము యొక్క వేగము అతి భయంకరము. దాని శక్తిముందు యెవ్వరూ నిలువలేరు యావత్ప్రపంచము కాలమునకు కట్టుబడి, కాలములో దొర్లుచున్నది. ఈ కాలవేగములో మానవులు స్వార్థపరులై తమతమ కోర్కెలను తీర్చుకొనుటలో నిమగ్నమై యున్నారు. వారికి నీగురించిన ఆలోచన లేదు వారి జీవితము వ్యర్థమై తొందరగా ముగియుచున్నది.

''అనేకులవలె నేను కూడ నిన్ను యేదైన ప్రాపంచికమైన వస్తువును ప్రసాదించమని అడుగుచున్నాను కాని నాకు ప్రాపంచిక వస్తువులపై మమకారము లేకుండునట్లు అనుగ్రహింపుము. నాతండ్రి నాకు విధించిన కర్తవ్యములను నిర్మమముగా తగిన నేర్పుతో, మీరు ప్రతిపాదించిన ప్రవచనముల కనుగుణముగా నేరవేర్చునట్లు నన్ననుగ్రహింప వేడెదను నాకు యిష్టము వచ్చినపుడు యీ ప్రపంచము వదలి నిన్ను చేరుట సాధ్యమగునట్లు చేయుము ఇదే నేను కోరువరము''

నారాయణుడు భక్తుడైన కర్దమునితో చిరునవ్వు నవ్వి యిట్లనెను ''నీ మనస్సులో యేమున్నదో గ్రహించితిని ఈ కర్మభూమిపై తామరాకు మీద నీటిబొట్టువలె జీవించగోరుచున్నావని నేనెఱుగుదును నీకొక భార్యను అప్పుడే సిద్ధముగా నుంచినాను నీ భక్తి నన్ను యెంతో సంతోషపరచినది.

''రెండు దినములలో మనుచక్రవర్తి, అతని భార్య శతరూపి నీవద్దకు రాగలరు తమకుమార్తె దేవహూతిని నీకిచ్చి వివాహము చేయుటకు యిక్కడకు వచ్చెదరు. దేవహూతి నీకు ఆదర్శపత్నికాగలదు ఆమె తొమ్మిది మంది పుత్రికలకు తల్లి అగును. ఆమె కుమార్తెలు మరీచి మున్నగు ఋషులను వివాహమాడెదరు ఆ విధముగ నీ తండ్రి నీకు ఆదేశించిన కర్తవ్యమును నిర్వర్తించగలవు. చివర, నీవు నాకు ప్రేమపాత్రుడవగుటచేత, నీకు పుత్రుడుగా జన్మించెదను. అప్పుడు సాంఖ్య యోగమును యీ పుడమిపై స్థాపించెదను''

నారాయణుడు అటుపిమ్మట అదృశ్యమయ్యెను. కర్దముడు మనువు రాకకై వేచియుండెను

కర్దముని ఆశ్రమమున కిరువైపుల సరస్వతీనది ప్రవహించుచుండెను ఆశ్రమము పక్కనే ఒక చిన్న సరస్సు నిర్మలమైన తియ్యని నీటితో నిండియుండెను. ఆశ్రమము పువ్వులచెట్లు, ఫలవృక్షములతో నుండగా, పరిమళమైన గాలి యెల్లపుడు వీచుచుండెను పవిత్రమైన ఆ ప్రదేశము నారాయణుని రాకతో మరింత పావనమయ్యెను. కర్దముని భక్తికి సంతోషింపగా, నారాయణుని కనుల నుండి ఆనందాశ్రువులు రాలెను అందుచేత ఆ సరస్సునకు బిందు సరస్సు అనిపేరు కలిగెను

# 27 దేవహూతి ఆగమనము

స్వాయంభువమనువు, భార్య శతరూపి, కుమార్తె దేవహూతి వెంటరాగా, బిందు సరస్సువైపు తొందరగా ప్రయాణించుచుండెను తనతో విలువైన పట్టుబట్టలు, నగలు తీసుకుని ఆశ్రమమువైపుగా ప్రయాణించెను త్వరలోనే ఆ ప్రదేశమును చేరెను సేవకులు తాను తెచ్చిన వస్తువులను తీసుకునిరాగా, మనువు ఆశ్రమములో ప్రవేశించి, కర్దమునివైపు నడచెను కర్దముడు అప్పుడే నిత్యకర్మలను (అగ్నిపూజ) పూర్తిచేసెను. అనేక సంవత్సరములుగా చేసిన తపస్సు ఫలితముగా కర్దమునిలో ఒక విధమైన తేజస్సు ప్రభవించి అది నారాయణ దర్శనముతో, మరింతగా ప్రకాశింపజొచ్చెను. కరుణాపూరిత నేత్రములు మంచి శరీర సౌందర్యము కలిగిన కర్దముని జూచి మనువు సంతోషించెను మనువు కర్దముని పాదములకు సమస్కరించెను

కర్దముడు మనువును ఆశీర్వదించి అతిధులకు చేయు సపర్యలు చేసి, అర్ఘ్యపాద్యాదులను సమర్పించెను మనువు చక్రవర్తియగుట చేత అతనిని తగురీతిగా గౌరవించెను. గౌరవ మర్యాదలను వినయముతో స్వీకరించి, ఋషిపాదముల చెంత కూర్చుండెను

కర్దముడు మనువుతో మధురముగా ప్రసంగించి, అతని రాజ్యములోని ప్రజల క్షేమ సమాచారము లడిగి తెలిసికొనెను తరువాత కర్దముడిట్లనెను ''నీవంటి మహాచక్రవర్తి ఉత్తమవ్యక్తి యీచిన్న ఆశ్రమమునకు విచ్చేయుట నాకు చాలా ఆనందముగా నున్నది మీరాక యీ ఆశ్రమమునకు గౌరవము కల్గించెను మీరు నారాయణయుని అంశమగుటచేత నాకు మిక్కిలి గౌరవనీయులు చక్రవర్తి భగవంతుడేయని చెప్పుదురు మరియు అతడే సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఇంద్రుడు, వాయువు, యముడు, ధర్మము, వరుణుడు నారాయణుడు తేజస్సుగలవాడగుటచేత సూర్యుని, ప్రసన్న వదనుడగుటచేత చంద్రుని పోలియుండును, ప్రచండ శక్తిముందు సామాన్యులెవరూ నిలువలేరు కనుక అగ్నితో పోల్చుచున్నారు రాజ్యములో సిరిసంపదలు వర్షించుటచేత ఇంద్రునివలె నున్నట్లు చెప్పుదురు. అందరి మనస్సులలోని భావములు తెలుసుకుని యుండుట చేత, సర్వత్ర వ్యాపించే వాయువుగా పరిగణింతురు. దుష్టశక్తులను నాశముగావించుట చేత యముడుగను, సత్పురుషులను రక్షించుటచేత ధర్మమూర్తిగను తలంచుదురు వరుణునివలె దీవి, గొప్పదనము గలిగి యుండి, నారాయణునికి ప్రతినిధిగా యీ భూమిపై చక్రవర్తియేలు చుండును. ఈ కారణములచేత చక్రవర్తిని ఒక దివ్యపురుషునిగా గౌరవించవలెను ఈ ఆశ్రమమునకు వచ్చుటకు మిమ్ములను ప్రేరేపించిన కారణము తెలిపినచో, నా శాయశక్తులా మిమ్ములను సంతోషపెట్టుటకు ప్రయత్నించగలనని వాగ్దానమిచ్చుచున్నాను''

కర్దముని మాటలకు తత్తరపడి, వినయముగా మనువు యిట్లు పలికెను ''తపస్సు, జ్ఞానము, నిస్స్వార్థము, వైరాగ్యము ప్రచారము చేయుటకు బ్రహ్మ ముఖము నుండి నీవు జన్మించినావు. క్షత్రియులమైన మేము భగవంతుని బాహువులనుండి, మీ వంటి ఉత్తమ జీవులను రక్షించి, మీరు నేర్చిన విద్యను ప్రచారము గావించుటలో సహాయపడుటకు, జన్మించితిమి మనము ఒకరినొకరు సంరక్షించుకొందుము నా పరిపాలనకు నీవు సంతోషము వెలిబుచ్చగా, నిన్ను సంతోషపెట్టగలుగుట నా మహద్భాగ్యమని భావించుచున్నాను దయాపురుషుడవైన నీవు నామాటలు విని నా కోరిక తీర్చగలవని నమ్ముతున్నాను.

''నాకు అయిదుగురు పిల్లలు. ఉత్తానపాదుడు ప్రియవ్రతుడు నా పుత్రులు. ఆకూతి, ప్రసూతి, దేవహూతి నా పుత్రికలు. నా కుమార్తె దేవహూతి, నారదుని వద్ద నీ గొప్పదనమును విన్నప్పటి నుండి ఆమె హృదయమును

నీకు అంకితము గావించినది. ఆమె నిన్ను భర్తగా యెంచినది. భగవంతుడైన నారాయణుడు నీ వద్దకు వెళ్ళమని ఆదేశించినాడు. అందుచే నా పుత్రిక దేవహూతిని చేబట్టమని కోరుచున్నాను. ఈమెను స్వీకరించి నన్ను గౌరవింపుము''.

అంత కర్దము డిట్లనెను. ''వివాహము చేసుకొనవలెనని కొంతకాలము నుండి యోచించుచున్నాను. నీ కుమార్తె నన్ను తన భర్తగా యెన్నుకున్నదని తెలుసుకుని, ఆమెను భార్యగా స్వీకరించుటకు సంతోషించుచు న్నాను. ఆమె గొప్ప సౌందర్యము, ఆమె ధరించు నగల ప్రకాశమును మరుగుపరచుచున్నది. ఆమెను స్వీకరించుటకు ముందు ఒక విషయము ముందుగా చెప్పవలసియున్నది. ఆమెకు నావలన సంతానము కలిగి తల్లియగువరకు నేను గృహస్థాశ్రమములో నుండెదను. అటు తర్వాత నేను ఆమెను వదలి నారాయణుని చేరుటకు తపస్సు చేయుటకై వెళ్ళెదను. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాశ్రమముల ననుసరించినవారు, తన భార్యను, పిల్లలను, గృహమును విడిచిపెట్టి సన్న్యాసాశ్రమమును తప్పక చేబట్టవలెను. ఇది నా అభిప్రాయము''.

అటుపిమ్మట మనువు, శతరూపి తమ కుమార్తె దేవహూతిని కర్దమునికిచ్చి వివాహము జేసిరి. సుందరమైన ఆ బిందుసరస్సు ప్రాంతములో తమ కుమార్తెను భర్త కర్దముని ఆశ్రమములో వదలి, మనుచక్రవర్తి శతరూపితో తిరిగి ప్రధాన నగరమైన బర్హిష్మతికి చేరుకొనెను. ఆ నగరమతి పవిత్రమైనది. ఇచ్చటనే పవిత్ర వరాహము, భూమిని వెదకునపుడు, తన శరీరము నుండి వెండ్రుకలను రాల్చెను. ఆ వెండ్రుకల నుండియే కుశతృణములు ఆవిర్భవించెను. ఆ తృణములనే బర్హియనియు, నగరమును బర్హిష్మతియని పిలుచుచుండిరి. అచట బర్హియను గడ్డిని పరచి, ఆదివరాహమను పేరుతో యజ్ఞవేదిక నేర్పాటు చేసి, మనువు ఒక యజ్ఞము సలిపెను. పునీతమైన ఆ ప్రదేశము బ్రహ్మావర్తమని పేరు కాంచెను.

## 28 ఆదర్శపత్ని

పార్వతి మహాదేవునికి సేవ చేసినట్లుగా కర్దమునికి దేవహూతి ఆదర్శపత్నిగా సేవ చేయుచుండెను. రోజులు, మాసములు, సంవత్సరములు గడచిపోవుచుండెను. ఆమె యెప్పటివలె తన భర్తను సేవించుటయే ఆనంద ముగా భావించి, సుఖముగా జీవించుచుండెను. ఒకరోజు కర్దముడామెను చూడగా, నిత్యము ఆమె ఆచరించు వ్రతపూజలచేత శుష్కించి, నీరసముగా నున్నట్లు గోచరించెను. ఆమె ముఖములో మొదట ఉన్న కళాకాంతులు తగ్గెను. ఆమె నీలవర్ణపు నేత్రములు అందముగానే యున్నవి, కాని రాత్రులందు నిద్రలేకుండటచేత కనులలో వెలుగు తగ్గెను. ఆమె యిదివరకే నగలన్నిటినీ తీసివేసి, సామాన్యమైన ముతక నూలు వస్త్రములను ధరించుచుండెను. పట్టువస్త్రములను ధరించుట చాలా కాలము క్రితమే మానివేసెను.

కర్దము డామెను పిలిచి యిట్లనెను. ''ప్రియపత్నీ! నిన్ను, నీ భక్తిని చూడగా నాకు ఆనందముగా నున్నది. రాకుమార్తెగా జన్మించి భోగభాగ్యముల కలవాటుపడిన నీవు, యిన్ని సంవత్సరములుగా యిక్కడ పేదరికము, కష్టము లనుభవించుచున్నప్పటికీ, నీవు యెన్నడూ విచారముగ లేవు. నిత్యము వ్రతములను ఆచరించుచు, ధ్యానములో నున్న నన్ను సేవించుచుండుటచేత నీకు నారాయణుని అనుగ్రహము కలిగినది. నేను నీకు అంతర్దృష్టి నొసగెదను. నీవు నారాయణుని వైభవము కాంచగలవు. దేవీ! నామాట వినుము. భగవంతుడు

తన కనుబొమ్మలు కొద్దిగా పైకెత్తి, మానవుని మనస్సులోని కోరికలను నశింపజేయగలడు భగవంతుడు మనలను మిక్కిలి ప్రేమతో చూచుచుండగా, యిక ప్రాపంచిక సుఖముల ఆవశ్యకత యేల? స్వర్గసౌఖ్యములకు వారసులము. అట్టియెడ ఇంద్రియ సుఖములకై తాపత్రయ పడనేల? మనమిద్దరము వాటి నతిక్రమించితిమి''

దేవహూతి భర్తతో మాట్లాడునపుడు కనులు దించుకుని యుండెను ఆమె యిట్లనెను. ''నాకు తెలుసును, మీరు పలికినదంతయూ నిజమే యోగమునకున్న శక్తి, మీపై నారాయణునికి గల అనుగ్రహము వేనెలుగు దును కాని, నాథా! నేను కేవలము స్త్రీని మాత్రమే మాతృమూర్తి కావలెనని ప్రతి స్త్రీకి సహజమైన వాంఛ నా మనస్సు యీకోరికతో నిండియున్నదని మీకు తెలిసియే యుండును, కాని నా నోటివెంట దానిని మీరు పలికించుచున్నారు'' ఆమె వదనములో సిగ్గు ముంచుకొని రాగా భర్త పక్క నిలుచుని యుండెను

కర్దముడు చిరునవ్వు నవ్వి ఆమెతో ''అట్లే కానిమ్ము'' అని పలికెను తన యోగశక్తి చేత కర్దముడు విమానమును సృష్టించెను. ఆ విమానమందు గాలిలో తేలుచుండు భవనము, భవనము చుట్టూ పూలతోటలు, సరస్సులు, భవనమందు రత్నములతో అలంకరించిన స్తంభములు, పట్టుబట్టలు పరచిన ఆసనములను సృష్టించెను. ఆశ్రమ ద్వారము వద్ద యీ విమానము నిలిచి యుండెను. దేవహూతి వానిని చూచుచుండెను. వానిని అనుభవించవలెనను కోరికతో నిండిన ఆమె కనులను కర్దముడు గాంచి యిట్లనెను. ''ప్రియపత్నీ! బిందుసరస్సులో ప్రవేశించుము అందు స్నానమాచరించిన తర్వాత, నాతో యీ విమానములో నీవు యెక్కడికి పోదచలచుకున్న నక్కడకు వెళ్లెదము. ఈ సరస్సు నారాయణుని కారుణ్యము కారణంగా రూపొందింది అందరి కోరికలు అది తీర్చగలదు''

నీలికనుల దేవహూతి, మాసిన వస్త్రములతో, చిందర వందరగా సంస్కారములేకయున్న కేశములతో, వ్రతముల నాచరించి కృశించియున్న సన్నని శరీరముతో, భర్త ఆదేశము ననుసరించి బిందుసరస్సులో ప్రవేశించెను ఆమె అట్లు చూచుచుండగనే ఒక విచిత్రమైన సంఘటన జరిగెను వందలకొలది అందమైన యువతులు దేవహూతికి స్వాగతము చెప్పిరి వారు ఆమెకు నూనెతో, పన్నీటితో స్నానము చేయించి చక్కని పట్టువస్త్రములను ధరింపజేసిరి ఆమెను ఆభరణములతో అలంకరించగా, సరస్సునుండి బయటకు వచ్చిన పిమ్మట దేవహూతి తనను తాను గుర్తించలేక పోయెను. ఆమెకు వెనుకటి సౌందర్యము, అందము తిరిగిరాగా, కర్దముని తలచుకుని లజ్జించెదెను. ఆమె ఆలోచన కన్న తొందరగనే అచటకు వచ్చి కర్దముడు ఆమె ప్రక్కగా నిలుచుండెను ఆమె అతనిని చూడగా, అతనిలో కూడ విశేషమైన మార్పు గోచరించెను వివాహము జరిగిన రోజున ఉన్నట్లు అతడుండెను గంధర్వునివలె అతిసుందరముగా నుండెను

చిరునవ్వు నవ్వుచూ ఆమె చేయినందుకొని విమానములో గూర్చుండబెట్టెను విమానము యెగిరి ఆకాశములో వాయువేగముతో ప్రయాణించుచుండెను. కొన్ని సంవత్సరములు ఆ దంపతులు విమానములో గడిపిరి. వారు రాత్రింబవళ్ళు అత్యంత సుఖముగా గడుపగా, వారికి కాలమే తెలియకుండెను అసలు యీ ప్రపంచమునే మరచిరి అట్లు నూరు సంవత్సరములు గడచిననూ, వారికి తెలియనే లేదు దేవహూతికి తొమ్మిదిమంది పుత్రికలు కలిగిరి తిరిగి భూమిపైకి వెళ్ళవలసిన సమయము వచ్చినదని కర్దముడు గ్రహించెను

దేవహూతికి కల అంతరించి మెలకువ స్థితిలోనికి వచ్చినట్లయ్యెను. తపస్సు చేయుటకై తన భర్త తనను వీడి వెళ్ళునని ఆమెకు తెలియును వివాహమునకు ముందుగనే అతడా విషయము చెప్పుట ఆమెకు జ్ఞప్తికి వచ్చెను. కర్దముని చెంతకేగి అతి మృదువుగా యిట్లు పలికెను. ''నాథా! నేను తల్లి నయిన పిమ్మట

గృహస్థాశ్రమము విడిచి వెళ్ళుదునని నాతండ్రితో చెప్పిరి మీరు వెళ్ళు సమయము ఆసన్నమైనదని నేనెఱుగుదును కాని, నాథా! మిమ్ము విడిచి నేనెట్లుండగలను? నేనొక అమాయిక వనితను సంసారభయము నుండి యెట్లు బయటపడగలనో నాకు దయచేసి బోధింపుడు నాకు చాలా భయముగా నున్నది నేను ఒంటరిగా జీవించవలసి వచ్చును కుమార్తెలకు వివాహము కాగానే వారి వారి భర్తలతో వెళ్ళిపోవుదురు వారి వలన నాకు ఉపశమనము కలుగదు. అందుచేత మరికొంతకాలము మీరు ఉండవలెను. ఎవరికి తెలుసు! నాకు సహాయముగా నుండుటకు బహుశః పుత్రుడు కలుగవచ్చు. అతడు నాకు యీ ప్రాపంచిక బంధములనుండి విడివడుటెట్లో బోధింపవచ్చును.

''ఈ పిల్లలు పుట్టక పూర్వము, మీతో గడిపిన యిన్ని దినములలో నా కోరికలు ప్రాపంచికమైనవిగా నుండెను భౌతిక వ్యామోహములు గల వ్యక్తికి అటువంటి ప్రాపంచికమైన కోర్కెలతో నిండిన మరొక వ్యక్తితో అనుబంధమేర్పడినపుడు, అది బంధమునకు దారితీయును. కాని ఆ అనుబంధమే భౌతిక వ్యామోహముల కతీతుడైన వానితో కలిగినపుడు అది మోక్షమునకు దారితీయగలదని చెప్పుదురు నీవు ప్రాపంచిక వ్యామోహ ముల కతీతుడవు. అందుచేత నీయెడల నాప్రేమ మోక్షమునకు దారితీయగలదా? నాగురించి చెప్పుము. నేను నీ ధర్మపత్నిని తాపసులలో ఉత్తముడవైన నీకు భార్యను అయినప్పటికీ నా మనస్సు ప్రాపంచిక విషయముల నుండి మరలుట లేదు వానిని నేను అతిక్రమించవలసియుంది నేనుమిక్కిలి దురదృష్టవంతురా లను. భగవంతుని మాయ నన్ను మోసపుచ్చుచున్నది''.

ఆమె కన్నీళ్ళను తుడిచి, కర్దముడిట్లనెను. ''నిన్ను నీవు చెడ్డగా తలంపకుము. నీవు దురదృష్టవంతులరా లవు కావు, కాకపోగా, నీవు అందరి స్త్రీలకన్న అదృష్టవంతురాలవు. సాక్షాత్తు నారాయణుడే నీకు పుత్రుడుగా జన్మించగలనని నాతో చెప్పెను. నీ గర్భములో నారాయణుని ధరించెదవు మరి యింకే స్త్రీయైన నీకంటె అదృష్టవంతురాలెట్లు కాగలదు. నీవు కన్నీరు కార్చవద్దు ఈ రోజు నుండి తీవ్ర వ్రతముల నాచరించి, భగవంతుని ప్రసవించుటకు సంసిద్ధురాలవు కావలెను రాత్రి పగలు నారాయణుని ప్రార్థింపుము నీ భక్తికి మెచ్చి,నీకు పుత్రుడుగా జన్మించగలడు భవిష్యత్తులో మన ఇద్దరి పేర్లు చిరస్థాయిగా నిలిచియుండునట్లు అతడు అత్యంత గౌరవము చేకూర్చును నీకు బ్రహ్మ విద్యను బోధించి, యీ ప్రపంచముతో నీకున్న బంధములను విప్పివేయును మాయనుండి నీవు తేరుకునే మార్గము సూచించి నీకు మిక్కిలి సహాయపడును నీ ద్వారా, లోకములోని మానవులందరూ అతని బోధల నందుకొనగలరు''.

## 29 కపిల వాసుదేవుడు

కర్దముడు చెప్పినట్లు దేవహూతి వ్రతముల నాచరించుచుండెను. ప్రతి దినము, రాత్రి పగలు, నారాయణుని పూజించుచుండెను. చాల కాలమిట్లు గడచెను కొంత కాలము తర్వాత నారాయణుడు ఆమె గర్భములో ప్రవేశించి, అరణిలో దాగియున్న అగ్నివలె నుండెను ఇట్లు జరుగగా, స్వర్గములో అందరూ బ్రహ్మానందభరితు లైరి. ఆకాశమున మధుర గానము వినవచ్చెను. మేఘములు సంతోషముతో గర్జించెను. గంధర్వులు పరమానందముతో గానము చేయగా, అప్సరసలు తన్మయత్వముతో నాట్యమాడిరి నారాయణునికి తల్లి

కాబోవు భాగ్యశాలిని దేవహూతిపై దేవతలు పుష్పవర్షము కురిపించిరి

ఇరుప్రక్కల సరస్వతీ నది ప్రవహించు ఆశ్రమమునకు, కర్దముని తండ్రి మరియు సృష్టికర్తయైన బ్రహ్మ యేతెంచెను మరీచి, మరికొందరు ఋషులు కూడ బ్రహ్మతో వచ్చిరి నారాయణుడు జన్మించబోవుచున్నట్లు, జన్మించుటకు గిల ' బ్రహ్మ, కర్దమ దే . వి, వారితో యిట్లనెను ''కుమారా! నీవు నాకు అదర్శ పుత్రుడవు నా ఆదేశములను మన్నించినావు నీ తొమ్మండుగురు పుత్రికలు యీ భూమిపై ప్రజోత్పత్తి గావించెదరు నాతో వచ్చిన యీ ఋషులకు వారినిచ్చి వివాహము జరుపుము నారాయణుడు నీకు పుత్రుడుగా జన్మించెదనని వాగ్దానము చేసి యున్నాడని నేనెఱుగుదును ఇప్పుడు నీ భార్య గర్భములో నారాయణుడు పెరుగుచుండుట కూడ తెలుసును బాలా! అతడు నీకు, నీ ద్వారా యీ లోకమునకు, బ్రహ్మ విద్యను బోధించి, సంసార బాధకు కారణమైన నీ అవిద్యను తొలగించును అతడు సాంఖ్య యోగమును నెలకొల్పి, కపిలుడను పేరుతో లోక ప్రఖ్యాతి పొందును అతని ఉనికి యీ లోకపు గొప్పదనమును యినుమడింపజేయును. మీరు కపిలుని తల్లిదండ్రులుగా చిరస్మరణీయులగుదురు''. బ్రహ్మ వారికి సెలవు నొసగి తిరిగి సత్యలోకమునకు వెళ్ళెను

కర్దముడు తన పుత్రికలను ఋషుల కిచ్చి వివాహము చేసెను కళను మరీచికి, అనసూయను అత్రికి, శ్రద్ధను అంగిరసునికి, హవిర్భువును పులస్త్యునికి యిచ్చి వివాహము చేసెను గతిని పులహునకు, క్రియను క్రతువునకు, ఖ్యాతిని భృగువునకు యిచ్చెను. అరుంధతి వసిష్ఠునికి భార్య కాగా, కడపటి పుత్రిక శాంతి అధర్వునికి పత్ని అయినది. వారు తమ తల్లిదండ్రుల వద్ద సెలవు తీసుకుని, వారి భర్తలతో వెళ్ళిపోయిరి ఇప్పుడు ఆ దంపతులిరువురు మాత్రమే ఆశ్రమములో ఉండిరి. జరుగిబోవు గొప్ప సంఘటన తలచుకొనుట వారికి ఆనందము నిచ్చుచున్నది పుత్రికలు నిష్క్రమించిన తర్వాత యేకాకిగా నున్న దేవహూతిని సమీపించి, కర్దముడు ఆమె గర్భములో నున్న నారాయణునకు ప్రణమిల్లి, యిట్లనెను ''నా పరిమిత బుద్ధితో నీ గొప్పతనమును నేనెట్లు వర్ణించగలను? నీ అపార కరుణను నేను వెల్లడించుటకు మాటలు చాలునా? సంసార బాధలలో చిక్కుకుని జీవితము గడపుచున్న మానవుల యెడ దేవతలు యెంతో దయగలిగి యున్నారు ఎన్నో జన్మల నుండి సంక్రమించిన సంచిత పాప ఫలితముగా, యీ లోకములో జన్మించి బంధములలో చిక్కుకొని యున్నాము అయినప్పటికీ నీవు అట్టి వారిని కనికరించవు మహర్షులు సంవత్సరముల తరబడి సాధనచేసి, భక్తిమార్గము ననుసరించుటకు మనసునకు శిక్షణ యిచ్చెదరు ఏకాంత ప్రదేశములో కూర్చుని, అనన్య భక్తితో నీ రూపమును ధ్యానించి, తమ హృదయములో నిలుపుకుని దర్శించుటకు ప్రయత్నించెదరు మరి నీవు చేసినదేమి? నా అమాయికతను, తెలివితక్కువ తనమును విస్మరించి, ఇంద్రియలోలుడ నైనప్పటికీ, నా ఆశ్రమములో నాకు కుమారుడుగా జన్మించుటకు నీవు సంకల్పించినావు నేనేమి చెప్పను? నేనేమి చెప్పగలను? ఒకప్పుడు నాకు పుత్రుడుగా జన్మించగలనని నీవు చెప్పియున్నావు నీ మాట నిలుపుకొనుటకై నీవు వచ్చితివి. భక్తుల యెడ నీకున్న ప్రేమ అపారము.

''నిన్ను, నీ రూపమును కీర్తించుటకు మాటలు చాలవు. ఈ లోకమే నీ గర్భములో ఉండగా, యిప్పుడు నీవు దేవహూతి గర్భములో శిశువుగా నున్నావు నీవు చతుర్భుజుడవని వర్ణింతురు
నాలుగు యోగములుగా నిన్ను చేరుటకు మార్గములు. తమ తపస్సుచేత ద్రష్టలు నిన్ను తెలియగలరు నేను మాత్రము నీ పాదములకు ప్రణమిల్లి పూజించగలను. ఈశ్వరుని నేనెట్లు వర్ణింపగలను? నీవు పురుషుడవు; నీవే మహత్తత్త్వము, అహంతత్త్వము; నీవే కాలము, నీవే త్రిగుణములు - సత్త్వరజస్తమో గుణములు నీవే

విశ్వము, విశ్వ రక్షకుడవు నీవే. ఈ లోకమంతయూ నీలోనున్నది ఓ కపిల వాసుదేవా! ప్రభువులకు ప్రభువైన నీకు నా ప్రణామములు. నిన్నెరిగి యుండుట నన్ను మాయ - సంసారము - నుండి విముక్తుని గావించినది. ఇక సన్న్యాసాశ్రమము స్వీకరించుటకు సిద్ధముగా నున్నాను. మిగిలిన జీవితకాల మంతయూ నిన్నే ధ్యానించి, నిన్ను చేరుకొనుటయే నా జీవిత పరిమావధిగా యెంచెదను''.

దేవహూతి గర్భములో నున్న నారాయణుడిట్లనెను. ''కర్దమా! ఒకప్పుడు, నీకు పుత్రుడుగా జన్మించెదనని మాట యిచ్చితిని. ఆ మాట నిలబెట్టుకొనక యెట్లుండగలను? మానవ శరీరమనే బంధమునుండి విముక్తిని కోరు వారి నిమిత్తమే యీ అవతారమును ధరించుట. మానవులకు నా గురించి సత్యము తెలిపి వారికి సహాయపడవలెనని నా కోరిక. ఈ బ్రహ్మ విద్యను అనేకులు విస్మరించిరి మానవులను రక్షించుటకై దీనిని పునరుద్ధరింప నిశ్చయించితివి నీవు తీసుకున్న నిర్ణయము చక్కగానున్నది నీవు సన్న్యాసాశ్రమము స్వీకరించుటను నేను ఆమోదించుచున్నాను నీవు మోక్షమున కర్హుడనైతివి నీ కోరికలన్నిటినీ నాకు విడిచిపెట్టుము నీవు యీ బంధముల నుండి విముక్తి పొందగలవు. నీ హృదయములో నన్ను నీవు దర్శించగలవు. త్వరలోనే నీవు నన్ను చేరగలవు నీవు వెళ్ళిన తర్వాత, నా తల్లి తనకు సంభవించే ఒంటరి తనమును, యీ ప్రపంచమును తలచుకొని విపరీతముగా భయపడుచున్నది ఆమెకు ఆత్మవిద్యను బోధించి, నన్ను ఆమె చేరుకొనుటకు సహాయము చేసెదను''

కర్దముడు కపిలునకు ప్రదక్షిణముజేసి అడవికేగెను. అడవిలో మౌనముగా అతడు రోజులు గడపుచుండెను బ్రహ్మమును తప్ప యింకేదియు అతడు తలచుట లేదు.* అతనిలో మమకార భావము లేవియు లేవు. అతడిప్పుడు కార్యకారణముల కతీతుడు. త్రిగుణములు సమవిభక్తముగా నుండే నిర్గుణ స్థితిని అతడు చేరుకొనెను; అనగా గుణాతీతుడయ్యెను. 'నేను', 'నాది' అను భావములు అతనిలో అంతరించెను. ద్వంద్వముల బాధ అతనికిపుడు లేదు శారీరక బాధలు, మానసికాందోళనలు, అశాంతితో కూడిన బుద్ధి యెన్నడో అతనిని విడచినవి అతని దృష్టి అంతర్ముఖమై నారాయణుని మాత్రమే దర్శించుచుండెను.

కర్దముని మనస్సు ప్రశాంతముగా, నిశ్చలముగా అలల శబ్దమణగియున్న సముద్రమువలె నుండెను అట్టి స్థితిలో, బ్రహ్మ పుత్రుడు, కపిల వాసుదేవుని తండ్రియగు కర్దముడు నారాయణుని పాదములు చేరెను.

## 30 కపిలుని బోధలు – 1

సన్న్యాసము స్వీకరించి కర్దముడు ఆశ్రమము విడిచి అరణ్యమునకు వెళ్ళిన తర్వాత, బాలకుడైన కపిలుడు, తన తల్లి దేవహూతితో, అత్యంత రమణీయమైన ఆ బిందు సరస్సు తీరమున నున్న ఆశ్రమమునందే యుండెను. ఇట్లు కొన్ని రోజులు గడచెను. దేవహూతి బ్రహ్మ మాటలను జ్ఞప్తికి తెచ్చుకొనెను ''బాలా! నారాయణుడు యీ లోకమునకు బ్రహ్మ విద్యను బోధింపనెంచి నీకు కుమారుడుగా జన్మించుటకు నిశ్చయించుకొనెను. అతడు నీకు బ్రహ్మ విద్యను బోధించి, లోకములో బాధలకు కారణమైన అవిద్యను తొలగించును'' ఏకాకిగా కూర్చునియున్న కుమారుని జూచి, దేవహూతి ఆ బాలుని వద్దకు వెళ్ళి యిట్లనెను ''నీవు నా కుమారుడవు. నీవు నారాయణుడవని కూడ నేనెఱుగుదును. నాకు సహాయము చేయుమని నిన్ను

అడుగుచున్నాను ఈ జీవితమంతయు ఇంద్రియములను తృప్తిపరచుటలో విసిగివేసారి అలసియున్నాను నావంటి సామాన్య మానవుల మనస్సులోని చీకటిని పారద్రోలుటకు ఉదయించిన సూర్యుడవు నీవు భగవంతునికి మాతృమూర్తినగు అదృష్టము నాకు దక్కెను. నేను తెలుసుకోవలసినది నాకు చెప్పుము పంచభూతాత్మకమైన యీ శరీరములో 'నేను' 'నాది' అను భావములను కలిగించినావు. వీనివలన రాగద్వేషము లవంటి అనేక ఉద్వేగములకు తావు యేర్పడుచున్నది. అవిద్యయనే దుష్టశక్తిని ఆత్మకు అడ్డముగా నీవు, కేవలం నీవు, పెట్టినావు నీవు మాత్రమే దానిని తొలగించి మమ్ము రక్షించగలవు శాంతి మార్గమును నాకు బోధింపుము ముక్తిమార్గమును బోధించి, నీ స్వభావమును వివరింపుము. పురుషుడు, ప్రకృతి నీవేయనియు, వాటిని గురించి నేను తెలుసుకున్నచో జనన మరణములనే బంధములనుండి స్వేచ్ఛగలుగుననియు చెప్పుదురు''

కపిలుని వదనము చిరునవ్వుతో ప్రకాశించగా, ప్రసన్న దృష్టితో తల్లిని చూచి యిట్లనెను. ''నేను నీకు చెప్పెదను సంసారము వలన కలిగే సుఖదుఃఖములను పూర్తిగా నశింపజేయుటకు ఒకే ఒక యోగము కలదని నా అభిప్రాయము పూర్వము కొ కొనగోరగా, వారికి నేను బోధించితిని ఆ యోగమును యిప్పుడు నీకు బోధించెదను. నీకు సులభముగా అర్థమగునట్లు చెప్పెదను ఎవరైనను యీ ముక్తిమార్గమును తేలికగా అర్థము చేసుకొనవచ్చును.

''తల్లీ! బంధమునకు, మోక్షమునకు మనస్సే కారణము మనసు త్రిగుణములతో చేరి, ఆ గుణములు సమత్వము తప్పినపుడు, అందులో యేదో యొక గుణము తీవ్రమై దానివలన జనించు ఉద్రేకముల యందు ఆత్మ తగుల్కొని యుండును మనస్సు అంతరాత్మ నుండి దూరమై, ఇంద్రియములకు సంతృప్తి గూర్చు వస్తువులయందు తగులవడి యుండును. ఇంద్రియములకు వస్తు అనుభవమును సమకూర్చుచు, ఆత్మకు దూర దూరముగా జరిగి మనస్సు సంచరించుచుండును అదే మనస్సును అంతర్ముఖము గావించి, పురుషోత్తముడైన నారాయణునితో అనగా ఈశ్వరునితో చేర్చియున్నపుడు, యింద్రియ లంపటముల నుండి స్వేచ్ఛను పొందును ఈ మార్గమునకు చిత్త సంయమనమని పేరు గమ్యమునకు యిది మొదటి మెట్టు 'నేను', 'నాది' అను భావములు అదృశ్యమైనపుడు, మనస్సు కామక్రోధములనే దుష్టశక్తుల నుండి స్వేచ్ఛ నొంది యుండును అప్పుడు మనస్సు శుద్ధముగా నుండి నన్ను ధ్యానించి చేరుట కర్హమై యుండును అపుడు ప్రాపంచిక సుఖ దుఃఖములు మనసును అంటవు. భక్తి జ్ఞాన వైరాగ్యములతో నిండిన మనస్సు బ్రహ్మమును దర్శించగలదు.

''తల్లీ! అన్ని మార్గములలో భక్తిమార్గము అతి సులభమైనది. తప్పక గమ్యమునకు తీసుకు వెళ్ళగలదు. ఇతర మార్గములు, భక్తిమార్గము తీసుకువెళ్ళునంత త్వరగా, మోక్షమునకు తీసుకువెళ్ళలేవు మానవునిలో 'సంగ'మనే గుణము అంతర్లీనముగా ఉన్నదని బుధులు చెప్పుదురు దీనికి నాశము లేదు నిత్యమూ పచ్చగా ఉండి, నాశనము లేని యీ గుణమును విస్మరించుటకు వీలులేదు. అమ్మా! సంగమనునది యెల్లపుడూ ఉండును మోక్షమునకు దీనినొక సాధనముగా వినియోగించు కొనవలెను సంగము అనగా అనుబంధము ఉండనిమ్ము. కాని బాహ్య వస్తువుల నుండి మరల్చుము ఇంతవరకు నీకు ప్రాపంచిక వస్తువులపై అనుబంధము కలదు. ప్రాపంచిక వస్తువులకు బదులుగా నారాయణునితో అనుబంధము యేర్పరచుకొనుము అనుబంధము వీడనక్కరలేదు. నారాయణునితో అనుబంధము బాహ్య వస్తువులతోగల అనుబంధమును త్రెంచును ఇది సులభముగా చేయవచ్చును

''ఈ అనుబంధమును అధమమైన వానినుండి ఉత్తమమైన వానివైపు మళ్లించుట క్రమ క్రమముగా జరుగవలెను ఒక్కసారిగా ఒకదానిని వదలిపెట్టి రెండవదానిని చేబట్టుట సాధ్యము కాదు. అందుకు మనస్సు సహకరించదు అంతిమ ధ్యేయమునకు ముక్త సంగమని పేరు. ఈ మార్గము ననుసరించుటకు సాధు సాంగత్యముచే, మనసునకు తగిన శిక్షణ కలుగుమ సజ్జన సాంగత్యము కలిగిన తర్వాత, మనస్సు వెనుకటి ఆకర్షణలకు లోబడకయుండును. ఇందువలన తరువాత మెట్టు సులభమగును.

''భగవంతునిపై ఆలోచనలకు మనస్సును మళ్ళించుటెట్లు? అనుకున్న దానికన్న తేలికయే. ఇంతకు ముందు అరిషడ్వర్గములైన కామక్రోధాదులు, 'నేను' 'నాది' అను భావములు మనస్సును మలిన మొనర్చి గమ్యము నుండి మరల్చి, ఇంద్రియములకు తృప్తిని గూర్చు వస్తువులవైపు నడిపించునని తెలిపియున్నాను అరిషడ్వర్గములైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే కల్మషముల బారినుండి స్వేచ్ఛపొందిన మనస్సు సహజముగా భగవంతునివైపు మరలును

''దీనిని సాధించి, ముక్త సంగులైన తర్వాత, సత్సంగము అనగా సజ్జనుల సాంగత్యముతో కాలము గడపవలెను. నిత్యమూ పచ్చగా ఉండే అనుబంధము సాధువులతో ముడిపడి యుండవలెను సాధువు లెవరు? వారి లక్షణము లేమిటి? వారిని గుర్తించుటెట్లు? ఇవి నీకు చెప్పెదను. ఈ భౌతిక శరీరమునకు కలిగే బాధల వలన అనారోగ్యముల వలన సాధువులు తమ మనస్థిమితమును పోగొట్టుకొనరు. అందరి మానవుల యెడ వారు దయగలిగి యుందురు. అన్ని జీవులు వారికి బంధువులే అన్ని జీవులనూ ప్రేమించెదరు అందుచే సహజముగా వారికి శత్రువులుండరు. వారు యెప్పుడూ శాంత స్సు యెట్టి కలవరములు లేక ప్రశాంతతతో నిండియుండును. వారు యెప్పుడునూ ధర్మ మార్గమును విడిచిపెట్టరు వారి ప్రవర్తన దోషరహితము నన్ను గురించియే వారెప్పుడూ తలంచెదరు. వారికి యెటువంటి విధులు, బాధ్యతలు, సంబంధములు లేకుండుటచేత, నాగురించిన కధలు తెలుసుకొనుటలోను వాటిని యితరులకు తెలియజెప్పుట లోను ఆనంద మనుభవించుచుందురు ఈ ప్రాపంచికమైన బాధలు వారిని బాధించవు వీటినుండి స్వేచ్ఛను పొందినటువంటి వారినే 'సాధువు'లందురు. అమ్మా! ఇట్టి సాధువులతో నీ మనస్సు అనుబంధము కలిగి యుండవలెనని ప్రార్థింపుము వారు నీకున్న యితర అనుబంధముల నుండి విముక్తికలిగించుటకు సహాయపడగ లరు

''సాధు సాంగత్యము వలన నీకు నన్ను గురించిన కధలతో పరిచయమేర్పడును. ఆ కథలు చెవులకింపుగా నుండుటయే కాక, హృదయమున కాహ్లాదము కలిగించును. ప్రీతికరమైన యీ కథలు వినుటచేత నీకు నాయందానక్తిని పెంచి, చివరకు ఆనందము చేకూర్చును. అనగా నిత్యమూ నన్ను మాత్రమే చింతించుచూ ఆనందమును పొందెదవు. ఈ ఆనందమే భక్తిగా రూపొందును సత్సంగము శ్రద్ధకు, శ్రద్ధ రతికి, రతి భక్తికి దారితీయును నీలో నా యెడల పెంపొందు భక్తివలన నెమ్మదిగా క్రమక్రమముగా, తప్పకుండా ఇంద్రియము లకు సంతృప్తినిచ్చు వస్తువులపై విహ్యాభావము కలుగును. ఒకప్పుడు ప్రాపంచిక వస్తువులపైనున్న ఆకర్షణ ఉండదు. ఒకప్పుడనుభవించిన సుఖముల యెడ ఆసక్తి అంతరించును. భగవంతుని యెడ నిశ్చలముగా మనస్సును కేంద్రీకరించుటకు మార్గముల నన్వేషించుటలో ఆసక్తికలుగను. అన్నిటి నుండి స్వేచ్ఛను పొందిన మానవుడు శ్రద్ధగా మోక్షమునకై పాటుపడును. ప్రకృతిపరమైన వాటియందు అభిరుచి లేకుండ, అతని బుద్ధి అప్రమత్తత కలిగి నిశితముగా నుండును ఇంద్రియములతో అనుబంధమును, ఇంద్రియములకు సంతృప్తి కలిగించు వస్తువులపై వ్యామోహమును శే 'రణము. నాకు పూర్తిగా శరణాగతుడైనందు

వలన అతడు నాలో లీనమగును''

దేవహూతి శ్రద్ధగా వినుచుండెను ఆమె తన కుమారుడు చెప్పుచుండగా అడ్డు తగిలి యిట్లనెను ''నేను వేదములను చదువలేదు చదువుకున్న కోవిదులు తెలిపే సత్యములను నేను నేర్చుకొనలేదు మరి నావంటి అమాయిక స్త్రీ భగవంతుని చేరుటెట్లో తెలియజెప్పుము. భగవంతుని చేరుటకు సులభమైన మార్గమేది?''

''భక్తి' యని కపిలుడనెను ''నీకు భక్తియోగము ఉపయోగపడును ప్రాపంచిక వస్తువులందు తగుల్గొనిన యింద్రియములు, వేదములు నిర్దేశించిన నిత్యవిధులు, కర్మలు చేయుట యందు నిమగ్నమైన మనస్సు, యీ రెండూ కూడను విముక్తిపొందుటకు ఒకే ఒక మార్గము కలదు, అది తనకు తానుగా శ్రద్ధతో మోక్షమును కాంక్షించుట నారాయణుని యందు అనన్య భక్తి పెంపొందించుకొనినపుడు యీ కాంక్ష తీరగలదు ఈ భక్తికర్మబంధములను, ఇంద్రియ బంధములను, శరీరములోని అగ్ని (వైశ్వానరుడు) భుజించిన ఆహారమును దహించినట్లుగా, దగ్ధము చేయును భక్తి వస్తు ప్రపంచము నుండి విముక్తిని కల్గించి, నారాయణునితో ఐక్యమగునట్లు చేయును భక్తిమార్గములో పయనించే యాత్రికులు, ముక్తిఅనే గమ్యమును సునాయాసముగా చేరగలరు

''నాకు యెప్పుడూ సేవచేయుచూ, నాతోనే అనుబంధము కలిగియుంటూ, నాకు సంతోషము కలిగించుటకే కర్మలను చేయుచూ, నా కథలనే యెల్లప్పుడూ చెప్పుచుండు సాధువులు మోక్షమును సైతము కోరరు నన్ను గురించిన ఆలోచనలతోనే వారు ఆనందముగా నుండెదరు వారు తమ మనో నేత్రముతో నా రూపము నెప్పుడూ చూచుచుందురు అందుచే, వారడిగిననూ లేకున్ననూ, నేను వారికి ముక్తిని ప్రసాదింతును నా గురించిన ఆలోచనలతో మునిగియుండే వారికి స్వర్గ సౌఖ్యములు కూడ ఆకర్షణీయము కావు అయినప్పటికీ వారికి అట్టి అర్హత యుండుటచేత నేను వారికి ఆ సౌఖ్యములను ప్రసాదించెదను

''నా భక్తులకు యెట్టి వినాశము కలుగదు నాలో లీనము కానున్న భక్తుల యెడ, చక్రము (కాలచక్రము), శక్తిహీనమై యుండును నేను భక్తులకు సర్వస్వమును పుత్రులపై యెట్టి ప్రేమయో నా భక్తులపై నాకట్టి ప్రేమ నేను భక్తులకు మిత్రుడను, గురువును, శ్రేయోభిలాషిని, ప్రియతముడను ఈ లోకమంతయూ నా అధీనములో నుండుటచే నా భక్తులకు యెట్టి భయము ఉండదు నాకు భయపడి గాలి వీచును, సూర్యుడు ప్రకాశించును, పర్జన్యుడు (వరుణుడు) వర్షించును నాచే నియమితుడై అగ్ని దహించును, యముడు అందరినీ కనిపెట్టి యుండును ఇంద్రియములను జయించిన యోగులకు దేనివలనను భయము కలుగదు వారు నన్ను తప్పక చేరెదరు ఇందు సంశయము లేదు.

## 31 కపిలుని బోధలు - 2

''పురుషుని రహస్యమును, అతడు యీ లోకమునంతయూ యెట్లు వ్యాపించియున్నదీ నీకు నేను చెప్పెదను. దీనిని ఆత్మవిద్యా యోగమందురు సంపూర్ణముగా దీనిని చక్కగా అర్థము చేసికొనినయెడల, నీవు మోక్షమును పొందగలవు ఈ యోగము తెలుసుకొనిన వారి సంశయములన్నీ నివృత్తి కాగలవు నీలో

నున్న ఆత్మయే పురుషుడు అతనికి ఆద్యంతములు లేవు. అతడు స్వయం ప్రకాశుడు. పురుషుడు కాని వస్తువేదియులేదు, పురుషునికి భిన్నమైన దేదియు లేదు. అతడు అంతటా వ్యాపించియున్నాడు. అతడు నిత్యుడు

''ప్రకృతి కారణముగా ఆత్మ ఉపాధులతో చేరియున్నది. పురుషుడు నిత్యుడని యింతకు ముందు తెలిపియున్నాను ఈ బహుళ ప్రపంచము నందంతటా వ్యాపించి యున్నది ఆ పురుషుడే. అతడు త్రిగుణాతీతుడు పురుషునికి సంబంధించిన యీ రెండు విషయములను సమన్వయ పరచుటెట్లు? ఒకటి శుద్ధమైనది. రెండవది బహుళ ప్రపంచము. పురుషుడు గుణములకు, ప్రకృతికి అతీతుడెట్లు కాగలిగెను? ఈ లోకములోని జనన మరణములతో అతనికి ప్రమేయము యెట్లు కలిగెను? జ్ఞానులకు యిది చిత్రవిచిత్రమని గోచరించదు.

''ప్రకృతి యందు రెండు కీలక శక్తులు గలవు ఒకటి ఆవరణ శక్తి, రెండవది విక్షేప శక్తి. త్రిగుణములు సమ విభక్తముగా నున్నప్పుడు దానిని నిర్గుణ స్థితి యందురు అనగా గుణములు లేనట్టి స్థితి. పురుషుని మరొక రూపమే కాలము. కాలము తిరుగుచున్నపుడు, త్రిగుణములలో సమత్వము తప్పిపోవును. ఈ సమత్వము, లేక సమవిభక్తస్థితి తప్పినపుడు, రజో గుణము ప్రకటితమగును దాని తర్వాత మిగిలిన రెండునూ ప్రకటితము కాగలవు.

''ఆ విధముగా గుణములు కార్యమునకు దిగినపుడు, ఆవరణ విక్షేపములు కలుగును ఇప్పుడు పురుషుడు రెండు రూపములు ధరించును. ఒకటి జీవుని రూపము, రెండవది ఈశ్వర రూపము గుణములతో కూడియున్న పురుషుని జీవుడందురు. ఆవరణము, జీవుడు తన సహజ ( నిజ) స్వభావమును మరిచిపోవునట్లు చేయును అవిద్య చేత యీ మరపు కలుగుచున్నది సత్యమును తెలుసుకొన లేకుండుటే అవిద్య. అవిద్యతో బాటు విక్షేపము కలుగును విక్షేపము కలవరము లేక ఆందోళనను సృష్టించును. దీనినే మాయ అందురు ఇది అసత్యము సత్యమను భ్రమను కలిగించును అనగా అవిద్యకు, మాయకు ఆవరణ విక్షేపములే కారణము. ఆవరణ విక్షేపముల చేత జీవాత్మ తన నిజ స్వరూపమును విస్మరించుచున్నాడు అశాశ్వతమైన ఉపాధులే తానని భ్రమించి యీ బహుళ ప్రపంచపు ప్రలోభములకు లోనై చిక్కుకునిపోతున్నాడు ప్రకృతి యొక్క ఆవరణ విక్షేప శక్తులకు భ్రమింపక, వేరుగా నుండునదే పురుషుని రెండవ స్వరూపమైన ఈశ్వరుడు

''ఈ మాయ నుండి విముక్తి పొంది, అనగా జీవుడు ప్రకృతి శక్తులు బంధించలేని స్థితిని చేరుటకు ఒక మార్గము కలదు అదియే భక్తియోగము అమ్మా! ఎల్లప్పుడూ భగవంతునే చింతింపుము భక్తి దానంతటదియే జ్ఞాన వైరాగ్యములను కలిగించును వాటిని నీవు అన్వేషించ నవసరములేదు నారాయణునిపై ప్రేమ పెంపొందినపుడు, యితర వస్తువులపై ప్రేమ లేకుండ జేయును ఆ విధముగా వైరాగ్యమలవడును. భక్తి నారాయణుని పాదములు చేరు మార్గమున తీసుకుపోవును. నారాయణుని సన్నిధికి చేరుటయే జీవిత లక్ష్యముగా యెంచిన భక్తుడు సత్యమును తెలుసుకొన్న వాడగును. అనగా అతని అవిద్య తొలగినదన్నమాట నారాయణుడే సత్యమని, యితరమైనవి అసత్యమని తెలుసుకొనును అదియే జ్ఞానము

''వివిధ యోగములు బ్రహ్మమును, పురుషుని, ఈశ్వరుని, భగవంతుని చేరుటకు మార్గమును సూచించు చున్నవి. అనగా గమ్యము ఒకటే. పురుషుడు అనగా ఈశ్వరుడు యీ బహుళ ప్రపంచమందు అన్నింటియందు వ్యక్తమగుచున్నాడు. దీనిని గ్రహించిన వాడు బ్రహ్మమే యగును అనగా బ్రహ్మత్వమును గురించి తెలుసు

కామట కాదు, బ్రహ్మత్వమునే పొందుట. తానే బ్రహ్మమని యెఱుక కలిగియుండుట. జీవుడు, తాను పురుషుడు లేక ఈశ్వరుడనని యెఱుగును. ఇప్పుడు నీకు బోధించిన జ్ఞాన యోగము, యింతకు ముందు వివరముగా బోధించిన భక్తి యోగము, యీ రెండుమా నిజముగా ఒక్కటే. ఒకటి, మరియొక దానికన్న వేరు కాదు

''అమ్మా! వివిధ మార్గములను నీకు బోధించితిని. ఏ ఒక్క మార్గమునైనను శ్రద్ధగా అనుసరించినపుడు నీకు తప్పక మోక్షము లభించగలదని హామీ యిచ్చుచున్నాను''.

## 32 దేవహూతి మరణము

కపిలుడు వచ్చిన కార్యము పూర్తి అయినది. తన తల్లి ద్వారా యీ లోకములో సాంఖ్యమును ప్రచారము గావించుటకు అతడు జన్మించెను. ఆ పనిని అతడు పూర్తి చేసెను. ఆశ్రమము నుండి నిష్క్రమించుటకు అతడు సంసిద్ధుడయ్యెను. తన తల్లి వద్ద సెలవు తీసుకుని అతడు ఆశ్రమము విడిచి వెళ్ళిపోయెను. కుమారుడు బోధించిన రీతిలో దేవహూతి తన శేష జీవితమును ఆశ్రమములో గడపుచుండెను. బిందు సరస్సులో తరుచుగా స్నానమాడి, కేశములను సంరక్షించుకొనకుండుటచేత, ఆమె నల్లని అందమైన కేశములు జీవముడిగి, అట్టగట్టుకుని, యిటుక రంగుగా మారెను ఆమె చేయు వ్రతములకు దేహము శుష్కించి నీరసించెను నార చీరలు ధరించి, నారాయణావతారమైన కపిలుడు బోధించిన యోగమును ఆచరించుచుండెను. ఆమె తన సర్వస్వమును యితరుల కిచ్చివేసెను భర్త, కుమారుడు లేని వెలితి ఆమె తెలుసుకొనెను. ఆమె వైరాగ్యము నేర్చినప్పటికీ దానిని ఒక్కసారిగా అనుసరించుట సులభము కాకుండెను ఆమె రాత్రి పగలు తన కుమారుని తలంచుచుండెను. అతడు ఆమెకు తన ఆలోచనలను పగలు రాత్రి నారాయణునివైపు, నిత్యము పారే సెలయేరు ప్రవాహమువలె, ఉండవలెనని చెప్పగా ఆమె అట్లు చేయుచుండెను కపిలుని సుందర వదనమును ఆమె తలచగా, ఆమె మనస్సు క్రమక్రమముగా నిశ్చల స్థితిని దాల్చెను. అప్పుడామె నారాయణుని రూపమును తలంచసాగెను. ఆమె అష్టాంగ యోగము నాచరించగా, ఆమె మనస్సు బ్రహ్మముపై కేంద్రీకరించెను ఆమె చేసిన తపస్సు వలన అవిద్య దగ్ధమైనది. అవిద్యతోబాటు ఆమె బాధలు నశించెను. జాగ్రదవస్థలో స్వప్నమును విస్మరించినట్లు, ఆమె తన శరీరముపై ధ్యాస లేకయుండెను. త్వరలోనే ఆమె బ్రహ్మ స్థితిని చేరుకొనెను.

ఆమె బ్రహ్మ స్థితిని పొందిన ప్రదేశము అతి పవిత్రమైన తీర్థము ఆమె వదలివేసిన శరీరము నదిగా రూపొందెను. తమను తాము శుద్ధిపరచుకొనుటకు దేవతలు యీ నదిని వినియోగించుచుండిరి. ఆ పవిత్ర ప్రదేశమునకు సిద్ధపాదమని పేరు ఆ విధముగా మనువు కుమార్తెయైన దేవహూతి, తన పుత్రుడైన కపిల వాసుదేవుని వద్ద బ్రహ్మ విద్య నేర్చినందువల్ల జీవన్ముక్తులందరి కన్న ఉత్తమస్థితిని పొందెను.

ఆశ్రమము విడచి వెళ్ళిన తర్వాత కపిలుడు వాయవ్య దిక్కుగా ప్రయాణము చేసెను. అతడు వెళ్ళిన ప్రదేశములలో సిద్ధ చారణ గంధర్వులు అతనికి మ్రొక్కిరి. సాగర ప్రభువు అర్ఘ్య పాద్యములతో కపిలుని పూజించి, అతనికి తన ప్రాంతములో ఒక ప్రశాంత స్థలమును తపస్సు కొనసాగించుటకు యిచ్చెను

# చతుర్ధ స్కంధము

## 33 ఆకూతి పుత్రుడు

స్వాయంభువమనువుకు ముగ్గురు కుమార్తెలు, యిద్దరు కుమారులు. ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు కుమారులు, ఆకూతి, దేవహూతి, ప్రసూతి కుమార్తెలు ఆకూతిని రుచి యను ఋషికిచ్చి మనువు వివాహము చేసెను 'పుత్రికా ధర్మమ'ను పద్ధతి ననుసరించి యీ వివాహము జరిగెను. పుత్రులు లేక, పుత్రికలు మాత్రమే యున్నప్పుడు, యోగ్యుడైన వానికి తన పుత్రిక నొకరి నిచ్చి అతనితో నిట్లనును. ''అన్నదమ్ములు లేని యీ కన్యను నీ కప్పగించుచున్నాను ఈమెకు పుట్టబోవు కుమారుడు నీకు, నాకు కూడ కుమారుడగును''. మనువు ఎప్పటికీ మరొక పుత్రుని కోరి, యీ పద్ధతిని ఆకూతికి వివాహము జేసెను

రుచి మహా గొప్ప ఋషి నారాయణుని యందు అత్యంత భక్తి రుచికి — ఆకూతికి ఒక కుమారుడు, ఒక కుమార్తె కలిగిరి నారాయణుడే కుమారుడుగా జన్మించెను యజ్ఞపురుషుడైన నారాయణుడుగా మూర్తీభవించుటచేత యజ్ఞుడని ఆ బాలునికి పేరిడిరి లక్ష్మీదేవిగా అవతరించిన కుమార్తెకు దక్షిణ యని నామమిడిరి

నారాయణుడే తనకు పుత్రుడుగా జన్మించినందుకు సంతసించి, ఆ బాలుని తన యింటికి తీసుకువెళ్ళెను దక్షిణ తల్లిదండ్రుల వద్ద నుండెను ఆ తర్వాత యజ్ఞుడు దక్షిణను శాస్త్ర పద్ధతుల ననుసరించి వివాహమాడెను వారికి పన్నెండుగురు పుత్రులు పుట్టిరి ప్రతి మన్వంతరమందు - ఒక మనువు, దేవతలు, మనుపుత్రులు, సుర గణాధిపతులు, ఋషులు, నారాయణావతారము ఉండవలయును స్వాయంభూమన్వంతరమునందు, అనగా స్వాయంభువమనువు కాలమున, యజ్ఞుని పన్నెండుగురు పుత్రులు సురగణాధిపతులు, మరీచి మున్నగు ఋషులే సప్తర్షులు యజ్ఞుడే నారాయణావతారము అతడే ఇంద్రుడు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు మనుపుత్రులు స్వాయంభూమన్వంతరమునందు వీరందరూ ప్రజోత్పత్తి గావించిరి

దేవహూతి కర్దమ ప్రజాపతిని వివాహమాడగా వారికి కపిలుడను పుత్రుడు కలిగెను. వారి జ్యేష్ఠ పుత్రి కళ మరీచి ఋషికి భార్య అయ్యెను వారి పుత్రులలో కశ్యప ఋషి గొప్పవాడు వారి కుమార్తె పూర్ణిమ, ఆమె కుమార్తె దేవకుల్య తర్వాత ఈమెను గంగ యను పేరుతో పిలుచుచుండిరి

కర్దముని తర్వాతి కుమార్తె శ్రద్ధ అంగిరసునకు భార్యయై, బృహస్పతికి తల్లి అయినది హవిర్భువు పులస్త్యునకు పత్నియై, అగస్త్యునకు తల్లి అయినది. మరియొక పుత్రుడు విశ్రవసుడు విశ్రవసుని పుత్రుడు కుబేరుడు విశ్రవసుని మరియొక భార్య కైకసి ఆమె పుత్రులు రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు. క్రియ క్రతువునకు భార్యయై, 'వాలఖిల్యు'లను ఋషులకు తల్లియైనది.

ఖ్యాతి భృగు మహర్షి పత్ని వారికిద్దరు పుత్రులు అందులో ఒకరు మృకండుని తండ్రి మరొక పుత్రుడు ఉశనసుడు ఇతడు 'కవి' యను పేరుతో ప్రఖ్యాతి పొందెను ఇతడే అసురులకు గురువైన శుక్రాచార్యుడు మనువు మూడవ కుమార్తె యైన ప్రసూతిని దక్ష ప్రజాపతి వివాహమాడెను వారికి పదహారుగురు పుత్రికలు వారిలో పదముగ్గురిని ధర్మునకు, ఒకతెను అగ్నికి, మరొకతెను ప్రీతిస్సునకు, యింకొకామెను మహాదేవునికి యిచ్చి వివాహము చేసెను

# 34 దత్తాత్రేయుడు

కర్దముని కుమార్తె అనసూయ అత్రి మహర్షికి భార్య అయ్యెను రూక్ష పర్వత సానువులందు అత్రి మహర్షి తపస్సు చేయుచుండెను. ఆ స్థలము చాలా ప్రశాంతముగా నుండెను పర్వతమునకు అన్ని ప్రక్కలను నిర్వింధ్యా నది మెల్లగా ప్రవహించుచుండెను నదీ ప్రవాహము వలన కలిగే సంగీత ఝరి, పువ్వుల పొదలందు తేనెటీగలు చేసే ఝుమ్మను శబ్దము, ఆశ్రమమంతా వ్యాపించి, అచ్చటి ప్రశాంత వాతావరణమునకు అనువుగా నుండెను అత్రి మహర్షి, ఇంద్రియములను నిగ్రహించి, ప్రాణాయామముతో శ్వాసనరికట్టి, అనేక సంవత్సరములు తపస్సు చేసెను

పుత్రుడు కలుగవలెనని అత్రి మహర్షి ప్రార్థించెను అతని ప్రార్థన యీ విధముగా నుండెను ''ప్రభువులకు ప్రభువైన ఓ భగవంతుడా! అన్ని విధములా నీవలెనే యుండునట్టి కుమారుని నాకు ప్రసాదింపుము''. నూరు సంవత్సరములకు పైబడి చాలా ఘోరముగా తపస్సు చేసెను తపస్సు తీవ్రతకు అతని ముఖములో నుండి వెలువడే అగ్నివంటి ప్రకాశమును చూసి స్వర్గవాసులు భయపడిరి అంత త్రిమూర్తులైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అత్రి మహర్షి ఆశ్రమమునకు వచ్చిరి తన ఆశ్రమ ద్వారము వద్ద వారు నిలుచుండుట చూచి, వారు ముగ్గురు ఒకేసారి రావడము తన మహద్భాగ్యమని యెంచెను అత్రి సంభ్రమముతో లేచి వారిని సాదరముగా ఆహ్వానించి గౌరవించెను ఉద్వేగము చేత అత్రి మహర్షికి నోటివెంట మాటలు వచ్చుట లేదు కొంతసేపటికి తమాయించుకుని వారివైపు చూచెను చిరునవ్వులు చిందే ముఖములతో త్రిమూర్తులు నిలుచుని యుండిరి వారిని పువ్వులతో పూజించి అత్రి యిట్లనెను ''ఈ లోకమున సృష్టి స్థితి లయములు మీ ముగ్గురియందు ఉన్నవి. నేను పలికే పలుకులు నా ఆలోచనలును సరిగా తెలియచెప్పలేకున్నవి నన్ను అనుగ్రహించుటకై మీరు ముగ్గురు ఒకేసారి వచ్చుటకు గల కారణము తెలియజెప్పవలెను మీ ముగ్గురిలో యెవరు గొప్పవారైతే వారిని పోలిన కుమారుడు నాకు కలుగవలెనని ప్రార్థించినాను మీలో యెవరు గొప్ప వారో యెవరు నాకు పుత్రుని ప్రసాదించెదరో తెలుపవలెను మీ ముగ్గురిలో గొప్ప వారెవరు?''

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు అత్రి మాటలకు సంతోషించి, నవ్వుచు యిట్లనిరి ''మా ముగ్గురిలో గొప్పవానిని పోలిన కుమారుడు కలుగవలెనని కోరుచున్నావు నీకు నిరాశ కలిగించదలచుకోలేదు అందుకే ముగ్గురము వచ్చితిమి మేము ముగ్గురము కలిసి ప్రభువులకు ప్రభువైన భగవంతుడుగా ఉంటున్నాము బ్రహ్మ విష్ణు మహేశ్వరుల మైన మేము గూడ పరబ్రహ్మాంశలుగా (సృష్టి స్థితి లయ కారకులుగా) ఉంటున్నాము పరబ్రహ్మయే సృష్టి స్థితి లయలకు కారకుడు మేము పరబ్రహ్మ స్వరూపులము మా ముగ్గురిలో ఒకరికి యింకొకరికి భేదము లేదు మా గురించిన సత్యము నీకు తెలియజేయవలెనని మేము ముగ్గురము కలిసి నీ వద్దకు వచ్చితిమి మా ఒకొక్కరి అంశతో నీకు ఒకొక్క కుమారుడు జన్మించును వారు ముప్పురు లోకములో ప్రఖ్యాతి పొంది నీకు కీర్తి తేగిలరు. నీవు సంతోషముగా నుండగిలవు'' అత్రికి బ్రహ్మ అంశతో పుట్టిన కుమారుడు చంద్రుడు, విష్ణు అంశతో పుట్టిన కుమారుడు దత్తుడు, మహాదేవుని అంశతో బుట్టిన కుమారుడు దుర్వాసుడు

# 35 దక్షుని ఆగ్రహము

దక్షుని కుమార్తెలలో ఒకతెయైన సతి మహాదేవుని వివాహమాడెను. ఒకప్పుడు, మరీచి మున్నగు ఋషులు బ్రహ్మ సత్రమను యజ్ఞమును జరుపుచుండిరి. గొప్ప గొప్ప ఋషులు, దేవతలు, స్వర్గవాసులు ఆ యజ్ఞము చూచుటకు వచ్చిరి. యజ్ఞము జరుగుచుండగా, దక్ష ప్రజాపతి యజ్ఞశాలలో ప్రవేశించెను అతడు సూర్యుని వలె ప్రకాశించుచుండెను. అతని రాకతో యాగశాల మిక్కిలి తేజస్సుతో వెలుగొందుచుండెను అతని గొప్పదనమును గుర్తించిన ఋషులందరూ ఒకేసారి లేచి నిలబడి దక్షుని గౌరవించిరి ఇద్దరు మాత్రము లేవక యితరులు చూపినట్లు, దక్షునికి యెట్టి గౌరవము చూపలేదు. ఆ యిద్దరిలో ఒకరు బ్రహ్మ, రెండవవారు మహాదేవుడు. దక్షుడు తన తండ్రి యైన బ్రహ్మ వద్దకు వెళ్ళి, పాదములకు ప్రణమిల్లి, పాద ధూళిని తన శిరస్సుపై నుంచుకొనెను. బ్రహ్మ అంగీకారముతో దక్షుడు కూర్చొనెను ఇతర ఋషులవలె, మహాదేవుడు లేచి తనకు గౌరవము చూపకపోవుటచేత ఆగ్రహము చెందెను ఈ అవమానము దక్షుడు భరించలేకుండెను. ఆగ్రహముతోనిండి, చింత నిప్పుల వలె నున్న యెర్రని కన్నులతో దక్షుడిట్లనెను ''బ్రహ్మర్షు లయిన మీరందరూ యిక్కడ సమావేశమైనారు మీ అందరి సమక్షములో మహాదేవుడు నన్ను అవమానపరచెను నా ప్రియ పుత్రిక సతిని యితనికిచ్చి వివాహము చేసితిని అందుమూలముగానైనా అతడు నన్ను గౌరవించవలసి యున్నది నేను అతనికి గురువుతో సమానము. అతనికి ప్రాథమిక మర్యాదలు కూడ తెలిసినట్లు కనబడదు అహంకారముతో ఉబ్బియున్నాడు నేను ప్రవేశించగనే గౌరవపూర్వకముగా నాతో మాట్లాడనుకూడ లేదు ఇటువంటి అమర్యాదకర వ్యక్తికి నా కుమార్తె నిచ్చినందుకు విచారిస్తున్నాను. ఒక అప్రయోజకునకు నా కుమార్తె నిచ్చి చాలా పొరపాటు చేసితిని ఇతనికి ప్రవర్తించవలసిన తీరు తెలియదు, మలినుడు, మర్యాదా దూరుడు, అన్నిటికన్న మిక్కిలి గర్విష్ఠి. ఇట్టి దౌర్భాగ్యునకు నా పుత్రిక నిచ్చితిని ఉచ్చరించుట తెలియని వానికి వేదములను బోధించినట్లున్నది.

''ప్రేత భూత పిశాచములు సంచరించే శ్మశానము యితని నివాస స్థలము జడలు కట్టిన కేశములతో దిగంబరముగా శ్మశానమందు సంచరించును మతి తప్పిన వానివలె కొంచెముసేపు నవ్వుచు, కొంచెముసేపు యేడ్చుచు ఉండును శరీరమునకు బూడిదను పూసుకుని, మెడలో పుర్రెలతో కట్టిన దండ ధరించి తిరుగుచుండును.మానవుల యెముకలు యితని ఆభరణములు నిజముగా యితడు 'అశివుడు', కాని 'శివు'డ ' కో అధమమైన తమస్సుతో నిండి, అహంకారముతో ఉబ్బియున్నాడు ఇతని సహచరులు కూడ యితని లక్షణములవారే. నా తండ్రి బ్రహ్మ ఆదేశించుటచేత నా కుమార్తె సతిని యితనికిచ్చి వివాహము చేసితిని అందుకు యిప్పుడు చాలా చింతిస్తున్నాను''

దక్షుడు చేతిలో జలము వేసుకుని, మహాదేవుని శపించబూని యిట్లనెను ''దైవము లందరిలో అధముడైన యీ మహేశ్వరునకు, ఇంద్ర ఉపేంద్రాది దేవతలకు వలె యజ్ఞ హవిస్సు నందు భాగము లేకుండుగాక''.

మహాదేవుని శపించిన తర్వాత దక్షుడు ఒక క్షణమైనను అక్కడ నిలువక తన యింటి కేగెను మహాదేవునికి అత్యంత భక్తుడైన నందికేశ్వరునకు, దక్షుడు మహాదేవుని యెడల ప్రవర్తించిన తీరునకు ఆగ్రహము కలిగెను

తన దైవమైన మహాదేవునికి తీవ్ర అవమానము జరిగినదని భావించెను నందికేశ్వరుడు లేచి నిలబడి యిట్లనెను ''ఈ దక్షుడు మూర్ఖుడు తాను చాలా గొప్పవాడనని తలచి, మహాదేవుడు యెవరో మరిచిపోయెను మహాదేవుని నిజ స్వభావము యెరుగని వ్యక్తి నిర్భాగ్యుడు ఇకనుంచి అతడు భగవదనుగ్రహమునకు దూరమగును ఆకలి దప్పులను తీర్చుకునే పశువుకన్న అతడు గొప్పకాదు తెలివితేటలు లేని మేకవంటి వాడు దక్షుడు ఇక నుండి అతని తల మేక తల యగును

''మహాదేవుని దక్షుడు శపించినపుడు మౌనము వహించిన యీ ఋషులు అందరూ యిందుకు బాధపడె దరు దక్షుని అనుయాయులు యికముందు జనన మరణమను సంసార చక్రములో చిక్కుకొందురు వారు తమ నిజ స్వభావము మరిచి, బ్రహ్మమునకు దూరమగుదురు ప్రాపంచిక విషయములందు కోరికలు కలిగి వానిని తీర్చుకొనుటలో నిమగ్నమై యుందురు. నిత్య విధులను నెరవేర్చుటలో కాలము వినియోగించుచు, తపస్సుకు దూరమై నియమము తప్పి సంచరించుదురు పొగడ్తలకు లొంగిన వారి మనస్సులు అజ్ఞానముతో నిండి లోక విషయములందు తగుల్కొని యుందురు. ఆహారమునకై వారు బిచ్చమెత్తుకొనవలసి వచ్చును. దక్షునకు ప్రోద్బలము నిచ్చిన వారందరికీ నేనిచ్చు శాపమిది.'' అక్కడ సమావేశమైన ఋషులలో ప్రధానుడైన భృగువు నందికేశ్వరుని మాటలకు ఆగ్రహము చెంది యిట్లనెను ''మహాదేవుని అనుయాయులను శపించెదను మహాదేవుని పూజించి అతడు చాలా గొప్పవాడని తలచు వారందరూ పాషండులుగా పేరొందెదరు, అనగా వారు వెనుకొకమాట ముందొకమాట చెప్పవారుగా నుందురు వేదములు ప్రతిపాదించిన కర్మలను చేయుటకు వారు అనర్హులగుదురు వారు వేదములను వ్యతిరేకించెదరు వారు అపరిశుభ్రముగా, మూర్ఖులై యుందురు. మహాదేవుని వలె వారి కేశములు జడలుకట్టి యుండును. వారి ప్రభువు వలె, యెముకలు ఆభరణములుగా ధరించి, శరీరమునకు బూడిద పూసుకొందురు వారు సురాపానము చేయుదురు. నాలుగు ఆశ్రమములకు ఆధారమైన వేదములకు వ్యతిరేకులగుటచేత, సంఘ నీతి నియమములను పాటించక లోకములో సంచరించె దరు వారు నీతి బాహ్యమైన విధానము లవలంబించి పూజించుటచేత లోకములో వారినందరూ అసహ్యించు కొందురు

''వేదముల నవమానించుటయే ధ్యేయముగా కలిగిన ఒక మతమును యేర్పరచెదరు మహాదేవుని పూజించువారు, అనేక సంవత్సరములుగా వేదములను పూజించుచూ, సాధువులేర్పరిచిన మార్గములో సంచరిస్తూ, వేదములు నారాయణుని అంశమని వాటిని గౌరవించే వారికి భిన్నముగా నుండెదరు పాషండులం దరూ అధమమైన తమోగుణముతో నిండి యుందురు''

ఇంతవరకు మౌనముగా కూర్చుని యున్న మహాదేవుడు లేచి విచార వదనముతో యజ్ఞశాలనుండి తన అనుయాయులతో బయటకు వెడలెను.

నిర్ణీతమైన వేయి సంవత్సరములు పూర్తయిన తర్వాత సత్రయాగము సమాప్తమయ్యెను. యాగ నిర్వాహ కులు గంగా యమునల సంగమ ప్రదేశమునకు వెళ్ళి, స్వచ్ఛతను సంతృప్తిని పొందిన మనస్సులతో తిరిగి వారి ఆశ్రమములకేగిరి.

# 36 కైలాసములో కలహము

బ్రహ్మ సత్ర యాగములో జరిగిన సంఘటన గడచి చాలా సంవత్సరములాయెను ప్రజాపతులందరిలో దక్షుని ప్రప్రథముడుగా యెంచి బ్రహ్మ అతనికి పట్టాభిషేకము చేసెను దీని పర్యవసానముగా యిదివరకు కన్న అహంభావము, గర్వము పెరిగెను మహాదేవునిపై తనకున్న ఏహ్యాభావము ప్రకటించుటకు 'బృహస్పతి సవ' మను యజ్ఞమును ప్రారంభించెను బ్రహ్మర్షులు, దేవర్షులు, పితృదేవతలు, దేవతలు యజ్ఞము చూచుటకు వచ్చిరి

తండ్రి జరుపుతున్న యజ్ఞము గురించి మహాదేవుని భార్య సతీదేవి వినియుండెను చక్కగా నలంకరించు కొని అనంత ప్రవాహముగా సాగిపోవుచున్న స్త్రీ పురుషులు యజ్ఞమునకు పోవుచుండుట ఆమె చూచెను ఆమె భర్త వద్దకు వెళ్ళి యిట్లనెను. ''మీ మామగారు, నా తండ్రి, గొప్ప యజ్ఞమును ప్రారంభించెను మనము కూడ పోవుదము దేవతలు, ఋషులు వారి భార్యలతో అక్కడకు వచ్చియున్నారు యాగశాలవైపు ప్రజలింకను వెళ్లుచునే యున్నారు కాబట్టి యింకా సమాప్తి కాలేదని తోచుచున్నది నాధా! నాకు వెళ్ళవలెనని యున్నది నా తల్లిని, అక్క చెల్లెండ్రను చూచి చాలా కాలమైనది వెళ్ళి యజ్ఞము చూడవలెనని ఆత్రముగా నున్నది.

''మీరు యీ లోకమునకు ప్రభువైయుండి, యీ యజ్ఞము సామాన్యమైనదిగా పరిగణిస్తున్నారు నేనొక స్త్రీని నా తండ్రి జరుపుచున్న యజ్ఞము చూచుటకు నాలో కలిగిన కుతూహలమును నివారించలేక పోవుచున్నాను మీ ముఖమును చూడగా మీ మనోభావ మీ విధముగా నున్నట్లు నాకు గోచరించుచున్నది 'మనలను ఆహ్వానించలేదు' ఆహ్వానించకపోయిననేమి? సత్పురుషులు తమ యజమాని, గురువు, తండ్రి, స్నేహితుల గృహములకు వెళ్ళుటకు ఆహ్వానమునకై వేచి యుండనక్కరలేదు నాయందు దయతలచి, యజ్ఞమును చూడ తహతహపడుతున్న నా కోర్కెను తీర్పుడు నన్ను అక్కడకు తీసుకువెళ్ళి నాకు సంతోషము కలిగింపరా?''

మహాదేవుడు చిరునవ్వు నవ్వి, దీనవదనముతో తన భార్యవైపు చూచెను ఆత్రముతో నిండిన ఆమె ముఖము చూచి, ఆమె కోరికను తీర్చలేకపోవుచున్నందుకు విచారించుచుండెను ఆ రోజు కఠినముగా పలికిన దక్షుని మాటలు గుర్తుకు వచ్చెను మహాదేవు డామెతో యిట్లనెను. ''ప్రియ పత్నీ, సతీ! ఆహ్వానించక పోయినప్పటికీ, నీ తండ్రి అందరివలె నున్నట్లయితే అతని యింటికి నీవు వెళ్ళవలెనను ఆలోచనను నేను అంతగా పట్టించుకొనవలసిన పనిలేదు. కాని, నీ తండ్రి దక్ష ప్రజాపతి గర్వముతో మదించి యున్నాడు అధికారపు మత్తులో అతడు మనకు తగిన గౌరవమును చూపకపోవచ్చును నీ తండ్రికి అనేక గొప్ప గుణములు విద్య, తపస్సు, సంపద, రూపము, వయస్సు, ఉత్తమ జన్మము - కలవు సత్పురుషులందు యీ గుణములు మంచి ఆభరణములుగా ప్రకాశించును కాని యీ గుణములు నీ తండ్రిలో గర్వమును పెంచెను 'నేను విద్యావంతుడను', 'నేను గొప్ప తపస్విని' అను భావములు అతనిలో గర్వమును పెంచి, నన్ను చూచి ఓర్వలేకున్నట్లు చేయుచున్నవి. గర్వము అనేక రకములు. తపో గర్వము అన్నిటికన్నా అధమమైనది. నీ తండ్రికి యీ తపోగర్వమనే రోగము సంప్రాప్తించినది.

''శత్రువు ప్రయోగించిన బాణముకన్న, దగ్గర బంధువు వలన కలిగే బాధ చాలా తీవ్రమైనది. శత్రు బాణము తెలివి తప్పి పడిపోవునట్లు చేయును అందువలన చాలాసేపటి వరకు ఆ బాధ తెలియదు నీకు తెలియదా?

నీ యెడల నీ తండ్రికి మిక్కిలి ప్రేమ అతని సంతానములో అందరికన్న నీపై మిన్నగా ప్రేమ కలదు. కాని, నేనన్న యిష్టము లేదు నేను తనను అవమానపరచినట్లు భావించి, నన్ను ద్వేషింపసాగెను అందుచేత నువ్వు ఆశించుచున్నట్లు నిన్ను ప్రేమ పూర్వకముగా ఆదరించడు అతని ఆగ్రహమునకు కారణము బహుశః నీకు తెలియకపోవచ్చు ఒకప్పుడు అతను యజ్ఞశాలలో ప్రవేశించినపుడు, అందరూ లేచి అతనికి నమస్కారము చేసిరి నేను అట్లు చేయలేదు ఎందుచేతనో నీకు తెలుసా? ఒక వ్యక్తి లేచి మరొక వ్యక్తికి నమస్కరించినపుడు, దానిని ప్రత్యుద్గమనము మరియు అభివందనమని అందురు. దీనికొక విశిష్టమైన అర్థము కలదు 'తనలోని పు ని పురుషునకు నమస్కరించుట' యని జ్ఞానులు చెప్పుదురు చేయు నమస్కారము వ్యక్తికి అనగా, అతని శరీరమునకు కాదు, అందరి శరీరములలో అంతర్గతముగా నుండే పురుషునకు కాని నీ తండ్రి తనకు నమస్కారముచేసి గౌరవించవలెనని భావించెను నేను అట్లు చేయలేకపోతిని ఒక సత్పురుషుడు అహంభావముతో నిండిన వ్యక్తిని కలుసుకొన్నపుడు, అతనిలోని ఆత్మ తన్ను కలుషితమైన మనోబుద్ధులు ఆవరించియుండుటచే కన్పింపక యుండును అటువంటప్పుడు సత్పురుషులు వారికి నమస్కరించుట జరుగదు.

''చాలా కాలము క్రితము నీ తండ్రి నన్ను కించపరచుచు మాట్లాడెను అందరిలో నన్ను చాలా క్రూరముగా అవమానించి శపించెను దేవతలకు అర్పించు యజ్ఞ హవిస్సులో నాకు భాగము లేకుండునట్లు చేసెను అతడు నీకు తండ్రియే కాని అతడు అతని అనుయాయులు నాకు శత్రువులు నీవు నా భార్యవగుటచేత వారి దృష్టి నీపై పడుట నాకు సహింపరానిది''.

సతీదేవి మౌనముగా తన భర్త మాటలను వినెను అతడామెను చూచి ఆమెలో విజృంభించు ప్రతీకార భావములను పసిగట్టెను ఆమె మనస్సులో కలిగే ఆలోచనలను అతడు ఊహించగలిగెను కాని అతడు దృఢమనస్కుడై ఆమెతో యిట్లనెను ''నా మాటలు ఉల్లంఘించి నీవు వెళ్ళుటకు నిశ్చయించినచో, నీకు శుభము కలుగబోదని నిశ్చయముగా చెప్పగిలను ఆత్మాభిమానముగల వారికి తమ దగ్గర బంధువుల అవమానము పొందినపుడు మరణమే గత్యంతరము నీకు ముందుగానే చెప్పుచున్నాను నిన్ను అక్కడ యెవ్వరూ సాదరముగా ఆహ్వానింపరు, యెందుకనగా యిప్పుడు నీవు దక్షుని తనయవుకావు, మహాదేవుని సహధర్మచారిణివి''

సతి చాలా విచారముగా నుండెను భర్త ఆమెను వెళ్ళవలదనెను. తన యిష్టమునకు వ్యతిరేకముగా ఆమె వెళ్ళినచో తీరని నష్టము కలుగునని తెలిపి ఆమె వెళ్ళకూడదనెను. కాని ఆమె మనస్సు తన ప్రియ బంధువులందరు నున్న యజ్ఞశాల యందే యుండెను. ఏమి చేయుటకు నిశ్చయించుకొనలేక తన గృహములో అటు నిటు తిరుగుచుండెను ఏమియు మాట్లాడక, మహాదేవుడు ఆమెను గమనించుచుండెను ఆమెను తన వారి వద్దకు వెళ్ళకుండా భర్త వారించుట చేత ఆమె కన్నులు అశ్రువులతో నిండియుండెను ఆమె కోరిక తీర్చుట కతడు యిష్టపడకున్నందున, స్త్రీలకు సహజముగా కలిగే కోపముతో అతనివైపు ఆమె చూచుచుండెను ఆమె కోరిక చాలా స్వల్పమైనది, కాని ఆమె భర్త దానిని తీర్చకుండెను చివరకు ఆమెలోని స్త్రీత్వము గెలిచెను.

భర్తలో అర్ధభాగమైన తాను, భర్తను విడిచి నిట్టూర్పులతో యజ్ఞశాలకు వెళ్ళుటకు నిశ్చయించుకొనెను వెనుకకు తిరిగి చూడక సూటిగా తొందరగా బాణమువలె దూసుకొనిపోయెను. మహాదేవుని సేవకులు ఆమె

వెంట వెడలిరి వారు ఆమెను నందిపై కూర్చుండబెట్టి యజ్ఞశాల వైపుగా తీసుకొని వెళ్ళిరి మహాదేవుడు ఏకాకిగా కూర్చుని విచారమనస్కుడై యుండెను.

## 37 సతీదేవి ఆత్మత్యాగము

దూరము నుండియే సుస్వరమైన వేద పఠనమును సతీదేవి వినసాగెను. ఆ స్థలము చేరుకొనగనే ఆమె గొప్ప ఋషులు, దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులతో నిండిన యజ్ఞశాలను చూచెను ఆమె గమ్యమును చేరెను యజ్ఞశాల స్వర్గమువలె ప్రకాశించుచుండెను ఆమె అందరివైపు చూచి, తర్వాత తండ్రివైపు చూచెను. దక్షుడు ఆమెను ఆపాదమస్తకము చూచియు ఆమె అక్కడ లేనట్లు నటించెను ఎవ్వరికిని దక్షుని యెదిరించి సతీదేవిని పలుకరించి ఆహ్వానించుటకు ధైర్యము లేకపోయెను ఆమె తల్లి, అక్కచెల్లెండ్రు ఆమెను కౌగలించుకుని తమ సంతోషమును వ్యక్తపరచిరి. ఆమెను వారు ఆట పట్టింపజూచిరి, కాని ఆమె అట్లు జరుగనివ్వలేదు తండ్రి నిర్లక్ష్యమునకు గురియైన సతి యింకెవరిని చూచుటకు యిష్టపడకుండెను

కొంతసేపటికి ఆమె తన భర్తను అవమానించుటకే యీ యజ్ఞము జరుగుచున్నదని, యజ్ఞ హవిస్సులో భాగము తన భర్తకు ఉండదని గ్రహించెను. మహాదేవుడు ఊహించి చెప్పినట్లే అన్నియు జరుగుచుండెను మహాదేవునికి భార్య అగుటచేత ఆమెను వారు నిర్లక్ష్యము చేయుదురని అతడు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చెను. కాని, తన తెలివి తక్కువతనముచేత భర్త మాటలను పెడచెవిని పెట్టెను. ఆమె యిల్లు వదలుటకు ముందు చివరసారిగా నిస్పృహతో విచారముతో నిండిన అతని ముఖము జ్ఞప్తికి రాగా, ఆమె కన్నులలో కోపము మెరిసెను. ఆమెకు అమితముగా కలిగిన కోపముచేత నోటివెంట మాటలు స్పష్టముగా పెదవులు దాటి రాకుండెను. క్రోధముతో పెదవులు వణకుచుండెను. కన్నులు యెర్రబడెను. ఆమె శరీరమంతయు పొగలేని నిప్పువలె ఉండెను తండ్రినిచూచి సతీదేవి యిట్లనెను. ''నీవు యెంత తెలివితక్కువవాడవు! ఈ లోకమున సాటిలేని ప్రభువు (మహాదేవుడు)ను నీవు శత్రువుగా పరిగణించుచున్నావు నీవంటి మూర్ఖులే ఆ విధముగా భావించెదరు ప్రజలను అనేక రకములుగా విభజించవచ్చును. మొదటి రకము అధములు. వీరిని 'అసాధువు'లం దురు. ఇతరులలోని దోషములనే వీరు చూచెదరు. మంచిని వారి కనులు చూడలేవు. రెండవ తరగతి వారు మధ్యములు. ఇతరులలో మంచిని చెడునూ కూడ వీరు చూడగలరు. మూడవ రకము వారు యితరులలోని మంచి చెడ్డ గుణములను చూచి, సందర్భమును పురస్కరించుకుని విచక్షణతో వ్యవహరించెదరు వారిని సజ్జనులందురు వీరిలో ఉత్తములు యితరులలోని దోషముల నెంచక మంచినే కనుగొని వర్తించెదరు ఉత్తమోత్తమ జీవులు దోషములను కన్నెత్తి చూడరు; అసలు దోషములు వారికి గోచరించవు. ఇతరులలో మంచిని, అది యెంత స్వల్పమైనను, మెచ్చుకుని అభినందింతురు. ఎదుటివారిలో అనేక దోషములున్నను వాటిని విస్మరించెదరు

''నీవు అధమాధముడవు. లేని దోషములు నీకు కనిపించును. ఇతరుల గొప్పదనము గుర్తించలేని నీ వంటి వారు యిట్లుండుటలో అసహజమేమియు లేదు. నా భర్త నిన్ను ఉపేక్షించెను. నీ ప్రవర్తన అతని నేమియు చేయలేదు. కాని నాకు చాలా బాధగా నున్నది. నేను సహించలేకపోవుచున్నాను. నా భర్తను 'శివు'డని పిలిచెదరు

అనగా పవిత్రము, స్వచ్ఛము, మంగళకరమైన వాడు. నీవు అశివుడవు కాబట్టి నా భర్తను నీవు ద్వేషించుచున్నావు.

''భక్తుడు, తన దైవమును యెవరైన అవమానించినట్లయితే వారిని దండించునని పెద్దలు చెప్పుదురు అట్లు చేయుటకు వీలుకానిచో, లేక అవమానించిన వారి నెదిరించుటకు తగిన బలము లేకున్నచో, భక్తుడు ఆ స్థలము విడిచి దూరముగాపోయి, కనీసం అవమానకరమైన మాటలను వినకుండా యుండవలెను. దైవద్వేషి ఆడిన అవమానకరమైన మాటలను విన్న తర్వాత నిజమైన భక్తుడు జీవించవలెనని కోరడు. శివద్వేషివైన నీకు కుమార్తెగా జన్మించినందుకు నాపై నాకు అసహ్యము కలుగుచున్నది నీవంటి పాపాత్మునికి కుమార్తెను కావడంచేత నాపై నాకు ద్వేషము కలుగుచున్నది. ఇకముందు నన్ను 'దాక్షాయణి' యని పిలుచుట నాకు యిష్టము లేదు ఇంతవరకు జీవించినది చాలు ఈ శరీరమును వదలిపెట్టెదను ''

ఆ తర్వాత సతీదేవి యింకేమియు మాట్లాడ కూరకుండెను. బంగారు వన్నె దుస్తులను ధరించిన సతి కూర్చుని కనులు మూసుకుని యోగ సమాధిలోనికి వెళ్ళెను అందరూ ఆమెను గమనించుచుండిరి మనో విగ్రహముతో ఆలోచనల నరికట్టి, తనలో ప్రవేశింపమని అగ్నిదేవత నాహ్వానించెను ఎవ్వరూ పెదవి విప్పలేదు ఉన్నట్లుండి ఆమె శరీరము, ఆహూతుడైన అగ్నిలో దగ్ధమై కొద్ది క్షణములలో బూడిద అయ్యెను

## 38 మహాదేవుని ఆగ్రహము

సతీదేవి తన్ను తాను దహించుకొనగా, ఆమె సేవకులు తమ ప్రభ్వి మరణమునకు ప్రతీకారముగా దక్షుని చంపుటకు బయలుదేరిరి. వారి రాకను కనిపెట్టి భృగు మహర్షి ఒక మంత్రము నుచ్చరించి అగ్నిలో ఘృతము సమర్పించెను ఈ మంత్రము యజ్ఞమున కంతరాయము కలిగించువారిని నాశనము చేయును. అగ్ని నుండి వేయికి మించి 'రిభు' అనే ప్రజలు ఒక్కసారిగా పుట్టిరి. మహాదేవుని సేవకులతో యీ రిభులు పోరాడి, వారిని వెనుకకు తరిమివేసిరి.

ఇంతలో నారదుడు మహాదేవుని వద్దకు వెళ్ళి యజ్ఞశాలలో జరిగినదంతయూ - సతీదేవి దారుణ మరణము, భృగువు మంత్రశక్తిచేత ప్రమథగణముల ఓటమి - పూసగ్రుచ్చినట్లు చెప్పెను

మహాదేవుడు ఆశ్చర్యపడలేదు ఇటువంటిదేదో జరుగగలదని అతడు యింతకు పూర్వమే ఊహించి యుండెను. అతని విచారము క్రోధముగా మారెను ఆ కోపములో జడలు కట్టిన కేశములలో నొకదానిని ఊడదీసి నేలపై విసిరెను. అందుండి అగ్ని రూపము వలెనున్న వీరభద్రుడు జన్మించెను అతడు చూచుటకు చాలా భయంకరముగా నుండెను అతడు భూమికి స్వర్గమునకు గల దూరమును కొలువగలిగినంత పరిమాణములో నుండెను అతనికి వెయ్యి భుజములు; కనులు నిప్పులవలె నుండెను. అతని శరీరము మేఘమువలె నల్లగా నుండి, కనుల నుండి అగ్ని చిమ్ముచుండెను మహాదేవునివలె అతని మెడలో పుర్రెల దండ గలదు. అతడు మహాదేవుని పాదములపైబడి యిట్లనెను ''నేనేమి చేయవలెనో ఆజ్ఞాపించరాదా?'' మహాదేవుడు ''వెళ్ళుము దక్షుని యజ్ఞశాలకు వెళ్ళి, దక్షుని చంపి ఆ యజ్ఞశాలను నాశనము చేయుము''

అని చెప్పెను

మహాదేవుని సేవకులు వెంటరాగా వీరభద్రుడు త్వరితముగా యజ్ఞశాలవైపు వెడలెను. ఒక భయంకరమైన హాహాకారము అతని నుండి బహిర్గతము కాగా, అతడు చేతిలో త్రిశూలము ధరించి పవిత్ర స్థలమును చేరెను ప్రమథ గణములు అతని వెంట నడువగా, వారి పాద ధూళి రేగి బ్రహ్మాండముగా యజ్ఞశాల యందు విస్తరించెను. అది చూచి యజ్ఞశాలలో నున్నవారు యేమి జరుగుచున్నదో తెలియక ఆత్రముతో చూచుచుండిరి. ''ఉత్తరదిక్కుగా యేమి జరుగుచున్నది?'' అని ఒకరినొకరు ప్రశ్నించు చుండిరి. ''అప్పుడే చీకటి పడుటకు సమయము ఆసన్నము కాలేదు బహుశః ధూళి మేఘము కావచ్చు. ఎచ్చటనుండి యీ ధూళి వచ్చుచున్నది? గాలి వీచుటలేదే బహుశః గొప్ప ప్రళయము సంభవించనున్నది కాబోలు'' అని వారిలో వారు అనుకొనిరి

దక్షుని భార్య ప్రసూతి యేదో గొప్ప ఆపద సంభవించనున్నదని భయపడెను తన కుమార్తె అవమాన మొంది, ఆ తర్వాత ఆమె శరీరము తన కనుల ముందే దహించుకొనిపోవుట చూచిన ప్రసూతి, యిటువంటి అవాంతర పరిస్థితి కలుగగలదని తలపోసెను మహాదేవుని గొప్పతనము ఆమె యెరుగును అట్టి మహాదేవుని యెదిరించినవారు క్షేమముగా యెట్లుండగలరు? కొద్ది క్షణములలోనే వీరభద్రుని నాయకత్వములో కోపోద్రిక్తులై యున్న ప్రమథగణములు యజ్ఞశాలను చుట్టుముట్టిరి అల్లకల్లోలము చెలరేగెను. ప్రతివారు పారిపోవుటకు ప్రయత్నించుచుండిరి మణిమంతుడు భృగువును పట్టుకొనెను వీరభద్రుడు తన దీర్ఘమైన బాహువులందు దక్షుని బంధించెను చండికేశ్వరుడు పూషుని, నందికేశ్వరుడు భృగుని తమ బాహువులతో బంధించిరి భృగువు పెదవులపైనున్న మీసమును వీరభద్రుడు లాగివేసెను. సతిని అలక్ష్యము చేయుటలో దక్షునికి పురి యెక్కించిన భృగుని కనురెప్పలను ఊడబెరికి, అతని రెండు కన్నులనూ పొడిచివేసెను బ్రహ్మ సత్ర యాగములో దక్షుడు మహాదేవుని అవమానించినపుడు, అనుచితమని యెంచక నవ్విన పూషుని (భాస్కరుని) పళ్ళను, మహాదేవుడు పంపగా వచ్చిన భయంకర వీరభద్రుడు విరగగొట్టెను.

దక్షుని గుండెలపై వీరభద్రుడు కూర్చుండి అతని తలను నరుకుటకు ప్రయత్నించెను. కాని అతడట్లు చేయలేకపోయెను ఏమి చేయుటకు తోచక కొద్దిసేపు అట్లే యుండెను. ఏ ఆయుధము చేతను దక్షుని చంపుటకు సాధ్యము కాకుండెను దక్షుడు యజ్ఞమును జరుపుచుండుటచేత, ఆయుధములేవీ పనిచేయవని వీరభద్రుడు గ్రహించెను అప్పుడేమి చేయవలెనో వీరభద్రునికి తెలియవచ్చెను వీరభద్రుడు తన చేతులను దక్షుని మెడచుట్టూ వేసి, ఉక్కిరి బిక్కిరి చేసెను. దక్షుని తలను శరీరము నుండి వేరుచేసి యజ్ఞాగ్నిలో పడవైచెను యజ్ఞశాలను పూర్తిగా నాశనము చేసి, వీరభద్రుడు ప్రమథగణములతో తిరిగి కైలాసము చేరెను

## 39 మహాదేవుని క్షమ

యజ్ఞశాల నాశనమైన తర్వాత సజీవులుగా మిగిలిన కొందరు బ్రహ్మకడకేగి, జరిగిన మహాదారుణ ఉదంతమును వివరించిరి. మహాదేవుడు లేని ఆ యజ్ఞమునకు బ్రహ్మ, విష్ణువు కూడ రాలేదు. కేవలము మహాదేవుని అవమానించుటకు యీ యజ్ఞమును తలపెట్టుట వారు రాకుండుటకు మరొక కారణము యజ్ఞశాలలో జరిగినదంతయు వినిన బ్రహ్మ వారితో యిట్లనెను ''అతి శక్తివంతుడైన వ్యక్తి ఒక అపచారము

చేసిన, ఆ శక్తిని పురస్కరించుకుని అతని అనుయా                                    దించుట చాలా అనుచితము, గర్వము అది మంచిది కాదు మీరందరూ దక్షుని పక్షము వహించిరి దక్షుడు యజ్ఞమును జరుపుచుండగా, ఆ యజ్ఞము మహాదేవుని అవమానించుటకు తలపెట్టినదని తెలిసి కూడ మీరు ఆ యజ్ఞమునకు వెళ్ళిరి మీరు మహాదేవుని యెడ అపచారము చేసితిరి కాబట్టి, మీరు చేయగలిగినది మహాదేవుని పాదముల మీద పడి క్షమించమని ప్రార్థించుటకన్న వేరే గత్యంతరము లేదు. మహాదేవునికి తీరని అపచారము జరిగినది అతని భార్య సతీదేవి యెడల దక్షుడు ప్రవర్తించిన తీరు మహాదేవునికి తీవ్ర మనస్తాపము కలిగించినది దక్షుని కారణముగా సతీదేవి మరణించెను మహాదేవుని ఆగ్రహము కొనసాగిన, యీ లోకమే నశించగలదు వెంటనే మహాదేవుని వద్దకు వెళ్ళి అతనిని శాంతింపజేయుడు''.

ఆ తర్వాత బ్రహ్మ మహాదేవుని నివాసమైన కైలాసమునకు వెళ్ళెను అది అత్యంత రమణీయమైన ప్రదేశము అచ్చట నంద అను నది పారుచుండెను కైలాస పర్వతమున కెదురుగా కుబేరుడు పరిపాలించు అలకా నగరముండెను బ్రహ్మతో వచ్చిన దేవతలు అచట నిలబడి సరస్సులో తేలియాడుచున్న సౌగంధిక పద్మములను వీక్షించుచుండిరి నందానది, ఆమె తోబుట్టువు అలకనంద, యిరువురూ కూడ అలకా నగరము నుండి ప్రవహించుచుండిరి

అక్కడ ఒక పెద్ద మర్రిచెట్టు క్రింద తపస్సులో నిమగ్నమైయున్న మహాదేవుని వారు కాంచిరి అతని కుడిచేతిలో పూసలదండ కలదు చేతులు జోడించి, దేవతలు వెంటరాగా, బ్రహ్మ మహాదేవుని సమీపించి మృదువుగా మాట్లాడ మొదలిడెను మహాదేవుని కీర్తించుచూ మాట్లాడసాగెను బ్రహ్మ మాటలలో అభ్యర్థన యిమిడి యుండుట అక్కడ ఉన్న దేవతలకు గోచరించెను. మహాదేవుడు యోగము నుండి లేచెను బ్రహ్మ అక్కడ ఉండుట గ్రహించి, లేచి నిలబడి శిరస్సు వంచి బ్రహ్మకు వినయపూర్వకముగా నమస్కరించెను అక్కడ ఉన్నవారు కూడ శిరస్సు వంచి బ్రహ్మకు నమస్కరించిరి వారి నమస్కారములను చిరునవ్వుతో స్వీకరించి, మహాదేవునితో బ్రహ్మ యిట్లనెను ''ఈ లోకమునకు, మనస్సుకు, ఇంద్రియములకు ప్రభువైన నీవు యీ ప్రజలపై కోపమును విడనాడవలెను అమాయకుల దోషములను మన్నించవలెను ఆగిపోయిన దక్ష యజ్ఞము పరిసమాప్తి యగునట్లు అనుగ్రహింపుము హవిస్సులో నీకు భాగము లేకుండజేసిన యజమానులను క్షమింపుము వికలాంగులైన వారినందరినీ తిరిగి పునరుద్ధరింపుము వారందరినీ క్షమింపుము''

చిరునవ్వుతో మహాదేవుడు అందరితో యిట్లనెను ''యజ్ఞములో పాలుపంచుకున్న అందరిపై నాకు కోపము లేదు కాని దక్షుని శిక్షింపవలసి యుండెను. అతని గర్వమును అహంకారమును నివారించవలసి యుండెను. అతని కారణముగా యితరులు కూడా శిక్షకు గురియైరి మేక తలతో తిరిగి దక్షుడు జీవించవచ్చును నందికేశ్వరుని మాటలు వృథాకావు కదా! దక్షుని మనస్సు పూర్తిగా క్షాళనమై యున్నది వికలాంగులైన వారందరూ అంగవైకల్యము పోయి తమ నిజ స్వరూపమును పొందగలరు''

తమతో యజ్ఞశాలకు రావలసినదని బ్రహ్మ మహాదేవుని అడిగెను మహాదేవుడందు కంగీకరించెను మహాదేవుడు చెప్పినట్లు అన్నియు నిజమయ్యెను దీర్ఘ నిద్రనుండి లేచినట్లుగా దక్షుడు లేచి దేవతలకు, బ్రహ్మకు, మహాదేవునికి యెదుట తానున్నట్లు గ్రహించెను మహాదేవుని యెడ ద్వేషముచేత మలినమైన దక్షుని మనస్సు యిప్పుడు ప్రశాంత సరస్సులోని జలమువలె నిర్మలముగా నుండెను దక్షుడు మాట్లాడబోయెను, కాని మాటలు రాకుండెను దుఃఖము ముంచుకు వచ్చెను తన మూలముగా తన ప్రియ పుత్రిక సతీదేవి

మరణించవలసి వచ్చినదని, తండ్రిగా తాను, అమె భర్త వైభవమును గాంచలేక గ్రుడ్డి వాడనైతినని, ఆలోచనలు రాగా, దుఃఖము కట్టలు త్రెంచుకొని వచ్చెను. అప్పుడు దక్షుడిట్లనెను. ''నేను నిన్ను అవమానించుటచేత నీవు నన్ను శిక్షించినావని యీ లోకము భావిస్తున్నది. కాని, నిజముగా నీవు నన్ను అనుగ్రహించినావు. నీకు విష్ణువునకు మానవాళిపై అమితమైన ప్రేమ గలదు సర్వమూ తెలుసుననుకునే అమాయక బ్రాహ్మణులను చూచి చిరునవ్వు నవ్వి, వారి తెలివి తక్కువ తనమును లక్ష్యపెట్టక, వారి యెడల దయ కలిగియున్నావు. అటువంటప్పుడు, నా తండ్రి ఆదేశము ప్రకారము నడుచుకొనుచున్న నన్ను నీవు శిక్షించినావని యెవరైనా యెట్లు ఊహించగలరు ఎంతో తెలుసుకొనవలసియున్న నేను యేమీ తెలియని వాడుగా నుండుట చాలా దురదృష్టకరము భ్రాంతిలో నుండుట చేత సత్యమును గమనించలేకపోతిని ఆ భ్రాంతి చేతనే నేను తెలివి తక్కువగా ప్రవర్తించితిని అందరి సమక్షములో, నిన్ను అవమానించినాను అయినప్పటికీ, నా యెడల అపారమైన కృపగలిగి యున్నావు నేను చేసిన వానిని లక్ష్యపెట్టక, నన్ను శుద్ధునొనర్చినావు నాకు పునర్జన్మను ప్రసాదించినావు, దీనిని సద్వినియోగము చేసెదను. నీ పాదములపైబడి క్షమించమని ప్రార్థించుట కన్న నేను చేయగలిగినది లేదు''.

యజ్ఞము తిరిగి కొనసాగెను నారాయణుడు రాగా త్రిమూర్తులు యజ్ఞమునకు అధ్వర్యము వహించిరి యజ్ఞ పిమ్మట, దక్షుడు త్రిమూర్తులను, దేవతలను, వచ్చిన అతిథులను తగు రీతిగా సత్కరించి గౌరవించెను అటు తర్వాత దేవతలు వారి స్వస్థానములకు వెడలిరి దక్షునిలో యిప్పుడు గర్వము అహంకారము అంతరించి సాధువుగా మారెను

సతీదేవి మాత్రము మరణించెను

## 40 బాలుని ప్రతిజ్ఞ

మనువు కుమారుడైన ఉత్తానపాదునకు యిద్దరు భార్యలు, సునీతి, సురుచి. సునీతి కుమారుడు ధ్రువుడు, సురుచి ఉత్తానపాద మహారాజునకు సునీతికన్న సురుచియందు ప్రేమ యెక్కువ.

ఒకరోజు తోటలో మహారాజు పుత్రుడు ఉత్తమునితో ఆడుకొనుచుండెను ఆ బాలుని తన ఒడిలో కూర్చుండపెట్టుకుని ఆడించుచుండెను ఇంతలో ధ్రువుడు అక్కడకు వచ్చి, తానుకూడ తండ్రి ఒడిలో కూర్చుండ గోరెను అతడట్లు కూర్చుండుటకు ప్రయత్నించుచుండగా, సురుచి దూరము నుండి చూచి, పరిగెత్తుకొని వచ్చి ధ్రువుని తండ్రి వద్ద నుండి లాగివేసి యిట్లనెను. ''మహారాజునకు నీవు పుత్రుడవు, కాని నీవు నా పుత్రుడవు కావు. అందుచేత నీ తండ్రి ఒడిలో కూర్చుండు అర్హత నీకు లేదు. అసాధ్యమైన దానికొరకు నీవు ప్రయత్నించుచున్నావు. నీ దురదృష్టమును నీవు గ్రహించ లేకున్నట్లున్నది మరొక స్త్రీకి నీవు పుత్రుడవగుట నీ దురదృష్టము ఉత్తముని వలె తండ్రి ఒడిలో కూర్చొను అర్హత పొందుటకు నీవు దీర్ఘ తపస్సు చేయవలెను వచ్చే జన్మలో సురుచికి కుమారుడుగా పుట్టవలెనని భగవంతుని ప్రార్థింపుము''.

ఆమె మాటలను మహారాజు వినుచుండెను. ఆమె యందు మిక్కిలి మోహము గలవాడగుటచేత ఒక్కమాట

కూడ పలుకకుండెను తన సవతి తల్లి పలికిన పరుషవాక్కులకు ధ్రువుడు బాధపడి, దెబ్బతిన్న సర్పమువలె బుసకొట్టుచూ, మౌనముగా నున్న తండ్రిపై నిందాపూర్వక దృక్కులు బరపెను. అక్కడ నుండి ధ్రువుడు తన తల్లి వద్దకు వెళ్ళెను. ఏమియు మాటాడక యేడ్చుచుండెను తల్లి తన ఒడిలో పెట్టుకుని సముదాయించి, సురుచి బలవంతముగా ధ్రువుని లాగివేయగా చూచిన వారినుండి జరిగిన వృత్తాంతము తెలుసుకొనెను ఏమియు చేయలేక సునీతి యేడ్వసాగెను. విచారములో మునిగి యున్నప్పటికీ ఆమె తన సహజమైన సరళ స్వభావమును వీడలేదు.

ఆమె పుత్రునితో యిట్లనెను. ''కుమారా! ఒక సత్యమును జ్ఞప్తియం దుంచుకొనుము. అది యేమనగా, ఒకరు మరొకరికి హాని తలపెట్టినప్పుడు, తలపెట్టిన వారికి హాని కలుగును. అందుచేత, యెప్పుడూ ఒకరికి హాని తలపెట్టకుము మహారాజుకు నాపై యిష్టము లేదు. సేవకురాలుగానైనా నేను సేవచేయుట అతని కయిష్టము. అటువంటి దౌర్భాగ్యురాలను నీకు తల్లినైనాను. సురుచి పలికినది నిజము. నీవు నాకు పుత్రుడవగుటచేత నీ తండ్రి ఒడిలో కూర్చునే అర్హత లేదు. నీ సవతి తల్లి పలికిన పలుకులకు బాధ కలుగుటచేత నీవు ఆమెపై ఆగ్రహము చెందవద్దు. పైగా, ఆమె చెప్పినట్లు చేయుము బాధితులకు ఆశ్రయుడు, ఉత్తమోత్తముడైన నారాయణుని ప్రార్థింపుము. సర్వ దేవతలకు, బ్రహ్మకు, నీ పితామహుడైన మనువుకు, యితర స్వర్గవాసులకు ఆశ్రయుడైన ఆ భగవంతుని పాదములే శరణ్యమని తలచి ఆశ్రయింపుము. భగవంతు నితో మాత్రమే అనుబంధము పెంచుకొనుము. అతని రూపమును కాంచి, నామము నుచ్చరింపుము భగవంతుని ప్రార్థింపుము అతడు నీ విచారమును పోగొట్టగలడు. నిన్ను ఓదార్చుటకు మరొక మార్గమేమియు నాకు కానరాదు''

తన శ్రేయస్సుకై తల్లి చెప్పినది ఆచరించుటకు దృఢముగా నిశ్చయించుకొనెను. తన తండ్రియున్న నగరము విడిచిపెట్టి, తపస్సు యెట్లు చేయవలెనో తెలియక సంచరించుచుండెను. నారదుడు తన యోగశక్తిచేత ధ్రువుని విషయము తెలుసుకొనెను. బహుశః అతనికి తన పూర్వ జన్మలో భగవంతుని అన్వేషించుచు బాలుడుగా సంచరించిన విషయము గుర్తుకు వచ్చి యుండవచ్చు తనలో తానిట్లనుకొనెను. ''ఈ బాలునికి సహాయపడవలెను ఇతడు క్షత్రియుడు, సవతి తల్లి మాటలు యితనికి బాధను కలిగించెను''. ధ్రువుడు ఉన్నచోట నారదుడు ప్రత్యక్షమై, ఆ బాలుని తలపై చెయ్యివేసి ఆశీర్వదించెను నారదుడా బాలునితో యిట్లనెను ''నీవు పసి బాలుడవు. నీకు అయిదు సంవత్సరములు మాత్రమే. బొమ్మలతో ఆటపాటలందు గడపవలసిన వయస్సు నీది. నీకు జరిగిన అవమానమును, నీ మనస్సుపై దాని ప్రభావమును చింతించుటకు తగిన వయసు నీకు లేదు ఈ లోకములో మంచీ చెడూ, మానావమానములు వారి కర్మల ఫలితమేగాని మరియొకటి కాదు. మానవుని భ్రాంతి చేతనే యివి కలుగుచున్నవి. భగవదనుగ్రహము నీకున్నచో, విచారము నీ చాయలకు రాదు. భగవదనుగ్రహమే కావలసినది. అది లేకున్నచో యెన్ని ప్రయత్నములు చేసిననూ అవి ఫలించవు. భగవంతుడు ప్రసాదించు సుఖ దుఃఖములను స్వీకరించుట నీ వంతు.

''నారాయణుని ఆశ్రయించమని నీ తల్లి నీకు చెప్పినది. నీవు తపస్సు చేసి నారాయణుని కనుగొనవలెనని తీర్మానించుకున్నావు. కుమారా! భగవంతుని మెప్పించుట సులభము కాదని నీకు తెలియునా? ఋషులు, యోగులు అనేక సంవత్సరములు తపస్సు చేసినప్పటికీ భగవంతుని చూడలేకుండిరి. ఇందుకు ధారణ అవసరము. త్యాగము, వైరాగ్యము, ఓర్పు చాలా అవసరము. ఒక జన్మనుండి మరొక జన్మకు యీ తపస్సు చేయవలయును అయినప్పటికీ, యింత చేసిననూ, భగవంతుని కనుగొనుట కష్టము. అందుచేత యీ

ప్రయత్నము విరమింపుము నీ మొండితనము వదలిపెట్టుము. కొంత కాలము తర్వాత చేయవచ్చును నీకు వృద్ధాప్యము వచ్చిన తర్వాత తపస్సు చేయవచ్చును. మానవుడు కొంత సుఖమును, కొంత దుఃఖమును అనుభవించవలెనని భగవంతుడు నిర్దేశించెను ప్రకృతి న్యాయమునకు యెదురు తిరుగుట సరికాదు జీవితములో సుఖములు అనుభవించుటచేత పుణ్యము తరుగునని, కష్టములు అనుభవించునపుడు పాపము తరుగునని జ్ఞానులు చెప్పుదురు అందుచే, సమదృష్టి కలిగి కష్ట సుఖములకు ప్రభావితము కాక యుండినచో, యీ రెండింటి నుండి విముక్తికలుగును నీకన్న అదృష్టవంతుని చూచినపుడు, అతనిపై అసూయ చెందరాదు అతని యెడ ప్రేమ చూపవలెను మంచి గుణములు లేని వానిని చూచినపుడు, అతనిని అసహ్యించుకుని ద్వేషింపక, జాలిపడవలెను నీతో సమానమైన వానిని చూచినపుడు అతనితో స్నేహముగా నుండవలెను అటువంటి వ్యక్తి యెప్పుడూ విచారముగా నుండడు''

నారదుని మాటలు విని ధ్రువుడిట్లనెను ''మిమ్ములను కలుసుకొనుట నా అదృష్టము సుఖ దుఃఖములను గురించిన రహస్యములను తేటతెల్లముగా వివరించి, యీ రెండింటికి అతీతముగా యెట్లుండవలెనో విశదపరిచిన మిమ్ము కనుగొనుట నా సుకృతము అయినప్పటికీ, శిక్షణలేని క్షత్రియుడ నగుటచేత కాబోలు సురుచి మాటలు బాధ కలిగించి తీవ్రమైన అయిష్టత జనించుట చేత మీరు చెప్పిన మాటలు నాలో లోతుగా నాటుకొనలేదు అవి నన్ను ఆకట్టుకొనవలసి యుండెను కాని అట్లు జరుగలేదు. నా అమాయికత్వమునకు మన్నింపుడు. నేను భగవంతుని చేరు విధమును బోధించవలెను నేను ఉత్తమోత్తమ స్థితిని కోరుచున్నాను దానిని నాకు ప్రసాదించమని భగవంతుని ప్రార్థించెదను దయచేసి బోధింపుడు. మీరు బ్రహ్మకు పుత్రులని, వీణ మీటుతూ, మానవ కళ్యాణమునకై లోకములో సంచారము చేయుదురని వినియున్నాను నన్ను కరుణింపుడు''

బాలుని అమాయికత్వమునకు, అతని మధురమైన మాటలకు ముగ్ధుడై నారదుడు ధ్రువునికి సహాయము చేయ నిశ్చయించుకొనెను నారదుడిట్లనెను. ''నీ తల్లి సూచించన మార్గము సరియైన మార్గము అది నీ కోరికను తీర్చును. అందరకూ ఆ నారాయణుడే ఆశ్రయుడు అతనిని ప్రార్థింపుము. అతని యందే నీ మనసును లగ్నము చేయుము అతనిని ప్రార్థించిన వారి కోర్కెలను అతడు తీర్చునని అందరూ యెరుగుదురు

''నీ మనసును నారాయణునిపై నిలుపుము నీ ప్రార్థనలను తప్పక వినును. నీ ప్రయత్నములు ఫలించుగాక!

''కుమారా! భగవంతుడు నిత్యము నిలిచియుండు యమునా నదీతీరమునకు వెళ్ళుము మధువనమను పవిత్ర స్థలమును చేరుము. రోజుకు మూడు పర్యాయములు యమునా నదిలో స్నానమాచరించి, ప్రాణాయామము చేయుచూ భగవంతుని రూపమును మనసులో ధ్యానింపుము. అతడు సులభముగా ప్రసన్నుడగును నేను నీకొక మంత్రమును బోధించెదను ఆ మంత్రమును నిత్యము ఉచ్ఛరించగా, భగవంతుడు నీ సమక్షమునకు వచ్చును. ఆ మంత్రము : ఓం నమో భగవతే వాసుదేవాయ ఈ మంత్రమును పదేపదే ఉచ్ఛరించినచో భగవంతుడు నీ కోర్కెలను తీర్చును ఇదియే భక్తి యోగము, అన్ని యోగములకన్న సులభమైనది. మరియు నారాయణునికి అత్యంత ప్రీతికరమైనది''

అటు పిమ్మట నారదుడు వివరముగా భగవంతుని రూపమును వర్ణించుచుండగా ధ్రువుడు తన మనస్సునందు ఆ రూప ప్రతిబింబమును స్థిరము చేసుకొనెను. అనంతుడను సర్పముపై పవ్వళించియున్న నారాయణుని రూపములో అతని మనస్సు నిండియుండెను. నారాయణుని నాభినుండి పద్మము మొలకెత్తుట

ఆ బాలుడు కాంచెను పీతాంబరములు ధరించి, పెదవులపై చిరునవ్వుచిందగా, కరుణతో నిండిన నే(త్రపద్మము లుగల నారాయణుని రూపము ఆ బాలుని మదిలో మెదలెను.

నారదునికి ప్రదక్షిణము చేసి ధ్రువుడు అతని పాదములకు ప్రణమిల్లెను. గురువువద్ద సెలవు తీసుకుని ధ్రువుడు యమునా నదీతీరమున నున్న మధువనమువైపుగా ప్రయాణించెను

## 41 ధ్రువుని తపస్సు

నారదుడు బోధించినట్లుగా యమునా నదీతీరమున నున్న మధువనమను పవిత్ర స్థలమందు ధ్రువుడు తపస్సు చేయనారంభించెను మొదటి మాసమందు ఆ అడవిలో దొరకు ఫలములను భుజించి జీవించుచుండెను రెండవ మాసములో యెండిన ఆకులు, గడ్డిపోచలు భుజించెను మూడవమాసమందు మంచినీరు మాత్రము త్రాగుచూ జీవించెను నాల్గవమాసమున మంచినీటిని కూడా విసర్జించెను గాలిని పీల్చుచూ అదియే ఆహారముగా స్వీకరించుచుండెను నారదు డుపదేశించి ... అతని మనస్సు లగ్నమైయున్నది. మనసులో 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అను మంత్రమును ఉచ్చరించుచుండెను. ఆ అయిదేండ్ల బాలునికి మంత్రము నుచ్చరించుట తప్ప వేరే ధ్యాస లేకుండెను

దేవతలు ధ్రువుని తపస్సు తీవ్రత కచ్చెరువొందిరి. అతని ధారణకు అంతరాయము కల్గింప ప్రయత్నించిరి అడవి మృగములను, పాములను, ... ని భయపెట్టదొడగిరి. కాని వానిని ఆ బాలుడు లక్ష్యపెట్టలేదు. తీవ్రముగా తపస్సునందు నిమగ్నుడగుటచేత వాని ఉనికి కూడ అతడు గమనించలేదు అతనికి తపస్సే ప్రధానము అతని తపస్సునకు ముల్లోకములు దద్దరిల్లగా దేవతలు నారాయణుని కడకేగి యిట్లనిరి ''ప్రభూ! ఇదివరకెన్నడునూ యిట్లు జరుగలేదు ధ్రువుని తీవ్రమైన తపస్సునకు వెరచి, జీవజాలము ఊపిరి పీల్చుకొనలేకున్నది మమ్ము కరుణించి, ధ్రువుని తపస్సు విరమింపజేయుము '' వారి మాటలు విని నారాయణుడిట్లనెను. ''నేను అతనివద్దకు వెళ్ళి తపస్సును విరమింపజేసెదను. ఇప్పటికి అయిదు మాసములు గడచినవి. నాభక్తుడైన యీ బాలుని ఆశీర్వదించెదను''

నారాయణుడు యమునా తీరమునకు వచ్చెను. అకస్మాత్తుగా ధ్రువుడు, యిన్నిరోజులుగా తన హృదయములో కాంచిన నారాయణుని రూపము అదృశ్యమైనట్లు భావించెను. సమాధినుండి తేరుకుని కళ్లు తెరిచి చూడగా, ధ్రువుడు తనయెదుట నారాయణుడు నిలబడియుండుట గాంచెను అకస్మాత్తుగా జరిగిన యీ సంఘటన ఆ బాలునికి పట్టరానిదిగా నుండెను నారాయణుని రూపమును కనులతో త్రాగుచున్నట్లుగా చూచుచుండెను నారాయణుని ఆలింగనము చేసుకొనుటకా యనునట్లు తన చేతులను జాపెను అతని కనులు వర్షించుచుండగా, ముఖమంతయు విప్పారియుండెను నారాయణుని పాదములపైబడి, తిరిగి లేచి నిలబడి, అదే పనిగా రెప్పవేయక చూచుచుండెను. పెదవులు కదలుచున్నప్పటికీ మాటవచ్చుటలేదు అట్లు కొంతసేపు నిల్చుని యుండెను.

ఆ బాలునికేమి కావలయునో నారాయణుడెరుగును. ధ్రువుడు నారాయణుని కీర్తించుటకు ప్రయత్నించెను.

కాని యెట్లు కీర్తించవలెనో తెలియకుండుటచేత కీర్తింపలేకుండెను. అతనికి పదములు దొరకుట లేదు. అందుచే నారాయణుడు, వేదములకు ప్రతిరూపమై మంచువలె తెల్లగానుండు శంఖముతో ఆ బాలకుని బుగ్గలు నిమిరెను శంఖము బుగ్గలను స్పృశించిన క్షణములో ధ్రువునికి జ్ఞానోదయమయ్యెను. మాటలను నేర్చెను. అతని మాటలు నారాయణుని వైభవమును వర్ణించు ఋషుల మాటలవలె నుండెను.

ధ్రువుడిట్లనెను. ''నాలో ప్రవేశించి నాకు మాట్లాడు శక్తినొసగిన నీకు చేతులు జోడించి నమస్కారము చేయుచున్నాను ప్రభూ! నాలో నిద్రించియున్న వాక్శక్తిని మేలుకొలిపినావు. ఇంద్రియములన్నిటియందు వ్యాపించి నీశక్తిచే వాటికి ప్రాణము పోయుచున్నావు. ఏకైక సత్యము నీవు మాయను, మహత్తత్వ అహం తత్వములను సృష్టించినది నీవు త్రిగుణములను, ఇంద్రియములకు అధిపతులను సృష్టించినది నీవు. వీనన్నిటిలో నీవు ప్రవేశించి, అరణిలో దాగియున్న అగ్నివలె నుందువు నిన్ను గురించిన సత్యము తెలియనివారు యీ మాయ నీకు భిన్నముగా నున్నదని తలచెదరు స్వప్నదృశ్యమును చూచుచున్నవానిని మేల్కొలిపి జాగ్రత్ స్థితిలోనికి తెచ్చినట్లు, బ్రహ్మకు దృష్టినిచ్చి యీ లోకమును చూచునట్లు చేసినావు. సర్వము నీవే అయి ఉండగా, యెవరైనను నిన్నెట్లు విస్మరించగలరు? నిన్ను పూజించువారికి జననమరణముల నుండి విముక్తి కలిగించెదవు అమాయిక ప్రజలు, తమ ఇంద్రియములను తృప్తిపరచుటకై నిన్ను కోరికలు కోరుచూ పూజించువారెంత దురదృష్టవంతులు! వారు మాయచేత మోసపోవుచున్నారు. కల్పవృక్షము వలె నీవు అమృతత్వము ప్రసాదించుచుండగా, నశ్వరమైన యీ శరీర మనుభవించే సౌఖ్యముల కొరకు ప్రాకులాడే మానవుడు దురదృష్టవంతుడు కాడా?

''నిన్ను తలచుచూ, నీగురించి కథలు వినుచూ, నీ భక్తులు చెప్పుకథలు వినుచుండగా ప్రాప్తించే బ్రహ్మానందానుభవము, బ్రహ్మస్థితిని పొందిన ఆనందమునకన్న మిన్న.

''కేవలము శారీరక సౌఖ్యముల సామాన్య మానవుడు, రథములో ప్రయాణించు వ్యక్తిని అకస్మాత్తుగా భూమిమీదకు మృత్యువనే కత్తితో నిసరివైచినట్లుగా జీవించుచున్నారు అట్టివారికి బ్రహ్మానంద మెట్లుండునో యెన్నడూ తెలియదు. బ్రహ్మ స్థితిలో కలిగే ఆనందము నిన్ను నిత్యమూ చింతించుటవల్ల కలిగే బ్రహ్మానందమునకు సాటిరాదు. అటువంటపుడు, భౌతిక సుఖములలో ఓలలాడుతూ, చెట్టునుండి యెండుటాకులు రాలినట్లు వారి కాలము చెల్లిపోగానే మరణించు మానవులెంత దౌర్భాగ్యులో వేరే చెప్పవలెనా? రాత్రిపగలు నిన్నే చింతించునట్లు దయచేసి నన్ననుగ్రహింపుము నీ భక్తులైన సాధువుల సత్సంగమును నాకు ప్రసాదింపుము. వారి సాంగత్యములో, నీకథలనే వినుచు ఆనందముతో తన్మయత్వము పొందగలను ఆ విధముగా, యెట్టి బాధయులేక, దుఃఖభరితమైన జనన మరణ సముద్రమును దాటగలను.

''నీ భక్తుల సాంగత్యము కలిగిన వ్యక్తి అశాశ్వతమైన యీ శరీరమును తనకు ప్రియమైన వారిని గురించి తలపక, సుఖముగా నుండును భార్య, పిల్లలు, యిల్లు, సంపద, వీటి ఆకర్షణకు లోబడక యుండును నాకైతే నీ దర్శన భాగ్యమును ప్రసాదించినావు. కాని యీలోకమునకు కారకుడవైన నీ ఈశ్వర రూపము నాకు అవగాహన అగుటలేదు. దీనినిబట్టి, నా మనస్సునుండి కోరికలు పూర్తిగా తొలగలేదని స్పష్టమగుచున్నది ప్రళయానంత రము యోగసమాధిలో నిద్రిస్తున్న నీ రూపము నేను కాంచుటలేదు ఈ లోకమంతయు నీలోనికి ఉపసంహారమొంది, కాలమునకు మరొకరూపమైన అనంతుడు నీకు శయ్య అయ్యెను నీ నాభి నుండి బ్రహ్మ జన్మించెను ఈ దృశ్యమును ఊహించి నీకు నమస్కరించుచున్నాను

''నీవు పరమాత్మవు నేను యింకనూ జీవాత్మనే నీవు శుద్ధుడవు, జీవుడట్లుకాదు. కోరికలతో మలినుడై యున్నాడు. నీవు జ్ఞానమూర్తివి, జీవుడు అవిద్యతో నిండియున్నాడు. నీవు చైతన్యము, నీవులేని జీవుడు చైతన్యరహితుడు. నీకు నాశమనునది లేదు. జీవుడు భ్రాంతిచేత సతమతమగుచు యెప్పుడూ మార్పుచెందు చుండును నీవు సనాతనుడవు జీవుడు మరలమరల జన్మించును. నీవు గుణములను శాసింతువు, జీవుడు గుణములకు దాసుడు

''నీవు పరబ్రహ్మము, పురుషుడు, యీ లోకమునకు కారకుడవైన నీకు నమస్కారము''.

బాలుడైన భక్తుని చూచి సంతసించి నారాయణుడిట్లనెను. ''నీవు యీ క్లిష్టకార్యమును చేబట్టుటకు కారణము నేనెరుగుదును. నీవుకోరిన దానిని ప్రసాదించెదను. నీకు నేనొక శాశ్వత స్థానమును ఒసంగుచున్నాను.

''నీకు ఒసగబోయే స్థానము చుట్టూ సూర్యచంద్రులు పరిభ్రమించెదరు. ఆ స్థానమునకు సప్తర్షిమండలము, నక్షత్రములు ప్రదక్షిణము చేయును

''నీతండ్రి రాజ్యము వదలివేసిన తర్వాత, నీకు పట్టాభిషేకము చేసి, శాంతి నన్వేషించుచు వెళ్ళిపోవును. నీవు యెల్లపుడూ నాయందు, భక్తులయందు భక్తి కలిగి యుందువు. వారి సాంగత్యములో నీకు కాలము గడచును ముప్పదివేల సంవత్సరములు నీవు యీ రాజ్యము నేలగలవు. నీవు అనేక యజ్ఞములు చేసి, తిరిగి నన్ను చూడగలవు చివరకు నీవు నన్ను చేరగలవు''

నారాయణుడు అంతర్ధానమయ్యెను. ఏకాకిగా నున్న ధ్రువుడు, జరిగిన సంఘటనయందే జీవించుచూ, పదేపదే తలచుకొనుచుండెను తండ్రిపాలించు నగరమునకు తిరిగి వెళ్ళుటకు ఆ బాలుడు సంకల్పించెను. ఒకవిధముగా అతడు సంతోషించెను, కాని అతని హృదయము జరిగిన సన్నివేశములకు, అంతగా ఉప్పొంగ లేదు. తనలో తానిట్లనుకొనెను ''నేను నారాయణుని చూచితిని. అతడు నన్నాశీర్వదించెను. ఋషులైన సనకసనత్కుమారులకు కలుగని ఆనందము నాకు కలిగినది. తెలివితక్కువవాడనై మోక్షము ప్రసాదించమని అడుగనైతిని నా మనస్సు నిర్భాగ్యము నారదమహర్షి చెప్పినది సరిగా యున్నది. 'మానావమానములను గ్రహించుటకిది సరియైన వయసుకాదు' అతని మాటలు లక్ష్యపెట్టకుండుట నా తెలివితక్కువతనము మోక్షముకన్న అతి తక్కువైనదానిని భగవంతుడు ప్రసాదించెను. ఈ భూమిపై జీవితమనే బంధమునుండి విముక్తిని కోరవలసినది. కాని నేనట్లు చేయలేదు నాలో అహంకారము పూర్తిగా నిర్మూలము కాలేదు అందుకే నామనస్సు పరిశుద్ధముగ లేకుండెను నేనొక యాచకునివలె ప్రవర్తించుట నాకు సిగ్గుగా నున్నది''

# 42 ధ్రువతార

నారదుడు ధ్రువునితో మాట్లాడిన తర్వాత ఉత్తానపాదుని రాజభవనమునకేగెను రాజు అతనికి తగురీతి స్వాగతముపలికి గౌరవించి ఉచితాసనముపై కూర్చుండబెట్టిన తర్వాత నారదుడు రాజు నుద్దేశించి యిట్లనెను ''నీవెందుకు నిరుత్సాహముగా కనుపించుచున్నావు? నీ రాజ్యమునకేమైన ఆపద సంభవించినదా?'' రాజు ఒక పెద్ద నిట్టూర్పు విడిచి యిట్లనెను ''నేను నిర్దాక్షిణ్యముగా ప్రవర్తించితిని నా భార్యయందు మోహావేశము వలన అయిదు సంవత్సరముల నాకుమారుడు నాదగ్గర నుండి వెళ్ళిపోవునట్లు చేసితిని అతడు అడవిలో తిరుగుచున్నాడు అతనికి ఆకలిదప్పులుండవా? లేతవయస్సులో నున్న ఆ బాలుడు అడవిలో కష్టములతో యెట్లు జీవించగలడు? భయంకరమైన అడవిలో, అడవిమృగములు, నక్కలు తమ పొట్టను బెట్టుకొనును నా ఒడిలో కూర్చొనగోరెను. కాని నా మోహాంధకారము చేత అతనికా అవకాశము నివ్వలేదు నా నిర్లక్ష్యమునకు, నా భార్య పరుషవాక్కులకు మిక్కిలి బాధపడి నన్ను వదలి వెళ్ళిపోయినాడు అందుచేత నేను నిరుత్సాహముగా నుండుటలో ఆశ్చర్యమేమున్నది?''

నారదుడు చిరునవ్వు నవ్వి యిట్లనెను. ''నారాయణుని రక్షణలో నున్న నీ కుమారుని గురించి విచారింపపనిలేదు నీ కుమారుడు ఉత్తమోత్తమ వ్యక్తి కాగలడు. ధ్రువుని గొప్పతనము నీకు తెలియదు వానిని బాలుడని తలపోయు నీకు అతని భవిష్యత్తు అసలే తెలియదు దేవతలు సాధించలేనిదానిని నీ కుమారుడు సాధించును నీ బాలుని మూలముగా నీ పేరు చిరస్థాయిగా యీ లోకములో నిలుచును గొప్పవాడైన ధ్రువుని తండ్రిగా ఉత్తానపాదుడను పేరు ప్రసిద్ధినొందును. విచారించవద్దు. ధ్రువుడు త్వరలోనే నీవద్దకు వచ్చును''

అయిదు నెలలు గడచినవి కాలము గడచుచున్నకొలది రాజు ఓర్పు తగ్గుచుండెను ఇంతలో అడవినుండి ధ్రువుడు తిరిగి వచ్చుచున్నా [illegible], రాజు ధ్రువునికి స్వాగతము చెప్పుటకు వెడలెను. రాజువెంట భార్యలు సునీతి, సురుచి, చిన్నకుమారుడు ఉత్తముడు కూడ ఉండిరి నగరసీమ సమీపించిన ధ్రువుని దూరమునుండి రాజు చూచెను రథము నుండి ఉత్సాహముతో ఉరుకువేసి, కనులవెంట ఆనందాశ్రువులు జాలువారగా, ధ్రువుని గాఢముగా కౌగిలించుకొనెను తండ్రికి, తల్లులకు ధ్రువుడు ప్రణమిల్లెను సురుచి ఆలింగనము చేసికొని, ఉద్వేగమొప్పగా గద్గద స్వరముతో ''దీర్ఘకాలము జీవింతువుగాక'' అని దీవించెను

సంవత్సరములు గడచెను ధ్రువుని రాజుగా పట్టాభిషిక్తుని చేసి, ఉత్తానపాదుడు రాజ్యమువదలి, తపస్సున కరణ్యమునకేగెను అనేక సంవత్సరముల తర్వాత, రాజ్యమును అత్యంత నైపుణ్యముతో పరిపాలించి, అనేక యజ్ఞములు, అశ్వమేధయాగము జరిపిన తర్వాత, ముప్పదివేల సంవత్సరములు పాలించితినని ధ్రువుడు గ్రహించెను. నారాయణుని మాటలు అతని మనసులో నిలిచియున్నవి: ముప్పదివేల సంవత్సరములు రాజ్యమేలిన తర్వాత, నారాయణుని పాదములచెంత సేదదేర్చుకొనవచ్చని చెప్పి [illegible] ్రను

త్వరలో తను పొందబోయే స్వేచ్ఛను తలచుకుని ధ్రువుడు ఆనందించెను. అతని కుమారునికి పట్టాభిషేకము చేసి, తపస్సు ఆచరించుటకు బదరికాశ్రమము వెళ్ళెను ఆత్మను కప్పియున్న యీ భౌతిక శరీరమును విడచుటకు తొందరపడుచుండెను యోగములో పూర్తిగా, యిదివరలో వలె, నిమగ్నుడై తన పరిసరముల నెరుగక యుండెను

ఇంతలో మెరయుచున్న రధ మొకటి అతనివద్ద నిలిచియుండెను. అందుండి నారాయణుని సేవకులైన యిద్దరు దివ్యపురుషులు దిగిరి ధ్రువుడు వారిని గౌరవించగా, వారిట్లుపలికిరి. ''కొన్ని సంవత్సరముల క్రిందట, నీవు అయిదేండ్ల బాలుడుగా నున్నపుడు, నారాయణుని ప్రార్థించగా, స్వర్గములో ఒక ఉత్తమమైన స్థానమును నీకుప్రసాదించెను. నీ చుట్టు సూర్యచంద్రులు, సప్తఋషులు, నక్షత్రములు ప్రదక్షిణములు చేయుదురు అంతేకాక నీ ఉత్తమస్థితిని వారు యెన్నటికీ చేరుకొనలేరు మిగిలిన నక్షత్రములు, గ్రహములు స్వర్గములో ఒకస్థానము నుండి మరొక స్థానమునకు వెళ్ళుచుండును కాని నీవు స్థిరముగా నుండెదవు. కృపతో యీ రధమునెక్కి, నీకు నిర్దేశించిన స్థానమును చేరుకొనుము''.

రధము నధిరోహింపబోవుచుండగా, మృత్యుదేవత ధ్రువుని సమీపించి, వంగి యిట్లనెను ''ఓ ప్రభూ! నన్ననుగ్రహింపుము'' ధ్రువుడు, ''నీకు స్వాగతము'' అని పలికి, మృత్యుదేవత వంచిన శిరముపై తన పాదము నుంచి, రధములో ప్రవేశించెను

## 43 వేనుడు జన్మించుట

ధ్రువుని కుమారుడు ఉత్కలుడు అతడు గొప్పవేదాంతి చిన్నవయసునందే బ్రహ్మస్థితిని పొందెను అతడు సింహాసనమును, రాజరికపు డాబుదర్పములను లక్ష్యపెట్టకుండెను రాజ్యపాలనములో అతనికి ఆసక్తి లేకుం డెను అతని అనాసక్తిని చూచి ప్రజలు అతడొక ఉత్తేజములేని అమాయికుడని యెంచిరి వేషధారణయందు అశ్రద్ధగా నుండుటచేత అతనిని చూచినవారు యెట్టి గౌరవమును చూపకుండిరి చివరకు ప్రకృతులు అతనికి రాజ్యపాలనలో యేమాత్రము నేర్పులేని వాడని భావించిరి అతని తమ్ముడైన వత్సరునికి వారు పట్టము గట్టిరి

వత్సరుని వంశీయులలో అంగుడనే రాజు ఒకడు జన్మించెను. అతడు అశ్వమేధయాగముజేసి రాజర్షిగా పేరుగాంచెను యాగానంతరము దేవతలు వచ్చి యజ్ఞ హవిస్సులో భాగమును తీసుకొనవలసి యుండెను కాని వారిని మంత్రములచే ఆహ్వానించినపుడు వారు రాకుండుటయేగాక తమ భాగమును తీసుకొనకుండిరి. అందరూ ఆశ్చర్యముచెంది, యజమానుడైన రాజును యిట్లడిగిరి ''ఓరాజా! మీరు అగ్నికి సమర్పించిన హవిస్సును దేవతలు స్వీకరింపకుండిరి. ఎట్టి పొరపాటు లేకుండ మేము యజ్ఞమును జరిపినాము. మా యందు యెట్టి దోషములేదు. మరి దేవతలు రాకుండుటకు కారణము తెలియకున్నది'',

రాజునకు చాలా విచారము కలిగెను. అక్కడ చేరియున్నవారి నుద్దేశించి రాజు యిట్లనెను. ''మీరందరూ చాలా తెలివిగలవారు, నా శ్రేయస్సును కోరువారు, నా దోషమేమిటో యెవరైనను చెప్పగలరా? ఈ స్థితిలో చెయ్యరానిదేదైనను చేయుట జరిగెనా? ఇటులెందుకు జరిగెనో నాకు తెలియుటలేదు ఎవరైనను యిట్లు జరుగుటకు కారణము చెప్పగలరా?''

వారిలో బుధులు యిట్లు పలికిరి ''ఓ రాజాధిరాజా! ఈ యాగనిర్వహణలో యెవ్వరూ నిన్ను నిందింపలేరు దీనికి కారణము మాకు తెలియును నీవు సద్గుణవంతుడవు, సందేహములేదు. కాని నీ

పూర్వజన్మలో పాపరహితుడవుకావు. ఆ కారణముచేత నీకు సంతానము కలుగకుండెను. నీకు మేము ఒక సహాయము చేసెదము పుత్రుని పొందుటకై నీవు మరొక యజ్ఞమును జేయుము నీచే పూజలందిన నారాయణుడు సంతోషించి నీ కోరికను తీర్చును. నారాయణుడే స్వయముగా మెచ్చుకుని నీకు పుత్రప్రాప్తి కలుగువట్లు ఆశీర్వదింపగా, అతనితో వచ్చు దేవతలు హవిస్సులో వారి భాగమును స్వీకరింతురు''.

నారాయణుని ప్రార్థించి గౌరవించుటకు మరియొక యజ్ఞము నిర్వహించు బాధ్యతను వారు స్వీకరించిరి. యాగము పరిసమాప్తికానున్న తరుణములో, బంగారు నగలను ధరించి చేతియందు బంగారు కలశములోనున్న రూపము అగ్నినుండి ఆవిర్భవించెను. ఆ కలశమును రాజునకు అందివ్వగా, అందు దివ్యపాయసమును రాజు కాంచెను అక్కడచేరిన వారు ఆశీర్వదింపగా రాజు ఆ పాయసమును రుచిచూసి, తన భార్య సునీతకు యిచ్చెను.

కొంత కాలమునకు ఒక పుత్రుడు జన్మించెను యాగఫలితముగా జన్మించిన యీ బాలుడు వేనుడు అధర్మమునకు నిలయమయ్యెను బాలుడుగా నున్నపుడే జీవులను బాధించి ఆనందించుచుండెను వయసు వచ్చిన తర్వాత వేటకై అడవి కేగుచుండెను తనకు యిష్టమైనపుడు వేటాడుచు, హాని కల్గించని సాధుజంతువు లను చంపుచుండెను. అతని క్రూరత్వము చూచి ప్రజలతనికి దూరముగా తొలగుచుండిరి అతడు కనిపించినపుడు ప్రజలు ''క్రూరుడైనరాజు వేనుడు యిటు వచ్చుచున్నాడు'' అని తలచి అతనికి దూరముగా పారిపోయెడివారు. సహచరులతో ఆడుచున్నపుడు యెట్టి సంకోచములేక నిర్దాక్షిణ్యముగా వారిని చంపుచుం డెను

రాజు తన పుత్రుని మంచి మార్గములో పెట్టుటకు అనేక ప్రయత్నములు చేసెను సామ, దాన, భేద, దండోపాయములను ప్రయోగించెను. కాని ప్రయోజనము లేకపోయెను అతని స్వభావమును మార్చలేకుండెను రాజు చాలా విచారముగా నుండెను తనలో తానిట్లనుకొనెను. ''పిల్లలులేనివారియెడల భగవంతుడు చాలా దయకలిగి యుండును. ఎందుకనగా దుష్టుడైన కుమారుడు చేయు అకృత్యములు లేకుండుటచే వారు నిర్విచారముగా నుందురు. దుష్టుడైన కుమారునికి తండ్రి అయినాడు అపకీర్తికి, ప్రజల ద్వేషమునకు, తీరని మానసిక బాధకు గురియగును. ఒక దుష్టపుత్రునివలన యింటికి, కుటుంబమునకు, దేశమునకు హాని కలుగుటచేత, తెలివిగలవారు పుత్రుడు కావలెనని కోరరు

''కాని నా గురించి నేను ఆలోచించగా, భగవంతుడు నాకు సద్వర్తన కలిగిన పుత్రునికి బదులు యీ దుష్టపుత్రుని యిచ్చి మేలు చేసెనేమోయని తోచుచున్నది ఈ కుమారుని కారణముగా నాకు సంతోషము లేకుండుటచేత యీ జీవితముపై విరక్తి కలుగుచున్నది. ఇట్టి దుర్మార్గుని కన్న పాపమునకు తలయెత్తుకుని సజ్జనులలో సంచరించలేకపోవు చున్నాను. సత్పుత్రుడు కలిగిన తండ్రి యింత తొందరగా సన్యాస మార్గమును స్వీకరించడు నా కుటుంబముతో మరికొంత కాలముండెడి అనుబంధము దుష్టుడైన యీ పుత్రుని కారణముగా యిప్పుడే తెగిపోయెను

రాజు చాలా విచారములో మునిగియుండుటచేత, యెవ్వరునూ అతనితో మాట్లాడలేకుండిరి

ఒకరోజురాత్రి నిద్రరాకుండుటచే పక్కపై అటునిటు పొరలు చుండెను అకస్మాత్తుగా ఒక నిశ్చయమునకు వచ్చెను. నిర్భాగ్యుడైన అంగరాజు తన శయ్యను విడిచి, దానితోపాటు ఇంటిని, ఇల్లాలిని సమస్తమును వదలిపెట్టి

ఆ నగరము నుండి వెళ్లిపోయెను మరి యెన్నడూ అతడు తిరిగి రాలేదు.

రాజు నిర్గమనముతో రాజ్యములోని ప్రజలు దుఃఖితులైరి పుత్రుని దుర్మార్గము రాజు యిట్లు ప్రవర్తించుటకు కారణమని వారు తెలుసుకొనిరి. అంగరాజు శాంతి నన్వేషించుచు వెళ్ళిపోయెను మంత్రులు, తదితరులు ఋషుల వద్దకు వెళ్ళి సలహా యివ్వలసినదని ఋషుల నడిగిరి. రాజ్యమునకు రాజుఉండవలెను. అందుచే అయోగ్యుడైనప్పటికీ దుష్టుడైన వేనుని రాజుగా చేయక తప్పదని ఋషులు సలహా యిచ్చిరి.

## 44 వేనుని రాజ్యపాలనము

రాజ్యములో భయాందోళనలు తాండవించెను ఇంతకు పూర్వమే దుష్టుడుగా పేరుగాంచిన వేనుడు, రాజు అయిన తర్వాత మరింత క్రూరముగా ప్రవర్తించుచుండెను. అధికారము, దానికి తోడు అమితమైన సంపద, యీరెండూ కలిసి అతని అహంభావమును యినుమడింపజేసినవి పెద్దలయెడ గౌరవము లేకపోయెను, సరికదా వీలు కలిగినపుడు వారి నవమానించుచుండెను. మిక్కిలి అహంభావము, క్రూరత్వము, నిర్దాక్షిణ్యము గల రాజుగా ప్రఖ్యాతికెక్కెను ఎచ్చటనూ హోమములు, యాగములు జరుగకూడదని ఆజ్ఞ యొసగెను

బుద్ధిమంతులు కొందరు సమావేశమై యీ అరాజక పరిపాలనను ఆపుచేయుటకు మార్గములను పరిశీలించిరి రోజురోజుకూ అరాజకము మితిమీరుచుండెను వారు సంధిగ్ధావస్థలో పడిరి ఇప్పటివలె రాజు తన అరాజక పరిపాలనను కొనసాగించినచో, భరింపజాలరు రాజ్యములో రాజు లేకున్న బందిపోటు దొంగలు దోపిడిదొంగలు దేశములో ప్రవేశించి ప్రజలను బాధపెట్టెదరు రాజ్యములో రాజు ఒకడు ఉండవలసి వచ్చుటచేత వేనుడు రాజుగా నియమితుడయ్యెను అతడా పదవికి అనర్హుడని తెలిసియున్నప్పటికీ, పరిస్థితులు దారుణముగా దిగజారునని యెవరూ ఊహించలేదు ప్రతిఒక్కరి భయాందోళనలకు అతడే కారణము. వారిలో ఒకరు, రాజైన వేనుడితో మాట్లాడి, అతనికి కర్తవ్యమును తెలిపినచో బాగుండునేమో యని వారు భావించిరి ధ్యత వహించిరి. అందుచేత తిరిగి పరిస్థితిని చక్కబెట్టుట వారి బాధ్యతయని గుర్తించిరి

మంత్రులు ఋషుల వద్దకు వెళ్ళిరి. ఋషులు చేతనైనంత వరకు సహాయము చేయుట కంగీకరించిరి రాజు వద్దకు వెళ్ళి, అతి కష్టముతో వారి ఆగ్రహమును నిగ్రహించుకుని, మృదు వచనములతోనిట్లు పలికిరి ''కుమారా! మేము చెప్పునది జాగ్రత్తగా వినుము నీ జీవితము, నీ సంపద, నీ పేరు ప్రఖ్యాతులు ప్రమాదములో చిక్కుకుని యున్నవి త్రికరణశుద్ధిగా — మనస్సు, వాక్కు, కార్యము ఒకటిగా నుండుట — ధర్మము నాచరించినచో గొప్పతనము చేకూరును నీవు యిప్పుడాచరించు చున్న ఆధర్మ పరిపాలన నీకుగాని దేశమునకు గాని క్షేమముకాదు నీ ప్రజలను రక్షించవలెనుగాని బాధపెట్టరాదు ధర్మమును, భగవంతుని లక్ష్యపెట్టని రాజు నరకము పాలగును నీవు యజ్ఞములు చేసి దైవమునకు ప్రీతి కల్గించవలసి యున్నది నీవు చేయుటలేదు సరికదా, చేయబోవు వారిని చేయకుండ ఆపుచేసితివి నీవు తప్పుగా నడచుకొనుచున్నావు మా సలహా పాటించి, నీ విధానములు మార్చుకొనుము ఇప్పటికైనను మించిపోయినది లేదు మా మాటలను విన్నచో నీకు, నీ ప్రజలకు క్షేమము కలుగును దుష్టపరిపాలన విడిచిపెట్టి, అందరికీ మేలు చేయుము'' వారి

విన్నపములను రాజు వేనుడు పెడచెవిని పెట్టెను అతిడిట్లనెను. ''నేనుకాదు, మీరు అధర్మమార్గము ననుసరించుచున్నారు. మిమ్ములను రక్షించుచున్న నన్ను వదలి, నాకు బదులుగా మరొక దైవమును మీరు పూజించుచున్నారు. దైవమునకు ప్రతిబింబము రాజు, అందుచే రాజును దైవముగా పూజించ వలెను మరియొకరిని కాదు స్వర్గవాసులందరికీ రాజు శరీరమే గృహము, అందుచేత రాజునైన నన్ను మీరందరూ పూజించవలసియున్నది. నేను నారాయణుడను, అత్యుత్తమ గౌరవము నందుకొనుటకు తగినవాడను ఈ సత్యము తెలియని ప్రజలే నరకమునకు వెళ్ళెదరు, నేను కాదు మీరందరూ భర్తలయెడ ప్రేమలేని భార్యలవంటివారు మీరు చెప్పే యజ్ఞపురుషుడెవరు? అతడు రాజు ఇకముందు యజ్ఞములను నన్ను గౌరవించుటకు జరుపవలెను నాకు హోమములు, నా పేరిట ఆహుతి చేయవలెను మీ రాజునైన నన్నుతప్ప యింకెవరినీ పూజించుటకు వీలులేదు''

వేనుని మాటలకు ఋషులు దిగ్భ్రాంతి చెందిరి కొంతసేపు అతని వైపుచూచి, యీ దుర్మార్గుడు రాజుగా నున్నంతవరకు దేశభవిష్యత్తు యెట్లుండునో యని యోచించిరి ఇంతవరకు నిగ్రహించుకున్న వారి ఆగ్రహము, వేనుని మాటలకు, అతడు కురిపించిన అవమానములకు ఒక్కసారిగా బయటికి వచ్చెను వారిలో వారిట్లనుకొనిరి. ''ఇతడు మరణించక తప్పదు

''యజ్ఞేశ్వరుడైన నారాయణునితో సమముగా తనను యెంచుతున్నాడు ఆ విధముగా తన విధిని తానే నిర్ణయించుకున్నాడు తన అహంభావమునకు భగవంతునిచేత యింతకుమునుపే విహతుడైనాడు ప్రజలను రక్షించుటకు యీ వేనుని మనము నాశనము చేయవలెను''

వారు మనస్సులో మృత్యుదేవతను ఆహ్వానింపగా, మృత్యువు వేనుని ప్రాణములను హరించెను తిరిగి చూడక ఋషులు వారి ఆశ్రమములకు వెళ్ళిపోయిరి

## 45 పృథు మహారాజు

. కొంతకాలము గడచెను. దేశమును పాలించు రాజు లేకపోవుటచేత, ప్రజలను దోచుకొనుటకు యిదియే సమయమని యెంచి బందిపోటు దొంగిలు నగిరములో ప్రవేశించిరి. ఒకరోజు సరస్వతీ నదీ తీరమున ఋషులు కూర్చొని యుండగా, దూరముగా ధూళిమేఘమును చూచిరి వారు కుతూహలముతో దీనికి కారణమేమై యుండునా అని పరిశోధింపసాగిరి. రాజు లేకుండుటచేత నగిరమును దోచుకుని బందిపోటుదొంగిలు గుర్రములపై తిరిగి వెళ్ళుటచేత రేగిన ధూళియని వారు కనుగొనిరి రాజ్యములో రాజు లేకపోవుట యెంత కీడును కలిగించునో ఆ ఋషులు గ్రహించిరి ఈ పరిస్థితి కలుగుటకు కొంతవరకు తాము బాధ్యులమని విశ్వసించి, ఆ రాజ్యములోని ప్రజలను యీ దౌర్భాగ్య స్థితి నుండి కాపాడుటకు యేదైన చేయవలసియున్నదని వారు తలచిరి. ఆ రాజ్యములోని ప్రజలు దుర్మార్గుడైన వేనుని పరిపాలనలోను, ఆ తర్వాత బందిపోటు దొంగలచేతను మిక్కిలి యిక్కట్లకు పాలయిరి.

అంగరాజు భార్య సునీతకు తన కుమారుడైన వేనునిపై విశేషమైన ప్రేమ యుండుటచే అతని భౌతిక

కాయమును దహనపరచుటకు ఆమె అంగీకరించదని ఋషులకు తెలియును ఆమెకున్న మాంత్రిక శక్తులచే తను, ఔషధములచేతను, ఆ మృతదేహమును కాపాడుచుండెను. ఋషులు ఆమెవద్దకు వెళ్ళి, వేనుని మృతశరీరము నిమ్మని అడిగిరి. ఋషులు ఆ మృతదేహమందు తొడలను చిలకగా, అందునుండి అనాకారిగా నల్లగా నుండు పురుషుడు ఉద్భవించెను ఆ పురుషుడు వేనునిలోని దుష్టత్వము మూర్తీభవించినట్లుండెను అతనిని నిషాదుడను పేరుతో పిలుచుచుండిరి అతని వంశీయులు నిషాదులుగా పేరొందిరి

ఆ తర్వాత ఋషులు మృతదేహను కుడిభుజమును మొదట చిలికి, పిమ్మట యెడమ భుజముగూడ చిలికిరి. వాని నుండి ఒక పురుషుడు ఒక స్త్రీ జన్మించిరి వారు నారాయణుడు, లక్ష్మీదేవి అవతారములు వారిని ఋషులు పొగడి యిట్లనిరి. ''ఈ పురుషుడు పృథువు అనుపేరుతో, యీ స్త్రీ అర్చిస్సు అను పేరుతో వ్యవహరింతురు వారు భార్యాభర్తలుగా జీవించి, యిలోకములో ప్రఖ్యాతి గాంచెదరు పృథుచక్రవర్తి అత్యంత వైభవముగా రాజ్యము పరిపాలించును''

పృథువు జన్మించి నందుకు సంతోషించి, బ్రహ్మాది దేవతలు యీ గొప్ప సంఘటనను తిలకించుటకు భూమికి దిగివచ్చిరి

పృథువు జన్మించినపుడు, స్వర్గములో మేళ తాళములు మ్రోగెను సిద్ధులు భూమిపై పుష్పవర్షము కురిపించిరి భూమికి దిగివచ్చిన బ్రహ్మ, దేవతలు, దేవర్షులు కొత్తగా పుట్టిన ఆ బాలుని చూచిరి ఆ బాలుని కుడిచేయిని పరీక్షించి, బ్రహ్మ యిట్లనెను. ''ఆహా! ఈ బాలుని చేతియందు చక్రము, పాదములందు పద్మచిహ్నములు గలవు ఇతడు నారాయణుని అవతారముగా లోకమును రక్షించుటకు వచ్చెను''

పెరిగి వయసు రాగానే పృథువు పట్టాభిషిక్తుడయ్యెను ప్రతిఒక్కరు పృథుమహారాజుకు కానుకలు తెచ్చిరి నదులు, సముద్రములు, పర్వతములు, వృక్షములు, గోవులు, పక్షులు, లేళ్లు కూడ కానుకలు తెచ్చెను ఆకాశము, భూమి, సకల జీవరాసులు కానుకలు తెచ్చెను సింహాసనముపై కూర్చునియున్న పృథువును నదీ జలములచేత అభిషేకించగా, అతని ముఖము ప్రకాశమానముగా నుండెను అతని ప్రక్కనే భార్య అర్చిస్సు కూర్చొనెను

దేవతలు, ప్రత్యేకమైన వస్తువులను కానుకలుగా సమర్పించిరి ఉత్తరదిక్కునకు అధిపతియైన కుబేరుడు, గంధర్వులు ఒక అందమైన ఆసనమును కానుకగా నిచ్చిరి చంద్రునివలె తెల్లగా నుండు ఛత్రమును వరుణుడు కానుకగా తెచ్చెను వాయువు చామరములను, ధర్ముడు ఒకమాలను కానుకలుగా నిచ్చిరి ఇంద్రుడు కిరీటమును, యముడు సంయమనమను దండమును కానుకగా నిచ్చిరి వేదరక్షితమైన కవచమును బ్రహ్మ కానుకగా నివ్వగా, చదువుల తల్లి సరస్వతి ముత్యాల దండను కానుకగా నొసగెను నారాయణుడు చక్రమును, అతని భార్య లక్ష్మి సంపదను యిచ్చిరి. రుద్రుడు ఖడ్గమును, పార్వతి రక్షణ కవచమును కానుకలుగా నొసంగిరి చంద్రుడు తెల్లని గుర్రములను, త్వష్టరుడు రథమును యిచ్చిరి. అగ్ని ధనుస్సును, సూర్యుడు తన కిరణములవలె ఉండు అమ్ములను యిచ్చిరి. భూమి పాదుకలను యిచ్చెను ఈ పాదుకలు యెక్కడికైనను గొనిపోగలవు స్వర్గవాసులు తమ పూలతోటల నుండి ప్రతిదినము పువ్వులను పంపుచుండిరి. నృత్యసంగీత వాద్యములను దేవతలు కానుకగా నొసంగిరి. మరియు సంకల్పించినంతనే అదృశ్యమగు శక్తిని కూడ ప్రసాదించిరి ఋషులు ఆశీర్వదించిరి సముద్రము శంఖములను రాజునకు సమర్పించెను నదులు, అతడు వెళ్ళునపుడు సులభముగా దాటుటకు మార్గము నిచ్చుచుండెను

సూతవంది మాగధులు పృథువు వైభవమును కీర్తింప మొదలిడిరి పృథుచక్రవర్తి నవ్వి హెచ్చు స్వరముతో పలికెను. వర్షాభ్ర గర్జనమువలె అతని స్వరము అందముగా నుండెను. అట్టి స్వరముతో నిట్లనెను ''మీ మధురమైన మాటలతో కూడిన పొగడ్తలను చాలింపుడు పరిపాలనలో నేర్పు సంపాదించిన వాడను కాను. మీరు నాపై వర్షించు పొగడ్తలకు అర్హత పొందుటకు నేను కృషిచేయవలసి యున్నది నన్నుకాక, భగవంతుని కీర్తింపుడు నేను ఉత్తమ ప్రభువుగా బుజువైన తర్వాత మీరు నన్ను మీ యిష్టము వచ్చినట్లు పొగడవచ్చు ఇప్పుడుకాదు మీ పొగడ్తల నందుకొనుటకు అర్హులు అనేకమంది యిక్కడ సమావేశమై యుండగా, నన్ను మీరు లేదు.

''వినయ సంపన్నుడైన యే వ్యక్తికూడను, ముమ్ముందు కలుగబోయే మీరు చెప్పిన గుణములను యిప్పుడు అంగీకరింపలేడు ఎంతో గొప్పతనము, అత్యంత నైపుణ్యము, కీర్తి ప్రఖ్యాతుల నార్జించి యున్నప్పటికీ, వినయముకల్గిన వ్యక్తి తన యెదుట యితరులు తన్ను పొగడుట కంగీకరింపడు మీరు నన్ను అదేపనిగా పొగడుచుండుటచేత నాకు లజ్జగా ఉంటున్నది కాబట్టి మీరు యీ పని మానివేయుడు''

పృథువునకు పట్టము గట్టిన తర్వాత, అతడు లోకరక్షకుడై ప్రఖ్యాతి పొందునని ఋషులు ఆశీర్వదించిరి

## 46 పృథువు ఆగ్రహము

రాజుగా పట్టాభిషిక్తుడైన పృథువును 'లోకరక్షకు'డని దేవతలు పిలిచిరి ఆ మాటల వెనుకనున్న అర్థమును గుర్తించిన రాజు, ముందు కర్తవ్యము చాలా క్లిష్టమైనదని కనుగొనెను అతడు ప్రజలు కృశించి మిక్కిలి నీరసించి యుండుట చూచెను వారు సరియైన ఆహారము, పోషణ లేక మిక్కిలి బాధలలో నుండిరి ఆ ప్రజలు రాజుతో నిట్లనిరి ''ప్రభూ! దయచేసి మాకు ఆహారమును ప్రసాదించండి తొర్రలో నున్న అగ్నిచేత చెట్టు దగ్ధమైనట్లు, మేము ఆకలి అనే అగ్నిచేత మెల్లగా దహించుకు పోవుచున్నాము మా ప్రధానాంగములు బాధపడుచుండుట చేత మేము పని చేయలేకపోవుచున్నాము మాకు అన్నము పెట్టండి పూర్వపు రాజు భుజములను ఋషులు చిలకగా, మీరు జన్మించి మమ్ము రక్షించి ఉద్ధరించెదరని వినియున్నాము. ఈ ఆకలి బాధనుండి మమ్ము రక్షించి కాపాడవలెను''.

పృథువు ఒక క్షణము యోచించెను. ఆరోగ్యమును, పోషణను యిచ్చే ధాతువులను భూమి నమిలివేసినదని, అవి తిరిగి మొలకెత్తకుండ చేయుచున్నదని రాజు గ్రహించెను ఈ కారణము చేత భూమిపై ఆగ్రహము చెంది, శిక్షింపనెంచెను. తన విల్లందుకొని ఒక అమ్మును భూమికి గుచ్చుకొనునట్లు వదలెను భూమాత భయపడి గోవురూపము ధరించి రాజు నుండి పారిపోయెను. తోకనెత్తి వణకుచున్న కాళ్ళతో ఆ గోవు భూమి అంతటా పరుగిడెను క్రోధముతో కనులు యెర్రబడగా, రాజు గోవును వెంబడించెను. గోవు పర్వత సానువుల క్రిందగా వెళ్ళి, లోయలలో ప్రవేశించి, అక్కడ నుండి దట్టమైన అడవిలో చొరబడి రాజునుండి తప్పించుకొనుటకు యత్నించెను కాని రాజు అలుపులేక గోవును వెంబడించుచునే యుండెను ఎక్కడకు వెళ్ళినను, గోవు వెనుదిరిగి రాజు తనను వెంబడించుట చూచుచుండెను. ఎవరూ తనను రక్షించువారులేరని గోవు తెలుసు కొనెను చివరకు రాజు పాదములపైబడి యిట్లనెను. ''దయచేసి నన్ను రక్షింపుము. నీవు ధర్మప్రభు

వువు. ఈ విధముగా నావంటి స్త్రీని వేధించుట తగదు. స్త్రీహత్య మహాపాపమని నీకు తెలియును. ఆమెలో దోషమున్నప్పటికీ చంపరాదు నేను నీకు యెట్టి హాని చేయకున్నప్పటికీ నన్ను చంపబూనుకున్నావు. నన్ను చంపినట్లయిన, నీ రాజ్యము నెక్కడ ప్రతిష్ఠించుకొనగలవు''.

పృథు విట్లనెను. ''భూమాతా! నీవు తప్పు మార్గములో నున్నావు. అందుకే నిన్ను శిక్షింప బూనుకున్నాను. మానవులు చేయు యజ్ఞములలో హవిస్సులో నీకు భాగము యిచ్చినప్పటికీ, తిరిగి నీవు ఆహారము నిచ్చుటలేదు. నీ విధిని నీవు నిర్వహించకపోవుటచేత నిన్ను శిక్షించవలసి యున్నది గోవు రూపములో గడ్డిని మేయు చున్నప్పటికీ, పాలను పిదుకుట లేదు. నీవు స్వార్థముతో ప్రవర్తించుచున్నావు నా పరిపాలనను నువ్వు ధైర్యముగా విస్మరిస్తున్నావు చాలా కాలము క్రిందట బ్రహ్మ నీకొసగిన ఆరోగ్యదాయులైన మూలికలను నీలో నిముడ్చుకున్నావు. నా ప్రజలు ఆకలితో బాధపడుచున్నారు వారి ఆకలిని తీర్చి సముదాయించవలెను. ఇతరుల శ్రేయస్సు తలంచని వారిని, మొగవారైనా ఆడవారైనా సరే రాజు చంపవలసినదే, అట్లు చంపినమా పాపముగా పరిగణింపరు నాకు ధర్మశాస్త్రము తెలుసును. అందలి రహస్యములను నీవు నాకు బోధించనక్కర లేదు! నిన్ను చంపుటకు నాకెట్టి సంకోచములేదు నిన్ను చంపి నీ మాంసమును ప్రజలకు ఆహారముగా యిచ్చెదను. యోగముచేత తిరిగి నేను రాజ్యమును ప్రతిష్ఠించగలను''

క్రోధముతో నిండిన కనుబొమలు, పిడుగువంటి స్వరము, బాణమును యింకా యెత్తి యుంచుటను జూచి భూమాత వణకసాగెను ఆమె యిట్లనెను. ''నీవు ఉత్తమోత్తమ ప్రభువువని యెరుగుదును జీవులకు, జడములకు నిలయముగ నన్ను సృష్టించినావు వీరందరికీ నన్ను తల్లిని జేసినావు నీవే నాపై ఆయుధములు ప్రయోగించిన, యిక నన్ను రక్షించువారెవరు? సముద్రములో అట్టడుగున నేను మునిగి యున్నపుడు, నీవు వచ్చి నన్ను లేవనెత్తి , సముద్రముపైన ప్రతిష్ఠించినావు ఆనాటి ఆదివరాహమే నీవు ఈనాడు మానవరూపములో నన్ను, నాపిల్లలను రక్షించుటకు వచ్చినావు కాని, నేను చూచునదేమి? నా ప్రభువు, నా స్వామి బాణముతో నన్ను చంపుటకు బెదిరించుచున్నాడు ప్రభువు లీలలు నావంటి సామాన్య వ్యక్తులు అవగాహన చేసుకొనలేరు నాపై కరుణ చూపుము

''నా మొరను జాగ్రత్తగా వినుము. తేనెటీగ అనేక పుష్పములనుండి ఒకొక్క బిందువును తెచ్చి తేనెను తయారుచేయును ఇట్లు చేయుటకు ఆ యోగి యెంతో శ్రమ పడును జ్ఞాని సత్యా [illegible] పలువురు వ్యక్తుల నుండి సమకూర్చుకొనును వానిని తాను జీర్ణము చేసుకుని జ్ఞానమును ప్రభవింప జేయును. అటులనే, నా నుండి పొందుటకు, యెంతగానో ప్రయత్నము చేయవలసి యున్నది ఈ లోకము నుండి మంచిని పొందుటకు మానవులకు ఋషులు అనేక విధులను నిర్ణయించిరి అనేక యాగములు, కర్మలు పరలోకప్రాప్తికై యేర్పరచిరి సరియైన మార్గములో నడచి పూర్వులు నిర్ణయించిన విధులు శ్రద్ధతో పాటించిన వారు తప్పక లాభమును పొందగలరు ప్రజలందరూ ధర్మపరులైనపుడు, ఋషులు నిర్దేశించిన వానిని వారు చేయుచుందురు

''కాని కాలక్రమములో వేనుని వంటి పాపాత్ములు నన్ను పాలింపదొడగిరి ఈ భూమిపై పాపము విస్తృతమయ్యెను దొంగలు, దుర్మార్గులైన రాజులు నన్ను వేధింపగా, నన్ను రక్షించువారు లేకపోయిరి. ఆ విధముగా ప్రతిఒక్కరు నన్ను విస్మరించుటచేత, బ్రహ్మ కానుకలుగా యిచ్చిన విలువైన మూలికలు, యితర పోషకపదార్థములు, అనర్హులచేతిలో దుర్వినియోగమగుచున్నవని గ్రహించితిని ప్రజలు యీ ధాతువులను,

మూలికలను యితర పదార్థములను వినియోగించుట కనర్హులని తలచి, వానిని నేను దిగమ్రింగితిని. నేను వానిని దాచివేసితినని నీవు అనుట సమంజసముగనే యున్నది. ఈ భూతలముపై అవి యిక మొలకెత్తలేవు. ఇక నానుండి ఉత్తమమైన వానిని బయటకు తెచ్చుట నీ చేతిలో నున్నది. నీవు సరియైన ప్రక్రియ చేత నాలోనున్న వాని నన్నింటినీ బయటికి తెప్పించగలవు.

''నేను పాలను పిదుకుటకు నాకొక దూడనిమ్ము. నీవు సరియైన పాత్ర నొకదానిని తెచ్చినచో, అందు పాలను పిదుక వచ్చును. పాలను పిదుకుటకు తగిన వ్యక్తిని చూడుము నా ఉ చేసినచో వర్షపునీరు నిలుచును, లేకున్న నీరు ప్రవహించిపోయి బీడుభూమిగా నుండును''. భూమాత మాటలను పృధుమహారాజు వినుచుండెను. అతని చేతినుండి అమ్ము, భుజమునుండి అప్రయత్నముగా విల్లు జారి క్రిందపడెను అతని నేత్రములు ఆలోచనా పూరితములయ్యెను. పృథు వామెతో నిట్లుపలికెను ''భూదేవీ! నీవు పలికినది సమంజసముగా నున్నది. నీ నుండి ఎక్కువ లాభమును పొందుట నాకర్తవ్యమై యున్నది మానవుడు కృషి చేయవలెను. విన్ను దున్ని, విత్తనములు నాటి, మొక్క అయిన తర్వాత పోషించవలసి యున్నది స్వర్గవాసులు ఆయా ఋతువులలో వర్షములు కురిపించగా, మానవుల కృషికి నీవు తగిన ఫలితము నిచ్చెదవు నీ విలువను మానవులు విస్మరించిరి విస్మరించినను నీవు లాభమొనగూర్తువని వారు తలంచిరి ''భూదేవి ఓర్పు'' అనే నానుడి చిరకాలముగా వాడుకలో గలదు అట్టి నీ ఓర్పు నశించినదనగా, యీ లోకము పాపభూయిష్ఠమైనదనుట స్పష్టము విచారించవద్దు నేను సరిదిద్దెదను''

## 47 భూదేవి నుండి పాలుపిండుట

చాలా సేపు తనలో తాను ఆలోచించి, మనువును దూడగాచేసి తాను స్వయముగా పాలుపిదుకుటకు నిశ్చయించుకొనెను. భూమాతనుండి ఆమెలో దాగియున్న మూలికలు, విలువైన ధాతువులను, తన ప్రజల ఉపయోగార్థము, పిండసాగెను. ప్రతిఒక్కరితో సరియైన దూడ, పిదుకువాడు ఉన్నచో, ఆమె నుండి వారు కోరినదానిని పొందవచ్చునని చెప్పెను

జ్ఞానులు ఆమెనుండి జ్ఞానమును పిదికిరి బృహస్పతిని దూడగజేసి, ఋషులు వేదము అను క్షీరమును పిండసాగిరి. ఈ క్షీరము నుంచుటకు వాక్కు, శ్రవణము, మనస్సులతో జేసిన పాత్రను వినియోగించిరి దేవతలు ఇంద్రుని దూడగా నొనర్చి ఒక బంగారుపాత్రలో ఆమె నుండి సోమరసము (అమృతము), వీర్యము, ఓజస్సు, బలమును పిండిరి. దైత్యులు, దానవులు ప్రహ్లాదుని దూడగాజేసి, ఒక యినుపపాత్రలో సుర, ఆసవములను నింపిరి గంధర్వులు అప్సరసలతో కలిసి, విశ్వావసును దూడగా జేసి పిదుకగా పద్మములతో చేసిన పాత్రయందు సంగీతమను క్షీరము లభించెను. ఆ సంగీతము మధురమైన స్వరములతో కూడి వినుటకెంతో రమ్యముగా నుండెను.

పితృదేవతలు అర్యముని దూడగా చేసి పిదుకగా, కాల్చని మట్టిపాత్రలో గుర్రములకు ఆహారమైన గవ్యము లభించెను. కపిలుని దూడగా జేసి సిద్ధులు భూమినుండి అణిమాది సిద్ధులను గ్రహించిరి విద్యాధరాదులు యధేచ్ఛగా ఆకాశములో విహరించు శక్తిని సంపాదించిరి. కింపురుషులు మయుని దూడగాచేసి, మాయ అనే

క్షీరమును పిదికిరి

యక్ష, రాక్షస, భూతపిశాచములు రుద్రుని దూడగను, పుర్రెను పాత్రగను జేసి, ద్రాక్షరసము రక్తము కలిపిన ద్రవమును పిదికిరి సర్పములు తక్షకుని దూడనుజేసి భూమి నుండి విషమును గ్రహించినవి. పుట్టను పాత్రగా జేసినవి. గోవులు యెద్దును దూడగా జేసి, కావలసినంత పచ్చగడ్డిని రాబట్టినవి.

వృక్షములు రావిచెట్టును దూడనుజేసి, ప్రాణాధారమైన రసమును భూమినుండి గ్రహించినవి హిమవంతుని దూడగాజేసి పర్వతములు భూమినుండి శంఖములు, యితర విలువైన వస్తువులను లభింపజేసుకొనెను

భూమాతనుండి ప్రతిఒక్కరూ వారికి కావలసిన వానిని పొందిరి; వారు, వారిలో ఉత్తముని దూడగా నియోగించిరి

భూమాత సమృద్ధిగా అందరకూ యిచ్చిన కానుకలకు పృథువు సంతోషించి, ఆమెను తన ప్రియపుత్రికగా స్వీకరించెను. అప్పటినుండి, భూమాత పృథ్వియను పేరు పొందెను.

తన వింటి కొప్పుతో పర్వత శిఖరాగ్రభాగమును పగులగొట్టి, ఆ మట్టితో భూమిలోని బొరియలను పూడ్చి సమతలముగా నుండునట్లు చేసెను ప్రజల హృదయములను చూరగొన్న మొట్టమొదటి రాజు పృథువు. అప్పటినుండి దేశమును పరిపాలించు రాజులను 'రజన్' అని పిలుచుచుండెడివారు ప్రజలను రంజింపచేయుటచేత యీపేరు సార్థకమయ్యెను. 'రంజయతి ఇతిరాజ'. పృథువు ఆది రాజు అయ్యెను

## 48 తొంబదితొమ్మిది అశ్వమేధములు

సరస్వతీ నది ఒకచోట మలుపు తిరిగి యుండుట గమనించవచ్చును. ఈ స్థలము వద్ద నదీ ప్రవాహవ మళ్ళీ తూర్పు దిక్కుగా ప్రవహించుట ప్రారంభమగును. ఇచ్చట నుండియే దృషద్వతి యను నది సరస్వ కలిసి ప్రవహించును ఈ రెండునదుల నడుమ ఒక ప్రదేశము గలదు. దేవతలు ఆ ప్రదేశమును పవిత్రషై భూమిగా పరిగణించి, బ్రహ్మావర్తమనుపేరుతో పిలుచుచుండిరి.

ఆ పవిత్ర స్థలమందు అశ్వమేధ యాగములు జరుపుటకు పృథుమహారాజు నిశ్చయించెను. మహారాజు నిశ్చయము వినిన ప్రజలు ప్రతి ఒక్కరును వలసిన వస్తువులను కానుకలుగా తెచ్చిరి. భూమి గోవు రూపము ధరించి, యజ్ఞశాలలో అవసరమైన వస్తువులనన్నిటిని, పాలు, వెన్న, హవిస్సు, యితర పవిత్ర వస్తువులను, పిదుకసాగెను. నదులు యజ్ఞశాలవరకు ప్రవహించి, ద్రాక్షరసము చెరుకు రసము నందిచ్చెను. వృక్షములు తేనెతో నిండిన ఫలముల నిచ్చెను. సముద్రము విలువైన వజ్రము, కెంపు, నీల, పచ్చ, మొదలైన రాళ్ళను, పర్వతములు నాలుగు రకములైన భోజన పదార్థములను తెచ్చియిచ్చెను. ఆహూతులందరూ చేతుల నిండుగా కానుకలను తెచ్చి రాజునకు యిచ్చిరి.

నారాయణుడు, బ్రహ్మ, మహాదేవుడు, దిక్పాలకులు, దేవర్షులు, గంధర్వులు, అప్సరసలు యజ్ఞశాలకు

విచ్చేసిరి తొంబది తొమ్మిది యజ్ఞములు పూర్తి అయ్యెను.

నూరు యజ్ఞములు పూర్తిచేసి, 'శతక్రతుడు' గా పేరొంది ఇంద్రపదవిని పొందిన ఇంద్రుడు, తన స్థానమునకు భంగము కలుగునేమోయని ఆందోళన చెందెను. పృథుమహారాజును అందరూ శ్లాఘించగా, అతని వైభవమును జూచిన ఇంద్రునకు అసూయ కలిగెను ఒక మానవుడు తనకంటె గొప్పవాడగుట ఇంద్రుడు సహించలేకపోయెను అందుచేత నూరవ యజ్ఞమునకు ఆటంకము కల్గించి పూర్తి కాకుండ చేయుటకు నిశ్చయించుకొనెను

నూరవ యజ్ఞము జరుగుచుండగా, ఇంద్రుడు పాషండుని వేషము ధరించి, యజ్ఞాశ్వమును దొంగిలించెను ఆవేషము ఒక కవచముగ పనికివచ్చెను అందరకూ అతడొక పవిత్రమైన సాధువువలె గోచరించెను. పృథువు కుమారుడు దొంగిలించిన వానిని పట్టుకుని యజ్ఞాశ్వమును రక్షించుటకు సన్నద్ధుడయ్యెను అత్రిమహర్షి రాకుమారునికి యజ్ఞాశ్వముతో నున్న ఇంద్రుని జూపెను యువకుడైన రాకుమారుడు దొంగను వెంబడించెను. దగ్గరకు వెళ్ళుసరికి, కాషాయ వస్త్రములను ధరించి శరీరమునకు బూడిద పూసుకుని జడలు కట్టియున్న సన్యాసిని కాంచెను. పొరపాటున ఒక సన్యాసిని వెంబడించుచున్నానని తలచి, అతనికెట్టి హానియు కలిగింపకుండెను తిరిగివచ్చిన యువరాజుతో అత్రి యిట్లనెను ''కుమారా! ఈ యజ్ఞాశ్వమును దొంగిలించిన వాడు ఇంద్రుడు అతడు దేవతగా నుండుటకు అనర్హుడు. అతనిని చంపుటయే తగిన శిక్ష ఆ విధముగా చేయుటకు సంకోచింపవద్దు'' మరల రాకుమారుడు, దైవమున కపచారము గావించు ఇంద్రుని వెంబడించుటకు వెళ్ళెను అశ్వమును వదలి ఇంద్రుడు అదృశ్యమయ్యెను విజయముతో యజ్ఞాశ్వమును తీసుకుని రాకుమారుడు యజ్ఞశాలలో ప్రవేశించెను అతని విజయమునకు సంతోషించి రాకుమారుని 'విజితాశ్వు'డను పేరుతో పిలుచుచుండిరి మరొక పర్యాయము ఇంద్రుడు తన జిత్తులను ప్రయోగింప యత్నించెను అకస్మాత్తుగా యజ్ఞశాలను చీకటి ఆవరించెను ఆ చీకటిని తోడుపాటు చేసుకుని, కట్టుకొయ్యకు బంగారు గొలుసతో గట్టిన అశ్వమును గొలుసుతో సహా దొంగిలించెను అక్కడచేరిన ఆహూతులకు అత్రి ఇంద్రుని చూపెను మరల ఇంద్రుడు సన్యాసివలె వేషము ధరించుటచేత, విజితాశ్వుడు మరొకసారి అతడు పవిత్రుడని తలచి మోసపోయెను. తిరిగి అత్రిచే ప్రేరేపితుడై, తేలికగా మోసపోయినందుకు క్రోధావిష్టుడై, విజితాశ్వుడు తన వాడి బాణమును ఇంద్రునిపై ప్రయోగించెను అశ్వమును వదలి ఇంద్రుడు అదృశ్యమయ్యెను.

ఇంద్రుని నక్కజిత్తులు ప్రజలపై తీవ్రప్రభావమును కలిగించెను అతని వేషము ఆకర్షకముగా నుండి మోసపుచ్చుచుండెను. అందరినీ ఆకట్టుకునే రూపము గలిగి పరమ పవిత్రుడనే భావము అందరికీ కలిగించెను; కాని అట్టి పవిత్రత అతనిలో లేకుండెను అయితే యింద్రుడవలంబించిన యీ పద్ధతులను ప్రజలు వారి స్వార్థ స్వప్రయోజనములకు అనుసరించుచుండిరి. ఆషాఢభూతులు, దొంగసన్యాసులు యీ భూమిపై సంచరింప మొదలిడిరి. నిజమైన సన్యాసులకు దొంగ సన్యాసులకు భేదము తెలియకుండెను

పృథువు యిదంతయు జూచి, ఇంద్రునిపై ఆగ్రహము చెందెను. విల్లమ్ములను స్వీకరించెను. అతని కోపమును జూచిన ఋత్విక్కులు బాణమును సంధింపకుండ ఆపుచేసిరి, వారిట్లనిరి ''ఓరాజా! ఇట్లు చేయుట తగదు. నీవు యజ్ఞదీక్షితుడవు. నీవు యింకొకరిని చంపుటకు వీలుకాదు, వేదవిహితమైన కర్మలు శాసించిన తప్ప అట్లు చేయుట సమంజసము కాదు అయితే, మేము శక్తివంతమైన మంత్రములచేత ఇంద్రుని యజ్ఞశాలకు రప్పించి, అతనిని అగ్నికి ఆహుతి చేసెదము''. ''అట్లే జరుగనిండు'' అని పృథువు పలికెను వారు ఆ మంత్రముల నుచ్చరింప బోవుచుండగా బ్రహ్మ అడ్డుపడి యిట్లనెను ''మీరు తలపెట్టినది సమజంసము

కాదు. వీరు రప్పించి ఆహుతి చేయనున్న ఇంద్రుడు నారాయణుని అవతారము. అందుచేత అతనిని అవమానింపదగదు ఆకూతి స్వాయంభువమనువుల మనుమడైన యజ్ఞుడు ఆ మన్వంతరమందు ఇంద్రుడుగా నుండెను. నారాయణుడే యజ్ఞుడుగా అవతరించెను ఇంద్రుడు ధరించిన వేషములు యెట్టి తీవ్ర పరిణామములు కల్గించెనో గమనించుడు ఈ పాషండ వేషమును పాపులకై సృష్టించెను వీటి మూలమున పాపము, మోసము వృద్ధిచెందును. ఈ పాపమును మరింతగా అభివృద్ధి చెందనీయవద్దు నీ నూరవయజ్ఞము పూర్తిగాకుండా నివారించుటకు ఇంద్రుడు తలపెట్టెను, నీవు ఇంద్రునితో సమానమగుదువని అతడు భావించెను ఇంద్రునిపై నీ ఆగ్రహమును విడిచిపెట్టుము మీరిద్దరూ నారాయణుని అవతారములు. మీరు యిద్దరూ స్నేహితులు కాలేరా? యజ్ఞమున కంతరాయము కలిగిన విషయము మరచిపొమ్ము క్రోధము చేత నీమనస్సు కలుషితము కారాదు. క్రోధము మానవునిలోని సమత్వభావమును నశింపజేయును క్రోధమునకు ఆస్కారము కల్గించినచో భ్రమ భ్రాంతులకు లోనగుదువు. నామాట వినుము

''దేవతలు చాలా మొండివారు. యజ్ఞమున కాటంకము కల్గించుటకు వారు తిరిగి ప్రయత్నించెదరు ఇంద్రుడు వేయు వివిధ వేషములను మానవు లనుసరించుటచేత, ధర్మము పతనము చెందు ప్రమాదము కలదు. ఈ వేషములు ఆషాఢభూతులను ఆకర్షించి, మానవునికి సహజముగా నుండు ధర్మబుద్ధి అంతరించు ప్రమాదమేర్పడును. ఇంద్రుని యెడల కోపమును మరచిపొమ్ము. ఇక, నూరవయజ్ఞ సమాప్తి గురించి విచారింపకుము మేము నీవు యజ్ఞము పూర్తి చేసినట్లుగా పరిగణించి, యజ్ఞప్రసాదమును అందించెదము''

బ్రహ్మ మాటలను పృథువు వినెను. ఇంద్రునిపై కోపము పోయెను తన సంకుచిత బుద్ధికి సిగ్గుపడి, ఇంద్రుడు పృథువు పాదములపైబడి విశాలభావము నలవరచుకొనెను. పృథ్విపై చక్రవర్తియైన పృధు మహారాజు స్వర్గలోకమునకు రాజైన ఇంద్రుని కౌగిలించుకొనెను.

సంవత్సరములు గడచెను. తనకు వృద్ధాప్యము వచ్చినదని పృథువు తలచెను పుత్రులకు రాజ్యమును వదలి, భార్యతో అడవికేగెను పవిత్ర స్థలములన్నిటినీ దర్శించిన కొంతకాలమునకు తన శరీరమును వదలిపెట్టవలసిన సమయము ఆసన్నమైనదని తెలుసుకొనెను. ఒక ఆశ్రమములో సిర్థపడి, తనకు విముక్తిని కలిగించే యోగము నాచరించుచుండెను

తన భర్త శరీరమును వదలిపెట్టగా, అర్చిస్సుకూడ భర్తతో చితాగ్నియందు ప్రవేశించెను.

పృథువు భూమిని పుత్రికగా స్వీకరించుటచేత యా భూమికి పృథ్వి అనుపేరు కలిగెను.

## 49 ప్రాచీన బర్హి

పృథుమహారాజు అడవికేగిన తర్వాత అతని కుమారుడు విజితాశ్వుడు రాజ్యము పాలించెను. అతని నలుగురు తమ్ముంలను నాలుగు దిక్కులకు పంపి వారా ప్రాంతములు పాలించుటకు యేర్పాటు చేసి, రాజ్యమునంతనూ విజితాశ్వుడు పాలించుచుండెను విజితాశ్వునికి నభస్వతి భార్య వారి కుమారుడు హవిర్ధనుడు. ఇతడు మిగిలిన పిల్లలవలెగాక భిన్నముగా నుండెను యౌవనమునందే రాజ్యపాలనమునందు

ఆసక్తిలేక,పాలన వ్యవహారములందు చిక్కుకుని యుండుటకు తన అయిష్టతను ప్రకటించెను. ముక్తికై తపస్సు చేయుటకు అతడు అరణ్యమున కేగెను.

హవిర్ధనునకు, రాజ్యము విసర్జించుటకు ముందు హవిర్ధని యనుభార్య వలన ఆరుగురు పుత్రులు కలిగిరి. వారిలో జ్యేష్ఠుడు బర్హిష్మదుడు. అతడు సాగరరాజు కుమార్తె శతద్రుతిని వివాహమాడెను. ఆమె అత్యంత సౌందర్యవతి, వారి వివాహ సమయమున, అగ్ని చుట్టూ ప్రదక్షిణము చేయునపుడు ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై అగ్నిదేవుడామెను కోరెనని చెప్పుదురు.

శతద్రుతికి పదిమంది కుమారులు కలిగిరి. వీరు ప్రచేతన సోదరులని పేరు గాంచిరి. దైవభీతి, ధర్మశాస్త్రాధ్యయనము, నారాయణుని యందు భక్తితో వారు పెరుగుచుండిరి. ఈ కార్యములను కొనసాగించమని తండ్రి ప్రేరేపించగా, వారు సముద్రములో ప్రవేశించి ఘోర తపస్సు చేయమొదలిడిరి

రాజైన బర్హిష్మదునకు యజ్ఞములు చేయుటయందు విశేషమైన నమ్మకముకలదు. యజ్ఞములు చేయుట యందుండే అభిలాషచేత, యెల్లప్పుడూ వాటియందు నిమగ్నుడై, ఒక యజ్ఞము తర్వాత మరొక యజ్ఞము చేయుచుండెను కొంతకాలమునకు అతనికిదొక మూఢనమ్మకమాయెను. ఒక యజ్ఞము పూర్తి అయిన మరుక్షణమే మరొక యజ్ఞము మొదలుపెట్టుచుండెను. ఒకానొక సమయమున యీ భూమి అంతయు యజ్ఞములలో వాడుకొను కుశలతో నిండియుండెను. కుశలు భూమినంతయు ఆక్రమించి, కుశల అగ్రభాగము తూర్పుదిక్కుగా నుండుటచేత, రాజునకు ప్రాచీన బర్హిష్మదుడను పేరు కలిగెను

తన కుమారులందరూ సముద్రములో తపస్సు చేయుచుండగా, బర్హిష్మదుడు యజ్ఞములు చేయుటలో నిమగ్నుడై యుండెను నారద మహర్షి జాలి తలచి తనలో విట్లనుకొనెను. ''సజ్జనుడైన యీరాజు జీవితమంతయు కర్మకాండల యందే వ్యర్థము చేయుచున్నాడు. ఇవి ముక్తికలిగించుటకు సహాయము చేయవు. ఇంతకన్న సులభమైన భక్తి మార్గమును తెలిపి రక్షించెదను''.

నారదుడు బర్హిష్మదుని వద్దకు వెళ్ళెను. నారదుని తగువిధముగా గౌరవించి, ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి, అతని పాదములవద్ద కూర్చుండెను. నారదుడు రాజును దేశ క్షేమమడిగి తెలుసుకుని యిట్లనెను. ''ఓరాజా! నీవు అనేక యజ్ఞములు జరుపుటలో నిమగ్నుడవై యున్నట్లు నాకు గోచరించుచున్నది. కాని యీ కర్మకాండలవలన నీవు మోక్షమును పొందలేవు. ఈ లోకములో మానవులు కోరునవి రెండు: దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి కర్మకాండలు చేయుటవలన యీ రెండునూ సమకూరవని జ్ఞానులు చెప్పుదురు. ఈ రెండునూ కాక, వేరే యింకేదైన ప్రయోజనమునకై యీ కర్మకాండలను జరుపుచుంటివా? ఏ ప్రయోజనముకొరకై నిర్విరామముగా యజ్ఞములను జరుపుచుంటివో చెప్పుము''. నారదుని మాటలు విని రాజు యిట్లనెను. ''ప్రభూ! కర్మకాండలో మునిగిన నేను, వేరే ప్రయోజనము గురించి ఆలోచించకుంటిని. ఈ రోజువరకు మోక్షమనునది నామనస్సునందు ప్రవేశించలేదు. మోక్షము లభించుటకు నేనేమి చేయవలెనో దయచేసి నాకు తెలుపగోరెదను ఈ కర్మలయందు నిత్యము నిమగ్నుడనగుట చేత యితర మార్గములు, అనగా యోగములను గురించి నేను తలంపకుంటిని ఒక్క పర్యాయమైనను మోక్షము గురించిన ఆలోచన నాకు కలుగలేదు

''మానవుడు అనేక రకములైన రాగములందు చిక్కుకొని యున్నాడు: భార్యపై , పిల్లలపై అనురాగము, ఇంటిపై మమకారము, సంపద రాజ్యములయందు అపేక్ష. తెలివితక్కువతనము, అజ్ఞానములచేత పరలోక

మును చేరుటకు మార్గములను తెలియలేకున్నాడు. ఈ లోకములోని వ్యవహారములందు తగుల్కొని యుండుటచేత, యీ జీవితము తర్వాత మరొక జీవితము, మరొక లోకము ఉన్నవని, అందుకు ప్రయత్నము సలుపవలెనని యెరుగడు ప్రభూ! ఇంతకాలముగా నేనీవిధముగానే యున్నాను. మీ మాటలు విన్న తర్వాత నాకు మోక్షము గురించిన ఆలోచన కలిగినది. ఇంతవరకు కర్మలయందే ఉండుటచేత ఆలోచించుటకు సమయము లేకుండెను. ఇదంతయు మోక్షమునకు దారి చూపజాలదని మీరు చెప్పగా గ్రహించితిని. నేనిప్పుడేమి చేయవలెను? ఈ కర్మబంధము నుండి విముక్తి పొందు మార్గమును నాకు బోధించవలెను. ఇప్పుడున్న మూఢనమ్మకము విడనాడి నన్ను నేను రక్షించుకొనవలెనన్న, నేనేమి చేయవలసి యున్నది? నాకు సహాయము చేయవలెను''.

నారదుడీ విధముగా పలికెను. ''అనేక యజ్ఞములు ఆచరించుట వలన సముద్రపుటొడ్డున ఉండే యిసుక రేణువులను లెక్కబెట్టుట తేలికగును. నీవు యింతవరకు సాధించినదేమిటో యెరుగుదువా? నీకు చూపించెద ను''. ప్రాసాదపు పైభాగమునకు నారదుడు రాజును తీసుకువెళ్ళెను. అతని యోగశక్తిచేత రాజు యింతవరకు యజ్ఞముల కర్పించిన గోవులను నారదుడు రప్పించి రాజునకు చూపించెను.

నారదుడు యిట్లనెను. ''చూడుము, యజ్ఞము పేరిట వేలకువేలు గోవులను వధించితివి. నీపై పగ తీర్చుకొనుటకై నీ మరణము కొరకు వేచియున్నవి. చాలా ఆగ్రహముతో ఇనుపకడ్డీల వలె ఉన్న తమ వాడికొమ్ములతో నిన్ను పొడుచుటకు పొంచియున్నవి''

రాజు గోవులను, నారదుని చూచెను ఒక్కపలుకైనను పలుకకుండెను తిరిగి ప్రాసాదము క్రిందకు రాజును తోడ్కొని నారదుడు వచ్చి యిట్లనెను. ''నీకు పురంజనుని వృత్తాంతము వివరించెదను. ఇది యీ పర్వతములంత ప్రాచీనమైనది. జాగ్రత్తగా విని ఆనందించుము. అతిచక్కని కథ అపురూప సుందరునికి, సుందరీమణికి సంబంధించినది కూర్చుని నేను చెప్పునది వినుము''

## 50 పురంజన వృత్తాంతము

ఒకప్పుడు పురంజనుడను ప్రఖ్యాతిచెందిన రాజు కలడు అతనికి ఒక స్నేహితుడు కలడు ఈ స్నేహితుని చేతలనుగాని, వాటి నాచరించు పద్ధతిగాని యెవ్వరూ తెలుసుకొనలేకుండిరి అందుచేత అతనిని 'అవిజ్ఞాతు' డని పిలుచుచుండిరి అతని ఉనికి యెవ్వరికీ తెలియకుండెను. అతనిని తలచి రమ్మని కోరితే తప్ప అతడు అగుపించెడివాడు కాడు. పురంజనుడు, అవిజ్ఞాతుడు గొప్ప స్నేహితులు వారిద్దరినీ 'విడదీయరాని' వారుగా లోకులు పరిగణించుచుండిరి వారు యెప్పుడూ కలిసియుండెడివారు ఇట్లు చాలా కాలము జరిగెను

కాలము గడచిన కొలది పురంజనునిలో అశాంతి పెరిగెను అవిజ్ఞాతుడెప్పటివలెనే శాంతిగా నుండెను స్నేహితుడైన అవిజ్ఞాతుడు వారించుచున్నప్పటికీ, పురంజనుడు యింటినీ, స్నేహితుని వదలి యింకొక నూతన వసతి గృహము నన్వేషించుచుండెను తాను పాలించుటకు తగిన నగరము కొరకు లోకమంతయు గాలించెను చాలాకాలము అట్టి నగరమును వెదకుచు సంచరించుచుండెను చాలా ప్రదేశములు తిరిగెను

కాని అతడు కోరుకున్నది లభించలేదు. చాలా నగరములను చూచి వానిలో నివసించుటకు ప్రయత్నించి, అవి తాను పాలించుటకు యోగ్యముగా లేవని తలచి చాలా విచారించెను. ఇంకనూ వెదకుచు తిరుగుచుండెను.

ఇట్లు తిరుగుచుండగా హిమాలయ పర్వతము దక్షిణ సానువులందు ఒక నగరమును కనుగొనెను అది చాలా అందముగా ఉండెను. ఆ నగరమునకు తొమ్మిది ద్వారములు. అనేక స్తంభములు, చుట్టూ బ్రహ్మాండమైన ప్రాకారమును కలవు. నగరముచుట్టూ కందకము, నగరములో అందమైన తోటలు గలవు. నగరములోని గృహములు అత్యంత సుందరముగా నుండెను వానిని బంగారము, వెండి, యినుముతో నిర్మించి, లోపల విలువైన నవరత్నములు పొదిగినారు. ఏడు అంతస్తుల మేడ ఒకటి కలదు. వీధులు విశాలముగను, పొడవుగను ఉండెను. అంగడివీథులు ద్యూతగృహములు పెక్కుగలవు. పట్టు పగడములతో అలంకరించిన స్తంభములు ప్రతిచోట కన్పించుచుండెను ఆ నగరము పేరు భోగవతి.

ఆ నగరమును ఆనుకొని స్వర్గతుల్యమైన తోట ఒకటి కలదు. స్వర్గములోనున్న వృక్షములన్నియు అచ్చట గలవు. పక్షులు, తుమ్మెదలు మధురమైన సంగీతము విన్పించుటలో పోటీపడుచుండెను. అచ్చట ఒక సరస్సు గలదు. ఆ సరస్సు మీదుగా చల్లని పిల్లవాయువులు వీచుచుండెను. ఆ వాయువులు అసంఖ్యాకమైన పువ్వుల పరిమళముతో నిండియుండెను. సరస్సు ఒడ్డునున్న వృక్షములు చల్లని నీడ నిచ్చుచూ ఆ ప్రదేశమునకు అందము చేకూర్చుచుండెను. మామిడి తోటలో కోకిలలు మధుర గానమును విన్పించుచుండెను. ఆ ప్రదేశ సౌందర్యమునకు తన్మయము చెందుచు పురంజనుడు అచ్చట సంచరించుచుండెను

ఇంతలో అతనికి కనుచూపు మేరలో ఒక అందమైన స్త్రీ కన్పించెను. ఆమె ఒక అప్సరసయని అతడు తలచెను. ఆమె ఆకారము చాలా ఆకర్షణీయముగా నుండెను. ఆమె కనులు, ముఖము, పెదవులు, పిరుదులు, అందమైన కుచములు మత్తెక్కించునట్లుగా నుండెను. ఆమె నేత్రములు అటు నిటు చూచుచుండెను, సీతాకోకచిలుక రెక్కల నాడించినట్లు, ఆమె కనురెప్పలు ఆడుచుండెను ఆమె అతనివైపు చూచి, తర్వాత అతనికి దూరముగా దృక్కులను మరల్చెను ఆమె చెవులకు ధరించిన కాంచన తాటంకములు చెవిలో రహస్యములు చెప్పగా, ఆమె సిగ్గుపడుచుండెను. నల్లగా నున్న ఆమె నడచి కదలుచుండగా, ఆమె రూపము చూపరుల నాకట్టుకొనుచుండెను.

ఆమెనే చూచుచు, ఆ స్థలములో పురంజనుడు నిలబడి అతుకుకొనిపోయెను. ఒక క్షణము తర్వాత తెప్పరిల్లి, ఆమె వెంట నున్న పరిచారకులను కాంచెను. పదిమంది పరిచారకులు, ఒకొక్క పరిచారకునకు నూరుమంది సఖులు ఉన్నట్లు అతనికి తోచెను. అయిదు శిరస్సులు కలిగిన నాగుపాము ఒకటి ఆమెను రక్షించుటకా యన్నట్లు, ఆమె ముందు నడచుచుండెను.

ఇతరుల నుండి దృష్టిని మళ్ళించి, పురంజనుడు తిరిగి ఆమెనే చూచుచుండెను ఆమె కళ్ళతో మాట్లాడు తీరు, నిట్టూర్పులు విడిచినపుడు ఆమె కుచములు పైకి క్రిందికి యెగసే తీరు, వాటిని పట్టుపయ్యెదతో కప్పుటకు ప్రయత్నించి విఫలమైన తీరు, బొటన వ్రేలితో నేలపై వ్రాయు చిత్రముల తీరు, యివన్నియు అతని ఉనికి ఆమెకు అయిష్టము కాదని, పైగా ఆమెకు కూడ తనయందు వ్యామోహము కలదని పురంజనుడు గ్రహించెను ఆమె పెదవులపై చిరునవ్వు మెరయగా, అతడామె చేరువకు వెళ్ళెను. ఆమెతో మాట్లాడకున్న యిక బ్రతుకలేనని అతడు నిశ్చయించుకునెను.

అతడామె నిట్లడిగెను ''నీవు యెవరో తెలుసుకొనగోరుచున్నాను నీవు చాలా అందముగా నున్నావు లేడి కనులవలె భయముతో నున్న నీ కనులు నాకు పిచ్చెక్కించుచున్నవి. అవి పద్మ దళములవలె నున్నవి నీవు యెవరి పుత్రికవు? ఎచ్చటనుండి వచ్చితివి? ఏ ప్రదేశమునకు చెందినదానవు? ఈ భూమిపై నున్న అందచందములను తిలకించుటకు స్వర్గము నుండి దిగి వచ్చితివా? ధర్మునకు భార్యయైన శ్రీ వా? లేక మహాదేవుని భార్య, భవాని వా? బహుశః నారాయణుని భార్యయైన లక్ష్మీదేవివి కావచ్చు. నీ అందము అసామాన్యమైనది ఏమిటి ఆలోచించుచున్నావు? నీవు ఆలోచనలో మునిగియుండగా, యీ పద్మము నీ చేతి నుండి క్రిందపడుట గమనించకుంటివి. నీ పాదములు భూమి నంటి యుండుటచే నీవు స్వర్గము నుండి రాలేదని గోచరించుచున్నది నీవు యీ భూమికి చెందిన దానవే అందము చేత నన్ను ఆకట్టుకొనుటకు నీవు వర్తించు తీరు నన్ను బానిసగా చేసినవి. నీ అందమైన నల్లని కనులకు నేను వశుడ నయినాను నీవు నా దానవు కాగలవా? నీ ప్రేమలో పడినాను. నాకు భార్యవై సంతోషపెట్టుము ఈ పరిచారకులు - పదిమంది పురుషులు, వారివెంట నున్న వందల కొలది స్త్రీలు, యెవరో చెప్పుము. నీ ముందు యీ భయంకరమైన పాము యెల్లప్పుడూ ఉండుట యెట్లు సాధ్యమగును? నాకు అంతయూ గందరగోళముగా నున్నది. నీ కనులెత్తి నా వైపు చూడుము''

చిరునవ్వుతో, మాటలు తడబడగా, ఆమె యిట్లనెను ''నేను యెవరో, నన్ను యెవరు సృష్టించిరో నాకు తెలియదు. ఈ నగరమునకు చెందిన దాననని, యిక్కడ నివసించుచున్నానని మాత్రమేనాకు తెలియును ఈ నగరము నెవరు నిర్మించిరో కూడ నాకు తెలియదు

''ప్రభూ! ఈ పురుషులు నా సహచరులు. వారి సహచరులైన యీ వందలాది స్త్రీలు నాకునూ చెలులే. ఈ అయిదు శిరస్సుల పాము నేను నిద్రించునపుడు యీ నగరమును రక్షించుచుండును. ఇది యెల్లపుడూ నాతో నుండును. నీవు నా వద్దకు వచ్చుట నా మహద్భాగ్యము. నీవు సౌఖ్యము నన్వేషించుచు యిక్కడకు వచ్చితివి నేను, నా స్నేహితులతో కలిసి, నీ కోర్కెలను తీర్చగలను. నీవు యీ నగరమునకు ప్రభువుగా నుండవచ్చును. నేను నీకు తోడుగ నీ ప్రక్కనే యుండెదను. నిండుగా నూరు సంవత్సరములు ఆనందనమును గ్రోలుచు నీవు ఉండవచ్చును. నాకు భర్తగా నుండదగిన ఆదర్శ పురుషుడవు. ఇంద్రియ సుఖములయెడ విముఖత కలిగి, యెప్పుడూ మృత్యువునే తలచుచు భవిష్యత్తునే ఆలోచించుచూ ఆందోళన చెందే పురుషులతో నేను యెన్నడూ సుఖముగా ఉండలేను. అట్టి పురుషులు నాకు ప్రియులు కారు. రేపటి గురించి ఆలోచన కాని, మృత్యువనగా భయముగాని నీకు లేవు వర్తమానములో కలిగే సుఖముతో నీవు సంతృప్తి చెందెదవు. స్త్రీ పురుషుల మధ్య ప్రేమను మించిన దేదియు లేదు. ఆ సుఖము మరి దేనివల్లను కలుగదు. నీవు నన్ను కాంక్షించుచున్నావు, నేను నీయందు ప్రేమ కలిగియున్నాను. నాతో వచ్చి యీ భోగవతీ నగరములో యితర ఆలోచనలు లేకుండ సంతోషముగా జీవించుము''

# 51 పురంజనుని సుఖ జీవితము

ఆమె పేరు పురంజని ఆమె పురంజనునితో నవ ద్వారములున్న ఆ నగరములో నివసించుచుండెను. ఆ రాకుమారినే అంతరంగమున నిత్యము నిలుపుకొని ఆనందముననుభవించుచు ఆమెను ఒక క్షణమైనను విడిచిపెట్టక సుఖముగా గడుపుచుండెను ఆమె యేమి చేసిన తానది చేయుచుండెను ఆమె కోరికలే తన కోరికలుగా నుండెను ఆమె ద్రాక్షరసము సేవించవలెనని కోరినచో తాను కూడ అట్లే కోరుచుండెను ఆమెకు ఆకలియైనపుడే తనకు ఆకలి యయ్యేడిది ఆమె పాట పాడునపుడు తాను ఆ పాటలోని మాట అయ్యేడివాడు ఆమె యేడ్చునపుడు తాను కన్నీరు కార్చేవాడు ఆమె నవ్వినపుడు తానుకూడ నవ్వేవాడు ఆమె పలికిన మాటలనే తాను పలుకుచు, ఆమె వినుచున్నవానినే తాను వినుచుండెడివాడు ఆమె ఆఘ్రాణించు వానినే అతడు ఆఘ్రాణించెడివాడు.ఆమెకు యేది అసహ్యమో, అతడు కూడ దానినే అసహ్యించుకొనెడివాడు సూక్ష్మముగా చెప్పవలెనన్న, ఆమె లేక అతడు లేడు అతని కామె సర్వస్వము

పురంజనునికి కాలము తెలియుటలేదు అతనికి గడచిపోయిన రోజులు కొద్ది క్షణములవలె గోచరించెను వారికి పుట్టిన పిల్లలు పెరుగుచుండిరి కాని అతడిని ఒకబానిసగానే చూచుచుండెను అతడు వృద్ధాప్యము సమీపిస్తున్నదని గ్రహించకుండెను అతనికిప్పుడు వయస్సు 50 సంవత్సరములు ఆమెపై అతని కామము పదింతలు వృద్ధి చెందెను, మరియు పిల్లలపై అనురాగము పెరుగుచుండెను అతని ఆలోచనలు భార్య, పిల్లలపై మమకారముతో నిండియుండెను

సాంప్రదాయము ననుసరించి అతడు యజ్ఞములు, యాగములు జరిపెను కాని ఆమెపైగల ప్రేమ, ఆమె వలన యింకనూ పొందగల సుఖములు, వీనితో అతని మనసు యెప్పుడును నిండియుండెను కాలము అతి తొందరగా గడచిపోవుచున్నదనియు, అతని యౌవనమెప్పుడో అంతరించినదనియు ధ్యాస అతనికి లేకుండెను కామముతో నిండిన వ్యక్తి వృద్ధాప్యమునకు స్వాగతము చెప్పడు, కాని అతనిలో వృద్ధాప్యము ప్రవేశించి యుండెను

చండవేగుడను గంధర్వ నాయకునకు మూడువందల అరువది మంది శక్తిమంతులైన సేవకులు గలరు. వీరిలో ప్రతి ఒక్కరికి అదే సంఖ్యలో సేవికలు గలరు. పురుషులు తెల్లగను, స్త్రీలు నల్లగను యుండిరి. భోగవతి పట్టణముపై చండవేగుడు దండయాత్ర సలిపెను. సేవకులు, సేవికలతో అతడు భోగవతి పట్టణమును ముట్టడించెను ఆ పట్టణము అన్ని ప్రక్కలను చుట్టుముట్టి ధ్వంసము చేయ సంకల్పించుకొనెను. ఆ పట్టణమును అయిదు శిరస్సులు గల ప్రజాగరుడను పాము కాపాడుచుండెను. పట్టణముపై దాడి చేయుచున్న శక్తులను ఆపుటకు ప్రజాగరుడు విఫల ప్రయత్నము చేసెను. ఏడువందల యిరువది మంది బలగమున్న శత్రువుతో ధైర్యముగా పోరాడెను వారి మధ్య పోరాటము నూరు సంవత్సరములు సాగెను ప్రజాగరుడు శత్రుధాటికి తట్టుకొనలేకపోయెను పరిస్థితులు పురంజనునికి చాలా విచారము కలిగించెను. పురంజనుడు నగరమునకు వచ్చి, ఆమెను కామించి ఆమెతో జీవించుట మొదలు పెట్టిన రోజు నుండియే దాడి కొనసాగెను కాని అతడు భార్య పిల్లల యందు అనురాగముతో యెల్లప్పుడూ చింతించుటచేత, చండవేగుని దాడిపట్ల శ్రద్ధ చూపకుండెను. ఇప్పుడు, నెమ్మదిగా, చండవేగుని దాడి గురించిన ఆలోచనలు ప్రవేశిస్తున్నవి. కాని జరుగుచున్న దాడి గురించి ఆలోచించుటకు అతని మనసు ఒప్పకుండెను

కాలమునకు జర యను పుత్రిక గలదు దురదృష్టవశాత్తు ఆమె అనాకారిగా నుండుట చేత, యెవ్వరును ఆమెను చేబట్టుటకు అంగీకరింపకుండిరి ఆమె భర్త కొరకు అన్వేషించుచు చాలా ప్రదేశములు సంచరించెను. ఆమె యెన్ని ప్రయత్నములు చేసినప్పటికీ, అందరూ ఆమెకు దూరముగా తొలగుచుండిరి. ఒకసారి ఆమె నారదుని కలుసుకొని అతడిని ప్రేమించ మొదలుపెట్టెను భార్యగా చేబట్టమని ఆమె నారదుని అడిగెను నారదుని చేత తిరస్కృతయైన ఆమెకు ఆగ్రహము కలిగి, తనదైన గృహము లేక యెల్లపుడూ లోక సంచారిగా నుండునట్లు ఆమె నారదుని శపించెను తిరిగి ఆమె భర్తకై అన్వేషించుట కొనసాగించెను ఆమె యవనేశ్వరుడను (కాలయవనుడు) పేరు గల వాని వద్దకు వెళ్ళి తనను భార్యగా స్వీకరించమని కోరెను ఆమెను చూచి జాలిపడి, దయతో అతడిట్లనెను ''నా మాట వినుము. నేను నిస్సంకోచముగా పలికే పలుకులకు నాపై ఆగ్రహింపకుము నీవు అందకత్తెవు కావు అంతేకాక నీవు యెవరికీ మంచి చేయబోవుట లేదు. అందుచేతనే నిన్నెవరూ భార్యగా స్వీకరించుటకు అంగీకరించుట లేదు. కాని నీ పరిస్థితి చూచి నాకు విచారము కలుగుచున్నది. నీవేమి చేయవలెనో నేను చెప్పెదను: నేను నిన్ను అంగీకరించలేను. నీవు అందరినీ అడుగుచున్నంత కాలము, వారికి వారుగా నిన్ను యెవరూ స్వీకరించరు అందువలన నీకు పదే పదే నిరుత్సాహము కలుగుచుండును కాబట్టి, వారికి తెలియకుండా నీవు వారి నావరించుకొనుము అప్పుడు యీ లోకమంతయూ నీకు బానిస యగును

''నీవు భయపడవద్దు. నేను నీకు అండగా నిలిచెదను. నేను, నా సోదరుడైన ప్రజ్వరుడు, యిరువురము నీకు అండగా నుండెదము ఈ రోజునుండి నీవు నాకు సోదరివి. ఎవ్వరికీ కనుపించకుండ మనము యీ లోకమంతయూ సంచరింతము వారు మనలను గమనించకుండ లక్ష్యపెట్టనపుడు, నీవు ప్రజ్వరునితో కలిసి వారిని పెనవేసుకొనుము మిగిలిన పని నేను కానిచ్చెదను ''

ఆ విధముగా ప్రజా నాశనము సంకల్పించి, వారు ముగ్గురూ సంచరించుచుండిరి వారి సేన పేరు 'భయము'. వారట్లు సంచరించుచూ భోగవతీ పురమునకు వచ్చిరి ఆ పట్టణమును ప్రజాగరుడను పాము రక్షించుట గమనించి, తమ సంకల్పమును నెరవేర్చుటకిది తగిన సమయమని వారు ముప్వురూ భావించిరి.

పురంజనునికి తెలియకుండ జర అతనిలో ప్రవేశించి అతని శరీరమును పూర్తిగా తన వశము లోకి తెచ్చుకొనెను. పురంజనుడేమియు చేయలేకుండెను. కాలయవనుని సేవకులైన యవనులు అన్నివైపులనుండి పట్టణముపై దాడి జరిపిరి. పురంజనుడు మిక్కిలి బాధతో సతమతమగుచుండెను. జర పురంజనుని పూర్తిగా వశము చేసుకొనెను. మరొకప్రక్క చండవేగుడు పట్టణము నాక్రమించెను ఎవ్వరూ తనను లక్ష్యపెట్టుట లేదని పురంజనుడు గ్రహించెను. అతని పిల్లలు యేమాత్రమూ లక్ష్యపెట్టుట లేదు. తన భార్యపై పురంజనుడు ప్రేమను ప్రదర్శించుటకు ప్రయత్నించునపుడు, ఆమె కోపపు చూపులతో విసరికొట్టు చుండెను. ఇదివరకు వలె ఆమెలో కామమును ప్రేరేపింప లేకుండెను. అతడు కూడ పూర్వము వలె కామక్రీడలు జరుపుటకు తగిన శక్తిలేదని గ్రహించి నిర్విణ్ణుడాయెను.

పురంజనుడు తనచుట్టూ పరికించి చూచెను. తన కనులముందే పట్టణము ముక్కలు ముక్కలు కాగా, యేమియు చేయలేని నిస్సహాయ స్థితిలో నుండెను. ప్రజ్వరుడు పురంజనుని సమీపించెను. ప్రజ్వరునితో అతని సేన 'భయము' అనుసరించెను. పురంజనుడు దుస్థితిలో పడెను. నగర రక్షకుడైన ప్రజాగరుడు యిక యేమాత్రము పోరు సలుప లేకుండెను నిప్పు అంటుకొన్న వృక్షము నుండి తప్పించుకు పారిపోవు పాము

వలె, పురంజనుడు భోగవతి పట్టణము నుండి పారిపోవ జూచెను. నిస్పృహతో నిండిన అశ్రువులు అతని కనుల వెంట రాలుచుండెను. ప్రజాగరుడు పట్టణము విడిచి వెళ్ళుటకు పురంజనుడు యిష్టపడకుండెను, కాని అతడేమి చేయవలెనో అతనికి తెలియకుండెను. అట్లు తీవ్రముగా ఆలోచించుచుండగా, మృత్యువు పురంజనుని తీసుకుపోయెను. అతని మరణముతో, భోగవతీ నగరము ముక్కలు ముక్కలై యేమియూ మిగులకుండెను. అతని పేరు మాత్రము నిలిచిపోయెను.

## 52 అవిజ్ఞాతుడు తిరిగి వచ్చుట

పురంజనుడు మరణింపబోవు సమయమందు తన భార్య పురంజని గురించి ఆలోచించుచుండెను. ఆ కారణముచేత తరువాత జన్మలో అతడు స్త్రీగా జన్మించెను (యద్భావం తద్భవతి). విదర్భ మహారాజునకు పుత్రికగా పుట్టెను. ఆ రాకుమారి అందముగా పెరుగుచుండెను. పాండ్య రాజైన మలయధ్వజుడు విదర్భ రాజపుత్రికను వివాహమాడెను. పాండ్యరాజు నారాయణుని భక్తుడు.

కొంత కాలమునకు వారికి ఏడుగురు పుత్రులు కలిగిరి. వృద్ధాప్యము వచ్చినంతనే పాండ్య రాజైన మలయధ్వజుడు, పుత్రులకు రాజ్యము నప్పగించి, ఏకాంత ప్రదేశములో శాంతి కొరకు వెడలెను. అతని భార్య అతని ననుసరించెను. వెన్నెల చంద్రుని అనుసరించునట్లు, ఆమె పుత్రులను, భోగభాగ్యములను విడిచిపుచ్చెను. పాండ్యరాజు అష్టాంగ యోగము ననుసరించి తపస్సు చేసి బ్రహ్మానుభవమును పొంది, భౌతిక శరీరమును విసర్జించెను.

అతని భార్య వైదర్భి అతనికి సేవలు జరుపుచు అతని అవసరములు తీర్చుచుండెను. ఆమె నార చీరలు ధరించి వ్రతములు సలుపుట వల్ల శరీరము శుష్కించి, తల జడలు గట్టి సంస్కారము లేక యుండెను. పొగలేని శుద్ధమైన అగ్నివలె ఆమె భర్త సమక్షములో ప్రకాశించెను.

భర్త మరణించినట్లు తెలుసుకున్న ఆమె బాధపడి తన కన్నీళ్లతో మృతిచెందిన భర్తకు స్నానము గావించెను. ఆమె కట్టెలను ప్రోగుచేసి దానిపై భర్త శరీరము నుంచి చితిపేర్చెను. అతనితోబాటు ఆ చితి యందు ఆహుతి యగుటకు ఆమె నిశ్చయించుకొనెను.

ఆమె మిక్కిలి బాధతో విచారించుచూ తన అంతిమ యాత్రకు సన్నద్ధమగుచుండగా, ఒక బ్రాహ్మణుడు వచ్చెను. ఆ బ్రాహ్మణుడు పురంజనుని సహచరుడైన అవిజ్ఞాతుడు, ఆమె ప్రక్కగా ఆ బ్రాహ్మణుడు నిలబడి యిట్లనెను. ''ఒక్క క్షణము నా మాటలను వినుము. నీవు యెవరు? ఎవరి భార్యవు? ఈ చితిపై నున్న వ్యక్తి మరణమునకు చింతించుచున్నావు. ఇతడు యెవరు? నీవు యింతగా విచారించుటకు అతనికి నీకు గల సంబంధము యేమిటో ఒకసారి యోచింపుము.''

వైదర్భి యేడుపు మాని, ఆ బ్రాహ్మణుని వంక ఆశ్చర్యముతో చూచెను. బ్రాహ్మణుడిట్లనెను. ''నీవు నన్ను గుర్తు పట్టితివా? చాలా చాలా సంవత్సరముల క్రితం, నీవు భౌతిక వ్యామోహములో చిక్కుకొనక ముందు, నీకు అవిజ్ఞాతుడను స్నేహితుడు కలడని గుర్తున్నదా?'' ఈ మాటలు వినగానే వైదర్భికి జ్ఞప్తి

వచ్చినట్లుగా ఆమె కనులలో తళుకు కన్పించెను బ్రాహ్మణుడు తన సంభాషణనిట్లు కొనసాగించెను. ''మనము యెప్పుడూ కలిసి యుండేవారము మన మెప్పుడూ ఒకరినొకరు విడిచి యుండలేదు అందుకే మనలను 'విడదీయరాని వార' ని అనుచుండెడివారు. మానస సరస్సులో నుండు రెండు హంసలవలె మనముండే వారము. నీవు నాకు అత్యంత ప్రీతి పాత్రుడవు, నేనును నీకు ప్రీతిపాత్రుడుగ నుండెడివాడను .అకస్మాత్తుగా నన్ను విడిచి వెళ్ళిపోయినావు ఇంద్రియ సుఖములకై అశాంతితో నన్ను వదలి వెళ్ళినావు. నవ ద్వారములు గల భోగవతీ నగరమునకు వచ్చితివి ఆ తర్వాత నీవు నన్ను పూర్తిగా మరచితివి కాని నేను యెప్పుడూ నీ శ్రేయస్సునే కోరుచు నిన్ను తలచుచుండెడి వాడను. నేను చాలా కాలము నుండి చేయ సంకల్పించినది నెరవేర్చుటకు సమయ మాసన్నమైనది. తిరిగి నిన్ను కలుసుకుని నిన్ను నాతో తీసుకువెళ్ళుటకు వేచి యున్నాను నీ గురించి చెప్పుటకు నేను వచ్చితిని ఈ వ్యక్తి మరణమునకు విచారించక అతడిని మరచిపొమ్ము. నీవు యిక్కడకు చెందిన దానవు కావు నాతో వచ్చి తిరి ' ' ' ఒక క్షణ మాగి బ్రాహ్మణుడు తిరిగి యిట్లనెను. ''నీవు పురంజనిని వివాహమాడిన వాడవుకాదు, పాండ్యరాజైన మలయధ్వజుని భార్యవైన వైదర్భివి అంతకంటే కాదు ఇదంతయూ నీ అజ్ఞానముచేత కల్గిన భ్రాంతి నీ సహజ స్వభావము నీవెరుగకపోవుటయే అజ్ఞానము ''

ఇది వరలో పురంజనుడుగను ప్రస్తుతము వైదర్భిగను ఉన్నట్టి ఆమె ఆ బ్రాహ్మణుని జూచి కొద్ది కొద్దిగా గుర్తించుచున్నట్లుండి, అతడు చెప్పబోవు మాటలకు వేచియుండెను అవిజ్ఞాతుడు మరల యిట్లనెను. ''యావద్విషయము నీకు నేను వివరించెదను. నీవు నేను ఒకటే మన యిద్దరి మధ్య భేదము లేశమాత్రమైనను లేదు. నేను పరమాత్మను, నీవు జీవాత్మవు, మానస సరస్సనే హృదయమందు మనిద్దరము కలిసి నివసించి నాము మనము యెప్పుడూ కలిసి యుందుము మాయ చేత నీవు భోగవతీ నగరములో అయిదు తలల పాము కాపాడు చుండగా పురంజనితో జీవించితివి. భోగవతి అనునది యీ మానవ శరీరము భోగవతిలోని నవ ద్వారములు, యీ శరీరము యొక్క నవ రంధ్రములు ఇంద్రియ సుఖము లనుభవించు మనస్సే పురంజని నీవు ఇంద్రియ సుఖములతో మునిగినపుడు నీ నిజ స్వభావమును మరచితివి. అవిద్య నిన్ను ఆవరించి మాయలో చిక్కుకుని యుండుట చేత, వాని కారణముగా యేర్పడిన బంధము తప్పని సరి అయ్యెను. ప్రాపంచిక సుఖాభిలాష చేత నీవు మాయలో చిక్కుకుంటివి ఈ సుఖములను కోరుచున్నకొలదీ, యీ సంసార సముద్రములో మరింత లోతుగా దిగిపోయినావు.

నీవు పురంజని భర్తయైన పురంజనుడవు కాదు మలయధ్వజుని భార్యవు కావు ఆత్మకు లింగ భేదము లేదు, అనురాగమనలే లేదు నా ప్రతిబింబమే నీవు అద్దమును మలిన మావరించుటచేత, నీవు యీ శరీరము అని భ్రాంతి చెందినావు ఈ శరీరము అతి సునాయాసముగా చండవేగుని అనగా కాలము చేత ధ్వంసమాయెను. వృద్ధాప్యము (జర), రోగము (ప్రజ్వరుడు) చేత యీ శరీరము నశించును ఇప్పుడు నీవు వాటన్నిటి నుండి విముక్తి పొందినావు నీ గురించిన సత్యమును నీవు మరచినావు ఇకనుండి నీవు నాతో నుండెదవు తిరిగి మనము మానస సరోవరమునకు వెళ్ళి అక్కడ ఒకటిగా తేలియాడెదము''

## 53 కథలోని అంతరార్థము

పురంజనుని వృత్తాంతము నారదుడు వివరించుచుండగా రాజు ప్రాచీన బర్హిష్మదుడు వినుచుండెను కథ పూర్తయిన తర్వాత నారదుడిట్లనెను. ''ఇది బ్రహ్మ విద్య, భక్తులకు తెలియకుండ నారాయణుడు వారి ననుగ్రహించునట్లు, నీవు యీ కథ ద్వారా సత్యమును గ్రహించునట్లు నేను ప్రయత్నము చేసితిని ఒక కథ ద్వారా యీ బ్రహ్మవిద్య బోధన జరిగెను నీలోని ఆత్మకు నాశనము లేదని నీవు గ్రహించునట్లు తెలియచేయుటకు నా శాయశక్తులా ప్రయత్నించినాను నీవు నీవుగా సత్యమును గుర్తించుటయే నేను కోరినది''

ప్రాచీన బర్హిష్మదుడిట్లనెను ''మునీంద్రా! మీరు పూర్తిగా వివరించి చెప్ప కోరెదను నా వంటి సామాన్య మానవులు సత్యమును సులభముగా అర్థము చేసికొనలేరు మరొకసారి యీ కథ యొక్క అంతరార్థమును తెలుపవలెను'' నారదుడిట్లనెను ''తప్పక అట్లే చేసెదను బ్రహ్మవిద్యను బోధించు సంకల్పముతోనే నీ వద్దకు వచ్చితివి. నీవు తెలుసుకొనుటకు చూపే కుతూహలము నాకు సంతోషముగా నున్నది జాగ్రత్తగా వినుము. పురంజన పదముతో ప్రారంభించెదను అంతటా వ్యాపించి యుండే పురుషుడు యీ శరీరము ధరించి దానిని చైతన్యవంతము చేయుచున్నాడు చైతన్యవంతమైన యీ శరీరమే పురంజనుడు ఈశరీరమును నివాస స్థలముగా జేసుకొనుటచేత యిది పుర (నగరము) మని పేరొందినది పురములో నుండుటచేత పురంజనుడయ్యెను.

''కాబట్టి యీ శరీరములో నుండు ఆత్మయే పురంజనుడు అతనిలోని దివ్యత్మము కనిపించనిది, కాని యిది యెల్లపుడూ సరియైన మార్గములో పయనించునట్లు సూచించును అదియే అవిజ్ఞాతుడు.

''ప్రళయానంతరము బ్రహ్మము తప్ప యింకేదియు లేదు కేవలము పురుషుడొక్కడే యుండెను పురుషుని లోని మాయచేత యీ లోకము సృష్టి జరిగిన తర్వాత పురుషుడే ప్రకృతిగా మారెను ప్రకృతి నుండి మహత్తత్వము ఆవిర్భవించి అహంతత్వముగా రూపొందెను అటు తర్వాత జీవాత్మ యేర్పడెను.

''జీవాత్మ అశాంతి చెంది, ప్రాపంచిక వస్తువుల అనుభవమును కోరుచుండెను అతడు తొమ్మిది రంధ్రములు (ద్వారములు) ఉన్న మానవ శరీరములో ప్రవేశించెను తొమ్మిది రంధ్రములు యేవనగా: రెండు కళ్ళు, రెండు నాసికా రంధ్రములు, రెండు చెవులు, నోరు, రెండు బహిష్కరణ గావించు అవయవములు మనసుతో కూడి యీ శరీరము జ్ఞానేంద్రియముల ద్వారా ప్రాపంచిక వస్తువులను గ్రహించి అనుభవించుచున్నది అనుభవము పొందుటకు మనసు అత్యవసరము ఇప్పుడు నీవు భోగవతీ పురమునకు, యీ శరీరమునకు గల పోలికను అర్థము చేసుకొనగలవు. అన్ని అనుభవములకు నిలయమగు యీ మానవ శరీరము భోగవతీ పురము. పురంజనుడు భౌతిక సుఖము ననుభవించుటకు తోడ్పడిన పురంజని మనస్సు, బుద్ధి అని కూడ అందురు. ఆమెతోనున్న పదిమంది సేవకులు పది ఇంద్రియములు - అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు. పురంజని పదిమంది సేవకులకు గల వందల కొలది సేవికలు, యింద్రియములు చేయు అనేక కర్మలు. అయిదు శిరస్సులు గల పాము శరీరములోని ప్రాణము పాము అయిదు తలలు ప్రాణము యొక్క అయిదు రూపములు: ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులు జీవాత్మ కన్ను, ముక్కు, నోరు మొదలైన తొమ్మిది పరికరముల ద్వారా భౌతిక ప్రపంచమందలి వస్తువులను గ్రహించి అనుభవించుచు

న్నది. ఈ తొమ్మిది పరికరములు తొమ్మిది ద్వారములు. ఈ తొమ్మిది ద్వారా పురము (శరీరము)లో ప్రవేశించుట, నిష్క్రమించుట జరుగును.

''భౌతిక ప్రపంచానందము ననుభవించుటకు మనస్సు నిశ్చయించుకున్నపుడు ఆత్మ మనసుతో కూడి యుండుటచేత దాని ననుసరించక తప్పదు. అందుచేత నేను పురంజని చేసినదెల్ల పురంజనుడు చేసెనని చెప్పినాను. తన వ్యక్తిత్వము కోల్పోయెను, అనగా నిజ స్వభావమును మరచెను.

''భోగవతీ నగరములో పురంజనుడు పురంజనిని కలుసుకున్న తోటయే ఇంద్రియములకు సుఖము కలిగించు వస్తు ప్రపంచము. జీవాత్మ మనసుతో చేరి బుద్ధి ననుసరించి యీ వస్తు ప్రపంచమును ఇంద్రియముల ద్వారా అనుభవించుటచేత అతడు పురంజని ఆలోచనలలోనే మునిగి యున్నాడని చెప్పితిని జీవాత్మ సహజ స్వభావమును మాయ ఆవరించి యుండుట చేత యీ లోకములో సుఖ దుఃఖముల ననుభవించుట జరుగుచున్నది

''భోగవతీ నగరములో పురంజనితో నూరు సంవత్సరములు జీవించవచ్చునని చెప్పుటలో అర్థము మానవుని ఆయుః ప్రమాణము నూరు సంవత్సరములని తెలియచెప్పుట చండవేగుడు కాలము, కాల చక్రము తిరుగుచునే యుండును. మూడు వందల అరవైమంది గంధర్వులనగా సంవత్సరములోని మూడువందల అరవై రోజులలోని దినములు (పగలు), నల్లగా నుండే గంధర్వుల సేవికలు రాత్రులు. కాలము శరీరమును ఆవరించి మానవుని జీవితమును, అతడెంతగా పోరాడి దూరముగా నుంచుటకు ప్రయత్నించినప్పటికీ, హరింపజేయును జర యనగా ముసలితనము. ముసలితనమందు శరీరము క్షీణించును అందుచేతనే జర (ముసలితనము)ను యెవరూ ఆహ్వానింపరు. కాబట్టి మృత్యువుతో చేరి యున్నది మృత్యువునకే యవనేశ్వరుడని పేరు శరీరమునకు మనస్సుకు కలిగే రోగములే యవనులు. ప్రజ్వరుడనగా జ్వరము, యిది శరీరములో ప్రవేశించి తొందరగా మరణించునట్లు చేయును.

''శరీరము, మనస్సు అనే ఉపాధులతో చేరిన ఆత్మ 'నేను', 'నాది' అను గుణములను పెంపొందించును ఇవి మనస్సులో ప్రవేశించిన తర్వాత శరీరము, శరీరముతో కూడియున్న జీవాత్మ అనేక సుఖ దుఃఖములకు గురియగును.

''అయితే దీనిని నివారించుట యెట్లు? మానవుడు తన స్వప్నములో అనేక రకములైన అనుభవములను పొందును స్వప్న ప్రపంచములో జీవాత్మ స్వప్నము కాంచు వానితో చేరియుండుటచేత, స్వప్నానుభవములు జీవాత్మకు కలుగుచున్నవి. స్వప్నము నుండి మేల్కొనునంత వరకు, యిది జరుగుచునే యుండును స్వప్నము నుండి తేరుకున్న తర్వాత, స్వప్నమును కాంచిన మానవుడు స్వప్నములో అనుభవించిన దంతయూ అసత్యమని తెలుసుకొనును అనగా స్వప్న యథార్థ స్వరూపమును గ్రహించును. కాని అతడు స్వప్నము నుండి మేల్కొనునంత వరకు, అదంతయు అనగా స్వప్న ప్రపంచము అసత్యమని అతనికి నచ్చచెప్పుటకు యెవ్వరికిని సాధ్యము కాదు. అదే విధముగా, జీవాత్మ శరీరము మనస్సులతో చేరియుండుట ఒక స్వప్నము వంటిది ఎంత తెలివిగల వాదము చేతనైనను అతని సుఖ దుఃఖములు అసత్యమని చెప్పి నమ్మించుటకు సాధ్యము కాదు తనంతట తానుగా సత్యమును గ్రహించవలెనన్న, స్వప్నము నుండి మేలుకొనవలెను''

# 54 స్వేచ్ఛా మార్గము

''నారాయణుని యందు భక్తి మాత్రమే మానవుడు సత్యమును తెలుసుకొనుటకు సహాయపడును. అన్నింటికీ కారకుడు నారాయణుడు; బాధితులందరికీ అతడే శరణ్యుడు భగవద్భక్తి వస్తుప్రపంచముపై మనసుకు విముఖత కలిగించి, జీవాత్మ నిజస్వభావము - జీవాత్మ పరమాత్మకు భిన్నము కాదని - యెరుకపరచును. జనన మరణములనే సంసార సాగరమును దాటుటకు రెండే రెండు మార్గములు కలవు. అవి : భగవత్కథలను వినుచుండుట, రాత్రి పగలు భగవంతుని చింతించుట పురంజన వృత్తాంతములో పురంజనుడు తర్వాత జన్మలో విదర్భ రాజపుత్రిగా పుట్టెనని చెప్పితిని. ఒక సత్పురుషునికి కుమార్తెగా పుట్టి నారాయణుని భక్తుడైన పాండ్యరాజుకు భార్య కావడం అతని అదృష్టము. వారికి ఒక పుత్రిక ఏడుగురు పుత్రులు కలిగిరి

''పుత్రికపేరు ఆశ, అనగా కోరిక. ఆమెకు నారాయణుని కథలు వినుట యందు మక్కువ ఏడుగురు పుత్రులు - శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్యములు. నారాయణుని భక్తులతోడి సాంగత్యము నీవు యీ యేడు విధములుగా భగవంతుని పూజించునట్లు చేయగలదు భగవత్కథలను వినుటకు కోరిక కలిగినపుడు, అనేక విధములుగా అతనిని పూజించవచ్చును. శ్రవణము, అనగా భగవత్కథలను వినుట తరువాత కీర్తన, అనగా భగవంతుని వైభవమును పొగడుట లేక కీర్తించుట స్మరణ, అనగా పదే పదే ఆ కథలను మనస్సులో చింతించి మననము చేయుట. పాదసేవన, అనగా నారాయణుని పాదములపైబడి భక్తితో శరణు జొచ్చుట. అర్చన, అనగా పూజించుట. వందన, అనగా ప్రార్థించుట. దాస్య, అనగా సేవ చేయుట ఈ యేడు విధములుగా నారాయణుని యందు భక్తి కలిగి యున్నచో, మనస్సు కర్మ బంధము నుండి విముక్తిపొందును అటు పిమ్మట, జీవాత్మ తన సహజ స్వరూపమును గుర్తించి, పరమాత్మతో ఐక్యమగును ఆ విధముగా పురంజనుడు 'అవిజ్ఞాత' అయ్యెను

''మరొక ఉదాహరణ ద్వారా యీ బ్రహ్మవిద్యా బోధను విపులీకరించెదను ఒక తోటలో లేడి సంచరించు చుండెను ఆలేడికి జతకుదిరి, తోటలో నున్న పచ్చని గడ్డిని చూసి జీవితాంతము సుఖముగా నుండవచ్చునని భావించెను. ఆ తోటలో పెరుగుచున్న పువ్వులు, చల్లని గాలి లేడికి హాయిని కలిగించగా, ఆ లేడి తన ఆనందమును, సంతృప్తికరమైన జీవితమును యెవ్వరూ భంగపరచలేరని తలపోసెను కాని ప్రక్కనే ఆ లేడిని భక్షించుటకు తోడేలు పొంచి కాచుకుని యుండెను. జతగానితో కూడి అందమైన తోటలో తియ్యని గడ్డిని మేయుచూ చక్కగా వీచే చల్లగాలి ననుభవించుచున్న ఆ అమాయకపు లేడి తోడేలును చూడకుండెను వెనుక మంచి వేటగాడు సంధించే భయంకరమైన అమ్ములను కూడ కానదయ్యెను ఈ భూమిపై మానవుని జీవితము, అజాగ్రత్తగా నున్న దురదృష్టకరమైన లేడివలె నున్నది.

''భౌతిక సుఖములు తోటలో పువ్వుల సుగంధమువలె అనిత్యము. స్త్రీ పురుషులు యీ తోట (ప్రపంచము)లో తాత్కాలిక సుఖముల నన్వేషించుచు సంచరించెదరు. కాలము, తోడేలు వలె, యెల్లప్పుడూ కాచుకొని యుండును. కాని మానవుడు దానిని గమనించడు. వెనుకనే మృత్యువు అనేక వేల రోగములతో వేటగాని అమ్ములవలె నుండును. మృత్యువు ఒక దాని వెనుక ఒకటి వానిని సంధించుచుండును కాని దాని అంతరార్థమును గ్రహింపక మానవుడు ఆ హెచ్చరికలను విస్మరించును''

కొంతసేపు ఆగి, నారదుడు తిరిగి యిట్లు పలికెను. ''ఈ కర్మకాండలు నిత్య సత్యమును తెలుసుకొనుటకు సహాయకారి కావని తెలుపుటకే నీకు ఊహాజనితమైన పురంజనుని వృత్తాంతమును వివరించితిని. యజ్ఞములు జరిపి స్వర్గము చేరగలమని భావించు సామాన్య మానవులకన్న నీవు ఉత్తముడవు నీవు జరిపే యీ కర్మలు భౌతిక సుఖముల నందిచ్చును, వాటిలో నీవు తగుల్కొనుటకు ప్రయత్నించరాదు. అంతకన్న ఉత్తమమైన వాని కొరకు నీవు ప్రయత్నించవలెను భగవంతుని సంతోషపరచి, అతనిని చేరుటకు తగిన కర్మలనే నీవు చేయవలెను సాధువులతోడి సాంగత్యము భగవత్కథలను వినుటయందు కుతూహలమును పెంచును ఇంతకుముందు చెప్పిన యేడు మార్గములు ఆచరించినపుడు, చివరిమెట్టు చేరుకొనగలవు. అదియే ఆత్మ సమర్పణము. అహం పూర్తిగా సమర్పించినపుడు మోక్షము లభించును. ఎప్పుడూ భగవంతునే చింతించువానికి వస్తు ప్రపంచము వలన యెట్టి బాధలు కలుగవు సుఖ దుఃఖములకు ఉప్పొంగుట కాని క్రుంగుట కాని జరుగదు. అతనిలో సమబుద్ధి యేర్పడి బ్రహ్మస్థితికి చేరువగా నుండును జీవాత్మ పరమాత్మలు ఒకటి యగును. అనగా ఒక దానితోనొకటి కలిసిపోవును. తర్వాత జనన మరణములుండవు. కాబట్టి యింతవరకు నీవు అవలంబించు చున్న మార్గము విడిచిపెట్టి, జీవిత శేషమును భగవద్ధ్యానమునందు గడుపుము''

అటు తర్వాత చాలాసేపు నిశ్శబ్దము తాండవించెను. రాజు కంటి వెంట అశ్రువులుకారగా యిట్లనెను. ''ప్రభూ! నిజముగా నీవు అసమాన దయా హృదయుడవై నావద్దకు వచ్చి మోక్షమునకు దారితీయు యేకైక మార్గమును చూపించినావు ఈ సత్యము నా గురువులకు బహుశః తెలియకపోయి ఉండవచ్చును లేక యీ సూక్ష్మ సత్యమును నాకు తెలుపుటకు వారు యిష్టపడకపోయి ఉండవచ్చును. మీరు అనుగ్రహించి బోధించిన దానిని శ్రద్ధగా విని అర్థము చేసుకొనుటకు ప్రయత్నించితిని మీ ఆశీస్సులతో యేడు విధములైన భక్తిమార్గముల ద్వారా నారాయణుని పాదములను చేరగలను నన్ను ఆశీర్వదింపుడు''.

రాజునకు జ్ఞానోదయము కలిగినదని నారదుడు సంతసించి, రాజు నాశీర్వదించి తిరిగి సిద్ధలోకమునకు వెళ్ళిపోయెను. ప్రాచీన బర్హిష్మదుడు కర్మకాండలను విసర్జించెను రాజ్యము పరిత్యజించెను. రాత్రింబవళ్ళు నారాయణుని పాదములనే మనసునందు చింతించుచూ, చివరకు నారయణుని పాద పద్మముల చెంతకు చేరెను

# పంచమ స్కంధము

## 55 ప్రాచేతస సోదరులు

బర్హిష్మదునకు పదిమంది కుమారులు వారిని ప్రాచేతస సోదరులుగా పిలుచుచుండిరి. తండ్రి వారిని తపస్సుచేసి కుటుంబ సంప్రదాయమును నిలబెట్టవలసినదని ఆదేశించెను. తండ్రి ఆదేశము ననుసరించి తపస్సు చేయుటకు అడవి కేగుటకు సన్నద్ధులైరి

వారు పశ్చిమ దిక్కుగా ఒక పెద్ద సరస్సును చూచిరి. అది సముద్రమంత విశాలముగా నుండెను ఎట్టి అలజడులు లేని సాధు పురుషుని ప్రశాంత మనస్సువలె, ఆ సరస్సులో అలలు లేకుండ అందలి నీరు నిర్మలముగా నుండెను. ఆ సరస్సు నందు చేపలు, ఎరుపు, నీలము, తెలుపు వర్ణములు గల పద్మములు తేలుచుండెను. పువ్వుల నుండి తేనెను గ్రహించుచున్న తేనెటీగలు చేయు శబ్దము, నీటి పక్షులు చేయు మధుర గానమునకు ప్రతిధ్వని వలె నుండెను. ఆ సరస్సుపై సువాసనలతో వీచు వాయువులు ఆఘ్రాణించి ప్రాచేతస సోదరులు నిశ్శబ్దముగా అక్కడ నిలుచుండిపోయిరి. వారికి వినిపించు మధుర సంగీతము యెటువైపునుంచి వచ్చుచున్నదాయని చూచుచుండిరి. ఇంతలో ఆకస్మాత్తుగా, ఆ సరస్సు హృదయమునుండి, మహాదేవుడు తన సేవకులతో ఆవిర్భవించెను. అతడు సువర్ణ వర్ణముతో ప్రకాశించుచుండెను. లోక కళ్యాణమునకై మ్రింగిన గరళము చేత నల్లని మెడ అందముగా కన్పడుచుండెను మహాదేవుని ముఖమందు చిరునవ్వు తాండవించగా, ప్రాచేతస సోదరులు ఒక క్షణము దిగ్భ్రాంతి చెంది, మహాదేవుని పాదములపైబడి పూజించిరి వారి నాశీర్వదించి మహాదేవుడిట్లనెను ''మీరు బర్హిష్మదుని కుమారులని, నారాయణుని భక్తులని నాకు తెలియును. తపస్సు చేయుటకు మీరు అడవికి వచ్చిన కారణము కూడ తెలియును. మీకు సహాయపడుటకు నేను వచ్చితిని మీకు నేను చెప్పు మంత్రము వలన మీరు భగవంతుని మానవ రూపములో చూడగలరు.''

మహాదేవుడు వారికి నారాయణుని రుద్రగీతలను బోధించెను తరువాత వారితో నిట్లనెను. ''మీరు ప్రతిరోజు యీ మంత్రమును నిశ్చల మనస్సుతో ఉచ్చరించినచో, మీరు కోరిన దానిని సాధించగలరు'' తరువాత మహాదేవుడు అదృశ్యమైపోయెను.

ప్రాచేతస సోదరులు ఆ సాగరములో ప్రవేశించి దీర్ఘకాలము తపస్సుచేసిరి. నారాయణుడు వారి భక్తికి మెచ్చి ప్రత్యక్షమై యిట్లనెను.'' మీ తపస్సునకు నేను మెచ్చితిని మీకు యేమి కావలెనో కోరుకొనుడు. దానిని మీకు ప్రసాదించెదను మీ కుటుంబ సంప్రదాయమును కొనసాగించమని మీ తండ్రి మిమ్ములను ఆదేశించుట నేనెరుగుదును. మీకు ఒక కుమారుడు కలిగి అతడు ప్రజాపతి యగును అతని కీర్తి లోకమంతయు వ్యాపించి, అతని పేరు చిరస్థాయిగా నిలుచును.

''ఒకప్పుడు కండుడను ఋషి ఘోర తపస్సు చేయుచుండెను. అతని తపస్సుకు అంతరాయము కలిగింప తలపెట్టి, ఇంద్రుడు ప్రమ్లోచ అనే అప్సరసను యీ భూమికి పంపెను. వ్యామోహితుడై

ఆమెతో ఇంద్రియ సుఖములు చాలా కాల మనుభవించెను. వారికొక పుత్రిక కలిగెను. పుత్రికను అడవిలో వదలిపెట్టి ప్రమ్లోచ తిరిగి స్వర్గమునకు వెళ్ళిపోయెను. ఏడ్చుచున్న ఆ పుత్రికను అడవిలోని వృక్షములు చేరదీసెను. ఆ బాలికను చూచి జాలిపడి, చంద్రుడు తన చూపుడు వేలుతో అమృతమును నోటి కందించెను ఆ బాలిక పెరిగి అందమైన స్త్రీగా రూపొందెను ఆమె మీకు భార్యయై ఒక పుత్రుని కనును. అతడు ప్రజాపతి యగును''.

భగవంతుని దర్శనమున ప్రాచేతస సోదరులకు పట్టలేని సంతోషము కలిగెను. తమను తాము సముదాయించుకుని, వారు భగవంతుని పాదములపైబడి కీర్తించిరి. చిరునవ్వుతో వారి పూజల నందుకుని అదృశ్యుడయ్యెను

వారు ఆ సముద్రము నుండి పైకి వచ్చి చూడగా, భూమి యంతయూ వృక్షములు ఆక్రమించియున్నట్లు కనుగొనిరి ఇంకేదియు వారు కానకుండిరి. వారు ఆగ్రహావేశులై అరణ్యమును దగ్ధము కావింప ప్రయత్నించిరి. ఇంతలో బ్రహ్మ వారి వద్దకు వచ్చి తొందరపడవలదని చెప్పెను

ఆ వృక్షములు తమ పెంపుడు కుమార్తె మరీషను తెచ్చి ప్రాచేతస సోదరుల కప్పగించగా, వారు ఆమెను వివాహమాడిరి. ఆమెకు తార్క్షియని మరొక పేరు కలదు.

వారికి ఒక పుత్రుడు కలిగెను. అతడే దక్షుడు. ఇదివరలో మహాదేవున్ని అవమానపరచిన దక్ష ప్రజాపతియే యీ దక్షుడు ఒకప్పుడు మహాదేవుని అగౌరవపరచిన కారణముగా తిరిగి మానవుడుగా పుట్టవలసి వచ్చెను.

దక్షుడు పెరిగి పెద్దవాడయ్యెను అతనికి పట్టాభిషేకము చేసి ప్రాచేతస సోదరులు తపస్సు ఆచరించుటకు రాజ్యము వదలి అడవికేగిరి

మార్గమందు నారదుడు వారి కెదురయ్యెను నారదునితో వినయపూర్వకముగా వారు సంభాషణ సలిపి, మోక్ష మార్గమును బోధించుమని అడిగిరి నారదుడు బోధించి వెళ్ళిన తర్వాత ఆ బోధలను వారు స్మరించిరి. నారాయణుని పాదముల చెంత వారికి చోటు లభించునని అభయమిచ్చిన భగవంతుని పలుకులు వారికి జ్ఞప్తికి వచ్చెను



వారి మనస్సులు భగవంతుని ధ్యానించుటలో లగ్నము కాగా, కొలది కాలములోనే వారు నారాయణ సన్నిధిని చేరుకొనిరి



ఇంతటితో మైత్రేయ విదురుల సంభాషణ ముగిసెను విదురుడు మైత్రేయుని వద్ద సెలవు తన సోదరుని, యుధిష్ఠిరుని చూచుటకు హస్తినాపురము వైపు ప్రయాణించెను ఈ లోకమ భగవంతుని పాదములను చేరుటకు సన్నద్ధము కావలెనని ధృతరాష్ట్రుడు గ్రహించవలెనని విదురుఁ ఇచ్చట ఒక ప్రధాన విషయమును గమనించవలసి యున్నది. విదురుని తీర్థయాత్రలను గురించి య ప్రశ్నించినపుడు, ప్రభాస తీర్థములోని దారుణ సంఘటనను విదురుడు చెప్పకుండెను. విదురుని హ అతి కోమలము. ఒకరు బాధపడుట చూచి అతడు సహింపలేకుండెను దారుణమైన కృష్ణుని నిర్యా తెలుపుటకు విదురుని కోమల హృదయము అంగీకరింపకుండెను.

# 56 ప్రియవ్రతుడు

స్వాయంభువ మనువునకు ముగ్గురు పుత్రికలు యిద్దరు పుత్రులు. పుత్రికలు ఆకూతి, దేవహూతి, ప్రసూతి, పుత్రులు ఉత్తానపాదుడు, ప్రియవ్రతుడు. దేవహూతి కర్దముని భార్య, కపిలుని తల్లి. ఆకూతి రుచి యను ఋషికి భార్య, యజ్ఞునకు తల్లి. ప్రసూతి దక్షుని భార్య, సతీదేవికి తల్లి. నారాయణునికి ప్రియభక్తుడైన ధ్రువుని తండ్రి ఉత్తానపాదుడు

ప్రియవ్రతుడు జ్యేష్ఠ కుమారుడు. కాని యౌవనమందే నారదుని బోధలు వినియుండుటచేత రాజ్యమును పరిపాలించుటయందు ఆసక్తి లేకుండెను. సోదరుడు ఉత్తానపాదునకు రాజ్యభారము అప్పగించి, తపస్సు చేయుటకు అడవికేగెను

అనేక సంవత్సరములు ఉత్తానపాదుడు పరిపాలించెను. అతని తర్వాత ధ్రువుడు, అతని వంశీయులు పరిపాలించిరి ప్రాచీన బర్హిష్మదుడు, ప్రాచేతస సోదరులు ధ్రువుని వారసులు, ప్రాచేతస సోదరుల కుమారుడైన దక్షుడు రాజ్యము పరిత్యజించి, తపస్సు చేయుటకై అడవికేగెను. రాజ్యమునందు రాజు లేకపోవుట మనువు చూచెను. రాజు లేని రాజ్యము క్షేమము కాదని యెంచి, తనకు యిష్టము లేకున్నప్పటికీ అడవికేగి ప్రియవ్రతుని తిరిగి వచ్చి రాజ్య భారమును చేబట్టవలసినదని మనువు బ్రతిమాలెను కాని మనువు ప్రయత్నములు ఫలించకుండెను. అందుచేత అతడు తన తండ్రియైన బ్రహ్మకు ప్రియవ్రతుని ఒప్పించు బాధ్యతను అప్పగించెను.

అడవిలో [illegible] రితో ప్రియవ్రతుడు సంభాషించు చుండగా బ్రహ్మ అక్కడకు వచ్చెను బ్రహ్మ రాకతో ఆ గుహ ప్రకాశమానమయ్యెను ప్రియవ్రతుడు వెంటనే లేచి నిలుచుండెను నారదుడు కూడ అట్లే చేసెను. బ్రహ్మ తన మనుమని జూచి చిరునవ్వుతో యిట్లనెను ''కుమారా! నేను చెప్పు మాటలను అతి జాగ్రత్తగా వినుము. ఏ భగవంతుని ఆదేశములను మనమందరమూ విధేయులమై అనుసరించవలెనో, ఆ భగవంతుడు రాజుగా నీ విధిని నిర్వర్తించ వలసినదని నిర్దేశించినాడు. భగవంతుని ఆదేశములను మనలో చాలామంది విధేయతతో పాటింతురు నీ కొసంగిన యీ మానవ శరీరమునకు ఒక ప్రయోజనము కలదు నీవు యీ భూమిపై మానవ జీవితము జీవింపవలసి యున్నది. మనలో ప్రతి ఒక్కరు ఒక ప్రయోజనము కొరకు జన్మించినారు. సృష్టికర్త చేతిలో మనమందరమూ నిస్సహాయులము

''భూమిని దున్నే యెద్దులను గమనించుము. వాటి ముక్కు రంధ్రముల ద్వారా త్రాడు నుంచి రైతు ఆ త్రాడు నటునిటు లాగుచుండగా, ఆ ప్రకారము యెద్దు కదలుచుండును ఆ త్రాడును యెటు లాగిన యెద్దు అట్లు సంచరించవలెను తన యిష్టము వచ్చినట్లు నడచుటకు వీలులేదు. అదే విధముగా, భగవంతుడు మనకు యేర్పరచిన జీవిత మార్గముపై నడిపించును మనకు యిష్టము వచ్చిన రీతిని సంచరించుటకు గాని, ప్రపంచానుభవనమును పొందుటకుగాని వీలులేదు. సుఖమునుగాని దుఃఖమునుగాని మనము యెంచుకొన లేము అవి ఒకదాని తర్వాత మరొకటి సంభవింపవచ్చును, లేదా కలసి రావచ్చును, లేక విడివిడిగా రావచ్చును. ఎందుకని మనము ప్రశ్నింపరాదు. సమభావముతో వాటిని మనము సహించవలెను మానవుడు, తనకు నిర్దిష్టమైన కర్మలను జరుపుచూ యీ లోకములో జీవించవలెను. వాటినతడు తృణీకరించుటకు అధికారము లేదు.

''అయినప్పటికీ, వస్తు ప్రపంచముతో అనుబంధము లేక సంచరించినచో పునర్జన్మల నుండి విముక్తుడగును అనగా జీవన్ముక్తుడగును అట్టి వాడు యీ మానవ లోకములో భగవంతుడు కోరినంత కాలము సంచరించును. స్వప్న ప్రపంచములోని అనుభవములను, స్వప్నము కరిగినంతనే అవి అసత్యమని యే విధముగా తలచునో, అదే రీతిగా సుఖదుఃఖములను పరిగణించును. అటువంటి మానవునకు, పునర్జన్మకు కారణమైన వాసనలు అంటవు. అతడు చేయు కర్మలు ఫలాపేక్షరహితమగుటచేత, వాసనలను నిర్మూలించుకోవలసిన ఆవశ్యకత కూడ లేదు.

''ఇంద్రియ నిగ్రహము లేని మానవుడు, దారితప్పి అడవిలో సంచరించువాని వలె, నిరంతరము ఒక జన్మనుండి మరొక జన్మకు ప్రయాణము చేయుచుండును కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను ఆరుగురు శత్రువులు మానవుని నిత్యము వెంటాడుచుండగా, అతని పతనమును వేగిరపరచుటకు మనస్సు ఇంద్రియములు కలిసి యీ ఆరుగురు శత్రువుల ఆజ్ఞలను అతి సులభముగా వెంటనే నిర్వర్తించుచుండును ఆ విధముగా మానవుడు జనన మరణములనే సంసార చక్రములో చిక్కుకొని పోవుచున్నాడు

''ఇంద్రియములను జయించి, తాను పరమాత్మ తప్ప యితరమేదియు కాదని భావించిన మానవుడే యీ మానవలోకములో జీవింపదగిన ఉత్తమ మానవుడు వస్తు ప్రపంచముతో అనుబంధము లేకుండుట చేత అతడు ఆదర్శపురుషుడు, యితర మానవులకు మార్గదర్శకుడు సహాయము నర్థించే యితర మానవులకు యిట్టి ధన్య జీవులు సహాయపడగలరు.

''ఇంద్రియములను జయింపగోరు మానవుడు, సామాన్య మానవుని వలె గృహస్థుడై భార్య పిల్లలతో జీవింపవచ్చును; కాని అరిషడ్వర్గము అను ఆరుగురు శత్రువులను జయించవలెను. ఒకసారి వాటిని అణచిపెట్టినచో, అతడు నిర్భయముగా యీ లోకములో సంచరింపవచ్చును. ఉదాహరణకు ముట్టడికి గురియైన నగరమును తలంచుము. శత్రువులు నగరముపై దాడి చేయుచుండగా, రాజు కోట నాశ్రయించి నగరమును సంరక్షించును క్లిష్ట పరిస్థితిలో రాజునకు కోట సహాయపడుచున్నది. అదే రీతిగా, మానవుడు నారాయణుని పాదముల నాశ్రయించినచో, అతి సులభముగా ఆరుగురు శత్రువులను తరిమికొట్టి, భగవంతుడు తన ఆనందమునకై యేర్పరచిన యీ లోకములో జీవించి ఆనందింపగలడు. తన జీవిత పరిమాణము ముగిసిన తర్వాత నారాయణునితో చేరిపోవును అనగా జీవాత్మ పరమాత్మలు ఏకమగుదురు

''కుమారా! నేను యివన్నియు చెప్పుట యెందులకనగా, నీవు తిరిగి వచ్చి రాజ్యము చేబట్టి చక్కగా పాలించి ప్రఖ్యాతి గాంచవలెనని. నీవు ధన్యజీవివి. భౌతికానందానుభవములో చిక్కుకుపోగల ప్రమాదము నీకు యెప్పుడూ ఉండబోదు. నీ విధిని నీవు నిర్వర్తించిన తర్వాత తిరిగి యిక్కడకు వచ్చి, శాంతికై అన్వేషణ కొనసాగించవచ్చును. నీవు యిదివరకే శాంతి సాధించినావు అందుకొరకే నిన్ను యీ రాజ్య పాలనా కార్యమును చేబట్టమని కోరుచున్నాను. నా కొరకు నీవు యీ కార్యము చేపట్టవలెను. నిస్స్వార్థముగా యీ రాజ్యము పరిపాలించి, తరతరములుగా జరుగుచున్న యీ సంప్రదాయమును కొనసాగింపుము రాజ్యమునకు తిరిగి రమ్ము''

చేతులు జోడించి బ్రహ్మ చెప్పిన దంతయూ విని యిట్లనెను ''ప్రభూ! మీరు చెప్పినట్లే చేసెదను'' బ్రహ్మ ముఖమునందు సంతోషముతో కూడిన నవ్వు ప్రస్ఫుటమయ్యెను తర్వాత గుహనుండి బ్రహ్మ వెళ్ళిపోయెను. మనువు వచ్చి ప్రియవ్రతుని రాజ్యమునకు గొనిపోయి సింహాసనముపై కూర్చుండబెట్టెను

# 59 ఋషభుని బోధలు

ఈ లోకములో వైరాగ్యము నవలంబించి యెట్లు జీవించవలెనో ప్రచారము గావించుటకు ఋషభుడు తన పుత్రులను పిలిచి వారికి జీవించు పద్ధతులను బోధించెను. వారితో ఋషభు డిట్లనెను ''కుమారులారా! ఈ మానవశరీరము మనకు ఒక ఉత్తమ ప్రయోజనము కొరకు లభించినది. పశువువలె ప్రపంచానుభవములు పొందుటకు కాదు పరిశుద్ధమైన మనస్సు అత్యవసరము. ఈ జీవితమునకు రెండు ముఖద్వారములు కలవు. ఒకటి · ఉత్తములైన వారికి సేవ జేసి మోక్షము పొందుట. రెండవది : ఇంద్రియముల ద్వారా వస్తు ప్రపంచముతో అనుబంధము పెంచుకొని వాటి నమభవించుట సమబుద్ధిని పెంపొందించుటకు మీరు ప్రయత్నించవలెను లాభనష్టములను ఒకేరీతిగా స్వీకరింపగల మనస్తత్వమును మీరు అభివృద్ధిగావించు కొనవలెను ఆగ్రహము నణచి మనసును నిగ్రహించవలెను భగవద్భక్తియే జీవితముయొక్క ప్రధాన ధ్యేయముగా నుండవలెను. భార్య, పిల్లలు, సంపద, రాజ్యముతో అనుబంధము పెంచుకొనరాదు. ఈ శరీరమును నిని మాత్రమే మానవుడు కోరుచుండవలెను వెనుకటి జన్మలో చేసిన కొన్ని కర్మల ఫలితముగా, తిరిగి మీరు జన్మించి యీ జీవితమును సాగించవలసి వచ్చెను ఈ లోకములో జన్మించిన మీరు అనేక ప్రలోభములకు గురియగుదురు అందుచేత మీరు తిరిగి జనన, మరణములను సంసార చక్రములో పడకుండ నుండుటకు తగిన కార్యములను చే నుండును ఈ శరీరమున్నంతవరకు, మనస్సు నిత్యసత్యమైన భగవంతుని యందు లగ్నము కానంతవరకు, మానవుడు లౌకిక కర్మలు చేయుటయందు నిమగ్నమై యుండును. అవిద్యచేత, అనగా తన నిజస్వభావమైన ఆత్మను తెలియకుండుటచేత, మానవుడు కర్మబద్ధు డగుచున్నాడు భగవంతుని తలంచనంత కాలము, అతనికి జీవితములో స్వేచ్ఛ లభించదు మానవుడు యిల్లు, యిల్లాలు, పిల్లలు, యింకను అనేక విధములైన వస్తువులతో అనుబంధమును పెంపొందించుకొనును ఈ వస్తుప్రపంచము అంతయూ, అసత్యమని, ఉత్తమ సత్యము వేరే యున్నదని గుర్తించలేక మానవుడు అనేక అవస్థలకు లోనవుచున్నాడు. తన తెలివితక్కువతనముచేత యీ లౌకికానుబంధముల వలన కలిగే పరిణామము లకు మానవుడు బాధపడుచున్నాడు.

'నేను', 'నాది' అనునవి మానవునికి రెండు ప్రబల శత్రువులు వీటి చేత మానవుని దృష్టి కలుషితమై, హృదయము కరడుగట్టుచున్నది. మానవునికి స్త్రీపై ప్రేమ కలుగుట చేత, కొత్త అనుబంధములు పెంచుకొనుట జరుగుతున్నది. ఇల్లు, భూమి, పిల్లలు, బంధువులు, సంపద, ఈ విధముగ అంతులేకుండ అనేకమైన వానితో అనుబంధము విస్తరించుచుండును. ఈ భూమితో మానవునికి గల బంధము విస్తరించి, నూతన బంధములు యేర్పడి మరింత బలపడుచున్నవి. అటువంటి మానవునికి మోక్షము కలుగు అవకాశములు చాల తక్కువ. ఏ వస్తువులతో అనుబంధము పెంచుకొనెనో వానిని గురించిన సత్యము, అనగా అవి అశాశ్వతములని తెలుసుకున్న మరుక్షణమున, జ్ఞానము చేత హృదయములోని ముడులు విడిన మరుక్షణమున తన భార్యపై నున్న అనురాగము సడలును. అహంకార మమకారములు వాటంతట అవి నమసిపోవును. కుమారులారా! మీ మనస్సులో భగవంతుని మాత్రమే తలవండి అనుబంధము వదలిపెట్టండి. శీతోష్ణములు, ఆకలిదప్పులు, విచారము, భ్రాంతి మున్నగువాని ప్రభావము మీకు ఉండదు. బ్రహ్మజ్ఞానమును తెలుసుకొనుటయందే మీరు శ్రమించవలెను. భగవంతునికి మీరు శరణాగతులు కావలెను. మీరు చేయు కర్మలను భగవంతునికి నివేదించండి. భగవత్కథలను వినుచు, భక్తులతో సాంగత్యము పెంచుకొనండి.

మానవులందరూ భవగంతుని ప్రతిబింబములే, అందుచేత యెవరినీ ద్వేషించరాదు ఇతరుల కష్టములలో పాలుపంచుకొనవలెను క్రోధమును నిగ్రహించుకొనవలెను వీలయినప్పు: డి భగివచ్చిం తన చేయుడు, ఒంటరితనము భగవచ్చింతనకు అనువైనది. మీ విధులను చక్కగా నిర్వర్తించండి. వేనినీ అశ్రద్ధ చేయకుడు ఎక్కువగా ఆలోచన చేయుచూ, తక్కువగా మాట్లాడవలెను.

''శిష్యునకు మార్గము చూపుటకు గురువు అత్యవసరము కుమారులకు తండ్రికి మించిన గురువు లేడు పుత్రులను సన్మార్గములో వర్తించునట్లు చేయు బాధ్యత తండ్రిది ప్రజలు సన్మార్గులై చరించునట్లు చేయు బాధ్యత రాజుది మీకు గురువుగా, మీరు నడచుకొనవలసిన తీరును చెప్పుచున్నాను.

''తన శిష్యులు లౌకిక కర్మలందు నిమగ్నమగునపుడు, వారికి స్వేచ్ఛా మార్గము గురువు చూపించవలసి యున్నది జీవితమను క్లిష్టప్రయాణము చాలవరకు సాగించుటచేత, అనుభవపూర్వకముగా జీవితములోని లోతుపాతులను గురువు తెలుసుకొనియుండును గురువునకు తన శిష్యులపై దయ లేక జీనితపు లోతుపాతులను గురించి హెచ్చరిక చేయకున్నచో, గురువునకు కలిగిన జ్ఞానమువల్ల ప్రయోజనమేమి? ఒక మనిషి మునిగిపోవుచున్నపుడు, యే మానవుడును చూచుచు ఊరుకొనలేడు. గురువు సహాయకుడు, తండ్రి, తల్లి, శ్రేయోభిలాషి నేను చెప్పిన విషయములను బాగుగా యోచించండి. ఈ భరతుని తండ్రిగా యెంచి అతని ఆదేశములను మన్నించండి అతడు చాలా గొప్పవాడు నేను సూచించిన ప్రకారము యాలోకములో జీవించండి మోహమను రోగమునకు భక్తి దివ్యౌషధము భక్తి సహాయముతో జనన మరణములను సంసార చక్రమునుండి మీరు రక్ష పడయవలెను''

ఋషభుడు, తనవలెనున్న పుత్రులకు, పై విధముగా బోధనలిచెను. లోకములోని ప్రజలకు సరియైన మార్గము చూపుటకుగాను ఋషభుడు తన పుత్రులకు బోధ చేసెను.

తరువాత భరతుని రాజ్యాభిషిక్తుని గావించెను రాజ్యమును, భార్యను, పిల్లలను, తన సర్వస్వమును పరిత్యజించి, యెన్నడూ మాయకు వశముగాని ఋషభుడు దేశము వదలి వెళ్ళిపోయెను. అతనికి జీవితము నుండి విముక్తి కలుగువరకు దేశమంతటను సంచరించెను.

మానవుడు కోరికలను విడిచిపెట్టినప్పటికీ, లోకము చేత ప్రభావితము కాకున్నప్పటికీ యీ లోకము విడిచి వెళ్ళుటకు సన్నద్ధుడైనప్పటికీ నిర్ణీత సమయము ఆసన్నమయేవరకు జీవించుచుండవలెను ఇది జీవిత ధర్మము కుమ్మరివాడు మట్టి నుండి కుండను మలచునపుడు చక్రము త్రిప్పును కుండను తీసివేసిన తర్వాత కూడా చక్రము తిరుగుచునే యుండును అదేరీతిగా ఒకొక్కపుడు పూర్వ జన్మ సంస్కారమునుబట్టి, దేహి దేహమును విడుచుటకు సిద్ధముగా నున్ననూ, ప్రాణము శరీరమును వీడదు. ఋషభునికి అట్లే జరిగినది.

చాలా కాలము సంచరించిన తర్వాత ఋషభుడు అవధూత అయ్యెను. తదుపరి కూటక పర్వత సానువులను చేరెను. అక్కడ ఉండగా, అంతవరకూ ఋషభుడు సంచరించిన అరణ్యము అగ్నిచేత దగ్ధమైనది ఎన్నడూ కర్మలలో చిక్కుపడని ఋషభుడు జీవిత బంధమునుండి విముక్తి పొందెను.

# 60 భరతుడు

ఋషభుని కుమారుడైన భరతుడు చక్కగా రాజ్యమును పాలించెను. అతడు ధర్మపరాయణుడు అతని పరిపాలన ఉత్తమముగా నుండెను. భరతుని అత్యుత్తమ పాలనచేత ప్రఖ్యాతిగాంచిన యీ భూమి భరతవర్షమను పేరు గాంచినది. భరతుడు, తన పూర్వుల సంప్రదాయములను పాటించి, రాజులకు నిర్దిష్టమైన పద్ధతుల ననుసరించెను. అతని పరిపాలనలో యీ భూమిపై ప్రజలు సుఖముగా జీవించిరి. భరతుడు నారాయణుని పరమభక్తుడు అతని హృదయములో నారాయణుని మూర్తి ప్రతిష్ఠితమై యుండెను చాలాకాలము సుఖ సంపదలతో రాజ్యమును పాలించితినని తలచి, రాజ్యమును విభజించి కుమారులకు పంచిపెట్టెను జ్యేష్ఠ కుమారునికి పట్టము గట్టి, భరతుడు సర్వస్వమూ పరిత్యజించి, హరిద్వారములోని పులహ మహర్షి ఆశ్రమమునకు వెళ్ళెను ఆ ఆశ్రమము అతి రమణీయమైన ప్రదేశమున గలదు. చక్రానది ఆశ్రమము చుట్టూ ప్రవహించుచున్నది. ఆ నది, యిప్పటికీ సాలగ్రామములతో నిండియున్నది. వానియందు నారాయణుడు వ్యాపించి యుండుటచేత, వానిని పూజింతురు

ఆ ఆశ్రమమునందు భరతుడు యేకాకిగా నుండి, ప్రతిదినము ఫలపుష్పములతో హృదయము నుండి భక్తి పొంగిపొరలుచుండగా నారాయణుని పూజించుచుండెను. అతడు ప్రాపంచిక సుఖదుఃఖములకు అతీతుడ య్యెను అన్ని అనుబంధములను పరిత్యజించుటచేత అతని హృయదము శాంతితో నిండియుండెను. భగవంతునిపై అత్యంత భక్తివలన కలిగే బ్రహ్మానందస్థితిని అతడు చేరెను నారాయణుని మదిలో తలంచున పుడు, అతని హృదయము ద్రవించి, ఆనంద బాష్పములు కన్నుల నుండి స్రవించుచుండెను. అతని హృదయము ఒక లోతైన సరస్సువలె నున్నది అందు అతని అహంకారము పూర్తిగా మునిగియుండెను. ప్రతిదినము అతడు లేడి చర్మము ధరించి, జడలు కట్టి ధూళితో నిండిన తలవెంట్రుకలతో సంచరించుచూ, ఉదయ సూర్యుని యందుండు నారాయణుని యీ క్రింది విధముగా ఆవాహన చేయుచుండెను ''ఈ లోకమును సృష్టించిన అద్భుతశక్తి, యీ ' వరించి సృష్టించినట్టి శక్తి, బుద్ధిని ప్రకాశింపజేసి చైతన్యవంతము గావించునట్టి శక్తి సూర్యునికి అమిత తేజస్సును కల్గించుశక్తికి శరణాగతుడను''

నారాయణుని చింతనతో భరతునకు ఆనందముగా రోజులు గడచుచుండెను ఒకసారి మహానదీ తీరమున కూర్చుని ప్రాతర్వందనము చేయు సమయమున, అతడొక దయనీయ దృశ్యమును గాంచెను. నదిలో నీరు త్రాగుటకు ఒక లేడి ఆ తీరమునకు వచ్చెను ఇంతలో అకస్మాత్తుగా సింహగర్జన వినిపించెను దగ్గర నుండి ఆ గర్జన వచ్చుచున్నట్లు తోచెను ఆ గర్జనకు భయపడి, అతి చేరువలోనే సింహము ఉన్నదని తలచి, పాపము ఆ లేడికి యెటువైపు పరిగెత్తి పోవలెనో తెలియకుండెను. దప్పికతో నున్న ఆ లేడి యింకను నీరుత్రాగుట మొదలిడలేదు విపరీతమైన భయముతో, నిస్సహాయస్థితిలో నున్న ఆ లేడి నదిని ఒక్క ఉదుటులో దాటుటకు ప్రయత్నించెను ఆ లేడికి అకస్మాత్తుగా కలిగిన భయమువలన, ఆమె గర్భములోని శిశువు నదిలో జారిపడెను నది అవతలివైపుకు చేరిన తల్లిలేడి మిక్కిలి అలసిపోయి నెమ్మదిగాప్రాకుచు ఒక గుహను చేరి, కొద్ది క్షణముల తర్వాత మరణించెను.

ఈ సంఘటనను గమనించుచున్న భరతుని హృదయము, నదిలో జారిపడిన లేడిపిల్ల నీటి ఉపరిభాగమందు తన్నుకొని బాధపడుచుండుట జూచి జాలితో నిండిపోయెను ఆ లేడిపిల్లను తన చేతులలో తీసుకుని

ఆ శ్రమమునకు వెళ్ళెను. ఆ లేడిపిల్లకు పాలుపోసి, చేతులతో నిమిరి తల్లివలె సముదాయించెను

రోజులు గడచి, ఆ లేడి పెద్దదయ్యెను. భరతుడు ఆ లేడిని ప్రాణముగా చూచుకొనుచుండెను. ఆ లేడితో అతని అనుబంధము యినుమడించెను రాజ్యము, భార్య, పిల్లలు, సర్వస్వము వదలిపెట్టిన భరతునకు యీ లేడి అత్యంత ప్రీతిపాత్రమయ్యెను. ఆ లేడిని వదలి ఉండలేని స్థితి కలిగెను. తన దృష్టి నుండి ఒక క్షణమైనను ఆ లేడి మరుగుపడుట సహించలేకుండెను. ఆ లేడి పచ్చిక మేయుటకు వెళ్ళినపుడు భరతుడు ఆందోళన చెంది, తనలో తానిట్లనుకొనును. ''పాపము యీ లేడికి, స్నేహితులు, బంధువులు, తల్లి, తండ్రి లేరు. నేను తప్ప యింకెవ్వరును లేరు నేను మాత్రమే ఆ లేడికి ఆశ్రయము అది నన్ను పూర్తిగా నమ్ముకున్నది. నాయందు దానికి గుడ్డి నమ్మకముండుట చేత దాని నమ్మకమును త్రెంచలేను దానిని రక్షింపవలసిన బాధ్యత నాపై నున్నది.''

భరతుడు తన సమయమునంతనూ ఆ లేడికై వినియోగించు చుండెను ఆ లేడితో అరణ్యము నందు సంచరించుచూ, అది అలసిపోయినపుడు, దానిని తన భుజములపై పెట్టుకుని తిరుగుచుండును సాయంకాలము కాగానే, లేడి ఆశ్రమమునకు రాకున్నచో భరతునకు ఆందోళన కలుగుచుండెను తనలో తానిట్లనుకొను చుండెను. ''నా ప్రియమైన లేడిని నేను తిరిగి చూడగలనా? ఏ తోడేలు, లేక యే అడవి మృగమో తిని వేసెనేమో! సూర్యుడస్తమించనున్నాడు ఇంకనూ నా లేడి తిరిగి రాదయ్యెను బహుశః సింహము తినివేసి యుండవచ్చును, లేక పులి తరుముతూ ఉండవచ్చును''. విచారమనస్కుడై అటు నిటు తిరుగుచూ తిరిగి తనలో యిట్లు తలంచును ''ఈ అరణ్యములో లేడిని యేకాకిగా తిరగనిచ్చుట చాలా ప్రమాదకరము. నేను వెళ్ళి వెదకెదను'' ఆ విధముగా తలచి, అరణ్యమంతటా వెదకి, మతి చెడిన వానివలె, ఆ లేడిని ప్రేమతో అనేక పేర్లతో పిలిచి, అది కనుపించిన తర్వాత తన చేతులతో దానిని పట్టుకుని ఆశ్రమమునకు తెచ్చును.

లేడిపై పెరిగిన అనురాగము చేత భరతుడు తన నిత్య విధులను మరచెను భగవంతుని పూజించుట, సమాధిలో నుండి భగవంతుని ధ్యానించుట పూర్తిగా నిలిపి వైచెను పూజించుటకు ప్రయత్నించినపుడు, లేడివచ్చి తన కొమ్ములతో మృదువుగా భరతుని తట్టును అప్పుడు భరతుడు ఆ లేడిని తాను సమకూర్చిన కుశఘాసములను నోటి కందించును ధ్యానమునకు కూర్చొనినపుడు మదిలో నారాయణుని రూపము రాకుండెను ఆ లేడి చేయు చిలిపి చేష్టలు మనస్సునందు మెదలి, చిరునవ్వు నవ్వుచుండెను. సూక్ష్మముగా చెప్పవలెనన్న, అతడన్నింటినీ మరచెను. లేడి అతనికి సర్వస్వమయ్యెను దానిని తల్లివలె నిమిరుచూ, గంటల కొలది మాట్లడుచూ కాలము గడపుచుండెను లోకమును పరిత్యజించిన భరతుడు యిట్టి పరిస్థితిలో నుండుట మిగుల దుస్థితి

రోజులు గడవగా, యెవరినీ లక్ష్యపెట్టని మృత్యువు, జంఝూనిల వేగముతో, ఎలుక యుండే తొర్రలో పాము ప్రవేశించినట్లు, భరతుని సమీపించెను మరణించనున్న భరతుడు తన దృష్టిని లేడిపై నిలిపెను. అతడు కడసారిగా పెంపుడు లేడిని గురించి ఆలోచించుచు కన్నుమూసెను

## 61 లేడిగా జన్మించిన భరతుడు

భరతుడు తిరిగి జన్మించెను. చనిపోవునపుడు భరతుని ఆలోచనలు లేడిపైనున్నవి తుది శ్వాస విడచునపుడు నిశ్శబ్దముగా లేడిని పిలుచుచుండుటచేత, భరతుడు లేడిగా జన్మించెను. కాని ఒక విధముగా అదృష్టవంతుడు పూర్వజన్మ స్మృతి కలిగియుండుట లేడిగా జన్మించిన భరతుని ప్రత్యేకత తన్ను గురించి తాను జాలిపడి యిట్లనుకొనెను ''నా ప్రస్తుత పరిస్థితి యెంత దయనీయమైనది అన్ని అనుబంధములను వదలివేసితిని అరణ్యమునే యిల్లు అనుకుని, నారాయణుని ఆలోచనలతో మనస్సు నింపి, భగవంతుని కథలనే జ్ఞప్తికి తెచ్చుకునేవాడను నా హృదయములో నారాయణునికి తప్ప యింకొకరికి స్థానము లేకుండెను నారాయణుని పాద పద్మములయందే నా మనస్సు నిలిచియుండెను అటువంటి ప్రశాంత సరస్సులో అలజడి చెలరేగెను లేడి యందు అనురాగము పెంపొందెను ఆ అనురాగము బలవత్తరమై, నేను సర్వమూ, నారాయణుని కూడ, మరచునట్లు చేసినది. నేను అంతవరకు అనుసరించుచున్న మార్గమును విడిచి చాలా దూరమేగితిని ఆ కారణముచేత బ్రహ్మ స్థితిని పొందుటకు బదులు లేడిగా జన్మించితిని ప్రాపంచిక వస్తువులతో అనురాగ అనుబంధములు అంతటి బలమైన శక్తి గలవి ఈ జన్మమునందు భగవద్భక్తులతో సాంగత్య మేర్పరచుకుని, కర్మ ఫలమును పూర్తిగా నివృత్తి చేసుకొనుటకు ప్రయత్నించెదను తిరిగి నా మనస్సు ఉన్నతమైన వాటియందు లగ్నము కాగలదు భగవంతుని తలంచుచూ, అతని కీర్తనలను వినుచూ, అతని వైభవమును వర్ణించు మాటలను, కథలను వినుచూ, యీ జన్మ బంధము నుండి విముక్తుడను కాగలను''

లేడి రూపములో భరతుడు, ఋషులు సమావేశమైయున్న సాల గ్రామమను స్థలమువైపు ప్రయాణించెను ఆశ్రమమునందున్న గడ్డిని మేయుచూ, నదిలోని నీరు త్రాగుచూ జీవించుచుండెను ఈ జీవితము యెప్పుడు ముగియునా అని బాధపడుచూ, విముక్తిని కల్గించు మరణమునకు వేచియుండెను చివరకు మరణించి, జంతువైన లేడి రూపము నుండి స్వేచ్ఛను పొందెను.

## 62 జడ భరతుడు

అంగిరస వంశములో ఒక బ్రాహ్మణుడుండెను అతడు చాలా మంచివాడు బ్రాహ్మణులకు విధివిహితమైన ధర్మ [illegible] వాడు అతనికి మొదటి భార్యయందు తొమ్మండుగురు పుత్రులు, రెండవ భార్యయందు ఒక పుత్రుడు ఒక పుత్రిక కలిగిరి రెండవ భార్యకు కలిగిన పుత్రుడు మరల భరతుడు, అతడు తిరిగి జన్మించవలసి వచ్చెను

భరతుడు [illegible] ఋషభునకు కుమారుడుగా జన్మించెను. అందుచే నారాయణుడే స్వయముగా తన పుత్రునకు ముముక్షువు అనుసరించదగు ధర్మములను బోధించెను మోక్షమును కోరువాడు ముముక్షువు. భరతునకు ఆత్మ విద్య యందు ప్రవేశము కలిగెను సుమారుగా దానినతడు సాధించెను కాని ప్రారబ్ధ కర్మముచేత లేడిగా జన్మించి, తరువాత తిరిగి మరొక జన్మనెత్తవలసి వచ్చెను విధిని దాటి మోక్ష మార్గము ననుసరించుట తేలిక కాదు యోగులు ఉత్తముల యింట జన్మించెదరని చెప్పుదురు, భరతుడు

ఆ ఉత్తమ బ్రాహ్మణునికి కుమారుడుగా జన్మించెను

పూర్వ జన్మలో భగవంతుని అనుగ్రహమునకు దూరమగుటచేత తనయందు తనకే ఏహ్యా భావము కలిగి, యెటువంటి నూతన అనుబంధములను యేర్పరచుకొనుటకు యిష్టపడకుండెను. కుటుంబములో యెవరితోనూ కలియక అందరకూ దూరముగా నుండెను ఇతడు తండ్రికి ఒక సమస్య అయ్యెను పాపము తండ్రి గాయత్రీ మంత్రము నుపదేశించుటకు ప్రయత్నించెను తండ్రి అనేక మాసములు ప్రయత్నించినప్పటికీ, ఆ పుత్రునిలో యెట్టి ప్రతిస్పందన కన్పించకుండెను. భరతుడు ఉద్దేశ్య పూర్వకముగా గాయత్రి మంత్రమును తప్పుగా ఉచ్చరించి అపస్వరముతో చదువుచుండెను. ఏదియు నేర్చుటకును తన విముఖతను చూపుచుండెను భరతుని ప్రవర్తన క్రమముగా అతడొక మూగ-చెవిటి వాడను భావమును అందరిలో కలిగించెను అతనిని మూర్ఖుడని పిలుచుచుండిరి ఇతరులు తననెట్లు పిలిచినను భరతుడు చలించెడివాడు కాడు

భరతునకు పూర్వజన్మల స్మృతి కలదు ఈ భూమిపై విముక్తిని పొందుట యందే అతని ధ్యాస. అందుచేత దున్నపోతు మీద వాన కురిసినట్లు, యితరులు తన గురించి వెలిబుచ్చే అభిప్రాయములు అతనినిగాని, అతని ప్రవర్తనను గాని మార్చలేకుండెను భరతుని తండ్రి లౌకిక కర్మలందు, లౌకిక బంధములందు నిమగ్నమై యుండి, తన కుమారుడైన భరతుని ఉత్తమ బ్రాహ్మణుడుగా తీర్చిదిద్దలేక ఉండె వాడు కొంత కాలము తర్వాత అతడు మరణించెను. అతని రెండవ భార్య తన పుత్రుడైన భరతుని, కుమార్తెను,సవతి సోదరులకు వారి తల్లికి అప్పజెప్పెను ఆమె భర్త చితియందు ప్రవేశించి భర్త ననుసరించెను

తండ్రి మరణించిన తర్వాత భరతుని సోదరులు, భరతుని యెడల తమకెట్టి బాధ్యతయు లేదని భావించి అతనికేమియు చేయకుండిరి వారు సవతి సోదరుడైన భరతుని హింసించుచుండెడివారు భరతుడు యే విధముగను తన అసంతృప్తిని వెలిబుచ్చెడివాడు కాడు పై [illegible] గోసించెడివాడు అతనినొక మామూలు కూలివాడుగా పరిగణించి, అతని బ్రాహ్మణ జన్మను కించపరచెడివారు కాని భరతుడు దానిని లక్ష్యపెట్టకుండెను. సూర్యాస్తమయము వరకు శ్రమించి, వారు యిచ్చిన ఆహారమునకు సంతృప్తి చెందెడివాడు ఒకొక్కపుడు వారిచ్చెడి ఆహారము పాతబడిన పిండియో, కాక పొట్టుతో కూడిన గింజలో, అవన్నియు భరతునికి ఒకే విధముగా నుండెను అతడు భగవంతుని గురించియే చింతించుచూ, తన సోదరులిచ్చిన నీచ కార్యములను చేయుచూ కాలమును గడపుచుండెను

ఒక దొంగల నాయకుడుండెను అతనికి సంతానము లేకుండెను కాళీమాతకు నరబలి యిచ్చినచో పుత్రుడు కలుగునని కొందరతనికి చెప్పిరి అందుచేత అతడు తన సేవకులను నలు దిక్కులకు పంపి నరబలికి తగిన మానవుని తీసుకొని రమ్మని పంపెను ఆ సేవకులు పగలంతయు వెదకిరి కాని ఫలితము లేకపోయెను రాత్రి కాజొచ్చెను. వారా చుట్టు ప్రక్కల సంచరించుచుండిరి వారు ఆకస్మాత్తుగా కొంత దూరములో ఒక యెత్తు దిబ్బపై నిలుచునియున్న మానవుని చూచిరి ఎత్తు దిబ్బపై భరతుడు నిలుచుని, లేళ్లు, యితర అడవి జంతువులు రాత్రియందు పొలమును ధ్వంసము చేయకుండ రక్షించుచుండెను దొంగల నాయకుని సేవకులు దగ్గరకు వచ్చి భరతుని జూచిరి. భరతునికి శారీరక సౌఖ్యములపై దృష్టి లేకుండెను వర్షము-యెండ, చలి-వేడి అతనికి సమానమే అతడు తన శరీరమును కూడ సరిగా కప్పుకొనక యుండెను అతడు కటిక నేలపైన పరుండుట చేత అతని శరీరము ధూళి ధూసరితమై యుండెను అతని తల జడలు కట్టి యుండెను మట్టిమూసిన ఆణిముత్యమువలె అతడు ఉండెను అతని పవిత్రమైన జందెము నల్లగా మాసిపోయెను.

పలు సంవత్సరములుగా బయట కఠోర జీవితమున కలవాటుపడిన భరతుని శరీరము బలిష్ఠమై శక్తివంతమై యుండెను. భరతుని జూచి దొంగల నాయకుని సేవకులు, అతడు బలి యిచ్చుటకు సరిపోయిన వాడని భావించిరి. ధూళితో నిండియున్నప్పటికీ, అతని శరీరమునందు యెట్టి మచ్చగాని, దెబ్బగాని, గీతగాని లేక యుండెను. ఆ సేవకులు జాప్యము చేయక వెంటనే నిర్ణయించుకొనిరి. భరతుని వారు త్రాళ్ళతో బంధించి వారితో తీసుకొనిపోయిరి. బంధించునపుడు భరతుడు యెట్టి అభ్యంతరము తెలుపకుండుట వారి నాశ్చర్యపర చెను. భరతుని వారు మందిరమునకు తీసుకువెళ్ళిరి. అతనికి పవిత్ర జలముతో స్నానము చేయించి, బలి కాబోవు వారు ధరించు వస్త్రములను అతనిచేత ధరింపజేసిరి.

అతని శరీరమంతటా గంధము పూసి, నుదుటిపై యెర్ర సిందూరపు బొట్టు పెట్టిరి. అతనికి భోజనము పెట్టి, తర్వాత కాళీమాత విగ్రహము ముందర అతని నుంచిరి. విపరీతముగా శబ్దము చేయు డప్పుల వాద్యము ప్రారంభించిరి.

భరతుడు నిశ్శబ్దముగా కూర్చుని తనకేమియూ పట్టనట్లుండెను. పూజారి మంత్రముల నుచ్చరించి, భరతుని వధించుటకు ఖడ్గము నెత్తెను.

బలియగుటకు సిద్ధముగా నున్న ఆ బ్రాహ్మణుని ముఖము నుండి వెలువడు తేజస్సును జూచి కాళీమాత భరించలేకపోయెను. భరతునిలోని బ్రాహ్మణ వర్చస్సు ప్రకాశించగా, దేవి చూచి భరించలేక వెలుపలికి వచ్చెను. ఒక గొప్ప క్రూర కార్యము జరుగబోవుచున్నదని దేవి గమనించెను. పాపమెరుగని అమాయక బ్రాహ్మణుడు యెటువంటి నిరసన చూపక, పరమ దుర్మార్గులైన ఆ దొంగల ముఠాచేత బలియగుటకు సిద్ధముగా నుండెను. మరియు ఆ నీచ కార్యము దేవి కొరకు జరుగుచున్నది. స్వర్గము నుండి ఆమె సేవకులు దిగి, ఆమె గమనించుచుండగా, ఆ దొంగల ముఠాలో ప్రతి ఒక్కరిని సంహరించి వారి రక్తమును కడుపునిండుగా త్రాగిరి.

భరతుని ఆశీర్వదించి దేవి అదృశ్యమయ్యెను. అతడు కూడా అచ్చట నుండి వెళ్ళిపోయెను.

## 63 పల్లకి మోసిన భరతుడు

ఒకానొకప్పుడు రాహుగణుడను రాజు ఇక్షుమతీ నదీ తీరమున ప్రయాణించుచుండెను. అతడు సింధు సౌవీర దేశములకు ప్రభువు. అతడు పల్లకిలో వెళ్ళుచుండెను. పల్లకి మోయుచున్న బోయలు మరొక మనిషి తమతోబాటు పల్లకి మోసినచో వారి బరువు కొంత తగ్గునని భావించిరి. వారు చుట్టును కలియజూడగా, వారి కనులు అచ్చట నిలుచుని యున్న భరతునిపై బడెను. భరతుడు దృఢకాయుడు. అతడు బలముగా మోటుగా నుండుట జూచి, బోయవాండ్రు అతడు పల్లకి మోయుటకు తగినవాడని భావించిరి. వారు వెంటనే భరతుని పిలిచి తమకు సహాయము చేయమని ఆదేశించిరి. మూర్ఖునివలె కనబడుచున్న భరతుడు ఒక్క మాటయైనను పలుకక ఊరకుండెను. క్షత్రియుడున్న పల్లకిని బ్రాహ్మణుడు మోయుట నీచ కార్యమైనప్పటికీ, భరతుడు అభ్యంతరము తెలుపకుండెను. మిగిలిన బోయీలతోబాటు భరతుడు కూడ పల్లకి నెత్తెను. మార్గములో అడుగు వేయుటకు ముందు క్రిములు, కీటకములు మొదలైనవి లేకుండునట్లుగా పరీక్షించి చూచి,

అవి లేవని దృఢపడిన తర్వాత అడుగు వేసెడివాడు. ఈ కారణముగా మిగిలిన బోయీల గమన వేగము తప్పి, పల్లకీ సమత్వము తప్పి ఒక ప్రక్కకు వాలుచుండెను. ఇది చూచి రాజు మిక్కిలి కోపోద్దీప్తుడై యిట్లనెను. ''పల్లకీ ఒక ప్రక్కకు వాలుటకు కారణమేమి? మీ పని మీరు సవ్యముగా నిర్వర్తించలేకున్నారా?'' రాజు సేవకులైన బోయీలు యిట్లు సమాధానమిచ్చిరి ''ప్రభూ! ఇది మా తప్పుకాదు, మాతో చేరిన యీ కొత్త బోయవాడు మాతో సరిగా అడుగులు వేయకుండుట చేత, యీ అసౌకర్యము తమకు కలుగుచున్నది'' రాజు ఆ క్రొత్త బోయీని మీద నుంచి క్రిందివరకు జూచెను

వ్యంగ్య పూరిత స్వరముతో రాజు యిట్లనెను. ''నీవు పేదవానివలె దయనీయముగా గోచరించుచున్నావు ఇంత దూరము యీ బరువంతయూ నీవే మోయుచున్నట్లున్నావు పాపం అలసిపోయి, సన్నగా శుష్కించి పోయినావు నీ కండరములు ముడుతలు పడి, యితర బోయీలకు వలె దృఢముగా లేవు నీవు యీ పనికి చాలా ముసలివాడవు'' భరతుడు మౌనముగా నుండెను రాజునకు తిరిగి జవాబు యివ్వక భరతుడు మౌనముగా పల్లకిని తన భుజమునకెత్తుకొనెను తిరిగి వారు కదలి వెళ్ళుచుండిరి కొన్ని అడుగులు వేసి కొంత దూరము వెళ్ళిన తర్వాత తిరిగి యిదివరకు వలె జరిగెను ఈసారి రాజునకు పట్టరాని ఆగ్రహము వచ్చి యిట్లనెను ''ఓరీ మూర్ఖుడా! నీవు చేయుచున్న పనిని గురించి యోచించుచున్నావా? నీవు నడ పీనుగ వలె ప్రవర్తించుచున్నావు నా ఆదేశములను లక్ష్యపెట్టక, నీవు అవిధేయముగా వర్తించుచున్నావు నీకు బుద్ధి కలుగుటకు, ఇక యెన్నడూ మరువలేనట్టి గుణపాఠమును నీకు చెప్పెదను నీ అహంభావమునకు తగిన విధముగా శిక్షించెదను''

రాజునకు తను రాజుననే గర్వము ప్రబలముగా నుండెను యజమానిగా తన సేవకులను తానేమైననూ చేయవచ్చునని తలచెను రజస్తమో గుణముల ప్రభావము తీవ్రముగా నుండుటచేత, అతనిలో గర్వము, అహంభావము మితిమీరెను తాను అధికుడనని, యితరులు తనకంటె చాలా అల్పులని తలంచుచుండెను సాధువులు, దైవ ప్రేమగల వారి సాంగత్య మతని కెన్నడును కలుగలేదు కలిగియున్నచో వారు రాజునకు కొంత జ్ఞానబోధ చేసి యుండెడివారు కనీసము భూమి మీద ప్రాకు పురుగులకు కూడ యెట్టి అపకారము తలపెట్టని బ్రాహ్మణుడైన భరతునితో మూర్ఖుడైన రాజు అహంకారముతో అతి క్రూరముగా మాట్లాడెను

భరతుడు చాలాసేపు మౌనముగా రాజును చూచెను అతని పెదవుల చివర కొద్దిపాటి చిరునవ్వు మెరసెను ఎట్టి ద్వేషము చూపక నెమ్మదైన స్వరముతో భరతుడిట్లనెను'' నీ పల్లకిని నేను సరిగా మోయుటలేదను కారణముచేత నీవు ఆగ్రహావిష్టుడవయినావు నేను చాలాసేపు బరువు మోసి అలసిపోయినానని వ్యంగ్యముగా మాట్లాడినావు ఈ బరువుచేత నేను యేమాత్రము అలయ లేదని నీ భావము ఒక విధముగా నీవు చెప్పినది సత్యమే కాని నన్ను గాయపరచవలెనని వ్యంగ్యపూరితముగా మాట అవి నాకెట్టి బాధను కలిగించవు ఎందుకో నీకు చెప్పనా? నా యీ శరీరము సత్యమని యీ బరువును యింతవరకూ మోయుచున్న శరీరము కూడ సత్యమని నీవు అభిప్రాయపడుచున్నావు ఇది సత్యమైనచో నీ మాటలు నాకు బాధ కల్గించెడివి కాని యీ రెండును సత్యమని నమ్ముటయెట్లు? ఈ శరీరరము సత్యమని గాని, బరువును మోయుచున్న యీ శరీరము సత్యమని గాని నేను ఋజువు చేయిలేను అట్టి పరిస్థితులలో, అసత్యమైన యీ శరీరమును గాయపరచుట సాధ్యమా? నాలోని నిజమైన 'నేను'నకు నా శరీరముతో యెట్టి సంబంధమును లేదు ఈ శరీరమునకు కలుగు అవమానాదులు యే విధముగను 'నన్ను' అంటవు నేను బరువును చాలా దూరము మోయుటచేత అలసిపోయినానని పలికినావు నన్ను అవమానపరచు ఉద్దేశ్యముతో యిట్లు మాట్లాడినావని

నాకు తెలుసును కాని అవమానము స్వీకరించుటకు నేనెంచుకొనలేదు కారణమేమనగా ప్రయాణించవలసిన దూరము, యీ ప్రయాణమునకొక ప్రయోజనము సత్యమైయుండి, యీ రెండింటితో యేమైన సంబంధము 'నాకు' ఉండినచో, అప్పుడు నీ మాటల వలన నాకు బాధ కలిగెడిది కాని యీ రెండునూ సత్యములని కాని, వాటితో నాకు సంబంధమున్నదనిగాని నాకు నమ్మకము లేదు అందుచేత నీ మాటల వలన నాకెట్టి బాధ కలుగలేదు నేను బలహీనముగా శుష్కించి యున్నానని పలికినావు ఇవి అర్థములేని మాటలు ఎందుకనగా 'నేను'నకు రూపము లేదు రూపము లేని దానికి లావు-సన్నము, పెద్ద-చిన్న అను గుణములు అన్వయించవు. ఈ పదములు ఆత్మ నివసించే గృహమైన శరీరమును వర్ణించుటకు సరిపోవును, ఆత్మకు కాదు లావు-సన్నములు, శరీర మానసిక రోగములు, ఆకలిదప్పులు, భయము, దెబ్బలాటలు, కోరికలు, ముసలితనము, నిద్ర, కామము, ఆశ, దుఃఖము, యివన్నియు తాను శరీరమని భావించు వారిని బాధించును కాని నిజమైన సత్యమును గుర్తించిన నన్ను యివేవియూ బాధించవు. ఈ శరీరపు జీవితకాలము చాలా తక్కువ, పరిమితము; 'నేను'అనంతము, నిత్యము నేను నడిచే శవమునని నీవు పలికినావు నేనేకాదు, నీవు, అందరు మానవులు, జంతువులు కూడ సంచరించు శవములే ఓ రాజా! డి యున్నట్లు తలంచకుము మారుచున్న వస్తువులన్నియు జనన మరణములు పొందుచున్నవి ప్రతి క్షణము చావు పుట్టుకలు జరుగుచున్నవి ఏతావతా, సంపద, సంపదను కల్గియుండుట నిత్య ఎ శిక్షించెదనని నీవు చేసిన బెదిరింపులు సాధ్యమగుట కవకాశమున్నది. కాని అట్లు జరుగదు రాజు, సేవకుడు వేర్వేరను భేద బుద్ధి ద్వైత భావము వలన కలుగుచున్నది ఇంకే యితరమైన కారణము నాకు గోచరించుటలేదు ఒకరు అధికుడు యింకొకరు అతనికన్న అల్పుడు అనునది లేదు ఈ విషయము నీవు గ్రహించినట్లు లేదు నే నిప్పుడేమి చేయవలెనో చెప్పుము 'నన్ను' నేను తెలుసుకున్నాను. నేనొక తెలివి తక్కువవాడుగా, యెట్టి భావములు లేని చెవిటి వాడుగా, మూర్ఖుని వలె గోచరించవచ్చు కాని, నిజముగా, ప్రాపంచికమైన వస్తువు లేవియూ 'నన్ను' అంటవు అటువంటప్పుడు, వీటన్నిటికీ దూరముగా నున్న 'నన్ను', నీ శిక్ష యే విధముగా బాధించగలదు? ఇది బాగుగా మెత్తగా నున్న పిండిని పిండి చేసినట్లుండును ఇది నా ప్రవర్తనపై యెట్టి ప్రభావము లేక యుండును''

భరతుడు తిరిగి పల్లకిని తన భుజముపై కెత్తుటకు ప్రయత్నించెను.

## 64 భరతుడు బ్రహ్మవిద్య బోధించుట

భరతుని మాటలను విన్న తర్వాత రాహూగణుని గర్వము, అహంభావము పూర్తిగా తొలగిపోయెను అతడు భరతుని పాదముల మీద పడి, కనులవెంట నీరు కారుచుండగా, సిగ్గుపడి గద్గద స్వరముతో యిట్లనెను ''నా గర్వము నీవు అణచివేసినావు నా అనుచిత ప్రవర్తనకు నన్ను క్షమించి, నాకొక వరము ప్రసాదించవలెను దయచేసి, నీవు యెవరో తెలియజెప్పి నన్ను అనుగ్రహించవలెను నేను సింధు సౌవీర దేశములకు రాజును నన్ను రాహూగణుడను పేరుతో పిలిచెదరు నేను ఉత్తముడైన కపిలుని వద్దకు వెళ్ళి అతని పాదముల చెంత కూర్చుని బ్రహ్మ విద్యను నేర్చుకొనుటకు వెళ్ళుచున్నాను. కాని నీవే కపిలుడుగా నా వద్దకు స్వయంగా నన్ను రక్షించుటకు వచ్చినట్లున్నది. నేను పూర్వజన్మలో యే సుకృతములు చేయుట వలన యీ

మహద్భాగ్యము నాకు సంప్రాప్తించెనో కదా! దయచేసి నాకు బ్రహ్మ విద్యను తెలిపి సత్యము తెలుసుకొనునట్లు చేయగోరెదను''

నేర్చుటకు ఆసక్తి కలిగిన రాజును చూసి జాలిపడి, భరతుడిట్లనెను ''నేను నీకు సహాయపడెదను నీవు మోక్ష మార్గమును కనుగొనెదవు నేను బోధించునపుడు జాగ్రత్తగా శ్రద్ధతో వినుము''.

. దగ్గరలో యెత్తైన ఒక రాతి పలకపై భరతుడు కూర్చుండెను అతని పాదములచెంత రాజు వినమ్రుడై కూర్చుండెను. భరతుడు బ్రహ్మ విద్యను బోధించుట మొదలిడెను. భరతుడిట్లు చెప్పదొడగెను.

''మానవుని మనస్సే సంసారమను బురదలో కూరుకొని పోవుటకు గాని, సంసారము నుండి స్వేచ్ఛను పొందుటకు గాని, కారణమగుచున్నది మనస్సును నిగ్రహించవలసి యున్నది సత్త్వరజస్తమో గుణములతో కలుషితమైన మనస్సు భౌతిక ప్రపంచములో సంచరించును. మంచి చెడు కర్మలను చేయుచూ, మరల మరల జనన మరణములను సంసార చక్రములో చిక్కుకొనును మనస్సులో ఆవిర్భవించే కోరికలు స్వభావమును బట్టి, ఉత్తమ గతి వైపు లేక అధమ గతి వైపు తరలుట జరుగును సుఖ దుఃఖములు మానవ జీవితములో సంభవించు చుండును వీనికి అంతు లేదు వస్తు ప్రపంచముతో మనస్సుకు అనుబంధము ఉన్నంత వరకు, మనస్సు స్వయముగా ప్రకాశించలేదు

''ఒక చిన్న దీపము ఉదాహరణగా తీసుకొనుము ఆ దీపమునకొక వత్తి, ఆ వత్తి నేతితో తడియుచున్నది ఆ వత్తి మండుచున్నంత సేపు, దీపము రంగు నెయ్యి గుణము ననుసరించి యుండును ఆ దీపము నుండి వచ్చు పొగ వాసన, కాంతి వర్ణము నెయ్యి గుణముపై ఆధారపడి యుండును దీపపు సెమ్మెలో నెయ్యి పూర్తిగా అయిపోయిన తర్వాత కొంతసేపు వత్తి తనకు తానే మండుచుండును అప్పుడు దాని వెలుగు, వర్ణము స్వత స్సిద్ధమైనదిగా నుండును క్రమేపి అది శూన్యమగును మనస్సు కూడ అట్లే గుణములతో చేరియున్నంత వరకు, ఆ గుణముల వర్ణము కలిగి వాటి కనుగుణముగా వర్తించును గుణములు మనస్సు నుండి విష్క్రమించిన తర్వాత, శూన్యస్థితిని చేరుకొనును వాయువు ఆకాశము అంతటా వ్యాపించి యున్నట్లుగా, భగవంతుడు యీ లోకమంతటా నిండి యున్నాడు జీవుడు అనుబంధము త్రెంచుకుని, అరిషడ్వర్గమును జయించి, జ్ఞానమను దీపము ప్రకాశింపజేసినపుడు, జీవునకు సంపూర్ణ స్వేచ్ఛ కలుగును అంతవరకు, జీవుడు మరల మరల యీ లోకములో జన్మించుచు బాధలకు గురియగును

''ఇంద్రియములను అరిషడ్వర్గమును జయించవలెనన్న, మనస్సును నిగ్రహించవలెను మనస్సును భగవంతుని పాదములపై మరల్చి, వానిని ఆశ్రయించినచో, సంసారమనే అరణ్యములో పడుదుమను భయము ఉండదు. ఒకసారి జీవుడు కర్మమార్గ మనుసరించినచో, అందలి లోతుపాతులలో చిక్కుకొనును జనన మరణములు ఒక అరణ్యము. మాయ వలన అనేక భ్రాంతుల చేత జీవుడు అరణ్యములో తిరుగాడుచున్నాడు త్రిగుణములు జీవుని చేత మంచి చెడు కర్మలను చేయించుచున్నది ఆయా కర్మలను బట్టి పాపము, పుణ్యము సముపార్జించుచున్నాడు జీవుని ధ్యేయము సుఖ ప్రాప్తి ఈ సుఖాన్వేషణలో సంసారమను అడవిలో పడుచున్నాడు అరిషడ్వర్గము ఆరుగురు దొంగలవలె జీవునికి తెలియకుండ ప్రవేశించి, అతని జ్ఞానమును దోచుకొనుచున్నది ఈ ఆర్గురు శత్రువులు, యిల్లాలు, యిల్లు, పిల్లలు, ధనము, సంపద, అధికారము మున్నగు వానితో అనుబంధము పెంచుకొనునట్లు చేయును ఆ విధముగా మాయలో పడి బయటకు వచ్చు మార్గము తెలియక నిస్సహాయస్థితిలో జీవుడు ఉంటున్నాడు

''ఇట్లు జీవుడు గృహస్థాశ్రమములో స్థిరపడుచున్నాడు. ఇది చాలా విచారకరమైన పరిస్థితి.

''ఈ భూమి చూచుటకు మన్నిగా, చెట్లు చేమలను పెరికి పారవేసినట్లు గోచరించును, కాని నిజముగా గొడ్డుపోలేదు భూమిలో పాతిన గింజలు కొంది కాలములోనే మొలకలెత్తును ఇట్లు పదే పదే జరుగును అయితే ఆ గింజలను కాల్చినపుడు అవి తిరిగి మొలకలెత్తుట జరుగదు. గృహస్థాశ్రమము ఒక కర్పూరపు పెట్టె వంటిది కొన్ని రోజులకు కర్పూరము హరించిపోయి, పెట్టె ఖాళీగా నుండును కాని కర్పూరపు వాసన మాత్రము పెట్టెను విడిచిపోదు. పెట్టె పెట్టెగా ఉన్నంత కాలము వాసన దానిని విడిచిపెట్టదు, పెట్టె సంపూర్ణముగా నాశనమగువరకు, వాసన దానిలో ఒక భాగముగా నుండును. గృహస్థాశ్రమములో ఉన్నంతవరకు నీకు మోక్షము కలుగదు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనే అరిషడ్వర్గము, ఇంద్రియములు, ఇంద్రియముల యజమాని అయిన మనస్సు, యివన్నీ మోక్ష మార్గమునకు దూరముగా తీసుకుపోవును.

''ఈ భూమిపై జీవితమును గురించి యోచించుము. ఈ జీవితములో బాధ, కష్టము, సుఖము, విచారము, ప్రేమ, ద్వేషము, భయము, భ్రమ, వెర్రితనము, దురాశ, అసూయ, ఆకలి, దప్పిక, మానసిక శారీరిక బాధలు, చావు పుట్టుకలు ఉన్నవి

''మానవునికి భగవంతుని గురించి ఆలోచించుటకు సమయము లేదు. ఈ లోకమును పరిత్యజించిన సాధువులతో సాంగత్యమును కోరడు ఇన్ని దోషములున్నప్పటికీ, మానవుడు యెదుగుటకు అవకాశము లేకపోలేదు మనస్సును విగ్రహించి, కళ్లెములాగి మనస్సు నరికట్టు నేర్పు సంపాదించి, ఆరుగురు అంతశ్శత్రువు లను జయించి, భగవంతునివైపు మనస్సును మరల్చినచో, జనన మరణ సంసార చక్రము నుండి విముక్తి పొందగలడు

''ఈ జ్ఞానము కేవలము తపస్సుచేత లభించదు మతపరమైన కర్మలను గావించుటచేతకాని, వేలకొంది మానవులకు అన్నదానము చేయుట వలనకాని, గృహస్థులకు దానములు చేయుటచేతగాని, నిర్విరామముగా వేదమంత్రములను పఠించుటచేతగాని, దేవతలను పూజించుటచేతగాని కలుగిదు సాధు సత్పురుషుల పాదములపైబడి వారి పాదధూళిని స్వీకరించి, గురువునకు పూర్తిగా శరణు జొచ్చినచో, మానవుడు మోక్షమును సాధించగలడు మోక్షమును కోరు మానవుడు జీవితకాలమంతయు భగవద్భక్తుల సాంగత్యముతో గడపవలెను. అప్పుడు మాయ అనే బంధమును యెట్లు త్రెంచుకొనవలెనో తెలియగలదు. భగవత్కథలు, కీర్తనలు మానవుని ఆధ్యాత్మిక సంపదను, శరీరములోని అంతశ్శత్రువులైన కామ క్రోధ లోభ మోహమద మాత్సర్యముల బారినుండి కాపాడును అటు తర్వాత కొద్ది కాలమునకే అతడు అహంకారమును వీడును మనసు అతని అధీనములో నుండును ఇక మిగిలినది తేలిక.

''ఓరాజా! సర్వమూ పరిత్యజించుట నేర్చుకొనుము అన్ని జీవుల యెడల కరుణ కలిగి యుండుము అన్ని వస్తువులతో నీకున్న అనుబంధము త్రెంచుకొనుము. నిర్మలమైన, స్వచ్ఛమైన మనస్సుతో యీ సంసార సాగరము దాటి అవతలి గట్టు సురక్షితముగా చేరుకొని మరల తిరిగి రావన్న నా మాట నమ్ముము''

రాహూగణుడు భరతునికి సాష్టాంగ నమస్కారము చేసి యిట్లనెను ''ప్రభూ! మానవజన్మ జీవునకు భగవంతుడొసగిన గొప్పవరము దివ్యపురుషులయెడ నాకు యెట్టి అసూయ లేదు. ప్రతి మానవునకూ, దేవతలకు కూడ, మీవంటి ఉత్తమ జీవుల పరిచయము కలుగుట దుర్లభము లిగెను.

ఒక ముహూర్తకాలములో మీ సాంగత్యము వలన నా అజ్ఞానము తొలగిపోయెను. గర్వము, అహంకారము నుండి విముక్తుడనైతిని. భగవంతుని శరణు జొచ్చుటయే మానవుని యేకైక విధి యని మీరు నాకు బోధించితిరి పదేపదే శిరస్సు వంచి నమస్కారము చేయుచున్నాను. ఇంకే విధముగాను నా కృతజ్ఞతను తెలుపుకొనలేను''

భరతు డతని నాశీర్వదించి, భగవంతుడిచ్చిన యీ శరీరములో ప్రాణముండువంతవరకు, భూమిపై సంచారము గావించుటకు వెళ్ళిపోయెను.

# షష్ఠ స్కంధము

## 65 అజామీళుని మరణము

ప్రాపంచిక వస్తువులయందు, భౌతిక సుఖములందు మునిగి, నిత్యమూ ప్రాపంచిక సుఖాన్వేషణలో నుండే మానవుని మనస్సు అజ్ఞానముతో నిండి, నిత్యసత్యమును గ్రహింపక యుండును అట్టి మానవునకు జనన మరణములనే సంసార చక్రము నిరంతరమూ ఉండును. జ్ఞానము చేతనే అజ్ఞానమను తెరను తొలగించవచ్చును భౌతిక ప్రపంచముతో అనుబంధము త్రెంచుటకు నియమము అనగా అధ్యాత్మిక నియమము అత్యవసరము. పరిశుద్ధమైన సంపూర్ణ ఆహారమును భుజించు మానవుని యెట్టి రోగములు బాధించవు అదే రీతిగా ఆధ్యాత్మికాహారమును భుజించే మానవుడెన్నడూ బాధలకు గురికాడు. నియమ నిష్ఠలే ఆధ్యాత్మికాహారము. మనోనిగ్రహ మవసరము బ్రహ్మముపై మనసు లగ్నముచేసి ధారణ చేయుట, భౌతిక సుఖములనుండి ఇంద్రి ఇంద్రియలోలత్వమువ ్రను జయించుట, నిస్వా ర్థము, నిత్యము సత్యము పలుకుట, అంతర్బహిశ్శౌచము, అన్ని జీవులందు కరుణ కలిగి యుండుట, యితరుల వస్తువులను పరిగ్రహించకుండుట, యితరులిచ్చే కానుకలను స్వీకరింపకుండుట - యివన్నియు మనస్సులో నున్న అజ్ఞానమును నిర్మూలించుటకు దోహదము చేయును కట్టెలందు ఉన్న అగ్నిచేత అరణ్యము దగ్ధమగు రీతిగా మానవుని అజ్ఞానము దగ్ధమగును. మోక్షమును పొందు శక్తిమానవుని యందేకలదు మానవుడు స్వయం కృషి చేత దానిని సాధించగలడు

కొందరు సంపూర్ణ శరణాగతి చేత భగవంతుని చేరగలిగిరి సూర్యుని వేడిచేత మంచు కరిగినట్లు, వారి పా భగవంతునికి తనను తాను అర్పించుకున్న మానవుడు, యితరులకన్న ఉన్నత స్థితిలో నుండును భక్తిమార్గము అన్నింటికన్న ఉత్తమమైనది, ఇది నిశ్చయముగా గమ్యమును చేర్చును భగవద్భక్తికి తపస్సు, జపము సాటిరావు భగవంతుని పాదములపై మనసును స్థిరపరచుకొన్న మానవుని దరికి స్వప్నము నందైనను పాపము, మృత్యువు చేరలేవు ఈ భక్తియోగము మిక్కిలి శక్తివంతమైనది.

నారాయణుని యందు భక్తికి గల శక్తిని తెలుపు పురాణగాథ ఒకటి గలదు

కన్యాకుబ్జమను దేశములో అజామీళుడనే బ్రాహ్మణుడు నివసించుచుండెను అతడు బ్రాహ్మణుడుగా పుట్టినప్పటికీ, దుష్ట మార్గములో పడి మంచిని పూర్తిగా విడిచిపెట్టెను అధమ జాతి స్త్రీతో అతడు సుఖించుచుండెను. ఒకప్పుడు అందరియెడల కరుణా స్వభావముతో నుండిన అజామీళుడు క్రూరుడుగా నుండెను జూదరిగా, మో లిగి యుండెను. ఇతరుల సంపదను దోచుకొనుచు జీవితము పాపకార్యములందే గడపుచుండెను. న్యాయముగా అతని క్షింపకుండెను. అందుచేత అందరు అతనిని యేవగించుకొనుచుండిరి.

కాలము గడువగా అతడు ముసలివాడయ్యెను అధమజాతి స్త్రీ యందు పదిమంది పుత్రులు కలిగిరి. వారిలో ఆఖరివానిపేరు నారాయణ తల్లిదండ్రులకు అతడు మిక్కిలి ప్రీతిపాత్రుడు ఆ బాలునితోనే అజామీళుడు కాలమంతయు వెళ్ళబుచ్చుచుండెను. ఆ బాలునియందుండు అమిత ప్రేమచేత అజామీళుడు

యింకే విషయము ఆలోచించకుండెను భుజించునపుడు తానొక్కడే భుజింపకుండెను పుత్రుని పిలిచి, ''నారాయణా! నువ్వుకూడ వచ్చి నేను భోజనము చేయకమునుపే నీవుచెయ్యి'', అదే విధముగా తాను యేదైనా త్రాగేముందు దానిని కుమారునికిచ్చి, ''నారాయణా! ముందు నీవు త్రాగు'' అనుచుండెను.

ఈ విధముగా అజామీళుడు ఆ స్త్రీతోను పిల్లలతోను కాలము గడుపుచూ, తనకు మృత్యువు సమీపించుచున్నదనే విషయము గ్రహింపకుండెను. మృత్యువు దగ్గరపడగా, అతని ఆలోచనలు చేతలు ఆఖరి కుమారునిపైననే యుండి, అతనిని పేరుపెట్టి ప్రతిక్షణమును పిలుచుచుండెడివాడు. ఇంతలో యమదూతలు అజామీళుని కడకు వచ్చిరి. వారిని దూరము నుండి అజామీళుడు చూచెను. వాకిటిముందు ఆడుకుంటున్న కుమారుని జూచి, ''నారాయణా! నావద్దకు రా నారాయణా!'' అని పలికి ప్రాణము విడిచెను.

అజామీళుడు, అఖరి శ్వాసలో ''నారాయణా! నావద్దకురా'' అన్న మాటలను నారాయణుని సేవకులు విని తక్షణము అక్కడకు వచ్చిరి వారు, యమదూతలు ఆ బ్రాహ్మణుని శరీరము నుండి జీవుని యీడ్చుట జూచి అడ్డుపడిరి యమదూతలు నారాయణుని సేవకులపై ఆగ్రహము చెంది యిట్లనిరి ''యమదూతలమైన మమ్ము మా విధిని నిర్వర్తించకుండా అడ్డుపడుటకు సాహసించిన మీరెవరో తెలుపవలెను? మీరెక్కడి నుండి వచ్చినారు? మీరు యెవరికి చెందినవారు? మీరు దివ్యపురుషులా లేక దేవతలా? మమ్ములను యేల అడ్డగించెదరు?'' నారాయణుని సేవకులు యమదూతలను జూచి నవ్వి యిట్లనిరి. ''మీరు అన్నట్లుగా యమధర్మరాజు సేవకులైనచో, ధర్మము గూర్చి వివరింపుడు ధర్మబద్ధముగా ప్రజలను శిక్షించు విధానము తెలుపుడు ఎట్టి మానవులకు శిక్షపడవలెను? ఎట్టి కార్యములు శిక్షార్హములు? శిక్ష మానవులకేనా, లేక జంతువులకు కూడ నున్నదా? మాకు తెలుసుకొను        నే వివరించి చెప్పవలెను''.

యమదూత లిట్లనిరి ''వేదములు నిర్దేశించినదే ధర్మము ధర్మమే నారాయణుని శ్వాసయని చెప్పవచ్చును. వేదానుసారము కానిదంతయు అధర్మము. భగవంతుడే ధర్మము ఎవరికి విధించిన ధర్మమును వారనుసరించనిచో, యముడు వారిని శిక్షించును మానవుడు తన కర్మలకు తగినట్లు జీవించును. కర్మలు చేయక యెట్టివారును ఉండరు వారు చేయు కర్మలను బట్టి, అనగా సత్కర్మలు దుష్కర్మలు, శిక్షగాని, ప్రతిఫలముగాని లభించును భవిష్యత్తులో కలుగబోవు జన్మ, మానవుడు యీ జన్మలో చేయు కర్మలను బట్టి నిర్ణీతమగుచున్నది, పూర్వ జన్మలో చేసిన కర్మల ననుసరించి ప్రస్తుత జన్మ నిర్ణయమైనది. వసంత ఋతువులోని యీ క్షణము అనేక వసంతముల కొనసాగింపు, యివి వచ్చి పోవుచుండును. రాబోయే వసంతమునకు, యీ వసంతములో విత్తనములు పడును. సంయమని పేరుగల నగరంలో నివసించే యముడు, మానవులు యీ జన్మలో చేసిన కర్మల ననుసరించి, రాబోవు జన్మను నిర్ణయించును

''మానవుడు, అజ్ఞానము చేత, యీ శరీరము అశాశ్వతమని గమనించుటలేదు అజ్ఞానము చేత బుద్ధి కలుషితమై, యీ శరీరమే తానని యీ జన్మమాత్రమే గలదని భావించుచున్నాడు. పూర్వజన్మ గురించిగాని, రాబోవు జన్మగురించి గాని అతడు తలచుటలేదు స్వప్నములో నున్న మానవుడు, మెలకువస్థితిలోని తన శరీరమును గురించి యెరుగడు అనేక స్వప్నములలో అతడు ధరించిన శరీరములను గూడ యెరుగడు తనకు తానుగా పట్టుపురుగు పట్టుదారము చుట్టుకొన్నట్లు మానవుడు తన ఆత్మకు కర్మలు చుట్టుకొని, బంధితుడననే భ్రమలో పడుతున్నాడు అందునుంచి బయటపడలేక పోతున్నాడు ఈ బంధము నుంచి స్వేచ్ఛను పొందుటకు తనయందే శక్తిగలదని గ్రహించునంతవరకు, మానవుడు కర్మలకు బద్ధుడు

''అజామీళుని గురించి చెప్పెదము. ఒకప్పుడితడు చాలా మంచివాడు, సద్బ్రాహ్మణుడు, ధర్మపరుడు. బాగా చదువుకుని మంచి నడవడి గలిగి ధర్మమార్గమునందే సంచరించెను

''ఒకనాడు, భగవంతుని పూజకొరకు, తన తండ్రిచేయుచున్నట్లే, ఫలములు, పుష్పములు, కుశలను. తీసుకు వచ్చుటకు అడవికి వెళ్ళెను అడవిలో ఒక త్రాగుబోతు అధమజాతి స్త్రీతో సంగమించుట చూచెను. ఆ దృశ్యము చూచినంతనే, శారీరక యింద్రియ సౌఖ్యములు, వాటివలన కలిగే ఆనందము గురించి ఆలోచించుట మొదలిడెను. ఆమెతో తాను కూడ సంభోగించి, త్రాగుబోతు పొందిన ఆనందమును అతని ముఖమందుగాంచి, తాను కూడ అట్టి ఆనందమును పొందవలెనని తలంచెను.

''అజామీళుడు తన బుద్ధిని, నిగ్రహశక్తిని వినియోగించుటకు ప్రయత్నించెను కాని ప్రయోజనము లేకపోయెను శరీర సౌఖ్యమునకు బానిస అయ్యెను. కొన్ని క్షణములలో తాను అంతవరకూ నేర్చిన జ్ఞానమునూ, పాటించిన నియమ నిష్ఠలనూ మరచిపోయెను ధర్మమార్గమును తప్పెను ఆ స్త్రీకి బానిసయై, ఆమె తన సర్వస్వమను మోహములో పడెను. ఆమె ఆశలను కోర్కెలను తీర్చుటకు, జూదము, దొంగతనము చేయ మొదలిడెను. సూక్ష్మముగా చెప్పవలెనన్న, అన్ని పాపకార్యములు అతనికి సహజమయ్యెను. తల్లిని, శాస్త్రవిధిగా వివాహమాడిన భార్యను విడిచి, యీ అధమజాతి స్త్రీతో జీవించుచూ పాపకార్యములు చేయుచుండెను ఇతడు పాపి. అందుచేత శిక్షార్హుడు''.

యమకింకరుల మాటలు నారాయణుని సేవకులు విని యిట్లనిరి. ''ఈతని గురించి మీరు చెప్పినదంతయూ సత్యమే అతడు పాపాత్ముడనుటలో సందేహములేదు. కాని అతని ప్రాణము శరీరమును విడుచు సమయములో, ''నారాయణా! నావద్దకురా'' అని గట్టిగా అనెను

''అదియే అతడిని మిమ్ములనుండి రక్షించెను. గొంతెత్తి పిలిచిన వారిని భగవంతుడెన్నడూ ఉపేక్షించడు. అట్టివారిని తన భక్తులుగా పరిగణించి వారి పాపములను కడిగివేయును భగవంతుని దృష్టిలో అతడు పాపాత్ముడు కాడు, అందుచేత యమసామ్రాజ్యములో అతనికి స్థానములేదు. బహుశః మీరు, అతడు భగవంతునుద్దేశించి 'నారాయణ' అని అనలేదు, ఆ పేరుతో అతని కుమారుని పిలిచెనని అనవచ్చు. ఆ విషయము మాకు తెలియును. అయినప్పటికీ భగవంతుని నామమునకు అంతటి మహత్తర శక్తి కలదు ఆ శక్తివలన యథాలాపముగా నామము నుచ్చరించినప్పటికీ, భగవంతుడు వారిని రక్షించును. బలమైన ఔషధమును తెలియక సేవించినప్పటికీ, దాని శక్తివలన రోగి యొక్క రోగము శమించును. అదే తీరున, అజామీళుడు, ''నారాయణా! ఇక్కడకు''రా అని అనుటవలన యమ శిక్షనుండి రక్షితుడయ్యెను.

''మనిషి దొంగకావచ్చు, త్రాగుబోతుకావచ్చు. స్నేహితుని మోసగించవచ్చు, బ్రహ్మ హత్య గావించవచ్చు. గురుపత్నిగమనము చేయవచ్చు, రాజును, స్త్రీని, తండ్రిని, గోవులను హత్యచేయవచ్చు, లేక వీటన్నింటికన్న మించిన యింకే పాపమునైన చేసియుండవచ్చు. కాని భగవంతుని నామమును ఉచ్చరించినచో, అట్టివారు అన్ని పాపములనుండి రక్షణ పొందుదురు భగవంతుని పేరుతో కుమారుని పిలిచినను, భగవంతుని నామమును యథాలాపముగా లేక వేళాకోళముగా ఉచ్చరించినను, కేవలం ఆనందము కొరకు పాడేపాటలో ఒక పదముగా భగవంతుని నామము ఉన్నను, భగవంతుని నిందిస్తూ నామమును ఉచ్చరించినను, యీ పరిస్థితులన్నిటియందు భగవన్నా ' ' భగవంతుడు కరుణాపూరితుడై ఆ మానవుని రక్షించును ఒక మనిషి అకస్మాత్తుగా జారి మెట్లమండి పడిపోయినప్పుడుగాని, లేక పాము కరచినప్పుడుగాని,

లేక రోగముతో బాధపడుచున్నప్పుడుగాని, అంతరంగము నుండి అలవాటుగా భగవంతుని పిలిచినచో అతడు తప్పక రక్ష పొందును. మహర్షులు, పాపములను పరిహరించుకొనుటకు అనేక మార్గములు సూచించిరి. ఒకొక్క పాపమును ఒకొక్క విధముగా పరిహరించుకొనవలెను. ఇట్లు జరిగినప్పటికీ ఆ వ్యక్తి తిరిగి పాపము చేయడని నమ్మకము లేదు. ఇవి రోగమును తాత్కాలికముగా నివారించునట్టి ఔషధములు. ఈ పద్ధతులు హృదయము నుండి పాపములను సమూలముగా నాశనము చేయలేవు. కాని నారాయణుని పాదములకు శరణాగతులైన వారి పాపములు సంపూర్ణముగా తొలగిపోవును.

''చీకటి అంతటా వ్యాపించినపుడు ఒక చిన్న దీపము ఆ చీకటిని పోగొట్టుటకు చాలదా? ఆ దీపము సెమ్మెయందు సరియైన నూనెను వేసి దీపము వెలుగునట్లు చేసినచో, ఆ ప్రదేశమును చీకటి ఆవరించదు. భగవన్నామము భగవంతునిపై మనస్సు కుదుర్చును. దీని పర్యవసానముగా పాపపు చింతలు మనస్సు నుండి తొలగిపోవును. అతనిలోని వాసనలు వాటంతటవి నమసిపోయి, తిరిగి పాప కార్యములను చేయకుండును. ఈ అజామీళునికి భగవన్నామము శక్తి తెలియదు. అందుచేత బహుశః నామము ప్రభావమతనికి ఉండదని మీరనవచ్చు. అది సరికాదు. ప్రమాదవశాత్తు నిప్పురవ్వ కట్టెకు తగిలినప్పటికీ, అది పూర్తిగా దగ్ధమగును. అదే విధముగా అజామీళుని పాపములన్నియు దగ్ధమయ్యెను మా మాటల యందు మీకు నమ్మకము కుదరకున్న, మీ యజమాని యమధర్మరాజును మా మాటలు సత్యమగునో కాదో అడిగి తెలుసుకొనుడు''.

## 66 యముని వివరణ

యమదూతలు అజామీళుని విడిచిపెట్టి తమ యజమాని వద్దకు వెళ్ళిరి. వారి అనుభవమును యజమానికి పూర్తిగా నివేదించిరి అజామీళుని తీసుకువచ్చుటకు వెళ్ళగా నారాయణుని సేవకులు యే విధముగా అడ్డుపడిరో వివరించిరి ఆ సేవకులతో జరిగిన సంభాషణ పూసగ్రుచ్చినట్లు చెప్పిరి. యమదూతలిట్లనిరి. ''ప్రభూ! ఇది వరకెన్నడును యిట్లు జరుగలేదు. మీరు ధర్మప్రభువులు. ఇంతవరకు మీరు విధించిన శిక్షనుండి యెవ్వరూ తప్పించుకొనలేదు. ఈనాడు నలుగురు విచిత్ర వ్యక్తులు మీ అధికారమున కడ్డుపడిరి. మేము అజామీళుని పట్టుకొనగా, వారు యమపాశము నుండి అజామీళుని విడిపించిరి. ప్రాణము విడుచుటకుముందు 'నారాయణ' అనెను. తక్షణమే వారు అజామీళుని చెంతకు వచ్చిరి. మా విధిని నిర్వర్తింపకుండ జేసిరి. భగవన్నామము గొప్పతనము వారు వివరించి, దానిని మీరు పూర్తిగా విశదపరచగలరని చెప్పిరి. అదెట్టులో మాకు తెలియచెప్పవలెను వారు అధికారపూర్వకముగా చెప్పుటచేత వారి మాటలను మన్నించవలసి వచ్చెను. యమపాశము నుండి పాపాత్ములను రక్షించు యీ వింతశక్తియేమిటో?''

యమదూతలు ఊహించిన దానికి వ్యతిరేకముగా యముడు చిరునవ్వు నవ్వి సంతోషముతో అతి సరళముగా యిట్లనెను ''మానవుల జీవితముపై నాకు విశేషమైన అధికారమున్నది. వారిని శిక్షించు అధికారము కలదు. అంతవరకు మీరు తలచినది సత్యము. కాని, నాపై మరొకరు గలరు. వారిని నేను గౌరవించి మన్నించవలెను. అతడే నారాయణుడు మీరు వస్త్రమును చూచితిరా? అది నిలువుగా అడ్డుగా దారములు వేయగా నేర్పడినది అదే విధముగా యీ లోకమను వస్త్రము భగవంతుడు నేసెను. అతడే యీ లోక

సృష్టిస్థితిలయలకు కారకుడు.

''ముక్కుకు కట్టిన త్రాళ్ళను యిటునటు లాగి యెద్దును తోలినట్లు, యీ లోకము నందలి జీవులు వేదములనే త్రాళ్ళతో నడచుచున్నవి. మనము, ఇంద్రుడు, వరుణుడు, వాయువు, సూర్యుడు, అష్టదిక్పాలకులు, బ్రహ్మ, అగ్ని —— వేయేల దేవతలందరూ కూడ నారాయణుని వైభవమును గ్రహించలేకున్నారు. అతని మాయను అంతకన్న తెలియలేకున్నారు. మానవునకు జ్ఞానేంద్రియములు —— కళ్లు, ముక్కు, చెవులు, నోరు, చర్మము —— కలవు. వస్తు ప్రపంచమును జ్ఞానేంద్రియముల ద్వారా అనుభవించుటకు, అతనిలో వేరొక వస్తువు కలదు, దాని చేతనే జ్ఞానేంద్రియములు పనిచేయగలుగుచున్నవి మానవుని హృదయములో నున్న యీ వస్తువును ద్రష్ట అనగా చూచువాడు, అందురు అతనిలో నున్న యీ వస్తువు స్వభావమును మానవు డెఱుగలేడు. మాయ మానవుని ఆవరించి యుండుట చేత, అతని బుద్ధి కలుషితమై, అతనిలో దాగియున్న ఆత్మను గుర్తించలేక పోవుచున్నాడు

''భగవంతుడు నిర్ణయించిన న్యాయమును చాలా కొద్దిమంది                    లో నేనొకడను. ఇతరులు · బ్రహ్మ, నారదుడు, సనత్కుమారుడు, కపిలుడు, మనువు, ప్రహ్లాదుడు, జనకుడు, బలి, వ్యాసుని కుమారుడు శుక్రబ్రహ్మ.

''భగవన్నామమును పదేపదే పలుకుటను భక్తి యోగమందురు భగవంతుని చేరుటకిది సులభమైన మార్గము. ఇదియే మానవు డాచరించదగు అత్యుత్తమ ధర్మము. అజామీళుడు ఒకసారి భగవన్నామము నుచ్చరించినందుకు పాపవిముక్తుడై, నా నుండి రక్షితుడయ్యెనుకదా! నిత్యమూ భగవంతుని స్మరించుట వలన పాపములు నాశమగుట మాత్రమే కాదు, ముక్తి మోక్షముకలిగి కర్మబంధముల నుండి విముక్తిని పొందును భగవద్భక్తులను సులభముగా గుర్తింపవచ్చు వారు సమబుద్ధి కలిగి యుందురు ద్వంద్వములచేత బాధనొందరు. వారు ప్రశాంత మనస్కులై యుందురు. భగవన్నామమనే కవచము వారిని రక్షించుచుండును.

''మీరెప్పుడును అట్టివారి దగ్గరకు పోగూడదు. ప్రపంచ సుఖములందు మునిగి, యితర ఆలోచనలు లేనట్టి వారి వద్దకే మీరు వెళ్ళవలెను. వారు భార్య, పిల్లలు, యిల్లు, సంపద, సుఖ సంతోషములపై ప్రేమ యను మాయలో పడుచుందురు. భగవంతుని నామమును ఒక్కసారైనా ఉచ్చరించని వారిని, భగవత్కథలను ఒక పర్యాయమైనను వినని వారిని నా దగ్గరకు తీసుకు రండు. భగవన్నామము సకల పాపములను కడిగివేయునని మీరు బాగుగా గుర్తుపెట్టుకొనవలెను. జపతపములు, వ్రతములు మొదలైన వాని వలన భగవదనుగ్రహము యెక్కువగా కలుగదు. నారాయణుని భక్తులకు నా నుండి యెట్టి శిక్ష ఉండదని మీరు గుర్తుంచుకొనుడు''.

ఇంతలో అజామీళుడు, మృత్యు పాశము నుండి తనను రక్షించిన వారి పాదములపై బడెను. అతడు మాట్లాడబోవునంతలో, వారు అదృశ్యమైపోయిరి. నారాయణుని సేవకులకు యమదూతలకు జరిగిన సంభాషణను అజామీళుడు పూర్తిగా విని యుండెను.

ఇంత వరకు గడిపిన జీవితమును తలచుకుని అజామీళుడు విచారముతో నుండెను తనలో తానిట్లనుకొనెను. ''నేను చాలా పాపాత్ముడను. దేహ సౌఖ్యముల ప్రలోభములకు వశుడనై అధమ స్థితికి దిగజారితిని సత్పురుషులందరూ నా ప్రవర్తనను విరసించి ద్వేషింతురు. నా భార్యను, తల్లిదండ్రులను వదలిపెట్టితిని వారిని చివరవరకు పోషించి గౌరవించవలసి యుండెను.

''నేను మిక్కిలి పాపాత్ముడ నన్నది నిజమే, కాని భగవంతుని సేవకులను చూచు భాగ్యము కల్గినది. పూర్వ జన్మలో నేను కొన్ని సత్కార్యములు చేసియుండవచ్చు, లేకున్న యిట్లు జరుగుట అసంభవము. ఈ పాపాత్ముని నోరు భగవన్నామము పలుకుటయూ జరుగదు. అహా ఆ పవిత్ర నామమునకు అతి పాపాత్ముడనైన నాకు యెంతటి అంతరమో కదా? నాకు మరొక అవకాశము కలిగినది. నా పాపములన్నియు ప్రక్షాళితములైనవని భగవంతుడే అభియమిచ్చినాడు. ఇక నూతన జీవితమును జీవించెదను. నాకు నూతన జీవితము ప్రసాదించినాడు. దీనిని సద్వినియోగ పరచెదను. అజ్ఞానము వరికట్టెదను. కర్మ బంధముల నుండి విముక్తికి ప్రయత్నించెదను అందరి మానవులతో స్నేహపూర్వకముగా మెలగెదను. మనశ్శాంతి కలిగియుండి, పాపభూయిష్ఠమైన యీ లోకమునుండి స్వేచ్ఛను పొందుటకు శాయశక్తులా ప్రయత్నించెదను''.

క్షణ కాలము ఉత్తములైన నారాయణ సేవకుల సాంగత్యము చేత అజామీళుడు సన్యసించుట కుపక్రమించెను. నారాయణునికి అత్యంత భక్తుడయ్యెను. అతని కెట్టి అనుబంధములు లేవు. గంగా తీరము చేరి భగవంతుని ధ్యానించెను అతని శ్రద్ధాసక్తులు అతి తొందరలోనే అతనికి యీ శరీరము నుండి విముక్తిని కలిగించినవి. ఇది వరకు చూచిన నారాయణుని సేవకులను గాంచి, వారికి నమస్కరించెను. ప్రాణము నిష్క్రమించిన తర్వాత అతని శరీరము గంగాతీరమున పడియుండెను. అజామీళుడు భగవంతునిలో ఐక్యమయ్యెను.

## 67 దక్షుని వంశీయులు

ప్రచేతస సోదరుల కుమారుడైన దక్షుడు అశికిని వివాహమాడెను వారికి అరువది మంది పుత్రికలు కల్గిరి ఆమన్వంతరమందు వీరిచే సూనవాభివృద్ధి జరిగెను వారిలో పదిమందిని ధర్మునకు, పద ముగ్గురుని కశ్యప ప్రజాపతికి, యిరవై యేడుగురిని చంద్రునకు యిచ్చి వివాహము చేసెను భూత, అంగిరస, కృశాశ్వులకు చెరి యిద్దరిని, తార్క్ష్యునకు నలుగురిని యిచ్చి దక్షుడు వివాహము చేసెను కశ్యపునికి మరియొక పేరు తార్క్ష్యుడని కొందరు చెప్పుదురు నంది దక్షుని వారసులలో ఒకడు దక్షుని కుమార్తెలలో ఒకరి పుత్రులు విశ్వేదేవులు. మరుద్వతి కుమారులు మరుద్వనుడు, జయంతుడు. జయంతునకే ఉపేంద్రుడని మరియొక పేరు. ఉపేంద్రునియందు వాసుదేవుని అంశ గలదు. దక్షుని కుమార్తెలలో ఒకరైన సంకల్పకు ఒక కుమారుడు కలడు. అతని పేరు కూడ సంకల్పుడు అతని పుత్రుని పేరు కాముడు. దక్షుని కుమార్తె వసువుకు అష్ట వసువులు కలిగిరి. వారు : ద్రోణ, ప్రాణ, ధ్రువ, అర్క, దోష, వసు, విభావసు, అగ్ని

అష్ట వసువులలో ఒకడైన వసువు భార్య అంగిరసి. వారి పుత్రుడు విశ్వకర్మ. ఇతడు దేవతా మందిరములు నిర్మించు నేర్పు గలవాడు విశ్వకర్మ కుమారుడు చక్షుషుడు ఇతడు, తర్వాత మన్వంతరమందు మనువు అయ్యెను

భూతుని భార్య సరూపకు కోట్ల కొలది రుద్రులు జన్మించిరి వీరిలో పదునొకండ్రు రుద్రులు ప్రఖ్యాతి గాంచిరి వారు రైవత, అజ, భవ, భీమ, వామ, ఉగ్ర, వృషాకపి, అజైకపతి, అహిర్బుధవ్య, బహురూప,మహ తార్క్ష్యుని భార్యలు వినత, కద్రువ, పతంగి, యామిని. పతంగి పక్షులకు, యామిని క్రిమికీటకములకు తల్లులైరి వినతకు ఇద్దరు పుత్రులు, వారిద్దరు ప్రఖ్యాతి పొందిరి ఒకడు సూర్యుని రథసారథి యైన అరుణుడు

రెండవవాడు నారాయణునికి వాహనమైన గరుడుడు కద్రువకు సర్పములు - శేష, వాసుకి, తక్షక, కర్కోటకాదులు జన్మించిరి.

చంద్రుని భార్యలు తారలు ఇరువది యేడు తారలలో చిత్ర, కృత్తిక, రోహిణి ప్రధానమైనవారు

కశ్యపుని భార్యలు అదితి, దితి, ధను, కష్ఠ, అరిష్ట, సురస, ఇల, ముని, క్రోధవశ, తామ్ర, సురభి, సరమ, తిమి సముద్రములోని జంతువులకు తిమి తల్లి అయ్యెను. వీనిలో ప్రధానమైనది తిమింగిలము క్రూర మృగములు, తదితర జంతువులు సరమకు జన్మించెను. సరమకు జన్మించిన ఒక శునకము పేరు సారమేయుడు.

సురభికి ఆవులు గేదెలు జన్మించెను. తామ్రకు డేగలు, గ్రద్దలు మున్నగు వారు కలిగిరి. మునికి స్వర్గములోని అప్సరసలు కలిగిరి. క్రోధవశ విషపూరితమైన కోరలు గలిగిన సర్పములకు తల్లి అయ్యెను ఇలకు వృక్షములు పుట్టెను. అరిష్టకు గంధర్వులు పుట్టిరి. మెత్తని పాదములు గల జంతువులు కష్ఠకు పుట్టెను

ధనుకు అరువది మంది పుత్రులు కలిగిరి. వారిలో శంబరుడు, హయగ్రీవుడు, విభావసుడు, వృషపర్వుడు, స్వర్భానుడు, వైశ్రవసుడు, మున్నగువారు కలరు స్వర్భానుని కుమార్తెయైన సుప్రభను నముచి పెండ్లాడెను వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ ఆమె నహుషుని కుమారుడైన యయాతికి భార్య అయ్యెను. ధను మరొక కుమారుడైన వైశ్వానరునకు నలుగురు అందమైన కుమార్తెలు కలిగిరి. వారు ఉపదానవి, హయశిర, పులోమ, కాలక. ఉపదానవి హిరణ్యాక్షుని వివాహమాడెను. ఆమె చెల్లెలు హయశిరను క్రతువు పెండ్లాడెను కశ్యప ప్రజాపతి పులోమ కలకలను వివాహమాడెను వీరిద్దరి పుత్రులు గొప్ప యుద్ధవీరులు వారు కాలకేయ, నివాతకవచు లను భీకర రాక్షసులుగా పేరు పొందిరి తరువాత కాలములో అర్జునుడు వారిని జయించెను ధను కుమారుడు విప్రసిద్ధి, హిరణ్యకశిపుని కుమార్తె సింహికను వివాహమాడెను వారికి నూర్గురు పుత్రులు వారిలో జ్యేష్ఠులు రాహు కేతువులు. వీరు నవగ్రహములలో స్థానమును పొందిరి

దక్షుని కుమార్తె అదితి చాలా ధన్యురాలు భ అవతరించినపుడు అదితిని తల్లిగా యెంచుకొ ని మరియొక పేరు. అదితి కుమారులు వివస్వంతుడు, అర్యముడు, పూషుడు, త్వష్ట, సవితృడు, భగుడు, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, శక్రుడు, ఉరుక్రముడు

శ్రద్ధదేవ, మను, యమ, యమి వివస్వంతునకు కలిగిరి వివస్వంతుని భార్య సంధ్య ఆడ గుర్రము రూపుదాల్చి అశ్విని దేవతలకు తల్లి అయ్యెను

వివస్వంతుని మరొక భార్య ఛాయ ఆమెకు శనైశ్చరుడు, మనువైన సవర్ణి కుమార్తె తపతి కలిగిరి అర్యముని భార్య మాతృక. ఆమె సంతానము మానవులుగా ఉండునట్లు బ్రహ్మ నిర్దేశించెను

పూషణునకు సంతానము లేకపోయెను మహాదేవుని దక్షుడు అవమానించినపుడు నవ్విన వారిలో పూషణుడు కలడు. తరువాత అతని దంతములు విరిగెను. అందుచే అతడు నమలలేకపోవుట చేత ద్రవ పదార్థములను మాత్రమే గ్రహించుచుండెను త్వష్ట రచనను, ఆమె సోదరిని వివాహమాడెను. వారి కుమారులు విశ్వరూపుడు,సన్నివేశుడు దేవతలను వారి గురువు వదలి పెట్టినపుడు, వారు విశ్వరూపుని గురువుగా ఉండమని ప్రార్థించిరి

పరీక్షిత్తు అడ్డుపడి యిట్లనెను. ''ఆహా! ఎంత అద్భుతముగా నున్నది! దేవతలను ఆ గురువు యెందుకు వదలిపెట్టెనో చెప్పవలెను? బహుశః వారు తమ గురువునకు తీరని అపచారము గావించి ఆగ్రహము కల్గించి యుండవచ్చు. లేకున్న బృహస్పతి యెన్నడూ ఇంద్రునిపై గాని అతని ప్రజలపై గాని క్రోపము వహించలేరు. నాలో కలిగిన యీ కుతూహలమును మీరు తీర్చవలెను.''

శుకబ్రహ్మ, పరీక్షిత్తు కుతూహలమునకు చిరునవ్వు నవ్వి యిట్లనెను.''అది పెద్ద గాథ. ఆ గాథను నీకు చెప్పుట నాకు చాలా సంతోషము''.

## 68 వృత్రాసురుని జననము

స్వర్గ లోకములకు ప్రభువగుటచేత ఇంద్రునికి గర్వము హెచ్చెను.ఒకప్పుడు శచీదేవితో కూడి సింహాసనముపై కూర్చుండెను. స్వర్గ లోకములోని ఇంద్రుని సేవకులందరూ ఇంద్రుని చుట్టూ జేరి యుండగా, గంధర్వులు అతని కీర్తిని శ్లాఘించుచుండిరి. తమ నృత్య కౌశలమును అప్సరసలు ఇంద్రుని సభలో ప్రదర్శించుచుండగా, గంధర్వ కిన్నరులు గానము చేయగా, ఇంద్రుడత్యంత వైభవముతో ప్రకాశించుచుండెను. సప్తర్షులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీ దేవతలు, అష్టదిక్పాలకులు ఇంద్రుని వైభవమును కొనియాడుచుండిరి.

దేవతలకు గురువైన బృహస్పతి ఇంద్రుని సభకు వచ్చెను. అహంభావ పూరితుడైన ఇంద్రుడు సింహాసనము నుండి లేచి గురువగు బృహస్పతిని గౌరవించకుండెను. ఈ అవమానమును బృహస్పతి సహించలేకపోయెను. ఏమియు మాట్లాడక, గర్వముగా సింహాసనముపై కూర్చున్న ఇంద్రుని చాలాసేపు తేరిపార జూచి, వెను దిరిగి అక్కడనుండి వెళ్ళిపోయెను. అక్కడ నుండి వెళ్ళిన బృహస్పతి యింటికి చేరుకొనెను. తన గురువు వెళ్ళిన తర్వాత, ఇంద్రుడు తాను చేసిన అపరాధ మెంతటి తీవ్రమైనదో గ్రహించెను. తనను తానిట్లు నిందించుకొనెను. ''గర్వము చేత నా కులగురువును అవమానపరచితిని. తక్షణమే వెళ్ళి అతని పాదములపై పడెదను. క్షమాపణ వేడుకొందును''. ఇంద్రుడు అతి తొందరగా బృహస్పతి గృహము సమీపించెను. కాని బృహస్పతి, ఇంద్రుని ఆలోచనలు ముందుగనే గ్రహించినవాడై, అదృశ్యుడయ్యెను. అందుచేత ఇంద్రుడు బృహస్పతిని కనుగొన లేకపోయెను. ఇంద్రుని కేమి చేయుటకు పాలుపోకుండెను.

ఇంద్రుని గురువు బృహస్పతి కనుపించకుండుటచేత, ఇంద్రుడు నిస్సహాయుడయ్యెనను వార్తనలుదిక్కులా వ్యాపించెను. ఇంద్రునకు గురువు లేకుండుట కనిపెట్టి, యిదే అదనని తలచి రాక్షసులు తమ గురువైన శుక్రుని సలహాపై స్వర్గలోక ప్రభువైన ఇంద్రునిపై యుద్ధము ప్రకటించిరి. దేవతలు చిత్తుగా ఓడిపోయిరి. అసురుల ఆయుధములకన్న పదవీచ్యుతి దేవతల నెక్కువగా బాధించెను. వారు బ్రహ్మ కడకేతెంచి తమ దుస్థితిని నివేదించిరి. వారేమి చేయవలెనో సలహా యివ్వమని బ్రహ్మను కోరిరి.

దేవతలపై, ముఖ్యముగా ఇంద్రునిపై జాలిపడి బ్రహ్మ యిట్లనెను. ''ఇంద్రుడా! గర్వముచేత నీవు గొప్పవాడైన బృహస్పతిని అవమానించినావు. ఇట్లు జరుగుట చాలా దురదృష్టకరము. నేనొక సలహా

యిచ్చెదము. త్వష్టని కుమారుడైన విశ్వరూపుని వద్దకు యిప్పుడే వెళ్ళుము. అతడు నీకు సహాయము చేయగలడు. అతడు చాలా గొప్పవాడు, నీకు సహాయము చేయుటకు తగినవాడు. దేవతలకు గురువుగా నుండుటకు నీ వతనిని అంగీకరించునట్లు చేయవలెను. అత డసురుడగుట చేత అతని సానుభూతి అసురులపై నుండగలదు. ఆ విషయము నీవు విస్మరించి, అతనిని గురువుగా ఉండవలసినదిగా కోరవలెను. అతడు సహాయము చేయగలడు''.

దేవతలు విశ్వరూపుని వద్దకు వెళ్ళి అతని పాదములపై పడగా, ఇంద్రుడతనితో యిట్లనెను. ''మేము నీ వద్దకు యాచకులుగా వచ్చితిమి. నీకు మేము ధర్మ సూక్ష్మములు చెప్పుటకు రాలేదు. కాని వేదములను బోధించు గురువు వేదములు మూర్తీభవించిన వాడని నీకు గుర్తుచేయుచున్నాము. ప్రజాపతి ప్రతిబింబము తండ్రి, భూమి యొక్క ప్రతిబింబము తల్లి. సోదరుడు ఇంద్రుని ప్రతిబింబము, కరుణకు ప్రతిబింబము సోదరి. ఆహ్వానించని అతిథి ధర్మదేవత, ఆహ్వానించిన అతిథి అగ్నికి ప్రతిరూపము. అన్ని జీవులూ భగవత్స్వరూపములు. అందుచేత మమ్ములను నీతో సరిసమానముగా యెంచవలెను. నీవు మాకు గురువువై మాకు జయము కలుగునట్లు చేయవలెను. నా కంటె వయస్సులో నీవు చిన్నవాడవు. కాని నేనడిగిన వరము నీవు ప్రసాదించ నున్నావు కాబట్టి నీ పాదములకు ప్రణమిల్లుచున్నాము. నీవు మాకు గురువగుటచేత వయస్సుతో నిమిత్తము లేక నీకు నమస్కరించుచున్నాము. మా కోరికను మన్నించి మాలో ఒకరుగా నుండవలసినదిగా ప్రార్థించుచున్నాము''.

వారిని చూచి విశ్వరూపుడు చిరునవ్వుతో యిట్లనెను. ''గురు పదవి నాకు యోగ్యమైనది కాదు. గురుత్వము వహించినచో, ఋషుల బ్రహ్మ తేజస్సు కలుషిత మగునని జ్ఞానులు చెప్పుదురు. కాని మీరు క్లిష్ట పరిస్థితుల్లో నుండి నా సహాయము కోరుచున్నారు. కష్టములో నున్న వారిని ఆదుకొనుట ధర్మము. అందుచేత మీ కోరికను మన్నించెదను. ఈ గురు పదవిని చేబట్టి నన్ను త్యాగము చేయవలసినదని మీరు కోరుట చేత నేను సంధిగ్ధములో పడినాను. అయినప్పటికీ మీ కోరికను కాదనలేను. మీకు గురువుగా నుండుట నాకు సమ్మతమే''.

విశ్వరూపుడు వారికి గురువయ్యెను. అతనికి అనేక కళలందు పరిచయముండుటచేత, వారు పోగొట్టుకున్న దానిని తిరిగి వారు పొందునట్లు చేసెను. అతి శక్తివంతమైన నారాయణ కవచమును అతడు ఇంద్రునకు తొడిగెను. మరియు దేవతలకు ప్రభువైన ఇంద్రునకు 'ఓం నమో నారాయణాయ' అను పవిత్ర మంత్రమును ఉపదేశించెను. ఈ మంత్రము ప్రతి అవయవము, మనస్సు, కర్మ నారాయణ చింతతో నిండియుండునట్లు చేసి, కీడు కలుగకుండ కవచమువలె రక్షించును. 'ఓం నమో నారాయణాయ' అని పదే పదే ఉచ్చరించుటయే యీ కవచము యొక్క రహస్యము. ఈ కవచమును తొడిగి ఇంద్రుడు అసురులతో యుద్ధము చేసి జయము పొందెను. ఒకప్పుడు విశ్వరూపుడు గురుత్వము వహించగా ఒక యజ్ఞమును జరిపెను. దేవతలకు ప్రభువైన ఇంద్రునికి గురువుగా, విశ్వరూపుడు యజ్ఞహవిస్సును దేవతలు స్వీకరించుటకు ఆయా దేవతలను ''ఇంద్రాయ ఇదం'', ''వరుణాయ ఇదం'' అని ఆవాహన చేయవలసి వచ్చెను.

విశ్వరూపుడు అమరజాతికి చెందిన వాడగుటచేత, సహజముగా అసురుల యెడ పక్షపాత వైఖరి గలవాడై, చిత్రమైన తంత్రము నుపయోగించి, యజ్ఞహవిస్సు అసురులకు చేరునట్లుగా మంత్రముల నుచ్చరించి ఆవాహన చేసెను. ఇంద్రుడు తమ గురువు మోసగించుచున్నాడని కనిపెట్టెను. ముందుగానే యిటువంటిది జరుగగలదని

బ్రహ్మ ఇంద్రుని హెచ్చరించి, దానిని సహించవలెనని చెప్పెను. కాని ఇంద్రుడు, గురువు మోసము చూసి సహించలేకపోయెను తన ఖడ్గమును తీసుకుని విశ్వరూపుని మూడు తలలు నరికివేసెను. మూడింటిలో 'సోమపీత' మను దానిని మొట్టమొదట నరికివేసెను. ఆ తలతో సోమరసమును త్రాగుచుండుట చేత ఆ తలకు 'సోమపీత' మను పేరు కల్గెను. ఈ తల శరీరము నుండి విడివడగానే కపింజల అనే పక్షిగా రూపొందెను రెండవది సురను త్రాగుటచే 'సురపీత' మను పేరు పడిన తల కళావింగమను పేరుగల పక్షిగా మారెను మూడవ తల అన్నము తినుటచేత 'అన్నాదం' అను పేరు పడిన తిత్తిరి పక్షి అయ్యెను.

బ్రాహ్మణుని తలలు నరుకుట చేత ఇంద్రుడు బ్రహ్మహత్యా పాతకమునకు గురి అయ్యెను. ఒక ఏడాది ఇంద్రుడు బాధపడవలసి వచ్చెను సంవత్సరము తర్వాత భూమిని, వనితలను, వృక్షములను తన యొక్క బ్రాహ్మణ హత్యా పాపమును పంచుకుని, తనకు పాప విముక్తిని కల్గించమని ఇంద్రుడు కోరెను దానికి ఫలితముగా వారి కనేక వరముల నొసంగెను. వాటి వలన క్రమేపి బ్రహ్మహత్యా పాప ప్రభావము వారిపై అంతరించునట్లు చేసెను.

తన కుమారుని చంపినందుకు త్వష్టునకు ఇంద్రునిపై ఆగ్రహము కలిగెను త్వష్టుడు ఒక హోమ కార్యము జరిపి యిట్లు ఆవాహన చేసెను. ''ఓ ఇంద్రశత్రూ! లెమ్ము బయిటకు వచ్చి తొందరగా నీ శత్రువును వధింపుము''. హోమ కార్యము పూర్తి అయిన వెంటనే ఆ హోమాగ్ని నుండి ఒక భయంకర రూపము వెలువడెను అతడు నల్లగా లావుగా నల్లని మేఘముల గుంపువలె కన్పట్టెను అతని జుట్టు, కనులు రాగి వర్ణములో నుండెను మిట్ట మధ్యాహ్నపు సూర్యుని వేడిమివలె అవి తీవ్రముగా నుండెను అతని చేతిలో ఒక త్రిశూలము గలదు అతనిని చూచినవారు భయపడి అక్కడ నుండి పారిపోయిరి అతని రూపము, స్వరము, అరుపు చాలా భయంకరముగా నుండెను. అతని పేరు వృత్రుడు

## 69 ఇంద్రునకు వజ్రాయుధము లభించుట

వృ... యకత్వము వహించి దేవతలపై దండెత్తెను అతని మహత్తర శక్తిముందు దేవతలు నిలువలేకపోయిరి దేనివలననూ వృత్రుని అణచుటకు సాధ్యము కాకుండెను దేవతల అస్త్రము లన్నియు విఫలమయ్యెను. త్వష్టుని కుమారుడైన వృత్రుడు, దేవతల అస్త్రములను మ్రింగివేయుచుండెను దేవతల అస్త్రములు తనలో నుండుటచేత వృత్రుడు మరింతగా ప్రకాశించుచుండెను.

భయముతో నిలువలేక దేవతలు పారిపోయిరి ఆదిపురుషుడైన నారాయణుని వద్దకు దేవతలు వెళ్ళిరి నారాయణుడు వారికి దర్శనమిచ్చి యిట్లనెను ''మీరు నిర్భయముగా నుండుడు నేను మీకొక పద్ధతి సూచించెదను అది వృత్రుని నాశనము చేయగలదు మీరు దధీచి మహర్షి వద్దకు వెళ్ళవలెను. ఆ మహర్షి అశ్వినీ దేవతలకు బ్రహ్మ విద్యను బోధించెను దానికి ప్రతిఫలముగా అశ్వినీ కుమారులు అతనికి అమృతత్వము ప్రసాదించిరి. మీరు దధీచి వద్దకు వెళ్ళి, అతని బలమైన అత్యంత శక్తితో కూడిన ఎముకలను యివ్వవలసినదని కోరవలెను. త్వష్టునకు అజేయమైన కవచమును ప్రసాదించినవాడు దధీచి అతడు తన కుమారునకు దానివివ్వగా, తి... కిచ్చెను అతడు దానిని ఇంద్రుని కిచ్చెను మీరు అశ్వినీ దేవతలను

తోడుగా తీసుకువెళ్ళి, వారి సహాయముతో మీరు దధీచి మహర్షి శరీరమును కోరినచో అతడు తప్పక శరీరమును మీ కొరకు త్యాగము చేయును ఆ శరీరములోని ఎముకలను భయంకరమైన ఆయుధముగా తీర్చిదిద్ద వలసినదిగా విశ్వకర్మను కోరవలెను. అప్పుడది వజ్రాయుధమగును. నా సహాయ సంపత్తులు తోడుకాగా, ఆ వజ్రాయుధముచేత వృత్రుడు అంతమొందును. ఆ ఆయుధముచేత అతని తల తెగి మరణించిన వెంటనే మీ వెనుకటి ఔన్నత్యము, అస్త్రములు తిరిగి మీకు లభించగలవు''.

దేవతలు దధీచి మహర్షి వద్దకు వెళ్ళి, అతని యెదుట సిగ్గుతో తలవంచుకుని నిలబడిరి అతని పాదములపైబడి, ఇంద్రుడు సంకోచించుచు, తగ్గు స్వరముతో తనకొక సహాయము చేయవలసినదని అర్థించెను ముసలి మహర్షి మౌనముగా చిరునవ్వు నవ్వుచూ ఇంద్రుడు కోరు అభ్యర్థనకై వేచి చూచుచుండెను. ఇంద్రుడు దధీచి శరీరము నందలి యెముకలు కావలెనని కోరుచు, తన కోరికకు కారణమును వివరించెను

దధీచి చిరునవ్వుతో వారి అభ్యర్థన పట్ల నిరసన తెల్పుచు యిట్లనెను. ''దేవతలారా! మరణము యెంతో వైరాగ్యము పొందిన వారికి కూడ ఆమోద యోగ్యము కాదు. మీకు మతిపోయినట్లున్నది. భగవంతుడే వచ్చి అడిగిననూ, యే మానవుడూ తన ప్రాణమును త్యజించుటకు యిష్టపడడు నాకు మరణించవలెనని లేదు. నాకు అమృతత్వము లభించినది ఆ భాగ్యమును మీకొరకు నేనెందుకు పోగొట్టుకొనవలెను నేను మరణించుటకు యిష్టపడను, యీ శరీరమును త్యజించలేను ''

దేవత లిట్లనిరి ''ప్రభూ! మీరు చాలా గొప్పవారు. కష్టములో నున్న వారిపై మీ ప్రేమ, కరుణ అపారము. అటువంటి మీరు యీ విధముగా మాట్లాడుట యెట్లు తగును? ఏ మానవుడైననూ, తన బాధను నివారించుకొనుటకు తగిన శక్తి సంపదలను కలిగియున్నచో, ఇతరుల సహాయమును యెన్నడూ కోరడు కాని యిప్పుడు మేము క్లిష్ట పరిస్థితిలో ఉన్నాము దీనిని నివారించుటకు మేము యేమియు చేయలేని స్థితిలో మున్నాము. మేము కోరిన కోరిక యెంత నీచమైనదో గ్రహించి కూడా, యీ సహాయమును మీ నుండి కోరవలసి వచ్చెను మేము రక్ష పడయుటకు యిదొక్కటే మార్గము దయచేసి మీరు దీనిని మాకు ప్రసాదించవలెను''.

దధీచి యిట్లనెను. ''మీ వాదనను త్రోసిపుచ్చుటకు వీలులేని విధముగా నన్ను యిరకాటములో పెట్టినారు కష్టములో నున్న వానికి సహాయపడలేని మానవుడు ఉన్నత లోకములకు వెళ్ళలేడు మీ కొరకు నేను మరణించ నిశ్చయించుకున్నాను కరుణ కలిగిన మానవుడు, యితరుల కష్టములు తనవిగా భావించి పరిగణించును ఈ విషయము తెలిసికూడా, కష్టములో నున్నవారికి సహాయపడక వారికి కష్టముల నుండి విముక్తి కలిగింపని మానవునకూ వృక్షమునకూ భేదము లేదు మీ దుస్థితి నుండి కాపాడుటకు సహాయము చేసెదను మీరు ఆందోళన చెందవలసిన అవసరము లేదు నా శరీరమును పరిత్యజించిన, అది మీకు వినియోగపడునని నారాయణుడే స్వయముగా చెప్పెను ''

దధీచి మహర్షి బ్రహ్మముపై మనస్సు లగ్నము చేసి సమాధిలోనికి వెళ్ళెను దేవతలు కోరిన తన శరీరమును పరిత్యజించెను. అతని శరీరములోని బలమైన ఎముకలను తీసుకొని వెళ్ళి విశ్వకర్మకు యిచ్చిరి.

విశ్వకర్మ ఆ ఎముకలతో పిడుగువంటి అతి భయంకరమైన ఆయుధమును రూపొందించెను. అది లోకములో వజ్రాయుధమని పేరు గాంచెను

# 70 ఇంద్ర వృత్రాసురుల యుద్ధము

తనకు యిష్టమైన ఐరావతము నధిరోహించి, ఇంద్రుడు వృత్రాసురునిపై యుద్ధమునకు సిద్ధపడెను. ఇంద్రుని నాయకత్వములో దేవతలందరూ వృత్రాసురుడు తన సేనతో నిలిచియున్న ప్రదేశమును చేరుకొనిరి నర్మదా నదీ తీరమున ఇంద్రునికి వృత్రాసురునికి మధ్య భయంకర పోరాటము సాగెను. అసురులందరూ వృత్రాసురుని వైపు చేరిరి. వారిలో నముచి, శంబర, హయగ్రీవ, పులోమ, వృషపర్వ, హేతి, ప్రహేతి, మాలి, సుమాలి, మున్నగువారు ప్రధానులు ఇంద్రుని పక్షమున ఏకాదశ రుద్రులు, అష్ట వసువులు, ద్వాదశాదిత్యులు, అశ్వినీ దేవతలిద్దరు, నలుగురు పితృ దేవతలు, నలుబది తొమ్మండ్రు అగ్నులు, నలుబది తొమ్మండ్రు మరుత్తులు, పదుగురు విశ్వేదేవతలు, యింకా మరెందరో గలరు.

యుద్ధము చాలా భీకరముగా నుండెను. అసురుల అస్త్రములు యిప్పుడు దేవతల నేమియు చేయలేకపో యెను. అల్ప మనస్కులాడు మాటలకు ధీరులైన సజ్జనులు చలించనట్లు దేవతలు స్థిరముగా నిలిచి పోరాడిరి దేవతలు పైచేయిగా నుండిరి అసురులు యుద్ధభూమి విడిచి పరుగెత్తి పారిపోవుచుండిరి అసురులలో ధైర్యము సడలుట జూచి వృత్రాసురుడు ఆగ్రహావిష్టుడయ్యెను అతడు స్వరము హెచ్చించి యిట్లనెను.

''మీరందరూ నేను చెప్పునది వినండి. మరణమునెవరూ తప్పించుకొనలేరు ఒకసారి జన్మించిన మీరందరూ మరణించుట తథ్యము. మరణము అనేక విధములుగా సంభవించును ప్రతి ఒక్కరికీ, యేదో ఒక విధముగా వంటప్పుడు, ఎప్పుడో ఒకనాడు మరణించవలసి యున్నపుడు, మీరు ఆగి మరణము గురించి ఒకసారి యోచించుట సమంజసము కాదా? మరణము అనివార్యమైనపుడు, యీ భూమిపై జీవితము ముగిసిన పిమ్మట ఆ మరణము వల్ల పేరు ప్రఖ్యాతులు పొంది స్వర్గము నలంకరించ గలిగినపుడు, మరణము కోరుట శ్రేయస్కరము కాదా? యోగములో యీ భౌతిక కాయమును విడనాడుట, యుద్ధ భూమిలో వెనుతిరుగక పోరాడుట, యీ రెండునూ కోరుకొన దగినవి. ఇవి అందరకూ సాధ్యము కాదు చాల కొద్ది మందికే యిది సాధ్యమగును అందుచేత మీరు మరణమునకు భయపడవలదు జీవితమున కంతము యెట్లును తప్పదు''

అసురు లతని మాటలను వినకుండిరి అప్పుడు దేవతలవైపు తిరిగి వృత్రాసురుడు కోపముతో యిట్లనెను. ''పారిపోవుచున్న యీ అసురులను వేధించి యేమి ప్రయోజనము? మీ దగ్గర నుండి భయముతో పారిపోవుచున్న వారికి బాధ కల్గించుట మీకు గౌరవప్రదము కాదు. మీకు ధైర్యమున్నచో నా యెదుట నిలిచి నాతో యుద్ధము చేయుడు''

వృత్రుడు పెట్టిన కేకకు దేవతల గుండెలు భయముతో అదిరెను. తన శూలమునెత్తి యేకాకిగా వృత్రుడు దేవ సేనలో ప్రవేశించి, వారిని నాశనము చేయ మొదలిడెను. ఇంద్రుడు వృత్రునిపైకి ఒక పెద్ద గదను విసరగా, వృత్రుడు యెడమ చేతితో పట్టుకుని, అటు యిటు దాని నూపి ఇంద్రుని ఐరావతముపైకి విసిరెను ఆ గదా ఘాతమునకు ఐరావతమునకు కొద్దిగా దెబ్బ తగులగా, ఆ యేనుగు కొన్ని అడుగులు వెనుకకు మరలెను విరోధి కష్ట పరిస్థితిని గమనించి, వృత్రుడు మరల గదను ప్రయోగించకుండెను ఇంద్రుడు తిరిగి వృత్రునిపై

దాడి సలుపుట గాంచి, వృత్రుడు నవ్వి ఇంద్రునితో యిట్లనెను. ''నీవంటి పాపాత్మునితో యుద్ధము చేయుట నా అదృష్టము. నాకు సోదరుడు, నీకు గురువు అయిన ఒక బ్రాహ్మణుని హత్య గావించినావు. అతడు నీ మంచినే తలపెట్టినాడు. ఈ శూలమును నీ హృదయములోనికి పోనిచ్చి, నా చనిపోయిన సోదరుని ఋణము తీర్చుకొందును. నీ వజ్రాయుధమును నాపై నీవెందుకు ప్రయోగించుటలేదు? నేనన్న నీకు భయమా? లేక ఆ ఆయుధము పనిచేయదని సంశయమా? నారాయణుని పనుపుపై ఒక మహావ్యక్తిశరీరము నుండి తీర్చిదిద్దినది యీ వజ్రాయుధము. దానికి శక్తి దధీచి వలన కలిగి, నారాయణునిచే పవిత్రమైనది. నాపై వజ్రాయుధమును ప్రయోగింపుము. భగవంతుడున్నచోట జయము తథ్యము. నా వరకు నేను భగవంతుని తలచి, నా ఆలోచనలు భగవంతుని చింతనలో నిండియుండునట్లు చేయుదును. నేను చనిపోయినచో యీ పాపభూయిష్ఠమైన శరీరమును వదలిపెట్టుదును. అందుకు నేను విచారించను. నాపై వజ్రాయుధము ప్రయోగించుము. ఒక పాపాత్మునికి చేసిన విన్నపము ఫలించనట్లు, యీ వజ్రాయుధము నాపై పనిచేయదని నీకు భయమా? నీవు విసరిన గద నిష్ఫలమైనట్లే యీ వజ్రాయుధము గూడ నిష్ఫలమగునని తలచుచుంటివా? ఆందోళన చెందకుము. నారాయణుని ఆశీర్వాదమొందిన యీ వజ్రాయుధము నిష్ఫలముకాదు. నీవు తప్పక నన్ను వధించెదువు''.

అనుకొనని యీ సంఘటనకు ఇంద్రుడు నిరుత్తరుడై నిలుచుండెను. ఇటువంటి మాటలను యెవ్వరును శత్రువునుండి వినబోరు. దేవతల సేన అంతయు నిశ్శబ్దముగా వృత్రుని మాటలను వినుచుండెను. వృత్రాసురుడు తిరిగి యిట్లు కొనసాగించెను.

''నావరకు నేను మనస్సును నారాయణుని పాదములపై లగ్నము చేసియున్నాను. నేను చనిపోయినట్లయితే యీ శరీరమనే బంధము నుండి విముక్తి కలుగును. తపస్సు చేసి యోగులు పొందు స్థితిని నేను పొందెదను. భగవంతుడు, తాను ప్రేమించిన భక్తులకు యీ ముల్లోకములలో సంపద నొసగడు. ఎందుచేతనో తెలుసా? సంపద ద్వేషమునకు, భయమునకు, మానసిక బాధకు, అహంభావమునకు, శత్రుత్వమునకు, విచారమునకు, విస్త్రాణకు కారణమని భగవంతునికి తెలియును. ఇంద్రా! వీటన్నింటి నుండి భగవంతుడు స్వేచ్ఛను ప్రసాదించుటేగాక యింకను ఆశీర్వదించును. దీనిని నమ్ముము. భగవంతుని అనుగ్రహ వరములను అనుభవించవలెనే కాని వర్ణించుటకు వీలుకాదు. ధనవంతుడు దీని నెన్నడూ తెలియలేడు''.

అకస్మాత్తుగా వృత్రునకు యుద్ధభూమి దాని పరిసరముల గురించిన ఆలోచనలు మరుగయ్యెను. అతని మనస్సు నారాయణునిపై నుండగా నిట్లనెను. ''ఓ ప్రభూ! నీ సేవకులకు సేవకునిగా నన్ను గొనిపొమ్ము. నీ గుణములనే నా మనస్సు ఆలోచించునట్లు చేయుము. నా కంఠము నుండి నీ గొప్ప తనమును కీర్తించు స్వరములనే రానిమ్ము. ఈ శరీరము నీకు ప్రీతికరమైన పనులనే చేయునట్లు అనుగ్రహింపుము. నాకు నీవే కావలయును. ప్రభూ! నాకు బ్రహ్మస్థితిపై గాని ధ్రువ స్థితిపైగాని కోరికలేదు. ఈ భూమిపై చక్రవర్తి కావలెనని గాని, పరలోకమును పాలించవలెననిగాని కోరిక లేదు. నాకు మోక్షముగాని, యోగశక్తిగాని వలదు. పిల్లపక్షి తల్లిపక్షి కొరకు, దూడ తల్లియైన ఆవు కొరకు, తనను విడచి చాలా దూరముగా తెలియని దేశములకేగిన భర్తకొరకు ప్రేమతో భార్య, యెట్లు పరితపించునో, నేనును నీకొరకై అట్లే తపించుచున్నాను. పునర్జన్మయను సుడిగుండములో చిక్కుకుని యున్నాను. అందునుండి నాకు విముక్తిని ప్రసాదించుము. నీ భక్తుల యెడ నాకు ప్రేమ పెంపొందింప జేయుము. ఆ విధముగా నేను తప్పక నీకు ప్రియమైనవాడ నగుదును. నీవు కల్పించిన మాయచేత నేను యీ శరీరమునకు, భార్యకు, బిడ్డలకు, ఇంటికి, 'నావి' అని భ్రమించే యితర

వస్తువులకు కట్టుబడిపోయినాను. దయచేసి యీ మాయను తొలగించి, యీ వస్తు ప్రపంచముతో బంధమును త్రెంచుకొనుటకు సహాయము చేయుము''.

# 71 వృత్రాసురుని వధ

వృత్రుడు యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. త్రిశూలమునెత్తి ఇంద్రునివైపు పరుగిడి యిట్లు అరచెను. ''ఇంద్రా! నీవు మరణించుటకు సిద్ధము కమ్ము''. త్రిశూలమును త్రిప్పి అతి వేగముగా ఇంద్రునిపైకి విసరెను మండుచున్న గ్రహము ఆకాశములో సంచరించుచున్నట్లు గోచరించెను ఇంద్రుడు తన వజ్రాయుధము చేత త్రిశూలము ధరించిన వృత్రుని బాహువును నరికివేసెను. ఆ బాహువును ముక్కలు ముక్కలుగా జేసెను. తన బాహువును నరికివేయుటచే వృత్రునికి విపరీతమైన బాధ కలిగెను ఆ బాధ వలన కోపముతో పిచ్చివాడయ్యెను. వృత్రుడు రెండవ చేతితో ఇనుప గుదియ పట్టుకుని ఇంద్రుని సమీపించెను ఇంద్రుని చేతిలో వజ్రాయుధ ముండెను. వృత్రుడు ఇనుప గుదియతో ఇంద్రుని, ఐరావతమును బలముగా కొట్టెను ఐరావతము తొండమునకు బలముగా తగులగా, వృత్రుడు కొట్టిన ధాటికి ఇంద్రుని కుడి చేతి నుండి వజ్రాయుధము జారి క్రింద పడెను. శత్రువు సముఖములో క్రిందకు వంగి వజ్రాయుధమును తీసుకొనుట సిగ్గుమాలిన పని యని ఇంద్రుడు తలచి తీసుకొనకుండెను అది గమనించి వృత్రుడు ఇంద్రునితో యిట్లనెను ''ఇంద్రా! ఎందుకు సంకోచించుచున్నావు? ఆలోచించుటకుగాని, జరిగిపోయిన దానికి విచారించుటకుగాని యిది సమయము కాదు వజ్రాయుధము తీసుకుని, దానితో నీ శత్రువునైన నన్ను చంపుము

''జయాపజయములు మానవుని జీవితములో ప్రతినిత్యము కలుగుచుండును ఎల్లప్పుడూ ఒకడే విజయము పొందుట జరుగదు. ఈ లోకములో జరుగు సంఘటనలు వానిని నిర్దేశించుట భగవంతుని అధీనములో నున్నవి. పాపము సామాన్య ప్రజలు అజ్ఞానముచేత సత్యమును తెలియక, యీ జీవిత పరమావధి శరీర రక్షణమేనని భావించెదరు ఇంద్రా, యీ సత్యము గుర్తు పెట్టుకొనుము ఈ ఒక్క లోకమే కాదు, సమస్త లోకములు ఒక అద్వితీయ శక్తికి లోబడి యున్నవి. ఇది చాలామందికి తెలిసిన వాటికన్న అతీతమైనది. కర్రనుండి మానవ, జంతు రూపములుగా తీర్చిదిద్దిన బొమ్మలను బొమ్మలాటలో చిత్రవిచిత్రముగా ఆడించుట నీవు యెన్నడూ చూడలేదా? దారములతోలాగి వాటి యజమాని ఆడించగా అవి కదులుట లేదా? వాటంతట అవి కదలుటకు శక్తి కలదా? అదే విధముగా, మనమందరమూ భగవంతుడు ఆడించినట్లు ఆడుచున్నాము. ఈ లోకమును జీవులతో పోషించిన భగవంతుడే తిరిగి అదే జీవులతో యీ లోకమును నాశనము చేయుచున్నాడు. భగవంతుని చేతిలో మనమందరము పరికరములము. ఎట్టి కోరికలు లేని మానవుడు కూడ జయము పొందిన తర్వాత అతని ప్రవర్తన మరొక విధముగా నుండును. అతడు యీ జీవితము, వైభవము, ఖ్యాతి, సంపదలతో అనుబంధము పెంచుకొనుట ప్రారంభించును. అందుచేతనే సమబుద్ధి కలిగి యుండవలెనని జ్ఞానులు చెప్పుదురు. జయాపజయములు, ఖ్యాతి అపఖ్యాతి, సుఖ దుఃఖములు, జీవన్మరణములు యెదురైన పుడు మానవుడు పొంగిపోరాదు, కృంగిపోరాదు. సత్వరజస్తమో గుణములు ప్రకృతి స్వభావము, వీనితో ఆత్మకు యెట్టి సంబంధము లేదు ఆత్మను తెలుసుకొని బ్రహ్మస్థితిని చేరిన మానవుని యీ ద్వంద్వము లేమియు చేయలేవు. నన్ను చూడుము. నా ఆయుధము నీ చేతిలో విరిగిపోయినది, నా భుజమును నీవు

నరికితివి. మన యిద్దరి మధ్య జరుగుచున్న యీ యుద్ధమను ఆటలో యెవరో ఒకరి జీవితము నాశము కాగలదు. ఎవరు గెలుచునదీ నిశ్చయముగా చెప్పుటకు వీలుకాదు ఇది ఒక జూదము వంటిది. ఫలితమును భగవంతునికి వదలిపెట్టి, మన శక్తిసామర్థ్యముల మేరకు మనము విధిని కానిచ్చెదము. ఇంద్రా, రమ్ము పోరును కొనసాగింపుము''

ఇంద్రునికి శత్రువైన వృత్రునిపై విపరీతమైన గౌరవాభిమానములు కలిగెను. వృత్రుని తెలివి, ఉదార బుద్ధి, వేదాంత జ్ఞానము చూచి ఇంద్రుడు యిట్లనెను. ''నీ గొప్పతనమునకు నేను అచ్చెరువందుచున్నాను. నీ మనస్సు యీ ప్రాపంచిక వస్తువులన్నిటి కన్న చాలా ఉత్తమమైనది నీవు సిద్ధ పురుషుడవు. అందరికి భ్రాంతిని కల్గించు మాయకు నీవు అతీతుడవు. నీలో అసుర లక్షణములు లేవు అసురడవైన నీవు రజోగుణముతో నిండియుండవలెను కాని నీలో అట్టి గుణము లేకుండుట విశేషము. నీవు శుద్ధ సాత్త్వికుడవు నీ మనస్సు భగవంతుని యందు సుస్థిరమై యున్నది. నీ గొప్పతనమునకు నా జోహారులు''.

ఆ తర్వాత వారిద్దరూ ధర్మ యుద్ధము గావించిరి. వృత్రుడు భయంకరమైన ఇనుప మేకును ఇంద్రునిపై విసరగా, అది ఇంద్రుని వజ్రాయుధము చేత ముక్కలు ముక్కలయ్యెను. వృత్రుని రెండవ భుజము కూడ ఇంద్రుడు నరికివైచెను వృత్రుడు తన నోరుని విప్పి విశాలమొనర్చెను అది భూమి నుండి ఆకాశమునకున్నంత విశాలముగా నుండెను. వృత్రుడు ఇంద్రుని, అతని యేనుగును మ్రింగివేసెను. ఇది జరిగిన తర్వాత దేవతలలో కలకలము చెలరేగెను వృత్రుడు ఇంద్రుని మ్రింగినప్పటికీ అతడు నారాయణ కవచము ధరించి యుండుటచేత చావకుండ రక్షణ పొందెను. ఇంద్రుడు తన వజ్రాయుధముతో వృత్రుని శరీరము లోపలి భాగములను తెగనరికి, తనకెట్టి హాని కలుగకుండ వెలుపలికి వచ్చెను పైకి వచ్చిన ఇంద్రుడు తన వజ్రాయుధముతో వృత్రుని శిరస్సు ఖండించెను ఈ దృశ్యము నందరూ చూచుచుండగా, వృత్రుని ప్రాణము శరీరము నుండి తేజో రూపములో బయటకు వచ్చి నారాయణుని పాదముల వద్ద అదృశ్యమయ్యెను

## 72 బ్రహ్మ హత్యా పాపము

వృత్రుడు మరణించిన తర్వాత, యీ లోకమందు, స్వర్గలోకమందు ప్రతి ఒక్కరూ నిర్భయముగా సంతోషముగా నుండిరి. కాని ఇంద్రునకు అట్లుకాదు అంతకు పూర్వము వృత్రుడు దేవతలను వేధించుచున్న పుడు, వారు వృత్రుని హతము గావింపుమని ఇంద్రుని వేడుకొనిరి కాని ఇంద్రునికి యిష్టము లేకుండెను. బ్రహ్మహత్యా పాపము కలుగునని అతడు భయపడెను ఇంద్రుడిట్లనెను ''ఇదివరలో విశ్వరూపుని చంపినపుడు బ్రహ్మహత్యా పాపము నాకు చుట్టుకుని ఒక సంవత్సరము వరకు వదలకుండెను భూమి, వృక్షములు, స్త్రీలు దయతో నా పాపములో పాలు పంచుకుని నన్ను పాప విముక్తుని చేసిరి. హోమాగ్ని నుండి పుట్టిన వృత్రుని నేను హతమార్చినచో, తిరిగి నన్ను యీ పాపము చుట్టుకొనినపుడు, నాతో పాలు పంచుకుని రక్షించు వారెవ్వరు?''

ఋషులు ఇంద్రునితో యిట్లనిరి. ''భయపడకుము. నీవు చేయబోవు అశ్వమేధ యాగమునకు మేము అధ్వర్యము వహించెదము. ఆ యజ్ఞము నిన్ను యీ పాపమునుండి విముక్తుని గావించును'' ఇంద్రుడు

సందేహముగా చూచుట గాంచి ఋషులు తిరిగి యిట్లనిరి. ''అశ్వమేధ యాగమునందు భగవంతుడైన నారాయణుడు పూజలొందును. అతడు మానవుని అన్ని పాపములను పరిహరించును. 'అతని నామములను కీర్తించుటచేత మహాపాతకములైన బ్రహ్మహత్య, గోహత్య, పితృహత్య, మాతృహత్య, గురుహత్యల నుండి మానవుడు విముక్తుడగును. అటువంటపుడు, లోక కళ్యాణమునకై యీ వృత్రుని సంహరించుట వలన ఆ పాపము నిన్ను చుట్టుకొనదు''.

ఋషులు చెప్పిన విషయములు ఇంద్రునికి నమ్మకము కల్గించగా, అతడు వృత్రుని సంహరించెను. వృత్రుని వధానంతరము బ్రహ్మహత్యా పాపము ఇంద్రుని వెంబడించెను. ఇంద్రుడొక్కడే దీనివలన బాధపడుచుండెను. ఇతరులెవ్వరూ అతని బాధలో పాలుపంచుకొనలేదు ఈ భూమి అంతయు ఇంద్రుడు పరుగెత్తి, చివరకు మానస సరస్సునందు ప్రవేశించెను. వెయ్యి సంవత్సరముల వరకు ఆ సరస్సులోని పద్మ కాండము నాశ్రయించి అందు వసించుచుండెను. ఈ సమయమందు జరిగిన యజ్ఞములలో తన భాగమైన హవిస్సును గ్రహించక యుండెను మానస సరస్సును లక్ష్మీదేవి రక్షించుచుండుట చేత బ్రహ్మహత్యా పాపము అతని దరికి రాలేకపోయెను ఆ పద్మ కాండమునందు ఆశ్రయము పొంది యున్నప్పుడు నిత్యమూ యీ పాపము నుండి విముక్తి పొందు మార్గములను గురించి ఆలోచించుచుండెను. తపస్సు తప్ప మరొక మార్గము లేదని నిశ్చయించుకొనెను.

వేయి సంవత్సరములు తపస్సు చేయుట చేత ఇంద్రుడు బ్రహ్మహత్యా పాపము నుండి విముక్తిపొంది, తిరిగి బ్రహ్మ ఆహ్వానింపగా స్వర్గము చేరుకొనెను. తర్వాత ఇంద్రుడు అశ్వమేధ యాగము నిర్వర్తించెను

ఇంద్రుడు స్వర్గమున లేని సమయమందు, నహుషుడు తాత్కాలికముగా ఇంద్ర పదవిని చేబట్టి స్వర్గమును పాలించెను

## 73 చిత్రకేతు మహారాజు

పరీక్షిత్తు అద్భుతపడి శుకబ్రహ్మతో యిట్లనెను. ''ప్రభూ! వృత్రుని రాక్షస జన్మము గురించి చెప్పుచుండిరి. దేవతలతో యుద్ధము చేయునపుడు అతని క్రూరకృత్యములను గూడ తెలిపిరి కాని వృత్రుడు ఆడినమాటలు నారాయణుని గొప్పభక్తుని మాటలవలె నున్నవి ఈ భయంకర రాక్షసుడు నారాయణుని భక్తుడగుట యెట్లు సాధ్యమయ్యెను? ఇది నాకు బోధపడక గందరగోళముగా నున్నది. దీనిని మరికొంత విశదముగా తెలుపవలెను. వృత్రునికి భగవంతుని యెడల ఉన్నటువంటి భక్తి, సాత్త్విక గుణములు కల్గిన దేవతలకు, ఋషులకు గూడ లేదని తోచుచున్నది ఈ లోకములో సముద్రతీరమున నున్న యిసుక రేణువుల కన్న యెక్కువ మంది జీవులు ఉన్నారు వారిలో అతికొద్దిమంది మాత్రము ధర్మమార్గ మనుసరింతురు. ఈ కొద్దిమందిలో చాల తక్కువ మంది మోక్షము జీవిత ధ్యేయమని తలచెదరు. మోక్షమును ఆపేక్షించువారిలో వెయ్యికి ఒక్కరు [illegible] ధములను త్రెంచుకొనగలుగుచున్నారు అట్టి జీవులలో కోటికొక్కరు నారాయణుని పాదములు చేరగలుగుచున్నారు అటువంటి సందర్భములో, దేవతలను బాధించి అనేక పాపకృత్యములు గావించిన అసురుడైన వృత్రునకు నారాయణునిపై అంతటి భక్తి యెట్లు కలిగెను? చివరకు అతని ప్రాణము

నారాయణుని పాదములనెట్లు చేరగల్గెను? ఇది చాలా విచిత్రముగా గోచరించుచున్నది. దీనిని విశదముగా తెలుపవలెను''

పరీక్షిత్తు సందర్భోచితముగా వేసిన ప్రశ్నకు శుకబ్రహ్మ సంతసించి యిట్లనెను ''నీ ప్రశ్న ఉచితమైనది వృత్రాసురుని అధ్యాత్మిక తత్త్వము వెనుక ఒక గాథ కలదు. నీకు ఆ గాథను వివరించుచుటకన్న సంతోషకరమైనది మరియొకటి లేదు శూరసేన దేశమందు చిత్రకేతు మహారాజు గలడు అతడు యీ లోకమును ధర్మయుతముగా పాలించెను అతడు చాలా మంచివాడు కాని ఒకే ఒక సంఘటన ఆ మహారాజు సుఖసంతోషములను కూలద్రోసెను. అతనికి అనేకమంది భార్యలున్నప్పటికీ సంతానము లేకుండెను అతనికి సర్వము ఉన్నప్పటికీ పుత్రుడు లేకుండుటచే అతడు విచారముగ నుండెను.

''ఈ భూమిపై సంచారము చేయుచున్న అంగిరస మహర్షి ఆ దేశమునకు వచ్చుట తటస్థించెను. చిత్రకేతు మహారాజు అంగిరస మహర్షిని వినయపూర్వకముగా ఆహ్వానించి తగిన గౌరవ మర్యాదలు చేసెను. రాజు సద్గుణములకు సంతోషించి మహర్షి యిట్లనెను ''విశేషమైన మర్యాదను చూపి ప్రవర్తించు రాజును దర్శించుట చాలా సంతోషమైన విషయము నీవు సత్పురుషుడవు, పెద్దలను గౌరవించుచున్నావు. సాధారణముగా మానవులు వేనికొరకు పరితపింతురో అవన్నియు నీకున్నవి నీకు లభించిన అదృష్టమునకు నీవు పూర్తిగా అర్హుడవు. కాని, నీవు విచారముతో నున్నట్లు కన్పడుచున్నావు నీ ముఖమందు విచారము స్పష్టముగా గోచరించుచున్నది నీ విచారమునకు కారణమేమిటో తెల్పుము?''

రాజు తన దురదృష్టమునకు కారణమును వివరించి యిట్లనెను ''నీవు గొప్ప ద్రష్టవు నాలో ప్రవేశించి నా సంతోషమును హరించి దొలిచివేయుచున్న యీ పురుగును ఊహించగిలరు! అయినప్పటికీ, మీరు అడిగితిరి కాబట్టే చెప్పుచున్నాను నాకు అందమైన భార్యలు గలరు, వారందరూ మంచివారు నాకు సర్వస్వమూ ఉన్నప్పటికీ, పుత్రునికి తండ్రికాలేని చింత మిగిలిపోయెను ఇతర వస్తువులు యెన్ని ఉన్నప్పటికీ అవి నాకు సంతోషము నిచ్చుటలేదు ఆకలిగానున్న వానికి పువ్వులు, గంధము యిచ్చినచో అతని ఆకలి తీరదు. ఆహారముతోనే ఆకలి తీరగలదు మీరు నాయందు దయ తలచినట్లైన, నాకు సహాయము చేసి, పుత్రులు లేని వారికి కలిగే నరకము నుండి రక్షింపవలెను తప్పక నాపై దయ చూపుడు.''

బ్రహ్మ కుమారుడైన ని జాలిపడి, ఒక దివ్య పదార్థమును త్వష్టని ఆధిపత్యములో తయారుచేసి రాజునకిచ్చి, దానిని జ్యేష్ఠభార్యకు యిమ్మని చెప్పెను. రాజు జ్యేష్ఠభార్యను పిలిచి, యిరువురు పరిశుద్ధులై మహర్షికి నమస్కరించిరి తర్వాత రాజు ఆ పదార్థమును మహర్షి ఆజ్ఞాపించినట్లుగా తన భార్యకు యిచ్చెను ఆమె దానిని సేవించిన తర్వాత, మహర్షి వారి దగ్గరనుండి నిష్క్రమించి తన సంచారమును కొనసాగించెను తరువాత కొంతకాలమునకు ఆ రాజునకు పుత్రుడు కలిగెను రాజ్యములో అందరూ యెంతో ఆనందించిరి

# 74 రాకుమారుని మృతి

రాజు ఆనందమునకు అవధులు లేకుండెను పుత్రునిపై విశేషమైన అనుబంధము కలుగగా, ఆ బాలునితోనే యెక్కువ కాలము గడుపుచుండెను. రాజునకు ఆ బాలుని తల్లి యెక్కువ ప్రేమపాత్రురాలు కాగా, మిగిలిన భార్యలు రాజు తమ్ము అలక్ష్యము చేయుచున్నాడని భావించిరి. ఇప్పుడు తమ్ము దాసీల కన్న చులకనగా చూచుచున్నట్లు వారు తలచిరి. రాకుమారుడు పుట్టకమునుపు తమ్ము చూచుటకు రాజు వచ్చుచుండెను, యిప్పుడు వచ్చుట పూర్తిగా మానివేసెను. అంతేగాక, వారికి రాకుమారుని తల్లి, అనగా జ్యేష్ఠభార్యపై అసూయకలిగెను ఆమెకు మాత్రమే మాతృత్వము దానివలన కలిగే ఆనందము లభించినది ఇతర భార్యలకు యీ అదృష్టము లేకపోవుటచేత వారికి రాజు జ్యేష్ఠభార్యపై అసూయ పెరిగెను ఈ అసూయచేత వారు వివేకమును కోల్పోయి, విపరీత చర్యకు నిశ్చయించుకొనిరి. ఒకరోజు ఆ శిశువుకు విషము పెట్టిరి

రాజు జ్యేష్ఠభార్య పుత్రుని పరుండబెట్టి, తాను లేచివెళ్ళెను. పుత్రుని చూచి నిద్రపోవుచున్నాడని ఆమె తలచెను. ఆమె నిత్యకృత్యములను గావించు కొనుచుండెను కొంతసేపయిన తర్వాత, తన పుత్రుడు చాలాసేపు నిద్రపోయినాడని తలచి, సేవకురాలిని పుత్రుని లేపి తీసుకురమ్మని పంపెను. ఆ సేవకురాలు వెళ్ళి చూడగా శిశువు మరణించి యుండెను ఆ దృశ్యము చూచి ఆమె బిగ్గరగా కేకపెట్టగా, శిశువుతల్లి యేమి జరిగెనో యని హుటాహుటి వచ్చెను. ఒక క్షణములో రాకుమారుడు మరణించెనన్న వార్తనలుదిశలా ప్రాకెను మహారాణి మూర్ఛపోయెను రాజు ఆమె అంతఃపురమును చేరెను మరణించిన పుత్రుని చూడగానే రాజు తనలోని వివేకము నశించెనని తలచెను మతిచెడిన వారివలె ఆ రాజదంపతులు చేయు రోదనముతో రాజ భవనములో శోకము తాండవించెను దేశమంతయూ శూన్యము నిండినట్లయ్యెను.

వారివద్దకు పుత్రుని ప్రసాదించిన అంగిరస మహర్షి నారదునితో వచ్చెను. వారు రాజును సమీపించి, విచారగ్రస్తుడైన రాజునకు జ్ఞాన బోధచేయు మాటలతో నిట్లు పలికిరి. ''ఓ రాజా! నీవు నీ కుమారుని మరణమునకు శోకించుచున్నావు కాని నీవు చక్కగా యోచించినట్లయితే నీవు శోకించుట చాలా తెలివితక్కువ పని యని గ్రహించగలవు నీవు అంతగా విచారించుటకు అతనికి నీకు యేమి సంబంధము? నీకు అతనితో గల బంధుత్వమేమి? నీవు తండ్రివని, అతడు నీ కుమారుడని భావించుచున్నావు ఒక క్షణమాలోచింపుము నీ పూర్వజన్మమున, అతని పూర్వ జన్మమున, నీ రాబోవు జన్మమున, అతని రాబోవు జన్మమున, యిప్పుడు మీయిద్దరికి ఉన్న సంబంధము గిలదా? మీమీ పూర్వజన్మలలో యీ సంబధము గిలదా? ఇప్పుడు నీకు కుమారుడైన యితడు రాబోవు జన్మలో నీకు పుత్రుడుగా కలుగబోడు అతడు నీకొక స్నేహితుడు, శత్రువు, లేక పూర్తిగా అపరిచితుడు కావచ్చు ఈ తండ్రి పుత్రుల సంబంధము స్థిరమైనది కాదు నది వేగముగా ప్రవహించునపుడు, యిసుకరేణువులు కొంతదూరము ప్రవాహముతో ప్రయాణము చేయును. అటు తర్వాత అవి మరి యెన్నటికీ కలియక విడిపోవును అదే విధముగా, కాల ప్రవాహములో, నీవు, నీ పుత్రుడు కొంతకాలము కలిసి ప్రయాణించినారు ఇప్పుడు మీరు విడిపోవు సమయము ఆసన్నమయ్యెను. మరొక చెట్టు విత్తనముల నుండి చెట్టు పుట్టినట్లు యీ లోకమున శిశువులు పుట్టుచున్నారు ఎవ్వరికీ ఆ శిశువులపై అధికారము లేదు. దేని గురించియు విచారించవలసిన పనిలేదు. మాయ చేత భ్రాంతి చెంది, నీవు తండ్రివని యితడు పుత్రుడని తలచి రోదించుచున్నావు ఈ భ్రాంతిని వదిలి పెట్టుము

''నీవు, నేను, సకల జీవులు, జడపదార్థములు యీ భూమిపై జన్మించి కొంతకాలము మాత్రమే ఉండును. మరణము తర్వాత తిరిగి ఒకరినొకరు కలియబోరు. ఈ భూమి మన మందరము కలిసి నివసించుటకు ఒక తాత్కాలిక గృహము. అందుచేత నీవెందుకు విచారించెదవు? భగవంతుడు, సృష్టించి, పోషించి, లయము చేయును. ఇది ప్రకృతి న్యాయము

''తండ్రిగా పేర్కొను 'దేహి' శరీరమువలన, తల్లిగా పేర్కొను 'దేహి' శరీరమునుండి పుత్రుడని పేర్కొను 'దేహి' శరీరము ఉద్భవించుచున్నది. విత్తనము నుండి చెట్టు పుట్టుట యెంత సహజమో, ఇదియూ అంతే. 'పుట్టుట గిట్టుట కొరకే' అను న్యాయము ననుసరించి, శరీరములు నశించును ఇది ప్రకృతి న్యాయము. కాని, దేహి అనగా ఆత్మ యెన్నడూ నశించదు. కాబట్టి నశించనటువంటి దాని గురించి మరణించినట్లు భావించి విచారించనవసరము లేదు. ఆత్మ సహజ స్వభావమును తెలియకుండుటచేత, శరీరము ఆత్మ వేర్వేరు కాదనట్లు తోచును. ఈ అవిద్యను విడిచిపెట్టినంతనే నీ విచారము నసిపోవును ఈ బాధలు, నష్టములు కేవలము అసత్యములని తలంచి ధైర్యము తెచ్చుకొని లెమ్ము. నీవు యిందుకై బాధపడుట అనవసరము''.

చిత్రకేతు మహారాజు మహర్షి మాటలను విని, చేతులతో కన్నీరు తుడుచుకుని యిట్లనెను. ''నన్ను యింతగా సముదాయించి, విచారమును మానమని చెప్పు మీరెవ్వరు? మీ వంటి ఉత్తమ జీవులు లోకమంతా సంచరించి, భ్రాంతిలో నున్న నా వంటి సామాన్య మానవులు అనుబంధము వల్ల కలిగే దుఃఖముతో మతి చెడినపుడు, సత్యము బోధించి ధైర్యము కలిగించుదురు. అజ్ఞాన సముద్రములో కొట్టుమిట్టాడుతున్న నావంటి అభాగ్యజీవులకు మీరు ప్రభువులు దయచేసి, చీకటితో నిండిన నాహృదయములో జ్ఞానజ్యోతి వెలిగించి, నాకు ఆనందమును ప్రసాదింపుడు''.

అంగిరసుడిట్లనెను ''ఓ రాజా! నేను అంగిరస మహర్షిని ఒకప్పుడు నీవు కోరగా, నీకు పుత్రుని ప్రసాదించినాను ఇతడు బ్రహ్మ కుమారుడు నారదుడు, నాకు సోదరుడు నీ పుత్రుని పోగొట్టుకున్న దుఃఖములో ఉండుటచేత నీవు నన్ను గుర్తింపకుంటివి. నిన్ను రక్షించుటకు మేము వచ్చితిమి భగవంతుని యెడల భక్తిగల నీవు విచారించుట తగదు. ఇంతకు పూర్వము నేను నీవద్దకు వచ్చినపుడు బ్రహ్మవిద్యను బోధించి యుండవలసినది. కాని అప్పటికి నీవు పరిపక్వత చెందలేదని గ్రహించినాను అప్పుడు నీవు యింకా భగవంతుని మాయలో చిక్కుకుని యున్నావు పుత్రుడు కావలెననే ప్రాపంచికమైన కోరిక నీలో బలముగా నుండెను. అందుచే నీకు పుత్రుని ప్రసాదించితిని. ఇప్పుడు పుత్రుని కోల్పోయిన తండ్రిపడే వ్యధను నీవు అనుభవిస్తున్నావు

''ఓ రాజా! భార్య, ఇల్లు, సంపద, కీర్తి, భోగ్యవస్తువులు, రాజరికము, సేవకులు, బంధువులు - యివన్నీ బాధ, విచారము, భ్రాంతి, భయము, దుఃఖమునకు కారణములు ఒక క్షణమాలోచించు. నీవు యెప్పుడైన యీ సౌధముపై కెక్కి, మేఘములు ఒకదానినొకటి వెంటాడుట చూచితివా? ఒకొక్కప్పుడు, అవి పెద్దనగరములో సేవలుగను, పొడవైన గోపురములు గల భవనములుగను కన్పించుట గమనించితివా? నీ ఊహలో యెన్నడైనా శూన్యము నుండి ఒక మహానగరము ఆవిర్భవించినట్లు గమనించితివా? జ్ఞానులు యీ మేఘ నగరమును గంధర్వనగరి అందురు. ఇది ఊహాశక్తిచేత రూపొందిన నగరము

''నీవెప్పుడును స్వప్నము గాంచలేదా? స్వప్నములో నీవు అందు ఒక పాత్రవని తలంచలేదా? స్వప్నము ముగిసి మెలకువస్థితికి వచ్చిన తర్వాత, స్వప్నములోని అనుభవములు అసత్యమని, మెలకువస్థితిలోని

అనుభవములు సత్యమని భావించెదవు చల్లని గాలి వీచుటతోనే గంధర్వనగరి చెదరిపోయి అది అంతయు అసత్యమని, అటువంటి నగరము లేదని గ్రహించెదవు. నీవెన్నడూ యిట్లు తలంచలేదా? ఈ లోకములోని అనుభవములు కూడ అట్టివే

''ఈ రాజ్యము, సంపద, భార్యలు, యెవరి మరణమునకు విచారించుచున్నావో ఆ పుత్రుడు, యివన్నియు స్వప్నములో కాంచు వస్తువుల వంటివి అవి నిజముగా లేవు. మెలకువస్థితిలో నీవు స్వప్న లోకములోని అనుభవములు అసత్యములని గ్రహించినట్లే, బ్రహ్మస్థితిని చేరినపుడు యీలోకములోని అనుభవములు కూడ స్వప్నలోకములోని అనుభవములవలె అసత్యమని గ్రహించగలవు. ఈ స్వప్నము నుండి తెలివితెచ్చుకుని లెమ్ము. ఈ లోకములో యేదియు సత్యము నిత్యము కాదని తెలుసుకొనినచో, నీవు యీ విచారమునుండి తేరుకొనగలవు''

అటుపిమ్మట నారదుడిట్లనెను ''నీకు ఉపనిషత్తులలో నొక మంత్రమును బోధించెదను. ఒకవారము రోజులు నీవు ఆ మంత్రము నుచ్చరించిన తర్వాత ఆదిశేషుని చూడగలవు అప్పుడు నీవు ద్వైతభావము వీడి, ఉత్తమజీవులు పొందిన సద్గతిని పొందగలవు''

నారదుడు తన యోగశక్తిచేత అక్కడి వారందరూ చనిపోయిన రాకుమారుని చూచునట్లు చేసెను. నారదుడతనితో యిట్లనెను ''నీకు అభివందనము. మరణించిన రాకుమారుని ఆత్మవునీవు. నీ బంధుజనమును పరికింపుము నీ తల్లి, తండ్రి, యితరులు నువ్వువారిని విడిచివెళ్ళినందుకు విచారిస్తున్నారు నీవు వదలిపెట్టిన యీ శరీరములోనికి తిరిగి ప్రవేశింపుము నీ తండ్రి నీకు యిచ్చుటకు సిద్ధముగా నున్న యీసంపదను, రాజ్యమును అంగీకరింపుము. ఈ సింహాసనముపై కూర్చుని అందరికీ ఆనందము చేకూర్చుము''.

రాకుమారుని ఆత్మ యిట్లు పలికెను. ''దివ్యమైన ఆత్మ కర్మలలో చిక్కుకొనుటవలన, యీ లోకములో మానవుడుగా, పక్షిగా, లేక మృగముగా జన్మించును. ఆ విధముగా చూచినట్లయితే, యీలోకములో జన్మించిన ప్రతిఒక్కరూ, యెప్పుడో ఒకప్పుడు మరొకరికి పుత్రుడుగానో, తండ్రిగానో, తల్లిగానో, స్నేహితుడుగానో, బంధువుగానో, లేక శత్రువుగానో ఉండియుందురు బంగారము, యితర వస్తువులను అమ్ముట- కొనుటచేత నిత్యము ఒకరి చేతులనుండి మరొకరి చేతులలోనికి మారుచున్నది. అదే రీతిగా, ఆత్మ ఒక శరీరమునుండి మరొక శరీరమునకు, ఒక తండ్రి నుండి మరొకనికి మారుచున్నది. ఈ బంధుత్వము అనిత్యము, అసత్యము. ఈ బంధుత్వము ఉన్నంతవరకు మమకారముండును. కాని ఆత్మకు, శరీరములో ఉంటూన్నప్పటికీ, యీ భ్రాంతి ఉండదు సంబంధము వలననే బాధ జనించుచున్నది. ఇది ఒక బంగారపు కడ్డీ వంటిది

''ఉదాహరణకు ఒక బంగారు కడ్డీని తీసుకొనుము. ఈరోజు అది ఒక లోభి పెట్టెలో నున్నది. నిన్నటి దినము అది బంగారువస్తువులు చేయు కంసాలి ఇనుపపెట్టెలో నుండెను. కొన్ని సంవత్సరముల తర్వాత మహారాజు కోశాగారములో నుండును ప్రతిఒక్కరూ బంగారు కడ్డీ తమ పెట్టెలో నున్నదందురు అది లోభి పెట్టెకావచ్చును, కంసాలి ఇనుపపెట్టె కావచ్చును, లేక రాజు కోశాగారము కావచ్చును కాని వారు, బంగారు కడ్డీకి పెట్టెతోగాని, దాని స్వామితోగాని అనుబంధములేదని గ్రహించలేరు. అదే విధముగా ఆత్మకు యెటువంటి అనుబంధములులేవు. అందుచే బాధకాని, సుఖముగాని ఉండదు. అందుచేతనే శరీరములో నున్న ఆత్మ, శరీరము విడిచిన తర్వాత విచారించదు''. ఆ విధముగా రాకుమారుని ఆత్మపలికి, వారందరి నుండి అదృశ్యమయ్యెను.

ఈ దృశ్యమును చూచి అచ్చెరువొంది, మరణించిన రాకుమారుని మాటలు వినగా, వారి దుఃఖము తొలగిపోయి, నిర్విచారముగ నుండిరి. వారికిగల గొలుసుల బంధము త్రెగుటచేత యెటువంటి బాధయు లేకుండెను ఆ తర్వాత రాకుమారుని మృతదేహమునకు అంత్యక్రియలు జరిపిరి. సవతితల్లులు తమ అకృత్యమునకు పశ్చాత్తాప పడి, పాపవిముక్తికి వ్రతములు చేపట్టిరి.

అంగిరస, నారద మహర్షులు పలికిన పలుకులకు చిత్రకేతు మహారాజు మనస్సు, ప్రశాంత సరస్సువలె, నిశ్చలముగా నుండెను. బురదతోనిండిన సరస్సును విడిచి యేనుగు వెళ్ళినట్లు, రాజు దేశము విడిచి లోకసంచారమునకు వెడలెను.

# సప్తమ స్కంధము

## 75 బ్రహ్మవిద్య

చిత్రకేతు మహారాజు యమునా నదీ తీరమును చేరెను. పవిత్ర నదీ జలములో స్నానమాచరించి ధ్యానమున కుపక్రమించెను అంగిరస నారద మహర్షులు అతని మనసులో మెదలగా, మానసికముగా వారి నావాహన చేసి, మనస్సునందే వారికి నమస్కారములు చేసెను. వెంటనే నారదుడు, అంగిరసునితో ప్రత్యక్షమయ్యెను. ఇది వరలో మంత్రము నుపదేశించెదనని మాట యిచ్చిన ప్రకారము రాజున కామంత్రము నుపదేశించిరి ఆ మంత్రము, రాజు ఆదిశేషుని చేరుటకు సహాయపడునని చెప్పి, రాజును మహర్షులిద్దరూ ఆశీర్వదించి వెళ్ళిపోయిరి.

చిత్రకేతు ఆ మంత్రమును యేడు దినములు, యేడు రాత్రులు నిర్విరామముగా నుచ్చరించెను అతడు కేవలము జలము మాత్రమే ఆహారముగా గ్రహించుచుండెను. ఏడవరోజు రాత్రి అతడు విద్యాధరుడయ్యెను అతని మనస్సు నిర్మలముగా ప్రకాశవంతముగా నుండెను మరికొద్ది రోజులకే భగవంతుని మరొక రూపమైన ఆదిశేషుని చేరెను రాజు పొగడ్తలకు సంతసించి, ఆదిశేషు డిట్లనెను ''నీ భక్తి నాకు సంతోషము కలిగించెను. నా వద్ద జ్ఞానము పొందుటకు వెళ్ళుమని నారద, అంగిరసులు నీతో చెప్పియున్నారు నీకు బ్రహ్మవిద్యను బోధించి, నీ మనసు నుండి మాయ అనే తెరను తొలగించి నిర్మలము గావించెదను.

''ఈ ప్రపంచమంతయు నే నావరించియున్నాను. నేను ద్రష్టను, దృష్టమును. దర్శన విధానము నేను నేను ద్రష్టను, దృష్టమును, యీ రెండింటికి భేదము లేదు చూచువాని యందును, అతడు చూచు వస్తువు వందును నేను ప్రవేశించి ఉంటున్నాను. ఒకప్రక్క వస్తు ప్రపంచము కలదు; మరొక ప్రక్క యీ వస్తు ప్రపంచము ననుభవించు మానవుడు కలడు నిజముగా యీ రెండును ఒకటే. నేనే యీ రెండు రూపములు ధరించుచున్నాను కాని యీ రెండింటికీ భేదము లేకపోవుట సత్యము నేను రెండింటియందు వ్యాపించి యున్నాను. స్వప్నము, స్వప్నము ననుభవించు వానిని ఉపమానముగా తీసుకుని మరికొంత విపులముగా చెప్పెదను.

''మానవుడు నిద్రపోవుచున్నపుడు స్వప్నమందు అనేక వృక్షములు, పర్వతములు, యితర వస్తువులతో కూడిన లోకమును చూచును ఈ స్వప్నలోకమును సృష్టించినది నిద్రించుచున్న మానవుడు, అతని మనస్సు నందు మాత్రమే యీ లోకము కలదు. అతను లేక స్వప్నలోకము లేదు. మరియు, స్వప్నమునందు తాను మెలకువ కలిగియున్నట్లు, లేక స్వప్న ప్రపంచములో ఒకచోట, తాను నిద్రించి యున్న స్థలము కాక, ఉన్నట్లు కలగనును కోసల దేశములో నిద్రించుచున్న వ్యక్తిగాంధార దేశములో యేదో జరుగుచున్నట్లు కలను గనును ఇవన్నియు కలలు గనేవారి సామాన్య అనుభవములు నీ దృష్టిని కొద్దిగా మళ్ళించి, ఆత్మయే కలను గనుచున్నవాడుగా పరిగణించినట్లయితే, యీ లోకమంతయు సామాన్య మానవుడు చూచుదానికి భిన్నముగా నుండును. బ్రహ్మస్థితిని పొందినవానికి, యీ లోకము స్వప్నతుల్యమగును. ఈ లోకమంతయు స్వప్నమును గనుచున్న ఆత్మ సృష్టించుకొన్నది; ఇది నిద్రలో మానవుని మనస్సు సృష్టించు స్వప్న లోకములవలె నుండును ఆత్మ, తాను గనుచున్న స్వప్నము నుండి మేలుకొన్నంతనే, అనగా జ్ఞానోదయము కలిగినదని గ్రహించినం

తనే, యీ వస్తు ప్రపంచమంతయూ మాయ యని గ్రహించును

''మానవుడు మూడు అవస్థలను పొందుచున్నాడు. జాగ్రదవస్థ, స్వప్నావస్థ, నిద్రావస్థ ఇవి ఒకదాని తర్వాత ఒకటి ప్రతి ఒక్కరికీ కలుగుచుండును. జాగ్రదవస్థలో స్వప్న లోకముండదు స్వప్నములో నున్నపుడు జాగ్రత్ లోక ముండదు. నిద్రావస్థలో జాగ్రత్ లోకముగాని, స్వప్నలోకము గాని యుండవు. కాని యీ మూడు అవస్థలందు ప్రత్యేకముగా ఒకటి ఉంటున్నది అది 'నేను మెలకువలో నున్నాను', 'నేను నిద్రించుచూ స్వప్నము గాంచుచున్నాను', 'నేను గాఢ నిద్రలో నున్నాను', అని అంటున్నది. అదియే ఆత్మ, నీలో, నాలో ఉన్నది 'నేను' అందరిలో ఉన్నాను ఈ సత్యమును గ్రహించినట్లయితే సుఖ దుఃఖములకు, యితర ద్వంద్వానుభూతులకుగాని తావు లేదు. ఎందుకనగా అప్పుడు యీ బహుళ ప్రపంచము అదృశ్యమగును. అప్పుడు నీకు సమదృష్టి యేర్పడి అన్నీ ఒకే విధముగా గోచరించును వృక్షము-గడ్డిపోచ, పర్వతము-యిసుక రేణువు; ఇవన్నియు ఒకటేయని, ఆత్మ వ్యక్త రూపములని తలచెదవు రెండునూ ఒకటేయని గ్రహించుట వలన వానిలోగల భేదములు కనుపింపవు అన్నింటిలో నేను వ్యాపించి యున్నట్లు గ్రహించగలిగిన స్థితినే బ్రహ్మస్థితి యందురు

''ఈ సత్యము తెలియనంతవరకు జీవుడు యీ వస్తు ప్రపంచములో కొట్టు మిట్టాడుచుండును సత్యమును యెఱుగ కుండుట చేత, ద్వంద్వములకు లోబడి బాధల ననుభవించును అందుచే జ్ఞా ద్దిని పెంపొందించుటకు యత్నించవలెను. దీనివలన అన్నింటియందు సమదృష్టి కలుగును బ్రహ్మవిద్య యందు ఆరితేరిన వారికి అన్నియూ ఒకే విధముగా గోచరించును

''జ్ఞానవంతులు మొదట వైరాగ్యము నలవరచుకొనవలెను ఇది స్వేచ్ఛను అనగా బ్రహ్మస్థితిని పొందుటకు మొదటి మెట్టు

''మానవులు లోకములో సుఖప్రాప్తికి, దుఃఖ నివృత్తికి తీవ్రముగా ప్రయత్నించెదరు వారు చేయు కర్మలన్నిటికీ యిదే ధ్యేయము. కాని, చిత్రమేమనగా వారు ఆశించినది లభ్యమగుట లేదు వారికి సుఖప్రాప్తిగాని, దుఃఖ నివృత్తిగాని కలుగుట లేదు మానవుడు తీవ్రముగా ప్రయత్నము చేసి పొందవలసినది ఒకే ఒక్కటే: అది మూడు అవస్థలందు ఉండునది. ఓ రాజా! ఈ సత్యమే 'నేను' అని గ్రహింపుము. నాయందే మానవుని మనస్సు లగ్నము కావలెను. నన్ను ధ్యానించుము.

''నేను యింతవరకు బోధించిన దానిని చక్కగా తెలిసికొనినచో, నీవు నన్ను చేరుకుని నాలో ఐక్యము కాగలవు''.

అటుపిమ్మట ఆదిశేషుడు అదృశ్యమయ్యెను. రాజు వర్ణింప సాధ్యముకాని శాంతిని పొందెను ఇంకెప్పుడూ తనకు విచారము కలుగదని గ్రహించి మిక్కిలి ఆనందించెను ఆకాశములో యెగురగలిగే రథమునెక్కి చిత్రకేతుడు ప్రయాణము చేసెను అనేక వేల సంవత్సరములు అతడట్లు నిర్విచారముగా యెట్టి బంధములును లేక సంచరించెను భగవంతుని కీర్తించుచూ కాలమును వెళ్ళబుచ్చెను

# 76 సతీదేవి శాపము

ఒకప్పుడు మహాదేవుని నివాసమైన కైలాస పర్వతము మీదుగా ప్రయాణించుచుండగా, చిత్రకేతుడు మహాదేవుని ప్రకాశవంతమైన రూపమును చూచెను. నారాయణుడు తనకు ప్రసాదించిన రథము నుండి, చిత్రకేతుడు కైలాస పర్వతమును, అందు ప్రమథగణములు మహాదేవుని చుట్టూ చేరియుండగా చూచెను. మహాదేవుడు ఋషులందరి మధ్య కూర్చుండెను. అతని ఒడిలో సతీదేవి కూర్చుని యుండెను. ఒక చేతితో మహాదేవుడామె నాలింగనము చేయుచుండెను ఇది చూచి చిత్రకేతుడు విరగబడి, వారందరికీ వినబడునంత గట్టిగా నవ్వెను చిత్రకేతుడు యిట్లనెను. ''మహాదేవుడిట్లు చేయుట చాల ఆశ్చర్యముగా నున్నది అతడు యీ లోకమునకు ప్రభువని అందురు అతడు అందరకూ గురువుగా ప్రసిద్ధినొందెను. అతడు ఋషుల సమావేశమునకు అధ్యక్షత వహించుచుండెను మరి నేను చూచునదేమి? బాహాటముగా అందరి సమక్షములో, తన భార్యతో రతికేళి జరుపుచుండెను సన్యాసి వస్త్రములు ధరించి, జడలు కట్టిన వెంట్రుకలతో, పవిత్ర శాస్త్ర గ్రంథముల నెరిగియూ, యీ మహాదేవుడు, అజ్ఞాని కుసంస్కారుడైన సామాన్య మానవునివలె, అందరిలో తన భార్యతో రతికేళి జరుపుచున్నాడు ఎందుచేత? అజ్ఞానులు కూడను సిగ్గు విడచి యిట్లు ప్రవర్తింపరు రహస్యముగా భార్యతో రతి సలిపెదరు మరి యీ దృశ్యము నెట్లు అర్థము చేసుకొనవలెను?''

ఈ మాటలను మహాదేవుడు విని ఊరకుండెను. అతడు నవ్వుచు మౌనముగా నుండుట జూచి, యితరులుకూడ అట్లే మౌనము వహించిరి ఎవ్వరూ ఒక్కమాట కూడ పలుకకుండిరి. కాని సతీదేవి రాజు మాటలను విని సహించలేకపోయెను తనకు గల ఇంద్రియ నిగ్రహము యితరులకు లేదని గర్వముతోనున్నాడని సతీదేవి తలచి, అతని కొక గుణపాఠము నేర్పి అతని గర్వము నణచవలెనని భావించెను. ఆమె కనులు క్రోధముతో యెర్రబడగా యిట్లనెను ''ఈ మనిషి చాలా గొప్పవాడననుకుని మనవంటి 'సిగ్గులేని' వారలకు ప్రవర్తనా నియమావళిని బోధించుట కర్హుడ ననుకొనుచున్నాడు.

''బ్రహ్మ, బ్రహ్మ పుత్రులైన భృగు నారదుల సందేశములను వినినవారు, తదితరులు యిక్కడ చేరియున్నారు వీరికెవరికీ ప్రవర్తన తీరు తెలియదనియూ, తనకొక్కనికే తెలుసుననుకొనుచున్నాడు ఇప్పుడే కళ్లు తెరిచిన యీ రాజు, వీరంతా మూర్ఖులని, నా భర్త మహాదేవుడు గౌరవమునకు అనర్హుడని భావించుచున్నాడు ఈ రాజు గర్వము నణచవలసిన సమయము వచ్చినది; ఇతనిని శిక్షింపక తప్పదు ఇతడు నారాయణుని పాదముల దరిదాపులలో నుండుటకేమాత్రము అర్హత లేదు అందుచేత, ఓ చిత్రకేతూ! నీ అహంకారమునకు శిక్షగా, నీవు అసుర జాతిలో జన్మించవలసినదిగా శపించుచున్నాను''.

చిత్రకేతు మహారాజు రథము దిగి, వినయపూర్వకముగా సతీదేవికి ప్రణమిల్లెను అతడిట్లనెను ''జగజ్జననీ! ఈ రెండు చేతులు జోడించి నీ శాపము స్వీకరించెదను. మానవుడు, యిదివరలో తాను చేసిన కర్మలకు ఫలితమును భగవంతుడు నిర్ణయించును మానవుడనే జంతువు మాయచేత భ్రాంతిలో చిక్కుపడి, యీ సంసార వలయములో గిరగిర తిరుగుచూ, బయటపడు మార్గము తెలియక, ఒక దాని వెంట ఒకటి వచ్చే సుఖ దుఃఖముల ననుభవించుచుండును ఈ ద్వంద్వములతో ఆత్మకు యెట్టి సంబంధము లేదు ఇతరులెవరూ వీటిని కలిగించలేరు అనంత ప్రవాహముగా భ్రాంతితో నిండిన యీ లోకములో, శాపమునకు, వరమునకు ఒక స్థానమున్నదా? స్వర్గమేది? నరకమేది? సుఖమేది? దుఃఖమేది? పరమాత్మ, మాయచేత జీవులను

సృష్టించును అతడే వారికి బంధమును, బంధ విముక్తిని యేర్పరచును. కాని పరమాత్మ వీటి కతీతముగా నుండును. అతనికి ఒకరిపై రాగము మరియొకరిపై ద్వేషము లేవు. అతనికి బంధువులుగాని, స్నేహితులుగాని లేరు. అతని కన్నియు ఒకే విధముగా గోచరించును. అతనిలో ద్వంద్వములు లేవు. తల్లీ! నీవు నాకు శాపమిచ్చినందుకు నీపై నాకు కోపము లేదు. శాపమును ఉపసంహరింపమని గాని, మార్చమని గాని అడుగను. నా మాటలు కష్టము కల్గించినచో నన్ను మన్నించవలెను''.

వారిద్దరకూ నమస్కరించి, చిత్రకేతుడు, రథమునెక్కి ముఖముపై చిరునవ్వు చిందగా అక్కడ నుండి వెళ్ళిపోయెను

మహాదేవుడు చిరునవ్వుతో రాజును గమనించుచుండెను అతడు సతీదేవివైపు తిరిగి యిట్లనెను. ''నారాయణుని భక్తుల గొప్పదనమును చూచితివా? వారిని యేదియు కలుషితము గావించలేదు నారాయణుని భక్తులకు స్వర్గము, నరకము, శాపము, వరము, అన్నియూ సమానమే. వారు యెట్టి ఉద్రేకములకు లోనుకాకుండ, యెక్కడ ఉన్నప్పటికీ శాంతముగా నుండెదరు వారికి అన్నియు ఒక్క రీతిగనే గోచరించును అతడు బ్రహ్మవిద్యలో నిష్ణాతుడు ద్వంద్వముల కతీతుడు. అతని ముఖములోని ప్రశాంతతను చూడుము అట్టి వానికి దారుణమైన శాపము నిచ్చితివి''. సతీదేవి కోపము అణగారగా, ఆమె చిత్రకేతుని, అతని ప్రశాంత వదనమును గాంచెను చిత్రకేతునకు తిరిగి శపించగల శక్తియుండినప్పటికీ, అతడు ఆమెను శపింపకుండెను ఆమె శాపమును ప్రశాంత వదనముతో స్వీకరించెను.

ఆ చిత్రకేతుడు, సతీదేవి శాప కారణముగా, వృత్రుడుగా జన్మించెను

## 77 మరుత్తుల జననము

నారాయణుని సహాయ సంపత్తులతో ఇంద్రుడు అసురులను సంహరించునపుడు, దితికి విచారమును కోపమును వచ్చెను తోబుట్టువులను చంపిన, ఇంద్రియలోలుడు, క్రూరుడు, పాపాత్ముడు అయిన ఇంద్రుడు మరణించవలెనని ఆమె నిశ్చయించుకొని, యిట్లనెను ''ఈ ఇంద్రుడొక మూర్ఖుడు తన ప్రాణమును సంరక్షించుకొనుటకు ధర్మ సూత్రములను విస్మరించెను రాజు కావచ్చు, పాలకుడు కావచ్చు, దేవత కావచ్చు, అందరి శరీరము ఒకటి కాదా? మరణించిన రెండు మూడు రోజుల తర్వాత యీ శరీరము గ్రద్దలకు, నక్కలకు, పురుగులకు విందగును. శరీరమును దహించిన, పిడికెడు మాత్రము బూడిద మిగులును అటువంటపుడు, యీ శరీర రక్షణము కొరకు పాపములు చేయుట మూర్ఖత్వము, స్వార్థము కాదా? ఈ ఇంద్రుని చంపుటకు నేనొక పుత్రుని బడయుదును ''

దితి తన భర్త కశ్యపునకు తన కోరికను తెలిపి అది నెరవేరునట్లు సహాయపడవలసినదిగా అర్థించెను. ఆమె భర్తనుండి వాగ్దానము పొందుటకు ఒక కుతంత్రమును ప్రయోగించెను. ఆమె భర్తకు చాల రోజులు అతడు మెచ్చుకునే టంతగా సపర్యలు గావించెను కశ్యపుడు సంతసించి యిట్లనెను. ''నీవు చేసిన సపర్యలు నాకెంతో సంతోషము కల్గించినవి. నీవు యేమి కోరిన దాని నొసగుదును. నన్ను అడుగుము''. అప్పుడామె

తనకొక పుత్రుడు కావలెనని, అతడు ఇంద్రుని సంహరించవలెనని కోరెను. ఆమె యిట్టి అపవిత్రమైన కోరిక కోరినందుకు కశ్యపుడు చాల చింతించెను. అనాలోచితముగా చేసిన వాగ్దానమునకు అతడు పరితపించెను కాని మాట నిలబెట్టుకొనదలచి అతడిట్లనెను ''నేను ఒక వ్రతము చేయు మంత్రములను నీకు బోధించెదను. ఒక సంవత్సర కాలము నీవు ఆ వ్రత నియమములను శ్రద్ధగా పాటించవలెను. ఇది చాల కఠినమైనది. నీవు తు,చ తప్పకుండా నా సూచనలను అనుసరించవలెను. నీవు అట్లు చేసినచో, సంవత్సరము తర్వాత నీ ప్రార్థనలకు సమాధానముగా ఒక పుత్రుడు కలుగగలడు''. ఆ తర్వాత పుంసవనమనే వ్రతమును కశ్యపుడు దితికి బోధించెను.

దితి తన గర్భములో కశ్యప కుమారుడు పెరుగుచుండగా, భర్త ఉపదేశించిన వ్రతమును నిష్ఠతో ఆచరించుచుండెను ఇట్లుండగా ఇంద్రుడు దితి ఆగ్రహమును తెలుసుకొనెను ఆమె ఆచరించు వ్రతమును, ఆమెకు పుట్టబోయే కొడుకు తనను సంహరించునని ఇంద్రుడు తెలుసుకొనెను ఇంద్రుడు దితి వద్దకు వచ్చి ఆమెకు సేవచేయు భారమును వహించెను. ప్రతిరోజూ అతడు పుష్పములు, ఫలములు, సమిధలు, కుశాసనములు ఆమె చేయు వ్రతము కొరకు తెచ్చుచుండెను. ఆమె అవసరములకు పరిశుద్ధమైన జలమును తెచ్చుచుండెను. ఆమెను నిత్యము గమనించుచు ఆమె తోడనే ఉండజొచ్చెను అతని సేవాభక్తిని దితి మెచ్చుకొనెను. స్త్రీ సహజమైన వాత్సల్య గుణము కలదగుటచేత, అతని సేవాభక్తిలో దాగియున్న కుయుక్తిని ఆమె పసిగట్టలేకపోయెను. ఆమె విశ్రాంతి పొందుచు వ్రత నియమనిష్ఠలను ఉల్లంఘించు తరుణము కొరకు ఇంద్రుడు వేచి చూచుచుండెను వేటగాడు యెరకొరకు వేచియున్నట్లుగా నుండెను అత డెంతగా ప్రయత్నించినప్పటికీ, ఆమె ఒక క్షణము కూడా విశ్రాంతి తీసుకొనకుండెను. కశ్యపుని సూచనలను ఆమె అతి శ్రద్ధగా పాటించుచూ యెట్టి పొరపాటును చేయకుండెను అయినప్పటికీ ఇంద్రుడు తన ప్రయత్నము విరమించలేదు.

చిట్టచివరకు ఇంద్రుని ఓర్పు ఫలించెను ఒకరోజు, ఆమె వ్రత నియమనిష్ఠలకు బాగా అలసి యుండెను. పైగా ఆమె ప్రసవించు దినములు దగ్గరకు వచ్చినవి. అలసట చేత, ఆమె స్నానమాచరించక, ఆచమనము చేయక ఒకనాటి సాయంత్రము నిద్రపోయెను ఇది భగవంతుడు తన కొసగిన మహదవకాశమని ఇంద్రుడు తలచెను తన యోగశక్తిచేత ఆమె గర్భములో ప్రవేశించెను. బంగారు వర్ణములో రూపమేర్పరచుకొనుచున్న శిశువును చూసెను. తన వజ్రాయుధముచే ఆ శిశువుని యేడు ముక్కలు చేసెను ఆ విధముగా ముక్కలైన శిశువులు రోదింప మొదలిడిరి అతడు 'మా రుద' అనగా యేడవవద్దు అని పలికెను. ఒకొక్క ముక్కను తిరిగి యేడు ముక్కలు చేసెను. అట్లు ముక్కలైన శిశువులు చేతులు జోడించి యిట్లనిరి. ''ఇంద్రా! మేము నీకు సోదరులము. నీవెందుకిట్లు చేయుచున్నావు?'' ఇంద్రుడు వారికిట్లు సమాధానమిచ్చెను. ''మీరు భయపడవలదు మీరు నాకు సోదరులుగా ఉండుటకొరకే యిట్లు చేసితిని. మీరు నాతో దేవగణములో మరుత్తులను పేరుతో నుండగలరు''

దితి నిద్రనుండి లేచి తాను కుమారులను ప్రసవించినట్లు గ్రహించెను వారు అగ్నివలె ప్రకాశించుచు ఇంద్రుని ప్రక్కనే యుండిరి. ఆమె వారివైపు, ఇంద్రునివైపు తిలకించి చూచెను. ఆమె యిట్లనెను. ''ఇంద్రా! ఈ కఠినమైన వ్రతమును నిన్ను చంపు కుమారుని గనుటకు ఆచరించుచున్నాను. నలుబది తొమ్మిది పుత్రులెట్లు కలిగిరి? అబద్ధము లాడి నన్ను మోసపుచ్చకు. నీవు సత్యము పలుకగలిగినచో నాకు చెప్పుము''. ఇంద్రుడామెతో నిట్లనెను. ''అమ్మా! నీవు నన్ను క్షమింప వేడెదను. నీ ఆగ్రహము నుండి నన్ను నేను

రక్షించుకొనుటకై, నీ గర్భములో ప్రవేశించి పుట్టబోవు శిశువును నాశనము చేయుటకు ప్రయత్నించితిని. కాని నా వజ్రాయుధముతో ఆ శిశువును ముక్కలు చేసినప్పటికీ అది చావకుండెను. ఈ ఘోరము చేసినందుకు నన్ను మన్నించి క్షమించవలెను. నీ పాదములకు నమస్కరింతును. ఇది చాలా క్రూర కృత్యమని నేనెఱుగుదును. కాని అమ్మా! జీవించవలెనన్న కోరిక ప్రతివారి హృదయమునందూ ఉండును. అదియే నేనిట్లు చేయుటకు కారణము. నీ పుత్రులందరూ జీవించి యున్నారు. నేను వారిని సంహరించలేకపోతిని''.

ఇంద్రునిపై దితి ఆగ్రహము యిగిరిపోయెను. ద్వేషము కూడ మటుమాయమయ్యెను. ఆమె యిట్లనెను. ''విధి వక్రించుట చేత కఠినమైన వ్రతము నాచరించుటలో ఒక క్షణ కాలము మైమరచి నిద్రించి, వ్రత నియమము నుల్లంఘించితిని. ప్రతిరోజూ అతి జాగ్రత్తగా వర్తించే నేను, యీ రోజు తప్పు చేసితిని. ఇది నా అజాగ్రత్త కాదు. నారాయణుని మాయచేతనే యిట్లు జరిగినది. నా శిశువుకు తండ్రి అమృతత్వము ప్రసాదించుటచేత, నీ వజ్రాయుధము శక్తిలేనిదయ్యెను. నీవు కోరుకున్న దానిని నీవు సాధించినావు. నా శిశువు మరణించకుండుట నా అదృష్టము''

కొన్ని క్షణములు దితి మౌనముగా నుండెను. ఇంద్రుడు తలవంచుకుని, వణకుచున్న చేతులు జోడించి నిలబడియుండెను. ఒక సాధుస్త్రీ యొక్క శాపము మృత్యువుకన్న తీవ్రమైనది. ఆమె ఆగ్రహమెంత తీవ్రమైనదో ఇంద్రునకు తెలియకుండెను.

దితి తనను తాను సముదాయించుకొనెను. క్రోధము, ద్వేషము ఆమె నుండి నిష్క్రమించగా, ఆమె యిట్లనెను. ''భగవదిచ్ఛను యెవరూ దాటలేరు. నా యీ పుత్రులను నీతో తీసుకువెళ్ళుము, వారు నీకు సహచరులుగా నుందురు. వారు అసుర జాతిలో జన్మించినప్పటికీ, నీ వలెనే వారందరిని దేవతలుగా పరిగణింతురు''.

## 78 యుధిష్ఠిరుని సందేహము

యుగములలో మూడవదైన ద్వాపరమందు, పాండవాగ్రజుడైన యుధిష్ఠిరుడు రాజసూయయాగము జరిపెను. యాగము పూర్తియైన పిమ్మట పాండవులు, అతిథులలో కెల్ల మిక్కిలి శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని, పూజించిరి. ఇందుకు చేది రాజైన శిశుపాలుడు మండిపడెను. శిశుపాలుడు కృష్ణుని నిందించుచు మాట్లాడెను. అతని నిందాఘాతము నరికట్టుటకు, కృష్ణుడతనిని సంహరింపవలసి వచ్చెను. మరణించిన తర్వాత శిశుపాలుని శరీరము నుండి వెడలిన ప్రాణము శ్రీకృష్ణుని పాదములవైపు సూటిగా వెళ్ళి అక్కడ అదృశ్యమయ్యెను. కొద్దిమంది మాత్రమే ఈ దృశ్యము చూడగలిగిరి. శిశుపాలుని శరీరము నుండి వెడలిన వెలుగు శ్రీకృష్ణుని పాదముల దిక్కుగా పయనించి, అతని పాద పద్మముల చెంత మోక్షము పొందెను. దీనిని చూసిన కొద్దిమందిలో ఒకడైన యుధిష్ఠిరుడు వెంటనే నారదుని యిట్లడిగెను. ''మహాప్రభూ! శిశుపాలుడు భగవంతునిలో ఐక్యమగుట చాలా చిత్రముగా నున్నది.

''భగవంతునికి భక్తులుగా నున్నవారు, భగవంతుని పాదముల ధ్యాస తప్ప అన్యచింత లేనివారు కూడా సులభముగా భగవంతుని చేరలేకపోవుచున్నారు. కాని యీ శిశుపాలుడు, కృష్ణుని ద్వేషించు పాపాత్ముడు,

యెప్పుడూ కృష్ణుని నిందించే శిశుపాలుడు కృష్ణునిచే నిహతుడై, కృష్ణుని పవిత్ర పాదముల చెంత చోటు చేసుకోగలిగినాడు. సుడిగాలిలోని ఘంటవలె నా మనస్సున్నది శ్రీకృష్ణుని నిరంతరము నిందించు శిశుపాలుడు నరకమునకు వెళ్ళక, భగవంతుని పాదముల చెంత ఆశ్రయము నెట్లు పొందగలిగెనో వివరించి చెప్పగోరెదము''. నారదుడిట్లు సమాధానమిచ్చెను. ''యుధిష్ఠిరా! నీ ప్రశ్న సముచితమైనది. కృష్ణుని నిందించువాడు యెందుకు శిక్ష పొందలేదని నీవు తెలుసుకొన గోరుచున్నావు. బహుశః నేనిప్పుడు చెప్పబోవునది నీకు తెలియకపోవచ్చు.

''మానావమానములు, నిందాస్తుతులు యీ శరీరముతో కూడినవి. మానవ శరీరములోనున్న వ్యక్తికి యిట్టి భావములు కలుగుచుండును. హృదయములో 'నేను', 'నాది' అను భావములు స్థిరపడినపుడు, అహంకారము చేత స్తుతించినపుడు పొంగుట, నిందించినపుడు క్రుంగుట జరుగును. ఈ అహంకారమే యితరులు హానిచేసినపుడు శిక్షించవలెనని, ఉపకారము చేసినపుడు ప్రతిఫల మొసగవలెనని తలంచును కాని భగవంతుడు వీటి కతీతుడు నీ వనుకునే యీ అపనిందలు భగవంతుని యేమాత్రము బాధించవు. నిందించిన వారిని శిక్షించుటలో కుతూహలము కూడ చూపడు అటులనే తనను పొగడువారిని స్వర్గమునకు పంపించుటయూ జరుగదు భక్తి సూత్రములు, భగవంతుని చేరు మార్గము అసాధారణమైనవి, ఆకర్షకమైనవి. దీనిని నీకు విశదపరచెదను.

''నిత్య ద్వేషము, నిత్యభక్తి, నిత్యానురాగము, లేక నిత్యము భగవంతునిపై అపేక్ష యివన్నియూ భగవంతుని దృష్టిలో ఒక్కటే, వారిని భగవంతుడు రక్షించును. భగవంతుని చేరు అనేక మార్గములలో యివికొన్ని. భగవంతుని నిరంతరమూ తలచుటే అంతిమ ధ్యేయము. భక్తి, భయము, అనురాగము, కోరిక, ద్వేషము, యివన్నీ భగవంతుని చేరుటకు మార్గములు రెక్కల పురుగు మట్టి పురుగును కన్నము ఉన్న గూటిలో నుంచి దానిని కుట్టుచుండునని నీకు తెలిసిన విషయమే. రెక్కల పురుగు తనను కుట్టునన్న భయముతో మట్టిపురుగు నిత్యము రెక్కల పురుగునే తలంచుటచేత, కొన్ని రోజులకు మట్టిపురుగు రెక్కల పురుగుగా రూపొంది గూడును ఛేదించుకుని బయటకు వచ్చును. అదే విధముగా నిత్యము భగవంతుని ద్వేషించుట చేత, అతని రూపము మనసులో స్థిరపడును. ఆ విధముగా వారి పాపములు తొలగి మనస్సు పరిశుద్ధమై నారాయణుని పాదములు చేరుకొందురు. భగవద్ద్వేషము ఒక రకమైన సంభ్రమ యోగము, యిది భగవంతుని చేరుటకు దగ్గర మార్గము. భక్తుడు నారాయణుని చేరుటకు దీర్ఘకాలము పట్టగా, భగవద్ద్వేషి తక్కువ కాలములో భగవత్పాదములను చేరుట విశేషము! భక్తివలెనే, కోరిక, ద్వేషము, భయము, రాగము కూడ భగవంతుని చేరుట కనువైన మార్గములు

''కృష్ణునిపై కాంక్షతో గోపికలు రాత్రింబగళ్ళు తలచుచుండిరి. వారు ముక్తి పొందెదరు. మేము భక్తితో నిరంతరము భగవంతుని తలచుటచేత మాయా ప్రపంచము నుండి స్వేచ్ఛను కనుగొనినాము కృష్ణుడన్న కంసునకు భయము. ఆ భయము చేత రాత్రి పగలూ కృష్ణుని తప్ప యింకెవరినీ తలంపకుండెను అతడు కృష్ణునిచే హతుడై అతని పాదముల చెంత చోటు చేసుకొనెను. కృష్ణునకు యాదవులందరూ బంధువర్గములోని వారగుటచేత, వారు ప్రేమతో కృష్ణుని తలంచుచుండిరి. వారి సమయ మాసన్నమైపుడు ముక్తిని పొందుదురు. నీవు, నీ సోదరులు కృష్ణునిపై విపరీతమైన అనురాగము కలిగియుండుటచేత కృష్ణుని యెల్లప్పుడూ చింతించుచున్నారు మీకు కృష్ణుని పాదముల యెడ స్థానము తప్పక లభించగలదు గమ్యము ప్రధానము కాని, దానిని చేరు మార్గములు కాదు మానవుని తలంపులు భగవంతునిపై స్థిరముగా కుదిరినచో అతడు తప్పక ముక్తి పొందగలడు శిశుపాలుడు ప్రత్యేకమైన వరమును పొందియున్నాడు. భగవంతునిపై ద్వేషము కలిగి అతనిచే

నిహతుడైన తర్వాత తిన్నగా భగవంతుని నివాసమైన వైకుంఠము చేరునట్లుగా వరమును బడసియున్నాడు. పురాణ కాలములో నారాయణుని ద్వారపాలకులైన జయ విజయులు, సనకసనందనాది ఋషులచేత భూమి మీద జన్మించునట్లు శాపము పొందినపుడు, వారికి జన్మ బంధముల నుండి విముక్తికలిగించెదనని నారాయణుడు అభయమిచ్చినాడు. వారు భూమిపై జన్మించి నారాయణునిపై విపరీతమైన ద్వేషము కలిగి యెల్లపుడూ నారాయణునే చింతించుటచేత, స్వేచ్ఛ లభించునని వారికి నారాయణుడు చెప్పెను.

''వారు కృతయుగమునందు హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగాను, త్రేతాయుగములో రావణ కుంభకర్ణులు గాను, ద్వాపరమందు శిశుపాల దంతవక్త్రులుగాను మూడుసార్లు యీ భూమిపై జన్మించిరి. ఇప్పుడు శిశుపాలుడుగా మూడవ జన్మ అంతమొందుటచేత, చాల కాలము క్రిందట యెచ్చటి నుండి బహిష్కృతుడ య్యెనో తిరిగి ఆ వైకుంఠమును చేరుకొనెను. త్వరలోనే దంతవక్త్రుడు అతని ననుసరించగలడు''.

యుధిష్ఠిరుడిట్లనెను. ''వారి గురించి మరికొంత విపులముగా చెప్పవలెను. వారిద్దరి గాధ నాలో కుతూహలము రేకెత్తించుచున్నది''.

నారదుడిట్లు చెప్పెను. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు దితి పుత్రులు. సముద్రము నుండి భూమిని వెలికి తీసుకువచ్చునపుడు వరాహావతారము దాల్చిన నారాయణుడు హిరణ్యాక్షుని సంహరించెను. హిరణ్యాక్షుడు నారాయణునితో పోరాడి అతనిచేత నేలగూలెను''.

## 79 హిరణ్యకశిపుడు

నారాయణుడు వరాహ రూపములో తన సోదరుని సంహరించుట చూచిన హిరణ్యకశిపునకు తీవ్రమైన కోప వికారములు కలిగెను. అతని కనులు యెర్రబడెను, వణకుచున్న పెదవులను పళ్ల మధ్య అదిమిపెట్టెను. త్రిశూలమును చేత ధరించి అతడిట్లనెను. ''స్నేహితులారా! నా సోదరునకు సంభవించిన ఘోరమైన మృతి మీరందరూ యెఱుగుదురు. మనకు బద్ధశత్రువైన నారాయణుని చేత అతడు నేలగూలెను. ఇది నేను సహించలేను. ఈ త్రిశూలమును నారాయణుని హృదయములో గ్రుచ్చి, ఆ రక్తముతో చనిపోయిన నా సోదరునికి శాంతిని చేకూర్తును. అప్పుడే నన్ను నిలువునా దహించుచున్న యీ బాధ సమసిపోగలదు. నారాయణుడు మరణించగానే, అతని భక్తులు, చెట్టుకు చుట్టుకున్న లతలు చెట్టు సమూలంగా పెరికివేసిన పిదప యెండిపోయినట్లు, వారికి వారే మరణించి రాలిపోవుదురు. ఇప్పుడు మీరు నేను చెప్పినట్లు చేయవలెను. బ్రాహ్మణ క్షత్రియులతో నిండిన యీ భూమి మీద తపస్సు, యజ్ఞము, ధ్యానము చేయువారందరినీ నాశనము చేయండి. ధర్మమునకు నిలయుడైన నారాయణుడు, యెక్కడ యజ్ఞ యాగములు జరుగునో, యెక్కడ బ్రాహ్మణులు చేరి తమ నిత్య విధులను ఆచరించుదురో, యెచ్చట దేవతలు ఉందురో, అక్కడ ఉండునని చెప్పుదురు. ఎక్కడెక్కడ బ్రాహ్మణులు, గోవులు, మున్నారో, వైదిక కర్మలు వేద విహితముగా జరుగునో అక్కడకు వెళ్ళి వాని నన్నింటినీ నాశనము గావింపుడు. అన్నింటినీ దగ్ధము చేయుడు. ప్రతి ఒక్కరినీ చంపివేయుడు. పవిత్ర వృక్షములను పెరికి పారవేయుడు. నారాయణునికి నిలువ నీడ లేకుండ మీరు చేయగల్గినదంతా చేయవలెను''.

ప్రభువు ఆజ్ఞానుసారము అసురులు ప్రతి ఒక్కరిని వేధింప దొడగిరి నగరములు, గ్రామములు, గోశాలలు, పూల తోటలు, ఋషులు నివసించు ఆశ్రమములు, భూములు, గృహములు, సర్వస్వమూ వారిచే ధ్వంసమయ్యెను గునపములు, బల్లెములు మున్నగు పరికరములతో గోపురములను, దేవాలయములను, నగర ప్రాకారములను, భవనములను కూల్చి నేలమట్టము చేసిరి. వంతెనలను, రహదారి మార్గములను పగులగొట్టిరి నారాయణునకు పవిత్రమైన మామిడి మొదలగు ఫల వృక్షములను నరికి నేల గూల్చిరి నారాయణునకు పేద ప్రజలు ప్రీతి పాత్రులగుటచేత, వారి గుడిసెలను తగులబెట్టిరి.

అసురులచే బాధలు పడుచున్న దేవతలు స్వర్గమును వదలిపెట్టి యీ భూమి మీద మారు వేషములతో సంచరించుచుండిరి. హిరణ్యాక్షుని మరణమునకు పరితపించుచున్న బంధువులను హిరణ్యకశిపుడు ఓదార్చు చుండెను వారితో అతడిట్లనెను ''ఒక గొప్ప వీరుని మరణమునకు విచారించుట సరియైనది కాదు. యుద్ధములో మరణమును వీరులు కోరెదరు. పురాతన కర్మ ఫలితముగా యిద్దరు జన్మనెత్తిరి వారి కర్మ ననుసరించి యీ జన్మలో వారికి యెడబాటు సంభవించినది కలియుట, కొంతకాలము కలిసి జీవించుట ఒక ఉత్సవములో కలుసుకొనుట వంటిది. మరణించని వాని ఽరని చెప్పగలను ఆత్మ నిత్యము, శుద్ధము, అనశ్వరము ఇది శరీరములో నివసించునప్పటికీ, దానికి భిన్నమైనది. శరీరమును ధరించు ఆత్మ మానవ గుణములు కలిగియుండును శరీరము మరణించగానే ఆ వ్యక్తి మరణించినట్లు భావించెదరు. కాని అది సరికాదు సుఖసంతోషములు, యితర ద్వంద్వానుభూతులు రక్త మాంసములతో నిండిన యీ శరీరమునకు సంబంధించినవి కాని, ఆత్మకు సంబంధించినవి కావు నదీ తీరమున నున్న చెట్ల నీడను నది జలములో మీరు కాంచ లేదా? నదిలో నీరు కదులుచున్నపుడు, చెట్ల నీడ కదలుచున్నట్లు గోచరించును కాని చెట్లు, వాని నీడలు స్థిరమైనవి వానికి కదలిక లేదు గిరగిర తిరిగే మానవునకు ప్రపంచమంతయూ తిరుగుచున్నట్లు కన్పించును కాని అట్లు జరుగుట లేదు అదే విధముగా, యీ శరీరము కప్పియున్న ఆత్మ మానవులకు కలుగు భావోద్వేగములను అనుభవించుచున్నదని తలచెదము కాని అది సత్యము కాదు స్వేచ్ఛగా నున్న ఆత్మ, శరీరమందు కట్టుపడిన ఆత్మ వేర్వేరుగా గోచరించును కట్టుపడిన ఆత్మ శరీరముతో కూడి యుండుటచేత, మానవులకు కలిగే సామాన్య అనుభవములు - విడిపోవుట, కలియుట, జన్మించుట, మరణించుట, మనస్తాపము, దుఃఖము, మున్నగునవి - ఆత్మ అనుభవించుచున్నట్లు భావించెదము కాని బుద్ధి నుపయోగించి తెలుసుకొనినచో అట్లు గాదని స్పష్టమగును. శరీరమునకు భిన్నముగా నున్న ఆత్మకు మానవుని భావములతో గాని, అనుభవములతోగాని సంబంధము లేదు మీ విచారమును వదలిపెట్టి, మనము చేయు కార్యము గురించి యోచింపుడు నా సోదరుని మరణమునకు ప్రతీకారముగా నారాయణుని నాశనము చేయు మార్గములను కనుగొనెదను''

## 80 హిరణ్యకశిపునకు వరప్రసాదము

హిరణ్యకశిపునకొక కోరిక యుండెను. అతడు అజేయుడుగను, మరణము లేకుండగను ఉండవలెనని తలచెను ఈ ముల్లోకములకు ఏకైక ప్రభువుగా నుండవలెనని అతని కోరిక తన కోరిక నెరవేరుటకు తపస్సు చేయ నిశ్చయించుకొనెను తీవ్రముగా తపస్సు చేసి, తపశ్శక్తిచేత బ్రహ్మదేవుని మెప్పించి అతనిచే వరములను పొందవచ్చునని భావించెను మందర పర్వతమునకేగి, అనేక సంవత్సరములు ఏకాగ్రతతో తీవ్రముగా తపస్సు

చేసెను అతడు తీవ్రమైన తపస్సు చేయుచున్నపుడు, దేవతలు మారువేషములు తీసివేసి తిరిగి స్వర్గము చేరుకొనిరి రోజులు గడిచిన కొలది హిరణ్యకశిపుని తపస్సు తీవ్రత హెచ్చెను ఆ తీవ్రత వలన అతడు మిట్ట మధ్యాహ్నపు సూర్యుని వలె ప్రకాశించు చుండెను. అతని శిరస్సున గల ప్రతి జట ముడి అగ్ని వెళ్ళగక్కు చున్నట్లుండెను లోకమంతయు తపస్సు తీవ్రతకు వేడెక్కి భస్మమగునాయని అనిపించెను. సముద్రములు, నదులు అల్లకల్లోలముగా నుండెను. భూమి కంపించెను పర్వతముల నుండి మంటలు వెడలుచుండెను. నక్షత్రములు రాలుచుండెను. దిక్కులు మండిపోవుచుండెను హిరణ్యకశిపుని తపస్సు అంత తీవ్రముగా నుండెను

ఎప్పటి వలెనే దేవతలు బ్రహ్మ కడకు వెళ్ళి యిట్లనిరి ''దేవా! మీరు మీ భక్తుని వద్దకు వెళ్ళగోరెదము. అతని కోరికలు తీర్చు సమయము యేతెంచినది. అతని తీవ్ర తపస్సుచేత జనించిన వేడిని మేము భరించలేకున్నాము అతని కోరికలు మీకు తెలియనివి కావు. అయినప్పటికీ మీకొక హెచ్చరికను చేయదలచి తిమి. హిరణ్యకశిపుడు, 'తపశ్శక్తి చేత బ్రహ్మ ఒకప్పుడు యీ లోకమును, దేవతలందరి నివాసములకన్న అత్యుత్తమమైన సత్యలోకమును తన నివాసము కొరకు సృష్టించెను నేను తీవ్ర ప్రయత్నము చేసినచో, నేను కూడ బ్రహ్మను కాగలను అప్పుడు నేను సత్య లోకమును నా నివాసముగా చేసుకొనగలను. అప్పుడు నేనొక నూతన ప్రపంచమును సృష్టించి న్యాయ చట్టము లన్నిటినీ మార్చివేయుదును ఇంత కాలముగా వాడుకలో ఉన్న న్యాయములన్నింటినీ మార్చివేయుదును, వేయేల వాటిని సంపూర్ణముగా నిర్మూలించెదను. ఇంతవరకు యేది పాపమని పరిగణించుచున్నారో ... అసురులందరూ దేవతలగుదురు నేను బ్రహ్మ నైనపుడు దేవ ... . అని పలికి యున్నాడట అందుకొరకే హిరణ్యకశిపుడు యింత తీవ్రముగా తపస్సు చేయుచున్నాడు దేవా! మీరు అతని వద్దకు వెళ్ళి వరము లిచ్చునపుడు యీ విషయములు జ్ఞప్తియందుంచుకొనవలెను''

బ్రహ్మ వారి మాటలు విని, హిరణ్యకశిపుడు తపస్సు చేయుచున్న గుహకు వెళ్ళెను మొదట హిరణ్యకశిపుని చూడలేకపోయెను అతని చుట్టూ చెట్లు, పుట్టలు పెరిగిపోయెను బ్రహ్మ అతనిని సమీపించి యిట్లనెను ''కుమారా! నీ తీవ్ర తపస్సుకు మెచ్చితిని. ఇంతకు ముందెవ్వరూ యింతటి భక్తితో, యేకాగ్రతతో తపస్సు ఆచరించి యుండలేదు. నాకు చాల సంతోషముగా నున్నది నీకు కావలసినది నన్ను అడుగుము. దానిని నీకు ప్రసాదించెదను''

హిరణ్యకశిపుని భక్తికి బ్రహ్మ ఆనందముతో తన్మయత్వము చెందెను. ఆ తన్మయత్వములో దేవతలు చేసిన హెచ్చరికలను మరచిపోయెను హిరణ్యకశిపుడు బ్రహ్మ పాదములకు ప్రణమిల్లగా తన కమండలములో జలము చేతిలోనికి తీసుకుని అతని శిరస్సుపై జల్లెను వెంటనే రాక్షస రాజు, అలక్ష్యము చేత పోగొట్టుకున్న పూర్వపు బలమును, స్వచ్ఛతను, సౌందర్యమును, తిరిగి పొందెను కరిగించిన బంగారము వలె అతడు మెరయు చుండెను అతని కండ్లలో అశ్రువులు చిమ్మగా, గద్గద స్వరముతో యిట్లనెను బ్రహ్మను చూచుటతోనే సంతోషము ముంచుకు వచ్చెను. అతడు బ్రహ్మను పొగడి, యిట్లు పలికెను ''మీరు నాకొక వరమును ప్రసాదించవలెను. ఒకే ఒక్క వరము. నాకు అనేక కోరికలు ఉండెను కాని మిమ్ములను చూచిన తక్షణమే, నేనడగకుండనే అవి అన్నియు మీరు వాటిని ప్రసాదించినట్లు తెలుసుకున్నాను నేను కోరు ఒకే ఒక్క వరము - నాకు అమరత్వము, అనగా మరణము లేకుండ అనుగ్రహించవలెను''.

బ్రహ్మ యిట్లనెను "కుమారా! అమరుడను కాని నేను, నీకు అమరత్వమును ప్రసాదించలేను కాని, వేని వలన మరణము కలుగకుండ నివారించ వచ్చునో వాటిని కోరుకొనుము, నేను వాటిని నీకు ప్రసాదించగలను నేను అంతకన్న యేమియు చేయలేను".

హిరణ్యకశిపుడిట్లనెను. "అట్లయినచో మీరు సృష్టించిన వేవియూ నా మరణమునకు కారణము కారాదు ఏ ఒక్కదాని చేతనూ నేను మరణింపకూడదు. ఆయుధములచేత నేను మరణించరాదు ఇంటి వెలుపల గాని లోపలగాని నాకు మరణము సంభవించకూడదు. రాత్రి యందు గాని పగటి యందు గాని నేను మరణించరాదు, భూమిపై గాని, ఆకాశమందుగాని నాకు మరణము కలుగరాదు. నాకు మానవుని చేత గాని మృగము చేతకాని మరణము కలుగకూడదు ప్రాణమున్న జీవుల చేత గాని జడ పదార్థముల చేతగాని నేను చావ కూడదు. దేవతలు, అసురులు, సర్పములు నన్ను నాశనము గావించుటకు శక్తి లేక యుండవలెను ఈ వరమును నాకు ప్రసాదింపుడు మరియు నేను యీ ప్రపంచమునకు ఏకచ్ఛత్రాధిపతిగా నుండగలనని వాగ్దానము చేయవలెను. అంతేకాక తరగని విశేష సంపదను అనుగ్రహించవలెను".

బ్రహ్మ హిరణ్యకశిపునకు వరములను ప్రసాదించి, మందర పర్వతము నుండి అదృశ్యమయ్యెను

హిరణ్యకశిపుడు దండయాత్రకు బయలుదేరెను. బ్రహ్మ అనుగ్రహించిన వరముల ప్రకారము, అతడు ముల్లోకములను, దిక్పాలకులను జయించెను. ఇంద్రుడు, వరుణుడు, కుబేరుడు, యముడు అతనికి సామంతులైరి స్వర్గమున కేగి ఇంద్ర భవనము నాక్రమించెను ఇంద్రుని సేవకులందరూ యిప్పుడు హిరణ్యకశిపునకు సేవ చేయుచుండిరి. ఇంద్రునికి, యితర దేవతలకు చెందవలసిన హవిస్సు హిరణ్యకశిపునకు లభించుచున్నది దున్నకపోయినప్పటికి భూమి పంటను యివ్వవలసి వచ్చెను. సప్త సముద్రములు, వాటిలో నిక్షిప్తముగా నున్న మణులను హిరణ్యకశిపున కిచ్చివేసెను

అయినప్పటికీ హిరణ్యకశిపునకు సంతోషము లేకుండెను. అతడు నారాయణుని ద్వేషించుచుండెను అడవిలో అగ్ని రగులుకున్నట్లు యీ ద్వేషము అతని లోలోపల రగులుకొనుచుండెను. ఇట్లు సంవత్సరములు గడిచిపోయెను. రాక్షసరాజు అత్యాచారములు భరించలేనంతగా నుండెను.

ప్రజలు తమ హృదయ కుహరములలో భగవంతుని ప్రార్థించుచుండిరి కాని బయట హిరణ్యకశిపుని యెడల భక్తి విధేయతలు ప్రదర్శించుచుండిరి గత్యంతరము లేక దేవతలు నారాయణుని వద్దకు వెళ్ళి రాక్షసరాజు అకృత్యముల నుండి విముక్తి కలిగించమని ప్రార్థించిరి.

భగవంతుడు వారిని సముదాయించి యిట్లనెను. "భయము లేదు. నాకు వదలి పెట్టుడు. మీరు అనుభవించుచున్న బాధలు నాకు తెలియును. హిరణ్యకశిపుని క్రూరత్వము మితిమీరి సహించరానిదిగా ఉంటున్నది. అతడొక ఉత్తమ పుత్రునికి తండ్రికాగలడు. పాపాత్ముడైన హిరణ్యకశిపుడు, ప్రేమ, స్నేహశీలత, నాకు ప్రియమైన యితర సద్గుణములతో మూర్తీభవించిన తన పుత్రుని మిక్కిలిగా బాధించునపుడు, నేను ప్రత్యక్షమగుదును. అతనికి బ్రహ్మ అనేక వరములు యిచ్చినప్పటికీ, నేను హిరణ్యకశిపుని నాశనము చేయుదును. దేవతలను ద్వేషించువాడు, వేదములను, బ్రాహ్మణులను, గోవులను, ఋషులను, ధర్మమును, నన్ను అవమానించువాడు, నా చేతిలో నాశన మొందునని మీరు యెఱుగరా? అయితే తగిన సమయము రావలెను. భయపడవలదు. అతని కుమారుడు హిరణ్యకశిపుని మరణమునకు కారకుడగును. నేను అతనిని

వధింతును''.

నారాయణుని అభయ వచనములకు దేవతలు సంతృప్తిపొంది అక్కడ నుండి నిష్క్రమించిరి. హిరణ్యకశిపుని మరణము త్వరలోనే సంభవించి వారి బాధలు అంతమగునను ఆలోచనలతో, యెట్లో కొంత కాలము యీ బాధలు సహించవచ్చునని తలచి, ఆ సమయము కొరకు వేచి చూచుచుండిరి. వారిలో తిరిగి ఆశ చిగురించగా, మంచి రోజులకై యెదురు చూచుచుండిరి.

## 81 ప్రహ్లాదుడు

నలుగురు పుత్రులకు హిరణ్యకశిపుడు తండ్రి అయ్యెను. వారు : సంహ్రాదుడు, అనుహ్రాదుడు, హ్రాదుడు, ప్రహ్లాదుడు. ఆఖరి వాడైన ప్రహ్లాదుడు దేవతా గుణములు కలిగి యుండెను. పెద్దల యెడ గౌరవము, బ్రాహ్మణుల యందు ప్రేమను చూపుచుండెను. అతని ప్రవర్తన దోషరహితముగా నుండెను. అతడు నియమములను పాటించుచు సత్యమునే పలుకుచుండెను. ఇంద్రియ నిగ్రహము కలిగియుండెను. అన్ని ప్రాణులను ప్రేమించుచుండెను. మంచి హృదయము కలవాడై యుండెను. బాధలలో నున్నవారికి స్నేహితుడుగా వారికి ఊరట చేకూర్చుచుండెను. జ్ఞానులకు సేవకునివలె సేవ చేయుచుండెను. దుఃఖములో నున్నవారిని, తండ్రి పిల్ల వానిని సముదాయించినట్లు, సముదాయించుచుండెను. సమాన వయస్కులతో సోదరునివలె మెలగుచుండెను. అతనిలో అహంకారము లేదు, హృదయము వినయముతో నిండియుండెను. ఎప్పుడు సమత్వ భావముతో నుండెను. ఒక మాటలో చెప్పవలెనన్న, రాక్షస రాజైన హిరణ్యకశిపునకు తగిన పుత్రుడు కాదు.

అసురులకు గురువైన శుక్రాచార్యునకు ఇద్దరు కుమారులు గలరు. వారు : చండ, అమార్కులు. హిరణ్యకశిపుడు, చండామార్కులను ప్రహ్లాదునికి అసుర పద్ధతి కనుగుణముగా ప్రవర్తనా నియమావళిని బోధించుటకు నియమించెను. అప్పుడు ప్రహ్లాదుని వయస్సు అయిదు సంవత్సరములు. ప్రహ్లాదునితోబాటు యితర అసుర బాలురు గూడ యీ గురువుల వద్ద శిష్యులుగా నుండిరి. ప్రహ్లాదుడు వారు చెప్పు పాఠములను, గురువులను సంతృప్తి పరచుటకు చదువుచుండెను. కాని తన హృదయము వాటి నంగీకరింపకుండెను.

ఒకరోజు హిరణ్యకశిపుడు పుత్రుడైన ప్రహ్లాదుని తన తొడపై కూర్చుండ బెట్టుకుని యిట్లనెను. ''కుమారా! కొంత కాలముగా గురువుల వద్ద నీవు పాఠములు నేర్చుచున్నావు. ఈ లోకములో అత్యుత్తమమైనదేదో చెప్పుము?'' ప్రహ్లాదుడిట్లు జవాబిచ్చెను. ''తండ్రీ! ప్రజలు దుఃఖములో చిక్కుకుని యుండుట నేను గమనించినాను. 'నేను', 'నాది' అనే రెండింటి వలన కలిగే భ్రాంతి యిందుకు కారణమని నేను భావిస్తున్నాను. ఇట్టి అసత్యమైన భ్రాంతి వారి బాధకు కారణమగుచున్నది. ఈ తప్పుడు మార్గము నవలంబించుటచేత ఆత్మ అధోగతి పాలగుట తథ్యము. నా దృష్టిలో యీ లోకమందు అత్యుత్తమమైనది గృహమును, తనది అనుకున్న వాటి నన్నింటినీ విడచి, యెండిపోయిన నూతిని విడిచిపుచ్చినట్లు, అరణ్యమున కేగి, నారాయణుని పాదములను ఆశ్రయించుట''.

ఒక క్షణ కాలము హిరణ్యాకశిపునకు నోట మాట రాకుండెను. తన అయిదేండ్ల కుమారుని నోటి నుండి యిట్టి మాటలు వచ్చునని అతడెన్నడూ తలంచలేదు అతనికి ఆగ్రహము కలుగబోయెను. కాని కోపము నిగ్రహించుకుని నవ్వెను.

తనలో తానిట్లనుకొనెను. ''నా కుమారుడు యింకను పసివాడు. ఇతరులు చెప్పిన దానిని మాత్రమే వల్లెవేయును. నారాయణుని ప్రేమించు వారు పలుకు మాటలనే అతడు చెప్పెను. ఇది వారందరికీ యిష్టమైన వి ని భక్తులను తప్పక చూచి యుండవచ్చును. ఈ అర్థము లేని మాటలు పలికి నందుకు నా కుమారుని నిందించరాదు''

హిరణ్యకశిపుడు గురువులైన చండామార్కులను పిలిచి, వారితో నిట్లు పలికెను ''నారాయణ భక్తులు, నారదుని వంటి భక్తులెవరూ నా కుమారుని చేరువకు రాకుండ కనిపెట్టవలెను మీ దృష్టినుండి తప్పి వెళ్ళకుండ చూడవలెను మీ గృహములోనే ఉండి, మీ వద్దనే నేర్చుకొనునట్లు చూడుడు'' భగవద్భక్తులు సామాన్య పౌరులవలె సంచరించుచూ, వారి ప్రభావమును తన పుత్రునిపై కల్గించు చున్నారని హిరణ్యకశిపుడు నిశ్చయముగా తలపోసెను గురువుల యింటిలో ప్రహ్లాదుని ఉంచుట వలన, నారాయణ భక్తుల చేత 'కలుషితము' కాకుండ రక్షణొందునని భావించెను.

గురువుల యింట, ప్రహ్లాదుడు శుక్రాచార్యుని యిద్దరు పుత్రుల మధ్య నుండెను మృదు వచనములతో సరళముగా వారు యిట్లడిగిరి ''రాకుమారా! ఇతరుల వలె గాక నీ మనస్సు మరొక విధముగా యేల ఉంటున్నది? నీవు యితర అసుర బాలురవలె లేవు. నిజము చెప్పుము. ఈ ఆలోచనలు నీ స్వంతమైనవా, లేక యితరు లెవరైనా యీ ఆలోచనలు నీలో కల్గించినారా? అట్లయిన, అతడెవరు? భయము లేకుండ చెప్పుము. నిన్ను మేము శిక్షించము''

ప్రహ్లాదుడిట్లు సమాధానమిచ్చెను ''నాకు యిట్టి ఉత్తమ భావములను ప్రసాదించిన ఆ భగవంతునికి నమస్కారము. గురువర్యులారా! నా మాటలను విని వాటిని జాగ్రత్తగా పరిశీలింపుడు మానవులు అజ్ఞానము చేత 'నేను', 'నాది' అను భేదములతో చింతింతురు. కాని నిజముగా అటువంటిదేదియూ లేదు. నా ఆలోచనలు యితరుల ఆలోచనలు వేర్వేరని భ్రాంతి కలుగుచుండును భగవంతుడు మానవుని అనుగ్రహింప నిశ్చయించు కున్నపుడు, అతనిలోని ద్వంద్వ భావములు నిర్మూలమగును ఈ ద్వంద్వ భావములే మానవుని విచక్షణా శక్తిని హరించుచున్నవి ఈ ద్వంద్వములే అసత్యమైన దుఃఖ ప్రపంచములో మానవుని పడవేయుచున్నవి. అజ్ఞానులు భగవంతుడు వేరు, మానవుడు వేరని తలచెదరు. గొప్ప వేదాంతులు సైతము అజ్ఞానమను యెడారి యిసుకలో తిరుగాడుచున్నారు. ఈ ద్వంద్వముల కతీతుడైన భగవంతుడే నాకిట్టి ఆలోచనలు కలిగించెను. వేరెవరూ కాదు అయస్కాంతము యినుప ముక్కను ఆకర్షించినట్లు, నా మనస్సు, తనకు తానుగా, నారాయణుని ఆకర్షణకు లోనైనది. నా ఆలోచనలు నిరంతరము నారాయణుని చుట్టూ తిరుగుచున్నవి నారాయణుని నిరంతరమూ తలచు భాగ్యము కలుగుటకు, యింతకు ముందు జన్మలో నేను యేమి సుకృతములు గావించితినో నేనెఱుగను''

గురువులు సహనము కోల్పోయిరి. వారిలో ఒకరిట్లనెను. ''గురువుల యెడ అగౌరవముగా ప్రవర్తించు యీ బాలుని శిక్షించుటకు ఒక కర్రను తీసుకురండు. ఇతడు మాకు అవమానము అగౌరవము తెచ్చిపెట్టగలడు ఇతని చెడు మనస్సు, అగ్ని అరణ్యమును దహించునట్లు, కుటుంబము నంతనూ దగ్ధము చేయగలదు

శిక్ష ద్వారా మాత్రమే యితడిని సరియైన మార్గమునకు తీసుకు రాగలము. మంచి గంధము చెట్లున్న అరణ్యములో యీ బాలుడు వేరొక వృక్షమువలె నున్నాడు. నారాయణుడు గొడ్డలితో యీ అరణ్యమున నశింపజేయుటకు, యీ బాలుని గొడ్డలిని పట్టుకునే కర్రగా ఉపయోగించుచున్నాడు''. శిక్షించెదమని బెదరించి, చండామార్కులు, ప్రహ్లాదునకు రాక్షస కుమారునికి బోధింపదగిన వాటిని బోధించుటకు ప్రయత్నించిరి.

కొంత కాలము గడచెను. ప్రహ్లాదునిలో శిక్షా భయమును తగినంతగా కలిగించి, వారు బోధించిన దంతయు అతడు నేర్చెనని వారు భావించిరి. ఆ బాలుని యిప్పుడు హిరణ్యకశిపుని వద్దకు తీసుకువెళ్ళి, తాము బోధించినది తెలుపవచ్చునని తలంచిరి. ఒకరోజు వారు ప్రహ్లాదుని హిరణ్యకశిపుని వద్దకు తీసుకువెళ్ళిరి. ప్రహ్లాదుడు తండ్రి పాదములకు ప్రణమిల్లి ఆపాద ధూళిని శిరస్సుపై వేసుకొనెను కనుల వెంట ఆనందాశ్రువులు రాలగా, హిరణ్యకశిపుడు కుమారుని తన తొడపై కూర్చుండబెట్టుకొని యిట్లనెను ''నీ గురువుల వద్ద నీవు చాల నేర్చితివి నీవు నేర్చుకున్న దానిలో కొంత చెప్పి నాకు ఆహ్లాదము కలిగింపుము''

## 82 ప్రహ్లాదుడు నేర్చిన పాఠములు

ప్రహ్లాదుని నేత్రములు స్ఫూర్తివంతము లయ్యెను. తండ్రివైపు కనులెత్తి చూచి సరళ స్వరముతో నిట్లనెను. ''తండ్రీ! నాకు సహాయపడే తొమ్మిది ముఖ్య పాఠములను నేర్చితిని''

''అవి యేమిటి నాయనా!'' తండ్రి ప్రేమతో అడిగెను

''అవి శ్రవణము, అనగా వినుట; కీర్తనము అనగా గానము చేయుట; స్మరణము అనగా ధ్యానించుట, పాదసేవనము అనగా పాదములు సేవించుట; అర్చనము అనగా పొగడుట; వందనము అనగా పూజించుట; దాస్యము అనగా సేవచేయుట, సఖ్యము అనగా స్నేహము కలిగియుండుట, ఆత్మ నివేదనము అనగా పూర్తిగా శరణాగతుడగుట''.

''చాలా బాగున్నది, చాలా బాగున్నది'' అని హిరణ్యకశిపుడనెను. ''వీటిలో యే ఒక్క విధముచేత నైనను నన్ను సేవించివచో, నేను అమితముగా సంతోషించెదను. నీవు పాఠములను చక్కగా నేర్చితివి''.

తన సంతృప్తిని వెలిబుచ్చు నేత్రములను గురువులపై ప్రసరించెను గురువులు కూడ సంతోషము, సంతృప్తి కలిగి యుండిరి. ప్రేమ పూరిత నేత్రములతో కుమారుని గాంచి అతనిని మృదువుగా నిమిరెను.

''తండ్రీ! ఇవి నారాయణుని ఆరాధించు మార్గములు. సర్వత్రా వ్యాపించియున్న నారాయణుని, యీ తొమ్మిది మార్గములలో యే మార్గము చేతనైనను చేరవచ్చును ఈ పాఠమును నేర్వగల్గుట నా అదృష్టము''. అని ప్రహ్లాదుడు పలికెను.

ప్రహ్లాదుడు విశ్వబ్ధముగా కూర్చుండెను ఒక క్షణము తండ్రి కూడ మౌనముగా నుండెను హిరణ్యకశిపుడు ఆగ్రహముతో మండిపడి చింత నిప్పుల వంటి తన కనులను శుక్రుని కుమారులవైపు ప్రసరించి యిట్లనెను

''నేను వినుచున్నదేమి? ఈ పాఠమును బోధింపుమనియా నేను మిమ్ములను అడిగినది? మీరు నా కుమారుని సర్వనాశనము చేయుచున్నారు. మీరు నా యెడల విశ్వాసము లేనివారని తెలుసుకున్నాను మీరు శత్రుపక్షము చేరి, నా కుమారునికి పనికిమాలినవి బోధించుచున్నారు మీచేత నేను మోసపోయినాను'' గురువులు తమ నిర్దోషిత్వమును తెల్పి హిరణ్యకశిపునికి నచ్చజెప్పుటకు అనేక విధములుగా ప్రయత్నించిరి. వారిట్లనిరి. ''ఓ ప్రభూ! ఇది మేము చెప్పినది కాదు మమ్ములను నమ్మండి ఇవి మేము యీ బాలునికి బోధించలేదు మాకు తెలిసినంతవరకు యింకెవరూ కూడ యివి బోధించలేదు అతనికి సహజముగానే అబ్బినవి మీ ఆగ్రహమును నిగ్రహించుకొనుడు అతని అవిధేయతను మాకు అంటగట్టవద్దు. మేము నిర్దోషులము''.

వారి చిత్తశుద్ధికి హిరణ్యకశిపుడు కొద్దిగా మెత్తబడి, పుత్రునివైపు తిరిగి యిట్లనెను ''కుమారా! ఇటుచూడు. అర్థము లేని యీ పాఠమును గురువులు నీకు బోధించలేదని చెప్పుచున్నారు. నన్ను, నిన్ను సర్వనాశనము గావించే యీ పాఠములు నీ కెవరు బోధించిరో చెప్పుము?'' తండ్రి ఆగ్రహమునకు చెక్కుచెదరక, ప్రహ్లాదుడు తండ్రివైపు స్థిర దృక్కులను బరపి యిట్లనెను ''భగవంతుని గొప్పదనమును నీవంటి వారు తెలుసుకొనలేరు ఈ వస్తు ప్రపంచములో నిమగ్నులై, ఇంద్రియానుభవములే సర్వస్వమూ అని తలచి, దానివలన కలిగే ఆనందము క్షణికమని తెలిసి కూడ అట్టి ఆనందము కొరకు పాటుపడువారు గుడ్డి వారిని గుడ్డి వారనుసరించి నట్లుందురు. వేదములు నిర్దేశించిన కర్మకాండలను నీవు జరుపుదువు. వాటిని జరుపమని చెప్పువారు కూడ నీ వలెనే సత్యము నెఱుగని అజ్ఞానులు. ఈ జీవితము యొక్క అంతిమ ధ్యేయము ఇంద్రియ సుఖముల ననుభవించి నీచమైన దురాశతో జీవించుటే యని నీవు భావించవచ్చు నీ పరిస్థితి చాల దయనీయమైనది.

''వైరాగ్యము పొందిన మహాపురుషుల పాద ధూళిని నీవు స్వీకరించనంతవరకు, నిత్య సత్యమైన నారాయణుని పాదముల యందు నీ మనస్సు స్థిరపడలేదు ఈ లోకమును ఛేదించి దానికి దూరమైనపుడే నీ మనస్సును భగవంతునిపై లగ్నము చేయగలవు భగవంతునిపై అనురాగము స్వతస్సిద్ధముగా కలుగవలెను. గురువుల బోధ చేతకాని, సజ్జన సాంగత్యముచేతగాని యిట్టి మనోభావము కలుగదు భౌతిక ప్రపంచముపై వ్యామోహము సడలనంతవరకు, నేను నేర్చిన పాఠములను నీవు తెలుసుకొనలేవు ''

చాలసేపటి వరకు హిరణ్యకశిపునకు మాట రాకుండెను. అతని కోపము తీవ్రమగుటచేత మాటలు పెదవులు దాటి వచ్చుట లేదు. కుమారుని తన ఒడిలో నుండి బలముగా త్రోసివేసెను. సేవకులను పిలిచి యిట్లనెను ''ఈ పాపాత్ముని నా యెదుట నుండి దూరముగా తీసుకుపొండి. అతడిని చంపవలెను తన వారిపై వీనికి అభిమానము లేదు. నా యెదుటనే, నాకు బద్ధశత్రువు, నా సోదరుని హతమార్చిన నారాయణుని పొగడే ధైర్యము వీనికున్నది. ఇతడు నారాయణుని కీర్తించి గానము చేయుచున్నాడు. ఆ 'భగవంతుడ'ను వానిపై వీనికున్న అపార ప్రేమ చూచినచో, వీడు నాకు ప్రబల శత్రువే కాని పుత్రుడు కాడని తోచుచున్నది. అయిదేళ్ళ వయసు నందే తన తండ్రిని పరిత్యజించెను. వీనివలన నాకేమియు మంచి జరుగబోదు. ఏ కుమారుడైనను యీ విధముగా తన తండ్రి యెడల ప్రవర్తించినపుడు , భయంకర రోగమును వదిలించుకున్నట్లు ఆ కుమారుని వదిలించుకొనవలెను శరీరములో ఒక భాగము శరీరమునకంతకూ బాధ కలిగించునపుడు, ఆ భాగమును తీసివేయుటే సమంజసము అప్పుడే శరీరము రక్షణొందును. ఇతడు నా పుత్రుడని మీరు భావింతురు. కాని ఇతడు నాకు శత్రువు ఇతడు ఒక ఋషి హృదయములో పెరిగే కోరికవలె నున్నాడు. దీనిని నాశనము చేయకున్నట్లయితే, యిది వసించుచున్న గృహమే నాశనము కాగలదు. సాధ్యమైనంత త్వరలోనే యీ బాలుని హతమార్చవలెను''

రాజు హిరణ్యకశిపుని సమక్షములో అతని అనుయాయులు భయంకరమైన త్రిశూలములు, పొడుగైన కర్రలతో ఆ బాలుని బాధింప మొదలిడిరి. ప్రహ్లాదుడు నిశ్చలముగా నిలిచి యుండెను అతని మనస్సు భగవంతునిపై లగ్నమై యున్నది ఇంతలో ఒక విచిత్రము గోచరించెను ఆ ఆయుధములు బాలునికి యెట్టి గాయము కల్గింపక నిరర్థకము లయ్యెను భగవదనుగ్రహము లేని మానవ ప్రయత్నములు విఫలమైనట్లుండెను ఈ దృశ్యము చూచి ఆశ్చర్యపడి, హిరణ్యకశిపుడు తన సేవకులు చేయు కార్యమును ఆపివేయమని చెప్పి యిట్లనెను ''ఇతర మార్గములను ప్రయోగించి చూచెదము''

ఆ బాలుని చంపుటకు అనేక విధములుగా ప్రయత్నించి విఫలుడయ్యెను ప్రహ్లాదుని నేలపై పరుండబెట్టి అతనిని అడవి యేనుగులచే త్రొక్కించెను ఆ యేనుగులు ప్రహ్లాదుని త్రొక్కివేయగా అతడు మరణించునని రాజు తలచెను కాని ప్రహ్లాదుడు చావకుండెను పాములతో నిండిన గోతిలో ప్రహ్లాదుని బడద్రోయించిన వాటి కాటునకు బాలుడు మరణించునని భావించెను. కాని బాలుని కేమియు జరుగకుండెను ఎత్తైన పర్వతము నుండి ప్రహ్లాదుని క్రిందకు త్రోయించెను కాని ప్రహ్లాదుడు యెట్టి గాయము లేకుండ లేచి వచ్చెను ఒక గొయ్యి త్రవ్వి అందు ప్రహ్లాదుని త్రోసి ఆ గొయ్యి పూడ్పించెను అయినను ప్రహ్లాదుడు చావలేదు అతనికి విషము పెట్టిరి అతని శరీరమునకు నిప్పు అంటించిరి కాని ప్రహ్లాదునకు మరణము కలుగలేదు చిన్న వానిని అయిదేళ్ళ కుమారుని చంపలేకపోయినందుకు రాజు దిక్కుతోచని వాడయ్యెను

గురువులు, ఆలోచనలో మునిగియున్న రాజును సమీపించి, యిట్లనిరి ''కొంత కాలము తర్వాత యీ బాలుని సరిదిద్దవచ్చును మాతో తీసుకువెళ్ళి తిరిగి ప్రయత్నించెదము ఇతర అసుర బాలురను కూడ జేర్చి, వారితో ఆట పాటలందు కుతూహలము కలుగునట్లు ప్రయత్నించెదము''

బాలునిలో మార్పు రాగలదేమోనను ఆశతో రాజు, ప్రహ్లాదుని గురువులతో వారి యింటికి పంపెను

## 83 ప్రహ్లాదుడు నారాయణు నెఱిగిన తీరు

చండామార్కులు ప్రహ్లాదునకు, యీ లోకములో మనస్సును ప్రలోభపరచి, ఆకర్షించు విషయముల గూర్చి బోధించిరి. వారు ధర్మార్థ కామముల గూర్చి బోధింపగా, ప్రహ్లాదుని మనస్సు మోక్షముపై నుండెను. ప్రహ్లాదుని శరీరము మాత్రమే గురువుల యింట నుండెను. అతని మనస్సు యెక్కడో దూరముగా నుండెను.

ఒకసారి గురువులు ప్రహ్లాదుని ఒంటరిగా గృహమున విడచి బయటకు వెడలిరి ఇతర బాలురు ఆడుకొనుచుండిరి. తండ్రిచేత విపరీత బాధలకు గురియగుచున్న ప్రహ్లాదుని యందు ఆ బాలురకు అమితమైన అభిమానము గురువులు కూడ ప్రహ్లాదునికి అనేక యిబ్బందులు కల్గించుటచేత, ఆ బాలురకు ప్రహ్లాదునిపై ప్రేమ మరింతగా పెరిగెను ప్రహ్లాదుడు తోటి బాలురతో మాట్లాడుచుండెను. ద్వేషము దానివలన ఉత్పన్నమయే గుణములచేత వయసు పెరిగిన కొద్ది మనస్సు కలుషితమగును అట్లు కలుషితము కాని మనస్సులతో ఆ లేత బాలురు ప్రహ్లాదుని మాటలకు ఆకర్షితులైరి. ఆ బాలురతో ప్రహ్లాదుడిట్లనెను ''మీరందరు నేను చెప్పునది వినండి మనకు యీ శరీరము, అద్భుతమైన మనస్సును ప్రసాదితమైనవి వానిని నిరర్థకము

గావించుట నేరము ఒక ప్రయోజనము కొరకు అవి మనకు లభించినవి మనస్సు భగవంతుని యందు లగ్నము చేయవలెను ఈ శరీరమును భగవంతుని పూజించుటకు వినియోగించవలెను. వంశ పారంపర్యముగా వచ్చుచున్న అసుర గుణములను విడిచిపెట్టి, సద్గుణములను, అనగా ప్రతి ఒక్కరినీ ప్రేమించి ద్వేషింపకుండుట, అన్ని జీవులయందు కరుణ కలిగియుండుట, అలవరచుకొనవలెను. అప్పుడు భగవంతుడు సులభముగా ప్రసన్నుడగును అతి తేలికగా భగవంతుని మీరు చేరవచ్చును. అతనినే తలవండి అతని కీర్తనలను గానము చేయండి మనము సులభముగా భగవంతుని చేరుకొనగలము''.

''నీకెట్లు తెలియును?'' అని ఆ బాలురడిగిరి. ''ఇది సత్యమని నీవుదృఢముగా చెప్పుచున్నావు ఇవి నీకెట్లు తెలియునో మాకు వివరించి చెప్పుము''

''నారాయణుని భక్తుడైన నారద మహర్షి నాకు బోధించెను'' అని ప్రహ్లాదుడనెను

ఆ బాలురకు అయోమయముగా నుండెను వారిట్లనిరి ''పుట్టినది మొదలు మన మందరము కలిసి తిరుగుచున్నాము ఈ గురువులను తప్ప యితర గురువుల నెరుగము నీవు నారదుని యెప్పుడు కలుసుకొని యిన్ని విషయములు నేర్చితివి?''

ప్రహ్లాదుడు నవ్వుచు యిట్లనెను ''చాల కాలము క్రిందట నా తండ్రి మందర పర్వతమున తపస్సు చేయుట కేగినపుడు, ఆ పర్వతమందు నా తండ్రి మరణించునని భావించి, దేవతలు దండెత్తి వచ్చి అసురులతో యీ రాజ్యమందు యుద్ధము చేసిరి వారి ధాటికి తట్టుకొనలేక అసురులు చెల్లాచెదురుగా పారిపోయిరి. దేవతలు నా తండ్రి నివసించు భవనము ప్రవేశించి దానిని కొల్లగొట్టిరి ఇంద్రుడు నా తల్లిని పట్టుకునెను ఆమె యేడ్చుచు బ్రతిమాలుకొనగా, ఇంద్రుడు ఆమె మాటలను లక్ష్యపెట్టకుండెను. ఇంతలో అనుకొనకుండ నారదుడక్కడకు వచ్చి ఇంద్రుని చూచి యిట్లనెను. ''ఇంద్రా! ఈమెను చెరబెట్టుట నీవంటి వానికి తగనిది ఇదియా దేవతలు పాటించు ధర్మము? సిగ్గు సిగ్గు ఆమెను తక్షణమే వదిలిపెట్టుము''

ఇంద్రుడిట్లనెను ''నారద మునీంద్రా! నీకు యిది అర్థము కాదు. చెడు తలంపుతో నేనామెను చెరబట్టలేదు ఆమె గర్భములో ఒక అసురుడు పెరుగుచున్నాడు ఆ శిశువు యిప్పుడే అగ్నివలె ప్రకాశించుచున్నాడు ఆ శిశువు జన్మించు వరకు ఆమెను నా వద్ద ఉంచెదను. శిశువు జన్మించిన తర్వాత, ఆ అసురుడు దేవతలను వేధించునుగాన అతడిని సంహరించి, ఆమెను వదలిపెట్టుదును''. అది విని నారదుడిట్లనెను ''నీవు పొరబడుచున్నావు పుట్టబోవు శిశువు మిమ్మలను వేధించడు. దేవతల కష్టములకు ఆ శిశువు కారణము కాబోడు పైగా ఆ శిశువు నారాయణుని భక్తుడై, తన తండ్రి అకృత్యముల నుంచి దేవతలకు విముక్తి కలిగించి ఆనందము చేకూర్చును''

''ఇంద్రుడు నారద మహర్షి మాటలను విశ్వసించెను నా తల్లిని వదలిపెట్టి ఇంద్రుడు వెళ్ళిపోయెను నా తల్లిని నారదుడు తన ఆశ్రమమునకు తీసుకు వెళ్ళెను ఆమెను సముదాయించి యిట్లనెను ''నీ శిశువు జన్మించు వరకు నా ఆశ్రమములో ఉండవచ్చును. నీ భర్త తపస్సు పూర్తిచేసి అప్పటికి తిరిగి వచ్చును నీవు యిక్కడ సుఖముగా నుండగలవు''. నా తల్లి నారదుని ఆశ్రమములో ఉండి అతడికి సేవ చేయుచుండెను. నన్ను మనస్సులో బెట్టుకుని, నారదుడు ప్రతి దినము నా తల్లికి, సులభముగా భగవంతుని చేరు భక్తియోగమును బోధించుచుండెను ఆమెతో జ్ఞానావధులు, నిత్య సత్యము, యీ శరీరములో నున్న ఆత్మ పరమాత్మ లేక

పరబ్రహ్మ స్వరూపము అను విషయములు ముచ్చటించు చుండెను. ఆమె వాటి నన్నిటినీ వినెను. కాని ఆమె మనస్సులో అవి యెక్కువ కాలము నిలువ లేదు కాని, నేను వాటిని విని, మరచిపోలేదు''

ప్రహ్లాద                              విన్న విషయములను విపులముగా వివరించెను. ఆ బాలురకు సహజముగా భక్తి మార్గము నచ్చెను. ఇంతలో తిరిగి యింటికి వచ్చిన గురువులు ఆ బాలురు ప్రహ్లాదునితోబాటు సామూహికముగా నారాయణుని కీర్తించుచూ గానము చేయుట చూచిరి. గురువులు, ఆ బాలురు చేయుచున్న దానిని ఆపివేసి, మామూలుగా పాఠములు బోధించుట ప్రారంభించిరి కాని వారు చెప్పునది ఆ బాలుర చెవికెక్కుట లేదని వారు గ్రహించి విస్మయము చెందిరి ప్రహ్లాదుడు ఆ బాలుర నందరనూ తన ధోరణి కనుగుణముగా మార్చివేసెను.

ఏమి చేయుటకు పాలుపోక, గురువులు హిరణ్యకశిపుని వద్దకు వెళ్ళి, తమ యింటి వద్ద జరిగినదంతయూ చెప్పిరి. రాజు క్రోధోద్దీప్తుడయ్యెను పరిస్థితులు మితిమీరినవని నిశ్చయించుకొనెను తన చిన్న కుమారుడు చేయుచున్న దానిని యిక యే మాత్రమూ క్షమించరాదని తలచెను మొట్టమొదట యేనో అర్థము కాని మాటలు ఆడుచున్నాడని తలపోసెను. కాని యిటీవల, పూర్తిగా తెలిసియుండి                              ్వడ నియు, తన ఆలోచనా పద్ధతిని జీవిత విధానమును విమర్శించే ధైర్యము ప్రదర్శించుచున్నాడని గ్రహించెను వాటిని విడిచిపెట్టమని ప్రహ్లాదుడు తండ్రిని కోరెను ప్రహ్లాదుని చంపించుటకు తన అనుచరులను నియోగిం పగా, వారా కార్యమును సక్రమముగా నిర్వర్తించలేకపోయిరి. విచిత్రములు జరిగి ఆ బాలుడు సురక్షితుడుగా నుండెనను వార్తలు రాజునకు చేరెను. వధ్యుడు పసి బాలుడగుటచేత, వారు దయితలచి, చంపుటకు మనసొప్పక యూరకుండిరని రాజు భావించెను.

హిరణ్యకశిపుడు, పుత్రుడైన ప్రహ్లాదుని తన చేతులతోనే చంపుటకు నిశ్చయించుకొనెను పుత్రునిపై అతనికున్న ప్రేమ చాల కాలము క్రిందటనే హరించిపోయెను ప్రహ్లాదుడు నారాయణ భక్తుడగుటచేత అతనిపై ప్రేమ అంతరించి ద్వేషము ప్రబలెను కుమారుని చంపుటకు దృఢ నిశ్చయుడై, గట్టిగా యిట్లరచెను ''ఈ క్షణమే నా కుమారుని యిక్కడకు తీసుకుని రండు. వాని మొండితనమును నేను అణచెదను''

## 84 అంతిమ ఘట్టము

హిరణ్యకశిపుడు పిలువనంపగా ప్రహ్లాదుడు వచ్చి తండ్రికి ప్రణమిల్లి పాదధూళి శిరస్సుపై నుంచుకొని, చేతులు జోడించి తండ్రి కెదురుగా నిలుచుండెను. హిరణ్యకశిపుడు కఠినముగా పుత్రునితో నిట్లనెను. ''నీవు మూర్ఖుడవు, పరమ మూర్ఖుడవు. నా వంటి గొప్ప మహారాజునకు పుత్రుడవైన నీవు, నాతో తలపడి పోరుటకు ధైర్యము లేని ఆ భగవంతుని మహా గొప్పగా పొగడుచున్నావు. ఇంత కాలము నిన్ను, నీ మొండితనమును సహించినాను. కాని నీవు ఒక చీడ పురుగువలె తయారైనావు. నీవు యీ కుటుంబమును సర్వనాశనము చేయగలవు. నన్ను, నా మాటలను నీవు గౌరవించుటలేదు. నా సహనము హద్దు మీరినది ఇప్పుడే నిన్ను యముని వద్దకు పంపెదను. సిద్ధముగా నుండుము''.

ఆ మాటలు తన నుద్దేశించి కావట్లుగా, ప్రశాంతముగా యెట్టి కలవరము లేక ప్రహ్లాదుడు నిలిచి యుండెను.

ఎట్టి విచారమును లేక శాంతము నిండిన ప్రహ్లాదుని ముఖమును గాంచిన హిరణ్యకశిపునకు అగ్నిలో ఆజ్యము పోసినట్లుండెను అతని భయంకర దృక్కులను వినయముగా నిలిచియున్న ప్రహ్లాదునిపై ప్రసరింపజేసి యిట్లనెను ''నీ నంగనాచి వేషములు, దొంగ వినయములు కట్టిపెట్టు నా ప్రబల శత్రువైన నారాయణుని ఆరాధించి పొగడుచు నన్ను వేధించుచున్నావు నేను వద్దని చెప్పుచున్నను నీవు యిట్లు చేయుట కెంత ధైర్యము? నా రాజ్యములో ఆ నారాయణుని పేరు ఉచ్చరించుటకు నీ కెంత ధైర్యము? నిన్ను చంపుటకు నిశ్చయించినాను''

ప్రహ్లాదుని నేత్రములు తండ్రి నేత్రములను కలిసినవి. ప్రహ్లాదుని కనులలో శాంతము ఉట్టిపడగా, హిరణ్యకశిపుని కనులు యెర్రనై మండుచున్నవి. ప్రహ్లాదుని కనులలో జాలి, విచారము గూడు కట్టుకొనగా, యిట్లనెను ''తండ్రీ! నేను దుష్టుడనని మీ భావము కాని, నిజముగా నేను దుష్టుడను కాను మీకు సహాయము చేయవలెనని మాత్రమే నా కోరిక ఇప్పటికైనను మించిపోయినది లేదు నా మాట వినినచో మీరు రక్ష పడయగలరు నారాయణుడు అత్యుత్తమ దైవము, మహా శక్తిమంతుడు దేవతలందరికన్న గొప్పవాడు, సృష్టికర్త యగు బ్రహ్మ కన్న గొప్పవాడు, అన్ని శక్తుల కంటె శక్తిమంతుడు. ఇంద్రియములకు, మనస్సుకు, బుద్ధికి చైతన్యమును కలిగించి ప్రకాశింపజేయు వా డతడే. ఈ ప్రపంచమునకు అతడే సృష్టికర్త, అతడే పోషణకర్త, అతడే లయకర్త, నీకన్న అతడు గొప్ప శక్తిమంతుడని అంగీకరించుము నారాయణుడు నీకు శత్రువు కాదు నీ మనస్సే నీకు శత్రువు అది తప్పు మార్గముల వెంట తీసుకొని వెళ్ళును. నీకు శత్రువైన మనస్సును నిగ్రహించి అదుపులో నుంచవలసి యున్నది, నారాయణుని కాదు

''అదుపు తప్పి నిగ్రహము లేని మనస్సును మించిన శత్రువు మరొకటి లేదు దయచేసి మనసు నదుపులో నుంచుకొనుడు. సమబుద్ధిని మనసులో పెంచుకొనుడు మీ మనస్సు నుండి రాగద్వేషములను దుష్టగుణము లను తొలగింపుడు అదియే భగవంతునికి అత్యంత ప్రీతికరమైనది మీరు పది దిక్కులను జయించితి ననుచున్నారు. ఎంత అసత్యము! మీలో యిమిడియున్న ఆర్గురు భయంకర శత్రువులు - కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు జయింపలేకుంటిరి ఈ ఆరుగురు శత్రువులను జయించిన వానికి, మనస్సును అదుపులో నుంచిన వానికి, ఇంద్రియములను నిగ్రహించిన వానికి, అందరిలోను ఉన్న ఆత్మ ఒకటేయని తెలునుకున్న వానికి, శత్రువు ఉండగలడా? తండ్రీ! మీకు మీరే శత్రువు. మిమ్ము మీరు జయించవలెను''.

హిరణ్యకశిపుడు మండిపడెను. క్రోధముతో నిండిన కనులను కుమారునివైపు త్రిప్పి యిట్లనెను ''నీ తండ్రికి నీవు ధర్మబోధ చేయునంతటి వాడవైనావు నిజముగా నీ తండ్రిని గురువుగా యెంచి, దేవునివలె గౌరవించవలసినది సరే, ఆ విషయము వదలిపెట్టు, నా కంటె గొప్ప వాడైన 'భగవంతుడు' ఉన్నాడనుచు న్నావు. అతడెవరో, యెక్కడనున్నాడో నాకు చెప్పుము''

''అతడు నారాయణుడు. తండ్రీ! అతడు సర్వత్ర ఉన్నాడు''. అని ప్రహ్లాదుడు జవాబిచ్చి నిర్భయముగా నుండెను. అతని స్వరములోగాని ప్రవర్తనలోగాని భయము లేకుండెను. ప్రశాంత దృక్కులతో నిండిన మోముతో ఆ బాలుడు నిలిచి యుండెను. హిరణ్యకశిపుడు, తన పుత్రుడు మాట్లాడునపుడు యెట్టి గౌరవమును ప్రదర్శించెనో కనిపెట్టెను. ప్రహ్లాదుని మాటలు తండ్రి చెవుల కింపుగా లేకుండుటచే, సంతోషపెట్టుటకు బదులు కోపమును ద్విగుణీకృతము చేసెను ''సర్వత్రా?'' హిరణ్యకశిపుడడిగెను అతని యెర్రని కనులు ఆ సభా ప్రాంగణములోని ఒక స్తంభముపై నిలిచెను ప్రహ్లాదుని వైపు అసహ్యముగా చూసి ''ఈ స్తంభమందు

ఉన్నాడా?'' అనెను.

ఆ స్తంభమునకు ప్రహ్లాదుడు ప్రణమిల్లి యిట్లనెను. ''అవును ఉన్నాడు ఈ స్తంభము లోపల నేను చూడగలుగుచున్నాను''

హిరణ్యకశిపుడు స్తంభము చుట్టు ఒకసారి, క్రిందకు పైకి ఒకసారి చూచి యేమియు గాంచక, అతడిట్లనెను. ఇప్పుడు నిన్ను చంపబోవుచున్నాను. నీవు చెప్పే ఆ నారాయణుడు యీ స్తంభము నుండి వచ్చి, నా చేతుల నుండి నిన్ను రక్షించునేమో చూచెదము''. హిరణ్యకశిపుడు పెద్దగా అరచి, చేతిలో కత్తి తీసుకొని సింహాసనము నుండి క్రిందకు ఉరికెను. బలమైన తన మోచేతితో ఆ స్తంభమును గుద్దెను.

## 85 నృసింహావతారము

ఇంతలో భయంకరమైన శబ్దము వినిపించెను. పిడుగు పడిన శబ్దము వలె నుండెను. ఆ శబ్దమునకు యీ లోకమంతయు కంపించెను. కాని హిరణ్యకశిపుడు భయపడలేదు అదే పనిగా ఆ స్తంభము వైపు చూచుచుండెను. అతడట్లు చూచుచుండగనే ఆ స్తంభము రెండుగా చీలి అందు నుండి భగవంతుడావిర్భవించెను.

భగవంతుడు అతి భయంకరమైన రూపమును ధరించెను. కరిగించిన బంగారము వలె మెరయుచు అతడచట నిలుచుండెను బంగారు మచ్చలుగల కనులతో హిణ్యకశిపునివైపు చూచెను సింహము ముఖము నందు కళ్ళువలె అవి ప్రకాశించుచుండెను. గుహ వలె నున్న నోటిలో రక్త వర్ణములో నున్న పెద్ద నాలుకను ఆడించుచుండెను ఆ నాలుక రక్తములో ముంచిన కత్తివలె నుండెను. ఆ సింహము యెక్కువ జూలుతో నుండెను. విశాలమైన వక్షముతో సింహము వలె సన్నని నడుము కలిగి యుండెను నడుము క్రింది భాగము మానవ రూపములో నున్నది. చూచిన ప్రతి ఒక్కరు భయముతో వణికిపోయిరి కాని హిరణ్యకశిపుడు బెదరక యుండెను అదే పనిగ ఆ వింత ఆకారమును చూచుచు తనలో తానిట్లనుకొనెను. ''ఏమిది చాలా వింతగా కన్పడుచున్నది! ఇది మానవుడు కాదు, జంతువు కాదు''

అకస్మాత్తుగా అతని మనస్సు గతములోనికి వెళ్ళెను మందర పర్వత సానువులపై బ్రహ్మ యెదురుగా నిలచి, బ్రహ్మను అడిగిన వరమును జ్ఞప్తికి తెచ్చుకొనెను మరణము లేకుండునట్లు వరమడుగగా, అది తనకు సాధ్యము కాదని బ్రహ్మ చెప్పెను అప్పుడు బ్రహ్మ నిట్లడిగెను ''నీవు సృష్టించిన దేదియు నా మరణమునకు కారణము కారాదు. నీవు సృష్టించిన వస్తువు లేవియు నన్ను చంపకూడదు '' హిరణ్యకశిపుడు వర్తమానములోనికి వచ్చెను వింతగా నిలచియున్న ఆకారము బ్రహ్మ సృష్టించినది కాదు ఇది అతని మరణమునకు కారణమగునా?

ఈ ఆలోచనను విదిలించుకొని, చేత ఆయుధము ధరించి భగవంతుని వేగముగా సమీపించెను ఒక క్షణకాలము నృసింహుని నుండి వెలువడుచున్న బ్రహ్మాండమైన వెలుగులో హిరణ్యకశిపుడు కన్పించకుండెను హిరణ్యకశిపుడు తన గదతో భగవంతుని కొట్టెను సర్పమును గరుడుడు పట్టుకున్నట్లు, హిరణ్యకశిపుని తన చేతులతో యెత్తెను. అతని పట్టునుండి తప్పించుకుని తిరిగి తన గదతో హిరణ్యకశిపుడు నృసింహుని

కొట్టెను భగవ                ,     బాహువులతో హిరణ్యకశిపుని యొడ్చుకొని వెళ్ళి ద్వార బంధము వద్ద ఆగెను నృసింహుడు ద్వార బంధముపై కూర్చుని తన ఒడిలో అసుర రాజు నుంచెను

హిరణ్యకశిపుడు నిస్సహాయముగా చుట్టూ పరికించి చూచెను ఆకాశము నల్లబడుచున్నది. అది పగలూ కాదు, రాత్రియూ కాదు తనలో తాను నవ్వుకొని యిక తన జీవితము సమాప్తి కానున్నదని తలచెను అది పగిలూ రాత్రియు కాని సమయము, ద్వార బంధము నందుండుటచేత యింటి వెలుపలనూ కాదు, యింటి లోపలనూ కాదు ఒక మృగము బాహువులలో చిక్కుకొనెను; దానిని మృగమనుటకు వీలుకాదు, మానవుడనుటకు వీలుకాదు భగవంతుడు తన ఒడిలో పెట్టుకొనెను అతడడిగిన వరములలో ఒకటి · తాను భూమిపైన గాని, ఆకాశమున గాని మరణించ కూడదు. ఒక విచిత్రమైన స్పష్టతతో తన మాటలు తిరిగి మంచు బిందువులో పచ్చటి బయలు ప్రతిబింబించినట్లు, తన స్ఫురణకు వచ్చుచున్నవి అయినప్పటికీ అతడు భయపడలేదు అతడు పోరాడుటకు ప్రయత్నించెను కాని నృసింహుని                డెను తన చూపులను కుమారునిపై ప్రసరింపజేసెను ఆ చూపులు 'బహుశః నీవు చెప్పినదే సరియైనది' అన్నట్లుండెను అతని కంటె బలవంతుడు, శక్తిమంతుడు మరొకడు కలడని మొదటిసారిగా అతనికి స్ఫురించెను

తన ఒడిలో నున్న హిరణ్యకశిపుని నృసింహుడు తన గోళ్ళతోను పళ్ళతోను చీల్చి, శరీరములోని భాగములను బయటకు లాగెను. ఆ దృశ్యము చాల భయంకరముగా నుండెను. హిరణ్యకశిపుని శరీరములోని ప్రేవులను బయటకు లాగి వాటిని మెడలో హారముగా ధరించిన నృసింహుడు భయంకరమైన ఉగ్రరూపము దాల్చెను

నృసింహుని క్రోధమునకు యీ లోకము మిక్కిలి భయకంపితమయ్యెను. సముద్రము అల్లకల్లోలమయ్యెను భయముతో భూమి కంపించెను నృసింహుడు వెలుగులన్నిటినీ తనలో లీనము గావించుకొనుటచేత ఆకాశము, స్వర్గము శోభను గోల్పోయెను మేఘములు అటు యిటు చెదరిపోగా, గ్రహములు గ్రహణము పట్టినట్లుండెను. ఊర్ధ్వ లోకములో ఉత్పాతము సంభవించునట్లుగా సముద్రము అల్లకల్లోలముగా నుండెను దిక్కులను రక్షించుచున్న ఏనుగులు, నృసింహుని అరుపునకు భయపడెను. అతని మహత్తర శక్తికి తాళలేక భూమి బ్రద్దలగునా యన్నట్లుండెను.

చనిపోయిన హిరణ్యకశిపుని లాగుకొనుచూ వెళ్ళి, నృసింహుడు సింహాసనముపై కూర్చుండెను అతని దగ్గరకు వెళ్ళుటకు యెవరికీ ధైర్యము లేకుండెను. అతని ఉగ్ర రూపమునకు భయపడి యెవరికీ - దేవతలుగాని, బ్రహ్మగాని, లక్ష్మీదేవిగాని పలకరించుటకు ధైర్యము లేకపోయెను

దూరముగా నిలబడి బ్రహ్మ నృసింహుని స్తుతించెను. దేవతలు, బ్రహ్మ, మహాదేవుడు యిట్లనిరి ''భగవంతుని లీలలు అతి చిత్రములు. ప్రతి సంఘటనకు కారకుడవు నీవు. తొలుత సనకాదులకు ఆగ్రహమును కల్పించినది నీవు. నీ భక్తులైన జయ విజయులు యీ పాప లోకములో జన్మించుటకు కారణము నీవు. నేమ భ్రాంతిలో హిరణ్యకశిపుడడిగిన వరములన్నీ యొసగునట్లు చేసినది నీవు ఈ అసురుని గృహమందు నీ భక్తులలో ఉత్తమోత్తముడు జన్మించెను అదియూ నీ సంకల్ప ప్రకారమే జరిగెను. తండ్రి కొడుకును చంపు ప్రయత్నములు చేయగా, నీ భక్తుని రక్షించుటకు నీవు యీ కార్యమును చేబట్టి యీ దుర్మార్గుని నాశనము చేసితివి. నీ చర్యల వెనుక నున్న ప్రయోజనమును యెవరు ఊహించగలరు? సవినయముగా మేము

నీకు నమస్కరించుచున్నాము''

నృసింహుడు క్రోధము మూర్తీభవించినట్లుండెను. దేవతలు, బ్రహ్మ నారాయణుని కడకు వెళ్ళి, హిరణ్యకశిపుని దుర్మార్గము నణచి యీ లోకమును రక్షింపుమని వేడినపుడు, నారాయణుడిట్లనెను ''అతని కుమారుడు, నాకు భక్తుడు అయిన ప్రహ్లాదుని బాధించునపుడు, ఆ బాలుడు శత్రుత్వము, క్రూరత్వము వలన కలుషితము కాక, యెప్పుడూ సమబుద్ధితో, ప్రశాంతతతో బాధలనన్నిటినీ నా యందు గల భక్తిచేత సహించును. అప్పుడు నేను అవతరించి, యీ హిరణ్యకశిపుని, నీవు వరములను ప్రసాదించినప్పటికీ నాశనము చేయుదును''.

ఒక సామాన్య మానవుడు తనకు పరమ భక్తుడైన వానిని బాధించుట చేత ఆగ్రహావిష్టుడై భగవంతుడు నృసింహ రూపము దాల్చెను. హిరణ్యకశిపుని చంపిన చాలసేపటి వరకు నృసింహుని కోపము తగ్గకుండెను. అతని భీకర రూపమునకు వెఱచి, బ్రహ్మాది దేవతలు నృసింహుని సమీపమునకు వెళ్ళలేకుండిరి. దూరము నుండి భగవంతుని స్తుతించుచుండిరి.

వారు లక్ష్మీదేవిని సమీపించి యిట్లనిరి ''అమ్మా! నీ భర్త కోపమును నీవు మాత్రమే శమింపజేయగలవు భూమ్యాకాశములు అతని క్రోధమునకు దద్దరిల్లుచున్నవి అతని జూలు అటునిటు ఆడగా మేఘములు చెల్లాచెదరగుచున్నవి అతని అత్యంత ప్రకాశ వైభవముచేత గ్రహములు గ్రహణము పట్టినట్లు తమ శోభను కోల్పోయినవి. అతని ఉచ్ఛ్వాస నిశ్వాసముల వలన సముద్రములు అల్లకల్లోలమైనవి. అష్టదిక్కులందు ఉన్నటువంటి యేనుగులు, తమను మెరుపులు పిడుగులు తాకినట్లు భయముతో వణకుచున్నవి. అందుమూలముగా భూమి కంపించుచున్నది. భగవంతుని వేడి శ్వాసను భరించలేక స్వర్గములు దూరముగా పోవుచున్నవి. భూమి కంపించుటచేత పర్వతములు కదలు ప్రమాదమును సూచించుచున్నవి భగవంతుడు శమింపకుండెనచో, యీలోకము, స్వర్గము అంతమొందగలవు''.

లక్ష్మీదేవి ఒకపరి తన భర్త ముఖమును చూచెను. ఆమె ముఖము భయముతో వివర్ణము కాగా యిట్లనెను. ''ఇప్పుడతడు ఉన్న స్థితిలో సమీపించుటకు నాకు ధైర్యము చాలదు. ఇది వరకెన్నడు నేనిట్లు చూడలేదు. నాకు చాల భయముగా నున్నది''

## 86 ప్రహ్లాదుడు నృసింహుని స్తుతించుట

హిరణ్యకశిపుని సింహాసనముపై ఆసీనుడైన నృసింహునికి దూరము నుండి వచ్చుచున్న పొగడ్తలు వినిపించుచుండెను. బ్రహ్మ ప్రహ్లాదుని సమీపించి యిట్లనెను. ''కుమారా! నారాయణ భక్తుడవైన నీపై గల ప్రేమతో భగవంతుడు యీ నృసింహ రూపము దాల్చి నీ తండ్రిని వధించెను. నీవు యిపుడు నృసింహుని శాంతింపజేయవలెను. ఆగ్రహావిష్టుడైన నృసింహుని సమీపమునకు మేమెవరమూ వెళ్ళలేము. నీవు మాత్రమే అతని ఆగ్రహము నుండి యీ లోకమును రక్షింపగలవు''.

ఒక్కమాట అయినను పలుకక, తన ప్రేమైక స్వరూపుని గాంచిన ఆనందముతో కనుల నుంచి అశ్రువులు కారుచుండగా, ప్రహ్లాదుడు నృసింహుని పాదములకు ప్రణమిల్లి, తన ఆనందాశ్రువులతో అతని పాదములు కడిగెను. ప్రహ్లాదుని జూచి, నృసింహుడు దయాపూరితమైన తన దృక్కులను ఆ అమాయక బాలునిపై నిలిపెను.

బాలుని లేవనెత్తి తన చేతిని అతని శిరస్సుపై నుంచెను. భగవంతుని హస్త స్పర్శతో ప్రహ్లాదునికి శరీరమంతయు గగుర్పొడిచిన ట్లయ్యెను అతని పాపములన్నియు నమసిపోయి, ఆ క్షణమందు బ్రహ్మమును గురించిన సత్యము గోచరించెను తమ్మి మొగ్గవలె ప్రహ్లాదుని చేతులు జోడించి యుండగా, అతని కనుల నుండి అశ్రువులు అవిరామముగా వచ్చుచుండెను వృక్షమువలె స్థిరముగా నిలిచి గద్గదస్వరముతో వణకుచు భగవంతుని వైభవము కీర్తించుట మొదలిడెను. ''ప్రభూ! బ్రహ్మాది దేవతలకు అందుబాటులో లేవు, సంవత్సరముల తరబడి ధ్యానము చేయు ఋషులకు మీ దర్శనము లభించుటలేదు; సత్పురుషులకు, జ్ఞానులకు కూడ మీ దర్శనము దుర్లభమగుచున్నది వీరందరికీ లభించని మీ దర్శనము, అధమమైన రాక్షసజాతిలో జన్మించిన నాకు కల్గుట యెంతటి భాగ్యమో? మీకు నాయందున్న అనంతమైన ప్రేమచేత నాకు ప్రత్యక్షమైతివి. నేను చాల అదృష్టవంతుడను పన్నెండు గుణములు మీకు ప్రీతికరమైనవని కోవిదులందురు ఉత్తమ కుటుంబములో జన్మించుట, సంపద, రూపసౌందర్యము, తపస్సు, పాండిత్యము, నేర్పరితనము, వైభవము, కీర్తి, బలము, ధైర్యము, ప్రయత్నము, బుద్ధి వీటన్నింటి కన్న గొప్పదైన అష్టాంగయోగము సూటిగా మీ దగ్గరకు చేర్చునని చెప్పుదురు కాని, నాకు, యీ ప్రపంచమునకు భక్తి, అనగా మీపై ప్రేమ యుండిన చాలునని నిరూపించినావు. ఇతరమైనవన్నియు మిమ్ము చేరుటకు ప్రతిబంధకములని కూడ స్పష్టపరచినావు అష్టాంగయోగము భక్తి కంటెను అల్పమైనదని నా నమ్మకము లేకున్న, కేవలము ఒక గజము మీ దయ నెట్లు పొందగలిగెను?

''భగవంతుడు భక్తివలన సంతోషించునని యెరుగుదును అందమైన శరీరము, సౌందర్యవతియైన భార్య, మేరు పర్వతమంత సంపద, మాట చమత్కారము — భక్తిలేకున్న వీని వలన యేమి ప్రయోజనము? భక్తి తప్ప యింకేదియు మీకు సంతోషము నివ్వలేదు''

''ప్రభూ! ఇక్కడచేరిన బ్రహ్మాది దేవతలందరూ పరమభక్తులు వారు మీకు ప్రియులు. అసురులమైన మేము నిన్ను పూజించుచున్నప్పటికీ, దేవతల భక్తి యింతకన్న యెన్నోరెట్లు గొప్పది అట్టివారు కూడ మిమ్ము చూచి భయపడుచున్నారు ఈ నృసింహావతారములో యీ లోకము నాశీర్వదింపవలసి యున్నది. ఈ లోకమందు వైభవమును యినుమడింపజేసి, ప్రతి ఒక్కరూ సుఖముగా నుండుటకొరకే మీరు యీ లోకములో అవతరించినారు. స్వామీ! ఈ ఆగ్రహమును విడిచిపెట్టుడు. మీకు క్రోధము తెప్పించిన అసురుడు మరణించినాడు. ఇతరుల శ్రేయస్సు కొరకై ప్రసన్నులు కావలెనని కోరుచున్నాను నేను మిమ్ము జూచిగాని, మీ క్రోధమును జూచిగాని, మీ రూపమును జూచిగాని భయపడుటలేదు కాని సంసారమనే సముద్రము నాకు భయమును కలిగించుచున్నది. మీ తోనే ఉండగోరు వారికి సంసారము భయంకరమైనది, భరింపరానిది నా తండ్రి సేవకులు నా చేతులు కట్టి ప్రవహించు నీటిలో నన్ను పారవేసినట్లు, స్వయంకృతమైన కర్మలచేత కట్టుబడి నేను యీ సంసార సముద్రములో పడబోవుచున్నాను. మీ దర్శనమైన వెంటనే కర్మ బంధములన్నియు దగ్ధమై, త్వరలోనే మిమ్ము చేరుకొనవలెనని ప్రార్థించుచున్నాను''.

నృసింహుడు కోపము విడనాడి, బాలుని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని యిట్లనెను ''కుమారా! నీపై నాకు మక్కువ యెక్కువ అసురులలో నీవు గొప్పవాడవు, ఉత్తముడవు నీవు కోరు వరములను ప్రసాదించదల చుకున్నాను నన్నడుగుము. మానవుల కోర్కెలన్నిటిని తీర్చుటకు నేనున్నాను నీకు యేది ముఖ్యమో దాని నడుగుము. నేను తీర్చెదను''.

ప్రహ్లాదుడు ప్రాపంచిక వస్తువుల యెడ లాలసుడగుటకు వరముల నొసగెదనని భగవంతుడు చెప్పెను. కాని ప్రహ్లాదుడు భగవంతుడిచ్చు వరములపై సుముఖత కనపరచలేదు ముఖముపై హాసము చిందగా మధురవచనములతో ఆ బాలుడిట్లనెను "ప్రభూ! నన్ను మైమరపించి మోసపుచ్చవద్దు నేను కోరునది మీతో ఉండుట. నేను అసురుడను ఇంద్రియానుభవముల నాశించుట అసుర స్వభావము దీనిని గుర్తించి, అట్టి ప్రాపంచిక సౌఖ్యములను యెరగా చూపి యీ సంసార సముద్రములో నాకు నేనుగా పడునట్లు చేయుచున్నారు ప్రభూ! నాకు వద్దు. నేను మీ దర్శనము పొందినాను. నేను యెప్పుడూ మిమ్ములను ప్రేమించుచున్నానని యెరుగుదురు ఈ ఇంద్రియముల సమూహమూ, అవి అపేక్షించు భోగములు నాకు ప్రియము కావు. బహుశః నా భక్తిని పరీక్షించుటకే యీ ప్రలోభములను కల్పించుచున్నారను కొనుచున్నాను. భక్తికి ప్రతిఫలముగా వరమును కోరువారు భక్తులు కాజాలరు, వర్తకులగుదురు ఎట్టి కోరికలు లేని భక్తుడను భక్తుల నుండి భక్తిని తప్ప యింకేదియు ఆశింపని మీరు నాకు ప్రభువు అట్టి సందర్భములో కోరికలు కోరుటకు వానిని ప్రసాదించుటకు ఆస్కారమెక్కడ?

"అయినప్పటికీ మీ ఆజ్ఞ నుల్లంఘించి అవమానపరచుట నాకిష్టము కాదు. నాకొకవరము ప్రసాదించవలెను మీరూపము నా హృదయములో యెల్లప్పుడూ స్థిరముగా నుండవలెను. మీ రూపమున్నచోట ప్రాపంచికమైన కోరికలకు తావుండదు. నాయీ హృదయములో మీయందు ప్రేమ స్థిరముగా నున్నచో, ఇంద్రియములు, మనస్సు, శ్వాస, శరీరము, ధర్మము, ధైర్యము, బుద్ధి, లజ్జ, సంపద, కీర్తి సత్యము కూడ ఆ ప్రదేశము వదలి భక్తిపై దగ్ధము కాగలవు. భక్తిసుస్థిరముగా నున్నచో వీడును అహంకారము వీడినంతనే దానితో చేరియున్న ఇతర గుణము లన్నియూ అదృశ్యమగును హృదయమందు కోరికలను విడనాడినవారు భగవంతునివలె సంపన్నులగుదురు.

"సనాతన పురుషుడు, పరబ్రహ్మ ృసింహుడు అయిన నీకు నా నమస్కారము".

నృసింహుడు పూర్తిగా శాంతించిన పిదప, యింతవరకు దూరముగా నున్న అందరూ చేరువకు వచ్చి అతనిని కీర్తించిరి లక్ష్మీదేవి వచ్చి నృసింహుని ప్రక్కనే కూర్చున్న పిదప అతడు లక్ష్మీ- నృసింహుడయ్యెను. అతడిట్లనెను. "కుమారా! ఈ కల్పాంతము వరకు నీవు జీవించెదవు భోగభాగ్యములందు తగుల్కొనక, నీవు సర్వసౌఖ్యములు యీ లోకములో పొందెదవు. చివరకు యీ కర్మబంధము నుండి విముక్తి పొంది నీవు నన్ను చేరెదవు". ప్రహ్లాదుడు వినయముతో శిరస్సు వంచి యిట్లనెను. "ప్రభూ! నా తండ్రిపై అనుగ్రహము చూపవలెను. అజ్ఞానముచే మీ వైభవమును గుర్తించక, జీవితమంతయు మిమ్ములను ద్వేషించెను. అతడు నాయెడల ప్రవర్తించిన తీరు మీకు ఆగ్రహము తెప్పించెను. క్షమించరాని భగవద్భక్త నిందన అనే పాపము నుండి నా తండ్రిని కాపాడి క్షమింపవలెను".

"అట్లే జరుగుగాక" అని నృసింహుడనెను. చిరునవ్వుతో మరల యిట్లు చెప్పెను "నీవు హిరణ్యుని వంశములో జనించుట చేత అతడేకాక, అతని పూర్వులు యిరువది తరములవరకు పరిశుద్ధులైరి. నీ తండ్రి పితృలోకము చేరెను. నీవు అతని అంత్యవిధులను నిర్వహింపుము నీ వారసులందరూ కూడ నాకు ప్రీతిపాత్రులగుదురని తెలుసుకొనుము". ఆటు తర్వాత నృసింహుడు బ్రహ్మతో యిట్లనెను. "ఇకనుండి అసురులకు నీవు అనాలోచితముగా వరములు ప్రసాదించుట తగదు. అది పాములకు అమృతము పోసిన ట్లుండును".

తర్వాత నృసింహుడు అదృశ్యమయ్యెను ప్రహ్లాదుడు బ్రహ్మాది దేవతలను గౌరవించిన పిదప, వారందరూ తమ తమ గృహములకేగిరి ఇంతకాలముగా వారు అనుభవించిన బాధలు సమసిపోవుటతో వారందరూ సంతోషించిరి నారదుడు యుధిష్ఠిరునితో చెప్పుచున్న వృత్తాంతము కొనసాగించుచూ యిట్లనెను ''ఆ విధముగా దితి పుత్రులు నారాయణునిచే నిహతులైరి. ద్వేషముతో వారు యెల్లప్పుడూ నారాయణునే చింతించుచుండిరి సనకాదుల శాపము చేత విష్ణు ద్వారపాలకులైన జయ విజయులు తిరిగి రావణ కుంభకర్ణులుగా జన్మించిరి నారాయణుడు రాముడుగా జన్మించి వారిని సంహరించెను. శిశుపాల దంతవక్త్రులుగా వారు మూడవసారి జన్మించిరి. శిశుపాలుడుగా జన్మించిన జయుడు ఇప్పుడే నారాయణుని పాదములు చేరెను త్వరలోనే విజయుడు అనుసరించగలడు

''యుధిష్ఠిరా! వీరిద్దరి మొదటి జన్మలో క్రోధము, మదము ప్రధానముగా నుండుట నీవు గుర్తించి యుండవచ్చు రెండవసారి రావణుడుగా జన్మించినపుడు, కామము ప్రధానమైన దుర్లక్షణముగా నుండెను ఈ జన్మయందు వారిద్దరిలో మత్సరము యెక్కువగా నుండెను

''ప్రహ్లాదుని వృత్తాంతమును, భగవంతుడు భక్తుని అనుగ్రహించుట వినిన వారు తిరిగి యీ లోకమున జన్మించరు'' అని పలికి నారదుడు ముగించెను

ఒక క్షణము యుధిష్ఠిరుడు మౌనముగా నుండి యిట్లనెను ''భగవంతుని ప్రత్యక్షముగా కాంచగల్గిన ఆ అసురబాలుడు ప్రహ్లాదుడు మిక్కిలి అదృష్టవంతుడు'' నారదుడు జాలిగా నవ్వి యిట్లనెను. ''యుధిష్ఠిరా! నీవు అందరికన్నా అదృష్టవంతుడవని గ్రహించలేదా? అది యెట్లో వివరించెదను

''ప్రహ్లాదుడు, అతని గురువైన నేను నీ అంతటి అదృష్టవంతులము కాము నీ పూర్వులైన పురూరవుడు, వసిష్ఠుని వంటి మహా గొప్ప ఋషులు, సృష్టికర్తయైన బ్రహ్మ కూడా నీ వంటి అదృష్టవంతులుకారు. అనేక సంవత్సరములు ఉపనిషత్తులు మొదలైన శాస్త్ర గ్రంధములు చదివి, బ్రహ్మము కొరకు అన్వేషించిరి ఉపనిషత్తుల సారమైన బ్రహ్మము, యిప్పుడు మానవ రూపములో, నీవు అడుగక పోయినప్పటికీ, నీతోనే ఉంటున్నాడు ఉపనిషత్తులన్నింటినీ ఒకచోట చేర్చిన వాని కున్న పవిత్రత, పరిశుద్ధత నీ గృహమున గలదు పరబ్రహ్మము ప్రహ్లాదుని గృహములో నివసించి యుండలేదు ఋషులు అతని గృహమునకేగి బ్రహ్మమును దర్శించలేదు. ఇప్పుడు జరుగుతున్నది నీవు యెరుగుదువా?

''ఋషులు వైకుంఠములో బ్రహ్మమును అన్వేషించు చున్నారు, సూర్యలోకములో, క్షీరసాగరములో, శ్వేతద్వీపములో వెదకుచున్నారు అక్కడెక్కడను గానక, అంతటా వెదకుచున్నారు. అతడు (బ్రహ్మము) మానవ రూపములో దాగి నీ కొరకు అంతటా తిరుగుచున్నాడు. ఇప్పుడు చెప్పుము, యితరులు అదృష్టవంతులా? లేక నీవా? కృష్ణుడుగా అవతరించిన పరబ్రహ్మము నీతో కలిసి ఉంటున్నాడు నీ కతడు మేనబావ నీవు అతనికి ప్రీతిపాత్రుడవు అతడు నీ శ్రేయోభిలాషి నీ నుండి అతడేమియూ ఆశించుట లేదు అతడు నీ మేనమామ కుమారుడు. 'అతడు నా ప్రాణము' అని యెంతో ప్రేమతో నీవు అనేకసార్లు అన్నావు ఇదంతయూ సత్యము. ఒకొక్కపుడు నీకు గురువువలె, మరొకపుడు బంధువువలె నీ కొరకు శ్రమించుచు న్నాడు ఈ ఇంద్రప్రస్థమును నిర్మించునపుడు, నీ సోదరులతో జరాసంధుని కోటలో ప్రవేశించి అతడు హతమారునట్లు చేసి, నీవు రాజసూయాగము చేయునట్లు కృషి చేసిన విషయము జ్ఞప్తిలేదా? కొన్ని సమయములలో అతడు నీకు సలహాదారు, మరొక సమయములో బావ, నీ కంటె వయసులో చిన్నవాడగుటచే

అతడు వీకు ప్రణామము చేయు చుండెను. మునులు అంతటా అన్వేషించి, యెక్కడను గానక, యీ భూమికి వచ్చిరి వారు మధుర, బృందావనము వెళ్ళిరి. తర్వాత ద్వారకకు వెళ్ళి, చివరకు నీ యింటికి నీతో సామాన్యమానవునివలె నివసించుచున్న కృష్ణుని వద్దకు వచ్చిరి అతని స్వభావమును ఒకొక్కపుడు బ్రహ్మ మహేశ్వరులు కూడ తెలుసుకొనలేరు. ఋషులు మౌనముగా భక్తితో నన్యసించి పూజింతురు అయినప్పటికీ వారు అతడిని పొందలేకున్నారు. భగవంతుని గూర్చి వారికి తెలుసును. కాని వారు అతడిని చూడలేదు. ఆ బ్రహ్మమే యీ కృష్ణుడు. అతడు యీ భూమిపై సంచరించుట యెంతో అదృష్టము నీతో, నీ సోదరులతో అతడు నివసించుచుండుట మీ భాగ్యము''.

# అష్టమ స్కంధము

## 87 గజేంద్రుని వృత్తాంతము

త్రికూట మనుకొండ ఒకటి కలదు. పాల సముద్రము చుట్టు ఆవరించి అతి రమణీయముగా నుండుటచే ఆ కొండ ప్రాముఖ్యము వహించెను. ఆ కొండపై పెరుగు లతలు వెండి బంగారములవలె తళతళ మెరయుచుండెను. ఆ ప్రకాశము దిక్కులందు ప్రసరించగా, నాలుగు దిక్కులు ప్రకాశించుచుండెను. అది నూరు యోజనములు విస్తీర్ణము కలిగి యుండెను. శంఖములు, విలువైన రాళ్ళు అచట నిశేషముగా నుండెను. ఎత్తునుంచి చూచువారికి నల్లగా నున్న భూమి, తెల్లని పాల సముద్రము, లతలు, వృక్షములు, పొదలతో ఆకుపచ్చగా నున్న కొండ వెండితో పొదిగిన పచ్చ రాయివలె గోచరించుచుండెను. ఆ కొండ చాల అందముగా నుండెను. అచట అడవి మృగములు కలవు. పక్షుల గూళ్ళు నుండి వచ్చు మధుర సంగీత ధ్వని, గుహలలో నుండి వినవచ్చే పులులు సింహముల అరుపులతో కలిసిపోవుచుండెను. అచ్చట వీచు వాయువు పరిమళ పుష్పముల సువాసనతో నిండియుండుటచే దివ్యపురుషులు ఆ ప్రదేశమునకు వచ్చి విహరించుచుండిరి. దివ్యపురుషుల కది యొక ఆటస్థలము. సిద్ధ చారణ గంధర్వులు తరచు అక్కడకు వచ్చి, అచ్చటి గుహలందు లోయలందు సంచారము చేయుచుండిరి. ఆ ప్రదేశమందలి పెద్దపెద్ద రాళ్ళతో యిమిడియున్న విలువైన మణులతో అవి మెరయు చుండెను.

ఆ కొండపై ఋతుమనువనే తోటకలదు. అందు మందార, పారిజాత, పాటల, అశోక, చంపక చూత మనే పుష్ప వృక్షములు; మామిడి మొదలగు ఫలవృక్షములు గలవు. పొడవైన దేవదారు, సాలవృక్షములు ఆకాశము నంటుచున్నట్లుండెను. ఆ తోట వరుణునకు చెందినది. ఆ కొండమీద అందమైన సరస్సుకూడ కలదు. అది చాల పెద్దది. అందు నీలి, తెలుపు, యెర్రని పద్మములు తేలుచుండెను. వాటియందున్న మకరందమును గ్రోలుటకు, ఆ పద్మముల చుట్టూ చేరిన తుమ్మెదలు చేయు ఝుమ్మను శబ్దము అన్ని వేళలందు వినిపించుచుండెను. నిర్మలముగా ఉన్న ఆ సరస్సులో పైన సంచరించు కొంగలు, హంసలు, లోపల నుండే చేపలు, తాబేళ్ళు స్పష్టముగా అగుపించుచుండెను. సరస్సు ఒడ్డు నందు మల్లె, కుంద, జాజి, పున్నాగ, కురవక మాధవీలతలు విరబూచి యుండెను. ఆ పుష్పవాసనలమత్తు మైమరపించు చుండెను.

ఆ కొండ యందు ఒక ఏనుగు తన పరివారముతో నివసించుచుండెను. తన యిష్టము వచ్చినపుడు ఆ ఏనుగు సంచరించుచుండెను. సంచరించునపుడు పరివారమంతయు ఆ యేనుగుతో సంచరించుచుండెను. వెదురు గడలను, చెరకుగడలలో లేతవానిని పెరికి తినుట వానికి ఆటగా నుండెను. ఆ అడవిలో అవి యిష్టము వచ్చినట్లు సంచరించుచుండెను. మదించిన ఆ యేనుగు నిలిచిన చోటునుండి, పులులు, సింహములు, అడవిపందులు, యెద్దులు దూరముగా పారిపోవుచుండెడివి.

ఒక వేసవికాలమందు ఆ యేనుగు తన సహచరులతో చాల దూరము నడిచి నడిచి అలసిపోయెను. మిక్కిలి దప్పికతోనున్న ఆ యేనుగు దూరమునుండి సరస్సు నుండి వచ్చు సువాసనలను ఆఘ్రాణించి, ఆ సరస్సు దిక్కుగా వేగముగా చనెను. వెంటనే తన పరివారము కూడ సరస్సును చేరి అందు ప్రవేశించెను. ఆ

సరస్సునందు స్నానము చేయగా అవి యెంతో హాయి ననుభవించి, మధురమైన సరోవర జలము త్రాగి దప్పికను తీర్చుకొనెను దప్పిక తీరిన తర్వాత వాటికి సరస్సు నుండి బయటకు రావలెననిపించలేదు. చాలసేపు స్వచ్ఛమైన సరోవరములో ఆడి ఆడి, తదుపరి దానిని బురదగా చేసెను గజరాజము తన తొండముతో సరస్సులో నీటిని చిన్నయేనుగులపై, ఆడ యేనుగుల వీపులపై జల్లుచుండెను సంసారసుఖములలో మునిగిన మానవుడు కాల ప్రవాహమును గుర్తించని విధముగా ఆ గజరాజు కాలము గతించుట గుర్తింపకుండెను. ఆ సరస్సు అడుగున దాగియున్న ప్రమాదములను మరచి, సంసారి సంసారబంధములో చిక్కుకొని పోయినట్లు, సరస్సునందు యితర యేనుగులతో ఆడుచూ ఉల్లాసముగా గడపుచుండెను

విధి ప్రేరణచే ఆ సరస్సునందే చాలకాలముగా నివసించుచున్న ఒక మొసలి, గజము కాలును తన బలమైన కోరలతో పట్టుకొనెను హఠాత్తుగా కలిగిన యీ బాధకు ఏనుగు తన శరీరము నంతనూ విదల్చి, మొసలి పట్టునుండి తప్పించుకొనుటకు ప్రయత్నించెను కాని సాధ్యము కాకపోయెను ఎంతగా ప్రయత్నించినప్పటికి మొసలి పట్టునుండి తప్పించుకొనుట అసాధ్యమయ్యెను మిగిలిన యేనుగులు సహాయపడుటకు ప్రయత్నించి విఫలమైనవి ఆ ఏనుగు బలమైన దైనప్పటికీ మకరము పట్టు అంతకన్న బలముగా నుండుటచే, ఆ పట్టునుండి విడిపించుకొనలేకుండెను కరిమకరుల మధ్య పోరు కొన్ని సంవత్సరములు సాగినది అడవిలో చక్రవర్తివలె సంచరించు గజరాజునకు సరస్సు అనే సామ్రాజ్యానికి రాజుగా ఉంటూన్న మొసలికి మధ్య జరుగుచున్న తీవ్రపోరాటము దేవతలకు కూడ ఆశ్చర్యము కలిగించెను క్రమక్రమముగా ఏనుగు బలము హరించి పోవుచుండెను. మొసలి పట్టు మరింత బలపడుచుండెను తన బలము సన్నగిల్లుటచే ఓడిపోవుట తథ్యమని, త్వరలోనే ప్రాణములు పోవునని ఆ యేనుగు గ్రహించెను ఆ క్షణములో ఏ వగాహన చేసుకొనెను బాగా ఆలోచించిన పిదప తనలో తానిట్లనుకొనెను "నేను యిప్పుడు పెద్ద యిక్కట్టులో పడినాను నామీద ఆధారపడిన యీ యితర యేనుగులు యీ క్లిష్ట పరిస్థితి నుండి నన్ను తప్పించలేవు నాకు వాటిల్లిన యీ విపత్కర పరిస్థితిని తప్పించి, యెవ్వరూ సహాయము చేయలేరు కాని, యింకను ఒక ఆశ మిగిలియున్నది బ్రహ్మాది దేవతలకు సైతము ఆశ్రయుడైన ఆ భగవంతుని శరణు జొచ్చెదను అతడు నన్ను యీ భయంకరమైన మొసలి బారి నుండి తప్పక రక్షించగలడు. భగవంతుడు నాకు అండగా నున్నచో, మృత్యువు అతనికి భయపడి నన్ను వదలి పారిపోవును భగవంతుని ప్రార్థించెదను"

తన మనస్సును ఆలోచనలను కూడగట్టుకుని, వాటిని నారాయణునిపై నిలిపి యిట్లు స్తుతించి గానము చేసెను. "దేవతలకు ప్రభువైన మహాప్రభూ! నీకు నా నమస్కారము. నీవు సనాతన పురుషుడవు, యీ ప్రకృతిని సృష్టించిన పురుషుడవు మానవుల మేధస్సును వికసింపజేసి ప్రకాశము నిచ్చువాడవు నీవు ఈ లోకమంతయు నీవలన యేర్పడినది నీవు లేక యీలోకము లేదు, నీ నుండి ఆవిర్భవించినది యీలోకము. దీనిని సృష్టించిన నీవు, తిరిగి నీలో లయము చేసుకొందువు అన్ని వెలుగులకు మూలము నీవు

"ప్రళయానంతరము నీవు తమస్సు, అనగా చీకటి సముద్రము అంచున నిలబడి, తిరిగి సృష్టిని ప్రారంభించి దానికి క్రొత్తగా జీవము కల్పించుచున్నావు ఈ విధముగా అనంతమైన కాలచక్రము కొనసాగుచున్నది. ఈ లోకములన్నింటికీ మూలకారణము నీవు. నీ దర్శనముకొరకు మహర్షులు వేలకొలది సంవత్సరములు ధ్యానములో నిమగ్నులై యుందురు. నీకు జనన మరణములు లేవు నీకు రూపనామములు, గుణములు లేవు. అయినప్పటికీ, నీ మాయచేత, నీకు, రూపనామములు సృష్టించి వానికి కొన్ని గుణములు ఆరోపించుచున్నారు లోకకళ్యాణము కొరకు నీవు రూపము ధరించుట చూచినవారు నీ నిరాకార తత్త్వమును విస్మరింతురు.

నీవు ఇంద్రియములకు, మనస్సుకు, భావోద్వేగములకు, బుద్ధికి అతీతుడవు. నీవు సామాన్యుల అవగాహనకు అతీతుడవైనప్పటికీ, కొందరు మహాపురుషులు నిన్ను గ్రహించి నీలో ఐక్యము కాగల్గిరి.

''ఇంద్రియముల కార్యకలాపములకు, వాని వాని ప్రత్యేక చర్యలను కాంచు నీవు ద్రష్టవు. ప్రతి ఒక్కదానికీ నీవు కారకుడవు. కాని, నీకు యేదీ కారణము కాదు. ఏలననగా నీవు సనాతనుడవు, నిత్యుడవు, అనాదివి, నీకు పరిమితులు లేవు, అనంతుడవు.

''నీవు గుణాతీతుడవు, అవి నిన్ను అంటవు. కాని గుణదోషములచేత మాయకు వశమైనవారు నీ సత్యస్వరూపము నెరుగజాలరు. సూర్యునినుండి అగ్నినుండి వెలువడే ప్రకాశము కొంతసేపు ఉండి తిరిగి యెచ్చటి నుండి వచ్చెనో, దానియందు అదృశ్యమగును. అదే విధముగా నీ వైభవము నీ నుండియే వెలువడుచున్నది. ఈ గుణములు, మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, శరీరము - యివన్నియు నీ నుండి జనించి, తిరిగి నీలో లయమగుచున్నవి. వానికి ప్రత్యేకమైన ఉనికిలేదు. నీవు గుణాతీతుడుగా ప్రసిద్ధి గాంచినప్పటికీ, నావంటి అభాగ్యజీవులయెడ నీవు కరుణామూర్తివని అందరును యెరుగుదురు. నీకు పూర్తిగా శరణాగతులైన వారు నిశ్చయముగా అవిద్య నుండి వెలువడి, నిత్యసత్యమైన నీ దర్శనము పొందగలరు.

''నా యీ జన్మ లోపలనూ వెలుపలనూ అవిద్యతో నిండియున్నది. ఈ గజాకారము వలనను మనస్సు వలనను నా కెట్టి ప్రయోజనమును లేదు. నాకు జీవించవలెనను కోరిక లేదు. కాలముచే నాశనము పొందని మోక్షమును కోరెదను. పుణ్యకార్యములకు ప్రతిఫలముగా కొంతకాలము స్వర్గములో నుండవచ్చును. ఆ పుణ్యము హరించిపోయి నంతనే తిరిగి యీ పాప ప్రపంచమున పడవలెను. దీనికి భిన్నమైన మోక్షమును కోరుచున్నాను. నా అవిద్య అణగిపోవలెనని నా ఆకాంక్ష. నేను ముముక్షువును. నీవు లోకకారకుడవు, సర్వవ్యాపివి. నీవు సృష్టించిన వానికి భిన్నముగా ఉంటూ, అంతిమ సత్యమువై యున్న నీకు నా ప్రణామములు. జ్ఞానాగ్నిచేత కర్మబంధములను దగ్ధము గావించుకొనిన యోగులు తమ హృదయములో నిన్ను దర్శించెదరు. 'నేను', 'నాది' అనుభావములతో వివేకశక్తిని కోల్పోయిన నావంటి మూర్ఖులు నీ గొప్పదనమును గుర్తించలేరు. నీవు అనంతశక్తిస్వరూపుడవు, నీవు నిత్యసత్యము, నీవు ఆత్మజ్యోతివి. నీకివే నా జోహారులు''.

బ్రహ్మాది దేవతలందరూ గజేంద్రము పలికిన పలుకులను వినుచుండిరి. ఆ గజేంద్రము ఆదిపురుషుని స్తుతించుటచేత, అవి యేవియు తమలో యే ఒక్కరికీ వర్తించవని గ్రహించిరి. గజేంద్రము పరిస్థితికి నారాయణుడు చలించి, హరి రూపములో సరస్సు తీరమున గజేంద్రునకు ప్రత్యక్షమయ్యెను.

గరుడునిపై నారాయణుడు వచ్చి చేరెను. అతని చేతిలో సుదర్శన చక్రము మెరసెను. నారాయణుని చూచిన గజేంద్రము, పద్మమును తొండముతోపట్టి తొండమును పైకెత్తియిట్లనెను. ''ఓ ప్రభూ! నారాయణా! నీకు నా నమస్కారము''. ఆ గజేంద్రము పరిస్థితిని చూచి నారాయణుడు కరుణాభరితుడయ్యెను. అతడు తన సుదర్శన చక్రముతో మొసలిని సంహరించి, ఆ గజేంద్రుని సరస్సునుండి బయటకు లాగెను. చనిపోయిన మొసలి నోరు తెరచుకుని గజేంద్రుని కాలినంటుకొని యుండెను.

స్వర్గవాసులు యీ దృశ్యమును ఆశ్చర్యముతో గాంచుచుండిరి. వారు నారాయణుని చుట్టూ చేరిరి. మొసలితోపోరి అలసిపోయిన గజేంద్రము తొండమునెత్తి అట్లే యుండెను. అమితప్రేమతో శ్రీహరి గజేంద్రుడొసగిన పద్మమును స్వీకరించగా, ఆ గజరాజము మిక్కిలి సంతోషించెను.

# 88 మోక్షము

వారట్లు చూచుచుండగా చనిపోయిన మొసలి శరీరమునుండి ఒక దివ్యపురుషుడు ప్రత్యక్షమయ్యెను. అతడు హూహూ అను గంధర్వుడు. అతడు భగవంతుని పాదములకు ప్రణమిల్లి, గాంధర్వ పద్ధతిలో కీర్తించి గానము చేసెను. అతడు యిన్ని సంవత్సరములుగా మొసలి రూపము ధరించి, చివరకు నారాయణుని చేతులలో విముక్తిని పొందుటకు కారణము అక్కడ చేరిన వారు తెలుసుకొనిరి.

చాల సంవత్సరములకు పూర్వము, యీ గంధర్వుడు తన భార్యలతో యిదే సరస్సునందు స్నానమాడుచుండెను. అదే సమయములో మహర్షి దేవలుడు సరస్సులో ప్రవేశించెను. జలక్రీడలో మునిగియున్న గంధర్వుడు నీటి అడుగునకుపోయి, నీటిలో నిల్చుని ధ్యానము చేయుచున్న దేవలుని కాలిబొటన వ్రేలును లాగెను. తాను చేసినది యెంత తీవ్ర అపచారమో ఆ గంధర్వుడు గ్రహింపకుండెను. దేవలుడు, తన ధ్యానమునకు అంతరాయము కల్గుటచేత మండిపడి, గంధర్వుని ఇట్లు శపించెను. ''నీవు యీ జలక్రీడలలో అమితముగా ఆనందించుచుండుటచేత, నీవు మొసలివై యీ సరస్సు నందే జీవించెదవు''. తన అపచారమును గుర్తించిన గంధర్వుడు శాపమును ఉపసంహరించవలసినదని బ్రతిమాలెను. అతని భార్యలు కూడ ఋషి ఆగ్రహమును ఉపశమింపజేయుటకు ప్రయత్నించిరి. దేవలుడు కొంతవరకు శాంతించి యిట్లనెను. ''నీవు యీ సరస్సునందు కొంతకాలము జీవించెదవు. గజేంద్రము తన సహచరులతో యీ సరస్సులో ప్రవేశించును. నీవు దాని కాలును గట్టిగా పట్టుకుని విడిచిపెట్టక యుండవలెను. ఆ గజేంద్రము భగవంతుని ప్రార్థింపగా, అతడు శ్రీహరి రూపములో ప్రత్యక్షమై, తన సుదర్శన చక్రముచే నిన్ను వధించి, నీకు మొసలి రూపము నుండి విముక్తి కలిగించును.

గంధర్వుడు భగవంతునికి ప్రదక్షిణము చేసి, భగవత్కీర్తనలను గానము చేయుచూ వెడలిపోయెను.

పరీక్షిత్తున కిదంతయు అయోమయముగా నుండుట అతని ముఖమున శుకబ్రహ్మ గుర్తించెను. అతడు ప్రశ్నించక మునుపే శుకబ్రహ్మ యిట్లనెను. ''నీ ఆలోచనలను నేను తెలుసుకున్నాను. పరమ యోగులు కూడ పలుకలేని పలుకులను, కేవలము ఒక జంతువు యెట్లు పలికెనా యని నీవు ఆశ్చర్యపడుచున్నావు. ఆ గజేంద్రమునకు పురుషుని గురించిన సత్యము యెట్లు తెలిసెను అని గదా నీ సందేహము? అది నీకు చెప్పెదను.

''దక్షిణ పాండ్యదేశమును ఒకప్పుడు ఇంద్రద్యుమ్నుడను రాజు పరిపాలించెను. అతడు ధర్మవర్తనుడు. అతడు నారాయణుని భక్తుడు. ఒకప్పుడు ఆ రాజు మలయ పర్వత సానువులలో మౌనముగా భగవంతుని ధ్యానించుచుండెను. అచ్చట నదిలో స్నానము చేసిన రాజు, ఆలోచనలను, మనస్సును, శ్వాసను నిగ్రహించి, భగవంతుని రూపమును ధ్యానించుచూ ప్రార్థించునపుడు మౌనవ్రతమును పాటించెను. ఆ పర్వతముపై నివసించుచున్న అగస్త్యమహర్షి ఆ ప్రదేశమునకు వచ్చుట తటస్థించెను. అతని శిష్యులు అగస్త్యమహర్షి చుట్టూ చేరిరి. ధ్యానమందు నిమగ్నుడైన రాజు బాహ్య ప్రపంచ జ్ఞానమును కోల్పోవుటచేత, అగస్త్యమహర్షిని గాంచక సాంప్రదాయము ననుసరించి చేయు గౌరవమర్యాదలను అగస్త్యమహర్షికి చేయకుండెను. బ్రాహ్మణుడైన అగస్త్యమహర్షి శిష్యులతో వచ్చి యుండగా రాజు వారి ఉనికిని గమనించకుండెను.

''రాజు ప్రవర్తన అగస్త్యునకు సహింపరాని దయ్యెను. అతడిట్లనెను. 'ధ్యానములో నిలిచియున్న రాజు తమస్సు మూర్తీభవించినట్లు ఉన్నాడు. తమస్సుకు సంకేతమైన ఏనుగుగా యీ రాజు జన్మించగలడు'. అట్లు శాపమొసగి అగస్త్యమహర్షి శిష్యులతో ఆ ప్రదేశమునుండి వెడలిపోయెను. ఇంద్రద్యుమ్న మహారాజు ఋషి శాపమునకు ఆగ్రహించక, శాంతముగా దానిని స్వీకరించెను అది భగవంతుని ఆజ్ఞగా భావించి, దానిని వినయముతో గ్రహించెను అతడు ఏనుగుగా జన్మించి త్రికూట పర్వతముపై నున్న అరణ్యములో సంచరించుచుండెను అతని జంతు జీవితములో ఒక విశేషము గలదు. అతని ఆలోచనలు, మనస్సు భగవంతునిపై భక్తితో నిండియుండుటచేత, పూర్వజన్మ స్మృతులు కలిగియుండెను అందుచేత, అతడు క్లిష్టపరిస్థితుల నెదుర్కొనినపుడు, భగవంతుని ప్రార్థించెను. సాధారణ జంతువుల కిది సాధ్యము కాదు

''ఇంద్రద్యుమ్నుడు యిపుడు శాపవిముక్తు డగుటేగాక, సంసార బంధము నుండి విముక్తిపొంది మోక్షము నందెను. భగవంతుని స్పర్శ కలిగిన వెంటనే అతని గజరూపము పోయెను అతడిపుడు నారాయణుని సేవకులలో ఒకడయ్యెను అతనికి నారాయణునితో సారూప్యము కలిగెను గరుడునిపై నారాయణుని ప్రక్కనే స్థానము పొందిన ఇంద్రద్యుమ్న మహారాజు యీ మానవలోకమును విడిచిపోయెను గరుడుడు ఆకాశముపై కెగిరి, త్రికూట పర్వతముపై రుతుమనువను తోటలోనున్న సరస్సు తీరముననున్న వారందరకూ అదృశ్యుడయ్యెను''

## 89 అమృత మధనము

ఒకప్పుడు దేవదానవుల మధ్య యుద్ధము సంభవించెను అసురుల తీవ్రధాటికి దేవతలు నిలువలేకపోయిరి. యుద్ధములో మరణించిన అనేకమంది దేవతలను పునరుజ్జీవించునట్లు చేయలేకపోయిరి. ఇంద్రవరుణాదులు సమావేశమై యీ తీవ్ర పరిస్థితిని అంతమొందించుటకు మార్గముల నన్వేషించగా, వారికేదియు తోచుకుండెను. సృష్టికర్తయైన బ్రహ్మ దగ్గరకు వెళ్ళుటకు వారు నిశ్చయించుకొనిరి. వారు బ్రహ్మ దగ్గరకు వెళ్ళగా, నారాయణుని వద్దకు వెళ్ళి ప్రార్థించుట తప్ప యింకొక మార్గము లేదని బ్రహ్మ సూచించెను. నారాయణుడు తమ కష్టములు గట్టెక్కుటకు సహాయపడునని బ్రహ్మ చెప్పెను.

అంతట వారు నారాయణుని వద్దకేగిరి బ్రహ్మ నారాయణుని ప్రార్థించి, దేవతలపై దయకలిగి వారి కష్టములను తీర్చుమని వేడెను. వారి ప్రార్థనలను వినిన నారాయణుడు ప్రత్యక్షమైన వారితో యిట్లనెను ''మీరు కోరుదానిని సాధించగలరు. మొట్టమొదట మీరు అసురులతో సంధి చేసుకొనవలెను మనము తిరిగి సన్నద్ధులమగుటకు కొంత వ్యవధి కావలెను. మీ ప్రయత్నములు సఫలమగునంతవరకు, అసురులతో సంధియే ఉచితమైన రాజనీతి మార్గము.

''ఒక ఉన్నతాశయమును సాధించుటకు చేయు ప్రయత్నములు, మార్గములు సాధ్యమైనంతవరకు శాంతిదాయకముగా నుండవలెను. మీరు మరణము లేకుండ రక్షనొందుటకు కావలసిన అమృతమును పొందవలెను. ఇది నేను మీకు యిచ్చుసూచన. ఆ అమృతముతో మరణించిన వారిని తిరిగి పునరుజ్జీవింప చేయవచ్చును అమృతము యెట్లు లభింపగలదు? అని మీ తరువాత ప్రశ్న.

''మందర పర్వతమును కవ్వముగా, వాసుకి యనే సర్పమును త్రాడుగా నియోగించి పాల సముద్రమును మధించవలెను సముద్రమును మధించుటకు అసురుల బలమైన బాహువులు అత్యవసరము మీకు మీరు దీనిని చేయజాలరు ఈ సాగర మథనములో నేను కూడా పాత్ర వహించెదను సాగరము నుండి అమృతము లభించువరకు మీరు కృషి సలుపవలెను ఆ అమృతము వల్ల పూర్తి లాభమును మీరు మాత్రమే పొందునట్లు, అసురులకు లేకుండునట్లు నేను చూచుకొందును కాని మీకు నేనొక హెచ్చరిక చేయదలచుకున్నాను ఏ విషయములోను మీరు అసురులకు అడ్డు చెప్పవద్దు వారి సూచనల నన్నిటిని ఆమోదించునట్లు మీరు నటించవలెను. మరొక హెచ్చరిక సాగరమును మథించగా మొట్టమొదట లభించునది కాలకూటవిషము దానిని చూచి మీరు భయపడవద్దు. అటు తర్వాత అనేక వస్తువులు, లభించగలవు చిట్టచివర అమృతము లభించును ఆ వస్తువులను రాక్షసులు కోరెదరని తలంచి, మీరు ముందుగా సంగ్రహించుటగాని, వాటిని కోరుటగాని చేయరాదు మీ ధ్యేయము అమృతమును పొందుట, ఇతరమైనవన్నియు అప్రధానములు మీరు వెళ్ళి బలిచక్రవర్తితో సంధి చేసుకొని మీ కార్యమును ప్రారంభింపుడు'' భగవంతుడు అదృశ్యము కాగా, బ్రహ్మాది దేవతలు వారి వారి గృహముల కేగిరి

బలిచక్రవర్తి, ప్రహ్లాదుని కుమారుడైన విరోచనుని కుమారుడు ఇంద్రుని నాయకత్వములో దేవతలు బలిచక్రవర్తి ప్రాసాదమునకు వెళ్ళిరి చక్రవర్తి సేవకులు, దేవతలను చూచి, వారిపై దాడి జరుపుటకు సిద్ధపడిరి కాని బలి అచ్చటకు వచ్చి, సేవకులను దుడుకుగా ప్రవర్తించవలదని ఆదేశించెను ఇంద్రుని సకల మర్యాదలతో బలిచక్రవర్తి తన సభకు ఆహ్వానించెను. గౌరవనీయుడైన అతిథిని సంతోషపెట్టుటకు తానేమి చేయవలెనో చెప్పుమని బలి అడిగెను. నారాయణుని మాటలు జ్ఞప్తికి తెచ్చుకుని ఇంద్రుడు అతి సరళముగా పలికెను ఇంద్రుని వైఖరి మిక్కిలి నేర్పుతోను, మాటలు యెదుటివారిని ఒప్పించునట్లుగను ఉన్నవి సాగరమథనము గురించి ఇంద్రుడు బలితో చర్చించెను ఇంద్రుడిట్లనెను. ''ఇంతవరకు మనకు తెలియని విషయ మొకటి గలదు మనలో మనము కీచులాడక స్నేహపూర్వకముగా కొంతకాలము సంచరించుదము కనీసము సాగరమథన కార్యము పూర్తియగువంత వరకు మనము మిత్రులుగా నుందము. మీరు యీ కార్యములో సహకరించగలరని నే నాశిస్తున్నాను. ఈ కార్యము చాల క్లిష్టమైనది కాని దీనివలన కలుగు విశేష ఫలితము దృష్ట్యా యీ కార్యము చేబట్టదగినదని నా అభిప్రాయము'' బలిచక్రవర్తి ఆమోదము తెలుపగా, అతని సహచరులైన శంబరుడు, అరిష్టనేమి, త్రిపురులు కూడ మెచ్చుకొనిరి వారు తమ మధ్య నున్న శత్రుత్వమును తాత్కాలికముగా విస్మరించుటకు నిశ్చయించుకొనిరి. అందరు కలిసికట్టుగా అమృతమును సాధించుటకు ప్రయత్నింప నిశ్చయించుకొనిరి.

ప్రతి ఒక్కరూ ఉత్సాహముతో నుండిరి. అసురులు తమ బలమైన బాహువులతో భూమినుండి మందర పర్వతమును పెకలించగా, దేవతలు, అసురులు కలిసి, దానిని సముద్రతీరమునకు తీసుకువెళ్ళిరి. ఆ పర్వతము అతి బరువుగా నుండుటచే, మార్గమునందు అది క్రిందజారిపడినది. అనేకమంది దేవతలు, అసురులు దాని క్రిందపడి అణగిపోయిరి. ఈ దారుణ సంఘటన నుండి వారు తేరుకొనునంతలో నారాయణుడు వారికి ప్రత్యక్షమయ్యెను ఆ పర్వతము నతడు యెత్తి సముద్రతీరమున చేరవేసెను. ఇంతకు మునుపే దేవతలు వాసుకికి నచ్చజెప్పి, సాగరమథనమందు మందరపర్వతమును చుట్టి, త్రాడుగా నుండి అసురులకు సేవజేయవలసినదని కోరిరి. అమృతములో కొంత భాగము నీయగలమని మాట యిచ్చిరి.

# 90 సాగరమథనము : కూర్మావతారము

దేవదానవులు సాగరమును మథించుట ప్రారంభించిరి. శ్రీమన్నారాయణుడు అక్కడనే యుండెను. అతడు వాసుకి తలవైపునకు వెళ్ళి వాసుకి శిరస్సును తన చేతులతో అదిమిపట్టెను. దేవతలు నారయణు ననుసరించి, వాసుకి శిరస్సుపై చేతులను వైచిరి. ఇది చూచిన అసురులకు ఆగ్రహము వచ్చెను. దేవతలు భగవంతుని నాయకత్వమున వాసుకి శిరస్సు పట్టుకొనుటచేత తమ నవమానించినట్లుగా భావించిరి. వాసుకి తోకను పట్టుకొనుట వారి గౌరవమునకు భంగకరమని అసురులు భావించిరి. తమను తాము ఉన్నతులుగా భావించిన అసురులు యిట్లనిరి. ''మేము పవిత్రమైన వేద శాస్త్రములను నేర్చియున్నాము. ఉత్తమ జన్మల నొందిన మేము బహు దొడ్డ కార్యములు సలిపి లోక ప్రఖ్యాతి పొందియున్నాము. దేవతలైన మీరు యీ సర్పము తలను పట్టుకొని యుండగా, మేము ఆ సర్పము తోకను పట్టుకొనుట మిక్కిలి అవమానకరము. ఈ మథన కార్యములో యిక మేము సహాయపడుటకు నిరాకరించుచున్నాము''.

అసురులు అట్లే స్థిరముగా కదలక నిల్చుండిరి. భగవంతుడు వారివైపు మధురహాసముతో వీక్షించి, వారికి తలను వదలి పెట్టి తోకను పట్టుకొనుటకు వెళ్ళెను. దేవతలు భగవంతుని ననుసరించిరి.

ప్రప్రథమముగా యేర్పడిన అభిప్రాయభేదము సమసిపోయినంతనే, తమ మాట నెగ్గినందుకు అసురులు యెంతగానో సంతోషించిరి. ఆ సంతోషములో అత్యంత ఉత్సాహముతో భగవంతుని నాయకత్వమున నున్న దేవతలతో సాగరమును మథింపజొచ్చిరి.

శక్తిమంతమైన అనేక బాహువులు యీ మథన కార్యమునందు నిమగ్నమై యున్నప్పటికీ, విశేషమైన బరువుచేత మందర పర్వతము సముద్రములో కూరుకుపోయెను. అనుకొనని యీ దారుణ సంఘటనకు దేవ దానవులలో నిరుత్సాహము కలిగెను. మథన కార్యము ప్రారంభించినపుడు విఘ్నేశ్వరుని పూజించక ఉపేక్షించుటచేత, యిటువంటిదేదో జరుగగలదని నారాయణు డూహించెను. నారాయణుడు సముద్రములో నీటి అడుగునకు వెళ్ళి ఘనమైన కూర్మ (తాబేలు) రూపము ధరించి, తన వీపుపై మందర పర్వతమును మోసెను. మందర పర్వతము తిరిగి పైకి లేచుట చూచి దేవ దానవులు హర్షముతో గంతులు వేయసాగిరి. మందర పర్వతము క్రిందికి యెట్లు పోయెనో, తిరిగి అది పైకి యెట్లు లేచెనో అది కొద్దిమంది మాత్రమే యెరుగుదురు. నారాయణుడు మందర పర్వత శిఖరమునకు వెళ్ళి తన సహస్ర బాహువులతో ఆ పర్వతమును స్థిరముగా, తిన్నగా నుండునట్లు సరిచేసెను. అతడు దేవదానవుల హృదయములలో ప్రవేశించి వారికి ఉత్సాహమును కలిగించెను. మథించుచున్న దేవ దానవుల ఉత్సాహమునకు భగవంతుడు కారకుడు; వాసుకి సర్పములోని అవిద్య, అలసత్వములకు కారకుడు భగవంతుడు. మందర పర్వతముపై నున్నది సహస్ర బాహువులు కలిగిన నారాయణుడు, పర్వతము క్రింద నున్నది ఘనమైన కూర్మము (నారాయణుని అవతారము). అసుర స్వభావము, దైవిక స్వభావము, మందర పర్వతము యొక్క స్థిర స్వభావము — అన్నియు ఆ నారాయణుడే. అతడు ఇచ్చటా, అచ్చటా, అంతటా వ్యాపించి యున్నాడు.

మథనము సాగుచుండెను. క్రమక్రమముగా తీవ్రత హెచ్చుచుండెను. ఇరుప్రక్కల నుండి అతిశక్తివంతముగా లాగుటచేత, వాసుకి భరించలేకుండెను. సర్పము నోటి నుండి అగ్ని, విషవాయువులు చిమ్మెను. తలను పట్టుకున్న అసురులకు యిది బాధాకరమయ్యెను. కాని వారు యేమియు చేయలేకపోయిరి.

ఆ విషవాయువులు వలన అందరకూ శ్వాస ఆడక యిబ్బంది కలుగుట చూచిన నారాయణునకు జాలి కలిగెను అనంత కరుణాసముద్రుడైన నారాయణుడు, వాతావరణము చల్లబడునట్లుగా వర్ష మేఘముల నాదేశించెను వర్షముపడి, సముద్రము నుండి వీచు శీతల వాయువులు వాతావరణమును చల్లబరచినవి తిరిగి మధనము కొనసాగెను

అమృతము లభించు సూచన లేవియు కన్పించుటలేదు మధించుచున్న దేవదానవులకు మరింత ఉత్సాహము కల్గించుటకు భగవంతుడు వారితో చేరి మధించుచుండెను నల్లని వర్షమేఘము బంగారు పట్టువలువ కప్పుకొన్నట్లుగా అతడు నిల్చుని యుండెను. నారాయణుడు వారితో కలిసి మధించునపుడు, అతని చెవులకు చేప ఆకారములో నున్న తాటంకములు కనిపించుచూ మరుగవుచూ, మెరుపు తీగవలె మెరయుచుండెను అలసటలో తలమీది వెంట్రుకలు ముఖముపై పడునపుడు, వాటిని తిరిగి తల ఆడించి వెనుకకు నెట్టు చుండెను. అతని కంఠములో నున్న హారము అటు యిటు ఊగుచుండెను అలసట చేత అతని కళ్ళు యెరుపెక్కెను ఈలోకమునకు ఆశ్రయమైన అతని బాహువులు, మధించుట తప్ప యింక యితర కార్యమేదియూ లేనట్లు క్రిందకూ మీదకూ ఊగుచుండెను అతనిని పరికించిన వారికి అత్యద్భుతముగా, సముద్రతీరమున మరియొక పర్వతము తేజస్సుతో ప్రకాశించుచున్నట్లు గోచరించెను

సముద్రములోని నీరు, మథించుటకు ప్రయోగించిన ఓషధుల రసముతో నిండి, పాలవలె తెల్లగా నుండెను అమృతము లభించు జాడలు కన్పించకుండెను నిరాశ పొందుచున్న దేవదానవుల నుత్సాహపరచుటకు భగవంతుడు మథము కొనసాగించుచుండెను

మథనము కొనసాగుచుండెను సముద్రములోని చేపలు, తిమింగిలములు మున్నగునవి నిర్దాక్షిణ్యముగా అటు నిటు చెల్లాచెదరై పోవుచుండెను. సాగర మథనము కొనసాగుచునే యుండెను

## 91 కాలకూటము

వారట్లు మథనము గావించుచుండగా, సముద్ర ఉపరితలముపై యేదో పైకెగయుచున్నట్లు గోచరించెను. వారు దానిని పూర్తిగా గాంచక మునుపే, వారికి ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అయ్యెను. అది హాలాహల మను భయంకర విషము నారాయణు డిదివరకే దేవతలను యీ విషయమున హెచ్చరించి యుండెను కాని వారు ఊహించిన దానికంటె యీ హాలాహలమను విషము భయంకరముగా నుండెను ఆ విషము అంతటా ప్రసరించెను ఆ విషము తీవ్రతకు వాతావరణమంతయు కలుషితమయ్యెను ఎవ్వరునూ దాని తీవ్రతను భరించలేకుండిరి. వాసుకిని పట్టుకున్న దేవదానవులు, ఆ సర్పమును వదలిపెట్టి అతివేగముతో దూరముగా పారిపోయిరి. కాని ఆ విషవాయువులు వారి ననుసరించెను. దేవతలు మహాదేవుని పాదములపైబడి అతనిని ప్రార్థించి యిట్లనిరి. ''మహాదేవా! నీవు సర్వ దేవతలకు దైవము లోక రక్షకుడవు ఈ విషము మాకు భయభ్రాంతులను కల్గించుచున్నది. మమ్మలను రక్షించవలెను'' తనను వేడుకొనుచున్న దేవతలను జూచి మహాదేవుడు కరుణాభరితుడయ్యెను.

తన భార్యవైపు జూచి అతడిట్లనెను ''సముద్రము నుండి ఆవిర్భవించిన యీ భయంకర కాలకూట విషము బారినుండి రక్షింపమని నన్ను ప్రార్థించుచున్న యీ దేవదానవులను చూడుము నన్ను విశ్వసించిన వారిని రక్షించుట నా ప్రధమ కర్తవ్యము కాబట్టి నేను యీ విషమును మ్రింగి, నన్ను ప్రార్థించుచున్న వీరిని రక్షించెదను'' లోకమాత చిరునవ్వుతో తన ఆమోదమును తెలిపెను మహాదేవుడు కాలకూట విషమును తన చేతిలో తీసుకుని మ్రింగెను ఆ విషము మహాదేవుని కంఠములో ప్రవేశించి, అప్పటి నుండి అచ్చటనే యుండెను అందుమూలముగా అతని తెల్లని కంఠము నీల వర్ణము దాల్చెను. అయితే నీలవర్ణము దాల్చిన కంఠము అతని సౌందర్యము నినుమడింపజేసెను. ఒక నల్లని మణిని కంఠమున ధరించి నట్లుండెను సత్పురుషులు బాధలను తాము స్వీకరించి, వారికి బాధా నివృత్తి గావింతురు ఈ విధముగా మానవులు భగవంతుని చర్యలను అనుకరించినచో, యీ లోకమును సృష్టించిన ఆదిపురుషుడైన ఆ నారాయణుడికి యింతకన్న ప్రీతికరమైనది వేరొకటి ఉండదు.

కాలకూట విషమును మ్రింగినపుడు, ఒకే ఒక్క చుక్క మహాదేవుని చేతి నుండి జారి నేలపై పడెను దానిని సర్పములు, వృశ్చికములు, యితర విషకీటకములు, కొన్ని లతలు గ్రహించెను ఈ విషమును గ్రహించిన లతలను విష వృక్షములుగా పరిగణించుటచే, వానిని తేనెటీగలు, పక్షులు, జంతువులు పరిహరించెను

## 92 లక్ష్మీదేవి ఆవిర్భవించుట

మహాదేవుడు కాలకూట విషమును స్వీకరించిన తర్వాత, దేవదానవులు తిరిగి సాగరమధనము సాగించిరి అట్లు చేయుచుండగా కామధేనువను గోవు సముద్రము నుండి ఆవిర్భవించెను వేదశాస్త్రములు, వైదిక కర్మలందు నిమగ్నమైన ఋషులు, హవిస్సును సమకూర్చుకొనుటకు (గోవుపాలు, వెన్న నుండి దీనిని చేయుదురు) యీ గోవు తోడుపడునని తలంచిరి యజ్ఞములలో హవిస్సును అగ్నిదేవుకి నిరంతరముగా సమర్పించెదరు

అటు తర్వాత కుందపుష్పమువలె నున్న తెల్లని గుర్రము — ఉచ్చైశ్శ్రవము — ఆవిర్భవించెను. ఈ గుర్రమును బలిచక్రవర్తి కోరెను నారాయణుని సలహాను ఇంద్రుడు జ్ఞప్తికి తెచ్చుకుని ఆ గుర్రమును బలిచక్రవర్తికి వదలిపెట్టెను అటు పిమ్మట ఆ సాగరము నుండి మహాదేవుని నివాసమైన కైలాసముతో సరి సమానమైన, బ్రహ్మాండమైన తెల్లని ఏనుగు ఆవిర్భవించెను దానికి వు ఐరావతమనే ఆ యేనుగును ఇంద్రుడు గైకొనెను తర్వాత అతి సుందరమైన, పద్మము రంగులో నున్న కౌస్తుభ మణి లభించెను దానిని ఆభరణముగా ధరించెదనని నారాయణుడు స్వీకరించెను. పిమ్మట పారిజాత వృక్షము, ఆ వృక్షముతోబాటు అందమైన అనేకమంది వనితలు వచ్చిరి. ఆ వనితలు అందమైన వస్త్రములు ధరించిరి వారు కంఠము నందు బంగారు హారములు, చే ధరించి యుండిరి వారి నడక తీరు అత్యంత రమణీయముగా నుండెను హావభావములు దేవతలకు ప్రీతి కలిగించెను వారు అప్సరసలు వారిని, పారిజాత వృక్షమును ఇంద్రుడు చేబట్టెను అసురులకు వీనిపై అపేక్ష లేకుండుటచే, దేవతలు వానిని తీసుకొనిరి

మెరుపుచేత సుధామమను కొండ ప్రకాశించినట్లు, సముద్రము నుండి అతి లావణ్యమైన లక్ష్మి రూపము

ఆవిర్భవించెను దేవదానవులందరూ ఆమెను కోరిరి ఆమెనుండి వారు దృక్కులను మరల్చలేకపోయిరి ఆమె ఆసీనురాలగుటకు సింహాసనము తెచ్చుటకై ఇంద్రుడు త్వరత్వరగా వెళ్ళెను నదులు రూపము ధరించి బంగారు పాత్రలలో ఆమె కొరకు జలము తీసుకువచ్చెను భూమాత లక్ష్మీదేవి అభ్యంగనమునకు కావలసిన పవిత్ర మూలికలను తెచ్చెను గోవులు పాలను పిదికెను వసంతుడు, చైత్రవైశాఖములందు మాత్రమే పుష్పించు పుష్పములను తెచ్చెను ఋషులు ఆమె చేత పవిత్ర స్నానము నాచరింపజేయగా, గంధర్వులు ఆమెను కీర్తించుచు గానముచేసిరి గంధర్వ వనితలు ఆమె యెదుట నాట్యము చేయగా, మేఘములు సంగీతమును వర్షించెను. దిక్కులను గాచుచున్న దిగ్గజములనే యేనుగులు తమ తొండములతో నీరు తెచ్చి ఆమె నభిషేకించెను సముద్రుడు ఆమె ధరించుటకు పట్టు వస్త్రములను తెచ్చెను వైజయంతి యను హారమును వరుణుడు తీసుకువచ్చెను ఆ హారమును తుమ్మెదలు చుట్టుముట్టెను విశ్వకర్మ అద్భుతముగా పొదిగిన మణులను తెచ్చెను సరస్వతీదేవి ముత్యాలహారమును యిచ్చెను బ్రహ్మ పద్మమును, నాగలోకవాసులు చెవుల తాటంకములను తెచ్చి యిచ్చిరి లక్ష్మీదేవి చేతిలో పద్మములతో కూర్చిన హారమును పట్టుకుని పెదవులపై సిగ్గుతో కూడిన హాసము చిందగా, వారందరి మధ్య సంచరించెను

తన భర్తను యెన్నుకొనుటకు చుట్టూ పరికించి చూచెను యక్షులు, గంధర్వులు, సిద్ధులు, చారణులు, దేవతలు అచ్చట నుండిరి అసురులందరు అచ్చట నుండిరి కాని వారిలో నెవరినీ ఆమె అంగీకరించలేదు అచట నున్న ఋషులను గాంచి ''వారు తపస్సంపన్నులయినప్పటికీ, ఆగ్రహమును జయించలేదు. బృహస్పతి, ...ులయిననూ, వారికి వైరాగ్యము గురించి తెలియదు. చంద్రుడు యువకుడు, సౌందర్యవంతుడు కాని అతడు కామ తృష్ణను జయింపలేకుండెను ఇంద్రుడు స్వర్గమునకు అధిపతి అయినప్పటికి, కోరికలను జయించలేకుండెను ప్రతిఒక్కరిలో యేదో ఒక లోపము స్పష్టముగా కానవచ్చుచుండెను నారాయణుడు తప్ప, యితరులెవరూ దోషరహితులు కారు అతడు సర్వసంపూర్ణుడు అందుచే అతడు నన్ను కోరడు'' త్రిగుణములైన సత్త్వరజస్తమో గుణముల కతీతుడు, అందరివలె యెట్టి ప్రలోభములకు లోనుగానివాడు, వీచే వాయువులకు తబ్బిబ్బు చెందక ప్రశాంత సరస్సువలె నున్న నారాయణుని ఆమె గాంచెను ఆమె నారాయణుని వద్దకు నడచి, ఆమె చేతిలోని పద్మహారమును అతని మెడలో వైచి, ప్రక్కనే నిలుచుండెను భగవంతు డామెను స్వీకరించి, తన వక్షస్థలముపై నుంచెను. ఆ పవిత్ర దంపతులు పిడుగుతో కూడిన మెరుపువలె అత్యంత వైభవముతో ప్రకాశించిరి

సాగర మథనము తిరిగి కొనసాగెను ఇంతలో పద్మములవంటి నేత్రములు కల్గిన ఒక అందమైన యువతి ఆవిర్భవించెను. ఆమె పేరు వారుణి, చాల ఆనందము కల్గించునది, బాగా మత్తు నిచ్చే ద్రవము అసురులు ఆమెను తీసుకొనిరి

## 93 అమృతము లభించుట

మథనము సాగుచుండెను సముద్రము నుండి ఒక దివ్యరూపము ఉన్నట్లుండి ఆవిర్భవించెను అతడు పల్లగా పొడవైన బలము కలిగిన బాహువులతో నుండెను ఆ యువకుని మెడలో ఒక హారము గలదు అతని

వక్షస్థలము చాల విశాలముగను, శక్తిమంతమైనదిగా గోచరించెను విలువైన మణులతో పొదిగిన బంగారు ఆభరణములు అతడు ధరించియుండెను. పసుపు పచ్చని వస్త్రము ధరించిన ఆ యువకుని మణులను ధరించిన చేతులు ఒక బంగారు పాత్రను పట్టుకొని యుండెను. అతడు నారాయణుని అవతారమైన ధన్వంతరి దేవదానవులు తన కార్యము సమాప్తమైనదని గ్రహించిరి బంగారు పాత్రయందు పవిత్రమైన అమృతముండెను అసురులు వాసుకిని వదలిపెట్టి త్వరత్వరగా ధన్వంతరి వద్దకు వచ్చిరి అతని చేతుల నుండి ఆ పాత్రను అసురులు లాగికొని అక్కడ నుండి పారిపోయిరి. అనుకొనని యీ సంఘటనను చూచి దేవతలు నిశ్చేష్టులైరి వారు నారాయణుని పాదములపై పడగా, అతడు చిరునవ్వు నవ్వి యిట్లనెను ''అమృతము మీ కొక్కరికే దక్కునని యిదివరకే చెప్పినాను మీ చింతలను నాకు వదలిపెట్టుడు'' అసురుల వింత చర్యలను అతడు గమనించుచుండెను

అమృతమును యెవరు మొదట రుచి చూడవలెనను విషయముపై అసురులలో తీవ్ర వాదోపవాదములు సాగెను. వారిలో ధర్మశీలురైన అసురులు కొందరు యిట్లనిరి ''ఈ మథనము ఒక యజ్ఞము వలె సాగినది దేవతలతో కలిసి మనము యీ కార్యమును నిర్వహించితిమి అమృతములో వారి భాగము వారి కిచ్చుట సమంజసము'' కాని బంగారు పాత్రను చుట్టుముట్టిన అసురులెవరును యీ మాటలను వినిపించుకొనలేదు కొద్దిసేపట్లో సముద్ర తీరమునకు దూరముగాపోయి, అమృతమును మొదట యెవరు రుచి చూడవలెనను విషయముపై వాదించుకొనుచుండిరి

ఒక్కసారిగా నిశ్శబ్దమావరించెను ఇంతవరకూ కొనసాగిన తీవ్ర వాగ్వాదన ఒక్కసారిగా స్తంభించిపోయెను అందరి కన్నులు యెదుట వచ్చుచున్న వ్యక్తిపై పడెను ఆ వ్యక్తి ఒక స్త్రీ ఆమె అత్యంత సౌందర్యముతో నున్నది ఇదివర కెన్నడును అంతటి సౌందర్యవతిని వారు చూచి యుండలేదు ఆమె ముఖములోని ఆకర్షణ, సౌందర్యము, యిదివరకెన్నడునూ చూడనిది ఆమె నేత్రముల వంటి నేత్రములను వారింతకు ముందు చూచియుండలేదు ఆమె నేత్రములు, చిక్కని నీలిరంగు పద్మములవలె నుండెను ఆమె లావణ్యము అవయవ సౌందర్యము తీర్చిదిద్దినట్లుండెను ఆ అసురులు ఆమె నుండి దృక్కులను మరల్చుకొనలేకపోయిరి

వారు ఆమెను సమీపించి, చుట్టును మూగి ప్రశ్నల వర్షము కురిపించిరి

''నీవు యెవరో మాకు చెప్పవలెను నీ నేత్రములు పద్మముల కంటె అందముగా నున్నవి నీ చిరునవ్వు మమ్ములను ముగ్ధులను చేయుచున్నది నీవు యేది అడిగిన అది చేయుటకు సిద్ధము మేము కశ్యపుని పుత్రులము, అసురులము ఈ బంగారు పాత్రలోని అమృతము కొరకు మేము పోట్లాడుకొనుచుంటిమి దీనిని నీవు తీసుకొనుము ఎవరు దీనిని ముందుగా రుచి చూడవలెనను నిర్ణయము నీకు వదలి పెట్టుచున్నాము బయట నుండి వచ్చిన నీవు నిష్పక్షపాతముగా నుండగలవు. నీకు తోచిన విధముగా యీ అమృతము పంచిపెట్టుము''

దేవతలకు లాభము చేకూర్చుటకై నారాయణుడు మోహిని అవతారము ధరించెను. ఆమె చిరునవ్వు వారికి మిక్కిలి హర్షదాయకముగా నుండగా, వారితో ఆమె యిట్లనెను. ''కశ్యప పుత్రులారా! మీకు అపరిచితురాలనైన నమ్మకము కుదిరెను? నేను స్త్రీని, నా చూపులు ' ' నున్నట్లు తోచుచున్నది పురుషులలో కామ ప్రవృత్తిని కల్గించే స్త్రీలను నమ్మకూడదని బుద్ధిమంతు లెరుగుదురని జ్ఞానులు చెప్పుదురు ఆ విధముగా నమ్ముట తోడేలును నమ్ముట వంటిది''

దానిని యెట్లు యెదుర్కొనవలెనో వారికి తెలియకుండెను భక్త సంరక్షణమే ప్రధమ కర్తవ్యముగా యెంచు శ్రీమన్నారాయణుడు అచట అవతరించెను అతని సమక్షములో బలి చక్రవర్తి మాయ ఆయుధములు నిష్ప్రయోజనము అయ్యెను భగవంతుని గూర్చిన చింత మాయను పారద్రోలగలదు అటువంటపుడు భగవంతుని సమక్షములో మాయ యెట్లు నిలువగలదు? మెలకువ కల్గినంతనే స్వప్న లోకము కరగిపోయినట్లు మాయ పటాపంచలగును

కాని బలి వెనుదిరుగికుండెను. అనేక ఆయుధములతో నారాయణునిపై దాడి చేసెను బలి అనుయాయుడైన కాలనేమి ఒక పొడుగైన ఆయుధమును నారాయణునిపై విసరగా, దానిని పట్టుకుని తిరిగి కాలనేమివైపు విసరెను ఆ తీవ్రతకు కాలనేమి మృతి చెందెను. భగవంతుని సుదర్శన చక్రముచే మాలి, సుమాలి హతులైరి

ఇంద్రుడు బలి చక్రవర్తిని ద్వంద్వ యుద్ధమున కాహ్వానించెను. అతిడిట్లనెను ''ఓరి మూర్ఖుడా! మాంత్రికుని వలె మాయ పన్నాగములు అవలంబించినావు నీ శక్తులు యెంత నిష్ప్రయోజనములో గాంచలేవా? ఇదిగో చూడుము ఈ వజ్రాయుధముతో నీ తలను వేయి ముక్కలు చేయుదును. నీ మరణమునకు సిద్ధపడుము''

బలి ఇంద్రుని చూచి చిరునవ్వు నవ్వి మంద్ర స్వరముతో యిట్లనెను. ''యుద్ధము చేయుటకు పూనుకొనిన వారు, కాలప్రేరితులై తమ కర్మఫలానుసారియైన, ఒక ప్రత్యేకమైన కార్యాచరణ పద్ధతి నవలంబించెదరు జరుగబోవు దానిని నిర్ణయించుట వారి చేతులలో లేదు. అట్టివారికి విజయముగాని, పరాజయముగాని సంభవించుట తప్పదు. అట్లు జరుగటయే న్యాయము అట్లు జరిగినపుడు యిది కాల నిర్ణయమని జ్ఞానవంతులు భావించి, సమదృష్టితో, అనగా సంతోషించుటగాని విచారించుటగాని లేక యుందురు అటువంటి జ్ఞాన సంపద నీకు సంప్రాప్తించలేదని తెలియును. విజయము, కీర్తిని అనుభవించు దేహమును ఆత్మయని పొరపాటుగా భావించు నీకు నిరంతర విచారము, అసంతృప్తి తప్పవు మూర్ఖుడవైన నీవు, నీ పరుష వాక్కులతో బాధింపగలనని తలపోయుచున్నావు. కాని ఆ మాటలను మేము లక్ష్యపెట్టుటలేదు వానిని నీచాతి నీచముగా పరిగణించెదము''.

బలి చక్రవర్తి నిష్ఠుర వాక్కులకు ఇంద్రుని క్రోధము అవధులను దాటెను అవి సత్యములగుటచేత ప్రతి ఒక్కమాట ఇంద్రునికి బాధను కల్గించి అతని కోపమును ద్విగుణీకృతపరచెను ఇంద్రుడు వజ్రాయుధమును బలిపై ప్రయోగింపగా, బలి నేలపై బడెను. బలి స్నేహితులు వచ్చి ఆ ప్రదేశము నుండి బలిని తీసుకుపోయిరి. కొన్ని క్షణముల తర్వాత తిరిగి వచ్చి ద్వంద్వ యుద్ధము కొనసాగించెను వారిరువురి మధ్య తీవ్రముగా జరుగుచున్నపోరు ఒక క్షణమైనను సడలక సాగుచుండెను.

నముచి మహాశక్తిమంతుడైన రాక్షసుడు. అతడు శక్తిమంతమగు అస్త్రములను ప్రయోగించి ఇంద్రునిపై దాడిచేసెను. వారు చాల కాలము పోరాడిరి నముచి అనుయాయులు చాలమంది మరణించగా, వారిరువురి మధ్య జరుగుచున్న పోరాటము తీవ్రరూపము దాల్చెను ఇంద్రుడు వజ్రాయుధమును నముచిపై విసరెను. అది శత్రువు చర్మపు పై పొరను కూడ అంటకుండుట జూచి ఇంద్రుడు నిశ్చేష్టుడయ్యెను. వృత్రాసురుని సంహరించిన వజ్రాయుధము నముచికి యెటువంటి హాని కలిగించక తిరిగి వెనుకకు వచ్చెను. ఇంద్రుడు ఆలోచనలో మునిగెను. దధీచి యెముకలతో విశ్వకర్మ మలచిన యీ వజ్రాయుధము, వృత్రాసురుని ప్రాణములను హరించిన యీ వజ్రాయుధము, పర్వత పంక్తుల రెక్కలను త్రుంచివేసిన యీ వజ్రాయుధము

యిప్పుడు శక్తిని కోల్పోయెను. ఇది యెట్లు జరిగెను? ఎక్కడ నుండియో అశరీరవాణి స్వరము విన్పించెను అది యిట్లున్నది ''నముచి అనే అసురుడు ఒక వరమును పొంది యున్నాడు ఆ వరము వలన అతడు యెండిన వస్తువులచేత గాని, తడిసిన వస్తువులచేతగాని మరణములేక యుండును ఈ వరమును బ్రహ్మ ప్రసాదించెను దీనిని ఉల్లంఘించు మార్గము నొకదానిని నీవు కనుగొనవలసి యున్నది'' ఇంద్రుడు కొంచెముసేపు ఆలోచనలో పడెను అతని కనులు సముద్రతీరమున వచ్చు అలలపై నిలిచెను. అలల నుండి ఉత్పన్నమయే నురుగును చూడగా అతనికొక ఆలోచన స్ఫురించెను ఇందు తనకు వినియోగించు ఆయుధము కలదని భావించెను ''సముద్రము అలల నుండి వచ్చు నురుగు యెండినది, తడిసినది కాదు. అందుచే యిది ప్రస్తుత ప్రయోజనము కుపకరించును''. అని ఇంద్రుడు తలచెను. చేతినిండుగా నురుగును తీసుకుని నముచి ముఖముపై విసరెను వెంటనే నముచి నేల గూలెను.

ఇంద్రుడు సాధించిన యీ ఘనకార్యమునకు స్వర్గమునుండి పుష్పవర్షము గురిసెను.

దేవదానవ సంగ్రామము కొనసాగునా యనిపించెను ఇంతలో బ్రహ్మ పుత్రుడు నారదుడు అచటికి వచ్చి, వారితో యిట్లనెను ''మీరు అమృతము కోరిరి నారాయణుని ఆశ్రయించిన మీరు అతని అనుగ్రహముచేత అమృతము పొందిరి. నారాయణుని సతీమణి లక్ష్మీదేవి మీ పక్షమున నున్నది ఈ యుద్ధము విరమించి మీ స్వస్థలమునకు వెళ్ళిరండు'' దేవతలు అందుకంగీకరించిరి. అయితే అసురులు కూడ అంగీకరించవలసి యున్నది ప్రస్తుతము అదృష్టము వారిపక్షమున లేదని తెలుసుకొనిరి. తలలు వ్రేలవైచుకొని, వారి వారి గృహములకేగిరి

## 95 బలిచక్రవర్తి

బలిచక్రవర్తి సంపదను, కీర్తిని ఇంద్రుని మూలముగా పోగొట్టుకొనెను విశాల హృదయుడగు యుద్ధములో పరాజయము కలిగినందుకు విచారించకుండెను. తన జీవితమునకు భృగుమహర్షి కారకులు బలి ఉత్తమ జీవి తనకొరకై అతడు విచారించుటలేదు. ప్రస్తుత దుఃఖస్థితికి తన నిందించుకుని కాలము వ్యర్థము గావించలేదు

అతని గురువైన శుక్రాచార్యుని వద్దకు వెళ్ళి శరణుజొచ్చెను. బలి శుక్రునితో యిట్లనెను ''ప్ర మీరు నాకు గురువులు, రక్షకులు మీరు యేది చెప్పిన అది చేయుటకు సిద్ధముగా నున్నాను. నేను వాడను నన్ను మీ యిచ్ఛవచ్చినట్లు నియోగించుకొనవచ్చును క్లిష్టపరిస్థితులలో సహాయము కోరివచ్చి శిష్యుని యే గురువు వదిలిపెట్టడని నే నెరుగుదును''

బలి హృదయములో నున్న కోరికను శుక్రాచార్యుడు కనిపెట్టెను. స్వర్గమును జయించవలెనన్నదే అతని కోరిక దానిని ముందుగా ఊహించిన శుక్రాచార్యుడు బలికి మహాభిషేకము చేసి యిట్లనెను. ''నీ కొరకు మేము ఒక యజ్ఞము జరిపెదము అది నీ కోరికను తీర్చగలదు'' బలిచక్రవర్తిని శక్తిమంతుని జేసి ఇంద్రుని ఓడించి స్వర్గమును జయించునట్లు చేయుటకు శుక్రాచార్యుడు నిశ్చయించుకొనెను బలి విశ్వజిత్తు అను యజ్ఞమును జరుపుటకు అన్ని సన్నాహములు జేసెను. పవిత్ర హవిస్సుతో అగ్నిని పూజించి, మంత్రోచ్చార

ణము గావించిరి. ఇది చాలసేపు కొనసాగెను. హోమగుండము నుండి ఎర్రగా ప్రకాశించే బంగారు రథమొకటి ఆవిర్భవించెను. గుర్రములు ఇంద్రుని గుర్రముల వలెనున్నవి. రథమునకు సింహముతో సలంకరించిన జెండాకట్టి యుండెను. రథములోపల ధనుస్సు అంచులు బంగారముతో తీర్చిదిద్దియున్నవి. దానితో బాటు యెప్పుడూ నిండుగా నుండే అమ్ములపొది, దివ్యకవచము కూడ గలవు. హోమగుండము నుండి రథము ఆవిర్భవించిన తర్వాత బ్రహ్మ బలివద్దకు వచ్చి — యెన్నడూ వాడనటువంటి పుష్పహారము నొకదానిని తెచ్చి యిచ్చెను. గురువు శుక్రాచార్యుడు బలికి ఒక శంఖము నిచ్చెను. ఈ మహాకార్యము జరుగుటకు కారకులైన వారందరికీ బలి ప్రదక్షిణము చేసి నమస్కరించెను.

బలిచక్రవర్తికి చెడు దినములు అంతము కాగా ఇదివరకు వలె అతడు నిబ్బరముగా నుండెను. నూతనముగా సంక్రమించిన శక్తిచేత, యింతకు పూర్వము కన్న యిప్పుడు అతనిలో కళాకాంతులు పెరిగి వైభవము యినుమడించెను. పెద్దసైన్యము సమకూర్చుకుని ఇంద్రుని నగరము వైపు వెడలెను. దివ్యకవచమును ధరించి అమ్ములపొదిని భుజమునకు తగిలించి, బంగారపు అంచులతో నున్న ధనుస్సును చేతబట్టి, బంగారు రథము నం దాసీనుడయ్యెను. అతని శక్తిమంతమైన బాహువులకు ధరించిన బంగారు భుజకీర్తులు తళతళ మెరయు చుండగా, చెవులకు ధరించిన పచ్చలతో పొదిగిన కుండలములు ప్రకాశించుచూ, బలిచక్రవర్తి 'ఆహవనీయ' మను అగ్నివలె గోచరించెను. అతని ననుసరించిన సేనలు, చూచినవారి హృదయములో భయమును కల్గించెను.

తన వెంట సేన రాగా, బంగారు రథమున ఆసీనుడైన బలి ఇంద్రుని అమరావతీ నగరమునకు ప్రయాణించెను.

అమరావతి అత్యంత సుందరమైన నగరముగా పేరు గాంచెను. స్వర్గాధిపతియైన ఇంద్రుని సుఖసంతోషము లకు అది నిలయము. స్వర్గవాసులకు సుఖసంతోషములను కల్గించు అందమైన వస్తువులన్నియు అచ్చట కలవు. అచట అనేక తోటలు ఫలపుష్పలతా వృక్షములతో నిండియుండెను. తుమ్మెదలు, పక్షులు చేయు సంగీతము యెల్లపుడూ వినవచ్చుచుండెను.

నగరము చుట్టూ లోతైన కందకము గలదు. నగరము లోపల నున్న కోట దానిని రక్షించుచున్నది. బంగారు వెండి అంచులతో మెరయుచున్న గృహద్వారములు నగరమునకు శోభను కూర్చుచున్నవి. అమరావతి నగర నిర్మాణమునకు విశ్వకర్మ ప్రత్యేకమైన శ్రద్ధ వహించి దానిని అందముగా తీర్చిదిద్దెను. ఆ నగరమందు యెట్టి దోషములను లేవు. వీధులు వెడల్పుగా పరిశుద్ధముగా నుండెను. అచట నివసించు స్త్రీల కొప్పులనుండి జారిపడిన పువ్వులు ఆ వీధులందు గోచరించుచుండెను. అచట ముసలితనమనే పదమునకు తావు లేదు. అసహ్యకరమైన దేదియు కానరాదు. సంగీతము, సువాసనలు, అందము, ఒకటేల అన్నియు అతి దివ్యముగా నుండి, మానవుని మనస్సు ఊహించ గలిగినవన్నియు ఆ అమరావతి నగరమున లభ్యమగుచుం డెను.

ఇంద్రుని, అతని సేనను ఓడించి అమరావతి నగరమును జయించవలెనను తలంపుతో బలిచక్రవర్తి ఆ నగరమువైపు వెళ్ళెను. అమరావతీపుర ద్వారములు సమీపించినంతనే, బలి శంఖమును గట్టిగా ఊదెను. ఇంద్రుడు బలిని చూచెను. అతని బంగారు రథమును, దివ్యకవచమును, ధనస్సును, అమ్ములపొదిని గాంచెను. అతని వెంటనున్న పెద్ద సైన్యమును కూడ ఇంద్రుడు చూచెను. బలితో యుద్ధము చేసినచో కలుగు పరిణామమెట్లుండునో ఇంద్రుడు తొందరగానే ఊహించగలిగెను. త్వరగా గురువైన బృహస్పతి కడకేగి యిట్లనెను. ''గురుదేవా! మన పురాతన శత్రువు తిరిగి యుద్ధమునకు సిద్ధపడినాడు. అతనిని యిప్పుడు

ఓడించుట సాధ్యముకాదని తోచుచున్నది. అతడు అంత శక్తిమంతుడెట్లయ్యెను? అతడెట్లు అజేయుడయ్యెను? అతడు శారీరికముగా, నీతి పద్ధతిని, అధ్యాత్మికముగా మహాశక్తిమంతుడు. అగ్నివలె ప్రకాశించు అతనికీ ప్రకాశమెట్లు కలిగెను? నాకు యిదంతయు చిత్రముగా నున్నది''.

బృహస్పతి యిట్లనెను. ''అతని గురువు మూలముగా బలి మహాశక్తిమంతుడయ్యెను. ఒకప్పుడు దిగజారు చున్న అతని శక్తిసామర్థ్యములను, శుక్రాచార్యుడు యినుమడింపజేసెను. నిజముగా యోచించిన, బలి ధాటికి నారాయణుడు తప్ప యింకెవ్వరు నిలువలేరు. నీవు యిప్పుడు వివేకముతో విశ్లేషణ సలిపి తగిన చర్యలు తీసుకోవలెను. ప్రస్తుతము నీవు బలిని ప్రతిఘటించుట వట్టి మూర్ఖత్వము. అది నిష్ప్రయోజనమగును. కాలము నీకు ప్రతికూలముగా నున్నది. ఇప్పుడు నీవు, యితరదేవతలు అమరావతి నగరము విడిచి వెళ్ళుటయే ఉత్తమమైనది. మీరు విడిచి వెళ్ళిన తర్వాత యీ నగరమును బలి స్వాధీనము చేసుకొనును. కొలది కాలములో, యే గురువు (శుక్రుడు) కారణముగా బలి మహాశక్తిమంతుడయ్యెనో, ఆ గురువు ఆగ్రహమునకు గురియై తన శక్తిసామర్థ్యములను కోల్పోవును. ప్రస్తుత పరిస్థితులలో, మీరందరూ యీ నగరము విడిచి పారిపోవుటయే శ్రేయస్కరము''.

ఇంద్రుడు తీరని దెబ్బతిన్నవానివలె గోచరించెను. ''అమరావతిని వదలి పారిపోవుటయా! అత్యంత ప్రియమైన యీ నగరమును నా శత్రువు చేతులో యెట్లు వదలగలను? కాదు, నేను యుద్ధము చేసెదను. ఏమి జరిగిననూ సరే. మేము శక్తి హీనులము కాము. మేము దేవతలము. బలి కేవలము ఒక అసురుడు. నేను అమరావతిని విడిచిపెట్టను''.

అమరావతిని వదలిపెట్టుటయే శ్రేయస్కరమని బృహస్పతి ఇంద్రునకు నచ్చజెప్పెను. లేకున్న దేవతలకు అనవసరముగా తీవ్రకష్టములు కామాంధులైన అసురులచే కలుగగలవని చెప్పెను. చివరకు ఇంద్రుడు గురువు సలహా ననుసరించి, యితర దేవతలతో కలిసి అమరావతి నగరము విడిచి పారిపోయెను.

యుద్ధము చేయవలసిన అవసరము లేకుండ, అమరావతి నగరము స్వాధీనమైనదని బలి తలపోసెను. దేవతల అధైర్యమును చూచి యేవగింపుతో నవ్వెను. బలి అమరావతి నగరమున స్థిరపడి, స్వర్గమున యీలోకము నేలుచుండెను. ముల్లోకములకు అతడు ప్రభువయ్యెను. ఇంక జయించవలసినదేదియు అ లేకుండెను. అశ్వమేధయాగము జరుపమని గురువు శుక్రాచార్యుడు బలితో చెప్పెను. బలి చక్రవర్తి నూ అశ్వమేధయాగములను జరిపెను. చంద్రుని వెన్నెల ప్రసరించినట్లు, బలిచక్రవర్తి కీర్తి లోకమంతటా వ్యాపిం చెను. అతని మంచితనము, ఔదార్యము, అనేకమైన యితర సద్గుణములు లోకములో అందరకూ తెలిసెను.

## 96 వామనావతారము

ఇంద్రుని, అతని సోదరులను బలి సునాయసముగా జయించుటచేత, ఇంద్రునితల్లి అదితి, విచారముతో నుండెను. ఒకప్పుడు కశ్యపుడు, ఆశ్రమము విడచివెళ్ళి చాలకాలము తీవ్రతపస్సు చేసి సమాధిలో నుండెను. తపస్సు సమాప్తమైన తర్వాత తిరిగి ఆశ్రమమునకు వచ్చెను. తిరిగి వచ్చిన భర్తకు అదితి తగిన మర్యాదలు చేసి అతని ప్రక్క మౌనముగా నిలుచుండెను. అతడు వాడిపోయిన ఆమె ముఖమును గాంచెను. అతడామె

నిట్లడిగెను. ''నీ ఆందోళనకు కారణమేమిటి? నీవు సంతోషముగా లేకుండుట గమనించినాను. నీకు యేమైన ఉపద్రవము సంభవించెనా? లేక యీ లోకమున కేదైన కీడు వాటిల్లెనా? మానవులు అధర్మపరులైతిరా? అనాలోచితముగా వచ్చిన అతిథుల నవమాన పరచగా వారు నీ ఆతిథ్యము స్వీకరించక వెళ్లిపోయినారా? ఏమి జరిగినది? కుమారులందరూ క్షేమమేగదా? నిన్ను చూడగా యేదో తీరని బాధతో సతమతమగుచున్నట్లు ఉన్నావు. అది యేమిటో నాకు చెప్పుము''.

అదితి యింతవరకు దించియున్న కనులను పైకెత్తెను. ఆమెకండ్లు అశ్రువులతో నిండి యుండెను. ఆమె భర్తతో యిట్లనెను. ''నాథా! నీవు భయపడినంత ప్రమాదమేమియూ జరుగలేదు. ఈ ఆశ్రమమునకు యెట్టికీడు వాటిల్లలేదు. నా మట్టుకు నేను యెట్టి అధర్మకార్యమును చేయలేదు. నా పిల్లలకు గల్గిన దుస్థితి నన్ను తీవ్రముగా బాధించుచున్నది. బలిచక్రవర్తి నా కుమారులకు బాధ కలిగించెను. అసురులు దేవతలను అమరావతీ నగరము నుండి తరిమివేసి వారి కీర్తిని, ధనసంపదలను దోచుకొనిరి. నన్ను, నా పుత్రుల యందు కరుణ చూపి, యీ ఉపద్రవము నుండి బయటపడుటకు సహాయము చేయవలెను''.

కశ్యప ప్రజాపతి మందహాసము చేయుచూ సరళముగా ఆమెతో నిట్లనెను. ''భగవంతుని మాయ అతి విచిత్రమైనది. ఈ లోకమంతయు అనురాగ బద్ధమై యున్నది. అదియే అత్యద్భుతమైన విష్ణుమాయ. లేకున్న, పంచభూతములతో యేర్పడిన యీ శరీరమునకు, ప్రకృతికి భిన్నమైన ఆత్మకు యేమి సంబంధము? ఎవరు యెవరికి భర్త యెవరు యెవరికి పుత్రుడు? మాయ చేతనే 'నేను', 'నాది' అని తలంచుట జరుగుచున్నది. నేను తల్లిని, వీరు నాపుత్రులు. వారు విచారముగా నుండుటచేత నేను విచారముగా నున్నాను''. ఒక క్షణమాగి, తిరిగి ఆమెను చూచి యిట్లనెను. ''అందరి హృదయములలో నివసించు నారాయణుని పూజించుట ఒక్కటే నీవు యిప్పుడు చేయవలసినది. అతనిని భక్తితో ప్రేమించి పూజించు వారలను కరుణించి, వారి కోర్కెలను తీర్చును. అతనిని ప్రార్థించి పూజింపుము''. ఆమె కశ్యపునితో యిట్లనెను. ''నేను స్త్రీని. భగవంతుని పూజించు విధానములు నాకు తెలియవు. అనేకులు మహాపురుషులు భగవంతునికి ప్రీతి కలిగించుటకు సంవత్సరముల తరబడి తపస్సు చేయుచున్నారు. నేనొక స్త్రీని. ఆ విధముగా నేనెట్లు చేయగలను? అమాయకులైన నావంటివారు భగవంతుని అనుగ్రహము పొందుటకు సులభమైన మార్గము నొకదానిని సూచించుము''.

కశ్యపుడిట్లు చెప్పెను. ''పయోవ్రతమనునది ఒకటి గలదు. ఒకప్పుడు బ్రహ్మ నాకీ వ్రతమును జెప్పెను. ఫాల్గుణమాస శుక్లపక్షమున పాడ్యమి మొదలు ద్వాదశి వరకు పండ్రెండు దినములు, పగలు రాత్రి నారాయణుని పూజించవలెను. పాలు మాత్రమే నీవు ఆహారముగా తీసుకొనవలెను. ద్వాదశాక్షరమైన యీ మంత్రము — ఓం నమో భవగతే వాసుదేవాయ — నుచ్చరించుచూ పూజించవలెను. భక్తిశ్రద్ధలతో నీవు యీ వ్రతమును ఆచరించిన, భగవంతుడు నీ కోర్కెను తప్పక తీర్చగలడు''.

అదితి పయోవ్రతము నాచరించెను. ఆమె మనస్సు స్థిరముగా నుండి ఇంద్రియములు అదుపులో నుండెను. ఆమె ఆలోచనలను భగవత్పాదములపై కేంద్రీకరించెను. పండ్రెండు రోజుల తర్వాత నారాయణుడు ఆమెకు ప్రత్యక్షమయ్యెను. ఆమెలేచి నిలుచుండెను. పదేపదే నారాయణుని పాదములకు ఆమె ప్రణమిల్లి, చేతులు జోడించి నిలబడి యుండగా ఆమె కనుల నుండి కన్నీరు యేకధారగా కారుచుండెను. ఒక్కమాటయైననూ మాట్లాడలేక పోయెను. కొంతసేపయిన తర్వాత తడబడిన అస్పష్టమైన మాటలు ఆమె పెదవుల నుండి

వచ్చుచుండెను. ''నిన్నెట్లు కీర్తించవలెనో, నీ గుణముల నెట్లు వర్ణించవలెనో నాకు తెలియదు. నేను అమాయకురాలిని. నాకు చదువుగాని, నీ గొప్పతనము గ్రహించు తెలివి తేటలుగాని లేవు. నీవు దయామయుడవు, కరుణామయుడవు. ఇంతమాత్రమే నాకు తెలుసును. ప్రభూ! నేను మీ దాసిసను. నేను బాధతో సతమతమగుచున్నాను. నన్ను కరుణింపుడు''.

పద్మములవంటి నేత్రములతో తన ప్రసన్న దృక్కులను ఆమెపై బరపి నారాయణుడిట్లనెను. ''దేవమాతా! నీ బాధను నేను అర్థము చేసుకొనగలను. నీ పుత్రులు అసురుల దయాదాక్షిణ్యములపై ఆధారపడి యున్నారు. నీ పుత్రులు తిరిగి పూర్వపు ఔన్నత్యమును పొందగా చూడవలెనని నీవు కోరుచున్నావు. అది నాకు తెలుసును. ఇది కొద్దిరోజుల తర్వాత సమసిపోవును. అంతవరకు నీవు వేచి యుండవలెను. అందుకు యింకా సమయము రాలేదు. ప్రస్తుతము బలి తారాబలము ఉచ్చస్థితిలో నున్నది. ఇందుకు కారణము శుక్రాచార్యుడు అతని శిష్యులు బలికి గురువులు అగుట. శుక్రుని గొప్పదనము చేత, అతని శిష్యుడైన బలికి యెట్టి ఆపదయు కలుగబోదు.

''అయినప్పటికీ నీవు చేసిన వ్రతము నాకు సంతోషము కల్గించినది. నీవు కోరు వరమును నేను ప్రసాదించెదను. నేను నీకు కుమారుడుగా జన్మించి, నీ పుత్రులకు సహాయము చేసెదను. నా జన్మ దేవరహస్యమగుట చేత యీ విషయమును నీవు యెవ్వరికీ తెలుపకూడదు''. అటు తర్వాత నారాయణుడు అదృశ్యుడయ్యెను. కశ్యపుడు, తన యోగశక్తిచేత జరుగబోవు దానిని తెలుసుకొనెను. అతని భార్య సంతోషముగా నుండుటచేత, అతడు కూడ సంతోషభరితుడయ్యెను.

అదితికి ఒక కుమారుడు జన్మించెను. పుట్టిన శిశువును చూచిన అదితికి, అతడు నారాయణ రూపములో నున్నట్లు గోచరించెను. ఇదివరకు ప్రత్యక్షమై మాట యిచ్చిన ప్రకారము, తానే ఆమెకు కుమారుడుగా జన్మించినట్లు రూఢి పరచుటకా యన్నట్లు ఆ బాలుడు నారాయణ రూపము ధరించెను. కొన్ని క్షణముల తర్వాత సాధారణ శిశువు రూపము ధరించి, ముల్లోకములకు ఆనందము చేకూర్చెను. దేవతలందరు చాల సంతోషించిరి. భగవంతుడు యీ భూమిపై అడుగుపెట్టుట వలన భూదేవి వింతకాంతులతో విలసిల్లుచుండెను. సరస్సులలోని నీరు నిర్మలముగా నుండెను. ఆకాశము అద్భుతమైన నీలి రంగుతో ప్రకాశించెను. అన్ని ఋతువులు ఒకేసారి ప్రవేశించెను. అన్ని ఋతువులలో పుష్పించే పుష్పములు విరబూసి, పరిమళ వాయువులతో వాతావరణము ఆహ్లాదకరముగా నుండెను.

అది భాద్రపదమాస శుక్లపక్ష ద్వాదశి. అభిజిత్తు నక్షత్రమున ఆ బాలుడు జన్మించెను. తర్వాత రోజులలో భాద్రపదమాస శుక్లపక్ష ద్వాదశి విజయ ద్వాదశిగా ప్రసిద్ధికెక్కెను.

ఆ శిశువు పెరిగి బాలుడుగా యెదిగెను. కాని అతడు పొట్టిగా వామనుడై నుండెను. అతనికి తగిన వయస్సులో ఉపనయనము జరిగెను. గాయత్రి మంత్రమును సూర్యు డుపదేశించెను. దేవగురువు బృహస్పతి పవిత్రమైన యజ్ఞోపవీతము నివ్వగా, తండ్రి కశ్యపుడు మౌంజిని యిచ్చెను. భూదేవి కృష్ణాజినము (లేడి చర్మము) నిచ్చెను. చంద్రుడు బ్రహ్మ దండము నిచ్చెను. తల్లి అదితి కౌపీనమును, దేవలోకవాసులు ఛత్రమును యిచ్చిరి. వేదములను తనలో యిముడ్చుకున్న బ్రహ్మ కమండలము నివ్వగా, సప్తర్షులు కుశఘాసముల నిచ్చిరి. సరస్వతి అక్షమాలను యిచ్చెను. కుబేరుడు భిక్షాపాత్రను యిచ్చెను. మహాదేవుని సతి పార్వతి, అన్నపూర్ణగా ఆ బాలునికి మొట్టమొదటి భిక్షను ప్రసాదించెను. వామనుని మరొకపేరు ఉపేంద్రుడు.

# 97 బలిచక్రవర్తి యజ్ఞము

పవిత్రభూమియైన భృగుకచ్ఛపై అసుర చక్రవర్తి బలి, శుక్రాచార్యుడు భృగువంశీయుల పర్యవేక్షణలో అశ్వమేధయాగము జరుపుచుండెను. యాగమును చూచుటకు వామనుడు వెళ్ళ నిశ్చయించుకొనెను. పవిత్ర నర్మదానది ఉత్తర తీరమున భృగుకచ్ఛ యున్నది.

యాగము సాగుచుండెను. ఇంతలో ఒక గొప్ప వెలుగు యెక్కడి నుండియో వచ్చుచున్నట్లుండెను. అక్కడ చేరిన వారు చుట్టూ పరికించి చూడగా, దివ్యమైన ఆ వెలుగు తమవైపుగా వచ్చుచున్నట్లుండెను. అది చూచి వారు తమలో తాము యిట్లు మాట్లాడుకొనిరి. ''ఉదయించు సూర్యుడు యీ భూమిపై నడచి మన దిక్కుగా వచ్చుచున్నట్లు గోచరించుచున్నది''. వారందరు యెదురుగా వచ్చుచున్న పొట్టి బ్రాహ్మణ బాలుని జూచిరి. ఆ బాలుని ఒక చేతిలో కమండలము, రెండవ చేతిలో ఛత్రము నున్నవి. ''సూర్యుడు యీ పొట్టి బాలుని రూపము ధరించి యీ యాగమును తిలకించుటకు వచ్చుచున్నాడా? అగ్నిదేవుడు ఆశీర్వదించుటకు వచ్చుచున్నాడా? లేక బ్రహ్మపుత్రుడైన సనత్కుమారుడు, ఈ యాగశాలను పునీతము గావించుటకు స్వయముగా వచ్చెనా?'' అని వారు తలపోసిరి.

ఆ బాలుడు యెవరైనదీ వారట్లు ఊహించుచుండగా, వామనుడు యజ్ఞశాలలో ప్రవేశించెను. ఆ బాలుని జానెడు వక్షస్థలము మౌంజితో కప్పబడి యుండెను. ఆ వక్షస్థలముపై నున్న యజ్ఞోపవీతము మెరపు తీగవలె ప్రకాశించుచుండెను. ఆకర్షణీయ మైన జటముడి తలపై అందముగా కానవచ్చుచుండెను. ఒకచేతి యందు కమండలమును, మరొక చేతితో ఛత్రమును ధరించి, ఆ పొట్టి బ్రాహ్మణ బాలుడు అక్కడ నిలుచుండెను. అక్కడ చేరిన వారందరు ఒక్కసారిగా లేచి నిలబడిరి. ఆ బాలుని వైభవము అంత గొప్పగా నుండెను. బలి ఆ బాలుని చెంతకు వచ్చి, అతని పాదములకు ప్రణమిల్లి, ఉత్తమాసనముపై కూర్చుండపెట్టి గౌరవించెను. ఆ బాలుని చిరుపాదములను పవిత్ర జలముతో కడిగి, ఆ జలమును తన శిరస్సుపై జల్లుకొనెను. బలి ఆ బాలునితో యిట్లనెను. ''కుమారా! నీకు స్వాగతము. నీవెవరో నాకు తెలియదు. కాని నన్ను, యీ యజ్ఞశాలను ఆశీర్వదించుటకు వచ్చినావని మాత్రము యెరుగుదును. బ్రహ్మర్షుల తపస్సంతయు మూర్తీభవించినట్లు నీవు నాకు గోచరించుచున్నావు. నీ రాక చేత నేను, నా పూర్వులు తరించిరి. నీ దర్శనము చేత నా జీవితము పరిశుద్ధమయ్యెను. నీ పాదములను ప్రక్షాళన చేసి ఆ జలమును నా శిరస్సుపై జల్లుకొనుటవలన నా పాపములన్నియు తుడుచుకొనిపోయి, నేను జరుపుచున్న యీ అశ్వమేధ యాగము ఫలించెను. ప్రభూ! నేను నీకేమి చేయగలనో సెలవియ్యవలెను. నీవంటి ఉత్తమ జీవులు భక్తులు కోరు వరములను అనుగ్రహించెదరు. ఇది బ్రాహ్మణుల ప్రత్యేకత, దానిని నెరవేర్చుట మహద్భాగ్యము. తనకు కావలసినది కోరుచు బ్రాహ్మణుడు అనుగ్రహించుచున్నాడు. ఆ కోరికను ప్రసాదించుచూ క్షత్రియుడు అనుగ్రహ పాత్రుడగుచున్నాడు. నీకు యేది కావలెనో కోరుకొనుము. నీకు యీ భూమి కావలెనా? లేక బంగారమా? లేక గృహములా? నీకు అందమైన పరిచారికలను యిత్తునా, లేక ఏనుగులు, గుర్రములు, ఆవులు కావలెనా? నన్ను ఆజ్ఞాపించి, నేను యిచ్చు దానమును స్వీకరించి నన్ను గౌరవింపవలెను''.

పొట్టి బ్రాహ్మణ బాలుడు నవ్వి మధురముగా బలితో నిట్లు పలికెను. ''నీవు వినయపూరితముగా, ఉదార

స్వభావముతో, ధర్మబద్ధముగా పలుకుట యెంతో సమంజసముగా నున్నది. నీవు అట్లు పలుకుటలో ఆశ్చర్యము యెంత మాత్రము లేదు. గొప్పవారైన శుక్రాచార్యులు, భృగువు నీకు గురువులు. నీ పూర్వులలో పితామహుడైన ప్రహ్లాదుడు గొప్ప భక్తుడు. నీ తండ్రి విరోచనుడు గొప్ప దాతగా ప్రసిద్ధిగాంచెను. నీ కుటుంబములో యాచించిన వారి కోర్కెలను తిరస్కరించిన వారెవరూ జన్మించి యుండలేదు. భిక్షకై వచ్చిన వారిని యింతవరకు యెవరూ నిరాకరించలేదు. ఇచ్చిన మాటను నిలబెట్టుకొనక ఉపసంహరించుకున్న సంఘటనలు కూడను లేవు. నీ పూర్వులలో ఒకడైన హిరణ్యాక్షునకు ఒకే ఒక ఆయుధము ఉండెను. అది గద, దానితో ముల్లోకములను అతడు జయించెను. అయినప్పటికీ అతనితో సరిసమానముగా పోరగల శక్తిమంతులు లభ్యముకాలేదని విచారించుచుండెడివాడు. నారాయణుడు వరాహరూపము ధరించినపుడు, హిరణ్యాక్షుడు అతనితో యుద్ధమునకు తలపడెను. రసాతలము నుండి భూమిని పైకి తెచ్చుచుండగా, హిరణ్యాక్షు డడ్డగించెను. వరాహునితో పోరాడి, అతనిచే హిరణ్యాక్షుడు సంహరింపబడెను. కాని ఆ భగవంతునకు యిది సంతోషమును కలిగించలేదు. హిరణ్యాక్షుని శక్తిని అతడెప్పుడూ తలంచుచూ, తాను విజయుడనని భావింపకుండెను. ఆ తర్వాత యేమి జరిగెను?

''తన సోదరుడు నిహతుడయ్యెనని తెలిసిన హిరణ్యకశిపుడు నారాయణుని చంపుటకు వైకుంఠమునకు వెళ్ళెను. త్రిశూలమును చేతిలో యెత్తిన హిరణ్యకశిపుని చూచి, నారాయణుడు తనలో తానిట్లనుకొనెను. 'నేను యెక్కడకు వెళ్ళిన అక్కడకు నన్ను యీ హిరణ్యకశిపుడు వెంబడించును. మరియు నేను నివసించు ప్రదేశముల నన్నింటినీ ధ్వంసము గావించును. అతని దృష్టి, మనస్సు, ఆలోచనలు బాహ్య ప్రపంచము నందుండుటచేత, నేను అతనిలో ప్రవేశించితిని. ఆ విధముగా అతను శ్వాస పీల్చునపుడు, భగవంతుడు అణువులలో అణువుగా మారి, అతనిలో ప్రవేశించెను. భగవంతుని పై ప్రేమ కన్న ద్వేషము మిక్కుటముగా నుండెను. ప్రతిక్షణము భగవంతుని ద్వేషించుచూ చింతించుట చేత చివరకు భగవంతుని చేతులలో మృతి చెందెను.

''ఇక నీ తండ్రి విరోచనునికి సాటియైన దానశీలురు గలరా? ఒకప్పుడు దేవతలు బ్రాహ్మణ రూపము ధరించి యాచకులుగా వచ్చిరి. వారు దేవతలని తెలిసినప్పటికీ, వారు కోరగా తన ప్రాణమునే ధారపోసెను. అతడు తన జీవితములో యెవరు యేది అడిగిననూ నిరాకరింపకూడదను సూత్రము పాటించెను. అటువంటి ఉత్తమ కుటుంబములో జన్మించిన నీవు ధర్మబద్ధుడవుగా నుండుటలో ఆశ్చర్యమేమున్నది? తప్పక నిన్ను నేను వరమడిగెదను. నీవు దానిని ప్రసాదించగలవని నేనెరుగుదును. నాకు మూడడుగులు భూమి మాత్రమే కావలెను; నా పాదములతో కొలిచెదను''.

వామనుని మాటలు వినిన బలి అచ్చెరువొంది ఒక క్షణకాలము మాట్లాడలేక పోయెను. తరువాత వికసించిన నవ్వు మోముతో యిట్లనెను. ''నీవు నిజముగా అమాయిక బాలుడివి. నీవు పలికిన జ్ఞానదాయకమైన పలుకులు జ్ఞానులకు మిక్కిలి సంతోషము చేకూర్చును. అయినప్పటికీ నీవు యింకా పసి బాలుడుగా నుండుట నాకు కొంత భయమును కలిగించుచున్నది. ఏది మంచిదో నీకు తెలియక పోవుట వలన నీ ప్రవర్తన కూడ అమాయిక బాలురు ప్రవర్తించు తీరులో నున్నది. ఏది నీకు మంచిదో, లాభదాయకమో తెలియని అజ్ఞానివలె నున్నావు. నన్ను చూడుము. నేను యీ ముల్లోకములకూ ప్రభువును. నీ మాటల నేర్పుతో నాకు ఆనందము కలిగించితివి. ద్వీపములు, బంగారురాసులు అడుగక, కేవలము మూడు అడుగుల భూమిని, అదియూ నీ చిరుపాదములతో కొలిచే మూడే మూడు పాదముల భూమిని కోరుచున్నావు! నేను నీకు యిచ్చిన తర్వాత, యికముందెప్పుడు

యింకేదియు నీవు కోరవలసిన అవసరముండదు. నీ మాటలను మార్చుకుని యింకా యెక్కువ భూమిని తీసుకొని జీవితమంతయు సుఖముగా నుండుము. నీవు అడుగుటయే తడవుగా నేనిచ్చెదను''.

వామనుడిట్లనెను. ''ని ఔదార్యమును నేను మెచ్చుకొనుచున్నాను. ఓ రాజా! కోరికను జయించని మానవుడు, లోకములోని సకల వస్తువులు యిచ్చిననూ అతనికి సంతృప్తి యుండదు. మూడు అడుగులతో తృప్తిపడని మానవుడు, సప్తద్వీపములు, అందలి సంపద అతనికి ధారపోసిననూ తృప్తిచెందదు. సప్తద్వీపములను పాలించు ప్రభువులు 'నాకు యిది చాలును' అను స్థితిని చేరుకొనలేదని అందురు. తనకు లభించిన దానితో సంతృప్తి పడువాడే నిజముగా సుఖము ననుభవించును. చంచల మనస్కులు యెప్పుడూ అసంతృప్తితో దుఃఖముతో బాధపడుదురు. అసంతృప్తియే మానవుని దుఃఖమునకు కారణము. సంతృప్తి పొందిన మానవుని ముఖము రోజు రోజుకూ వికసించి, విముక్తి పొందుటకు అర్హత కలిగియుండును. నీవు దానశీలురలో అగ్రగణ్యుడవు. నీవు దాన సామ్రాట్టువి. కాబట్టి నేను కోరిన నా పాదములతో కొలిచే మూడడుగుల భూమిని నీవు ప్రసాదించ గోరెదను''.

తిరిగి బలి నవ్వెను. నవ్వుచు యధాలాపముగా యిట్లనెను. ''అటులనే కానిమ్ము. నీ చిరు పాదములతో కొలిచిన మూడడుగుల భూమిని ప్రసాదించెదను''. వామనరూపములో నున్న భగవంతుని చిరు పాదపద్మములను బలి వీక్షించెను.

పెదవులపై నవ్వు లాస్యము చేయుచుండగా, జలముతో నిండిన పాత్రను తీసుకుని, అందులో కొన్ని బిందువులను పద్మములవంటి ఆ బాలుని చేతిలోవైచి, ''నీవు కోరిన దానిని నేను నీకిచ్చుచున్నాను'' అని బలి పలికెను.

## 98 శుక్రుని అభ్యంతరము

గురువు శుక్రాచార్యుడు అడ్డుపడెను. మాట్లాడక బలి తన కనులను పైకెత్తి ప్రశ్నార్థకముగా చూచెను. శుక్రుడు జ్ఞానులలో కెల్ల జ్ఞాని. అతడు 'కవి'యను పేరుతో ప్రసిద్ధిపొందెను. ఇంద్రుని గురువు బృహస్పతి కన్న తెలివికలవాడని కొందరు అందురు. శుక్రునకు దైత్యులపై మక్కువ, బలి అతని ప్రియశిష్యుడు. అతడు బలి మోసపోవుట సహింపకుండెను. రాజును దయతోజూచి యిట్లనెను. ''కుమారా! నీవు యేమి చేయుచున్నావో నీకు తెలియదు. ఈ చిన్నారి బ్రాహ్మణ బాలుడు అమాయకుడని, తనకేది మంచియో, లాభదాయకమో తెలియని పసివాడని నీవు భ్రమపడుచున్నావు. కాని ఆ బాలుడు సాక్షాత్తు నారాయణుడు. దేవతలకు ఉపకారము చేయనెంచి, అదితి కశ్యపులకు జన్మించెను. నీ హృదయము వెన్నవంటిది. ఈ బాలునికి దుడుకుగా వరమును ప్రసాదించెదనని మాట నిచ్చియున్నావు. ఆ వరము తేలికైనది కాదు. అది నిన్ను, అసురజాతిని నాశనము చేయునని నాకు తెలుసును. ఇది అన్యాయముతో కూడి యున్నది. నీవు యీ అన్యాయమునకు లోబడి బాధపడకూడదని నా తలంపు.

''నీ ముందర నిలిచియున్న నారాయణుడు, నీవు యీ సంపద నంతయూ పోగొట్టుకొనునట్లు చేయనున్నాడు. నీ సర్వస్వమునూ కోల్పోయెదవు. నీ అధికారము, వైభవము దేవతలు, నారాయణుని

సహాయముతో చేజిక్కించుకొందురు నీవు వట్టి తెలివితక్కువ వాడవు. నీ సర్వస్వము పోగొట్టుకున్న తర్వాత, నీవెక్కడ జీవించెదవు? నీకు నిలబడుటకు కావలసిన స్థలము కూడ యుండదు. ఈ పసిబాలుడు, తన చిరు పాద పద్మములతో కొలుచు మూడడుగుల భూమిని కోరినాడు భగవంతుని ఒక్క పాదము యీ భూమి నంతయూ కొలుచునని నీకు తెలియదా? రెండవసారి తన పాదముతో దేవలోకమును కొలుచును. మూడవసారి పాదము నెక్కడ మోపును? తన పాదమును నీ తలపై మోపి పాతాళమునకు అణగద్రొక్కునని నీవు గ్రహించలేవా? ఈ కోర్కెను నీవు తీర్చలేకపోవుట సమంజసముగానే యుండును. నీ ఆందోళనకు కారణము నేనెరుగుదును ఇచ్చిన మాటను ఉపసంహరించుకొనుట ధర్మవిరుద్ధమని నీవు తలంచి బాధపడుచు న్నావు. ఋగ్వేదములో ఈ విషయమున విపులమైన చర్చ యున్నది. దానిని నీకు విశదపరచి తెల్పెదను.

'' 'నేను యిచ్చెదను' అని పలుకుట సత్యము పలుకుట యగును అట్లు పలికిన తర్వాత 'నేను యివ్వను' అని పలికినచో అది అసత్యము పలికినట్లగును సత్యము పుష్పము వంటిది మాట ఆ వృక్షము యిచ్చు పండు వంటిది సత్యము పలుకువారు సత్పురుషులుగా ప్రసిద్ధిగాంచెదరు అట్టివారు, అందమైన పుష్పములను తియ్యని ఫలములను యిచ్చు వృక్షములవంటి వారు

''అసత్యము మాటల వెనుక నున్న వేరులను పెల్లగించును. పెల్లగిలిన వృక్షము వేరులు, సామాన్య మానవులు తమ సహజమైన కనులతో చూడగలిగే వేరులు, యెండిపోయి త్వరలోనే నేలగూలును అదే రీతిగా అసత్యము పలుకు మానవుడు ఆత్మ విహీనుడై, త్వరలోనే శరీరమును గోల్పోవును. అందుచేత మానవుడు అసత్యము పలుకరాదు. కాని, కొన్ని సమయములందు అసత్యము పలుకుట నిషిద్ధము కాదు వరము ప్రసాదించెదనని మాట యిచ్చినపుడు, ఆ వరము ప్రసాదించుటచేత తన శరీరమునకు హాని యేర్పడునపుడు, తన మాటను ఉపసంహరించుకుని వరమును యివ్వ నిరాకరించ వచ్చును. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో అసత్యము పలుకుట నిషిద్ధము కాదు భార్య తన మాట వినునట్లు చేయుటకు, పరిహాసమాడునపుడు, వివాహ సమయములో పెండ్లి కుమార్తె లేక పెండ్లి కుమారుని గుణములను వర్ణించునపుడు, ప్రాణమునకు ముప్పు సంభవించినపుడు, గోవులకు బ్రాహ్మణులకు మంచి చేయునపుడు, అపాయములో నున్న వారిని రక్షించునపుడు అసత్యము పలుకవచ్చునని ఋగ్వేదమందు కలదు. నీవు యిచ్చిన వరముచేత వినాశము తప్పదని గ్రహించినపుడు యిచ్చిన మాటను ఉపసంహరించుకొనుటలో యెట్టి దోషము లేదు. నిన్ను యెట్టి పాపము అంటదు. ఇప్పుడు నీవు యిచ్చిన వరమును ఉపసంహరించుకొనుటయే శ్రేయస్కరము''.

గురువు పలికిన పలుకులను బలి శ్రద్ధతో వినియుండెను చాలసేపు నిశ్శబ్దముగా నుండి బలి యిట్లనెను. ''ప్రసాదించిన వరము తనకే ముప్పు కల్గించునపుడు, యిచ్చిన మాటను ఉపసంహరించుకుని వరమును నిరాకరించుటలో అసమంజసమేమియు లేదని చెప్పిన మీ వాదము సముచితముగా నున్నదని నమ్ముచున్నాను. కాని, గురువర్యా! నన్నొకసారి పరికింపుడు భౌతికమైన రక్షణయే ప్రధానమని భావించు సామాన్య మానవుల వంటి వాడను కాను నేను విరోచనుని కుమారుడను, ప్రహ్లాదునికి మనుమడను అట్టి ఉత్తమ వంశములో జన్మించిన నేను, మీరు చెప్పినట్లుగా నేనెట్లు ఆచరించగలను. అటువంటి ఆలోచనను ఒక క్షణమైనను రానీయదగునా? అది సిగ్గుచేటు కాదా? మీ సలహాను పాటించినచో, తన సంపదను విడనాడుట కిష్టపడని సామాన్య మానవులవలె ప్రవర్తించినట్లగును అసత్యము పలుకుట కన్న నికృష్టమైనది లేదని పదే పదే చెప్పుదురు ఇది తప్ప యింక ఎటువంటి ఘోర పాపము నైనను భరింతును. ఒక బ్రాహ్మణుని మోసగించుట వలన తీరని ప్రమాదము సంభవించగలదు నరకము, దారిద్ర్యము, దుఃఖము, పదవీచ్యుతి, మరణము, వీటి వలన

యింకేదియు నీవు కోరవలసిన అవసరముండదు. నీ మాటలను మార్చుకుని యింకా యెక్కువ భూమిని తీసుకొని జీవితమంతయు సుఖముగా నుండుము. నీవు అడుగుటయే తడవుగా నేనిచ్చెదను''.

వామనుడిట్లనెను. ''ని ఔదార్యమును నేను మెచ్చుకొనుచున్నాను. ఓ రాజా! కోరికను జయించని మానవుడు, లోకములోని సకల వస్తువులు యిచ్చిననూ అతనికి సంతృప్తి యుండదు. మూడు అడుగులతో తృప్తిపడని మానవుడు, సప్తద్వీపములు, అందలి సంపద అతనికి ధారపోసిననూ తృప్తిచెందదు. సప్తద్వీపములను పాలించు ప్రభువులు 'నాకు యిది చాలును' అను స్థితిని చేరుకొనలేదని అందురు. తనకు లభించిన దానితో సంతృప్తి పడువాడే నిజముగా సుఖము ననుభవించును. చంచల మనస్కులు యెప్పుడూ అసంతృప్తితో దుఃఖముతో బాధపడుదురు. అసంతృప్తియే మానవుని దుఃఖమునకు కారణము. సంతృప్తి పొందిన మానవుని ముఖము రోజు రోజుకూ వికసించి, విముక్తి పొందుటకు అర్హత కలిగియుండును. నీవు దానశీలురలో అగ్రగణ్యుడవు. నీవు దాన సామ్రాట్టువి. కాబట్టి నేను కోరిన నా పాదములతో కొలిచే మూడడుగుల భూమిని నీవు ప్రసాదించ గోరెదను''.

తిరిగి బలి నవ్వెను. నవ్వుచు యథాలాపముగా యిట్లనెను. ''అటులనే కానిమ్ము. నీ చిరు పాదములతో కొలిచిన మూడడుగుల భూమిని ప్రసాదించెదను''. వామనరూపములో నున్న భగవంతుని చిరు పాదపద్మములను బలి వీక్షించెను.

పెదవులపై నవ్వు లాస్యము చేయుచుండగా, జలముతో నిండిన పాత్రను తీసుకుని, అందులో కొన్ని బిందువులను పద్మములవంటి ఆ బాలుని చేతిలోవైచి, ''నీవు కోరిన దానిని నేను నీకిచ్చుచున్నాను'' అని బలి పలికెను.

## 98 శుక్రుని అభ్యంతరము

గురువు శుక్రాచార్యుడు అడ్డుపడెను. మాట్లాడక బలి తన కనులను పైకెత్తి ప్రశ్నార్థకముగా చూచెను. శుక్రుడు జ్ఞానులలో కెల్ల జ్ఞాని. అతడు 'కవి'యను పేరుతో ప్రసిద్ధిపొందెను. ఇంద్రుని గురువు బృహస్పతి కన్న తెలివికలవాడని కొందరు అందురు. శుక్రునకు దైత్యులపై మక్కువ, బలి అతని ప్రియశిష్యుడు. అతడు బలి మోసపోవుట సహింపకుండెను. రాజును దయతోజూచి యిట్లనెను. ''కుమారా! నీవు యేమి చేయుచున్నావో నీకు తెలియదు. ఈ చిన్నారి బ్రాహ్మణ బాలుడు అమాయకుడని, తనకేది మంచియో, లాభదాయకమో తెలియని పసివాడని నీవు భ్రమపడుచున్నావు. కాని ఆ బాలుడు సాక్షాత్తు నారాయణుడు. దేవతలకు ఉపకారము చేయనెంచి, అదితి కశ్యపులకు జన్మించెను. నీ హృదయము వెన్నవంటిది. ఈ బాలునికి దుడుకుగా వరమును ప్రసాదించెదనని మాట నిచ్చియున్నావు. ఆ వరము తేలికైనది కాదు. అది నిన్ను, అసురజాతిని నాశనము చేయునని నాకు తెలుసును. ఇది అన్యాయముతో కూడి యున్నది. నీవు యీ అన్యాయమునకు లోబడి బాధపడకూడదని నా తలంపు.

''నీ ముందర నిలిచియున్న నారాయణుడు, నీవు యీ సంపద నంతయూ పోగొట్టుకొనునట్లు చేయనున్నాడు. నీ సర్వస్వమునూ కోల్పోయెదవు. నీ అధికారము, వైభవము దేవతలు, నారాయణుని

# 99 మూడడుగుల భూమి

దానము యిచ్చుట స్వీకరించుట జరిగెను. బలి కన్నులెత్తి వామనుని చూచెను. అతడట్లు చూచుచుండగనే పొట్టి బ్రాహ్మణ బాలుడు క్రమముగా పెరిగి బృహద్రూపము వహించెను. నారాయణుని విశ్వరూపమును గాంచుచున్న బలి కండ్ల నుండి ఆనందాశ్రువులు కారుచుండెను. విరాట్ పురుష రూపము దర్శించు మహద్భాగ్యము బలికి కలిగెను. పంచ మహాభూతములు, త్రిగుణములు, ఇంద్రియములు, చిత్తము, జీవులతో కూడిన యీ విశ్వమును చూచెను. భగవంతుని పాదముల వద్ద రసాతలమును, పాదముల చర్మమందు భూమిని, చూచెను. అతని మోకాళ్ళు పర్వతములు, పక్షులు; తొడలు వాయువులకు నిలయములు. బలి ప్రజాపతులను, అసురులను గాంచెను. భగవంతుని నాభి ఆకాశముగను, ఉదరమందు సప్త సముద్రములను చూచెను. వక్ష స్థలమున నక్షత్రములు ఒకచోట చేరి అందమైన హారమువలె నుండెను. విరాట్ పురుషుని హృదయమందు ధర్మము ప్రతిష్ఠితమై యుండుట బలి కనుగొనెను. వక్షముపై 'ఋత' అనగా ధర్మముతో కూడిన మధుర వచనములు ఉండెను. అచ్చటనే సత్యము కలదు. అతని మనస్సునందు చంద్రుడు, విశాల వక్షస్థలముపై పద్మమును చేతిలో ధరించిన లక్ష్మీదేవి యుండిరి. అతని గళమందు సామవేదము, పవిత్ర మంత్రములు, వివిధములైన స్వరములు నుండెను. భుజములందు ఇంద్రుని నాయకత్వములోని దేవతలు గలరు. అతని చెవులు దిక్కులు, శిరస్సు స్వర్గము. నేత్రములందు సూర్యుడు, నోటి యందు అగ్ని యుండిరి. నాలుక యందు వరుణుడు, గొంతులో వేదములు నుండెను. కనుబొమలందు విధి, కనురెప్పలు యెత్తినపుడు ఏహ్యో భావముతో కూడిన నవ్వును తిలకించెను. నుదుటి యందు రాత్రి, పగలు, క్రోధమును; అడుగు పెదవి యందు ఆశను బలి వీక్షించెను. అతని స్పర్శయే కామము; అవయముల సొంపు యజ్ఞము, నీడ మృత్యువు; నవ్వు మాయ. అతడి వెంద్రుకలే వృక్షములు, లతలు, పొదలు; నరములు నదులు. అతని బుద్ధి బ్రహ్మ. అతని శరీరము చరాచర వస్తువులు, దేవగణములు, ఋషులు, వేయేల అన్నింటికీ నిలయము.

బలి వద్ద నున్న అసుర సేవకులు భయాశ్చర్యముతో శుక్రాచార్యుడు ఊహించి చెప్పినట్లుగా జరుగుచున్నదని గ్రహించిరి. భగవంతుని విరాట్ రూపము, తేజస్సు చూచి భరించలేక మూర్ఛపోయిరి. మూర్ఛ నుండి తేరుకుని లేచిన తర్వాత, విరాట్ పురుషుని రూపముగాక నారాయణుని రూపము గాంచిరి. అతని సేవకులందరూ వైకుంఠము నుండి వచ్చిరి. భగవంతుని ఆయుధము లన్నియు నుండెను. వైభవోపేతమైన సుదర్శన చక్రము, శార్ఙమను ధనుస్సు, పాంచజన్యముగా పేరుగాంచిన శంఖము, కౌమోదకి యను గదను ధరించి యుండెను. అతని సేవకులు, భగవంతునికి ప్రీతిపాత్రుడైన సునందుని నాయకత్వములో నుండిరి.

భగవంతుడు కిరీటము ధరించి యుండెను. అందలి మణులు అత్యంత కాంతితో ప్రకాశించుచుండెను. అమోఘమైన బాహువులు భుజకీర్తులను ధరించెను. మకర కుండలములు తల ఆడించునపుడు అందముగా ఊగుచుండెను. కౌస్తుభమణి ధరించగా, వక్షముపై నున్న శ్రీవత్సమను చిహ్నము సొబగు ద్విగుణీకృతమయ్యెను. అతడు ధరించిన బంగారు వన్నెలోనున్న పచ్చని వస్త్రము గాలికి రెప రెపలాడుచుండెను. అతని ముఖమున అందమైన నవ్వు తాండవించెను.

భగవంతుని బృహద్రూపము స్వర్గమును సమీపించెను. నారాయణుడు ఒక అడుగుతో బలికి చెందిన ఈ భూమి నాక్రమించెను. అతని ఆకారము ఆకాశమంతయు నిండి, విశాల బాహువులు అన్ని దిక్కులకూ ప్రసరించెను. రెండవ అడుగునకు స్వర్గములో కొంత భాగము మాత్రమే కనుపించుచుండెను. తన పాదమునెత్తి

మహర్లోకము చేరి, అచట నుండి జనలోకము, సత్యలోకము, ద్యుర్లోకములను చేరెను. సత్యలోకము నందుండే బ్రహ్మ అమితోత్సాహముతో భగవంతుని పాదము వద్దకు వెళ్ళెను. పాదము గోళ్ళు చంద్రుని వెన్నెల వలె ప్రకాశించుచూ, సత్యలోక సౌందర్యమును యినుమడింపజేసెను. బ్రహ్మకు తోడుగా మరీచి మున్నగు ఋషులు, సనకసనందాదులు, యోగులు, వేదములు, వాటి శాఖలు వచ్చి, వారందరూ భగవంతుని పాదమును పూజించిరి. బ్రహ్మ, కమండలములోని నీటితో నారాయణుని పాదము నభిషేకించెను. నారాయణుని పాదములచే పునీతమైన ఆ నీరు ప్రవహించి మందాకినీ నదిగా ప్రసిద్ధికెక్కెను. ఆ నది ప్రవహించిన ప్రదేశములు శుద్ధియై పవిత్రములయ్యెను. మందాకిని భూమి మీదకు వచ్చిన తర్వాత గంగానదిగా ప్రసిద్ధిగాంచెను.

భగవంతుడు భూమిని, స్వర్గమును కొలిచెను. తిరిగి వామన రూపముతో నవ్వుచూ నిలబడెను. అసురులు, తమ యజమాని బలి సంపదనూ రాజ్యమునూ పోగొట్టుకొనుట గాంచిరి. వారు వామనునితో యుద్ధము చేయ నిశ్చయించుకొనిరి. వారు వామనుని ఓడించి, తిరిగి బలిని సింహాసనముపై కూర్చుండబెట్టవచ్చునని తలంచిరి. వారు తమ ఆయుధములను చేతబట్టి వామనుని రూపములో నున్న నారాయణునిపై కెగబడిరి. అంతకు ముందే అక్కడ నున్న నారాయణుని సేవకులు అసురులతో యుద్ధము చేయుటకు సిద్ధపడిరి. దీనినంతయూ గమనించిన బలి చక్రవర్తి తన సేవకులపై ఆగ్రహించెను. వారితో బలి యిట్లనెను. ''నా మాటలు విని యుద్ధము చేయు ఆలోచనను విరమింపుడు. కాలము మనకు అనుకూలము కాదు. అన్నింటిలో కాలము అతి ప్రధానమైనది. భగవంతుడు కాల స్వరూపుడు. అతని యిచ్ఛ ప్రకారమే సుఖ దుఃఖములు కలుగుచుండును. భగవంతుని ముందు మానవుడు నిస్సహాయుడు. ఒక సమయములో ఈ కాలము మన కనుకూలముగా నుండి, దేవతలకు అనుకూలముగా లేకుండెను. అప్పుడు మనము శక్తిమంతులము, వారు చాల బాధలకు లోనైరి. కాలమిపుడు పరిస్థితులను తారుమారు చేసెను. పెద్ద సేన కాని, మంత్రములుగాని, తపస్సుగాని కాల ప్రవాహమును అరికట్టలేవు. మనకు తిరిగి అదృష్ట కాలము వచ్చు వరకు వేచి యుండవలెను. అంతవరకు తెలివిగా నిగ్రహము కలిగి యుండవలెను. యుద్ధము చేయవద్దు, దాని వలన ప్రయోజనముండదు''.

భగవంతుని ప్రక్కనే గరుడుడు నిల్చుని యుండెను. యజమానివైపు ఒకసారి చూసి, వరుణ పాశముతో బలిని బంధించెను. ఇది జరిగినపుడు అన్నివైపుల నుండి హాహాకార ధ్వనులు వినవచ్చెను.

బలి తనలో తాను నవ్వుకొనెను. ఇట్లు యెందుకు జరిగెనో అతడు గ్రహించెను. 'నేను' 'నాది' అను రెండు మహా పాపములను తన హృదయము నుండి పారద్రోలుటకు నారాయణుడు ఉద్దేశించెనని బలి విశ్వసించెను. 'నాదైన యీ భూమి నంతయు నీ కొసంగెదను' అని పలికినపుడు, భగవంతుడు తనలో తాను నవ్వుకుని, అందులకు శిక్షింప నిశ్చయించుకొనెను. వామనుని వైపు బలి చూచెను. అతనిలో ప్రేమ, అనుగ్రహము గాంచి, తాను ఊహించినది సరికాదని తలంచెను. తనను అనుగ్రహించుటకే భగవంతుడు వచ్చెను. వరమడిగి తన సర్వస్వమునూ తీసుకుని, 'నాది' అను పాపమును కడిగివేసెను. శరణాగతి ద్వారా 'నేను' అను భావము విడనాడవచ్చునని లోకమునకు తెలియజెప్పుటకే, గరుడుని యీ వరుణ పాశముతో నన్ను బంధింపుమని భగవంతుడు చెప్పి యుండవచ్చును. భగవంతుని దయాగుణము బలి కనుల వెంట నీళ్ళు వచ్చునట్లు చేసెను. గరుడుడు వరుణ పాశముతో బంధించునపుడు, వినయముగా శిరస్సు వంచెను.

## 100 బలి మాట నిలబెట్టుకొనుట

బంధితుడైన బలి వంక నారాయణుడు చూచెను సత్యమును విడనాడకుండుటచే బలి సర్వస్వమును పోగొట్టుకొనెను నారాయణు డిట్లనెను. ''నీవు అసురులకు చక్రవర్తివి. నా పాదముంతో కొలిచే మూడడుగుల భూమిని యిచ్చుటకు మాట నిచ్చితివి. రెండడుగులను కొలిచి ఆక్రమించి, వాటిని నేను స్వంతము గావించుకొనుట నీవు చూసి యున్నావు. ఇంకొక అడుగు మిగిలి యున్నది. నా పాదము నెక్కడ నుంచుమందువు? చెప్పుము. మాట తప్పి, అసత్యము పలికినచో దానికి యెట్టి శిక్ష నొందవలెనో నీవు యెరుగుదువు నిన్ను పాతాళ లోకమునకు అణగద్రొక్క వలసివచ్చును. నీ గురువు యిదివరకే యీ విషయము నీకు చెప్పియున్నాడు''.

వామనుని మాటలు వినిన బలి బాధ చెందనూ లేదు, భయపడనూలేదు. బలి నవ్వుచూ యిట్లనెను. ''ప్రభూ! నా మాటలు అసత్యము కావని తలంతును నీ మూడవ అడుగునకు యింకనూ స్థలమున్నది నీ పాదమును నా తలపై పెట్టి నన్ననుగ్రహింపుము నాకు నరక మనిన భయము లేదు, గాని పాపాత్ముడ ననిపించుకొనుటకు భయముగా నున్నది. ఈ వరుణ పాశ బంధముల వలన నాకు భయము లేదు. దారిద్ర్యము, నిత్య దుఃఖము కూడ నాకు భయావహములు కావు. శిక్షితునకు, శిక్షించువాడు తల్లి, తండ్రి, సోదరుడు లేక శ్రేయోభిలాషివలె అత్యంత ప్రీతిపాత్రుడైనప్పుడు, అది నిజముగా అనుగ్రహమని యెంచెదను. లోక దృష్టిలో నా గర్వమునకు అహంకారమునకు నీవు శిక్ష విధించవలసి యున్నది. కాని నీవు నిజముగా నన్ను ఆశీర్వదించి అనుగ్రహించినావు. నీవు నా అంతర్నేత్రము - జ్ఞాన చక్షువు - తెరిచినావు రాక్షసులకు నీవు స్నేహితుడవేకాని శత్రువువు కాదు

''నా పితామహుడైన ప్రహ్లాదుడు నీకు మిక్కిలి ప్రేమ పాత్రుడు. అతడు తన తండ్రిచే విశేషముగా బాధలకు గురియైనపుడు, నీవూరకున్నావు. ఈ భౌతిక శరీరము పొందుచున్న బాధ నిజముగా ఒక లెక్కలోనిది కాదని అతనికి బాగుగా తెలియును ఈ శరీరము, సంపద, బంధువులు, స్నేహితులు, జ్ఞానమునకు ఆపద వాటిల్లినపుడు యెందుకూ కొరగానివని అతడెరుగును. అతడీ విషయములను ఒక క్షణమైనను యోచింపక, యెల్లకాలము నిన్ను, నీ పాద పద్మములనే చింతించుచుండెను. నేను కూడ అట్లే చేయుచున్నాను శ్రీ, అనగా సంపద మూలముగానే మానవుని గర్వము, అహంకారము కలుగుచున్నవి మనిషి గుడ్డివాడై, మరణముతో యీ శరీరము అంతమగుచున్నదనే సత్యమును విస్మరిస్తున్నాడు. ప్రభూ! ఇప్పుడు నీవు నాకేమి చేయుచున్నావు? నేను యీ సంపదకు దూరమగునట్లు చేసి, త్వరలోనే నిన్ను చేరుటకు అవకాశము కలిగించి అనుగ్రహించినావు. నేను చాల అదృష్టవంతుడను''.

ఆ క్షణములో, బలి పితామహుడైన ప్రహ్లాదుడు అచటకు వచ్చెను. అతడు నారాయణునికి పరమ భక్తుడగుటచే, బలి ప్రణామము చేయగోరెను. కాని వరుణపాశముచేత బద్ధుడగుట వలన అట్లు చేయలేకపోయెను. అశ్రువులంతోనే స్వాగతము పలికి మానసికముగా పూజించెను. ప్రహ్లాదుడు సూటిగా వామనుని చెంతకు వెళ్ళి ప్రణమిల్లెను. తన అశ్రువులతో భగవంతుని పాదములకు అభిషేకము చేసెను బ్రహ్మ నారాయణుని వద్దకు వచ్చి యిట్లనెను. ''ఇంక యే మాత్రము వింధ్యావళికి దుఃఖము కలిగించవద్దు. ఈ పాశ బంధము నుండి బలిని విడిపించుము. అతడు తన సర్వస్వమును యిచ్చివేసెను. నిత్యము నిన్నే చింతించువారు, కేవలము పత్ర పుష్ప తోయములతో మాత్రమే నిన్ను పూజించుచున్నప్పటికీ, నీకు చాల దగ్గరగా నుందురని

చెప్పి యుండలేదా? బలి సర్వస్వమును నీకు అర్పించి, సంపూర్ణ శరణాగతుడయ్యెను. అతనికి నీవు ఉచిత ఫలము నందియ్యవలెను''.

నారాయణు డిట్లు పలికెను. ''ఒక వ్యక్తిని నాశనము గావించుటకు, అతనికి యీ లోకములో విశేషమైన సంపదను, అధికారమును ప్రసాదించెదను. అతడు వాని యందు తగుల్కొని, తన నిజ స్వభావమును విస్మరించును. నేను యెవరినైనా మాయ నుండి రక్షింపదలచుకున్నపుడు, వారి సంపదను తీసుకొందును. దోషములన్నిటిని పరిహరింపగా, అతడు నాలో లీనమగును. ఒకసారి నాచే రక్షితుడైన భక్తుడు నాశనము పొందడు.

''బలి యెన్నడూ మాట తప్పి సంచరించలేదు. అతడు మాయను జయించెను. అతడు సంపదను, అధికారమును, చక్రవర్తి పదవిని పోగొట్టుకుని మిక్కిలి వ్యధ నొందెను. వరుణ పాశముచే బద్ధుడైన బలిని చూచి అతని శత్రువులు నవ్వుచున్నారు. బంధువులందరూ అతనిని విడిచి వెళ్ళిపోయిరి. గురువు శపించెను. అయినప్పటికీ, అతడు ధర్మ పథమును విడువకుండుట మెచ్చుకోదగినది. నేను మాయ మాటలు పలుకగా, అతని గురువు వేదముల నుండి యెన్నో సత్యములను పలికి, అసత్యమును సత్యముగా యెంచవచ్చునని నమ్మింప ప్రయత్నించెను. కాని బలి వానిని వినకుండెను. దేవతలు అసూయచెందు స్థితిని బలి చేరుకొనెను. నా అనుగ్రహము పొందిన బలి, సావర్ణి మన్వంతరమందు ఇంద్రుడుగా నుండగలడు. అంతవరకు, నాకు ప్రియమైన సుతల మందు బలి యుండగలడు. నేను నీతోనే యుండి రక్షించుచుందును. ఎల్లపుడూ నీ చెంతనే యుండెదను. నీలోని అసుర గుణములు త్వరలోనే అంతరించి, సావర్ణి మన్వంతరమందు ఇంద్రుడుగా ప్రసిద్ధి గాంచెదవు''.

బలికి విశేషమైన ఆనందము కలిగి నోట మాట రాకుండెను. అతని కనులు యేకధారగా వర్షించుచుండెను. మాటలు గొంతులోనే ఉండిపోయి, కన్నీరుతో నిండుటచే బయటకు రాకుండెను. కొంతసేపయిన తర్వాత తనను తాను సముదాయించుకుని, యిట్లనెను. ''ప్రభూ! నా వద్దకు వచ్చి దానమడిగితివి. దాన మొసగుటలో పూర్తిగా నిమగ్నుడనైయున్న నేను నీకు సరిగా నమస్కరించ వలెనని కూడ తోచలేదు. నీకు పాద నమస్కారము చేయుటకు ప్రయత్నము మాత్రము చేసితిని. నా యీ కొద్దిపాటి ప్రయత్నమునకే నీవు అనంతమైన అనుగ్రహమును ప్రసాదించినావు. నీ పవిత్ర పాదమును, అధికార సంపదలతో గుడ్డివాడైన యీ దుష్ట బలి శిరస్సుపై మోపినావు. నీకు నాయందు గల దయను యెట్లు కీర్తింపను?''

వరుణ పాశ బంధము నుండి బలి విడుపు పొందెను. బ్రహ్మ విష్ణు రుద్రులకు బలి ప్రదక్షిణము చేసెను. అనంతరము బలి సుతల లోకము ప్రవేశించెను. ప్రహ్లాదుడు భగవంతునితో యిట్లు పలికెను. ''స్వర్గవాసులు నీ ఆశీస్సులకై నీకు ప్రణమిల్లుచున్నారు. నేను, నా మనుమడు దేవతలము కాము. కేవలము అసురులము. జన్మ చేత దేవతలకన్న తక్కువవారము. అయినప్పటికీ, నీకు మా యందు ప్రేమ యెక్కువ, అది యెంత యెక్కువనగా వారి కన్న మేము గొప్ప అదృష్టవంతులము. ప్రభూ! నా మనుమనిపై నీవు కురిపించిన అనుగ్రహమునకు నేను నీకెట్లు ధన్యవాదములు తెలుపగలను? నీవు అతనిని ఇంద్రుని జేసితివి. తనను తాను మరచే ప్రమాదము సంభవించినపుడు, నీకు నీవుగా వచ్చి, అతని సంపదను హరించి అనుగ్రహించినావు. సుతల లోకములో బలికి రక్షకుడుగా నుండగలనని వాగ్దానము చేసినావు. నీ అనుగ్రహము పొందుటకు మేము చేసిన పుణ్యమేమో నాకు తెలియదు''.

వామనుడు దయాపూర్వకముగా నవ్వి ప్రహ్లాదునితో యిట్లనెను. ''ప్రహ్లాదా! సుతల లోకము ప్రవేశించి, నీ మనుమనితో నుండుము. నేను మీతోనే యెల్లపుడును ఉండెదను. చేతిలో గదను ధరించి మీ గృహమును పరిరక్షించెదను''.

దేవతలందరకూ నమస్కరించి, ప్రహ్లాదుడు సుతల లోకము ప్రవేశించెను భగవదాజ్ఞానుసారము బలి ప్రారంభించిన యజ్ఞమును శుక్రాచార్యుడు సంపూర్తి గావించెను.

## 101 మత్స్యావతారము

మత్స్యావతారమును సవివరముగా తెలుపమని పరీక్షిత్తు శుక బ్రహ్మను అడిగెను.

శుకు డిట్లనెను. ''గోవులకు, బ్రాహ్మణులకు, దేవతలకు, సత్పురుషులకు హాని కలుగు ప్రమాదము యేర్పడినపుడు, ధర్మము, వేదములు లేక లోకమే నాశనమగునపుడు వానిని రక్షించుటకు భగవంతుడు యీ భూమిపై అవతరించును. ఇంతకు పూర్వ కల్పాంతమున బ్రహ్మ దీర్ఘనిద్రలో నుండగా, యీ లోకము నీటిలో మునిగిపోయెను. బ్రహ్మ నిద్రించుచున్నపుడు, హయగ్రీవుడను అసురుడు వేదములను దొంగిలించెను వేదములతోబాటు ఆ అసురుడు నీటి అడుగునకు బోయెను మహా ప్రళయము నైమిత్తికము. ఆ ప్రళయమునకు పర్యవసానమే యీ లోకము నీటి అడుగునకు బోవుట

''ఆ సమయమందు సత్యవ్రతుడను రాజు యీ లోకమును పాలించుచుండెను. అతడు సాధు పురుషుడు, నారాయణునకు పరమభక్తుడు ప్రళయానంతరము లోకమును తిరిగి సృష్టించిన తర్వాత సత్యవ్రతుడు, ద్వాదశాదిత్యులలో ఒకడైన వివస్వతునకు కుమారుడుగా జన్మించెను అప్పటి మన్వంతరము వైవస్వత మన్వంతరమని పేరొందెను వివస్వతుని కుమారుడు శ్రాద్ధదేవుడు

ఒకరోజు సత్యవ్రతుడు ఉదయమున కృతమాలా నదీ తీరమున నిత్యకృత్యములను జరుపుచుండెను. పితృదేవతలకు అర్ఘ్యమిచ్చుటకై దోసిటిలో జలము తీసుకొనగా అందు ఒక చిరు చేపను అతడు కనుగొనెను. వెంటనే ఆ చిరు చేపను నీటిలో వదలిపెట్టెను. ఆ చిరు చేప మానవ స్వరముతో నిట్లనెను. ''ఓ రాజా! నాపై దయజూపుము నేను అతి చిన్న చేపను పెద్ద చేపల వలన నాకు భయము; అవి నన్ను తినివేయగలవు. ఈ నీటి నుండి నన్ను తీసుకొనిపోయి రక్షింపుము'' ఆ చేప మాట్లాడిన పలుకులకు అతని హృదయము ద్రవించెను ఆ చిరు చేపను చేతులతో తీసి తన కమండలములో నైచి గృహమున కేగెను.

''ఒక రాత్రి గడిచెను. మరునాటి ఉదయము ఆ చేప యిట్లనెను. ''ఈ పాత్రలో తగినంతగా నాకు స్థలము లేదు. వెడల్పైన మరొక పెద్ద పాత్రలో యుంచిన యెడల నేను సంచరించుటకు వీలుగా నుండును''. వేరొక పెద్ద పాత్రలో నీరు పోసి అందు యీ చేప నుంచెను. ఒక గంటలో ఆ చేప పాత్రను మించి యెదిగెను. సత్యవ్రతుడు దానినొక సరస్సులో నైచెను. తిరిగి అట్లే జరిగెను. తాను సంచరించుటకు స్థలము చాలుట లేదని ఆ చేప మొరపెట్టెను. ఆ రాజు ఒకదానికంటె పెద్దదైన మరొ సరోవరములో నైచుట, ఆ చేప పెరుగుచు మొరపెట్టుట జరుగుచుండెను. ఆఖరుకు ఆ చేపను సముద్రములో పడనైచెను. ఆ చేప రాజుతో యిట్లనెను

''ఈ సముద్ర మందున్న తిమింగిలములు నన్ను తప్పక తినివేయును. నన్ను యిక్కడ కెందుకు తీసుకువచ్చితివి?''

సత్యవ్రతుడు చిన్నగా నవ్వి యిట్లనెను. ''నీవు చాల విచిత్రమైన చేపవు. నీవు ఒక గంట కాలములో నూరు మైళ్ళ పొడవున్న సరస్సుకంటె పెరిగినావు. ఇదివర కెన్నడును నేను యిటువంటి దానిని చూడలేదు. నీవు సాధారణమైన చేపవు కావు. నీవెవరో నే నెరుగుదును. నీవు సాక్షాత్తు నారాయణుని రూపము. అయితే యే ప్రయోజనము కొరకై నీవు యీ రూపము దాల్చితివో నేనెరుగను. దేవాదిదేవా! నీకు నా నమస్కారము. అన్ని జీవులకు నీవు ఆశ్రయుడవు. నా వంటి అసహాయులను రక్షించుట కొరకే నీవు ఒక రూపము ధరింతువు. నీవు నాకు వ్యక్తముగుటచేత, యీ రూపము నెందుకు ధరించితివో దయచేసి నాకు చెప్పవలెను''. మత్స్య రూపములోనున్న భగవంతుడు సత్యవ్రతునితో నిట్లనెను. ''నీవు చెప్పినది సరియైనది. ఒక ప్రయోజనము కొరకు యీ రూపము ధరించినాను. ఏడు దినముల లోగా యీ ముల్లోకములు నీటిలో మునిగిపోవును. మహాప్రళయము సంభవించనున్నది. పూర్తిగా నీటిలో మునిగిన తర్వాత నీవైపుగా వచ్చు పడవనొక దానిని చూడగలవు. అప్రమత్తతో నుండి దాని రాకను గమనించవలెను. దానిని చూచిన వెంటనే నీవు ఆ పడవలో ప్రవేశించవలెను. ఓషధులను, విత్తనములను ప్రోగుచేసి, సప్తర్షులు వెంటరాగా వారితో పడవ నెక్కవలెను. నీ చుట్టును చిమ్మ చీకటిగా నుండును. కాని ఋషుల నుండి ఆవిర్భవించే తేజస్సు వెలుగునిచ్చి నీకు సహాయపడగలదు. అల్లకల్లోలముగా నున్న సముద్రమందు పెద్ద పెద్ద అలలు పడవ నటు నిటు విసురుగా ఊపుచుండును. నీవు భయపడవద్దు. నేను నీటిలో నుందును. నన్ను నీవు చూచినపుడు, వాసుకి సర్పమును త్రాడుగా జేసుకుని నా కొమ్ము నొకదానిని యీ పడవకు కట్టివేయుము. ఈ సముద్రమందు తనివితీర ఆటలాడుదును. ఇట్లు బ్రహ్మకు ఒక రాత్రి అగువరకు జరుగగలదు. నీవు నాతో నుండగలవు''.

''ఆ చేప అదృశ్యమయ్యెను''.

''భూమిపై కుశఘాసమును పరచి కూర్చుని సత్యవ్రతుడు, ఆ యేడు దినములు నారాయణుని నిర్విరామముగా ధ్యానించుచుండెను. ఏడవ రోజు నల్లని మేఘములు ఆకాశమును కప్పి, యేకధారగా వర్షము కురిసెను. శీఘ్రముగా భూమి అదృశ్యమగుచుండెను. దూరముగా తనవైపు త్వరత్వరగా వచ్చుచున్న పడవను కాంచెను. ఇంతకు పూర్వము సూచించినట్లుగా, ఓషధులు, వివిధ వృక్షముల విత్తనములతో పడవలో ప్రవేశించెను. సప్తర్షులు తన్ననుసరించిరి. భగవన్నామములను వారు ఉచ్చరించుచుండిరి. వారిట్లనిరి. 'ఓరాజా! భయపడకుము. భగవన్నామముతో యీ ప్రమాదకర ప్రయాణము చేయగలము'.

''బంగారు వన్నెలో బృహద్రూపముతో నున్న మత్స్యమును గాంచి, భగవంతుని కీర్తించుట మొదలిడిరి. అది చేరువకు వచ్చెను. ఇది వరలో సూచించిన ప్రకారము, ఆ మత్స్యము కొమ్ము నొకదానిని పడవకు గట్టిగా కట్టివేసెను. అలలకు పడవ విసురుగా అటు నిటు ఊగుచుండెను. అయితే పడవలో వారెవరూ, నారాయణుని అండలో నున్నామను ధైర్యముతో భీతి చెందలేదు.

''భగవంతునికి నమస్కరించి రాజు యిట్లనెను. 'ప్రభూ! అజ్ఞాన ప్రపంచములో పడియున్న మానవులు, నీ అనుగ్రహము చేత ముక్తి పొందగలుగుచున్నారు. చీకటిలో నున్న వారికి వెలుగు చూపి సహాయము చేయుచున్నావు. మాకు ఆత్మవిద్యను బోధింపవలయును. దాని వలన మేము నీలోని వారమనే జ్ఞానమును పొందగలము. దాని రహస్యము బోధించవలెను. తన్నావరించిన మాయ సత్యమని భావించి, అహంకార

మమకారములతో గుడ్డిగా సంచరించు మానవులు యెట్లు నీటి నతిక్రమించగలుగుదురో నాకు బోధించవలెను ఈ మాయ అనే తెరను ఛేదించి, నిన్ను దర్శించగలుగునట్లు మాకు సహాయపడవలెను'.

''అపార కరుణా సముద్రుడైన భగవంతుడు, సత్యవ్రతునికి బ్రహ్మవిద్య బోధించుటకు నిశ్చయించెను. జ్ఞాన భక్తి కర్మ యోగములను బోధించెను.

''సముద్రమందు లీలలు జరుపుచున్నపుడు, మత్స్యావతారములో నున్న నారాయణుడు హయగ్రీవుడను అసురునితో యుద్ధము చేసి వేదములను తెచ్చి ప్రళయాంతమున బ్రహ్మకు అప్పగించెను.

''సత్యవ్రతుడు వివస్వతునికి జన్మించి, శ్రాద్ధ దేవుడను పేరుతో వైవస్వత మన్వంతరమున మనువుగా వ్యవహరించెను''

# నవమ స్కంధము

## 102 మార్కండేయుడు

శుకుడు పరీక్షిత్తునకు చెప్పిన భాగవతమును ఉగ్రశ్రవుడు జ్ఞప్తికి తెచ్చుకొన్నప్పుడు, శౌనకుడు హఠాత్తుగా మార్కండేయుని గురించి తెలుసుకొనవలెనని కోరిక గలిగి, ఉగ్రశ్రవుని మధ్యలో ఆపి యిట్లనెను. ''ప్రభూ! నన్నొక సందేహము వేధించుచున్నది. మహాప్రళయము సంభవించినపుడు, యీ లోకమంతయు నీటిలో మునిగిపోగా, మృకండుని కుమారుడైన మార్కండేయుడు, అమృతత్వము నొంది యుండుటచేత యెట్టి బాధను అనుభవించలేదని కొందరు చెప్పగా విని యున్నాము. ఇది యెట్లు సాధ్యమా అనిపించుచున్నది. నాకు తెలిసినంత వరకు మార్కండేయుడు మా గోత్రములో అనగా భార్గవ గోత్రములో జన్మించినాడని మాత్రము తెలియును. పుట్టినప్పటి నుండి అతనిని మన మెరుగుదుము. ఇంతవరకు మనము ప్రళయమును చూడలేదు. అటువంటపుడు ప్రళయములో మార్కండేయున కెట్టి హాని జరుగలేదను కథకు ఆధారమేమి? మరియు సముద్రజలముపై మర్రి ఆకు నందు భగవంతుడు శిశువు రూపములో నుండగా అతడు చూచినట్లు, పద్మముల వంటి అతని చేతులు, పద్మము వంటి పాదము బొటన వ్రేలును పట్టుకుని పెదవుల వద్ద పెట్టుకున్నట్లు, సంతృప్తితో అతని ముఖము ప్రకాశవంతమైనట్లు కూడ వినియున్నాము. చిత్రాతి చిత్రమైన యీ వృత్తాంతమును దయచేసి మాకు విశదీకరింపవలెను''.

ఉగ్రశ్రవుడు (సూతుడు) యిట్లనెను. ''నీ ప్రశ్న సముచితముగా సవ్యముగా నున్నది. అంతేకాక నాకు, యీ ప్రపంచమునకు నారాయణుని కథ వివరించుటకు తెలుసుకొనుటకు అవకాశమేర్పడుచున్నది. ఈ కలియుగము నందు ప్రధాన లక్షణములైన మాయ, అజ్ఞానము మానవుని మనస్సు నుండి పారద్రోలు శక్తి యీ మార్కండేయ వృత్తాంతమునకు గలదు.

''మార్కండేయునికి తండ్రి మృకండుడు పవిత్ర యజ్ఞోపవీతము ధరింపజేసి గాయత్రి మంత్రము నుపదేశించెను. యువకుడైన మార్కండేయుడు వేద వేదాంగములలో ప్రావీణ్యము సంపాదించవలెనని దృఢముగా సంకల్పించుకొనెను. వానిని నిర్విరామముగా అధ్యయనము చేసి, స్వాధ్యాయమను తపస్సు నాచరించుటలో పరిపూర్ణుడయ్యెను. అతడు నైష్ఠిక బ్రహ్మచారి. అతడు నారవస్త్రములు ధరించియుండెను. తల మీద వెంట్రుకలు జడలు కట్టెను. అతని ప్రశాంత వదనము యోగులకు కూడ యీర్ష్య కలుగునట్లుండెను. అతని చేతియందు కమండలము ఉండెను. మౌంజి, లేడి చర్మము అతని ప్రకాశము నినుమడింపజేయుచుండెను. ఎల్లపుడును చేతిలో జపమాల యుండగా అతని పెదవులు భగవన్నామము నుచ్చరించుచుండెను. ఉదయము, సాయంకాలము విశ్శబ్దముగా భిక్షా పాత్రను తీసుకుని బయటికి వెళ్ళి, తిరిగి గురువుకు భిక్ష తీసుకొని వచ్చుచుండెను. గురువు తనకు యేమైన యిచ్చినచో భుజించెడివాడు, లేకున్న పస్తుండెడివాడు. భగవంతునికి చేయు పూజా విధానముల యెడ ఉన్న గాఢభక్తిచేత అతడు మృత్యుంజయుడయ్యెను. బ్రహ్మకు, భృగువునకు, మహాదేవునకు, దక్షునకు, దేవతలకు, పితృదేవతలకు, అందరకూ అది యొక అద్భుతముగా తోచెను. గొప్ప యోగి యైన మార్కండేయుని మనస్సులో యెట్టి అల్లకల్లోలములు లేవు. అతి ప్రశాంతమైన

సరస్సువలె నుండెడిది నారాయణుని గురించిన ఆలోచనలే అతని మనస్సు నందు ఉండెడివి

''అతని సుస్థిర తపశ్శక్తిపై ఇంద్రునికి సందేహము గలిగెను ఇంద్రుడు మార్కండేయుని తపస్సు భంగము గావింపదలచెను. ఆ యోగి మనస్సు నల్లకల్లోలము గావించుటకు తన పరివారమును పంపెను గంధర్వులు గానము చేసిరి అప్సరసలు నాట్యమాడిరి ప్రణయదేవతయైన మన్మథుడు వారికి నాయకత్వము వహించెను వసంతుడు, మలయానిలుడు అతనికి సహాయకులుగా నుండిరి మలయానిలుడు ప్రణయ భావములు రేకెత్తించు చల్లని వాయువులను బరపుచుండెను. హిమాచలమునకు ఉత్తరదిక్కున పుష్పభద్రయను నదీ తీరమున 'చిత్ర'యను పేరుగల గుట్ట యొకటి ఉండెను. అచట మార్కండేయుడు ఆశ్రమము నిర్మించుకొనెను అది పవిత్రస్థలము. ఆశ్రమము సమీపములోని సరస్సు తీరము, భగవంతు నర్చించుట కర్హమైన పువ్వులను పుష్పించు వృక్షములు, పొదలు, లతలతో నిండియుండెను. ఆశ్రమము, పరిసర ప్రాంతములందు ప్రశాంతత వ్యాపించి యుండెను ఆ ప్రదేశమున వాయువు కామునితో కూడి ప్రవేశించి, జలపాతము నుండి జలను తెచ్చి చుట్టును జల్లెను. తుమ్మెదలు ఝుమ్మని ఝుంకారముతో, మత్తెక్కిన వానివలె, గానము చేయుచుండెను. కోయిలలు ప్రణయ గీతములను విన్పించుచుండెను. నెమళ్ళు విచ్చలవిడిగా నాట్యము చేయుచుండెను. పక్షులు వాతావరణమందలి మత్తును గ్రహించినట్లుండెను వసంతుడు ఆ స్థలమున ప్రవేశించి, వృక్షముల పచ్చని ఆకులు, రెమ్మలు, పుష్పముల వెనుక దాగి పిచ్చి యెక్కించునట్లుగా పుష్పపరిమళమును వ్యాపింపజేసెను మన్మథుడు, గాయకులతో నాట్యకత్తెలతో అచటికి వచ్చి దాడి చేయుటకు పన్నాగము పన్నెను

''మార్కండేయుడు యోగ సమాధికి సన్నద్ధుడై యుండెను. అతడప్పుడే అగ్ని పూజలు ముగించి కనులు మూసుకుని యుండెను అగ్ని మూర్తీభవించి ఆసీనుడైనట్లు గోచరించెను

''అతని సమక్షములో అప్సరసలు నాట్యము చేయుచుండిరి చెరకు విల్లును మన్మథుడు యెత్తి, అయిదు అమ్ములను వింట సంధించెను ఇంద్రుని కతిప్రియమైన అప్సరస పుంజకస్థల ఋషిని కవ్వించుటకు వచ్చెను. మార్కండేయుడు కనులు తెరచుట చూచి, యిదే తగిన సమయమని యెంచి మన్మథుడు బాణములు ప్రయోగిం ను అయితే భగవదనుగ్రహము లేని మానవ ప్రయత్నములు విఫలమైనట్లు, మన్మథ బాణముల న్నియు వి యోజనము లయ్యెను మార్కండేయుని తీవ్రతపము వేడికి నిలుపలేక, నిద్రించుచున్న త్రాచును కదిపి పారి యిన బాలురవలె, దూరముగా పారిపోయిరి. అతడు స్తిమితము గోల్పోక, వారిని శపింపక యుండెను అతనిలోని గొప్ప సుగుణమిది

''మన్మథుడు అతని పరివారము ముఖములు వ్రేలవేసుకుని తిరిగి వచ్చుట జూచిన ఇంద్రుడు జరిగిన విషయము నూహించి, అదెట్లు జరిగెనాయని ఆశ్చర్యపడెను.

''తప స్వాధ్యాయ సంయమములతో సంపన్నుడైన మార్కండేయునికి నారాయణుడు, నర నారాయణ రూపముతో ప్రత్యక్షమయ్యెను. ఒకరు నల్లగాను, మరొకరు తెల్లగాను నుండిరి. వారి నే
వికసించిన పద్మ పత్రములవలె నుండెను. ఒక్కొక్కరికి నాలుగు భుజము లుండెను వారు లేడి చర్మము, నార దుస్తులు ధరించి యుండిరి. మెడలో యజ్ఞోపవీతము, చేతి వ్రేళ్ళయందు పవిత్రమైన దర్భలు కలిగి యుండిరి చేతులందు కమండలము, జపమాల, బ్రహ్మదండము నుండెను తన పూర్వులందరూ చేసిన తపస్సులు ఫలితము కూడగట్టుకుని రూపము ధరించెనా యని మార్కండేయుడు భావించెను అత్యంత ఉత్సాహముతో లేచి నిలబడి, వారి పాదములపై బడెను. కనులు అశ్రువులతో నిండి యుండుటచే వారిని

సరిగా చూడలేకుండెను. అతడు చేతులు జోడించి, తడబడుచున్న పదములతో వారికి స్వాగతము పలికెను. వారికి అర్ఘ్యపాద్యముల నిచ్చి అసీనులను జేసెను. వారిని పుష్పములతో పూజించెను. తనను తాను సముదాయించుకున్న పిదప, వారిని కీర్తించెను. అతడిట్లు పలికెను. 'ప్రభూ! ఈ లోకము నంతనూ వ్యాపించి యున్నావు. నీవు బ్రహ్మవు, మహేశ్వరుడవు. నాలో నున్న ఆత్మవు నీవు. నీవు వాక్కునకు, మనస్సునకు ఇంద్రియములకు ప్రభుడవు. మానవులు ఇంద్రియము లాడించునట్లు ఆడునట్లుగా చేయుచున్నావు. ఈ బొమ్మలాట నుండి తిరిగి వారిని నీవే రక్షించుచున్నావు. లోక కళ్యాణము కొరకై నీవు యీ ద్వంద్వ రూపములు ధరించుచున్నావు. సాలెపురుగు తన నుండి ఉత్పన్నమైన పదార్థముతో గూడు కట్టుకుని, తిరిగి ఆ గూడును తానే విప్పివేసి దానిని మ్రింగినట్లు, యీ లోకమును సృష్టించి తిరిగి నీలో లయము గావించుకొనుచున్నావు.

'' 'నీ పాదముల చెంత ఆశ్రయము పొందిన వానికి కర్మ తన నంటి పెట్టుకుని యుండునన్న భయముండదు. గుణములు, కాల ప్రభావము అతని కుండవు., నేనెప్పుడును నిన్నే తలంచుచుందును. అందుకు నీవిపుడు ప్రత్యక్షమై నన్ననుగ్రహించినావు. నీ పాద స్పర్శకు మించినది వేరొకటి లేదు. నీ దర్శన భాగ్యము కలిగిన మానవునకు శిథిలమయ్యే శరీరముపై మమకారము యెట్లు ఉండగలదు? ఈ శరీరము అనిత్యము, అసత్యము, నిష్ప్రయోజనమైనది, ఆత్మను మనస్సు గ్రహింపకుండ మరుగుపరచును. ఈ లోకమందు సృష్టి స్థితి లయలు నీ మాయవలన కలుగుచున్నవి; త్రిగుణములచే, మానవుని అజ్ఞానముచే నీమాయ యినుమడించుచున్నది. నీవు సర్వజ్ఞుడవు, నిత్యుడవు, ఆది పురుషుడవు. నీకు నా నమస్కారము. నీవు యీ లోకమంతయు వ్యాపించి యున్నావు. నిన్ను అరికట్టు వస్తువేదియు లేదు. అన్నింటికీ ప్రభువువైన నీకు నా ప్రణామములు. ఇంద్రియ ప్రలోభములు మానవునికి భ్రాంతి కల్గించి వివేచనా శక్తిని నశింపజేయును. ఇంద్రియములందు, శ్వాసయందు, హృదయమందు నీ ఉనికిని గ్రహించలేకున్నాడు. నీ మాయచేత అజ్ఞానమను సముద్రములో యీదులాడుచున్నాడు. సృష్టికర్తయైన బ్రహ్మ కూడ, నీవు వేదములు బోధించి సత్యమును తెలియజెప్పునంతవరకు, అవిద్యలో నుండెనని చెప్పుదురు. దేవాదిదేవుడవైన నీకు నా నమోవాకము లు'.

''నర నారాయణులు అతని పూజలను చిరునవ్వుతో స్వీకరించిరి. వారిట్లు పలికిరి. 'నీ సంయమము, తపశ్శక్తి స్వాధ్యాయము, నిశ్చలభక్తి నిన్ను సిద్ధపురుషుని గావించెను. మాకు మిక్కిలి సంతోషము కలిగెను. నీవు కోరు వరమును మేము ప్రసాదించగలము'.

''మార్కండేయు డిట్లనెను. 'మిమ్ము దర్శించిన తర్వాత, యే మానవునకైననూ యితర విషయములపై కోరిక యుండునా? అయినప్పటికీ భగవదాజ్ఞను ఉల్లంఘించుట మర్యాద కాదు. అందుచే నేనొక వరమడిగె దను, మానవుని మనస్సులో అజ్ఞానమునకు కారణమైన మాయను గురించి తెలియగోరుచున్నాను. దయచేసి తెలుపవలెను'.

'' 'అట్లే కానిమ్ము. భగవంతుని మాయ నీకు వ్యక్తము కాగలదు' అని పలికి నర నారాయణులు బదరి కాశ్రమమునకు వెళ్ళిపోయిరి''.

# 103 మార్కండేయుడు చూచిన దృశ్యము

''పుష్పభద్రా నదీ తీరమున 'చిత్ర' అను గుట్టపై నిర్మించుకొనిన ఆశ్రమములో మార్కండేయుడు ప్రార్థనతో, ధ్యానముతో కాలము గడపుచుండెను. నర నారాయణులుగా ప్రత్యక్షమై తన్ననుగ్రహించిన ఆ సుదినమును పదేపదే తలచుకొనుచుండెను అతడు అన్నింటి యందు భగవంతునే చూచుచుండెను భగవంతుడు తప్ప యింకేదియు అతనికి గోచరించుట లేదు. ఒకొక్కపుడు అతని ఆలోచనలన్నియు భగవంతుని యందు నిమగ్నమై యుండి, నిత్యమూ జరుపు పూజా విధులను మరచుచుండెను.

''ఒకరోజు అకస్మాత్తుగా పెద్దగాలి వీచ నారంభించెను. అది ఒక భీకరమైన తుఫానుగా చెలరేగి కుండపోతగా వర్షింపసాగెను. పిడుగులతో ఆ గుట్ట దద్దరిల్లుచుండెను. మెరపులతో ఆ ప్రదేశము ఉండి ఉండి వెలుగుతో నిండుచుండెను. అసాధారణమైన వర్షము కురియుచుండెను. వర్షధారలు అదే పనిగా పడుచుండెను. నాలుగు సముద్రములు నిండి, పొంగి పొరలి ఒకటి అగునట్లు ఉండెను. నీటితో నిండి భూమి కన్పింపకుండెను. తిమింగలములు, పెద్ద జలచరములు, మొసళ్ళు మాత్రమే కన్పించుచుండెను. సుడిగుండములు యేర్పడి, వాటి పరిధిలోనికి వచ్చిన వానిని కబళించుచుండెను. వర్షము, సముద్రముల హోరు, యింకేదియు వినిపించనంత తీవ్రముగా నుండెను

''అట్లు చూచుచుండగనే, భూమి అదృశ్యమగుట మార్కండేయుడు చూచి భయవిహ్వాలుడయ్యెను. అతి త్వరలోనే యెత్తైన గుట్టలు, పర్వతములు నీటిలో మునిగిపోవుట జూచెను ఆకాశమునకు, భూమికి మధ్య నుండు గీత, భూమి అదృశ్యమగుటచేత, కనుపించకుండెను. మిగిలిన రెండు లోకములు, దేవతలు, నక్షత్రములు కూడ జలమయము లగుట జూచెను అతడు దిక్కు తెలియక, గమ్యము లేక ఆ నీటిపై తేలుచున్నట్లు కనుగొనెను. ఆకలి దప్పికలతో సతమతమగుచుండెను. పెద్దచేపలు, తిమింగిలములు, యితర జలచరములు చాల భయంకరముగా నుండెను. చుట్టూ చీకటి ఆవరించెను విసరినైచిన కొయ్య మాదిరిగా ఆ నీటిలో ఒంటరిగా భయమావహింపగా తేలుచుండెను ఒకసారి సుడిగుండములో చిక్కుకుని తిరిగి యది దూరముగా విసరినైచినపుడు, ఒక పెద్ద అల వచ్చి మరొక చోటుకు తీసుకుపోయెను తాను నిర్జించిన భయములన్నీ ఒక్కసారిగా కలుగుచున్నట్లు తోచెను. అనారోగ్యముతో బాధపడుచు విచారించుచుండెను. భయభ్రాంతులకు లోనయినట్లు తలచెను మరణము కలుగునేమో యను ఆలోచన రాగా, ఆ ఆలోచనకు భయకంపితుడయ్యెను ఒకప్పుడు మృత్యువును జయించితినన్న విషయము అతనికి తెలుసు! అయిననూ, యిప్పుడు తాను నిజముగా మరణించ నున్నాడని తలంచి భీతి చెందెను. ఆ విధముగా అతడు భయము, బాధ ముంచుకురాగా, అలలచే అటు నిటు చెదరిపడుచుండెను

''ఆ విధముగా నీటిలో తేలుచున్న మార్కండేయుడు దూరముగా నున్న ఒక అశ్వత్థవృక్షమును చూచెను అశ్వత్థవృక్షము పెద్దదిగను, దాని కొమ్మలకున్న ఆకులు కొత్తగా ఆకుపచ్చని రంగుతో నున్నట్లు అతడు చూచెను. ఆ చెట్టులో ఒక కొమ్మ తాను నిలిచియున్న ప్రదేశమువైపు వాలియున్నట్లు గమనించెను ఆ కొమ్మలోని అశ్వత్థ పత్రముపై అతడొక విచిత్ర దృశ్యమును గాంచెను

''అశ్వత్థ పత్రము మీద ఒక శిశువు నిద్రించుచుండుట అతడు చూచెను ఆ శిశువు నుండి వెలువడు కాంతి చుట్టును ఆవరించియున్న చీకటిని పారద్రోలుచున్నదా యను నట్లుండెను నీలమణి వర్ణములో ఆ

శిశువు ఉండెను. పద్మమువలె శిశువు ముఖము సుందరముగా నుండెను. మెడ శంఖము వలె అతి చక్కగా నుండెను. వక్షము విశాలముగా నుండి, నాసిక సానపట్టినట్లుండెను. వంకరలు తిరిగిన తల వెంట్రుకలు ముఖము మీద పడుచూ, ఉచ్ఛ్వాసమునకు కదలుచు ఆడుచున్నట్లుండెను. ఆలిచిప్పలవలె నున్న ఆ శిశువు చెవులు దానిమ్మ పుష్పములను ధరించెను. ఆ శిశువు చిరు పెదవులపై దరహాసము గోచరించెను. చిన్నారి చేతులతో పద్మము మొగ్గవలె నున్న పాదము బొటకన వ్రేలును పట్టుకుని లాగి పెదవులతో చప్పరించుచూ అమితానంద ములో మునిగి యుండెను.

''అత్యంత సుందరముగా నున్న ఆ శిశువు నుండి మార్కండేయుడు తన కండ్లను మరల్చలేకపోయెను. ఆ శిశువును చూచినంతనే, మార్కండేయ మహర్షి అంతవరకు తాను పొందిన అలసటను మరచిపోయెను. మరింత వెడల్పు చేసుకున్న కన్నులతో ఆ శిశువు నట్లే చూచుచు ఋషి తన్మయత్వము చెందెను. ఈ శిశువు యెవరా యని తలచెను. మరింత దగ్గరగా వెళ్ళి శిశువును చూచెను. శిశువు దగ్గరకు వెళ్ళగా ఆ శిశువు శ్వాస తనను లాగుచున్నట్లు అనిపించెను. మార్కండేయుడు, దోమ ప్రవేశించినట్లుగా, శిశువు ఉచ్ఛ్వాసతో శిశువు శరీరము నందు ప్రవేశించెను.

''శిశువు శరీరము లోపల మార్కండేయుడు, వర్షము రాకముందున్న ప్రపంచమును గాంచెను. ఆ దృశ్యము చూచిన మార్కండేయుడు అచ్చెరువందెను. అతడు భూమినంతయు జూచెను. స్వర్గమును, నక్షత్రములతో నిండిన ఆకాశమును గాంచెను. పర్వతములు, ద్వీపములు, దేవతలు నాలుగు దిక్కులను రక్షించుట జూచెను. అసురులను జూచెను. అడవులు, నగరములు, ఆశ్రమములు, అన్నిటినీ జూచెను. హిమవత్పర్వతము, పుష్పభద్రా నదీతీరము, చిత్రగిరిపై తన ఆశ్రమమునూ కనుగొనెను. ఇంతలో శిశువు నిశ్వాసముతో మార్కండేయుడు బయటకు వెడలి వచ్చెను. తిరిగి మార్కండేయుడు సముద్రముపై తేలుచుండెను. ఇంకను ఆ శిశువును చూచుచు, శిశువుచే ఆకృష్టుడై యాదుకొని దగ్గరకు చేరి, శిశువును ఆలింగనము చేయదలచెను. అంతలో ఆ శిశువు అక్కడ నుండి అదృశ్యమయ్యెను. అశ్వత్థ వృక్షము, సముద్రము, నీటి అలలు అన్నియు అదృశ్యమయ్యెను. తిరిగి తన ఆశ్రమములో నేలపై తానున్నట్లు మార్కండేయుడు కనుగొనెను.

''ఈ విచిత్ర అనుభవమును పొందిన మార్కండేయుడు, నారాయణుని యందు మనసు లగ్నము చేసి సమాధిలో నున్నట్లుండెను.

''పార్వతీ పరమేశ్వరులు ప్రమథ గణములతో ఆకాశమునందు సంచరించుచుండిరి. పార్వతి మార్కండే యుని జూచి, భర్తతో ఋషిని ఆశీర్వదించి అనుగ్రహించమని జెప్పెను. వారు భూమికి దిగి వచ్చి మార్కండేయునికి ప్రత్యక్షమైరి. మార్కండేయుడు అత్యంత ఉత్సాహముతో వారికి స్వాగతము చెప్పి గౌరవ మర్యాదలు సలిపెను. ఫల పుష్ప హారతులతో పూజించి, ప్రణమిల్లి ప్రార్థించెను. అంత పరమేశ్వరుడు (మహాదేవుడు) మార్కండేయునితో యిట్లనెను. 'నీకు నారాయణునందున్న భక్తిచే సిద్ధిని పొందితివి. నీవు అతనిచే వరమును పొంది, విష్ణుమాయను తెలుసుకునే ప్రత్యేకత సాధించినావు. నీవు చిరంజీవివై పురాణచర్యు డుగా పేరు గాంచెదవు. నీవు చెప్పు భగవత్కథలను విని యీ లోకములోని ప్రజలు తరింతురు'.

''పార్వతీ పరమేశ్వరులు ప్రమథ గణములతో తిరిగి ఆకాశమున కెగసిపోయిరి. మార్కండేయుడు, తనకు గలిగిన విచిత్ర అనుభవమును — మహా ప్రళయము, అందు అశ్వత్థ వృక్షపు ఆకులో శిశువును గాంచుట — పదే పదే చింతించుచుండెను''.

# 104 సుకన్య

ప్రళయము తర్వాత భగవంతుడు తప్ప యింకేదియు మిగులలేదు. నారాయణుని నాభి నుండి పద్మము, పద్మము నుండి బ్రహ్మ ఆవిర్భవించెను. బ్రహ్మ మానసపుత్రుడు మరీచి మహర్షి. దాక్షాయణి అతని భార్య వారి కుమారుడు కశ్యపుడు. కశ్యపుని భార్య అదితి వారి పుత్రుడు సూర్యుడు. సూర్యుని కుమారుడు శ్రాద్ధదేవుడు. పూర్వ కల్పములో అతడు సత్యవ్రతుడు. ఈ కల్పములో వివస్వతునికి కుమారుడుగా బుట్టి, మనువుగా వ్యవహరించుటచే వైవస్వత మనువుగా ప్రసిద్ధి పొందెను శ్రాద్ధదేవుని కుమారుడు ఇక్ష్వాకుడు వైవస్వతుని వంశము సూర్య వంశమని పేరొందెను ఆ తర్వాత ఇక్ష్వాకుడు రాజ్యమేలి పేరుగాంచుటచే ఇక్ష్వాకు వంశమని పేరు బడసెను

మను పుత్రులలో ఒకడు శర్యాతి అతడు చాల ధర్మశీలుడు. అతని పుత్రిక సుకన్య ఆమె అందమైనది పద్మముల వంటి నేత్రములు గలది ఆమెకు యుక్తవయస్సు వచ్చినప్పటికీ, తండ్రి ఆమె యింకను పసిబాలిక యని తలంచుచుండెను. తండ్రికి ఆమెపై అమితప్రేమ అమాయకురాలైన ఆమె అందరికీ ప్రేమ పాత్రురాల య్యెను

ఒకసారి రాజు తన పరివారముతో అడవికి వెళ్ళినపుడు, సుకన్య కూడ తండ్రి ననుసరించి వెళ్ళెను. వారు చ్యవన మహర్షి ఆశ్రమమునకు వచ్చిరి చ్యవనుడు చాల కాలము ధ్యానములో మునిగి యుండెను. తపస్సు ప్రారంభించి అనేక సంవత్సరములు గడచి యుండుటచే అతని చుట్టును మట్టి పుట్టలు కట్టుటచే, అతడు కనుపించక యుండెను. రాకుమారి సుకన్య అచట సంచరించుచూ, మహర్షి చుట్టునున్న పుట్టను వింతగా చూడసాగెను పుట్ట దగ్గరగా వెళ్ళి చూడగా, ఒక కన్నము నుండి మిణుగురు పురుగు వలె మెరయుచున్న రెండు మెరపు బిందువులను గాంచెను పసితనపు చేష్టలను విడనాడని సుకన్య ఒక దర్భపుల్లను తీసుకుని ఆ కన్నములో పెట్టి మెరయుచున్న బిందువులకు తగులునట్లు గుచ్చెను ఆ రెండును మహర్షి నేత్రములు; సుకన్య వానిని గుచ్చి ఋషికి బాధ కలిగించెను ఆ ఋషి ఆగ్రహము చెంది, రాజు సేనా పరివారము స్తంభించిపోవునట్లు చేసెను ఈ దారుణ పరిణామమునకు కారణమేమిటో రాజు ఊహించలేకపోయెను ప్రతిఒక్కరిని పిలిచి మహర్షి నెవరైననూ అవమానించిరేమోయని అడిగెను సుకన్య సంకోచించుచు తండ్రిని సమీపించి, జరిగిన దంతయూ తెలిపెను జరిగిన దారుణము విని రాజు భయకంపితుడై ఋషి వద్దకు వచ్చెను అనాలోచితముగా తన కుమార్తె చేసిన పాప కార్యమునకు తనను, తన కుమార్తెను క్షమించమని రాజు ఋషిని ప్రార్థించెను తన కుమార్తెను మహర్షికిచ్చి వివాహము చేసెదనని పలికి, ఋషిని సమాధానపరచెను

సుకన్యా చ్యవనుల వివాహము జరిగిన తర్వాత, ఆమె ఋషి ఆశ్రమమునకు వెళ్ళిపోయెను. ఆమె అనాలోచితముగా చేసిన చర్యకు రాజు సేనా పరివారము స్తంభించిన ఆ క్షణములో ఆమెలో పసితనము పోయి ప్రౌఢత్వము ప్రవేశించెను. దేవహూతి కర్దముని సేవించినట్లు, ఆమె చ్యవన మహర్షిని సేవించుచుండెను

ఒకసారి అశ్వినీ దేవతలు చ్యవనుని ఆశ్రమమునకు వచ్చిరి సుకన్య సేవలకు ఋషి సంతోషించి, ఆమెను సంతోషపరుప తలచెను అందుచే ఋషి అశ్వినీ కుమారులకు గౌరవ మర్యాదలు చేసి, వారి నొక వరము కోరెను వారితో ఋషి యిట్లు పలికెను ''మీరు దివ్య భిషక్కులు మీరు వైద్యులగుటచే, దేవతలు మీకు

యజ్ఞములలో సోమభాగమును యిచ్చుటలేదు. మిమ్మ తక్కువ జాతి దేవతలుగా పరిగణించుచున్నారు. మీరు నన్ను అందమైన, ఆకర్షణీయమైన యువకునిగా జేసినచో, అందుకు ప్రతి ఫలముగా మీకు సోమములో భాగము వచ్చునట్లు చేసెదను''.

అశ్వినీ కుమారులు, తమ ప్రతిష్ఠ పెరుగునని తలంచి, సంతోషించి, ఋషికి యౌవనము ప్రసాదించుట కంగీకరించిరి మంత్రముల నుచ్చరించిన తర్వాత, తాము ఔషధములను ప్రయోగించిన ఒక చెరువులో ప్రవేశించమని అశ్వినీ కుమారులు ఋషిని ఆదేశించిరి. ఆ ప్రకారము ఋషి ప్రవేశించెను. ఒక క్షణము తర్వాత, ఆ చెరువు నుండి ముగ్గురు యువకులు బయటకి వచ్చిరి. వారు ముగ్గురు పద్మములతో కట్టిన హారములు ధరించి యుండిరి వారి చెవులకు మణులతో పొదిగిన కుండలములు కలవు అందమైన పట్టు వస్త్రములను వారు ధరించి యుండిరి. సతీమణియైన సుకన్య వారు ముగ్గురనూ చూచి, వారిలో తన భర్త యెవరో తెలుసుకొనలేకపోయెను. ఆమె అశ్వినీ కుమారులకు ప్రణమిల్లి యిట్లనెను ''నా పాతివ్రత్యమును నేను కాపాడుకొనునట్లు చేసి నన్ను కరుణింపుడు. ముగ్గురు యెడముగా నిలుచుండుడు. నా భర్తను నేను కనుగొనెదను!''. వారు ఆమెను కరుణించి చ్యవనుని ఆమె గుర్తించునట్లు చేసి, ఋషికి దూరముగా నిలుచుండిరి అశ్వినీ కుమారులు ఋషి దంపతుల వద్ద సెలవు తీసుకుని తిరిగి స్వర్గము చేరిరి.

ఇంతలో సుకన్య తండ్రి శర్యాతి, యజ్ఞము చేయ సంకల్పించి చ్యవనునితో సంప్రదించుటకై ఆశ్రమమునకు వచ్చెను ఆశ్రమములో ప్రవేశించిన శర్యాతి, తన కుమార్తె దేవతలను పోలిన అందమైన యువకునితో నుండుట జూచెను ఇది చూచి రాజు దిగ్భ్రాంతుడయ్యెను సుకన్య పట్టరాని సంతోషముతో తండ్రిని సమీపించి అతని పాదములకు ప్రణమిల్లెను కాని అతడామెను ఆశీర్వదించక ముఖము త్రిప్పుకొనెను. తండ్రి ముభావముగా నుండుటకు కారణము ఆమె ఊహించలేకపోయెను. క్రోధముతో నున్న తండ్రిని చూచి, ఆమె అమాయికముగా యిట్లడిగెను ''తండ్రీ! నీవెందుకు కోపముగా నున్నావు? నన్ను చూచి నీవు అసంతృప్తి చెందుటకు కారణమేమి? చాల దినముల తర్వాత నిన్ను నేను చూడగల్గుచున్నాను. కాని, నీవు నాయందు సుముఖత చూపకుండుటచే నాకు బాధగా నున్నది. ఒకప్పుడు నాపై నీ కమితమైన ప్రేమ యుండెను. కాని యిప్పుడు అట్లు కాదు. నీకు నేనేమి అపచారము చేసితిని? దయచేసి నాకు చెప్పవలెను!'' శర్యాతి ఆమెను చూచి యిట్లనెను. ''నాయెదుట నిలుచుని యీ ప్రశ్న అడుగుటకు నీకెంత ధైర్యము? నీవు నాకు పుత్రికగా నుండు అర్హతలేదు. గొప్ప మను వంశములో జన్మించిన నీవు 'అసతి'గా యెట్లు మారితివి? చ్యవన మహర్షి నీచేత మోసగింపబడినాడు. అతడు నిన్ను శపింపకుండుట నాకు ఆశ్చర్యముగా నున్నది. నీవెట్లు సిగ్గులేక యుంటున్నావు? ఈ యువకునితో వ్యభిచరించుచూ, నన్ను ఆశీర్వదించమని యెట్లు అడుగుచున్నావు. ఇక నుండి నీవు నా కుమార్తెవు కావు. నీ ముఖమును చూడదలచుకోలేదు''. అతడు తిరిగి వెళ్ళిపోవనుండెను.

ఇంతలో వెనుక నుండి నవ్వులు వెండి గంటలు మ్రోగినట్లు వినిపించగా, వెళ్ళిపోనున్న ఆమె తండ్రి ఒక క్షణమాగెను వెనుకకు తిరిగి కుమార్తెను జూచి ఆశ్చర్యపోయెను. యువకుడైన ఆమె భర్త చ్యవనుడు కూడ ఆమెతో కలిసి నవ్వుచుండెను. ఆ దంపతు లిరువురూ శర్యాతి కడకు వచ్చిరి. అతనితో సుకన్య యిట్లనెను ''తండ్రీ! నేనెట్టి పాపము చేయలేదు. ఈ యువకుడు నీ అల్లుడు, చ్యవన మహర్షి తప్ప వేరొకరెవరూ కాదు''

వారు జరిగిన దంతయు వివరించి, తమ అదృష్ట భాగ్యమునకు అశ్వినీ దేవతలు యెట్లు కారకులైరో

ఆ వృత్తాంతమంతయూ తెలిపిరి.

చ్యవనుడు శర్యాతికి సోమ యజ్ఞము జరిపి, యజ్ఞము జరుగుచుండగా సోమమును అశ్వినీ దేవతలకు సమర్పించెను. ఇది చూసిన దేవతలు అసంతృప్తులు కాగా, ఇంద్రుడు అచటకు వచ్చెను. ఇంద్రుడు మండిపడి చ్యవనుని నాశనము చేయుటకు తన వజ్రాయుధమును ప్రయోగింపబూనెను. అయితే చ్యవనుని తపశ్శక్తి ఇంద్రుని భుజమును స్తంభింపజేసెను. స్వర్గాధిపతియైన ఇంద్రుడు తన భుజమును కదల్చలేకపోయెను; అతని చేతిలో నున్న వజ్రాయుధము జడముగా మారెను. అనవసరముగా స్వార్థముతో వ్యవహరించుచున్నానని ఇంద్రుడు గ్రహించి, దేవతలతో బాటు అశ్వినీ కుమారులు కూడ సోమములో భాగము తీసుకొనుటకు అంగీకరించెను. అప్పటి నుండి అశ్వినీ దేవతలకు సోమము లభించుచుండెను.

## 105 నాభాగుడు

ఇక్ష్వాకు వంశములో నభగుడు గొప్ప మహారాజు. అతని పుత్రుడు నాభాగుడు. యువకుడైన నాభాగునకు చదువుయందు మిక్కిలి ఆసక్తి యుండుటచేత కాలమంతయూ గురువు వద్దనే గడపుచుండెను. కొంత కాలమునకు నభగుని ఆస్తి విభాగము జరిగినపుడు, నాభాగుని పూర్తిగా విస్మరించి అతని సోదరులు తండ్రి ఆస్తిని తమలో తాము పంచుకొనిరి. గురువు యింటి నుండి తిరిగి వచ్చిన నాభాగుడు తన సోదరుల కడకేగి యిట్లడిగెను. ''మన తండ్రి ఆస్తిలో నా భాగమేది?'' అతని సోదరులు, ''నీవు చాల కాలము గురువు యింట నుండుటచేత, నీ విషయము పూర్తిగా మరిచినాము. తిరిగి అంతయూ విభజించుటకు సమయము మించిపోయినది. కాని మన తండ్రిగారిని యింతవరకూ పంచుకొనలేదు. అందుచేత తండ్రిని నీ భాగముగా తీసుకు వెళ్ళవచ్చును. నీతో తీసుకువెళ్ళి అతడిని సంరక్షింపుము'' అని జవాబిచ్చిరి.

నాభాగుడు తండ్రి వద్దకు వెళ్ళి తన సోదరులు చెప్పిన దంతయూ వివరించెను. తండ్రి నాభాగునితో యిట్లనెను. ''కుమారా! నీ సోదరులు దురాశాపరులై నిన్ను మోసపుచ్చిరి. నేను ఆస్తివలె నీవు జీవించుటకు వినియోగపడలేను. అయినప్పటికీ, యీ విధముగా జరుగుటచేత, నీకు సహాయము చేయుటకు యేదో నొక మార్గము కనుగొందును''. ముసలి తండ్రి కొంతసేపు యోచించి యిట్లనెను. ''నీవు జీవించుటకు నేను నీకు యే విధముగా సహాయపడగలనో నాకు తెలియును. నీవు ఆస్తి సంపాదించగలుగు మార్గము నాకు తెలుసు. ఇక్కడకు దగ్గరలో అంగిరసులు ''అభిప్లవ'', ''ప్రిష్ట్య'' అను యజ్ఞములు జరుపుచున్నారు. ఆ యజ్ఞములను మొదలుపెట్టిన ఆరు దినములలో పూర్తిచేయవలసి యున్నది. అంగిరసులు జ్ఞానవంతులు, అధ్యయనపరులు అయినప్పటికీ, కీలకమైన మంత్రము నొకదానిని వారు జ్ఞప్తియందుంచుకొన లేకున్నారు. ఆ మంత్రము నుచ్చరింపకున్నచో యజ్ఞము సంపూర్ణము కానేరదు. నేను నీకు రెండు మంత్రములు బోధించెదను. నీవు యజ్ఞశాలకు వెళ్ళి అక్కడ ఉండి యీ రెండు మంత్రములను పఠింపుము. యజ్ఞము పూర్తియై సఫలమగుటచేత వారు స్వర్గమున కేగుదురు. అందుకు కృతజ్ఞతగా, యజ్ఞశాలలోని విలువైన వస్తువులను నీకు ప్రసాదించెదరు. ఆ విధముగా లభించిన సంపదతో నీవు సుఖముగా జీవించగలవు''.

నాభాగుడు తండ్రి చెప్పినట్లు చేసెను. ముసలి తండ్రి ఆశించినట్లుగా అంగిరసులు యజ్ఞశాలలోని సంపదను

నాభాగునికిచ్చి వేసిరి. యజ్ఞశాలలోని ద్రవ్య పదార్థములను ప్రోగుచేయుచుండగా, ఉత్తర దిక్కునుండి తనవైపుగా ఒక నల్లని మనిషి వచ్చుచుండుట నాభాగుడు గమనించెను. అతడు దగ్గరకు వచ్చి, ''ఈ సంపద అంతయూ నాది. ఇందులో నీకు హక్కులేదు'' అనెను.

నాభాగుడు, అంగిరసులు తనను మెచ్చుకుని కృతజ్ఞతతో యీ సంపదను తనకు ఒసగిరని విన్నవించెను. కాని ప్రయోజనము లేకపోయెను. చివరకు నాభాగుడిట్లనెను. ''ఈ సమస్యను మూడవ వ్యక్తి పరిష్కరించ వలెను''. ''అటులనే జరుగనిమ్ము'' అని నల్లని మనిషి రూపములో నున్న రుద్రుడనెను. ''నీ తండ్రి వద్దకు వెళ్ళి జరిగినదంతయు చెప్పుము. అతని నిర్ణయమునకు నేను కట్టుబడి యుందును''.

నభగుడు, తన పుత్రుడు చెప్పినదంతయూ విని, ''కుమారా! చాల కాలము క్రిందట దక్షుడు యజ్ఞము జరిపినపుడు, యజ్ఞశాలలోని సంపద అంతయూ రుద్రునకు చెందునని ఋషులు పలికిరి. ఇప్పుడు వచ్చి యీ సంపదను కోరుచున్నవాడు తప్పక రుద్రుడే కాగలడు. అతనికి అన్ని హక్కులు ఉన్నవి. అతడు దైవము కూడ. అతని హక్కును కాదనుటకు వీలులేదు''. నాభాగుడు తిరిగి యజ్ఞశాలకు వెళ్ళి రుద్రునితో యిట్లనెను. ''ఈ సంపద అంతయు నీదేనని, నాకు హక్కులేదని నా తండ్రి తెలిపెను. నా అజ్ఞానమునకు క్షమించి నన్ను ఆశీర్వదింపుడు''. నాభాగుడు రుద్రుని పాదములకు ప్రణమిల్లెను. నాభాగుని వినయమును రుద్రుడు మెచ్చుకుని యిట్లనెను. ''నీవు చాల నిజాయితీ పరుడవు. పెద్దలయందు నీకున్న గౌరవము మెచ్చుకోదగినది. నీ ప్రవర్తన నాకు చాల ఆనందము కల్గించినది. నీకు నేను బ్రహ్మవిద్యను బోధించెదను. నీ అత్యుత్తమ ధర్మమునకు ప్రతిఫలముగా యీ సంపదనంతయూ బహూకరించుచున్నాను.

ఆ కాలమందు నాభాగుడు ఒక గొప్ప వేదాంతి అయ్యెను.

## 106 అంబరీషుడు

నాభాగుని కుమారుడు అంబరీషుడు. అతడు యీ భూలోకమున కంతకూ చక్రవర్తియై అమితమైన సంపదతో యుండెను. అంతేకాక అతడు చాల జ్ఞానవంతుడు. ఈ ప్రపంచములోని వస్తువులన్నియు అశాశ్వతమనియు, అవి మానవుల వివేకమును కొల్లగొట్టుననియు అతడెరుగును. అందుచేత అతడు యిదంతయు స్వప్నతుల్యముగా భావించుచుండెను. అతడు మహారాజుగా సకల రాజభోగములు అనుభవిం చుచూ జీవించుచుండెను. కాని యిదంతయూ అశాశ్వతమని, చిరకాలము ఉండదని యెరిగి యుండెను. ప్రాపంచిక విషయములలో చిక్కుకొనక జీవించుచుండెను. నాభాగునికి తగిన పుత్రుడు అంబరీషుడు; ఎల్లప్పుడూ అతని మనస్సు బ్రహ్మవిద్యయందు లగ్నమై యుండెడిది. అతనికి నారాయణునిపై విశేషమైన భక్తియుండుటచేత, యీ భౌతిక ప్రపంచమును దాని ఆకర్షణలను ఒక మట్టిముద్ద మాత్రమేయని గుర్తించుట తేలికయ్యెను. అతడు పరమ భాగవతుడు. నారాయణుని పాదపద్మములే అతని మనసున యెప్పుడూ మెలగుచుండెను. అతని నోటినుండి నారాయణ కీర్తనలే వినవచ్చుచుండెను. భగవంతుని మందిరములో సేవలు చేయుటయందు తన చేతులను వినియోగించుచుండెను. భగవత్కథలను వినుటకు అతని చెవులు ఆత్రముగా యెదురు చూచుచుండెడివి. అతని కన్నులు దేవాలయములో భగవంతుని ప్రతిమలను గాంచి ఆనందించుచుం

డెడివి. అతని పాదములు పవిత్రస్థలములకు వెళ్ళుటకు ఉత్సాహపడుచుండెడివి.

నారాయణ భక్తుడైన అంబరీష మహారాజు యీ భూమిని కడు సమర్థముగా పరిపాలించుచుండెను. వసిష్ఠుడు, అసితుడు, గౌతముడు తోడుపడగా సరస్వతీ నదీ తీరమున అశ్వమేధయాగము చేసెను ఎటువంటి బంధములకు, అనురాగములకు కట్టుబడక యీలోకములో జీవించుచుండెను. నారాయణుడు మెచ్చుకుని, తన సుదర్శన చక్రమును అంబరీషునకు ప్రసాదించెను. ఆ చక్రము అంబరీషుని, అతని రాజ్యమును రక్షించుచుండెను. ఇట్లు కాలము గడచుచుండెను

ఒకనాడు ద్వాదశీవ్రత మహాత్మ్యమును గురించి అంబరీషుడు వినియుండెను. అతడు భార్యా సమేతుడై ఒక సంవత్సరకాలము యీ వ్రతము నాచరించెను. వ్రతము ముగిసే ముందు కార్తీకమాసమున చివరి మూడురోజులు ఉపవాసము చేసెను. తర్వాత నదిలో పవిత్రస్నానము చేసెను పిమ్మట మధువనమునకేగి అచట నారాయణుని పూజించెను బ్రాహ్మణులకు గోసువర్ణ దానములు చేసి, తన గృహమునకు వచ్చి భార్యప్రక్కన కూర్చుని ఉపవాస విరమణకు సిద్ధపడెను

ఆ సమయములో దుర్వాస మహర్షి అక్కడకు వచ్చెను అంబరీషుడు లేచి వచ్చి, దుర్వాస మహర్షికి తగిన ఆసనమేర్పరచి, అర్ఘ్యపాద్య ఆచమనములతో గౌరవించెను దుర్వాసునకు సాష్టాంగ ప్రణామముచేసి, తన ఆతిధ్యము స్వీకరించి, భోజనము చేయవలసినదని ప్రార్థించెను. రాజు వినయమునకు దుర్వాస మహర్షి సంతసించి యిట్లనెను ''నీ ఆతిధ్యము తప్పక స్వీకరించెదను ముందుగా నదికి వెళ్ళి ఉదయ సంధ్య పూర్తిగావించుకుని వచ్చెదను''.

దుర్వాసుడు నదిలో స్నానమాచరించునపుడు అఘమర్షణ సూత్రమను మంత్రమును పఠించుచుండెను ఇట్లుండగా ద్వాదశి ఘడియలు పూర్తికావచ్చుటచేత రాజు చిక్కు పరిస్థితిలో పడెను. అతని ద్వాదశి వ్రతము సఫలమగుటకు ద్వాదశి ఘడియలు అంతమగులోపుగ 'పారణ' (అనగా ద్వాదశి భోజనము) చేయవలసియు న్నది ద్వాదశి భోజనము తప్పనిసరి మాత్రమే కాదు, అట్లు చేయకున్నచో మిక్కిలి పాపము రాజు బ్రాహ్మణుల సలహా కోరగా, వారు తులసి తీర్థము పుచ్చుకున్నచో పాపము అంటదని సలహా యిచ్చిరి వారు చెప్పినట్లు తులసి తీర్థము తీసుకుని, దుర్వాస మహర్షి రాకకై యెదురు చూచుచుండెను

తిరిగి వచ్చిన దుర్వాసుని రాజు సాదరముగ ఆహ్వానించెను దుర్వాసుడు తన మనోనేత్రముతో జరిగిన విషయము కనుగొనెను రాజు, అతిధి వచ్చువరకు వేచియుండక 'పారణ' పూర్తిచేసి అతిధి నవమానించెనని దుర్వాసుడు ఆగ్రహావిష్టుడయ్యెను క్రోధముతో దుర్వాసుని శరీరమంతయూ కంపించెను కన్నులు యెర్రన య్యెను రాజుతో యిట్లనెను ''నీవు అధికార సంపదలతో మదించి యున్నావు నీకు అతిధిని గౌరవించుట తెలియదు అహంభావముతో మిడిసి పడుచున్నావు అతిధి నవమానించినందుకు యిప్పుడే నీకు గుణపాఠము చెప్పి శిక్షించెదను'' జడలుకట్టిన తల నుండి ఒక వెంట్రుక లాగి దానికి జీవముపోసి, అతనికి 'కృత్యు'డని పేరిడెను కృత్యుడు కత్తిని ధరించి అంబరీషుని వడివడిగా సమీపించెను. అంబరీషుడు చెక్కుచెదరక నిలిచి యుండెను

ఇంతలో సుదర్శన చక్రము ప్రత్యక్షమై దుర్వాసుడు సృష్టించిన కృత్యుని దగ్ధము చేసెను ఇది చూచి దుర్వాసు డచ్చెరువొందెను సుదర్శన చక్రము అంతటితో ఆగలేదు దుర్వాసుని వెంటాడెను. దాని నుండి

తప్పించుకొనుటకు దుర్వాసుడు పరుగిడెను. సుదర్శన చక్రము దుర్వాసుని వెంటాడుచునే యుండెను. అడవికి పరుగెత్తగా, అరణ్యములోని అగ్నివలె సుదర్శన చక్రము దుర్వాసుని వెంబడించెను. మేరు పర్వతమున ఒక గుహలోనికి దుర్వాసుడు ప్రవేశించెను. తిరిగి చక్రము అచట యెదురయ్యెను. తర్వాత స్వర్గమున యింద్రుని వద్దకేగెను. సుదర్శన చక్రము దుర్వాసుని తరుముకొని వచ్చుచుండెను. ఆ తర్వాత సృష్టికర్త బ్రహ్మకడకేగి యిట్లనెను. ''రక్షించు! రక్షించు! నారాయణుని ఆయుధమైన యీ సుదర్శన చక్రము నుండి నన్ను రక్షించి కాపాడుము''. బ్రహ్మ యిట్లనెను. ''నేను భగవంతుని సేవకుడను. నిస్సహాయుడను. నీకు, నారాయణుని ఆయుధమునకు మధ్య జోక్యము చేసుకొనలేను''. ఆ తర్వాత మహాదేవుని వద్దకు వెళ్ళి రక్షింపుమని దుర్వాసుడు వేడగా, నారాయణుని వద్దకు వెళ్ళి అతని పాదములపై బడి ప్రార్థించుమని మహాదేవుడు చెప్పెను. అక్కడ నుండి దుర్వాసుడు వైకుంఠమున కేగెను. అచట నారాయణుడు లక్ష్మీసమేతుడై యుండుట దుర్వాసుడు జూచెను. వారి పాదములపైబడి యిట్లనెను. ''దయచేసి నన్ను రక్షింపుము. నీ సుదర్శన చక్రము నుండి నన్ను విడిపింపుము. ఆ చక్రము నుండి వెలువడే వేడి తీవ్రతకు నేను తట్టుకొనలేకు న్నాను. నేను దగ్ధము కాబోవుచున్నాను, నీవు మాత్రమే నన్ను రక్షింపగలవు''. ''ఇదెట్లు జరిగెను?'' అని నారాయణు డడిగెను. ''ఈ విధముగా నా సుదర్శన చక్రము నిన్నెందులకు వెంబడించుచున్నది? అంతయు వివరముగా చెప్పుము''. సిగ్గుతో కుంచించుకు పోయిన ముఖముతో మాటలు తడబడుచుండగా, జరిగినదం తయూ దుర్వాసుడు వివరించి యిట్లనెను. ''నీ భక్తుని నేను బాధించితిని. అందుకు శిక్షగా యీ సుదర్శన చక్రము నన్ను వెంటాడుచున్నది. దయచేసి నన్ను రక్షింపుము. దేవాదిదేవుడవైన నీకు అసాధ్యమేదియు లేదు. నా ప్రవర్తనకు నేను పశ్చాత్తాపడుచున్నాను. నన్ను రక్షింపుము''.

నారాయణుడు చిరునవ్వుతో యిట్లనెను. ''ఓ దుర్వాసా! బ్రహ్మరుద్రులవలె నేను కూడ నిస్సహాయుడనని నీవు తెలుసుకొనలేవా? నీకు నాగురించి పూర్తిగా తెలియదు. నాకు పూర్తి స్వేచ్ఛ లేదు. నా యిష్టము వచ్చినట్లు చేయుచున్నట్లుగా గోచరించవచ్చును. కాని మొట్టమొదట నేను నా భక్తుల ఆధీనములో నున్నాను. నా సర్వస్వమూ వారిదే. వారు సర్వస్వమూ త్యజించి నాకు శరణాగతులైనారు. వారు అన్నిటినీ — భార్య, పిల్లలు, యిళ్ళు, బంధువులు — వదలిపెట్టిరి. వారికి యిహలోకముపైగాని పరలోకముపైగాని ఆలోచనలేదు. వారికి స్వర్గము ఆకర్షణీయముకాదు. నా అనుగ్రహమునే వారు కోరుచుందురు. అందుకు ప్రతిఫలముగా యెట్టి పరిస్థితులందు కూడ వారిని వదలివేయనని ప్రతిజ్ఞ తీసుకున్నాను. వారికి నాయందుగల భక్తియే నా మనస్సులో మొట్టమొదట మెదలును. తమ ప్రేమచేత వారు నన్ను జయించిరి, వారి ప్రేమశక్తి ముందు నేను శక్తిహీనుడను. 'నాది' యని ప్రత్యేకముగా నాకేదియులేదు. వారి సంతోషమే నా సంతోషము, వారి దుఃఖమే నా దుఃఖము. నేను 'భక్తపరాధీనుడ'నని ప్రసిద్ధి కెక్కియున్నాను. నాకు భక్తులపై యున్న మక్కువకంటె, నాపై నాకుగాని, నా భార్య లక్ష్మియందుగాని యెక్కువ మక్కువలేదు. అటువంటి పరిస్థితులలో వారితో యధాలాపముగా నేనెట్లు వ్యవహరించగలను? నా భక్తులను అవమానించిన, నన్నవమానించినట్లే యగును. ఉత్తమవనితలు తమ ప్రేమచేత భర్తల నెట్లు బానిసలుగా జేసుకొందురో, అటులనే భక్తులకు నేను బానిసను.

''నీవు కూడ నాకు భక్తుడవే. అయితే యీ చక్రమును నేను ఉపసంహరింపజాలను. నిన్ను నీవు రక్షించుకొనుటకు యేమి చేయవలెనో నీకు చెప్పెదను. నీకు ఒకే ఒక మార్గము గలదు. తిరిగి భూలోకమునకు వెళ్ళి, నీ బాధకు గురియైన నా భక్తుడు అంబరీషుని పాదములపై బడి వేడుకొనుము. బహుశః నాభాగుని

పుత్రుడైన అంబరీషుడు నిన్ను క్షమించినపుడు, యీ సుదర్శన చక్రము వెనుకకు మరల గలదు. నీ కొరకు అతడు యీ చక్రమును ఉపసంహరించగలడు. ఆ విధముగా నీకు రక్షణ కలుగును''. ముఖము వ్రేలవేసుకుని దుర్వాసుడు అంబరీషుని ద్వారము ప్రవేశించెను. అంబరీషుని పాదములను తన రెండు చేతులతో పట్టుకొనెను. పరిణామమునకు అంబరీషుడు తబ్బిబ్బయ్యెను. అతడు భగవంతుని ప్రార్థించి, సుదర్శన చక్రము ఉపసంహారము నొందునట్లు చేసెను. ''ఓ సుదర్శనా! నీకు నా ప్రణామములు. నీవు అగ్ని, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు. నీవు లోకమంతయూ వ్యాపించియున్నావు కరుణాసముద్రుడైన నారాయణునికి యిష్టమైన ఆయుధము నీవు. నీ శక్తివైభవము ముందు, అస్త్రములన్నియు శక్తిహీనములు. నీ పాదములకు నమస్కరించుచున్నాను ఈ దుర్వాసుని క్షమించమని కోరుచున్నాను. నీవు దుష్టులను, దుష్టశక్తులను నిర్మూలించెదవు నీ క్రోధమును యీ పేద బ్రాహ్మణునిపై ప్రసరింపజేయకుము''

అంబరీషుని ప్రార్థనలకు సంతుష్టుడై సుదర్శనుడు శాంతించెను దుర్వాసుని వెంటాడుట మానెను. మనస్సు మారిన దుర్వాసుడు రాజుతో యిట్లనెను. ''నీవు చాల ఉదారపురుషుడవు. అకారణముగా నిన్ను బాధించిన నాతో సరళముగా ప్రవర్తించుట చాల గొప్ప విషయము. నారాయణ భక్తుల గొప్పదనము గ్రహించినాను. తమ భక్తితో నారాయణుని ఆకట్టుకున్న భక్తులకు అసాధ్యమేదియు లేదు మనసులో యెల్లప్పుడూ భగవంతుని రూపమును చింతించు నీ వంటి భక్తులు గంగానదివలె పవిత్రులు, పరిశుద్ధులు. నీవు నన్ను చాల దయతో జూచినావు నేను పలికిన పరుష వాక్యములను విస్మరించి నన్ను రక్షించినావు''.

దుర్వాసుని వంటి మహర్షి అంబరీషుని పాదములపై బడగా, ఆ ఇరకాటపు పరిస్థితి నుండి దుర్వాసుని తప్పించుటకు రాజు ప్రయత్నించెను తనకు తగిన గౌరవము చూపలేదని అంబరీషునిపై కోపగించిన దుర్వాసుడు చివరకు తనను తాను రక్షించుకొనుటకు అంబరీషుని పాదములపై పడవలసి వచ్చెను. సన్నివేశము యిరువురకు యిబ్బందిగా నుండెను, యెట్లో ఆ క్షణము గడచిపోయెను.

దుర్వాసుడు ముల్లోకములు తిరిగి అంబరీషుని వద్దకు వచ్చుసరికి ఒక సంవత్సరకాలము గడచెను ఆ సంవత్సర కాలమంతయు రాజు ఒక మెతుకైననూ భుజింపలేదు. తన దుడుకు ప్రవర్తనకు పరిణామములు యెంత తీవ్రముగా నుండునోయని యూహించి, దుర్వాసుడు రాజును భోజనము చేయవలసినదని పదేపదే కోరెను. అయితే అతిథిని మొదట గౌరవింపవలెనని రాజు ఉద్దేశ్యము. అది గ్రహించి సంతుష్ట మనస్కుడై హృదయములో ఆనందముప్పొంగగా, అంబరీషుని ఆతిథ్యము స్వీకరించుటకు దుర్వాస మహర్షి అంగీకరించెను. దుర్వాస మహర్షి భుజించి సంతుష్టుడైన పిదప అంబరీష మహారాజు భుజించెను.

దుర్వాసుడిట్లనెను ''నారాయణ భక్తుడవైన నీతో పరిచయము గలిగి నేను అనుగ్రహము పొందినాను. ఈ సంఘటన మన యిద్దరి చరిత్రలు చిరకాలము యీ లోకములో నిలిచిపోవునట్లు జేయగలదు'' అతడు రాజు వద్ద సెలవు తీసుకుని వెడలిపోయెను అంబరీషునకు జరిగిన దంతయూ ఒక స్వప్నము వలె తోచెను. దుర్వాసుని రాక, అతని ఆగ్రహము, సుదర్శన చక్రము అతనిని వెంబడించుట, చివరకు పశ్చాత్తాపపడుట — యీ విచిత్రములన్నియు అంబరీషుడు తలచుకొని, తనలో నిట్లనుకొనెను ''ఇదంతయు భగవంతుని లీల. దీని వెనుక నున్న ప్రయోజనము యెవరూ యెరుగలేరు కదా?''

## 107 కాకుత్థ్సులు

ఇక్ష్వాకు వంశీయులలో ఒకడైన పురంజయుడు, ఇంద్రవాహనుడుగా పేరుపొందెను దేవతలకు అసురులకు యుద్ధము సంభవించినపుడు, యెప్పటివలెనే ఇంద్రుడు భూలోకమును పాలించు రాజులలో నొకని సహాయము కోరెను సూర్య (ఇక్ష్వాకు) వంశములో జన్మించిన పురంజయుని సహాయ మర్థింపగా అతడిట్లనెను ''నేనొక నియతిపై నీ తరపున యుద్ధము చేసెదను యుద్ధము చేయునపుడు నీవు నాకు వాహనముగా నుండవలెను. ఇంద్రునికిది నచ్చలేదు. స్వర్గాధిపతి ఒక మానవునికి వాహనముగా నుండుట అవమానకరమని తలచెను. ఇంద్రుని ఆలోచనలు కనిపెట్టిన నారాయణుడు, పురంజయుని సహాయముతో యుద్ధములో నెగ్గు అవకాశము ఉండుటచేత, యా నియమమున కంగీకరించమని ఇంద్రునికి నచ్చజెప్పెను భగవంతుని సలహాపై పురంజయునికి వాహనముగా నుండుటకు ఇంద్రుడు అంగీకరించెను ఇంద్రుడు ఎద్దు రూపము ధరించగా, ఈ యెద్దు మూపుపై పురంజయుడు కూర్చుండెను అతడు గొప్పవీరుడు పైగా నారాయణుని
వాడి బాణములతో అసురులను హతమార్చి వారిని నరకమునకు పంపెను అతి వైభవముగా అసురులతో పోరాడగా, వారు నగరము విడిచిపెట్టి పారిపోయిరి రాజు వారి సంపదనంతయూ తీసుకుని ఇంద్రుని కిచ్చెను ఆ విధముగా అతనికి ఇంద్రవాహనుడనే పేరు కలిగెను కాని ఆ తర్వాత కాకుత్థ్సుడను పేరుతో ప్రసిద్ధి పొందెను అతని వంశములోని తరవాతి రాజులందరూ కాకుత్థ్సులని పేరుపొందిరి దశరథ తనయుడైన శ్రీరాముడు కూడ యా పేరుతోనే ప్రసిద్ధుడు



ఇక్ష్వాకు వంశములో యువనాశ్వుడను రాజు జన్మించెను అతినికి సంతానము లేకుండెను జీవితముపై రోతపుట్టి, తన నూర్గురు భార్యలతో అరణ్యమున కేగెను అరణ్యములో నివసించుచున్న మహర్షులు అతనియందు దయతలచి, ఇంద్రుని అనుగ్రహమును పొందుటకై యజ్ఞము చేయ సంకల్పించిరి

యజ్ఞము సమాప్తికాగా, ఒక కుండను నీటితో నింపి ఆ జలమును పవిత్రము గావించమని దేవతల నావాహన చేసిరి. యజ్ఞశాలలో ఒక పవిత్ర స్థలమున ఆ జలము నుంచిరి ఆ జలము రాజు భార్యల కుద్దేశించినది

అర్ధరాత్రి యువనాశ్వునకు తెలివి వచ్చి లేచెను అతినికి అమితముగా దాహము వేసెను అతడు యజ్ఞశాలలో అందరూ నిద్రించుచుండుట జూచెను అతని యెదుటనే యున్న కుండలోని నీటి ప్రత్యేక గుణములు యేమిటో అతడు యెరుగడు. ఆ కుండలోని నీరు త్రాగి, తిరిగి నిద్రకుపక్రమించెను మరునాటి ఉదయము లేచి ఋషులు ఆ కుండ శూన్యముగా నుండుట జూచి, ప్రతి ఒక్కరినీ, ''ఈ కుండలోని నీరు యెవరు త్రాగిరి?'' అని అడిగిరి రాత్రి విపరీతముగా దాహము వేయుటచే ఆ నీరును త్రాగితినని రాజు చెప్పెను ఏమి చేయవలెనో యెవరికినీ తెలియకుండెను. ఏమి జరుగునో కూడ వారికి తెలియకుండెను

కొన్ని నెలలు గడచెను యువనాశ్వుని కడుపు కుడిభాగము శిశువుతో పెద్దగా నయ్యెను అతని కడుపు ఛేదించగా ఒక కుమారుడు పుట్టెను. పుట్టిన వెంటనే ఆ శిశువు ఆకలితో గట్టిగా యేడ్చుచుండెను యువనాశ్వునికి సంతానము కొరకై ఇంద్రుని అనుగ్రహము పొందుటకు యజ్ఞము చేయుటచేత, ఇంద్రుడు అక్కడకు వచ్చెను ఇంద్రుడు తన కుడిచేతి చూపుడువ్రేలును శిశువు నోటిలో పెట్టెను ఇంద్రుని చేతి నుండి స్రవించిన అమృతమును ఆ శిశువు గ్రోలెను

ఋషులు తపః ప్రభావమువలన యువనాశ్వునకు మరణము కలుగలేదు ఆ తర్వాత అతడు తపస్సు చేసి ముక్తి పొందెను.

ఆ శిశువుకు మాంధాత యని పేరు పెట్టిరి అతడు గొప్ప చక్రవర్తియై యీ భూమిపై పరిపాలించెను కృతయుగమున అతడు గొప్ప ఆభరమణమని ప్రజలు కొనియాడిరి

★ ★ ★

ఆ వంశములో తరువాత సత్యవ్రతుడు రాజయ్యెను. అతని కుమారుడు త్రిశంకుడు త్రిశంకు మహారాజు మానవ శరీరముతో స్వర్గము వెళ్ళగోరెను అతని యీ విచిత్రమైన కోరికను అంగీకరించక, వసిష్ఠుడు అతని పుత్రులు యజ్ఞము చేయుటకు నిరాకరించి, అతనిని చండాలుడగునట్లు శపించిరి విశ్వామిత్రుడు, అతనిని స్వర్గమునకు పంపుటకు యజ్ఞము చేయ నంగీకరించెను. విశ్వామిత్రుడు యజ్ఞము చేయగా, త్రిశంకు స్వర్గమునకు అధిరోహించెను. చండాలుని దృక్కులు కలిగి మానవ రూపములో నున్న త్రిశంకుడు స్వర్గమునకు వచ్చుట దేవతలకు, ఇంద్రునకు యిష్టము లేకుండెను. అందుచే వారు త్రిశంకుని క్రిందకు త్రోసివేసిరి. త్రిశంకుని ఆవేదనను వినిన విశ్వామిత్రుడు కోపగించి, త్రిశంకుని ఆకాశము మధ్యలో ఆపివేసి, ప్రత్యేకమైన త్రిశంకు స్వర్గమును సృష్టించెను అతడు నూతనముగా మరొక బ్రహ్మను సృష్టించుసంతలో దేవతలు వచ్చి విశ్వామిత్రుని సముదాయించిరి తనకు విశ్వామిత్రుడు ప్రత్యేకముగా సృష్టించిన స్వర్గములో త్రిశంకుడు జీవించుచుండెను

★ ★ ★

త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు అతనికి పుత్రులు లేరు అతడు సముద్రమున కధిపతియైన వరుణుని ప్రార్థించి యిట్లనెను. ''నేను కోరునది ఒక పుత్రుడు పున్నామ నరకము నుండి రక్షించుటకు నాకు పుత్రుడు కావలెను. నాకు పుత్రుడు కలుగగానే, యజ్ఞము జేసి నా పుత్రుని నీకు సమర్పించెదను'' కొంత కాలమునకు ఒక పుత్రుడు కలిగెను అతని పేరు రోహితుడు వరుణుడు హరిశ్చంద్రుని సమీపించి యిట్లనెను ''పుత్రుడు కలుగగానే యజ్ఞము జేసి పుత్రుని సమర్పించెదనని మాట యిచ్చినావు'' హరిశ్చంద్రు డిట్లు జవాబిచ్చెను ''క్రొత్తగా పుట్టిన శిశువు శుద్ధిగా నుండడు పది రోజుల తర్వాత శిశువునకు శుద్ధి కలుగును ఆ తర్వాత నీకు సమర్పించెదను''

పదిరోజుల తర్వాత వరుణుడు తిరిగి వచ్చి హరిశ్చంద్రుని శిశువు నిమ్మని కోరెను అంత రాజు యిట్లనెను ''యజ్ఞ పశువుకు పళ్లు ఉండవలెను అందుచేత యీ శిశువుకు పళ్ళు వచ్చునంతవరకు వేచి యుండుము'' పళ్ళు వచ్చిన తర్వాత వరుణుడు రాగా, రాజు బాలునికి పాల పళ్లు రాలవలెనని, ఆ తర్వాత అవి తిరిగి వచ్చిన తర్వాత యిచ్చెదనని యేదో ఒక మిష పెట్టి వరుణుని పంపుచుండెను ఇట్లు కొంతకాలము జరిగెను రాజునకు పుత్రునిపై గారాబము పెంపొందగా, యేదో ఒక మిషతో వరుణుని పంపించి వేయుచుండెను. ఒకసారి, ''నా కుమారుడు కవచము ధరించనీ, కవచము ధరించిన క్షత్రియుడే శుద్ధమైనవాడు'' అని వరుణునితో పలికెను

ఈ లోపుగా పెరిగి పెద్దవాడగుచున్న రోహితుడు తనకు జరుగబోవు ముప్పును తెలుసుకొనెను ఈ ముప్పు నుండి తప్పించుకొనుటకు ధనువు తీసుకుని అరణ్యమునకు పారిపోవలెనని తలంచెను అసత్యవాది యైన రాజును వరుణుడు శిక్షింపనెంచి, అతడు జలోదర వ్యాధితో బాధపడునట్లు చేసెను ఆ విషయము వినిన రోహితుడు, తన తండ్రిని రక్షించుటకై యింటికి వెళ్ళుటకు నిశ్చయించెను ఇంద్రుడతనిని ఆపి,

పుణ్య నదులను సందర్శించమని చెప్పెను. అయిదేండ్లు గడచిన తర్వాత రోహితుడు తన తండ్రి వద్దకు రాజ్యమునకు వెళ్ళుటకు నిశ్చయించెను.

మార్గము నందు రోహితుడు ఒక బ్రాహ్మణుని కలుసుకొనెను. ఆ బ్రాహ్మణుని ముగ్గురు కుమారులలో ఒకనిని వరుణునకు సమర్పించుటకు రోహితుడు కొనెను. అతని పేరు శునశ్శేపుడు, జలోదర రోగముతో బాధపడుచున్న హరిశ్చంద్రుడు నరమేధ యాగము జరిపెను. ఈ యాగమందు పశుబలికి బదులుగా నరబలి యివ్వవలసి యుండెను. హోతయైన విశ్వామిత్రుడు వరుణ జప మంత్రములను శునశ్శేపునకు బోధించెను. దీనికి వరుణుడు చాల సంతోషించి మెచ్చుకొనెను. యాగము సంతృప్తికరముగా సమాప్తియైనందుకు ఇంద్రుడు మెచ్చి, హరిశ్చంద్రునకు బంగారు రథమును ప్రసాదించెను. వరుణుడు శునశ్శేపుని మెచ్చుకుని, అతడు చిరకాలము జీవించునట్లు ఆశీర్వదించెను. విశ్వామిత్రుడు శునశ్శేపుని దత్త పుత్రునిగా స్వీకరించెను. యాగము సంతృప్తికరముగా ముగిసెను. దేవతలు హరిశ్చంద్రుని యాగమును మెచ్చి ఆశీర్వదించిరి. హరిశ్చంద్రుడు తన పుత్రుని కోల్పోవలేదు. అనేక సంవత్సరములుగా హరిశ్చంద్రుని బాధించుచున్న రోగము కూడ శాంతించెను.

త్రిశంకుని యెడల విశేషమైన అభిమానముగల విశ్వామిత్రుడు హరిశ్చంద్రునకు బ్రహ్మవిద్య బోధించు బాధ్యత స్వీకరించెను.



ఆ వంశమునందే జన్మించిన మరియొక రాజు ఖట్వాంగుడు. అతడు గొప్ప వీరుడు. ఒక పర్యాయము దేవతలను అసురులు వేధించుచున్నపుడు, దేవతలు ఖట్వాంగ మహారాజు సహాయము కోరిరి. ఖట్వాంగుడు ఇంద్రునికి సహాయముగా వెళ్ళి అసురులను అణచి వేసెను. అతడు చేసిన సహాయమునకు దేవతలు మెచ్చుకుని, వర మడుగవలసినదని కోరిరి. ఖట్వాంగు డిట్లు పలికెను. ''నా జీవితములో యింకెన్ని సంవత్సరములు మిగిలి యున్నవో దయచేసి చెప్పవలెను''. దేవతలు ఒకరినొకరు పరికించి సంకోచముతో నిట్లనిరి. ''ఇది దేవ రహస్యము. నీవు అడిగిన వరము ప్రసాదించెదమని మాట యిచ్చి యుండుటచేత నీకు మేము చెప్పెదము. ఇంకా ఒక ముహూర్త కాలము మిగిలియున్నది''. (ముహూర్త కాలము సుమారు యిరువది నిమిషములకు సమానము).

ఖట్వాంగునకు విచారము కలుగలేదు. త్వరలో భూలోకమునకు వచ్చి, ధ్యానమునకు కూర్చుండెను. అతడు భగవంతుని ధ్యానించుచుండెను. భగవంతుని ప్రార్థించు మాటలు అతడు పలుకుచుండెను. అతడిట్లనెను. ''ఈ లోకములో నాకేదియు ప్రియము కాదు. నా జీవితములో యెన్నడూ అధర్మముగా వర్తించలేదు. నేను యెల్లపుడూ నిన్ను తప్ప అన్యుల నెవరినీ తలంచలేదు. దేవతలు స్వర్గమును ప్రసాదింతుమని ప్రలోభపెట్టిరి. కాని నాకు స్వర్గముపైగాని, స్వర్గ సౌఖ్యములపైగాని మక్కువ లేదు. నీ స్వరూపమును, మాయలో చిక్కుకున్న దేవతలు యెరుగరు. మనస్సు, ఇంద్రియములు సృష్టించే యీ మాయా లోకమును వదిలి, నీ పాదపద్మముల యందు ఆశ్రయము పొందగోరుచున్నాను''. ఆ విధముగా ప్రార్థించుచున్న ఖట్వాంగుడు యీ భౌతిక కాయమును వీడి నారాయణునిలో లీనమయ్యెను.

# 108 సగరుని కుమారులు

ఇక్ష్వాకు వంశములో బాహుకుడను రాజు జన్మించెను శత్రువులు అతని రాజ్యమును బలవంతముగా తీసుకొనగా, అతడు భార్యలతో అరణ్యము కేగెను అరణ్యములో ఆ రాజు మరణించెను దుఃఖములో మునిగిన భార్య శోకము పట్టలేక భర్త చితిపై ప్రవేశించుటకు సిద్ధపడెను ఆమె గర్భవతిగా నుండుటచే, ఆశ్రమములోని ఋషులు ఆమెను నివారించిరి

ఆ రాజు యితర భార్యలకు యీ వార్త కంటగింపుగా నుండెను వారు మొదటి నుండి ఆమె అదృష్టమునకు అసూయ చెందుచుండిరి కాబోవు మహారాజుకు ఆమె తల్లియగుట వారి కిష్టము లేకుండెను అందుచే వారు ఆహారములో విషము కలిపి, ఆమెకు యెంతో ప్రేమతో పెట్టిరి కాని వారు ఊహించినట్లు ఆమెకుగాని, గర్భములోని శిశువుకు గాని యెట్టి కీడును జరుగలేదు పుట్టిన తర్వాత శిశువును తల్లి సేవించిన విషము (గరము) కప్పి యుండెను అందుచే ఆ శిశువుకు 'సగిరు'డని పేరు పెట్టిరి

సగరుడు చాల ప్రఖ్యాతి పొంది, తర్వాత చక్రవర్తి అయ్యెను అతడు అశ్వమేధ యాగము చేయ సంకల్పించెను యాగమందు బలి యిచ్చు అశ్వమును బయటకు విడిచిపెట్టిరి
ఇంద్రుడు అశ్వమును దొంగిలించెను రాజు తన అరువది వేలమంది పుత్రులను అశ్వమును వెదకి తీసుకు రమ్మని పంపెను అతని పుత్రులందరూ మహా శూరులు వారికి అహంభావము కూడ యెక్కువ అశ్వమును వెదకుటకై వారు బయలుదేరిరి

వారు లోకమంతయు వెదకిరి అశ్వము వారికి దొరకలేదు శక్తిమంతమైన భుజములతో వారు భూమిని త్రవ్వి పాతాళ లోకము ప్రవేశించిరి ఈశాన్య దిక్కున ప్రయాణించుచుండగా వారు ఒక గుహ చూచిరి ఆ గుహ యందు ఒక ఋషి సమాధి యందు ఉండెను ఆ ప్రక్కనే గుర్రము నిర్విచారముగా గడ్డి మేయుచుండెను

''ఆ దొంగను చూడు!'' అని గర్వోన్నతులైన రాకుమారులనిరి గుర్రము దొంగిలించి, యేమియు తెలియని నంగనాచి వలె కనులు మూసుకుని కూర్చునియున్నాడు ఇతనిని చంపి వేయుదము'' అని తలపోసి అరువది వేలమంది రాకుమారులు ఆయుధములు ధరించి సమాధిలో నున్న ఋషిని సమీపించిరి

ఆ ఋషి కపిలుడు అతడు కనులు తెరచెను అతని ఆగ్రహ దృష్టి వారిపై పడగా వారందరూ భస్మమై బూడిదగా మారిరి

సత్త్వ గుణము మూర్తీభవించిన వాడు కపిలుడు అతనిలో తమోగుణమునకు తావులేదు అందుచే, కపిలుని ఆగ్రహమునకు వారు భస్మమైనారనుట బహుశః సరికాకపోవచ్చును తమోగుణము అధమమైనది ఋషులు సహజముగా అధ్యాత్మిక శక్తిసంపన్నులు అంతేకాక, సంసారమను ఊబిలో చిక్కుకున్న మానవులకు, దీనినెట్లు సులభముగా దాటవచ్చునో బోధించినవాడు కపిలుడు ఇది నావగా చేసుకున్నచో భయంకరమైన యీ సంసారమనే సముద్రమును దాట వీలగును. అట్టి మహాత్మునకు శత్రువు గాని, స్నేహితుడు గాని ఉండడు మరి సగరుని పుత్రులు ఆ విధముగా యెందుకు భస్మము గావింపబడినారు? ఒక మహాత్ముని కించపరుచుటచేత వారు స్మృతి చెందిరి వారి వివేక శక్తిని ఇంద్రుడు హరించి వేసెను

సగరునికి యిద్దరు భార్యలు. మరణించిన అరువది వేలమంది పుత్రుల తల్లి సుమతి. రెండవ భార్య పేరు కేశిని. ఆమె కుమారుడు అసమంజసుడు. అసమంజసుని కుమారుడు అంశుమంతుడు. ఇతనికి పితామహుడైన సగరునిపై అమితమైన భక్తిగౌరవములు కలవు.

అసమంజసుడు ఒక విచిత్రమైన వ్యక్తి పూర్వ జన్మలో అతడొక యోగి. దురదృష్టవశాత్తు అతడు అనురాగము పెంచుకొని సంగుడయ్యెను. దాని ఫలితముగా అతడు మహారాజునకు పుత్రుడుగా జన్మించెను. అతనికి పూర్వ జన్మ స్మృతి యుండెను. ఈ జన్మలో అతడు క్రూరుడుగా నటించి, బంధముల నుండి తనను తాను రక్షించుకొనుచుండెను. చిన్నతనము నందే అతని చర్యలు అమానుషముగా గోచరించుచుండెను. అందరినీ అసంతృప్తులను గావించుచూ, రాగబంధము నుండి తప్పించుకొనుచుండెను. చిన్న పిల్లలను పట్టుకుని సరయూ నదిలో వారిని త్రోసివేయుచూ నవ్వుచు చప్పట్లు చరుచుచుండుట జూచి, నగర పౌరులు భయభ్రాంతులైరి. అతని అమానుష చర్యలు భరింప శక్యము కాకుండెను.

అతని అమానుష చర్యలకు అంతులేకుండుటచేత, అతనిని శిక్షించవలసినదని రాజుకు పౌరులు మొరపెట్టుకొనిరి. చట్టము ననుసరించి, అసమంజసుని, రాజు దేశము నుండి బహిష్కరించెను. అరణ్యమునకు పోవుటకు ముందు, అంతకు ముందు సరయూ నదిలోనికి విసిరివేసిన పిల్లలను తిరిగి పునరుజ్జీవింప జేసెను. ఇది చూచి అచ్చెరువందిన ప్రజలు మాట్లాడునంత లోపలనే, అతడు అడవికి వెళ్ళిపోయెను. అచ్చట తపస్సు చేసి మోక్షము పొందెను. సత్పురుషుడైన కుమారుని పోగొట్టుకున్నందుకు సగర మహారాజు మిక్కిలి విచారించెను. ఆ కారణము చేత సగరుడు, ఇక్ష్వాకు వంశములో మిగిలిన అంశుమంతునిపై విశేషమైన ప్రేమను వర్షించుచుండెను.

## 109 అంశుమంతుడు

అశ్వమేధ యాగము పూర్తికావలసి యున్నందున, సగర చక్రవర్తి మనుమడైన అంశుమంతుని తన అరువది వేల మంది పుత్రులను, అశ్వమును వెదకుటకై పంపించెను. అశ్వమును పట్టి తెచ్చుటకు సగర పుత్రులు వెళ్ళి చాల సంవత్సరములయ్యెను. వారు తిరిగి రాకుండుటచేత సగర చక్రవర్తికి ఆందోళన యెక్కువయ్యెను. అంశుమంతుడు తన పెదతండ్రులను వెదకుటకు బయలుదేరెను. వారు వెళ్ళిన మార్గముననే పాదముల గుర్తులను బట్టి అంశుమంతుడు కూడ వెళ్ళెను. వారు భూమిని త్రవ్వి వెళ్ళిన బిలములో ప్రవేశించి, అంశుమంతుడు ప్రయాణము చేయగా చేయగా చివరకు గుహను చేరెను. అక్కడ గుర్రము కట్టివేయబడి యుండుట అతడు చూచెను. తన పెదతండ్రులు చూచినట్లుగనే కపిలుడు సమాధిలో నుండుట కనుగొనెను. కపిల మహర్షి ప్రక్కగా బూడిద రాసిగా పడియుండుట జూచి యిది యేమైయుండునా యని అంశుమంతుడు తలపోసెను.

కపిల వాసుదేవుని సమీపించి, అంశుమంతుడు నమస్కరించెను. వినయము, భక్తిప్రపత్తులతో అంశుమంతుడిట్లనెను. ''ప్రభూ! సృష్టికర్తయైన బ్రహ్మ కూడను నిన్ను సంపూర్ణముగా తెలిసికొనలేదు. అటువంటప్పుడు సాధారణ మానవులమైన మేము త్రిగుణములు, మనస్సు, బుద్ధితో కూడిన మాయలో చిక్కుకుని యుండగా

నిన్ను తెలుసుకొనుట యెట్లు సాధ్యము? మేము ఆవరణచే (మాయ) కప్పబడి యుండుటచేత నీ వంటి దివ్య పురుషుల నుండి వెలువడే వెలుగును చూడలేని అంధులుగా నుంటున్నాము వస్తు చూడగలుగుచున్నాము ఇంద్రియములు గ్రహించు వస్తువులనే చూచుచున్నాము మాలో నిబిడీకృతమై యున్న ఆత్మ వైభవమును తెలియలేకున్నాము. అవస్థాత్రయము - జాగ్రత్, స్వప్న, సుషుప్తి - నెరుగుదుము కాని యీ మూడింటిని దాటి వెళ్ళలేకున్నాము. అజ్ఞానినైన నా వంటి మానవుడు నీ వైభవమును యెట్లు తెలుసుకొనగలడు? కాని నాకు తెలిసినది యింత మాత్రమే. ఈ లోకమున కాశ్రయుడవు, త్రిగుణాతీతుడవు, కార్య కారణముల కతీతుడవు, నిత్య సత్యమైన పరమాత్మ తత్త్వమును మానవులకు బోధించుట కవతరించిన వాడవు. నీకు నా నమస్కారము నీవు సనాతనుడవు, యెట్టి మార్పును పొందని వాడవు; దేవాదిదేవుడవు నిన్ను దర్శించు మహద్భాగ్యము లభించినది నీ దర్శనముచేత సంకల్పములచే ప్రేరణ నొ చేయు కర్మ బంధములనే మాయ నుండి విముక్తి లభించినది నీకు నా ప్రణామములు ''

కనుల నుండి అశ్రువులు స్రవించుచుండగా, అంశుమంతుడు కపిలుని పాదములపై బడెను రాకుమారుని వినయమునకు భక్తికి సంతోషించి, కపిలు డిట్లనెను. ''కుమారా! నీ పితామహుడైన సగరునికి చెందిన యీ అశ్వమును తీసుకువెళ్ళుము నేను యోగ నిద్రలో నున్నపుడు, ఇంద్రుడు యీ అశ్వమును యిచ్చట వదలి వెళ్ళెను నీ పెద తండ్రులు అహంభావముచేత దగ్ధమైనారు వారి ఆత్మలు పవిత్ర మందాకినీ (గంగ) జలముతో శుద్ధియై పితృలోకము చేరగలవు

అంశుమంతుడు కపిలునికి ప్రదక్షిణము గావించి, సాష్టాంగ నమస్కారము చేసెను అశ్వమును తీసుకుని నగరమున కేగెను. సగరుడు యాగము పూర్తిగావించెను తన అరువదివేల పుత్రుల దురదృష్టమునకు విచారించి, సగర చక్రవర్తి అంశుమంతునికి పట్టము గట్టెను తరువాత అరణ్యమునకేగి శాంతి మోక్షములకై తపస్సు చేయ నారంభించెను.

అంశుమంతుడు గంగను మెప్పించి, ఆమె భూమికి వచ్చునట్లు చేయుటకు తపస్సు చేసెను. కాని అతడు కోరిన దానిని సాధించలేకపోయెను వృద్ధాప్యము సమీపించగా కొంత కాలమునకు మరణించెను అతని కుమారుడు దిలీప మహారాజు కూడ గంగను మెప్పించలేకపోయెను ఆ పని అసంపూర్తిగా నిలిచిపోయెను తరువాత అతడు కూడ మరణించెను

## 110 గంగా – భాగీరథి

దిలీపుని కుమారుడు భగీరథుడు రాజ్యమును మంత్రులకు వదలిపెట్టి, భూమికి గంగను తెచ్చి తన పూర్వులకు పితృలోక ప్రాప్తి కలిగించుటకు దృఢనిశ్చయుడయ్యెను. అతడు చాల కాలము మిక్కిలి శ్రద్ధాభక్తులతో తపస్సు చేయగా, గంగాదేవి అతని తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమయ్యెను చేతులు జోడించి నమస్కరించి ఆమెతో యిట్లనెను ''దేవీ! గంగా! మందాకినీ! నీవు భగవంతుని పాదముల నుండి జన్మించినావు వామనుడు మూడడుగుల భూమి బలి చక్రవర్తిని కోరినపుడు బలి ప్రసాదించగా వామనుడు విశ్వరూపము ధరించెను ఒక పాదము స్వర్గ లోకమును వ్యాపించగా, సత్య లోకములోని బ్రహ్మ ఋషి సమేతంగా, తన

కమండలములోని జలముతో ఆ పాదము నభిషేకించెను. అట్లు నభిషేకించిన జలము మందాకినిగా రూపొంది నది నీకు 'విష్ణుపది' అను పేరు గూడ గలదు. నన్ను, నా కుటుంబమును కరుణించుము''.

మందాకిని చిరునవ్వు నవ్వి, వరము కోరుకొమ్మనెను. కపిలుడు చెప్పిన మాటలు పలికి యిట్లనెను. ''తల్లీ! నా పూర్వులకు పితృలోకమును ప్రసాదింపుము. మూడు తరములుగా వారికి పితృలోక ప్రాప్తి కలుగకుండెను''

గంగ (మందాకిని) యిట్లనెను. ''భగీరథా! నేను స్వర్గము నుండి వచ్చి భూమిపై ప్రవహించునపుడు నా వేగమెట్లుండునో నీవు గ్రహించలేకున్నావు. నా వేగము నరికట్టు శక్తినంతు లెవరున్నారు? నా వేగము నరికట్టకున్నచో, ప్రవాహ తీవ్రతకు పాతాళము, వరకు పోయెదను. నీ తపస్సంతయూ వ్యర్థమగును. అదియుగాక, యీ స్వర్గమును వదలిపెట్టి, పాపభూయిష్ఠమైన భూమికి నేను యేల రావలయునో తెలియకున్నది. ప్రజలు ఆ జలములో స్నానమాచరించగా, వారి పాపములచేత నేను కలుషితము కాగలను. నేను వారి పాపములను గ్రహించవలసి యుండును నేనెట్లు శుద్ధియగుదును? నన్నెవరు శుద్ధిచేయగలరు?''

భగీరథుడు వినయముతో నిట్లనెను. ''నీవు భయపడుచున్న పాపము పెద్ద సమస్య కాదు. కర్మ బంధముల నుండి ముక్తిపొందిన మహాపురుషులు, భగవచ్చింతన తప్ప అన్య చింత నెరుగని మహాత్ములు, తమ మనస్సులో నారాయణుని ప్రతిష్ఠించుకున్న పుణ్యాత్ములు, నీలో స్నానము చేసినపుడు నీవు శుద్ధికాగలవని జ్ఞానవంతులు చెప్పగా వినియున్నాను. అవి తీర్థ రూపములుగా యేర్పడి నిన్ను శుద్ధి గావించగలవు. ఆ పుణ్య పురుషులు పాపము హరించు శక్తి గలవారగుటచే వారిని పాపము అంటదు. ఇక రెండవది, నీ వేగము నరికట్టు సమస్య యున్నది. మహాదేవుని అనుగ్రహము చేతనే యిది సాధ్యము కాగలదు. నేను మహాదేవుని ప్రార్థించెదను. తల్లీ! మహాదేవుడు తన శిరస్సుపై నిన్ను పెట్టుకుని నీ వేగము నరికట్టుట కంగీకరించినచో, నా పూర్వులను శుద్ధిచేసి పితృలోక ప్రాప్తి లభ్యమగునట్లు చేయగలవా?''

''తప్పక చేసెదను. నా మాట నమ్ము'' అని గంగ పలికెను

భగీరథుడు తిరిగి మహాదేవుని మెప్పించుటకు తపస్సు ప్రారంభించెను భక్తులకు తొందరగా ప్రసన్నుడై వారు కోరిన వరములను ప్రసాదించునని పేరు వడసిన మహాదేవుడు, భగీరథుని తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమై యేమి కావలెనని యడిగెను మహాదేవుని కీర్తించి భగీరథుడు యిట్లు విన్నవించుకొనెను. ''మహాదేవా! కపిలుని ఆగ్రహమునకు గురియైన నా పూర్వులు యెట్లు భస్మమైతిరో నీవు యెరుగుదువు. కపిల మహర్షి నా పితామహునితో మందాకినీ జలముతో వారు. శుద్ధి కాగలరని చెప్పెను అనేక సంవత్సరములు ఆమెను ప్రార్థించగా, ఆమె భూమికి వచ్చుట కంగీకరించెను. కాని ఆమె అతి వేగముగ యీ భూమికి వచ్చునపుడు ఆ వేగమును భరించు శక్తి యీ భూమికి లేకుండుట ఆటంకముగా నున్నది అందుకే నేను మిమ్ములను ప్రార్థించుచున్నాను. ఆమె యీ భూమికి దిగి వచ్చునపుడు, ఆమెను మీ శిరస్సున ధరించి ఆమె వేగము నరికట్టవలెను మహాదేవుడు సంతోషముతో 'సరే' అనెను.

మందాకిని స్వర్గము నుండి అతి వేగముతో క్రిందికి వచ్చుచుండెను. ఈ దృశ్యమును స్వర్గవాసులు ఆశ్చర్యముతో తిలకించుచుండిరి. మహాదేవుడు త్రిశూలమును రెండు చేతులతో వెనుక పట్టుకుని, తల కొద్దిగా పైకెత్తి నిలుచుండెను అతని వక్షము ముందుకు యెగసెను. అతని భుజములపై నున్న సర్పములు అటు

నిటు కదలుచుండెను బంగారు వన్నెతో మెరయుచున్న అతని శరీరమున, అతని కంఠమున నీల వర్ణపు మచ్చ ప్రకాశించుచుండెను అతని పెదవులపై చిరునవ్వు కదలాడగా, లోకమంతయూ గంగానది దిగి వచ్చుట అత్యంతాశ్చర్యముతో తిలకించెను కన్నులు వెడల్పు చేసుకుని, చేతులు జోడించి భగీరథుడు చూచుచుండెను. అతని గుండె వేగముగా కొట్టుకొనుచుండెను. తన పూర్వులకు పితృలోకప్రాప్తి కలుగబోవుచున్నందుకు సంతోషించెను

తన శక్తిని గ్రహించిన గంగ కొద్దిగా గర్వము చెందెను ఆమె అతి వేగముగా దిగుచుండెను. మహాదేవుడు, జడలు కట్టియున్న తన శిరస్సుపై ఆమెను స్వీకరించెను. ఇంతలో ఒక విచిత్రము జరిగెను! అతి వేగముగా హోరు మను శబ్దముతో దిగి వచ్చుచున్న గంగ కన్పించకుండెను మహాదేవుని జడలలో చిక్కుకుపోయెను మహాదేవుని జడలలో చిక్కుకున్న గంగి బయట పడుటకు ప్రయత్నించి విఫలురాయ్యెను.

భగీరథుడు చూచి వాపోవుచూ యిట్లనెను ''ఓ భగవంతుడా! ఇంతలో యేమి జరిగెను? నా తపస్సు అంతా వృధాయేనా? నన్ను కరుణించి, గంగామాతను విడువుము'' అదే చిరునవ్వు పెదవులపై కదలాడగా, మహాదేవుడు తన శిరస్సుపై నున్న ఒక వెంట్రుక ద్వారా గంగ కొద్ది కొద్దిగా జారిపడునట్లు చేసెను. మందాకిని గర్వము భంగము కాగా, జరిగిన దానికి విచారించి సరిదిద్దుకొనెను ఒకొక్క బొట్టుగా మందాకిని భూమిపై పడెను అట్లు పడిన గంగా బిందువులు సరస్సుగా యేర్పడి, 'బిందు సరస్సు' అనియు, 'సప్తస్రోతస్స'నియు పేరొందెను

గంగి యేడు పాయలుగా చీలిపోయెను మూడు తూర్పు దిక్కువైపు, మూడు పశ్చిమ దిక్కువైపు ప్రవహించెను ఏడవ పాయ భగీరథుని రథము ననుసరించి కపిలుని గుహవైపుగా ప్రవహించెను.

భూమిని గంగ స్పృశించిన ప్రదేశములన్నియు పునీతమయ్యెను భగీరథుని రథము వెండి వలె మెరయుచు కొద్ది కొద్దిగా పడుచున్న గంగా బిందువులు, తండ్రిని పుత్రిక అనుసరించునట్లు, అనుసరించెను. త్వరలోనే కపిలుని గుహ సమీపించెను సగరుని అరువదివేల పుత్రులు భస్మముగా మారిన ఆ భస్మరాశిని గంగ తాకి వారిని పునీతులను జేసెను అంతట వారు పితృలోకము చేరిరి.

స్వర్గమందు మందాకినిగా పేరొందియున్న ఆ నది, భూలోకమున గంగ యను పేరుతో ప్రసిద్ధి చెందెను. ఈ లోకమునకు భగీరథుడు గంగను తెచ్చుటచే, గంగను భగీరథుని పుత్రికగా పరిగణించి భాగీరథి యను పేరుతో వ్యవహరించుచున్నారు

## 111 సౌదాస మహారాజు

భగీరథుని వంశములో జన్మించినవాడు సౌదాసుడు అతడు సుదాసుని పుత్రుడు సూర్యవంశపు రాజులందరివలె సౌదాసుడు ధర్మపరాయణుడు మరియు దైవభక్తి కలవాడు. ఒకసారి అతడు వేటకు వెళ్ళెను వేటాడుచుండగా అతనికొక రాక్షసు డెదురయ్యెను. ఆ రాక్షసుని సంహరించి, తిరిగి నగరమునకు వచ్చెను ఆ రాక్షసునకొక సోదరుడు కలడని, రాక్షసుని సంహరించి నందుకు అతని సోదరుడు తనపై పగబట్టెనని

రాజునకు తెలియదు రాక్షసుని ' వచ్చి), కపట మార్గమున రాజ సౌధములో ప్రవేశించెను వంటవాని వేషము ధరించి వంట గదిలో నుండెను.

ఒకసారి రాజు తన కుల గురువైన వసిష్ఠునికి విందు చేయదలచి ఆహ్వానించెను. వంటవాడుగా నున్న రాక్షసుని సోదరుడు నరమాంసమును వండి వసిష్ఠునకు వడ్డించెను తనకు వడ్డించిన పదార్థము భుజింప యోగ్యము కానిదని వసిష్ఠుడు గ్రహించెను వసిష్ఠుడు రాజుపై ఆగ్రహము చెంది యిట్లు శపించెను ''నీవు రాక్షసుడవై నాకు వడ్డించిన యీ ఆహారమును భుజించగలవు''

ముక్కోపులైన అందరి బ్రాహ్మణులవలె, వసిష్ఠుడు జరిగిన విషయమును నిదానముగా యోచించిన మీదట, రాజు అమాయకుడనియు, అది ఒక రాక్షసుని పన్నాగమనియు తెలుసుకొనెను వసిష్ఠుడు శాపమును మార్చుటకు అంగీకరించెను రాజు రాక్షసుడుగా పన్నెండు సంవత్సరములు మాత్రమే యుండునట్లు శాపమును మార్చెను కాని రాజు తనకు అకారణముగా శాపమిచ్చినందుకు వసిష్ఠునిపై ఆగ్రహము కలిగెను అతడు ధర్మపరాయణుడు తిరిగి వసిష్ఠ మహర్షిని శపించు నుద్దేశముతో చేతిలో జలము తీసుకొనెను ఇంతలో దైవభీతి, సద్గుణములు కలిగిన రాజు భార్య మదయంతి తన భర్త చేయునది అనుచితమని గ్రహించెను ఆమె భర్తను త్వరగా సమీపించి, ''ఇట్లు చేయవలదు. బ్రాహ్మణులను, ఋషులను గౌరవించ వలసియున్నది అతడు అన్యాయముగా శాపము నిచ్చినప్పటికీ, కులగురువుపై ఆగ్రహించుట పాడికాదు. ఇది నీకు, నీ వారసులకు శ్రేయస్కరము కాదు'' భార్య మాటల యందు రాజుకు నమ్మకము కుదిరెను కోపమునకు తావు నివ్వకుండ యుండవలసినదని గ్రహించెను చేతిలోని నీటిని తన కాళ్ళపై వేసుకొనెను అతని పాదములు చీకటి రాత్రివలె నల్లగా మారెను. దాని కారణంగా అతనికి 'కల్మాషపాదు'డను పేరు కలిగెను

రాజు రాక్షసుడై అరణ్యములో కాలము గడుపుచుండెను ఒకసారి అరణ్యములో బ్రాహ్మణ దంపతులను అతడు చూచెను. సహజమైన రాక్షస ప్రవృత్తిచేత ఆ బ్రాహ్మణుని పట్టుకుని తినుటకు సిద్ధపడెను అతని భార్య తన భర్తను వదలివేయమని రాక్షస రూపములో నున్న రాజును వేడుకొనెను ఆమె యిట్లనెను ''నీవు గొప్ప వీరుడవు, క్షత్రియుడవు, ధర్మపరాయణుడవు నిజముగా నీవు రాక్షసుడవు కావు- ఇక్ష్వాకు వంశములో మణి వంటి వాడవు. నీవు మహారథుడవు నీ భార్య మదయంతి మహాసాధ్వి దయచేసి నీ నిజస్వభావమును జ్ఞప్తికి తెచ్చుకుని నా భర్తను వదలిపెట్టి నన్ను చంపుము''

కాని రాక్షసుడుగా మారిన రాజు వినకుండెను. శాపగ్రస్తుడైన సౌదాసుని మనస్సు అసుర భావములతో నిండియుండుటచేత, అతడా బ్రాహ్మణుని చంపి తినివేసెను ఆ బ్రాహ్మణుని భార్య ఆవేదనతో ఆగ్రహము చెంది యిట్లనెను భార్యాభర్తలను విడదీసిన నిన్ను శపించుచున్నాను ''నీ భార్యను పొందు సమయములో నీవు మరణించగలవు'' ఆమె భర్తను దహనము చేసి, ఆ చితిలో తాను కూడ ప్రవేశించెను

పండ్రెండు సంవత్సరములు పూర్తి అయిన తర్వాత రాక్షస రూపము పోయి, స్వస్వరూపము కలిగెను అతడు రాజ్యమునకు తిరిగి వచ్చెను అతడు అత్యంత ప్రేమతో భార్యను సమీపించగా, బ్రాహ్మణుని భార్య యిచ్చిన శాపమును ఆమె భర్తకు గుర్తు చేసెను అందుచే అతడామెకు దూరముగా నుండవలసి వచ్చెను ఆ కాలము నాటి సంప్రదాయము ననుసరించి కుల గురువైన వసిష్ఠుడు మదయంతిని స్వీకరించి రాజునకు పుత్రుని ప్రసాదించెను మదయంతి గర్భమున శిశువు యేడు సంవత్సరము లుండెను చివరకు ఒక రాతితో వసిష్ఠుడు మదయంతి గర్భము నుండి ఆ శిశువును బయటకు లాగెను అందుచేత ఆ శిశువుకు 'అస్మకు'డని

పేరిడిరి. అతడు చక్కగా పరిపాలించుచు తన పూర్వుల యశస్సును యినుమడింపజేసెను. సూర్య వంశపు రాజులలో ఒకడైన ఖట్వాంగుడు, సౌదాసుని తరువాతి తరములోని వాడు. అతని మరియొక పేరు విశ్వసహుడు.

# 112 శ్రీరాముడు

ఖట్వాంగుని కుమారుడు దీర్ఘబాహుడు. రఘు మహారాజు యితనికుమారుడు. రఘు మహారాజు కుమారుడు అజుడు. అజుని కుమారుడు దశరథుడు. రావణుని దుశ్చర్యల నుండి దేవతలను రక్షించుటకు, భగవంతుడు యీ భూమిపై అవతరించుట కంగీకరించెను. దశరథునికి పుత్రుడుగా జన్మించెను. ఈ లోకమును పాపముల నుండి విముక్తిగావించుటకు, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులుగా నాలుగు రూపములు ధరించి భగవంతుడు అవతరించెను. రాముని కథను పెక్కుమారులు వినియుందువు. భార్య సీతతో, తమ్ముడు లక్ష్మణునితో కలిసి రాముడు దండకారణ్యములో సంచరించెను. తండ్రి పనుపున వారు అరణ్యవాసము చేసిరి. రాముని అతి సుకుమారముగా తండ్రి దశరథుడు పెంచెను. భార్య సీత అతని మెత్తని పాదములు స్పృశించగా అవి యెరుపెక్కి వాడిన పద్మమువలె నుండెడివి. అటువంటి రాముని సుకుమార కోమల పాదములు అరణ్యమున, తండ్రి ప్రతిష్ఠకు భంగము కలుగకుండుటకై తిరుగజొచ్చెను.

శ్రీరాముడు పదునారు సంవత్సరముల వయస్సులో నున్నపుడు, విశ్వామిత్రుడు దశరథుని వద్దకు వచ్చి యిట్లనెను. ''సిద్ధాశ్రమమున నేనొక గొప్ప యజ్ఞము చేయబోవుచున్నాను. మారీచ సుబాహులను రాక్షసులు ఆ ప్రదేశమును కలుష మొనర్చి యజ్ఞమునకు భంగము గావించుచున్నారు. నీ కుమారుడైన శ్రీరాముని నాతో తీసుకువెళ్ళుటకు వచ్చినాను. అతడు రాక్షసులను హతమార్చును. శ్రీరాముని నాతో పంపుము''.

పుత్ర వాత్సల్యముచేత దశరథుడు శ్రీరాముని పంపుటకు యిష్టపడకుండెను. వసిష్ఠుడు దశరథునకు పుత్రవ్యామోహము తగదనియూ, విశ్వామిత్రునికి ఆగ్రహము కలుగనీయ వలదనియూ నచ్చచెప్పెను. రామలక్ష్మణులు విశ్వామిత్రునితో అరణ్యమున కేగిరి. వారు సిద్ధాశ్రమమును చేరిరి. యజ్ఞము జరుగుచున్నపుడు రాక్షసులు ఆకాశములో కనుపించిరి. శ్రీరాముడు సుబాహుని సంహరించి, మారీచుని సముద్ర తీరమునకు త్రోసివైచెను. యజ్ఞము సంపూర్తి అయ్యెను. విశ్వామిత్రుడు రామ లక్ష్మణులను మిథిలా నగరమునకు తీసుకువెళ్ళెను. జనకుడు విదేహ రాజ్యమును పాలించుచుండెను. మిథిల విదేహ రాజ్యమునకు ప్రధాన నగరము. అతని వద్ద శివ ధనుస్సు గలదు. స్వయంవరమున, శ్రీరాముడు శివ ధనుస్సును విరిచి, జనకుని కుమార్తె సీతను పరిణయమాడెను. సీత శ్రీరామునికి అన్ని విధములను - అందము, వయస్సు, ఉత్తమ గుణములు, పాతివ్రత్యము - తగియున్నది.

సీతను తీసుకుని అయోధ్యకు వెళ్ళుచుండగా, మార్గమందు పరశురాము డెదురయ్యెను. ఈ భూమిపై యిరువది యొక్క పర్యాయములు అతి ఘోరముగా క్షత్రియుల నందరినీ నిర్మూలించెను. రాముడు పరశురాముని ధాటికి తట్టుకుని, అతనికి గర్వ భంగము జేసెను.

దశరథుడు కైకేయి కిచ్చిన వరముల కారణముగా, పదునాలుగేండ్లు దండకారణ్యములో వనవాసము

చేయవలసినదని శ్రీరాము నాజ్ఞాపించెను. పెద్దల యెడ విధేయత కలిగిన శ్రీరాముడు, యెట్టి విచారము లేక, పరమ యోగులు శరీరము త్యజించునట్లు, రాజ్యమును, సంపదను, బంధువులను, అత్యంత ప్రియమైన అయోధ్యా నగరమును విడిచిపెట్టి అరణ్యమున కేగెను. సీత, లక్ష్మణుడు శ్రీరాముని అనుసరించిరి.

అరణ్యములో నుండగా, రావణాసురుని సోదరి శూర్పణఖ శ్రీరాముని జూచి అతనిపై మోహము పెంచుకొనెను. ఆమెకు కలిగిన పాప చింతలకు కురూపిని జేసి శిక్షించెను. ఆమె ఖర, దూషణ, త్రిశిరులను పిలిచి రాముని శిక్షింపమని కోరెను. రావణుడు జన స్థానములో వీరిని తనకు ప్రతినిధులుగా నుంచెను. అరణ్యములో నున్న ఋషుల యెడ వీరు క్రూరముగా ప్రవర్తించుచుండిరి. ఈ ముగ్గురు రాక్షసులను, వారి సేనను యెదుర్కొని శ్రీరాముడు తన కోదండముతో వారి నందరినీ సంహరించెను.

రావణుడు సీత సౌందర్యము గూర్చి వినియుండెను. జన స్థానములోని తన ప్రతినిధులు సైన్య సమేతముగా రామునిచే గూలిరని తెలుసుకొనెను. తన సోదరి శూర్పణఖను కురూపి గావించినందుకు, రాక్షసులను హతమార్చినందుకు ప్రతీకారము చేయ నిశ్చయించెను. రావణుడు సీతా వ్యామోహములో పడి ఆమెను తీసుకుపోవ నెంచెను. మారీచుని ప్రోత్సహించి బంగారు లేడి రూపము ధరించునట్లు చేసెను. ఆశ్రమము ముందర విహరించుచున్న బంగారు లేడి అందమును చూచి, సీత ఆ లేడిని పట్టి తెమ్మని భర్తను కోరెను. ఎన్నడూ యేమియు కోరని సీతకు, ఆ బంగారు లేడిని తెచ్చి బహూకరించవలెనని సంకల్పించి శ్రీరాముడు ఆ లేడిని వెంబడించెను. కొంత దూరము వెంబడించిన తర్వాత, ఒక రాక్షసుడు లేడి రూపము ధరించినట్లు శ్రీరాముడు గ్రహించెను. వెంటనే ఆ లేడిపై బాణము ప్రయోగించెను. దక్షునిపై రుద్రునికి కల్గిన ఆగ్రహమువలె 'హిస్స'ను శబ్దము చేయుచు, లేడి రూపములో నున్న మారీచుని వధించెను. ఆశ్రమములో శ్రీరాముడు లేని సమయము చూచి, రావణుడు ప్రవేశించి సీత నెత్తుకుని పోయెను.

రామలక్ష్మణులు సీతను వెదకుటకై అరణ్యమంతయు సంచరించిరి. దారిలో వారికి దశరథుని స్నేహితుడైన జటాయువు యెదురయ్యెను. రావణునితో పోరి జటాయువు మరణించుటకు సిద్ధముగా నుండెను. శ్రీరాముడు జటాయువుకు అంత్యక్రియలు సలిపి, తిరిగి సీత నన్వేషించుచూ లక్ష్మణునితో అరణ్యమంతయూ వెదకెను. దుఃఖములో నున్న శ్రీరాముని కొంతవరకు లక్ష్మణుడు సముదాయించెను. సీతా వియోగ దుఃఖము శ్రీరాముడు భరించలేకుండెను. విచారములో నున్న శ్రీరాముడు లక్ష్మణునితో యిట్లు పలికెను. ''లక్ష్మణా! స్త్రీపై అనురాగము పెంచుకున్న పురుషుని స్థితి యీ విధముగా నుండును. సీత లేని వెలితి దుర్భరముగా నున్నది''.

రామలక్ష్మణులు సీతకై అన్వేషించుచుండిరి. ఇంతలో కబంధుడనే రాక్షసుడు, తన విశాలమైన బాహువులతో వారిని పట్టుకొన జూచెను. కాని చివరకు వారిచేత మరణించెను. ఆ తర్వాత వారు ఋష్యమూక పర్వతము చేరి, అచ్చట వానరరాజు సుగ్రీవునితో చెలిమి చేసుకొనిరి. సుగ్రీవుని సోదరుడైన వాలిని జంపి సుగ్రీవుని పట్టాభిషిక్తుని జేసిన తర్వాత, సుగ్రీవుడు అతని వానర సైన్యమును తోడ్కొని, రామలక్ష్మణులు దక్షిణ సముద్రతీరము చేరిరి. సాగర రాజు తనకు త్రోవను యివ్వగలడని మూడు రాత్రులు శ్రీరాముడు వేచి చూచెను. సముద్రము దాటి లంకలో ప్రవేశించుటకు సాగరరాజు వీలు కల్పించకుండుటచే, శ్రీరాముడు ఆగ్రహము చెందెను. సముద్రమును దగ్ధము గావించెదనని రాముడు బెదరించెను. అప్పుడు సాగరరాజు వచ్చి క్షమించమని ప్రార్థించెను. శ్రీరామునితో అతడిట్లనెను. ''ఉత్తమ దైవమైన నీవు నాపై ఆగ్రహించితివి. నా అజ్ఞానమునకు క్షమించి మన్నించవలెను. నాపై యీ వానరులచేత సేతువును నిర్మించుము. అది తేలునట్లు చేయగలనని

మాట యిచ్చుచున్నాను''. వానరులు సేతువు నిర్మించగా, వారితో కలిసి రామలక్ష్మణులు లంకలో ప్రవేశించిరి. ఇంతకు పూర్వము సీతను వెదకుటకై వచ్చిన హనుమంతుడు లంకను దగ్ధము గావించెను. ఏనుగుల గుంపు పద్మములతో నిండిన సరస్సును చెల్లాచెదరు గావించునట్లు, వానర సైన్యము అందమైన లంకలోని అసంఖ్యాక మైన పూల తోటలను, భవనములను, కోశములను, పక్షుల గూళ్ళను, ఆటస్థలములను చిందర వందర జేయుచుండెను.

తన నగరములో వానర సైన్యము ప్రవేశించి భీభత్సము కల్గించినందుకు శ్రీరామునిపై రావణుడు మండిపడెను. శత్రువులతో పోరుటకు కుంభ, నికుంభ, ధూమ్రాక్ష, దుర్ముఖ, సురాంతక, నరాంతకులను రావణుడు పంపెను. ఆ తర్వాత రావణుని కుమారుడు సర్వసేనాని యైన ఇంద్రజిత్తు, ప్రహస్తుడు, అతికాయుడు, అకంపనుడు, సోదరుడు కుంభకర్ణుడు, వారిపై యుద్ధమునకు వచ్చిరి. వారందరూ రామలక్ష్మ ణులచే హతులైరి. సుగ్రీవుడు, హనుమంతుడు, నీలుడు, అంగదుడు, జాంబవంతుడు, యితర వానర ప్రముఖులు రామలక్ష్మణులకు సహాయపడిరి. చివరకు శ్రీరాముని చంపుటకు రావణుడు రణరంగములో ప్రవేశించెను. రామరావణ యుద్ధమును స్వర్గవాసులు తిలకించుచుండిరి. రావణుడు తన రథము నెక్కి రణరంగమున ప్రవేశించినపుడు స్వర్గాధిపతి ఇంద్రుడు తన రథమును మాతాలి సారధ్యములో శ్రీరామునకు పంపెను.

మరపురాని రామరావణ యుద్ధములో చివరకు శ్రీరాముడు ప్రయోగించిన బ్రహ్మాస్త్రముచేత రావణుడు హతుడయ్యెను.

విభీషణుడు, సోదరుడైన రావణునకు, మరణించిన యితర బంధువులకు అంత్యక్రియలు జరిపెను. శ్రీరాముడు విభీషణునకు పట్టము గట్టి, కల్పాంతము వరకు సుఖముగా జీవించునట్లు వరము ప్రసాదించెను. ఆ తర్వాత శ్రీరాముడు సీతను తీసుకుని, లక్ష్మణుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, విభీషణుడు అనుసరించగా లంకా పట్టణము వదలి వెళ్ళెను.

శ్రీరాముడు సీతాసమేతముగా అయోధ్యకు యేతెంచెను. వారి రాకకై భరతుడు వేచి చూచుచుండెను. భరతుడు కూడ, అరణ్యములో శ్రీరాముని వలె, పట్టు వస్త్రములు ధరించక నార వస్త్రములు ధరించి సాధు వేషములో నుండుచు వచ్చెను. అన్నగారివలె తాను కూడ నేలపై పవ్వళించుచుండెను. భరతుని తల జడలు కట్టి యుండెను. అయోధ్యా నగరము పొలిమేరలలో నున్న నంది గ్రామములో నివసించుచు, శ్రీరాముని ప్రతినిధిగా అయోధ్యను పాలించుచుండెను. సింహాసనముపై శ్రీరాముని పాదుకలను అతనికి చిహ్నముగా నుంచెను.

శ్రీరాముడు తిరిగి వచ్చుచున్నాడన్న వార్త విని భరతుడు, పాదుకలను శిరస్సుపై ధరించి, నంది గ్రామము విడిచి త్వరగా వెళ్ళి రామ లక్ష్మణులను కలుసుకొనెను. పాదుకలను క్రిందపెట్టి, అశ్రువులు నిండిన నేత్రములతో రాముని పాదములకు నమస్కరించెను. శ్రీరాముని తిరిగి అయోధ్యకు ఆహ్వానించుచూ వైదిక బ్రాహ్మణులు వేద మంత్రములను పఠించుచుండగా, రాముడు భరతుని కౌగిలించుకొనెను.

శ్రీరాముడు, సోదరులతో, నగర పౌరులు వెంటరాగా అయోధ్యలో ప్రవేశించెను. నగర మంతయు ఆనంద కోలాహలముతో నిండియుండెను. శ్రీరాముడు అభ్యంగనము చేసి, పట్టాభిషిక్తుడయ్యెను.

అనేక యాగములు జరిపి, రాజ్యమును సమర్ధముగా పాలించెను.

ఒకసారి ఒక పౌరుడు శ్రీరాముని భార్య గురించి చులకనగా మాట్లాడుట వినియుండెను. ఆ పౌరుడు రాము నసహ్యించుకుని యిట్లనెను. "మరొకరి గృహములో నుండిన భార్యను తన యింటికి తిరిగి రానివ్వరాదు. భార్య యందు మోహము కలిగిన రాముడు సీతను రానిచ్చెను. నేనయితే అట్లు చేసెడి వాడను కాను". ఇది విన్న రాముడు భార్యను వదలివేయుటకు నిశ్చయించుకొనెను. శ్రీరాముడు తన పౌరులకు ప్రీతి గలుగునట్లు వర్తించుటయే మహారాజుగా తన ప్రథమ కర్తవ్యమని యెంచెను. అప్పుడు సీత గర్భవతిగా నుండెను. ఆమె వాల్మీకి ఆశ్రమము చేరి, అచ్చట యిద్దరు పుత్రులను ప్రసవించెను. వారు కుశలవులు.

పుత్రులను వాల్మీకి సంరక్షణలో వదలి, ఆమె భూమి యందు ప్రవేశించెను. ఇది విని శ్రీరాముడు దుఃఖములో మునిగెను. పాలకుడుగా తనవియైన ప్రత్యేక భావములు ఉండకూడదని అతడు విశ్వసించెను. అతడు పదునొకండు వేల సంవత్సరములు యీ భూమిపై పరిపాలించి, తిరిగి నిజ స్థానమైన వైకుంఠము ప్రవేశించెను.

## 113 చంద్రవంశము

నారాయణుని నాభి నుండి సృష్టికర్త బ్రహ్మ ఉద్భవించెను. బ్రహ్మ కుమారుడు అత్రి మహర్షి. ఒకసారి అత్రి మహర్షి ఆనంద బాష్పములు రాల్చగా, ఆ బాష్పముల నుండి ఒక పుత్రుడు జన్మించెను. అతని పేరు సోముడు. అతడు అమృత పుత్రుడు. సృష్టికర్త బ్రహ్మ సోముని ఓషధులకు, నక్షత్రములకు అధిపతిగా నియమించెను. ముల్లోకములను జయించి సోముడు రాజసూయ యాగము చేసెను. అతడు అత్యంత సుందరముగను ఆకర్షణీయముగను ఉండుటచే అతనిని చూచిన వారందరూ ప్రేమించుచుండిరి.

కొంత కాలమునకు అతనిలో గర్వము, అహంభావము పెరిగెను. పర్యవసానముగా అతని ధర్మపరాయణత క్షీణించ దొడగెను. దేవతల గురువైన బృహస్పతికి తార యను అందమైన భార్య కలదు. సోముడు ఆమెను బలవంతముగా తీసుకుపోయెను. అతడు అతి సుందరముగా ఆకర్షణీయముగా నుండుటచే తార అతని ప్రేమను వారించకుండెను. బృహస్పతికి భార్యపై విపరీతమైన మక్కువ. తన భార్యను యిచ్చివేయుమని బృహస్పతి పదే పదే అడిగినప్పటికి, సోముడు నిరాకరించెను.

దీని కారణముగా స్వర్గములో యుద్ధము మొదలయ్యెను. మొదటి నుండి బృహస్పతిపై సద్భావము లేని అసుర గురువు శుక్రాచార్యుడు, యిదే అదను అని తలచి సోముని పక్షము వహించెను. అతనితోబాటు అసురులందరూ సోముని పక్షము వహించిరి. మహాదేవుడు, అంగిరసుని పుత్రుడైన బృహస్పతి పక్షము వహించెను. మహాదేవునికి అంగిరసునిపై చాల గౌరవము కలదు. అంగిరసుని తన గురువుగా సరిగణించెడివాడు. దీనికొక కారణము గలదు. దక్షుడు యజ్ఞము చేయుచున్నపుడు, దక్షుని కుమార్తె మహాదేవుని భార్య అయిన సతీదేవి శరీరమును విడనాడినపుడు, మహాదేవుడు తనను తాను మరచేటంత దుఃఖములో మునిగి యుండెను. అప్పుడు నారాయణుడు మహాదేవుని సముదాయించి, అతని సహజ స్వభావము గుర్తుచేయుటకు అంగిరసుని పంపెను. అంగిరసుడు ఆ విధముగా జేసి దుఃఖములో మునిగిన మహాదేవుని రక్షించినందులకు, అతనిపై మహాదేవునకు విశేషమైన గౌరవము కలదు.

ఇంద్రుడు, యితర దేవతలు తమ గురువైన బృహస్పతి పక్షము వహించిరి. యుద్ధము తీవ్రముగా సాగుచుండెను. ఇరుపక్షముల వారు, సోముని అహంభావము కారణముగా, నశింపనున్నట్లు గోచరించెను. ఇది చూసి బ్రహ్మ జోక్యము చేసుకొనుటకు నిశ్చయించెను. మనుమడైన సోముని వద్దకు వెళ్ళి తీవ్రముగా మందలించి, తారను తీసుకువచ్చి బృహస్పతికి అప్పజెప్పెను.

ఆమె గర్భవతిగా నుండుట బృహస్పతి కనుగొనెను. అతని కామెపై విశేషమైన ప్రేమ యుండుటచే, ఆమె తప్పిదమునకు ఆగ్రహించకుండెను. అతడామెతో నిట్లనెను. ''నీ గర్భములో శిశువు పెరుగుచున్నాడు. ఎవరి శిశువో నాకు తెలియదు. నీ గర్భము నుండి శిశువును ప్రసరింపుము. నేను అప్పుడు తండ్రి నగుదును. నీవు స్త్రీ వగుటచేత నిన్ను శపించను. భయపడకుము''. శిశువు జన్మించెను. పుట్టిన మగ శిశువు చాల అందముగా నుండెను. బృహస్పతికి ఆ శిశువుపై అనురాగ మెక్కువయ్యెను. సోమునకు కూడ ఆ శిశువుపై అనురాగ ముండెను. సోముడు, తన శిశువని బృహస్పతితో వాగ్వాదము పెట్టుకొని శిశువును తన కిమ్మని కోరెను. దేవతలు, ఋషులు తారను ప్రశ్నించిరి. కాని సిగ్గు అవమానము ముంచుకురాగా, ఆమె బదులు చెప్పకుండెను. కొత్తగా పుట్టిన శిశువు మాట్లాడ మొదలుపెట్టి యిట్లనెను. ''నీవు యేల బదులు చెప్పవు? నీ భర్త యెడల అవిధేయతతో ప్రవర్తించితివి. నా గురించిన సత్యమును అతడు తెలుసుకొనదలచినపుడు నీవు మాట్లాడకుంటివి. నేనెవరో చెప్పుము''. ఆమెను ప్రక్కకు తీసుకువెళ్ళి రహస్యముగా ఆమె నుండి సత్యము తెలుసుకొనుటకు బ్రహ్మ ప్రయత్నించెను. ఆమెను పదే పదే అడుగగా, చివరకు నెమ్మదిగా తడబడుతూ, సోముడు (చంద్రుడు) శిశువు తండ్రియని చెప్పెను. ఆ శిశువును చంద్రుడు తీసుకువెళ్ళెను. కొత్తగా పుట్టిన శిశువు సత్యమును తెలుసుకొన గోరినందులకు బ్రహ్మ అతని ధర్మ పరత్వమున కచ్చెరువందెను. ఆ శిశువు మహాజ్ఞాని యని యెంచి బ్రహ్మ ఆ శిశువుకు 'బుధు'డని నామకరణము గావించెను. బుధుడనగా తెలుసుకొనువాడు లేక జ్ఞానవంతుడు.

సూర్య వంశమునకు మూలపురుషుడు, వైవస్వతుని పుత్రుడు అయిన శ్రాద్ధదేవునకు చాల కాలము వరకు సంతానము లేకుండెను. అతడు గురువైన వసిష్ఠుని యజ్ఞము చేసి మైత్రావరుణులను ప్రార్థించవలసినదని కోరెను. అతని భార్య పుత్రికను బడయగోరెను. యజ్ఞము గావించుచున్నపుడు, తన కోరిక ఫలించునట్లు చేయమని ఆమె హోతను కోరెను. ఆమె కోరినట్లుగా హోత యజ్ఞము జరిపించెను. ఆమెకు పుత్రిక జన్మించెను. రాజునకు యిది నిరాశ కలిగించెను. అతడు వసిష్ఠుని యిదెట్లు జరిగెనని ప్రశ్నించెను. వసిష్ఠుడు, మహారాణి కోరికపై హోత మంత్రములను మార్చి, ఆమెకు పుత్రిక జన్మించునట్లు చేసెనని చెప్పెను. ఆమెకు పుట్టిన బిడ్డ పేరు 'ఇళ'. పుట్టిన బిడ్డను బిడ్డడుగా తన తపశ్శక్తిచేత మార్చవచ్చునని, వసిష్ఠుడు రాజునకు తెలిపెను. వసిష్ఠుని తపశ్శక్తిచేత ఆ బాలిక బాలుడుగా మారెను. రాకుమారునికి సుద్యుమ్నుడని పేరు పెట్టిరి.

ఒక పర్యాయము రాకుమారుడు వేటకై ఉత్తర దిక్కుగా వెళ్ళెను. మేరు పర్వత పంక్తులందు ఒక వెచ్చని వృక్షముల పొదలో సుద్యుమ్నుడు తన అనుయాయులతో ప్రవేశించెను. ప్రవేశించిన వెంటనే అతడు స్త్రీగా మారెను. అతని అనుయాయులకు, గుర్రమునకు కూడ యిట్లే జరిగెను. ఇట్లు జరుగుటకు మహాదేవుని శాపమే కారణము.

ఒకప్పుడు మహాదేవుని పూజించుటకు ఋషులు అరణ్యమునకు వచ్చిరి. మహాదేవుడు ఆ అరణ్యములో వసించుచుండెను. ఎప్పటివలెనే, పార్వతి మహాదేవునితో అరణ్యము నందుండెను. మహాదేవుని చూడవలెనను

ఆశ్రమమునకు ముందుగా తెలియబరచకుండ, పార్వతీ పరమేశ్వరులు ఉండు ప్రదేశమున ప్రవేశించిరి. పార్వతి మహాదేవుని ఒడిలో వివస్త్రయై కూర్చుండెను. ఋషులు ప్రవేశించుట చూచి, ఆమె సిగ్గుతో అక్కడ పడియున్న వస్త్రమును కప్పుకుని లేచి వెళ్ళిపోయెను. ఋషులు ఇరకాటపు పరిస్థితిలో పడి, అక్కడ నుండి వారు నర నారాయణుల ఆశ్రమమునకు వెళ్ళిరి.

తన భార్యను సముదాయించుటకు మహాదేవుడు యిట్లు శపించెను. ''ఈ అరణ్యములో ప్రవేశించు వారు స్త్రీలుగా మారెదరు''. ఆ శాపము చేత పురుషులెవరూ ఆ అరణ్యములో ప్రవేశించకుండిరి. వసిష్ఠుడు, రాకుమారునికి సహాయము చేయవలసినదని మహాదేవుని ప్రార్థించెను. అప్పుడు, మహాదేవుడు, ఆ రాకుమారుడు ఒక నెల పురుషుడుగను, తరువాత నెల స్త్రీగను, తిరిగి ఒక నెల పురుషుడుగను యిట్లు తన కుమారునకు రాజ్యము నిచ్చివేసి అడవికి వెళ్ళి తపమాచరించువరకు జీవించగలడని చెప్పెను.

సుద్యుమ్నుడు అరణ్యములో స్త్రీ రూపముతో సంచరించుచున్నపుడు, సోముని పుత్రుడైన బుధుడు ఆమె అందమునకు మెచ్చి ప్రేమలో పడెను. ఆ సమయమున సుద్యుమ్నుడు ఇళగా నుండెను. ఇళా బుధులకు ఒక పుత్రుడు కలిగెను. ఆ కుమారునకు పురూరవుడని పేరు పెట్టిరి. చంద్రవంశములో అతడు మొట్టమొదటి మహారాజు.

## 114 పురూరవుడు

పురూరవునకు తండ్రి వివేకము, పితామహుడైన సోముని సౌందర్యము సంక్రమించెను. సుద్యుమ్నుడు రాజ్యమును పురూరవునకు అప్పగించి అరణ్యమునకు వెళ్ళగా, పురూరవుడు చక్కగా రాజ్య పరిపాలనము చేయుచుండెను. పురూరవుని కీర్తి నాలుగు దిక్కులను వ్యాపించెను.

ఒకసారి ఇంద్రుని సభలో నారదుడు, పురూరవుని సౌందర్యమును, ఔదార్యమును, ధర్మపరాయణతను కొనియాడెను. రాజులకు ఉండవలసిన గొప్ప సద్గుణము లన్నియూ పురూరవునిలో కలవని పలికెను. నారదుడు పురూరవుని గుణములను శ్లాఘించగా, నాట్యసుందరి ఊర్వశి నారదుని మాటలను విని పురూరవునిపై మమత పెంచుకొనెను. పురూరవునిపై ప్రేమతో భూలోకమునకు వచ్చెను. ఆమె పురూరవుని వద్దకు వెళ్ళి అతని సౌందర్యమునకు దిగ్భ్రాంతి చెందెను. పురూరవుడు ఊర్వశి సౌందర్యమును గ్రోలుచుండెను. అతి సరళముగా అతడామెతో యిట్లనెను. ''దయచేసి కూర్చొని, నీకు సంతోషము చేకూర్చుటకు నేనేమి చేయవలెనో చెప్పుము''. ఆమె మౌనముగా నిలిచి యుండెను. ఆమె నేత్రములు యెన్నో విషయములు తెలుపుచున్నట్లుండెను. ఆమె రాజుపై బరపిన దరహాసముతో కూడిన దృక్కులను చూచి, తనపై ఆమెకు అపేక్ష కలదని పురూరవుడు భావించి యిట్లనెను. ''నీ అందమునకు నేను ముగ్ధుడనైతిని నీవు నా భార్యవు కాగలవా?''

ఊర్వశి యిట్లు జవాబిచ్చెను. ''నీవంటి అపురూప సౌందర్యవంతుడు నా యెదుట నిలిచి నన్ను భార్యగా స్వీకరించ దలచినచో, నేను కాదనగలనా? ఈ భూలోకములోగాని, స్వర్గలోకములోగాని నీ సౌందర్యమునకు ముగ్ధులుగాని స్త్రీలు ఉండరని నా అభిప్రాయము. నా మనస్సు, నేత్రములు నీ పరమైనవి. నా హృదయము ప్రేమతో ఉప్పొంగగా నీకడకు వచ్చితిని. కాని నన్ను భార్యగా పొందుటకు నీవు రెండు షరతులను పాటించవలసి

యున్నది''.

రాజు యిట్లనెను. ''ఆజ్ఞాపించు, ప్రేమ సుందరీ! నీవు యేది చెప్పినను చేయుటకు సిద్ధముగా నున్నాను''. ఆమె యిట్లనెను. ''ఇవి నా పెంపుడు మేకలు. వాటిని రక్షింపవలెను. వాటికి యెటువంటి హానియు కలుగదని నీవు మాట యివ్వవలెను. రెండవ నిబంధన: సంగమించునపుడు తప్ప నిన్ను వివస్త్రునిగా నేనెన్నడూ నిన్ను చూడకూడదు. నేను నెయ్యి తప్ప యింకేదియు భుజించను''.

రాజు ఆమె నిబంధలన్నిటినీ అంగీకరించెను. వారు భార్యాభర్తలైరి. చాల కాలము వారు యీ భూలోకము నందు, స్వర్గలోకమునందు, వనములందు సంచరించి ఆనందముగా కాలము గడుపుచుండిరి. కుబేరుని చైత్ర వనములో వారు తరచు కాలము గడపుచుండెడివారు.

ఊర్వశి లేని స్వర్గము నిర్జీవముగా నున్నట్లు ఇంద్రునకు గోచరించెను. ఆమెను తిరిగి స్వర్గమునకు రప్పించుటకు అతడు నిశ్చయించుకొనెను. ఒకరోజు పురూరవుడు ఊర్వశి గాఢముగా నిద్రించు సమయమున, ఇంద్రుడు పంపగా గంధర్వులు వచ్చి మేకలను అపహరించిరి. వాటిని తోలుకుని గంధర్వులు వెళ్ళుచున్నపుడు అవి అరచిన అరుపులకు వారికి తెలివి వచ్చెను. ఊర్వశి మతిచెడిన దానివలె నుండెను. విచారములో నున్న ఊర్వశి పురూరవుని మేల్కొలిపి, అతనిని పరుషముగా నిందించెను. ఆమె అతనితో యిట్లనెను. ''నీవు గొప్ప వీరుడవని తలచి నేను తెలివి తక్కువ దానినైతిని. నా పెంపుడు మేకలను రక్షించగలవని నమ్మినాను. వానిని యిప్పుడు అపహరించినారు. నీలో మగతనమే లేదు. వెలుగు ఉండినప్పుడే నీవు మగతనము ప్రదర్శింతువు. రాత్రి ఆడువారివలె నిద్రపోవుచు బయటకు వెళ్ళుటకు ధైర్యములేని పిరికిపందవు. నా మేకలను రక్షింపలేకపోతివి. నన్ను మోసగించినావు''.

ఆమె పరుష వాక్కులను విన్న రాజు మంచము నుండి ఉరికి, కత్తి తీసుకుని దొంగలను పట్టుకొనుటకు బయటకు వెళ్ళెను. అతని శరీరముపై వస్త్రములు లేవు. అదే సమయములో, ఇంద్రుని మాయోపాయముచేత ఆకాశమున ప్రకాశవంతమైన మెరుపొకటి మెరసెను. గంధర్వులు మేకలను వదలిపెట్టి అదృశ్యమైరి. వివస్త్రుడైన రాజును చూచిన ఊర్వశి కూడా అదృశ్యురాలయ్యెను. తిరిగి వచ్చిన రాజు ఆమె లేకుండుట కనుగొనెను.

ఊర్వశి లేని జీవితము పురూరవునకు దుర్భరముగా నుండెను. భూలోకమంతయు ఆమెను వెదకుచు తిరుగజొచ్చెను. సరస్వతీ నదీ తీరమునకు వెళ్ళగా, అక్కడ ఊర్వశి సఖుల నైదుగురిని అతడు చూచెను. ఆమెకు అతని సందేశ మీ విధముగా నుండెను. ''ప్రియా! నన్ను విడిచి వెళ్ళకుము. నన్ను క్రూరముగా హింసింపకుము. నాతోనే యుండుము. నీ కొరకైయీ విధముగా తిరుగుచుంటిని. ఒకప్పుడు నిన్ను ప్రేమించిన నా యీ శరీరము శిథిలము కానున్నది గ్రద్దలు, తోడేళ్ళు నా శరీరమును తినగలవు''

ఊర్వశి సమాధానము యీ విధముగా నుండెను. ''అబద్ధము లాడకుము. తోడేళ్లు నిన్ను తిని యుండనవసరము లేదు. ఆడువారిని నమ్మరాదని నీవు యింకను గ్రహించలేదా? వారికి దేనిపైననుగాని, యెవరి యందుగాని శాశ్వతమైన ప్రేమ యుండదు. వారి హృదయములు తోడేళ్ళ వంటివి. వారు కరుణారహితులు, క్రూరులు, హృదయము లేని వారు, ఓర్పు లేనివారు, వారి కోర్కెలను తీర్చుకొనుటలో బహు మొండివారు. వారిని నమ్మిన ప్రియుని, భర్తను, సోదరుని, యెవరినైనను, యేదో ఒక నెపము మీద చంపుటకు వెనుకాడరు. అది వేరే విషయము, అదంతయు వదలిపెట్టుము. ఈ సంవత్సరాంతమున నీవు

నన్ను కలుసుకుని ఒక రాత్రి గడపగలవు. అప్పుడు నీకు పుత్రుడు సమకూరును''.

ఆమెను తిరిగి కలుసుకొనబోతున్నానని, ఆమె శిశువుతో నున్నదని, ఆ శిశువు తన సింహాసనమునకు వారసుడగునని తెలుసుకుని ఉత్సాహముతో గంతులు వేసెను. ఆమె చెప్పినట్లుగనే, ఒకరోజు రాత్రి ఆమె పురూరవునితో గడిపెను. ఆమె వెళ్ళిపోవు సమయము రాగానే, అతనికి విచారముగ నుండెను. ఊర్వశి యిట్లు చెప్పెను. ''గంధర్వులను ప్రార్థింపుము. వారు మనలను యేకము గావింతురు''.

పురూరవుడు గంధర్వులను ప్రార్థించెను. అతనికి ఒక అగ్ని పాత్రను యిచ్చి యిట్లు పలికిరి. ''ఈ అగ్ని పాత్రతో మేము చెప్పినట్లు మంత్ర విధులను గావింపుము. నీవు తిరిగి ఊర్వశిని చేరగలవు''.

అతడు చెట్టుక్రింద ఆ పాత్రను పూడ్చి, ఆ రాత్రి అంతయు ఆమెను గురించి ఆలోచించుచుండెను. ఆ రాత్రి స్వప్నములో మూడు వేదములను గాంచెను. ఉదయమున తాను పాత్రను పూడ్చి పెట్టియున్న ప్రదేశమునకు వెళ్ళెను. గంధర్వులు చెప్పినట్లుగా అతడు అరణులను తీసుకుని ఒక దానితో నొకటి రాపిడి చేసెను. అట్లు రాపిడి చేయగా అగ్ని ఉద్భవించెను. అగ్ని మూడు రూపములు ధరించెను. ఈ మూడును మూడు వేదములకు ప్రతినిధులు. అవి: గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని.

అగ్ని సాక్షిగా అతడు నారాయణుని పూజించి, తన కోరికను ప్రసాదింపుమని ప్రార్థించెను.

పురూరవుని కోరిక సిద్ధించెను. అతడు గంధర్వుల నివాస స్థలము చేరి ఊర్వశిని తిరిగి పొందెను.

## 115 పరశురాముడు

పురూరవుని కుటుంబములో గాధియను మహారాజు జన్మించెను. అతని పుత్రిక సత్యవతి. రుచీకుడను బ్రాహ్మణుడు గాధి మహారాజు వద్దకు వచ్చి, సత్యవతిని తనకిచ్చి వివాహము చేయమని కోరెను. రాజు రుచీకునితో నిట్లనెను. ''నీవు నా కుమార్తెను వివాహమాడవలెనన్న, ఒక వెయ్యి అశ్వములను నాకు కానుకగా నియ్యవలెను; ఆ అశ్వములు చంద్రునివలె పాలతెలుపు శరీరము, నల్లని చెవులను కలిగి యుండవలెను. నా కుమార్తెపై నీకు యెనలేని ప్రేమ యున్నచో యీ కన్యాశుల్కమును నీవు యివ్వగలవు. ఈ విధముగా శుల్కము తీసుకొనుట మాకు ఆచారము కాదు. కాని నా పుత్రికపై నీకు యెంతవరకు ప్రేమ ఉన్నదో తెలుసుకొనగోరి యీ శుల్కము నడుగుచున్నాను''. రుచీకుడు సాగరరాజైన వరుణుని కడకేగి తనకు సహాయము చేయవలసిన దని ప్రార్థించెను. రుచీకుడు వేయి అశ్వములతో తిరిగి వచ్చి వాటిని గాధిరాజు కొసగి, సత్యవతిని తనకిచ్చి వివాహము చేయుమనెను. గాధిరాజు సంతుష్టుడై, తన కుమార్తెకు తగిన వరుడు లభించెనని తలచి ఆమెను రుచీకునికిచ్చి వివాహము చేసెను.

గాధి రాజునకు పుత్రులు లేకుండిరి. రుచీకునకు కూడ పుత్రుడు కలుగలేదు. గాధి భార్య, సత్యవతి యిద్దరూ తమకు సంతానము కలుగునట్లు సహాయపడవలెనని రుచీకుని కోరగా, అతడందుల కంగీకరించెను.

వారికొరకు, మంత్రములచే పునీతమైన జలమును రెండు మట్టి పాత్రలలో నుంచెను. ఒకటి రాజు భార్య

కొరకు. ఆ పాత్రలోని జలము త్రాగిన స్త్రీకి క్షత్రియ గుణములు కలిగిన పుత్రుడు కలుగునట్లు రుచీకుడు మంత్రించెను. తన భార్య కొరకు రెండవ పాత్రలోని జలమును బ్రాహ్మణ గుణములు కలిగిన పుత్రుడు జన్మించునట్లు మంత్రించెను ఆ రెండు పాత్రలను ఆశ్రమములో నుంచి, రుచీకుడు ప్రాతః స్సంధ్యావందన విధులు నెరవేర్చుటకు నదీ తీరమునకు వెళ్ళెను

ఆ ఇరువురు స్త్రీలు ఆశ్రమములో తన కొరకై యుంచిన రెండు పాత్రలను చూచిరి. గాధి రాజు భార్య, రుచీకుడు తన భార్య యెడల సహజముగా పక్షపాతముతో నుండగలడని అనుమానించెను. సత్యవతి కుద్దేశించిన పాత్ర జలము, తన కుద్దేశించిన దానికన్న మెరుగుగా నుండగలదని తలపోసెను. తన పుత్రుడు, మనుమని కన్న ఉత్తముడుగా నుండవలెనని తలంచెను. అందుచేత ఆమె కుమార్తెతో యీ పాత్రలను తారుమారు చేసినను యెటువంటి హాని జరుగబోదని, రెండును కూడ పుత్రులను ప్రసాదించుటకేయని చెప్పెను. సరళ స్వభావురాలైన సత్యవతి అట్లే కానిమ్మని పలికెను రుచీకుడు తిరిగి వచ్చేలోపల వారా పాత్రలలోని జలమును త్రాగిరి ఆ తర్వాత సత్యవతి తన భర్తతో తల్లి సలహాపై ఆ పాత్రలను తారుమారు చేసినట్లు చెప్పెను తల్లీ కుమార్తెల తెలివితక్కువ తనమునకు అతడు కోపగించెను

''నాతో చెప్పకుండ మీరిద్దరూ యీ విధముగా యెందుకు చేసిరి?'' అని రుచీకుడు పలికెను. ''మీరిద్దరూ పుత్రులు కావలెనని కోరగా ఆమెకు క్షత్రియ గుణములుకల బాలుడు జన్మించునట్లును, నీకు బ్రాహ్మణ గుణములుకల పుత్రుడు జన్మించునట్లును నేను ఆ రెండు పాత్రలలోని జలమును మంత్రించినాను అది యిప్పుడు తారుమారైనది నీకు కలుగబోయే తమ్ముడు సాధు పురుషుడుగను, నీ కుమారుడు వీరుడైన క్షత్రియుడుగను ఉందురు'' ఈ విషయము సత్యవతిని కలవరపరచెను ఆమె భర్త పాదములపైబడి యేదో ఒక విధముగా తిరిగి మార్చుమని కోరెను. రుచీకు డిట్లనెను. ''నేను ఒటి మాత్రము చేయగలను ఒక తరము తర్వాత జరుగునట్లు చేయగలను నీ పుత్రుడు సరళ స్వభావము కలిగియుండును, కాని నీ మనుమడు క్షత్రియ గుణములు కలవాడై యుండును''

సత్యవతికి కుమారుడు పుట్టెను అతని పేరు జమదగ్ని అతడు సాధుత్వము మూర్తీభవించినట్లుండెను తల్లివలె అతి సరళముగా, ఆప్యాయముగా నుండెను సత్యవతి మరణించినపుడు, ఆమె కౌశికి నదిగా రూపొందెను ఆ నది లోకమునంతను పునీతము గావించునదిగా ప్రసిద్ధికెక్కెను

జమదగ్ని రేణుకను వివాహమాడెను వారికి అయిదుగురు పుత్రులు కలిగిరి. వారు —— వసుమనుడు, వసువు, వసుషేణుడు, రుమణ్వంతుడు, రాముడు చివరివాడైన రాముడు క్షత్రియ గుణములు కలిగి యుండెను కాని అతడు తరువాత కాలములో క్షత్రియ ద్వేషిగా పేరుగాంచెను అతడు, పాపపూరితమైన హైహయ రాజుల నుండి యీ లోకమును రక్షించుటకు, భగవంతుని అవతారముగా వెలసెనని చెప్పుచుందురు భార్గవ రామునిలో రాజస తామస గుణము అధికముగా నుండెను తనకు గౌరవము చూపక అవమానించిన వారిని, అదెంత స్వల్పమైనను, తీవ్రముగా శిక్షించుచుండెను సహజముగా అతడు క్షత్రియుడు కాని పుట్టుకచే బ్రాహ్మణుడగుటచేత, బ్రాహ్మణులను గౌరవించని క్షత్రియులను శిక్షించుచుండెను

# 116 కార్తవీర్యుడు

హైహయ దేశము రాజు కార్తవీర్యార్జునుడు. అతడు నారాయణుని అంశమైన దత్తాత్రేయుని కొలిచెను. అతనికి వేయి బాహువులు. అతని నెవరూ జయింపలేకుండిరి. అతడు చాల శక్తిమంతుడు. లోకములో మిక్కిలి బలపరాక్రమములు కలవాడని ప్రసిద్ధిగాంచెను. ఈ గుణములు అతనిలో అహంభావమును పెంచెను. ఒకసారి అతడు నర్మదా నదిలో భార్యలతోగూడి స్నానము చేయుచుండెను. అతడు తన వేయి బాహువుల శక్తితో నదీ ప్రవాహము నరికట్టి స్తంభింపజేసెను. నదికి అవతలిగట్టున రావణుడు గుడారములో నుండగా నదీజలము చేత ఆ గుడారము తడిసెను. దీనికి కారణభూతుడు హైహయ రాజైన కార్తవీర్యార్జునుడని తెలుసుకొని, రావణుడు సహింపలేకపోయెను. రావణుడు కార్తవీర్యార్జుని సమీపించి అతడి నవమానించుటకు ప్రయత్నించెను. కాని కార్తవీర్యార్జునుడు రావణుని తన భార్యల సమక్షములో పట్టుకుని నవ్వులపాలు జేసెను. రావణుని బందీగా చేసి మాహిష్మతీ నగరములో కొంతకాలముంచి, తీవ్రముగా అవమానించిన పిదప విడిచిపుచ్చెను.

ఒకసారి కార్తవీర్యుడు అరణ్యములో వేటాడుచు సంచరించుచుండెను. అట్లు సంచరించుచున్న కార్తవీర్యుడు కాకతాళీయముగా జమదగ్ని ఆశ్రమము ప్రవేశించెను. తన ఆశ్రమమందున్న గోవు కామధేనువు సహాయముతో కార్తవీర్యార్జునుని అతని పరివారమును జమదగ్ని ఆదరించి వారిని సంతుష్టిపరచెను. కామధేనువు శక్తిసంపదలకు కార్తవీర్యుడు ముగ్ధుడయ్యెను. అటువంటి కామధేనువును పొందిన జమదగ్నిపై అసూయ కలిగెను. అతడు ఆశ్రమము విడిచి వెళ్ళునపుడు తన పరిచారకులను కామధేనువును దొంగిలించి నగరమునకు తరలించుకు రమ్మని చెప్పెను. అతని ఆజ్ఞను శిరసావహించి, దీనముగా అంబాయని అరచుచున్న కామధేనువును మాహిష్మతి నగరమునకు తరలించుకు పోయిరి. ఇంతలో ఆశ్రమమునకు తిరిగి వచ్చిన భార్గవరాముడు కామధేనువును అపహరించిన విషయము తెలుసుకొనెను. కర్ర దెబ్బతిన్న త్రాచుపాము వలె బుస్సుమని యెగసెను. అతడు తన గండ్రగొడ్డలిని, విల్లు, అమ్ములను తీసుకుని మాహిష్మతి నగరమువైపు వెళ్ళెను.

నగరము సమీపించుచున్న కార్తవీర్యుడు, భార్గవరాముడు తనను వెంబడించుట జూచెను. ఇదివరలో అతడు భార్గవరాముని చూచియుండలేదు. లేడి చర్మము ధరించిన బ్రాహ్మణునివలె భార్గవరాముడు ప్రకాశించుచుండెను. అంతవరకు మాత్రమే బ్రాహ్మణుని పోలికలు. కాని యీ బ్రాహ్మణుడు విల్లు, అమ్ములు ధరించి యుండెను. పైగా భుజముపై గండ్రగొడ్డలి కలదు. ప్రళయకాలమందు ప్రకాశించు తీక్షణమైన సూర్యునివలె నుండెను. తనతో యుద్ధము చేయుటకు భార్గవరాముడు వచ్చెనని కార్తవీర్యుడు తలచి, పదిహేడు అక్షౌహిణుల సైన్యమును పంపెను.

ఏకాకిగా కార్తవీర్యార్జుని సైన్యమును భార్గవరాముడు హతము గావించెను. సైన్యమంతయు నాశనమగుట జూచి, కార్తవీర్యుడు రణరంగములో ప్రవేశించెను. అతని అయిదువందల బాహువులలో అయిదువందల ధనుస్సులుండెను. మిగిలిన అయిదువందల బాహువులు అమ్ములను ధనుస్సుల నుండి విడిచి పెట్టుచుండెను. కాని భార్గవరాముడు ఆ బాణములను త్రుంచివేసెను. అంతట కార్తవీర్యుడు రాళ్ళను వృక్షములను విసరగా, అతని బాహువులను తన గండ్రగొడ్డలితో నరికివేసెను. ఒక క్షణము తర్వాత కార్తవీర్యుని శిరస్సును నరికివేసెను. కార్తవీర్యుని పదివేలమంది పుత్రులు తమ తండ్రి మరణమునకు దిగ్భ్రాంతులై భయముతో ఆ ప్రదేశము విడిచి పారిపోయిరి.

భార్గవరాముడు కామధేనువును దూడను తీసుకుని ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. జమదగ్ని యుద్ధ విశేషములను, కార్తవీర్యుని మరణమును విని యుండెను. కొంతసేపు మౌనము వహించి తర్వాత యిట్లనెను. వత్సా, రామా! క్షత్రియుని చంపుట మహాపాపము. నీ కోపమే నీ లోపము. క్షమ వహించి యుండవలెను. ఈ క్షమాగుణము వలననే బ్రాహ్మణులను యితరులు గౌరవింతురు. క్షమాగుణము వలన వారి ముఖములు తేజోవంతములై యుంటున్నవి. బ్రాహ్మణులు భగవంతునికి ప్రీతిపాత్రులగుటకు వారి ఓర్పు కారణము. కార్తవీర్యుడు ఉత్తమ క్షత్రియుడు. అతడు నీచే హతుడైనాడు. ఈ పాపము బ్రహ్మ హత్యా పాపముకన్న గొప్పది. పుణ్యనదీ తీరములను సందర్శించుటవలన యీ పాపము పరిహారము కాగలదు. ఒక సంవత్సర కాలము తీర్థములన్నిటినీ సందర్శించి తిరిగి రమ్ము''. ''అట్లే చేయుదును'' అని భార్గవరాముడు పలికి పుణ్య నదీ తీర్థములను సందర్శించుటకు వెడలెను.

సంవత్సరము తర్వాత భార్గవరాముడు పుణ్య తీర్థయాత్రలు ముగించుకుని తిరిగి వచ్చెను. అతని రాకకు తల్లిదండ్రులెంతో సంతోషించిరి. ఒకసారి జమదగ్ని భార్య రేణుక, మంచినీరు కొనితెచ్చుటకు ప్రతిదినము వలె ఆ దినము కూడ నదీతీరమునకు వెళ్ళెను. అచట చిత్రసేనుడను గంధర్వుడు అప్సరసలతో కూడి జలక్రీడ సల్పుచుండెను. రేణుక ఆ గంధర్వుని చూచి తనలో యిట్లు తలపోసెను. ''ఆహా! ఎంతటి సౌందర్యవంతు డితడు''. ఆరోజు ఆమె ప్రతిదినముకన్న మరికొంతకాలము నది ఒడ్డున గడపెను. ఆమె తిరిగి ఆశ్రమమునకు వచ్చుసరికి హోమమొనర్చు సమయము దాటెను. ఆలస్యముగా వచ్చినందుకు తన భర్త ఆగ్రహించగలడని, సంకోచముతో ఆమె ఆశ్రమములో ప్రవేశించెను. మంచినీటి పాత్రను అతని పాదముల వద్ద నుంచి ఆమె చేతులు జోడించి నిలుచుండెను. జమదగ్ని మహర్షి తన జ్ఞాన నేత్రముతో ఆమె ఆలస్యమునకు కారణము గ్రహించెను. కొద్ది నిముషములే అయినప్పటికీ, ఆమెకు మానసికముగా పాపపు తలంపులు కల్గినందుకు జమదగ్ని ఆగ్రహించెను. ఒక పరపురుషుడు తన భర్తకన్న సౌందర్యవంతుడనే ఆలోచన కలుగుట పాపము. అతడు తన పుత్రులను పిలిచి వారితో యిట్లనెను. ''ఈమె పాపము చేసినది. తక్షణమే ఆమెను సంహరింపుడు''. పుత్రులు సంకోచించిరి. ఆగ్రహముతో ఆజ్ఞాపించిన తండ్రి మాటలను విని, తమ తల్లిని సంహరించుటకు వారు సంకోచించిరి. అపుడు జమదగ్ని తన కనిష్ఠ పుత్రుడైన భార్గవరాముని పిలిచి, ''నీ తల్లిని, సోదరులను సంహరింపుము. ఇది నా ఆజ్ఞ'' అని పలికెను. అతడు ఒక క్షణమైనను సంకోచింపక, తండ్రి ఆజ్ఞ మేరకు తల్లిని సోదరులను సంహరించెను. జమదగ్ని సంతోషించి భార్గవరాముని మెచ్చుకొని యిట్లనెను. ''కుమారా! నా ఆజ్ఞను నీవు తక్షణమే నెరవేర్చినందుకు నిన్ను మెచ్చుకొనుచున్నాను. నీవు యేదైన వరము నడుగుము. నేను నీకు ప్రసాదించెదను''.

భార్గవ (పరశు) రాముడు తండ్రి పాదములపైబడి యిట్లనెను. ''తండ్రీ! నా తల్లి సోదరులు తిరిగి సజీవులు కావలెనని నా కోరిక. అంతేకాక, వారికి జరిగిన విషయము స్మృతి యందుండ కూడదు''. తండ్రి జమదగ్నికి భార్యపై, యితర పుత్రులపై కలిగిన ఆగ్రహము అదృశ్యమయ్యెను. అతని చివరి కుమారుడు కోరిన వరమును ఆనందముతో ప్రసాదించెను. వారు నిద్ర నుండి లేచినట్లు లేచిరి. జరిగిన దేమియు వారికి తెలియకుండెను.

ఇట్లుండగా, తమ తండ్రిని సంహరించిన పరశురామునిపై కార్తవీర్యార్జునుని పుత్రులు ద్వేషము పెంచుకొను చుండిరి. ఒకసారి పరశురాముడు తన సోదరులతో అడవికి వెళ్ళినపుడు, కార్తవీర్యుని కుమారులు జమదగ్ని ఆశ్రమమునకు వచ్చిరి. ముసలివారైన రేణుకా జమదగ్నులు మాత్రమే యింట నుండుట గమనించి, వారు యిదే తగిన సమయమని తలపోసిరి. జమదగ్ని అగ్నిహోత్రము ముందు కూర్చుని యుండగా, రేణుక

భర్తకు సహాయపడుచుండెను. కార్తవీర్యుని కుమారులు కత్తులు దూసి వేగముగా జమదగ్నిని సమీపించిరి. వారేమి చేయనున్నారో రేణుక గ్రహించెను. ఆమె, తన భర్తను సంహరింపవలదని కార్తవీర్యుని కుమారులను వేడుకొనెను. కాని వారు వినకుండిరి. భగవంతుని ధ్యానించుచున్న జమదగ్ని తలను వారు నరికివేసిరి. వారు తలచిన కార్యము సమాప్తి అయిన తక్షణమే అక్కడ నుండి వారు పారిపోయిరి.

రేణుక ''రామా! రామా!'' యని గట్టిగా అరచెను. ఆమె అర్తనాదము దూరము నుండి వినిన పరశురాముడు పరుగుపరుగున ఆశ్రమమునకు తిరిగి వచ్చి జరిగిన ఘోరమును కనులార చూచెను. మరణించిన తండ్రినొక సారి వీక్షించెను. సర్వస్వము తన సోదరులకు వదలిపెట్టి, గండ్రగొడ్డలిని చేతబట్టుకుని వడివడిగా ఆశ్రమము నుండి వెళ్ళెను. ఆ క్షణములో అతడు క్షత్రియులనందరినీ సంహరింప నిశ్చయించుకొనెను. అతడు మెరపు వేగముతో మాహిష్మతీ నగరము చేరెను. కార్తవీర్యుని పుత్రుల నందరినీ అతి సులభముగా సంహరించెను. పరశురాముని ప్రతీకార తీక్షణతకు వారేమియు చేయలేక నిస్సహాయులైరి. వారి తలలను నరికివేసి వాటిని గుట్టగా ప్రోగుచేసెను. నగరమంతయు ధ్వంసమై రక్తము కాలువలు కట్టి ప్రవహించెను.

పరశురాముని ఆగ్రహము ఉపశమించలేదు. అతడు లోకమంతయు సంచరించెను. క్షత్రియులను సంహరించుటయే అతని ధ్యేయము. లోకమంతయు యిరువది యొక్క పర్యాయములు సంచరించి, క్షత్రియుల నందరినీ సంహరించి, వారి రక్తముతో అయిదు సరస్సులు నిండునట్లు చేసెను. ఆ అయిదు సరస్సులు శమంత పంచకమను పేరు పొందెను. శమంత పంచకము వద్ద తన తండ్రికి అంత్యక్రియలు జరిపెను. పరశురాముడొక్కడే తన తండ్రికి జలమునకు బదులుగా రక్తముతో తర్పణము వదలి అంత్యక్రియలు జరిపెను.

అనేక క్షత్రియులను సంహరించిన పాపమును కడిగి వేసుకొనుటకు పరశురాముడు యజ్ఞములు జరిపెను. పాపభూయిష్ఠులైన హైహయ రాజుల నుండి లోకమును రక్షించుటకు భగవంతుడు పరశురాముడుగా అవతరించెనని చెప్పుదురు. తరువాత మన్వంతరములో సప్తర్షులలో పరశురాము డొకడని చెప్పుదురు.

## 117 కౌశికునకు వసిష్ఠుని ఆతిధ్యము

పురూరవునకు ఆరుగురు పుత్రులు, వారిలో జ్యేష్ఠుడు అయువు. అతని వారసులలో నహుషుడు, అతని పుత్రుడు యయాతి, తర్వాత పూరు చక్రవర్తి. ఈ వంశము వారందరు పౌరవులుగా ప్రసిద్ధికెక్కిరి.

పురూరవుని కనిష్ఠపుత్రుడు విజయుడు. విజయుని కుమారుడు భీముడు. కాంచనుడు భీముని కుమారుడు. కాంచనుని కుమారుడు జహ్నువు. గంగానది భగీరథుని వెంట వెళ్ళుచున్నపుడు, జహ్నువు గంగానదిని త్రాగివేసెను. జహ్నువు కుమారుడు పురు. బలుకుడు పురుని పుత్రుడు. బలకుని పుత్రుడు అజకుడు. కుశుడు అజకుని కుమారుడు. కుశునకు నలుగురు కుమారులు, వీరిలో కనిష్ఠుడు కుశనాభుడు. సత్యవతి తండ్రియైన గాధి, కుశనాభుని పుత్రుడు. గాధి కుమారుడు కౌశికుడు, అతడే విశ్వామిత్రుడుగా ప్రసిద్ధికెక్కెను.

కౌశికుడు పేరుపొందిన మహారాజు. అతడు చక్కగా పరిపాలించెను. అందుచే ఉత్తముడైన రాజుగా ప్రసిద్ధిగాంచెను.

ఒక పర్యాయము పెద్ద బలగముతో అతడు అరణ్యమున కేగెను. అతడు అనేక ప్రదేశములకు వెళ్ళుచుండెను. తన రాజ్యములోని అనేక నగరములను సందర్శించెను. ప్రయాణము చేయునపుడు, అందమైన నదులను, కొండలను, ఆశ్రమములను తిలకించుచుండెను. అట్టి ఆశ్రమములలో బ్రహ్మ పుత్రుడైన వసిష్ఠుని ఆశ్రమ మొకటి గలదు. దూరము నుండి కౌశికుడు ఆశ్రమములోని అందమైన పుష్ప వృక్షములను, పొదలను, లతలను గాంచెను. ఆశ్రమము ప్రక్క నుండి పారుచున్న సెలయేటిని కూడ అతడు చూచెను. లేళ్లు, యితర సాధు జంతువులు సంచరించుట రాజు గమనించెను. అచ్చట సిద్ధులు, చారణులు, గంధర్వులు, కిన్నరులు కూడ సంచరించుట చూచి కౌశికు డాశ్చర్యము చెందెను. అచ్చటి వృక్షములందున్న పక్షుల గూళ్ళ నుండి వచ్చు మధుర సంగీత వినాదములతో ఆశ్రమము ప్రతిధ్వనించుచుండెను. ఆ ఆశ్రమునందే కాక, దాని పరిసరములలో కూడ ప్రశాంతత కానవచ్చుచుండెను. ఆశ్రమము దగ్గరకు సమీపించగా, రాజు అనేకులు ఋషులు తపస్సు చేయుచుండుట జూచెను. ధ్యానములో నున్న ఋషులకు బాహ్య ప్రపంచ జ్ఞానము లేకుండెను. అతడు వినియున్న బ్రహ్మ లోకము స్వర్గమునందుకాక, యీ వసిష్ఠుని ఆశ్రమమునందే యున్నట్లు గోచరించెను.

ఆశ్రమములోని ఋషులను సందర్శించి వారికి నమస్కరించుట ఆనాటి మహారాజుల సంప్రదాయము. ఋషులు కూడ రాజులకు ఆశ్రమములో స్వాగత సత్కారములు జరుపుట ఆచారము. రాజులు నారాయణుని ప్రతినిధులని ఆనాడు భావించెడివారు. కౌశికుడు వసిష్ఠుని ఆశ్రమములో ప్రవేశించి, వసిష్ఠ మహర్షికి సాష్టాంగ ప్రణామములు జేసెను. వసిష్ఠుడు చాల సంతోషించి, ఆనందోత్సాహములతో రాజు నాహ్వానించెను. మహారాజున కుచితమైన ఆసనము దెప్పించి దానిపై అతనిని గూర్చుండబెట్టెను. తర్వాత రాజునకు ఫలములు, మంచినీరు సమర్పించెను. రాజు అత్యంత వినయముతో వాటిని స్వీకరించగా కొద్దిసేపు వారిద్దరు సంభాషించిరి. లోకరీతిలో వసిష్ఠుడు అడుగవలసిన విషయముల నడిగి తెలిసికొనెను. వసిష్ఠు డిట్లనెను. ''మీరు క్షేమమని తలచెదను. మీ ధర్మ పరిపాలనలో పౌరులందరూ సుఖశాంతులతో జీవించుచున్నారని భావించెదను. సేవక పరివారము విధేయులై తమ సేవలను జరుపుచున్నారని తలంతును. శత్రువులందరూ అణగిమణగి యున్నారు కదా? సేనలు బలపరాక్రమ సహితములై యున్నవా? కోశాగారమునకు ధన లోపము లేదుగదా? కుటుంబ ములో అందరూ కుశలమేనా?'' కౌశికుడు అన్ని ప్రశ్నలకు సరియైన సమాధానములు తెలిపి, ఋషిని కుశల ప్రశ్నలు వేసెను. క్రూరమృగముల వలన యెట్టి హాని కలుగకుండ, ఋషుల తపస్సు నిర్విఘ్నముగా సాగుచున్నదా యని యడిగి తెలుసుకొనెను.

వసిష్ఠుడు, కౌశికుడు పరస్పర గౌరవ భావముతో చాలసేపు అనేక విషయములపై ముచ్చటించిరి. అట్లు చాలసేపు వారు యిరువురు సంభాషించిన తర్వాత వసిష్ఠు డిట్లనెను. ''నా ఆతిథ్యము స్వీకరించవలసినదని కోరుతున్నాను. నా ఆశ్రమమునకు సేనా సమేతముగా వచ్చి పావనము గావించుట చాల అరుదు. నీకు విందుచేసి ఆనందము చేకూర్చవలెనని నా అభీష్టము. నీవు సత్పురుషుడవు, ధర్మప్రభుడవు. నిన్ను సత్కరించుట నాకు సంతోషము''.

వసిష్ఠుని ఆదరాభిమానములకు కౌశికుడు మిక్కిలి సంతోషించెను. అత్యంత వినయముతో కౌశికుడిట్లనెను. ''ఆదరపూర్వకమైన పలుకులే నాకు విందు. పాలు ఫలములు యిది వరకే యిచ్చి యున్నావు. నీ దర్శనము చేత యీ జన్మ పరిశుద్ధమైనది. ఇంతకన్నను సంతృప్తి కలిగించున దింకేమి గలదు? నిన్ను దైవముగా మేము గౌరవించవలసియున్నది, నీవు నన్ను గౌరవించి సత్కరించవలెననుట ఉచితముగా లేదు. నేను సెలవు తీసుకుని ప్రయాణము కొనసాగించెదను''. తన బలగమున కంతకూ విందు చేయుట వసిష్ఠునకు యిబ్బంది కల్గించునని

భావించి, నేరుగా వెళ్ళవలెనని లేచెను. కాని వసిష్ఠుడు యిందు కంగీకరించకుండెను. తన విందు గౌరవమర్యాదలను కౌశికుడు అతని బలగము స్వీకరించవలసినదని వసిష్ఠుడు పదేపదే కోరెను చివరకు కౌశికుడు వసిష్ఠుని ఆతిధ్యము నంగీకరించి యిట్లనెను. ''ఋషివర్యా! అటులనే కానిండు, మాకు ఆతిధ్య మొసగుటకు మీరు చూపు ఆసక్తి మేము తప్పించుకొనలేని పరిస్థితిని కల్పించినది. ఇది మీ సద్గుణమునకు నిదర్శనము''. వారిరువురూ నవ్వుచు ఆశ్రమము బయటకు వెళ్ళిరి వసిష్ఠుడు, ''సురభీ! శబళీ! వెంటనే ఇక్కడకు రమ్ము'' అని కేకవేసెను.

వసిష్ఠుడు యెవరిని పిలుచుచుండెనా యని కౌశికుడు ఆశ్చర్యముతో చూచుచుండెను. అతడిట్లు ఆలోచించుచుండగనే, అందమైన ఆవు వచ్చి వసిష్ఠుని ముందు నిలబడి యిట్లనెను. ''తండ్రీ! నన్ను పిలిచితిరా?'' అందమైన ఆ ఆవును కౌశికుడు చూచెను ఆ ధేనువు అందమైన ఆకారము, నలుపు తెలుపు కలిసిన మూపు కలిగి యుండెను. ఆ గోవు నేత్రములందు సాధుత్వము ఉట్టిపడుచుండెను. వసిష్ఠుడు గోవుతో యిట్లనెను. ''శబళీ! నా మాటలు వినుము. ఇతడీ దేశమునకు రాజు పేరు కౌశికుడు.
యిక్కడకు విచ్చేసెను. అతనికి అతని బలగమునకు విందుచేసి ఆనందము కల్గించవలెనని తలచితిని. సమస్త పదార్థములతో ఘనముగా విందు యేర్పాటు చేయవలెను. ఎటువంటి లోపము ఉండరాదు. వారు సంతుష్టులై వెళ్ళవలెను. తొందరగా అన్నియు సిద్ధము గావింపుము''.

శబళ కామధేనువు. క్షీరసాగరమును దేవదానవులు అమృతము కొరకు మధించినపుడు ఉద్భవించిన దివ్యధేనువు అది వసిష్ఠునకు లభించెను.

కామధేనువు రాజునకు అతని బలగమునకు పదార్థములను సృష్టించి గొప్ప విందుకు కావలసిన యేర్పాటులు గావించెను అన్ని రకములైన భోజ్యపదార్థములను, పానీయములను అందరకు ప్రీతి కలిగించునట్లుగా సమకూర్చెను. అన్ని పదార్థములు సమృద్ధిగా నుండెను వాటిని అందరకూ ఆదరాభిమానములతో వడ్డించగా, వారందరూ కడుపునిండుగా భుజించి సంతుష్టులైరి. కౌశికుడు అమందానంద భరితుడై, తన మంత్రులు, సేనాపతులతో వసిష్ఠునకు కృతజ్ఞతా పూర్వక నమస్కారము చేసెను తర్వాత కౌశికు డిట్లనెను ''ఋషివర్యా! నా జీవితములో యింతవరకు యిటువంటి రుచికరమైన పదార్థములను భుజింపలేదు. నిన్నొక కోరిక కోరుచున్నాను ఈ కామధేనువు శబళ యొక్క విశేషమైన శక్తిసామర్థ్యములకు నేను ముగ్ధుడనైనాను. ఇటువంటి ధేనువు దేశమును పాలించు రాజు అధీనములో నుండవలెను. ఆమె వలన అందరకూ లాభము చేకూరును ఆ గోవును నాకిమ్ము. అందుకు ప్రతిఫలముగా నీకు నూరువేల గోవుల నిచ్చెదను. ఈ గోవు ఒక మణి వంటిది. విలువైన మణులు రాజునకు చెందినవి. నాకు ఆ గోవు కావలెను. దయచేసి దానిని నాకిమ్ము''.

కౌశికుని మాటలకు వసిష్ఠుడు నిశ్చేష్టుడయ్యెను. తనను తాను సముదాయించుకుని, అతి సరళముగా యిట్లు పలికెను. ''ఎవరేది యడిగినను నేను సాధారణముగా నిరాకరించను కాని శబళ విషయము వేరు నూరువేల గోవులే కాదు, ఒక కోటి గోవులిచ్చినను, శబళను నేను విడనాడలేను. నీవు బంగారు వెండి రాసులను యిచ్చెద ననవచ్చు కాని వాటివలన నాకు ప్రయోజనము లేదు నేను శబళను యివ్వజాలను. ఇది తిరుగులేనిది''

కౌశికుడు స్తంభించినట్లు నిలుచుండెను. చెమ్మగిల్లిన కండ్లతో వసిష్ఠుడు మరల యిట్లనెను ''ఓరాజా! శబళ నాదేహములో ఒక భాగము దానిని విడిచి యుండలేను కీర్తికెక్కిన మానవుడు కీర్తిని వదలియుండుట

యెంత దుష్కరమో యిదియూ నట్లే. శబళ ప్రసాదించు దానములచేతనే, నేను వైదిక విధులను నిర్వర్తించగలు గుచున్నాను. అందుచే శబళను నీకు యివ్వజాలను''.

కౌశికుడు వదలిపెట్టలేదు. ''బంగారము పట్టు వస్త్రములతో అలంకరించిన వేయి గజములను నీకు యిచ్చెదను. ఎనిమిదివందల అశ్వములను రథములతో నొసంగెదను. నీవు కోరినట్లయిన, అంతకన్న యెక్కువగా నీకు యివ్వగలను. ఒక కోటి కపిల ధేనువులను నీకిచ్చెదను. ఈ కామధేనువును నాకిమ్ము. నీవు కోరినచో, లెక్కకు మించిన బంగారము, వజ్రవైఢూర్యములు నీకిత్తును'' అని పలికెను.

అతి విచారముతో వసిష్ఠుడు స్థిరమైన స్వరముతో నిట్లనెను. ''నా సర్వ సంపద యీ కామధేనువు. ఇది నా సర్వస్వము, నా ప్రాణము. నా తపస్సు అంతయు ఆమెతోనే యున్నది. ఇక యీ విషయముపై చర్చించుట యెందులకు? నేను యీ ధేనువును యెన్నటికీ విడిచి యుండలేను. నీవు నాకు విశేషమైన సంపద నొసంగుట అనవసరము. నీవు యిచ్చు వస్తువుల వలన నాకెట్టి ప్రయోజనమును లేదు. నాకు ఉన్న శబళ చాలును. ఆమె నాది. ఎప్పటికీ ఆమె నాది''.

# 118 కౌశికుని నిరుత్సాహము

కౌశికుడు సహజముగా క్షత్రియుడగుటచే ఆగ్రహము చెందెను. ఇదివరకెన్నడూ తాను కోరినది లభించకుండుట జరుగలేదు. అతని మనస్సు యిప్పుడు కామధేనువుపై నున్నది. అతడు ఆగ్రహముతో ఆశ్రమము నుండి వెళ్ళెను. అతడు తన సేవకులను బలవంతముగా ఆ గోవును తీసుకువెళ్ళుమని ఆజ్ఞాపించెను. గోశాలనుండి కౌశికుని సేవకులు కామధేనువును తరలించుకొని వెళ్ళిరి. కామధేనువు తనలో తానిట్లు తలపోసెను. ''ఉదారుడైన వసిష్ఠుడు నన్నేల వదలివేసెను? నేనేమి తప్పుచేసితినని నాకీ శిక్ష విధించెను? రాజు సేవకులు నన్ను తీసుకుపోవుచుండగా తండ్రి వసిష్ఠుడు యేమియు చేయక ఊరకుండెను''. ఆమె విచారించుచుండగా కనుల నుండి యేకధారగా అశ్రువులు వర్షించుచుండెను. ఆమె నిట్టూర్పులు వినిపించుచుం డెను. తిరిగి తనలో నిట్లనుకొనెను. ''నేను తండ్రివద్దకు వెళ్ళి, రాజు సేవకులు నన్నిట్లు యెందు కవమానించునట్లు చేసితివని అడిగెదను''. అకస్మాత్తుగా రాజు సేవకుల నుండి తప్పించుకుని వాయువేగముతో పరుగెత్తెను. వసిష్ఠుని సమీపించి, అతని పాదములపైబడి యిట్లనెను. ''తండ్రీ! నన్నేల నీవు వదలిపెట్టితివి? నీవు చూచుచుండగనే, రాజు సేవకులు నన్ను యీడ్చుకొని వెళ్ళిరి. దీనికి నీవు యేల అంగీకరించితివి?'' వసిష్ఠుడిట్లనెను. ''పుత్రీ! నీ వేమియు తప్పుచేయలేదు. నిన్ను నేను శిక్షించుటలేదు. నేను నిన్నెపుడూ విడిచి పెట్టను. ఈ రాజు అతి శక్తిమంతుడు. బలవంతముగా నిన్ను తీసుకువెళ్ళెను. ఈ అక్షౌహిణీ సైన్యము రాజుకు చెందినది, అందుచే అతని నెవరూ జయింపలేరని తలచుచున్నాడు. అందుచేతనే బలవంతముగా నిన్ను తీసుకురమ్మని తన సేవకుల నాజ్ఞాపించెను''

శబళ యిట్లనెను. ''కాని, ఓ మహర్షీ! ఒక బ్రాహ్మణుని ముందు రాజు శక్తియేపాటిది? క్షత్రియబలముకన్న బ్రహ్మబలము గొప్పది. అన్ని లోకములలో నీ గొప్పదనము సాటిలేనిది. కౌశికుడు గొప్ప క్షత్రియుడు, అతి శక్తిమంతుడు. సందేహములేదు. తండ్రీ! నీ అనుగ్రహ బలము చేత అబలనైన నేను కూడ అతని కన్న

శక్తిమంతురాలనని నిరూపించెదను. అందుల కంగీకరింపుము అతని అహంభావమును, గర్వమును అణచి శిక్షించెదను''. కామధేనువు వగర్చుచూ శ్వాసము విడుచుచుండుట వసిష్ఠుడు గమనించి, చాల కోపముతో నున్నదని గ్రహించెను. శబళ నేత్రములు యెరుపెక్కెను, కోపమును సూచించుచు తోకనెత్తెను వసిష్ఠుడు చిరునవ్వుతో వీపు నిమిరి యిట్లనెను. ''సరే, నీకు నా అంగీకారము తెలుపుచున్నాను. ఒక క్షణములో, రాజు సైన్యము నెదుర్కొనగల్గిన సైన్యము సృష్టింపుము''

శబళ తన శరీరమును కుదిపెను వెంటనే పెద్ద సేనా నివహము ప్రత్యక్షమయ్యెను. వందలకొలది వీరులు ప్రత్యక్షమై కౌశికుని సైన్యముతో పోరాడుటకు సన్నద్ధులైరి. ఒక ధేనువు సృష్టించిన సేన చేతులలో తన సైన్యము ఓడిపోవుట చూచి, కౌశికుడు ఆగ్రహావిష్టుడయ్యెను. అతని నేత్రములు యెరుపెక్కెను అతడు యుద్ధమందు ప్రవేశించి శబళ సృష్టించిన సైన్యముతో పోరాడెను. రాజు ధైర్యసాహసములను, అతడు తాను సృష్టించిన సైన్యమును నాశనము చేయుటను చూచి, శబళ తిరిగి సైన్యమును, సేనాధిపతులను సృష్టించెను సైన్యము తరిగినపుడు, తిరిగి సైన్యమును శబళ సృష్టించుచుండెను కౌశికుని పుత్రులు యుద్ధమందు ప్రవేశించి కౌశికునితోబాటు పోరాటము సలిపి, చివరకు వారు వసిష్ఠుని కూడ యెదుర్కొనిరి వసిష్ఠమహర్షి, తన హుంకారముతో కౌశికుని పుత్రుల నందరినీ దగ్ధము గావించెను కౌశికుని పుత్రులందరూ బూడిదగా మారి గుట్టగా ప్రోగుపడి యుండిరి

రాజు హృదయము బ్రద్దలయ్యెను అతని సేనయంతయూ నాశనమయ్యెను. పుత్రులందరూ మరణించిరి. కోరలు తీసివేసిన సర్పమువలె, రెక్కలు తెగిన పక్షివలె అతడుండెను అతని గర్వము అణగిపోయెను. అస్తమించు సూర్యుని వలె కౌశికుని వదనము వివర్ణమై యుండెను

తలదించుకుని, మౌనముగా కౌశికుడు వసిష్ఠుని ఆశ్రమమువీడి, తన రాజ్యమునకు వెడలెను

## 119 కౌశికుని తపస్సు

కౌశికుని ఆగ్రహము సమసిపోలేదు వసిష్ఠ ఆశ్రమములో 'కామధేనువు శబళ సృష్టించిన సేనాబలము' చేతిలో తాను, తన కుమారులు, సైన్యము చిత్తుగా ఓడిపోవుట వలన కలిగిన అవమానము కౌశికుని మనస్సును వేధించుచుండెను. అతనికి జీవితముపై విసుగు విరక్తి కలుగగా, మిగిలిన ఒకే ఒక్క కుమారునకు రాజ్యభారము అప్పగించి చూచుకొమ్మనెను. కౌశికుడు అడవికేగి కిన్నరులు వసించు హిమవత్పర్వత పంక్తులలో అనేక సంవత్సరములు గొప్ప తపస్సు చేసెను అతని తపస్సునకు మహాదేవుడు మెచ్చి, ప్రత్యక్షమై యిట్లడిగెను. ''నీవెందుకీ తపస్సు నాచరించుచున్నావు? నీకేమి కావలెను? నీవు కోరిన దానిని నేను ప్రసాదించెదను''

కౌశికుడు మహాదేవునకు సాష్టాంగ ప్రణామము జేసి కీర్తించి, యిట్లుపలికెను. ''ప్రభూ! మీరు నా తపస్సును మెచ్చుకున్నచో నేను విలువిద్యలో ప్రవీణుడనగునట్లు వరమొసంగుడు దివ్యాస్త్రములను ప్రయోగించుటలో ప్రావీణ్యము కలుగునట్లు వరము ప్రసాదింపుడు దయచేసి వీనిని నాకు ప్రసాదించవలెను'' శంకరుడిట్లనెను ''వీనిని నీకు ప్రసాదించుచున్నాను ఇక శాంతముగా జీవింపుము'' కౌశికుడు తిరిగి తన రాజ్యమునకేగెను తన స్వాభిమానము, ఆత్మగౌరవము పునరుద్ధృతమైనట్లు అతడు భావించెను దానితోబాటు మరల గర్వము

అతనిలో చోటు చేసుకొనెను. ఇప్పుడది పదింతలు పెరిగెను. కౌశికుడు తనలో తానిట్లు తలచెను. ''వసిష్ఠుడిక చచిపోయినట్లే! దివ్యాస్త్రముల ధాటికి అతడెట్లు తట్టుకొనగలడు? వసిష్ఠుని నాశనము చేసి కామధేనువును నా రాజ్యమునకు తీసుకు వచ్చెదను''.

కౌశికుడు వసిష్ఠుని ఆశ్రమమునకు వెళ్ళి, ముందుగా హెచ్చరించకుండగనే, దివ్యాస్త్రములను ఒకదాని వెనుక నొకటి ప్రయోగించు చుండెను. ఆశ్రమములోని పక్షులు, పెంపుడు జంతువులు మిక్కిలి భయముతో పరుగెత్తసాగెను. ఆశ్రమములో నివసించుచున్న వసిష్ఠుని శిష్యులు, అకస్మాత్తుగా వచ్చుచున్న అస్త్రముల ధాటికి తట్టుకొనలేక మిక్కిలి భయముతో ఆశ్రమము విడిచి పారిపోయిరి. ఆశ్రమము దాని పరిసరములు నిర్జీవముగా బోసిపోయినట్లుండెను. ఆ ప్రదేశమందలి మట్టి లవణ మిళితమై యెందుకును పనికిరానిదిగా మారెను. ఆశ్రమమునందు నిశ్శబ్దము తాండవించుచుండెను. వసిష్ఠుని ఆగ్రహము ప్రకోపించెను. వసిష్ఠుడు తనలో నిట్లు తలపోసెను. ''నిష్కారణముగా యీ రాజు మరల మరల నన్ను వేధించుచున్నాడు. సూర్యుడు మంచును కరగించునట్లు, నేనీ రాజును సర్వనాశనము గావించెదను''.

వసిష్ఠుడు బయటకువచ్చి కౌశికునితో యిట్లనెను. ''ప్రశాంతమైన యీ ఆశ్రమమును నీవు నాశనము జేసితివి. నీపై నాకు ఆగ్రహము కలుగుచున్నది. నీకు ఉచితానుచితములు కూడ తెలియనట్లు గోచరించుచున్నది. చూడగా, నీవొక మూర్ఖునివలె నున్నావు. నిన్ను సంహరించెదను''.

వసిష్ఠుడు దండమును పైకెత్తెను. అది అగ్నివలె ప్రకాశించుచున్నది. పొగలేకనే, యుగాంతమున దహించునట్లుండెను. మృత్యుదేవత యముని దండమువలె నుండెను.

తనకు దివ్యాస్త్రములు గలవన్న ధైర్యముతో కౌశికుడు వసిష్ఠుని మాటలకు భయపడక లెక్కచేయకుండెను. అతడు అగ్ని అధిదేవతయైన ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. వసిష్ఠుడు తన దండమును కౌశికునిపై విసరి యిట్లనెను. ''నీ దివ్యాస్త్రములతో నన్నెదిరించుటకు వచ్చినావన్నమాట. నీ శక్తి యెంతటిదో చూచెదను. నీ యెదుటనే నేను నిలుచుందును. నీవేమి చేయగలవో నిరూపింపుము. నీ క్షత్రియబలము గొప్పదో, లేక నా బ్రహ్మబలము గొప్పదో చూచెదముగాక! మూర్ఖుడా! నీవు క్షత్రియులకే కళంకము. బ్రాహ్మణుని దివ్యశక్తులు యెంతటి గొప్పవో నీవు యిప్పుడు చూడగలవు''.

కౌశికుడు ప్రయోగించిన ఆగ్నేయాస్త్రము వడివడిగా వసిష్ఠునివైపు వచ్చుచుండెను. వసిష్ఠుని ముందు నున్న బ్రహ్మదండమును స్పృశించగనే, నీటిచే అగ్ని ఆరిపోయినట్లు, ఆ అస్త్రము ఆరిపోయెను. ఆ తరువాత కౌశికుడు వరుసగా వరుణ, రుద్ర, ఇంద్ర, పాశుపత, ఐషీకాస్త్రములను ప్రయోగించెను. అవి అన్నియు బ్రహ్మదండము ముందు నిష్ప్రయోజనమయ్యెను. అవి నిష్ప్రయోజనమగుట జూచిన కౌశికుని కనుబొమ్మలందు కోపము, నిస్పృహ స్పష్టముగా గోచరించుచుండెను. అయినప్పటికీ కౌశికుడు వదలిపెట్టక, గాంధర్వ, జృంభణ, స్వపనాస్త్రములను ప్రయోగించెను. అవియూ నిష్ప్రయోజనము లయ్యెను. చివరకు పుత్రుని చంపిన ఇంద్రుని వజ్రాస్త్రము ప్రయోగింపగా అదియు నిష్ఫలమయ్యెను. తరువాత కౌశికుడు, కాలపాశము, బలిని బంధించిన వరుణపాశము, బ్రహ్మపాశములను విడిచెను. అటు పిమ్మట చక్రములను, అనేక దారుణాస్త్రములను ప్రయోగించెను. కాని వీనిలో యే ఒక్కటియూ బ్రహ్మదండమును దాటి వసిష్ఠునికి హాని కలిగింపలేకుండెను.

స్వర్గములో దేవతలందరూ సమావేశమై యీ దృశ్యమును గాంచుచుండిరి. ముల్లోకములందు బ్రహ్మ బలము మిగిలిన శక్తులకన్న మిన్నగా నుండుట వారు తిలకించుచుండిరి. మిక్కిలి నిరుత్సాహపడిన రాజు, చివరకు బ్రహ్మాస్త్రమును ప్రయోగించగా, అందరూ ఆత్రములో యేమగునోయని చూచుచుండిరి. కాని అంతకుముందు ప్రయోగించిన అస్త్రములు, పాశములు, చక్రములవలె యిది కూడ బ్రహ్మదండము ముందు నిష్ఫలమయ్యెను. వసిష్ఠుడు అగ్నివలె అత్యంత తేజస్సుతో ప్రకాశించుచుండెను. అతని శరీరములో ప్రతి అణువు వేడిసెగలు గ్రక్కుచున్నట్లుండెను. పొగలేని నిప్పువలె బ్రహ్మదండము ప్రకాశించుచుండెను. స్వర్గము లోని ఋషులు, యితరులు, యేకగ్రీవముగా నిట్లు ప్రకటించిరి. ''నీశక్తి మహాగొప్పది. నీ వైభవము యీ అస్త్రముల ధాటిని తట్టుకొనగలిగెను. గొప్ప మహారాజైన కౌశికుడు పరాజితుడయ్యెను. నీ ఆగ్రహము నుపశమింపజేసి, యీ లోకమును శాంతింపజేయుము''.

వసిష్ఠుడు శాంతించెను. బ్రహ్మదండము కూడను చల్లబడెను.

కౌశికుడు తన విల్లు అమ్ములను క్రిందపెట్టి దీర్ఘ నిశ్వాసముతో యిట్లు తలచెను. ''ఆహా! ఎందులకీ క్షత్రియ బలము! బ్రహ్మబలమే బలము, యెంచతగినది. కేవలము ఒక బ్రహ్మదండముచేత యీ వసిష్ఠుడు నాకు మహాదేవుడు ప్రసాదించిన యస్త్రములన్నియు నిరుపయోగమగునట్లు గావించినాడు. నేను కూడ అట్టి బలము సంపాదించుటకు తపస్సు చేసెదను. తపస్సు చేసి బ్రహ్మత్వమును పొందెదను''.

కౌశికుని హృదయములో అనేక భావములు చెలరేగెను. వసిష్ఠుని చేతిలో పొందిన అపజయమునకు హృదయములో కసిగా నుండెను. అతని వేడినిట్టూర్పులు కర్రవ్రేటువడిన పాము బుసవలె నుండెను. వసిష్ఠునిపై అతని ద్వేషము తీవ్రముగా పెరిగెను. ఈ భావములన్నియు, హృదయములో చెలరేగుచుండగా, దక్షిణదిక్కుగా కౌశికుడు ప్రయాణము చేసి, తీవ్రముగా తపస్సు చేయమొదలుపెట్టెను. బ్రహ్మర్షి కావలెనని అతని కోరిక. అనేక సంవత్సరములు గడిచెను అతడింకనూ తపస్సు చేయుచుండెను.

వేయి సంవత్సరములు గడచిన తర్వాత బ్రహ్మ ప్రత్యక్షమై యిట్లనెను. ''కౌశికా! నీ తీవ్ర తపస్సుకు, యేకాగ్రతకు స్వర్గములో అందరూ మెచ్చుకొనిరి. అసాధ్యమైన దానిని నీవు సాధించితివి. ఇక నుంచి నీవు రాజర్షి కౌశికుడవు''. ఇట్లు పలికి బ్రహ్మ తిరిగి సత్యలోకమున కేగెను.

కౌశికునకు తగినంతగా సంతోషము కలుగలేదు. పైగా అతడు చాల విచారముగా నుండెను. నిస్పృహ నిరాశ తీవ్రమయ్యెను. అతడు లోకమును కోరగా పిడికెడు యినుక లభ్యమైనట్లుగా, తలపోసెను. ''ఇన్నివేల సంవత్సరముల తపస్సు చేయగా, రాజర్షిగా మాత్రమే అర్హత సంపాదించ గలిగినాను. బహుశః తగినంత తీవ్రముగా తపస్సు చేసి యుండకపోవచ్చును. నేను మరల ప్రయత్నించెదను''.

తిరిగి కౌశికుడు భయంకరమైన తపస్సు చేయమొదలిడెను.

# 120 త్రిశంకు మహారాజు

సూర్యవంశములోని రాజులలో త్రిశంకు మహారాజు గొప్పవాడు, ధర్మపరాయణుడు, సద్గుణవంతుడు. అకస్మాత్తుగా రాజునకు ఒక విచిత్రమైన కోరిక కలిగెను. మానవ శరీరముతో స్వర్గమునకు వెళ్ళవలెనని అతని కోరిక. తన కోరిక నేరవేరుటకు యజ్ఞము జరుపమని గురువైన వసిష్ఠుని త్రిశంకు మహారాజు ప్రార్థించెను. వసిష్ఠుడు యిందు కంగీకరింపక యిట్లు పలికెను. ''నీవు కోరునది అపవిత్రమైనది, అస్వాభావికమైనది. నీవు యీ మానవ శరీరముతో స్వర్గమునకు వెళ్ళుటకు నేనెట్టి సహాయము చేయలేను''.

త్రిశంకుడు పూర్తిగా నిరాశ చెందెను. అతడు సింహాసనము త్యజించి, దక్షిణ దిక్కుగా ప్రయాణించెను. అతడు వసిష్ఠుని కుమారులను కలుసుకుని, తన కోరికను వారికి దెలిపి, అది నెరవేరునట్లు చేయమని కోరెను. వారు నూర్గురు అనేక సంవత్సరములు తపస్సు చేసియుండిరి.

వసిష్ఠుని పుత్రుల తపశ్శక్తి చాల గొప్పది. త్రిశంకు మహారాజు వారిని సమీపించి గౌరవ పురస్సరముగా నమస్కారము చేసి చేతులు జోడించి యిట్లనెను. ''నేను మిమ్ము శరణు వేడుచున్నాను. నేను మహారాజును. మీ తండ్రి వసిష్ఠుడు నాకు గురువు. ఈ శరీరముతో నేను స్వర్గమున కేగునట్లు మీరు యాగము చేయవలసినదని ప్రార్థించుచున్నాను. వసిష్ఠుడు యిట్లు చేయుటకు నిరాకరించి, యింకెవరి సహాయమునైన పొందమని చెప్పెను. గురుపుత్రులైన మీరు తప్ప నాకింకెవరును లేరు. అందుచే మీ సహాయము నర్థించుచున్నాను. మీరు తపశ్శక్తి సంపన్నులు. నాకు సహాయము చేయవలసినదని ప్రార్థించుచున్నాను. మీ పూర్వులందరూ ఇక్ష్వాకువంశము లోని వారికి గురువులు. మీరు మాకు దైవ సమానులు. నా ప్రార్థన మన్నించి సహాయము చేయవలెను.

వసిష్ఠుని పుత్రులు రాజుపై ఆగ్రహము చెంది యిట్లనిరి. ''నీవు మూర్ఖుడవు, పాపాత్ముడవు. ఇట్లు చేయుట అధర్మమని మా తండ్రి నిరాకరించగా, మమ్ములను యాగము జరిపి, నీ కోరిక నెరవేరునట్లు చేయుమని అడుగుట కెంత ధైర్యము?

''వసిష్ఠుడు నీకు కులగురువు. ఇక్ష్వాకుల పాలన ప్రారంభమైనప్పటి నుండి ఆ వంశములోని రాజులందరకూ మా తండ్రి హిత ముపదేశించు చున్నాడు. అతడు నీ కోరికను మన్నించకుండెను. మా తండ్రికి అనంగీకారమైన దానిని మమ్ములను చేయమని నీవెట్లు అడుగుచుంటివి? నీ యీ కోరిక చాల కుర్రతనపు చేష్టగా నున్నది. నీ నగరమునకు తిరిగివెళ్ళి రాజ్యపాలనము కొనసాగించుము. నీ కోరికను తీర్చుటకై మా తండ్రి కవమానము కలిగించలేము''. వారి సమాధానము రాజునకు నిరాశ కలిగించెను. అతడు వారితో యిట్లనెను. ''గురువైన వసిష్ఠుడు, అతని కుమారులైన మీరు నా కోరిక నెరవేర్చకుండిన నేనేమి చేయగలను? ఒకే ఒక మార్గము గోచరించుచున్నది. నా కోరిక తీర్చగలుగు మరొక గురువు కొరకు అన్వేషించెదను''. వసిష్ఠుని పుత్రులు ఆగ్రహావిష్టులైరి. వారికి, వారి తండ్రికి జరిగిన అవమానము సహింపలేకుండిరి. వారు త్రిశంకుని ఇట్లు శపించిరి. ''నీవు గురుద్రోహివి. ఈక్షణము నుండి నీవు ఛండాలుడ వగుదువు''. వారట్లు శపించి, తమ ఆశ్రమమునకు వెళ్ళిపోయిరి.

రాజు విచారముతో తిరిగి తన నగరమునకు వచ్చెను. అతని హృదయములో తీరని బాధ, నిరాశ చోటు చేసుకొనెను. ఆ రాత్రి గడచిన తర్వాత అతడు ఛండాలుడైనట్లు కనుగొనెను. మంచి బంగారు వన్నెతో

మున్న అతని శరీరము నల్లగా మారెను. బట్టలన్నియూ నల్లబడెను అతని మెడలో నున్న అడవి పువ్వులు, ధరించిన బంగారు ఆభరణములు మొరటు యినుప వస్తువులుగా మారెను నగరములో అతనిని చూచి గుర్తు పట్టలేక, ప్రజలు అసహ్యించుకొనిరి. తానెవరో వివరించి నప్పటికీ అతని మంత్రులు కూడ అతనిని నమ్మలేకపోయిరి. అతని ఆకారము చూచి అవహేళన చేసి, ప్రజలు అతనిని నగరమునుండి బహిష్కరించిరి త్రిశంకు డొక క్షణమాలోచించి తనకు తప్పక సహాయపడువ్యక్తి ఒకరు గలరని నిశ్చయించుకొనెను కౌశికుని తీవ్ర తపస్సు గురించి త్రిశంకుడు విని యుండెను. అతడు తన తపశ్శక్తిచే రాజర్షి అయ్యెనని కూడ తెలుసుకొనెను కౌశికుడు తపస్సు చేయుచున్న ప్రదేశమునకు త్రిశంకుడు వడివడిగా చేరుకొనెను

## 121 త్రిశంకు స్వర్గము

కౌశికుడు ధ్యానములో నిమగ్నుడై యుండెను. అతని ధ్యానమునకు అంతరాయము కలిగింపక త్రిశంకుడు ప్రక్కనే నిలుచుని యుండెను. చేరువలో యెవరో నిలుచున్నట్లు గ్రహించి, కౌశికుడు కనులు తెరచి చూచెను దూరముగా అనాకారిగా నల్లగా నున్న ఛండాలుడొకడు నిలుచుని యుండుట గాంచెను ఆ ఛండాలుని నేత్రములు, వదనము అతి దీనముగా నుండుట జూచి, అతడు తీవ్రముగా యేదో బాధపడుచున్నాడని గ్రహించెను కౌశికుని హృదయము సానుభూతితో నిండెను ఛండాలుని దగ్గరకు పిలిచి యిట్లడిగెను. ''అయోధ్య రాజైన త్రిశంకువని యెరుగుదును నీకేమి సహాయము కావలెను. నీవు వీరుడవు గొప్పరాజువు. నేనేమి చేయవలెనో చెప్పుము? ఈ చండాల రూపము యేదో శాపఫలితమని తలచెదను నీ బాధ నివారించుటకు నేనేమి చేయవలెనో చెప్పుము''

ఆదరపూర్వకముగా పలికిన కౌశికుని పలుకులు వినిన రాజు హృదయము కృతజ్ఞతతో నిండి, కనులు చెమర్చెను చేతులు జోడించి త్రిశంకు డిట్లనెను ''నా గురువైన వసిష్ఠుడు, అతని పుత్రులు నా కోరికను నిరాకరించిరి. ఈ శరీరముతో స్వర్గమునకు వెళ్ళవలెనను నా కోరికను వారు తిరస్కరించిరి నేను నూరు యజ్ఞములు జరిపితిని నా యీ ప్రత్యేకమైన కోరిక నెరవేరుటకు అవి చాలవని తలంతును. నేనెన్నడును అబద్ధము లాడలేదు. ఇక ముందు కూడ అబద్ధము లాడను నేను ప్రజలను మిక్కిలి అభిమానముతో చూచుకొని, పాలించితిని. క్షత్రియ ధర్మములను విడనాడి నేనెన్నడును చరించలేదు పెద్దలందరకు నేను ప్రీతి కల్గించెడివాడను నేను ధర్మబద్ధముగా యెల్లపుడును వ్యవహరించితిని. ఇవి యేవియూ నా చిన్నకోరికను తీర్చలేకుండుటచే, అవియన్నియు నిరర్థకమనియూ, విధి ఒక్కటే అత్యంత శక్తిమంతమైనదనియు, మానవ ప్రయత్నములు వ్యర్థమనియూ భావించుచుంటిని. సమస్తమును విధి వశమునందే యున్నది అందరు చివరకు విధినే ఆశ్రయించవలసి యున్నది ఈ మానవ శరీరముతో స్వర్గమునకు వెళ్ళవలెనను నా కోరికను నెరవేర్చి సహాయ పడగలరేమోయని అర్థించుటకు వచ్చినాను. నా కోరికను తెలిపి సహాయ మర్థించుటకు నాకు యింకెవ్వరును లేరు నాకు సహాయము చేసి, మానవ ప్రయత్నములు విధి వశమున కతీతమైనవని, అవి అతిశక్తిమంతమైనవని లోకమునకు నిరూపింపవలసిన నిర్ణయమును మీకు వదలివేయుచున్నాను''

రాజు దుర్గతికి కౌశికుని హృదయము ద్రవించి, అభిమాన ముప్పొంగెను అతడు సరళ స్వరముతో నిట్లనెను

''ఓరాజా! నీవు నా వద్ద యీ ఆశ్రమములో ఉండవచ్చును నీ ధర్మగుణములు యీ లోకమునకు విదితమే నీకు తప్పక సహాయము చేసెదను. నీకేమియు భయము లేదు ఋషులందరను సమావేశపరచి నీ కొరకై యజ్ఞము చేయుటకు నాకు సహాయము చేయవలసినదని కోరెదను. నీ గురుపుత్రుల శాపఫలితముగా ఏర్పడిన యీ చండాల రూపముతో నీవు స్వర్గమునకు వెళ్ళునట్లు చేసెదను. నీవు నావద్దకు వచ్చి ఆశ్రయము కోరినావు నీవు రిక్తహస్తములతో వెళ్ళరాదు నీవు కోరినది నేను చేసెదను''

యజ్ఞము జరుపుట కవసరమైన వస్తువులను సమకూర్చుటకు కౌశికుడు తన పుత్రులను నియోగించెను. తన శిష్యులను పిలిచి వారితో నిట్లనెను ''మీరు వెళ్ళి ఋషులందరను ఆహ్వానింపుడు. ఇది నా ప్రార్థనయని విన్నవింపుడు వారు ఆశ్రమములతో తరలి రానిండు''. ఋషులను ఆహ్వానించుటకు నలుదిక్కులకూ వెళ్ళిరి ఋషులందరును కౌశికుని ఆశ్రమమునకు వచ్చిరి వసిష్ఠుడు, అతని పుత్రులు తప్ప అందరును విచ్చేసిరి. వసిష్ఠుని పుత్రులాడిన మాటలను కౌశికునకు శిష్యులు నివేదించిరి వసిష్ఠుని పుత్రులిట్లనిరి ''ఈ యజ్ఞము హాస్యాస్పదముగా నున్నది ఒక చండాలుని కొరకు, ఒక క్షత్రియుడు యజ్ఞము జరుపుట చాల చిత్రాతి చిత్రము ఈ యజ్ఞములో భాగము పంచుకొనేవారి తీరు యెట్లుండునో గమనించవలసి యున్నది! దేవతల నర్చించునపుడు వారు యెట్లు క్షత్రియుని (బ్రాహ్మణేతరుని) చేతినుండి హవిస్సును గ్రహించగలరు! ఒక చండాలుడు స్పృశింపగా, క్షత్రియుడు సమర్పించిన దానిని వారెట్లు భుజింతురు?'' వారి మాటలకు కౌశికుడు మండిపడి, వారు, నిషాదులగునట్లు శపించెను

తన కోరికపై వచ్చిన ఋషులతో కౌశికు డిట్లనెను ''ఈ త్రిశంకు మహారాజు ఇక్ష్వాకు వంశమునకు చెందినవాడు అత్యుత్తమ ప్రభువు ముల్లోకములందు ధర్మ ప్రభువుగా ప్రసిద్ధికెక్కెను ఈ శరీరముతో స్వర్గమునకు వెళ్ళవలెనని అతని కోరిక అతని కోరిక నెరవేరుటకు సహాయము చేసెదనని మాట యిచ్చినాను ఈ ప్రయత్నములో మీరందరు నాకు సహాయము చేయవలెనని కోరుచున్నాను''

కౌశికుని అభ్యర్థన వినిన ఋషులు తమలో తాము యిట్లను కొనసాగిరి ''ఈ కౌశికునకు ముక్కుపై కోపము. అతని ఆగ్రహము ప్రమాదకరము మనమతనికి సహాయపడకుండిన అతడు మనపై ఆగ్రహించుట తథ్యము ఆగ్రహములో అతడేమి చేయునో మనము ఊహించలేము. వసిష్ఠుని పుత్రులు అతని ఆగ్రహమునకు యెట్లు గురియైరో మనము కనులార గాంచినాము అందుచే అతడు చేయు యజ్ఞమునకు సహాయపడుటయే శ్రేయస్కరము''

కౌశికుడు యజ్ఞమునకు యాజకుడుగా నుండెను ఋషులందరూ తగిన సహాయము చేయుటకు నిశ్చయించుకొనిరి యజ్ఞము యధావిధిగా కొనసాగెను. చివరలో హవిస్సులో భాగము స్వీకరించుటకు దేవతలను ఒకొక్కరినే కౌశికుడు ఆహ్వానించెను కాని యే ఒక్కరునూ రాకుండిరి. దేవతలు యజ్ఞమును బహిష్కరించుట స్పష్టమయ్యెను ఈ అవమానమునకు కౌశికుడు ఆగ్రహము చెందెను. కాని తనను తాను శమింపజేసుకుని, క్రోధమును వెళ్ళగ్రక్కు నేత్రములుతో శరీరమంతయు కంపించుచుండగా, అగ్నిలో ఘృతమును వేయు గిరటెను పైకెత్తి పట్టుకుని ఉచ్చైస్వరముతో నిట్లనెను. ''నా తపశ్శక్తిని చూడుడు ఈ రాజును యిదే శరీరముతో స్వర్గముపైకి లేవనెత్తెదను'' కౌశికుడు త్రిశంకు వైపు తిరిగి, ''ఓ రాజా! నిన్ను నేను ఆజ్ఞాపించుచున్నాను నీవు గాలిలో పైకి లేచి సశరీరముగా స్వర్గమును చేరెదవు. నేను చేసిన తపస్సుకు ఫలిత మేదైన నుండిన, అది నిన్ను స్వర్గమునకు లేవనెత్తి తీసుకుపోవలెను. త్రిశంకూ! లెమ్ము పైకి లేచి

స్వర్గమును చేరుము''.

ప్రతి ఒక్కరూ ఊపిరి బిగబట్టి యేమి జరుగునో యని గమనించుచుండిరి ఒక్కసారిగా త్రిశంకు భూమి నుండి లేచి గాలిలో పైపైకి వెళ్ళుచుండెను. చేతులు జోడించి, కౌశికునకు నమస్కరించి గాలిలో పైకి వెళ్ళెను అందరూ చూచుచుండగనే ఆకాశమున అతడు అదృశ్యుడయ్యెను.

త్రిశంకు డావిధముగా స్వర్గమునకు వచ్చుట ఇంద్రున కిష్టము లేకుండెను ఇంద్రుడిట్లనెను ''త్రిశంకూ! నీవు తిరిగి భూలోకమునకు వెళ్ళుము. గురు పుత్రులచే శపింపబడిన నీవు యీ స్వర్గములో నుండుట కనర్హుడవు నిన్ను మాలో ఒకడుగా స్వీకరించుటకు మేము సంసిద్ధులుగా లేము'' త్రిశంకుని స్వర్గము నుండి త్రోసివేసెను అతడు భూమిపైకి దిగుచూ, యెలుగెత్తి కౌశికుని పిలిచి యిట్లనెను ''ప్రభూ! వారు నన్ను త్రోసివేయగా జారిపడుచున్నాను నన్ను రక్షింపుడు!''

' విచారము కలిగెను దేవతలు అసూయతో, స్వార్థముతో యిట్లు వర్తించగలరన్న ఆలోచనను కౌశికుడు భరించలేకుండెను. అతడు ''నీవు అక్కడే నిలువుము'' అని గట్టిగా అరచెను

క్రిందకు పడబోవుచున్న త్రిశంకు మధ్యలో ఆగిపోయెను. అచట నున్న ఋషులందరి సమక్షములో, సృష్టికర్త బ్రహ్మవలె త్రిశంకు స్వర్గమును సృష్టించెను. దక్షిణ దిక్కున సప్తర్షి మండలమును, నక్షత్రములను సృష్టించెను. తరువాత అతడిట్లనెను ''నేను మరొక ఇంద్రుని సృష్టించెదను ఆ ఇంద్రుని ముందు యిప్పుడున్న ఇంద్రుడు దిగదుడుపుగా నుండును''. కౌశికుడు తన కార్యమును మొదలుబెట్టెను త్రిశంకు స్వర్గములో ప్రత్యేకముగా వేర్వేరు దేవతలను సృష్టించవలెనని అతని అభిమతము

స్వర్గములో పెద్ద కల్లోలము చెలరేగెను. దేవతలు, ఋషులు అత్యంత వినయముతో కౌశికుని సమీపించి యిట్లనిరి ''కౌశికా! మేము చెప్పునది సావధానముగా వినుము గురు శాపము పొందినవారు స్వర్గములో నుండుట కనర్హులని చెప్పుదురు. అందుచే మేము త్రిశంకుని స్వర్గము నుండి త్రోసివేయవలసి వచ్చెను అంతేగాని, నీ గొప్ప తపస్సును కించపరచుటకు గాదు'' వారి పలుకులను విని కౌశికుడిట్లనెను. ''మీరు త్రిశంకునిపై అసూయ చెంది ఆ విధముగా ప్రవర్తించినారు అతనిని తిరిగి భూలోకమునకు రానివ్వను. అతడు చాల ధర్మపరాయణుడు గురు శాపమునకుగాని, మీరు యిప్పుడు అతని యెడల ప్రవర్తించిన తీరునకుగాని అతడు అర్హుడు కాడు''. అంతట దేవతలు యిట్లనిరి ''అట్లయినచో మేము మా మాటలను ఉపసంహరించుకొనుచున్నాము. నీవు చెప్పినది మేము అంగీకరించుచున్నాము''

కౌశికుడిట్లనెను ''నేను త్రిశంకున కిచ్చిన మాటను ఉపసంహరించుకొనను అతనిని సశరీరముగా స్వర్గమునకు పంపెదనని మాట యిచ్చితిని. నేను అతని కొరకు సృష్టించిన స్వర్గము శాశ్వ
నేను సృష్టించిన సప్తర్షి మండలము, నక్షత్రములు మొదలైనవన్నియు శాశ్వతముగా నుండగలవు ఇంద్రుడు రావచ్చు, పోవచ్చు కాని నేను సృష్టించిన త్రిశంకు స్వర్గము చిరకాలము ఉండగలదు''

ఇంద్రాది దేవతలు వినయముగా యిందులకు అంగీకరించిరి ఇంద్రు డిట్లనెను ''అట్లే కానిమ్ము నీవు సృష్టించిన దేవతలు, ఋషులు, నక్షత్రములు, నీ గొప్పదనమును యీ లోకమున చాటుటకు నిదర్శనముగా నుండగలరు త్రిశంకుడు, తన కొరకై నిర్మించిన స్వర్గమును ఇంద్రుని వలె పరిపాలించగలడు నక్షత్రము

లన్నియూ వాని పరిధిలో సంచరించగలవు. అతని పేరు ప్రతిష్ఠలు చిరకాలము నిలిచి యుండగలవు''. దేవతలు పలికిన పలుకులు కౌశికుని సంతోషపరచెను. త్రిశంకుడు సుఖముగా నుండెను. ఋషులందరు వారి వారి ఆశ్రమములకు, దేవతలు తమ నివాసములకు వెళ్ళిరి.

కౌశికుడు యేకాకిగా నుండెను. అతని తపస్సంపద అంతయూ కరగిపోయెను. అతడు సర్వస్వమును త్రిశంకు మహారాజు కొరకు ధారపోసెను. అయినను క్లిష్ట పరిస్థితులలో నున్న త్రిశంకును ఆదుకొని సహాయపడినందుకు సంతోషము కలిగెను.

## 122 శునశ్శేపుడు

త్రిశంకుని గాధ జరిగిన తర్వాత కౌశికుడు తనలో తానిట్లు భావించెను. ''దక్షిణ దిశలో నేను గావించిన తపస్సునకు అంతరాయము కలిగి అంతయు వ్యయమైపోయెను. పశ్చిమ దిశగా వెళ్ళి మరల తపస్సు ప్రారంభించెదను మానవుల కంట పడని ప్రదేశమందు ఒక సరోవర తీరమున ఆశ్రమము నేర్పరచుకుని అచ్చట తపస్సు చేసెదను''. కౌశికమను సరస్సు ఒడ్డున పుష్కర క్షేత్రమను పుణ్యస్థలములో అతడు తిరిగి తపస్సు ప్రారంభించెను

త్రిశంకునకు హరిశ్చంద్రుడను కుమారుడు గలడని యింతకు ముందు మరొక సందర్భములో తెలియవచ్చినది. వరుణ ప్రసాదముచేత హరిశ్చంద్రునకొక కుమారుడు గలిగెను. పుట్టిన వెంటనే ఆ పుత్రుని వరుణ దేవునకు ప్రసాదించగలనని హరిశ్చంద్రుడు మాట యిచ్చెను. అయితే పుత్రునిపై అభిమానము మెండుగా నుండుటచే యేదో ఒక మిషపై వరుణదేవుని కివ్వకుండెను. వరుసగా ఒకదాని తర్వాత మరొక కారణము చెప్పుచు నరమేధ యాగమును మాట యిచ్చిన ప్రకారము సలుపక యెగవేయుచుండెను. హరిశ్చంద్రుని పుత్రుడు రోహితుడు పెరిగి పెద్దవాడయ్యెను అతడు తన తండ్రి వరుణదేవుని కిచ్చిన వాగ్దానమును తెలుసుకొనెను అతడు అరణ్యమునకు వెళ్ళి తనకు సంభవింప బోవు ఉపద్రవము నుండి తప్పించుకొన జూచెను. అనేక సంవత్సరములు అడవిలో సంచరించెను. హరిశ్చంద్రుడు వరుణున కిచ్చిన వాగ్దానము నిలుపుకొననందుకు, రాజును శిక్షింపనెంచి, అతడు మహోదర వ్యాధితో బాధపడునట్లు చేసెను తన తండ్రి తీవ్రమైన వ్యాధితో బాధపడుచున్నాడని తెలుసుకుని, తండ్రిని రక్షింపనెంచి తిరిగి రాజ్యమునకు బోవ తలపెట్టెను ఇంద్రుడతని నడ్డగించి తీర్థయాత్రలకు బంపెను అతడు తిరిగి వచ్చునపుడెల్లను ఇంద్రుడు అడ్డుపడి మరల తీర్థయాత్రలను కొనసాగించమని పంపుచుండెను. ఇట్లు అయిదు సంవత్సరములు గడచెను చివరకు రాజ్యమునకు బోయి తండ్రిని రక్షించుటకు రోహితుడు నిశ్చయించుకొనెను.

రోహితుడు రాజ్యమునకు తిరిగి వచ్చుచుండగా మార్గమందు అజగర్తుడను బ్రాహ్మణుని కలుసుకొనెను. ఆ బ్రాహ్మణుడు భార్యతో, ముగ్గురు పుత్రులతో ప్రయాణము సలుపుచుండెను. తనకు బదులుగా వేరొకరు నరమేధమునకు లభించినచో, తన తండ్రికి ఆరోగ్యము చేకూరగలదనియు, మృత్యు ముఖము నుండి తాను తప్పించుకొనవచ్చుననియూ రోహితుడు భావించెను బ్రాహ్మణుని, అతని పుత్రులను చూచిన తర్వాత రోహితుని కిట్టి ఆలోచన కలిగెను. మరొక యువకుని వరుణదేవునకు సమర్పించినచో, తన రాజ

కుటుంబమునకు అవాంతర పరిస్థితి తప్పిపోగలదని తలంచెను. రోహితుడు బ్రాహ్మణునకు నమస్కరించెను. రోహితుడు యేదో చెప్ప నున్నాడని గ్రహించి బ్రాహ్మణుడు మౌనముగా నుండెను. రోహితుడిట్లనెను. ''బ్రాహ్మణోత్తమా! నీకు నూరువేల గోవులను యిచ్చెదను. అందుకు ప్రతిఫలముగా నీ కుమారులలో నొకరిని నాకివ్వగలవా?'' బ్రాహ్మణుడు వింతయైన యీ కోరికను విని ఆశ్చర్యము చెంది, వివరము అడిగి తెలుసుకొనెను. రోహితుడు, తన కుటుంబము యెదుర్కొంటున్న క్లిష్ట సమస్యను వివరించెను. రోహితుడు మరల యిట్లనెను. ''నా తండ్రికి నేనొక్కడనే పుత్రుడను. నేను మరణించినచో మా వంశము అంతరించగలదు. నా తండ్రి అనారోగ్యములో బాధపడుచున్నాడు. నీ పుత్రులలో ఒకరిని యిచ్చినచో యిద్దరి జీవితములు రక్షించినట్లగును. మరియు దేశమునకు సేవచేసిన కీర్తి కూడ నీకు దక్కగలదు. నీ పుత్రులలో నొకని నాకివ్వగలవా?''

అజగర్తు డిట్లనెను. ''నా జ్యేష్ఠ పుత్రుని యీయజాలను. అతనిపై నాకు అత్యంత ప్రీతి. అతడు లేనిదే నేను జీవించలేను''. బ్రాహ్మణుని భార్య యిటులనెను. ''జ్యేష్ఠ పుత్రుడు తన కత్యంత ప్రీతిపాత్రుడగుటచే అతని నివ్వలేనని నా భర్త భార్గవుడు చెప్పెను. ఈ కనిష్ఠ పుత్రునిపై నాకు విపరీతమైన ప్రేమాభిమానములు గలవు. అతని యెడబాటు నేను భరించలేను. జ్యేష్ఠపుత్రునిపై తండ్రికి, కనిష్ఠ పుత్రునిపై తల్లికి ప్రేమ యుండుట లోక సహజము''.

బ్రాహ్మణుని రెండవ పుత్రుని పేరు శునశ్శేపుడు. అతడు అతి సరళముగా కొద్దిపాటి విచార స్వరముతో యిట్లనెను. ''ఓ రాకుమారుడా! నా మాట వినుము. నా అన్నగారు తండ్రికి, తమ్ముడు తల్లికి ప్రీతిపాత్రులు. కాబట్టి నా తల్లిదండ్రులు నన్ను నీకిచ్చిరని భావించవచ్చును. నన్ను నీతో తీసుకువెళ్ళుము''. రాకుమారుడు మాట ప్రకారము గోవులను బ్రాహ్మణున కిచ్చి, అతని పుత్రుని సంతోషముగా తనతో తీసుకు వెళ్ళెను.

రోహితుడు, శునశ్శేపుడు పవిత్ర పుష్కర స్థలము చేరుసరికి నడి మధ్యాహ్నము కాజొచ్చెను. అచట బ్రాహ్మణ బాలుడైన శునశ్శేపుడు కౌశికుడు తపస్సు చేయుచుండుట గమనించెను. ఆ బాలుడు ఆకలిదప్పిక లతో అలమటించుచుండెను. పైగా తనపై తల్లిదండ్రులకు ప్రేమాభిమానములు లేవని తెలుసుకుని నిరుత్సాహ ముతో నుండెను. లేకున్న, గోవులను తీసుకుని తనకు మరణము సంభవించునని తెలిసికూడ, రాకుమారునకు అమ్మజూతురా? కౌశికుడు భార్గవ కుటుంబమునకు దూరపు బంధువని తెలుసుకుని, ఆ బంధుత్వమును వినియోగించుకొనవలెనని భావించెను. వెంటనే ఉన్నపాటున కౌశికుని వద్దకు వెళ్ళి అతని ఒడిలో పడి యేడ్వసాగెను. సమాధిలో నున్న కౌశికుడు తెలివి తెచ్చుకుని ఆగంతకుని చూచెను. ఒక బాలుడు విచార వదనముతో తన హృదయములోని ఆవేదనను తెలుపుచు యేడ్చుచుండెను. ఆ బాలుడిట్లనెను. ''నాకు తల్లియు, తండ్రియు లేరు. నా కెవరు బంధువులు లేరు. నీవు తప్ప నాకింకెవరూ లేరు. నా ప్రాణము కాపాడుము. నీవు చాల శక్తిమంతుడవని, ఉదారుడవని, కరుణామయుడవని, యితరులు విచారముతో నుండుట చూచి సహించలేవని చెప్పగా విన్నాను. నిన్ను నేను చూచి నీ సహాయ మర్థించుటకై వచ్చితిని''. ఆ బాలుని విచారమునకు కారణమడుగగా, అతడు కౌశికునకు జరిగిన విషయము విపులముగా తెలిపెను. అది వినిన కౌశికుని హృదయము ప్రేమతో నిండిపోయెను. శునశ్శేపుడు తిరిగి యిట్లనెను. ''ప్రభూ! రాజు చేయు యజ్ఞము కొరకు నా తండ్రి నన్ను అమ్మివేసెను. కాని యజ్ఞమునకు ఆటంకము కలుగుట నాకు యిష్టము లేదు, నా ప్రాణములు విడుచుటకు కూడ నాకు యిష్టము లేదు. ఈ రెండును నెరవేరునట్లు నీవు మాత్రమే చేయగలవు. నేను దీర్ఘకాలము జీవించి, తపస్సు చేసి ఆ తర్వాత స్వర్గము చేరవలెనని నా అభిమతము. అనాధుడనైన

నావంటి అభాగ్యుల పాలిటి రక్షకుడవు నీవు''.

విచారించుచున్న బాలునితో కౌశికుడు మృదువైన మాటలతో రక్షించెదనని మాట యిచ్చి ఓదార్చెను. తరువాత కౌశికుడు తన పుత్రులను పిలిచి యిట్లనెను. ''పుత్రులు పున్నామ నరకము నుండి రక్షించి, తాము పితృలోకము చేరుటకు సహాయపడెదరను తలంపుతో తల్లిదండ్రులు పుత్రులను కోరెదరు. మీ జన్మలను మీరు సార్థకము గావించెదరో లేదో నేను చూచెదను ఈ బాలుడు రక్షింపమని నన్ను కోరుచు నా దగ్గరకు వచ్చెను మీరందరు శాస్త్రములు చక్కగా అధ్యయనము చేసినవారు, తపస్సు చేసి శక్తిని సంపాదించినారు. నేను ఆశించినట్లుగా మీరు నడచుకొనవలెను మీలో ఒకరు హరిశ్చంద్రుడు జరుపు నరమేధ యాగమునకు యజ్ఞపశువు కావలెను ఆ విధముగా నేనీ బాలుని రక్షించి యజ్ఞము జయప్రదముగా సమాప్తి యగునట్లు గావించెదను. ఆ విధముగా మీరు చేసెదరా?''

కౌశికుని పుత్రులలో మధుచ్ఛందుడు మరికొందరు యిది ఒక వేళాకోళముగా పరిగణించి నవ్వుచు తండ్రితో యిట్లనిరి. ''తండ్రీ! ఎవరో ఒక బాలుడు వచ్చి తన హృదయావేదనను తెలుపగా, నీ పుత్రులలో ఒకరిని బలి చేయుటకు నీ హృదయమెట్లు అంగీకరించెను? శునక మాంసమును భుజించుట యే విధముగా అసాధ్యమో, నీ యాదేశమును మేము పాటించుట అంతటి అసాధ్యము''. కౌశికుని ఆగ్రహము అతని ముఖమందు ప్రస్ఫుటముగా గోచరించుచుండెను. అతడు తన పుత్రులతో నిట్లనెను. ''మీ ప్రవర్తన, మాటల తీరు చూడగా యీ జీవితమునకు అనర్హులని తోచుచున్నది. మీరు నాకు పుత్రులుగా నుండదగరు తండ్రి ఆదేశమును పాటించని వారు గౌరవింపదగరు వసిష్ఠుని కుమారుల వలె మీరు కూడ నిషాదులై శునక మాంసమును భుజించుచూ వేయు సంవత్సరములు జీవించుడు''

కౌశికుడు తన పుత్రులను శపించిన తర్వాత శునశ్శేపుని యేదో విధముగా రక్షించెదనని అభయ మొసంగెను అతడిట్లనెను ''నీవు రోహితునితో వెళ్ళుము. నిన్ను బలి స్తంభమునకు కట్టి మెడలో యెర్రని పూలదండలు వేసి శరీరమునకు యెర్రని గంధము పూసెదరు. పవిత్ర మంత్రములతో మంత్రించిన త్రాళ్ళతో నిన్ను యూప స్తంభమునకు కట్టెదరు నేను నీకు రెండు మంత్ర శ్లోకములను బోధించెదను వాటిని నీ మనస్సులో మననము చేసుకొనుము. యజ్ఞము జరుగునపుడు నీవు ఆ మంత్ర శ్లోకములను పఠించుచుండుము అపుడు యజ్ఞము విజయవంతముగా సమాప్తి అయినట్లు భావించవచ్చును''.

శునశ్శేపుడు అతిశ్రద్ధతో మంత్ర శ్లోకములు నేర్చుకొనెను తరువాత విశ్రమించుచున్న రోహితుని వద్దకు వెళ్ళి యిట్లనెను ''తొందరగా మనము నగరము చేరుదము. యజ్ఞము జరుగు స్థలమునకు నన్ను తీసుకొని వెళ్ళుము. నేను సంసిద్ధుడనై యున్నాను''.

శునశ్శేపుడు తనంత తానుగా ఉత్సాహము చూపించుట చూచి రోహితుడు సంతోషించెను. వారిద్దరూ రోగముతో బాధపడుచున్న హరిశ్చంద్రుని వద్దకు వెళ్ళిరి అనుకూలముగా మారిన పరిస్థితులకు హరిశ్చంద్రుడు చాల సంతోషించెను మహోదర వ్యాధితో బాధపడుచున్నప్పటికీ, యజ్ఞశాలకు వెళ్ళి యజ్ఞమును ప్రారంభించెను. కౌశికుడచ్చటకు వచ్చెను. రాజు, కౌశికుని యజ్ఞహోతగా నియమించెను జమదగ్ని అధ్వర్యుడుగను, వసిష్ఠుడు బ్రహ్మగను, అయాస్యుడు ఉద్గాతగను వ్యవహరించిరి

హరిశ్చంద్రుడు శునశ్శేపుని యూపమునకు గట్టెను. ఆ బాలుని వారు బలి చేయుటకు సంసిద్ధులగుచుం

డగా, ఆ బాలుడు పసితనపు తత్తరపాటుతో కౌశికుడు తనకు నేర్పిన మంత్రములను గట్టిగా నుచ్చరించుట మొదలుపెట్టెను. యజ్ఞశాల అంతయు నిశ్శబ్దముగా నుండెను. మొదట ఆశ్చర్యముతోను, తర్వాత ఇంద్రవరుణాది దేవతలను కీర్తించు ఉత్తమ మంత్రములు వినిపించుటచేత యజ్ఞశాల అంతయు గంభీర నిశ్శబ్దమావరించెను. ఇంద్రుడు, వరుణుడు మెచ్చుకొనిరి. వారు ప్రత్యక్షమై శునశ్శేపుడు చిరకాలము జీవించునట్లు వరము ప్రసాదించిరి. హరిశ్చంద్రుని తప్పిదమును క్షమించి, అతని జలోదర రోగమును నివారింపజేసిరి. పుత్రునిపై విశేషమైన మమకారమును పెంచుకొనుట వలన కలిగిన అనుభవములు రాజునకు గుణపాఠము నేర్పగా, అతడు కౌశికుని వద్ద బ్రహ్మవిద్య నేర్వవలెనని తలంచెను. కౌశికుడు చాల సంతోషముతో అంగీకరించెను. ఆ తర్వాత హరిశ్చంద్రుడు పూర్తిగా మారిపోయెను.

కౌశికుడు శునశ్శేపుని దత్త పుత్రునిగా స్వీకరించెను. తన పుత్రులైన మధుచ్ఛందాదులను పేరు పేరున పిలిచి వారితో శునశ్శేపుని తమ అగ్రజునిగా పరిగణించవలెనని చెప్పెను. ''భృగు వంశమునకు చెందినవాడు. అతడిప్పుడు మీలో ఒకడు'' అని కౌశికుడు తన కుమారులతో చెప్పెను. తమ తండ్రి శునశ్శేపుని దత్తపుత్రునిగా స్వీకరించుట పెద్ద కుమారులకు యిష్టము లేకుండెను. వారి ప్రవర్తనకు తండ్రి ఆగ్రహము చెంది నీచ జాతిలో జన్మించునట్లు శపించెను. ఏబదిమంది పుత్రులు శాపగ్రస్తులైరి. మిగిలిన ఏబదిమంది పుత్రులు, మధుచ్ఛందునితో సహా తండ్రి పాదములపైబడి యిట్లనిరి. ''మీ ఆదేశమును శిరసావహించెదము. శునశ్శేపుని అగ్రసోదరునిగా స్వీకరించుటకు మేము సిద్ధమే''

తండ్రి సంతోషించి వారితో నిట్లనెను. ''మీరు చాల ఉత్తములు. మీ ప్రవర్తనకు మెచ్చుకొనుచున్నాను. శునశ్శేపునితో సహా మీరందరూ కౌశికులుగా వ్యవహరింతురు. లోకములో మన కుటుంబము వారు కౌశిక గోత్రోద్భవులుగా ప్రసిద్ధి పొందెదరు''.

కౌశికుడు మరొక వేయి సంవత్సరములు తపస్సు చేసెను. ఆ తర్వాత బ్రహ్మ ప్రత్యక్షమై యిట్లనెను. ''నీ తపస్సుకు అచ్చెరువొంది మెచ్చితిమి. నీకు 'ఋషి' పదమును ప్రదానము చేయుట మాకు సంతోషదాయకము''.

కౌశికునకు సంతృప్తి కలుగలేదు. 'ఋషి' బ్రహ్మర్షి కన్న తక్కువ స్థాయి యని అతడెరుగును. అతడు 'బ్రహ్మర్షి' కాదలచి మరింత ఘోరముగా తపస్సు చేయ మొదలిడెను.

## 123 కౌశికుని తప్పిదము

కౌశికుని తీవ్ర తపస్సుకు దేవతలు ఆందోళన చెందుచుండిరి. ఇంద్రుడు తన ఇంద్ర పదవికి భంగము కులుగునేమో యని భయపడెను. కౌశికుని తపమునకు భంగము కలిగింపనెంచి, మేనక యను అప్సరసను పిలిపించెను. ఇంద్రుడు మేనకతో యిట్లనెను. ''అప్సరస లందరిలో నీవు ఉత్తమురాలవు. నీవు నాకొక సహాయము చేయవలసి యున్నది. నీవేమి చేయవలెనో నీకు చెప్పెదను. కౌశికుడు తీవ్రమైన తపస్సు ఆచరించుచున్నాడు. అతడు మిట్ట మధ్యాహ్నపు సూర్యునివలె ప్రకాశించుచున్నాడు. అతడింత వరకు చేసిన తపస్సు చాల భయంకరమైనది. అతని తపస్సు విజయవంతమైనచో నా యింద్ర పదవికి ముప్పు వాటిల్లగలదు.

నీవు అతడు తపస్సు చేయుచున్న ప్రదేశమునకు వెళ్లుము. అతడు ఇంద్రియములను నిగ్రహించి, ఏకాగ్రతతో ధ్యానములో నిమగ్నుడై యున్నాడు. నీ అందముతో, హావ భావములు ప్రదర్శించి, పురుషులందరకు నున్న దౌర్బల్యము నూతగా తీసుకుని, అతడు నీ వ్యామోహములోపడి, తపస్సు విరమించునట్లు జేయుము అప్పుడు నిన్ను నేను మెచ్చుకొందును''

మేనక వెళ్ళుటకు భయపడి యిట్లనెను. ''దేవా! అతడు చాల శక్తిమంతుడనియూ, కోపిష్టి యనియూ వినియున్నాను తపశ్శక్తి, ఆగ్రహము, యీ రెండును కలిసిన పర్యవసాన మెట్లుండునో ఊహించవచ్చు! నేను యీ రెండింటిని యెట్లు తట్టుకొనగలను? నీవే అతనికి భయపడుచున్నావు, అటువంటిది నేను యే విధముగా అతని దగ్గరకు వెళ్ళగలను? అతడు వసిష్ఠ పుత్రులను శపించెను అతడు క్షత్రియుడైనప్పటికీ, స్వశక్తిచేత బ్రాహ్మణుడయ్యెను. బ్రహ్మవలె త్రిశంకు స్వర్గము సృష్టించెను అంతటి మహాతపస్వి తప్పకుండ ఇంద్రియముల కతీతుడై యుండును నేనెట్లు ధైర్యము చేసి అతని వద్దకు వెళ్ళగలను? అతడు నన్ను శపించిన నా గతి యేమి కావలయును? అతడు నన్ను శపించకుండునని నీవు అభయ మొసగినచో నీవు చెప్పినట్లు నేను చేయగలను. నాతో వసంతుని మన్మథుని పంపుము. మందానిలమును కూడ నాతో వచ్చునట్లు చేయుము అనురాగ భోగముల కనుకూల పరిస్థితులు కల్పించినచో, నేను అతనిని కవ్వించుటకు ప్రయత్నించె దను''

మేనక భూలోకమునకు వెళ్ళి కౌశికుడు తపస్సు చేయుచున్న పరిసర ప్రాంతములో, తగిన సమయము కొరకు వేచి యుండెను. కౌశికుడు ధ్యానము నుండి లేచి అటు నిటు తిరుగుచుండెను ఇదే తగిన సమయమని తలచి, మేనక విశ్వామిత్రుడు సంచరించుచున్న ప్రాంతమునకు వెళ్ళెను ఆమె ఊహ వమ్ము కాలేదు.

ఆమె అతడు సంచరించుచున్న ప్రాంతములో నడయాడుచుండుట జూచెను ఆమె అందమునకు హావభావములకు ముగ్ధుడై ఆమెకు వశమయ్యెను

ఇట్లు అయిదు సంవత్సరములు గడచెను. మరొక అయిదు సంవత్సరములు గడచెను. ఒకరోజు అతడు స్వప్నము నుండి మేల్కాంచినట్లు లేచెను పది విలువైన సంవత్సరములు వ్యర్థమయ్యెనని అతడు గ్రహించెను అతని తపస్సుకు భంగము కలిగెను అంతవరకు సమకూర్చుకొనిన తపశ్శక్తిని చాలవరకు కోల్పోయెను అతనికి విచారము, తనపై తనకు ఆగ్రహము కలిగెను. తర్వాత అతడు యిది దేవతల పన్నాగమనియు, యెవరైనను తీవ్రముగా తపస్సు చేసిన అందుకు ఆటంకమును కల్గింతురనియు గ్రహించెను. ఇట్టి పరిస్థితిలో నున్న కౌశికుని చూచిన మేనకకు చేతులలో బిడ్డ యుండగా, భయము ఆవహించెను అతని ఆగ్రహము తనపై ప్రసరించునేమోయని ఆమె భయపడెను ఆమె చేతులు జోడించి నిలుచుండెను ఆమె కనుల నుండి కన్నీరు కనురెప్పలపై నిలిచి యుండెను. కాని ఆమెపై కౌశికున కాగ్రహము లేకుండెను అతడామెతో తిరిగి తపస్సు కొనసాగించబోవుచున్నానని చెప్పెను

అతడు కౌశికీ నదీ తీరమునకు వెళ్ళెను అతని సోదరి సత్యవతియే కౌశికి అతడు భయంకర తపస్సు చేయుచుండెను చాల కాలము తర్వాత, దేవతలు బ్రహ్మ అతని తపస్సుకు మెచ్చిరి. బ్రహ్మ దేవతలతో కౌశికునకు ప్రత్యక్షమై యిట్లు పలికెను. ''కౌశికా! నీవు యిప్పుడు 'మహర్షి'వైనావు. చాల తీవ్రమైన తపస్సు ఆచరించినావు. నీవు ఋషులలో కెల్ల అత్యుత్తముడవు'' బ్రహ్మ వచనములు కౌశికునకు, సంతృప్తినిగాని, అసంతృప్తినిగాని కలిగించలేదు కౌశికుడిట్లనెను. ''నాతపశ్శక్తి చేత 'మహర్షి' పదవి నందుకున్నాను కాని,

మహాత్మా! నేను యింద్రియములను జయించితినా? దయచేసి తెలుపుడు''. బ్రహ్మ యిట్లనెను. ''బహుశః జయించ లేదనుకొందును. నీవు యింకను సంపూర్ణమైన జితేంద్రియుడవు కావు''. కౌశికుడు వదనము దించుకొనెను. బ్రహ్మ యిట్లనెను. ''నీవు అదికూడను సాధించుటకు ప్రయత్నించవలెను''.

అటు తర్వాత కొన్ని సంవత్సరములు అతిక్లిష్టమైన రీతిని కౌశికుడు తపస్సు చేసెను. అతడు చేతులు పైకెత్తి ఆహారము లేక తపస్సు గావించెను. గాలి మాత్రమే అతని ఆహారము. నడి వేసవి కాలములో పంచాగ్నుల మధ్య నిలుచుండి, శీతకాలములో జలము మధ్య నిలబడి తపస్సు చేసెను. అతని తపస్సు తీవ్రతరమయ్యెను. మరల ఇంద్రుడు అతని తపస్సుకు భంగము చేయనెంచి అప్సరస రంభను పిలిపించెను. అతడామెతో యిట్లనెను. ''ఇది వరకు మేనక చేసినట్లుగా, నీవు కౌశికుని నీ వశము గావించుకొనుము''. రంభ మిక్కిలి భయపడి ఇంద్రునితో యిట్లనెను. ''దేవా! నాకు వెళ్ళుటకు ధైర్యము చాలకున్నది. అతని ఆగ్రహము భరించరానిది''. ఇంద్రుడామెకు యెట్టి ప్రమాదము కలుగబోదని అభయ మొసంగెను. ఇది వరకు మేనక వెళ్ళినట్లే రంభ భూలోకమునకు వెళ్ళెను. ఇంద్రుడు, స్వయముగా తానే వచ్చి రంభకు సహాయముగా నుండగలనని చెప్పెను. కౌశికుడు తపస్సు చేయుచున్న ప్రదేశములోని వృక్షముపై కోయిలలు మధురముగా కూయుచుండెను. ఇంద్రుడు, మన్మధుడు అదే వృక్షముపై కూర్చుండిరి. రంభ, కౌశికుడు తపస్సు చేయు ప్రదేశము కేతెంచెను.

కౌశికుడు తీవ్ర ధ్యానములో నిమగ్నుడై యుండగా కోయిల కూతలు అంతరాయము కలిగించుచుండెను. వసంత ఋతువులో పుష్పించు పువ్వుల గుబాళింపులు అతని నాసికను సోకెను. అతడు కళ్ళు తెరచెను. ఎదురుగా అందమైన రంభ నిలిచి యుండెను. కౌశికుడు యిది ఇంద్రుని పన్నాగమని తెలుసుకొనెను. లేకున్న వసంత ఋతువు రావలసిన దానికన్న ముందుగా యెట్లు వచ్చెనని తలంచెను. అంతేకాక అందమైన సుకుమార స్త్రీ యీ అరణ్యము లోనికి, వేరొకరు తీసుకురానిచో, యెట్లు రాగలదు? వెంటనే ఆగ్రహముతో రంభను శపించెను. ''ఇంద్రుని పనుపుపై నీవు యిక్కడకు వచ్చి నీ హావభావ విలాసములతో నన్ను వశపరచు కొనవలెననుకున్నావు. నా తపశ్శక్తిని హరింపజేయ జూచితివి. నీవు శిలగా మారి వేయి సంవత్సరములు యీ భూలోకములో నుండగలవు''. ఆమెను శపించిన తక్షణమే తన తొందరపాటుకు పశ్చాత్తాపము చెందెను. ''బ్రహ్మ చెప్పినది సత్యమే. నేను జితేంద్రియుడను కాను. ఆగ్రహమును నిగ్రహించుకొనలేకున్నాను. ఇంద్రియములను జయించనంత వరకు ఆత్మకు ప్రశాంతత చేకూరదు. ఇప్పటి నుండి ఆగ్రహము చెందక, ఒక్కమాట యైనను పలుకక యుండెదను. అన్ని భావములను బహిష్కరించి, మరల తపస్సు చేసెదను. అప్పుడే నేను చేసిన తపస్సుకు తగిన ప్రతిఫలము లభ్యము కాగలదు''.

## 124 బ్రహ్మర్షి విశ్వామిత్రుడు

కౌశికుడు ఉత్తర దిశ నుండి తూర్పుదిశగా వెళ్ళి అక్కడ తిరిగి తపస్సు ప్రారంభించెను. ఒక వేయి సంవత్సరములు అతడు మౌనముగా ఘోర తపస్సు ఆచరించెను. అతని తపోగ్నికి యీ లోకము, స్వర్గలోకము అట్టుడికి నట్టుడికి పోయెను. కౌశికుడు పుల్లవలె సన్నగా నయ్యెను. అనేక అవాంతరములను అతిక్రమించెను. తన మనస్సు నుండి క్రోధమును సంపూర్ణముగా విడనాడెను.

ఒకరోజు ఉపవాసము విరమించి అన్నము వండుకొనెను. అతడు తినబోవుచుండగా, ఇంద్రుడు ఒక బ్రాహ్మణుని వేషములో వచ్చి అన్నము పెట్టమని యాచించెను. ఒక్క మాటైనను పలుకక, తాను వండుకొనిన అన్నమును ఆ బ్రాహ్మణునికి పెట్టి, తిరిగి తపస్సు ప్రారంభించెను. అతడు మరింత తీవ్రముగా తపస్సు చేయనారంభించెను. అతడు పీల్చు శ్వాసను కూడ నిగ్రహింప దొడగెను. అతడిప్పుడు గాలిని పీల్చక చాలసేపు ఉండగలుగుచుండెను. అతని శిరస్సు నుండి పొగ వచ్చుట మొదలిడెను. అతని తపస్సు వేడిమికి లోకము క్షోభించుచుండెను. ఇంద్రాది దేవతలు బ్రహ్మ వద్దకు వెళ్ళి యిట్లనిరి. ''కౌశికుడు తన తపస్సు చేత అత్యంత తేజస్సుతో ప్రకాశించుచున్నాడు. ఇంత కాలముగ అతడు అభిలషించిన దానిని నీవు ప్రసాదింపకున్నచో, అతని తపస్సు వేడిమికి ముల్లోకములు నాశనము కాగలవు. తపస్సు చేత అతని తేజస్సు సూర్యుని అగ్నిని మించి యున్నది. అతని ప్రకాశము ముందు అగ్ని, సూర్యుడు తమ ప్రకాశమును గోల్పోయినట్లు గోచరించుచున్నారు. సముద్రములో అలలు ఉద్ధృతముగా నున్నవి. పర్వతముల నుండి అగ్ని చిమ్ముచున్నది. భూమి వణకుచున్నది. ఆకాశములో పెనుతుఫాను చెలరేగుచున్నది. కౌశికుడు కాలాంతాగ్ని వలె నున్నాడు. ఈ తీవ్ర పరిస్థితి నుండి లోకమును రక్షింపవలసిన బాధ్యత నీపై నున్నది''.

బ్రహ్మ త్వరగా కౌశికుని వద్దకు వచ్చి యిట్లనెను. ''బ్రహ్మర్షీ! నీకు స్వాగతము. నీ తపస్సు మమ్ములను మెప్పించినది. నీ అపూర్వమైన సాధన చేత బ్రహ్మర్షి పదవికి అర్హుడనైతివి. నీకు అభ్యుదయమగు గాక!''

కౌశికుని వదనమందు సంతోషము మెరసెను. బ్రహ్మకు సాష్టాంగ ప్రణామము గావించి యిట్లు పలికెను. ''నీవు నాకు ప్రసాదించినది సత్యమే యగుచో, నేను బ్రహ్మర్షినయినచో, మీ అనుగ్రహముచే నేను దీర్ఘకాలము జీవించినచో, వేదములు నన్ను బ్రహ్మర్షిగా గుర్తించునట్లు చేయుము. నాకొక కోరిక యున్నది. నీ కుమారుడైన వసిష్ఠుడు నన్ను బ్రహ్మర్షిగా గుర్తించవలెను''. వారు వసిష్ఠుని పిలువనంపగా అతడు వచ్చి, ప్రేమాభిమానముతో చిరునవ్వు నవ్వి కౌశికునితో యిట్లనెను. ''నీవు చాల గొప్పవాడవు. బ్రహ్మర్షివి. అందుకు సందేహము లేదు''. కౌశికుడు వసిష్ఠుని గౌరవించి సత్కరించెను. కౌశికుడు తన యిష్టము వచ్చిన ప్రదేశమునకు వెళ్ళుటకు పూర్తి స్వేచ్ఛ కలిగియుండెను. లోకములో యితరులకు మంచి చేయవలెనను తలంపు అతని మనస్సులో నుండెను. అందుచేత అతనికి 'విశ్వామిత్ర' నామధేయము సార్థకమయ్యెను.

## 125 నహుషుడు

పురూరవునకు ఆయువను పుత్రుడు కలడు. ఆయువునకు నలుగురు పుత్రులు. వారిలో నహుషుడు ప్రధానమైనవాడు. అతడు చాల ఉత్తముడు. రాజ్యమును చక్కగా పాలించుచుండెను. అతడు అన్ని దిక్కులందున్న రాజులను జయించి విశేషమైన సంపదను గడించెను. అతడనేక యజ్ఞములు చేసి ఇంద్రపదవి కర్హుడయ్యెను. ఒకప్పుడు, బ్రహ్మ హత్యాపాతకముచే ఇంద్రుడు బాధపడుచున్నప్పుడు, అతడు తాత్కాలికముగా మరుగున నుండవలసి వచ్చెను. ఆ సమయమున దేవతలు నహుషుని ఇంద్రుడుగా వ్యవహరించమని కోరిరి. ఇంద్రుడు బ్రహ్మహత్యాపాపము నుండి విముక్తిపొందునంతవరకు నహుషుడు ఇంద్ర పదవి చేబట్టుటకు అంగీకరించెను. తన పుత్రుడైన యయాతిని రాజుగా నియమించి, నహుషుడు స్వర్గములో ఇంద్ర పదవి నధిరోహించెను.

కొంత కాలమునకు నహుషునిలో అహంభావము పెరిగెను. అతడార్జించిన సంపద, లోకముపై తనకు కల్గిన అధికారము, అనేక యజ్ఞములను జరిపితినను భావము, దేవతలు వచ్చి తన్ను యింద్రుడుగా నుండమని కోరుట — యివన్నియు కూడి అతనిలో గర్వమును, అహంకారమును పెంపొందించెను. నహుషుడు గొప్ప మహారాజు, కాని అధికారము అతనిలో మదమును గర్వమును యినుమడింపజేసెను.

ఇంద్రునకొక ప్రత్యేకత గలదు. అతని పల్లకిని సప్తర్షులు మోసెడివారు. రాజ కార్యముపై నహుషుడు బయటకు పల్లకిలో వెళ్ళునపుడు ఋషులు ఆ పల్లకి మోసెడివారు. ఇది నహుషునకు యెంతయో సంతోషము కల్గించెను రాను రాను ఋషులు తనకు బానిసలను భ్రమలో నహుషుడుండెను. అధికార మదములో నున్న నహుషుడు, ఋషులు ఇంద్రపదవి యందున్న గౌరవముచేత అట్లు చేయుచున్నారని తలపక భూలోకములో నుండి వచ్చిన తనకు సేవకులుగా నున్నారని తలచుచుండెను.

దురదృష్టవశాత్తు అతని మదిలో మరియొక భావము తలయెత్తెను. ఇంద్రపదవి నేలుచుండుటచే శచీదేవిని తన భార్యగా స్వీకరించవచ్చునని తలచెను. ఆమె నివాసమునకు వెళ్ళుటకు నిశ్చయించుకుని పల్లకిని తెప్పించెను ఋషులు పల్లకి మోసుకొని రాగా, నహుషుడందు కూర్చుండెను ఆమె సౌధమునకు తొందరగా వెళ్ళవలెనని మనసు తొందర జేయుచుండెను. పల్లకిని తొందరగా ఋషులు తీసుకువెళ్ళుట లేదని భావించెను ప్రేమ జాడ్యములో పడినవాని మనస్సు ప్రయాణించు వేగముతో గాలి కూడ ప్రయాణించలేదు గదా! ఓర్పు కోల్పోయిన నహుషుడు ఋషులతో వేగముగా వెళ్ళమని చెప్పుచూ 'సర్ప — సర్ప' యనెను. అగస్త్య మహర్షి అతని మనస్సులో మెదలు విషయము గ్రహించి, అతని అహంకారమును సహించలేక పల్లకి క్రిందకు దించెను అగస్త్యుడు నహుషునితో యిట్లనెను. ''ఓరి మూర్ఖుడా! నీవేమి మాట్లాడుచున్నావో, యేమి చేయుచున్నావో నీవెరుగవు. నీ అహంకారము సహింపరానిదయ్యెను. దీనిని నివారించుటకు ఒకే మార్గము కలదు. నీవు 'సర్ప—సర్ప' అని యున్నావు అట్లే అగుగాక. అయితే సర్పమువలె ఆహారము కొరకు తిరుగలేక, కొండచిలువ మాదిరి ఆహారము నీవద్దకు వచ్చువరకు పడియుండగలవు. ద్వైతవనమను అరణ్యములో వేయి సంవత్సరములు ఆ విధముగా నుండగలవు''

శాపము పొందిన వెంటనే నహుషుని గర్వము మటుమాయమయ్యెను. అతి వినయముతో అతడిట్లనెను ''మిమ్ము అవమానించిన నన్ను శపించుట ఉచితముగా నున్నది. ఇంతకన్న కఠినమైన శిక్షకు అర్హుడను. కరుణా హృదయులైన మీరు తక్కువ శిక్షను విధించినారు నన్ను కరుణించి, నేను భూలోకములో యెంత కాలము ఉండవలెనో, శాపమెట్లు విముక్తి కాగలదో సెలవీయవలెను. మీ వంటి మహాత్ములు యిటువంటి శాపముల నిచ్చి, మావంటి వారిలో కలుగకూడని దుష్ట భావములను నివారింతురు అయితే విషమునకు విరుగుడు ఉన్నట్లు, శాప కారణము అంతరించినంతనే శాపమునకు విరుగుడు తప్పక యుండగలదు''.

నహుషుని స్థితి జూసి అగస్త్యుడు విచారించెను. ఉత్తముల ఆగ్రహము క్షణకాలమే యుండును. నహుషునితో అగస్త్య డిట్లనెను. ''శాపము ఉపసంహరించుటకు వీలులేదు. ద్వాపర యుగములో కొండచిలువ రూపము వదలి స్వర్గమునకు తిరిగి రాగలవు నీ వంశములో యుధిష్ఠిరుడనే గొప్ప వ్యక్తి జన్మించును అతడు ధర్మమూర్తిగా విలసిల్లును అతడు నిన్ను శాపవిముక్తుని గావించును. అతని సోదరుని నీవు పట్టుకొనగా అతడు నీ వద్దకు వచ్చి తన సోదరుని విడిచి పుచ్చమని కోరును. నీవు యుధిష్ఠిరుని ధర్మమును గురించి అడుగు ప్రశ్నలకు అతడు సరియగు సమాధానములు చెప్పగలడు అప్పుడు నీకు కొండచిలువ రూపము

పోయి, తిరిగి యీ స్వర్గమునకు రాగలవు''

పంద్రెండేడుల అరణ్యావాసములో పాండవులు ద్వైతవనమున వెళ్ళుచుండగా, అగస్త్యుడు చెప్పినట్లు జరిగెను ఆ విధముగా నహుషునకు శాపవిముక్తి కలిగెను.

# 126 వాగ్వాదము

వృషపర్వుడు అసురులను పాలించుచుండెను. అతని గురువు శుక్రాచార్యుడు. శుక్రాచార్యునికి కుమార్తె దేవయానిపై మిక్కిలి ప్రేమ వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ. దేవయాని శర్మిష్ఠ మంచి చెలికత్తెలు

ఒకరోజు దేవయాని, శర్మిష్ఠ స్నేహితురాండ్రతో జలకమాడుటకు నదీ తీరమునకేగిరి. వారు వస్త్రములను నది గట్టుపై నుంచి, నీటిలో జలకము లాడుచుండగా, మహాదేవుడు వృషభము నెక్కి తన సేవకులతో ఆకాశమున సంచరించుచుండుట జూచిరి పార్వతి మహాదేవుని ప్రక్కనే యుండెను. నదిలో జలకమాడుచున్న స్త్రీలందరూ సిగ్గుపడి, వడివడిగా నది ఒడ్డుకు వెళ్ళి వస్త్రములు ధరించిరి వారు నదిలో జలకమాడుచున్న పుడు చల్లగా వీచుచున్న గాలికి నది గట్టున పెట్టిన వస్త్రములు యెగిరి కలసిపోయెను తొందరలో వారు చేతికందిన వస్త్రములను తీసుకుని ధరించిరి. ధరించిన తర్వాత శర్మిష్ఠ దేవయాని వస్త్రములను ధరించినట్లు తెలుసుకొనెను. అక్కడ మిగిలియున్న రాకుమార్తె శర్మిష్ఠ వస్త్రములను దేవయాని ధరించవలసి వచ్చెను.

అంతవరకు శర్మిష్ఠపై ప్రేమాభిమానములు గల దేవయానికి అకస్మాత్తుగా కోపము ముంచుకు వచ్చెను శర్మిష్ఠ ప్రయత్న పూర్వకముగా చేయకున్నప్పటికీ, అట్లు చేసినదని దేవయాని తలంచి, శర్మిష్ఠతో నిట్లనెను ''నీవు అసుర స్త్రీవి నాకన్న అధము రాలవు. నేను బ్రాహ్మణ పుత్రికను నా దుస్తులను నీవు ధరించుటచే అవి కలుషితమైనవి నీకు మర్యాద తెలియదు'' రాకుమార్తె శర్మిష్ఠ, సహజముగా అసుర స్వభావము గలదగుటచే, దేవయాని అవమానకరమైన మాటలను విని సహించలేకపోయెను. ఆమె కోపముతో యిట్లనెను ''నీ గురించి నీవు గొప్పగా భావించకు, నీవు ఒక ముష్టివాని కుమార్తెవు నా తండ్రి కడకు వచ్చి నీ తండ్రి పడిగాపులు పడియుండును. ఎల్లప్పుడూ నా తండ్రిని పొగడుచుండును యజమాని కొరకు వేచి లాభము పొందుటకు, నా తండ్రికేది ప్రీతిని చేకూర్చునో దానిని చేయుటకు సిద్ధపడును. నీవు అతని పుత్రికవు నీ తండ్రి శుక్రుడు నా తండ్రి యిచ్చు దానధర్మములపై ఆధారపడి యున్నాడు నీ కోపమునకు ద్వేషమునకు లక్ష్యపెట్టు వారెవరూ యిక్కడలేరు! నా వంటి రాకుమార్తెతో నీవు పరుషముగా మాట్లాడుట చూడగా, ఆయుధము లేని మనిషి ఆయుధము కలవానితో తలపడిన రీతిగా నున్నది. నీవన్న నాకు లక్ష్యములేదు. ముష్టి అడుగుకొను నీవు నాతో యీ విధముగా మాట్లాడుట కెంత ధైర్యము'' శర్మిష్ఠకు కోపము ముంచుకు వచ్చి, ఆమె దేవయానిని గొట్టెను. ఆమె వస్త్రములను పట్టిలాగి, చేరువలోనే వాడుకలో లేని నూతిలోకి త్రోసివేసి, శర్మిష్ఠ తిరిగి నగరము చేరుకొనెను ''ఈ ముష్టి బ్రాహ్మణ స్త్రీ యిక చచ్చినట్లే'' యని శర్మిష్ఠ తనలో తాననుకొనెను ఇంటివద్ద జరిగిన విషయము ఆమె యెవరికినీ చెప్పకుండెను.

# 127 దేవయానిని రక్షించినరాజు

పురూరవ వంశములో జన్మించి ప్రఖ్యాతి పొందిన మహారాజు యయాతి. అతడు నహుషుని కుమారుడు. ఇంద్రుడు బ్రహ్మహత్యా పాపముతో ఇంద్రపదవిని తాత్కాలికముగా త్యజించినపుడు, నహుషుడు దేవతల కోరికపై ఇంద్రపదవిని చేబట్టి రాజ్యమును పుత్రుడైన యయాతికి అప్పగించెను. పురూరవునకు ఆయువను కుమారుడు గలడు. ఆయువు కుమారుడు నహుషుడు.

అందరి రాజుల వలె యయాతికి కూడ వేట యనగా ప్రీతి. అతడు వేటకై అరణ్యమునకు వచ్చెను. అతని అశ్వము అరణ్యములో చాల దూరము తీసుకుపోయెను. అతనికి అలసటచే దప్పిక కలిగెను. అతడు దూరములో నున్న నూతిని చూచి, అశ్వము నదలించగా అది బావి వద్దకు యయాతిని జేర్చెను. అతడు వంగి బావిలో చూడగా అందు నీరు లేకపోవుటచే వాడుకలో లేదని గ్రహించెను. అతడు విసుగుచెంది వెళ్ళబోవు సమయములో అతనికి దగ్గరలో నుండి వచ్చుచున్న మూలుగు వినిపించెను. ఆ మూలుగు బావిలో నుండి వచ్చుచున్నట్లు అతడు తెలుసుకొనెను. అతడు బావిలోకి వంగి చూడగా ఒక స్త్రీ కన్పించెను. ఆమె చాల అందముగా ప్రకాశించుచున్నట్లు అతనికి కన్పించెను. అతడు ఇరకాటపు పరిస్థితిలో చిక్కుకునెను. ఆమెకు సహాయ మత్యవసరమని గ్రహించెను. అతడు సరళముగా కరుణాపూరిత స్వరముతో యిట్లనెను. ''నీవెవరు? ఇక్కడ నుంచి సహాయము వర్ధించుచున్న నీ అందమైన చేతులను గాంచుచున్నాను. నీ చేతి వ్రేళ్ల గోరులు రాగి వలె యెర్రగా నున్నవి. నీవొక యువతివని తలంతును. నిన్ను బాధించునదేమి? ఎందుకు నీ నిట్టూర్పులు క్రోధము, విచారముతో నున్నవి? ఎండిపోయి గడ్డితో నిండిన యీ బావిలో నీవు యెట్లు పడినావు? నీవు యెవరి కుమార్తెవు? అగమ్య గోచరముగా నున్న యీ పరిస్థితిని వివరించి చెప్పుము''.

దేవయాని యిట్లనెను. ''అసురులకు దేవతలకు జరిగిన యుద్ధములో అసురులు గెలుచుచుండిరని నీవు వినియుందువు. మరణించిన అసురులను వారి గురువు శుక్రాచార్యుడు పునరుజ్జీవింప జేయుచుండెను. నేను ఆ శుక్రాచార్యుని కుమార్తెను. నీవు నాకు తెలియని పర పురుషుడవు. చూడగా యువకుని వలె అందముగా, శక్తిమంతుని వలె గోచరించుచున్నావు. నీవెవరు? ఎందుల కిచ్చటకు వచ్చితివి''.

యయాతి మహారాజు యిట్లనెను. ''నేను నహుష చక్రవర్తి కుమారుడను. నా పేరు యయాతి. చంద్ర వంశమునకు చెందిన వాడను. వేటాడగా అలసిపోయి దాహము తీర్చుకొనుటకు వచ్చితిని. బావిలో నీటి కొరకు రాగా నిన్ను చూచుట తటస్థించెను.

దేవయాని, తాను వివస్త్రనని చెప్పెను. ఆమె పరిస్థితికి రాజు విచారించి, తన యొడలిపై నున్న వస్త్రమును తీసి ఆమెకు అందునట్లు బావిలోనికి విసరెను. ఆమె ఆ వస్త్రమును ధరించి యిట్లనెను. ''ఇదిగో, నీవు వర్ణించినట్టే నా కుడిచేయి రాగి రంగు గోరులతో నున్నది. నీవు సత్పురుషుని వలె గోచరించుచున్నావు. నన్ను రక్షించుటకు విధి నిన్ను తీసుకువచ్చినట్లున్నది. నన్ను పైకి లాగి రక్షింపుము''. రాజు ఆమె కుడిచేతిని పట్టుకుని పైకి లాగెను. ఆమెను బావి నుండి బయటకు లాగి భూమిపై గూర్చుండబెట్టి యిట్లనెను. ''నీవు యిపుడు సురక్షితవుగా నున్నావు. నిస్సహాయముగా మరణింతునన్న భయము యిక లేదు. నీవు త్వరగా గృహము చేరుకొనగలవు''. దేవయాని కదలకుండెను. అతనివైపు చూచి ఆమె యిట్లనెను. ''నేను వెళ్ళు ప్రదేశ మింకేదియు లేదు. నేను నీతో వచ్చెదను''.

ఆమె మాటలకు యయాతి ఆశ్చర్యపడెను. అతడామెతో యిట్లు పలికెను. ''ఇంతకు ముందు నీవు శుక్రాచార్యుని కుమార్తెవని చెప్పితివి. ఇప్పుడు నీవు వెళ్ళుదగు ప్రదేశము లేదనుచున్నావు. నాకు యేమియూ బోధపడుటలేదు''.

''నీకు బోధపడుట లేదా?'' నవ్వుచు దేవయాని అడిగెను. ''నేను నీకు వివరించెదను. నేను అవివాహితను. నీవు నా కుడిచేతిని పట్టి లాగినావు. అందుచేత నీవు నాకు భర్తవైనావు. కాబట్టి నన్ను నీతో తీసుకువెళ్ళుట ఉచితము''.

యయాతి యిట్లు జవాబిచ్చెను. ''అది అసంభవము. నేను మహారాజును. క్షత్రియుడను. నీవు ఒక బ్రాహ్మణుని కుమార్తెవు. క్షత్రియుడు అగ్ర కులములో జన్మించిన వారిని పరిణయమాడుట అధర్మము''.

దేవయాని అతని మాటలను వినకుండెను. ఆమె యిట్లనెను. ''నిన్ను భర్తగా యెంచుకున్నాను. నీవు నన్నిపుడు నిరాకరించవచ్చు. కాని నా తండ్రి నిన్ను పిలువ నంపినపుడు, నీవు వచ్చి నన్ను చూడగలవు''. యయాతి ఆమెకు వీడ్కోలు చెప్పి తన నగరమున కేగెను.

## 128 దేవయాని పగ

దేవయాని ఒక చెట్టు క్రింద కూర్చుని యేడ్చుచుండెను. ఈ లోపుగా దేవయాని యింటికి రాకున్నందున శుక్రాచార్యుడు తన కుమార్తెను గురించి ఆందోళన పడుచుండెను. అప్పటికి సాయంకాలమయ్యెను. అతడు ఇక వేచి యుండలేకపోయెను. దేవయానిని వెదకి రమ్మని శుక్రాచార్యుడు సేవకురాలిని పంపెను. దేవయాని స్నేహితురాండ్రందరి యిళ్ళకూ వెళ్ళెను. కాని ఆమె జాడ తెలియలేదు. చివరకు వారందరు జలకమాడుటకు వెళ్ళిన నది వద్దకు వెళ్ళెను. అచ్చట ఒక చెట్టు క్రింద విచారించుచున్న దేవయానిని చూచెను. దేవయానిని సమీపించి ఆమె యిట్లడిగెను. ''ఏమి జరిగినది? ఎందుకేడ్చుచున్నావు? నీ కొరకు నీ తండ్రి ఆందోళన పడుచున్నాడు''. దేవయాని ఆమెతో శర్మిష్ఠకూ తనకూ జరిగిన వివాదమును తెలిపి యిట్లనెను. ''ఘూర్ణికా! నీవు వెళ్ళి నా తండ్రితో యిదంతయు చెప్పుము. ఆ రాక్షసి తండ్రి వృషపర్వుని నగరములో నేను కాలుబెట్టనని కూడ చెప్పుము''. ఆ సేవకురాలు తొందరగా శుక్రాచార్యుని వద్దకు వెళ్ళి జరిగిన విషయము పూసగ్రుచ్చినట్లు నివేదించెను. ఆమె సహజధోరణిలో జరిగిన దానికి కొంత కల్పనచేసి చెప్పుచు యిట్లనెను. ''ప్రభూ! దేవయాని అరణ్యములో నున్నది. ఆమె చచ్చిపడి యున్నది. రాజు కుమార్తె శర్మిష్ఠ ఆమెను చంపివేసెను''.

మతి చెడిన వానివలె శుక్రాచార్యుడు బయటకు వచ్చెను. దేవయాని మరణమునకు చింతించుచూ అరణ్యమునకు పరుగెత్తెను. ఆమె బ్రతికి యున్నట్లు కనుగొనెను. ఆమె ఒక చెట్టు నానుకొని యుండెను. తండ్రిని చూచిన దేవయాని బావురుమని విలపించెను. ఆమెను దగ్గరకు తీసుకుని మిక్కిలి ఆదరాభిమానముతో యిట్లనెను. ''ఇది వరలో నేను చేసిన యేదో ఒక పాపమునకు యీనాడీ విధముగా బాధపడుచున్నాను''. దేవయాని ఓర్పు కోల్పోయి యిట్లనెను. ''పాపమో, గీపమో, అది వేరే విషయము. అది అంత ముఖ్యమైనది కాదు. తండ్రీ! నా మాట వినుము. వృషపర్వుని కూతురు పలికిన అవమానపు మాటలు నేను మరువలేకున్నాను.

''తండ్రీ! నీవు మహారాజుకు స్తుతిపాఠకుడవనియు, అతనిని పొగడుట తప్ప వేరేమియు చేయనివాడవనియు ఆమె అన్నది. నేను ఒక స్తుతిపాఠకుని పుత్రికనని, నీవొక ముష్టివాడవని, రాజు యిచ్చు దాన ధర్మములు స్వీకరించుట తప్ప తిరిగి నీవేమియు చేయుటలేదని చాల యీసడింపుగా మాట్లాడెను. ఆమె యీ విధముగా మాట్లాడునపుడు ఆమెలో కొట్టవచ్చునట్లు కన్పించిన అహంకారము, క్రోధము నేను మరువలేను. ఈ విధముగా నన్ను సూటిపోటి మాటలని నూతి వద్దకు యీడ్చుకు వెళ్ళి నన్ను నూతిలోనికి త్రోసివేసి తాను వెళ్ళిపోయెను. తండ్రీ! నాకు సమాధానము చెప్పుము. నేను స్తుతిపాఠకుని కుమార్తెనా? ఒక ముష్టివాని పుత్రికనా?''

శుక్రాచార్యుడు అశ్రువులు కార్చుచు ప్రేమ పూర్వకముగా దేవయానితో నిట్లనెను. ''కుమారీ! నీవు ముష్టివాని కుమార్తెవు కావు. ముల్లోకములందు నీ తండ్రిని కీర్తించుచుందురు. అంతేగాని నీ తండ్రి యెవరినీ పొగడడు, లోకములో అందరు రాజులు, వృషపర్వుడు, ఇంద్రుడు, యయాతి, మున్నగువారు జ్ఞానమే నా సంపదయని, లోకములో అందరికన్న నేను సంపన్నుడనని యెరుగుదురు''.

దేవయాని యిట్లనెను. ''అట్లయినచో, శర్మిష్ఠ పలికిన పలుకులకు నేను ఆమెను క్షమించలేను. గౌరవములేని ప్రదేశమందుండుటకు నా కిష్టము లేదు. నేను నగరములో ప్రవేశించను''. తండ్రి ఆమెకు యెంతగానో నచ్చజెప్ప జూచెను. క్రోధము తగదని, ఉదారముగా నుండవలెనని తెలియజెప్ప ప్రయత్నించెను. కాని ఆమె వినకుండెను.

శుక్రునికి కుమార్తెయే సర్వస్వము. అతడు మరుచటి రోజు ఉదయము వృషపర్వుని వద్దకేగి ముందురోజు జరిగిన దుస్సంఘటనను వివరించి ఇట్లనెను. ''నా కుమార్తె సంతోషము తప్ప నాకు వేరే కోరిక లేదు. ఆమె వెళ్ళుచోటునకే నేను కూడ వెళ్ళెదను. ఆమె లేక నేను జీవించలేను''. వృషపర్వుడు శుక్రాచార్యుని వెంటబెట్టుకుని త్వరగా అరణ్యము చేరి దేవయానిని సముదాయించుటకు ప్రయత్నించెను. ఆమె పాదములపై బడి వృషపర్వు డిట్లనెను. ''నా సంపద, కీర్తి, శక్తి నీ తండ్రి అనుగ్రహముచే కల్గినవి. అతడు నన్ను విడిచి పెట్టి వెళ్లినచో నేను ఆత్మహత్య చేసుకొనవలసి యుండును. నాకు వేరు మార్గము లేదు. దయచేసి అతడు నా వద్ద ఉండునట్లు కరుణించుము. నీవు యేది ఆజ్ఞాపించిన అది చేయుటకు సిద్ధముగా నున్నాను''. దేవయాని కొంతసేపు యోచించి యిట్లనెను. ''నీ కుమార్తె, మరొక వేయి మంది సేవికలతో కలసి నాకు దాసిగా నుండవలెను. నేను వెళ్ళుచోటుకు వారు నాతో దాసీలుగా వచ్చి యుండవలెను. నాకు యెవరో ఒకరితో వివాహము జరిగి వెళ్ళునపుడు నీ కుమార్తె నాతో దాసిగా అనుసరించవలెను''.

వృషపర్వుడు తన సేవికలలో ఒకరిని పంపి కుమార్తెను రప్పించెను. బ్రాహ్మణ పుత్రిక దేవయాని విధించిన షరతులన్నిటినీ రాకుమారి శర్మిష్ఠకు తెలియజేసెను. ఆమె అయిష్టతను సూచించు ఒక్క పలుకైననూ పలుకలేదు. ఆమె పరిచారకు లందరినీ కూడగట్టుకుని మౌనముగా తండ్రి సముఖమునకు వచ్చెను. ఆమె దేవయానిని సమీపించి సరళముగా నిట్లనెను. ''నేను దాసిని. ఈ పరిచారికలందరు నాతో వచ్చిరి. నీవు వెళ్ళు ప్రదేశమునకు నిన్ను అనుసరించి రాగలము''.

దేవయాని ఆమెను చూచి యేవగింపు స్వరముతో యిట్లడిగెను. ''పొగడ్తలందుకునే వాని కుమార్తె ఒక స్తుతిపాఠకుని కుమార్తెకు దాసిగా యెట్లు రాగిలదు? ఇది సంభవమా?''

శర్మిష్ఠ అదే స్వరముతో సరళముగా యిట్లు జవాబిచ్చెను. ''తనవారు క్లిష్ట పరిస్థితులలో నుండి విచారించునపుడు, వారి బాధలు, విచారము సమసిపోవుటకు ప్రయత్నించుట వారి కర్తవ్యము. పురాణ కాలములో యిట్లు చేయుట ధర్మమని చెప్పియున్నారు. ఈ ధర్మము ప్రతి మానవునికి వర్తించగలదు. ఈ ధర్మము ననుసరించుట రాజుకు అతని పిల్లలకు అత్యంత ప్రధానము. నా మూలముగా నా తండ్రికి ప్రజలకు యిక్కట్లు కలుగుట నాకిష్టము లేదు. కాబట్టి నేను నీకు బానిసగా నుండి విధేయురాలనై నీవు యెచ్చటకు వెళ్ళిననూ అనుసరించి వచ్చెదను.

దేవయాని తండ్రితో యిట్లనెను. ''తండ్రీ! నాకు సంతృప్తి కలిగినది. ఇక మనము నగరమునకు వెళ్ళుదము''.

ఎవరి ఆలోచనలలో వారుండిరి. వారందరు నగరము ప్రవేశించిరి. దేవయాని పంతము నెగ్గెను. ఆమె తన పంతము నెగ్గించుకున్నందుకు శుక్రుడు సంతోషించెను. వృషపర్వుడు మాత్రము విచారముగా నుండెను. రాజునకు గురువు అతి ప్రధానమైనవాడు. గురువైన శుక్రుడు విడిచి వెళ్ళనందుకు రాజు మనసు కొంత ఊరట జెందెను. శర్మిష్ఠ మనస్సులోని ఆలోచనలు యెవరికిని అంతుబట్టనివి. ఆమె కనులు దించుకుని యున్నప్పటికి, ఆమె ముఖమందు ప్రశాంతత గోచరించుచుండెను. తండ్రి యెడల ఆమెకుగల విశేషమైన ప్రేమ చేత, ఆమె యేది చేయుటకైనను సంసిద్ధురాలయ్యెను.

## 129 యయాతి దేవయానిని వివాహమాడుట

అనేక దినములు గడచెను. ఒకరోజు, శర్మిష్ఠాది పరిచారికలతో గూడి అరణ్యమునకు వెళ్ళెను. వారు తమ శత్రుత్వమును మరచిపోయినట్లు గోచరించెను. అరణ్యములో వారు ఆడుచూ, పాడుచూ, నాట్యము చేయుచు గడపిరి.

ఆ అరణ్యమునకు మరల హస్తినాపుర రాజు యయాతి వచ్చెను. దూరము నుండి స్త్రీ సమూహమును జూచెను. తరువాత వారికి దగ్గరగా వచ్చెను. వారిలో యిద్దరు అందముగా నుండుట అతడు గమనించెను. వారిని నిదానముగా చూచిన తర్వాత, ఆ యిద్దరిలో నొకరిని తానిదివరకు చూచినట్లు గ్రహించెను. ఆమె, తాను నూతి నుండి రక్షించిన బ్రాహ్మణ వనిత. ఆనాటి సంఘటన గుర్తుకు వచ్చి తనలోతాను నవ్వుకొనెను. ఆనా డామె కుడిచేయి పట్టుకుని లాగుటచేత, తనను భార్యగా స్వీకరించమనెను. ఆమె నిజముగా అందమైనదే. కాని రెండవ ఆమె కూడ ఈమె అందమునకు సరితూగగిలదు!

దేవయాని మణిఖచితాసనముపై గూర్చుండుట యయాతి గుర్తించెను. అందముగా నున్న రెండవ ఆమె శరీరముపై ఆభరణములు లేకుండుట అతడు గమనించెను. ఆమె దేవయాని పాదముల వద్ద కూర్చుని పాదముల నొత్తుచుండెను. ఆమె యెవరో తెలుసుకొనుటకు కుతూహలుడై, పూర్వ పరిచయమును పురస్కరించుకొని దేవయానిని సమీపించి ఆమెతో సంభాషించెను. అతడు అపరిచితునివలె నటించెను. అతడిట్లనెను. ''వేయి మంది వనితల మధ్య మీరిద్దరూ యితరులపై పెత్తనము చలాయించుచున్నట్లు గోచరించుచున్నది. నాలో కుతూహలము రేగెను. మీరెవరో తెలుసుకొనవచ్చునా?'' దేవయాని యిట్లు బదులు చెప్పెను. ''నేను

చెప్పెదను, జాగ్రత్తగా వినుము. అసుర గురువు శుక్రాచార్యునకు ఒక కుమార్తె గలదు. నేను అతని కుమార్తెను. ఈమె నాకు పరిచారకురాలు, నాకు బానిస. ఈమె నేనెక్కడ యుండిన అక్కడ ఉండును. అసుర రాజు వృషపర్వుని కూతురు యీమె''.

యయాతి అప్రయత్నముగా యిట్లనెను. ''ఆహా! ఏమి యీమె సౌందర్యము! స్వర్గములోని అప్సరసలుగాని, గంధర్వ కిన్నర వనితలుగాని యీమె అందమునకు సాటి రారు. ఇక మానవులలో యిటువంటి అందకత్తెను చూడలేదు. పద్మములవంటి ఆమె నేత్రములు లక్ష్మీదేవి నేత్రములు వలె విశాలముగా నున్నవి. ఆమె సౌందర్యము సంపూర్ణమైనది. రాజ భవనములో నుండవలసిన యీ రాకుమార్తె యేదో ముని శాపమునకో, దేవతల శాపమునకో తప్పక గురి అయి ఉండవచ్చును. లేకపోయిన, ఆమె నీకు బానిసగా నుండుటెట్లు సంభవము?'' దేవయాని, అతడు శర్మిష్ఠ అందమును పొగడుచు పలికిన మాటలు వినెను. అవి యీమె కిష్టము లేకుండెను. ఆమె యిట్లనెను. ''ఈ లోకములో అన్నియు విధి ననుసరించి జరుగును. ఇది కూడను విధికృతమే యని తలచి ఆ విషయముపై ఆలోచనను విరమింపుము. నీవెవరో దయచేసి చెప్పుము. నీవు మహారాజువలె దుస్తులు ధరించినావు. చూడగా చక్కగ చదువుకున్న వానివలె గోచరించుచున్నావు. నీ పేరేమి? నీవెక్కడ నుంచి వచ్చితివి? నీవెవరి కుమారుడవు? దేనికొరకు నీవిక్కడకు వచ్చితివి?''

దేవయాని అహంభావముతో అడిగిన ప్రశ్నలకు తనలో తాను నవ్వుకుని, ఆమె తలంపులకు అనుగుణంగా నటించి ప్రదర్శించవలెనని తలచెను. అతడిట్లు పలికెను. ''నేను విద్యార్థిగా నున్నపుడు వేదశాస్త్రములు అధ్యయనము చేసితిని. నేను ఒక రాజును, ఒక చక్రవర్తి కుమారుడను. నేను చంద్రవంశములో ప్రసిద్ధిపొందిన యయాతి మహారాజును''. దేవయాని యిట్లడిగెను. ''ఏదైన ప్రత్యేక కార్యముపై యీ అరణ్యమునకు వచ్చితివా? శత్రువు నెవరినైనా జయించుటకు వచ్చితివా, లేక వేటయం దాసక్తి నిన్నీ అరణ్యమునకు తీసుకువచ్చెనా?'' యయాతి యిట్లు సమాధాన మిచ్చెను. ''నీ ఊహ సరియైనది. నేను వేటకై వచ్చితిని. నాకు దాహము కలుగుటచే నీ పరిచారికా బృందమును సమీపించితిని. దప్పిక తీర్చుకొని సేద తేరుటకు నీ వద్దకు వచ్చితిని. నన్ను గురించి సంపూర్ణముగా తెలుసుకున్నావు. నేనేమి చేయవలెనో చెప్పుము''.

దేవయాని యిట్లనెను. ''నిన్ను నా భర్తగా యెంచుకున్నాను. నన్ను నీ భార్యగా స్వీకరించుట కంగీకరిపుము''. యయాతి నేత్రములు శర్మిష్ఠ అందమును గ్రోలుచుండెను. శర్మిష్ఠ తన భార్య కావలెనని యయాతి తలంచెను. దేవయాని సూచనకు అతడు నిశ్చేష్టుడై యిట్లనెను. ''నేను నిన్ను వివాహమాడుట ఉచితము కాదు. నేను క్షత్రియుడను. నీవు బ్రాహ్మణ వనితవు, ఉత్తముడుగా పేరు గాంచిన శుక్రాచార్యుని పుత్రికవు. అవివాహితవైన నీతో నేనిట్లు సంభాషించుట నీ తండ్రి అంగీకరింపక పోవచ్చునని నా భయము. ఏ పురుషుడును, మరొకరి భార్యనుగాని, కుమారుని భార్యనుగాని, ఉత్తమ కులమునకు చెందిన స్త్రీనిగాని, స్వగోత్ర సంభవయైన స్త్రీనిగాని, సోదరినిగాని, పేద స్త్రీ, లేక రోగముతో బాధపడుచున్న స్త్రీనిగాని సమీపించుట అనుచితమని జ్ఞానులందురు. అందుచే నీ మాటలను నేను స్వీకరించలేను''.

దేవయాని ఓర్పును కోల్పోయి యిట్లు పలికెను. ''నాకును శాస్త్ర జ్ఞానము కలదు. బ్రాహ్మణులు క్షత్రియ కన్యలను వివాహమాడిన సందర్భములు నేనెరుగుదును. క్షత్రియులు బ్రాహ్మణ కన్యలను వివాహమాడిన సందర్భము లనేకము కలవు. ఈ రెండు సుమారుగా ఒకటియే. ఈ రెండు వర్ణముల మధ్య యెక్కువగా తర తమ భేదము లేదు. నీవు నహుషుని కుమారుడవు, అనగా నీవు ఒక ఋషి కుమారుడవు. నీ భార్యగా

నన్ను గైకొనుము''.

వారిద్దరు యిట్లు మాట్లాడుకొనుచు మిగిలిన వారికి దూరముగా సంచరించుచుండిరి. దేవయాని మరల యిట్లనెను. ''నేను నూతిలో నిస్సహాయస్థితిలో నున్నపుడు నీవు వచ్చి నా కుడిచేయి పట్టుకుని బయటకు లాగితివి. నీవు పట్టిన నా కుడిచేతిని యే బ్రాహ్మణ యువకుడు ముందుకు వచ్చి చేబట్టగలడు? ఆనాడే నీవు నా భర్తవని నా నిశ్చయమును తెలిపియున్నాను''.

యయాతి మరొక కారణము చూపుటకు ప్రయత్నించి యిట్లనెను. ''బ్రాహ్మణుని ఆగ్రహశక్తియెంతటిదో నీకు తెలియనట్లు తోచుచున్నది. క్రుద్ధసర్పము విషముగాని, వాడి ఆయుధములచే కలుగుబాధగాని, మంటలు చుట్టుముట్టినపుడు కలిగే నిస్సహాయ స్థితిగాని, బ్రాహ్మణుని ఆగ్రహావేశముచేత కలిగే ప్రమాదమునకు సాటి రావు''.

''క్రోధావిష్టుడైన బ్రాహ్మణుడెవరు?'' ప్రేమలో పడిన దేవయాని ఆక్రోశించెను. ''నీ మాటలు నాకర్థ మగుటలేదు''.

యయాతి యిట్లనెను. ''పాము తనకు హాని తలపెట్టినపుడు మాత్రమే యెదుటివారిని కరచును. ఆయుధమును ప్రయోగించినపుడే అది యెదుటివారికి బాధ కలిగించును. కాని బ్రాహ్మణుని ఆగ్రహము వ్యక్తిని, అతని రాజ్యమును, సేనా బలమును సంపూర్ణముగా నాశనము గావించును. నిన్ను వివాహమాడగలనని మాట నీయజాలను. ఎందుకనగా నీ తండ్రి నన్ను నా తరువాతి తరము వారిని కూడ శపించలగడు. నీ తండ్రి స్వయముగా నిన్ను నాకిచ్చి వివాహము చేసిన తప్ప నేను నీ ప్రేమ నంగీకరించలేను''. ఈ మాటలు విన్న దేవయాని వదనము సంతోషముతో వికసించెను. ఆమె యిట్లనెను. ''నీవు ఆ విషయమై భయపడవలసిన పని లేదు. కొంచెముసేపు ఆగుము. నా తండ్రిని కలుసుకొనుము''. ఆమె పరిచారికను పిలిచి ''వెంటనే వెళ్ళి మా తండ్రిని పిలుచుకుని రమ్మ'' అని చెప్పి పంపెను.

వెంటనే శుక్రాచార్యుడు వచ్చెను. మిక్కిలి తేజస్సుతో ప్రకాశించుచున్న శుక్రాచార్యుని చూచినంతనే యయాతి శుక్రుని పాదములపైబడి అతని పాద ధూళిని శిరస్సు నందుంచుకుని యిట్లనెను. ''నేను నహుషుని కుమారుడను. నా పేరు యయాతి''.

దేవయాని తండ్రి వదనమందు వింత దృక్కులను చూచి యిట్లనెను. ''తండ్రీ! నీకు జ్ఞాపక మున్నదా? ఆరోజు నేను నూతిలో పడినపుడు ఆ రోజంతయు నీవు నా కొరకు వెదికినావు. నీవు నేనొక చెట్టు క్రింద కూర్చుండగా చూచినావు. అపుడు, ఒక ఉదారపురుషుడు వచ్చి నన్ను బయటకు లాగి రక్షించినాడని చెప్పినాను. జ్ఞప్తియున్నదా? ఈతడే ఆ ఉదార పురుషుడు. ఇతడు నా కుడిచేయు పట్టుకుని నూతి అట్టడుగు నుండి బయటకు లాగెను.

''ఇది వరకెవరును నా కుడిచేయిని పట్టుకొనలేదు. నన్ను యితనికిచ్చి వివాహము చేయమని కోరుతు న్నాను. నా భర్తగా యితనిని యెంచుకున్నాను''.

శుక్రుడు సంతోషించినట్లు కన్పించుటకు ప్రయత్నించెను. అతడిట్లనెను. ''అతడు క్షత్రియుడు. నీవు బ్రాహ్మణ స్త్రీవి. మీరిద్దరు వేరు కులములకు చెందినవారు. బ్రాహ్మణ క్షత్రియ ధర్మములు వేరు. ఇది

నాకు ఆందోళన కలిగించుచున్నది. కాని, కుమారీ! నీవు అతనిని భర్తగా యెంచుకున్నావు. నీ కోరికను నెరవేర్చెదను''.

శుక్రుడు యయాతివైపు తిరిగి యిట్లనెను. ''ఆమె నిన్ను వరించినది. ఆమెను నీవు రాణిగా స్వీకరించవచ్చును. ఆమెను నీకు కన్యాదానము చేయుట నా కంగీకారమే. నాపుత్రికను చేబట్టుము''.

యయాతి యిట్లనెను. ''ఓ భార్గవా! నీవు చాల ఉత్తముడవు. కాని నాకు సంకోచము కలుగుచున్నది. ఈ విధముగా వివాహమాడుట అధర్మమని తోచుచున్నది. జాతి సంకరము మహాపాపము. ఇట్టి పాపము చేయుట నా కిష్టములేదు. అందుచేతనే నేను సంకోచించుచున్నాను''. యయాతి పలుకులు శుక్రునికి ప్రీతికలిగించెను. అతడిట్లనెను. ''ఈ వివాహము వలన నీకెట్టి పాపము కలుగదు. దేవయానిని భార్యగా స్వీకరించు. నీపై ఆమెకు యెనలేని ప్రేమ గలదు. ఆమె నిన్ను సుఖపెట్టగలదు''

అపురూపమైన దూరదృష్టితో శుక్రుడు రహస్యముగా యయాతితో నిట్లు పలికెను. ''నా కుమార్తెతో నున్న యువతి శర్మిష్ఠ. ఆమె వృషపర్వుని కుమార్తె. ఎట్టి పరిస్థితులలోను నీవు ఆమెను ప్రేమించుటగాని, ఆమె గురించి ఆలోచించుట గాని చేయ తగదు. దేవయానిని తీసుకువెళ్ళి ఆమెను సుఖపెట్టుము''. ''ఆమెను సుఖపెట్టుటకు ప్రయత్నించెదను'' అని యయాతి బదులు చెప్పెను.

దేవయాని—యయాతి వివాహము శాస్త్రోక్తమైన విధులతో జరిగెను. యయాతి దేవయానిని తన రాజ్యమునకు తీసుకువెళ్ళెను. ఆమెతో శర్మిష్ఠ, మిగిలిన వేయి మంది పరిచారికలు కూడ వెళ్ళిరి.

## 130 శర్మిష్ఠ

యయాతి దేవయానిని అంతఃపురమునకు తీసుకువెళ్ళెను. ఆమె అచట సుఖముగా నుండెను. ఆమెతో వచ్చిన శర్మిష్ఠ అశోకవనములో నిర్మించిన చిన్న గృహములో నివసించుచుండెను. అశోకవనము రాజ సౌధమున కానుకొని యుండెను. దేవయాని యిదివరకు విధించిన షరతుల ప్రకారము వేయిమంది పరిచారికలు కూడ వచ్చిరి. యయాతి దేవయానితో సుఖముగా కాలము గడపుచుండెను. కొంతకాలమునకు వారికొక పుత్రుడు కలిగెను.

ఒకరోజు శర్మిష్ఠ అశోకవనములో సంచరించుచుండెను. ఆమె హృదయమంతయు విచారముతో నిండి యుండెను. ఆమె తన విధికి వగచుచుండెను. తనను దేవయానితో పోల్చి చూచుకొనెను; దేవయానికి అందమైన భర్త, ముద్దులు గొలిపే కొడుకు నుండిరి. దేవయాని స్త్రీత్వము సఫలమయ్యెను. శర్మిష్ఠ యింకను కన్యగానే మిగిలిపోయెను. చిన్నతనములో చేసిన చేష్టలకు పర్యవసానముగా యిట్లు జరిగెను కదాయని ఆమె తలపోయు చుండెను. జరిగిన దానిని తలచుకుని లాభము లేదు, కాని ఆరోజు యెందులకో ఆమె మిక్కిలి విచారముగా నుండెను. అశోకవనములో ఒక చెట్టు నానుకుని ఆమె నిలిచియుండెను. ఆమెలో ఆలోచనలు విచ్చలవిడిగా వెల్లి విరియుచుండెను. ఆ చెట్టు బాగుగా వికసించి యుండెను. చెట్టు కొమ్మలకు నారింజ పూవులు మొగ్గలు గుత్తులు గుత్తులుగా క్రమ్ముకొని యుండెను. ఆమె చెట్టు నానుకుని నిలబడి చేతులతో కొమ్మలను

తాకుచుండెను.

యయాతి అశోక వనమునకు కాకతాళీయముగా వచ్చెను. అతడు, శర్మిష్ఠ చెట్టు నానుకుని యుండుట జూచెను. చాలసేపు అతడక్కడే నిలిచి యుండి ఆమెను చూచుచుండెను. ఇంత అందమైన యువతిని అతడిదివర కెన్నడును చూడలేదు. చాల కాలము క్రితము దేవయానితో వివాహము జరుగక మునుపు, ఆమె యందు ప్రేమ కలిగి యుండెను. అతడు భార్య దేవయానితో సుఖించుచుండెను. కాని అతని హృదయము శర్మిష్ఠకు అంకితమైనది. శుక్రాచార్యుడు హెచ్చరిక చేయుటబట్టిగాని, లేకున్నచో యెన్నడో ఆమెను వివాహమాడి యుండెడివాడు. అతడు చాల ధర్మపరాయణుడు. చేసిన వాగ్దానమును భంగపరచుట అతని కిష్టము లేకుండెను. బ్రాహ్మణుని ఆగ్రహమునకు గురికాగలనేమోనను భయము కూడ కలదు. ఈ కారణముచేత శర్మిష్ఠపై ప్రేమ గురించి యెన్నడును ఆలోచించలేదు. ఈరోజు ఆమెను ఒంటరిగా చూచుట తటస్థించెను. ఆమె అందము అతనిని ముగ్ధుని చేయుచుండెను. అతడు కదలక స్తంభించినట్లు అచ్చటనే నిలుచుండెను.

శర్మిష్ఠ ప్రక్కకు తిరిగెను. కొద్ది దూరములో రాజు నిలబడి యుండుట ఆమె జూచెను. కొలది మాసములుగా ఆమె అతనిపై ప్రేమను పెంచుకొనెను. ఆరోజు అరణ్యములో దేవయాని పాదము లొత్తుచున్నప్పుడు అతడు వచ్చినప్పటి నుండి ఆమెకు అతనిపై ప్రేమ కలిగెను. అతని చూపులను బట్టి అతనికి తనపై ప్రేమ కలదని ఆమె గ్రహించెను. కాని దేవయాని అతనిని భర్తగా యెంచుకొనెను. నూతన దంపతులతో తాను యీ రాజ్యమునకు వచ్చెను. ప్రతిదినము రాజును చూచుచు — అతని గురించిన ఆలోచనలతో సతమత మగుచు బాధపడుచుండెను.

ఆమె అతనిని చూచి, చేతులు జోడించి నమస్కరించెను. ఇద్దరు అక్కడే కొంతసేపు నిలుచుండిరి. తరువాత ఆమె యిట్లనెను. ''నీవు మహారాజువు, దైవమువలె, నీపై ఆధారపడినవారి ప్రార్థనలను విని వాటిని ప్రసాదించుచున్నావు. నాకొక సహాయము చేయగోరుచున్నాను''.

''ఏమిటి నీ కోరిక?'' అనునట్లుగా రాజు కనురెప్పలను పైకెత్తెను. ఆమె యిట్లనెను. ''నన్ను నీ భార్యగా గైకొనుము''.

యయాతి యిట్లనెను. ''నీవెవరో నేనెరుగుదును. నీవు వృషపర్వుని కుమార్తెవు. నా భార్యతో పరిచారికగా వచ్చినావు. నిన్ను చూచినప్పటి నుండి నేను మరువలేకున్నాను. నీవు చాల అందమైన దానవు. నీకు సాటియైన వారు లేరు. కాని శుక్రాచార్యుడు నీపై యెట్టి ఆలోచనలు పెట్టుకొలవలదని నన్ను హెచ్చరించెను. అతనికి వాగ్దానము చేసియుండుటచే యింతవరకు నీకు నేను దూరముగా ఉంటున్నాను.

శర్మిష్ఠ నవ్వి యిట్లనెను. ''శాస్త్రములతో మిక్కిలి పరిచయమున్న మీ వంటి వారికి అయిదు సందర్భములలో అసత్యము లాడవచ్చునన్న విషయము తెలియదా? పరస్పరము ఒక స్త్రీ ఒక పురుషుడు ప్రేమించుకున్నప్పుడు పురుషుడు అసత్యము పలుకవచ్చునని, అని నేళాకోళముగా మాత్రమే యెంచవలెనని అందురు. పురుషుడు స్త్రీని చేబట్టునపుడు అసత్యము లాడుట అధర్మము కాదు. అవి అసత్యములుగా పరిగణింపరు. వివాహ సమయమందు అసత్యములాడుట అనుచితము కాదు. ప్రాణమునకు ముప్పు సంభవించి నపుడు, ప్రాణ రక్షణ కొరకు అసత్యమాడుట దోషము కాదు. సంపద గోల్పోవుచున్నపుడు అసత్యము లాడవచ్చును. ఈ సందర్భముగా అసత్యము పలికిన అది అధర్మ మనిపించుకొనదు.

''ప్రభూ! నీ భార్యకు నేను దాసినను. ఆమెకు చెందినది మీకు కూడ చెందును ఆ విధముగా మీకు నేను యిది వరకే చెంది యున్నాను కాబట్టి నన్ను స్వీకరింపుడు. ప్రతిరోజును నగర వీధులలో 'ఎవరేది కోరిననూ నేను దానిని ప్రసాదింతును' అని ప్రకటించుచున్నారు. అది అసత్యమును ప్రకటించుటకాదు గదా'' రాజు చిరునవ్వు నవ్వి అంగీకారము సూచించెను క్షత్రియులకు వర్తించు గాంధర్వ పద్ధతిలో వారు భార్యాభర్తలైరి.

కొంతకాలమునకు వారికొక కుమారుడు జన్మించెను శర్మిష్ఠతో రాజు సుఖముగా గడపుచుండెను. అతడు తనలో తానిట్లు తలంచెను. ''రాజ్యమునకు సంపద యెట్లో, మోడువారుచున్న మొక్కలకు వర్షపు నీరు యెట్లో, దేవతలకు అమృతము యెట్లో, యీమె నాకట్లున్నది. ఈ శర్మిష్ఠ అందాలరాశి, నా సుఖము కొరకే జన్మించినట్లున్నది''.

శర్మిష్ఠకు కుమారుడు జన్మించెనని వినిన దేవయానికి, ఆమె భర్త యెవరై యుండురాయను కుతూహలము జనించెను ఆమె ఊహించుటకు ప్రయత్నించెను చివరకు ఉండబట్టలేక, శర్మిష్ఠ వద్దకు వెళ్ళి సూటిగా ఆమె నడిగెను. ''ఏమిటి నీవు చేసినది? కామమునకు దాసినవై మాన మర్యాదలను మరచినావా? ఎవరు నిన్ను చేబట్టి తల్లిని గావించినారు? ఇటువంటి సిగ్గుమాలిన పని నీవెట్లు చేసితివి?'' రాకుమారి శర్మిష్ఠ యిట్లనెను ''అదృష్టవశాత్తు ఒక ఋషి వచ్చుట తటస్థించెను నేను అవివాహిత కన్యనని నీకు తెలుసు. అది పాపము. వివాహము కాని స్త్రీ, సంతానములేని స్త్రీ జీవితము వ్యర్థమని శాస్త్రములు చెప్పుచున్నవి. తరువాత జన్మలో కూడ వారి జీవితము వ్యర్థమేయగును. అందుచేత నేనతనిని నాకు పాప విముక్తి కలిగించమని కోరినాను. అదీ జరిగిన సత్యము నన్ను పురికొల్పినది పాప భయము కాని, కామవాంఛ కాదు

''అట్లయినచో నీవు చేసినది చాల సముచితముగానే యున్నది'' అని రాణి దేవయాని పలికెను. ''ఇందులో తప్పేమియూ లేదు. ఆ ఋషి యెవరో చెప్పుము అతని పేరేమి? గోత్రమేమి?

''సూర్యుని తేజస్సుతో సమానమైన తేజస్సు గలవాడు'' అని రాకుమారి పలికెను ''అతని శక్తి సౌశీల్యము నన్ను ముగ్ధుని గావించెను అతని పేరు గోత్రము అడుగలేకపోతిని''

ఆమె సమాధానము దేవయానికి సంతృప్తి కల్గించకుండెను కాని దేవయాని ఆ విషయమై యెక్కువగా ఆలోచించలేదు. ఆమె అంతఃపురమునకు వెళ్ళిపోయెను. శర్మిష్ఠ గండము గడిచినట్లు భావించి నిట్టూర్చెను.

దేవయానికి యిద్దరు పుత్రులు కలిగిరి వారు — యదు, తుర్వసులు తండ్రివలె వారు అతి సౌందర్యముగా నుండిరి రాజభవనములో అందరకును వారు ముద్దుల బాలురైరి

దేవయాని మద్యపానమున కలవాటుపడెను మైకములో భర్తను పరుషవాక్కులతో దూషించుచుండెను తరుచుగా ఆమె యేడ్చుచుండెను. ఒకొక్కపుడు గానము, నాట్యము చేయుచుండెను. ఒల్లు తెలియని స్థితిలో ఆమె యిట్లనుచుండెను. ''నిర్జనమైన యీ అరణ్యమునకు నీవెందుకు వచ్చితివి? రాజు వేషము ధరించి యేల నా వద్దకు వచ్చెదవు? నీవు బ్రాహ్మణుడవు, కాని రాజ వస్త్రాలంకారములను ధరించితివి నా భర్త యయాతి పురుషులందరిలో శ్రేష్ఠుడు. అతడు నిన్ను చూచినచో ఆగ్రహించును వెంటనే యిక్కడినుండి వెళ్ళిపో''.

తన సమక్షము నుండి రాజు వెళ్ళిపోవునట్లు ఆమె చరించుచుండెను ఆమెను తిరిగి పూర్వపు దేవయాని

వలె చేయుటకు ప్రయత్నించెను. కాని అతని ప్రయత్నములు విఫలమయ్యెను. ఆమె మైకములో నున్నపుడు కనిపెట్టి జాగ్రత్తగా చూచుటకు పాత పరిచారికలను నియమించెను. ఆమె ప్రస్తుత పరిస్థితిని తన స్వార్థము కొరకు వినియోగించదలచెను. ఆమె మద్యము యెక్కువగా సేవించునట్లు ప్రోత్సహించుచుండెను. ఆమెకు కావలిగా వికలాంగులైన పరిచారికలను యేర్పరచెను. ఆమె బాగుగా మైకములో నున్నపుడు, అక్కడ నుండి తప్పించుకుని, అశోకవనము వెళ్ళి, తన ప్రియమైన శర్మిష్ఠతో గడుపుచుండెను.

ఇట్లు చాలకాలము దేవయానికి తెలియకుండ గడచెను. శర్మిష్ఠకు ముగ్గురు కుమారులు కలిగిరి. వారు — ద్రుహ్యుడు, అనువు, పూరువు అనువారు.

ఒకరోజు దేవయాని రాజుతో అశోకవనమునకు వెళ్ళెను. అక్కడ ఆ ముగ్గురు బాలురు ఆడుకొనుచుండగా ఆమె చూచెను. వారి అందమున కచ్చెరువంది, రాజుతో ఆమె యిట్లనెను. ''నాథా! వారెంత అందముగా నున్నారో చూడుము! వారెవరై యుందురు? స్వర్గలోకము నుండి వచ్చినట్లు కన్పించుచున్నారు. వారి అందము అసమానమైనది. గమనించి చూడగా, వారిలో నీ పోలికలు కానవచ్చుచున్నవి''.

అతని వద్ద నుండి యెట్టి సమాధానము లేకపోవుటచే, ఆమె ఆ బాలురను సమీపించి, వారితో నున్న పరిచారికను 'యెవరు వీరు' అను కుతూహలము తెలుపు దృక్కులతో చూచెను. ఆ పరిచారిక నవ్వి యిట్లనెను. ''బాలకులారా! ఈమె మీరెవరో తెలుసుకొన గోరుచున్నది. ఆమెకు చెప్పండి''. ఆటలాడుచున్న ఆ బాలురు దేవయానిని చూచి యిట్లనిరి ''మా తండ్రి ఒక ఋషి, అతడు రెండు కులములకు చెందినవాడని మా తల్లి చెప్పెను. మా తల్లి శర్మిష్ఠ''.

దేవయాని తనను తాను సముదాయించుకుని యిట్లడిగెను. ''మీ తండ్రి పేరేమి? అతడే గోత్రమునకు చెందినవాడు? అతడెక్కడ ఉండునో తెలియునా?'' వారు దేవయానివైపు చూచి, దూరముగా నిలుచుని యున్న యయాతిని చూపుడు వ్రేలుతో చూపిస్తూ ''అతడే మా తండ్రి'' యని పలికిరి.

## 131 దేవయాని ఆగ్రహము, శుక్రశాపము

దేవయాని ఆ బాలురను తనతో తీసుకువెళ్ళి రాజు ముందు నిలబెట్టెను. యయాతి, దేవయానికి అప్రియము కలిగించుటకు భయపడి, ఆ బాలురవైపు చూడకుండెను. ఈ విధమైన తండ్రి వైఖరిని ఆ బాలురు యిదివరలో చూడనందున, వారు తమ తల్లివద్దకు వెళ్ళి యేడ్వసాగిరి. వారు తల్లితో యిట్లనిరి. ''అమ్మా! నాన్నగారి ప్రవర్తన యీరోజు విడ్డూరముగా నున్నది. మమ్ములను పలుకరించి మాట్లాడలేదు'' శర్మిష్ఠ బయటకు వచ్చి దూరముగా నున్న రాజును చూచెను. అతనితో మహారాణి దేవయాని ఉండుట ఆమె చూచెను.

దేవయాని అంతయూ గమనించుచుండెను. ఆమె కిప్పుడు అంతయు బోధపడెను. ఆమె రాజువైపు మరల చూచెను. అతడు మౌనముగా నిలిచి యుండెను. అతడు తలదించుకుని సిగ్గుతో కుచించుకుపోయెను.

దేవయాని శర్మిష్ఠ వద్దకు వెళ్ళి ఆమె చేతిని మొరటుగా తన చేతితో లాగి యిట్లనెను. ''చాల కాలము క్రిందట నీ పుత్రుని తండ్రి యెవరని అడిగినపుడు ఒక ఋషి అని చెప్పి నన్ను మోసగించినావు. ఆ 'ఋషి'

యీ రాజేయని యీనాడు నేను గ్రహించినాను. నీవు నా బానిసవు. నీకై నీవు స్వేచ్ఛగా వర్తించుటకు హక్కు లేదు. నీవు నన్ను అడిగి యున్నట్లైన నీకు మంచి భర్తను తెచ్చియుండుదానను. నా యెడల నీకు భయము లేదు. నీ ప్రవర్తన సరిగా అసుర ప్రవర్తనవలె నున్నది''. శర్మిష్ఠ సరళ స్వరముతో యిట్లనెను. ''నేను ఋషి అని చెప్పుటలో అసత్యము లేదు. అతడు రాజర్షియని లోకములో అందరకూ తెలియును. నా ప్రవర్తన నియమ నిబంధనల పరిధిలోనే యున్నది. నీవు నీ భర్తను యెంచుకున్నట్లే, నీ బానిసగా నేను కూడ అట్లే చేసితిని. నీవు అతనికి చెందినావు కాబట్టి, నీ బానిసనైన నేను కూడ అతనికి చెందినదాననే. నీవు నా తండ్రి గురు కుమార్తెవు. నా తండ్రి నీ తండ్రిని గౌరవించినట్లే నేను నిన్ను గౌరవించుచున్నాను. నీ భర్త నీ నుండి గౌరవము నాశించినట్లే నానుండి కూడ ఆశించును. వివాహము మూలముగా నీ వతని దానవైనావు. నీ బానిసనైన నేను కూడ అతనిదాననైనాను. నీతో నేను యిక్కడికి వచ్చినప్పటి నుండి, అతడు నాకు యిల్లు, బట్టలు, సర్వమూ సమకూర్చెను. అటువంటప్పుడు అతడు నన్ను చేబట్టి యీ బాలురకు తల్లిగా చేయుటలో తప్పేమి కలదు?''

దేవయాని ఆగ్రహమును భరించలేకుండెను. ఆమె పెదవులు వణకుచుండెను. కన్నులు యెర్రబడెను. ఒకప్పటి ఆమె స్నేహితురాలి భుజములను పట్టి ఊపి యిట్లనెను. ''నీతో నేనిక మాట్లాడదలచుకోలేదు''. మౌనముగా నిలిచియున్న రాజువైపు తిరిగి దేవయాని యిట్లనెను. ''ఓ రాజా! బానిసయైన యీ శర్మిష్ఠతో నీవు తనివితీర సుఖించవచ్చును. నీవు నాకు అప్రియముగా వర్తించుటచే యింకొక క్షణమైనను యిక్కడ నీతో నేనుండలేను''.

దేవయాని మాటలు గ్రక్కుచున్న అగ్నివలె నుండెను. ఆమె ఆభరణము లన్నిటిని తీసివేసి రాజు ముందు నేలపై విసిరెను. ఆమె, రాజువైపు శర్మిష్ఠవైపు దగ్ధము గావించు చూపులను బరసెను. వడివడిగా అక్కడ నుండి వెళ్ళిపోయెను. రాజు ఆమెకు, ఆమె ఆగ్రహమునకు భయపడి ఆమె వెంట పరుగెత్తి ఆమె చేతిని దీసుకుని ఓదార్చుటకు ప్రయత్నించెను. కాని ఆమె వినకుండెను. రాజు మాటల కామె సమాధానము చెప్పక అశోకవనము విడిచి వెళ్ళెను. రథమును దెప్పించి శీఘ్రముగా తన తండ్రి గృహమును చేరెను. శుక్రుడు ఒక్కడే యుండెను. ఆమె సుడిగాలి వలె వచ్చి తండ్రి పాదములపై బడెను. శుక్రుడు ఎగాదిగ జూచి, ఆమె తల యెత్తి, మిక్కిలి విచారముతో నిండిన ఆమె ముఖమును గాంచెను. కళ్ళు దించుకుని నెమ్మదిగా వచ్చుచున్న రాజును శుక్రుడు యెదురుగ గమనించెను. అతడు కూడ శుక్రుని పాదములపై బడెను. శుక్రునకీ నాటకము అవగతము కాలేదు. యయాతి పలుకక మునుపే దేవయాని మాట్లాడెను. ఆమె మాటలు అతి తొందరగా వచ్చుచుండెను. ఆమె మాటలను బట్టి ఆమెలో పేరుకుపోయిన క్రోధము స్పష్టముగా గోచరించుచుండెను. ఆమె తండ్రితో జరిగినదంతయూ తెలిపి, రాజు తన నేవిధముగా మోసగించెనో వివరించెను. ''అధర్మము ధర్మమును జయించినది'' అని దేవయాని పలికెను. ''వృషపర్వుని కూతురు శర్మిష్ఠ నన్ను అతిక్రమించెను. ఆమెకు ముగ్గురు పుత్రులు, నాకు యిద్దరే పుత్రులు. ధర్మపరాయణుడని పేరు పొందిన రాజు నిజముగా నీతిలేనివాడు. అతనికి హృదయము లేదు. నా నమ్మకమును వమ్ము గావించెను''.

పుత్రిక దేవయానిపై యెనలేని ప్రేమగల శుక్రుడు ఆమె చెప్పినది విన్న తర్వాత క్రోధపూరిత నేత్రములతో యయాతిని జూచెను. రాజు ముఖమును తిలకించిన శుక్రుడు, తన కుమార్తె చెప్పినది సత్యమేయని విశ్వసించెను. శుక్రుడు మండిపడెను. వివాహ సందర్భములో ప్రత్యేకముగా శర్మిష్ఠను గురించిన ఆలోచనలు తగవని హెచ్చరించి నప్పటికిని రాజు వినకుండెనని శుక్రుడు భావించెను. అతని కుమార్తె మిక్కిలి విచారములో నుండుట

చూచి, తండ్రిగా ఆమె యందు విశేషమైన ప్రీతి గలవాడగుటచే, అతడు రాజుతో నిట్లనెను.

''యయాతీ! ధర్మ శాస్త్రములతో బాగుగా పరిచయ మున్నప్పటికిని, కామవాంఛ ప్రకోపించుటచేత నీతి నియమముల నుల్లంఘించితివి. నా కుమార్తెకు తీరని దుఃఖము కలిగించుటచేత నిన్ను శపించుచున్నాను. లౌకిక సుఖముల వెంట పరుగెత్తువారు ముసలితనము ననహ్యించుకొందురు. అట్టి ముసలితనము నిన్ను ఆవహించగలదు''

శుక్రుని భీకర శాపమునకు యయాతి మూగబోయెను. రాజర్షి యయాతిలో ఒక దోషము కలదు. అదియే కామవాంఛ ఈ శాపమువలన జీవితమంతయు చీకటి అయినట్లయ్యెను చేతులు జోడించి, కనులవెంట అశ్రువులు కారుచుండగా యయాతి యిట్లు పలికెను ''దేవా! నేను చెప్పునది మీరు వినకుండగనే శాపమొసగినారు వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ తన్ను స్వీకరించమని ప్రాధేయపడెను లేకున్న ఆమె జీవితము వ్యర్థమగునని ఆమె తలంచెను నేను నేర్చిన ధర్మ సూత్రములు యిట్లు తెలుపుచున్నవి 'స్త్రీ తనంతట తానుగా ఒక పురుషుని చేబట్టమని కోరినపుడు ఆమె కోరికను తీర్చవలసియున్నది. లేకున్న ఆ పురుషునికి శిశుహత్యా పాపము కలుగును అట్టి పరిస్థితిలో ఆ పురుషుడు మరొక విధముగా ప్రవర్తించినచో అది పరిస్థితుల ప్రభావము కాని, అతని యిచ్ఛకాదు. అదియుగాక, నా జీవితములో యెవరేది అడిగినను దానిని ప్రసాదించెదనని ప్రకటించినాను ఆమె తన కోరిక తెలిపి నన్ను ప్రసాదించమని అర్థించెను అధర్మపరుడనని అనిపించుకొనుట యిష్టములేక ఆమెను స్వీకరించితిని''

శుక్రు డిట్లనెను ''నీవు తప్పు చేసితివనియే నేను భావించెదను చేసిన వాగ్దానము నుల్లంఘించినవాడవు నీవు కట్టుకున్న భార్య యెడల ఉచితముగా ప్రవర్తించలేదు నీకు వృద్ధాప్యము త్వరలోనే సంభవించును''

అతడట్లు పలుకుచుండగనే, యయాతి అవయవములు శుష్కించి ముడతలు పడుచున్నట్లు కనుగొనెను. తన బలమైన, శక్తిమంతములైన అందమైన బాహువులను చూచుకొనగా, అవి మిక్కిలి సన్నబడి ఒక్కసారిగా ముడుతలేర్పడి, చర్మము మాత్రమే కప్పియున్నట్లుండెను. తన స్వరూపము తనకే భయము కలిగించెను అతడు చాల దుఃఖించి యిట్లనెను. ''ఆచార్యా! నాకింకను అనేక కోరికలు మిగిలి యుండెను దయచేసి నాకీ ముసలితనము పోవునట్లు చేయుము నన్ను కరుణింపుము నేను యింకనూ అనేక సంవత్సరములు జీవించవలసియున్నది అందు నీ కుమార్తెను అనేక రీతులుగా సుఖపెట్టగలను కాని నీవు నాకీ వృద్ధాప్యమును అంటగట్టినావు నీవు మాత్రమే నాకు సహాయము చేయగలవు'' శుక్రుడు యిట్లు పలికెను ''బ్రాహ్మణు డిచ్చిన శాపమునకు తిరుగులేదు. నేను యేదైన పలికినచో అది జరిగి తీరును నేనెప్పుడును అసత్యము పలుకలేదు. సరే, శాపమును కొంతవరకు మార్చగలను ఎవరైనా యువకుడు నీ వృద్ధాప్యమును గ్రహించిన యెడల, అతని యౌవనము నీవు యెరువు తెచ్చుకొనవచ్చును నీకు జీవితములో పూర్తి సంతృప్తి కలిగి, కోరికలన్నియు తీరిన మీదట, నీకు యౌవనము యెరువు యిచ్చిన వ్యక్తికి తిరిగి యౌవనము కలుగును''

# 132 యయాతి పుత్రులు

యయాతికి చీకటిలో గుడ్డి దీపము వెలుగు నిచ్చినట్లు, ఆశాకిరణము గోచరించెను. అతడిట్లనెను. ''శాపము మార్చినందుకు మీకు నా కృతజ్ఞత. నా అయిదుగురు పుత్రులను అడిగెదను. నా కొరకు యెవరు సర్వసౌఖ్యములు త్యజించునో, అతడు నా తర్వాత చక్రవర్తి కాగలడు. అతడు చేసిన త్యాగమునకు అతని కీర్తి లోకములో చిరస్థాయిగా నిలిచిపోగలదు. అతనికి విశేషమైన పుణ్యము కలుగును''.

శుక్రుని వద్ద యయాతి సెలవు తీసుకొనెను. శుక్రుని ఆగ్రహము అణగారెను. అతడిట్లనెను. ''నీ దారిన నీవు వెళ్ళుము. నీ కొరకు యౌవనము త్యాగము చేయు కుమారుడు నీ తర్వాత రాజు కాగలడు. అతడు కీర్తి ప్రతిష్ఠలు గడించును. అతడు దీర్ఘకాలము జీవించును. అతని కనేక మంది పుత్రులు కలుగుదురు''.

విలపించుచు, వృద్ధాప్యము చేత మెల్లగా నడచుచూ యయాతి నగరము ప్రవేశించెను. ప్రవేశించిన వెంటనే జ్యేష్ఠ కుమారుడు యదువును పిలిపించెను. యదువు దేవయాని కుమారుడు. అతడు వచ్చి తండ్రియెదుట నిలుచుండెను. అతనికి జరిగిన దేమియు తెలియలేదు. తన తండ్రికి అకస్మాత్తుగా కలిగిన వృద్ధాప్యమునకు, విచారమునకు కారణమేమై యుండునా యని ఆశ్చర్యముతో చింతించుచు మౌనముగా నిలబడి యుండెను.

రాజు యిట్ల పలికెను. ''చూడు కుమారా! నాకు అకస్మాత్తుగా వృద్ధాప్యము ప్రాప్తించెను. నా అవయముల పటుత్వము తగ్గెను. నేను కదలలేక పోవుచున్నాను. నీ మాతామహుడైన శుక్రాచార్యుని శాపముచే యిట్లు జరిగెను. నాకు పెక్కు తీరని కోరికలు మిగిలి యున్నవి. నీవు నా కుమారుడవు. నాకు సహాయపడగలవు. నీ యౌవనము నాకిచ్చి నా వృద్ధాప్యము నీవు స్వీకరించినచో, ఒక వేయి సంవత్సరములు కోరికలు తీర్చుకుని, నీ యౌవనము తిరిగి నీకిచ్చివేయగలను''.

యదువు కొంచెముసేపు యోచించి యిట్లనెను. ''తండ్రీ! ముసలితనము యెవ్వరికీ ఆమోదయోగ్యము కాదు. ముఖ్యముగా యువకునకు అసలే వీలుకాదు. నిండు జీవితమంతయూ ముందుండగా వృద్ధాప్యము నెవరు వరింతురు? తెల్లబడిన వెంట్రుకలు, శుష్కించిన శరీరము, వంగిన నడుముతో దైనందిన కృత్యముల నెట్లు నెరవేర్చగలను? రాచ కార్యములనెట్లు నిర్వహించగలను? నీవు నాపై రుద్దనున్న యీ ముసలితనము నాకు వద్దు. వృద్ధాప్యము యెవరు కూడ ఆహ్వానించరు''.

యయాతి పుత్రునికి నచ్చచెప్పజూచెను. ''వృద్ధాప్యము కొంతకాలము మాత్రమే యుండగలదు. ఆ తర్వాత నీకు మరల యౌవనము కలిగి అనేక సంవత్సరములు సుఖముగా నుండగలవు''.

యయాతి పుత్రులందరిలో యదువు సర్వస్వమును త్యజించి భగవంతుని ధ్యానము చేయుచు కాలము గడపవలెనని తలచుచుండెను. వైరాగ్యమునకు అనురాగము పెంచుకొనకుండుట అతి ముఖ్యము. కొంతకాలము ప్రాపంచిక సౌఖ్యము లనుభవించిన పిదప వైరాగ్యమును సాధించవచ్చును. యౌవనమందు సౌఖ్యము లనుభవించిన తర్వాత వైరాగ్యమునకు సిద్ధపడవలెనని యదువు సంకల్పము. తండ్రి తనకివ్వనున్న వృద్ధాప్యము అతి తొందరలోనే రాగలదని తలంచెను. అందుల కతడు సిద్ధముగా లేకుండెను. అసహజమైన యీ వృద్ధాప్యము తన ఆశయము నెరవేరుటకు ఆటంకమగునని భావించెను.

సహజముగా సంప్రాప్తించు వృద్ధాప్యము, వైరాగ్య భావమును, పరలోక చింతను, భగవంతునిపై భక్తిని కలిగించును. తండ్రి తనకివ్వనున్న వృద్ధాప్యము ఒక బ్రాహ్మణుని శాపఫలితము. అది తన ఆశయము నెరవేరుటకు ప్రతిబంధకము కాగలదని తలచెను. యదువు వృద్ధాప్యమును తిరస్కరించుటకు మరొక కారణము గలదు. అతడు తనలో తానిట్లు తలంచెను. ''నా తండ్రి యౌవనము కోరుట ఉత్తమ ఆశయము కొరకు కాదు; నా తల్లితో సుఖించుట కొరకు యౌవనము కోరుచున్నాడు. నా యౌవనము నతని కిచ్చినచో, ఆ యౌవనముతో నా తల్లిని సుఖపెట్టును. దీనివలన నేను నా తల్లికి ఘోర అపచారము చేసినట్లగును. ఈ పాపము నేను చేయలేను. నా తండ్రికి అప్రియము కలిగించుటకన్న వేరు మార్గము లేదు. నేను వృద్ధాప్యము నిరాకరించుటకు వెనుక నున్న కారణములను విశదీకరించి చెప్పజాలను''.

యదువు విచారముగ నుండెను. కాని మనస్సు మార్చుకొనకుండెను. అతడిట్లనెను, ''అకస్మాత్తుగా సంభవించు వృద్ధాప్యము నాకు వద్దు. క్రమేణ సంక్రమించు వృద్ధాప్యము చేతనే వైరాగ్య మలవడును. నా యౌవనము నేను వదలుకొనలేను. తండ్రీ! నన్ను క్షమింపుడు''.

యయాతికి పుత్రునిపై ఆగ్రహము కలిగి యిట్లనెను. ''నీవు నాకు జన్మించితివి. నీ ఉనికికి కారణము నేను. అయినప్పటికిని, నేనడిగిన దానిని నీవు కాదనుచున్నావు. నీకు యీ రాజ్యము సంక్రమింపదు. నీవు పాలితుడవే కాని పాలకుడవు కాలేవు''.

యదువు సమాధానము చెప్పక యూరకుండెను. తండ్రికి నమస్కరించి అక్కడ నుండి వెళ్ళిపోయెను.

ఆ తర్వాత దేవయాని రెండవ కుమారుడు తుర్వసుని పిలిపించెను. యదువుతో చెప్పినట్లుగనే, యయాతి చెప్పెను. తన వృద్ధాప్యము స్వీకరించి అతని యౌవనము నిచ్చినచో, తాను సుఖించి, వేయి సంవత్సరముల తర్వాత తిరిగి అతని యౌవనము నిచ్చి వేయుదునని చెప్పెను. కాని అతడందు కంగీకరించక, ''తండ్రీ! నా బలము, అందమును హరించే వృద్ధాప్యము నాకు వద్దు. వృద్ధాప్యము వలన సౌఖ్యానుభవము పొందలేను. మరియు బుద్ధిని మందగింపజేయును. అంతేకాక ప్రాణమును కూడ తీయగలదు. నాకు వృద్ధాప్యము వద్దు''.

యయాతి ఆగ్రహము యినుమడించెను. అతడిట్లనెను. ''నాకు ప్రీతికరమైన దానిని చేయుటకు అయిష్టతను చూపుచున్నావు. నా తర్వాత నీవు రాజు కాజాలవు. నీవు మ్లేచ్ఛులకు రాజుగా నుందువు. వారు నీతి నిజాయితీ, మర్యాద తెలియని వారుగా నుందురు. సంకుచిత స్వభావులు. లోకులు వారిని యేవగించుకుందురు. అటువంటి మూర్ఖులకు నీవు మూర్ఖుడనైన రాజుగా నుందువు''.

ఆ తర్వాత శర్మిష్ఠ పుత్రులను పిలిపించెను. ద్రుహ్యుడు, అనువు దేవయాని పుత్రుల వలె వృద్ధాప్యము తీసుకొనుటకు నిరాకరించిరి. వారు కూడ తన తర్వాత రాజ్యము నేలుట కనర్హులని యయాతి పలికెను. వృద్ధాప్యము తలచుకొనగా కలిగిన భయము చేత వారు రాజరికము పోయినను బాధ లేదనుకొనిరి. అందుచే, రాజు వారికి యెంతగా నచ్చజెప్ప జూచినను వారు లక్ష్యపెట్టకుండిరి.

యయాతి కిప్పుడు ఆశలన్నియు సుమారుగా అంతరించి, వృద్ధాప్యము తప్పదన్నట్లు తోచెను. కనిష్ఠ పుత్రుడు పూరుని రావించి, అతనిని మిగిలిన పుత్రులను అడిగినట్లే యడిగెను.

పూరు డిట్లనెను. ''తండ్రీ! మీ ఆజ్ఞను శిరసావహించెదను. పెద్దల ఆజ్ఞలను విధేయతతో ఆచరించుటయే

కర్తవ్యమని నేను నేర్చుకుంటిని. అట్టివారు అనుగ్రహపాత్రులై దీర్ఘకాలము జీవింతురని ఉన్నత లోకములు చేరుటకు అదే మార్గమని తెలుసుకున్నాను. మీ వృద్ధాప్యమును సంతోషముగా స్వీకరించి, నా యౌవనమును మీ కిచ్చెదను. తండ్రీ! నా ప్రాణములను కోరినను వానిని మీకు యివ్వగలను. నా యౌవనము మీరు స్వీకరించి సుఖముగా జీవించుడు. మీరు ఆనంద మనుభవించి, వృద్ధాప్యము చేపట్టునంతవరకు నేను మీ వృద్ధాప్యమును ధరించి యుందును.

పుత్రుడైన పూరుని మాటలను వినిన యయాతికి అమితోత్సాహము గలిగెను. అతడిట్లనెను. ''నా తర్వాత నీవు రాజువు కాగలవు. నీ రాజ్యములో ప్రజలు సుఖసంతోషములతో తులతూగెదరు. నీవు దైవభీతితో ధర్మబద్ధముగా పాలించెదవు''.

## 133 అసంతృప్తి

పూరుడు యయాతి వృద్ధాప్యమును, యయాతి పూరుని యౌవనమును స్వీకరించిరి. యయాతి తాను తలచినట్లు సుఖముగా కాలము గడుపుచూ, రాచకార్యములను అలక్ష్యము చేయక, నిర్వర్తించుచుండెను. దేవయాని యిప్పుడు బాగుగ పరిణతి చెందెను. ఆమె ఆగ్రహమును వీడెను. ఆమె యయాతి ప్రేమను చూరగొనుచుండగా, అతడామెను సహస్ర విధములుగా సుఖపెట్టుచుండెను.

ఇట్లు వేయి సంవత్సరములు గడచెను. యౌవన కాలము అంతరించు సమయము సమీపించినదని యయాతి గ్రహించెను. కాని యౌవనము ప్రసాదించిన సుఖ సంతోషముల యెడ తనకు పూర్తిగా తనివి తీరలేదని తెలుసుకొనెను. ఈ విషయమై అతడు దేవయానితో ముచ్చటించెను. అతడామెతో యిట్లనెను. ''దేవీ! ఆనాడు నీ కుడిచేయి పట్టుకుని, నూతి నుండి బయటకు లాగినప్పటి నుండి నేటివరకు నా ఆలోచనలు నీ మీదనే యుండెను. నీవు, నీపై ప్రేమ, నీతో నేననుభవించిన సుఖము — యీ ఆలోచనలు తప్ప వేరు ఆలోచనలు లేవు. ఇతర విషయములు గురించి ఆలోచించవలసిన సమయము వచ్చినది. మనము ఒకరిపై నొకరికిగల ప్రేమతో కట్టుబడి మాయలో చిక్కుకుని యింతకాలము గడపినాము. ఈ జీవితము తర్వాత యేమిటని యెన్నడు ఆలోచించలేదు; ఆత్మవిద్యను అలక్ష్యము చేసితిని. ఈ జీవితములో నేను ఒక ముఖ్యమైన పాఠమును నేర్చితిని. ధనధాన్యములు, గోవులు, స్త్రీ సౌఖ్యము మనిషికి తృప్తిని కలిగించలేవు. మానవుని హృదయములో కోరికలు జనించుచున్నంత కాలము, అవి తీరుచున్నప్పటికిని, అతడు 'ఇక చాలును' అని యెప్పటికీ అనలేడు''.

''అనుభవించుట ద్వారా కామవాంఛ అణగారదు. అగ్నిలో నెయ్యి వేయగా, యెగిసి మరింత విజృంభించు విధముగా, కోరికలను తీర్చుచున్నకొలది మరల మరల అవి అనంతముగా పుట్టుచునే యుండును. కోరికలను త్యజించుట అతిక్లిష్టమైనది. వయసు ముదిరినను కోరికలు తరగవు. దుఃఖ సముద్రములో మునుగక, ఆనందము పొందవలెనన్న కోరికలను త్యజించవలెను. ఇంద్రియములు చాల శక్తిమంతమైనవని చెప్పుదురు. జ్ఞానులు కూడ ఇంద్రియముల శక్తికి లొంగి పాపకూపములో పడుచుందురని చెప్పుదురు. అందుచేతనే సోదరితో, పుత్రికలతో ఒకే ఆసనముపై కూర్చొనరాదని జ్ఞానులందురు. క్షణకాలములో సిద్ధిహానిని చేయు శక్తి ఇంద్రియములకు

కలదు.

''వేయి సంవత్సరములుగా నేను కోరికల వెంట పరుగిడుచుంటిని. నాకు యింకను తృప్తి తీరలేదు కాబట్టి, యీ కోరికలను పూర్తిగ విడనాడుటకు ప్రయత్నించి చూచెదను శాశ్వతమైన బ్రహ్మముపై నా హృదయమును కేంద్రీకరించెదను. ద్వంద్వములను మరచి, 'నాది' 'నేను' అనుభావములు విడనాడి, అరణ్యములో లేడివలె, సంచరించెదను

''ఇంద్రియములకు సుఖమును కలిగించు వస్తువులు అనిత్యమని మానవుడు గ్రహించవలసి యున్నది. ప్రాపంచిక వస్తువులు సంసార కూపములోనికి లాగును. కాబట్టి మనస్సును భౌతిక విషయముల నుండి ఉపసంహరించి, నిత్యము, శాశ్వతము అయిన బ్రహ్మముపై లగ్నము చేయవలెను''

యయాతి కుమారుడైన పూరుని వద్దకు వెళ్ళి అతని యౌవనము తిరిగి యిచ్చి వేసెను. శాంతినిండిన మనస్సుతో, ఒకప్పుడు శాపముగా భావించిన వృద్ధాప్యమును స్వీకరించెను మనస్సు పరిశుద్ధమగుటచే వృద్ధాప్యమును తనకు తానుగా యెట్టి సంకోచములేక పొందెను. అతనిలో యిప్పుడెట్టి కోరికలు లేవు మిగిలిన పుత్రులపై కోపము కూడ లేకుండెను. పూరుని చక్రవర్తిగా జేసెను. యదువు దక్షిణదిశను, ద్రుహ్యుడు వాయవ్య దిశను, తుర్వసుడు పశ్చిమదిశను, అనువు ఉత్తరదిశను పాలించునట్లు యయాతి నియమించెను

యయాతి అరణ్యమునకు వెళ్ళి అచట సంచరించుచుండెను కోరికల నుండి స్వేచ్ఛ పొందిన యయాతి, రెక్కలు వచ్చిన పక్షి గూడు విడచి యెగిరిపోయినట్లుగా, విహరించుచుండెను

కొంతకాలమునకు యయాతి చరమదశ చేరుకొనెను. దేవయాని కూడ అతడు చూపిన మార్గము ననుసరించి, భగవంతునిపై మనసు లగ్నము చేసి, యీ శరీరమును విడచెను

## 134 దుష్యంతుడు

చంద్రవంశపు రాజులలో పూరు చక్రవర్తి మహాప్రసిద్ధి చెందెను. కురు మహారాజు యిదే వంశములోని వాడు. వీరితరము, తరువాత తరములో వీరి వంశీయులు పౌరవులనియు, కౌరవులనియు గణుతికెక్కిరి.

పౌరవ వంశములో జన్మించిన ఒకరాజు ఐలికుడు అతని కుమారుడు దుష్యంతుడు ఐలికునకు మరికొందరు పుత్రులు గలరు. దుష్యంతుడు జ్యేష్ఠుడగుటచే అతడు చక్రవర్తిగా పట్టాభిషిక్తుడయ్యెను అతడు నాలుగు దిక్కులందున్న రాజులను జయించి, యీ లోకమును యెదురు లేని మహారాజుగా పాలించెను అతడు చాల ఉదాత్తుడు అతనిపాలనలో ప్రజలు భోగభాగ్యములతో తులతూగిరి ప్రజలు ఆకలి యననేమియో యెరుగరు. అతని రాజ్యములో 'దొంగ' అను పదమునకు తావు లేకుండెను. ప్రజలకు అనారోగ్యమననేమో తెలియదు ఆయా ఋతువులందు వర్షములు బాగుగా వర్షించి పంటలు పుష్కలముగా పండుచుండెను. రాజ్యమందు సమృద్ధిగా పాలనిచ్చు గోవులు విరివిగా నుండెను ప్రతి ఒక్కరికిని సమృద్ధిగా ఆహారము లభ్యమగుచుండెను. అందరును సుఖసంతోషములతో విలసిల్లు చుండిరి.

రాజు ప్రజలందరి ప్రేమను చూరగొనుచుండెను. అతడు గొప్ప వీరుడు. విలువిద్యయందు, గదాయుద్ధము నందు సాటిలేని మేటిగా పేరు గాంచెను

అతనికి విష్ణువునకున్న బలము గలదు. సూర్యుని తేజస్సు గలదు, సాగరమునకున్న ఉదాత్తత, భూమికి యున్న ఓర్పు అతనిలోని విశేష గుణములు. సూక్ష్మముగా చెప్పవలెనన్న, అతని రాజ్యములో అందరును సుఖముగా జీవించుచుండిరి.

ఒకసారి నగరము నానుకుని యున్న గ్రామములలో కొద్ది గందరగోళము చెలరేగెను. క్రూరమృగములు గ్రామములలో ప్రవేశించి గోవులకు హాని కల్గించుచున్న వార్తలు దుష్యంత మహారాజునకు అందెను. ఆ వెంటనే అతడు అరణ్యమునకు ప్రయాణమయ్యెను. సేనా బలము తోడురాగా రీవిగా వేటకు బయలుదేరెను. అతడు ప్రయాణించుచున్నపుడు మార్గమున కిరువైపుల చేరిన ప్రజలు తమలో తాము యిట్లనుకొనసాగిరి. ''ఈతడే దుష్యంతుడు పెద్దపులి కున్నంత శక్తిగలవాడు యుద్ధములో అతనిని జయించగలవారు లేరందురు. అతని బలశౌర్యములు చూచి అందరూ నివ్వెర పడెదరు'' వారి మాటలు చెవిని పడగా, దుష్యంతుడు చిరునవ్వు నవ్వుచు అరణ్యమునకు సాగిపోయెను.

అతడు తోటలు దాటెను నగరపు పొలిమేరలలో నున్న పొదలను కూడ దాటి వెళ్ళుచుండెను అరణ్యములో ప్రవేశించి, చాల సేపు పులులను సింహములను ఎలుగుబంట్లను అడవి దున్నలను వేటాడుచూ కాలము గడిపెను అతనికి మార్గములో ఏనుగుల గుంపులు, లేళ్లమందలు యెదురయ్యెను.

అందులో ఒక లేడి అందముగా కనుపించెను. ఆ లేడిపై బాణము ప్రయోగింపదలచెను. రాజు ఉద్దేశ్యమును కనిపెట్టిన లేడి, తనకు రానున్న ప్రమాదము తలచుకొని, సన్నని కాళ్ళతో సాధ్యమైనంత వేగముగా పారిపోయెను. రాజు రథమునెక్కి ఆ లేడి ననుసరించి వెళ్ళెను అట్లు యెంతసేపు అయినదీ అతనికి తెలియకుండెను ఇంతలో అతడు అలసిపోయి, దాహము వేయుచున్నట్లు భావించెను అతడు లేడిని యింకను వెంబడించుచుండెను. ఆ లేడి మరొక అరణ్యము ప్రవేశించెను

దుష్యంతుడు కూడ ఆ అరణ్యములో ప్రవేశించెను. అచ్చటి వాతావరణము చాల ఆహ్లాదముగా నుండుట అతనికి ఆశ్చర్యము గొలిపెను అచ్చట మనస్సుకు శాంతి దొరకుచున్నట్లుండెను ప్రశాంతత ఆ పరిసరమంతా వ్యాపించి యున్నట్లు కనుగొనెను చల్లటిగాలి వీచగా ఫలపుష్పములతో నిండిన వృక్షముల కొమ్మలు ఊగుచూ ఆహ్వానించుచున్నట్లు యుండెను. వృక్షముల నీడతో ఆ ప్రదేశము చీకటిగా యుండెను. పక్షులు చేయు మంజుల నాదము మధురముగా వినిపించుచుండెను తుమ్మెదలు పువ్వుల గుత్తులపై వ్రాలి ఝుమ్మను శబ్దము చేయుచుండెను మత్తెక్కించుచున్న పుష్పపరిమళములు ఇంద్రియములకు హాయి కలిగించుచుండెను. ఉండి ఉండి వీచు చల్లని గాలికి వృక్షముల నుండి పుష్పములు నేలపై రాలి తివాసి పరచినట్లు అందముగా నుండెను.

ఆ ప్రదేశము యొక్క రామణీయకత దుష్యంతునకు అద్భుతముగా కనుపించెను ఆ అరణ్యము అంచున ఒక చిన్న సెలయేరు అతివేగముగా ప్రవహించుచుండుట జూచెను. ఇన్ని సంవత్సరములుగా వేటకు వచ్చుచున్నప్పటికిని యీ అందమైన ప్రదేశమును యెట్లు చూడకుంటినా యని ఆశ్చర్యపడెను దగ్గరలోనే ఋషి ఆశ్రమములను కొన్నిటిని అతడు జూచెను ప్రవహించుచున్న నది మాలిని అని అతడు గుర్తించెను. తల్లి పిల్లలను ఆలింగనము చేసుకొనునట్లు, యీ నది ఆశ్రమములను ఆలింగనము చేసుకున్నట్లు యుండెను.

కణ్వమహర్షి ఆశ్రమము మాలినీ నదీ తీరమున నున్నదని దుష్యంతు డెరుగును. అందుచే, అతడు ఆశ్రమమునకు వెళ్ళకుండ ఋషిని పలుకరించకుండిన అమర్యాదగా నుండునని భావించెను. తన సేనాబలమును అక్కడనే యుండుమని దుష్యంతుడు చెప్పి వారితో యిట్లనెను. ''ముందు ఆశ్రమములున్నవి. ఇది దాటి మీరు ముందుకు పోరాదు. నేను తిరిగి వచ్చువరకు మీరిక్కడనే యుండుడు. నేను ఋషికి నమస్కారము చేసి తిరిగి వచ్చెదను''. రాజ వస్త్రములను, ఆభరణములను తీసివేసి, సామాన్య వస్త్రములు ధరించి ఆశ్రమమువైపు వెళ్ళెను. అతడు బ్రాహ్మణ పురోహితునితో కలసి, ప్రశాంతతతో అందముతో నిండియున్న ఆ మార్గమున నడిచి ఆశ్రమమును చేరుకొనెను.

## 135 శకుంతల

ఆ రమణీయ ప్రశాంత వాతావరణమమందు దుష్యంతుడు రాచకార్యములను పూర్తిగా మరచి, మహర్షి సందర్శనము చేసి పాదధూళి తీసుకొనవలెనను తలంపుతో నిమగ్నుడై యుండెను.

దుష్యంతుడు అతి వినమ్రతతో ఆశ్రమములో ప్రవేశించెను. ఆశ్రమములో యెవరూ లేకుండుట అతని కాశ్చర్యము కలిగించెను. ఆశ్రమము శూన్యముగా వదలిపెట్టిన గృహమువలె నుండెను. అతడు చుట్టును పరికించి చూచెను. ఎవ్వరును కనుపించలేదు. కొంచెముసేపు అటులనే నిలిచియుండి, తర్వాత బిగ్గరగా ''ఎవరైన నున్నారా?'' అని అడిగెను. అతని స్వరము ప్రతిధ్వనించగా, కొంతదూరమున కూడ అతనిమాటలు వినిపించెను. అతని ప్రశ్నకు జవాబు నాశించుచుండగా, ఆశ్రమము లోపలినుంచి ఒక అందమైన యువతి తొందరగా వచ్చుట గాంచెను. ఆమె తొందరగా కదలుచుండుట జూచిన దుష్యంతుడు ఆకాశమందు నల్లని మబ్బులలో మెరుపును గాంచినట్లు భావించెను.

ఆమె అందములో 'శ్రీ' వలె నుండెను. ఆమె నల్లని నేత్రములందు కుతూహలము గోచరించెను. ఆమె రాజును చూసి నిశ్చేష్టురాలయ్యెను. అందమైన పురుషుడు తన యెదుట నిలిచియుండుట జూచెను. విశాలమైన వక్షస్థలము, పద్మ దళముల వలె విశాలముగా నున్న అతని నయనములు ఆకర్షణీయముగా నుండెను. అతని మెడ సింహము మెడ వలె నుండెను; పొడవైన అతని బాహువులు శక్తిమంతమైనవి. దుష్యంతునకు ఆ యువతి అవయవములు చక్కగా సమకూర్చినట్లుండెను. ఆమె చంద్రుని వలె యింపుగా నుండెను. వసంతుడు స్త్రీ రూపము దాల్చెనా యనునట్లు ఉన్నదామె; ఆమె అందము అంత స్వచ్ఛముగా నుండెను. ఒకరి నొకరు చూచుకొనుచు అట్లే చాలసేపు నిలిచి యుండిరి. ఆమె తొందరగా లోనికి వెళ్ళెను. వెంటనే అర్ఘ్య పాద్యములతో తిరిగి వచ్చి అతనికి సమర్పించి యిట్లనెను. ''ఈ ఆశ్రమమునకు వచ్చిన నీకు స్వాగతము''. దుష్యంతుని కూర్చొనబెట్టి ఆశ్రమ ఆతిధ్యము స్వీకరించమని కోరెను. ఆ తర్వాత ఆమె కొంత తడవు మౌనముగా నుండెను. అతడామెనే చూచుచుండుట గమనించి, సిగ్గుతో యిట్లడిగెను. ''నీకు ఆనందము చేకూర్చుటకు నేనేమి చేయగలను? ఈ ఆశ్రమమునకు వచ్చుటకు కారణమేమై యుండునో అడుగవచ్చునా? నీవెవరో తెలుసుకొనవచ్చునా? ఎక్కడ నుండి వచ్చినావు?''

దుష్యంతుడిట్లనెను. ''రాజర్షి ఐలికుని కుమారుడను. నన్ను దుష్యంతుడందురు. నేను కణ్వ మహర్షిని సందర్శించుటకు వచ్చితిని. అతడిక్కడ లేనట్లు ఉన్నది. అతడెక్కడకు వెళ్ళెనో చెప్పగలవా?'' ఆ యువతి

యిట్లనెను. ''పండ్లు యేరి తెచ్చుటకు కొద్దిసేపు క్రిందటనే ఆశ్రమము విడచి వెళ్ళెను. కొంచెముసేపు వేచి యుండినచో నా తండ్రి రాగలడు. అప్పుడు నీవు కలుసుకొనవచ్చును''.

ఆమె మాట్లాడుచున్నపుడు రాజు మౌనముగా కూర్చుండెను. ఆమె అందమునకు అతడు ముగ్ధుడయ్యెను. ఆశ్రమమునకు వెలుగునిచ్చు దీపమువలె ఆమె యున్నదని తలంచెను. యౌవనము అందము మిళితమై ఆమెలో వ్యక్తమైన గంభీరతను అతడిదివర కెన్నడును చూచి యుండలేదు. అటు పిమ్మట రాజు యిట్లడిగెను. ''నీవు యెవరు? ఎవరికి చెందిన దానవు? లోకమును త్యజించిన వారితో నిండియుండు ఆశ్రమములో నీ వంటి యువతిని చూడగలనని నేను ఊహించలేదు. నీవు చాల అందమైన దానవు. నిన్ను చూచిన క్షణము నుండి నీ అందమే నా మనస్సు నందు మెదలుచుండెను. సావకాశముగా నా మాటలు వినుము. ప్రఖ్యాతి గాంచిన పూరు వంశములో జన్మించిన రాజును నేను. నేను దుష్యంతుడను. నీవు అందకత్తెవు. నాకు నీపై ప్రేమ అంకురించినది. ధర్మపరాయణుల వంశములో జన్మించిన నాకు దురాలోచనలు కలుగజాలవు. నాలో పాపచింత యేమియూ లేదు. బహుశః ఋషి కుమార్తెయైన బ్రాహ్మణ కన్య ప్రేమలో పడలేదనుకుంటాను! నీవు బ్రాహ్మణ కన్యవు కావని నీపై నా ప్రేమ సరియైనదేనని వినగోరుచున్నాను. నీపై కలిగిన ప్రేమతో నేను దహించుకొని పోవుచున్నాను. నన్ను, నా ప్రేమను నీవు స్వీకరించవలెను''.

ఒక క్షణము ఆ యువతి యేమియు మాట్లాడక యూరకుండెను. ఆమె పెదవులందు సన్నని చిరునవ్వు మెదలసాగెను. వారటులనే ఆశ్రమములో కొంతసేపు కూరుచుండిరి. ఆ తర్వాత ఆమె అతి మృదువుగా యిట్లు పలుకసాగెను. ''నేను కణ్వ మహర్షి కుమార్తెను. అతడు మహా తపస్వి, స్థిరచిత్తుడు. ధర్మ సూత్రములు బాగుగా యెరిగినవాడు. అతని కీర్తి లోకమంతయు వ్యాపించెను. కణ్వుడు నాకు తండ్రి, గురువు, అతని అనుమతి లేనిదే యేది చేయుటకు నాకు స్వేచ్ఛ లేదు. నీవు నన్ను సూటిగా అడుగుట యుచితముగా లేదు. నా తండ్రి నడుగుము. నా యిష్టము వచ్చునట్లు చేయుటకు నాకు స్వేచ్ఛ లేదు''. దుష్యంతుడిట్లు పలికెను. ''నీ తండ్రి కీర్తి లోకమంతటను వ్యాపించినదని నీవు చెప్పినది సరియైనదే. అతని గొప్పదనమును నేనెరుగుదును. అతడు అవివాహితుడని కూడ నేనెరుగుదును. అతడు బ్రహ్మచర్యము తర్వాత, గృహస్థాశ్రమము స్వీకరించకుండ, తిన్నగా సన్యాసాశ్రమము స్వీకరించినాడు. ఈ సత్యము లోక విదితమే. మరి నీవు అతనికి పుత్రిక వెట్లు అయితివి? ఇది అసంభవము. నా మనస్సులో యీ సందేహము కలుగుచున్నది. నా సందేహమును తీర్చుము. ఇదెట్లు జరిగెను?''

ఆమె మరల చిన్నగా నవ్వెను. రాజును చూచి తిరిగి తలదించుకుని నేలపై దృక్కులను బరపుచుండెను. సూటిగా రాజును చూడలేక మృదు స్వరముతో నిట్లనెను. ''నీవు చెప్పినది సరియైనది. నేను కణ్వ మహర్షి దత్తపుత్రికను''. అని పలికి కొంతసేపు ఆగెను. ఆమె తిరిగి చెప్పబోవు దానిని వినుటకు కుతూహలముతో రాజు మాట్లాడక యుండెను. ఆమె తిరిగి కొనసాగించెను. ''ఒకసారి నా తండ్రి వద్దకు ఒక ఋషి వచ్చెను. నేను తన కుమార్తెనని ఆ ఋషితో నా తండ్రి చెప్పెను. నీ విప్పుడడిగినట్లుగానే ఆ ఋషి యిదెట్లు సంభవమని నా తండ్రి నడిగెను. నా గురించి ఆ ఋషితో నా తండ్రి చెప్పగా విని, సత్యమును తెలుసుకున్నాను. నా తండ్రి యిట్లు చెప్పెను:

''ఒకప్పుడు నా మిత్రుడు విశ్వామిత్రుడు తపస్సు చేసి ముల్లోకములను గడగడలాడించెను. అతని తపశ్శక్తి తన పదవికి భంగము కలిగించగలదని ఇంద్రుడు భావించి, విశ్వామిత్రుని తపస్సును భంగము గావింప

విశ్చయించుకొనెను. అప్సరస మేనకను పిలిచి, తన అందచందములతో విశ్వామిత్రుని కవ్వించి తపస్సు భంగము చేయవలసినదని ఇంద్రుడు చెప్పెను. విశ్వామిత్రుడు ఆగ్రహావేశశాలియని తెలుసుకున్న మేనక విశ్వామిత్రుని దగ్గరకు వెళ్ళుటకు సంకోచించెను కాని ఇంద్రుడామెకు అభయమొసగి ఆమెను విశ్వామిత్రుని వద్దకు పంపెను. ఆమెను మన్మధుడు, వసంతుడు, మలయమారుతము అనుసరించిరి.

''మేనక వచ్చిన పనిని సాధించెను. మేనకా విశ్వామిత్రులకు ఒక కుమార్తె కలిగెను మేనక పుత్రికను తీసుకుని విశ్వామిత్రుని సమీపించగా, అతడు తన తపస్సుకు భంగము కలిగెనని తలచి, మేనకను గాని ఆ శిశువునుగాని చూడకుండెను మేనక శిశువు బాధ్యత వహించుట కిష్టపడక, అరణ్యమున మాలినీ నదీ తరమున ఆ శిశువును వదలి, స్వర్గమునకు తిరిగి వెళ్ళిపోయెను

''ఆ అరణ్యమున సింహములు, క్రూర మృగములు విరివిగా సంచరించుచుండెను. గడ్డిపై శిశువు పరుండి యున్నది. వృక్షములపై నున్న శకుంత పక్షులు ఆ శిశువుపై దయదలచి, సూర్యుని వేడి, చలి గాలి శిశువుకు సోకకుండునట్లుగా చుట్టూ చేరి, సంరక్షించుచుండెను.

''నేను ఉదయమున నదిలో స్నానము చేసి సూర్యస్తవ మొనర్చుటకు వెళ్ళితిని ఆ అరణ్యములో పక్షుల రక్షణలో, యేకాకిగా నున్న శిశువును చూచితిని. శకుంత పక్షులు నన్ను చూచి యిట్లనెను. 'ఓ మహర్షీ! ఈ శిశువు నీ మిత్రుడైన విశ్వామిత్రుని పుత్రిక. తపోభంగము కలిగినందుకు తనపై తనకే ఆగ్రహము కలిగి, తిరిగి తపస్సు ప్రారంభించుటకు కౌశికీ నది తీరమునకు వెళ్ళెను. అతని తపస్సుకు మేనక అంతరాయము కల్గించి భగ్నము చేసెను మేనక శిశువు బాధ్యతను చేబట్టక యిక్కడ వదలిపెట్టి స్వర్గమునకు వెళ్ళిపోయెను. నీవు దయార్ద్ర హృదయుడవు. నీవు యీ శిశువును యింటికి తీసుకువెళ్ళి పెంచవలెను' ఆ పక్షులు సరిగా చెప్పినవి. సహజముగా నేను కరుణామయుడను అరణ్యములో గడ్డిపై నున్న ఆ శిశువును శకుంత పక్షులు రక్షించుచుండుట చూచి నా హృదయము ద్రవించినది. ఆ శిశువును నా చేతులలోనికి తీసుకుని ఆశ్రమమునకు వచ్చితిని శకుంత పక్షులచే రక్షింపబడిన ఆ శిశువుకు 'శకుంతల' యని పేరు పెట్టితిని. ఆ విధముగా ఆమె నా కుమార్తె అయినది. ఆమె కూడ నన్ను తండ్రిగా పరిగణించుచున్నది''

''ఇదీ నా తండ్రి ఆ ఋషికి చెప్పిన కథ'' అని శకుంతల పలికెను ''కాబట్టి నేను విశ్వామిత్ర మహర్షికి, అప్సరస మేనకకు జన్మించితిని కాని నా మట్టుకు యీ కణ్వ మహర్షియే నా తండ్రి అతడు చెప్పినట్లే నేను చేయుదును''

## 136 దుష్యంతుడు శకుంతలను వివాహమాడుట

దుష్యంతుడు తన నిర్ణయము సరియైనదని తెలుసుకుని సంతోషించెను ఆమె క్షత్రియ కన్య యగుటచే రాణిగా నుండదగునని భావించెను అతడు నవ్వుచూ ఆమెతో నిట్లనెను. ''నీవు ఒక క్షత్రియుని కుమార్తెవని తెలుసుకున్నాను అది నాకు చాల సంతోషము. నీవు నా భార్యవగుటకు యిక యెటువంటి అభ్యంతరము లేదు నీవు యేది అడిగిన నది చేయుటకు సిద్ధముగా నున్నాను నీవు నాకు కావలెను నీవు లేక నేను జీవించలేను నీవు కోరినచో నా రాజ్యమంతయూ నీ కిచ్చివేసెదను నీ తండ్రి వచ్చునంత వరకు నేను వేచి

యుండలేను. నేను క్షత్రియుడను, గాంధర్వ పద్ధతిలో నిన్ను నేను వివాహమాడవచ్చును. ఈ వివాహమునకు ప్రేమ పునాదిగా యుండుటచే యీ గాంధర్వ పద్ధతి అత్యుత్తమమైనది'' శకుంతల యిట్లనెను ''త్వరలోనే నా తండ్రి అరణ్యము నుండి రాగలడు. దయచేసి ఆయన కొరకు వేచి యుండుము. నా తండ్రి నాకు దైవము. అతడు నన్ను యెవరి కిచ్చిన వారిని నేను భర్తగా స్వీకరించెదను. లోకములో స్త్రీకి స్వేచ్ఛ లేదను విషయము నీకు తెలియదా? చిన్నతనములో తండ్రి, ప్రాయమందు భర్త వృద్ధాప్యములో పుత్రుడు స్త్రీకి రక్షకులు. స్త్రీకి యెన్నడూ తన యిష్టము వచ్చునట్లు చేయుటకు స్వేచ్ఛలేదు నా తండ్రిని విస్మరించి నీ ప్రేమను అంగీకరించలేను''. ''అట్లు అనకుము'' అని దుష్యంతుడనెను. ''నీ తండ్రి నీపై ఆగ్రహించునని నీవు సంకోచించ పనిలేదు. అతనికి ఆగ్రహమే కలుగదు. కణ్వుడు అత్యంత కరుణామయుడు. నీ భర్తను నీవు యెంచుకున్నందుకు అతడు విచారించడు నన్ను యిప్పుడు చేబట్టుటకు అంగీకరించినందువల్ల నీ తండ్రిని అవమానించినట్లు నీవు భావింపతగదు''.

''బ్రాహ్మణుల ఆగ్రహము ఆయుధములకన్న ప్రమాదకరమైనది. సాధారణ ఆయుధములు శరీరమును మాత్రమే బాధించగలవు. అగ్ని వేడిచేత దహించును, సూర్యుడు తన కిరణములచేత, రాజు బలెమ్ముచేత బ్రాహ్మణుడు తన ఆగ్రహముచేత యెదుటి వారిని దహించుదురు. ఋషి కోపము ఇంద్రుని వజ్రాయుధమువలె సర్వ నాశనము చేయగలదు''.

దుష్యంతుడు ఆమె నాలోచించనీయక యిట్లనెను. ''నాకు ఋషి కరుణా స్వభావము పూర్తిగా తెలుసును. నీవు అతనికి భయపడ నవసరము లేదు నీవు నాకు భార్యవు కమ్ము నీ గురించిన ఆలోచనలు, నీ అందము నన్ను పూర్తిగా ఆవహించెను. నీకొక విషయము చెప్పెదను ఆత్మయే ఏకైక బంధువు, ఆత్మయే ఏకైక మిత్రుడు, ఆత్మయే తల్లి తండ్రి, సర్వస్వము ధర్మము నతిక్రమింపక, నీ ఆత్మ అనుమతితో నా భార్యవు కమ్ము గాంధర్వ విధిచే నన్ను వివాహమాడుము. నా దానివి కమ్ము'' అతని తొందరపాటు శకుంతలకు ప్రీతి కలిగించెను. అతని ప్రేమ ఆమెను మెప్పించెను. అయినప్పటికిని, ఆమెకు తనయందుగాని అతని యందుగాని స్థిరమైన భావము కుదురలేదు ఆమె యిట్లనెను. ''నీవు చెప్పినట్లు నీవు సూచించిన మార్గము సరియైనదగుచో, నా ఆత్మ అనుమతితో నీకు భార్యనగుట సముచితమైనచో నేను నీ ప్రేమ నంగీకరింతును. కాని నీవు ప్రమాణ పూర్వకముగా నాకు ఒక మాట నియ్యవలెను. మనకు జన్మించు పుత్రుని నీ తర్వాత చక్రవర్తిగా పట్టాభిషిక్తుని చేయవలెను. ఆ విధముగా నీవు వాగ్దానము చేసినచో నిన్ను వివాహమాడెదను''.

ఆమె యేది కోరిన అది చేయగలనని దుష్యంతుడు వాగ్దానము చేసెను శకుంతల తర్వాత యిట్లనెను. ''శాస్త్ర రీత్యా జరిగే వివాహమునే పెద్దలు అంగీకరింతురని చెప్పగా విన్నాను. అట్టి వివాహము వల్ల కూడిన దంపతులను గౌరవముతో చూచెదరు పుట్టబోవు పుత్రుని దృష్ట్యా యిది అత్యంత ముఖ్యము నాకు గాని నాకు పుట్టబోవు పుత్రునకు గాని యెటువంటి అపనిందయు కలుగరాదు అందుచే నీతో వివాహము సరియైన పద్ధతిలో జరుగవలెను. ఇచ్చట ఆశ్రమములో అవసరమైన వస్తువులన్నియు గలవు యజ్ఞశాలలో వివాహము జరుపుటకు కావలసిన వస్తువులన్నియు నున్నవి పాత్రలు, దర్భాసనము, బియ్యము యిచట గలవు కలుగబోవు పుత్రుని వైభవము వివాహము యొక్క పవిత్రతపై ఆధారపడి యుండును. ఇచట నున్న బ్రాహ్మణులు అజ్య, హవిర్లాజాగ్నులతో వివాహము జరుపగలరు ఈ ఆర్భాట మంతయు నీకు యిష్టము లేదని నేనెరుగుదును. కాని ధర్మబద్ధముగా యీ వివాహము జరుగవలెనని కోరుచున్నందుకు నన్ను క్షమించవలెను''

ఆమె చెప్పిన దానికి దుష్యంతు డంగీకరించెను. దుష్యంతునితో ఆశ్రమమునకు వచ్చిన బ్రాహ్మణ పురోహితుని పిలిచి యిట్లనెను. ''ఈ రాకుమారిని నేను వివాహమాడుచున్నాను. సరియైన పద్ధతిలో వివాహము జరుపుటకు అన్ని సన్నాహములను చేయుము. నాకు కలుగబోవు కుమారునకు యెట్టి దోషము అంటరాదు చాల క్లుప్తముగా సరియైన పద్ధతిలో జరుగనిమ్ము''.

బ్రాహ్మణ పురోహితుడు చాల సంతోషముగా వివాహము జరుపు బాధ్యత స్వీకరించెను. వివాహమునకు రాజు సంసిద్ధుడయ్యెను. దుష్యంతుడు శకుంతలను భార్యగా స్వీకరించెను. శకుంతలా దుష్యంతులు భార్యాభర్త లైరి. ఆమెతో కొంతసేపు అతడు గడిపెను. ఇంతలో తిరిగి వెళ్ళుటకు సమయ మాసన్నమైనదని అతడు లేచెను. అతడామెతో నిట్లనెను. ''నేను నగరమునకు వెళ్ళిన వెంటనే గజములు, అశ్వములను సేనతో పంపెదను బంధు సముదాయమును పల్లకితో నిన్ను తోడుకుని వచ్చుటకు పంపించెదను. నీకు పరిచారికలుం దురు. నేనిపుడు తొందరగా వెళ్ళవలెను. నేను కూడ వారితో వచ్చి నిన్ను నాతో తీసుకువెళ్ళెదను. నీవు రాణిగా నగరమందు నీ గృహములో ప్రవేశించుటకు నేను వచ్చి తీసుకువెళ్ళెదను. కొద్ది కాలము మాత్రమే యీ యెడబాటు. తొందరలోనే వచ్చి నిన్ను తీసుకు వెళ్ళగలనని మాట యిచ్చుచున్నాను''

ఆమెను పదే పదే దగ్గరకు తీసుకుని ఆలింగనము చేసుకొనెను ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకుని త్వరలోనే రాగలనని చెప్పెను. అతని నవ్వు ముఖము వెళ్ళనిమ్మని అడుగుచున్నట్లు ఉండెను.

అశ్రువులు నిండిన కనులతో అతనికి ప్రదక్షిణము చేసి అతని పాదములకు నమస్కరించెను. ఆమెను లేవనెత్తి సముదాయించి అతడామెతో యిట్లనెను. ''దేవీ! విచారించకుము కొద్ది రోజులు మాత్రమే మనకీ యెడబాటు. నేను త్వరలోనే వచ్చెదను. నేను యింతవరకు సంపాదించిన పుణ్యము మీద ఒట్టుపెట్టి త్వరలోనే రాగలనని మాట యిచ్చుచున్నాను''.

అతడట్లు పలుకుచుండగా, అతని మనో నేత్రములో కణ్వుడు వచ్చు దృశ్యమును తిలకించెను ''కణ్వుడు తపస్సంపన్నుడైన ఋషి. నేను చేసిన యీ కార్యము విని అతనికి నాపై యెట్టి అభిప్రాయము కలుగునో గదా! నేను యిక్కడకు వచ్చి అతని అంగీకారము ఆశీస్సులు పొందకనే అతని కుమార్తెను వివాహమాడితిని ఏమి జరుగునో!'' శకుంతలను విడిచి నగరమునకు తిరిగి వెళ్ళుచున్నపుడు దుష్యంతుని మదిలో యిట్టి ఆలోచనలు చెలరేగి కలవరపరచెను

## 137 శకుంతల ఒప్పుకొనుట

దుష్యంతుడు వెళ్ళిన తర్వాత కణ్వుడు తిరిగి వచ్చెను. మామూలుగా తండ్రి ఆశ్రమమునకు వచ్చినపుడు యెదురు వెళ్ళు శకుంతల ఆరోజు అట్లు వెళ్ళకుండెను ఆమెను సిగ్గు ముంచివేసెను. తన నిర్ణయమును అతడు నిరాకరించునేమోయని భయపడెను నెమ్మదిగా అడుగులో అడుగు వేయుచు తండ్రి వద్దకు వచ్చెను. అతని చేతుల నుండి ఫలములతో నిండిన బుట్టను తీసుకుని, అతడు కూర్చొనుటకు ఆసనమును తెచ్చెను. అతడు పాదములను కడుగుకొనుటకు నీళ్ళు తెచ్చి యిచ్చెను అతని పాదములను కడుగుచున్నపుడు, భయము సిగ్గు ముంచుకురాగా ఒక్క మాటైనను మాట్లాడకుండెను. ఆమె యేదో తప్పుచేసినట్లు భావించి

తండ్రి తన చర్యను గర్హించునని తలపోసెను ఆమె నిస్సహాయ స్థితిలో యిరుకుకొన్నట్లు తలంచెను తప్పుచేసినట్లు భావించి మూగిపోయినట్లుండెను

కణ్వుడు ఆశ్చర్యముతో ఆమెను చూచి యిట్లనెను. ''కుమారీ! నీవు సిగ్గుతో ప్రవర్తించుట మొదటిసారిగా చూచుచున్నాను. నీవు యీరోజు యెందుకో అదోకలాగున నున్నావు. నీలో వచ్చిన యీ మార్పు అనూహ్యముగా నున్నది నీలోని యీ మార్పుకు కారణమేమో నాకు చెప్పుము'' అప్పటికిని ఆమె మౌనముగనే యుండెను పండ్లు ఒలుచుటలో నిమగ్నమై యుండెను అతడు పండ్లను భుజించి, తాను యేర్పరిచిన ఆసనమందు అతడు విశ్రాంతి తీసుకొనుచుండగా, శకుంతల నెమ్మదిగా మాట్లాడజొచ్చెను. భర్త దుష్యంతుని తలచుకుని, అతడి గురించి తండ్రితో చెప్పవలెనని ఆమెకు తెలియును సిగ్గుచేత ఆమె వదనము యెర్రనయ్యెను. కనుల వెంట నీళ్ళు వచ్చునట్లుండుటచే గొంతు గద్గదమయ్యెను ఆమె ధైర్యము తెచ్చుకొనెను తండ్రి పాదములొత్తుచు, ఆమె యిట్లనెను. ''తండ్రీ! నీవు బయటకు వెళ్ళినపుడు ఐలికుని కుమారుడు దుష్యంతుడు యీ ఆశ్రమమునకు వచ్చెను. విధి అతని నిక్కడకు రప్పించెనని తలచెదను అతడిని చూచిన క్షణము నుండి అతనినే భర్తగా యెన్నుకుంటిని. తండ్రీ! అతడు నన్ను స్వీకరించెను నీ పాదములకు నమస్కరించుచున్నాను, నాపై ఆగ్రహించవద్దు నీ తపశ్శక్తిచేత అంతర్నేత్రము ద్వారా సర్వము తెలుసుకొనగలవు ఏమి జరిగినదియు వివరముగా నీకు నేను చెప్పవలసిన పని లేదు అప్రయత్నముగా జరిగిన మా వివాహమును నీవు సమ్మతించి దయ చూపమని వేడుచున్నాను అతడు బలవంతము చేయుటచే నేను లొంగిపోయినాను''.

కనులు మూసుకుని ఋషి కొంతసేపు మౌనముగా కూర్చుండెను. తన అంతర్నేత్రముతో జరిగిన దంతయు తెలుసుకొనెను అతి తొందరగా జరిగిన వారి వివాహములో యెట్టి దోషము లేదని తలంచెను అతడు నవ్వుచు కుమార్తెతో యిట్లనెను ''లేదు, నాకు నీపై కోపము లేదు నేనిక్కడ లేనపుడు యేమి జరిగినదియు తెలుసుకున్నాను నన్ను పరిగణనలోనికి తీసుకొనక, పురూరవ కుటుంబములోని దుష్యంత మహారాజు, నా కుమార్తెవైన నీవు యీ పవిత్ర వివాహ బంధముచే భార్యాభర్తలైనారు నేను కోపగింతునని మీరు తలచుట సహజమే కాని నాకు కోపము లేదు నీ గురించి గాని, నీ భర్త గురించి గాని నీవు భయపడ నవసరము లేదు నీవు ఒక ఉత్తముని భర్తగా యెంచుకున్నావు గాంధర్వ పద్ధతిలో వివాహ ముచితముగానే యున్నది క్షత్రియులలో యీ పద్ధతి సర్వసామాన్యము పుట్టబోవు శిశువు శ్రేయస్సు దృష్ట్యా శాస్త్ర విధిగా వివాహము జరుగవలెనను నీ నిర్ణయము చాల సముచితముగా నున్నది నీవొక ఉదాత్త పుత్రునికి తల్లివి కాగలవు

''దుష్యంతుడు ధర్మ ప్రభువు. అతని నీతి నిజాయితీ లోకములో ప్రసిద్ధి కెక్కినవి అతడు పురుషులలోకెల్ల ఉత్తముడు అట్టి ఉత్తముడు నిన్ను భార్యగా స్వీకరించెను ఈ భూ ప్రపంచము నంతనూ పరిపాలించు మహారాజుకు నీవు తల్లివి కాగలవు. అతడు చక్రవర్తి కాగలడు. నీవు దుష్యంతుని యెంచుకున్నందుకు నాకు చాల సంతోషముగా నున్నది నీవు నా వద్దకు వచ్చి చాల సంవత్సరములైనది నీకు తగిన వరుని చూడవలెనను ఆలోచనలు నా మనస్సులో మెదలుచుండెను. నీవు నా సమస్యను తీర్చివేసినావు నాకు చాల ఆనందము కలిగించినావు. నా ఆనందమును ప్రకటించుటకు నీవు యే వరము నడిగిననూ ప్రసాదించుటకు సిద్ధముగా నున్నాను''

శకుంతల యిప్పుడు గిట్టిగా యేడ్చెను. ''తండ్రీ! నేను నిన్ను వరమడుగ వలెనా? నీవు అన్నియు నాకు

యిచ్చితివి. అయినప్పటికీ నీవు ఆదేశించుటచేత నేనొకటి కోరుచున్నాను. నా భర్త దుష్యంతుని యెడల నీవు దయ గలిగి యుండవలెను. నాకు యింకేమియు అక్కరలేదు''.

కణ్వుడు సంతోషముతో ఆమె కోరికను ప్రసాదించి, అభిమానపూర్వకముగా తలపై చేయివేసి నిమిరెను. అతడిట్లనెను. ''ఈరోజు నుండి నీవు నగరములోని పద్ధతులను, పౌరవ చక్రవర్తి మహారాణిగా నుండదగు రీతులను నేర్వవలెను''. ఆమెను శుద్ధిపరచవలెనను ఆలోచన మనస్సులో మెదలగా, అతడామెను మృదువుగా స్పృశించెను. తండ్రి చేతి స్పర్శ కలుగగనే, దోషము చేసితినన్న తలంపులు ఆమె మనస్సు నుండి అదృశ్యమై, సంతోషముగా నుండెను. తండ్రి తన చర్యను క్షమించెనని తెలుసుకుని ఆమె నిర్విచారముగా నుండెను.

## 138 శకుంతల వేచియుండుట

కొన్ని రోజుల తర్వాత తాను గర్భము ధరించి యున్నట్లు శకుంతల గ్రహించెను. ఆమెకు చాల సంతోషము కలిగెను. ఆమె గర్భములో శిశువు పెరుగుచుండెను. అదే సమయములో ఆమెలో ఆందోళన కూడ పెరుగుచుండెను. రాజు, తిరిగి వచ్చి తనను నగరమునకు తీసుకువెళ్ళగలనని చెప్పెను. మొదట కొన్ని రోజులు జరిగిన ఆలస్యము గురించి యెక్కువగా ఆలోచించకుండెను. కాని వారములు గడచెను. అతని వద్ద నుండి యెట్టి సమాచారము కూడ లేదు. ఆమె యిట్లనుకొనెను. ''రాచ కార్యములతో అతడు తీరిక లేక నన్ను గురించి తలంచుటకు సమయము చిక్కకపోయి యుండును. మరికొన్ని రోజులు ఓర్పుతో వేచి చూచెదను''.

ఆమె మరి కొంతకాలము వేచి చూచెను. కాని అతడు రాలేదు. ఆమె కిపుడు విచారము కలుగజొచ్చెను. ఆమెకు యే విషయముపైగాని శ్రద్ధ లేకుండెను. ఆహారము తీసుకొనకుండెను. రాత్రి పగలు ఆమె నిద్ర, ఆహారము మాని రాజును, తన పరిస్థితిని తలచుకొనుచుండెను. ఆమెలో ఉండి ఉండి యేదో ఆశ చిగురించగా, యిట్లు తనలో తా ననుకొనెను. ''నేడో, రేపో, లేక యెల్లుండిగాని అతడు మాట యిచ్చినట్లు సేనతో తప్పక రాగలడు. అతడు గొప్ప ధర్మ ప్రభువు. అతడు పౌరవ వంశీయుడు. నన్ను వదలిపెట్టడు''. ఆమె రోజులు లెక్కపెట్టుచుండెను. రోజులు, వారములు, మాసములు గడచుచుండెను.

మూడు సంవత్సరములు గడచెను. ఆమె యిప్పుడు ఒక బాలునికి తల్లి. జన్మించుటకు ముందు ఆమె గర్భములో శిశువు మూడు సంవత్సరము లుండెను. అతడు చాల అందముగా నుండెను. అతడు జన్మించి నపుడు పుష్ప వర్షము కురిసెను, దివ్యగానము వినిపించెను. మున్ముందు చంద్ర వంశపు రాజులందరిలో గొప్ప చక్రవర్తి కాగలడనుటకు నిదర్శనముగా యీ సూచనలు గోచరించెను. ఇంద్రుడు శకుంతల వద్దకు వచ్చి యిట్లనెను. 'శకుంతలా! నీ కుమారుడు యీ లోకమున కంతకూ చక్రవర్తి కాగలడు. అతని బలమునకు, అందమునకు, వైభవమునకు, శక్తికి యెవరూ సాటిరారు. అతడు అశ్వమేధ రాజసూయ యాగములు పలు పర్యాయములు చేయగలడు. నీ కుమారుడు పౌరవ రాజు లందరిలో అత్యుత్తముడు కాగలడు''.

నూతనముగా జన్మించిన శిశువు భవిష్యత్తును విని కణ్వాశ్రమములోని వారందరూ యెంతో సంతోషించిరి. ఆ ఆశ్రమములోని శకుంతల, యీ భూమి నంతనూ పరిపాలించు చక్రవర్తికి తల్లి కాగలదను ఆలోచన,

ఆశ్రమవాసులందరికీ యెగిరి గంతు వేయునంత సంతోషము కలిగెను. వారు అతి సామాన్యజీవులు. వారి అవసరములు కోరికలు బహు తక్కువ. వారందరును ఆమెను తమ పుత్రికగా యెంచి సంతోషించిరి. నూతన శిశువుకు శాస్త్రరీత్యా జరుపవలసిన విధులన్నిటిని కణ్వ మహర్షి జరిపెను.

శిశువు తొందరగా పెరుగుచుండెను. మల్లెమొగ్గల వంటి తెల్లని పళ్ళు వచ్చెను. పెదవుల నుండి వచ్చీరాని మాటలు వినేవారికి ఆనందము కలిగించుచుండెను. ఆ శిశువు కొక విచిత్రమైన అలవాటు గలదు. తప్పటడుగులు వేయుచూ నడిచే ఆ బాలుడు సింహము లుండే గుహలలోనికి ప్రవేశించి, అడ సింహము ప్రక్క పరుండే సింహపు పిల్లలను పట్టుకుని లాగి పరుగెత్తుచూ ఆడుచుండెడివాడు. తల్లి సింహము కోపముతో భయపెట్టినను ఆ బాలునకు భయముండెడిది కాదు. తన చిన్నారి బాహువులతో సింహములతో పోరాడి భయపెట్టుచుండెడివాడు. ఆశ్రమవాసులకు యిది విచిత్రముగా నుండెడిది. అతడు పెరిగి పెద్దవాడగుచున్న కొలది అతనిలో భయమనునది లేకుండెను. ఆ విధముగా శకుంతల కుమారుడు పెరుగుచుండెను.

ఆ బాలునకు ఆరు సంవత్సరములు వచ్చుసరికి వేటలో ఆరితేరిన వాడయ్యెను. ఆశ్రమము నంటియున్న అరణ్యములో నున్న పులులు, సింహములు, ఎలుగుబంట్లు, తోడేళ్ళు, అడవిదున్నలు, అడవి పందులతో పోరాడుట ఆ బాలునకు అతి సంతోషముగా నుండెడిది. అతని శక్తి సామర్ధ్యములు చూచి, ఆ బాలుని మాతామహుడైన కణ్వ మహర్షి 'సర్వదమను'డని ఆ బాలుని పిలుచుచుండెను.

నగరమునకు తిరిగి వచ్చిన దుష్యంతుడు మొదట శకుంతల గురించి ఆలోచించుచుండెను. కాని అతడు కణ్వ మహర్షికి భయపడెను. కణ్వ మహర్షికి యెదురుపడుటకు, అతడాగ్రహించునేమోనని తలచి, తిరిగి అరణ్యమునకేగి ఆమెను తీసుకువచ్చుటకు సంకోచించి జాగు చేసెను. కాలము గడచిన కొలది, అతనికి పిచ్చెక్కించిన ఆ క్షణములు క్రమముగా మరుగై, మరికొన్ని రోజులకు పూర్తిగా అతని మనస్సు నుండి తొలగిపోయెను.

## 139 శకుంతల ఆశ్రమము విడిచి వెళ్ళుట

కాలము గడచుచున్నకొలది, కుమార్తె జీవితము వ్యర్థమగుచున్నదని కణ్వుడు భావించెను. ఆమె యెప్పుడును యేదో ఆలోచించుచున్నట్లుండెను. పూర్వము వలె ఆమె యిప్పుడు ఆడుచు, పాడుచు హాయిగా ఉంటూ తండ్రికి ఆనందమును కలిగించుటలేదు. ఆమె కన్నులు లోతుకు పోయెను. అత్యల్పముగ మాట్లాడు చుండెను. ఆమె శుష్కించి యుండుటచే సంతోషముగా నుండుటలేదని కణ్వుడు గ్రహించెను. బాలునకు పండ్రెండు సంవత్సరములు వచ్చెను. ఆశ్రమములోని అందరు బాలురవలె అతడుకూడ వేద శాస్త్రములు నేర్చుకొనెను. ఆమెను, ఆమె కుమారుని నగరములోని రాజు వద్దకు పంపుటకు సమయి మాసన్నమైనదని కణ్వుడు నిశ్చయించెను. బాలుని యువరాజుగా పట్టాభిషిక్తుని చేయుటకు తగిన వయస్సు వచ్చినదని కూడ కణ్వుడు తలచెను.

కణ్వుడు శకుంతలను పిలిచి తన ప్రక్క కూర్చుండబెట్టుకొనెను. ఆమె తలను అతడు నిమురగా, ఆమెకు దుఃఖము ముంచుకు వచ్చెను. ఆమెను సముదాయించి యిట్లనెను. ''నీ హృదయములోని విచారము

వేనెరుగుదును. నా మాట విను, పుత్రీ! భర్త వద్దనే స్త్రీకి స్థానము భర్తకు సేవ చేయుచూ అతనిని సంతృప్తి పెట్టుట ద్వారా స్త్రీ మోక్షము పొందగలదు. ఇంతకాలము అతడు నిన్ను పిలిపించునని వేచియున్నావు. అతడట్లు చేయకుండుటచేత నీవే అతని దగ్గరకు వెళ్ళుట అతి ముఖ్యము. నీవు చాల కాలము అతడు వచ్చునని వేచియుంటివి.

''పౌరవ రాజు దుష్యంతుడు వచ్చు సూచనలు లేకుండుటచే అతని వద్దకు నిన్ను పంపుటకు నిశ్చయించి నాను. అతని అలక్ష్యమునకు నీవు అతనిపై అయిష్టత పెంచుకొనరాదు. కుమారుని చూచి రాజు సంతోషించ గలడు. నీ కుమారుడు యువరాజుగా పట్టాభిషిక్తుడగును అది నీకు సంతోషము నిచ్చును''.

కణ్వుడు ఆగి శకుంతలవైపు చూచెను. ఆమెకు తీవ్రమైన మనోవ్యథ కలిగించిన రాజు వద్దకు వెళ్ళుటకు సుముఖముగా లేదని కణ్వుడు గ్రహించెను. ఆమె యేదో చెప్పబోవుచుండగా కణ్వుడు చెయ్యి అడ్డము పెట్టి యిట్లనెను. ''కుమారీ! వద్దు. నా మాట కాదనకుము. నీ భర్త వద్దకు నీవు వెళ్ళవలెనని నా అభిమతము వివాహితయైన స్త్రీ తండ్రి యింట యెక్కువ కాలము ఉండుట సమంజసము కాదు. కుమార్తె సుఖముగా హాయిగా నుండుటకు తండ్రిగా నా విధిని నిర్వర్తించుచున్నాను''. ఆమె మౌనముగా నుండెను తల్లి కుమారుల ప్రయాణమునకు కణ్వుడు అన్ని సన్నాహములు చేసెను. ఆమె ప్రయాణించు రోజు వచ్చినది

కణ్వుడు ఆమెను తండ్రి ప్రేమతో ఆలింగనము చేసుకుని, మనుమని తన ఒడిలోనికి తీసుకునెను. ఆ బాలుని శిరస్సు నాఘ్రాణించి యిట్లనెను ''కుమారా, సర్వదమనా! పౌరవ వంశములో అనేకులు గొప్ప రాజులు కలరు. మనలను పరిపాలించుచున్న రాజు అట్టి ఉత్తమ వంశమునకు చెందినవాడు అతని పేరు దుష్యంతుడు నీ తల్లి ఆ మహారాజునకు రాణి. నీవు ఆ రాజు వారసుడవు నీవు నీ తల్లితో ఆ రాజు వద్దకు వెళ్ళుచున్నావు. వెళ్ళి నీ తండ్రికి నమస్కరించుము యువరాజుగా నీకు పట్టము గట్టెదరు రాజును గౌరవించవలెను కొంత కాలము తర్వాత నీవు యీ భూమిని మహోదాత్తులైన నీ పూర్వుల వలె పరిపాలించుము. నీవు మహారాజువై సింహాసనముపై కూర్చున్నపుడు నన్నొకసారి తలచుకొనుము''. కణ్వుని నేత్రములు అశ్రువులతో నిండెను.

బాలుడు కణ్వుని పాదములపైబడి యిట్లనెను ''నీవు నాకు తండ్రివి తల్లివి కూడ నాకు మరొక తండ్రి వద్దు. నాకు నీవే కావలయును. ఈ లోకమందు పరలోకమందు కూడ నిన్ను నేను సేవించుటచేత పుణ్యము సమకూరును. నాకింకేమియు వద్దు నా తల్లి వెళ్ళదలచినచో తన భర్త దగ్గరకు వెళ్ళవచ్చును నేను మాత్రము నీ పాదముల చెంతనే జీవిత మంతయు గడపెదను. బహుశః యీ అడవిలోని క్రూర మృగములతో నా క్రీడాపనులు చూచి నీవు ఆగ్రహము చెంది నన్ను శిక్షించుటకై యిక్కడి నుండి పంపివేయుచున్నావని తలచెదను. తండ్రీ! నేను ఆ మృగములను బాధించక, నీ పాదముల వద్ద కూర్చుని శ్రద్ధతో శాస్త్రములను అధ్యయనము చేసెదను. నా మాట నమ్ముము. దయచేసి నన్ను మాత్రము యిక్కడ నుండి పంపించి వేయవద్దు''. కణ్వుని కాళ్ళు గట్టిగా పట్టుకుని వదలక కణ్వుని హృదయము బ్రద్దలగునట్లు ఆ బాలుడు యేడ్చుచుండెను. శకుంతల కూడ విచారించుచుండెను ఆమెకు తండ్రిపై యెనలేని ప్రేమ. ఆమె పుత్రుని మాటలు మరింతగా ఆమెకు విచారము కలిగించెను విచారించుచున్న తల్లితో ఆమె పుత్రుడిట్లనెను ''తండ్రి మాటలు విని నీవెందుకు యేడ్చుచున్నావు? నీ భర్తపై ప్రేమతో వెళ్ళదలచుకున్నచో నీవు వెళ్ళవచ్చు. నేను యిక్కడనే తండ్రివద్ద యుండెదను''

ఆ బాలుని మాటలు ఆమెకు మరింత బాధ కలిగించగా, ఆమె యిట్లనెను. ''ఒక మనిషి చేయు పాప కార్యమునకు అనేకులు బాధపడుదురు. నేరము చేసిన వ్యక్తి యెట్లో పరిణామముల నుండి తప్పించుకుని బయటపడును, కాని యితరులు అందుకు బాధపడెదరు. నా విషయములో అదే జరిగినది. చివరకు బాధపడుచున్న దానను నేను. కుమారా! నాకు వెళ్ళవలెనని యున్నదని భావించకుము. నేను కోరునది ఒక్కటే. ఈ తండ్రి పాదములచెంత చోటునే కోరుచున్నాను. ఇంకేమియు నాకక్కరలేదు. పడిపోయిన లత వలె ఆమె కణ్వుని పాదములపై పడగా, అత డామెను లేవనెత్తి సముదాయించెను. ఆమె కన్నీళ్లు తుడిచి కూర్చొనబెట్టెను. తర్వాత అతి సరళమైన మాటలతో ఆమె మొండి నిశ్చయమును మానుమని కణ్వుడు నచ్చజెప్పెను. బాలుడు కణ్వుని మాటలను వినుచుండెను. కణ్వు డిట్లనెను. ''శకుంతలా! నా మాట వినుము. నీ శ్రేయస్సు కోరి చెప్పుచున్నాను. ఈ ఆశ్రమములో నీవు పుష్పమువలె పెరిగినావు. ఈ ఆశ్రమము నాగరిక ప్రపంచమునకు దూరముగా నున్నది. సాధారణముగా కన్యలకు చెప్పు ధర్మ సూత్రములు నీకు చెప్పలేదనుకుంటాను. నీ అమాయిక స్థితికి, నీకు తల్లి లేకపోవుట నా బ్రహ్మచర్యాశ్రమము రెండును కారణములైనవి. పతివ్రతకు భర్త ప్రక్క తప్ప వేరొకచోట స్థానము లేదు. తన సర్వస్వమూ భర్తయేయని తలంచు స్త్రీని పతివ్రత యందురు. పతివ్రతల కెల్లపుడు స్వర్గ ద్వారములు తెరచి యుండును. దేవతలందరు పతివ్రతలను మెచ్చుకొందురు. భర్తయే సర్వస్వమని తలంచు పతివ్రతలకిది గొప్ప కానుక. నీకు, నీ కుమారునికి ఉజ్జ్వల భవిష్యత్తు గలదు. నీ కుమారుని భవిష్యత్తు కొరకైనను, నీ కోసము కాకపోయినను, నీవు దుష్యంతుని వద్దకు వెళ్ళవలెను''.

ముడుతలుపడిన తన చేతులతో కణ్వుడు మనుమని శిరస్సు నిమురుచు యిట్లనెను. ''నీవు నా మనుమడవు. చంద్రవంశపు రాజైన ఐలికునకు కూడ మనుమడవు. నీవు నీ విధి నిర్వర్తించవలెను. ఆ విధముగా నీ తల్లి తన విధిని తప్పక నిర్వర్తించగలదు. ఆమె భర్తను ప్రేమించెను. తన్ను ప్రేమించిన పురుషుని యే స్త్రీ కూడ మరువలేదు. కాని ఆమె అతని వద్దకు వెళ్ళుటకు యిష్టపడుటలేదు. నీవు పౌరవుడవు, భవిష్యత్తులో యీ భూమికి రాజు కానున్నావు. నీ తల్లిని తీసుకుని నీ తండ్రి వద్దకు ధైర్యముగా వెళ్ళుము. నీకు అక్కడ నచ్చకపోయినచో, నీవు నా దగ్గరకు తిరిగి రావచ్చును. నీవిక్కడకు యెప్పుడైననూ రావచ్చును.

తల్లి, కుమారుడు మాట్లాడలేదు. కణ్వుడు శిష్యులను పిలిచి వారితో యిట్లనెను. ''ఈ శకుంతలను తీసుకువెళ్ళి ఆమె భర్తకు అప్పగించి రండు. నే నామెను పంపుట నాకు యిష్టముండి కాదు. కాని స్త్రీకి భర్త ప్రక్కనే స్థానము. ఎక్కువ కాలము తండ్రి వద్దనే యుండుట శ్రేయస్కరము కాదు. లోకులు ఆమెను గురించి అన్యథా తలచెదరు''.

తిరిగి ఆశ్రమమునకు రావచ్చునను ఆశతో బాలుడు ప్రయాణమునకు అభ్యంతరము చెప్పలేదు. అతడిట్ల నెను. ''అమ్మా! ఆలస్యము చేయకు. రాజు వద్దకు వెళ్ళుదము''.

తాతగారైన కణ్వుని పాదములకు నమస్కరించి ఆశీస్సులు పొందెను. తండ్రికి ప్రదక్షిణము గావించి శకుంతల సాష్టాంగ ప్రణామము జేసెను. ఆమె కనులు వర్షించుచుండెను. చేతులు జోడించి ఆమె యిట్లనెను. ''ఇంత కాలము నీవు నన్ను పెంచి పెద్ద దానిని చేసినావు. అజ్ఞానముచేత లేక నిర్లక్ష్యముచేత అనేకసార్లు నీతో పరుషముగా మాట్లాడి యుండవచ్చు. ఒకొక్కపుడు నీ మాట లెక్కచేయక అగౌరవముగా ప్రవర్తించి యుండవచ్చు. చేయకూడని పనులు నేను చేసి యుండవచ్చు. కాని నీవు వాటిని సహించి నన్ను క్షమించవలెను''.

కణ్వుని నేత్రముల నుండి అశ్రువులు ధారగా కారుచుండెను. అతడు మాట్లాడలేకపోయెను. హృదయము విచారముతో బరువెక్కెను. తన ప్రియమైన పుత్రికతో యెడబాటు వలన కల్గిన విచారమును యెట్లో దిగమ్రింగి, శిష్యులతో యిట్లనెను ''ఈమె నా వద్ద మిక్కిలి గారాబముగా పెరిగిన సంగతి మీకందరకూ తెలిసినదే ఆమె అరణ్యములో జన్మించి, యింతవరకు అరణ్యములోనే జీవించెను. ఆమెకు లోకము తెలియదు అసలే విచారముగా నున్న యామెను అతి జాగ్రత్తగా కాపాడుడు. మహారాజుకు అప్పగించి మీరు తిరిగి రండు''.

కణ్వుడు మరల వారితో యిట్లనెను. ''నా యీ సందేశమును మహారాజుకు తెలియజేయుడు. 'అనేక సంవత్సరముల క్రితము నా ఆశ్రమమునకు వచ్చి వివాహమాడిన యీ శకుంతల నీ పుత్రునికి తల్లి అయ్యెను నా ఆశీస్సులతో వారిని నీ వద్దకు పంపుచున్నాను. వారిని స్వీకరించి సుఖముగా నుండుము' '' శకుంతల, ఆమె కుమారుడు కణ్వుని వద్ద సెలవు తీసుకుని మెల్లగా అయిష్టతతో ఆశ్రమము విడిచి నూతన జీవిత మార్గమున నడువసాగిరి అనేక సంవత్సరములుగా అలవాటుపడిన ఆ వాతావరణమును విడిచి వెళ్ళుట ఆమెకు చాల విచారము కలిగించెను తండ్రి విడిచిన కన్నీళ్ల తడి యింకనూ ఆమె తలపై నిలిచియుండెను

## 140 తల్లి, కుమారుడు

అంచెలంచెలుగా ప్రయాణము చేసి, చివరకు ప్రతిష్ఠానపుర ద్వారమును సమీపించిరి. ఈ నగరమందే పూర్వము పురూరవుడు ఊర్వశితో జీవించెను పురూరవుడు దుష్యంతునికి పూర్వుడు నగర ద్వారము చేరి వారు రాజు భవనము ఇంద్ర భవనము వలె, నగరము మధ్యగా నున్నదని కనుగొనిరి. ఆ భవనము ముందర ప్రాంగణములో రాజును చూడగోరువారికి దుష్యంతుడు దర్శన మీయగలడని వారు తెలుసుకొనిరి ద్వారము వద్ద ప్రజలు కొత్తగా నగరమునకు వచ్చిన శకుంతలను, ఆమె తోడివారలను వింతగా చూచుచుండిరి శకుంతలతో వచ్చిన కణ్వుని శిష్యులను, వారు ధరించిన నార వస్త్రములను, వారి జటాజూటములను ఆశ్చర్యముతో చూచుచూ, ప్రజలు వారిలో వారు వ్యాఖ్యానించు కొనుచుండిరి. కణ్వుని శిష్యుల కిది నచ్చలేదు.

హఠాత్తుగా వారు ఆగి యిట్లనిరి. ''శకుంతలా! గురువుగారు కోరినట్లుగా నీ భర్త పాలించు నగరమునకు తీసుకువచ్చితిమి మేము ఆశ్రమమునకు తిరిగి వెళ్ళెదము''. శకుంతలకు కొత్త ప్రదేశము, పరిసరములు భయము కలిగించెను. ఆమె యేదో పోగొట్టుకున్నట్లు భావించెను. అదియును గాక, ఆమె రాజును చూచి చాల సంవత్సరము లయ్యెను. అతడామె యెడల యెట్లు ప్రవర్తించునో యని భయముగా నుండెను ఆమె శిష్యులతో యిట్లనెను ''నాతో రాజభవనము వరకు వచ్చి, రాజు మమ్ము చూచిన తర్వాత మీరు వెళ్ళవచ్చును''.

వారు తల అడ్డముగా త్రిప్పి యిట్లనిరి ''అట్లు చేయుటకు వీలుకాదు. నగర ద్వారము వరకు నిన్ను క్షేమముగా తీసుకు వచ్చితిమి నీవు సునాయాసముగా రాజ భవనమును చేరుకొనవచ్చు. మాకు యీ నగరముతోగాని, నగరవాసులతోగాని పనిలేదు. అన్ని బంధములను త్యజించిన మా వంటి వారికి, యీ నగరముతోగాని, నాగరక పద్ధతులతోగాని ప్రమేయము లేదు మేము తిరిగి వెళ్ళగోరుచున్నాము''. శకుంతల కన్నులు అశ్రువులతో నిండెను. వారు ఆమెను సముదాయించి యిట్లనిరి. ''నీకేమియు భయము లేదు

నీకు అంతయు సవ్యముగా నుండగలదు. వచ్చుచున్నపుడు మార్గములో అన్నియు మంచి శకునములు యెదురైనవి నీ కుమారుడు తప్పక పట్టాభిషిక్తు డగును. నీవు గురువుగారి ఆశీస్సులు పొందినావు ఆయన మాటలు యెన్నడూ వృధా కాలేదు''. వారు నగరము నుండి వెనుతిరిగి తొందరగా నడువసాగిరి. వారు కనుమరుగగు వరకు కుమారుని చేయి పట్టుకుని శకుంతల వారినే చూచుచుండెను వారు వెళ్ళుటతో ఆమెకు ఆశ్రమముతో నున్న ఆఖరి సంబంధము తెగిపోయెను.

శకుంతల విగ్రహమువలె నిల్చియుండి యేదో ఆలోచనలో మునిగి యుండగా, ఆమె కుమారుడు తిరిగి ఆమెను యీ లోకములోనికి తీసుకువచ్చెను. అతడామె చేయి పట్టుకొనగా ఆమె మెల్లగా నడచుచుండెను ఆమె మనస్సు తండ్రి గురించి, ఆశ్రమ జీవితము గురించిన ఆలోచనలతో నిండియుండెను ఆమె సంకోచించుచు చాల మెల్లగా నడచుచుండెను. ఆమె చూపులు దెబ్బతిన్న లేడి చూపులవలె నుండెను. అతడామె చెయ్యిని స్థిరముగా పట్టుకుని ఆమెను నడిపించుచు రాజభవనము వైపుగా నడచెను మబ్బులను తాకుటకు పోటీపడుచున్నట్లు గోచరించుచున్న యెత్తైన అందమైన భవనములు చూచి ఆ బాలుడు ముగ్ధుడయ్యెను ఉత్సాహముతో ఆ బాలుని కనులు ప్రకాశించుచుండెను. ఆమె మాత్రము నిరుత్సాహముతో రాజభవనమువైపు నడచుచుండెను.

వీధిలోని ప్రజలు విచారముతో నున్న ఆమె సౌందర్యమును, ప్రక్కనే సింహమువలె నడచుచున్న బాలుని జూచి ఆశ్చర్యపడిరి వారు తల్లి కుమారులయి యుందురని భావించిరి కొందరిట్లు తలపోసిరి ''స్వర్గపురాణి శచీదేవి కుమారుడు జయంతునితో నడచుచున్నట్లుగా వీరిద్దరు నున్నారు''. మరి కొంద రీవిధముగా భావించిరి ''ఆహా! ఏమి యీమె సౌందర్యము! సాక్షాత్తు లక్ష్మీదేవి యీ నగరమునకు వచ్చి నడుచుచున్నదా యనునట్లున్నది కాని ఆమె చేతియందు యెర్రని పద్మము లేకుండుటచేత లక్ష్మీదేవి కాదని నిశ్చయముగా చెప్పవచ్చు''.

శకుంతల కుమారునితో మృదువుగా మాట్లాడుట జూచిన ప్రజలు యిట్లనుకొనిరి ''ఈమె మరొక లోకమునుండి వచ్చినట్లున్నది ఇటువంటి వారిని యిది వరకెన్నడను చూడలేదు ఆ యువకుని చూడు! అతని నడక సింహము నడచినంత హుందాగా నున్నది అతని మెడ, వక్షము సింహము వక్షమువలె శక్తిమంతమైనవిగా నున్నవి! ఆహా! అతని అవయవ సౌష్టవము యెంత పొందికగా నున్నదో గదా! ఆ ఎర్రని పాదము లెంత అందముగా నున్నవి! అడుగు వేయునపుడు అవి యెంత స్థిరముగా భూమిపై పడుచున్నవో చూడుము. మహారాజు నడచుచున్నట్లున్నది'' మరొక డీవిధముగా అనెను ''నీవు మహారాజు అనగానే, అతని ముఖము ఆకారము చూడగా యేదో స్ఫురించుచున్నది. ఇంతెందుకు, మన మహారాజు దుష్యంతుని వలె నున్నాడు! ఎవరి కుమారుడో? అతనితో హంసవలెనున్న ఆమె మాటలు కోకిల స్వరము వలె నున్నవి ఆమె స్వరము అతి మధురము. ఆమె ముఖము చంద్రబింబమువలె నున్నది ఆమె నవ్వినపుడు మల్లెమొగ్గలు విచ్చెనా యనునట్లున్నది. ఆమె పద్మదళము వర్ణములో నున్నది. చూచినవారికి ఆమె నయనములు పొడవుగా పద్మదళములవలె విశాలముగా నున్నట్లు తోచును. కరగించిన బంగారము వలె ఆమె మేను ప్రకాశించుచున్నది ఆమె యెవరో స్వర్గము నుండి దారి తప్పి యిటు వచ్చినట్లున్నది ఆమె యీ భూలోకమునకు చెందినది కాదు'' ఆ విధముగా ప్రజలు తల్లీ కుమారులను చూచి తలపోయుచుండిరి

లెక్కచేయక శకుంతల రాజభవనము వైపు నడుచుచుండెను కొందరు వారిని అనుసరించిరి ఇంతలో శకుంతల రాజభవన ద్వారము చేరుకొనెను

ఆమె శరీరములో ప్రతి అవయవము వణకుచుండెను. ఆమె కిప్పుడేమి చేయవలెనో తెలియలేదు. ఆమె స్తంభించినట్లు నిలుచుండెను. ఒక చేతితో గుండె పట్టుకుని చూడగా గుండె కొట్టుకొనుట ఆగినట్లు అనిపించెను. రెండవ చేతితో కుమారుని చేయి పట్టుకొనినట్లు గ్రహించి, నిబ్బరముగా నుండుటకు నిశ్చయించుకొనెను. తన కుమారుని కొరకు, మున్ముందు రాజ్యము నేలు తన పుత్రుని కొరకు నిబ్బరముగా నుండదలచెను. తన తండ్రి ఆ విధముగా పలుకుటచే అది సత్యము కాగలదని ఆమె తలంచెను. రాజును పలకరించుటకు ఆమెకు ధైర్యము అత్యవసరము. ఆమె సభా మందిరమువైపు నడచెను. అచట రాజు ప్రజలకు దర్శనమిచ్చి వారి సాధక బాధకములను విని పరిష్కారము చేయునని ఆమె తెలుసుకొనెను.

రాజును యే విధముగా సంబోధించవలెనో, అతనితో యేమి చెప్పవలెనో యని సరియైన వాక్యములను తన మనస్సులో సమకూర్చుకుని మననము చేసుకొనుచుండెను. దుష్యంతుని తలచుకొనగా ఆమెకు సిగ్గు ముంచుకు వచ్చెను. ఆమె తనలో తానిట్లనుకొనెను. ''అతని ముందు నిలిచి నేనేమి మాట్లాడుదును? నేనతనిని 'నాథా' యని పిలువనా? లేక 'మహారాజా' యని సంబోధించనా?'' ఇట్లు ఆలోచించుచుండగనే ఆమె సభా మందిరము చేరుకొనెను.

సూర్యుని వలె ప్రకాశించుచున్న కుమారునితో శకుంతల సభా మందిరములో ప్రవేశించెను.

## 141 దుష్యంతుని నిరాదరణ

దూరము నుండి శకుంతల తలయెత్తి ఆమెకు ప్రియమైన భర్తను గాంచెను. అతడు సింహాసనముపై కూర్చుని యుండెను. అతడు ఇంద్రుని వలె ఆమెకు గోచరించెను. అతనిని చూచి చాల కాలము అయినందున, ఆమె రెప్పవాల్చక అతడి ముఖమునే చూచుచుండెను. అతనిని చూడగలిగినందుకు ఆమెకు చాల సంతోషము కలిగెను. ఆమె తలదించుకుని సింహాసనమువైపు నడచి వెళ్ళెను. అతనికి సవినయముగా నమస్కారము చేసి, పుత్రుని సింహాసనము ముందుకు నెట్టి యిట్ల పలికెను. ''కుమారా! నీ తండ్రియైన రాజుకు నమస్కారము చేయుము'' తర్వాత ఆమె మౌనముగా నిల్చుండెను. సిగ్గుచేత ఆమె మరి మాట్లాడలేకపోయెను. ఒక స్తంభము నానుకుని ఆమె యట్లే నిలుచుండి మధ్య మధ్య తలయెత్తి రాజును చూచుచుండెను, ఉత్సాహముతో ఆమె కనులు ప్రకాశించుచుండగా, తనను తాను అదుపులో నుంచుకొనలేకపోయెను.

సర్వదమనుడు రాజుకు నమస్కరించి, తల్లి ప్రక్కనే నిలుచుండెను. ఆ బాలుని కన్నులు కుతూహలముతో ప్రశ్నించుచున్నట్లు ఉత్సాహమును వ్యక్తము చేయుచుండెను. ''ఇతడా నా తండ్రి!'' అని తనలో తాననుకొనెను. ''అతడు చాల ఉదాత్త పురుషునివలె నున్నాడు. నేను కూడ అతనివలెనే యుందును''. అతడు తల్లివైపు చూడగా ఆమె చిరునవ్వు నవ్వెను.

ఇంతలో వారెవరో, తన వద్దకెందుకు వచ్చిరో రాజునకు తెలియలేదు. ఆమె ''రాజైన నీ తండ్రికి నమస్కరించు'' అని పలికిన మాటలు అతని నాలోచింపజేసెను. ఆమె ఆ విధముగా మాట్లాడుట అనుచితమని భావించెను. తన భావములను వెలిబుచ్చక, గంభీర వదనముతో యిట్లనెను. ''నేను నీకేమి చేయగలను? నీ కుమారునితో నా వద్దకు యేల వచ్చితివి? నీకేమి కావలెనో అడుగుము. సరియైనదేదో అది చేసెదెను''

శకుంతల స్వరము అతి మృదువుగా మెల్లగా నుండుటచే రాజు సరిగా వినలేకపోయెను. ఆమె యిట్లనెను. ''మహారాజునకు ప్రీతి కలిగినచో నేను తప్పక పలికెదను. ఈ బాలుడు నీ వలన నాకు జన్మించెను. నీవు నాకొసగిన వాగ్దానమును - యీ బాలుని యువరాజును చేసెదనని - నెరవేర్చుమని అడుగుటకై వచ్చితిని. నీవు కణ్వుని ఆశ్రమమునకు వచ్చి నన్ను భార్యగా స్వీకరించిన విషయము నీకు గుర్తుచేయ నవసరములేదు. ప్రభూ! ఆరోజు జ్ఞప్తికి తెచ్చుకొని యీ బాలుని నీ కుమారుడుగాను, నన్ను నీ భార్యగాను గైకొనుము. నీతో మా యెడబాటు అనేక సంవత్సరములైనది''.

అనేకమందితో ప్రేమ కలాపములు సలిపిన దుష్యంతుడు, శకుంతలను ఆమె యందలి ప్రేమను మరచిపోయి చాల కాలమయ్యెను. ఆమెతో ప్రేమ అతని జీవితములో క్షణకాలము మాత్రమే యుండెను. కాల గమనములో ఆమెపై ప్రేమ యెన్నడో మాసిపోయెను. ఆమె మృదువుగా తడబడుచు మాట్లాడిన మాటలు విన్న తర్వాత అతనికి కొద్దికొద్దిగా ఆనాటి సంఘటన జ్ఞప్తికి వచ్చెను. కొంతసేపటికి అంతయూ స్ఫురణకు వచ్చెను. కాని అతడు అంగీకరించుటకు యిష్టపడకుండెను. అతడిట్లనెను. ''నాకు అటువంటి దేమియు జ్ఞాపకము లేదు. నిన్ను నే నిదివరకెన్నడును చూచినట్లు లేదు. నీవు నాకు అపరిచితురాలవు. నిన్ను నేను భార్యగా స్వీకరించుట, యీ బాలుడు నా పుత్రుడగుట అసంభవము''. అతడు కొంతసేపు ఆగి, ఆమె యేమి మాట్లాడునో యని వేచి చూచెను. ఆమె మాట రాక నిశ్చేష్టురాలయ్యెను. రాజు మరల యిట్లనెను. ''నీ కథను నేను నమ్మజాలను. నా నుండి యేదో లాభము పొంద నెంచి, వివాహమును నెపముతో నీవు యీ సాహసమునకు పూనుకున్నట్లున్నది. నీతో నాకెట్టి సంబంధము లేదు. నీవు వెళ్ళవచ్చును. నీకు తోచినట్లు నీవు చేయవచ్చును''.

అతని మాటలు ఆమె చెవులకు విషతుల్యముగా నుండెను. ఆమె స్తంభించి నిలుచుండెను. ఆమె తల తిరిగి పడిపోవునేమో యని భావించెను. ఆమె అటువంటి మాటలను వినగలనని ఊహించకుండుటచే, ఆమె హృదయమునకు తీరని ఆఘాతము కలిగెను. కాని ఆమె నిగ్రహించుకొనెను. నిటారుగ నిలుచున్న ఆమె హృదయములో నిస్పృహకు బదులుగా ఆగ్రహము అలలవలె ఉప్పొంగుచుండెను. ఆమె పెదవులు ఆవేశముతో వణకుచుండెను. ఇంతవరకు మృదువైన ఆమె నేత్రములు ఆగ్రహముతో ప్రకాశవంతమయ్యెను. ఆమె వాడి చూపులు రాజును దహించుచున్నట్లుండెను. దీర్ఘముగా అతనివైపు చూపు సారించి ఆమె యిట్లనెను. ''నీకు జ్ఞాపకమున్నది. నీకు సర్వమును జ్ఞాపకమున్నదని నాకు తెలియును. కాని అనాగరకుని వలె ప్రవర్తించుచు జ్ఞాపకము లేదనుచున్నావు. నీ హృదయములో నున్న అంతరాత్మకు తెలుసు. నీ అంతరాత్మ నడుగుము. అది నీకు అంతయు తెలియజెప్పగలదు. నీవు సత్యము పలుకుటలేదు. ఓ రాజా! నీవు తెలిసి అసత్యమాడుచు న్నావు. నీవు శాస్త్ర గ్రంధములు చదివినవాడవు. అసత్యము చెప్పి నీ ఆత్మను నువ్వు మోసగించుచున్నట్లు గ్రహించలేవా? ధర్మము సరళ స్వభావులను, ఉత్తములను రక్షించును, నీవు ధర్మమును అతిక్రమించుచున్నావు. నీవు మహారాజువు, అసత్యము పలుకుచున్నావు.

''మానవుడు రహస్యముగా పాపము చేసి, తనలో తానిట్లు తలచును. 'నేను చేసినది యితరులు యెరుగరు, వారు తెలుసుకొనలేరు. అందుచేత నాకు ఫరవాలేదు'. కాని అతడు చేసిన పాపము దేవతలకు తెలుసు, భూతములకు తెలుసు; సూర్య చంద్రులకు అగ్ని వాయువులకు తెలియును; స్వర్గ భూలోకములకు తెలుసును; ధర్మప్రభువు యమునికి తెలియును, రాత్రి పగలు, ఉదయ సాయం సంధ్యలకు తెలుసు; పాపాత్ముని ప్రవర్తన ధర్మమునకు తెలుసు. వైవస్వతుడైన యముడు, అతని పాపమును తప్పక శిక్షింపగలడు.

''క్షేత్రజ్ఞుడు అనగా అంతరాత్మ - మానవులు చేయు కార్యము లన్నింటికి సాక్షి. అంతరాత్మకు తెలియనిది లేదు.

''తనను తాను అనగా ఆత్మను వంచించుకొను మానవుడు దైవానుగ్రహము పొందలేడు. ఓ రాజా! నా మాటలను వినుము. మరొకసారి నీకు ఆనాటి సంఘటన జ్ఞప్తికి తెచ్చుటకు ప్రయత్నించెదను.

''నీవు కణ్వ మహర్షి ఆశ్రమమునకు నీకై నీవు వచ్చి నన్ను చేబట్టినావు. న్యాయముగా నేను నీ ధర్మపత్నిని. ధర్మపరాయణురాలైన పతివ్రతను, యిప్పుడు నీవు చేసినట్లు, నలుగురిలో అవమానించుట సమంజము కాదు. నేను కోరుకున్నచో యీ భవనమును నేలకూల్చగలను. నీ తల వెయ్యి వ్రక్కలు చేయగలను. భర్త పాపాత్ముడైనప్పటికిని స్త్రీ భర్తను ప్రేమించును. అందుచేత నా ఆగ్రహమును నీపై గాని, నీ రాజ్యముపై గాని ప్రసరింపజేయదలచుకోలేదు.

''ఒక పుత్రునికి తండ్రి యగుట చాల గొప్ప విషయమని చెప్పుదురు. నీ పుత్రుని తీసుకు వచ్చినాను. ఇతడెంత గొప్పవాడో, యితని చూపులు యెంత ఉదాత్తముగా నున్నవో లోకమునకు తెలియును. ఇటువంటి పుత్రుని నిరాకరించు మూర్ఖపు తండ్రి యుండునా? తండ్రి రూపము పుత్రుని యందు ప్రతిబింబించునని జ్ఞానులు చెప్పుదురు. నీ పుత్రునిలో నీ రూపమును చూడగలవు. పుత్రుడు పున్నామ నరకము నుండి రక్షించును. కాని నీ పుత్రుని నీవు అంగీకరించకున్నావు. ఇది చాల చోద్యముగా నున్నది.

''చాల కాలము క్రిందట జరిగిన విషయము మరొక పర్యాయము నీకు జ్ఞప్తికి తెచ్చుటకు ప్రయత్నించెదను. నీవు అరణ్యమునకు వచ్చి ఒక లేడిని వేటాడగా, అది మరొక అరణ్యమందు ప్రవేశించెను. నీవును అందు ప్రవేశించి, అలసిపోయి మాలినీ నదీ తీరమున నున్న కణ్వాశ్రమమునకు వచ్చినావు. ఆశ్రమములో నీవు నన్ను కలసినావు. నేను ఒంటరిగా నుంటిని. నా తండ్రి బయటకు వెళ్ళెను. అతిథిగా నిన్ను గౌరవించి సత్కరించితిని. నేనెవరో నీవు తెలుసుకొనగోరితివి. నేను అప్సరస మేనకకు, మహర్షి విశ్వామిత్రునికి కుమార్తెనని తెలిపితిని. నీవు సరళమైన, మృదు వచనములతో నాతో సంభాషించితివి. అవి తేనెలొలుకు పలుకుల వలె నుండెను. కాని అవి అసత్యములు. నీవు ఆశ్రమములో నన్ను చేబట్టినావు. నీవు గాంధర్వ పద్ధతిలో నన్ను వివాహము చేసుకొనగలనని పలికినావు. తెలివి తక్కువగా నేను నిన్ను నమ్మినాను. నీ మాటలను విశ్వసించి నీ ప్రేమను అంగీకరించినాను. ఇంత జరిగిన తర్వాత కూడ నీకు జ్ఞాపకము లేదనుట ఆశ్చర్యము! పౌరవ చక్రవర్తి యీ విధముగా అసత్యమాడి తనకు చెందిన వారిని నిరాకరించుట అనుచితము. నీవు యీ లోకమునకు ప్రభుడవు. నీవు నాకు భర్తవు. నన్ను, నీ పుత్రుని నిరాకరించుట తగదు. నేను యెప్పుడును దురదృష్టవంతురాలనే. నేను పుట్టిన వెంటనే నా తండ్రి నన్ను నిరాకరించెను. నా తల్లికి నేను అక్కరలేకపోతిని. నన్ను అరణ్యములో వదలి ఆమె వెళ్ళిపోయెను. పక్షులు నన్ను కరుణించి రక్షించెను. ఆ తర్వాత కణ్వ మహర్షి నన్ను పెంచి పెద్ద జేసెను. అతని రక్షణలో నేను పెరిగితిని. తరువాత నా జీవితములో నీవు ప్రవేశించితివి. నా జీవితము నాశనము చేసి, నీవు చేసిన పనులను అంగీకరించకుండుటకు నిశ్చయించుకున్నావు. నేను నా తండ్రి ఆశ్రమమునకు వెళ్ళిపోయెదను. నీవు నన్ను చేపట్టనక్కరలేదు. కాని నీ పుత్రుని అంగీకరించుటకు నిరాకరించవద్దు, అతడు నీ పుత్రుడు అతనిని యువరాజును చేయుము''.

దుష్యంతుడు ఓర్పును కోల్పోయి చాల పరుషముగా యిట్లు పలికెను. ''నాకు నీ వలన పుత్రుడెవడును కలిగినట్లు నాకు తెలియదు. ఆడవారు అసత్యము లాడుటలో అగ్రగణ్యులు. నీవు అతి తెలివిగా కల్పించి

చెప్పిన కథను నేను నమ్మగలనని యెట్లు భావించినావు? నీవు సిగ్గువిడిచి యిక్కడకు వచ్చి బాహాటముగా యే స్త్రీ పలుకలేని విషయములు నీవు చెప్పినావు. నీవొక క్రూర తాపసివి. నీవు యిక్కడ నుంచి పొమ్ము ఘోర తపస్సు చేసిన విశ్వామిత్రుడెక్కడ? మేనక యెక్కడ? వారిద్దరి కుమార్తెనని చెప్పుటకు నీకెంత ధైర్యము! నీవు యీ విధముగా మాట్లాడ తగదు.

''బలముగా యేపుగా పెరిగిన ఒక బాలుని తీసుకువచ్చి నా కుమారుడని చెప్పగా నేనెట్లు నమ్మగిలను. నీవు నీతి నియమములు లేని అధమజాతి స్త్రీ వని భావించెదను. నీవు ఉత్తమ వనితలతో చేరియుండుటకు అనర్హురాలవు నీకు ధనము కావలసినచో కోశాధ్యక్షుడు నీకు బంగారము, నగలు యివ్వగలడు మరొకచోటికి వెళ్ళి నీ నాటకము ప్రదర్శింపుము. ఇక్కడ నుండి వెళ్ళిపొమ్ము. నీ ముఖము మరొకసారి చూపించకుము''.

ఆమెలో సహనము నశించెను. ఆమె విచారమే ఆమెకు ధైర్యము కలిగించెను. తల్లిగా ఆమె తన పుత్రుని హక్కుల కొరకు పోరాడ దలచెను ఏహ్య భావముతో రాజును చూచి ఆమె యిట్లనెను. ''నన్ను ఘోరముగా నిందించుచు నీవు మాట్లాడుట చాల వింతగా నున్నది నాలో యిన్ని పాపములు నీవు కనుగొనుట ఉచితమని తలచినావు కాని నీవు చేసిన మేరు పర్వతమంత పాపము ముందు నా పాపము ఆవగింజంత మాత్రమే కాని నీవు తెలిసి కూడ నీ పాపమును పరిగణించకున్నావు. నేను ఒక మహర్షికి అప్సరకు జన్మించితిని కాని నీవు ఒక సామాన్య మానవుడవు. అంతేకాక పాపాత్ముడవు. నేను ఆకాశములో విహరించగలను నీవు యీ భూమిపై మాత్రమే సంచరించగలవు. నేను మేరు పర్వతమంత మహోన్నతమైన దానను. నీవు ఆవగింజపాటి కూడ చేయవు. నీ పూర్వులలో ఒకరైన ఆయువు, అప్సరస ఊర్వశికి, పురూరవునికి కుమారుడు నీ పుత్రుని తల్లి కూడ ఒక అప్సరస కుమార్తె. ఇంతవరకు యెవరు కూడ ఈ సంతతి సంఘమునకు బాహ్యులని తలచలేదు.

''వేదాధ్యయనమునకన్న, పవిత్ర తీర్థ స్నానము కన్న సత్యము పలుకుట మిన్నయని నీకు తెలియదా? సత్యమునకు మించిన ధర్మము లేదు, అసత్యమునకు మించిన అధర్మము లేదు. బ్రహ్మమే సత్యము అధర్మమును కొనసాగించుచు నీ అంతరాత్మను అనగా బ్రహ్మమును అవమానించకుము. నీవు గుర్తించకపోయి నప్పటికిని నా కుమారుడు యీ లోకమును యేలగలడని చెప్పుచున్నాను అతడు జన్మించినపుడు స్వర్గాధిపతి ఇంద్రుడిట్లనెను· ''శకుంతలా! నీ కుమారుడు చక్రవర్తి యగును'' ఇంద్రుని మాటలు వృధా కావు. కాని యిప్పుడు, నీవు కణ్వాశ్రమమునకు వచ్చినట్లు చూచిన సాక్షులు లేకుండుటచేత నేను నా తండ్రి వద్దకు వెళ్ళుచున్నాను''

శకుంతల వెనుకకు తిరిగి వెళ్ళుచుండెను. ఆమె ఆగ్రహము, శిరోజముల నుండి పొగవచ్చుచున్నట్లు గోచరించెను అతి కష్టముపై ఆమె ఆగ్రహము నిగ్రహించుకుని, కుమారుని చేయి పట్టుకుని ఆ భవనము నుండి, నగరము నుండి వెళ్ళుటకు నిశ్చయించుకొని నడచుచుండెను

## 142 పశ్చాత్తప్తుడైన రాజు

ఆ సభా ప్రాంగణములో అందరును ఆశ్చర్యముతో ఆ దృశ్యమును గమనించుచుండిరి. గుసగుసలు కూడ వినిపించనంత నిశ్శబ్దముగా నుండెను. చూచువారికి యీ నాటకము రక్తిదాయకముగా నుండెను శకుంతల

భవన ద్వారము దాటి బయటకు వెళ్ళెను. కాని సభ నుంచి యెవ్వరును కదలలేదు. ఇంతలో అకస్మాత్తుగా ఆకాశము నుండి యేవో మాటలు వినిపించెను. అవి యిట్లుండెను. ''దుష్యంతా! ఈమె నీకు భార్య, ఆ బాలుడు నిజముగా నీ పుత్రుడు. శకుంతల పలికిన దంతయూ సత్యమే. ఆమెను భార్యగా గౌరవించి, ఆ బాలుని పుత్రునిగా చేరదీయవలసిన బాధ్యత నీపై నున్నది. నీ ప్రాణము వలె నీ కుమారుని చూచుకుని అతనికి రక్షణ కలిగింపుము. అతడు నీకన్న గొప్ప చక్రవర్తి కాగలడు. ఇప్పటికే చాల బాధ ననుభవించిన శకుంతలను అవమానించకుము''.

ఆకాశములో దేవతలు సమావేశమైరి. ప్రజలకు వారు స్పష్టముగా గోచరించుచుండిరి. వారిట్లనిరి. ''నీ పుత్రుని స్వీకరించి, అతడు నీ వారసుడని ప్రకటించుము. శకుంతల చెప్పిన దంతయు సత్యమే. నీ తర్వాత నీ కుమారుని రాజు చేసెదనని ఆమెకు వాగ్దాన మొసగినావు. స్త్రీ ఆగ్రహము కుటుంబము నంతను నాశనము చేయగలదు. తొందరగా వెళ్ళి ఉత్తమురాలైన నీ భార్యను సముదాయించుము. నీ కుమారుని 'భరతు'డని పిలువుము. ఎందుకనగా మేము నిన్ను ఆ బాలుని చేరదీసి రక్షించమని కోరుచున్నాము ( భర యనగా గౌరవము, రక్షణ,). నీ కుమారుని మూలముగా నీ కుటుంబము భరత కుటుంబమని, యీ లోకము 'భారతావని' యని పేరు గాంచును.

దేవతలు, శకుంతలా భరతులపై పుష్ప వర్షము కురిపించిరి. దుష్యంతుడు సింహాసనము దిగి దేవతలను పూజించెను. తర్వాత సభా మందిరములరో వారందరి నుద్దేశించి యిట్లు పలికెను. ''మీరు దేవతలు, ఋషులు పలికిన మాటలు వినియున్నారు. నేను అసత్యమాడలేదు. ఈ బాలుడు నా కుమారుడేనని నాకు తెలియును. నా ప్రియ భార్య కూడ నాకు జ్ఞాపక మున్నది. కాని నేను, ఆమెను ఆమె కుమారుని కేవలము ఆమె మాటలపై నాధారపడి స్వీకరించ దలచలేదు. నా పుత్రుని తల్లిదండ్రుల పవిత్రత గురించి యెవరికీ యెట్టి సందేహము నుండరాదని తలచితిని. మీరందరు కూడ శకుంతల న్యాయముగా నా ధర్మపత్ని యని తెలుసుకొనవలెనని భావించినాను. లోకులు వేలు చూపి, 'పౌరవరాజు దుష్యంతుడు యెవరో స్త్రీ వచ్చి భార్యనని చెప్పగా ఆమెను అంతఃపురము లోనికి తీసుకువెళ్ళినాడు. ఆమె అందముగా ఉండుటచే, రాజు ఆమె చెప్పినది నిజమగునో కాదో తెలుసుకొనలేదు' అని నిందించుట నా కిష్టము లేకుండెను. నాకు గాని, నా భార్య పుత్రులకు గాని, యెటువంటి కళంకము ఉండరాదని యిట్లు చేసితిని. నామాటలను నా రాణి క్షమించగలదని ఆశించుచున్నాను. ఆమె శ్రేయస్సు కోరి ఆమెకు లాభము చేకూర్చుటకే నేనిట్లు పలికితిని''.

దుష్యంతుడు నడచివెళ్ళి, ఆ బాలుని సర్వదమనుని చేయి పట్టుకుని తన గుండెల దగ్గరకు చేర్చుకుని గాఢముగా కౌగిలించుకొనెను. సంప్రదాయానుసారముగా బాలుని నుదుటి నాఘ్రాణించెను. తరువాత నెమ్మదిగా తడబడచున్న అడుగులతో శకుంతల వద్దకు వెళ్ళి ఆమెను సమాధానపరచెను. అతడిట్లనెను. ''ప్రేయసీ! నిన్ను నేను కలిసి భార్యగా స్వీకరించిన విషయ మిక్కడి ప్రజలకు తెలియదు. నిన్ను ప్రశ్నించకుండ నీవు నా భార్యవని ఋజువు చేయకుండ స్వీకరించినచో వారు నమ్మి యుండెడివారు కారు. లోకులు యితరుల గురించిన చెడును తేలికగా విశ్వసించెదరు. ముఖ్యముగా స్త్రీల విషయములో, ఉన్నత పదవుల నలంకరించిన వారి విషయములో యిది సత్యము. ఆ కారణముచేతనే నేను నీతో పరుషముగా మాట్లాడితిని. నా మాటలను, ప్రవర్తనను నీవు క్షమించవలెను. భర్తలు నిజముగా తప్పు చేసినప్పటికిని పతివ్రతలు వారిని క్షమించెదరు. నీవు యీ విషయము మరువగలవని తలంచెదను''

దుష్యంతుడు శకుంతల చేయి పట్టుకుని అంతఃపురమునకు తీసుకువెళ్ళెను. అతడు తన తల్లి వద్దకు ఆమెను తీసుకువెళ్ళి యిట్లనెను. ''అమ్మా! నీ కోడలిని, మనుమని చూడుము''. ఆమె ఆశ్చర్యపూరిత నేత్రములు ప్రశ్నించుచున్నట్లుండెను. ''అమ్మా! నా భార్య, మేనకా విశ్వామిత్రుల కుమార్తె. ఆమె కణ్వమహర్షి పెంపకములో పెరిగెను. ఇప్పుడు నీకు కోడలైనది''. శకుంతల ఆమె పాదములకు నమస్కరించెను. ఆమె శకుంతలను లేవనెత్తి కౌగిలించుకొనెను. ఆమె శకుంతలతో యిట్లనెను. ''నీవు చాల అందముగా నున్నావు. ఈ లోకమునకు చక్రవర్తికాగల నీ కుమారునకు తల్లివగుట నీ మహద్భాగ్యము. అతడు లోకములన్నిటినీ జయించగలడు. ఈ నూతన వాతావరణములో నీవు సుఖముగ నుండి నా కుమారుని సుఖపెట్టుము''.

శకుంతలను మహారాణిగా ప్రకటించి, కుమారుని యువరాజుగా పట్టాభిషిక్తుని చేయుటకు ముహూర్తము నిశ్చయించమని రాజు పురోహితులను ఆదేశించెను. ఆ బాలునికి లాంఛనముగా భరతుడని పేరిడి, యువరాజుగా పట్టాభిషేకము చేసిరి. రాజ్యములో ప్రజలందరు ఆనందోత్సాహములను ప్రదర్శించిరి. దుష్యంతుడు నూరు సంవత్సరములు పాలించెను.

## 143 రంతిదేవుడు

భరతుని వంశములో రంతిదేవుడను రాకుమారుడు జన్మించెను. అతని ఖ్యాతి ముల్లోకములకు వ్యాపించెను. అతడు ఉత్తమ దానశీలుడని యిప్పటికిని ప్రజలు గుర్తు పెట్టుకొనినారు.

ఆకాశము నుండి వర్షము పడునంత తేలికగా అతనికి విశేషమైన సంపద ఒనగూడెను. తన సంపదను ధారాళముగా దానము చేయుచుండెడివాడు. కొంత కాలమునకు సంపద యంతయు దానధర్మములకు వినియోగమై, యేమియు మిగలకుండెను. అతడు ఆకలితో నున్నప్పటికిని యితరుల కిచ్చుట మానలేదు.

అతడు పేదవాడయ్యెను. నలుబది యెనిమిది రోజులు కటిక దారిద్ర్యముతో బాధ పడెను. అతడు భుజించుట కేమియు లేకుండెను. అతని భార్య పిల్లలు కూడ ఆకలితో అలమటించుచుండిరి. నలబది తొమ్మిదవరోజు, అతడెట్లో కొంచెము పాలతో వండిన అన్నము, నెయ్యి, గోధుమరొట్టెలు, మంచినీరు సంపాదించెను. అనుష్ఠానము లన్నియు పూర్తి గావించుకుని, భుజించుటకు కూర్చొనెను. ఇంతలో ఒక బ్రాహ్మణుడు వచ్చి అన్నము పెట్టమని యడిగెను. రంతిదేవుడు తనలో తానిట్లనుకొనెను. ''నారాయణుడు సర్వత్ర యున్నాడు. బహుశః అతడే యీ రూపములో వచ్చి అన్నము పెట్టమని అడుగుచున్నాడు''. అతడా బ్రాహ్మణునకు తాను అతి ముఖ్యమని తలంచిన, అన్నమును, పాలును ఆ బ్రాహ్మణునకు పెట్టెను. బ్రాహ్మణుడు సంతృప్తి చెంది వెళ్ళిపోయెను. రంతిదేవుడు ఆనందముతో మరల భోజనమున కుపక్రమించెను. మిగిలిన దానిలో కొంత భార్యకు, పిల్లలకు పెట్టెను. తాను తినబోవునంతలో ఒక అధమజాతివాడు వచ్చి భోజనము పెట్టమని అడిగెను. బ్రహ్మము సర్వవ్యాపియని గ్రహించి, రంతిదేవుడు తనకు మిగిలిన ఆహారమును ఆ అధమజాతి వానికిచ్చివేసెను. అతడు వెళ్ళిన తర్వాత ఒక ముష్టివాడు వచ్చెను. అతనితో నాలుగు కుక్కలుండెను. రంతిదేవుడు, యింట మిగిలిన ఆహారమంతయు వానికిచ్చి, అతనికి అతనితో వచ్చిన కుక్కలకు తృప్తి కల్గించితినని సంతోషించెను. ఇక త్రాగుటకు నీరు మాత్రమే మిగిలెను.

తనకు ఆ జలము సరిపోవునని యెంచి త్రాగుటకు సిద్ధపడుచుండగా ఒక చండాలుడు (అస్పృశ్యుడు) వచ్చి మంచినీరు యిమ్మని అడిగెను. ఆ చండాలుని చూచిన రంతిదేవుని హృదయము కరుణతో నిండెను. అతడిట్లనెను. ''నాకు సంపద అక్కరలేదు, నాకు స్వర్గమును అక్కరలేదు ఇతరుల బాధలను నేను గ్రహించి, వారిని బాధా విముక్తులను చేయుటే నేను కోరునది నేను యీ పేదవానికి మంచినీరు యిచ్చి అతనికి నూతనముగా ప్రాణము పోసినట్లు భావించితిని నా ఆకలి, దాహము, అలసట, నీరసము, విచారము, బాధ అన్నియు నన్ను విడిచి వెళ్ళెను వాటితో బాటు నాకు గల భ్రాంతులు, అనురాగ బంధములు అన్నియు వీడినవి''. తనకు మిగిలిన ఆ మంచినీటిని చండాలునకిచ్చెను. వచ్చిన అతిథులు తమ నిజస్వరూపమును ప్రకటించిరి వారు బ్రహ్మాది దేవతలు రంతిదేవుని వారు మెచ్చుకొనిరి. రంతిదేవుడు వారిని పూజించెను. వారినేమియు అతడు కోరలేదు అతని మనస్సు నారాయణుని యందు ఉన్నది నారాయణుని గూర్చి స్మరించుచుండగనే, త్రిగుణములతో కూడిన మాయ అనే ఆవరణము, కలకరిగి పోయినట్లుగా, అంతరించెను. రంతిదేవుడు పరమాత్మతో ఐక్యమయ్యెను.

. . . . . . . . . . . . . . . . . . . .

చంద్రవంశములోని రాజులలో ప్రసిద్ధుడైన కురుమహారాజు సోదరుడు రంతిదేవుడు. అతడు భరత వంశములోని వాడు అతని రాజ్యములో ప్రజలు సుఖించుచుండిరి కురుజాంగల మందు కురువు తపస్సు చేసెను ఆ ప్రదేశము పునీతమై కురుక్షేత్రముగా ప్రసిద్ధికెక్కెను

. . . . . . . . . . . . . . . . . . . . . . . .

దివోదాసుడు చంద్రవంశపు రాజులలో ఒకడు. అతని నూర్గురు కుమారులలో కనిష్ఠుడు పృష్టుడు. పృష్టుని కుమారుడు ద్రుపదుడు ద్రుపదుని కుటుంబములో ఉపరిచరవసువు అను రాజు కలడు అతని కుమారుడు బృహద్రథుడు ప్రఖ్యాతిచెందిన జరాసంధుని తండ్రిగా బృహద్రథుడు చిరస్మరణీయుడైనాడు బృహద్రథుని సోదరులలో ఒకడు చేది దేశమునకు రాజు

ప్రతీపుడు కౌరవుల పూర్వులలో ఒకడు ప్రతీపునకు ముగ్గురు కుమారులు — దేవాపి, శంతనుడు, బాహ్లికుడు. దేవాపికి రాజ్యమందు యిష్టములేక యౌవనమందే తపస్సు చేయుటకు అడవికి వెళ్ళెను.

శంతనుడు రాజయ్యెను అతని రాజ్యములో అనావృష్టి కలిగెను పన్నెండు సంవత్సరములు రాజ్యములో వర్షములు లేకుండెను దీనికి అతడు కారణములు తెలుసుకొనదలచెను. కొందరిట్లనిరి. ''నీ సోదరునికి చెందవలసిన రాజ్యమును నీవు పాలించుటచే, 'పరివేత్త'వై పాపము కట్టుకొంటివి. ఈ రాజ్యమును నీ సోదరునకిచ్చివేయుము'' వారి హితమును శంతనుడు అనుసరించెను కాని, అంతకుమునుపే దేవాపి, వేదము లనుమతించని పాషండ సాంప్రదాయమును స్వీకరించెను దేవాపి రాజ్యము నేలుట కనర్హుడని నిశ్చయించి, ఇంద్రుడు యెండిపోయిన భూములపై మేఘములు వర్షించునట్లు చేసెను. దేవాపి యోగిగా రూపొంది, కాలపి అను గ్రామములో నివసించుచుండెను కలికాలములో చంద్రవంశము అవతరించిన అనంతరము, తర్వాత మన్వంతరమున అనగా కృతయుగమున అతడు తిరిగి పునరుద్ధరించును

శంతనుని మరియొక సోదరుడైన బాహ్లికుని కుమారుడు సోమదత్తుడు. సోమదత్తుని కుమారుడు భూరి. భూరి కుమారుడు భూరిశ్రవసుడు. భూరి మరియొక కుమారుని పేరు శలుడు

# 144 గంగ, వసువులు

ఒకప్పుడు మహాభిషుడను గొప్ప రాజు కలడు. అతడు ఇంద్రుని ఆస్థానమునకు వెళ్ళగా, ఇంద్రుడతనికి అర్ధాసనము యిచ్చెను ఇట్టి గౌరవము బహుకొద్దిమంది రాజులకు మాత్రమే కలిగెను.

ఆస్థానమునకు వచ్చిన రాజుపై గంగ దృష్టి పడెను. ఆమె వెంటనే తన దృక్కులను మరల్చుకొనెను. ఇంద్రుడు యిది గమనించి యిట్లనెను. ''నీవు దేవతవైనప్పటికివి యీ రాజు నీ కనులకు ప్రీతి కలిగించెను. ఈ రాజుకు తరువాత జన్మలో నీవు భూలోకమున పుట్టి భార్యవగుదువు''.

నిరుత్సాహముతో గంగాదేవి నడచుచుండగా, భూలోకమున జన్మింప శాపమొందిన అష్టవసువులు ఆమె కెదురేగి నమస్కరించి, ఒకరినొకరు తమ దురదృష్టములను తెలుపుకొనిరి అంతట వసువులు గంగాదేవితో యిట్లనిరి. ''అమ్మా మందాకినీ! మాకొక సహాయము చేయుము మేము నీకు పుత్రులుగా జన్మించెదము కాని మానవుల మధ్య జీవించుట మాకు యిష్టము లేదు అందుచేత, మమ్ములను పుట్టిన వెంటనే నదిలో పడవేయుము ఈ విధముగా మా శాపము పరిసమాప్తమగును మానవలోకములో జీవించుట తప్పును'' గంగాదేవి అట్లు చేయుట కంగీకరించెను

ఆమె వాగ్దానమును నిలబెట్టుకొనెను. కాని అష్టవసువులలో అల్లరితనము, దుష్టచింతనలు గల ఒక వసువు మాత్రము, నదిలో పడద్రోయుటచే జీవితము ముగించక, యీ మానవలోకములో దేవవ్రతుడుగా జీవించెను.

మహాభిషుడు శంతనుడుగా జన్మించెను. అతడు గంగాదేవిని వివాహమాడెను వారికి పుట్టిన యేడుగురు కుమారులను నదిలో పడవేసెను. ఎనిమిదవ పుత్రుని నదిలో పడవేయు సమయములో, అతడు ఆమెను వారించెను. అందుచే ఆమె పుత్రుని తీసుకొని భర్తను విడిచి వెళ్ళిపోయెను ఆ బాలుడు దివ్యగురువుల అండదండలతో పెరిగిన తర్వాత, తిరగి శంతనునకు ఆమె అప్పగించెను అతడే దేవవ్రతుడు. ఆ తర్వాత శంతనుడు సత్యవతి యను అందమైన యువతిని ప్రేమించెను ఆమె ఒక జాలరివాని కుమార్తె ఆమెకు కలిగిన కుమారుడు చక్రవర్తి కావలెనని ఆ జాలరి కోరెను.

దేవవ్రతునికి రాజ్యము చెందవలసి యుండుటచే, శంతనుడు జాలరివాని కోరికను అంగీకరించకుండెను దేవవ్రతునికీ విషయము తెలిసెను. తండ్రికి తెలియకుండ, దేవవ్రతుడు జాలరి వాని వద్దకు వెళ్ళి అతని కుమార్తె సత్యవతిని తీసుకువచ్చి శంతనునకు వివాహము గావించెను దేవవ్రతుడు వివాహము చేసుకొననని, సత్యవతికి కలిగిన కుమారుడు తన తండ్రి శంతనుని తర్వాత రాజు కాగిలడని ప్రతిజ్ఞబూనెను తీవ్రమైన అతని ప్రతిజ్ఞకు మెచ్చి లోకులు 'భీష్మ'డని పిలుచుచుండిరి.

సత్యవతికి చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడని యిద్దరు పుత్రులు కలిగిరి ఇద్దరును చిన్నతనమునందే మరణించిరి. గంధర్వులతో యుద్ధము చేయుచు చిత్రాంగదుడు మరణించెను విచిత్రవీర్యుడు రోగమువల్ల మరణించెను. అతడు మరణించుటకు ముందు కాశీరాజు కుమార్తెలైన అంబిక, అంబాలికలను వివాహమాడెను అతడు మరణించునాటికి సంతానము లేకుండెను. అందుచే చంద్రవంశము అంతరించునని అందరకును భయము కలిగెను

శంతనునితో వివాహమునకు పూర్వము పరాశరమహర్షి వలన సత్యవతికి వ్యాసుడు జన్మించెను. విచిత్రవీర్యుడు మరణించిన తర్వాత అతని తల్లి సత్యవతి వ్యాసుని పిలిపించి, విచిత్రవీర్యుని భార్యలను స్వీకరించమని చెప్పెను. వ్యాసుడు ఆమె కోరినట్లు చేసెను. వ్యాసునకు ముగ్గురు పుత్రులు కలిగిరి. ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు. విదురుడు ఒక దాసికి జన్మించెను. అందుచేత అతడు క్షత్రియుడుకాడు.

ధృతరాష్ట్రుడు గాంధార రాజపుత్రి గాంధారిని వివాహమాడెను. వారికి నూర్గురు పుత్రులు కల్గిరి. దుశ్శలయను పుత్రిక కూడ కలిగెను. పుత్రులలో జ్యేష్ఠుడు దుర్యోధనుడు.

పాండురాజు భార్యలు కుంతి, మాద్రి. అయితే శాపకారణము చేత వారియందు సంతానము బడయలేకుండెను. చిన్నతనమునందు నేర్చిన దివ్యమంత్రముల నుచ్చరించి యముని, వాయువును, ఇంద్రుని ఆహ్వానించగా, వారివలన వరుసగా యుధిష్ఠిర, భీమ, అర్జునులను పుత్రులు కుంతిదేవికి కలిగిరి. అదే మంత్రము చేత అశ్వినీదేవతలను ఆహ్వానించగా, మాద్రికి నకుల సహదేవులు జన్మించిరి.

ఈ అయిదుగురు ద్రుపదరాజు కుమార్తె ద్రౌపదిని వివాహమాడిరి. భీముడు హిడింబిని కూడ వివాహమాడెను. వారి కుమారుడు ఘటోత్కచుడు. అర్జునుడు ఉలూపియను నాగికన్యను వివాహమాడెను. వారికి ఐరావంతుడను పుత్రుడు కలిగెను. అర్జునుని మరియొక భార్య మణిపురి రాజపుత్రియైన చిత్రాంగద. ఆమె కుమారుడు బభ్రువాహనుడు. ఇతడు పుత్రికాసుతుడు, అనగా మణిపురి రాజునకు పుత్రులు లేకుండుటచే ఆ రాజ్యమునకు వారసుడయ్యెను. అర్జునుడు సుభద్రను వివాహమాడెను. ఆమె కుమారుడు అభిమన్యుడు. ''అభిమన్యుడు ఉత్తరను వివాహమాడెను. నీవు వారికి కుమారుడుగా జన్మించినావు'' అని శుకుడు పరీక్షిత్తుతో చెప్పెను. ''యాదవుడైన కృష్ణుని అనుగ్రహముచేత నీవు అశ్వత్థామ అస్త్రముబారి నుండి రక్షణ పొందినావు''.

## 145 యాదవ వంశము

యయాతికి అయిదుగురు పుత్రులు — యదు, ద్రుహ్యు, తుర్వసు, అను, పూరుననువారు. పూరువు తండ్రికి ప్రియమైన వాడగుటచే రాజ్యము నతని కప్పగించెను. పూరు వంశములోనివాడు శంతనుడు, కౌరవులకు పాండవులకు ప్రపితామహుడు.

యయాతి పెద్ద కుమారుడు యదువుకు రాజ్యపాలనమందు ఆసక్తి లేకుండెను. అతడు చిన్న రాజ్యము నొకదానిని పాలించవలసి వచ్చెను. అతని వంశములో ఒకడు వీతిహోత్రుడు. అతని కుమారుడు మధుడు. మధునికి నూర్గురు పుత్రులు. వారిలో జ్యేష్ఠుడు వృష్ణి. వారి సంతతి మాధవులని, వృష్ణులని పేరొందిరి. వారి వంశములో దశార్హుడు తరువాతివాడు. అందుచే యాదవకులము వారు దాశార్హులని కూడ పేరు గాంచిరి. యాదవులలో ఒకడైన సాత్త్వతునకు యేడుగురు పుత్రులు: భజమానుడు, భజి, దివ్యుడు, వృష్ణి, దేవావృధుడు, అంధకుడు, మహాభోజుడు. వీరు అంధక, వృష్ణి భోజ రాజ్యములకు మూలపురుషులు.

వృష్ణికి యిద్దరు కుమారులు. వీరిలో ఒకడైన యుధజిత్తునకు శిని, అనమిత్రుడు అను యిద్దరు పుత్రులు కలిగిరి. శిని కుమారుడు సత్యకుడు. సత్యకుని కుమారుడు యుయుధానుడు. కాని యితనిని సాత్యకి యను

పేరుతో పిలిచెడివారు. అనమిత్రుని కుమారుడు నిర్మనుడు. నిర్మనునికి యిద్దరు పుత్రులు: సత్రాజిత్తు, ప్రసేనుడు.

యాదవులలో ఒకడైన అంధకుని సంతతిలో వాడు ఆహుకుడు. ఇతనికి దేవకుడు, ఉగ్రసేనుడు యని యిద్దరు పుత్రులు. దేవకునకు దేవకియను కుమార్తె గలదు. ఆమె వివాహము వసుదేవునితో జరిగెను.

శూరుడు దేవమీఢుని కుమారుడు. శూరుని పదిమంది పుత్రులలో జ్యేష్ఠుడు వసుదేవుడు. వసుదేవుడు జన్మించినపుడు స్వర్గములో మధుర గానము వినిపించెను. డోలు, సన్నాయి మొదలగు వాయిద్యములు మ్రోగెను. సాక్షాత్తు నారాయణుడు మానవరూపము ధరించి వసుదేవునికి పుత్రుడుగా జన్మించునని సూచించున ట్లుగా అనేక దుందుభులు స్వర్గమున మ్రోగెను. అందుచేత వసుదేవుడు 'ఆనకదుందుభి' గా ప్రసిద్ధికెక్కెను. శినికి స్వయంభోజుడను కుమారుడొకడు కలడు. స్వయంభోజుని కుమారుడు హృదికుడు. శతధను, దేవబాహు, కృతవర్మ అను మువ్వురు హృదికుని కుమారులు. వసుదేవునికి అయిదుగురు అక్కచెల్లెండ్రు కలరు : పృథ, శ్రుతదేవ, శ్రుతకీర్తి శ్రుతశ్రవస్స, రాజాధిదేవి. కుంతిభోజుడు శూరునకు స్నేహితుడు. కుంతిభోజునకు సంతానము లేకుండెను. అందుచే శూరుడు తన కుమార్తె పృథను కుంతిభోజునకు దత్తత యిచ్చెను. అప్పటి నుండి ఆమె కుంతీదేవి యని పేరొందెను. ఆమె పాండవుల తల్లి.

కరూష దేశపురాజు వృద్ధశర్మ శ్రుతదేవను వివాహమాడెను. శ్రుతదేవ కుమారుడు దంతవక్త్రుడు. నారాయణుని ద్వారపాలకుడైన జయునికిది మూడవ జన్మ. ఇంతకుముందు హిరణ్యకశిపుడుగా, రావణుడుగా జన్మించెను.

శ్రుతకీర్తి కేకయరాజును వివాహమాడెను. వారికి అయిదుగురు పుత్రులు జన్మించిరి. వారు కేకయ సోదరులుగా ప్రసిద్ధికెక్కిరి. కురుక్షేత్ర సంగ్రామములో ఉత్సాహముగా పాల్గొనిరి. అవంతిరాజు జయసేనుడు రాజాధిదేవిని పరిణయమాడెను. వారి పుత్రులు విందుడు, అనువిందుడు కూడ కురుక్షేత్ర యుద్ధములో ప్రముఖ పాత్ర వహించిరి. రాజాధిదేవి కుమార్తె మిత్రవిందను శ్రీకృష్ణుడు వివాహమాడెను.

చేది దేశాధిపతి దామఘోషుని శ్రుతశ్రవస్స వివాహమాడెను. ఆమె కుమారుడు శిశుపాలుడు. నారాయణుని ద్వారపాలకుడు విజయుడు మూడవ జన్మలో శిశుపాలుడుగా జన్మించెను. ఇంతకు ముందు రెండు జన్మలలో అతడు హిరణ్యాక్ష, కుంభకర్ణులుగా జన్మించెను.

వసుదేవునికి యేడుగురు భార్యలు: పౌరవి, రోహిణి, భద్ర, మదిర, రోచన, ఇళ, దేవకి.

రోహిణి కుమారులు: గద, సారణ, బలరామాదులు. దేవకికి ఎనిమిది మంది సంతానము కలిగెను. వారిలో ఆరుగురిని కంసుడు చంపివేసెను. ఏడవవాడు బలరాముడు. మొదట దేవకి గర్భములో యేర్పడిన బలరాముడు తరువాత విష్ణుమాయచే రోహిణి గర్భమున ప్రవేశించెను. నారాయణుడు దేవకీ వసుదేవులకు అష్టమ పుత్రుడుగా జన్మించెను.

ఈ భూమిపై ధర్మము క్షీణించినపుడు, అధర్మము ప్రబలినపుడు భగవంతుడు మానవరూపములో అవతరించుటకు నిశ్చయించుకొనును. అధికార మదాంధులైన రాజులు, మానవ రూపములో నున్న అసుర లక్షణములను కలిగిన రాజుల నుండి యీ లోకమును రక్షించుటకు భగవంతుడు యాదవ కులములో

జన్మించెను అధర్మ ప్రభువులు యీ భూమిపై చేయు అకృత్యములచేత వారిని నిర్మూలించి, వారి రక్తముతో యీ భూమిని పునీతము గావింపదలచి భగవంతు డవతరించెను ఇందుకొరకు భగవంతుడు, బలరామునితో (అనంతుని అంశము) వృష్ణి వంశములో అవతరించెను అతడాచరించిన కార్యములను యెవ్వరును, యెన్నటికిని మరువలేరు కృష్ణావతారము అవతారము లన్నింటిలోను మహాగొప్పది. ఇది పూర్ణావతారము.

కలియుగములో లోకమంతయు పాపభూయిష్ఠమైనపుడు, వసుదేవుని కుమారుడుగా జన్మించిన భగవంతుని కీర్తి ప్రతిష్ఠలు అజ్ఞానము, దుఃఖము, బాధ మున్నగువాని నుండి విముక్తి కలిగించును శ్రీకృష్ణుని అద్భుత చర్యలను ఒక్కసారి వినిన, మానవుల కర్మవాసనలు మటుమాయమగును. పవిత్ర తీర్థములలో ఆచమనము చేయునంత పరిశుద్ధమైనది అతడు భోజ, వృష్ణి, అంధక, మధు, శూరసేన, దశార్హులకు ప్రియుడు పాండవులకు అత్యుత్తమ ప్రియుడు

అతని రూప మతి సుందరము అతని చూపులు దయాపూరితములు అతని నవ్వు అందరినీ ఆకట్టుకొనును అతని మాటలు అతి గంభీరములు అతని శక్తి సర్వవిదితము ఈ అవతారముతో భగవంతుడు లోకులను ముగ్ధులను చేసెను మకరకుండలములను చెవులకు ధరించెను అతని నవ్వుతో తన అందమైన ముఖమును చూచువారి కనులను ఆకట్టుకొనుచుండెను. అతడనేక వైభవోపేత కార్యములు చేసి లోకుల మెప్పు పొందెను అతడు తన సహజ రూపముతో జన్మించెను శంఖము, చక్రము, నాలుగు భుజములతో దేవకికి దర్శనమిచ్చి తన మాట నిలబెట్టుకొనెను కొద్ది క్షణముల తర్వాత మానవ శిశురూపము దాల్చెను

అతడు గోకులములో పెరిగెను. అనేకమంది అసురులను సంహరించి గొప్ప గొప్ప కార్యములు సాధించెను ఈ భూమిపై నూట యిరువదియైదు సంవత్సరములుండి, తిరిగి వైకుంఠము చేరెను మానవ శ్రేయస్సుకై అతడీ భూమిపై వైభవోపేతమైన జీవితము గడపెను

## 146 అధర్మము ప్రబలుట

శుక మహర్షి చెప్పుట ఆపివేసెను. అతడు భగవదవతార గాథను చెప్పుట కొనసాగించునని పరీక్షిత్తు వేచియుండెను కాని శుక మహర్షి ధ్యానములో లీనమయ్యెను. దేవకీ వసుదేవుల గురించి చెప్పుచున్నపుడు మహర్షి మనస్సు నారాయణుని పాదములపై నిలిచెను. ఆ నారాయణుడే రూప నామములు ధరించి యీ లోకమును అధర్మము నుండి విముక్తి గావించుటకు యీ భూమిపై అవతరించెనను ఆలోచనలు అతని మనస్సున నిండి యుండెను శుకుడు తన మనోనేత్రముతో భగవంతుడు గావించిన అనేక అద్భుత కార్యములను గాంచుచుండెను కనుల నుండి అశ్రువులు కారుచుండగా, అతడు మాట్లాడలేకపోయెను కొన్ని క్షణముల తర్వాత కనులు తెరచెను.

పరీక్షిత్తు యిట్లు పలికెను ''మునీంద్రా! ఇంతవరకు మీరు సూర్య చంద్రవంశపు రాజుల గాథలు వివరించినారు యాదవకులమును భగవంతుడు తన తరువాతి అవతారమునకు యెన్నుకున్నట్లు చెప్పినారు. శ్రీకృష్ణావతారము సంపూర్ణావతారమని, అనంతుడే బలరాముడుగా అవతరించెనని కూడ తెలియచెప్పినారు వారు యీ లోకములో జీవించిన కాలములో జరిగిన అనేక సంఘటనలను వివరముగా చెప్పగోరుచున్నాను.

''కోరికలకు అతీతులైన నీవంటివారు ప్రతిదినము, నిత్యమును శ్రీకృష్ణుని కీర్తింతురు భగవంతుని కీర్తనలను వినగా మానవుడు జనన మరణములనే భయంకర రోగము నుండి విముక్తి పొందగలడు గోహత్య వంటి మహాపాపములను చేసిన వారు కూడ భగవత్కథలను వినినంతనే పాప విముక్తులగుదురు ముక్తుడు, ముముక్షువు, విషయి — యీ ముగ్గురు ముందుగానో, వెనుకగానో మోక్షమందుట తథ్యము ముముక్షువు మోక్షమును కోరును, అనగా తొందరగా యీ లోకములోని బంధముల నుండి విముక్తినభిలషించును అతని ప్రయత్నములకు ఫలితము చేకూరును సంసార కూపములో చిక్కుకున్న విషయ లోలురు కూడ, శ్రీకృష్ణ గాథను శ్రద్ధగా వినుటకు ప్రయత్నించినచో మోక్షము నందుకొనగలరు ఈ కారణములతోబాటు నేను శ్రీకృష్ణావతార కథలను వినుటకు పురికొల్పిన గొప్ప కారణము మరి యొకటి కలదు కురుక్షేత్ర సంగ్రామ సమయములో, కురుక్షేత్ర సంగ్రామమను నదిని మా తాత ముత్తాతలు క్షేమముగా దాటుటకు శ్రీకృష్ణుడు నావగా ఉపకరించెను ఆ నదికి భీష్ముడు, ద్రోణుడు రెండు గట్ల వలె నుండిరి జయద్రథుని నాయకత్వములోని విశేషమైన సేనాబలము ఆ నదిలోని జలము, కృపాచార్యుడు నాశము గావించు నదీ ప్రవాహవేగము కర్ణుడు, పాండవులను ముంచుటకు లేచిన పెద్ద అలలవంటివాడు శల్యుడు నది అడుగున నుండు భయంకర జలచరము, అతనికి అశ్వత్థామ వికర్ణులు తోడ్పడిరి దుర్యోధనుడు నదిలోని సుడిగుండము అట్టి నదిని పాండవులు శ్రీకృష్ణుని సహాయముచేత దాటగలిగిరి నిస్పృహయనే సముద్రమును దాటి వారు క్షేమముగా తీరము చేరునట్లు శ్రీకృష్ణుడు సహాయపడెను

''మరియు, అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రము, కౌరవ పాండవ వంశమునకు అంకురముగా మిగిలిన నన్ను నాశనము చేయనున్న తరుణములో శ్రీకృష్ణుడు తన చక్రమును ప్రయోగించి నన్ను రక్షించినాడు. ఇది నీవు చెప్పగా విని జ్ఞప్తియందుంచుకున్నాను. శ్రీకృష్ణుడు అన్ని జీవులందు వ్యాపించి, అంతర్యామిగా

వారికి మోక్షము ప్రసాదించుచున్నాడు. ఆ శ్రీకృష్ణ భగవానుడే బాహ్య ప్రపంచములో వ్యాపించి, కాలరూపము ధరించి, యీ లోకమును దానితోబాటు మాయను సృష్టించుచున్నాడు. మునీంద్రా! అతడు మానవ రూపము నెందుకు ధరించినాడు? అతడెందుకు దేవకికి జన్మించి, యశోదచేత పెరిగినాడు? అతడు బాల్యమున, యౌవనమున, ఆ తరువాత కాలమున యెట్లు వర్తించి సంచరించెను? అతడు మేనమామ నెందుకు సంహరించెను? ఇంత ఘోర పాపము నతడెందుకు చేయవలసి వచ్చెను? అన్ని విషయములు వివరముగా చెప్పగోరెదను శ్రీకృష్ణ గాథామృతమును తలచుకొనగా నాకు ఆకలి దప్పికలు కలుగుటలేదు నాకు ఆ గాథ వివరించి నన్ను తరింపజేయుడు''

వ్యాసుని కుమారుడైన శుకమహర్షి పరీక్షిత్తు భక్తితత్పరతను మెచ్చుకుని, అతడు అడిగిన సముచిత ప్రశ్నలకు సంతోషించి, చిరునవ్వుతో యిట్లు చెప్పెను. ''నీ మనస్సు సరియైన మార్గములో నున్నది. అట్లు గాకున్నచో, శ్రీకృష్ణుని గాథలను వినుటయందు నీకింత ఆసక్తి యుండెడిది కాదు. శ్రీకృష్ణుని గాథలను వినుటచేత, వానిని చెప్పువారు కూడా పరిశుద్ధులగుదురు అనగా వినువారు చెప్పువారుకూడ ఆ కథామృతమును గ్రోలి పునీతులగుదురు అవి భగవంతుని పాదముల నుండి ప్రవహించు గంగాజలము వలె పరిశుద్ధము గావించును. నారాయణుడు యీ పాప భూమిపై జన్మించుటకు కారణమైన సంఘటనల నన్నింటిని నీకు వివరముగా చెప్పెదను సావధానముగా వినుము

''ఒకప్పుడు భూమాత, పాపాత్ములనేకులు జన్మించుటచే ఆ బాధను భరించలేకపోయెను. ఆమె గోరూపము దాల్చి, సృష్టికర్తయైన బ్రహ్మ వద్దకు వెళ్ళి కనుల వెంట నీరు వచ్చుచుండగా అతని యెదుట నిలబడి యుండెను ' ` , ఆమె అధర్మము ప్రబలి పెచ్చుపెరిగి పోవుచుండుటచే తాను భరించలేకున్నానని, రాజులు పెక్కు పాప కార్యములు చేసి తన్ను పాప భూయిష్ఠము గావించుచున్నారని బ్రహ్మదేవునకు నివేదించెను. బ్రహ్మ ఆమె మాటలు విని యిట్లనెను ''నీకు సహాయము చేయగలవాడు ఆ నారాయణుడు తప్ప యింకెవరును లేరు'' మహాదేవుడు, దేవతలు తన్ననుసరించగా బ్రహ్మ క్షీరసముద్ర తీరమునకు వెళ్ళి నిలిచియుండెను నిశ్చలముగా వెలుగుచున్న జ్యోతివలె అతని మనస్సు స్థిరముగా, దేవతల రక్షకుడు, దేవాదిదేవుడైన నారాయణునిపై లగ్నమయ్యెను బ్రహ్మ పురుష సూక్తముతో నారాయణుని మౌనముగా స్తుతింప మొదలిడెను

''తన మనసులో నారాయణుని స్వరము విని, అతనితో వచ్చిన మహాదేవుడు దేవతలతో యిట్లనెను నారాయణుని స్వరమును వినుడు, భూమాతను దహించుచున్న జ్వరము నతడెరుగును అతడు రూప నామములు ధరించుటకు నిశ్చయించుకొనెను భూమాత కష్టములు తీరునంతవరకు అతడీ భూమిపై జీవించును ఆ సమయమున మీరందరు భూమిపై జన్మించవలెనని వాంఛించుచున్నాడు మీరందరు యాదవ కుటుంబములో జన్మించగలరు భగవంతుడు దేవకీ వసుదేవులకు జన్మించును ఆదిశేషుడు, నారాయణుని సోదరుడుగా జన్మించును ఎవరి శక్తిచేత యీ లోకమంతయు భ్రాంతిలో మునిగియుండునో ఆ విష్ణుమాయ కూడ నారాయణుని ఆదేశము ప్రకారము జన్మించగలదు స్వర్గవాసులందరు యీ భూమిపై జన్మించెదరు. నారాయణుడు జన్మించి అధర్మమును సంపూర్ణముగా నిర్మూలించును పాపుల నుండి పాపముల నుండి యీ భూమి విముక్తిచెంది పరిశుద్ధము కాగలదు''

భూమాతకు ఊరట కలిగెను దేవతలు యీ లోకమునకు బాధ నివృత్తి యగునని అత్యంత సంతోషోత్సాహ

ములతో వారి వారి గృహముల కేగిరి.

## 147 ఆకాశవాణి

యాదవులకు ప్రభువు శూరుడు. యాదవులు యయాతి కుమారుడైన యదు సంతతివారు. అతని రాజ్యము రెండు భాగములుగా విభాగమాయెను. ఒకటి మధుర, రెండవది శూరసేనము ఉగ్రసేనుడు, దేవకుడు సోదరులు. ఉగ్రసేనుడు మధురను పాలించుచుండెను అతని కుమారుడు కంసుడు దేవకుని కుమార్తె దేవకి.

దేవకీ వసుదేవుల వివాహము నిశ్చయమయ్యెను వసుదేవుడు శూరుని కుమారుడు కంసునికి సొంత చెల్లెలు లేకపోవుటచే, దేవకిపై యెక్కువ అభిమానము కలిగియుండెను దేవకీ వసుదేవుల వివాహానంతరము, వసుదేవుడు దేవకిని తన గృహమునకు తీసుకువెళ్ళుటకు సన్నాహములు చేసెను నూతన దంపతులు రత్నఖచితమైన రథములో నాసీనులైరి వారి వెంట నూరు బంగారు రథములు ఊరేగింపుగా వెళ్ళుటకు సిద్ధమాయెను. దేవకుడు, కుమార్తె వివాహ కట్నముగా నాలుగువందల యేనుగులను, పదిహేనువేల గుర్రము లను, రెండువందల మంది అందమైన పరిచారికలను, నూటయెనిమిదివేల రథములను వసుదేవునకు యిచ్చెను.

దేవకీ వసుదేవులు రథము నారోహించగా మంగళ వాద్యములు మ్రోగెను కంసుడు రథము వద్దకు వచ్చి, రథసారథిని దిగమని చెప్పి, తానే స్వయముగా రథ సారథ్యము వహించెను సోదరి దేవకిపైగల అభిమానమునకు చిహ్నముగా కంసుడిట్లు చేసెను.

మెల్లగా కొరడాతో గుర్రమును నదలించగనే, ఊరేగింపు ప్రారంభమయ్యెను ఇంతలో అకస్మాత్తుగా ఆకాశము నుండి ఒక స్వరము వినిపించెను మంగళవాద్యములు ఆగిపోయెను అందరి కనులు ఆ స్వరము యెక్కడ నుండి వచ్చుచున్నదోయని అన్ని ప్రక్కలను చూచుచుండెను ఆ స్వరము యిట్లుండెను ''ఓరీ మూర్ఖుడా!'' ఆ స్వరము కంసుని ఉద్దేశించి యున్నట్లు అందరికినీ స్పష్టమయ్యెను అందరి దృష్టి ఆకట్టుకొనుటకా యనునట్లు ఆ స్వరము కొద్ది క్షణములు ఆగి, తిరిగి యిట్లు కొనసాగెను ''ఓరీ మూర్ఖుడా! భర్తతో యేగుచున్న నీ సోదరి నీ మరణమునకు కారకురాలు కాగలదు ఆమెకు జన్మించు యెనిమిదవ కుమారుడు నిన్ను సంహరించును''

వెంటనే మెరుపువలె కంసుడు రథము నుండి క్రిందకు ఉరికెను ఒక చేతితో తన సోదరి జుత్తు పట్టుకుని, రెండవ చేతితో ఒర నుండి కత్తిని దూసెను కంసుడు, సోదరి దేవకితో, ''నన్ను చంపబోవువానికి నీవు తల్లివి కాగలవన్నమాట ఇదెట్లు జరుగగలదో చూచెదను. ఈ క్షణమే నిన్ను యమలోకమునకు పంపెదను ఆ తర్వాత నాకెట్టి భయము ఉండదు'' సూర్య కిరణమువలె ప్రకాశించుచున్న కత్తి నెత్తి సోదరిని చంపబోయెను

వసుదేవుడు కంసుని కుడిచేయి పట్టుకుని, కంసుని సమాధాన పరచుటకు ప్రయత్నించెను ''కంసా! నీవు శూరసేనుని కుటుంబములో జన్మించినావు. అది చాల ఉన్నత కుటుంబము నీవు ఉదార హృదయుడవు. ఒక స్త్రీని వధించి అపఖ్యాతి పాలగుదువా? అందును నీ సోదరిని? నీవు తెలివిగలవాడవు మనిషి పుట్టుకతోనే

వారి మరణము కూడ పుట్టుచున్నదని నీవంటి తెలివైనవారు యెరుగుదురు. జన్మించిన ప్రతి మనిషి మరణించుట నిశ్చయము. అది యెప్పుడైననూ జరుగవచ్చు అది నేడు కావచ్చును, నూరు సంవత్సరముల తర్వాత కావచ్చును. ఆత్మ మరొక శరీరములో ప్రవేశించి యీ శరీరము విడిచిపెట్టును. మార్గముపై నడచు మానవుడు ఒక అడుగు తర్వాత మరొక అడుగు వేయునట్లు, ఆత్మ ఒక శరీరము తర్వాత మరొక శరీరమును ధరించును ఇది అనంతముగా కొనసాగును. గడ్డిపై నడిచే పురుగు ప్రాకుతూ మరొక గడ్డిపోచను పట్టుకుని అంతకు ముందు పట్టుకున్న దానిని వదలిపెట్టును. మానవుని జనన మరణములు కలిసియుండును వాటిని వేరుచేయుట అసాధ్యము. జన్మించు ప్రతి మానవుడు మరణించుట సత్యము. మరణము తథ్యము. కాకున్న కాలవ్యవధి మాత్రమే మారునది. దేహికి అనగా ఆత్మకు, మరణము లేదు. దేహి, యీ జన్మలో చేసిన కర్మలను పురస్కరించుకుని తరువాత జన్మలో తగిన రూపనామములను ధరించును అనగా కర్మఫలితములను బట్టి రూపనామము లేర్పడును. దేహి యీ శరీరము విడచునపుడు, తరువాత జన్మలో యెట్టి జీవితమో నిర్ణయమై యుండును. రెండు జన్మల మధ్య అవస్థయే మరణము

''సాధారణ మానవుడు నిత్య జీవితములో చూచునవి అతని మనస్సులో నాటుకొనును ఉదాహరణకు తాను చూచిన రాజు, లేక ఇంద్రుని కథలుగాని దేవతల కథలుగాని అతనిలో ముద్రవేయును. అట్టి ఆలోచనలు నిండిన మనస్సుతో అతడు నిద్ర కుపక్రమించినపుడు, అవియే అతనికి స్వప్నమున కన్పించును. అతడు సృష్టించుకున్న స్వప్న ప్రపంచములో అతడే రాజుగను, ఇంద్రుడుగను వ్యవహరించును స్వప్నములో నున్నంత వరకు అతనికి మెలకువ జ్ఞానము ఉండదు అనగా తాను సాధారణ మానవుడననే జ్ఞానము ఉండదు. మెలకువ స్థితిలోని అనుభవముల ప్రభావము స్వప్న ప్రపంచములో యెట్లుండునో, అదే విధముగా ఒక జీవితములో చేసిన కర్మలు తరువాత జన్మలోని జీవిత సరళని నిర్ణయించును. స్వప్న ప్రపంచములో నున్నపుడు మెలకువ జ్ఞానము లేనట్లుగా, దేహికి మరు జన్మలో పూర్వ జన్మ స్మృతులుండవు. భ్రాంతి చేత జీవితములో తన ప్రస్తుత స్థితిని, అనగా సాధువు, పాపాత్ముడు, రాజు, పేద యివి విధి నిర్ణయించినవని తలచునేగాని, పూర్వ జన్మలో తాను చేసిన కర్మల ఫలితముగా యీ జన్మ రూపొందినదని గుర్తించడు నిశ్చలమైన వెలుగు ఒక నీటి పాత్రలో ప్రతిబింబించినపుడు, అది కదలుచున్నట్లు గోచరించును. కాని ఆ అనిశ్చలత పాత్రలోని నీరు కదలుచుండుటచేత యేర్పడినదేగాని, వెలుగు గుణము కాదు అదే విధముగా శరీర మనోబుద్ధులకు కట్టుబడిన ఆత్మ తన ప్రత్యేకమైన ఉనికిని గ్రహించలేదు అజ్ఞానము చేత శరీర మనోబుద్ధులనే ఉపాధులతో చేరిన ఆత్మ భౌతిక ప్రపంచములో భ్రాంతులకు లోనై సుఖ దుఃఖముల ననుభవించుచున్నది.

''అందుచేత ఒక ఆత్మ యింకొక ఆత్మను బాధించునని, చంపునని తలచుట అవివేకము ఎవరో నిన్ను బాధించగలరను భ్రాంతిలో పడి వారిని చంపబూనుకొనుట సమంజసము కాదు

''నీవు రాకుమారుడవైన కంసుడవు. నీవు ఉత్తమ వంశములో జన్మించినవాడవు. మరియు నీ సోదరిపై అమితమైన అభిమానము గలవాడవు. ఒక్కసారిగా ఆమెపై నీకు గల అభిమానము యెట్లు అంతరించెను? నీ యేకైక సోదరి, మరియు పెండ్లికూతురు. ఆమెను వధించుటకు నీ హృదయమెట్లు అంగీకరించెను? నాతో ఆమెకు వివాహమై కొద్ది గంటలు మాత్రమే గడచెను ఆమె నీకు కొన్ని క్షణముల క్రితము వరకు ప్రియమైన సోదరి. ఆమె యిప్పుడు భయముతో నిలువెల్ల వణకుచున్నది ఆమె కనుల నుండి అశ్రువులు యేకధారగా కారుచున్నవి ఈ అమాయక స్త్రీని వధించుట తగదు కంసా! కత్తిని దించుము ఇట్లు చేయుట నీ వంటి వానికి తగదు''

కాని కంసుడు వినకుండెను. తన సోదరి బ్రతికియుండుట తనకు ప్రమాదమని తలచి ఆమెను చంప నిశ్చయించుకొనెను తన మాటలు నిష్ప్రయోజనమని వసుదేవుడు గ్రహించెను తన భార్య బ్రతికి యుండుటకు తొందరగా యేదో యొకటి ఆలోచించి చేయవలసి యున్నదని భావించెను అతడు తనలో తానిట్లనుకొనెను:

''తెలివైనవారు యేదో యొక విధముగా అవాంతర పరిస్థితిని తొలగించుటకు ప్రయత్నించెదరు ప్రయత్నములు ఫలించక, సంహారము తప్పనపుడు, విచారించవలసిన పని లేదు ఏదో యొక ఉపాయ మాలోచించి ఆమె నీ గండము నుండి తప్పించవలెను. ఆమె పుత్రులను కంసున కిచ్చివేసెదనని చెప్పెదను. నా కింకను పుత్రులు పుట్టలేదు. వారు పుట్టులోపున యేమి జరుగగలదో వేచి చూచెదను కనీసము వారు పుట్టువరకు ఆమె బ్రతికి యుండగలదు ఏమో యెవరి కెరుక! పుత్రులు పుట్టక మునుపే కంసుడు మరణించవచ్చును అతడు బ్రతికి యున్నప్పటికిని, నా పుత్రులలో ఒకరిచేత అతడు చావవచ్చును. స్వర్గము నుండి వినవచ్చిన భవిష్యవాణి వృథాకాదు. అరణ్యములో అగ్ని చెలరేగిన, ఒకటి రెండు వృక్షములు బహుశః మిగలవచ్చును ఇది విధి నిర్ణయము అదే విధముగా యీ ప్రమాదము నుండి విధి వశము చేత దేవకి బ్రతికి బయటపడవచ్చును పుత్రులు పుట్టిన వెంటనే కంసుని కిచ్చెదని వాగ్దానముచేసి, కంసుని సమాధానపరచెదను ఇందులో తప్పేమియు లేదు''

మనసులోని తీవ్ర విచారమును పైకి కనబడనీయక, శాంతముగా వసుదేవు డిట్లనెను ''కంసా! దేవకి నిన్ను సంహరించునని ఆకాశవాణి పలుకలేదు. ఆమె పుత్రులు వలన మాత్రమే నీకు ప్రమాదము వారు పుట్టిన వెంటనే వారిని నీకిచ్చెదనని వాగ్దానము చేయుచున్నాను ఈ నూతన వధువును నన్ను వదలిపెట్టుము'' కంసుడొక క్షణమాలోచించి వసుదేవుని సూచన బాగున్నదని భావించెను అతడు కత్తిని దించి, ''సరే, అట్లేకానీ'' అని పలికెను.

## 148 సంకర్షణుడు

దేవకీ వసుదేవులు వారికి యేర్పరచిన సౌధములో ప్రవేశించి అచ్చట నివసించుచుండిరి. కొంతకాలమునకు వారికొక పుత్రుడు కలిగెను వసుదేవుడు ఆ శిశువునకు కీర్తిమానుడని పేరుపెట్టెను హృదయములో దుఃఖమును దిగమ్రింగుకుని, వసుదేవుడు శిశువును తీసుకువెళ్ళి కంసుని కప్పగించి తాను యిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకొనెను ఉత్తములైన సాధుపురుషులకు భరింపరాని దనెడి దేదియు నుండదు సమబుద్ధితో నిశ్చలమైన మనస్సుతో జరుగబోవు సంఘటనలను స్వీకరించవలెనని, మంచి చెడులను యెదురు చూడరాదని విజ్ఞులకు తెలియును అనుబంధము పెట్టుకొనక వైరాగ్యముతో కర్మలు చేయువారికి యిది గొప్పది, యిది చిన్నది అను భేదభావము ఉండదు భగవంతుని చరణములపై స్థిరముగా మనస్సు నిల్పినవారికి యేదియు అసాధ్యము కాదు వసుదేవుడు సమచిత్తము, జ్ఞానము కలవాడగుటచే ఆ శివువును తీసుకువెళ్ళి కంసుని పాదములందుంచుట సాధ్యమయ్యెను అతడు కంసితో యిట్లనెను ''ఈ శిశువు నా కుమారుడు. జన్మించిన వెంటనే శిశువును నీకు యిచ్చెదనని వాగ్దానము చేసితిని''.

వసుదేవుడు తన మాటను నిలుపుకున్న తీరును చూచి కంసుడు సంతోషించి మెచ్చుకొనెను. కంసుడు నవ్వుచు శిశువును తీసుకుని తిరిగి వసుదేవుని చేతులలో పెట్టుచు యిట్లనెను. ''ఈ శిశువును నీవు తీసుకుపొమ్ము. నేను యీ శిశువును సంహరింపను. నీ అష్టమ పుత్రుడు నా మరణమునకు కారకుడని గదా ఆకాశవాణి పలికెను! ఈ శిశువు నీ జ్యేష్ఠపుత్రుడు. ఇతనివలన నాకు భయము లేదు''.

వసుదేవుడు శిశువును తీసుకుని తన గృహమునకేగెను. కాని తన బావమరిది మనసు నెరిగున్నవాడగుటచే, అతని మాటల యందుగాని చేతలయందు గాని వసుదేవునికి విశ్వాసము లేకుండెను.

నారదుడు కంసుని వద్దకు వచ్చెను. నారదుడు కంసునితో అనేక విషయములు ముచ్చటించెను. అందు గోకులములోని గోపాలురు, నందుడు, యాదవుల భార్యలు, వారి బంధుబలగము — వీరందరూ దేవతలనియు నారాయణుని ఆదేశముపై యీ భూలోకమున మానవులుగా జన్మించిరనియు వారు అసురులందరనూ నిర్మూలించుటకొరకే జన్మించినారనియు నారదుడు తెలిపెను. ఈ విషయము విని కంసుడు తెల్లబోయెను. అగ్నిలో ఆజ్యము పోసినట్లు నారదుడు మరియు యీ విధముగా పలికెను. ''దేవకి పుత్రుల విషయము నీవు యేమరి యుండుట తగదు. అదృశ్యవాణి ఆమె యెనిమిదవ పుత్రుడు నిన్ను సంహరించునని చెప్పుటచే, యీ మొదటి శిశువును విడిచిపుచ్చినావు. కొద్దిగా ఆలోచించుము. ఎమినిదవ పుత్రుడన అర్థమేమి? ఎనిమిది అంకెనుండి వెనుకకు లెక్కపెట్టిన మొదటివాడు అష్టమ పుత్రుడగును. నీవు రెండవ అంకెనుండి లెక్కపెట్టిన మొదటివాడు అష్టమ పుత్రుడగును. మూడవ అంకెనుండి లెక్కపెట్టిన రెండవ శిశువు అష్టమ పుత్రుడగును. అదే విధముగా మిగిలిన వారు కూడ అష్టమ పుత్రులగుదురు. ఇంతటి ముఖ్య విషయముపై నీవు శ్రద్ధ వహింపకుండుట తెలివైన పనికాదు''. కంసుని మనస్సులో సందేహ బీజము నాటి, తన అలవాటు ప్రకారము నారాయణ కీర్తనలు గానము చేయుచు నారదుడు వెళ్ళిపోయెను.

దేవకికి పుట్టిన శిశువు నారాయణుడేనని తనను సంహరించుటకే జన్మించెనని కంసుడు గట్టిగా విశ్వసించెను. ఆ వెంటనే కంసుడు వసుదేవుని గృహమునకు వెళ్ళి, తల్లి చేతుల నుండి బిడ్డను లాగి ఆ శిశువును చంపివేసెను. అదే విధముగా పుట్టిన ప్రతి శిశువును కంసుడు వధించెను. ఈ లోకములో తన ప్రాణమును సంరక్షించుకొనవలెనను దురాశతో యితరుల ప్రాణములను తీయుటకు వెనుకాడరు గదా? ఎదుటివారు తండ్రి, తల్లి, సోదరులు, స్నేహితులు, లేక యెవరైనను వారి ప్రాణములు తీయుటకు సంకోచించరు గదా? కంసుడు అటువంటి వ్యక్తి. కంసుడు నారదుడు చెప్పిన విషయము — పూర్వజన్మలో తాను కాలనేమి యను పేరుతో గొప్ప అసురుడుగా జన్మించి, నారాయణునిచేత నిహతుడైనట్లు — జ్ఞప్తియందుంచుకొనెను. అందుచే దేవకి కుమారుడు, తగిన ముందు జాగ్రత్తలు తీసుకొనకుండిన, తనను తప్పక హతమార్చునని కంసుడు దృఢముగా విశ్వసించెను. కంసుడు యాదవులపై ద్వేషము పెంచుకుని వారిని వేధించుచుండెను. ఉగ్రసేనుడు యదు, భోజ, అంధక రాజ్యములను పాలించుచుండెను. తన తండ్రిని అణచి కారాగారములో నుంచుటకు కంసుడు సంకోచించకుండెను. అప్పటి నుండి కంసుడు నిరంకుశముగా రాజ్యము నంతటిని యేలుచుండెను.

మగధరాజైన జరాసంధుడు తన పుత్రికలను కంసునకిచ్చి వివాహము చేసెను. అందుచేత అతి శక్తిమంతులైన రాజుల సహాయసంపత్తులు కంసునకుండెను. అట్టి ప్రముఖులలో కొందరు: జరాసంధుడు, ప్రలంబుడు, బకుడు, చాణూరుడు, తృణావర్తుడు, అఘాసురుడు, ముష్టికుడు అరిష్టుడు, ద్వివిధుడు, పూతన (యీమె స్త్రీ), కేశి, ధేనుకుడు. జరాసంధుడు తప్ప మిగిలిన వారందరూ అసురులు. వీరు కాక అనేకులు రాజులు

కంసునితో స్నేహపూర్వకముగా నుండిరి. కంసుడు వేధించిన యాదవులు కురు, పాంచాల, కేకయ, సాళ్వ, విదర్భ, నిషధ, విదేహ, కోసల రాజ్యములలో ఆశ్రయము పొందిరి. కొంతమంది యాదవులు కంసుని రాజ్యములోనే యుండి అతనికి అనుకూలముగా వర్తించుటే రాజకీయముగా తెలివైన పనియని భావించిరి. దేవకి మొదటి ఆరుగురు పుత్రులు పుట్టిన వెంటనే కంసుని చేత మరణించిరి. దేవకి యేడవ గర్భము ధరించెను. ఆదిశేషుడు దేవకి గర్భములో ప్రవేశించెను. అతనిని గర్భమందు ధరించిన తల్లి దేవకికి ఆనందమును దుఃఖమును ప్రాప్తించునట్లు చేసెను.

ఈ లోకములో అధర్మమున కంతము కలిగించుటకు సమయము ఆసన్నమైనదని నారాయణుడు నిశ్చయించుకొనెను అతడు యోగమాయను పిలిచి యిట్లు ఆదేశించెను ''దేవీ! గోపాలురను పాలించు నందుడున్న గోకులమునకు నీవు తక్షణమే వెళ్ళుము. అచ్చట వసుదేవుని భార్య రోహిణి కలదు. కంసునికి భయపడి వసుదేవుని యితర భార్యలు బయటకు రాకుండ లోపలనే యుండిరి. నా ఆదేశముపై నా అంశమైన ఆదిశేషుడు దేవకి గర్భమున ప్రవేశించెను. నీవు వెళ్ళి దేవకి గర్భము నుండి ఆ శిశువును తీసి రోహిణి గర్భమున ప్రవేశపెట్టుము. తరువాత దేవకి గర్భమున నేను జన్మించెదను. అదే సమయములో నీవు యశోదానందులకు జన్మించెదవు. ఈ గొప్ప సంఘటన చేత భవిష్యత్తులో నీవు ఈశ్వరిగా సంతానము లేని వారికి సంతానమొసగి, వారి కోర్కెలను తీర్చి ప్రసిద్ధి పొందెదవు. పురుషులు నిన్ను ధూప, దీప, నైవేద్యములతో పూజించెదరు నీకు దేవాలయములు నిర్మించి, అనేక పేర్లతో — దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చండిక, కృష్ణ, కన్నిక, మాయ, నారాయణి, ఈశాని, శారద, అంబిక — నిన్ను కొలచెదరు.

''దేవకి గర్భము నుండి రోహిణి గర్భమునకు మారిన శిశువు సంకర్షణుడను పేరు దాల్చును. మరియు లోకములో నందరినీ ఆకర్షించుటచే 'రాము'డనియు, చాల శక్తిమంతుడగుటచే 'బలు'డనియు కూడ పిలుతురు

యోగమాయ నారాయణుని వద్ద సెలవు తీసుకుని యీ భూలోకమునకు దిగి వచ్చెను. దేవకికి మైకము కమ్మెను. ఆమె గర్భము నుండి శిశువును మార్చుట ఆమెకు తెలియకనే జరిగిపోయెను. మరుచటి రోజు ప్రజలు, జన్మించక మునుపే శిశువు గతించెనని తలపోసిరి. కంసుడు కూడ యీ విషయము వినియుండెను. సంకర్షణుడు రోహిణి గర్భములో పెరుగుచుండెను

## 149 శ్రీకృష్ణ జననము

పరమాత్మ, అందరికీ ఆశ్రయుడు అయిన నారాయణుడు వసుదేవుని మనస్సులో ప్రవేశించెను. వసుదేవుని వదనమందు ప్రకాశవంతమైన తేజస్సును చూచి ప్రజలు అచ్చెరువందిరి. అతని మనస్సు నారాయణునకు నివాసమగుటచే మిట్టమధ్యాహ్నపు సూర్యుని వలె వసుదేవుడు ప్రకాశించుచుండెను.

మూర్తీభవించిన మంగళస్వరూపము, యీలోక వైభవ సంపదల సారము, పరమాత్మ, ప్రతి జీవియందు, జడపదార్థములందు ఆత్మగ నుండు నారాయణుడు దేవకి గర్భములో ప్రవేశించెను. దేవతలకు దేవుడైన నారాయణునికి తల్లి కాగలుగు మహాభాగ్యము దేవకికి కలిగెను. చంద్రు డుదయించబోవు తూర్పు దిశవలె

ఆమె అందముగా గోచరించెను. ఆమె రూపము తేజస్సుతో నిండెను. కాని ఆమె కంసుడు చెరనుంచుటచే లోకులు వానిని చూడలేకుండిరి. మట్టిపాత్రలో నుంచిన దీపపు జ్యోతిని కాంచలేనట్లు, లోకులు ఆమె తేజస్సును వైభవమును కాంచలేకుండిరి. ఇతరులకు విద్యను గరపక, తాను మాత్రమే విద్యావంతుడనని భావించు పండితుని మనస్సులో చిక్కుపడిన చదువుల సరస్వతివలె, దేవకి తేజో వైభవములు చెరలో చిక్కుపడి యుండెను.

ఆమె అద్వితీయమైన ప్రకాశముతో నున్నట్లు కంసుడు తెలుసుకొనెను. ఆమె గర్భమున నారాయణుని ధరించి యుండుటచే, ఆమె నివసించుచున్న గృహము ఒక విచిత్రమైన వెలుగుతో ప్రకాశించుచుండెను. ఆమె పెదవులందు అందమైన చిరునవ్వు కంసుడు చూచి తనలో తానిట్లనుకొనెను. ''దేవకి యింతకు ముందెన్న డును యిట్లు లేదు. పుట్టబోవు శిశువు ఆమె యింత శోభాయమానముగా నుండుటకు కారణమవి నాకు తోచుచున్నది. నారాయణుడే ఆమెకు జన్మించనున్నట్లువున్నది. అందుకే ఆమె యింత అందముగ అగుపించుచు న్నదని తోచుచున్నది. నేను తగిన జాగ్రత్తలను తీసుకొనవలసి యున్నది. లేకున్న అతడు (నారాయణుడు) చెప్పినట్లు జేయగలడు! మరణించుట నాకిష్టము లేదు. ఆమె నిప్పుడు సంహరించగలను. కాని ఆమె స్త్రీ, మరియు నాకు సోదరి, గర్భము ధరించియున్నది. ఇంతవరకు నేను చేసిన ప్రతి శిశుహత్య క్షమించరాని నేరమే. ఈమె నిప్పుడు నేను సంహరించినచో లోకము నన్ను నిందించును. నా కీర్తిని, సంపదను, ఆయుస్సును యీ పాపము హరించును. ఘోరకృత్యములు సలుపుచు జీవించు వ్యక్తి నడపీనుగుతో సమానము కదా? బ్రతికి యుండగా ప్రజలు అతనిని శపింతురు. మరణించిన తర్వాత అతడు 'అంధతమస్సు' అను నరకమున కేగును''.

కంసుడు సోదరిని సంహరించు ఆలోచన విరమించెను. శిశువు జన్మించువరకు వేచియుండుటకు నిశ్చయించుకొనెను. పుట్టబోయే శిశువును గురించియే అత డాలోచించుచుండెను. ఆ ఆలోచనలు తప్ప యితర ఆలోచనలు అతనికి కలుగకుండెను. ఆసనముపై కూర్చొనుటకు ముందు అకస్మాత్తుగా ఆ ఆసనముపై శిశువును చూచినట్లు భ్రమ చెందుచుండెను. తనకు తాను యిట్లు చెప్పుకొనుచుండెను. ''ఆసనముపై నున్న శిశువుపై నేను కూర్చొనబోతిని! ఎంత ఘోరము!'' అట్లే పరుండబోవుసపుడు పరుపుపై శిశువును చూచినట్లు భ్రమ చెందును. వెంటనే దూరముగా జరిగి నిలుచుండును. చూపు క్రిందకు దించినపుడు పాదములవద్ద శిశువున్నట్లు ఉలికిపడుచుండును. భోజనము చేయుటకు కూర్చొనినచో కంచములో ఆహారమునకు బదులు శిశువును గాంచును. విసుగుతో లేచిపోయి, దూరముగా నడచివెళ్ళును. ప్రతి కదలిక యందు శిశువు తనకు యెదురు వచ్చుచుండెనని కంసుడు తలపోసెను. కంసునికి యీ లోకమంతయు నారాయణుడు కేవల మొక శిశు రూపములో సర్వత్ర వ్యాపించియున్నట్లు తోచెను.

సమయము దగ్గర పడుచుండెను. బ్రహ్మ, ఈశ్వరుడు, దేవతలు దేవకి సమక్షమునకు వెళ్ళి చేతులు జోడించి భగవంతుని స్తుతించిరి. వారిట్లనిరి. ''దేవా! నీకు మా ప్రణామములు. మమ్ములను రక్షించుటకు అనేక సందర్భములలో అనేక రూపములు దాల్చితివి. నీవు మత్స్య, కూర్మ, వరాహ, నృసింహ, వామన, పరశురామ, రామ, హయగ్రీవ, యజ్ఞ, కపిల అవతారములు ధరించితివి. అనేకమైన యితర రూపములు కూడ నీవు ధరించినావు. ఈ భూమి నీ సహాయము కోరుచున్నది. ఈ లోకమును దుష్టుల బారి నుండి రక్షింపుము. మేము నీకు నమ్రులమై నమస్కరించుచున్నాము''.

తరువాత వారు దేవకితో యిట్లనిరి. ''నీవు సాక్షాత్తు నారాయణునికి తల్లివి కానున్నావు. నీవు మహా భాగ్యశాలివి. నీకు యిదివరకే ఆదిశేషుడు జన్మించెను. ఇపుడు నీకు పుట్టబోవు శిశువు లోకరక్షకుడు కాగలడు.

నీవు కంసుని గురించి భయము చెంద నవసరము లేదు. అతనికి తుది దినములు సమీపించినవి''. ఆమెను సమాధానపరచి ఆమెలో ఉత్సాహమును కలిగించిన తర్వాత బ్రహ్మాది దేవతలు నిష్క్రమించిరి.

శుభ సమయము యేతెంచెను. ఆరు ఋతువుల అందము ఆ సమయమున మేళవించెను. గ్రహములు నక్షత్రములు వాటి స్థానముల నుండి లోకమునకు శాంతిని ఆనందమును అందించెను నాలుగు దిక్కులు నిర్మలముగా నుండెను. రోహిణి నక్షత్రము ప్రవేశించెను. ఈ నక్షత్రము ప్రజాపతి అధీనములో గలదు ఆకాశము నిర్మలముగా నక్షత్రములతో ప్రకాశించుచుండెను నదీ జలములు స్వచ్ఛముగా తీయగా నుండెను సరస్సులన్నియు పద్మములతో ఉత్పల పుష్పములతో నిండియుండెను. వృక్షములు పుష్పములతో అలంకరించి నట్లుండెను. చల్లగా వీచు వాయువులు కుసుమ సువాసనలను వెదజల్లుచుండెను బ్రాహ్మణులు రగిల్చిన అగ్నిహోత్రము పొగలేక మండుచుండెను. శాంతి, ప్రశాంతత యీ భూమి అంతట వ్యాపించెను. మానవుల మనస్సులు హాయిగా నుండెను. కంసు డొక్కడు మాత్రమే అశాంతితో నుండెను స్వర్గమున దివ్యదుందుభులు మ్రోగెను. కిన్నెర గంధర్వులు గానము చేయుచుండిరి. సిద్ధ చారణులు స్తోత్రమంత్రములు పఠించుచుండిరి. అప్సరసలు ఆనందముతో నాట్యము చేయుచుండిరి. దేవతలు, ఋషులు, పుష్పవర్షము కురిపించిరి. సముద్ర ఘోషవలె ఆకాశమందు మబ్బుల నుండి ఉరుముల శబ్దము వినిపించెను అది అర్ధరాత్రి సమయము ఆ ముహూర్తము అభిజిత్తు. వసుదేవుని భార్య దేవకికి, అందరి హృదయములలో వసించే నారాయణుడు జన్మించెను

తూర్పు దిక్కున చంద్రుడు ప్రకాశముతో ఉదయించినట్లు, నారాయణుడు దేవకి గర్భము నుండి ఉదయించెను.

## 150 శ్రీకృష్ణుని గోకులమునకు గొనిపోవుట

వసుదేవుడు పుట్టిన శిశువును చూచి ఆశ్చర్యముతో అచ్చెరువొందెను ఆ శిశువు సామాన్యమైన శిశువు కాదు. నారాయణుడే సహజ స్వరూపములో నుండెను వసుదేవునకు తన చేతులలో నున్న శిశువు నారాయణుడుగా వగుపించెను. అతడు పద్మముల వంటి నేత్రములును, చతుర్భుజములును, నాలుగు చేతులలో శంఖ చక్ర గదా పద్మములు నుండుట జూచెను ఆ శిశువు వక్షస్థలముపై శ్రీవత్సమను పుట్టుమచ్చను వసుదేవుడు గాంచెను. శిశువు మెడయందు కౌస్తుభమణి ప్రకాశించుచుండెను. పీతాంబరము ధరించియుండెను నల్లని మేఘమువలె నున్న ఆ శిశువు తన కిరీట కాంతులను పరిసరములకు ప్రసరింపచేసెను. మకర కుండలములు శోభను చేకూర్చుచుండెను. వసుదేవుడు వైభవోపేతమైన ఆ రూపమును రెప్పవాల్చక చూచుచుండెను. అతని కనులు శిశువు సౌందర్యమును గ్రోలుచున్నట్లుండెను ఇంతలో వసుదేవుడు ఆ పుట్టిన శిశువుకు తాను తండ్రినని తలచి, క్షత్రియుడగుటచే సంప్రదాయము ననుసరించి చేయవలసిన విధులను జరుపవలెనని తలపోసెను పవిత్ర నదీజలములో స్నానము చేసి, వేయిమంది బ్రాహ్మణులను పూజించి, వేయి గోవులను దానమిచ్చెను. ఇదంతయు మానసికముగా చేసెను; తగిన సమయములో యిట్లు చేసెదనని తన మనస్సులోనే వాగ్దానము చేసెను

వసుదేవుడు శిశువును భూమిపై పరుండబెట్టెను. చేతులు జోడించి వినయముతో పరమపురుషు నిట్లు ప్రార్థించెను. ''అనంత దయాస్వరూపుడవైన నీవు యీ పేద భూమిపై మా యిద్దరకు మానవ రూపములో జన్మించితివి. ఉద్వేగము చేత పెదవులు దాటి మాటలు వచ్చుటలేదు. ఇకమీద నేనెంత మాత్రము దురదృష్టవంతుడను కాను. మానవులందరిలో నేను గొప్ప అదృష్టవంతుడను. నా భార్య సాక్షాత్తు భగవంతునికి మాతృమూర్తి కాగలిగినది. మాయందు నీకున్న కృపకు ధన్యవాదములు''.

ఆ తర్వాత దేవకి యిట్లనెను. ''నీవొక్కడవే సర్వమూ లయింపజేయగలవు. నీవు మాయందు దయదలచి, యీ కంసుని నిరంకుశత్వము నంతము చేయుము. కంసుడు నిన్ను యీ రూపములో చూచునట్లు చేయకుము; యీ రూపము దర్శించుటకు పరమయోగులు అనేక సంవత్సరములు తపస్సు చేయుదురు; చాల కొద్దిమందికి మాత్రమే యీ రూపమును గాంచు అదృష్టము లభించెను. నీ యీ దివ్యరూపము నావంటి సామాన్యుల నేత్రములు చూచుటకు కాదు. వైభవోపేతమైన యీ రూపమును దాచివేయుము. నీ జన్మము ఒక విధముగా నన్ను విచారగ్రస్తను చేయుచున్నది. ఇతర తల్లులవలె నిన్ను నా వద్దనే యుంచుకొనలేను. ప్రభూ! ఇన్ని సంవత్సరములుగా నాకు కలిగిన పుత్రులను కంసు డేవిధముగా సంహరించెనో నీకు తెలుసును. ఇప్పుడు కూడ నీవు జన్మించిన వార్త అతని కంది యుండవచ్చును. కుడిచేతియందు కత్తిని చేపట్టి అతడు వెంటనే యిక్కడకు వచ్చుచుండవచ్చును. అతడు నిన్ను యీ రూపములో చూడకుండుగాక. ఈ రూపమును చూచుట కతడు అనర్హుడు''. అంత భగవంతుడు దేవకితో నిట్లనెను. ''దేవకీ! నీవు స్వచ్ఛమైన స్త్రీవి. ఇంతకు ముందు జన్మలో నీవు స్వాయంభువమను సంతతిలో పృష్ణియను పేరుతో జన్మించితివి. ఈ వసుదేవుడు వెనుక జన్మలో 'సుతపుడు' అను పేరుతో వెలసెను. ప్రజాపతి ఆదేశించగా మీరిరువురూ పుత్రోత్పత్తి గావించి, ఆ తర్వాత అతి దీర్ఘ తపస్సు చేసిరి. నీ మనస్సు కేవలము నాయందు మాత్రమే లగ్నమైయుండెను. పన్నెండు వేల సంవత్సరములు నీ తపస్సు కొనసాగెను. నీ భక్తికి మెచ్చి యిదే రూపములో నీకు దర్శన మిచ్చినాను. వరమడుగమని మీకు చెప్పితిని. ఆ క్షణములో మీరు మాయచేత భ్రమలో పడిరి. అంత తీవ్ర తపస్సు ఆచరించిన తర్వాత బంధ విముక్తి అనగా మోక్షమును కోరియుండవలసినది. కాని మీరు నేను పుత్రుడుగా జన్మించవలెనని కోరిరి. ఆ తర్వాత మీరు భౌతికానందములో మునిగి యుండగా కొంత కాలమునకు మీకు నేను జన్మించితిని. నన్ను పృష్ణిగర్భుడను పేరుతో పిలిచెడివారు. సద్గుణములచేత నేను ప్రసిద్ధి పొందినాను. ఆ తర్వాత మీరు అదితి కశ్యపులుగా జన్మించి ఖ్యాతి పొందిరి. తిరిగి నేను మీకు పుత్రుడుగా జన్మించి ఉపేంద్రుడను పేరుతో పెరిగి, బలి యజ్ఞము నాపి వామనుడుగా పేరు గాంచితిని. ఇప్పుడు మీకు మూడవసారి జన్మించినాను. నారాయణుడు మీకు మరల మరల పుత్రుడుగా జన్మింతునని యిచ్చిన మాటను ఋజువు పరచుటకే నేనీ రూపము ధరించితిని. నా నిజస్వరూపము చూడకుండినచో, యీ ప్రపంచపు మాయలో పడి మోక్షమును పొందక యుందురు. ఇప్పుడు నేను మీ కుమారుడనని తలచినప్పటికిని, నేను పరబ్రహ్మమునని గ్రహింపుడు. ఈ జన్మ తరువాత మీకు మోక్షము లభించును. అది నిశ్చయము''.

దేవకీ వసుదేవులు దివ్యమంగళ రూపములో నున్న ఆ శిశువును చూచుచుండగనే, ఆ రూపము అదృశ్యమై సాధారణ మానవ రూపము ధరించెను. నూతనముగా జన్మించిన శిశువును తీసుకువెళ్ళి గోకులములో నందుని యింట విడచి రావలసినదని వసుదేవుని ఆదేశించెను. తిరిగి వచ్చునపుడు నందుని భార్య యశోద ప్రసవించిన శిశువును తీసుకురావలసిదని గూడ వసుదేవునికి ఆదేశము. దేవకీ వసుదేవులు యీ కార్యమునెట్లు చేయవలెనో యని యోచించుచుండిరి. ఎందుకనగా కారాగార ద్వారము లన్నియు మూసియున్నవి. మరియు ప్రతి

ద్వారము వద్ద ద్వారపాలకులున్నారు దేవకికి శిశువు జన్మించునని తెలిసినప్పటి నుండి కంసుడు కారాగార మందలి ద్వారపాలకులను రెట్టింపుచేసెను

వసుదేవుడు శిశువును ఒక వెదురు బుట్టలో పెట్టి దానిపై తన యుత్తరీయము గప్పెను బుట్టను చేతితో పట్టుకుని యేమిచేయుటకు తోచక నిస్సహాయముగా తాళము వేసిన ద్వారము వంక చూచుచుండెను

ఇంతలో అతడొక విచిత్రము గాంచెను. తాళములు తమకు తామే వీడ్వడి ద్వారములు తెరచుకొనెను. దేవకీ వసుదేవులు యీ అద్భుతము చూచి ఆశ్చర్యము చెందిరి. వసుదేవుడు ద్వారము వద్దకు నడచి వెళ్ళెను. ద్వార పాలకులు గాఢముగా నిద్రించుచుండుట జూచెను. సునాయాసముగా వసుదేవుడు బుట్టను తలపై పెట్టుకుని నడిచివెళ్ళి యమునా నదీతీరము చేరెను ఆకాశమంతయు నల్లని మేఘములతో దట్టముగా నుండెను కుంభవృష్టిగా వర్షము కురియుచుండెను పొంగుచున్న నదిని యెట్లు దాటవలెనా యని వసుదేవుడు తలంచుచుండెను. భగవంతునిపై భారము వేసి బుట్టను తలపై పెట్టుకుని నదిని దాటుట కుద్యమించెను అతనికి తెలియకుండ, ఆదిశేషుడు అతని ననుసరించెను. తన వేయి పడగలతో వర్షము నుండి శిశువును రక్షించుచుండెను కుండపోతగా కురియుచున్న వర్షము వలన యమునా నది పొంగుచుండెను. కాని శ్రీరామచంద్రుడు సముద్రమును దాటి లంకను చేరుటకు సముద్రుడు సహాయపడినట్లుగా, ధారా వర్షమునకు కారకుడైన ఇంద్రుడు స్వయముగా, వసుదేవుడు నదిని దాటుటకు వీలుగా, మార్గము కల్పించెను.

భగవంతుని ఆదేశము మేరకు గోకులము చేరుకొనెను తిన్నగా నందుని గృహమునకు వెళ్ళి నందుని భార్య యశోద గదిలోనికి ప్రవేశించెను ఆమె ప్రక్కనే శిశువు పరుండి యుండుట వసుదేవుడు చూచెను తాను బుట్టలో తెచ్చిన శిశువును యశోద ప్రక్కన పరుండబెట్టి, యశోద వద్దనున్న శిశువును తీసుకుని బుట్టలో పెట్టెను ఆ శిశువు బాలిక గోకులమంతయు గాఢ నిద్రలో నుండెను

వసుదేవుడు తిరిగి మధుర వచ్చి కారాగారములో ప్రవేశించెను. తాను తీసుకువచ్చిన బాలికను దేవకి ప్రక్కన పరుండబెట్టెను కారాగారము తలుపులు మరల తమకుతామే మూసుకొని యుండుట కనుగొనెను. సంకెళ్ళను తన చేతులకు తగిలించుకొనెను కంసుని రాకకై వారు యెదురు చూచుచుండిరి.

## 151 విష్ణుమాయ

నూతనముగా జన్మించిన శిశువు రోదనముతో రాజసౌధములో అందరు నిద్ర నుండి లేచిరి ద్వారము వద్ద నున్న కావలివారు పరుగెత్తుకుని వెళ్ళి కంసునితో యిట్లనిరి. ''ప్రభూ! దేవకీదేవి శిశువును ప్రసవించెను మీకు యీ వార్త తెలుపుటకై వెంటనే వచ్చితిమి''

కంసుడు పరుపుపై పరుండి నిద్రించుటకు ప్రయత్నించుచుండెను. అతడు చాల రోజుల నుండి సరిగా నిద్రపోవుటలేదు, నిద్రాదేవి అతడిని యెన్నడో వదలిపెట్టెను. దేవకికి శిశువు జన్మించెనని వినినప్పటి నుండి అది అష్టమ శిశువు అగుటచేత కంసునికి శాంతి లేకుండెను తన సోదరి చుట్టూ ఒక విచిత్రమైన ప్రకాశమును చూచినప్పటి నుండి, ఆమెకు కలుగబోవు శిశువు తన మృత్యువుకు కారణమగునని తెలుసుకొనెను. అప్పటి

నుండి అతనికి నిద్ర లేకుండెను. శిశువు జన్మించినదని విని నంతనే కత్తి తీసుకుని వడివడిగా దేవకి వసుదేవులున్న కారాగారమునకు వెళ్ళెను

కంసుని రాకను దేవకి చూచెను మృత్యుదేవత తనవైపుగా వచ్చుచున్నట్లు ఆమె భావించెను. కంసుని ముఖము అతి భయంకరముగా నుండెను ఆమె సోదరుని పాదములపైబడి యిట్లనెను ''అన్నా! దయచేసి యీ శిశువును చంపక వదలిపెట్టుము. నాకు పుట్టిన యీ శిశువు బాలిక యగుటచేత విడిచిపెట్టుము. నాకు యిది వరకు పుట్టిన పుత్రుల నందరినీ నీకు యిచ్చితిని వారిని చంపివేసినావు కాని యీ శిశువు బాలిక ఒక అమాయిక బాలిక నిన్నేమి చేయగలదు? నిన్ను భయభ్రాంతుని గావించిన ఆకాశవాణి పలుకులు యీ బాలిక వలన నెరవేరవని నా దృఢ నమ్మకము అమెను విడిచిపెట్టుము. స్త్రీ హత్య మహాపాపము. అట్టి నేరము చేయవద్దు ఒకప్పుడు నేను నీకు అత్యంత ప్రియ సోదరిని ఆ ప్రేమను పురస్కరించుకుని నిన్ను నేను అభ్యర్థిస్తున్నాను ఈ శిశువును నాకిమ్ము'' దేవకి శిశువును గుండెలకు గట్టిగా హత్తుకుని యుండెను. ఆమె కనుల నుండి కారు నీటితో ఆ శిశువు స్నానము చేయుచున్నట్లుగా నుండెను

దేవకి ప్రార్థనలు చెవిటి వాని ముందు శంఖమూదినట్లయ్యెను కంసుడు ఆవేశ పూరితుడయ్యెను మృత్యు భయము అతనిని మృగముగా చేసెను తన సోదరి మృదుహస్తముల నుండి శిశువును బలాత్కారముగా లాగెను. శిశువు లేత కాళ్ళను ఒక చేతితో పట్టుకుని అక్కడ ఉన్న రాతికి గట్టిగా కొట్టుటకు ప్రయత్నించెను

ఆ శిశువు (విష్ణుమాయ) అతని చేతి పట్టును తప్పించుకుని ఆకాశమున కెగిరిపోయెను. సంభ్రమాశ్చర్యము లతో అందరును పైకి చూచుచుండిరి అందరును ఆకాశములో దేవి రూపము గాంచిరి. ఆమె యెనిమిది చేతులు వివిధములైన ఆయుధములను ధరించి యుండెను. ఆమె మెడలో పువ్వుల దండను ధరించెను ఆమె మెడలో, భుజములపై, పాదములందు ధరించిన మణులు ప్రకాశించుచుండెను ఆమె విల్లు, త్రిశూలము, అమ్ములు, కత్తి, శంఖము, చక్రము, గద పట్టుకుని యుండెను ఆమె చుట్టును సిద్ధచారణ గంధర్వ కిన్నరులు, అప్సరసలు చేరి పూజించుచుండిరి. ఆకాశము నుండి దేవి కంసునితో యిట్లు పలికెను ''ఓరీ మూర్ఖుడా! నన్ను చంపుటకు నీవు ప్రయత్నించుట యెంత తెలివి తక్కువ! నన్ను చంపి నీవు యేమి సాధించగలవు? నీ పురాతన శత్రువు, నిన్ను చంపుటకు శిశువుగా జన్మించి యున్నాడు అమాయిక ప్రజలను అకారణముగా చంపకుము'' ఆమె అదృశ్యము కాగా భూమి అంతయు చీకటియయ్యెను.

విష్ణుమాయ పలుకులు, జరిగిన విచిత్ర సంఘటన కంసునిపై అపూర్వ ప్రభావము కలిగించెను. దేవకీ వసుదేవులపై కక్ష వహించినందుకు తనపై తనకు అసహ్యము కలిగెను పశ్చాత్తాపముతో కంసుడు స్వయముగా తన చేతులతో దేవకీ వసుదేవుల చేతులకు కాళ్ళకు కట్టిన గొలుసులను విప్పివేసి, వారితో యిట్లనెను ''సోదరీ! వసుదేవా! ఇంతవరకూ మీ యెడల నేను క్రూరముగా ప్రవర్తించినందుకు నేను చాల విచారించుచున్నాను నా స్వార్థ ప్రేమ నన్ను రాక్షసుడుగా మార్చి మీ పుత్రులను చంపునట్లు చేసినది. నా హృదయములో కరుణ, ప్రేమ అంతరించెను భవిష్యత్తు నూహించుటకే నాకు భయముగా నున్నది నేను మరణించిన తర్వాత ప్రత్యేకమైన నరకము నా కొరకు యెదురు చూచుచుండ వచ్చును నేను శిశుహత్యా పాతకుడను''

కొంతసేపు మాట్లడక యూరకుండి తిరిగి కంసుడిట్లనెను. ''మానవులు తమ స్వార్థ ప్రయోజనము కొరకు అసత్యము పలుకుదురని నేనెరుగుదును కాని యింతవరకు దేవతలు అసత్యము లాడగలరని నే నెరుగను. ఆకాశవాణి పలుకులు సత్యమని భావించి నా సోదరి పుత్రులను చంపినాను. దేవకీ! నన్ను క్షమింపుము

గతించిన నీ బిడ్డల కొరకు విచారించకుము. ఈ భౌతిక శరీరము అశాశ్వతము. ఇది ఒక మట్టి పాత్రవంటిది. మట్టిపాత్ర పగులగానే రూపము కోల్పోవును. అదే విధముగా యీ శరీరము మరణము తర్వాత శిథిలమై రూపము పోగొట్టుకొనును. కాని యీ శరీరములోని ఆత్మ పాత్రలోని గాలివలె యెన్నటికిని నశించకుండును. ఇక్కడ విచారించుటకు తావులేదు. జ్ఞానులు జనన మరణములను సంసార చక్రమునకు విచారింపరు. బ్రహ్మము సత్యమని తెలియని అజ్ఞానులు అహంకారముచేత భ్రాంతి చెందుదురు. అట్టి అజ్ఞానులు ఆత్మయు శరీరము నొకటే యని భావింతురు. ఈ భూమిపై అజ్ఞానులు వివాహము చేసుకుని సంతానము పెంపొందించుకొని సుఖదుఃఖమయమైన సంసార జీవితము గడపుచుందురు. పుత్రులు కలిగినపుడు సంతోషించుచు, మరణించినపుడు దుఃఖించుచు జీవించెదరు. మాయలో చిక్కుకుని యున్నంతవరకు సత్యమును తెలియక విచారములో మునిగి జీవించుచుందురు.

''కాని మీరిద్దరును అట్లు కాదు. ఈ భూమిపై పుట్టు ప్రతి జీవి పూర్వ జన్మలో చేసిన కర్మ ఫలితముగా జన్మించుచున్నాడని మీరెరుగుదురు. అజ్ఞానులు అజ్ఞానముచేత యెవరో చంపుటచేత వారు చనిపోయిరని తలంచెదరు. అది సరియైనది కాదని మీకు బాగుగా తెలియును. కాబట్టి మీవంటి ఉత్తమ జ్ఞానులు ఉదార బుద్ధితో పాపాత్ముడైన యీ కంసుని క్షమింపవలెను''. కనుల వెంట అశ్రువులు కారుచుండగా కంసుడు చెరలోనున్న దేవకీ వసుదేవుల కాళ్ళపైబడి వారి చేతులను తన చేతిలోనికి ఆప్యాయముగా తీసుకొనెను.

ఉదార స్వభావులైన దేవకీ వసుదేవులు, కంసుడు నిజముగా పశ్చాత్తాపము చెంది విచారించుచున్నాడని భావించిరి. అతనిని లేవనెత్తి, అతని అక్రమ కృత్యములను యెన్నడో మరిచినామని చెప్పిరి. దేవకి నవ్వుచు కంసునితో యిట్లనెను. ''అన్నా! నీవన్నది సత్యము. అజ్ఞానులు, ఆత్మ సత్యము నెరుగని వారు మాత్రమే యెడబాటుకు దుఃఖించెదరు. సత్యాసత్య విచక్షణ జ్ఞానము కలుగనంతవరకు విచారము, దుఃఖము, భయము, ద్వేషము, దురాశ, లోభము, అహంకారము మున్నగు దుర్గుణములు మానవుల హృదయములందు నిండియుండును. ఈ దుర్గుణములు వారి వివేక శక్తిని హరించి గుడ్డివారిని జేయును. ఒక వ్యక్తి మరొకరిని ద్వేషించినచో, తన్ను తాను ద్వేషించినట్లే యగును. ఏలయనగా ద్వేషమునకు గురియైన వానియందు ద్వేషించువానియందు నున్న ఆత్మ ఒక్కటే. ఈ సత్యము గుర్తించిన వారు దుఃఖ ప్రపంచమున తగుల్కొనరు''

దేవకీ వసుదేవుల ఔదార్యము క్షమాగుణము కనుగొనిన కంసుడు తాను యెంత అల్పుడైనదియు గ్రహించి, వారి వద్ద సెలవు తీసుకుని తేలికయైన హృదయముతో తన సౌధమునకు తిరిగి వచ్చెను.

## 152 కంసుని ప్రచారము

నల్లని మేఘములతో దట్టముగా నున్న ఆకాశమందు సూర్యుని గాంచుట సాధ్యముకాదు. మధ్యమధ్యలో మబ్బులు కొద్దిగా వీడినప్పుడు సూర్యరశ్మిని గాంచవచ్చును. కాని తిరిగి మబ్బులు ఆవరించి చీకటి వ్యాపించిన తర్వాత, సూర్యరశ్మి ఒక జ్ఞాపకముగా మిగిలి త్వరలో అంతరించును. కంసుని తీరు అదే విధముగా నుండెను. ఉత్తములైన, నారాయణుడు తల్లిదండ్రులుగా నెంచుకున్న, దేవకీ వసుదేవుల సమక్షములో నున్నపుడు, కంసునికి వారి సద్గుణములంటి జీవిత సత్యమును తెలుసుకొనినట్లు భావించెను. మరియు జీవితము

అశాశ్వతమనియు, అన్ని జీవులలో ప్రకాశించు ఆత్మ ఒకటే యనియు కూడ గ్రహించెను.

వారి సమక్షము నుండి వెళ్ళిన కంసుని మనస్సు ఆకాశము మేఘావృతమైనట్లు, చీకటితో నిండి యుండెను మరుచటి రోజు మంత్రులను పిలిపించి, కారాగారములో జరిగిన విచిత్ర సంఘటనలను, విష్ణుమాయ పలుకులను వారికి వివరించెను

దైవద్వేషులు, అజ్ఞానులు, మూఢులు, గర్వోన్నతులు అయిన మంత్రులు ఆవేశముతో తీవ్రముగా వ్యాఖ్యానించిరి వారు అనేక సూచనలు చేసిరి. వారిట్లనిరి. ''ఎచ్చటనో రహస్యముగా శిశువును దాచి వేసిరనుట స్పష్టము. బహుశః మధురా నగరము వెలుపల దాచి యుంచవచ్చు. గ్రామ శివారులలో గోపాలకులు జీవించు ప్రదేశములో దాచి యుండవచ్చును సంవత్సరములోపు శిశువులందరినీ హతము చేసినచో యీ సమస్య తీరగలదు దేవతలు నీకెట్టి ప్రమాదము కల్పించలేరు నీ చేతులలో వారు పలుమార్లు అపజయము పొందిరి నీ పేరు వినినంతనే గడగడ వణకి పారిపోవుదురు నీకు బద్ధ శత్రువైన నారాయణుడు నిన్నేమి చేయగలడు? అతడెప్పుడును దాగుకొని యుండును. ఎదురుగా వచ్చి ముఖాముఖి యుద్ధము చేయుటకు సంకోచించును. మహాదేవుడు సగము మగవాడు అతడు నిన్నేమి చేయగలడు? వీరిద్దరికంటె బ్రహ్మదేవుడు అల్పుడు. నీ శక్తి ముందు ఇంద్రుని శక్తి మిక్కిలి తక్కువ యని నీకు తెలియును.

''అయినప్పటికిని మనము తగిన జాగ్రత్తలు తీసుకొనుట సమంజసము. లేతగా నున్నపుడే శత్రువులనే వేరులను పెరికివేయవలెను శరీరములో రోగము చోటు చేసుకున్నపుడు, అది యెట్లు సంక్రమించెనో దాని స్వభావమేమియో తెలుసుకుని దానిని నివారించుటకు తక్షణ చర్యలు తీసుకోవలెను మనము దానిని ఉపేక్షించినచో అది క్రమముగా పెరిగి శరీరింద్రియములను నశింపజేయును దానిని నిగ్రహించి అదుపులో నుంచకుండిన, కళ్ళెములేని గుర్రము రధమును యిష్టము వచ్చినట్లు లాగిన విధముగా నుండగలదు.

''నారాయణుడు దేవతలకు ఆశ్రయుడు. స్వర్గమను వృక్షమునకు వేరు వంటి వాడు సనాతన ధర్మము యెచ్చట విలసిల్లునో అచ్చట అతడుండునని చెప్పుదురు ఈ సనాతన ధర్మము, వేద మంత్రపఠనము, గోపూజ, బ్రాహ్మణులు గావించు తపస్సు, యజ్ఞ యాగములు అను పునాదులపై నిలిచి యున్నది ప్రభూ! నారాయణుని నశింపజేయుటకు అత్యుత్తమమైన మార్గమేమనగా వేద ప్రచారము గావించు బ్రాహ్మణులను, తపస్సు చేయు ఋషులను. ఆశ్రమములోని నిత్యాగ్నిహోత్రమునకు అవసరమైన వెన్న, నెయ్యి నిచ్చు గోవులను సంహరించుట

''నారాయణుని వివిధ రూపములు గోబ్రాహ్మణ వేదములు, తపస్సు, సత్యవ్రతము, ఆత్మనిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, ధ్యాన మననములు, కరుణ, ఓర్పు యోగము అని చెప్పుదురు. దేవతలు, మహాదేవుడు, ఇంద్రుడు నారాయణునకు ప్రియమైనవారు అతడు అసుర ద్వేషి ఇది వరకు మేము నీకు చెప్పినట్లు దేవతలు, తదితరులు నీకు యెట్టి హాని చేయలేరు. నారాయణుని వలన మాత్రమే మనకు ముప్పు''.

మృత్యువను త్రాటిని మెడకు తగిలించుకుని అది పువ్వుల దండయని భ్రమించినట్లు, కంసుడు జన్మతః కలిగిన సద్గుణములను పూర్తిగా మరచిపోయెను. కంసుడు తన మంత్రులే శ్రేయోభిలాషులు, స్నేహితులు అని భావించుటచేత, వారు చెప్పిన వానిని మెచ్చుకొనెను. తక్షణమే అసురులను నాలుగు దిక్కులకు బంపి, బ్రాహ్మణులను వేధించి, యజ్ఞశాలలను ధ్వంసము చేయుమని ఆజ్ఞాపించెను మృత్యువు త్వరలోనే సమీపించుచు

వ్నదని యెరుగక, అసురులు తమ కప్పగించిన కార్యమును సంతోషముతో నిర్వర్తించుచుండిరి. ఆయుః ప్రమాణము తగ్గిపోవుటకు, సంపదను గోల్పోవుటకు, కీర్తి ప్రతిష్ఠలను, భార్యా సుతులను పోగొట్టుకొనుటకు, సత్పురుషులకు హాని కలిగించుటకు మించిన శక్తిమంతమైనది వేరొకటి గలదా? దుష్ట కార్యములను సలుపుట కుత్సాహపడు దుష్టులకు యెవ్వరును సహాయపడలేరు.

## 153 భూలోక స్వర్గము

గోకులములో యశోదకు విష్ణుమాయ జన్మించినపుడు అందరును గాఢ నిద్రలో నుండిరి. వారికి యశోద ప్రసవించినదని మాత్రమే తెలుసును. కాని ఆ శిశువు మగశిశువో, ఆడశిశువో తెలియలేదు. వసుదేవుడు వచ్చి శిశువులను మార్పిడి చేసి వెళ్ళిన తర్వాత గోకులవాసులు నిద్రనుండి లేచిరి వెంటనే నందునికి పుత్రుడు జన్మించెనను వార్త ప్రాకిపోయెను. గోకుల వాసులందరును శిశువును చూచుటకు నందుని యింటికి వచ్చిరి అచ్చట లోకాధిపతియైన నారాయణుడు తల్లి యశోద ప్రక్కన శిశువుగా పరుండియుండెను. యశోద చేతులలో ఆ బిడ్డడు చిన్నగా సన్నగా నీలి కమలము వలె గోచరించెను. నందునకు బ్రహ్మానందము కలిగెను. అతనికి చంద్రునివంటి అందముగల పుత్రుడు కలిగెను. నందుడు బ్రాహ్మణులను పిలిపించి, దుష్టశక్తులను పారద్రోలుటకు వారిచే పవిత్ర మంత్రములను పఠింపజేసి, వారికి విరివిగా దానము లొసగెను ఆ తర్వాత పుణ్యాహవాచనము, జాతకర్మ మొదలగు సంస్కారములను నూతనముగా పుట్టిన బాలునికి యథావిధిగా జరిపించెను.

భూమి కాలముచే పునీతమగును; మానవ శరీరము పవిత్ర తీర్థములో స్నానమాచరించుటచే పావనమగును, మసి పట్టిన పాత్రలు చింతపండుతో శుద్ధము కాగలవు; తల్లి గర్భము నుండి వెలువడిన శిశువు జాతకర్మచే శుద్ధిపొందును; యాగములు చేయుటచే బ్రాహ్మణులు పవిత్రులగుదురు; దానము చేయుటచే సంపద సద్వినియోగ మగును, తపస్సు చేత ఇంద్రియ నిగ్రహము సాధ్యమగును; సంతృప్తి వలన మనస్సు నిశ్చలముగా నుండును; ఆత్మవిద్య చేత ఆత్మ ప్రకాశించును.

గోకుల మంతయు పండుగ జరుపుకొనుచున్నట్లు ఉండెను. వారు రాజకుమారుడు పుట్టినంత ఆనంద ముతో నుండిరి ప్రతి గృహము అలంకృతమై యుండెను వీధులలో పన్నీరు జల్లిరి స్త్రీలు అందమైన రంగుల దుస్తులు ధరించిరి గోపికలు, గోపాలురు వీధులలో ఆనందముతో నాట్యమాడుచుండిరి. స్త్రీలు గంధపు నీరు గల వెండి పళ్ళెములను శిశువు యెదుట ముమ్మారు త్రిప్పి యిట్లనిరి. ''కలకాలము జీవించుగాక! ఎట్టి అరిష్టములు కలుగకుండు గాక!''

రోహిణికి కూడ కుమారుడు కలిగెను. ఆమె యశోదకు సోదరి కంసుని నిరంకుశము నుండి తప్పించుకొనుటకు రోహిణి గోకులములో దాగియుండెను. కంసుడు యాదవులను, వారి భార్యలను బాధించుచుండెను. అక్క చెల్లెండ్రిద్దరూ వారి బాలురతో రాణులవలె గోకులమున గోపికల సమక్షములో ప్రకాశించుచుండిరి. రోహిణి కుమారుడు తెల్లగాను, యశోద కుమారుడు నల్లగాను ఉండిరి

# 154 పూతన

కంసుని రాజ్యములో నందుడు ఒక సామంతుడు. సామంతులందరు ప్రతి సంవత్సరము రాజుకు కప్పము చెల్లించుట విధి కప్పము చెల్లించవలసిన సమయము రాగా నందుడు మధురకేగెను. నందుడు మధుర వచ్చెనని తెలిసి వసుదేవుడు అతనిని చూచుటకు వచ్చెను వారిద్దరు అన్యోన్య స్నేహితులు. ఆప్యాయముగా ఒకరినొకరు కౌగిలించుకుని పరస్పరము కుశల మడిగి తెలుసుకొనిరి. ఆ తర్వాత వసుదేవుడు నందునితో యిట్లనెను. ''నీకు కుమారుడు కలిగెనని వినియున్నాను. నీవు చాల అదృష్టవంతుడవు. నీవంటి అదృష్టశాలిని చూచుట నా మహద్భాగ్యము. నీవు నాకు చాల ఆప్తమిత్రుడవు. కాని మనము కలుసుకొనుట చాల అరుదు. ఈ లోకములో ఒకరినొకరు ప్రేమించుకొనువారు, కలిసి ఒకచోట నుండ గోరువారు కోరు కోరిక చాల అరుదుగా నెరవేరును. మనము నదిలో నీటిపై తేలు చెక్క బల్లల వంటి వారము. కొంత కాలము ఒకరి నొకరు కలుసుకుని, ఆనందముగా గడపి, తిరిగి విడిపోయి యెవరి త్రోవన వారు వెళ్ళుదుము గోకులములో ప్రజలందరుని నిన్ను మెచ్చుకొందురని విని చాల సంతోషించినాను మన యిద్దరి శరీరములు వేరు కాని ఆత్మ ఒక్కటే. కాబట్టి నీ పుత్రుడు నా పుత్రుడే యగును! నా పుత్రుడు క్షేమముగా నున్నాడు కదా!''

నందునికి అశ్రువులు రాగా యిట్లు పలికెను. ''నీవు చాల దురదృష్టవంతుడవు. నీ పుత్రులందరూ కంసునిచేత మృతినొందిరి చివర పుట్టిన కుమార్తె కూడ నిన్ను వదలి ఆకసమున యెగిరిపోయెనని విన్నాను. అదృష్టము గాని దురదృష్టముగాని మానవుల జీవితమును నడిపించును విధి చేత మనము శక్తిహీనులము. దౌర్భాగ్యము నిన్ను యింతవరకు వెంటాడుచున్నది. ఎవరు చెప్పగలరు, కాలము మారవచ్చు! ఏది యేమైనప్పటికిని అదృష్టముపై ఆశలు పెంచుకొనక జీవించువారే నిజముగా ఆత్మ సత్యమును తెలిసినవారని చెప్పవచ్చును అట్టివారు క్రుంగక పొంగక చలించకుందురు''.

వసుదేవుడు తగురీతిగా యిట్లు సమాధాన మిచ్చెను. ''మిత్రుడా! నీవు మధురలో యెక్కువ కాలము ఉండవద్దు నీవు రాజుకు కప్పము చెల్లించితివి. గోకులములో కొన్ని దుశ్శకునములు కన్పట్టుచున్నవి. నీవు తొందరగా నీ భార్యా, పుత్రుల వద్దకు వెళ్ళుట మంచిది''

ఒకరికొకరు వీడ్కోలు చెప్పుకున్న తర్వాత, నందుడు ఎడ్లబండిలో గోకులమునకు ప్రయాణమయ్యెను వసుదేవుడు గోకులములో దుశ్శకునములు గోచరించుచున్నవని చెప్పినప్పటి నుండి నందుని మనస్సు వికలముగా నుండెను ఏవో ప్రమాదకర సూచనలు కన్పడుటచేతనే వసుదేవుడు ఆ విధముగా పలికెనని నందుడు దృఢముగా విశ్వసించెను. నారాయణుని ప్రార్థించుచు నందుడు ఎడ్లబండిలో గోకులమునకు ప్రయాణము సాగించెను

తన మంత్రులు యిచ్చిన సలహాను పాటించవలసిన సమయము వచ్చినదని కంసుడు భావించెను. దేశములో కొత్తగా జన్మించిన శిశువుల నందరినీ చంపుటకు నిశ్చయించుకొనెను. దీనిని సాధించుటకు అనేక మార్గములను యోచించి, చివరకు ఆతని ఆజ్ఞలను నెరవేర్చుటకై తగిన వ్యక్తిని యెన్నుకొనెను

కంసుని దుస్సహచరులలో ఒకని భార్య పూతన ఆమె అతి క్రూరమైన అసుర వనిత కంసుడు ఆమెను పిలిపించి, యేమి చేయవలెనో వివరముగా ఆమెకు తెలిపెను ఎట్టి అభ్యంతరము తెలుపక, ఆమె కంసుని ఆజ్ఞను నెరవేర్చుట కంగీకరించెను.

అప్పటి నుండి ఆమె నగరములందు, పల్లెలందు సామాన్యులు నివసించు ప్రాంతములలో యిష్టము వచ్చినట్లు సంచరించుచుండెను. నారాయణుని కీర్తనలు వినిపించని ప్రదేశములలో అసురులు తమ శక్తిని ప్రదర్శింతురను నది సత్యము గదా? అటువంటపుడు, పూతన గోకులములో మానవ రూపములో నున్న భగవంతునికి హాని యెట్లు చేయగలదు?

తన యిచ్ఛవచ్చిన రీతిగా సంచరించుచున్న పూతన, ఒకనాడు ఆకాశమున పయనించుచు క్రింద గోకులము జూచెను ఇంతవరకు గోకులమును చూడకుండుటచే అక్కడకు వెళ్ళుటకు నిశ్చయించుకొనెను తనకున్న మాయా శక్తిచేత అందమైన స్త్రీ రూపము ధరించి పవిత్ర గోకులమునకు వెళ్ళెను. చుట్టును పరికించి, ఒక పెద్ద గృహమును చూచెను. ఆ గృహమునకు అనేకులు వచ్చుచు పోవుచు నుండుట పూతన గమనించెను పూతన ఆ గృహములో ప్రవేశించెను అది నందుని గృహము ఆమె కొప్పు బిగించి కట్టి అందు మల్లెపూల దండను ధరించెను. ఆమె వెడల్పైన పిరుదులు, అందమైన వక్షోజములు అందరినీ ఆకర్షించెను ఆమె సౌందర్యము అందరకును ఆకర్షణీయముగా నుండెను ఆమె శిరో దముగా నుండి, చల్లని గాలికి ఆమె వెంట్రుకలు యెగిరి ముఖమున పడుచు, మరింత అందముగా గోచరించుచుండెను. ఆమె మాటి మాటికి నవ్వుచుండెను ఆమె చేతియందు ఒక పద్మము గలదు ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవియని గోపికలు భావించిరి మారువేషములో నున్న పూతన అంత అందముగా నుండెను అమాయికులైన గోపికల మనస్సులను ఆమె ఆకట్టుకొనెను.

ఆమె నందుని గృహము వాకిలి సమీపించెను. అచ్చట మానవ రూపములో భగవంతుడుండెను అతడు తన వైభవమును మరుగపరచి, బూడిద కప్పిన బొగ్గువలె నల్లగా కన్పట్టుచుండెను ఉయ్యాలలో పరున్న బాలుని పూతన చూచెను. ఆమె వాకిట్లో ప్రవేశించగనే, ఉయ్యాలలోని బాలుడు కనులు మూసుకొనెను. బహుశః తన దృష్టి ఆమెపై ప్రసరించిన ఆమె అనుగ్రహింపబడునని తలచెనేమో! ప కార్యమునకు అంతరాయము కలుగును దుష్టశిక్షణ, శిష్టరక్షణ యను కార్యము నిర్వహించుటకే భగవంతు డవతరించెను గదా!

పూతన చుట్టుప్రక్కల యెవరైన నున్నారేమోనని చూచెను ఆ సమయమున అక్కడ యెవరును లేకుండుట జూచి, ఆమె ఊయెలలో నున్న బాలుని యెత్తి చేతులలోనికి తీసుకుని క్రింద కూర్చుని తన ఒడిలో పెట్టుకొనెను నిద్రపోవుచున్న నాగుబామును త్రాడని భావించి మెడలో వేసుకొనుట యెంత తెలివి తక్కువతనమో పూతన చర్య కూడ ఆ విధముగా నుండెను ఆమె అట్లు కూర్చుండెను. దాసీలు, యితర స్త్రీలు అటు నిటు తిరిగుచుండిరి గాని, ఒక అపరిచిత స్త్రీ తన ఒడిలో బాలుని పెట్టుకుని కూర్చొనుట వారు శ్రద్ధగా గమనించకుండిరి ఆమె ఆకర్షణకు, సౌందర్యమునకు ముగ్ధులై ఆమె చర్యలకు యెట్టి ప్రాముఖ్యము యివ్వకుండిరి.

పూతన నెమ్మదిగా రవిక ముడివిప్పి విషపూరితమైన పాలతో నిండిన తన స్తనములను బాలుని పెదవుల కందించెను బాలుని రూపములో నున్న భవగంతుడు తన చిన్నారి చేతులతో ఆమె స్తనమును పట్టుకుని నోటితో తనివితీరా పీల్చుచుండెను కొన్ని క్షణముల తర్వాత తన ప్రాణమునే ఆ బాలుడు పీల్చుచున్నట్లు ఆమె గ్రహించెను. ఆమెకు విపరీతమైన బాధ కలిగెను ఆ బాలుడు స్తనమును పట్టుకుని, పీల్చుచున్నపుడు ఆమెలోని నరనరము తీవ్రమైన బాధకు లోనయ్యెను. ఆ బాధకు తట్టుకొనలేక ఆమె పెద్దగా కేకవేసెను.

ఆమె వచ్చిన పనిని మరిచిపోయెను. ''వదలిపెట్టు! వదలిపెట్టు'' అని అదే పనిగా అరచుచు, తన స్తనమును బాలుని నోటి నుండి విడిపించుకొనుటకు ప్రయత్నించెను కాని ఫలితము లేకపోయెను. ఆ బాధకు తట్టుకొనలేక ఆమె భీకరమైన శబ్దముతో అరచెను. ఆ అరుపునకు భూమి, ఆకాశము, గ్రహములు దద్దరిల్లెను. బాధతో ఆమె పెట్టిన కేక అంత గట్టిగా నుండెను ప్రజలు యెక్కడనో పిడుగు పడినదని భావించిరి చివరిసారిగా పూతన గట్టిగా కేక పెట్టి ప్రాణములు విడిచెను

ఆమె అందమైన రూపము అదృశ్యమయ్యెను. చచ్చిపడియున్న ఆమె శరీరము, ఇంద్రుని వజ్రాయుధముచే మరణించిన వృత్రుని వలె గోచరించెను. ఆమె నేలపై కూలినపుడు చుట్టుప్రక్కల ఆరు క్రోసుల దూరము వరకు నున్న చెట్లు అన్నియు కూలెను. ఆమె కేకకు అదిరిపడి శబ్దము వచ్చిన దిక్కుగా ప్రజలు వచ్చి పర్వతము వలె పడియున్న పూతన మృత దేహమును చూచిరి వారు ఆశ్చర్యముతో చూచుచుండిరి. అకస్మాత్తుగా ఆమె విపుల స్తనములపై ఆడుకొనుచున్న నందుని కుమారుని గాంచిరి వారు తొందరగా వచ్చి ఆ బాలుని అక్కడ నుండి దూరముగా తీసుకుపోయిరి యశోదయు, రోహిణియు బాలునికి దిష్టితీసి, కీడు కలుగకుండ బాలుని రక్షించుటకు అనేక సంప్రదాయ విధులను నెరవేర్చిరి ప్రజలు పూతన మృత దేహము చుట్టును నిలుచుండిరి. యశోద తొందరగా బాలుని లోపలికి తీసుకువెళ్ళి పాలిచ్చి నిద్రపుచ్చెను

అదే సమయమున నందుడు మధుర నుండి తిరిగి వచ్చెను. ఆ దృశ్యము చూచి అతడు తెల్లబోయెను. అచ్చట చేరిన వారితో నందు డిట్లనెను ''నిజముగా నా స్నేహితుడు వసుదేవునకు దివ్యజ్ఞానము కలదు. లేకున్న అతనికి యిక్కడ ప్రమాదము జరుగనున్నదని యెట్లు తెలియును? గోకులములో దుశ్శకునములు కానవచ్చుచున్నవని నన్ను తొందరగా వెళ్ళమని పంపెను''

పూతన మృత దేహమును కదలించుటకు గోపాలురకు చాల వ్యవధి పట్టెను పెద్ద పెద్ద ప్రూనులను రంపముతో కోసినట్లు, ఆమె శరీరమును కోసి ప్రోగుపెట్టి నిప్పంటించిరి చితి కంటించిన అగ్నిహోత్రము వెలుగునకు ఆకాశమంతయు ప్రకాశింపజొచ్చెను ఆమె దేహము మండుచున్నపుడు, చుట్టు చేరిన ప్రజలు ఒక అపూర్వమైన దానిని గాంచి అచ్చెరువొందిరి. ఆమె శరీరము మండుచున్నపుడు మంచి గంధపు సువాసన, దివ్య సుగంధమును ఆవిర్భవించెను. ఎవరును దీనికి కారణము తెలుసుకుని వివరించలేకపోయిరి

పూతన యను రాక్షసి భగవంతునిచే జచ్చెను ఆమె స్తనము నతడు పీల్చునపుడు ఆమెలోని పాపము నంతను అతడు పీల్చివేసెను. ఆమె భగవంతుని స్పృశించుటచేత పునీతురాలయ్యెను భగవంతుడు కూడ తన పెదవులతో ఆమెను స్పృశించెను పూతన అదృష్టవంతురాలు విషము నిచ్చిన స్త్రీకి భగవదనుగ్రహము లభింపగా, పాలు పరమాన్నము సమర్పించి పూజించు వారి మాట యిక చెప్పవలెనా? నిజముగా ఆ బాలునికి పాలు కుదువబెట్టే యశోద, గోపికలు, గోకులములోని గోవులు మిక్కిలి అదృష్టవంతులు వారు తిరిగి జన్మ లేని మోక్షమును పొందిరి

గోపాలురకు ఆ ప్రదేశమంతా వ్యాపించిన దివ్య సువాసనలకు, దహనమగుచున్న పూతన మృత దేహమునకు గల సంబంధము అవగాహన కాలేదు ఆ సువాసన యెక్కడి నుండి వచ్చెనా యని ఆశ్చర్యము చెందుచు తమ తమ గృహముల కేగిరి.

ఒక అందమైన యువతి వచ్చి అందరినీ యెట్లు మోసగించెనో వివరముగా నందునికి తెలిపిరి. ఆమె

రాక్షసి యని యెవరును ఊహించలేకపోయిరి. నారాయణుని అనుగ్రహముచే బాలుడు సురక్షితముగా నుండెనవియు, యిది వారందరి అదృష్టమనియు భయంకరమైన ముప్పు తప్పినదనియు అందరును భావించిరి. ఈ విషయమును గురించి రాత్రి ప్రొద్దుపోవు వరకు ముచ్చటించి విద్ర కుపక్రమించిరి. కాని ఆ బాలుడెట్లు భయంకర రాక్షసి పూతన నుండి తప్పించుకొనెనో వారికి అంతుబట్టలేదు. బాలుని రక్షించి నందుకు వారు మరొకసారి నారాయణునికి ధన్యవాదములు అర్పించుచు మనస్సులోనే నమస్కరించిరి.

## ఫలశ్రుతి

పూతన మోక్షమను యీ కథను యెవరు శ్రద్ధాభక్తులతో విందురో వారు శ్రీకృష్ణ భగవానుని అనుగ్రహము నకు పాత్రులగుదురు. అట్టివారి మనను యెల్లపుడూ శ్రీకృష్ణుని యందే లగ్నమై యుండును. వారు శ్రీకృష్ణుని యెడల అచంచల భక్తి కలిగి యుందురు.

పరీక్షిత్తు మహారాజు యిట్లనెను. ''ప్రభూ! నారాయణుని అనేక అవతార గాథలు నాకు వివరించి చెప్పినారు. మత్స్యావతారము అత్యద్భుతమైనది. మిగిలిన అవతారములు కూడ అట్లే యున్నవి భగవంతుడు యీ అవతారములు దాల్చుటకు వెనుక నున్న ప్రయోజనము నాకు మిక్కిలి ఔత్సుక్యము కలిగించుచున్నది. మరియు ఆ గాథలను నా చెవులు విని మనస్సునకు అమందానందము చేకూర్చుచున్నవి. కాని యీ కృష్ణావతారము అన్ని అవతారములకన్న ఉత్కృష్టమైనదని నా అభిప్రాయము. కృష్ణావతార గాథలను వినుటచేత మనసులో నున్న నిరాశా నిస్పృహలు మటుమాయమగునని చెప్పుదురు. అంతేకాక మానవులకు అశాంతిని కలిగించు కోరికలు కూడ అంతరించునని విజ్ఞులందురు దురాలోచనలు దూరమై మనసు పరిశుద్ధ మగును. మనసు భగవంతుని చింతించుచు, నారాయణ భక్తుల సత్సాంగత్యమును కోరుచుండును. నా జీవితములో మిగిలిన యీ కొద్ది రోజులు గోకులములో కృష్ణుడు గావించిన అద్భుత చర్యలు, వాటిని ప్రత్యక్షముగా చూచి అనుభవించి తన్మయత్వము చెందిన అదృష్టవంతుల గాథలు వివరించి నాకు అనంతమైన ఆనందము చేకూర్చుమని కోరుచున్నాను''

శుక బ్రహ్మ శ్రీకృష్ణుని లీలలను వివరింప మొదలుపెట్టెను.

## 155 శకటాసురుడు, తృణావర్తుడు

యశోదానందుల చిన్నారి పుత్రుడు క్రమముగా పెరుగుచుండెను. ఆ బాలుని కిపుడు మూడు మాసములు. బోర్ల పడుట నేర్చెను. బోర్లపడి బోసి నవ్వులు నవ్వుచు నుండెడి పుత్రుని చూసిన యశోద ఆనందము వర్ణనాతీతము. ఆ రోజు కృష్ణుని జన్మ నక్షత్రమగుటచే యశోద వేడుక చేయ నిశ్చయించెను. ఆమె గోకులములో నున్న వారందరినీ ఆహ్వానించెను పురుషులు స్త్రీలు గుంపులు గుంపులుగా యమునా నదీ తీరమునకు వెళ్ళిరి బ్రాహ్మ ించుచుండగా, స్త్రీ పురుషులు నృత్య గాన వినోదములలో

మునిగి యుండగా బాలునికి అభ్యంగన స్నానము చేయించిరి. వచ్చిన వారందరికిని విరివిగా కట్నములు, కానుకలు నొసగిరి.

యశోద తన పుత్రుడు అలసిపోయి నిద్రపోవనున్నాడని భావించెను. ఒక బండి క్రిందివైపు కట్టిన ఊయెలలో యశోద బాలుని పండుకొనబెట్టెను.

యశోద సహచరులతో ముచ్చటలాడుచు బాలుడు నిద్ర నుండి లేచిన సంగతి గమనించకుండెను. బాలుడు గట్టిగా యేడ్చినప్పటికిని యెవరును పట్టించుకొనలేదు. అతనికి కోపము వచ్చి, వృక్ష లతల కన్న లేతనైన తన చిన్నారి కాళ్ళతో ఆ బండిని తన్నెను. పెద్దగా శబ్దము వినిన అక్కడ వారందరును ఆ బండి దూరముగా విసరివేసినట్లు పడియుండుట జూచి ఆశ్చర్యపోయిరి. ఆ బండిలోనుంచిన గిన్నెలు పాత్రలు చెల్లాచెదురుగా పడి ముక్కలయ్యెను. చక్రము బండి నుండి విడిపోయెను. బండి ఒక ప్రక్కకు ఒరిగిపోయెను. ఏమి జరిగెనో యెవరికిని తెలియలేదు.

కొందరు చిన్న పిల్లలు కృష్ణుడు కాలితో తన్నగా అట్లు జరిగినవని చెప్పిరి. మూడు మాసముల బాలుడు కాలితో తన్నిన బండి దూరముగా పోయి పడుట యెట్లు సాధ్యమో యెవరికిని అర్థము కాలేదు. వారట్లు ఆలోచించుచుండగా, యశోద కృష్ణుని తన చేతులలోనికి తీసుకుని తన ముద్దుల కృష్ణునికి యెట్టి కీడు జరుగనందుకు భగవంతుని కభివందనములు మనసులోనే చెప్పెను.

కంసుని అనుయాయులలో శకటాసురుడు ఉన్నట్లు యెవరికిని తెలియదు. అతడు గోకులము వచ్చి బండి చక్రములో ప్రవేశించి బండిని దూరముగా తీసుకుపోయి తరువాత బాలుని చంపవచ్చునని ఉద్దేశించెను. శకటాసురుని పన్నాగము కనిపెట్టిన భగవంతుడు తన పవిత్ర పాదములతో ఒక తన్ను తన్ని ఆ అసురుని చంపెను. కాని అక్కడ ఉన్న వారికెవరికీ యేమి జరిగెనో తెలియకుండెను.

ఒకసారి యశోద పుత్రుని స్నానము చేయించి తన ఒడిలో పెట్టుకుని వాకిట కూర్చుండెను. అకస్మాత్తుగా తన పుత్రుడు మిక్కిలి బరువుగా నున్నట్లు ఆమెకు తోచెను. అటులెందుకు జరిగెనో ఆమెకు తెలియలేదు. బహుశః తన ఊహయని తలంచి ఆ విషయము మరిచిపోవుటకు ప్రయత్నించెను. కాని బాలుని బరువు క్రమముగా పెరుగుచుండెను. ఆమె ఆ బరువు భరించలేక పుత్రుని నేలపై నుంచెను. బాలుడు నిద్రపోవుచుం డుట జూచి, గృహ కృత్యములు నిర్వర్తించుటకు లోని కేగెను.

కంసుని అనుయాయులలో మరియొకడు యశోద పుత్రుని చంపుటకు గోకులము వచ్చెను. అతని పేరు తృణావర్తుడు. పూతన మరణించినప్పటి నుండి తమ రాజుకు ప్రమాదము, గోకులములో అందరకూ ముద్దుల మూటయైన నల్లని బాలుని వలన, కలుగగలదను నిశ్చయమునకు వచ్చిరి.

తృణావర్తుడు సుడిగాలి రూపము ధరించెను. గోకులములోని వారందరును ఒక్కసారిగా యీ సుడిగాలి తీవ్రతకు లోనయిరి. ప్రచండ వేగముతో వీచు గాలికి ధూళి చెలరేగుటచేత యేదియు కన్పించకుండెను. వారు కనులు మూసుకుని దేనినైనను ఊతగా పట్టుకొనవలసి వచ్చెను. లేకున్న గాలి వేగమునకు తట్టుకొనలేకుం డిరి. అష్ట దిక్కులందు సుడిగాలి శబ్దము ప్రతిధ్వనించుచుండెను. అంతటా చీకటి అలముకొనెను. ప్రజలు భయముతో అటు నిటు పరుగెత్తుచుండిరి. ఉన్నట్లుండి సుడిగాలి తీవ్రత తగ్గిపోయెను. అందరును కనులు

తెరవగలిగిరి. బాలుని తీసుకువచ్చుటకు యశోద వాకిటికి వచ్చెను. కాని ఆమెకు బాలుడు కనుపించలేదు. ఆమె అందరినీ పిలువగా, వారందరను బాలునికై వెదకిరి. కాని వారికెక్కడను గోచరించలేదు. రాళ్ళు రప్పలు, ధూళి ఆకాశము నుండి ఉండి ఉండి పడుచుండెను. వారు కళ్ళు తెరచుచూ మూయుచూ అట్లే బాలునికై వెదకసాగిరి. కాని వారికి బాలుడు కనుపించకుండెను. తమ ముద్దుల బాలుడు కన్పింపకుండుటచేత గోకులమంతయు విచారములో మునిగెను.

ఇంతలో తృణావర్తుడు బాలుని దూరముగా ఆకాశముపైకి యెగురవేసుకుపోయెను. బాగా యెత్తునకు తీసుకువెళ్ళి అంత యెత్తు నుంచి నేలపై విసరి కొట్టవలెనని తృణావర్తుని ఉద్దేశ్యము. కాని బాలుడు మిక్కిలి బరువెక్కెను. తృణావర్తుడు పైకి యెత్తలేనంత బరువయ్యెను. అతడు బాలుని క్రిందకు వదలిపెట్ట ప్రయత్నించి విఫలుడయ్యెను. బాలుడు తన చిట్టి చేతులతో తృణావర్తుని మెడ పట్టుకునెను. తృణావర్తునికి ఊపిరాడకుండెను. ఒక పెద్ద రాయి మెడకు తగిలించినట్లు ఉండెను. అతి కష్టముతో ఉండి ఉండి ఊపిరి పీల్చగల్గెను. కొంతసేపటికి పూర్తిగా ఊపిరి ఆగిపోయెను. తృణావర్తుడు మరణించెను. సుడిగాలి తీవ్రత అంతరించుట తోడనే గోకులములోని ప్రజలు ఒక పెద్ద అసుర రూపము క్రింద పడుట జూచిరి. అతని చేతులలో బాలుడు గలడు. మరణించిన ఆ అసురుని వక్షమున కంటుకుని యున్న బాలుని తెచ్చి వారు యశోదకు అప్పగించిరి. ఏమి జరిగెనో యెవరికిని తెలియకుండెను. అసురుని చేతుల నుండి బాలుడు చావు యెట్లు తప్పించుకొనెనో యే ఒక్కరికిని అర్థము కాలేదు. తిరిగి బాలుడు దొరికెనను ఆనందములో బాలుడే అసురుని చంపినాడన్న విషయము వారి దృష్టికి రాకుండెను. ప్రజలు వారిలో వారిట్లనుకొనిరి. ''ఒకరికి కీడు తలపెట్టువారు నశింతురు. వారి దుష్ట స్వభావముచేతనే వారు మరణించెదరు''. వారిలో మరొకడిట్లనెను. ''నారాయణుడు మనలను దయతో జూచుట మనందరి అదృష్టము. లేకున్న యీ బాలుడు తిరిగి జీవించునా?'' వేరొకరు యిట్లనెను. ''నందుడు యెన్నియో సత్కార్యములు చేసెను. ఎన్నియో దాన ధర్మములు చేసెను. అతడు మంచివాడగుట చేతనే భగవంతుడు అతనిపై దయకలిగి యుండెను''.

ఒకరోజు యశోద పుత్రునికి పాలిచ్చుచుండెను. కడుపునిండ పాలు త్రాగి ఆ బాలుడు ఆమెతో కొంతసేపు ఆడుచుండెను. అంతలో అతడు నిద్రపోవుచున్నట్లుండెను. యశోద చిరునవ్వుతో పుత్రుని చూచుచుండెను. అతడు ఆవలించినపుడు ఆ చిన్నారి నోరు గుండ్రని పుష్పము వలె నుండెను. విప్పిన నోరు చూచుచున్న యశోద అద్భుతము గాంచి ఆశ్చర్యపోయెను. ఆ బాలుని నోటియందు యశోద యీ లోకమునంతనూ జూచెను. ఆమెకు ఆకాశము, ముల్లోకములు, నక్షత్రరాసులు, సూర్య చంద్రులు, అగ్ని, వాయువు, అష్ట దిక్పాలకులు కానవచ్చెను. మరియు సముద్రములు, ద్వీపములును కానవచ్చెను. అంతేకాక పర్వతములు, అరణ్యములు, జంతువులు, వేయేల సమస్త సృష్టిని ఆమె జూచెను.

ఆమెకు వణుకు పుట్టెను. ఈ విచిత్రమును జూచి ఆమె అచ్చెరువందుచుండెను. ఆమె అట్లు ఆలోచించుచుండగనే భగవంతుని మాయ ఆమెను గప్పెను. ఆ విషయము నామె అంతటితో మరచిపోయెను.

# 156 నామకరణము

తన పుత్రులకు సాంప్రదాయానుగుణముగా షోడశ కర్మలు యధావిధిగా జరుగవలెనని వసుదేవుడు తలచి, తమ కుటుంబ పురోహితుడు గర్గుని పిలిపించెను. గోకులములో పెరుగుచున్న తన పుత్రుల గురించి తెలిపి, అక్కడకు అనుకొనకుండ వెళ్ళినట్లు వెళ్ళమని చెప్పి అక్కడ వారికి నామకరణాది కర్మలను, క్షత్రియ బాలురకు చేయు పద్ధతిలో జరిపింపమని కోరెను.

గర్గుడు గోకులము వచ్చెను. నందుడు ఆనందోత్సాహములతో అత్యంత వినయముగా గర్గుని ఆహ్వానించెను. నందుడు ప్రణామము చేసి అర్ఘ్యపాద్యాదులతో సత్కరించి, ఉచితాసనముపై గర్గుని గూర్చుండబెట్టి యిట్లనెను. ''బ్రాహ్మణోత్తమా! తమ రాక నాకెంత ఆనందము చేకూర్చెనో చెప్పతరమా? మీ వంటి మహాత్ములు ఆశ్రమము విడిచి మా వంటి సామాన్యుల గృహములకు వచ్చుట తప్పక మా శ్రేయస్సు కొరకే యని భావించెదను. నేను దైనందిన సంసార జీవితములో చిక్కుకొని సమయము చిక్కక పవిత్ర స్థలములు దర్శించకుంటిని. తీర్థయాత్రలు, పుణ్యక్షేత్రములు సందర్శించని అధముడను. అటువంటి నన్ను మీరు అనుగ్రహించి దర్శన భాగ్యము కలిగించినారు. ఇంద్రియములు గ్రహింపజాలని జ్యోతిషమను శాస్త్రములో మీరు ప్రజ్ఞావంతులని యెరుగుదును. ఈ శాస్త్రము మానవులకు జ్ఞానము బోధింపగలదని వినియున్నాను. నాకు లభించిన యీ సదవకాశమును వినియోగించుటలో మీ అనుగ్రహము కోరెదను. నాకు యిద్దరు పుత్రులు కలరు. మీరు అనుగ్రహించి ఆశీర్వదించి ఆ బాలురకు నామకరణాది కర్మలు జరిపించగోరుచున్నాను''.

గర్గుడిట్లనెను. ''నందా! నేను యాదవ కుటుంబమునకు పురోహితుడను. ఈ లోకములో నేను ప్రఖ్యాతి గడించుటచే ప్రజలు నా కార్యములను శ్రద్ధతో పాటింతురు. నీవు చెప్పిన కర్మలను నేను జరిపినచో కంసునికీ విషయము తెలియగలదు. అతడు యాదవ కుటుంబ పురోహితుడు యెందుకు యీ కార్యము చేసెనని ఊహించి, వెంటనే నీ కుమారుడు దేవకి కుమారుడనే నిశ్చయమునకు రాగలడు. దేవకికి అష్టమ శిశువుగా బాలిక జన్మించెనని కంసుడెరుగును. ఆ బాలిక అతని చేతుల నుండి ఆకాశములోకెగిరి, కంసుని చంపు బాలుడు వేరే మరొకచోట జన్మించి పెరుగుచున్నాడని చెప్పిన విషయము మీరు విని యుందురు. నీకు వసుదేవునికి మధ్యనున్న స్నేహము అతని నాలోచింపజేయును. వీనికన్నిటికి తోడు, యీ నామకరణము నేను జరిపించితినని కంసుడు వినినచో, అతడు నీకు, నీ కుమారులకు పెక్కు కష్టములు కలిగించును''.

నందుడిట్లనెను. ''నీవు భయపడుచున్న దానిని నివారించవచ్చు. ఈ గోకులములో నా స్వగృహములో మూడవ కంటికి తెలియకుండ రహస్యముగా నామకరణము జరిపింపుము. దగ్గర బంధువులకు కూడ తెలియనివ్వను. విందు వేడుకలు, ఆర్భాటము లేక క్లుప్తముగా జరుగునట్లు యేర్పాట్లు చేసెదను. కాని నీవు యీ బాలురకు నామకరణము చేయవలెనని నా అభిమతము''.

ఆ విధముగా తాను వచ్చిన పనిని నెరవేర్చుటకు గర్గు డంగీకరించెను. ఈ కార్యము కొరకే ప్రత్యేకముగా గర్గుడు గోకులమునకు ప్రయాణముచేసి వచ్చెను.

గర్గు డిట్లనెను. ''రోహిణి కుమారుడు తన అందముచే అందరినీ ఆకట్టుకొనును. పెరిగి పెద్దవాడైన తర్వాత తన అత్యుత్తమ గుణములచేత అందరినీ రమింపజేయును. అందుచే అతనికి 'రామ' యను నామము పెట్టెదను. మరియు అతడు శక్తిమంతుడగుటచేత 'బల' యను పేరు కూడ తగి యుండును. సంకర్షణుడను

పేరు కూడ సరిపోవును.

''నీ రెండవ పుత్రుడు నల్లని వర్ణములో నుండుటచే అతనికి 'కృష్ణు'డను నామము సరిపోవును. పూర్వ జన్మలో అతడు వసుదేవుని కుమారుడు. అందుచే 'వాసుదేవు'డను పేరు కూడ సరిపోవును. కాని యీ నామముతో పిలువవద్దు. దానిని రహస్యముగానే యుండనిమ్ము. అనేక గుణములు కల ఆ బాలుడు అనేక నామములతో ప్రసిద్ధుడగునని జ్ఞానులందురు. నాకు అవి తెలియును. కాని లోకులకు తెలియదు. నీకు, యీ గోకుల వాసులకు ఆనందము చేకూర్చు యీ బాలుడు మీకందరకును గొప్ప అదృష్టము తెచ్చిపెట్టును. అతని మూలముగా మీ కష్టములన్నియు తొలగును. ఇంతకు పూర్వము జన్మలలో ఒక జన్మ యందు, రాజ్యమునకు రాజు లేకుండెను. దాని మూలముగా దొంగలచే, నాస్తికులచే దేశములో అరాజకము ప్రబలెను. నీ యీ పుత్రుడు అప్పుడు రాజుగా జన్మించి, దేశములో అరాజకము అంతరించి ప్రజలు సుఖించునట్లు జేసెను. (అది పృథు అవతారమునకు సంబంధించినది. వేనుడు ప్రజలను హింసించెను. వేదములను వేదాంగములను రక్షించువారిని వేధించెను. అతని కాలములో నాస్తికత్వము ప్రబలెను. వేనుని మరణము తర్వాత కూడ దొంగతనము మొదలగు అధర్మములు ప్రజ్వరిల్లెను. నారాయణుడు పృథు చక్రవర్తిగా జన్మించి యీ భూమిని అధర్మము అరాజకము నుండి రక్షించెను).

''నీ పుత్రుని, యీ కృష్ణుని ప్రేమించువారు శత్రువులచేత యెట్టి బాధలకు లోనుగారు. నారాయణునిపై భక్తిగల అసురులు, అసుర జన్మ యెత్తినప్పటికిని, యే విధముగా రక్షితులైరో అదే విధముగా నీ పుత్రునిపై ప్రేమాభిమానములు గలవారు రక్షితులగుదురు. కాబట్టి నీ పుత్రుని యెడల మిక్కిలి శ్రద్ధ వహించుము. అతడు మున్ముందు యెన్నియో గొప్ప కార్యములు అందరి శ్రేయస్సుకై చేయనున్నాడు''

అందరినీ ఆశీర్వదించి, వారి వద్ద సెలవు తీసుకుని గర్గుడు గోకులము విడచి వెళ్ళెను. గోకులములో జరిగిన విషయములు, బాలుర యోగక్షేమము దేవకీ వసుదేవులకు గర్గుడు వివరించి చెప్పెను.

బలరామ కృష్ణులు శుక్లపక్షపు చంద్రుని వలె పెరుగుచుండిరి. వారిప్పుడు నేలపై ప్రాకుచుండిరి. వారు ప్రాకుచున్నపుడు వారి కాళ్ళకున్న వెండి మువ్వలు మధుర సంగీతము వలె శబ్దము చేయుచుండెను. మరికొద్ది రోజులకు, వారు తడబడచు నడచుచుండుట జూచిన వారి తల్లులకు అత్యంతానందము కలుగుచుండెను. మధ్య మధ్యలో పడిపోగా దెబ్బ తగిలినట్లుగా యేడ్చుచుండిరి.

ఆ బాలురు వీధులలో సంచరించుచు ఒంటి నిండ మట్టి పూసుకుని, యింట్లోనికి వచ్చి కళ్ళు పెద్దవి చేసుకుని, తమ తల్లులు చివాట్లు పెట్టుదురేమోనని భయపడుచున్నట్లు వాకిట నిలుచుందురు. మన్ను ధూళితో నున్న ఆ బాలురను, తమ పట్టు చీరలు మురికి యగునని తలంచక, ఆప్యాయతతో దగ్గరకు తీసుకుని రోహిణీ యశోదలు హత్తుకుని ఆనందించెడివారు. తమ తల్లులు కోపగించుటలేదని తెలుసుకున్న ఆ బాలురు నవ్వుచున్నపుడు, అపుడపుడే యేర్పడుచున్న తెల్లని పలువరున అందముగా, ఆకాశములో చంద్రవంక వలె, గోచరించుచుండెను. గోపికలు తమ నిత్యకృత్యములను మరచి, నందుని యింట యీ బాలురు చేయు చిలిపి చేష్టలకు ఆనందించుచు కాలము గడుపుచుండిరి.

బలరామ కృష్ణులు పెరిగి యిల్లూ వాకిలి అంతటా పరుగెత్తుచుండిరి. గోకులములోని యితర బాలురతో కలిసి వారు ఆటలాడుట మొదలుపెట్టిరి. ఇంటి పట్టున నుండక గంటల కొలది వారు బయట ఆట పాటలతో

కాలము గడుపుచుండగా, రోహిణీ యశోదలకు ఆందోళన కలుగుచుండెను. వారి బాల్యము ఆ విధముగా గడచుచుండెను.

## 157 కృష్ణుని చిలిపి చేష్టలు

కృష్ణునికి పెంకితనము చేయు వయస్సు వచ్చెను! గోపికలను ఆట పట్టించుట కృష్ణునికి సరదా. గోపికల యిండ్లలో కృష్ణుని అల్లరి చేష్టల గురించి తరుచుగా యశోదకు మొరలు వచ్చుచుండెను ప్రతి దినము యశోదకు అనేక గోపికలు మొరపెట్టుకొనుచుండిరి ఈ మొర లాలకించుట యశోదకు నిత్యకృత్యముగా మారెను.

ఒక గోపిక యశోదతో నిట్లనెను ''నీ కుమారుని ఆగడములు నేను మాటలతో వర్ణించ లేనంతగా పెచ్చు పెరిగిపోయెను. ఒకరోజు నేను పాలు పిదుకుటకు ఆవు దగ్గరకు వెళ్ళితిని. ఏమైనదో తెలుసా? నీ తనయుడు దూడను వదలిపెట్టినాడు. ఆ దూడ పాలన్నిటినీ త్రాగివేసెను. మాకు ఒక చుక్కకూడ మిగులలేదు. ప్రక్కనే నిలుచున్న కృష్ణుని కసరగా నన్నుచూసి నవ్వుచుండెను''. మరియొక గోపిక యిట్లనెను. ''దొంగతనము చేయుటలో నీ కుమారుడు చాల నేర్పరి. నా యింటిలోనికి వచ్చి పెరుగు, వెన్న నందలాది మార్గములలో దొంగిలించును. తాను కొంత తిని, మిగిలినది చెట్టుపైనున్న కోతులకు పెట్టును వెన్న, పెరుగు నుంచిన కుండలను పగులగొట్టును మీ వాని అల్లరి మితిమీరి యున్నది''.

వేరే మరొక గోపిక యశోదతో నిట్లు మొరపెట్టుకొనెను. ''మేము యింటి పనులు చేసుకొనుచున్నాము. అహో రాత్రములు వెన్న యుంచిన పాత్రకు కాపలా యుండలేము కదా! అందుచేత చీకటి గదిలో ఒక మూల వెన్న యుంచిన పాత్రను దాచినాము. చీకటి గది యని నీ కుమారునికి లెక్కలేదు. నీ పుత్రుడు ధరించిన మణులు దీపము వలె ప్రకాశించగా ఆ చీకటి గదిలో జొరబడి వెన్న పాత్రను కనుగొని వెన్న నంతనూ దొంగిలించెడివాడే! మేము సమయమునకు వచ్చుటచే సరిపోయినది''.

ఇంకొక గోపిక యిట్లనెను. ''కృష్ణునికి అందకుండ యెత్తు ప్రదేశమున దాచియుంచినచో అతడు మరొక కిటుకు ప్రయోగించును ఇంటి కప్పుకు వెన్న యుంచిన కుండ త్రాటితో వ్రేలాడ గట్టి యుండుట జూచి, దాని క్రింద ముక్కాలి పీట నైచి దానిపై మరొక బాలుని వంగుమని చెప్పి ఆ బాలునిపై తానెక్కి కుండకు కన్నము చేసి వెన్న, పెరుగు దొంగిలించును. నేను అటువచ్చి చూసినపుడు 'కృష్ణా! యీ రోజు నువ్వు నాకు దొరికిపోయినావు. నా యింట్లో దొంగతనము చేయుచున్నావు' అని నేను గట్టిగా మాట్లాడినపుడు కృష్ణుడు అతి నిబ్బరముగా నా ముఖములో ముఖము పెట్టి 'ఈ యింటి యజమానిని నేను నీవే దొంగవు' అనును''.

మరియొక గోపిక మొర యిట్లుండెను. ''నేను అప్పుడే యిల్లు కడిగి శుభ్రము చేసితిని. కృష్ణుడు వచ్చి వెన్న యిమ్మని యడిగెను. నేను యివ్వకపోవుటతో నాపై కృష్ణునికి కోపము వచ్చెను. నేను వేరు పనులలో నున్నపుడు, బయట నుండి చెత్తా చెదారము, మురికి నీరు తెచ్చి యిల్లంతయు వెదజల్లెను''.

గోపికలు తల్లితో మొరపెట్టుకొనుచున్నపుడు తల్లి ప్రక్కనే కృష్ణుడు నిలిచి యుండెను ఒక గోపిక,

కృష్ణుని ముఖములో అతని చూపులు చూసి, ''చూడండి! ఎంత నంగనాచివలె ముఖము పెట్టినాడో! పాపం అందరి పిల్లలలోకి యేమియు నెరుగని అమాయకుని వలె నిలిచి యున్నాడు. యశోదా! నీ ముద్దుల కొడుకు అల్లరి చేష్టలు మితిమీరి మేము భరించలేనంతగా ఉంటున్నవి. నీవు కృష్ణుని శిక్షించు''. యశోద కోపముతో కృష్ణునివైపు చూచెను. కాని కన్నీరు నిండిన ఆ కృష్ణుని కనులను, భయముతో వణకుచున్నట్లు గోచరించుచున్న అతని పెదవులను, కలుగబోవు బాధను భరించలేనట్లు దగ్గర జేర్చిన కనురెప్పలను జూచిన యశోద కృష్ణుని మందలింప లేకపోయెను. గోపికలు కూడ కోపము మరచి కృష్ణుని అందమైన ముఖమును అమాయకపు కన్నులను, చిన్న చిరునవ్వును, అల్లరి చేష్టలను తలచుకొనుచు వారి యిండ్లకు వెళ్ళువారు.

## 158 యశోద చూచిన దృశ్యము

ఒకరోజు యశోద యింటి ముంగిట పిల్లలందరును ఆడుకొనుచుండిరి. యశోద యింటి పనులతో తీరిక లేక యుండెను. ఇంతలో బలరాముడు యశోద వద్దకు వచ్చి ''అమ్మా! అమ్మా! కృష్ణుడు గుప్పెడు మన్ను తినుచున్నాడు'' అనెను. యశోద బలరామునివైపు నమ్మలేనట్లు చూచెను. కాని బలరాముని వెంట నున్న పిల్లలు నిజమేనన్నట్లు తలలూపుచు నిట్లనిరి. ''ఔనమ్మా! కృష్ణుడు మన్ను తినుట మేము కనులార చూచినాము''. యశోద వెంటనే కృష్ణుని వద్దకు వెళ్ళి ఎడమ చేతితో కృష్ణుని పట్టుకుని, కొట్టుటకా యనునట్లు కుడిచేతిని పైకెత్తి యిట్లనెను. ''నీ అల్లరికి అంతులేదా? నీవు మన్ను యెందుకు తిన్నావు? ఈ రోజు నీకు దెబ్బలు తప్పవు''.

కృష్ణుడు తల అడ్డముగా ఊపి యిట్లనెను. ''అసలు నేను మన్ను తిననేలేదు. నేను యెన్నడును మన్ను తినను. నాకు మన్ను అనగా పరమ అసహ్యము. అటువంటి అసహ్యమైన దానిని నేను అసలు తిననే తినను''. యశోద ''మరి యీ బాలురందరూ నీవు మన్ను తినుట చూచినారు. నీ అన్న బలరాముడు నువ్వు మన్ను తినుట చూచితినని చెప్పినాడు'' అని పలికెను.

''అమ్మా! వారందరును అబద్ధము లాడుచున్నారు. వారు నిజము చెబుతున్నారో లేదో పరీక్షించి చూడుము. నా నోరు చూడుము. మట్టి యెక్కడనైన కన్పించుచున్నదా?'' అని కృష్ణుడనెను.

''ఏదీ నీ నోరు చూడనీ'' అని యశోద పలుకగా, పరమ దైవమైన నారాయణుడు మానవశ్రేయస్సుకై నర రూపము దాల్చి అవతరించిన కృష్ణుడు, తల్లి చూచుటకు తన నోరు విప్పెను. ఆమె తన పుత్రుడు నోరు విప్పగా చూచి, తాను చూచిన దృశ్యమునకు దిగ్భ్రాంతి చెందెను!

ఆ బాలుని నోటి లోపల యశోద యీ లోకము నంతయూ గాంచెను. అందు చరాచరములన్నియు గలవు. ఆమె స్వర్గ లోకమును, అష్ట దిక్కులను, పర్వతములను, ద్వీపములను, సప్త సముద్రములను గాంచెను. సప్తద్వీపములను వాని నావరించి యున్న సముద్రముమ తిలకించెను. ఆమె వాయుదేవుని, దేవతలకు నివాసమైన స్వర్గలోకమును; చంద్రుని, నక్షత్రములను; పంచమహాభూతములైన పృథివ్యప్తేజో వాయు రాకాశములను జూచెను. ఇంద్రియముల కధిపతులను, చైతన్యముతో ప్రకాశించుచున్న ఇంద్రియములను జూచెను. మరియు ఆమె మనస్సును, మహత్తత్త్వమును, తన్మాత్రలను, సత్వ రజస్తమోగుణములను చూచెను. ప్రకృతియందు

త్రిగుణముల సమత్వమెట్లుండునో ఆమె కనులారా జూచెను.

పరమాత్మ జీవాత్మ కలిసియున్నపుడు త్రిగుణముల సమత్వము చెదరక యుండును. జీవాత్మ ఉపాధులతో చేరి పరమాత్మకు దూరమైనపుడు, త్రిగుణముల సమత్వము తప్పును. కాల ప్రభావముచేత యిట్లు జరుగును. కాలము సమీపించినపుడు జీవాత్మ స్వభావముచేత ఆత్మ భౌతిక ప్రపంచముతో అనుబంధ మేర్పరచుకొనును. విశ్వము ఆవిర్భవించుటకు త్రిగుణముల సమత్వము తప్పుటయే కారణము. యశోద దీనినంతను, అనగా త్రిగుణముల సమత్వము యెట్లు తప్పి విశ్వ సృష్టి జరుగుచున్నదో గాంచెను. చాల అద్భుత దృశ్యము! ఆమె గోకులమును, అందు తాను కుమారుని నోరు విప్పి చూచుచుండుటను తిలకించెను.

ఆమె తన చుట్టును పరికించి చూచి యెవ్వరు లేరని గ్రహించి తనలో తానిట్లనుకొనెను. ''ఇది స్వప్నమా!'' ఆమె పదే పదే తనకు తాను ''కాదు. ఇది స్వప్నము కాదు. నేను మేలుకుని యున్నాను. ఇది తప్పక నారాయణుని మాయ అయి ఉండవచ్చును. అట్లయినచో ప్రతి ఒక్కరును దీనిని చూచి యుండవచ్చును. ఇది అద్దములో కనుపించు ప్రతిబింబము వంటి ప్రతి బింబమా? కాని యీ దృశ్యమున నా పుత్రుడు కృష్ణుడు కూడ నాకెట్లు కన్పించుచున్నాడు? ప్రతిబింబములో ప్రతిబింబింపజేయు అద్దమును జూచుట సాధ్యము కాదే. మరియు యీ దృశ్యములో అద్దమును యెట్లు చూడగల్గుచున్నాను? మరి, యేదైన వింతశక్తినా కుమారునకున్నదా?'' అని ఆశ్చర్యముతో యశోద యోచించుచుండెను. ఆమె యిట్లు తలచెను. ''మనోవాక్కాయ కర్మలకు అతీతమైన స్థితి మహాగొప్పది. అదియే యీ లోకమున కాధారము, మూలము. ఆ స్థితియే యీ లోకము, అన్ని లోకములు చైతన్య వంతమై ప్రకాశించుటకు కారణమగుచున్నది. అదియే జీవుల చైతన్యమునకు, కార్య కారణములకు మూలము. ఈ లోక మావిర్భవించుటకు అదియే మూల కారణము. దానికి నా వందనములు. భగవంతుడు తన మాయచేత నాకొక వ్యక్తిత్వము కల్పించి నేను యశోదను నాకొక భర్త నందుడు, యితడు నా కుమారుడు, గోకులమునకు నేను రాణిని, గోకులములోని ప్రజలకు అప్పురాలను అని భావించునట్లు చేయుచున్నాడు. నన్ను కమ్మిన మాయ నాకిప్పుడు స్పష్టముగా గోచరించుచున్నది. ఈ మాయకు కారకుడైన భగవంతునికి నా నమస్కారము''.

ఈ స్థితిలో నున్న తల్లిని జూచి కృష్ణుడు తన విష్ణుమాయచేత ఆమెలో పుత్ర వాత్సల్యము తిరిగి రేకెత్తించగా యశోద వెంటనే యింతవరకు పొందిన అనుభవము, ఆడిన మాటలు, బ్రహ్మము గురించి తెలుసుకున్న సత్యము, అన్నిటినీ మరచిపోయెను. మైకము నుండి తెలివి వచ్చినట్లు లేచి తిరిగి యీ మాయా ప్రపంచములో పడెను. ఏమి జరిగెనో కూడ ఆమెకు గుర్తు లేకుండెను. ఇదంతయూ ఒక స్వప్నము వలె భావించి మరచిపోయెను.

శుద్ధ సత్యమైన పరమాత్మను ఋగ్యజుస్సామ వేద రీతులలో యజ్ఞ యాగాదులు చేయువారు 'ఇంద్రు'డని, ఉపనిషత్తులు (వేదాంత శాస్త్రము) 'బ్రహ్మ' మని, సాంఖ్యులు 'పురుషు'డని, యోగులు 'పరమాత్మ' యని పిలిచెదరు. ఆ పరమాత్మయే యశోద కుమారుడు, అల్లరి కృష్ణుడు. అతని చిలిపి అల్లరి చేష్టలకు ఆమె మాటిమాటికి దండించవలసి వచ్చుచుండెను! ఎన్నియో దొంగతనము లంటగట్టుటచే కృష్ణుడు దొంగ కృష్ణుడయ్యెను!

శ్రద్ధగా వినుచున్న పరీక్షిత్తు మహారాజు యిట్లనెను. ''యశోదానందులు యెంత పుణ్యాత్ములో గదా! పరమాత్మకు తల్లిదండ్రులు కాగల మహాభాగ్యము వారికి లభించెను. దేవకీ వసుదేవులకు ఆ అదృష్టము

కలుగలేదు. బ్రహ్మాది దేవతలు భగవంతుని స్తుతింతురు, కాని యశోదా నందుల అదృష్టము వారికి లేదు. భగవంతుని యశోదా నందులు పూర్తిగా దక్కించుకొనిరి. సాక్షాత్తు నారాయణునకు పాలిచ్చు భాగ్యమును పొందిన యశోద యెంతటి అదృష్టవంతురాలు! వారి కీగౌరవము నారాయణుడెట్లు కలుగజేసెనో విన కుతూహలముగా నున్నది. దయచేసి వివరింపుడు''

శుకు డిట్లు చెప్పెను. ''ద్రోణుడను వసువు, అతని భార్య ధర, నారాయణు డీభూమిపై అవతరించు కాలమున జన్మించవలసినదని బ్రహ్మదేవు డాదేశించెను. వారు బ్రహ్మను ఒక వరమడిగిరి. 'మేము భూలోకమున జన్మించి భూలోక వాసుల గుణ గణములు కలిగి యుందుము. కాని మాకు నారాయణునిపై అనన్య భక్తి కలిగియుండునట్లు వరము ప్రసాదించుము. దుఃఖ భూయిష్ఠమైన భూలోక జీవితము నతిక్రమించుటకు అదొక్కటే మార్గము''.

'' 'అట్లే జరుగును' అని బ్రహ్మ పలికెను. ఆ విధముగా ద్రోణుడు నందుడుగాను, ధర యశోదగాను జన్మించిరి''.

## 159 యశోద కృష్ణుని కట్టివేయుట

గోకులములో ఒక రోజు యశోద పరిచారికలు వేరు పనులలో తీరిక లేక యుండిరి అందుచేత ఆమె స్వయముగా పెరుగు చిలికి వెన్న చేయుటకు నిశ్చయించుకొనెను ఆమె దధి పాత్రను తెచ్చి చిలుకుట ప్రారంభించెను. ఆమె చిలుకు చుండగా కృష్ణుడచటకు వచ్చెను. అత డాకలితో నుండుటచే యేదైన తినుట కిమ్మనెను. అతడు అందముగా నున్న తల్లిని చూచెను. ఎల్లపుడును యితరులు చేయు పనిని తానే స్వయముగా యీరోజు చేయుటచేత, అలవాటు లేనందున, యశోద అలసియున్నట్లు గోచరించుచుండెను. వర్షబిందువులు పడిన పద్మమువలె ఆమె ముఖము కన్పించుచుండెను చిలుకు చున్నపుడు చేతి గాజులు గలగల శబ్దము చేయుచుండెను. వదులుగా నున్న ఆమె జుట్టులో ధరించిన మాలతీ పుష్పమాల జారి పడిపోవుచున్నట్లుండెను. ఆమె చెవులకున్న తాటంకములు అటు నిటు ఊగుచుండెను చేతుల భుజముల కదలికకు, ఆమె కట్టిన పట్టుచీర రెపరెపలాడుచుండెను. కృష్ణుడు ఆమెకు దగ్గరగా వెళ్ళి కవ్వమును పట్టుకొని ''ఇకచాలు. నాకు ఆకలిగా నున్నది ఏదైన తినుటకు పెట్టు'' అమనట్లు ముఖము పెట్టెను

యశోద నవ్వి కృష్ణుని తన చేతులలోనికి తీసుకుని కూర్చుని ఒళ్ళో పెట్టుకుని పాలిచ్చుచుండెను

పాలిచ్చుచుండగా, పొయ్యిపై కాగుచున్న పాలు పొంగిన వాసన తగిలెను. అంత యశోద కృష్ణుని నేలపై కూర్చుండబెట్టి వంట యింటిలోనికి వెళ్ళెను. ఆకలి పూర్తిగా తీరకనే తల్లి తనను వదలి వెళ్ళినందుకు కృష్ణునకు కోపము వచ్చెను పెదవులను పళ్ళ మధ్య బిగించి, కవ్వమును చేతిలోనికి తీసుకుని పెరుగు కుండను గట్టిగా కొట్టెను. కుండ పగిలెను అందుండి పెద్ద వెన్న ముద్దను తీసుకొనెను. దొంగ కన్నీరు తెచ్చుకుని, వాకిటికి వెళ్ళి ఒక మూల దాగి వెన్న తినుచుండెను.

యశోద పొంగిన పాలను దించి, తిరిగి మజ్జిగ చిలుకు పనిని కొనసాగించుటకు వచ్చెను. పగిలిపోయిన

కుండను జూచెను. మజ్జిగ, వెన్న నేలపాలై అన్ని ప్రక్కలకు ప్రాకెను. కృష్ణుడు మాత్రము యెక్కడను కన్పించకుండెను. కృష్ణుని తుంటరి తనమునకు తనలోతాను నవ్వుకుని కృష్ణుని వెదకపోగెను. ఒక రోటిపై కూర్చుని వెన్న తినుచు, చుట్టును చేరిన కోతులకు కూడ కొంత వెన్న పెట్టుచుండెను. వెనకవైపు నుండి యశోద కృష్ణుని సమీపించెను. ఆమె చేతిలో ఒక చిన్న బెత్తముండెను. ఆమె బెత్తముతో తనకు దగ్గరగా వచ్చుచున్నదని గ్రహించి, పొందబోవు శిక్షకు భయపడుచున్నట్లు, పారిపోవ ప్రయత్నించెను. అతనిని పట్టుకొనుటకు యశోద అతని వెంట పరుగెత్తు చుండెను. యోగులకు అందని ఆ పరమాత్ముడు, మనసుకు గ్రాహ్యముకాని ఆ పరమ పురుషుడు చిన్ని కృష్ణుడుగా యశోదకు చిక్కకుండ పరుగెత్తుచుండెను. యశోద కృష్ణుని పట్టుకుని, కొట్టి, యికముందు అల్లరి చేయకుండ త్రాడుతో కట్టివేయవలెనని ప్రయత్నించెను.

ఆమెను పరుగెత్తించి ఆడిన ఆట మూలముగా, ఆమె అలసిపోయినదని కృష్ణుడు గ్రహించెను. ఆమె ధరించిన దుస్తులు చిందర వందర అయ్యెను. ముఖము చెమటతో తడిసెను. విశాల వక్షోజములు, వెడల్పైన పిరుదులతో ఆమె పరుగెత్తలేకపోయెను ఆమె తలరేగి జుట్టు వదులు వదులుగా నయ్యెను మాలతీ పుష్పములు నేలమీద చిందర వందరగా పడెను ఆమె స్థితికి జాలిపడి కృష్ణుడు చివరకు తనకు తానే ఆమెకు పట్టుబడిపోయినట్లు నటించెను

ఎడమ చేతితో గట్టిగా కృష్ణుని పట్టుకుని చివాట్లు పెట్టుచుండెను. కృష్ణుడు యేడ్చుచుండెను. కన్నులు కన్నీటితో నిండెను. తన చిట్టి చేతులతో కనులు నులుముకొనగా, కనులకు పెట్టిన కాటిక కన్నీటి తడికి ముఖమంతయు చెదరెను అప్పుడు అతని వదనము మరింత మనోహరముగ గోచరించుచుండెను. తల్లి చూపులను తప్పించుకుని అటు నిటు చూచుచుండెను. తన చేతితో గట్టిగా పట్టుకుని యశోద యిట్లనెను. ''నీ అల్లరి నేను భరించలేకున్నాను నిన్ను అదిమిపెట్టి యుంచుట అసాధ్యముగా నున్నది మాటలతో చెప్పగా నీవు వినుట లేదు నిన్ను తీవ్రముగా దండించవలసి యున్నది. నీ కోతి చేష్టలకు అంతులేకున్నది. వెన్న అంతయు దొంగిలించి, యేమియు తప్పు చేయనట్లుగా రోటిపై కూర్చుని వెన్న తినుచున్నావు. కొంచెము ఆగు, చూడు నిన్ను యీ కర్రతో కొట్టెదను''.

కృష్ణుడు మిక్కిలి భయపడుచున్నట్లు దీన వదనముతో తల్లిని చూచుచు ఆమెను గట్టిగా పట్టుకునెను. యశోదకు కుమారునిపై అమిత ప్రేమ చేతులలోనికి తీసుకుని గుండెలకు గాఢముగా హత్తుకొనవలెనని తలచెను కాని మరల కఠినముగా వ్యవహరించినట్లు గోచరించవలెనని యిట్లనెను. ''సరే! నిన్ను నేను కొట్టను. నువ్వు యింతవరకు రాజువలె సింహాసనముపై కూర్చున్న ఆ రోటికి నిన్ను త్రాడుతో కట్టెదను ఇక నువ్వు యెట్లు అల్లరి చేసెదవో చూసెదను'' యశోద ఒక త్రాడును తెచ్చి కృష్ణుని రోటికి కట్టుటకు ప్రయత్నించెను. నిత్య సత్యమైన బ్రహ్మమును కట్ట తరమా! లోపల బయట అంతటను నిండియున్న బ్రహ్మమును బంధింప శక్యమా? ఊర్ధ్వ అధో లోకములందు బ్రహ్మము నిండియున్నది. ఈ విశ్వమే బ్రహ్మము. సజీవమైనవి, జడమైనవి అన్నియు ఆ బ్రహ్మమే! మానవ రక్షణకై మానవ రూపము ధరించినాడు. అట్టి వానిని యశోద ఒక చిన్న త్రాడుతో బంధింప జూచెను!!! కృష్ణుని రాతికి దగ్గరగా బంధింపనెంచెను కాని త్రాడు కురుచయయ్యెను మరొక త్రాడు తెచ్చి దానికి ముడివేసి పెద్దది చేసి కృష్ణుని కట్టుటకు మరల ప్రయత్నించెను. తిరిగి ఆ త్రాడు చాలదయ్యెను ఇంకొక త్రాడు తెచ్చి యింతకు ముందున్న త్రాడుకు ముడివేసి రాయికి కృష్ణుని గట్టుటకు ప్రయత్నించగా అదియు చాలకుండెను కొన్ని అంగుళములు కురుచయయ్యెను. ఆమె యేమి జరుగుచున్నదో, యేల ఇట్లు జరుగుచున్నదో యోచించకుండెను. ఆమె అట్లు వరుసగా యింట

మన్న త్రాడు నంతనూ తెచ్చి ముడివేసినప్పటికిని చాలకుండెను. ఇంతలో ఆమె చుట్టును గోకులములోని జనులు చేరిరి. గోపికలు ఆమె అసహాయ స్థితిని జూచి ఆనందించుచుండిరి. తల్లి ముఖము చూచి ఆమె మిక్కిలి అలసిపోయినదని గ్రహించి కృష్ణుడు విచారించి రాయికి కట్టుబడుటకు అనువు కల్పించెను. ఈ లోకమంతయు అతని అధీనములో నున్నది. అట్టి పరమాత్ముని యశోద ఒక త్రాడుతో రాతికి గట్టగలిగినది పరమాత్మ భక్తిఅనే సూత్రముతో కట్టుబడగలుగునని తెలియుటలేదా? బ్రహ్మ, మహాదేవుడు, లక్ష్మి చేయలేని దానిని యశోద సాధించెను. ఆమె కన్న అదృష్టవంతులెవరు? అమాయక గోపిక యశోద తన చేతులతో కృష్ణుని రోటికి కట్టి బంధించెను.

పెద్ద నిట్టూర్పు విడిచి యశోద గృహకృత్యములు కొనసాగించుటకు యింట్లోనికి వెళ్ళి యిట్లనుకొనెను. ''నిన్ను త్రాడుతో బంధించితిని. ఇక నాకు నిశ్చింతగా నుండును''.

## 160 రెండు వృక్షములు

గూటముపై కూర్చున్న కృష్ణునకు కొంతసేపయిన తర్వాత విసుగు పుట్టెను. కొంతసేపు అచ్చట నున్న కోతులతో ఆడెను. ఆ తర్వాత అది కూడ విసుగు కలిగించెను. అటుపిమ్మట నేలపై ప్రాకుచుండెను. ప్రాకినపుడు తన్ను కట్టిన గూటము కూడ వెనుక వచ్చుచుండెను. అట్లు నాలుగువైపుల తిరిగి తిరిగి యింటి ముందు వాకిలి చేరుకొనెను. కొంతమంది బాలురు దూరముగా ఆడుకొనుచుండిరి. చుట్టుప్రక్కల మరింకెవ్వరును లేరు. అక్కడ రెండు వృక్షములు కవలవలె పెరుగుచుండుట కృష్ణుడు చూచెను. అవి అర్జున వృక్షములు.

కొంతసేపయిన తర్వాత కృష్ణుడు ఆ రెండు వృక్షముల మధ్యగా వెళ్ళెను. తన్ను కట్టివేసిన స్థలము దాటగా, త్రాడుతో గూటమునకు ముడివేయుట చేత గూటము కదలకుండెను. కాని కృష్ణుడు తనతో గూటము నీడ్చుకుని వెనుకకు చూడక ప్రాకుచు వెళ్ళు చుండెను.

ఇంతలో పెద్ద శబ్దమయ్యెను. కృష్ణుడు యీడ్చుకు వెళ్ళిన గూటము చేత ఆ రెండు వృక్షములు పెద్ద శబ్దము చేయుచు నేలపై పడెను. పడిపోయిన ఆ రెండు వృక్షముల నుండి వెలుగు లావిర్భవించెను. ఆ రెండును కృష్ణుని పాదములపైబడి యిట్లనెను. ''మేము గొప్ప అదృష్టవంతులము. నీ పవిత్ర పాదములు మమ్ములను తాకుటచేత నారదుడు మాకిచ్చిన శాపము అంతరించినది. తిరిగి ఉత్తర దిశనున్న మా స్వగృహమునకు వెళ్ళుటకు పునీతులమైతిమి. మా తండ్రి కుబేరుని వద్దకు వెళ్ళెదము''. ఆ తర్వాత వారు అదృశ్యులైరి.

పరీక్షిత్తునకు కుతూహలము కలిగెను. అతడు శుకునితో యిట్లనెను. ''దేవా! ఈ కుబేర పుత్రుల వృత్తాంతమేమిటో తెలియజెప్పుడు. నారదుడు వారి నెందుకు శపించెను?''

శుకుడిట్లనెను. ''ఆ కథ చెప్పెదను. ఉత్తర దిశకు రక్షకుడు, ధనాధిపతి అయిన కుబేరునకు నలకూబర, మణిగ్రీవులను యిరువురు పుత్రులు కలరు. వారు యువకులు, సౌందర్యవంతులు, పైగా ధనవంతులు. ఈ కారణములచే వారికి సహజముగా అహంభావము యెక్కువగా నుండెనని వేరుగ చెప్పనవసరము లేదు. ఒకసారి కైలాసపర్వతము దిగువ ప్రవహించుచున్న పవిత్ర గంగా తీరమున యీ యువకులిద్దరును వారి భార్యలతో

క్రీడించుచుండిరి. వారు వారుణియను మద్యమును అధికముగా సేవించుటచేత బాహ్య ప్రపంచ జ్ఞానము పూర్తిగా కోల్పోయిరి. మదించిన యేనుగులవలె వారు ఆ నదిలో జలక్రీడలాడుచుండిరి.

''నారద మహర్షి ఆ మార్గమున వెళ్ళుట తటస్థించెను. నారదుడు వారిని చూచెను. కాని వారు, నారదుని చూచినప్పటికిని, మద్యపాన ప్రభావము చేత నారదుని లక్ష్యపెట్టకుండిరి. ఋషిని గౌరవించవలెనను విషయము వారు పూర్తిగా విస్మరించిరి. అంతేకాక, ఒక మహాఋషి యెదుట తాము అసభ్యముగా ప్రవర్తించుచున్నామను జ్ఞానము కూడ లేక యుండిరి. వారి భార్యలు వడివడిగా గట్టుకు చేరుకుని అచ్చట వదలిన దుస్తులను ధరించిరి. తరువాత వారు నారదునికి నమస్కరించిరి. కాని ఆ అన్నదమ్ములిద్దరును నారదుని ఉపేక్షించిరి. నారదుడు వారి అహంభావమను రోగమును నివారింపదలచెను. అంతేకాక కృష్ణుడు రక్షించు నంతటి అదృష్టము వారికి కలుగునట్లు చేసెను. నారదుడు యిట్లు పలికెను. ''మానవులు అనేక విధములైన మదముతో చరించెదరు. ఉత్తమజన్మ పొందిన రాకుమారులు, విద్వాంసులు కొందరు అహంభావము కలిగి యుందురు. అహంభావము నకు రజోగుణము ప్రధాన కారణము. కాని మరియొక విధమైన మదము అన్నిటికన్న అధమమైనది. అది ధనమదము. ధన సంపద విరివిగా నున్న మానవులు వనితా లోలురై జూదము మద్యపానము మొదలగు దురభ్యాసములకు లోనై యుక్తాయుక్త విచక్షణ గోల్పోయి అసభ్యముగా చరింతురు. అట్టి మానవులు ఆత్మ నిగ్రహము పోగొట్టుకుని దయారహితముగా సంచరించెదరు. వారు యీ శరీరము శాశ్వతమను భ్రమలో నుండెదరు. శారీరక వాంఛలు తీర్చుకొనుటకు యెదుటివారిని చంపుటకైనను సంకోచింపరు. భూమిని పరిపాలించు మహారాజు, దాని ప్రక్క ముష్టి అడుగుకొనెడి పేద, యిద్దరును సమానమే. మృత్యువు యిద్దరినీ సమానముగా చూచును. ఇద్దరును పిడికెడు భస్మముగా మారుదురు. కాని అహంభావి యీ విషయము గ్రహించలేడు. మున్ముందు తనకు జరుగనున్న దుస్థితి తలంపక, చంపుటకు సిద్ధమగును. ఈ శరీరము అన్నము ప్రసాదించువానికి చెందును. రూపుదిద్దిన తల్లిదండ్రులకు చెందును. చివరకు పురుగులు, కుక్కలు, నక్కలు యీ శరీరమును తినివేయును. మూఢులు మాత్రమే యీ శరీరము శాశ్వతమని విశ్వసింతురు. వారికి దేహమునకు దేహములో నుండు దేహికి భేదము తెలియదు. అహంకార పూరితులైన వారి మనసు కలుషితముగా నుండును. బీదరికమే వారి అహంకారమను రోగమును కుదుర్చును. పేదవారు మాత్రమే అన్ని జీవులు సమానమని గ్రహించెదరు. కటికనేలపై పరుండు పేదలు, అన్నములేక నీరసించిన ముఖముతో నున్న బీదవారు యితర జీవులకు యెట్టి హానియు కలుగకూడదని అభిలషింతురు. అదే విధముగ కష్టములననేమో తెలియని మానవులు కరుణ యనగా నేమో తెలియలేరు.

''అహంకారములేని మానవుడు, విద్యామదము ధనమదము కులమదము అను మూడు మదములు లేని మానవుడు, చాల అరుదు. పేదవారు మాత్రమే యీ మూడు మదములు లేక యుందురు. దుర్భర జీవితమే వారి తపస్సు. ఆ తపస్సు వారిని శాశ్వతమైన ఉత్తమ లోకములకు అనగా మనము జీవించు లోకములకు భిన్నమైనవి, తీసుకు వెళ్ళును. పేదవారికి నిత్యమును తిండి కొరత యుండును. శరీరము శుష్కించగా, యెప్పుడును ఆకలి తీర్చుకొనుటకై ఆహారము కొరకు పరితపించుచుందురు. అట్టివారికి ఇంద్రియములు అర్థములేనివి. ఆకలిగా నున్నవారి ఇంద్రియములు అణగి యుండును. వారికి తోటి మానవులనుగాని, యితర జీవులను గాని గాయపరచు ఆలోచనలే రావు. అన్ని జీవులను సమభావముతో చూచు సాధువులు సహజముగా పేదవారికి దగ్గరగా నుందురు. సాధుసాంగత్యము చేత పేదవారు భౌతిక వాంఛలు లేక యుందురు. అన్ని పరిస్థితులందు సమ భావముతో నుండు సాధువులకు, నారాయణ చింత తప్ప యితర చింతలు లేని సాధువులకు,

గర్వముతో మదించినవారితో అవసరము కలుగదు

''మీరిరువురును వారుణియను మద్యము సేవించినారు ధనమదముతో మీరు విచక్షణా జ్ఞానము కోల్పోయినారు. మీకు ఇంద్రియ నిగ్రహము లేదు. నావంటి సాధు పురుషుల యెడల ప్రవర్తించవలసిన తీరు తెన్నులు కనీస మర్యాదలు కూడ మీకు తెలియవు. మీరు కుబేరుని పుత్రులు మీరు తామసముతో అవిధేయులై ప్రవర్తించుటచేత భూమిపై కవల వృక్షములై జన్మించెదరు. మీరు పూర్వ జన్మ స్మృతి కలిగయుందురు. శాపవిమోచనమునకై మీరు తహతహలాడుచు వేచి యుందురు.

''మీరు జన్మించు కాలమందే నారాయణుడు జన్మించును. అతడు మీ భూలోక బద్ధ జీవితము నుండి విముక్తి కలిగించును. అతడు మీ అహంభావమును కూడ నివారించును'' నారదుడు వారిని శపించి తన దారిన తాను వెళ్ళిపోయెను కుబేరుని పుత్రులిద్దరును గోకులములో కవల వృక్షములుగా జన్మించి పెరుగుచుండిరి ఆ యిరువురు సోదరుల శాపవిమోచన సమయము ఆసన్నమైనదని కృష్ణుడు నిశ్చయించి, వాని మధ్యగా వెళ్ళి అవి నేలపై పడునట్లు చేసెను

ఆ వృక్షములు రెండు నేలపై ఒరిగినపుడు పెద్ద శబ్దమయ్యెను ఆ శబ్దము విని గోకులములోని ప్రజలు, యశోద యేమి జరిగినోయని చూచుటకు వచ్చిరి. తన కుమారుడు ఆ వృక్షముల క్రిందపడి నలిగిపోనందుకు యశోద భగవంతునికి నమస్కరించి, గూటమునకు కట్టినందుకు తనలోతాను మిక్కిలి విచారించెను. ఆమె తొందర తొందరగా గూటమునకు కట్టిన ముడులు విప్పివేసెను కర్మబంధములనే ముడులు విప్పి మోక్షమార్గమున తీసుకువెళ్ళు సమర్థుడు తన కుమారుడని ఆమె తెలిసికొనలేక పోయెను అక్కడ చేరిన వారందరును ఆ వృక్షములెట్లు కూలెనా, బాలుడు (కృష్ణుడు) యెట్లు మృత్యువు నుండి తప్పించుకొనెనా యని ఆశ్చర్యపోవుచుండగా, అక్కడ ఆడుకొనుచున్న కొందరు పిల్లలు యిట్లనిరి. ''కృష్ణుడు ప్రాకుచుండగా గూటము కూడ అతనితో వెనుక కదిలి వెళ్ళుచుండెను ఆ రెండు వృక్షముల మధ్యగా అతడు వెళ్ళినంతనే అవి నేల గూలెను వెలుగువలె గోచరించు ఇద్దరు పురుషులు కృష్ణునితో మాట్లాడగా మేము చూచినాము. కృష్ణుడు కూడ వారితో మాట్లాడెను ఆ తరువాత వారు గాలిలో లేచి ఆకాశమున పక్షులవలె యెగిరి వెళ్ళిపోయిరి'' ఆ పిల్లల మాటలు యెవ్వరును నమ్మలేదు ప్రజలు వారిలో వారిట్లనుకొనిరి ''ఇది చాల అసంభవము. చిన్నవాడైన కృష్ణుడు రెండు వృక్షములను ఒకేసారి యెట్లు నేలకూల్చగలడు? వృక్షములు నేల గూలుట, కృష్ణుడు అటు ప్రక్కగా వచ్చుట యించుమించు ఒకేసారి జరుగుటచేత, ఆ పిల్లలు కృష్ణుడే వృక్షములను నేలగూల్చెనని భావించిరి. ఇక వెలుగుచున్న యిద్దరు వ్యక్తులను చూచుట — యిది కేవలము పిల్లలకు సహజముగా నుండు ఊహాశక్తి మాత్రమే ఈ విచిత్ర దృశ్యము తాము చెప్పెడి కథ నమ్ముటకు తోడ్పడునని వారు తలచి యుండవచ్చు''. ఆ విధముగా యక్ష రాజ కుమారులైన నలకూబర మణిగ్రీవుల శాపవిమోచనము పరిపూర్తి యయ్యెను

## 161 గోకులములో కృష్ణుడు

గోపిక లందరకును కృష్ణుడన్న చెప్పలేని అభిమానము కృష్ణుడు రోజంతయు గోపికల యిండ్ల యందే గడుపుచుండెడివాడు. వారు అడిగినపుడు నాట్యము చేసెడివాడు. వారు చప్పట్లు చరచగా గిరగిర తిరుచుచుండె

డివాడు అట్లు తిరుగునపుడు జుట్టు యెగురుట, మెడలో హారములు ఊగి గుండెలపై పడుట జూచి ఆనందముతో వారు ఆ బాలుని హత్తుకుని ముద్దాడేవారు. అతడు నవ్వుచు పాడుచు వారి కానందము చేకూర్చెడివాడు. అంతలో ఒక గోపిక యిట్లనెను. ''కృష్ణా! వెళ్ళి ఆ మజ్జిగకుండ, కవ్వము తీసుకురా'' కృష్ణుడు అత్యుత్సాహముతో వారు చెప్పినట్లు వెళ్ళి ఆ వస్తువులను చేతులతో గట్టిగా పట్టుకుని అవి భారముగా నున్నట్లు శ్రమకోర్చి తెచ్చుచున్నట్లు చూపరులకు గోచరించెడివాడు వాటిని క్రిందపెట్టి అలసట తీరినట్లు కంది యెర్రగానున్న చేతులు తేలికగా జాడించెడివాడు.

బలరామకృష్ణు లిద్దరును గంటల కొద్ది మట్టిలో బయట ఆడుచు, తమ తల్లులు భోజనమునకు రమ్మని పిలుచుచున్నప్పటికిని వినకుండెడివారు ఒకరోజు రోహిణి కృష్ణుని, బలరాముని యిట్లు కేకవేసి పిలిచెను ''చూడండి! మీవంటి నిండా యెంత మన్ను ఉన్నదో! చాల సేపటి నుండి మట్టిలో ఆడుచున్నారు ఇక లోపలికి రండి రామా! ఈరోజు నీ జన్మ నక్షత్రము మీరు పవిత్ర స్నానము చేయండి మీ తండ్రి యీనాటికి తగిన వైదిక విధులను జరుపదలచినారు మిగిలిన బాలురను చూడుడు. ఎంత చక్కగా అలంకరించుకుని యున్నారో! మీరిద్దరు మాత్రమే యింకను మురికిగా నున్నారు'' వారిద్దరూ రోహిణి మాటలు లక్ష్యపెట్టకుం డిరి. ఆమె యశోదతో నిట్లనెను ''చెల్లెమ్మా! నీవు మాత్రమే వారిని లోపలికి రప్పించి స్నానమాచరించునట్లు చేయగలవు నేను ప్రయత్నించినాను కాని వారు నా మాట వినుటలేదు'' యశోద బయటకు వచ్చి యిట్లనెను ''కృష్ణా! ఓ కృష్ణా! పద్మపత్రనేత్రా, ప్రియపుత్రా! ఇక ఆట చాలించండి. చాలసేపటి నుండి ఆడుచుండుటవల్ల మీరిద్దరు బాగుగా అలసిపోయినారు మీకు తెలియదుగాని మీరు చాల ఆకలితో నున్నారు. లోపలికి రండి రామా, ముద్దులరామా! నీవును, తమ్ముడును లోపలికి వచ్చి స్నానము చేసి భోజనము చేయండి మీ తండ్రి మీ యిద్దరి కొరకు యెదురు చూచుచున్నారు ఆలస్యము చేయక రండి'' ఆమె బలరామకృష్ణులతో ఆడుచున్న మిగిలిన బాలుర నుద్దేశించి దృఢస్వరముతో నిట్లనెను ''చూడండి అబ్బాయిలూ! ఇక మీ యిళ్ళకు మీరు వెళ్ళండి అప్పుడే వీ రిద్దరును నామాట విందురు'' బలరామకృష్ణులు అందరి పిల్లలవలె అతి పెంకిగా వ్యవహరించుచుండిరి ఎవరికిని వారి దివ్యత్వము తెలియకుండునటుల యెంతో జాగ్రత్త తీసుకునెడివారు, గోకుల ప్రజలు అమాయకులు పాపము వారు బలరామకృష్ణులు యిరువురును అనంత, నారాయణ అవతార మూర్తులని తెలియని అమాయకులు వారు సహజముగ అందరి పిల్లలు వ్యవహరించినట్లే వ్యవహరించుటవల్ల సత్యము ఆ గోకులవాసులు యెన్నటికిని గ్రహించలేకుండిరి

యశోద, తన పుత్రుడెవరో యెరిగి యున్నచో, ఆమె యీ భారము వహించలేక యుండెడిది అందుచేత తన దివ్య స్వరూపమును ఒక క్షణకాలము ఆమెకు ప్రసన్నము చేసినప్పటికిని తిరిగి ఆమె మాయలో పడి సర్వము మరచునట్లు చేసెను

వారికి కృష్ణుడు ఆనందము చేకూర్చు బాలుడు తన చిలిపిచేష్టలతో అందరి అభిమానము, ప్రేమ చూరగొనెను

కృష్ణుడు ఆందరిని ఆకర్షించెడివాడు కారణము తెలియకయే అందరును కృష్ణుని అమితముగా ప్రేమించు చుండిరి. గోకులములో గోపికలు, గోపాలురు కృష్ణుని ప్రేమించునట్లు, నారాయణు నింకెవ్వరును ప్రేమించ లేదు అతడు నిర్వహించుచున్న పాత్ర అతనికి ఆనందము కల్గించుచుండెను అతడు హాయిగా యెవ్వరును తన రహస్యము నెరుగకుండునటుల వర్తించుచుండెను బలరాముడు అనంతుని అవతారమగుటచేత అతనికి

మాత్రము కృష్ణుని రహస్యము తెలియును తన దివ్యత్వము ప్రకటించక దాచి యుంచుటయే అతని ప్రధాన కర్తవ్యము. దానినతడు మిక్కిలి నేర్పుతో నిర్వహించుచుండెను అసురులను చంపుటచేత యీ బాలుడు యెవరైయుండునా అని ప్రజలు యోచించుచుండిరి. ప్రతి ఒక్కరు కృష్ణుడు క్షేమముగా బ్రతికి బయట పడినందుకు నారాయణునికి ధన్యవాదములు తెలిపిరి. వారికి ఆ సంఘటనలలో కృష్ణుని పాత్ర యేమిటో తెలియకుండెను. కృష్ణుడు తన దివ్యత్వము ప్రకటము కాకుండునట్లు మిక్కిలి నేర్పుతో చరించుచుండెను. తన దివ్యత్వమును కప్పిన తెరను కొద్దిమంది మాత్రమే యెరుగుదురు.

## 162 ఆరణ్యాక ఫలములు

ఒకరోజు కృష్ణుడు యింటి ముందు వాకిలిలో ఆడుకొనుచుండగా, ''ఫలములు! జంబూఫలములు!'' అను కేక వినపడెను. కృష్ణుడు వీధి గుమ్మము వద్దకు పరుగెత్తి వెళ్ళెను. ఒక నిషాద స్త్రీ పండ్ల బుట్టను తల మీద పెట్టుకుని యుండుట కృష్ణుడు చూచెను. కృష్ణుడామెను పిలిచి యిట్లనెను ''నాకు కొన్ని పండ్లు యిమ్ము. ఈ పండ్లు నాకు చాల యిష్టము'' చిన్నారి కృష్ణుడు తడబడుచు పలికిన పలుకులకు ఆమె నవ్వి యిట్లనెను. ''తప్పకుండ నీకు యీ పళ్ళు యిచ్చెదను కాని వాటి వెల యివ్వవలెను''

ఆశ్చర్యముతో ''వెలయా'' అని అడిగెను ''వెల అనగానేమి?''

''నేను నీకు పళ్ళు యిచ్చినందుకు నీవు దానికి ప్రతిఫలముగా యేదైన నివ్వవలెను'' అని ఆమె పలికెను

''సరే'' అని కృష్ణుడనెను ''నేను నీకు గింజలు యిచ్చెదను మరి పండ్ల నిచ్చెదవా?''

''గింజలు తీసుకురమ్ము. నేను నీకు పండ్ల నిచ్చెదను'' కృష్ణుడు లోనికి పరుగెత్తెను ఆమె తల మీద నుండి బుట్టను దించి నేలపై పెట్టెను కృష్ణుడు సామాను గదిలోనికి వెళ్ళి, పద్మకుట్మలము వంటి తన దోసిటితో బియ్యపు గింజలు తీసుకుని వచ్చెను. అతడు పరుగెత్తి వచ్చుచున్నపుడు సామాను గది నుంచి వీధి ద్వారమువరకు గింజలు రాలుచుండెను తన దోసిలిని ఆమెకు చూపి యిట్లనెను ''చూడు! నేను నీకు గింజలు తెచ్చితిని నాకు యీ పండ్లను యిమ్ము'' ఆమె రిక్తముగా నున్న కృష్ణుని అందమైన గులాబిరంగులో నున్న నాజూకు చేతులను చూచెను ఆమె బియ్యపు గింజలు లోపలి నుండి ద్వారమువరకు పడియుండుట చూచెను ఆమె కృష్ణుని రెండు చేతుల నిండుగా తన బుట్టలోని పండ్లను యెంచి యిచ్చెను

బుద్ధికి గ్రాహ్యముకాని పరమాత్మ, ఆరణ్యకములు అనగా ఉపనిషత్తులు గూడ వర్ణింపలేని ఆ పరమాత్మ, కొన్ని అరణ్యకఫలములను గోరుట యెంత చిత్రము! భగవంతుని పెక్కు లీలలలో యిది యొకటి ఈ కథను వినువారు భగవంతుని చేరుటకు ఆరణ్యకముల (వేదాంతము) ఆవశ్యకత లేదు

నిషాద స్త్రీ యింటికి వెళ్ళిపోయి చూచుకొనగా తన బుట్ట బరువుగా నున్నట్లు ఆమెకు తోచెను. ఆమె బుట్టను దించి లోపల చూచెను. విలువైన మణులతో బుట్ట నిండియున్నట్లు ఆమె కనుగొనెను ఆమె కూర్చొని ఆశ్చర్యపడుచుండెను ఇది యెట్లు సంభవించెనో ఆమెకు అవగాహన కాలేదు

# 163 గోకులము నుండి బృందావనము

ఒకరోజు నందుని యాధిపత్యమున గోపాలురందరూ సమావేశమైరి. తరచుగా కృష్ణునికి ఆపదలు కలుగుచుండుట గురించి వారు చర్చించిరి. కృష్ణుని క్షేమము వారందరి ధ్యేయముగా నుండెను. గోపాలురందరిలో వృద్ధుడైన ఉపనందుడు మొట్ట మొదట యిట్లు పలికెను. ''ఈ గోకులము విడిచి పెట్టి సురక్షితమైన మరొక ప్రదేశమునకు తరలి వెళ్ళుట శ్రేయస్కరమని నా అభిప్రాయము. ఈ ప్రదేశము కృష్ణునికి క్షేమకరము కాదు అనేక ఉత్పాతములు కలుగుచున్నవి ఇది మంచిది కాదు మున్ముందు యీ బాలునికి మరికొన్ని కష్టములు ఆపదలు కలుగునని తోచుచున్నది ఇప్పటికే నాలుగు పర్యాయములు తీవ్రమైన ఆపదల నుండి తప్పించుకొనెను పూతన యను రాక్షసి మొదట యీ బాలుని చంపుటకు సంకల్పించెను తరువాత బండి క్రిందపడి నలిగిపోవుట తప్పెను. తరువాత సుడిగాలి నుండి ప్రమాదము తప్పెను ఇప్పుడు యీ కవల వృక్షముల నుండి నారాయణుని అనుగ్రహముచే ఆపద తప్పెను. అదృష్టవశముచేత యింతవరకు గోకులము దుష్టశక్తుల ప్రభావమునకు లోనుకాలేదు అది సంభవింపక మునుపే మనము యీ గోకులము విడిచి వెళ్ళుట మంచిది పిల్లలను రక్షించుట మన ప్రథమ కర్తవ్యము

''గోవర్ధన పర్వతమునకు దిగువ బృందావనమను ప్రదేశము కలదని విని యున్నాను పేరును బట్టి మన గోసంపద కా పర్వతము రక్షకాగలదని తోచుచున్నది. పర్వతము చుట్టు నున్న అడవిలో మన గోవులకు సరిపడునంత పచ్చగడ్డి యున్నదని వింటిని గోవులకు పుష్టిగా ఆహారము లభించును. మన గోపాలురు, గోపికలు సుఖ సంతోషములతో జీవించగలరని నా గట్టి నమ్మకము నా యీ సూచన అందరకును అంగీకారమైనచో, మరొక క్షణమైననూ వ్యర్థము గావించవద్దు''

గో ... నందుని సూచన నామోదించిరి. వెంటనే గోకుల వాసులందరును, ఊరేగింపుగా, తమతమ సామాగ్రితో బండ్లపై గోకులము నుండి బృందావనమునకు ప్రయాణమైరి ఒక బండి వెనుక మరొకటి నెమ్మదిగా సాగిపోవుచుండెను స్త్రీలు, పిల్లలు, వృద్ధులు బండ్లలో యెక్కి కూర్చొనగా, యువకులు తమ విండ్లను, డప్పుడమారులను చేత బట్టి బండ్ల వెనుక నడువసాగిరి. బండ్లకు ముందు గోవులు మందలు మందలుగా గోపాలకుల రక్షణలో నడువసాగెను

దుష్టశక్తుల బారి పడకుండ యుండుటకు బ్రాహ్మణులు వేదమంత్రములు నుచ్చరించుచు వారి ననుసరించి వెళ్ళిరి స్త్రీలు తిరునాళ్ళకు వెళ్ళుచున్నట్లు భావించి ఆనందించుచుండిరి స్త్రీలందరును వారికి యిష్టమైన పట్టుచీరలను ధరించిరి మెడలో హారములు, తలలో పూలు ధరించిన గోపికాస్త్రీలు కృష్ణుని చిలిపి చేష్టలను వర్ణించు పాటలను పాడుకొనుచు వెళ్ళిరి. ఒక బండిలో రోహిణి, యశోద, బలరామకృష్ణులు కూర్చుండిరి. మిగిలిన వారితో కలిసి ఆడుచు పాడుచు నడువవలెనని యుండెను కాని అట్లు చేయుటకు వీలు లేకపోయెను. ఆ పిల్లలు యిద్దరును తమతోపాటు ఉండుట ఆ తల్లులకు చెప్పలేని ఆనందోత్సాహములు కలిగించెను

ప్రయాణము చివరకు వచ్చెను బృందావనము చేరుకొనిరి బలరామకృష్ణులు బండి నుండి క్రిందకు దూకి గంతిరి. గొప్పగానున్న గోవర్ధన పర్వత సౌందర్యమును వారు రెప్పవేయక చూచుచుండిరి పర్వతము

దిగువనున్న అరణ్యము, ప్రక్కనే పారుచున్న యమునానది అత్యంత శోభాయమానముగా గోచరించెను. బలరామకృష్ణుల దృక్కులచే ఆ ప్రదేశము పావనమయ్యెను.

పిల్లలకు బృందావనములో జీవితము చాల ఉత్సాహముగా నుండెను బలరామకృ ుడు గోపాలురతో కలిసి బయటకు వెళ్ళుచుండిరి. బలరామకృష్ణులు గోవులను తోలుకొని యితర గోపాలకుల వలె బయటకు వెళ్ళుచుండిరి. పగలంతయు, గోవులు మేయుచున్నపుడు, బలరామకృష్ణులు యితర గోపబాలురతో ఆడుచుండెడివారు. సాయంకాలము యింటికి వచ్చిన తర్వాత ఆ రోజు జరిగిన ముచ్చట్లను తలుచుకుని ఆనందించెడివారు. ప్రతిరోజు గోవులను తోలుకొని వెళ్ళుటకు ముందు ఆటకు కావలసిన వస్తువులను ప్రోగుచేసి తమతో తీసుకు వెళ్ళెడివారు ఇల్లు దాటి తమ తల్లుల దృష్టి మరుగైన తర్వాత, యిక వారు అదుపు లేకుండ సంచరించెడివారు. కృష్ణుడు వేణువు ఊదెడివాడు. ఒకొక్కపుడు పండ్ల చెట్లపై రాళ్ళు విసిరి పండీపండని మారేడు పండ్లు రాలగా వాటిని తినుచు ఆనందించెడివారు బలరామకృష్ణులు తమ కాలి గజ్జెలు మధుర సంగీతమువలె ఘల్లుఘల్లు మనుచుండగా, వారు చెట్లను తన్నుచు ఆ ప్రదేశమంతయు పరుగెత్తి మిగిలిన బాలురతో ఆడుచుండెడివారు. దుప్పట్లను శరీరమంతటను కప్పుకుని, యెద్దులు, గోవులవలె వేషము ధరించి ఒకరినొకరు భయపెట్టుచు ఉల్లాసముగా కాలము గడిపెడివారు. ఒకొక్కపుడు అరణ్యములోని పక్షులవలె కూతపెట్టుచు, ఒకరినొకరు కడుపుబ్బ నవ్వించుచుండెడివారు. నిశ్చింతగా అట్లు సంచరించ గలుగుట పిల్లల అదృష్టము కదా!

## 164 వత్సుడు, బకుడు

ఒకరోజు బలరామకృష్ణులు గోవులను తోలుకొని బయటకు వెళ్ళిరి అవి గడ్డిమేయుచుండెను వారు గోవులను కాయుచుండగా, కంసుడు పంపిన అసురుడొకడు యమునా నదీతీరమునకు వచ్చెను. అసురు డాబాలురను చంప నిశ్చయించుకుని, దూడరూపము దాల్చి, అచట నున్న దూడల మందలో కలసిపోయి తిరుగుచుండెను కృష్ణుడిది కనుగొనెను రహస్యముగా యీ సంగతి బలరామునికి చెప్పెను ఏమియు జరగనట్లు, యేమియు తెలియని వారివలె వారిరువురును నటించి సంచరించుచుండిరి. నెమ్మదిగా యధాలాప ముగా కృష్ణుడు దూడరూపములో నున్న అసురుని సమీపించెను తాను దూడ రూపము ధరించిన విషయము కృష్ణునికి తెలుసునని అసురు డెరుగకుండెను.

కృష్ణుడు ఆ దూడ వెనుక కాళ్ళను రెండింటిని పట్టుకుని గిరగిర త్రిప్పెను అట్లు తిప్పినేలపై బడవేయగా, దూడ రూపముపోయి అసురుడు నేలకూలి మరణించెను అతడు నేలపై పడునపుడు అక్కడనున్న ఫలవృక్షములకు అతని శరీరము గట్టిగా తగులగా, ఆ వృక్షములకున్న పండ్లు నేలపై చెల్లాచెదురుగా పడెను కృష్ణుని చెంతనే యున్న యితరబాలురు కృష్ణుని చర్యను ఆశ్చర్యముతో చూచుచుండిరి స్వర్గము నుండి కృష్ణునిపై పుష్పవర్షము కురిసెను కృష్ణుని చర్యలకు దేవతలు మిక్కిలి సంతోషించిరి అత్యనాయాసముగా మరొక అసురుడు మరణించెనని వారు హాయిగా ఊపిరి బీల్చిరి

లోకమును సంరక్షించు భగవదవతారములైన బలరామకృష్ణులు బృందావనములో సామాన్య గోపాలకులవలె

గోవులను సంరక్షించుచు చరించుచుండిరి

గడ్డిని మేసిన దూడలను నీరు త్రాగించుటకై వారిరువురును దూడలను తోలుకుని యమునా నదీతీరము నకు వెళ్ళిరి వారు కూడ కడుపునిండుగా యమునా నదీ జలము త్రాగిరి చుట్టును పరికించి చూడగా ఆ నదీ తీరమున ఒక విచిత్రమైన జీవిని వారు చూచిరి అది ఒక భయంకరమైన పక్షివలె వారికి గోచరించెను ఇంద్రుడు వజ్రాయుధముతో ఒక పర్వతమును కొంత నరికివేయగా మిగిలిన దానంత పెద్దదిగా యుండెను ఆ విచిత్రజీవి అది ఒక పెద్ద కొంగయని వారిరువురును గ్రహించిరి. బకుడను అసురుడు కృష్ణుని చంపుటకు వేచి చూచుచుండెను శరీరము, ముఖము నేలపైకి వంగియున్న ఆ విచిత్రజీవిని చూచుటకు బాలురందరను దగ్గరకు వచ్చిరి వారట్లు చూచుచుండగనే, ఆ విచిత్రజీవి కొంగముక్కువలె నున్న నోటిని వెడల్పుచేసి కృష్ణుని మ్రింగివేసెను

అకస్మాత్తుగా జరిగిన సంఘటనకు యేమి చేయుటకును యెవరికిని యేమియు తోచలేదు కొంగవలె నున్న ఒక భయంకర పక్షి కృష్ణుని మ్రింగివేయుట చూచి ఆ బాలురందరును దిగ్భ్రాంతి చెందిరి ఇట్లుండగా, బకునికి తన పొడవైన మెడలో అగ్నిగోళమొకటి కదలుచున్నట్లు, దానివలన తీరని బాధ కలుగుచున్నట్లు తోచెను ఆ బాధను బకుడు భరించలేక, అంతకుముందు మ్రింగిన కృష్ణుని బయటకు కక్కెను ఇనుప సూదులవలె నున్న తన వాడియైన ముక్కుతో కృష్ణుని పొడుచుటకు బకుడు వడివడిగా వచ్చుచుండెను

తన దగ్గరకు వచ్చువరకు కృష్ణుడు వేచి యుండెను. దగ్గరకు వచ్చినంతనే కృష్ణుడు, బకుడు తెరచిన ముక్కు పైభాగమును క్రింది భాగమును పట్టుకుని తోటిబాలురు ఆశ్చర్యముతో చూచుచుండగా, రెండుగా చీల్చివేసెను బృందావనములోని కృష్ణుని సాహస కృత్యమునకు పుష్పవర్షము గురిసెను దివ్య సంగీతము వినిపించెను. బలరాముడు యితర బాలురు కృష్ణుని కౌగిలించుకొనిరి బకుడు మ్రింగివేయుట చేత కృష్ణుడు చనిపోవునేమో యను ఆలోచన ఆ బాలురకు కలుగక మునుపే, కృష్ణుడు బయట పడి బకుని సంహరించెను. చివరకు చూడగా ఆ విచిత్రజీవి కొంగకాదనియు, ఒక భయంకర అసురుడనియు నిర్ధారణ యయ్యెను.

అందరూ తమతమ యిండ్లకు తిరిగి వచ్చి, ప్రతిఒక్కరికీ కృష్ణుడొనర్చిన అద్భుత కార్యము వర్ణించిరి. నందుడు, యితర పెద్దలు, బాలురను రక్షించినందుకు భగవంతునికి ధన్యవాదములు తెలిపిరి వారిలో వారిట్లనుకొనిరి ''ఆహా! ఎన్ని పర్యాయములు యీ బాలుడు మృత్యువు నుండి తప్పించుకొనెనో గదా! విచిత్రమేమనగా, మనందరి అదృష్టము కొలది, చంపవచ్చినవారే చనిపోవుట జరుగుచున్నది ఇంతకు మునుపే వారు అనేక పాపములు చేసియుండవచ్చును కృష్ణుని చంపు సంకల్పముతో కృష్ణుని సమీపింపగా, దీపమును మ్రింగు నుద్దేశముతో సమీపించెడి రెక్కల పురుగులు నశించినట్లుగా, వారు నశించుచున్నారు'' నందుడు తనలో తానిట్లనుకొనెను ''గర్గుడు చెప్పినది సత్యము. నా కుమారుడు చిరకాలము జీవించి, లోకములో తన ధైర్యసాహసములకు యశస్సు కీర్తి పొందును''

# 165 అఘాసురుడు

ఒకరోజు కృష్ణుడు అరణ్యములో ఆనందముగా గడపవలెనని యెంచి, తోటిబాలురను పిలిచి యిట్లనెను. ''చూడండి, నేను వేణువు, యితర వాద్యములు తెచ్చెదను మీకు కావలసిన వానిని మీరు తీసుకొని రండు. రేపు మనమందరము అరణ్యములో ఆనందముగా ఆడుచు పాడుచు గడుపుదము''. బాలురందరు విని యెగిరి గంతులు వేసిరి వారి మనస్సులలో ఉత్సాహ ముప్పొంగుచుండెను ఆవు దూడలను తోలుకువెళ్ళె నెపముతో వెళ్ళి రోజంతయు ఆనందముగా గడపవలెనని వారందరును తలపోసిరి

ఉదయముననే అందరును యిల్లు విడిచి వెళ్ళిరి. కృష్ణుడు తన వేణు వాద్యములను తీసుకుని వారికి నాయకుడుగా ముందు వెళ్ళుచుండెను అతడు తన వెనుక యితర బాలురతో ఆవుదూడలతో నడచుచుండెను వారి చేతులలో దూడలను అదలించుటకు చిన్న చిన్న కర్రలుండెను కొందరి చేతులలో వేణువులు, యితర వాయిద్యములు నుండెను గవ్వలు, పూసలతో కట్టిన దండలు అందరి మెడల యందుండెను. అరణ్యములోని పువ్వులు, ఆకులతో దండలు కట్టి ధరించిరి నదీ తీరమున విరివిగా లభ్యమగు ఆలిచిప్పల భస్మము ముఖమునకు పూసుకొనిరి. ఒకరినొకరు హాస్యము లాడుచు, ఒకరినొకరు ఆటపట్టించుచు, నవ్వుచు ఆటపాటలలో మునిగి యుండిరి కృష్ణుడు అందరిని మించిపోయెను అందరిని ఆటపట్టించుటలో అగ్రగామి అయ్యెను ఎప్పటికప్పుడు కొత్తకొత్త ఆటలతో కృష్ణుడు అందరికిని ఉత్సాహానందములను కల్గించుచుండెను

అందరికంటె ముందుగా చాల దూరము వెళ్ళి తన్ను పట్టుకొనుమని వారిని కవ్వించగా, వారు కృష్ణుని పట్టుకొనుటకు ఆ ప్రదేశమంతయు పరుగులెత్తిరి ఆ తరువాత కొంతసేపటికి కృష్ణుడు తనకు తానే వారికి పట్టుబడిపోవును అంతట ఆ బాలురు ''కృష్ణుడు పట్టుబడె''నని గట్టిగా కేకలువేసి చప్పట్లు చరచిరి అట్లు కొంతసేపు ఆడి అలసిపోయిన తర్వాత, అరణ్యములో నివసించు జంతువులు చేయు శబ్దములు చేయుచు కొంతసేపు గడిపిరి కొందరు కోయిలవలె కూయసాగిరి మరికొందరు తుమ్మెదల వలె ఝుమ్మను శబ్దము చేయసాగిరి కొందరు చప్పట్లు చరుచుచు, ఆకాశములో విహరించు పక్షుల నీడ ననుసరించి పరుగెత్తుచుండిరి. మరికొందరు నది ఒడ్డున చేపలకై కొంగ వేచి యున్నట్లు కూర్చుండిరి కొందరు నెమళివలె నాట్యము చేయగా, మరికొందరు బాలురు కోతులవలె చెట్లకొమ్మలను పట్టుకుని ఊగులాడుచుండిరి. వీరిని చూచి కోతులు అదొక విధముగా ముఖమును పెట్టుట జూచి, బాలురు కూడ ఆ కోతుల భంగిమలను అభినయించుచుండిరి. అంతలో కృష్ణుడు నదిలో దూకుట జూచి, బాలురందరును నదిలో దూకి యీతగొట్టుట మొదలిడిరి

ఆ గోపబాలుర అదృష్టమే అదృష్టము భగవంతుడు వారితో రో గడుపుట కన్న మించిన అదృష్టము యింకేమి గలదు? వేలకువేలు సంవత్సరములు ఇంద్రియ నిగ్రహముతో తపోధ్యానములు సలిపినను పరమాత్ముని పాదధూళి లభించుట దుర్లభము అనేక జన్మలు పరిశుద్ధమైన జీవితము గడిపినను పరమాత్మ దర్శన భాగ్యము కొద్ది మందికే కలుగును కేవలము జ్ఞానధనులు మాత్రమే దర్శించగలుగు పరమాత్మ, పరమభక్తులకు సేవకుడుగా నుండుటకు వెనుదీయని పరమాత్మ, కృష్ణుడుగా యమునానదీ తీరపు యిసుక దిబ్బలలో అమాయకులు, అజ్ఞానులు అయిన బృందావనములోని గోపబాలురతో ఆడుచు పాడుచు చరించుట కన్న విచిత్రమింకేది గలదు! బృందావనము, అందు నివసించు ప్రజలు మహాభాగ్యవంతులు. వారికి

రాత్రి పగలు కృష్ణునితో కలిసి జీవించు సదవకాశము లభించినది ఆ గోపబాలురు కృష్ణునితో అట్లు అనేక విధముల ఆటలు ఆడుచుండగా, ఒక అసురుడు వారిని సమీపించెను. అతనిపేరు అఘాసురుడు పేరుకు తగినట్లుగా అతనిలో దుష్టత్వము మూర్తీభవించెను. కృష్ణుని సంహరించుటకై ఆ రాక్షసుని కంసుడు పంపెను. స్వర్గములో దేవతలు కృష్ణుని చిలిపి చేష్టలు ఆనందింప గలిగినట్లుగా, ఆ రాక్షసునకు యెట్లు ఆనందించవలెనో తెలియకుండెను. దేవతలు కృష్ణుని దర్శించుటచేత అమృతము లభించిన ఆనందము కన్న యెక్కువగా ఆనందించుచుండిరి

అఘాసురుడు పూతనకు బకునకు సోదరుడు. అతని స్వామి కంసుని ఆజ్ఞను శిరసావహించుటలో ఆత్రమును చూపుటయేగాక, తన సోదరిని, సోదరుని కృష్ణుడు హతమార్చినందుకు పగతీర్చుకొనవలెనని ఉవ్విళ్లూరుచుండెను. బలరామకృష్ణులను చూచి అఘాసురుడు తనలో తానిట్లనుకొనెను. ''నా సోదరిని, సోదరుని చంపినది యీ చిన్న బాలుడన్నమాట నా బాధను తీర్చుకొనుటకు వీరిద్దరిని సర్వనాశనము చేసి, నా మనస్సులోని ముల్లును, నా స్వామిని బాధించుచున్న ముల్లును ఒకేసారి పెరికి వేయుదును ఈ బాలుని మరణమే నా అనుంగు సోదరులకు నేనొసంగు తర్పణము ఈ బాలురిద్దరును మరణించినచో, బృందావనములో వీరి చుట్టును నడచు జీవితము స్తంభించి శూన్యమగును నేను తొందరగా వీరి అంతము చూడవలెను''.

ఆ గోపాలుర మార్గమునకు అడ్డముగా అఘాసురుడు నిలుచుండెను. అతడొక పెద్ద సర్పరూపము దాల్చెను దాని పొడవు నాలుగు క్రోసులు. ఒక పెద్ద పర్వతము వలె నుండెను. నోరు తెరచి వేచి చూచుచుండెను. ఆ సర్పము క్రింది దవడ నేలపై ఆని యుండెను. పై దవడ ఆకాశమును ముట్టు చున్నట్లుండెను. అతని నోరు ఒక పెద్ద గుహవలె నుండెను కోరలు గుహలోని యెత్తు పల్లముల మాదిరిగా నుండెను నోటి మధ్యలో యెర్రని నాలుక గలదు. అతడి శ్వాస వేడిగా నుండుటచే, వాతావరణమంతయు మండుచున్నట్లుండెను ఈ గోపబాలురు వ       యని తలంచునట్లుగా అసురుడు తన శరీరమును రూపొందించుకొనెను. ఆ బాలురలో కొందరు, ''చూడు! ఈ గుహ నోరు తెరచుకున్న సర్పము మాదిరి యున్నట్లు ఊహించవచ్చు!'' అని పలికిరి

ఆ ఉపమానమును మరికొందరు విశ్లేషించిరి. అందులో ఒక బాలుడు, ''ఇదిగో యిది నిజముగా ఒక సర్పము నోరు తెరచుకుని మనలను మ్రింగివేయుటకు వేచి యున్నట్లున్నది గుహ పై భాగమున సూర్యకిరణముల వెలుగు ప్రసరించగా, సర్పము పై దవడ మాదిరిగా యున్నది కదా! నేలపై బడిన గుహ పై భాగము నీడ మన ఊహను మరింత బలపరచుచున్నది ఆ చిన్న చిన్న యెత్తు పల్లములను చూడగా సర్పము కోరలవలె అగుపించుచున్నది. గుహ మధ్యలో ఎత్తుగా నున్న యీ మార్గము వంతెన మాదిరిగా నున్నది చూడగా సర్పము జాపిన యెర్రని నాలుకవలె నున్నది చుట్టును చీకటిగా నుండుటచేత, సర్పము నోరు వలె గోచరించుచున్నది. మిట్ట మధ్యాహ్నపు యెండ చేత చుట్టును వేడిగా నున్నగాలి, వేడియైన సర్పపు విషపూరిత శ్వాసవలె నున్నది''

వారిలో ఒక గోపబాలుడు యిట్లనెను ''మనము యీ గుహలోనికి వెళ్ళినట్లు తలంచుదము. ఇది సర్పముగా మారి మనలను మ్రింగివేయునా? తరువాత యేమి జరుగును?'' మరొకడు, ''ఏమియు జరుగదు మన కృష్ణుడు దానిని చంపివేయును ఆ రోజు కొంగను చంపినట్లే చంపు       'నిలేదు లోపలికి

వెళ్ళుదము. ఇదీ ఒక సాహస కృత్యము కాగలదు''.

ఒకరి తర్వాత మరొకరు గుహవలె నున్న నోటిలోనికి ప్రవేశించిరి. అది ఒక పెద్ద సర్పమనియు, ఆ భయంకర సర్పము నోటిలో ప్రవేశించిన చావు తప్పదనియు కృష్ణుడెరుగును. అతడు మౌనముగా నిలిచి యుండి, తోటి బాలురందరు దూడలతో తమ సాహస కృత్యములను ప్రదర్శించుటకై గుహలోని కేగువరకును వేచి గమనించుచుండెను. కృష్ణుడు ఒక్కడే అందు ప్రవేశించక మిగిలియుండెను. సర్పము నోరు తెరచుకొని యుండెను. కృష్ణుడు ప్రవేశించువరకు నోరు తెరచుకుని అఘాసురుడు వేచి యుండెను. లేకున్న పగ సాధించుటకు వీలుకాదు, తన స్వామి కార్యము కూడ ఫలింపదు.

కృష్ణుడు తనతో వచ్చిన గోపబాలురందరి విధి వ్రాత పూర్తిగా నెరిగి యుండెను. వారు గుహలో ప్రవేశించునపుడు యిట్లు తలపోసిరి. ''ఇది సర్పము అయినచో కృష్ణుడు దానిని తప్పక చంపితీరును. మనకేమియు ఆపదలేదు. సురక్షితముగా నుండెదము''. కృష్ణుడు తనలో తాను నవ్వుకుని అఘాసురునికి ఆఖరి ఘడియలు సమీపించెనని తలచి, గుహవలె నున్న సర్పము నోటిలో ప్రవేశించెను. కృష్ణుడు ప్రవేశించిన వెంటనే సర్పము నోరు మూయుట చూచి, కృష్ణుని దివ్యత్వము తెలిసిన దేవతలు కూడ ఆందోళనతో కేకవైచి యేమి జరుగునోయని వేచి చూచుచుండిరి. కృష్ణుడు సర్పము గొంతు చేరిన తర్వాత, తన శరీరమును క్రమక్రమముగా పెద్దది చేయజొచ్చెను. అఘాసురుడు ఉమ్మివేసి కృష్ణుని బయటకు నెట్టుటకు ప్రయత్నించి, తన్ను తాను సంరక్షించుకొనదలచి విఫలుడయ్యెను. నెమ్మదిగా క్రమేపి అఘాసురునికి ఊపిరాడకుండెను. అఘాసురుడేమియు చేయలేకుండెను. మిక్కిలి బాధతో తోక నాడించుచుండెను. గొంతులోని బాధ భరించరాని దయ్యెను. చివరకు ఒక పెద్ద నిశ్శ్వాస విడిచెను. తీవ్రమైన ఆ గాలిపోటునకు తల పగిలి ముక్కలయ్యెను.

అఘాసురుడు చనిపోయిన వెంటనే ప్రేమపూరితమైన దృక్కులతో తోటి బాలురను చూచెను. విషపూరిత మైన సర్పశక్తికి వారు మూర్ఛపోయి నేలపై పడియుండిరి. కృష్ణుని దృక్కులు ప్రసరించిన వెంటనే వారు లేచి బయటకు వేగముగా వెళ్ళిపోయిరి. అందరును బయటకు వెళ్ళిన తర్వాత చిట్టచివర కృష్ణుడు బయటకు వచ్చెను. గుహ ప్రవేశ ద్వారము అనగా సర్పము యొక్క నోరు వద్ద ఒక వెలుగు గోచరించెను. నాలుగు దిక్కులు దేదీప్యమానముగా ప్రకాశించుచుండెను. అందరును చూచుచుండగా ఆ వెలుగు కృష్ణుని పాదము లందు ప్రవేశించెను. ఇదంతయూ గమనించుచున్న దేవతలు కృష్ణునిపై పుష్ప వర్షము కురిపించిరి. స్వర్గవాసులు సంతోషముతో నృత్యగానములు చేసిరి. గానము విని బ్రహ్మ తన నివాసము నుండి యేమి జరిగెనోయని తెలుసుకొనుటకు బయటకు వచ్చెను. చిన్నబాలుడైన కృష్ణుడు యింతటి అద్భుత కార్యము నెట్లు గావించెనా యని ఆశ్చర్యపడెను.

కృష్ణుని స్పర్శచేత మరణించిన అఘాసురుడు సకల పాపముల నుండి విముక్తుడై, భగవంతుని పాదములను చేరు అర్హత పొందెను. ఇట్లు జరుగుటలో వింతయేమి? భగవంతుని రూపము మనస్సులో స్థిరముగా నున్నచో, అట్టివారు ముక్తి నొందుట తథ్యము. అటువంటపుడు, సర్పరూపము దాల్చిన అఘాసురుని నోటి యందు కృష్ణుడు తనకు తానే ప్రవేశించి, తన పవిత్ర పాదములతో స్పృశించెను. అందుచే దుష్టత్వము మూర్తీభవించినప్ప టికిని అఘాసురునికి మోక్షము లభించుటలో ఆశ్చర్యమేమి గలదు?

# 166 బ్రహ్మదేవుని సంశయము

ఇది జరిగినప్పుడు గోప బాలురందరును సుమారు అయిదు సంవత్సరముల వయసులో నుండిరి. వారు తమ తమ యిండ్లకు వెళ్ళి తల్లిదండ్రులతో కృష్ణుడు వారినెట్లు రక్షించినదియు వివరించి చెప్పిరి. కాని ఒక సంవత్సరము తర్వాత మాత్రమే వారీ విషయము చెప్పిరి. అనగా అప్పటికి వారందరుకును ఆరు సంవత్సరముల వయస్సు.

పరీక్షిత్తు మహారాజు ఉత్సాహభరితమైన యీ కథను విని మౌనముగా కూర్చుండెను. ఒక క్షణకాలము తర్వాత అతడిట్లనెను. ''స్వామీ! నా సందేహము తీర్చవలెను. ఒక సంవత్సరము తర్వాత ఆ బాలురు వారి తల్లిదండ్రులకీ విషయమును వివరించినారని మీరు చెప్పినారు. ఇది యెట్లు సాధ్యము. బాలురకు సహజమైన ఉత్సాహముతో, కృష్ణుడు యీ విషయము గురించి మాట్లాడవద్దని ఒకవేళ చెప్పినప్పటికీ లక్ష్యము చేయక, వారు చెప్పుదురు కదా! అటువంటపుడు ఉత్తేజకరమైన యీ సంఘటనను ఒక సంవత్సరము వరకు ఆ బాలురు ప్రస్తావించకుండుటకు కారణమేమై యుండును. కృష్ణుడు వారిచేత యేదైన రహస్య ప్రతిజ్ఞ చేయించెనా? లేకున్న యిది అసంభవము. నాకేమియు బోధపడుటలేదు. నా యీ సంశయమును నివృత్తి చేయగోరెదను''.

శుకుడు పరీక్షిత్తు సంశయమును విని మెచ్చుకొనెను. వారు సంవత్సరకాలము వరకు యేల వేచి యుండిరని రాజు అడిగిన ప్రశ్నవిని, శుకుడు ఆలోచనలోపడి, కొంత విరామము తర్వాత సమాధానము చెప్పెను. భగవంతుని అద్భుత చర్యలను చెప్పునపుడు అతడు తన్మయుడై తన్ను తాను మరచి, కృష్ణుని లీలలతో మనస్సు నిండి శూన్యదృక్కులు ప్రసరించుచుండును. తిరిగి బాహ్యస్మృతి కలిగి కథ కొనసాగించుటకు కొంత సమయము పట్టుచుండెడిది. శుకుడు పరీక్షిత్తుతో నిట్లనెను. ''నీ ప్రశ్న సముచితముగా నున్నది. నీవు యీ ప్రశ్నవేయుట చేత దానికి సంబంధించిన గాథ నీకు తెలుపుటకు నేను యెంతగానో ఆనందిస్తున్నాను. ఎన్నిసారులు వినినప్పటికిని భగవంతుని కథలు వినువారికి వివరించువారికి కూడ సంతోషము చేకూర్చును. కాముకులు స్త్రీలను గురించి వినుటకు యెంత సంతోషము వ్యక్తపరతురో, భగవద్భక్తులకు భగవత్కథలు అంతకంటె పెక్కురెట్లు ఆనందము కలిగించును. ఇప్పుడు నీకు బృందావనములోని గోపాలురు గోపికలు ఒక సంవత్సరము వరకు వారి పుత్రులు తమకు అఘాసురుని మరణ వృత్తాంతమును యెందుకు వివరించలేకపోయిరో చెప్పెదను.

''అరణ్యములో ఆ బాలురు ఆడుచు పాడుచు దూడలతో అఘాసురుడు ఉన్నటువంటి ప్రదేశమునకు వచ్చిరి. అఘాసురుని సంహరించిన తర్వాత కృష్ణుడు వారి ఆలోచనలను జరిగిన అద్భుత సంఘటన నుండి మళ్లింపదలచెను. వారు దీనికి యెక్కువ ప్రాముఖ్యత నివ్వకూడదని కృష్ణుడట్లు చేసెను. వారు ఆ విషయము మరచిపోవునట్లు చేసెను. అన్ని అవతారములందు ముఖ్యముగా కృష్ణావతారమందు, భగవంతుడు సామాన్య మానవుడనే భ్రమ కలిగించుటకు సాధ్యమైనంతవరకు ప్రయత్నించెను. కాని అడపా దడపా మాయతెర తొలగి దివ్యత్వము ప్రకటమగుచుండెను. తన మాయచేత ప్రజలు యిట్టి విషయములు మరచిపోవునట్లు చేయుచుండెను. మానవుల జ్ఞాపకశక్తి కొద్దికాలమే. ఆ క్షణములో యీ అద్భుత కార్యము వారందరి ముఖములందు ప్రస్ఫుటముగా గోచరించుచుండెను. కాని కాలము, అద్భుతలీలలు గావించి, దివ్యత్వము ప్రకటించిన మానవుని మరచిపోవునట్లు చేయును. వారు ''కృష్ణుడు చాల అద్భుత వ్యక్తి'' అని మాత్రమే అందురు. కృష్ణుడు గూడ

యిట్లు జరుగవలెనని తలచెను.

''కృష్ణుడు అల్లరి బాలురనందరిని తోడ్కొని యమునా నదీ తీరమున యిసుక దిబ్బలవద్దకు వెళ్ళెను. కృష్ణుడు వారితో యిట్లనెను. ''మిత్రులారా! ఇంతకాలము మనము ఆడుచుపాడుచు ఆకలి మరచిపోయినాము. నాకు చాల ఆకలిగా ఉన్నది. నేను కాలు యెత్తి ఒక్క అడుగైననూ వేయలేను. నది ఒడ్డువైపు చూడుడు. ఇసుక స్వచ్ఛముగా పాలవలె తెల్లగా మృదువుగా నున్నది. చెట్లనీడ వలన మిట్ట మధ్యాహ్నపు యెండ తీవ్రత తెలియుటలేదు. పుష్పముల చుట్టును తుమ్మెదలు చేయుచున్న ఝుంకారము, పక్షుల రెక్కల కదలికచే కలుగు శబ్దములు, మధుర సంగీతమును విన్పించుచున్న నదీ ప్రవాహము, యివన్నీ కలిసి యెంతో హాయిని చేకూర్చుచున్నవి. ఇక్కడ నుంచి కదలుటకు నా మనస్సంగీకరించకున్నది. ఇసుక తిన్నెలపై కూర్చుని మనము భోజనము కానిచ్చెదము. దూడలు గడ్డిమేసి నదిలో నీరు త్రాగి రాగలవు. ఈ లోపుగా మనము భుజించెదము''. కృష్ణుని సూచనలను యెవ్వరూ యెన్నడూ కాదనలేదు. ''అట్లే'' యని బాలురు చప్పట్లు చరిచిరి. అఘాసురుని మరణ విషయము వారి మనస్సుల నుండి తొలగిపోయెను. ఇప్పుడు వారి ఆలోచన లన్నియు భోజనముపై నున్నవి.

''ఆ బాలురు అందరును వలయాకారములో కూర్చొనిరి. వారి మధ్య కృష్ణుడు కూర్చొనెను. వారు భోజనము చేయుట మొదలుపెట్టిరి. బాలురందరును తమ తల్లులు కట్టియిచ్చిన పొట్లములను విప్పిరి. కొందరి పొట్లములు తామరాకునందు, మరికొందరి పొట్లములు అరటియాకునందు కట్టియుండెను. కొందరు తమ ఆహారమును మట్టి పాత్రలలోను, మరికొందరు రాతిచిప్పలలోను తెచ్చుకొనిరి. వారందరు కేరింతలతో నవ్వుచు ఆనందముగా భుజించుచుండిరి.

''ప్రతి యజ్ఞము నందు హవిస్సును స్వీకరించు పరమాత్మ, యెవరికి సమస్తమును అర్పించుచున్నారో, యెవని యందు సర్వస్వమును దాగియున్నదో, అట్టి పరమాత్మ చిన్న బాలుని రూపములో ఇతర బాలుర మధ్య కూర్చుని, తాను తెచ్చుకొనిన అన్నపు పొట్లము విప్పి భుజించుచుండెను. కృష్ణుడు తమ మధ్య సంచరించుచుండగా యిన్ని సంవత్సరములుగా తమ జీవితముల కుత్తేజము పడసిన గోకులవాసులు యెంత ధన్యులో కదా!

''కృష్ణుడు తన నడుముకు కట్టిన పీతాంబరపు మడతలో వేణువును దోపెను. దూడలను తోలుటకు తెచ్చిన కర్రను చంక క్రింద బెట్టెను. కృష్ణుడు మిగిలిన బాలురందరి మధ్య కూర్చుని హాస్యోక్తులతో వారిని కడుపుబ్బ నవ్వించుచుండెను. ప్రతి ఒక్కరును కృష్ణుడు తన యందే శ్రద్ధవహించవలెనని ఉవ్విళ్ళూరుటచేత, కృష్ణుడు అందరివంక ఒకేసారి దృష్టి సారించి ఒక్కొక్కరినే ప్రత్యేకించి చూచినట్లు చూచుచుండెను. ఎడమ చేతితో పెరుగు అన్నమును, వ్రేళ్ళమధ్య ఊరగాయలను పట్టుకొని భుజించుచుండెను. అందమైన యీ దృశ్యమును జూచి దేవతలు గోపబాలుర అదృష్టమునకు అసూయపడజొచ్చిరి.

''వారట్లు హాస్యోక్తులతో ముచ్చట లాడుకొనుచుండగా, దగ్గరలో గడ్డిమేయుచున్న ఆవుదూడలు వారిని విడిచి దూరముగా అరణ్యములోనికి వెళ్ళెను. ఇంతలో ఒక గోపబాలుడు దగ్గరలో ఆవుదూడలు కనుపించకపో వుట జూచి గట్టిగా యిట్లు కేకపెట్టెను. ''ఆవుదూడలేమైనవి? కృష్ణా! గొప్ప ఘోరము జరిగెను. ఆవుదూడలు అరణ్యములోనికి వెళ్ళినవి. తప్పకుండ క్రూరమృగములు వానిని చంపి తినివేయగలవు. మన పెద్దవారికి యేమి సమాధానము చెప్పగలము?''

''మిగిలిన బాలురు కూడ విషాదముతో నుండగా, కృష్ణుడు వారితో యిట్లనెను. 'మీరేమియు ఆందోళన చెందవద్దు. నేను వెళ్ళి అవి యెక్కడనున్నవో, యేమి చేయుచున్నవో చూచి వచ్చెదను. మీరు భోజనము పూర్తిచేయుడు. నేను ఆవుదూడలను తోలుకు వచ్చెదను'. బాలురందరూ ఒక్కసారిగా ''అది చాల బాగున్నది. కృష్ణుడు ఉండగా అన్నీ సర్దుకొనును. మనము ఆందోళన చెందనవసరము లేదు''. కృష్ణుడు నవ్వి అడవిలోనికి వెళ్ళెను.

''ఎడమచేతిలో పెరుగు అన్నము పట్టుకుని, ఆ పర్వత ప్రదేశము, గుహలు, గోవర్ధన పర్వత సానువులు అంతటను సంచరించెను. కాని ఆవుదూడల జాడ కనుగొనలేకపోయెను. వెదకినందువల్ల ప్రయోజనము కనుపించక పోవుటచేత, కృష్ణుడు యమునా నదీతీరమున తోడిబాలురను వదలి వెళ్ళిన ప్రదేశమునకు తిరిగి వచ్చెను. ఆ ప్రదేశము నిర్జనముగా నుండెను. తోడిబాలురు ఒక్కరును కృష్ణునకు కన్పించలేదు.

''కృష్ణుడు ఒక క్షణము యోచించగా యేమి జరిగెనో గ్రహించెను. కృష్ణుడు అఘాసురుని చంపినపుడు స్వర్గములో దేవతలు వేడుకచేసిరి. ఆ వేడుకలో జరిగిన సంగీత నృత్యములను సృష్టికర్త బ్రహ్మ విని, తన నివాసము నుండి బయటకు వచ్చి, దేవతలు వేడుక జరుపుటకు కారణము తెలుసుకుని, బాలుని శక్తి సామర్థ్యములకు అచ్చెరువొందెను. ఆ బాలుని శక్తి సామర్థ్యములు మరికొంత పరీక్షించుటకు బ్రహ్మ నిశ్చయించుకొనెను. బ్రహ్మదేవుడు ఆవుదూడలను దొంగిలించి ఒక గుహలో దాచివేసెను. కృష్ణుడు లేని సమయమున, ఆ గోపబాలురు నిద్రపోవునట్లు చేసి, వారందరిని కూడ దూడల నుంచిన గుహలో దాచివేసెను.

''కృష్ణుడు తనలో తానునవ్వుకుని యిట్లు తలపోసెను. 'ఇది బ్రహ్మదేవుని ఆటయన్న మాట. అందుకు సరిసమానమైన ఆట నేను కూడ ఆడెదను'.

''పరమదేవతా స్వరూపుడైన పరమాత్మ, సృష్టి యందంతటనూ వ్యాపించి, సర్వజీవులందు జీవాత్మగా వసించు పరమాత్మ, అనగా ఆ నారాయణుడు, బ్రహ్మదేవునికి యీ లీలలు గావించుచున్నది నారాయణుడేగాని కేవల మొక బాలుడు కాదని తెలియజెప్పుటకు నిశ్చయించుకొనెను''.

## 167 సంవత్సరకాలము సత్యము మరుగుపరచి యుంచుట

కృష్ణుడు ఒక్కడే ఆవుదూడల రూపములు, గోప బాలుర రూపములు కూడ ధరించెను. తానే దూడల మెడలోని త్రాడుగను, బాలుర చేతులలోని కర్రలుగను మారెను. ఆహారమును తెచ్చుకొను పాత్రలు తానయ్యెను. ఆ బాలురు ధరించు వస్త్రములు, చినిగిపోయిన పంచగానీ, పట్టుపంచగానీ, లేక రంగు ఉత్తరీయము గానీ, తానే అయ్యెను. ఒకటేల, సర్వమూ తానయ్యెను. ఆ బాలుర రూపములేకాక, వారి స్వభావములు — వారి వారి ప్రత్యేక గుణములు, చేష్టలు — కూడ తాను వహించెను. చీకటి పడుటతో, బాలుర రూపములో నున్న కృష్ణుడు బృందావనము చేరుకొనెను. కృష్ణుడు వందలాది కృష్ణులై వివిధ రకములయిన దుస్తులను ధరించి యుండెను.

ప్రతి ఒక్క గోపబాలుడు తన దూడలతో యింట ప్రవేశించెను. వారి తల్లులు ఆ బాలురను తమ గుండెలకు

హత్తుకొనిరి కృష్ణుడు తన యింటికి వెళ్ళెను. యశోద కృష్ణుని ముద్దాడెను ఇట్లు మరుచటి రోజు, ఆ మరుచటి రోజు, అట్లే ప్రతి దినము జరిగిపోవుచుండెను. కొన్ని కొన్ని విషయములలో స్వల్పమైన మార్పులు గోచరించుచుండెను. ఉదాహరణకు, తల్లిగోవులు యింటికి వచ్చి తమ దూడలను మరింత ప్రేమతో నిమిరి సాకుచుండెను. మామూలుకన్నా యెక్కువ పాలను యిచ్చుచుండెను తల్లిదండ్రులు వారి వారి పుత్రులతో యెప్పటివలెనే వ్యవహరించుచుండిరి, కాని స్వల్పభేదము కానవచ్చుచుండెను. వారి ఆప్యాయత, ప్రేమలలో యేదో చెప్పరాని మాధుర్యము గోచరించుచుండెను. ఇది ప్రతి ఒక్కరిలోనూ కన్పట్టుచుండెను. తల్లులు, తమ పుత్రులయందు కూడ కృష్ణునిపై చూపు ప్రేమాభిమానములను చూపుచుండిరి అందరిలోనూ యిట్టి భావములు అంతరాంతమున యిమిడి యుండెను. వారికి కారణము తెలియదు. తెలుసుకొనుటకు వారు ప్రయత్నించను లేదు.

ఇట్లు ఒక సంవత్సరము గడిచెను. సంవత్సరము పూర్తి యగుటకు నాలుగైదు రోజుల ముందు ఒకనాడు కృష్ణుడు, బలరాముడు, గోపబాలురు, ఆవు దూడలతో కలిసి మిగిలిన సరంజామా తీసుకుని అడవిలోనికి వెళ్ళిరి. గోవర్ధన పర్వతము దిగువ ఆవుదూడలు మేయుచుండగా, పర్వతముపై నున్న తల్లిగోవులు వానిని చూచెను. ఆకలిని మరిచిపోయి గోపాలురు అదలించు చున్నప్పటికిని లక్ష్యపెట్టక ఆ తల్లిగోవులు పరుగు పరుగున తమ దూడలు ఉన్నచోటికి వచ్చి, వానికి పాలతో నిండిన తమ పొదుగులను కుడిపి పాలిచ్చు చుండెను.

గోపాలురు తమ అదలింపులు నిష్ఫలమయ్యెనని తలంచి పర్వతము దిగువకు వచ్చి తల్లి గోవులను తిరిగి తోలుకు వెళ్ళుటకు సంకల్పించిరి అవసరమయినచో వాటిని తిట్టి కొట్టుటకు సిద్ధపడిరి వారు కొండ దిగువకు వచ్చి వారి పుత్రులు బలరామకృష్ణులతో నుండుట జూచిరి పుత్రులను చూచినంతనే వారి హృదయములు ప్రేమతో నిండి పొంగిపొరలు చుండెను. ఆ ప్రేమలో వారి అలసటను, ఆగ్రహమును పూర్తిగా మరచిరి వారి పుత్రులను అదుముకుని కౌగిలించుకొనగా, వారి అలసట అంతయు మాయమయ్యెను. పుత్రులను విడిచి వెళ్ళునపుడు వారి కన్నులు అశ్రువులతో నిండెను ఆవులను విడిచి వారు అయిష్టముగా కదలి వెళ్ళిరి

బలరాముడు నిలిచియుండి, గోవులు, గోపాలురు ప్రదర్శించుచున్న అసామాన్య ప్రేమను గమనించుచుండెను అతనికి ఆశ్చర్యము కలిగెను దూరముగా నిలిచి యోచించుచుండెను అతడు కూడ గోప బాలుర యెడ ప్రేమతో ఆకృష్టుడగు చున్నట్లు భావించెను. ప్రేమతో కూడిన యిట్టి ఆకర్షణ యింతవరకు కృష్ణుని యందు మాత్రమే గలదు. ఈ భావము కలుగుటతోడనే ఆశ్చర్యపడి తనలో తానిట్లనుకొనెను ''ఇది దేవతల మాయ అగునా? లేక మానవుల భ్రమయేనా? లేక అసురుల మాయ కాగలదా? కాదు. ఎన్నటికిని కాజాలదు. నేను కూడ యీ ప్రేమలో చిక్కుకున్నాను దేవతలుగాని, అసురులుగాని నా మనసుపై యెట్టి ప్రభావము చూపలేరు ఇది కృష్ణుడు మాత్రమే అలవరుచుకొన్న ఆకర్షణ ఇంకెవరును యిట్లు ప్రేమతో ఆకర్షించలేరు'' కృష్ణుని వద్దకు వెళ్ళి యిట్లనెను. ''కొంతసేపటి వరకు యిది దేవతలు లేక అసురుల చర్య యని, లేక మంత్రశక్తులు కలిగిన మానవుల కార్యమని తలచినాను కాని ఇది నీ వల్లనే, నీ శక్తి సామర్థ్యముల చేతనే యీ చిత్రాతి సంఘటనలు జరుగుచున్నవని గ్రహించినాను. కృష్ణా! యిదంతయు యెందులకు? నాకు చెప్పుము వారందరు యెచ్చట నున్నారు? ఇంకను యెంతకాలము యీ ఆట కొనసాగగలదు?''

కృష్ణుడు వెనుకటి వృత్తాంతమును వివరించెను. వారట్లు మాట్లాడుకొనుచుండగా, దీనికి ముఖ్యకారకుడైన బ్రహ్మ యేమి జరుగుచున్నదో చూచుటకు వచ్చెను. ఇంతలో అతనికి సిగ్గుపడవలసిన అనుభవము కలిగెను. ఇంకను అతడందు నుంచి తేరుకొనకుండెను.

## 168 బ్రహ్మదేవుని విచారము

ఆవుదూడలను గోపబాలురను అపహరించి గుహలో దాచివేసిన పిమ్మట బ్రహ్మ తన స్వస్థానమైన సత్యలోకమునకు వెళ్ళెను ద్వారపాలకులు బ్రహ్మను చూచి లోపల ప్రవేశించుటకు అనుమతి నిరాకరించిరి వారి అవిధేయతకు ఆశ్చర్యము చెంది బ్రహ్మ యిట్లనెను. ''ఏమిటి యీ ఆట? నేను బ్రహ్మను నా స్వగృహములో నేను ప్రవేశించుచున్నాను. నా సేవకులైన మీరిరువురూ నన్నడ్డగింతురా? ఇది పరాచికము కానిచో నాకు ఆగ్రహము వచ్చెడిది'' ద్వారపాలకులు నవ్వి యిట్లనిరి ''ఇంతకు ముందెన్నడూ నిన్ను మేము చూచి యుండలేదు. నీవు ప్రవేశించుట తగదు నీవు మా ప్రభువు వేషము ధరించితివి. కాని నీవు మా ప్రభువు కావని మాకు తెలియును. మా ప్రభువు లోపలనే యున్నాడు'' ''లోపలనున్నాడా?. ఇది నేను నమ్మను'' అని బ్రహ్మ గట్టిగా అరచెను. ''సరే. మమ్ములను నమ్మకున్నచో నీకు నీవే చూడగలవు'' అని నవ్వుచు ఆ ద్వారపాలకులు బ్రహ్మ ఒక సన్నని రంధ్రము ద్వారా న[illegible] కు అంగీకరించిరి.

దేవతలు ఋషుల మధ్య తనవలెనే యున్న మరొక వ్యక్తి ఉన్నతాసనముపై కూర్చుని యుండుట బ్రహ్మ జూచెను సరస్వతి వీణ వాయించుచుండెను మందిరములో వీణానాదము తప్ప యింకే శబ్దము వినిపించక నిశ్శబ్దముగా నుండెను.

జరిగిన అవమానము తట్టుకొనలేక బ్రహ్మ బృందావనములో యేమి జరుగుచున్నదో చూచుటకు వెళ్ళెను కృష్ణుని చర్యను కన్నులార చూచెను ప్రతిరోజు యధావిధిగా కృష్ణుడు, బలరాముడు, యితర గోపాలురు తమ ఆవు దూడలతో వెళ్ళుట గమనించెను. కనులు నులుముకుని బ్రహ్మ తనలో తానిట్లనుకొనెను. ''గోప బాలురు, ఆవుదూడలతో గుహలో నిద్రపోవుచున్నారు. మరివారు యిక్కడ కృష్ణునితో యెట్లుండిరి?'' ఒకవేళ గుహలో అవియుండుట జూచి కృష్ణుడు వాటిని విడిపించెనేమో యని తలచి గుహ వద్దకు వెళ్ళెను. కాని అవి గుహలో దీర్ఘ నిద్రలో నుండెను ఇది యెట్లు సంభవమూ యని బ్రహ్మ తీవ్రముగా ఆలోచించినప్పటికిని అంతుపట్టకుండెను భగవంతుని మాయచేత బ్రహ్మ మనస్సు అయోమయముగా నుండెను అవిద్యయను చీకటిలో చిక్కుకొనెను. సూర్యుని ప్రకాశము ముందు మెరుగుడు పురుగు ప్రకాశమువలె, యీ విచిత్రమును అర్థము చేసుకొనుటకు బ్రహ్మ చేసిన ప్రయత్నములన్నియు వ్యర్థమయ్యెను

బ్రహ్మ తెలివితక్కువ తనము జూచి కృష్ణుడు జాలిపడెను ప్రతి ఆవుదూడ, ప్రతి ఒక్క బాలుడు నల్లని మేఘ వర్ణములో పసుపుపచ్చని పీతాంబరము ధరించి, చదుర్భుజములు గలిగి నాలుగు చేతులందు శంఖ చక్ర గదా పద్మములు ఉన్నట్లుగా బహ్మకు జూపట్టెను. భక్తుల శ్రేయస్సుకై నిరాకారుడైన భగవంతుడు సాకారుడుగా అవతరించుట బ్రహ్మ జూచెను తన కండ్లముందు అనేక నారాయణ రూపములు గాంచుచున్న బ్రహ్మ శిలవలె స్తంభించి నిలుచుని యుండెను బ్రహ్మకు తన అహంభావమును గుర్తుచేయవలసిన సమయము

ఆసన్నమైనదని కృష్ణుడు తలచి తగిన గుణపాఠము చెప్పుటకు నిశ్చయించుకొనెను. నారాయణుడు ధరించిన దూడల, బాలుర రూపములు అదృశ్యమై, ఆవుదూడలు, గోపబాలురు వాని వాని స్థానమును పొందుట బ్రహ్మ ప్రత్యక్షముగా తిలకించెను. బ్రహ్మ తన అజ్ఞానమునకు సిగ్గుపడి, కృష్ణుని పాదములపైబడి క్షమించమని ప్రార్థించెను. భగవంతుని సహజ స్వభావమును తెలియక, అజ్ఞానముతో తెలివితక్కువగా ప్రవర్తించినందుకు మన్నించమని బ్రహ్మ పదేపదే వేడుకొనెను. ఆ తర్వాత శ్రీకృష్ణుని చుట్టును మూడుసార్లు ప్రదక్షిణము చేసెను. తనకంటె ఉన్నతులైన వారిని యీ విధముగా గౌరవించుట సనాతన సంప్రదాయము. గర్వము అణగిన బ్రహ్మ తిరిగి సత్యలోకమునకు వెళ్ళెను.

బ్రహ్మ వదలిపెట్టిన ఆవుదూడలను తీసుకుని కృష్ణుడు తనతోటి బాలురను వదలిపెట్టిన ప్రదేశమునకు వెళ్ళెను. వారందరు కృష్ణునికై వేచియుండిరి. వారు కృష్ణునితో యిట్లనిరి. ''కృష్ణా! ఈ దూడలను అతితొందరగా పట్టి తెచ్చితివే! మేమింకా ఒక ముద్దయైననూ భుజించలేదు. నీవు తొందరగా వచ్చితివి. తొందరగా రమ్మా. భోజనము పూర్తిచేసి మరల ఆటలాడుదము''. కృష్ణుడు అందరినీ ఆకర్షించే చిరునవ్వు నవ్వి, తన యెడమ చేతిలో మిగిలియున్న పెరుగు అన్నము తినుట పూర్తి గావించెను.

దారిలో నున్న పువ్వులను త్రెంపి వాటిని దండగా కట్టి తన అందమైన మెడలో వైచికొనెను. నెమలికుండే రెక్కనొకదానిని ఊడదీసి దానిని జుట్టులో తురిమెను. ముఖమునకు తెల్లని ముత్యపు చిప్పపొడిని రుద్ది వేణువు నూదుచూ. తోటి బాలురు సన్నాయి డోలు వాయించుచుండగా, కృష్ణుడు బృందావనము ప్రవేశించెను.

బాలురు తమ తమ యిండ్లకేగి, తల్లిదండ్రులతో కృష్ణుడు తమను యెట్లు పాము కోరల నుండి రక్షించెనో, పామును యెట్లు చంపెనో, తామందరూ చచ్చిన పాము కడుపునుండి బయటకెట్లు వచ్చిరో వివరించి చెప్పిరి.

## 169 బలరాముడు ధేనుకుని చంపుట

కృష్ణుని వయస్సు ఆరు సంవత్సరములు. తోటి బాలురుకు కూడ అదే వయస్సు. ఆవులు గడ్డిమేయుటకై తోలుకొని వెళ్ళదగిన వయస్సు వచ్చెను. కృష్ణుడు అడుగుపెట్టిన ప్రదేశమంతయు పునీతమయ్యెను. బృందావనములో గోవులను గడ్డి మేయుటకై తోలుకొని వెళ్ళుట వారి నిత్యకృత్యమయ్యెను. వేణువు నూదుటలో ప్రజ్ఞాశాలి అయ్యెను. తన స్నేహితులను, ఆవులను చేరదీసి, భోజనమైన పిదప, వేణుగానముతో వారి నోలలాడించు చుండెను.

ఒకరోజు బలరాముడు కృష్ణుడు ప్రతిరోజువలె వారి బలగముతో అరణ్యములో ప్రవేశించిరి. పుష్పములు ప్రతిచోట కానవచ్చుచుండెను. లేళ్ళు అటునిటు పరుగెత్తుచుండెను. పక్షుల సంగీతము, తుమ్మెదల ఝుంకారము చెవుల కింపుగా నుండెను. నదిలో నీరు నెమ్మదిగా ప్రవహించుచుండెను. అక్కడి వాతావరణము, మహాపురుషుల మనస్సువలె, అత్యంత ప్రశాంతతతో నిండియుండెను. కృష్ణుడు బలరాముని పిలిచి యిట్లనెను. ''అన్నా! ఈ అరణ్యము చూడుము. పుష్పములతో నిండిన యీ చెట్లను చూడుము. పువ్వులతో నిండిన కొమ్మల బరువుకు వంగి భూమిని తాకుచున్నట్లున్నది. అవి నీ పాదములపైబడి పూర్వజన్మలో చేసిన పాపములకు యీ జన్మలో చెట్టుగా పుట్టి పాప విముక్తి గావించుమని కోరుచున్నట్లు ఉన్నది. తుమ్మెదలు

నిన్ను స్తుతించుచున్నట్లున్నది. ఈ లోకమును పాప రహితము గావించుటకు అవతరించినావని వానికి తెలిసినట్లున్నది ఈ అరణ్యములో ఋషులు కానవచ్చుటలేదు. బహుశః వారు యీ చెట్లలోనో, పక్షులలోనో, తుమ్మెదలలోనో దాగి యుండవచ్చును. ఆ నెమలి ఆనందముగా యెట్లు నృత్యము చేయుచున్నదో! దాని తోక యెంత అందముగా నున్నదో గదా! ఆ లేళ్ళ మందలు భయపడుచున్న కన్యల వలె కదలుచు పరుగెత్తుచున్నవి. కోకిలలు నిన్ను స్తుతించుచు గానము చేయుచున్నవి. నీ పాదములు యీ ప్రదేశము నందు సంచరించుటచే బృందావనము నిజముగా పావనమైనది''. బలరాముడు నవ్వుచు కృష్ణుడు చెప్పిన వానిని స్వీకరించెను. కృష్ణు డీవిధముగ ఆవేశముతో ప్రేమపూరితమైన భావముతో పలుకుట బహు అరుదు. మిగిలిన బాలురతో కలిసి వారు ఆవులను మేపుటకు అరణ్యములోనికి వెళ్ళిరి. కృష్ణుడు పదే పదే అన్న బలరాముని చూచి చిరునవ్వు నవ్వుచుండెను

కృష్ణుడు ఉల్లాసముతో సంచరించుచుండెను నెమళ్ళతో కలిసి నృత్యము చేయుచుండెను. లేళ్లతో పరుగుత్తుచుండెను తుమ్మెదలతో సరిసమానముగా ఝుంకారము చేయుచుండెను ఆవులు దూరముగాపోయి మేయుచుండెను. మేఘ గర్జనతో అతడు గోవులను పేరు పేరున పిలువగా అవి అటు నిటు పరుగెత్తుచు యెప్పటివలె చరించుచుండెను.

బలరాముడు అలసిపోయెను కృష్ణుడు తన ఒడిలో బలరాముని పరుండబెట్టుకుని కాళ్ళు ఒత్తసాగెను.

శ్రీధామ, సుబాల, స్తోక కృష్ణ అను ముప్పురు కృష్ణునికి అత్యంత ప్రియమైన స్నేహితులు వారు కృష్ణుని వద్దకు వచ్చి యిట్లనిరి. ''చూడు కృష్ణా! దగ్గరలోనే అందమైన తాటి తోపు గలదు మంచి పండిన ఫలములు గలవు కొన్ని నేలపై రాలినవి. మరికొన్ని చెట్లకు వ్రేలాడుచున్నవి. అవి చాల రుచికరమైనవి కాని ఆ తోటను ధేనుకాసురుడనే రాక్షసుడు అచట వసించుచు కావలి కాయుచుండుటచే మనకు ఆ ఫలములు లభ్యము కావు. నీవు, బలరాముడు శక్తిమంతులు. మీరు ఆ రాక్షసుని చంపగలరు. కాని ఒక హెచ్చరిక. ధేనుకుడు ఒక్కడే అచట ఉండుటలేదు అతని బంధు బలగము అనుయాయులు కూడ కలరు. వారు కూడ ధేనుకుని వలె అతి భయంకరమైనవారు. ధేనుకుడు నరమాంసమును భక్షించుటచే ఆ తోపులోనికి వెళ్ళుట కెవరికీ ధైర్యము చాలదు

''కాని ఆ పండిన పండ్ల సువాసనలు వాటిని తినవలెనని నోరూరించుచున్నవి ఆ పండ్లను రుచి చూడవలెనని యున్నది. మీరిద్దరు మాత్రమే మా కోరికను తీర్చగలరు. ఆ పండ్లను మాకు తెచ్చి యివ్వగలరా?''

వారు కోరిన ఆ చిన్న కోరికకు బలరామకృష్ణులు నవ్వుకొనిరి వెంటనే వారు తాటి తోపు దిక్కుగా, ఆనందముతో గంతులు వేయుచున్న యితర బాలురు వెంటరాగా, వెళ్ళిరి

తాటి తోపులో ప్రవేశించగనే బలరాముడు పండ్లను తెచ్చు కార్యములో నిమగ్నమయ్యెను తన బలమైన, శక్తిమంతమైన బాహువులతో ఒకొక్క చెట్టును కుదుపగా, పండ్లు నేలపై రాలెను నేల యంతయు పండ్లతో పరచిన తివాసివలె గోచరించుచుండెను గోప బాలురందరూ వడివడిగా పండ్ల నేరుకొనుచుండిరి బలరాముడు చెట్లను కుదిపిన శబ్దము విని, ఆడ గాడిద రూపములో నున్న ధేనుకాసురుడు తొందరగా ఆ ప్రదేశమునకు వచ్చెను అతడు వేసిన అడుగులకు భూమి దద్దరిల్లెను

ధేనుకుడు వడివడిగా బలరాముని సమీపించి భయంకరమైన కేక పెట్టి బలరాముని గుండెలపై తన్ని చుట్టూ పరుగెత్తుచుండెను మరల మరల బలరాముని వద్దకు వచ్చి వెనుక కాళ్ళ నెత్తి తన్ని చంపుటకు ప్రయత్నించెను బలరాముడు రాక్షసుని వెనక రెండు కాళ్ళను పట్టుకొనెను అట్లు పట్టుకుని మీదకెత్తి గిరిగిర త్రిప్పి చెట్ల మీదకు విసరెను ధేనుకుడు చచ్చి నేలపై పడెను. అతనితోపాటు చెట్లు కూడ నేల కొరిగెను. ఒక చెట్టు పక్క దానిపై పడగా, అది దాని పక్కనున్న దానిపై పడి, యిట్లు అన్నీ పెనుగాలికి ఊగిపడినట్లుగా పడెను

ఆదిశేషుడు లోకమంతటను వ్యాపించియుండెను ఒక చిన్న వస్త్రము దూదిపోగు దారముతో నేయబడి నట్లు, యీ లోకమంతయు నారాయణుని వేరొక అంశమైన ఆదిశేషునితో నిండియున్నది అట్టితరి, బలరాముని చర్య యెవరికైనను ఆశ్చర్యము గొలుపునా?

ధేనుకుని అనుయాయులు బంధు బలగము తమ యజమాని ఒక చిన్న బాలుని చేతిలో మృతినొందుట చూచి, పగ తీర్చుకొనుటకై బలరామకృష్ణులపై కెగబడిరి బలరామకృష్ణులు కదలక నిలుచున్న చోటనే యుండి, ఒకొక్క రాక్షసుడు దగ్గరకు సమీపించగా వాని కాళ్ళు పట్టుకుని గిర గిర త్రిప్పి చెట్ల మీదకు విసరివేయుచుండిరి.

చెట్లకు పండి ' ్చిపోయిన అసురుల కళేబరములు వ్రేలాడుచుండెను బలరామకృష్ణుల సాహస చర్యలను దేవతలు మెచ్చుకొనిరి

సాయంకాలము గోప బాలురు బలరామకృష్ణులతో కలసి బృందావనముకు తిరిగి వచ్చిరి వచ్చిన వెంటనే తల్లులందరును కృష్ణుని - యెర్రమట్టితో శరీరము జుట్టు యెర్రగా అందముగా నున్న కృష్ణుని, తలలో నెమలి ఈకను తురిమి అందముగా గోచరించుచున్న కృష్ణుని, అడవి పువ్వులతో కట్టిన వనమాల అనే హారమును మెడలో ధరించిన కృష్ణుని, యెల్లపుడూ పెదవులందు చిరునవ్వు చిందు కృష్ణుని - చూచుటకు వచ్చిరి ప్రతి సాయంకాలమును అందమైన కృష్ణుని దర్శించుటకు గోపాలురు, గోపికలు వేచి చూచుచుందురు.

## 170 విషపూరితమైన సరస్సు

ప్రతిదినము వలెనే ఆ దినమును కృష్ణుడు తోటి బాలురతో ఆవులను తోలుకుని యమునా తీరమునకు వెళ్ళెను. ఆ రోజు బలరాముడు వారితో వెళ్ళలేదు వారికి యిష్టమైన ప్రదేశములో కూర్చుని ఆడుచు, నవ్వుచు మాట్లడుకొనుచుండిరి. ఎండ చాల తీవ్రముగ నుండెను. గోవులు తమకు తాము యిష్టము వచ్చినట్లు సంచరించుచుండెను కొంతమంది బాలురు యమున వైపుగా వెళ్ళిరి. వారు మిక్కిలి దప్పికతో నుండుటచే, యే ప్రదేశమున త్రాగుచుండిరో యోచించలేదు

యమునా నదీ తీర సమీపములో 'మధు' అను సరస్సు ఒకటి గిలదు ఆ సరస్సులో కాళీయుడను భయంకర సర్పము నివసించుచుండెను ఆ సర్పము మధు సరస్సులోని నీటిని విషపూరితము గావించెను ఆ సరస్సులోని నీరును త్రాగినవారు జీవింపజాలరు అందులోనీ నీరు అంతగా విషపూరితమయ్యెను. దప్పిక తీర్చుకొను ఆత్రములో ఆ గోప బాలురు మధు సరస్సులోని నీరు విషపూరిత మయ్యెనను హెచ్చరికను

మరచిపోయి, ఆ నీటిని కడుపునిండుగా త్రాగిరి. గోవులు కూడ అట్లే దాహము తీర్చుకొనెను. తక్షణమే వారు తెలివి తప్పి చచ్చి పడిపోయిరి. ఆ సరస్సులోని విషము తీవ్రతకు, అచ్చట నుండి వీచు గాలిని, పైన యెగిరే పక్షులు పీల్చి క్రిందపడి చనిపోవుచుండెడివి.

కొంతసేపటికి కృష్ణుడు దాహము తీర్చుకొనుటకు వెళ్ళిన బాలురు, గోవులు తిరిగి రాకుండుట గమనించెను. వెంటనే కృష్ణుడు లేచెను. మిగిలిన బాలురు కూడ లేచిరి. అంతకు ముందు వెళ్ళిన బాలుర అడుగుజాడల ననుసరించి ఆ మార్గమునే వీరు కూడ వెళ్ళసాగిరి. అట్లు వారు యమునా నదివైపుగా వెళ్ళిరి. దాహము తీర్చుకొనుటకై వారు ఆ మార్గమున వెళ్ళుటలో ఆశ్చర్యము లేదు. కాని కొద్దిగా మార్గము తప్పియుండెను కొన్ని క్షణములు వెదకిన తర్వాత, స్పృహతప్పి చచ్చిపోయినట్లు పడియున్న కొందరు బాలురను కృష్ణుడు చూచెను గోవులు కూడ చచ్చి పడియున్నట్లు తెలివిలేక పడియుండెను.

కృష్ణుని ఆగ్రహమునకు అవధులు లేకుండెను. మధు సరస్సును జూచెను. నీలవర్ణపు యమునా జలము మధు సరస్సులోనికి ప్రవహించి, అనేక సంవత్సరములుగా కాళీయుడు నిత్యమూ విడిచిపుచ్చే విషవాయువుచేత, నల్లగా మారెను. ఆ జలము వేడిగా నురుగువలె నుండెను. ఆ బాధాకర దృశ్యమును వారు చూచుచు నిలుచుండిరి. ఇంతలో తోటి బాలురు ఆ దృశ్యమును చూచి కలిగిన బాధతో యేడ్చుచున్న శబ్దము వినిపించెను ''ఆహా! ఏమి యీ దుస్సంఘటన! మన స్నేహితులు, చెలికాండ్రు చనిపోయిరి. మన గోవులు కూడ చచ్చిపడియున్నవి! ఆలోచించక, యీ కాళీయుని మడుగులోని నీటిని త్రాగి యుందురు. వారు లేకుండ మనము యిండ్లకు యెట్లు వెళ్ళగలము? వారు లేకుండ మనమెట్లు జీవించగలము? ఇప్పుడేమి చేయుదము?'' వారట్లు విచారముతో నిస్పృహతో యేడ్చుచుండిరి. వారి కనుల నుండి అశ్రువులు ఏకధారగా వర్షించుచుండెను

కృష్ణుడు నిలిచి యుండి చుట్టును పరికించి చూచెను. మధు సరస్సు ఒడ్డున కొన్ని వృక్షములు మాత్రమే యున్నవి. ఆ సరస్సులోని విషవాయువు వలన వృక్షములు చాల కాలము క్రితమే యెండి చచ్చిపోయినవి. ఎండిపోయి మోడువారిన చెట్లను చూచిన వారికి విచారము కలుగును. ఒకప్పుడు మంచి శక్తి బలము ఉండి యిప్పుడవి సడలిపోయిన మానవులవలె నున్నవి

వాటిలో మిక్కిలి పొడవుగా నున్న కదంబ వృక్షము నొకదానిని కృష్ణుడు చూచెను. ఆ వృక్షమునకు మాత్రమే కొమ్మలు విషవాయువు ప్రభావము పడక మిగిలియున్నవి. దీనికొక కథ గలదు. ఒకప్పుడు గరుడుడు అమృత కలశమును, తన సోదరులను మెప్పించి తల్లిని బంధ విముక్తి గావించుటకై యీ భూమి మీదకు తెచ్చినపుడు కొంతసేపు యీ కదంబ వృక్షముపై విశ్రమించెను. ఆ కారణముచేత కాళీయుని విష ప్రభావము యీ వృక్షముపై పడక యుండెను. దృఢముగా నున్న ఆ కదంబ వృక్షముపైకి కృష్ణుడు యెక్కెను. తోటి బాలురందరూ ఆశ్చర్యముతో చూచుచుండిరి. కృష్ణుడేమి చేయదలచెనో వారికి తెలియదు. కృష్ణుని చేతి సంజ్ఞలు వారికిట్లు చెప్పుచున్నట్లుండెను. ''భయపడక అక్కడే ఉండుడు. నేను యీ సమస్యను పరిష్కరించె దను. మీరందరను అక్కడే నిలిచి యుండి గమనించుడు''.

వారట్లు చూచుచుండగనే కృష్ణుడు వారివైపు ఒకసారి చూచి చెట్టు చివరకు యెక్కెను. ఆ బాలురందరూ ఒక విచిత్ర దృశ్యమును గాంచుచుండిరి కృష్ణుని చిన్ని పాదములు చెట్టును స్పృశించిన ప్రతిచోటను చిగురించుట ప్రారంభించెను కొద్దిసేపటికి ఆ కదంబ వృక్షము ఆకుపచ్చని ఆకులు, తియ్యని కడిమి పూల

వాసనలతో కళకళ లాడుచుండెను. ఆ బాలురు ఆశ్చర్యముతో కనులు మరింత పెద్దవి చేసుకుని చూచుచుండగ కృష్ణుడు ఆ వృక్షముపై నుండి గెంతెను. ఆ వృక్షము చివర కొమ్మను ఊతగా చేసుకుని మధు సరస్సులోనికి దూకెను.

ఇదంతయు గమనించుచున్న బాలురు భయభ్రాంతులైరి. కొద్ది నిమిషములలో కృష్ణుడు మరణించునని వారు తలచిరి. కొందరు బాలురు నందుని యింటికి వెళ్ళి జరిగిన దంతయు వివరించి చెప్పిరి లోపలి గదిలో నున్న యశోద బయటకు వచ్చి, ''గోవులు, కొందరు బాలురు కాళీయుని మడుగులోని నీటిని త్రాగి ఒడ్డున చచ్చిపడియున్నారు. అది చూచి కృష్ణుడు ఆ మడుగులోనికి దుమికెను. అతడు చనిపోవనున్నాడు! కృష్ణుడు చనిపోవనున్నాడు'' అని ఆ బాలురు చెప్పుచున్న విషయము వినెను

యశోద వెంటనే మూర్ఛపోయెను. ఆమెను కొందరు సేద దేర్చుచుండిరి నందుని పరిస్థితి కూడ జాలిని పుట్టించుచుండెను వారి జీవనజ్యోతి అంతరించెను. ఇక జీవించుట యెందుకు? అని వారు వగర్చుచు యేడ్చుచుండిరి. ఈ దుర్భర వార్త బృందావన మంతయు వ్యాపించెను. ప్రతి గృహము విచారముతో నిండెను. ఎవ్వరును కూడ తమ పుత్రుడు, తమ గోవులు మరణించెనని ఆలోచించకుండిరి వారి విచారమంతయు కృష్ణుని కేమి ఆపద వాటిల్లునో యని మాత్రమే. భయంకర కాళీయ సర్పము చేతిలో కృష్ణుడు చిక్కెనని వారు దుఃఖించుచుండిరి

అందరును యమునా నదీ తీరమునకు పరుగెత్తిరి. పెద్దవాడైన అన్న బలరాముని రక్షణ లేకుండ కృష్ణుని ఆనాడు బయటకు వెళ్ళనివ్వక ఆపి యుండవలసిదని వారందరును తలచిరి. అనేక లీలలు జరిపినప్పటికిని, వారికింకను కృష్ణుని గురించి తెలియలేదు. సాక్షాత్తు నారాయణుడే యని వారు తెలియలేకుండిరి! వారి దృష్టిలో కృష్ణుడు అందరిని ఆకర్షించు బాలుడు, అతనికి సంభవించిన అనేక ఆపదలు నారాయణుని అనుగ్రహముచేతను, తల్లిదండ్రుల అదృష్టము చేతను తప్పెనని వారు భావించుచుండిరి బలరాముడు లేకుండుటచే యేమి జరిగెనో చూడుడు! ఏమి జరిగెనో!

బలరాముడు అంతయూ వినుచు తనలో తాను నవ్వుకొనెను కృష్ణుడెవరో, తానెవరో బలరామునకు తెలియును ఈ దేవ రహస్యము - కృష్ణుడు, తాను కూడ యే ప్రయోజనము కొరకై జన్మించిరో - బలరాముడు వారికి చెప్పలేకుండెను.

ఒక మాటయినను మాట్లాడక బలరాముడు కూడ బృందావనవాసులతో కలసి యమునా నదీ తీరమునకు వెళ్ళి కాళీయుని మడుగు ఒడ్డున నిలిచి యుండెను

## 171 కాళీయుడు

ఇట్లుండగా నడుము బిగించి మడుగులో కృష్ణుడు దుమికెను అతని రెండు చేతులును కాళీయుని మృత్యువు కప్పగించుటకు పిలుచుచున్నట్లుండెను కృష్ణుడు దూకిన వెంటనే ఆ సరస్సుకు చైతన్యము వచ్చినట్లయ్యెను. ప్రశాంతముగా నున్న సరస్సులో ఉద్భుతమైన అలలు చెరేగెను ఎత్తున లేచిన ఆ సరస్సులోని నీరు కృష్ణుని

తమ బాహువుల లోనికి తీసుకొనుచున్నట్లు గోచరించెను. ఆ అలలు కృష్ణుని కబళించి అట్టడుగునకు చీకటిలోనికి తీసుకొనిపోవుటకు ప్రయత్నించుచున్నట్లు ఉండెను. కృష్ణుడు ఆ సరస్సులో స్వేచ్ఛగా ఈతకొట్టుచూ, ఆటలాడుచున్నట్లుండెను

అనేక సంవత్సరములుగా ఆ సరస్సు నిశ్చలముగా పైకి కన్పట్టుచుండెను. ఒక్కసారి ఆ ప్రశాంతతకు అంతరాయము కలిగినట్లు కాళీయుడు భావించెను. సరస్సు ఉపరితలముపై యేదో కదలుచున్నట్లు కాళీయునకు తోచెను. కాని లక్ష్యపెట్టక, సరస్సు అడుగున అలవాటు ప్రకారముండెను. కొంతసేపయిన తర్వాత సరస్సులో నీటిని యెవరో చిలుకుచున్నట్లు, దాని వలన కలిగిన విపరీతమైన కదలికచేత తాను అటు నిటు ఊగుచున్నట్లు కాళీయుడు భావించెను. ఇదివరకెన్నడును యిట్లు జరగనందువలన, కాళీయుడు అచ్చెరువొంది, తన విపుల శరీరమును కదల్చి, సరస్సు ఉపరి భాగము పైకి వచ్చుటకు ప్రయత్నించెను. ఇంతవరకు సరస్సు చుట్టు ప్రక్కలకు వచ్చుట కెవరికీ ధైర్యము లేకపోయెను ఈరోజు అందుకు భిన్నముగా నుండెను!

కాళీయుడు తన అయిదు తలలను పైకెత్తి యీ మానవ ప్రపంచమును చూచెను సరస్సు ఒడ్డును గాంచెను వందల కొలదీ స్త్రీ పురుషులు విచారముతో యేడ్చుచుండుట చూచెను అనేకులు గుండెలు బాదుకొని విలపించుచుండిరి. కొందరు స్త్రీలు సరస్సులో దూకి ఆత్మహత్య చేసుకొనుటకు ప్రయత్నించుచుండగా, పురుషులు వారిని అడ్డగించి నివారించుచుండిరి. వారందరిలో ఒక స్త్రీ ప్రత్యేకముగా గుండెలు పగులునట్లు విచారించుచుండెను ఆమె యిట్లను చుండెను "కృష్ణా! కుమారా! నీవు మరణించిన వెనుక మేము జీవించి ప్రయోజనమేమి? నిన్ను కాళీయుడు చంపును నేను కూడ అతని చేతనే చచ్చిపోయెదను. కుమారుని పోగొట్టుకున్న నాకు జీవితముపై ఆశలేదు". బలరాముడు, న ... డిరి. బలరాముడు ఆమెతో యిట్లనెను "అమ్మా! కృష్ణుడు యెవ్వరి చేతను చావడు అది అంత తేలికకాదు అనేక సంవత్సరములుగా ఈ యమునా నదీ జలమును విషమయము గావించిన కాళీయుని శిక్షించుటకు కృష్ణుడు నిశ్చయించుకొనెను గోవులు, గోప బాలురు కాళీయునిచేత చచ్చిరి. అందుచేత కాళీయుని శిక్షించుట సముచితము కృష్ణుడు మడుగులో దూకుటకు అదియే కారణము. అమ్మా! కొంచెముసేపు ఓపిక పట్టుము కృష్ణుడు విజయము సాధించి రాగలడు గమనించి చూడుము"

ఇంతవరకు కృష్ణుడు సరస్సు అడుగుననే యీదుచుండెను. అందుచే యెవరికిని కనుపించకుండెను. తూర్పున ఉదయించు చంద్రుని వలె కృష్ణుడు సరస్సు ఉపరి భాగము పైకి వచ్చెను ఒక బాలుడు సరస్సు అడుగునుండి పైకి వచ్చుట కాళీయుడు చూచెను. ఆ బాలుడు పసుపు పచ్చని పట్టు వస్త్రము ధరించి యుండెను కాళీయ మడుగులోని నీటిచే పూర్తిగా తడిసిపోయెను. అతని వక్షముపై అందమైన పుట్టుమచ్చ గలదు ముఖమున దివ్యహాసరేఖలు ప్రసరించుచుండెను భయముకాని, ఆందోళనకాని లేశమైనను యెక్కడను ఆ బాలుని ముఖమందు గోచరించుటలేదు అతి అందముగా ఆకర్షణీయముగా కన్పడుచుండెను. ఒక క్షణ కాలము, భయంకరమైన కాళీయుడు కూడ కృష్ణుని అందచందములు జూచి దిగ్భ్రాంతుడయ్యెను కాని వెంటనే కృష్ణునిపై విరుచుకుపడెను కృష్ణుని పట్టుకుని చుట్టు చుట్టుకొనెను తన అయిదు శిరస్సుల నుండి విషమును కృష్ణునిపై కక్కుచుండెను తన కోరలతో కృష్ణుని శరీరమంతటను కరచెను ఒడ్డున నిలబడినవారు యీ భయంకర దృశ్యమును గాంచుచు, కొద్ది క్షణములలో కృష్ణుడు మరణించి సరస్సులోని నల్లటి జలములో కలిసిపోవునేమోయను భయముతో చూచుచుండిరి ఈ ఘోర దృశ్యమును చూడజాలక కొందరు తెలివితప్పి పడిపోయిరి నందుడు మూర్ఛపోయెను. బలరాముడు ఒక్కడే యశోదను, రోహిణిని సరస్సులోనికి

దూకనీయక అడ్డుపడుచుండెను. వారివి ధైర్యవచనములతో సేద దీర్చుచుండెను. వారు బలరాముని మాటలు నమ్మలేకుండిరి కాళీయుని కోరలకు చిక్కిన వారిగతి యేమగునో వారికి తెలియును

నందుడు మూర్ఛనుండి లేచి, సరస్సులో దూకి ఆత్మహత్య చేసుకొనుటకు ప్రయత్నించెను. వారినందరిని ఆ సరస్సుకు దూరముగా నుంచుట బలరామునికి చాల కష్టమయ్యెను.

కొంతసేపు యీ విధముగా - కాళీయుని కోరలలో తాను చిక్కుకున్నట్లు, మృత్యువు వాత పడబోవుచున్నట్లు - కృష్ణుడు జరుగనిచ్చెను. కాళీయుడు కూడ కృష్ణునికి అంతిమ ఘడియలు సమీపించెనని భావించెను. ఒక్కసారిగా యేదో చెప్పరానిది జరుగుబోవుచున్నదని కాళీయుడు తలచెను. ఏదో పెద్ద బరువు తనను క్రిందకు అణగ ద్రొక్కుచున్నట్లు తోచెను. ఎవరో తనను ముక్కలు ముక్కలుగా చేధించుచున్న భావము కలిగెను. కృష్ణుడు తన శరీరమును పెంచుచుండుట, అతనిని పట్టుకొని యుండుట అసాధ్యమగుచుండుట కాళీయుడు గాంచెను. కాళీయుడు తన పట్టును మరింత బిగించుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను కృష్ణుడు కాళీయుని పట్టునుండి సులభముగా తప్పించుకొనెను. ఈ దృశ్యము చూచినవారు తిరిగి జీవితము చిగురించినట్లుగా భావించిరి నిస్పృహతో నున్నవారిలో యిప్పుడు కుతూహలము రేకెత్తెను. ఆశ్చర్యముతో యేమి జరుగునో యని వారందరును చూచుచుండిరి. కాళీయుని పట్టునుండి తప్పించుకున్న కృష్ణుని చూచిన ' ' రేఖలు ప్రకాశించుచున్నట్లు గోచరించెను ''తొందరగా రా! తొందరగా రా! కృష్ణా!'' అని వారు యేక కంఠముతో కేక పెట్టిరి ''ఒడ్డుకు రా! నిన్ను మేము బయటకు లాగెదము ఈ రాక్షసుని గుప్పిట నుండి తప్పించుకుని బ్రతుకగలవు మరల పట్టుకొను లోపున రమ్ము'' అని ఒడ్డు నుండి వారు అరచుచుండిరి. వారిని జూచి కృష్ణుడు చిరునవ్వు నవ్వి, చేతులతో చేయు సంజ్ఞలు యిట్లు చెప్పుచున్నట్లుండెను. ''అక్కడే నిలిచి యుండి గమనించి చూడుడు. చాల లీలలు చూడగలరు''

కాళీయుని ఆగ్రహము అవధులు దాటెను తన అయిదు పడగలను పూర్తిగా విప్పి, సముద్రపు హోరువలె హిస్సను శబ్దము చేయుచు, అన్ని కోరలతో ఒకేమారు కరచు నుద్దేశ్యముతో కృష్ణుని మీద బడెను తన తోకతో తన్ని కృష్ణుని చరచుటకు అనేక ప్రయత్నములు చేసెను. కృష్ణుడు ప్రతిసారియు తప్పించుకొనెను. కృష్ణుడు యిచట అచట అంతటను చరించుచుండెను భయంకర కాళీయుడు తన పడగలతో కృష్ణుని వెంబడించుచుండెను తన కోరలతో కరచుటకు సిద్ధపడిన తరుణములో కృష్ణుడు తప్పించుకొనుచుండెను. ఈ విధముగా కొంతసేపు కృష్ణుడు కాళీయునితో ఆటలాడెను ఒక క్షణము అయిదుపడగలు నిశ్చలముగా నుండెను. కండ్లు అగ్నిని వెళ్ళగ్రక్కుచున్నట్లుండెను నాలుకలు విషము గ్రక్కుచుండెను కాళీయుని యెఱ్ఱని నేత్రములందు ద్వేషము తప్ప యింకేదియు కానవచ్చుటలేదు తన క్రోధముతో ఆ బాలుని దహించుటకు సిద్ధముగా నున్నట్లు గోచరించుచుండెను తనను ధిక్కరించి ధైర్యముతో ఆటలాడుచున్న కృష్ణునికి గుణపాఠము చెప్పి శిక్షించవలెనని కాళీయుడు తలచెను.

# 172 కాళీయ మర్దనము

కృష్ణుడు ఆకాశము పైకెగసి మరల కాళీయుని శిరస్సుపైకి గెంతెను. ఈ దృశ్యము అందరిలో విపరీతమైన సంచలనము కలిగించెను. సరిగా కాళీయుని శిరస్సులపై కృష్ణుడు తాండవించుచుండెను. కాళీయు డేమియు చేయలేకుండెను. కృష్ణుని పాదముల క్రిందనున్న కాళీయుడు తప్పించుకొనుటకు యెంతగానో ప్రయత్నించెను. కాళీయుని ఒక శిరస్సుపై కృష్ణుడు నిలుచుని యున్నపుడు మిగిలిన నాలుగు శిరస్సులందున్న కోరలతో కృష్ణుని కరచుటకు ప్రయత్నించెను. వెంటనే కృష్ణుని పాదములు మరొక శిరస్సుపైకి, అటు తర్వాత మరొక శిరస్సుపైకి, యిట్లు ఒక శిరస్సు నుండి మరొక శిరస్సుపైకి కృష్ణుడు గెంతుచుండెను. కొంతసేపయిన తర్వాత కృష్ణుడు కాళీయుని శిరస్సులపై నృత్యము చేయనారంభించెను. సరస్సులోని నీరు అలలుగా లేచి ఒడ్డును తాకుమూ తీయని సంగీతము వలె శబ్దము గావించుచుండెను. అలలు చేయు శబ్దము కృష్ణుని నాట్యమునకు లయ వేయుచున్నట్లుండెను. కృష్ణుని పాదములు ఉల్లాసముతో గెంతులు వేయుచు ఘల్లు ఘల్లుమని శబ్దము చేయుచుండెను. కాళీయుని శిరస్సుపై నున్న మణులు నాట్యము చేయుచున్న కృష్ణుని పాదములను ప్రకాశవంతము జేయుచున్నవి. క్రమముగా కృష్ణుడు చేయుచున్న నాట్యము స్థాయి నందుకొని పెరుగుచుండెను. కృష్ణుని నాట్యము అంతమగు సూచనలేవియు కానరాకుండెను.

కాళీయుడు తోకతో చరిచిన చరుపులు క్రమముగా తగ్గజొచ్చెను. కాళీయుడు మిక్కిలి అలసిపోవుచుండెను. అలసట స్పష్టముగా గోచరించుచుండెను. ఇంతవరకు విషమును గ్రక్కుచున్న కాళీయుడు యిపుడు రక్తము కక్కుచుండెను. కృష్ణుడు కాళీయునిపై చేయుచున్న నాట్య వైభవమును స్వర్గవాసులు చూచి మిక్కిలి ఆనందించిరి. సరస్సు ఒడ్డున నిలచియున్న బృందావనవాసులు కృష్ణుని నాట్యమున కనుగుణముగా తాళము వేయుచు చప్పట్లు చరచుచుండిరి. వారికిపుడు కృష్ణుని కేమగునో యను భయము పోయెను. కాళీయుడు ఒకొక్క శిరస్సును పైకెత్తినపుడు కృష్ణుడు ఆ శిరస్సుపైకెక్కి నాట్యము చేయుచు దాని నణచుచుండెను. ఇట్లు కొంతసేపు కొనసాగెను.

తన తలపై నాట్యము చేసి తన ననుగ్రహించుచున్నదెవరో కాళీయుడు గ్రహించెను. మనస్సులో నారాయణునకు నమస్కారము చేసెను. కృష్ణుడు దయతో కరుణించకున్నచో తన భర్త కాళీయుడు మరణించునని కాళీయుని భార్యలు తెలుసుకొనిరి. వారు సరస్సు ఉపరితలమునకు వచ్చి కృష్ణుని పూజించిరి. తమ భర్త ప్రాణములను కాపాడుమని కృష్ణుని ప్రార్థించిరి. కాళీయుని భార్యలు, పిల్లలు చేతులు జోడించి ప్రార్థించుట కృష్ణుడు చూచెను. వారిట్లనిరి. ''నీవు దేవతలకు కూడ దైవము. మా భర్తను నీవు శిక్షించుట సముచితముగా నున్నది. ఆ విషయము నిన్ను మేము ప్రశ్నించుటలేదు. దుష్టులను అణచుటయే నీ అవతార లక్ష్యము. అది నీవిపుడు గావించితివి. నీవు మమ్ము శిక్షించితివి. మా దృష్టిలో యిది శిక్ష కాదు. నీ దివ్యానుగ్రహ భాగ్యము ప్రసాదించితివి. తప్పుచేసిన వారిని శిక్షించుటలో పరమార్థము తన అనుగ్రహముచే వారిని పాప విముక్తులను గావించుటయని మేమెరుగుదుము. ఇంతకు ముందు జన్మలలో గావించిన పాపకృత్యముల కారణముగా యీ భయంకర సర్ప రూపములను మేము దాల్చవలసివచ్చెను. కాని కాళీయుడు పూర్వ జన్మలో యేదో పుణ్యము చేసి యుండవచ్చు. లేకుండినచో తన శిరస్సుపై నీ పాద పద్మములు నాట్యమాడు అదృష్టము కలుగునా? శ్రీ మహాలక్ష్మి కూడ యెన్నో పూజలు తపస్సు, నీ పాద ధూళిని స్పృశించుటకు చేయుచున్నది! అటువంటపుడు, అడుగకనే కాళీయునకు యీ మహాభాగ్యము - నీ పవిత్ర పాద స్పర్శ - కలిగెను. ఇంతకన్న

అదృష్టవంతులు వేరెవరైన కలరా? నీ పాద స్పర్శ లభించిన తర్వాత స్వర్గ సౌఖ్యము కాని, బ్రహ్మానందముగాని ఇంద్రపదవి కాని యెవరును అభిలషించరు. మా భర్తకు నీ పాద స్పర్శానందము కలిగినది హృదయ పూర్వకముగా మేము నీకు నమస్కరించుచున్నాము.

''మాకు నీ దర్శనము లభించెను. మాకు యెట్టి కోరికలు లేవు. ఈ కాళీయుని వదలిపెట్టుమని ప్రార్థించుచున్నాము. నీవు కరుణా సముద్రుడవు. క్షమా హృదయుడవు. అందులో ఒక బిందువును మేము కోరుచున్నాము కాళీయుని క్షమించి ప్రాణము ప్రసాదింపుము. నీ నిజ స్వభావమును తెలియని అజ్ఞాని యీ కాళీయుడు అందుకే ఆ విధముగా ప్రవర్తించెను. మాకు యీ వరము ప్రసాదింపుము. కాళీయుడు జీవించి మమ్ము సుఖపెట్టనిమ్ము''.

కాళీయుడు అలసిపోయెను అతని అయిదు తలలు క్రిందకు వంగి యుండెను అహంకారము మచ్చుకైనను లేదు. కృష్ణుడు కాళీయుని శిరస్సు నుండి క్రిందకు గెంతెను అతి కష్టముతో కాళీయుడు ఊపిరి పీల్చుచుండెను చేతులు జోడించి కాళీయు డిట్లనెను ''ప్రభూ! 'నేను' అను అహంభావమును వదలి పెట్టుట యెవరికైను చాల కష్టము. ఈ అహంకారమే జీవులందరి వినాశనమునకు మూల కారణము అహంకారమను రోగము నన్ను పట్టుకొన్నది నీవు యీ రోగమును నివారించితివి నాలోని దుష్టత్వమే యీ సర్ప రూపముగా మూర్తీభవించినది దాని కనుగుణముగా నేను వర్తించినాను. అజ్ఞానమను నిద్ర నుండి లేచినాను నీవెవరో నేను తెలుసుకున్నాను వెనుకటి జీవితమునకు నేను యెన్నడును తిరిగివెళ్ళను''

కృష్ణు డిట్లనెను. ''కాళీయా! నిన్ను క్షమించినాను. కాని నీవు యిక్కడ యెంత మాత్రము ఉండరాదు. సముద్రములోనికి వెళ్ళి నీ బంధువులతో జీవించుము నదులు, వాటి యందలి నీరు మానవుల కొరకు యేర్పరచినవి. వారి జీవితము యీ నదీ జలముపై ఆధారపడియున్నది దానిని నీవు విషపూరితము చేయుట తగదు. ఈ కాళీయ మర్దనమను కథను వినిన వారికి యెన్నడును సర్పము లన్నచో భయము కలుగదు నీవు యెక్కడి నుండి వచ్చితివో అక్కడకు వెళ్ళుము''

మౌనముగా నిలుచున్న కాళీయుని జూచి కృష్ణుడు చిరునవ్వు నవ్వి యిట్లనెను ''నీవు దేని కొరకు ఆందోళన చెందుచున్నావో నాకు తెలుసును రమణక ద్వీపములో గరుడుడు ఉండుటచే నీవు భయపడుచున్నావు కాని యికముందు గరుడుడు నిన్ను వేధించబోడని అభయ మొసంగుచున్నాను నేను నీ శిరస్సులపై నాట్యమాడినపుడు నా పాదపు గుర్తులు నీ శిరస్సులపై పడినవి ఆ గుర్తులను చూసి గరుడుడు నిన్ను వదలిపెట్టును''

కాళీయుడు కృష్ణుని పువ్వులతోను, మణులతోను, నీలి కమలములతోను పూజించెను తరువాత కాళీయుడు భార్య, సుత సమేతముగా కృష్ణునికి సాష్టాంగ ప్రణామము సలిపి, రమణక ద్వీపమునకు తరలి వెళ్ళెను. విషపూరితమైన యమునా నది యిపుడు కలుష రహితమయ్యెను

భగవంతుని పాద చిహ్నములను శిరస్సుపై ధరించిన కాళీయుడు సరస్సు వదలి నెమ్మదిగా ప్రాకుచు వెళ్ళెను. మధు సరస్సులోని నీరు పరిశుద్ధమై మధురముగా మారెను గోపాలురు, గోపికలు, గ్రహణము విడిచిన చంద్రుని వలె, సరస్సు నుండి బయటకు వచ్చిన కృష్ణుని చూచి, బ్రహ్మానందము పొందిరి యశోద, రోహిణి, నందుడు, తదితరులు కృష్ణుని వద్దకు వెళ్ళి కౌగిలించుకొన దలచిరి కాని వారికి కలిగిన

ఆనందోద్వేగముచేత, చలనము లేని వారివలె, అక్కడనే నిలుచుండిపోయిరి. నెమ్మదిగా బలరాముడు కదలివెళ్ళి కృష్ణుని గాఢముగా కౌగిలించుకొనెను. వారి పెదవులందు మెదలిన హాసరేఖల అర్థము వారివురుకు మాత్రమే తెలియును.

బృందావన మండలి పెద్దలు, యశోదా నందులు, మాయా ప్రభావము తిరిగి వారిని ముంచుకొనగా, యిట్లు తలపోయసాగిరి. "కాళీయుని విషము నుండి ఆ భగవంతుడే కృష్ణుని రక్షించెను. బ్రాహ్మణులకు, పేదలకు దాన ధర్మములు విరివిగా చేయవలసి యున్నది దుష్టశక్తుల నుండి కృష్ణుని రక్షించవలసి యున్నది". కాళీయుని శిరస్సుపై నాట్యమాడి తన దివ్యత్వమును ప్రకటించినప్పటికిని, వారీ విధముగా తలపోసిరి మాయ ప్రభావము అంత గొప్పది. కృష్ణుని సంకల్పము చేతనే అమాయకులైన బృందావనవాసులు యీ మాయా ప్రభావమునకు లోనగుచుండిరి. యశోద కృష్ణుని తన ఒడిలో కూర్చుండ పెట్టుకుని, బృందావనవాసుల అదృష్టమునకు, తన ప్రియపుత్రుడు బ్రతికి బయటపడినందుకు సంతోషించి ఆనందబాష్పములు రాల్చెను. వారందరును నారాయణునికి ధన్యవాదములు తెలిపి నమస్కరించిరి. అంతవరకు పడియున్న గోవులు, గోపబాలురు దీర్ఘ నిద్ర నుండి లేచినట్లు లేచిరి. ఆ రాత్రి యెవరును తమ గృహములకు వెళ్ళక, యమునా నది ఒడ్డున ముచ్చట లాడుకొనుచు గడిపిరి.

## 173 రమణక ద్వీపములో యుద్ధము

శుకుడు చెప్పుచుండగా పరీక్షిత్తు అడ్డుపడి యిట్లనెను. "మునీంద్రా! నాలో కుతూహలము రేగెను రమణక ద్వీపములో కాళీయున ' ' ధ్య ద్వేష మెందులకు? కాళీయునకు గరుడుడన్నచో భయమేల? దీనికి కారణము దయచేసి వివరించి చెప్పగోరెదను"

శుకుని చిరునవ్వు "నీ కుతూహలమున కంతులేదు" అని అనుచున్నట్లు యున్నది తర్వాత శుకు డిట్లనెను "ప్రజలు సర్పము కాటునకు భయపడెదరు. వారు అనేక విధములుగా సర్పము కాటును తప్పించుకొనుటకు ప్రయత్నించెదరు. కాబట్టే ప్రజలు ప్రతి అమవాస్య దినమున బలి యొసగి సర్పములకు ప్రీతి కలిగింతురు. ఈ బలి ఆహారమును అశ్వర్థ వృక్షము క్రింద వదలిపెట్టుదురు. సర్పములు ఆహారమును స్వీకరించి, ప్రజలకు హాని కలిగించక వదలిపెట్టుచుండును.

"ప్రజలు సర్పమును జూచి భయపడునట్లే, సర్పములు గరుడుని జూచి భయపడును. అందుచే సర్పములు గరుడునికి ప్రీతి కలిగించుటకు తమ బలి ఆహారములో కొంత భాగము అదే అమావాస్య రోజున గరుడునికి వదలిపెట్టును. కద్రువ పుత్రుడైన కాళీయుడు యువకుడు, అహంకార పూరితుడు. అతనిలోని విషము అహంకారముచేత, యితర సర్పముల కన్న, మరింత విషపూరితమయ్యెను. గరుడునికి ఆహారము నిచ్చుట పిరికిపందల లక్షణమని యెంచి, సాంప్రదాయము ధిక్కరించి ఆ భాగము కూడ తానే తినివేసెను.

"తనకు చెందవలసిన భాగము కాళీయుడు తినివేయుట అవమానకరమని గరుడుడు భావించి సహించలేకపో యెను. గరుడుడు కాళీయుని వద్దకు వెళ్ళి తన విశాలమైన రెక్కలను పరచెను కద్రువ పుత్రులకు తనకు గల శత్రుత్వము అతని మనస్సులో మెదలెను. తన తల్లి దాసిగా కద్రువ వద్ద అమె దుష్టపుత్రుల వద్ద పనిచేసిన

రోజులు జ్ఞప్తికి వచ్చెను. తన ఆగ్రహము వెళ్ళగ్రక్కుటకు అవకాశము దొరకెనని యెంచి గరుడుడు క్రోధావేశముతో కాళీయునిపై కెగసెను.

''యువకుడైన కాళీయుడు ధైర్యముగా నిలిచెను. తన అయిదు శిరస్సుల నుండి విషము పైకి గ్రక్కుచు, నిర్భయముగా గరుడుని కెదురు నిలిచెను. తన విషమయమైన కోరలతో గరుడుని మాటిమాటికి కరుచుచుండెను. నారాయణునికి వాహనము, నారాయణుని ప్రియభక్తుడు అయిన గరుడుడు, కాళీయుని విసురుపాటు సహించక తన కుడి రెక్కతో కాళీయుని క్రింద పడద్రోసెను. గరుడుని రెక్కలు బంగారు వర్ణములో నుండుటచే గరుడునికి 'సుపర్ణు'డను పేరు కలిగెను. క్రింద పడద్రోయుట వలన కలిగిన బాధకు కాళీయుడు తాళలేకపోయెను. అచ్చట నుండి తొందరగా కదలిపోయి, యమునా తీరము వైపుకు వెళ్ళెను. ఆ తీరమున నున్న చిన్న సరస్సులో నివాస మేర్పరచుకొనెను. మధు సరస్సులో ప్రవేశించుటకు గరుడుడు సాహసించలేకపోయెను''. శుకుడు ఆగి చిరునవ్వుతో యిట్లనెను. ''దీనికొక కారణము కలదు నీకు చెప్పెదను వినుము''.

ఒకప్పుడు ఆ సరస్సు నందు పెక్కు చేపలు జీవించుచుండెను. ఒకసారి గ్రద్ద ఆ సరస్సు పరిసరములలో యెగురుచు ఒడ్డున నున్న ఒక చేపను చూచి తినివేయుటకు దానిపై లంఘించెను. సమీపములోనే సౌభరి యను ఋషి నిలిచియుండెను. చేపను గ్రద్ద పట్టుకుని తినివేయకుండ ఆ ఋషి అడ్డుపడెను. అతడు గ్రద్దను మందలించెను, కాని ఆ ఋషి మందలింపులను గ్రద్ద లక్ష్యపెట్టక ఒక చేపను తినివేసెను. చనిపోయిన తల్లి చేపను గానక ఆ చేప పిల్లలు దీన స్థితిలో నుండుట ఋషి జాగ్రత్తగా గమనించుచుండెను. అతనికి అమితమైన ఆగ్రహము కలిగెను. అతడు అన్ని పక్షులను యీ విధముగా శపించెను ''నేటి నుండి యే పక్షియైనను, గరుడునితో సహా, యీ సరస్సులో ప్రవేశించి చేపలను స్పృశించినచో, దాని తల వేయి వ్రక్కలగును''

''సౌభరి ఋషి శాప విషయము కాళీయుడు తెలుసుకొనెను. మధు సరస్సుకు గరుడుడు రాలేడను ధైర్యముతో కాళీయుడు అచట నివాస మేర్పరచుకొనెను''.

యమునా నది ఒడ్డున అర్ధరాత్రి కాజొచ్చెను. ఆ రోజు జరిగిన సంఘటనలకు అందరు బాగా అలసిపోయి దీర్ఘ నిద్రలో పడిరి. ఇంతలో అకస్మాత్తుగా అగ్ని అరణ్యమును దహించుచుండెను. అది వేసవి కాలము. అగ్ని బాగుగా ప్రజ్వరిల్లి, నిద్రించుచున్న గోపాలు రందరనూ చుట్టుముట్టెను వేడికి నిద్ర నుండి లేచి తమను చుట్టుముట్టిన అగ్ని, గడ్డిని, చెట్లను దహించుచుండుట జూచిరి. వెంటనే వారు కృష్ణుని వైపు జూచి యిట్లనిరి ''కృష్ణా! నీవే మా అందరి రక్షకుడవు. నీవు రక్షించి, యీ మంటల నుండి మేము బయటపడి జీవించునట్లు చేయవలెను. నీవు తప్ప మమ్ములను ఆదుకొను వారలెవరును లేరు. దయ దలచి యేదో ఒకటి వెంటనే చేయుము''. కృష్ణుడు వారి ఆర్తనాదము విని, సహజముగా ప్రేమ స్వరూపుడగుటచే, ఒకప్పుడు మహాదేవుడు హాలాహలము మ్రింగి దేవతలను రక్షించినట్లుగా, ఆ అరణ్యాగ్నిని దిగమ్రింగి బృందావనవాసులందరను రక్షించెన

# 174 ప్రలంబుడు

వేసవి కాలము ప్రారంభమయ్యెను అది వేసవి కాలమయినప్పటికిని బలరామకృష్ణులున్న బృందావనములో యెప్పుడును వసంతమే పర్వతము నుండి క్రింద పడుచున్న జలపాతము హోరు తీయని సంగీతమువలె నున్నది. ఆ సంగీతమున కనుగుణముగా మంద్రస్థాయిలో పురుగులు చేయు గుసగుస ధ్వనులు మైకము కల్గించుచుండెను వృక్షములన్నియు గుబాళించు పుష్పములను దాల్చియుండెను. నదులు, సరస్సులు విచ్చిన యెరుపు, నీలి, తెల్లని పద్మములతో నిండియుండెను. ఆకాశము భూమిపైకి దిగి వచ్చెనా యనునట్లున్నది. ఆ నీటిపై నుండి వచ్చు గాలి పువ్వుల సువాసనలను తీసుకువచ్చుచుండెను నేల పచ్చటి గడ్డి వలన చల్లగా ఆహ్లాదకరముగా నుండెను తీవ్రమైన సూర్యుని వేడి ప్రభావము అక్కడ లేకుండెను. నిత్యము ఊరుచున్న జలముచేత నేల యెప్పుడును తేమగా నుండెను లేళ్లు, పక్షులు, కోయిలలు గానము చేయుచుండగా నెమళ్ళు పురివిప్పి నాట్యము సలుపుచుండెను.

తన స్నేహితులతో కృష్ణుడు తరచుగా యీ అరణ్యమునకు వెళ్ళుచుండెను. ఒక చేతిలో వేణువు మరొక చేతిలో ఆవు దూడల నదిలించుటకు చిన్న కొరడా యుండెడివి. దినమంతయును వారు ఆడుచు, పాడుచు, నాట్యము చేయుచు గడపుచుండెడివారు అనేక విధములైన ఆట పాటలలో మునిగి యున్న వారికి కాలము తెలిసెడిది కాదు ప్రతి దినమును తమ తమ యిళ్ళకు ఆలస్యముగా చేరుకొనువారు కృష్ణుని స్నేహితులు ఆడే వివిధములైన ఆటలు - దాగుడు మూతలాట, కప్పగంతులాట, కుస్తీపట్లు, యింకా అనేక రకములైనవి - చూచి దేవతలు వారిపై అసూయ చెందెడివారు.

గొప్ప తపస్సంపన్నులకు, సాధువులకు లభ్యముకాని పరమాత్మ, కృష్ణుని రూపములో దినమంతయు గోప బాలురతోడనే యుండుట వారి మహద్భాగ్యము.

ప్రలంబుడను అసురుడొకడు గలడు అతడు కంసుని పనుపున కృష్ణుని చంపుటకు వచ్చెను. ప్రలంబుడు అరణ్యములోనికి ప్రవేశించిన వెంటనే కృష్ణునికీ విషయము తెలిసెను అతడు గోప బాలుని రూపము ధరించి మిగిలిన గోప బాలురతో కూడి ఆడుచుండెను. బలరామకృష్ణులు తప్ప యితరులెవరును గుర్తించకుండిరి. వారితో గోప బాలుని వేషములో నున్న ప్రలంబుని కృష్ణుడు ఆడనిచ్చెను

వారు రెండు జట్లుగా చీలి ఒక విధమైన ఆట ఆడుచుండిరి నేడు కూడ కొద్ది మార్పులతో అట్టి ఆటను ఆడుచుందురు. ఆ ఆటలో ఓడిపోయిన జట్టు గెలిచిన జట్టును మోసుకుని తీసుకు వెళ్ళవలెను ఒక జట్టుకు బలరాముడు నాయకత్వము వహించగా రెండవ జట్టుకు కృష్ణుడు నాయకత్వము వహించెను కృష్ణుని జట్టు ఓడిపోవుటచేత గెలిచిన జట్టులో ప్రతి ఒక్కరిని వారు మోసుకు వెళ్ళవలసి వచ్చెను అట్లు వారు పుండరీకమను పెద్ద అశ్వత్థ వృక్షము చేరుకొనిరి కృష్ణుడు శ్రీధాముడను బాలుని మోసుకు వెళ్ళుచుండెను బాలుని రూపములో నున్న ప్రలంబుడు బలరాముని మోసుకు వెళ్ళుచుండెను.

కొంత దూరము వెళ్ళిన తర్వాత, బలరామునితో పరుగెత్తి పారిపోవుటకు యిదే సమయమని ప్రలంబుడు తలంచెను ఎవరును తన్ను చూచుట లేదని గ్రహించి, బలరాముని చంపు నుద్దేశ్యముతో తొందరగా మిగిలిన వారి నుండి కదలి వెళ్ళెను

తన వీపుపై నున్న బలరామునితో కొంత దూరము నడచి ప్రలంబుడు తన సహజమైన అసుర రూపము దాల్చెను.

వీపుపై బలరాముడు ఉండగా, అతడొక నల్లని మేఘమువలె గోచరించుచుండెను. నడిరాత్రి మబ్బు పూర్ణిమా చంద్రుని అంచును తగిలి యున్నట్లుగా ఆ అసురుని ఘన శరీరము వీపుపై బలరాము డుండెను. ప్రలంబుడు తన శరీరమును పెంచుట జూచి బలరాముడు ఆశ్చర్యము చెందెను. బలరాముడు చేయి గట్టిగా ముడిచి తన పిడికిలితో ప్రలంబుని గట్టిగా కొట్టెను. అది ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బవలె నుండెను. ఆ దెబ్బకు ప్రలంబుని తల గిర్రుమని తిరిగెను. తరువాత మరొక క్షణమునకు తల చితికిపోయెను. ప్రలంబుని విశాలమైన నోటి నుండి రక్తము కారుచుండగా, పర్వతము కూలినట్లు నేలపై కూలెను. ఇంతలో ఆ ప్రదేశమునకు ఇతర బాలురు వచ్చి, బలరాముని కౌగిలించుకుని యిట్లనిరి. ''అదృష్టవశాత్తు యీ అసురుని నీవు చంపగలిగినావు''. దేవతలు బలరామునిపై పుష్ప వర్షము కురిపించిరి. ఆ తరువాత బాలురందరను బృందావనమునకు తిరిగి వచ్చిరి. దారిలో వారు బలరాముని బలమును మెచ్చుకొనుచు అసురుని చంపిన తీరును గురించి ముచ్చటించుచు యెవరి గృహములకు వారు వెళ్ళిరి.

## 175 అరణ్య దహనము

ఒకసారి, బాలురందరును యెప్పటివలెనే ఆటపాటలందు మునిగి యుండగా, ఆవులు, దూడలు దారితప్పి దూరముగా పోయినవని వారు గ్రహించిరి. అవి కనుపించకపోవుటచే వారికి ఆందోళన, భయము పెరిగెను. ఇంతలో ఆవులు పచ్చని గడ్డియున్న కొత్త ప్రదేశమునకు చనెను. కొంత దూరముగా నున్న స్థలములో పచ్చగడ్డి సమృద్ధిగా నుండుటచే గోవులు అచటకు వెళ్ళెను. కాని అచట గడ్డి యిదివరకు ఆవులు మేయు ప్రదేశములోని గడ్డికన్న కొంచెము భిన్నముగా నుండెను. అవి గడ్డి మేయుచుండుగా, అరణ్యాగ్ని చెట్లను గడ్డిని దహించి వేయుచున్నట్లు కనుగొని, పెద్దగా 'అంబా' యని అరచెను. వారి చుట్టును మంటలు చుట్టుముట్టెను. అవి మంటలు దాటి బయటకు రాలేకపోయెను.

ఈలోపుగా గోపబాలురు ఆవులను వెదకుచు అటు నిటు సంచరించుచుండిరి. వాటి పాదపు గుర్తులను, మేసిన గడ్డి గుర్తులను బట్టి ఆవుల జాడ తెలుసుకొనుటకు ప్రయత్నించిరి. కాని వారు గోవులను కనుగొనలేకపోయిరి. ఆ గోవుల నొక్కొక్క దానిని కృష్ణుడు పేరు పేరున గళమెత్తి పిలుచుచుండెను. ఆవులు ఆ స్వరము విని సమాధానముగా తిరిగి 'అంబా' యని అరచెను. ఆ గోవుల స్వరములో బాధ, ఒక విధమైన నిట్టూర్పు మిళితమై యుండెను.

ఇంతలో మంటలు బాగుగా వ్యాపించెను. ఎత్తైన మంటలు ఆకాశము నంటుచున్నట్లుండెను. వాతావరణ మంతయు వేడిగా నుండెను. మంటలు బాలురను కూడ చుట్టుముట్టెను. వారు భయభ్రాంతులై గట్టిగా అరచిరి. ''కృష్ణా! కృష్ణా! తొందరగా వచ్చి రక్షించు. రామా! మాకు సహాయపడుము. మీరిద్దరూ మమ్ము, యీ దూడలను రక్షించగలరు. ఇదివరకు పెక్కుమార్లు రక్షించినారు. ఈ అగ్ని అన్నింటినీ దహించివేయుచు న్నది. మీరు ఆలస్యము చేసినచో మేము యీ అగ్నికి ఆహుతి అయ్యెదము. కృష్ణా! మమ్ము యీ ఆపద

నుండి కాపాడుము''. వారి ఆర్తనాదము కృష్ణుడు విని యిట్లనెను. ''భయపడకండి. నేనున్నంతవరకు యెవరికినీ యే భయమును లేదు మీరు ప్రతిఒక్కరు కనులు మూసుకొని, నేను తిరిగి తెరువుమని చెప్పినంతవరకు కనులు మూసుకుని యుండుడు''.

ఆ బాలురందరను కృష్ణుడు చెప్పినట్లే చేసిరి. కృష్ణుడు చెప్పినట్లు చేయుట వారికి క్రొత్తకాదు బాలురందరును కండ్లు గట్టిగా మూసుకుని కృష్ణుని మాత్రమే మనస్సునందు తలచుచుండిరి. కృష్ణుడు తన యోగశక్తిచేత అగ్నిని పీల్చి, కాళీయునిపై తాండవమాడినపుడు వేడి విషవాయువులను పీల్చి దిగమ్రింగినట్లుగా దిగమ్రింగెను.

మంటల వేడి అణగారిన తర్వాత చల్లని గాలి వీచగా, కృష్ణుడు గోవులను తరలించుకొని యితర బాలురతో భాండీరకమను వటవృక్షము దగ్గరకు చేరెను. అప్పుడు కృష్ణుడు వారితో ''స్నేహితులారా! ఇప్పుడు మీరు కన్నులు తెరవండి'' అని పలికెను

అంతకు ముందు వారెక్కడ ఆడుచుండిరో ఆ ప్రదేశమునకు వచ్చినామని గ్రహించిరి అగ్ని జ్వాలలు, గోవుల దీనాలాపములు యింకా వారి మదిలో మెదలుచుండెను. మంటలు చల్లారెనని, తాము సురక్షితముగా నున్నామని వారు యింకను భావించలేకుండిరి ఒక క్షణకాలము వారు కృష్ణుడు భగవంతుడనియు, ఆద్యంతములు లేనివాడనియు, సాక్షాత్తు నారాయణుడేనని తలంచిరి కాని అతి తొందరలోనే ఆ భావము వారి మనస్సుల నుండి చెదిరిపోయెను. తమ చెలికాడైన కృష్ణుడు ప్రీతిపాత్రుడనియు, యెటువంటి ప్రమాదము నుండియైనను రక్షించగలడనియు, అద్భుత వ్యక్తియనియు, వారికి బాగుగా తెలుసును. అంతకు మించి వారు కృష్ణుని అవగాహన చేసుకొనలేకుండిరి వారు యిళ్ళకు వెళ్ళి, బృందావనవాసులతో బలరామకృష్ణుల సాహస కృత్యములు చెప్పిరి.

బృందావనములోని స్త్రీ పురుషులందరును, యిద్దరు దివ్య పురుషులు తమ మధ్య పిల్లలుగా పుట్టి సంచరించుట తమ మహద్భాగ్యమని భావించిరి

## 176 వర్షఋతువు

వేసవి కాలములోని వేడి అణగారెను వర్షకాలము ప్రారంభమగుటతో వేసవి వేడి పూర్తిగా అంతరించెను గ్రీష్మము వెళ్ళి వర్ష ఋతువు ప్రవేశించెను నీలి ఆకాశపు స్వచ్ఛతపోయి నల్లని మబ్బులు అచ్చటచ్చట ఆకాశములో గోచరించుచుండెను. అవి వర్షకాల ఆగమనమును సూచించుచుండెను ఆకాశమంతయు నల్లని మబ్బులు వ్యాపించెను. బూడిద రంగు చర్మము ఆకాశమును కప్పినట్లుండెను ఇంతలో ఉరుముల శబ్దము వినిపించెను. నల్లని ఆకాశమందు మెరుపులు మెరయుచుండెను. త్రిగుణములు ఒకేచోట మిళితమై యున్నట్లు ఉండెను ఆకాశము బ్రహ్మమని భావించినచో, దానిని కప్పిన దట్టమైన నల్లని మబ్బులు తమోగుణముగా యెంచవచ్చును. ఉరుములు రజోగుణమునకు, చీకటి మబ్బులకును, వెలుగునిచ్చు మెరుపులు సత్వగుణమునకును ప్రతీకలని చెప్పవచ్చు ఆవరణలతో కూడిన పరమాత్మ జీవాత్మ అయినట్లు, ఆకాశము మబ్బులు,

ఉరుములు, మెరుపులతో నిండియున్నది.

గత యెనిమిది మాసములు సూర్యుడు తన కిరణములు ప్రసరించిన ప్రదేశములన్నిటి నుండి గ్రహించిన జలమును యిప్పుడు తిరిగి భూమాతకు యిచ్చి వేయుటకు నిశ్చయించినట్లుగా నుండెను. పరిపాలకులు ప్రజలు నుండి పన్నులు వసూలుచేసి, ఆ సొమ్మును తిరిగి వారికి అనేక సౌకర్యముల రూపములో యిచ్చి వేయుచున్న రీతిలో నుండెను. ఉత్తమ వ్యక్తులు, మానవుల శ్రేయస్సుకై, తమ జీవితము ధారపోయుటకు సిద్ధపడుదురు. ఆదే విధముగా మబ్బులు భూమికి నీరునిచ్చి తమను తాము అంతము గావించుకొనును. బలమైన గాలులకు మబ్బులు అటు విటు చెదిరి, ఉండి ఉండి వర్షించుచుండెను. వేసవి వేడిమికి యెండిపోయిన భూమి తిరిగి ఆకుపచ్చగా ప్రకాశించుచుండెను.

రాత్రివేళ నక్షత్రములు, గ్రహములు కనుపించకుండెను. మిణుగురు పురుగులు ఉండి ఉండి తమ రెక్కల నాడించుటచేత పొడమిన సన్నని వెలుగు మాత్రమే కన్పించుచుండెను. వేద పద్ధతులు విడనాడి, అవినీతి మార్గములు అందరి జీవితమందు చోటు చేసుకున్న కలికాలమువలె గోచరించుచుండెను. ఇంతవరకు నిశ్శబ్దముగా నున్న కప్పలు ఒక్కసారిగా బెకబెకమని అరచుట ప్రారంభించెను. ఇది యెట్లున్నదనగా ఉపాధ్యాయుడు తరగతిలోనికి వచ్చుట జూచి, విద్యార్థులు గట్టిగా పాఠములు పఠించు తీరులో నున్నది. ఇంతవరకు యెట్టి ప్రాముఖ్యము లేని చిన్న చిన్న వాగులు, సెలయేరులు ఒక్కసారిగా నీటితో నిండి ప్రవహించుచుండెను. చాల కాలము భౌతికమైన సుఖసంతోషములకు, సంపదకు దూరమైన పేదవారికి ఒక్కసారిగా యివి సమకూడినపుడు వానినెట్లు సద్వినియోగ పరచవలెనో తెలియక, సతమతమగునట్లు చిన్న చిన్న వాగులు, సెలయేరులు కట్టలు తెగి అడ్డు అదుపు లేక ప్రవహించుచుండెను. పంట భూములు పచ్చని పంటలతో చూడ ముచ్చటగా నుండెను. మబ్బులు కురిసిన స్వచ్ఛమైన మధురమైన చల్లని నీటితో తడిసిన భూమిపై ప్రతి ఒక్కటియు చూచుటకు అత్యంత మనోహరముగా నుండెను.

బలమైన గాలులతో బాటు పొంగి ప్రవహించుచున్న నదులలోని నీరు తీవ్ర వేగముతో వచ్చి సముద్రములో కలియుచుండెను. ఇది, ఇంద్రియ ప్రలోభములకు అతీతుడై దీర్ఘకాలము ప్రశాంత మనస్కుడైన యోగి, అకస్మాత్తుగా ఇంద్రియలోలుడై మనస్సంయమనమును గోల్పోయిన తీరులో నున్నది.

చాల కాలము అశ్రద్ధ చేసిన వేదములను మరచిపోయి వానిని పోగొట్టుకున్నట్లు, ప్రతి దినము ప్రజలు సంచరించే కాలి బాటలు గడ్డి మొలుచుటచేత, ఆ బాటలు కనుపించక అదృశ్యమయ్యెను.

ధనవంతుడైన విటుడు పేదవాడైన తర్వాత దేవదాసి అతనిని అలక్ష్యము చేయునట్లుగా, మబ్బులు వర్షించిన తర్వాత మెరుపులకు మబ్బుల యందాసక్తి తగ్గినట్లుండెను. సప్తవర్ణములతో కూడిన హరిచాపము (rainbow) గుణాతీతుడైన పరమాత్మ లోకములో గుణములతో కూడియున్నట్లు గోచరించు విధముగా, ఆకాశమునందు గోచరించెను. అహంకారముతో నిండిన మానవుని బుద్ధి మందగించినట్లుగా, మబ్బుల వెనుక నున్న చంద్రుడు తన ప్రకాశమును అందజేయలేకుండెను.

నెమళ్ళు పురి విప్పి నాట్యము చేయుచుండెను. ఎండిపోయిన వృక్షములకు తిరిగి నీరు లభించుటతో సంతృప్తి చెందినట్లుండెను. కొన్నిచోట్ల గట్లు తెగి యుండెను. మానవుని దృష్టి ప్రసరించినంత దూరము వరకు వర్షపు నీరును, పచ్చని భూమియు కన్పించుచుండెను. ఈ దృశ్యము నేత్రములకు విందు చేయుచున్నట్లు

న్నది.

బృందావనములోని బాలురు వర్షములో ఆడుచు ఆనందించుచుండిరి. వారు గుహలకు పరుగెత్తుచు అచట కూర్చుని మరల వృక్షముల క్రిందపడిన గింజలు, యితర భోజ్యమైన వస్తువులను భుజించుచు మరల వర్షములో తడియుచు ఆడుచుండిరి. వర్షము పడుచున్నప్పుడు కృష్ణుడు ఆ వర్షమువైపే రెప్పవాల్చక చూచుచు నిలుచుండెడివాడు. ఎత్తైన పర్వతముల మండి కారుచున్న వర్షధారలను, పాలతో నిండిన పొదుగులు కలిగిన గోవులను చూచుచు నిలిచియున్న కృష్ణుని వద్దకు నెమ్మదిగా ఆ గోవులు తేనెను సేకరించుటకు సంచరించే కోయ స్త్రీలను తప్పించుకుని, తమ ప్రియ కృష్ణుని వద్దకు చేరుచుండెడివి. బాలురు కృష్ణుని ప్రక్కనే రాతిపై కూర్చుని తాము తెచ్చుకున్న భోజనము చేయుచు, తమ ప్రక్క నుండి వడివడిగా ప్రవహించే నదిని తిలకించుచుండిరి. కృష్ణుడు గడ్డిపై నడుము వాల్చి గంటల తరబడి ఆకాశమును, గాలికి ఊగిసలాడే చెట్టు చివరి కొమ్మలను చూచుచుండెను. తన చుట్టును గోవులు, దూడలు, స్నేహితులు ఉండెడివారు.

ఆ విధముగా అందరికి ఆనంద సంతోషములు చేకూర్చు వర్షాకాలము గడచిపోయెను. గాలి తీవ్రత ఒక్కసారిగా తగ్గెను. భూమిని, వృక్షములను, పచ్చని గడ్డిని తాకిన గాలి మృదువుగా మెల్లగా వీచుచుండెను. ఆకాశము మరల మబ్బులు లేక స్వచ్ఛముగా నుండెను. నదులు, సరోవరములలోని నీరు కూడ బురద లేక స్వచ్ఛముగా నుండెను.

పద్మములు తిరిగి విరిసెను. యోగులు కొంత కాలము పాటు ధ్యానము విస్మరించి తిరిగి ధ్యానము చేత ప్రశాంతత పొందిన విధముగా కలువలు విరియుట ప్రారంభించెను.

## 177 శరదృతువు

మానవుని జీవితమును నాలుగు ఆశ్రమములుగా విభజించిరి. ఇవి : బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్యాసాశ్రమము. ఈ నాలుగును వేనికవియే క్లిష్టమైనవి. బ్రహ్మచర్యాశ్రమములో మానవుడు గురువు వద్ద వసించుచు, అతని ఆజ్ఞలను పాటించుచు, గృహమునందు సర్వకార్యములను చేయవలసి యుండును. అగ్నిహోత్రమునకు సమిధలు తెచ్చుట, వస్త్రములు శుభ్రముచేసి ఆరబెట్టుట, గురువు పాదములొత్తుట, మొదలుగాగల అనేక కృత్యములు సాధారణముగా ఓర్పు తక్కువగా నుండు యువకుల ఓర్పును పరీక్షించుచుండెను. బ్రహ్మచర్యము మనస్సు పరిపరి విధములుగా సంచరింపకుండ నరికట్టి నిగ్రహించుటకు సహాయపడును. మనస్సును భగవంతునిపై లగ్నము చేసి భక్తి అలవరచుకున్నచో గురువు యింట చేయుచున్న పెద్ద కార్యములవలన కలుగు సాధక బాధకములు మనస్సుకు యెట్టి బాధయు కలిగింపవు. మనసును ఉత్తమ లక్ష్యమువైపు మరల్చినపుడు అవి బాధ లనిపించవు.

మానవుని జీవితములో తరువాత స్థితి గృహస్థాశ్రమము. ఇందు మానవుడు సంసారమను బంధములో చిక్కుకొనును. ఈ ఆశ్రమము నందు భార్య పిల్లలను పోషించుచు, పిల్లలను సరియైన రీతిలో పెంచవలసి యుండును. ఇందుకొరకు జీవనోపాధికై ఆర్జించవలసి యుండును. సంసారము నందలి కష్టనష్టములు మానవుని అశాంతికి గురిచేయును. ఈ అశాంతిని అతిక్రమించుటకు ఒకే ఒక మార్గము కలదు. భగవంతునిపై మనస్సు

## నిలిపి భక్తి అభ్యాసము చేసినచో సంసార కష్టనష్టములు బాధలనిపించవు

వానప్రస్థాశ్రమమందు మానవునికి సంసారము నెడల కొంత విరక్తి కలిగి కుటుంబ సమస్యలకు దూరముగా నుండును ఈ ఆశ్రమమందు కూడ మానవుడు అనేక కష్టనష్టములకు, ముఖ్యముగా భౌతికమైన కష్టనష్టములకు గురియగు చుండును. భౌతిక సుఖములకు అలవాటుపడిన మానవుడు అసుకరమైన జీవిత సరళికి అలవాటుపడుట మిక్కిలి కష్టముతో కూడినది. భక్తిని పెంపొందించుకున్నచో, భౌతికమైన యిబ్బందులు, అసౌకర్యములు యెక్కువగా బాధించవు.

ఇక నాలుగవది సన్యాసాశ్రమము. మానవుడు సర్వమూ త్యజించి భవ బంధములను త్రెంచుకొనుట యీ ఆశ్రమము యొక్క విశిష్టత మోక్ష మార్గమునకై గృహము, భార్య, పిల్లలపై మమకారము వీడుట అత్యవసరము. అయితే సన్యాసి కాగలుగుట తేలిక కాదు ఎంత ప్రయత్నించినప్పటికిని, ఇంద్రియముల ప్రాబల్యము అతి శక్తిమంతమగుటచే మానవుడు అరిషడ్వర్గమును జయించుట మిక్కిలి కష్టతరము అరిషడ్వర్గములో ముఖ్యముగా కామమునకు వశుడై పతనము చెందును. మానవుడు పతనము చెందకుండ నుండుటకు, కేవలము భక్తిమాత్రమే రక్షించగలదు. భగవంతునిపై మనస్సు నిలిపిన మానవుడు జయము పొంది, కష్ట నష్టములచే బాధ పొందకుండును జీవితకాల మంతయు మానవునకు సహాయపడునది భక్తి మానవు లనుసరించదగునది భక్తియోగము తప్ప వేరేదియు లేదు.

వర్షఋతువు అనంతరము శరదృతువు ప్రవేశించెను భగవంతునిపై భక్తి అడ్డంకులను తొలగించునట్లు శరదృతువు ప్రవేశించెను బ్రహ్మచర్యములోని యిబ్బందులవలె నున్న నల్లని మబ్బులు వీడి ఆకాశము స్వచ్ఛముగా నుండెను. వర్షకాలములో పశువులశాలలో కట్టుపడిన గోవులు, అనుబంధము పెంచుకొనక జీవించు గృహస్థునివలె, యిపుడు స్వేచ్ఛగా యిచ్ఛవచ్చిన చోటుకు సంచరించ గలుగుచున్నవి భక్తిచేత వానప్రస్థాశ్రమములో యిహలోక సౌకర్యములను త్యజించినట్లుగా, భూమి యిపుడు బురద, నిలిచిపోయిన నీరు లేకయుండెను. భగవద్భక్తితో నిండిన సన్యాసి మనస్సువలె నీరు స్వచ్ఛముగా మధురముగా నుండెను.

మునులు తమ పిల్లలపై మమకారమును, భౌతిక సుఖ సంపదలపై వ్యామోహమును వీడి ప్రశాంతముగా నుండునట్లు, ఆకాశము మబ్బులు వర్షించిన తర్వాత తేలికపడి తెల్లగానయ్యెను జ్ఞానకోవిదులు తమ జ్ఞానమును కొందరకే బోధించు రీతిగా, పర్వతముల నుండి కొన్నిచోట్ల మాత్రమే స్వచ్ఛమైన నీరు క్రిందకు ప్రవహించుచుండెను వర్షకాలమందు చిన్న చిన్న నీటి గుంటలలో నీరు విరివిగా నున్నపుడు, చిన్న చిన్న చేపలు, యితర జలచరములు అందుండెడివి. వర్షకాలము ముగిసి, క్రమముగా ఆ నీటి గుంటలలోని నీరు యింకిపోవు చున్నప్పటికిని, నీరు తరిగి పోవుచున్నదని గ్రహింపక అవి అందే వసించుచుండెను ఇది యేరీతిగా నున్నదనగా, భౌతిక సుఖ సంపదలలో మునిగిన మానవుడు కాలము గతించి జీవిత కాలము తగ్గుచున్నదని యెరుగని విధముగా నున్నది. జ్ఞానవంతుడు 'నేను', 'నాది' అను మమకార భావము వదలుకొనునట్లుగా, భూమి తేమ, బురదలను వానిని తాత్కాలికముగా కప్పిన లతలను విసర్జించెను వర్షములు ఆగిపోయిన తర్వాత, సముద్రము అల్లకల్లోలముగా లేక, మనస్సును కర్మలను నిగ్రహించుట నేర్చినవానివలె ప్రశాంతముగా నుండెను.

శరదృతువునందు తిరిగి సూర్యుడు తీవ్రముగా ప్రకాశించుచుండెను కాని రాత్రియందు చంద్రుని వెన్నెల చల్లదనము నిచ్చి, పగటి వేడిమిని మరపించుచుండెను ఇది శరీరముతో అనుబంధమును నశింపజేయు ఆత్మజ్ఞానము వలె నున్నది. మేఘములు లేక నక్షత్రములతో ప్రకాశించు ఆకాశము, సత్వగుణముతో నిండిన

బుద్ధివలె నుండెను. వర్షకాలమున యీ మానవ లోకమందు అస్తవ్యస్తమైన నిత్యకృత్యము లన్నియు, యిపుడు, అనగా వర్షములు ముగిసి మేఘములు తెల్లనై ఆకాశము స్వచ్ఛమైన తర్వాత, యిదివరకువలె జీవితము సాగుచుండెను. ప్రజలు తమ దైనందిన కృత్యములను యథావిధిగా నెరపుకొనుచుండిరి. ఒక నూతన శోభ వెల్లివిరియు చుండెను. అరణ్యములు వర్షముచే పరిశుభ్రమైనట్లుండెను. సరస్సులు యెరుపు, నీలి, తెలుపు కలువ పూవులతో నిండియుండెను. నదుల ప్రవాహవేగము తగ్గి, మెల్లగా హుందాగా ప్రవహించుచుండెను. కొత్తగా పుష్పించుచున్న పువ్వుల సువాసనలతో గాలి వీచుచుండెను. బృందావనము అతి సౌందర్యముగా నుండెను.

## 178 కృష్ణుని వేణునాద మహిమ

యమునా నదీ తీరమున మధువనమను తోట గలదు. ఒకరోజు కృష్ణుడు గోపాలకులతో, గోవులతో, దూడలతో కలిసి ఆ తోటలో ప్రవేశించెను. యమునా నదిలోని నీరు స్వచ్ఛముగా తియ్యగా నుండెను. సరస్సులలో విరిసిన కలువల గుబాళింపులతో గాలి వీచుచుండెను. చెట్లు పువ్వులతో నిండియుండెను. తుమ్మెదలు పువ్వుల చుట్టును రొద చేయుచు తిరుగుచుండెను. చెట్లపై నున్న పక్షులు కుహూకుహూమని శబ్దము చేయుచుండెను. అందరును ఆనందముగా ఉల్లాసముతో ఆడుచు పాడుచు ఆ తోటలో ప్రవేశించిరి.

కృష్ణుడు తన వేణువు తీసి ఊదుచుండెను. ఆ వేణువు నుండి వెలువడు మధుర నాదము మైలు దూరము వరకు వినిపించుచుండెను. ఆ మధుర సంగీతమును విన్న గోపికలు తన్మయత్వము చెందిరి. గోపికలు ఒకరితో నొకరు కృష్ణుని గురించి, అతని లీలలను గురించి ముచ్చటించుకొనుచుండిరి. వారి ఆలోచనలు కృష్ణునిపైనే యున్నవి. కృష్ణుని నల్లని జుట్టు, గాలికి యెగిరి ఆ జుట్టు ముఖముపై పడినపుడు యెంత అందముగా నుండునో వారు తలంచుచుండిరి. తలలో తురిమిన నెమలి పింఛము కృష్ణుని వదనమునకు మరింత శోభ చేకూర్చుచుం డెను. నాట్యాచార్యునివలె కృష్ణుని శరీరము పొందికగా నుండెను. అతడు చెవులందు తెల్లని కర్ణికార పుష్పములు ధరించెడివాడు. అనేక రంగులతో — తెలుపు, యెరుపు, పసుపుపచ్చ, నీలి — పువ్వుల దండను మెడలో ధరించెడివాడు. ఆ దండలో మధ్య మధ్య ఆకుపచ్చని ఆకులు కూడ నుండెడివి. ఆ పువ్వుల దండను 'వైజయంతి' యని పిలిచెడివారు. ఎల్లప్పుడు సువర్ణ ఛాయలో నుండు పట్టువస్త్రములు ధరించు చుండెడి వాడు. నల్లని శరీరఛ్ఛాయ గల కృష్ణునకు పచ్చని రంగు వస్త్రములు అందముగా అమరి యుండెడివి. పండుగకు అలంకరించుకొనినట్లుగా కృష్ణుడు అందరి మధ్య నిలుచుని పెదవులతో వేణువు నూదుచు తీయని స్వరములు పలికించుచుండెను. ఆ స్వరముల కనుగుణముగ యువకులైన గోపాలురు అడుగులు వేయుచు నాట్యము చేయుచుండిరి. మధువనములో అందరును ఆనందముగ నుండిరి.

గోపికలు తమలో తాము కృష్ణుని విషయము తప్ప యింకే యితర విషయముపై మాట్లాడకుండిరి. ఒక గోపిక యిట్లనెను. ''పెదవులపై వేణువును, చుట్టునున్న గోపాలురు, వృక్షములు, గోవులు మొదలైన అన్నిటిపై ప్రేమ దృక్కులను ప్రసరింపజేయు కృష్ణుని వదనమును గురించి ఆలోచించగా, యితర విషయములపై మనసు నిలువగలదా? అతడు యెప్పుడును మన మధ్య ఉండుటచేత మనమెంతయో అదృష్టవంతులము. ఆ వేణువు

అదృష్టమునకు నాకు అసూయ కల్గుచున్నది. ఇక్కడ నేను కృష్ణుని చూపులకై వేచి యుండగా, ఆ వేణువు నా ప్రియతమ కృష్ణుని పెదవులకు దగ్గరగా నుండి స్పృశించుచున్నది.

''కృష్ణుని పాద స్పర్శను పొందుచున్న యీ బృందావనము యెంతో అదృష్టము చేసుకున్నది. కృష్ణుని సంగీతమునకు నెమళ్ళు ఆనందముతో నాట్యము చేయుచుండెను. వెదురుతో చేసిన వేణువును తన సంగీతమునకు కృష్ణుడు యెన్నుకున్నందుకు, వెదురు వృక్షములు తేనెను కురిపించుచుండెను. కొండ దిగువ నున్న జంతువులు కృష్ణుని వేణు నాదమునకు స్తంభించి, బొమ్మలవలె, నిలుచుండిపోయెడివి. కృష్ణుడు తనపై సంచరించుచున్నందుకు భూమి గర్వపడుచుండెను. మధు వనములో గానముచేయు కృష్ణుని ప్రక్కనే నిలిచియున్న లేళ్ల అదృష్టము యేమని చెప్పగలము! ఆకాశములో సంచరించు దివ్యనర్తకులు ఆగి కృష్ణుని వేణువు నుండి వెలువడు అమోఘమైన సంగీతమును వినుచు తన్మయత్వము చెందగా, ఆ తన్మయత్వములో తమ సిగల నుండి రాలి పడిపోవుచున్న పువ్వులను గాని, గాలికి యెగిరి వదులగుచున్న తమ పట్టువస్త్రములను గాని గమనింపకుండిరి. ఆవులు నెమరు వేయుచున్న పచ్చగడ్డిని అట్లే వదలి, నోటి నుండి క్రిందపడుచున్ననూ గమనింపక యుండెడివి తల్లి గోవుల వద్ద పాలు త్రాగుచున్న ఆవుదూడలు త్రాగుట ఆపివేసెడివి. వాటి మూతుల నుండి పాలు చుక్కలు చుక్కలుగా కారుచుండెడివి ఆ మధుర సంగీతమునకు పాలు త్రాగుట మరచి మైమరపు చెందెడివి

మహర్షులు భగవంతుని తప్ప యింకే యితర విషయము ఆలోచించెడివారు కాదని అందురు ఆ లెక్కన అరణ్యములో నున్న వారందరును కృష్ణునే తలంచుటచేత, మహర్షులని చెప్పవచ్చును. వారు కృష్ణునే చూచుచు, కృష్ణుని గానమునే వినుచు, కృష్ణుని తప్ప యింకే యితర విషయము గురించి యోచించుట లేదు. యమునా నది కూడ కృష్ణునిపై ప్రేమను పెంచుకొని, అందలి చిన్న చిన్న అలలు కృష్ణుని పాదముల తాకుచు, తమ యెడ దయచూపమని అడుగుచున్నట్లుండెను కృష్ణుడు గోవర్ధన పర్వత సానువులలో సంచరించుటచేత అన్ని పర్వతములలో గోవర్ధన పర్వతము మిక్కిలి అదృష్టవంతమైనదని చెప్పవచ్చును. గోవులు అచట మేయుచుండగా, అచటి పర్వత గుహలందు అతడు వేణువు నూదుచుండెడివాడు అచ్చట నున్న వృక్షముల నుండి పుష్పములను ఫలములను కోయుచుండెడివాడు. భక్తులు భగవంతునికి పుష్పములను, జలమును, ఫలములను సమర్పించినట్లుగా, గోవర్ధన పర్వతము అనేక దినములుగా కృష్ణునికి యిట్టి సేవ చేయుచుండుటచేత, కృష్ణునికి పరమ భక్తుడుగా రూపొందెను ఒక్కరోజు కూడ తప్పిపోకుండ యీ సేవ జరుగుచుండెను మరి కృష్ణుని ప్రేమపూరిత దృక్కులు యీ పర్వత సానువులపై ప్రసరించుటలో ఆశ్చర్యమేమి కలదు?

## 179 గోపికలకు కృష్ణుని వాగ్దానము

గోపికలకు కృష్ణునిపై యెనలేని ప్రేమ మార్గశిర మాస వాతావరణము వారి ప్రేమకు దోహదము చేయుచున్నట్లుగా నుండెను. మాసము లన్నిటిలో మార్గశిర మాసము అతి పవిత్రమైనదని, కాత్యాయనీ దేవిని పూజించినచో వారి ప్రార్థనలు సఫలము కాగలవని వారు విని యుండిరి హేమంత ఋతువులో మార్గశిర మాసము మొదటిది. యమునానది నిర్మలమైన స్వచ్ఛమైన నీటితో నిండియుండెను. గోప కన్యలందరూ

కాత్యాయనీ దేవిని ప్రార్థించుటకు నిశ్చయించుకొనిరి. తెల్లవారు జామునే వ్రత నియమము ననుసరించి యమునా నదీ తీరమునకు వెళ్ళుచుండిరి. చల్లని నదీ జలములో స్నానముచేసి, నది ఒడ్డున మట్టితో కాత్యాయనీ దేవి విగ్రహము చేసి పూజించి, పళ్ళు, పువ్వులు, నైవేద్యము సమర్పించి, వారి కోరికలు తీర్చమని ప్రార్థించెడివారు

''దేవీ! కాత్యాయనీ! మాయా! యోగినీ! అధీశ్వరీ! మేము నీ భక్తులము మా యందు దయ గలిగి యుండుము నందుని కుమారుడైన కృష్ణుడు మమ్ములను ప్రేమతో జూచునట్లు చేయుము'' అని ప్రతి గోప కన్యయు ప్రార్థించుచుండెను వారి మనస్సులో వేరు తలపు ఉండెడిది కాదు. ఇట్లు రోజులు గడచుచుండెను ప్రతిదినమును బృందావన వీథులలో గోప కన్యలు గుంపులు గుంపులుగా చేరి ఆడుచు, పాడుచు, ఒకరి చేతులొకరు పట్టుకుని యమునా నదీ తీరమునకు పరుగెత్తుచుండెడివారు. వారి సంగీతమునకు దిక్కులు ప్రతిధ్వనించుచుండెను వారు తనివితీర యమునలో స్నానము చేయుచు తమ ప్రియ కృష్ణునిపై పాటలు పాడుచుండెడివారు

ఒకరోజు ఉదయము వారి నాట పట్టించుటకు కృష్ణుడు నిశ్చయించుకొనెను. నెమ్మదిగా వారికి తెలియ కుండ, వారి వెనుకనే కృష్ణుడు యమునా నదికి వెళ్ళెను వారందరును నదిలో ప్రవేశించి మెడవరకు మునిగి స్నానము చేయుచుండగా, అంతవరకు దాగియున్న కృష్ణుడు బయటికి వచ్చెను వారందరును వారి వారి ఆనందములో మునిగి యుండిరి కృష్ణుని లీలలను, అమోఘ కృత్యములను తలంచుచు, కృష్ణుడు ప్రస్తుతము జరుపుచున్న లీలను గమనింపకుండిరి మెల్లగా వారు వస్త్రములు విడిచిన ప్రదేశమునకు వెళ్ళెను వారి వస్త్రములను తీసుకుని తొందరగా చెట్టు చివరకు యెక్కి వారి సంభాషణలను వినుచు కూర్చొనెను. స్నానమాచరించి అలసిపోయిన తర్వాత గోప కన్యలు నది ఒడ్డుకు వచ్చిరి వారి వస్త్రములన్నియు అదృశ్యమగుట చూచి ఆశ్చర్యపడిరి తిరిగి వారు నదిలోనికి వెళ్ళి వస్త్రములను విడిచిన స్థలమును వెదుకసాగిరి కాని వారి చూపులన్నియు నిరర్థకమయ్యెను. వారి నేత్రములు అటు నిటు అన్ని ప్రదేశములను చూచుచుండెను కాని ఫలితము లేకపోయెను ఏమి చేయుటకు పాలుపోలేదు. అట్టి తరుణములో వారికి కృష్ణుని స్వరము వినిపించెను. అతడిట్లనెను. ''ఓ గోపికలారా! మీ దుస్తులు యిక్కడ నా వద్ద నున్నవి మీరు యిక్కడకు వచ్చి నన్ను అడిగినచో వాటిని మీకు యిచ్చెదను మిమ్ములను చూచినచో నాకు విచారము కలుగుచున్నది మీరందరు ఉపవాసములచేత యితర వ్రత నియమములచేత నీరసపడి సన్నపడినారు మీరు ఆ నీటిలో యెక్కువసేపు నిలువలేరు మీరందరు ఒకసారిగా, లేక ఒకరొక్కరే వచ్చి నా వద్ద నున్న మీ దుస్తులను తీసుకువెళ్ళండి''

ఆ కన్యలకు యేమి చేయవలెనో, యేమి మాట్లాడవలెనో తెలియకుండెను ఒకరి నొకరు చూచుకొనిరి వారు కృష్ణుని అమితముగా ప్రేమించి కృష్ణుని కొరకు కాత్యాయని పూజ చేయుట చేత కృష్ణునిపై వారికి కోపము లేకుండెను. నదిలో నీరు చల్లగా నుండెను. ఉదయవేళ శీతల వాయువునకు వారు వణకుచుండిరి. చివరకు వారిట్లనిరి ''కృష్ణా! నీ చిలిపి చేష్టలతో మమ్ము అల్లరి పెట్టుట భావ్యముగాదు. నీవు చాల మంచి బాలుడవని మాకు తెలుసు. మా వస్త్రములు మాకు యిచ్చివేయుము. చలిగా నున్నది, యీ చలిని మేము భరించలేకున్నాము. బృందావన రాజకుమారుడవైన నీవు మమ్ము యిట్లు వేధించుట ఉచితము కాదు. మేము నీ బానిసలము నీ ఆజ్ఞలను మేము తప్పక నిర్వర్తించెదము కాని, మా వస్త్రములను మాకు యిచ్చివేయుము లేనిచో . !''

అసంపూర్ణముగా వదలి వేసిన వాక్యమును విని, కృష్ణుడిట్లనెను. ''లేనిచో? మీరేమి చేసెదరు?''

వారిలో ధైర్యవంతురాలైన ఒక గోపిక యిట్లనెను. ''మేము రాజుతో నీపై ఫిర్యాదు చేసెదము''.

కృష్ణుడు గట్టిగా నవ్వి యిట్లనెను. ''మీ మాటలు పరస్పర విరుద్ధముగా లేవా! నా ఆజ్ఞ లన్నిటిని పాలించెదమందురు. సరే ఇది నా ఆజ్ఞ. వెంటనే వచ్చి మీ వస్త్రములు తీసుకొనుడు''.

మరొక మార్గము లేదని ఆ గోప కన్యలు గ్రహించిరి. ఉదయము చలిలో వణకుచున్న ఆకారములతో, వారి అవస్థను యెవరైనను పసిగట్టెదరేమోనను భయముతో, తమ సన్నని చేతులతో శరీరమును వీలయినంత వరకు ఆచ్ఛాదించుకొని, కృష్ణుడున్న చెట్టు వద్దకు పరుగున వచ్చిరి. కృష్ణుడు చెట్టు కొమ్మ మీద నుండి వంగి చిలిపి దృష్టులతో వారి నొకొక్కరినే చూచుచు యిట్లనెను. ''మీరందరు ఒక వ్రతము చేయుచున్నారు. కాని వ్రత నియమములు తెలుసుకొనక, మీరు వివస్త్రలై నదిలో స్నానము చేసి పాపము గావించుచున్నారు. అట్లు చేయుట తప్పు. అది వరుణదేవునకు తీరని అవమానము మీ పాపమునకు ప్రాయశ్చిత్తమేమనగా, రెండు చేతులు తల పైకి యెత్తి నాకు అంజలి ఘటింపుడు. అటు పిమ్మటనే మీ వస్త్రములను మీకు తిరిగి యిచ్చెదను''.

ఒక చేతితో మర్మావయవము కప్పుకుని రెండవ చేతి నెత్తి నమస్కరించిరి కాని కృష్ణుడు తల అడ్డముగా త్రిప్పి యిట్లనెను ''రెండు చేతులు జోడించిననే కాని అంజలి ఘటించినట్లు కాదు ఒక్క చేతితో నాకు నమస్కరించుట తగదు అట్లు చేయుట అసంపూర్ణమైన పూజ యగును. ఇన్ని రోజులుగా మీరు చేయుచున్న యీ వ్రతము, వరుణదేవుని అవమానించుట కొనసాగినచో, విఫలమగును''.

వ్రతము వృధాయగుట ఆ కన్యల కిష్టము లేకుండెను మరియు కృష్ణుడు తన చిలిపి పనులను వదలిపెట్టడని కూడ వారికి తెలియును సమయము మించిపోవుచున్నది. తెల్లవారి వెలుగు వచ్చినంతనే బృందావనవాసు లందరూ ప్రాతః కృత్యములకు అక్కడకు వచ్చెదరు తమ అజ్ఞానము నుండి వారు బయటపడి, రెండు చేతులు పైకెత్తి జోడించి కృష్ణుడు కూర్చున్న చెట్టు వద్దకు నడిచి వచ్చిరి వారికి తనపై గల భక్తికి సంతసించి కృష్ణుడు వారి వస్త్రములను తిరిగి యిచ్చెను

ఇది యొక చిత్రము. కృష్ణుడు వారి నాటపట్టించి, ఆట బొమ్మలుగాచేసి ఆడించెను వారి వస్త్రములు దొంగిలించెను అయినప్పటికిని వారికి కృష్ణునిపై కోపము రాలేదు వారు కృష్ణుని అందము గాంచుచు తన్మయత్వము చెందిరి. వారి మనస్సులందు కృష్ణునిపై యెట్టి కోపము లేకుండెను వారికి కృష్ణునిపై అమితమైన ప్రేమ.

గోప కన్యలు కాత్యాయనీ వ్రతము యెందుకు చేయుచున్నదియు కృష్ణుడెరుగును. తన్ను అమితముగా ప్రేమించు ఆ కన్యలపై కృష్ణునికి కూడ విశేషమైన ప్రేమ గలదు వారితో అతి సరళమైన స్వరముతో కృష్ణు డిట్లనెను. ''మీ మనస్సులో యేమున్నదో నాకు తెలియును మీ భక్తిని నే నంగీకరించినాను. నాయందు భక్తి గలవారు యెన్నడును వట్టి చేతులతో పోలేరు నా మాటను నమ్మండి. మీ హృదయము, మనస్సు నాకర్పించినారు మీ మనస్సునందు నాయందు ప్రేమ తప్ప యింకేదియు లేదు నేను చెప్పునది వినండి మీ హృదయము అందున్న ప్రేమ స్వచ్ఛమైనది అది సాధారణ మానవుల హృదయములలో నుండెడి

కామపూరితమైన ప్రేమ కాదు. విత్తనము భూమిలో నాటినచో అది తిరిగి మొక్కగా పుట్టును. కాని ఆ విత్తనమును వేయించినచో లేక కాల్చినచో, అందుండి తిరిగి మొక్క పుట్టుట జరుగదు. అదే విధముగా, మానవులు యితర మానవులపై పెంచుకొను ప్రేమ వారు లౌకిక బంధములలో చిక్కుకొనునట్లు చేయును. కాని నాపై మీకున్న ప్రేమ అట్లు గాదు. అది భౌతికమైనది కాదు. అది జీవితమునకు అంతిమ ధ్యేయము. మీ ప్రయత్నములు సఫలీకృతము కాగలవని అభయ మొసగుచున్నాను. నిశ్చింతగా మీరు మీ యిళ్లకు వెళ్లవచ్చు''

కృష్ణుని అభయ దానము విని ఆ గోపికలు విశేషముగా ఆనందించిరి. ఆ ఆనందముతో వారు తమ తమ యిండ్లకు వెళ్ళిరి

వారిలో ప్రతి ఒక్కరి మనస్సునందు ఒకే ఒక ఆలోచన గలదు. అది కృష్ణుడు వారితో చెప్పిన మాట: ''మీ మనస్సులో యేమున్నదో నాకు తెలియును. మీ వ్రతము నిష్ఫలము కాబోదని నేను అభయమిచ్చుచున్నాను'' అనగా వారి ప్రేమను కృష్ణు డంగీకరించెను. అంతేకాక, వారిపై తనకున్న ప్రేమను కూడ అనేక విధములుగా వెల్లడించెను. ఇంతవరకు ఆట పాటలతో పెరుగుచున్న ఆ కన్యలు, యిప్పుడు తమ హృదయములలో గొప్ప రహస్యము నొకదానిని దాచుకుని యున్నట్లుగా, ఆనందముతో కూడిన దరహాసముతో, కోరిన వస్తువును సాధించిన సంతోష భావముతో వారు సంచరించుచుండిరి. ఆ విధముగా రోజులు గడచిపోవుచుండెను

## 180 బ్రాహ్మణ పత్నుల భక్తి

అనువైన సమయములందు కృష్ణుడు పరిసరములపై తన అభిప్రాయములు వెలిబుచ్చెడివాడు. ఒకసారి, యెప్పటివలె, ఉదయముననే యువకులందరును బృందావనము నుండి సమీపములో నున్న అరణ్యమునకు వెళ్ళిరి. అది వారు నిత్యము ఆడుకునెడి ఆట స్థలము. ఇది గోవర్ధన పర్వత సానువులపై నున్నది. ఎండ తీవ్రముగా భరించలేనంతగా నుండి నప్పటికిని, వృక్షముల నీడక్రింద వారికి చల్లగా నుండెను కృష్ణుడు పరిసరముల గూర్చిన ఆలోచనలోపడెను. తామున్న ప్రదేశము యెంత రమణీయముగా నున్నదో కృష్ణుడు తన స్నేహితులకు వర్ణించి చెప్పెను.

''ఇటు చూడండి'' అని కృష్ణుడనెను ''ఈ చెట్లు యెట్లు అనుగ్రహించుచున్నవో చూడుడు. ఒక దానితో నొకటి అల్లుకుపోయిన యీ చెట్ల కొమ్మలు అందముగా గొడుగు వలె మనకందరకును నీడ నిచ్చుచున్నవి. ఇతరుల శ్రేయస్సు కొరకు జీవించు ఆ వృక్షములెంత భాగ్యవంతమైనవి! ఎండ తీవ్రతకు అవి యెట్టి ఫిర్యాదు చేయక యెండ తీవ్రతను, గాలి వానల బీభత్సమును, మంచు వంటి చలిని శాంతముగా భరించుచున్నవి. ఆ విధముగా ప్రకృతి బీభత్సముల నుండి అవి మనలను రక్షించుచున్నవి. వాటి జీవితమును ఆదర్శముగా తీసుకొని ఆ విధముగా జీవించుటకు యత్నించవలెను. సహాయము కోరి వచ్చిన వారిని స్వార్థపూరిత మానవునివలె రిక్త హస్తములతో తిరిగి పంపవు. వృక్షములు, ఆకులు, పువ్వులు, ఫలములు, నీడ, వేరు, బేడు ను యిచ్చుచున్నవి చనిపోయిన తర్వాత కూడ తమ శరీరమును మానవుల వినియోగమునకు అంకితము

గావించుచున్నవి. పవిత్ర గ్రంథములన్నియు, తమ జీవితమునర్పించి యైననూ యితరులకు మేలు చేయవలె నని చెప్పుచున్నవి. ఈ వృక్షములు ఆ సూత్రమును ఉత్తమ మానవుల కంటె కూడ, తు.చ. తప్పక పాటించుచున్నవి''.

వారు మౌనముగా నడచుచుండిరి స్వార్థ రహితముగా వృక్షములు మానవుల కందించుచున్న సేవలను గురించిన ఆలోచనలు కృష్ణుని మదిలో యింకను మెదలుచుండెను మామూలుగా చిలిపి పలుకులు పలికే కృష్ణుడు అందుకు భిన్నముగా యానాడు పలికిన పలుకులు తన స్నేహితులను ఆలోచించునట్లు చేసెను. తదుపరి వారందరను యమునా నది ఒడ్డు చేరుకొనిరి. అచట వారు యెప్పటివలె ఆడుచుండిరి. వారి ఆనంద కోలాహలము నదీ ప్రవాహ శబ్దముతో కలిసిపోవుచున్నట్లుండెను

ఇంతలో ఆ యువకులు కృష్ణునితో నిట్లనిరి ''కృష్ణా! ఇప్పటికే చాల ఆలస్యమయినది. సూర్యుడు నట్టనడిమికి వచ్చినాడు ఆటలలో మునిగి కాలము గమనించకపోతిమి అందరకును ఆకలి వేయుచున్నది. రామ! నీవును కృష్ణుడును కలిసి యేదైన చేయవలెను మీ కిరువురకును యిదేమియు కష్ట కార్యము కాదు మా కేదైన తినుటకు తెచ్చిపెట్టుడు''. ఒక క్షణము కృష్ణుడు ఆలోచించి యిట్లనెను ''ఈరోజు మనము యేమియు తీసుకురాలేదు. కాని నాకొక ఆలోచన కల్గినది దగ్గరలోనే యాగములు చేయు పవిత్ర స్థల మొకటి కలదు. వేద శాస్త్రములలో నిపుణులైన పెక్కుమంది బ్రాహ్మణులు 'అంగిరస' యజ్ఞము గావించుచున్నారు. అక్కడకు వెళ్ళి బలరామకృష్ణులు పంపించిరని చెప్పి భోజనము పెట్టమని అడగండి'' ఆనందముతో ఆ యువకులు పరుగెత్తి వెళ్ళి త్వరలోనే ఆ ప్రదేశము చేరుకొనిరి వారు బ్రాహ్మణులను సమీపించి, పాదములకు నమస్కరించి యిట్లనిరి ''పవిత్రాత్మురాలా! మా విన్నపము నాలకింపుడు మేము బృందావనములోని గోపాలురము. మాకు ఆకలిగా నున్నది అరణ్యములో యింతవరకు ఆవులను మేపుచుంటిమి నందుని కుమారులైన బలరామకృష్ణులు మాతో వచ్చిరి వారు మమ్ములను మీ వద్దకు పంపి యీ విధముగా మనవి చేయమని చెప్పిరి. 'మాకు ఆకలిగా నున్నది భోజనము పెట్టి మా ఆకలి తీర్చవలెను' మీరు జరుపుచున్న యజ్ఞము సౌత్రామణి కాదని వారు మీతో చెప్పమని కోరినారు (సౌత్రామణి యజ్ఞమందు యజ్ఞము జరుపువారు యిచ్చే ఆహారము ముట్టకూడదు). ఈ యజ్ఞములో యజ్ఞ పశువు పునీత మగుటచేత, యితరులకు భోజనము పెట్టుటలో దోషము లేదు''.

ఆ బ్రాహ్మణులు వారి మాటలను మౌనముగా వినిరి ఈ యజ్ఞము జరుపుటలో వారి ధ్యేయము స్వర్గసౌఖ్యములు పొందుటకొరకు మాత్రమే కర్మకాండ, అందుకు సంబంధించిన విధులు మాత్రము ఆ బ్రాహ్మణులకు అతి ప్రధానమైనవి; అంతేకాక చాల తెలివిగల వారమని వారు భావించుచుండిరి అందుచే, మానవ రూపములో భగవంతుడు అడిగినప్పటికిని వారు లక్ష్యపెట్టకుండిరి

యజ్ఞములోని పంచాగ్నులు, ఇంద్రుని నాయకత్వములోని దేవతలు, యజ్ఞ నిర్వాహకుడు, యజ్ఞ ఫలము, యజ్ఞమునకు సంబంధించిన అన్ని వస్తువులు నారాయణుని వివిధ అంశములే నారాయణుడే యజ్ఞేశ్వరుడు ఆ నారాయణుడే వచ్చి వారిని ఆహారమిమ్మని అడిగెను. దురదృష్టవంతులైన బ్రాహ్మణులు ప్రాప్తించబోవు లోకమును గూర్చిన చింతలో ప్రస్తుతము వారి చుట్టూనున్న లోకమును గురించి తెలియకుండిరి నారాయణుడే కృష్ణుడను సత్యము వారు గ్రహింపలేకపోయిరి అందరి మానవులవలె కృష్ణుడొక సాధారణ మానవుడని యెంచి, గోప యువకుల మనవి నాలకింపక, మౌనముగా కూర్చొనిరి

ఆ యువకులు కొంతసేపు అట్లే కూర్చొనిరి. బ్రాహ్మణులు ఔననిగాని కాదనిగాని పలుకకుండిరి ఇక ప్రయోజనము లేదని తలచి, ఆ గోప యువకులు అక్కడ నుండి పరుగెత్తి తిరిగి బలరామకృష్ణులున్న ప్రదేశమునకు వచ్చిరి. వారికొరకు వేచియున్న బలరామకృష్ణులతో నిట్లనిరి ''మేము యజ్ఞశాలకు వెళ్ళి బ్రాహ్మణుల నడిగితిమి మీరు ఆహారము యిమ్మని అడిగినట్లు వారితో చెప్పినాము మేమందరమును యెంత ఆకలిగా నున్నామో వివరించి చెప్పినాము కాని, కృష్ణా! ప్రయోజనము లేకపోయెను వారు మౌనము వహించిరి నిల్చుండుటకు ఓపిక లేక తిరిగి వచ్చివేసినాము. ఇప్పుడిక మేము యేమి చేయవలెనో చెప్పుము మాకు యెంత ఆకలిగా నున్నదో నీకు తెలియును మీరిద్దరును కూడ యెంతో ఆకలితో నున్నారు. దీని కేదైన మార్గ మొకటి యోచింపుడు''

''స్నేహితులారా!'' కృష్ణుడు సంబోధించెను ''అడుగుకొనువారు యిటువంటి అవమానములు యెదుర్కొనవలసి యుండును. బాధలేదు ఆ బ్రాహ్మణుల భార్యల వద్దకు వెళ్ళి, వారితో నేను బలరాముడు యిక్కడ ఉన్నట్లు చెప్పవలెను వారికి వేద శాస్త్రములు తెలియవు కాని నన్ను ప్రేమించుట వారికి బాగుగా తెలియును వారు యెల్లప్పుడూ నన్నే తలచెదరు వారు మీకు తప్పక భోజనము పెట్టెదరు''.

గోప యువకులు యీసారి యజ్ఞశాలలో బ్రాహ్మణుల భార్యలున్న స్థలమునకు వెళ్ళి వారి పాదములకు నమస్కరించి యిట్లనిరి. ''మీకు మా నమస్కారములు సావధానముగా మా మనవి వినవలెను. బలరామకృష్ణులు పంపగా మేము వచ్చితిమి వారు సమీపములోనే వేచియున్నారు కృష్ణుడు మీకొక సందేశమును పంపెను 'గోవులు, స్నేహితులతో కలిసి నేనును బలరాముడును యీ అరణ్యమునకు వచ్చినాము చూడగా మేము చాల దూరము వచ్చినట్లున్నది. మాకు చాల ఆకలిగా నున్నది మాకు భుజించుట కేదైన యీయవలెను''' బ్రాహ్మణ పత్నులు వారి మాటలు పూర్తియగువరకు వేచి యుండలేకపోయిరి కృష్ణుడు సమీపములోనే యున్నాడని విని మిక్కిలిగా సంతోషించిరి యజ్ఞమునకు వండిన పదార్థములన్నిటినీ చేతికందిన పాత్రలలో పెట్టి, వాటిని తీసుకుని తొందరగా, నదులు సముద్రములో చేరుటకు ఉత్సాహపడినట్లుగా, కృష్ణుడున్న ప్రదేశమునకు బయలుదేరిరి తమ ఆరాధ్య దైవముగా భావించు కృష్ణుని చూచుటకు ఉవ్విళ్లూరు చుండిరి

కృష్ణుడు తన భక్తులను కలుసుకొనుటకు నిశ్చయించుకొనెను పసుపు పచ్చని పట్టు వస్త్రము ధరించెను వనమాలను ధరించిన కృష్ణుని వక్షస్థలము అందముగా గోచరించుచుండెను వంకులు తిరిగిన జుట్టు కిరీటమువలె నుండెను జుట్టు ముడులలో తురిమిన నెమలి పింఛము గాలికి యెగిరుచు శోభాయమానముగా నుండెను నేలపై నున్న కెంధూళిని చెక్కిళ్లకు రాసుకొనెను కుడిచేతితో కలువపువ్వును పట్టుకుని, యెడమచేతిని తన చెలికాని భుజముపై ఆన్చి యుంచెను. ఆత్రుతతో కృష్ణుని చూడగోరుచున్న యజ్ఞపత్నులకు యీ దృశ్యము యెంతో సుందరముగా కానవచ్చెను

దూరము నుండి వారు కృష్ణుని గాంచిరి పద్మముల వంటి నేత్రములు, మైథనోపేతమైన దరహాసము చూచి ముగ్ధులైరి , గోకులమందు, బృందావన మందు యిదివరకు వినియున్న లీలా కృష్ణుని నేడు కన్నులార గాంచిరి అట్లే కృష్ణుని చూచుచు తన్మయులై యీ లోకమును, తమను తాము మరచి నిలుచుండిపోయిరి వారికింకే విషయముపై ధ్యాసలేదు ఇంతకాలముగా తాము ప్రేమించుచున్న కృష్ణుని ఇంతకాలముగా నిరీక్షించి యిప్పుడు కనులార చూచుచున్న కృష్ణుని గురించి వారు తలంచుచుండిరి ఈనాడు వారి కనుల ముందు చిరునవ్వుతో కనుల నిండుగా అభిమానముతో వారి యెదుట కూర్చొని యున్నాడు సుషుప్తి అవస్థలో

అహంకారము పూర్తిగా నశించినట్లు, కృష్ణుని సమక్షములో నున్నామన్న భావోద్వేగములో తమ్ము తాము మరచిరి

కృష్ణుడు వారి మనోభావములు తెలుసుకుని చిరునవ్వుతో యిట్లనెను. ''తల్లులారా! మీకు స్వాగతము. ఆసీనలుకండు మిమ్ములను యెట్లు సంతోష పరుపగలము మీరు యింత దూరము మమ్ము చూచుటకు నడచి వచ్చుట మా అదృష్టము మీరు వివేకవతులు ప్రతిఫలము నాశించని భక్తి నాపై మీకు గలదని నాకు తెలియును మీకు రుచింపని మాటలను కొన్నిటిని నేను చెప్పవలసియున్నది. నాయందు మీకు గల ప్రేమచేత, మీరు అనుసరించవలసిన యితర ధర్మములు వదలి వచ్చినారు. భౌతిక విషయములు, అనగా యీ జీవితము, శరీరము, మనస్సు, బుద్ధి, పిల్లలు, భర్త సంపద, బంధు మిత్రులు, యివన్నియు నిరర్థకములనియు, అర్థ రహితములనియు గ్రహించు స్థితిని బ్రహ్మస్థితి యందురు. అటువంటి స్థితిని మీరు చేరుకున్నారు. నాపై మీకున్న ప్రేమ స్వార్థ రహితమైనది. కాని తల్లులారా! మీరు తిరిగి యజ్ఞశాలకు వెళ్ళవలెను ఏకాగ్రతతో మీ భర్తలు జరుపుచున్న యజ్ఞము సమాప్తి గావించుటకు మీ అవసరము యెంతైనా ఉన్నది''

ఆ స్త్రీలు కనుల నీరు గార్చుచు యిట్లనిరి. ''ఇటువంటి క్రూరపు మాటలు మాట్లాడుట నీకు ఉచితము గాదు నీ భక్తులెవరును నశింపబోరని నీవు వ్రతము పట్టినావు. దానినిపుడు నిజము గావింపుము. అన్నిటిని వదలి నీ వద్దకు వచ్చినాము నీ పవిత్ర పాదములను తాకిన తులసిదండ మాత్రమే మాకు కావలెను. ఇపుడు నీ వద్దకు వచ్చిన మేము మరలి వెళ్ళుటకు మరొక ప్రదేశమేదియు లేదు. మా భర్తలు, పుత్రులు, తండ్రులు, తల్లులు మమ్ములను అంగీకరించి స్వీకరింపరు.

''నీవు తప్ప మాకు యితరులెవరును లేరు మమ్ము నీతో గొనిపొమ్ము'' కృష్ణుడు వారితో యిట్లనెను ''మీరు నిస్పృహ చెందవద్దు. మీ భర్తలు మిమ్ము తప్పు పట్టరు మీ గురించి చెడుగా యెవ్వరును పలుకజాలరు మీ నడతలో యెటువంటి తప్పుగాని దేవతలైనను పట్టజాలరు ఇది నా మాటగా విశ్వసించి నిర్భయముగా నుండుడు.

''మీరు నన్ను వదలి వెళ్ళుట యిష్టము లేకపోవుటే, మీ భర్తల వద్దకు తిరిగి వెళ్ళకుండుటకు నిజమైన కారణము. నేను మీ హృదయములలో యెల్లపుడు నుందును తల్లులారా! శరీరముతో కూడిన ఆత్మ, అనగా యీ మానవ జీవిత, ప్రభావము మీవంటి వారికుండదు. మీకు సుఖాభిలాష గాని, రాగ బంధములుగాని లేవు మీ మిగిలిన జీవితము నన్ను గురించిన ఆలోచనలతో, నన్ను చింతించుటతో గడచి, చివరకు మీరు నాలో ఐక్యము కాలగరు. మరియు, నావద్దనే నిత్యము ఉండుట, మీకు నాపై గల భక్తితో సరిసమానముకాదు. నన్ను గురించిన కథలు వినుట చేతను, నన్ను చింతించుటచేతను, నా రూపమును మీ మనసులో ప్రతిష్ఠించుకుని చూచుట చేతను, నన్ను స్తుతించుట చేతను మీరు యెక్కువ ప్రయోజనము పొందగలరు. నామాట విని, మీ యిండ్లకు మీరువెళ్ళి మీ భర్తలకు నిత్యసేవలను జరుపుడు''

యజ్ఞపత్నులు తిరిగి యజ్ఞశాలకు వెళ్ళిరి. వారి సాహచర్యములో బ్రాహ్మణులు యజ్ఞము సమాప్తిగావించిరి. వారిలో ఒకామె వెళ్ళిన వెంటనే కృష్ణుని తలంచుచు యీ భౌతిక శరీరమును విడిచిపెట్టెను.

# 181 బ్రాహ్మణుల పశ్చాత్తాపము

యజ్ఞము జరిపిన బ్రాహ్మణులు సిగ్గుతో కుచించుకుపోయిరి. తమ హీన ప్రవర్తన భార్యలముందు సిగ్గుపడునట్లు చేసినది. వారు తమ చర్యకు సిగ్గుపడి తమను తాము నిందించుకొనసాగిరి తమ జీవితములో ఒక గొప్ప సదవకాశమును గోల్పోయిరి. ఎట్టి శాస్త్రములతో పరిచయము లేని వారి భార్యల భక్తి వారు సిగ్గుతో బాధపడునట్లు చేసెను. వారు యిట్లు తలపోసిరి ''బలరామకృష్ణులకు ఆహారము నివ్వని మనము యెంత దురదృష్టవంతులము! మన ప్రవర్తన మూలముగా గొప్ప నేరము చేసినట్లయ్యెనుగదా!

''మనము ముమ్మారు పునీతులమయినట్లు చెప్పుదురు. మొట్టమొదట స్వచ్ఛమైన తల్లిదండ్రులకు జన్మించుటచే మన జన్మ స్వచ్ఛమైనది గాయత్రీమంత్ర ముపదేశము పొందుటచే రెండవసారి మనము పునీతులమైతిమి. మరియు, మూడవసారి ఈ యజ్ఞము చేయుటకొరకై ప్రత్యేకమైన విధులు జరుపుటచే పరిశుద్ధులమైనాము అయితేనేమి? ఈ బాహ్య కృత్యములచేత పరిశుద్ధమైనప్పటికిని, అంతశ్శుద్ధి లేనందువలన యీ బాలురు పరబ్రహ్మస్వరూపులని గుర్తింపకుంటిమి. మన జన్మ, వేదశాస్త్రాధ్యయనము, బ్రహ్మచర్యము మున్నగునవన్నియు వ్యర్థము కదా! మనము పొందిన విశేష జ్ఞానము, లభించిన ఉత్తమజన్మ, యజ్ఞములు జరిపి సాధించినది, కర్మకాండలు సలుపుటలో మనకున్న నైపుణ్యము, అన్నియు నిరర్థకముగదా! ఇంతవరకు మనము వేదశాస్త్రములను బాగుగా చదివిన ఉత్తమ బ్రాహ్మణులమని గర్వపడినాము మనము 'జ్ఞాన'వంతుల మను గర్వము మనలను గుడ్డివారిని చేసి సత్యమును విస్మరించునట్లు గావించినది. ప్రత్యక్షముగా కన్నుల యెదుట గోచరించిన సత్యమును చూడలేకపోతిమి. ఆహా! మాయ మనల నెట్లు ఆవహించెనోగదా!

''మన భార్యల సంగతి చూడుడు! భగవంతునిపై వారికెంత భక్తియో గదా! వారు వేదశాస్త్రముల నెన్నడును అభ్యసించకుండుట అందరును యెరిగిన సత్యమే వారికి ఉపనయనమను కర్మ లేకపోవుటచేత గాయత్రీ మంత్రోపదేశము, బ్రహ్మవిద్య వారు పొందియుండలేదు. గురువు ద్వారా వారు పవిత్ర వేదములు నేర్వలేదు వారు యెన్నడును తపస్సు చేయలేదు బ్రహ్మసత్యమును తెలుసుకొను ఆత్మవిద్యను వారు అధ్యయనము చేసి యుండలేదు సంధ్యావందన మాచరించక పోవుటచేత వారు స్వచ్ఛమైన వారి లెక్కలోనికి రాలేదు. అయినప్పటికిని 'అపరిశుద్ధ'మైన వారుగా, అజ్ఞానులుగా తెలివితక్కువవారుగా మనము పరిగణించిన యీ స్త్రీలు దేవతలకు దైవమైన కృష్ణునిపై భక్తిని పెంచుకొనిరి మనకదిలేదు మనము విధులాచరించుటలో నిమగ్నమై, మన గృహస్థ ధర్మమును, కృష్ణుడు గుర్తుచేసినప్పటికిని అలక్ష్యము చేసితిమి కొన్ని పరిస్థితులలో యజ్ఞము పూర్తికానప్పటికిని యితరులకు భోజనము పెట్టుట తప్పుకాదని కృష్ణుడు చెప్పినట్లు ఆ గోపబాలురు చెప్పినప్పటికిని మనము వినిపించుకొనలేదు మనము విముక్తి పొందుటకు అవకాశమును కల్పించినాడు లేకున్న భగవంతుడు వచ్చి మనలను ఆహారముకొరకు యాచించుటేల? నారాయణుని పాదములను యెల్లపుడును సేవించు లక్ష్మి, తన చాంచల్యమును అహంకారమును వీడి, తనతోడనే నిత్యముండునట్లు అనుగ్రహించుమని పాదసేవ చేయుచుండగా, న వద్దకు వచ్చి ఆకలిగా నున్నదని భోజనము పెట్టుడని అడుగగా మనము నిరాకరించితిమి! మనము చేసినది యెంత ఘోరమైనది! అతడెవరో మనకు తెలియక కాదు. అజ్ఞానము కారణముగా చెప్పలేము యోగీశ్వరుడైన నారాయణుడు యదువంశములో జన్మించినట్లు వినియున్నాము అయినప్పటికిని, అవసర సమయములో మనము వివేకము కోల్పోయితిమి భగవంతునిపై అచంచల భక్తి మాత్రమే కోరదగినదని మన భార్యలు మనకు చెప్పవలసి వచ్చెను అనంత

జ్ఞాన స్వరూపుడైన కృష్ణునికి నమస్కారము. విధులలో నిమగ్నమగుటచేత బుద్ధి మందగించెను మనము చేసిన క్షమించరాని యీ పాపమును, అనంత కరుణా సముద్రుడైన కృష్ణుడు దయదలచి క్షమించునని ఆశింతము. మనము భ్రాంతిలోపడి చేజిక్కిన మహదవకాశమును జారవవిడుచుకొంటిమి. కృష్ణుడు మనలను క్షమించుగాక''।

సిగ్గుతో అవమానముతో దహించుకు పోవుచున్న బ్రాహ్మణులకు బలరామకృష్ణులను చూచు ధైర్యము లేకుండెను మరియు వారికి కంసుని దుష్టత్వము బాగుగా తెలియును. ఈ సంఘటన కంసునికి తెలియకూడ దని భావించి, వారు ఊరకుండిరి. ఆ కారణముచేత దివ్యమైన జన్మలను పొందిన బలరామకృష్ణులను చూచుటకు వారు రాలేకపోయిరి

## 182 గోవర్ధన పర్వతము

ఒకరోజు బృందావన వాసులందరును యేదో పనిలో నిమగ్నమై యుండుట కృష్ణుడు గమనించెను. తన యింటి యందుకూడ అందరును తీరుబడిలేకుండ యేదో ఒక గొప్ప కార్యమునకు సన్నద్ధు లగుచున్నట్లు కనుగొనెను తనకు అంతయు తెలిసినప్పటికిని, కృష్ణుడు తండ్రి నందుని వద్దకు వెళ్ళి వినయముగా నిలుచుండెను నందునితో మిగిలిన పెద్దలు కూడ నుండిరి కృష్ణుడు చేతులు జోడించి తండ్రికి నమస్కరించి యిట్లడిగెను ''తండ్రీ! అందరును యేదో ముఖ్యమైన కార్యములో మునిగియున్నట్లున్నారు. ఎక్కడ చూచినను ఉత్సాహము వెల్లివిరియుచున్నది. గొప్ప పండుగ యేదో జరుపనున్నట్లున్నది అది యేమిటో నాకు తెలియజెప్పగలరా?'' నందుడు కృష్ణుని తన తొడపై కూర్చొనబెట్టుకుని జుట్టు నిమురుచుండెను. ''కుమారా! ఒక యాగము నిర్వహించుటకు మేము సన్నాహములు చేయుచున్నాము''

కృష్ణుడు కన్నులు వెడల్పు చేసి ''యాగమా?'' అని ప్రశ్నార్థకముగా నడిగెను ''ఏ దైవమునకు ప్రీతిగావించుటకు ఈ యాగమును చేయనున్నారు? తండ్రీ! మీ హృదయములలోయేదో ఒక తీరని కోరిక ఉండియుండవచ్చును ఈ యాగము తలపెట్టుటకు ఆ కోరిక ప్రోద్బలము చేయుచున్నదని తలచెదను. నేను తెలుసుకోవలెనని కోరినపుడు మీరు యెప్పుడును నాకు తెలియజెప్పెడివారు. యాగము తలపెట్టవలసి నంత బలమైన కోరిక యేమిటో నాకు తెలుపగోరెదను అన్నింటికన్న ఆత్మ గొప్పదనియు, శత్రువునకును మిత్రునకును భేదము లేదనియు తమకు యితరులకు తారతమ్యమేమియు లేదనియు, ద్వంద్వములను సమబుద్ధితో చూచు ప్రజలకు కోరికలుండనేరవు

''బుద్ధిహీనులు చిన్నచిన్న కోరికలకు లోనగుదురు. అవి లౌకికమైనవి అట్టివారు యజ్ఞయాగములు, కర్మకాండలు చేయుచుందురు. తాను చేయు కార్యములు పూర్తిగా తెలుసుకొని చేయువారు కొందరైనచో, మరికొందరు గుడ్డి నమ్మకముతో యీ విధులను నిర్వర్తింతురు మొదటి తరగతివారు మాత్రమే తమ ప్రయత్నములకు తగిన ప్రతిఫలమును పొందెదరు రెండవ తరగతివారు తాము చేయు కార్యముల ప్రయోజ నము తెలియని అజ్ఞానులు

''తండ్రీ! ఇపుడు మీరు చేయబోవు యాగము గురించి చెప్పండి నాకు తెలుసుకొనవలెనని యున్నది. యజ్ఞము ప్రయోజనమును సరిగా యోచించి చేయుచున్నారా? లేక యింతకు పూర్వము మీ పూర్వులు చేయుచుండిరి కాబట్టి వారి సంప్రదాయము నుల్లంఘించుట కిష్టము లేక చేయుచున్నారా? ఈ యాగమేమిటో, దానిని జరుపుటకు వెనుకనున్న కారణమేమిటో, ఈ యాగము చేయుటకు మిమ్ములను ప్రేరేపించుచున్న బలవత్తర కారణము లేమిటో వివరించి చెప్పవలెను''

నందుడిట్లనెను. ''నీకు పూర్తిగా వివరించి చెప్పెదను. నీవు చెప్పునది సవ్యముగా నున్నది. నాకు వ్యక్తిగతముగా యెట్టి కోరికలు లేవు అందరి శ్రేయస్సు కొరకే నేనిది చేయబోవుచున్నాను. స్వర్గాధిపతియైన ఇంద్రుడు మనకు వర్షములు యిచ్చుచున్నాడు. మేఘములు ఇంద్రుని అంగములు ఈ మేఘములు సమృద్ధిగా వర్షముల నొసగుచున్నవి అందుమూలముగా పశువులకు గ్రాసము, చేకూరుచున్నది, బీడు భూములు లాభము పొందుచున్నవి. పశువులే మన సంపద సమృద్ధిగా గడ్డి దొరకుటచే అవి జీవించగలుగుచున్నవి. ఇంద్రుడు మనకీ బహుమానముల నిచ్చుట చేత, అతనిని మనము పూజింతుము తమకు లభించిన యీ బహుమతులను సాధనములుగా వినియోగించి, ధర్మార్థకామములను మానవులు సాధించెదరు. ఈ మూడింటెని సరియైన తీరులో సాధించినచో అవి నాలుగవదైన మోక్షమునకు దారితీయగలవు. అనగా మానవుల ప్రయత్నము లకు మేఘములు ఫలితము నిచ్చుచున్నవి ఇంద్రుని పూజించుట అనేక తరములుగా జరుగుచున్నది. ఇంద్రుని పండుగ అను ఈ యాగమును యెప్పుడును మేము జరుపుచున్నాము దీనిని సరిగా నిర్వహింపకుండుట యెవరికిని మంచిదికాదు ఇంద్రునిగాని, ఇంద్రుడిచ్చు ప్రతిఫలమునుగాని యెవరును ఉపేక్షించతగదు''

ఇంద్రుని ఆటపట్టించి, విచిత్రము చూడవలెనని కృష్ణుడు నిశ్చయించుకొనెను పెద్దల నందరినీ కలయజూసి కృష్ణుడు వారితో యిట్లనెను ''నేను మీతో ఏకీభవించలేను''

నందుడును తదితరులును ఆశ్చర్యముతో త్రుళ్ళిపడి యిట్లనిరి ''నీవు బాలుడవు. నీవు యేమి మాట్లాడుచున్నావో నీకు తెలియదు''

కృష్ణుడిట్లనెను ''నా వాదమును జాగ్రత్తగా వినుడు నా వాదము వినిన తర్వాత, మీకు నచ్చుకున్నచో, మీరు యాగము చేయుటకు తగు సన్నాహములు చేయవచ్చును''

ఈ బాలుడు యేమి చెప్పునోయని అంద ' ' వినసాగిరి కృష్ణుడు మాట్లాడుచున్నపుడు అందరూ నిశ్శబ్దముగా నుండిరి.

కృష్ణుడిట్లనెను. ''కర్మచేతనే జీవులు పుట్టుచున్నవి కర్మచేతనే జీవులు మరణించుచున్నవి. సుఖము, దుఃఖము, భయము, క్షేమము మున్నగున వన్నియు కర్మ ఫలితములు ఈ జనన మరణములను సంసార చక్రముతోగాని, జీవించునపుడుగాని దేవతలకెట్టి ప్రమేయము లేదు మీరు చెప్పినట్లుగా ఒకవేళ, మానవులకు వారి అర్హతనుబట్టి ఒక దేవత యిచ్చునని అనుకున్నప్పటికిని, ఆ దేవత కూడ మానవులు చేసిన కర్మలకు, వాని ఫలితములకు లోబడి చరించవలసి యున్నది పూర్వజన్మలో చేసిన కర్మలు యీ జన్మలో మన అదృష్టమును తీర్చిదిద్దును ఏ దేవుడుగాని ఇంద్రుడుగాని మానవుని భాగ్యమును మార్చలేడు మానవులు పూర్తిగా వారి 'స్వభావము'పై ఆధారపడియున్నారు, ఇది పూర్వజన్మలో చేసిన కర్మచేత నిర్ణయమగుచున్నది అసురుడగుటగాని, మానవుడగుటగాని కర్మపైననే ఆధారపడి యుంటున్నది జీవుడు ఉత్తమశ్రేణికి చెందిన

మానవుడుగాని, అధమజాతికి చెందిన పశువుగాగాని జన్మించుట కర్మను బట్టి జరుగుచున్నది. మానవులలో ఉత్తమాధమ తరగతులలో జనించుటకూడ కర్మపైననే ఆధారపడి యున్నది శత్రువుగాగాని, మిత్రుడుగాగాని, లేక తటస్థుడుగా గాని యుండుట కర్మచేతనే నిర్ణయమగుచున్నది.

''మానవులు జీవితమును వారి చర్యలను కర్మయే నిర్దేశించుచున్నదిగాని, స్వర్గములో నున్న వారెవరును కాదు. అందుచేత కర్మ అధీనములో నున్న మానవులు 'కర్మ'ను దైవముగా యెంచి పూజించవలెను అతని ప్రవర్తన పద్ధతులను కర్మ నిర్దేశించవలెను. ఒకదానిపై ఆధారపడి యున్నప్పుడు, దానిని వదలిపెట్టి మరొక దైవమును పూజించుట సవ్యముకాదు.

''బ్రాహ్మణులు వేదజ్ఞానముతో జీవింతురు. క్షత్రియులు దేశమును రక్షించుచు జీవింతురు. వైశ్యులు మాటకు కట్టుబడి, యిచ్చి పుచ్చుకునే వ్యాపారము చేయుదురు. శూద్రులు తమకంటె అధికులకు సేవ చేయుచు జీవింతురు

''వ్యవసాయము, వ్యాపారము, పశు సంరక్షణ, ధనమును అప్పుగా యిచ్చుట ... వ
జీవన విధానమును వైశ్యులు అనుసరింతురు. మనము మూడవ తరగతికి చెందినవారము అనగా పశువులను సంరక్షించుచు, అవి మనకు యిచ్చే సంపదతో జీవింతుము.

''సత్వరజస్తమో గుణములు జీవించుటకు, జన్మించుటకు, మరణించుటకు వరుసగా కారణములు. చరాచర వస్తువులన్నియు రజోగుణము చేత కలుగుచున్నవి ఈ రజోగుణముచేతనే ప్రకృతియందు నాలుగుదిక్కులందు మేఘము లేర్పడుచున్నవి. ఆ మేఘములు భూమిపై వర్షించుచున్నవి అందుమూలముగా జీవులు యీ భూమి మీద జీవింపగలుగుచున్నవి మరి ఇంద్రునికి వర్షమునకు యేమి సంబంధము? వర్షములు కురియుట ప్రకృతి సహజము. ఇంద్రునికెట్టి బాధ్యతయు లేదు మన వరకు మనము పాలించవలసిన భూమి ఏదియు లేదు మనకు పట్టణములు లేవు. మనదన్న దేశమేదియు లేదు చివరకు ఒక పల్లెగాని గుడిసెగాని మనదన్నది యేదీ లేదు. మనము కేవలము అడవులందు, పర్వతపంక్తులందు సంచారము చేయువారము మనకు ఒకటే కోరిక, మన పశువులకు గడ్డి నిచ్చువానికి మనము కృతజ్ఞత తెలుపవలసి యున్నది ఆ పశువులు గడ్డిమేసి మనకు పశు సంపద నొసగుచున్నవి.

''అందుచేత మన గోవులకు గడ్డి నందిచ్చుచున్న యీ గోవర్ధన పర్వతమును, గోవులను, బ్రాహ్మణులను పూజించుట సముచితముగా నుండగలదని సూచించుచున్నాను. ఇంద్రుని పూజించుటకు సమకూర్చిన వస్తువులను ఈ గోవర్ధన పర్వతమును పూజించుటకు వినియోగించుదము. గోవుల పాలను యీ పర్వతమునకు నైవేద్యముగా సమర్పించుదము. పిండుచేసి యీ పర్వతమున కొసగుదము చదువుకున్న బ్రాహ్మణులను పిలిపించి, యజ్ఞాగ్నిని యేర్పరచి, అందు గోవుల నుండి లభించే పాలు, పెరుగు, వెన్న, నెయ్యి సమర్పించి వేదమంత్రములను పఠించునట్లు చేయుదము బీదవారికి, ఆకలితో నున్నవారికి అన్నము పెట్టుదము. గోవులను, గోవర్ధన పర్వతమును పూజించుదము. మనము పట్టుబట్టలు, ఆభరణములు ధరించుదము శరీరమునకు గంధము పూసుకొని మెడలో పుష్పహారములను వేసుకొందము ఈ పండుగ వేడుకలో గోవర్ధనము చుట్టును ప్రదక్షిణము చేసి, మనకు సమృద్ధిగా అన్నియు యిచ్చుచున్నందుకు కృతజ్ఞత తెలుపుదము నా అభిప్రాయములను సూచనలను మీకు తెలియజెప్పితిని. మీకు అంగీకారమైనచో నేను చెప్పినట్లు చేయుడు''

కాలమే భగవంతుడు బాలుని రూపములో ఆ భగవంతుడు ఇంద్రుని అహంకారము వణగ ద్రొక్క నిశ్చయించెను భగవంతుడే పలికినపుడు, నందుడు యితర పెద్దలు కాదందురా? కృష్ణుడు సూచించినట్లుగా చేయుటకు వారంగీకరించిరి ఆ ప్రకారము వారు పూజ జరిపిరి. బ్రాహ్మణులు వేదమంత్రములు పఠించి అగ్నిలో ఆజ్యము పోసిరి. ఆ తరువాత బ్రాహ్మణులను గోవులను గోవర్ధన పర్వతమును పూజించిరి. పర్వతము దిగువ నైవేద్యము పెట్టిరి.

వారు చేయుచున్నది సరియైనదని నమ్మించుటకు కృష్ణుడొక రూపము ధరించి, అది గోవర్ధన పర్వత స్వరూపమని ప్రకటించెను. బలరాముడు తప్ప అన్యులెవరును ఆ స్వరూప స్వభావము యెరుగకుండిరి!

గోపికలు, గోపాలురు మంచి పట్టు వస్త్రములు ధరించి, పాడుచు నృత్యము చేయుచు, గోవర్ధన పర్వతము చుట్టును ప్రదక్షిణము జేసి, గోవర్ధన పర్వత స్వరూపమైన కృష్ణునకు నమస్కరించిరి.

తాము చేసిన పూజలకు వెంటనే ప్రతిఫలము లభించినందుకు వారందరును ఉప్పొంగిపోయిరి పండుగ ముగిసిన తర్వాత గోపాలురందరును వ్రజభూమికి తిరిగి వచ్చిరి.

## 183 ఇంద్రుని ఆగ్రహము

ఇంద్రుడు మండిపడెను కృష్ణుని సూచనపై గోపాలురు వర్తించుట తన్నవమానించుటకేనని భావించి సహింపలేకపోయెను. వారినందరినీ శిక్షించుటకు నిశ్చయించుకుని, 'సంవర్తక'ములనే మేఘములను రావించి యిట్లనెను "సాధారణ మానవుడు, యింకను బాలుడుగా నున్న కృష్ణుని సూచనపై గోవులను కాచుకొను గోపాలకులు యెంత ధైర్యముగా నన్నవమానించిరో చూడుడు. నాకు అన్ని పదార్థములు అర్పించుట నిరుపయోగమని ఆ బాలుడు చెప్పగా, అందరును ఆ మాటవిని నన్ను అలక్ష్యము చేసిరి ఇన్ని సంవత్సరము లుగా జరుపుచు వచ్చిన 'ఇంద్రునిపండుగ'ను జరుపకుండిరి ఇందుకైనేను వారిని శిక్షించెదను. ఈ మూర్ఖులు సంసార రనావ సహాయముతో దాటగలమని తలపోయుచున్నారు వారికి ఆత్మవిద్య తెలియదు విముక్తి పొందుటకు జేయు కర్మకాండ యననేమో వారెరుగరు కృష్ణుని మాటలను మాత్రమే వారు వినిరి అయినను, యీ కృష్ణుడెటువంటివాడు? అతడు బాలుడు, అజ్ఞాని, అతిగా మాట్లాడుచుండును చాల తెలివైనవాడనని తలచును ఎవరిని గౌరవించదగునో తెలియనంత అహంభావము గలవాడు అటువంటి ఒక బాలుడు, అజ్ఞానులైన గోపాలకుల కందరుకును హితబోధకుడయ్యెను వారు నాకు ప్రీతి కల్గించకుండిరి. వారికి యెట్లో లభించిన సంపదను చూచుకుని అహంకార పూరితులైరి. మీరు వెళ్ళి వారిని శిక్షించమని ఆజ్ఞాపించుచున్నాను వెళ్ళి వారి గర్వము నణచుడు నాకు బదులుగా పూజలందుకున్న గోవులనన్నింటిని వధించుడు ఐరావతముపై నేను మిమ్ముల ననుసరించి వచ్చి, వారు తగిన శిక్షపొందునట్లు చూచెదను"

ఇంద్రుని పనుపున మేఘములు గుంపులు గుంపులుగా బృందావనమువైపు ప్రయాణమయ్యెను అకస్మాత్తుగ బృందావనములో వర్షము కురియుట ప్రారంభమయ్యెను పగా పట్టించుకొనలేదు క్రమముగా కుంభవృష్టిగా కురియుచుండెను భయంకరమైన ఉరుములు, పిడుగులు, మెరుపులతో దద్దరిల్లు

చుండెను. ఆవాహ ప్రవాహములను పెనుగాలులు ప్రేరేపింపగా, మేఘములు వడగళ్ల వానను విరివిగా కురిపించుచుండెను. కొద్దిసేపటిలో భూమి అంతయు జలమయ మయ్యెను. ఎత్తు పల్లములు కనుపించకుం డెను. అంతయు సముద్రమువలె గోచరించుచుండెను. తీవ్రమైన వర్షధాటికి భరించరాని చలికి, గోవులు నిలద్రొక్కు కొనలేక పోయెను. గోపాలురు, వారి భార్యలు, పిల్లలు వర్షపు హోరుకు తాళలేక, కృష్ణుని వద్దకు వెళ్ళి, యీ ఆపద నుండి రక్షింపుమని ప్రార్థించిరి. పాపము గోవులు తమ శిరస్సులను కాళ్ళమధ్య నుంచుకుని తమను తాము రక్షించుకొనుచుండెను ఈ దృశ్యము అతి దీనముగా నుండెను. గోపాలు రందరును వేదనతో గొంతెత్తి ''కృష్ణా! కృష్ణా! యీ ప్రమాదము నుండి కాపాడుము. ఇంద్రుని ఆగ్రహము నుండి, యీ వర్ష మేఘములనుండి మమ్ము రక్షింపుము'' అని విలవిలలాడుచు యేడ్చుచుండిరి

ఈ కుంభవృష్టికి కారణము కృష్ణునికి తెలియును. బీభత్సమును సృష్టించిన ఇంద్రుని ఆగ్రహము యెంత తీవ్రమైనదో కృష్ణుడు అంచనావేసి తెలుసుకొనెను. తనలో తానిట్లు తలపోసెను ''ముల్లోకములకు అధిపతినని తలపోయు నింద్రునకు బుద్ధి చెప్పవలసిన సమయము వచ్చెను తన్ను గురించి తాను కడుగొప్పగా ఊహించు కొనును ఉన్నత స్థితిలో నున్న యెవ్వరికైనను అహంకారము తగదు. అకారణముగా బాధకు గురియైన యీ ప్రజలను నేనే యెట్లు రక్షించ గలుగుదునో చూపించెదను''

ప్రజలందరును చూచుచుండగా కృష్ణుడు గోవర్ధనపర్వతము దిగువకు వెళ్ళి, పిల్లలు కుక్కగొడుగును ఊడబెరికి చేతిలో పెట్టుకొనునట్లు, ఆ పర్వతమును తన ఒంటి చేతితో పైకెత్తి, తోటి ప్రజలతో యిట్లనెను. ''మీరందరు యీ పర్వతము క్రిందకు రండు. మీతో గోవులను, దూడలను, కావలసిన యితర వస్తువులను తీసుకుని రండు ఇది నా చేతి నుండి తప్పి దాని క్రిందపడి నలిగిపోగలమనే భయము అక్కరలేదు నామాట నమ్మండి అట్లు జరుగదు. ఇపుడు మీరు యీ భయంకరమైన గాలివాన గాలికి భయపడుచున్నారు మీ కష్టములు తీరినవి మీకు రక్షణ కల్పించెదను'' వారు కృష్ణుని, మహోన్నతమైన ఆ గోవర్ధనపర్వతమును, ఒకదాని తరువాత మరొక దానిని, రెప్పవాల్చక ఆశ్చర్యముతో చూచుచుండిరి వారు దేని గురించి భయపడుచున్నారో గ్రహించి, కృష్ణుడు మరల వారికి అభయమొసంగెను గోపాలు రందరును గృహములలోని అవసర వస్తువులను తీసుకుని, పర్వతము క్రింద నుండుటకు పరుగుపరుగున వచ్చిరి విశ్రాంతియను ఆలోచనను కృష్ణుడు దరికి రానివ్వకుండెను. నిద్రాహారములు మాని పర్వతమును చేతితో నెత్తి పట్టుకొనగా, దానిక్రింద బృందావన వాసులందరును సురక్షితముగా నుండిరి

ఈ కుంభవృష్టి ఏడుదినములు యెడతెరిపి లేక సాగెను. ఇంద్రుని ఆగ్రహము నిష్ప్రయోజనమయ్యెను. ఎవరినైతే శిక్షింపనెంచెనో వారందరు కృష్ణుని చేత సురక్షితముగా నుండిరి

యోగశక్తిచేత కృష్ణుడు సాధించినది స్వర్గవాసులకును ఇంద్రునకును అద్భుతముగా గోచరించెను. అహంకా రము, గర్వము అణగిపోగా, ఇంద్రుడు వర్ష మేఘములను ఆకాశమునుండి ఉపసంహరించెను. వర్షము ఆగిపోయెను

ఆకాశము తిరిగి నీలవర్ణము దాల్చెను భూమిపై నీరు యింకిపోయి యెండిన సూచలు కనుపించెను. బృందావన వాసులతో కృష్ణుడు సంతోష పూర్వకముగ నిట్లు పలికెను ''వర్షము ఆగినది. సూర్యుడు ఆకాశమందు స్పష్టముగ ప్రకాశించుచున్నాడు ఆకాశము నీలముగ మారెను సూర్యునివేడి తాకుటచే భూమి మరల వెచ్చగా నయ్యెను మీరు యింతవరకు ఆశ్రయము పొందిన యీ పర్వతము క్రిందనుండి బయటకు

వచ్చి, మీమీ యింఢ్లకు వెళ్ళి నిత్యకృత్యములను గావించుకొనవచ్చును వర్షఋతువులో తప్ప వర్షములు యిక పడబోవు''

కృష్ణుని మాటల ననుసరించి వారందరు బృందావనమునకు వెళ్ళిరి. దూరము నుండి కృష్ణుడు తన చేతితో గోవర్ధన పర్వతము నెత్తి నిలుచుండుట వారందరు చూచిరి. వారందరును గమనించుచుండగా కృష్ణుడు పర్వతమును భూమిపై నుంచెను. మిక్కిలి అభిమానముతో కృతజ్ఞతతో అందరు కృష్ణుని కౌగిలించుకుని అభినందించిరి. పెద్దలు చేయెత్తి కృష్ణుని ఆశీర్వదింపగా, యువకులు కృష్ణుని చుట్టును నాట్యము చేయసాగిరి. స్వర్గములో సంగీత వాద్యములు వినిపించెను. దేవతలు కృష్ణునిపై పుష్పవర్షము కురిపించిరి.

ఈ సంఘటన తరువాత బృందావనవాసులు కృష్ణుడు సాధించిన వానిపై తీవ్రముగా ఆలోచింపసాగిరి. సరస్సులో ఏనుగు తన తొండముతో కలువపువ్వు నెత్తినట్లుగా, ఒక బాలుడు తన చేతితో గోవర్ధన పర్వతమును యెత్తుట యెట్లు సాధ్యమయ్యెనా యని అచ్చెరువందిరి. కృష్ణుని దివ్యత్వము నెరుగనివారు ఆశ్చర్యము చెందిరి. వారిట్లనిరి ''నందా! నీ కుమారుడొక విచిత్రవ్యక్తి ఇవన్నియు ఆ బాలుడెట్లు చేయగలుగుచుండెను? ఒక గోపాలుని పుత్రునివలె లేదు ఈ బృందావనమందు పూసలలో మణివలె నున్నాడు. వెనుక జరిగినవన్నియు గుర్తు చేసుకున్నచో, పసివాడుగా కూడ యెన్నో అద్భుతములు చేసెను నెలల శిశువుగా నున్నపుడు పూతనయను రాక్షసి స్తనము నుండి ప్రాణములను పీల్చివేసెను. వయస్సు మీరిన తర్వాత కాలము మనుష్యుల నుండి ప్రాణములను గైకొన్నరీతిలో నుండెను. ని చంపెను. అప్పుడు కూడ కృష్ణుడు శిశువే. బిగ్గరగా యేడ్చుచు బండిని కాలితో తన్నగా, బండి చక్రములో దాగియున్న ఆ రాక్షసుడు నాశనమైనాడు తృణావర్తుడు కృష్ణుని మీది కెత్తినప్పటికిని, అతనిచే సులభముగా హతమారినాడు ఒక సాధారణ శిశువు రెండు వృక్షముల మధ్య నుండి ప్రాకగా, అవి నేలపై కూలుట యెట్లు సంభవించెను? యమునా నది ఒడ్డున బకాసురుని యెట్లు వధించినదియు బాలురందరును వివరించినారు. ప్రలంబుడు, ధేనుకుడు అను రాక్షసులను గూడ సంహరించుట తెలిసినదే అరణ్యములో చెలరేగిన మంటల నుండి మన బాలురను, గోవులను రక్షించుట మనకందరకును బాగుగా తెలుసును. మన మందరము చూచుచుండగా, కాళీయునిపై తలలపై కృష్ణుడు గంతులు వేసి, ఆ భయంకర సర్పము సరస్సు విడిచి వెళ్ళునట్లు చేసినాడు ఆ సరస్సులోని నీరు అటు తర్వాత మధురముగా మారెను నందా! మన కందరకును ప్రాణపదమైన యీ బాలుని చూడగా, మనయందరి మధ్య ఒక సామాన్య గోపబాలుని వలె యెందుకు జన్మించెనా యని ఆశ్చర్యము కలుగుచున్నది?''

ఇదివరలో తనకు చెప్పిన సత్యము యిప్పుడు వారికి తెలియజెప్పవలెనని నందుడు యోచించెను తన కుమారుని అద్భుత చర్యలకు ఆశ్చర్యము చెందుచున్న పెద్దలతో నందుడు యిట్లు పలికెను ''నాకు తెలిసిన దానిని నేను మీకు చెప్పుటకు ప్రయత్నించెదను నారాయణుడు వివిధ యుగములలో అనేక రూపములు ధరించి అవతరించును. ఇది కూడ నారాయణుని అవతారమే నల్లని వర్ణము ధరించినాడు జ్ఞానియైన గర్గుడు నాతో యిట్లనెను ''నీ కుమారుడు వసుదేవుని కుమారుడు. అందుచే అతడు వాసుదేవుడు. అతని కనేక రూపనామములు గలవు. నాకు వాటిని గురించి తెలుసును కాని సాధారణ మానవులకు యివి తెలియవు అతడు గోకులమునకు వచ్చి మీకును, మానవజాతి కంతకును శ్రేయస్సు చేకూర్చనున్నాడు మీకందరుకును ప్రియతముడైన యీ బాలుడు నారాయణుని అందమునకు, గొప్పదనమునకు, కీర్తికి సరితూగగలడు అతని చర్యలకు వేనికిని ఆశ్చర్యపడ నవసరము లేదు''.

''ఈ విషయము నాకు గర్గుడు చెప్పెను. అతడు చెప్పిన ప్రతి ఒక్క మాటను నేను విశ్వసింతును. కృష్ణుడొక దివ్య బాలుడని నారాయణుని అంశమని పరిగణించుచున్నాను. అతని చర్యలు మనకు అద్భుతముగా గోచరించినప్పటికిని, దేవదేవునికవి సహజమైనవి''.

పెద్దలందరును నందుని మాటలువిని, కృష్ణుని దివ్యత్వమును తలచుకొనిరి. కాని దీర్ఘకాలము మన వద్ద నుండు వస్తువుల విలువను తెలియకుండినట్లుగా, బృందావనవాసులు కృష్ణుని దివ్యత్వములు మరచిపోయి యెప్పటివలె సంచరించుచుండిరి. కృష్ణుని సంకల్పము కూడ యిదియే.

## 184 గోవిందుడుగా పట్టాభిషిక్తుడైన కృష్ణుడు

గోవర్ధన పర్వతము క్రింద నుండి ప్రతిఒక్కరును వెళ్ళువరకు కృష్ణుడు ఆగి, అటుపిమ్మట ఆ పర్వతమును భూమిపై నుంచెను. కృష్ణుడు ఏకాకిగా నున్న సమయములో ఇంద్రుడు అచటకు వచ్చెను. శక్తిని కోల్పోయి అణగిన ఇంద్రుడు సిగ్గుతో వినమ్రుడై నోటమాటరాక నిలుచుండి యుండెను. అతనితో కామధేనువను గోవు కూడ నుండెను. గోవర్ధన పర్వతము దిగువ కృష్ణుడు ఏకాకిగా నిలిచి యున్నప్పుడు ఇంద్రుడు సమీపమునకు వచ్చి మణులతో పొదిగిన తన కిరీటమును కృష్ణుని పాదములపై బెట్టి నమస్కరించెను. తరువాత లేచి నిలబడి చేతులు జోడించి కృష్ణుని స్తుతించుచు మాట్లాడసాగెను. ఇంద్రుడు ''నా అనుచిత ప్రవర్తనను క్షమింపవలెను'' అని పలికెను.

''ప్రభూ! రజస్తమో గుణములను విడనాడి సత్త్వగుణమే ప్రధానముగా మూర్తీభవించిన నీకు నన్ను క్షమించుట కష్టము కాదు. ఈ లోకమంతయు అవిద్యతో (అనగా సత్యము తెలియకుండుట) నిండి యున్నది. ఈ అవిద్యకు మాయ ప్రధాన కారణము. అది సత్యమును మరుగు పరచును. మరియు నిది త్రిగుణముల సమ్మేళనము. నీవు గుణాతీతుడవు. కాబట్టి నిన్ను యివి బంధించలేవు. నీవు స్థాణుడవు, శాశ్వతుడవు. అదియే సత్యము. సాధారణ దోషములతో నిండిన మానవులకు నీ వద్దకు వచ్చు ధైర్యము లేదు. లోభము, దురాశ శరీరము తోడి అనుబంధము వలన కలుగుచున్నవి. ఇవి పునర్జన్మకు కారణములగుచున్నవి. మానవుని అజ్ఞానమునకు అవిద్యకు యీ దోషములే నిదర్శనములు.

''భౌతిక విషయములేవియు నిన్ను అంటజాలవు. నీవు యీ భౌతిక ప్రపంచ వ్యామోహములలో తగులు కొనకుండినప్పటికిని, ధర్మము ప్రతిష్ఠించి రక్షించుట కొరకు, అధర్మ వర్తనులను శిక్షించుట కొరకు, మానవ రూపనామములు ధరించి యితర మానవులవలె యీ పాపభూయిష్ఠమైన ధరణిపై సంచరించుచున్నావు. మాలో పెక్కుమంది యిది గ్రహించలేకున్నారు.

''నీవు లోకపితవు, లోకపాలకుడవు. అనంతమైన కాలమే నీవు. అహంకారముతో గుడ్డివారమై, ప్రవర్తన నిబంధనలను అతిక్రమించు నావంటి వారలను శిక్షించుటకు నీవు అవతరించినావు. తిరిగి ఆర్యమార్గమున మమ్ము నడిపింపుము. వేదములు నిర్దేశించిన నిబంధనలను ఉల్లంఘింపక నడచుకొనువారే ఆర్యులు. ఈ నిబంధనలను అనుసరించని వారు అనార్యులు. క్షమింపరాని నా ప్రవర్తనను క్షమింపవేడెదను. దేవతల కధిపతినని

నాకున్న సంపదను శక్తిని చూచుకొని గర్వముతో ప్రవర్తించినాను. నీ గొప్పతనము గ్రహించలేక, నీ శక్తి నెదిరింపదలచి ఘోరమైన తప్పు చేసినాను నా తప్పును క్షమించమని యికముందు యిట్టి పరిస్థితిలో చిక్కుకొనక యుండునట్లు చేయవలసినదిగా ప్రార్థించుచున్నాను''.

కృష్ణుడు చిరునవ్వు నవ్వి యిట్లనెను ''ఇంద్రా! నీవు నాకు యెప్పుడును ప్రీతిపాత్రుడవే. నేను నీ సోదరుడను, ఉపేంద్రుడను కాదా! ఈ సంఘటనను యెందులకు జరుగనిచ్చితిని? నీవు తప్పు మార్గములో నున్నావని గుర్తుచేయుటకు యిట్లు చేసితిని. నీకు స్వర్గాధిపతినని, శక్తిమంతుడనని తలబిరుసెక్కినది. ఈ దుర్గుణములను పోగొట్టి యెప్పటివలె నుండునట్లు చేయుటకై యీ సంఘటనను కల్పించినాను. గోపాలురు 'ఇంద్రుని పండుగ' జరుపకుండునట్లు నేనే చేసితిని. నీపై నాకెట్టి పగయు లేదు. అంతేకాక నీ శ్రేయస్సునే కోరుచున్నాను నీతమ్ముడైన ఉపేంద్రునికి నీవు పూర్వపు ఇంద్రుని వలె నుండవలెనని నేను కోరితిని.

''మరియొక విషయము చెప్పనిమ్ము. బంగారపు మెరుగు చూచి అంతర్నేత్రము గుడ్డియైన వాడు నన్ను కాంచలేడు. అట్టివానిని నేను అనుగ్రహించి నా భక్తుని గావించుటకు, అతడు సంపదను గోల్పోవునట్లు చేయుదును కష్ట సమయములో నున్నపుడే మానవుడు తనకన్న గొప్ప శక్తులు గలవని గ్రహించును. నీపై నాకెప్పుడును అమితమైన అభిమానము గలదు. నీవు నిశ్చింతగా వెళ్ళవచ్చు''

కామధేనువు కృష్ణునితో యిట్లనెను. ''బృందావనములో నీవు గోపాలకుడుగా నుండుట మా అందరి మహద్భాగ్యము నీవు మా సంతతిని రక్షించుచుండుటచే వాటికెట్టి విచారమును లేదు. మరియు నీవు పోషించి పాలించుచుండుటచే అవి సుఖముగా నున్నవి నీవు దేవతలకు దేవుడవు. నీవు మాకు రాజువు, ఇంద్రుడవు. నిన్ను మా ప్రభువుగా పట్టాభిషిక్తుని చేయుటకు బ్రహ్మ అంగీకారము పొందినాను. నీవు యీ భూమిపై నుండి అధర్మమును పారద్రోలుటకు అవతరించినావు నీకు మా నమస్కారము''.

అటు తరువాత కామధేనువు స్వర్గము నుండి తెచ్చిన జలముతో, తన పాలతో కృష్ణు నభిషేకించెను. ఇంద్రుడు స్వర్గము నుండి గంగను తీసుకు రావలసినదని ఐరావతమును కోరెను మందాకినీ నదికి మూలము నారాయణుని పాదములు ఇంద్రుడు గంగా జలముతో కృష్ణున కభిషేకము గావించి యిట్లనెను ''ఇప్పటి నుండి నీవు గోవిందుడుగా ప్రసిద్ధి చెందెదవు. నీవు గోవులకు రక్షకుడవు మరియు యీ సమస్త లోకమునకు సకల జీవులకు రక్షకుడవు. అందుచే గోవిందుడను నామము నీకు తగియున్నది ఈ లోకములోని ప్రజలు తరువాతి కాలములో యెంతో ఆప్యాయముగా నిన్ను గోవిందుడని కొలిచెదరు.

''నేను దేవతల కధిపతిని, ఇంద్రుడను. నీవు సకల జీవులకు ఇంద్రుడవు. ముల్లోకములలోను నీవు గోవిందుడుగా కీర్తి గాంచెదవు. ఈ నామము చిరకాలముగా నుండగలదు''.

దివ్య మహర్షులు నారద తుంబురులు భగవంతుని స్తుతించుచు గానము చేసిరి. గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు కృష్ణుని స్తుతించుచు పాటలు పాడిరి. అప్సరసలు ఆనందముతో నృత్యము చేసిరి. స్వర్గవాసులు కృష్ణునిపై పుష్పవర్షము కురిపించిరి. ఆకాశమంతయు వారి స్తుతులతో నిండిపోయెను

ముల్లోకములు సంతోషముగా నుండెను. ఆ సంతోషముచేత గోవుల క్షీరము యీ భూమిపై ప్రవహించెను పాల వంటి తియ్యని జలముతో నదులు నిండెను వృక్షముల నుండి తేనె జాలువారు చుండెను పర్వతముల

వ్నియు ఆరోగ్యదాయకమైన వన మూలికలతో నిండియుండెను. ఔషధముల కుపయోగపడు వనమూలికల చిగుళ్ళు విలువైన వజ్రముల వలె ప్రకాశించుచుండెను. కృష్ణుని పట్టాభిషేక మహోత్సవమునకు అవి అలంకరించుకొనినట్లు గోచరించుచుండెను!

కృష్ణుడు పట్టాభిషిక్తుడైనపుడు, పరస్పరము ద్వేషించుకొను మృగములు కూడ మిత్రుల వలె ప్రవర్తింపదొడగెను.

ఇంద్రుడు కృష్ణుని వద్ద సెలవు తీసుకుని, కామధేనువు యితర స్వర్గవాసులు వెంటరాగా, స్వర్గమునకు తిరిగి వెళ్ళెను.

ఏమియు జరుగనట్లుగా కృష్ణుడు తన గృహమునకు నడచివెళ్ళెను

## 185 వరుణుని నుండి నందుని రక్షించుట

ఒకసారి నందుడు ఏకాదశీ వ్రతము నాచరించుచు, స్నానము చేయుటకై యమునా నదికి వెళ్ళెను ఆ వ్రత మేమనగా ఏకాదశినాడు ఉపవాసము చేసి, రోజంతయును పగలు, రాత్రి నారాయణుని ప్రార్థించి, మరుచటి దివము ద్వాదశినాడు నదిలో స్నానము చేసి పారణ చేయవలెను వ్రత నియమముల ననుసరించి ద్వాదశి రోజు ఉదయమున స్నానము చేయుటకై నందుడు యమునా నదిలో ప్రవేశించెను. అప్పటి కింకను సూర్యుడు ఉదయించలేదు. అది అసుర సంధ్యాకాలము నందుడు స్నానము చేయుచుండగా ఒక అసురుడు చూచి నందుని పట్టుకుని జలదేవత యైన వరుణుని వద్దకు గొనిపోయెను

సాన్నము చేయుటకు వెళ్ళిన నందుడు తిరిగి రాకపోవుటచే గోపాలకు లందరును ఆందోళనపడి భయభ్రాంతులైరి వారు వెంటనే బలరామకృష్ణుల వద్దకు వెళ్ళి జరిగిన సంగతి వివరించిరి ఇది వరుణుని మాయతోడి పన్నాగమని కృష్ణుడు గ్రహించెను. అతడు ఊర్ధ్వలోకమునకు వెళ్ళి వరుణుని భవనము ప్రవేశించెను వరుణుడు కృష్ణుని పాదములపైబడి పూజించి యిట్లనెను ''ఇప్పుడు నేను అనుగ్రహ పాత్రుడనైనాను. నా జన్మ సార్థకమైనది నీ పాదములు తాకిన వారు జనన మరణముల నుండి శాశ్వతముగా విముక్తి పొందుదురు. అజ్ఞాని యైన నా సేవకుని క్షమింపుము నీవెవరో అతనికి తెలియదు పట్టుకున్న వ్యక్తి నీ తండ్రియని కూడ అతడెరుగడు ఎట్టి దురభిప్రాయము పెట్టుకొనక నీ తండ్రిని నీవు తీసుకుని వెళ్ళవచ్చును''. కృష్ణుడు తిరిగి భూమికి దిగి వచ్చి నందునితో బృందావనమునకు తిరిగి వెళ్ళెను

తన కుమారుని యెడల వరుణుడు ప్రదర్శించిన భక్తికి నందుడు ఆచ్చెరువందెను వరుణుని అమోఘ సంపదను, అతని గొప్పదనమును కనులార గాంచెను. తన కుమారుని గొప్పదనమునకు ఆశ్చర్యము చెందెను జలదేవత యైన వరుణుడు తన సంపద నంతను కృష్ణుని పాదములపై నుంచి క్షమించమని కోరుట నందునికి మిక్కిలి ఆశ్చర్యము కలిగించెను. ఈ విషయమును గోపాలకు లందరికి వివరించి చెప్పెను గడచిన కొన్ని దినములుగా వారి మనస్సులో మెదలుచున్న భావములు — కృష్ణుడు మానవమాత్రుడు కాదు, భగవత్స్వరూపుడన్నది — సత్యమని స్పష్టమయ్యెను వారిలో వారిట్లనుకొనిరి ''దేవతలకు దైవమని మనకు తెలునును

అపార కరుణా సముద్రుడైన కృష్ణుడు మనలను తన నివాసమైన వైకుంఠమును చేరనిచ్చునా?''

వారి మనస్సులలోని ఆలోచనలు కృష్ణునికి పూర్తిగా తెలియును. అతడీ విషయమునే చాల కాలముగా ఆలోచించుచుండెను. తనలో తానిట్లు అనుకొనెను. బ్రహ్మము నిర్గుణము. ఆత్మయను సరోవరమును 'అహం' తాకినపుడు, అనగా త్రిగుణముల సమత్వము తప్పినపుడు మాయ ఆవరించును. అప్పుడు ఆత్మ తన సహజ తత్త్వమును మరచి సంసారములో చిక్కుకొనును. అహంకారము అవిద్యకు దారితీయును తన్ను తానెరుగకుం డుటయే అవిద్య అవిద్య కామమునకు దానికి సంబంధించిన యితర దుర్గుణములకు, అవి కర్మకు దారి తీయును. కర్మలో తగుల్కొనిన ఆత్మ జనన మరణములను సంసార వలయములో చిక్కుకొనును తన్ను గురించిన సత్యము, అనగా తాను బ్రహ్మమను విషయము తెలుసుకొను వరకు, యిది కొనసాగును. ఈ అమాయకులకు, నేను చూపించినతప్ప, బ్రహ్మమును తెలుసుకొను అవకాశము లేదు''.

గోపాలురపై అనంతమైన కరుణాభిమానములు వహించిన కృష్ణుడు వారికి బ్రహ్మమును ప్రకటించి చూపెను. నారాయణుని నివాసమైన వైకుంఠమును వారికి చూపించెను. వారు ఒకే ఒక తపస్సు చేసిరి అదియేమవగా కృష్ణునిపై వారికి గల స్వచ్ఛమైన ప్రేమ. దాని ఫలితముగా వారు వైకుంఠము చూడసాగిరి. ఈ తపస్సు మాత్రమే వారికి సాధ్యమైనది. దానిని వారు అత్యుత్తమముగా నెరవేర్చిరి.

బ్రహ్మము ప్రకృతికి భిన్నమైనది అది స్వచ్ఛమైన జ్ఞానము, అనగా స్వయం ప్రకాశము గలది. స్వయం ప్రకాశమనగా, దీనిని తెలుసుకొనుటకు వేరొక జ్ఞాన జ్యోతి లేక బుద్ధి యొక్క ఆవశ్యకత లేకుండుట. ప్రజ్ఞానమే బ్రహ్మ. అదియే సత్యము, అనగా చావుపుట్టుకలు లేనిది, అనంతమైనది, అనగా ఆద్యంతములు లేనిది. మాయను విసర్జించగలిగిన మనస్సులు మాత్రమే బ్రహ్మమును గ్రహించగలవు. అట్టి బ్రహ్మము గోపాలకులకు ప్రకటిత మయ్యెను వారు పేద అమాయకులు. వారికి గల ప్రేమ, భక్తి అనన్యమైనవి అందుచేతనే వారు బ్రహ్మమును దర్శించగలిగిరి

తరువాత వారు వైకుంఠము జూచిరి మొదట వారు తమ వ్యక్తిత్వమును మరచి పరబ్రహ్మములో మునిగిన అనుభూతిని పొందిరి. దీర్ఘకాలము వారు దీనిని భరింపలేరని తెలుసుకుని కృష్ణుడు వారిని తిరిగి సమాధిస్థితి నుండి తేరుకుని వైకుంఠము జూచునట్లు చేసెను నారాయణుడే కృష్ణుడు వేదము లతనిని పూజించినవి వారు తిరిగి దూరమున చూడగా తమతో బృందావనములో నున్న కృష్ణుని చూడజొచ్చిరి.

జరిగినది తలచుకొని వారు ''మనము యింతవరకు చూచినది నిజమా? లేక ఊహా దృశ్యమా?'' అని తమలో తాము అనుకొనిరి.

## 186 వెన్నెల రాత్రి

శరదృతువు ప్రవేశించెను శరద్రాత్రులు మల్లెపువ్వుల సువాసనలతో నిండియుండెను ఆ ఋతువు కృష్ణుడు గోపికల కిచ్చిన వాగ్దానము గుర్తుకు తెచ్చెను. అంతకు ముందు మార్గశిర మాసములో ఒకరోజు ఉదయము గోపికల వస్త్రములు అపహరించినపుడు కృష్ణుడు గోపికలకు వాగ్దాన మొసగెను సకల జీవులకు, జడ చైతన్య పదార్థములకు ఆశ్రయుడైన పరబ్రహ్మ స్వరూపుడు తన భక్తులకు సంతోషము కలిగించవలెనని నిశ్చయించుకొ

నెను. పూర్ణిమ రాత్రి త్వరలోనే రానున్నది.

అతడు నిశ్చయించుకొనిన రోజు వచ్చినది. తూర్పున చంద్రుడు, నక్షత్రములు ఉదయించెను. ఉదయించు చున్న చంద్రుని మృదువైన కిరణములు తూర్పున యెర్రగా గోచరించుచుండెను. చాల కాలము తరువాత ప్రియురాలి వద్దకు వచ్చి ఆమె కన్నీరు తుడుచుచున్న ప్రియుని వలె చంద్రుడుండెను. తన చల్లని వెలుగుతో ప్రజలను సేద దేర్చుచుండెను. కృష్ణుడు యమునా నది ఒడ్డుకు వెళ్ళెను. ఉదయ చంద్రుని వెలుగుపడి యమునా నదీ తీరమున వెండివలె నున్న యిసుక బంగారు వర్ణముతో మెరసిపోవుచుండెను. చంద్రుడు ఒక పెద్ద కమలా ఫలమువలె గోచరించసాగెను. చంద్రుడు లక్ష్మీదేవి వదనమువలె అందముగా నుండెను. దగ్గరలోనున్న అరణ్యము వెన్నెలలో స్నానమాచరించు చున్నట్లుండెను.

కృష్ణుడు వేణువు తీసి పెదవులపై నానించి మధురముగా వాయించు చుండెను. నదీ తీరము నుండి వెలువడిన ఆ సంగీత స్వరములు దూరముగా నున్న బృందావనములోని గృహములలో వినిపింపసాగెను. అవి నిత్యము కృష్ణుని మాత్రమే చింతించు గోపికల కర్ణములు సోకినవి. వారి హృదయములలో వేరు ఆలోచనలకు తావు లేదు. ఆ మధుర సంగీతము వారిని ఉన్మత్తులను చేసెను. ప్రతి ఒకరు కృష్ణుని వద్దకు వెళ్ళవలెనని సంకల్పించిరి. తీవ్ర ఉన్మత్తతలో నున్న వారు యుక్తా యుక్తములు యోచించక, తమ గృహములు వీడి యమునా నదీ తీరము వైపు వడి వడిగా వెళ్ళసాగిరి. వెళ్ళుచున్నపుడు, వారి ఆలోచనల కనుగుణముగా చెవుల తాటంకములు ఊగిసలాడుచుండెను.

ఆ దివ్య సంగీతము వినిపించినపుడు ఒక గోపిక ఆవును పిదుకు చుండెను. సంగీతము విన్నదే తడవుగా, గోవును పాలగిన్నెను అక్కడనే విడచి యమునా నది ఒడ్డుకు పరుగు పరుగున వెళ్ళెను. మరికొంతమంది పాలను పొయ్యి మీద మరగించుచుండిరి. మరగుచున్న పాలను అట్లే వదలి, మరగినవో లేదో చూడక, హుటాహుటి యమునా నదివైపుగా సాగిపోయిరి. మరొక గోపిక పొయ్యిపై నుంచిన బియ్యము నట్లే వదలి వెళ్ళిపోయెను.

ఇంట అత్త మామలకు వడ్డించుచున్న గోపిక, కృష్ణుని మురళీ నాదము వినిన వెంటనే, వారేమనుకొందురో యని తలంచక, వెంటనే యిల్లు విడిచి కృష్ణుని వద్దకు పరుగెత్తెను. ఆ గోపికలు, భర్తలను, అత్తమామలను, పిల్లలను, తమ విధులను, సర్వస్వమును మరచిపోయిరి. కృష్ణునితో నుండుటే వారి ప్రధానమైన ఆలోచన. చక్కగా నలంకరించుకొనవలెనను ధ్యాసకూడ వారికి లేకుండెను. ఒకామె కాటుక దిద్దుకొనుట పూర్తికాకపోగా, మరొకామె సిగలో తరుముకొనుచున్న పువ్వులను సగములో వదలివేసెను. చిందర వందరగా నున్న తలవెంద్రుకలతో మరొకామె పరుగెత్తెను. ఇంట నున్న పెద్దలు వారిని ఆపి యెక్కడకు వెళ్ళుచున్నదియు తెలుసుకొనగోరిరి. కాని గోపికలు వారి ప్రశ్నలను గాని, అడ్డగింపులనుగాని లక్ష్యము చేయకుండిరి.

కొందరు గోపికలను యింటి పెద్దలు ఆపుజేసిరి. ఆలోచనలన్నియు కృష్ణునిపై కేంద్రీకృతమైన వారు దీర్ఘ సమాధిలో నున్నట్లుండిరి. వారి పాపములన్నియు నశించి, వారికి గల అనన్యమైన భక్తిచేత మోక్షము పొందిరి. సత్కర్మలు చేసి పుణ్యమార్జించినవారు పుణ్యలోకములు చేరుదురని విజ్ఞులందురు. అటులనే దుష్కర్మలు చేయువారు పాపము సంతరించుకొని నీచ జన్మలు పొందుదురు. పాప పుణ్యములు సమముగా మిళితమైనపుడు మానవులుగా జన్మించుదురు. ఎల్లప్పుడును భగవంతుని చింతించుటచేత గోపికల పాప ఫలము పూర్తిగా నశించెను. భగవంతుని అమితముగా ప్రేమించుటచేత పుణ్య ఫలము కూడ లేక యుండెను. పాప

పుణ్యము అనునవి లేకుండుటచేత వారు మోక్షము నందసాగిరి.

శుకుని మాటలు విని పరీక్షిత్తు యిట్లడిగెను. ''మునీంద్రా! నాకు ఒక సందేహము కలుగుచున్నది. ఈ గోపికలు భగవంతుని ప్రేమించుటచేత మోక్షము పొందినట్లు చెప్పినారు. కాని వారు కృష్ణుని పరబ్రహ్మముగా యెంచి ఆరాధించలేదు. కేవలము ఇంద్రియ సుఖము అందించు ప్రియుని ప్రేమించినట్లుగా వర్తించినారు. అట్టి ప్రేమకు మోక్ష ఫలము యెట్లు కలిగెను? వారి దృష్టిలో కృష్ణుడు ఒక జారపురుషుడు, భగవంతుడు కాడు. అతడు అందగాడు, అందుచే అతనిని పొందవలెనని వారు కోరినారు. అటువంటి ప్రేమను భక్తియని యెట్లు చెప్పగలము? ఈ సందేహమును తీర్చవలెనని కోరుచున్నాను''.

శుకుడిట్లు సమాధాన మిచ్చెను. ''విష మనుకొని అమృతము త్రాగిన వానికి, యే విధముగను హాని జరుగదు సరిగదా, అమృతము సేవించిన లాభము సమకూరగలదని నీవు వినియుండలేదా? అదే విధముగా, గోపికలు కృష్ణుని సామాన్య ప్రియునిగా చూచినప్పటికిని, కృష్ణుడు పరబ్రహ్మ స్వరూపుడగుటచేత, వారి ప్రేమ భక్తిగా మారి, మోక్షము నందుకొనగలిగిరి. శిశుపాలుడు భగవంతుని ద్వేషించి నప్పటికిని మోక్షము పొందెనని నీకు చెప్పినాను గదా! భగవంతుని ద్వేషము చేత అవిరామముగా పరమాత్ముని తలచుచుండెను. అదే రీతిగా, భగవంతుని నిత్యమును తలంచు చుండుటచేత, వారు కర్మల నుండి విముక్తులైరి

''పరమాత్మ ప్రత్యగాత్మ - యీ రెండును అకళంకమైన సత్యములు కాని ఆవరణలు, అనగా జన్మ జన్మల నుండి సంప్రాప్తించిన వాసనలు ఆత్మ స్వచ్ఛతను మరుగుపరచును. తెర కప్పినట్లుండుటచే బ్రహ్మము కనిపింపదు. కాని కృష్ణుడు యీ వాసనలకు అతీతుడు, ద్వంద్వాతీతుడు అట్టి కృష్ణుడు యీ అమాయక గోపికలకు ఆరాధ్యుడు అతడు పరమాత్ముడని వారికి తెలియనప్పటికిని, అతనిపై వారికి గల ప్రేమ ఇంద్రియ సుఖాభిలాషతో కూడుకుని యున్నప్పటికిని, వారి భక్తి పరమాత్మ యెడల నున్న దనుట సత్యము. అందుచే వారు మోక్షము పొందగలిగిరి

''భగవంతునికై నిత్యము తపించు వారు, నిత్యము ద్వేషించువారు, నిత్యము ఆరాధించువారు, నిత్యము ప్రేమించువారు భగవంతునితో సన్నిహిత సంబంధము పెంచుకున్నప్పటికిని అట్టి వారు మోక్షమందుట నిశ్చయము''

## 187 గోపికలు, కృష్ణుడు

గోపికలు తన చుట్టును మూగి మధుర వేణు గానములో తన్మయులై యుండుట కృష్ణుడు చూచెను. ప్రతి ఒక్కరిని చూచి వారితో అతి మధురముగా సంభాషించెను. అతడిట్లనెను ''మీరందరను యీ అరణ్యము మధ్యకు ఈ రాత్రి సమయములో వచ్చినారు మీకు యే విధముగా తృప్తి కలిగించగలను? మీరు గుంపుగా యిక్కడకు వచ్చుటకు కారణమేమిటో నాకు వివరించ గోరెదను రాత్రి ప్రొద్దుపోయినది పొదల మాటున భయంకర మృగములు దాగి యుండవచ్చును దయచేసి మీ యిళ్ళకు తిరిగి వెళ్ళిపొండు. మీరు ఈ సమయములో యిచట నుండుట ఉచితము కాదు మీ బంధువు లందరును మీకొరకు వేచి యుందురు వారి ఆగ్రహము యినుమడించక మునుపే మీరు వెళ్ళవలెను ఈ వెన్నెలలో యమునా నదిని చూచుటకు

వచ్చి యుండవచ్చును. మీ చుట్టు నున్న అరణ్యమును పరికించి చూడుడు. చంద్రుని వెండిరేఖల కాంతి సముదాయము మరింత అందము చేకూర్చుచున్నవి. నది అలల నుండి వచ్చు చల్లని గాలి అంగములకు యింపు గూర్చుచున్నది. ఇక్కడకు వచ్చి కొంతసేపు ఉన్నారు. కాబట్టి యిక ఆలస్యము చేయక వెంటనే మీ గృహములకు యేగవలెను. మీ భర్తలు మీ కొరకు యెదురు చూచుచుందురు. మీ రెత్తుకొనేటపుడు పొందే ఆనందము కొరకు మీ పిల్లలు ఆతృతతో యెదురు చూచుచుందురు. మరియు గోవులు, దూడలు మీ సేవల నందుకోవలసి యున్నవి. నా వైపు నిందా పూర్వకముగా యెందుకు చూచెదరు? ఒకవేళ నాతో కాలము గడుపుటకు మీరు యిక్కడకు వచ్చినారా? అట్లయినచో అది నాకు సంతోషదాయకము. అన్ని జీవులు నా యందు ప్రేమ గలిగి యున్నవి. కాని మీ కర్తవ్యములను మీరు విస్మరించరాదు. మీ భర్తల, పిల్లల అవసరములు తీర్చుట మీ ప్రథమ కర్తవ్యము. స్త్రీకి తన భర్త యెడల తప్ప యితరులపై ప్రేమ కలిగియుండుట సరికాదు. అది మిమ్ములను స్వర్గమునకు దూరము చేయును. అది నిరర్థకము, మరియు మీకు కళంకము తెచ్చును. అది రహస్యమైన కోరిక యగుటచేత, నలుగురికి తెలియగలదనే భయము యెల్లప్పుడును వెంటాడును. ఇట్టి కృత్యముల నుండి విరమించుడు. మీ యిండ్లకు మీరు వెళ్ళి నాపై మీకు గల అపారమైన భక్తిని - నేను చేసిన కార్యములను తరచు వినుచు, నన్నే నిత్యము చింతించుచు, నన్ను గురించి గానము చేయుచు, నన్ను తరుచుగా దర్శించుచు - తలచుకొని ఆనందింపుడు. ఈ ప్రేమ అట్టి భక్తికి సరితూగదు. మరొకసారి మీ అందరినీ మీ మీ యిండ్లకు వెళ్ళుమని కోరుచున్నాను''.

శిలా విగ్రహముల వలె గోపికలు నిలుచుండిరి. కృష్ణుని పలుకులు వారి కర్ణములకు యిష్టము కలిగింపకుండెను. నిరుత్సాహపూరితములైన వారి వదనములు వాడిన పువ్వులవలె నుండెను. వారి హృదయములు దుఃఖముతో నిండియుండెను. తలలు దించుకొని యుండిరి. ఎర్రని పెదవుల నుండి నిస్పృహ వెలువడగా, కన్నులు నీరు కార్చుచుండెను.

మౌనముగా నిలిచియున్న గోపికల కనుల నుండి అశ్రువులు కారుట ఆ వెన్నెల వెలుగులో కృష్ణుడు చూచెను. కఠినముగా మాట్లాడిన కృష్ణునితో వారు మెల్లగా భయకంపిత స్వరముతో మాట్లాడజొచ్చిరి. వారి కన్నుల నుండి అదే పనిగా అశ్రువులు కారుచుండెను. కన్నులకు పెట్టుకొనిన కాటుక చెదరిపోవుచున్నను. తలవెంద్రుకలు చిందర వందరగా నుండినను, చీరలు సరిగా ధరింపకున్నను, కృష్ణుని సమీపమునకు త్వరగా చేరవలెనను ఉద్దేశ్యముతో వాటిని లక్ష్యపెట్టకుండిరి. అతడిదేమియు పట్టించుకొనలేదు. తమ ప్రయాస అంతయు వృథా అయ్యెనని, కృష్ణుడు తమతో సాదరముగా మాట్లాడలేదని వారు తెలుసుకొనిరి. వారందరును కలసి ఒకరొకరే యిట్లు పలికిరి. ''కృష్ణా! నీవు మాతో యిట్లు మాట్లాడుట తగదు. మేము అన్నిటినీ వదలిపెట్టి నీవు సహాయపడగలవని వచ్చితిమి. మమ్ములను దూరము చేయకు. నీవు అతి చక్కగా ధర్మ సూత్రములను గురించి - గృహమే మాకు నిర్దిష్టమైనదనియు, భర్తలకు, అత్త మామలకు, పిల్లలకు సేవచేయుటయే ప్రధాన కర్తవ్యమనియు - చెప్పినావు. నీ ధర్మ సూత్రములను నీవే అట్టేపెట్టుకొనుము. స్త్రీ నడవడి గురించిన ధర్మబోధను వినుటకు మేమిచటకు రాలేదు. నీవు మమ్ములను వదలిపెట్టవను నమ్మకముతో యిక్కడకు వచ్చితిమి.

''ఇల్లు, భర్త, పిల్లల యెడల విశ్వాసము కలిగియుండమని చెప్పినావు. కాని అవి సుఖ సంతోషములను కలిగించనపుడు, అట్టి ధర్మము వలన ప్రయోజనమేమి? ఈ బంధములన్నియు విడచి మనస్సును నిత్యమైన ఒకే ఒక దాని యందు కేంద్రీకరించవలెనని చదువుకున్న వారు చెప్పుదురు. మానవ రూపము ధరించిన

వచ్చి యుండవచ్చును. మీ చుట్టు నున్న అరణ్యమును పరికించి చూడుడు. చంద్రుని వెండిరేఖల కాంతి సముదాయము మరింత అందము చేకూర్చుచున్నవి. నది అలల నుండి వచ్చు చల్లని గాలి అంగములకు యింపు గూర్చుచున్నది. ఇక్కడకు వచ్చి కొంతసేపు ఉన్నారు. కాబట్టి యిక ఆలస్యము చేయక వెంటనే మీ గృహములకు యేగవలెను. మీ భర్తలు మీ కొరకు యెదురు చూచుచుందురు. మీ రెత్తుకొనేటపుడు పొందే ఆనందము కొరకు మీ పిల్లలు ఆతృతతో యెదురు చూచుచుందురు. మరియు గోవులు, దూడలు మీ సేవల నందుకోవలసి యున్నవి. నా వైపు నిందా పూర్వకముగా యెందుకు చూచెదరు? ఒకవేళ నాతో కాలము గడుపుటకు మీరు యిక్కడకు వచ్చినారా? అట్లయినచో అది నాకు సంతోషదాయకము. అన్ని జీవులు నా యందు ప్రేమ గలిగి యున్నవి. కాని మీ కర్తవ్యములను మీరు విస్మరించరాదు. మీ భర్తల, పిల్లల అవసరములు తీర్చుట మీ ప్రథమ కర్తవ్యము. స్త్రీకి తన భర్త యెడల తప్ప యితరులపై ప్రేమ కలిగియుండుట సరికాదు. అది మిమ్ములను స్వర్గమునకు దూరము చేయును. అది నిరర్థకము, మరియు మీకు కళంకము తెచ్చును. అది రహస్యమైన కోరిక యగుటచేత, నలుగురికి తెలియగలదనే భయము యెల్లప్పుడును వెంటాడును. ఇట్టి కృత్యముల నుండి విరమించుడు. మీ యిండ్లకు మీరు వెళ్ళి నాపై మీకు గల అపారమైన భక్తిని - నేను చేసిన కార్యములను తరచు వినుచు, నన్నే నిత్యము చింతించుచు, నన్ను గురించి గానము చేయుచు, నన్ను తరుచుగా దర్శించుచు - తలచుకొని ఆనందింపుడు. ఈ ప్రేమ అట్టి భక్తికి సరితూగదు. మరొకసారి మీ అందరినీ మీ మీ యిండ్లకు వెళ్ళుమని కోరుచున్నాను''.

శిలా విగ్రహముల వలె గోపికలు నిలుచుండిరి. కృష్ణుని పలుకులు వారి కర్ణములకు యిష్టము కలిగింపకుండెను. నిరుత్సాహపూరితములైన వారి వదనములు వాడిన పువ్వులవలె నుండెను. వారి హృదయములు దుఃఖముతో నిండియుండెను. తలలు దించుకొని యుండిరి. ఎర్రని పెదవుల నుండి నిస్పృహ వెలువడగా, కన్నులు నీరు కార్చుచుండెను.

మౌనముగా నిలిచియున్న గోపికల కనుల నుండి అశ్రువులు కారుట ఆ వెన్నెల వెలుగులో కృష్ణుడు చూచెను. కఠినముగా మాట్లాడిన కృష్ణునితో వారు మెల్లగా భయకంపిత స్వరముతో మాట్లాడజొచ్చిరి. వారి కన్నుల నుండి అదే పనిగా అశ్రువులు కారుచుండెను. కన్నులకు పెట్టుకొనిన కాటుక చెదరిపోవుచున్నను. తలవెంట్రుకలు చిందర వందరగా నుండినను, చీరలు సరిగా ధరింపకున్నను, కృష్ణుని సమీపమునకు త్వరగా చేరవలెనను ఉద్దేశ్యముతో వాటిని లక్ష్యపెట్టకుండిరి. అతడిదేమియు పట్టించుకొనలేదు. తమ ప్రయాస అంతయు వృథా అయ్యెనని, కృష్ణుడు తమతో సాదరముగా మాట్లాడలేదని వారు తెలుసుకొనిరి. వారందరును కలసి ఒకరొకరే యిట్లు పలికిరి. ''కృష్ణా! నీవు మాతో యిట్లు మాట్లాడుట తగదు. మేము అన్నిటినీ వదలిపెట్టి నీవు సహాయపడగలవని వచ్చితిమి. మమ్ములను దూరము చేయకు. నీవు అతి చక్కగా ధర్మ సూత్రములను గురించి - గృహమే మాకు నిర్దిష్టమైనదనియు, భర్తలకు, అత్త మామలకు, పిల్లలకు సేవచేయుటయే ప్రధాన కర్తవ్యమనియు - చెప్పినావు. నీ ధర్మ సూత్రములను నీవే అట్టేపెట్టుకొనుము. స్త్రీ నడవడి గురించిన ధర్మబోధను వినుటకు మేమిచటకు రాలేదు. నీవు మమ్ములను వదలిపెట్టవను నమ్మకముతో యిక్కడకు వచ్చితిమి.

''ఇల్లు, భర్త, పిల్లల యెడల విశ్వాసము కలిగియుండమని చెప్పినావు. కాని అవి సుఖ సంతోషములను కలిగించనపుడు, అట్టి ధర్మము వలన ప్రయోజనమేమి? ఈ బంధములన్నియు విడచి మనస్సును నిత్యమైన ఒకే ఒక దాని యందు కేంద్రీకరించవలెనని చదువుకున్న వారు చెప్పుదురు. మానవ రూపము ధరించిన

# 188 పోయిన ప్రేమకై వెదకుట

కృష్ణుడు కనుపించక పోవుటతో వారిని నిస్సహాయత ఆవహించెను. వారి ప్రేమ ఉన్మత్త స్థితి చేరుకొనెను. అనగా వారు వివక్షణ కోల్పోయిరి. కృష్ణుని స్తుతించుచు పాటలు పాడసాగిరి. పుట్టినప్పటి నుండి అతడు గావించిన అనేక లీలలను తలచుకొనిరి.

కృష్ణుని వెదకుచు అరణ్యములో సంచరించసాగిరి. వృక్షములను లతలను కృష్ణుడెచట దాగెనో తెలుసునా యని యడిగిరి. ''ఓ అశ్వత్థమా! మా హృదయములను దొంగిలించిన కృష్ణుని నీవు చూచితివా? అశోక పున్నాగ చంపకములారా! మీరు గాని కృష్ణుని చూచితిరా? ఇంతవరకు కృష్ణుడు మాతో నుండెను. మా తెలివితక్కువ కొలది, కృష్ణుడు మాకు మాత్రమే చెందినవాడని గర్వపడినాము. మా గర్వము నణచుటకై మమ్ము దుఃఖములో ముంచి వెళ్ళిపోయినాడు మీరు చూచినచో చెప్పండి ఓ తులసీ, మల్లికా మాలతులారా! మీలో యెవరైనను మా కృష్ణుని చూచియున్నారా?'' ఈ విధముగా వారు విచారించుచు దుఃఖించుచు కృష్ణునికై వెదకసాగిరి.

ఇంతలో కృష్ణుని పాదముల గుర్తులను చూచిరి. అప్పుడే అక్కడ నుండి నడచి వెళ్ళినట్లు ఆ గుర్తులుండెను ఆ గుర్తులను పురస్కరించుకుని కృష్ణుని జాడ తెలుసుకొనవలెనని యోచించిరి కొంత దూరము సాగిన తర్వాత, కృష్ణుని పాదముల గుర్తులతోబాటు ఒక స్త్రీ పాదముల గుర్తులను చూచి ఆశ్చర్యపడిరి. అసూయతో మండిపడుచు, ఒకరితో నొకరిట్లనుకొనసాగిరి ''చూడు! మనందరికంటే మరొకామె కృష్ణునికి ప్రియమైనది వారి అడుగులు ఒక దానితో నొకటి యెట్లు అల్లుకుపోయినవో చూడుడు ఇంత దూరము అతని కంటుకొని యెట్లున్నదో! ఆమె పాదముల గుర్తులు అకస్మాత్తుగా అదృశ్య మెట్లయ్యెనో చూడుము! కృష్ణుని పాదముల గుర్తులు భూమిలో బాగా లోతుగా నున్నవి అనగా ఆమె, యెవరైన నేమి, కృష్ణుడు తనను యెత్తుకుని తీసుకువెళ్ళుమని అడుగగా అతడట్లు చేసి యుండవచ్చు. పద, యింకను ముందుకుపోయి యెక్కడకు దారి తీసినదో చూచెదము. ఈ లత నుండి పువ్వుల త్రెంపగా చిందరపందరగా యెట్లు పడియున్నవో చూడుడు ఆమె కొరకు కృష్ణుడు పువ్వులను కోసి యుండవచ్చు ఇన్నివిధములుగా అనుగ్రహీతయైన ఆ గోపిక మహా అదృష్టవంతురాలు! అతడిక్కడ కూర్చుని ఆమెకు తలదువ్వి పువ్వులు అలంకరించినట్లున్నది''

కృష్ణునితో యేకాంతముగా వెళ్ళిన గోపిక, తనలో తాను స్వగతముగా పలికిన మాటలను బట్టి గర్వముతో నిండియున్నదని తెలియుచున్నది ''కృష్ణుడు నన్నే అమితముగా ప్రేమించుచున్నాడు అందరిని విడిచిపెట్టి నా వెంట వచ్చినాడు తన చేతులతో నన్నెత్తుకుని, తలదువ్వి తలలో పువ్వులు అలంకరించినాడు కేవలము, నన్ను మాత్రమే అతడు ప్రేమించుచున్నాడు. 'నేను అలసిపోయినాను' అని అనగానే, విసుగుచెంది కోపగించక రెండు చేతులతో నన్ను యెత్తుకున్నాడు. అటు తర్వాత తన వీపుపై నెక్కించుకున్నాడు ఇదంతయు తలచుకొని నా హృదయ ముప్పొంగగా నన్ను క్రిందకు దించి అదృశ్యుడయ్యెను. ఎక్కడున్నావు? కృష్ణా! ఎక్కడకు వెళ్ళినావు?''. కృష్ణుని వెదకుచున్న గోపికలు ఆమెను కనుగొనిరి ఆమె, కృష్ణుడు తన నెట్లు విడనాడి వెళ్ళెనో వారితో చెప్పెను.

వారందరును తిరిగి యమునా నది ఒడ్డుకు వచ్చిరి. కన్నులు కన్నీరు కార్చుచుండగా, తమ వద్దకు తిరిగి రావలసినదిగా ప్రార్థించుచు వెక్కివెక్కి పాడసాగిరి. వారి గర్వము పూర్తిగా అంతరించెనని తెలుసుకుని

కృష్ణుడు వారి మధ్య ప్రత్యక్షమయ్యెను. తన కత్యంత ప్రీతిదాయకమైన పసుపుపచ్చని పట్టు వస్త్రము ధరించి, అడవి పువ్వులతో కట్టిన దండ తన విశాల వక్షముపై అటు నిటు ఊగుచుండగా, మకరకుండలములు వెన్నెలలో మెరయుచుండగా, వంపులు తిరిగిన వెంద్రుకల మధ్య తురిమిన నెమలి యీక నాట్యము చేయుచుండగా, కృష్ణుడు వారి మధ్య మరల తిరుగాడెను.

అత్యంత ఆనందముతో గోపికలందరును లేచి నిలిచి కృష్ణుని వడి వడిగా సమీపించిరి. అందరును అతనిని కౌగిలించుకొనుటకు, చేతులు పట్టుకొనుటకు, అతని [illegible] ృృటకు, అతనికి సాధ్యమైనంత దగ్గరలో నుండుటకు ప్రయత్నించిరి. కైవల్యము పొందిన ముముక్షువుల వలె వారుండిరి. సంసారులకు బ్రహ్మ విద్యలో ఆరితేరినవాడు దొరికి సంసార కూపము నుండి ముక్తి మార్గమున తీసుకు వెళ్ళువాడు లభించినట్లు వారు భావింపసాగిరి. విశ్వుడు తైజసుడు సుషుప్తి స్థితి చేరినట్లుగా నుండెను. జాగ్రత్ స్వప్న స్థితులు దాటిన తర్వాత ఆత్మ సుషుప్తి స్థితిలో, అనగా మంచి గాఢ నిద్రలో నుండును. ఈ స్థితిలో ద్వంద్వము లుండవు, భావము లుండవు. ప్రశాంతముగా నుండును. స్వప్నముకాని, ఆలోచనలుకాని, అలజడులుగాని లేనట్టి ప్రశాంత స్థితి. తురీయ స్థితికి ఒక మెట్టు దిగువ నుండే స్థితి యిది.

రాత్రి చాలవరకు గడచెను. తెల్లని వెన్నెల రేఖలను బరపిన చంద్రుడు ఆకాశము మధ్యకు చేరెను పువ్వులు విచ్చి యుండెను ఆ పువ్వుల సువాసనలతో గాలి నిండి యుండెను. చంద్రుడు ప్రసరింపజేయు వెండి వెన్నెలలో ఆ రాత్రి మునిగి యున్నట్లున్నది. నల్లని యమునా నది, సోదరి గంగా నదివలె బంగారు వర్ణము ధరించి నట్లుండెను. నదీతీరమునున్న యిసుకను యమునా నది అలలు తాకి, ఆ అలలు చేయు సంగీతము మైకము కల్గించుచుండెను.

## 189 ప్రేమ బోధ

కృష్ణుడు గోపికలను వెంట నిడుకుని యమునా నది యిసుక తిన్నెలవైపు వెళ్ళెను. కృష్ణునితో వారు మాట్లాడుచు అతని అందమును కనులతో గ్రోలుచుండిరి. ఒక గోపిక యిట్లనెను. ''కృష్ణా! నాకొక సందేహము. అది నీవు తీర్చవలెను''. కృష్ణుడు చిరునవ్వు నవ్వి మౌనముగా ప్రశ్న వేయమని సూచించెను. ఆమె యిట్లనెను ''ఈ లోకములో వివిధములైన ప్రేమ, అనేక విధములైన ప్రేమికులు గలరు. కొందరు తాము యితరులపై జూపు ప్రేమకు ప్రతిఫలము కోరుదురు మరికొందరి తీరు దీనికి పూర్తిగా వ్యతిరేకము. వారు యెటువంటి ప్రతిఫలము నాశింపక యితరులను ప్రేమింతురు ఇతరులు తమ్ము ప్రేమించకున్నప్పటికిని, వారు యితరులను ప్రేమింతురు. అది వారి స్వభావము ఇక మూడవ తరగతివారు వేరే కలరు. ఇతరులు తమను ప్రేమించుచున్న ప్పటికిని, వారిని ప్రేమతో చూడరు. తాము యితరుల ప్రేమకు పాత్రులు కానప్పటికిని వారు లక్ష్యపెట్టరు ఈ మూడింటిలో యేది ఉత్తమమైనదో దానికి కారణమేమిటో వివరించి చెప్పవలెను''.

కృష్ణుని వదనము గంభీరముగా మారెను. కొంచెము ఆగి యిట్లు సమాధానమిచ్చెను. ''మొదటి తరగతివారు, అనగా ప్రతిఫలాపేక్షతో ప్రేమించువారు స్వార్థపరులు వారి సుఖ సంతోషముల కొరకే యితరులను ప్రేమింతురు. ఇందు ప్రేమించువారు, ప్రేమకు పాత్రులగువారు కూడ ఒక్క రీతిగనే యుందురు

వారి ప్రేమ హృదయపూర్వకమైనది కాదు. వారి ప్రవర్తనలో ధర్మము కానరాదు. ఒకరిని ప్రేమించి, వారి ప్రేమ పొందుట మంచిదే. కాని యిది వారిరువురకు మాత్రమే మంచిని చేయును. ఇందులో నిస్వార్థ, ఉదాత్త గుణములు లేవు.

''రెండవ తరగతి ప్రేమ తల్లిదండ్రులు తమ పిల్లలపై చూపు ప్రేమ వంటిది ప్రతిఫలము నేదియు ఆశింపక ప్రేమింతురు వారు మిక్కిలి కరుణాపూరితులు వారు దయ గలిగియుందురు. అందరితో స్నేహపూర్వకముగా అభిమానముతో వర్తింతురు.

''పై రెండు తరగతులకు భిన్నమైన వారు కొందరు కలరు. వారు తమ యెడల ప్రేమతో చరించేవారిని తిరిగి ప్రేమించలేని అశక్తులు. వారి నెవరును ప్రేమించకున్నట్లైన వారి స్థితి యేమి! ఇట్టి వారిని నాలుగు రకములుగా విభజించవచ్చును

''ఆత్మారాములు, అనగా బ్రహ్మచింతనలో జీవించి ఆనందించువారు. వీరు యితరుల నుండి యెటువంటి ప్రేమను ఆశింపరు. ఇతరులను ప్రేమించవలెనను ఆసక్తికూడ వారికుండదు ఆప్తకాములు రెండవ రకమునకు చెందినవారు. అన్ని కోరికలు తీరి సంతృప్తులై, యిక యెటువంటి కోరికలు లేనివారు. వీరు యితరులు తమపై ప్రేమ చూపించవలెనని ఆశించరు. వారికి యితరులతో ప్రమేయ ముండదు. వీరు నిర్లక్ష్యముగా నుందురు మూడవ తరగతికి చెందిన వారు కృతఘ్నులు, అనగా విశ్వాసహీనులు వీరు యితరుల నుండి గ్రహించుటయే తప్ప, యిచ్చుట తెలియదు నాల్గవ తరగతికి చెందినవారు గురు ద్రోహులు. ప్రేమాభిమానములు చూపించు పెద్దల యెడ వీరు అగౌరవముగా ప్రవర్తించెదరు

''నా మట్టుకు నేను, యితరులు నాపై విపరీతమైన ప్రేమను ప్రకటించినప్పటికిని, ఒకొక్కపుడు వారికి ప్రతిఫలము నివ్వను వారు నన్ను మరింతగా, అనగా నన్ను మాత్రమే తలచుచు, నాకు భక్తులగునట్లు చేయుట కొరకే యిట్లు చేయుదును ఉదాహరణకు, ఒక పేదవానికి అకస్మాత్తుగా ధనరాశి లభించెను. అది కొంత కాల మనుభవించి, తరువాత దానిని పోగొట్టుకున్నపుడు, పేదరికములో అనుభవించిన బాధకన్న యెక్కువగా నుండును. అప్పుడు అతని ఆలోచనలు సంపాదించి పోగొట్టుకున్న ధన సంపదపై తీవ్రముగా నుండును. అదే విధముగా, నేను మీ అందరి మధ్య నుండి అదృశ్యమైనాను. మీకు నాపై నున్న ప్రేమ యెంత తీవ్రమైనదో మీకు నా అవసరము యెంతవరకున్నదో తెలుసుకొనుటకు అట్లు చేసినాను. కొంతసేపు నన్ను పోగొట్టుకున్నందు వలన పొందిన బాధచేత మీకు నాయందు భక్తియినుమడించెను. ఇంతవరకు మీరు అత్యంత ప్రియమైన వాని నన్నింటిని వదలివేసినారు. మీ భక్తి స్థిరపడుటకు నేనిట్లు చేసినాను మీ నిస్వార్థ భక్తికి నేనెంతగా సంతోషించితినో మీకు యిప్పుడు చెప్పెదను. మీరు నన్నెంతగా ప్రేమించు చున్నారో నే నెన్నడును మరువలేను''.

కృష్ణుని పలుకులు విన్న తర్వాత, అతి విచిత్రముగా, గోపికల ఆలోచన తీరులో మార్పు వచ్చెను. వారిలో యిపుడు శారీరక సంబధమైన ప్రేమకు బదులుగా, కృష్ణుని సమక్షములో నుండుటయే ప్రధాన లక్ష్యమయ్యెను

# 190 రాసక్రీడ

రాస నృత్యము చేయవలసినదిగా కృష్ణుడు గోపికలకు సూచించెను. గోపికలందరును వలయాకారములో నిలుచుండిరి. ప్రతి యిద్దరు గోపికల మధ్య కృష్ణుడుండెను. ప్రతి గోపిక కృష్ణుడు తన చేతిని మాత్రమే పట్టుకుని యున్నట్లు భావించెను. వారందరును కలసి పాడుచు నృత్యము చేసిరి.

కృష్ణుని పట్టు వస్త్రము గాలికి రెపరెపలాడుచుండెను. నీల వర్ణ శరీరమున నలదిన చందనము భాసిల్లుచుండెను. నృత్యము చేయుచున్నపుడు పువ్వుల దండ కృష్ణుని వక్షముపై ఊగుచుండెను. చెవులకున్న బంగారు కుండలములు చెక్కిళ్ళను తాకుచుండెను అతని చిరునవ్వు అందరిని ముగ్ధులను గావించుచుండెను యమునా నదీ తీరమున వెన్నెల రాత్రిలో బృందావనములోని అమాయక గోపికలతో కృష్ణుడు రాసక్రీడ సలిపెను.

ఈ రాసక్రీడను కనులార గాంచుటకు ఆకాశమున స్వర్గవాసు లందరును గుమిగూడిరి. స్వర్గములోని సంగీత వాద్యములు మధురమైన సంగీతమును వినిపింప దొడగెను గంధర్వులు భగవంతుని స్తుతించుచు గానము చేసిరి

వారు గావించుచున్న నృత్యము వేగము పుంజుకొనగా, వారి కాళ్ళ గజ్జెల శబ్దము, చేతి గాజుల గలగలలు, మెడలోని గొలుసుల కదలిక కూడ వేగము నందుకొనసాగెను. గుండ్రని బంగారు గొలుసు మధ్య పొదిగిన అందమైన ఆకుపచ్చ మణివలె కృష్ణుడు ప్రకాశించుచుండెను. కృష్ణునితో ఆనందముగా నృత్యము చేయుచు పరవశించుచున్న గోపికల అదృష్టమునుజూచి, స్వర్గములోని అప్సరసలు అసూయ జెందిరి. చంద్రుడు గ్రహములు యీ రాసక్రీడను గాంచుచు గమనము తప్పి స్తంభించిపోవుటచేత ఆ రాత్రి మిగిలిన రాత్రులకన్న దీర్ఘముగా నుండెను.

ఆ తరువాత కృష్ణుడు, గోపికలు వెంటరాగా, యమునా నదిలో ప్రవేశించెను. ఆ నదిలో యీదుచు చాలసేపు ఆటలాడిరి.

పరీక్షిన్మహారాజు మధ్యలో కల్పించుకొని యిట్లనెను ''మునీంద్రా! మీరు చెప్పుచున్న విషయములు నాకు యింకను నమ్మకము కలిగించుట లేదు నారాయణుని సంపూర్ణావతారమైన కృష్ణుడు, ధర్మమును ప్రతిష్ఠించు నుద్దేశ్యముతో యీ భూమిపై జన్మించి, తన్ను చూచి యితరులు అనుసరించునట్లు ఆదర్శప్రాయముగా మెలగవలసిన కృష్ణుడు, యీ విధముగా యెందుకు ప్రవర్తించెను? ఇతరుల భార్యలను తానెట్లు ప్రేమించెను? జారుడుగా వర్తించి, గోపికలు తమ భర్తల యెడ విశ్వాసహీనలై సంచరించునట్లు యెందుకు చేసెను? అతడు ఆప్తకాముడగుటచే కోరికలు యేవియు లేనివాడనియు, యీ సుఖ సంతోషములకు అతీతుడనియు యింతకు ముందు చెప్పియున్నారు. కాని అతడు చేసినది అనుచితము, అధర్మము కాదా?''

శుకుడిట్లనెను. ''ఒక సాధారణ మానవుని చర్య వలె నీవు దీనిని పరిగణించుచున్నావు ఆ దృష్టితో చూచినట్లయిన యిది అనుచితమే. కాని యిది అధర్మము కాదు ఇట్టి చర్యను సాధారణ మానవులు చేసినచో అది తప్పుగా నెంతురు. కాని కృష్ణునిపై గోపికల ప్రేమ, అందరకును భగవంతునిపై నుండు భక్తి వంటిది వారి భక్తికి ప్రతిఫలమును వారు గ్రహింప గలిగిన తీరులో, అనగా భౌతికముగా వారికి ప్రసాదించెను. భగవంతుని యెడల భక్తి గలవారు భగవత్సాయుజ్యము పొందగలరను సత్యమును యిది యే విధముగాను భంగపరచుట

లేదు. అదియే కదా మనమందరము కోరునది! భగవంతునిపై భక్తి గలిగి, రాత్రి పగలు అతనినే తలచుచు చివరకు భగవంతుని చేరు స్త్రీ విశ్వాసహీనయని నిందించుట తగదు. అది అధర్మము కాదు.

''తనపై గోపికలకు మిక్కుటమైన భక్తిగలదని, కృష్ణుడు వారికి యీ జీవితములోనే ప్రతిఫలము నొసగదలచి, ఆ వెన్నెల రాత్రిలో వారు తనతో ఐక్యము పొందు భాగ్యము ప్రసాదించెను సాధారణ మానవులకది కామముతో కూడిన చర్యగా గోచరించవచ్చును కాని గోపికలు భక్తిలో చరమ స్థితిని పొంది అనుభవించిరి''

దీర్ఘమైన ఆ వెన్నెల రాత్రి అంతము కాజొచ్చెను. తూర్పున అరుణ కాంతులు కనుపించెను. తన్ను విడచి వెళ్ళుట కిచ్చగింపని గోపికలను మెల్లగా వారి వారి గృహములకు వెళ్ళునట్లు చేసెను గృహములకు వెళ్ళిన తర్వాత రాత్రి అంతయు బయట నున్నందుకు వారి నెవరును నిందింపకుండునట్లు చేసెను తన యోగశక్తిచేత కృష్ణుడు, ఇంటిలోని వారెవరును గోపికలు యింట లేకుండుట గమనించకుండునట్లు చేసెను ప్రతి ఒక్క గోపిక మనస్సులో ఆ మధురమైన వెన్నెల రాత్రి మధురానుభూతులు మరల మరల మెదలసాగెను.

## 191 సుదర్శనుడను విద్యాధరుడు

ఆరోజు మహాదేవుని పండుగదినము బృందావనవాసులు అంబికా వనమునకు వెళ్ళిరి పిల్లలందరును బండ్లలో యెక్కి వెళ్ళిరి. బండ్లు ఒకదాని వెనుక నొకటి పోవుచుండెను పిల్లలకు ఒక వేడుక దినముగా నుండెను కొందరు బండ్ల వెనుక నడువసాగిరి యువకులు ఆడుచు గెంతుచు, చెట్లనెక్కి కొమ్మలు పట్టుకుని, నడచుచున్న వారిపై గెంతి కడుపుబ్బ నవ్వుచు పోవుచుండిరి వారు అంబికా వనము ఆ విధముగా చేరుకొని అచట సరస్వతీ నదిలో స్నానము చేయవలసి యుండెను. పెద్దలు నదిలో స్నానము చేసి, భక్తి శ్రద్ధలతో మహాదేవునికి, దేవికి పూజ చేసి పువ్వులు, నైవేద్యము సమర్పించిరి తమ్మాశీర్వదింపుమని భగవంతుని ప్రార్థించిరి ఆ తరువాత బ్రాహ్మణులకు సమృద్ధిగా పాల నిచ్చు గోవులను, సువర్ణమును, వస్త్రములను, మధుర పదార్థములను దాన మొసగిరి వేద విహితముగా సకల విధులను నిర్వర్తించి, కేవలము మంచి నీరు మాత్రమే ఆహారముగా గైకొని, పెద్దలు నది ఒడ్డున ఆ రాత్రి గడపిరి ఆ రాత్రి సగము గడచిన తర్వాత, పరిసర అరణ్యములో నివసించుచున్న ఒక పెద్ద కొండచిలువ ప్రాకుచు ఆ స్థలమునకు వచ్చెను నిద్రపోవుచున్న నందుని ఆ కొండచిలువ మ్రింగుట ప్రారంభించెను. నందుడు నిద్ర నుండి లేచి భయభ్రాంతుడై అరచెను ''కృష్ణా! కృష్ణా! ఈ పెద్ద పాము నన్ను మ్రింగివేయుచున్నది. నేను నిస్సహాయుడను నాకు సహాయము చేయుము'' చుట్టు నున్న వారందరును ఆందోళనపడుచు లేచి దీపము వెలిగించి పామును భయపెట్ట జూచిరి. వారి ప్రయత్నము నిష్ఫలమయ్యెను గ్రహణము పట్టిన చంద్రుడు అదృశ్యుడయినట్లుగా, మెల్లమెల్లగా పాము శరీరములోనికి పోయి నందుడు అదృశ్యమగుచుండెను. కృష్ణుడు వచ్చి దగ్గర కొంతసేపు నిలుచుండెను

కృష్ణుడు తన పాదములతో సర్పమును స్పృశించెను తత్క్షణమే సర్పము తన రూపమును గోల్పోయి, ఒక దివ్యమైన మానవ రూపము ధరించెను. అతడే విద్యాధరుడు సువర్ణ మాలికలు మెడలో ధరించిన విద్యాధరుడు దేదీప్యమానముగా ప్రకాశించుచుండెను కృష్ణునికి సాష్టాంగ ప్రణామము జేసి, రెండు చేతులు జోడించి నిలుచుండెను

విద్యాధరునితో కృష్ణుడిట్లు పలికెను. ''నీవు ఒక దేవతవలె అత్యంత సుందరముగా నున్నావు. నీ రూపము కనుల కింపుగా నున్నది. ఇంతకాలము నీవు సర్ప రూపము ధరించుట యెట్లు సంభవించెను? అట్లు జరుగుటకు కారణమైన దురదృష్ట సంఘటనను వివరించి చెప్పుము.''

విద్యాధరుడిట్లు చెప్పెను. ''నాపేరు సుదర్శనుడు. ఒకప్పుడు నేను స్వర్గములో కీర్తి ప్రఖ్యాతులు పొందిన వాడను. నా రథమునెక్కి సంచరించుచుంటిని. నాకున్న సంపదకు, సౌందర్యమునకు గర్వము చెందితిని. నా గర్వము అందరకు ప్రస్ఫుటముగా కనుపించుచుండెను. ఒకసారి కొందరు ప్రజలు గుంపుగా వెళ్ళుట చూచితిని. వారు చాల అనాకారులుగా నుండుట చూచి, పూర్వాపరములు ఆలోచింపక, వారి అనాకారిత్వము నకు గట్టిగా నవ్వితిని. నా దురదృష్టవశాత్తు, వారు అంగిరసులను ఋషులగుట సంభవించెను. వారు నేను సర్ప రూపము ధరించి యీ భూమిపై జీవించునట్లు శపించిరి. నీ స్పర్శచేత అట్టి పాప రూపము నుండి విముక్తుడనైన నన్ను ఆ ఋషులు శపించలేదు సరికదా, ఆశీర్వదించి అనుగ్రహించినారని భావించుచున్నాను. లేకున్న, నిత్య ధ్యానపరులైన ఋషులకు లభించని మహాద్భాగ్యము - మానవ రూపములో నున్న నీ దర్శనము - నాకు దొరకెడిది కాదు. నీపాదములకు మరొకసారి ప్రణమిల్లుచున్నాను. నా నివాసమునకు తిరిగి వెళ్ళుట కనుజ్ఞ నొసగవలసినదని ప్రార్థించుచున్నాను''. తరువాత సుదర్శనుడు తన నివాసమైన గంధర్వ లోకమునకు వెళ్ళెను.

నందుడు, యితర గోపాలురు తిరిగి నిద్రపోలేకపోయిరి. ఆ రాత్రి వారు కృష్ణుడు గావించిన అనేక లీలలను గురించి ముచ్చటించుకొనుచు, తమ మధ్య కృష్ణుడు నిత్యము సంచరించుట గొప్ప భాగ్యమని భావించిరి. ఒకసారి బృందావనములో ఒక వెన్నెల రాత్రివేళ, తమకు ప్రియమైన యమునా నది ఒడ్డున బలరామకృష్ణులుం డిరి. కృష్ణుడు వేణువును పెదవులపై నదుముకుని మ్రోయించుచుండెను. ఆ మధుర సంగీతము ఇండ్లలో నున్న గోపికల నాకర్షించి, వారు గృహములు వదలి యమునా తీరమునకు వచ్చునట్లు జేసెను. వారందరును కలసి నాట్యము చేయుచుండగా, కుబేరుని సేవకుడైన శంఖచూడుడు అచటకు వచ్చి గోపికల నపహరించుకు పోయెను. వారందరును విచారముతో యేడ్వసాగిరి. ''కృష్ణా! రామా! అపహృతలమైన మమ్ము రక్షింపుము''. బలరామకృష్ణులు శంఖచూడుని అనుసరించి వెళ్ళిరి. అన్నదమ్ముల ఆగ్రహమును గాంచిన శంఖచూడుడు భయకంపితుడై, గోపికలను వదలిపెట్టి, ఆ ప్రదేశము విడిచి పారిపోయెను. బలరాము డచటనే నిలిచియుండి గోపికలను రక్షించుచుండగా, కృష్ణుడు శంఖచూడుని వెంబడించెను. ఎంత వేగముగా పరుగెత్తినప్పటికిని, కృష్ణుని ఆగ్రహము తప్పించుకొనలేకపోయెను. అతడెటు వెళ్ళిన, కృష్ణుడచటకు వెళ్ళి, చివరకు పట్టుకుని ఆ దుర్మార్గుని తలపై చేతితో ఒక వ్రేటు వేసెను. అక్కడి కక్కడనే శంఖచూడుడు చచ్చిపడెను. శంఖచూడుడు తలపై ధరించిన మణిని తీసుకుని యమునా నది ఒడ్డుకు వచ్చి బలరామునికిచ్చి ధరించమని చెప్పెను.

## 192 అరిష్టుని మరణము

అరిష్టుడను అసురు డొకడు గలడు. కృష్ణుని చంపుటకై అతడు బృందావనమునకు వచ్చెను. అతడొక ఎద్దు రూపము ధరించెను. ఆ ఎద్దు వేయు బలమైన అడుగులకు భూమి కంపించుచుండెను. మరియు ఎద్దు వేయు ఱంకెల ధ్వని అందరి హృదయములలో భయమును పుట్టించుచుండెను. తోకను పైకెత్తి వాడియైన పెద్ద కొమ్ములతో చెట్లను చీల్చుచు బలముగా కదుపుచుండగా, అవి నేలగూలునేమో యను నట్లుండెను.

ఆ యెద్దు రూపము అందరకును భయము గొలుపుచుండగా, ప్రతి ఒక్కరు అటు నిటు పరుగెత్తి పారిపోవుచుండిరి. అలవాటు ప్రకారము కృష్ణునివద్దకు వచ్చి కొత్తగా వచ్చిన ఎద్దును గురించి వివరించి చెప్పిరి. ''మీరు భయము చెంద నవసరము లేదు. నేను రక్షించెద''నని కృష్ణుడు వారికి అభయ మొసగెను.

కృష్ణుడు అసురుని వద్దకు వెళ్ళి యిట్లనెను ''ఉరుముల వంటి అంకెలు వేసి యీ అమాయిక ప్రజలను భయపెట్టి నీ వేమి లాభము పొందనున్నావు? నీ వంటి దుర్మార్గులను నాశనము చేయుటకే నేను జన్మించినాను''. కృష్ణుడు ఎద్దు ముందర నిల్చి దాని కోపము ప్రకోపింపచేసెను. భూమిపై బలమైన అడుగులతో టప టప గొట్టుచు, తలను కుడి యెడమలకు ఆడించుచుండెను. ముక్కు నుండి వేడి నిశ్వాసములు విడుచుచు, తోక పైకెత్తి కృష్ణుని మీదకు లంఘించెను. వాడి కొమ్ములు కృష్ణునికి గురిపెట్టి యుండెను. తలను దించెను. ఎర్రని కన్నులు కృష్ణునివైపు జూచుచున్నవి. బాగుగా దగ్గరకు వచ్చువరకు కృష్ణుడు వేచి యుండి, తరువాత తన రెండు చేతులతో రెండు కొమ్ములను పట్టుకొనెను. ఎద్దును పట్టి ముందుకు లాగి, తరువాత బలము కొలది వెనుకకు త్రోసివేయగా అది పదునెనిమిది అడుగులు వెనుకకు పోయెను. కృష్ణుని చంపుటకు వచ్చిన ఎద్దు మిక్కిలి ఆగ్రహముతో మరల కృష్ణునిపైకి ఉరికెను.

కృష్ణుడు తిరిగి దాని రెండు కొమ్ములు పట్టుకుని, యీసారి నేలపై విసరిగొట్టెను. ఎద్దును కృష్ణుడు తన అడుగులతో, అది బాగా అలసిపోయి కుంటుకొనుచుండు నంతవరకు తొక్కిపెట్టి యుంచెను. మిక్కిలి బలముతో ఒక కొమ్మును ఊడబెరికి, దానితో ఆ యెద్దును చిదుక గొట్టెను. కొన్ని క్షణములు ఆ అసురుడు యాతన పడి, చివరకు రక్తము కక్కుకుని చచ్చిపడెను. ఆ రక్తము కృష్ణునిపై చిందెను. మట్టి కొట్టుకొని, రక్తపు మరకలతో నిండిన శరీరముతో కృష్ణుడు బృందావన వీధులలో ప్రవేశించగా గోపాలురు గోపికలు బారులు తీర్చి నిలిచియుండి కృష్ణుని శ్లాఘించిరి. అంతవరకును వారు ఎద్దుతో పోరుచున్న కృష్ణుని ఆందోళనా పూరిత వదనములతో గాంచుచుండిరి. ఎద్దు రూపములో నున్న అసురుని మరణమునకు బృందావన వాసులు సంప్రహర్షము ప్రకటించిరి.

## 193 కంసుని వద్దకు నారదుని పునరాగమనము

అరిష్టుడు మరణించుటతో, కంసుడు పంపిన అసురు లందరును హతులైనారని నారద మునీంద్రుడు తెలుసుకొనెను. కంసుని మరణము కూడ దగ్గర పడుచున్నదని యెఱిగి, దానిని సత్వర పరచుటకు తగిన చర్యలు తీసుకొనుటకు నిశ్చయించుకొనెను.

నారదుడు కంసుని సభ కేగెను. మర్యాదా పూర్వకముగా నారద మహర్షి నాహ్వానించి, ఉచితాసనముపై గూర్చుండబెట్టి కంసుడిట్లు పలికెను. ''ఓ నారద మునీంద్రా! మీరు నన్ను చూచుటకు వచ్చి చాల కాలమైనది. క్రిందటిసారి వచ్చినపుడు.....''

''జ్ఞాపకమున్నది'' అని నారదుడు అడ్డు తగిలి సమాధానమిచ్చెను. ''వసుదేవుని పుత్రులను వదలిపెట్టుట నీ తెలివి తక్కువ యని అప్పుడు నేను చెప్పితిని. వారిలో దేవకి అష్టమ పుత్రుడెవరో తెలుసుకొనుట కష్టమని తెలిపితిని.'' కంసుని చూచి నారదుడు చిరునవ్వు నవ్వగా, కంసుడు యిట్లనెను. ''నా ప్రయత్నము లన్నియు

విఫలమయ్యెను. అష్టమ శిశువు జన్మించిన వెంటనే, నా చెల్లెలును ఆమె భర్తయు చెరనున్న కారాగారమునకు వెళ్ళితిని. అప్పుడేమి జరిగెనో నీకు తెలియునా?''

నారదుడిట్లు జవాబిచ్చెను ''దానిని గురించి యేవో కలగాపులగమైన వార్తలు విన్నాను. అసలు యేమి జరిగెనో చెప్పుము''

కంసుడిట్లు చెప్పదొడగెను ''నా జీవితములో అది బహు లజ్జాకరమైన క్షణము నేను వెళ్ళునరికి నా సోదరి చేతులలో ఒక ఆడ శిశువు ఉండెను. శిశువు నిమ్మని నేను చేయి జాపగా ఆమె యిట్లనెను. 'అన్నా! ఇది మగశిశువు కాదు ఈ ఆడశిశువు వలన నీకెట్టి కీడు వాటిల్లదు. ఈ శిశువును నాకు వదలిపెట్టుము. ఈ శిశువు పుత్రుడు కాదు, నాకు దక్కనిమ్ము అష్టమ పుత్రుడు నిన్ను చంపునని ఆకాశవాణి పలికెను. కాని ఇది పుత్రుడు కాదు' ఆమె దీనాలాపములు నేను లక్ష్యపెట్టలేదు నా యెడమచేతితో ఆ శిశువును పట్టుకొంటిని ఇతర శిశువులను నేనెట్లు చంపితినో నీవెరుగుదువు. ఎడమ చేతితో గాలిలోకి పైకెత్తి క్రిందపడుచున్నప్పుడు కత్తితో వారిని రెండు ముక్కలుగా నరికెడి వాడను. అదే పద్ధతిలో యీ శిశువును కూడ చంపదలచితిని.

''నేనామెను గాలిలో పైకి విసరితిని. తరువాత యేమి జరిగెనో తెలియునా? శిశువు గాలిలో స్తంభించిపోయెను! ఇది నిజమా, కలయా యని కళ్లు నులుముకుని చూచితిని. అది నిజమే కుడిచేతితో కత్తి పట్టుకుని, యెత్తిన ఎడమచేయి అట్లే యుండగా, ఆశ్చర్యమును క్రోధమును ముంచుకొని వచ్చినవి అటు తర్వాత....'' అని మధ్యలో ఆగెను.

నారదుడు కనులలో దరహాసము చిందగా, కరుణ ఉట్టిపడుచున్న వదనముతో ''ఆ తర్వాత యేమి జరిగెను?'' అని ప్రశ్నించెను

''అటు తర్వాత శిశువు రూపము మారెను. ఆమె శిశువు కాదు, పార్వతీదేవి. ఆమె హస్తములందు అనేక ఆయుధములు ధరించి యుండెను ఆమె నాతో యిట్లు పలికెను 'ఓరి మూర్ఖుడా! నీవు విధిని వంచించగలనని తలచుచున్నావా? నీ మరణమునకు కారణభూతుడు కానున్న పుత్రుడు అపుడే జన్మించియున్నాడు. నేను వెళ్లుచున్నాను నీ సోదరి అష్టమ పుత్రుడు త్వరలోనే నిన్ను వధించుట నేను గమనించెదను' ఆ తర్వాత దేవి అదృశ్యమయ్యెను. నీ మాటలు నేను వినియుండవలసినది కాదు కనీసము నా సోదరికి తన పిల్లలు దక్కునట్లు చేయవలసినది. శిశు హత్యలు గావించి ఘోర పాపము చేసితిని, మరియు నా ప్రియ సోదరిని బాధ పెట్టితిని ఇంతకును ఆకాశవాణి పలికిన పలుకులు విని యిట్లు చేసితిని! నాకు సుఖము లేదు''.

నారదుడిట్లు పలికెను ''పార్వతీదేవి చెప్పిన నీ మేనల్లుని వెదకుటకు ప్రయత్నించలేదా?''

''అనేక ప్రయత్నములు చేసితిని'' అని కంసుడు సమాధానమిచ్చెను ''అనేక ప్రయత్నములు సలిపితిని. అతడు యెక్కడ నున్నదియు స్పష్టముగా తెలియలేదు కాని అన్ని దిక్కులకు నేను పంపిన అసురులు హతమారిరి అందును ఒక బాలునిచే చచ్చిరి. అతడు గొల్లల ప్రభువు నందుని కుమారుడు ఆ బాలుడు సుందరుడని వినియున్నాను కాని అతడు దేవకి పుత్రుడు కాజాలడు, యశోదానందుల పుత్రుడని వానినందరు పరిగణించుచున్నారు''

నారదుడు కొంతసేపు మౌనముగా కూర్చుండెను. తరువాత యిట్లనెను. ''కంసా! జాగ్రత్తగా నేను చెప్పునది వినుము. దేవకి పుత్రుడు యెక్కడ నున్నదియు నేను చెప్పెదను''. ''ఎక్కడ? ఎక్కడ ఉన్నాడు, మునీంద్రా!'' అని సింహాసనము నుండి ఉరికి కంసుడు అడిగెను. ''తొందరగా చెప్పుము. వెంటనే అతనిని వధించెదను''. కంసుని కూర్చుండుమని చెప్పి నారదు డిట్లనెను. ''నీవు నిదానముగా నా మాటలను వినదలచుకున్నచో నీకు చెప్పెదను''.

''నీవు యేది చెప్పిన నది చేయగలనని మాట యిచ్చెదను'' అని ఓర్మి కోల్పోయి పలికెను. ''అతడెక్కడ మున్నదియు వెంటనే చెప్పుము''.

''అతడు బృందావనములో నున్నాడు'' అని మెల్లగా నారదుడు చెప్పెను.

కంసుని వదనమందు ఆశ్చర్యమును, కలవరమును మిళితమై గోచరించెను. కంసుడు నారదునితో నిట్లనెను. ''గొల్లవారికి నాయకుడైన నందుని కుమారుడు, యువకుడు అయిన నల్లనివాడు కృష్ణుడా యీ మధురా పురాధీశుని చంపనున్నది? నారద మునీంద్రా! నన్ను ఆట పట్టించుచున్నావా? ఇది వరకొక పర్యాయము నాకు తప్పుడు హితము బోధించినావు. చూడగా నాతో తిరిగి అటువంటి నాటక మాడుచున్నట్లున్నది''.

''కంసా! లేదు నేను నిజము చెప్పుచున్నాను'' అని నారదుడు పలికెను. ''నల్లని యువకుడు, కృష్ణుడు నందుని కుమారుడు కాదు అతడు వసుదేవుని కుమారుడు. అతడే నీ పాలిటి మృత్యువు''. కంసునికి ఆగ్రహమును ఆశ్చర్యమును కలిగి నోట మాట రాకుండెను. ''ఇది యెట్లు సంభవించెను?'' అని మాత్రము పలికెను. ''వసుదేవుడు ఇంతకాలము కారాగారములో నున్నాడు. ఆ దంపతులిరువురకు కావలి వారిని నియమించితిని. నాకు తెలియనిదే గాలి కూడ అందు ప్రవేశించుటకు వీలు లేకుండ జేసితిని. మరి బృందావనములో వసుదేవునికి కుమారుడెట్లు కలిగెను? నీకు సరియైన సమాచార మందలేనట్లున్నది. ఇది అసంభవము''

''అది యెట్లు జరిగెనో నేను నీకు చెప్పెదను'' అని నారద మహర్షి, బృందావనములో నివసించుచున్న వసుదేవుని రెండవ భార్య రోహిణి గర్భమునకు దేవకి గర్భములోని పిండమును యెట్లు మార్పిడి చేసినదియు కంసునికి వివరించెను అటు తర్వాత కృష్ణపక్షమున అష్టమి నాటి రాత్రి జరిగిన సంఘటనలు - కృష్ణుని జననము, వసుదేవుడు శిశువును గోకులము తీసుకువెళ్ళుట, నందుని యింట ఆ శిశువునుంచి యశోద శిశువును తీసుకువచ్చుట - వివరముగా కంసునికి నారదుడు తెలియజెప్పెను.

నారదుడు ఒకొక్క విషయము వివరించి చెప్పుచుండగా, కంసుని ఆగ్రహము యినుమడించుచుండెను. ఆగ్రహము తారస్థాయికి చేరుకొనగా, ఒర నుండి కత్తి తీసి యిట్లు పలికెను. ''నా చెల్లెలు, వసుదేవుడు కూడ నన్ను మోసగించిరి. ఈ క్షణమే వెళ్ళి వసుదేవుని, మంచి పన్నాగము పన్నిన అతని భార్య దేవకిని సంహరించెదను''.

నారదు డిట్లు పలికెను ''ఇప్పుడు వారిని శిక్షించుటవలన ప్రయోజనము లేదు. కావలసినచో నీవు వారిని కారాగారములో బంధించుము. ఇప్పటికే శిశుహత్యలు గావించి చాల పాపము కూడగట్టుకొనినావు ఒక స్త్రీని, అందును నీ సోదరిని, హత్యచేసి పాపము పెంచుకొనవద్దు. ఇంతవరకు, కృష్ణుడు నువ్వు పంపిన అసురుల

నందరిని హతమార్చినాడు. ఏదో ఒక విధముగా అతనిని పట్టుకొనుము. అతనిని నాశనము చేసినట్లైన నీ సమస్య లన్నియు తీరిపోగలవు''.

యువకుడైన కృష్ణుని పట్టుకుని చంపుటకు సర్వ విధముల ప్రయత్నించెదనని కంసుడు చెప్పెను. తాను వచ్చిన పని పూర్తి అగుటలో, నారాయణుని స్తుతించుచు నారదుడు విశ్రమించెను.

## 194 కంసుడు అక్రూరుని పిలిపించుట

తన బలగములో అతి శక్తిమంతుడైన కేశి యను అసురుని పిలిపించి యిట్లు పలికెను. ''నీవు తక్షణమే బృందావనమునకు వెళ్ళి బలరామకృష్ణులను యిరువురు యువకులను చంపవలెను''.

కేశిని బృందావనమునకు పంపించిన తర్వాత, కంసుడు తన మంత్రులందరితో సమావేశమయ్యెను. వారిలో చాణూరుడు, ముష్టికుడు, సాల్వుడు, కోసలుడు అను మల్ల యుద్ధవీరులు, మహామాత్రుడనే మావటి గలరు. వారితో కంసుడిట్లు పలికెను. ''స్నేహితులారా! వీరులారా! శక్తిమంతులైన మీరు నన్ను నా సింహాసనమును బలపరచుచున్నారు. నా మరణమునకు కారకుడు కాబోవు యువకుడు యెచట దాగి యుండెనో అన్వేషించుట మీరెరుగుదురు. అతడిపుడు బృందావనములో గోపాలక ముఖ్యుడైన నందుని యింట నున్నట్లు తెలియవచ్చెను. బలరామకృష్ణులను యిరువురు యువకులు బృందావనములో నందుని యింట పెరుగుచున్నారు. వీరిద్దరును దేవకీ వసుదేవుల పుత్రులని తెలిసినది. వారిని వధించుటకు కేశిని పంపినాను. విజయముతో కేశి తిరిగి రాగలడని నమ్ముచున్నాను.

''ఏ కారణము చేతనైనను అతడు రాకున్నట్లైన, చేయవలసిన దానిని చేయుటకు నేను మీపై ఆధారపడవలసి యున్నది. మీరు మల్లయుద్ధములో కీర్తి ప్రఖ్యాతులు పొందినారు. సమయము చూచి ఆ యువకుల నిరువురను మధురకు రప్పించెదను. మల్ల యుద్ధమునకు యేర్పాట్లుచేసి, నన్ను చంపనున్న ఆ యువకుల నిద్దరినీ మల్ల యుద్ధములో ఓడించి చంపవలెను. ఈ పట్టణ వాసులందరును తిలకించుటకు వీలుగా మల్ల యుద్ధమునకు యేర్పాట్లు గావించుడు. ఆ యువకులు మరణించినట్లయిన, మల్ల యుద్ధములో పోరి మరణించినట్లు గోచరించును తప్ప కుతంత్రముచేత చంపినట్లు గోచరించదు. మహామాత్రా! నీ వద్ద కువలయాపీడమను ఏనుగు గలదు. దానిని నర్తనశాల ద్వారము వద్దకు తీసుకుని రమ్ము. నీ సమీపమునకు ఆ యువకులిద్దరును వచ్చిన వెంటనే ఏనుగుచేత త్రొక్కించి చంపుము. శుక్లపక్ష చతుర్దశి దినమున ధనుర్యాగము, అనగా ధనువులను పూజించుట అనే యాగమును చేయనున్నట్లు కపట ప్రకటన గావించెదను. ఈ యాగమునకు తగిన సన్నాహములు యిప్పటి నుండి ప్రారంభించి, దుష్టశక్తులకు అర్పించవలసిన వానిని అర్పించవలెను''.

అనేక ఆయుధములను ప్రయోగించుటలో ఆరితేరిన కంసుడు యాదవులలో ఒకడైన అక్రూరుని పిలిపించెను. అక్రూరుని రెండు చేతులలో తన చేతుల నుంచి కంసుడు యిట్లనెను. ''ప్రియమైన అక్రూరా! నా హృదయమున కత్యంత ప్రీతికరమైన దాని నొకటి నీవు చేయవలసి యున్నది. నీవు నాకు మంచి స్నేహితుడవు. నీవు నా స్నేహితుడుగా యిప్పుడు వర్తించ వలసియున్నది. భోజులలోగాని, యాదవులలోగాని

నా శ్రేయస్సును కోరువాడవు నీవొక్కడవే. పవిత్ర పురాణ కథలందు, తన కేదైన సహాయము అవసరమైనపుడు ఇంద్రుడు నారాయణుని కడకు వెళ్ళేవాడని చెప్పుట వినియున్నాను అదే విధముగా నిన్నిపుడు నాకొక సహాయము చేయమని కోరుచున్నాను. దాని వలన నీకు లాభము కలుగ గలదు''.

కంసుడు చెప్పదలచుకున్న దానిని వినుటకై అక్రూరుడు వేచి యుండెను కంసుడు చెప్పబోవు దానిని అక్రూరుడు ఊహించెను కాని పెదవి విప్పి ఒక మాట యైనను పలుకలేదు. పాప భూయిష్ఠుడైన కంసుడు కూడ, తన మనసులోని ఆలోచనలను సత్పురుషుడైన అక్రూరునికి తెలుపుటకు కొంచెము సంకోచించి, యిట్లు పలికెను. ''అక్రూరా! నీవు గొల్లలకు ప్రభువైన నందుని యింటికి వెళ్ళుము. అది బృందావనములో నున్నది. వసుదేవుని యిద్దరు కుమారులు అచట గలరు. నీతో వారిని మధురకు తీసుకుని రమ్ము. ఆలస్యము నేను భరించలేను. దేవతలు నారాయణుని వద్దకు వెళ్ళగా, వారితో నారాయణుడు కంసుని వంటి పాపాత్ములను నాశము గావించుటకు మానవ రూప నామములు ధరించగలనని చెప్పినట్లుగా నారదుడు చెప్పెను ఆ యువకు లిద్దరును నా మరణమునకు కాబోవు కారకులని తెలిసెను కాని నన్ను నేను రక్షించుకొనగలను. ముందు జాగ్రత్తలు తీసుకొనని వారిని మాత్రమే మృత్యువు కబళించగలదు. కాని ఈ యువకులు మధురకు వచ్చిన వెంటనే హతమారునట్లు నేను చూచెదను. నాకు యెట్టి అపకీర్తియు రాకుండ, వారు మరణించునట్లు తగిన యేర్పాట్లు గావించితిని.

''నందుని, గోపాలకులను కూడ యిచటకు తీసుకు రమ్ము. ఈ యిద్దరు బాలురకు ఆశ్రయ మిచ్చినందు లకు వారిని తగిన విధముగా శిక్షించెదను ఆ పనిని తర్వాత చేసెదను. ఇప్పుడు నీవు బయలుదేరి సాధ్యమైనంత వేగముగా వెళ్ళవలెను'' అక్రూరుడు సంకోచముతో యిట్లడిగెను ''నీవు యేమి చేయదలచుకున్నావు? నీ ప్రణాళిక యేమిటి?'' కంసుడు బిగ్గరగా నవ్వి యిట్లనెను ''మొదట వారు కువలయాపీడమను యేనుగు సమీపమునకు వచ్చునట్లుగా యేర్పాటు గావించెదను. ఆ యేనుగు వారిని త్రొక్కి పిప్పిచేయును''

కంసుడు ఒక క్షణమాగెను తిరిగి మెల్లని స్వరముతో యిట్లనెను. ''ఒకవేళ, ఒకవేళ వారు బ్రతికి బయటపడినట్లయితే, ఆరితేరిన చాణూర ముష్టికులతో వారు మల్లయుద్ధము చేయునట్లు యేర్పాట్లు గావించితిని. ఈ బాలురిద్దరూ మరణించిన తర్వాత, వసుదేవుడు, భోజులు, యాదవులు, దశార్హులు, వారి బంధుబలగము వంతు రాగలదు. అటు తర్వాత ముసలివాడైన ఉగ్రసేనుడు, అతని సోదరుడు దేవకుడు మృత్యువువాత పడుదురు ఇక వేరెవరైన నా శత్రువులు మిగిలియున్నచో, వారు కూడ వారి సోదరుల మార్గమున వెళ్ళుదురు. అప్పుడిక యీ భూమిపై నాకు శత్రువు అను వారుండరు''.

''మగధ దేశాధిపతి, అతి శక్తిమంతుడైన జరాసంధుడు నాకు మామగారు ద్వివిదుడు నాకు ప్రియమైన స్నేహితుడు. శంబరుడు, నరకుడు, బాణుడు అను ముగ్గురు అసురులు నాకు అత్యంత ప్రీతిపాత్రులు. వారు నాకెప్పుడును స్నేహితులే. వారి సహాయముతో యీ లోకమున కంతకును చక్రవర్తిగా నుండగలను. నా ఆశ నెరవేరుటకు ఏదియును అడ్డురాదు'' కొన్ని క్షణములు కంసుడు ఆగెను అతడు యీ లోకమునకు ప్రభువుగా నుండు రోజును కలగనుచుండెను తల విదిలించి ప్రస్తుత విషయమునకు వచ్చి మరల యిట్లనెను. ''కాని యిదంతయు ముందు జరుగవలసి యున్నది. ఇప్పుడు వెంటనే బృందావనమునకు వెళ్ళుట నీ కర్తవ్యము. అమాయకత నటించి వారిని ఆహ్వానింపుము సరళమైన భాషలో నేను వారిని ఆహ్వానించినట్లు చెప్పి ఒప్పించి మధురకు తీసుకుని రమ్ము ధనుర్యాగము గురించి వారికి చెప్పుము. ఈ మధురానగర

సౌందర్యమును వర్ణించి చెప్పుము. ఆ పల్లె యువకులు యిద్దరును నగర సౌందర్యమును విని ముగ్ధులై యీ నగరము సందర్శించుటకు ఉవ్విళ్లూరుచుదురు. నీవు రేపు ఉదయమే బయలుదేరి వెళ్ళుటకు తగిన సన్నాహములు చేయుము. నీవు బృందావనము త్వరలోనే చేరుకొనగలవు''.

అక్రూరుడు కొన్ని క్షణములు ఆలోచించి, హితోపదేశము చేయుటకు నిశ్చయించి యిట్లు పలికెను. ''ప్రభూ! నన్ను మీ శ్రేయోభిలాషిగా పరిగణించినట్లు చెప్పినారు. నా యందు మీకున్న విశ్వాసమునకు అభిమానమునకు కృతజ్ఞుడను. మీ యందు నాకున్న ప్రేమ చేతనే ధైర్యముతో యీ మాటలు పలుకుచున్నాను. ఆకాశవాణి మీ మరణము సూచించినది. ఆ మరణము నుండి రక్షించుకొనుటకు మీరు చేయు ప్రయత్నములను నేను మెచ్చుకొనుచున్నాను కాని ప్రభూ! తాను చేయు ప్రయత్నముల జయాపజయములు తన చేతిలో లేవని మానవుడు గ్రహించవలసి యున్నది అవి ఫలించుటకు ఫలింపకపోవుటకు సమాసావకాశములు గలవు తెలివి గలవారు యీ విషయమును గ్రహించవలెను. అది భగవంతుని చేతిలో నున్నది, తన చేతిలో లేదు మానవుడు అనేక గొప్ప విషయముల నాశించును అనేకమైన కలలు గనును.వాటిని తప్పక చేయగలడు. ఉదాత్తమైన ఆలోచనలు, నీచమైన ఆలోచనలు కలిసి మానవుని మనసును గందరగోళ పరచును. కాని అతడొక విషయము విస్మరించును దైవముగాని మానవుని నాశనము చేయుటకు నిశ్చయించుకొనిననచో, అతడు తన తెలివితేటలతో విధి వ్రాత నుండి తప్పించుకొనలేడు ఈ మాటలను జ్ఞప్తి యందుంచుకొనుడు. నేను మీ సంస్థానములో ఒక సేవకుడను. మీ ఆజ్ఞను పాలించుట నా కర్తవ్యము రేపు బృందావనము వెళ్ళి బలరామకృష్ణులను మధురకు తీసుకు వచ్చెదను''.

## 195 కేశి వధ

కేశి అను అసురుడు బృందావనము వైపుగా వెళ్ళెను. తన యజమాని ఆదేశించినట్లు చేయుటకు ఆత్రము కనబరుచుచుండెను అతని స్నేహితు లనేకులు బాల కృష్ణుని చేత చచ్చిరి. పూతన వధ నాటి నుండి అసురు లొకొక్కరే చచ్చుచుండిరి తన స్నేహితు లనేకులను పోగొట్టుకొనెను. వీరిలో ధేనుకుడు, అరిష్టుడు, బకుడు, యింకను అనేకులు గలరు కృష్ణుడు యెవరైనప్పటికిని, అతనిని యెదుర్కొనగలనను నిబ్బరము కేశికి ఉండెను. అనేకులను చంపిన ఘనత కలదు. అతని కేదియు కష్టసాధ్యము కాదు. తన స్నేహితులెవరును లేకపోవుటచే జీవితము నిరుత్సాహముగా నుండెను వారందరును నిహతులైనందుకు పగతీర్చుకొనవలెనని నిశ్చయించెను. తన స్నేహితులు సాధించలేని దానిని సాధింపబూనుకొని, అత్యుత్సాహముతో బృందావనమునకు వెళ్ళెను.

కేశి యితరులను చంపు కార్యముపై వెడలునపుడు అశ్వరూపము ధరించుటలో ప్రావీణ్యము గడించినట్లు పేరుపొందెను. అటులనే బృందావనమునకు అశ్వరూపము ధరించి, కృష్ణుడు తిరుగు ప్రదేశములందు సంచరించుచుండెను ఆకారము చాల పెద్దదిగా నుండెను. మనస్సునకున్న వేగముతో పరుగెత్తుచుండెను మెడపైనున్న జూలు గాలికి అటు నిటు కదలాడగా, ఆకాశములోని మబ్బులు చెల్లాచెదరయ్యెను ఆ అశ్వ వేగము అంత తీవ్రముగా నుండెను కన్నులు పెద్దవిగా యెర్రగా నుండెను నోటి నుండి వచ్చు శ్వాస వేడిగా నిప్పులు గ్రక్కుచున్నట్లుండెను పొడవైన మెడ చాల అందముగా కన్పడుచుండెను అది నల్లని వర్ష మేఘము వర్ణములో నుండెను. చీకటి రాత్రి వలె, పాపభూయిష్ఠమైన దాని మనస్సు, నల్లగా నుండెను ఆ

అశ్వము సకిలింపులు మైళ్ళ కొలది దూరములో వినిపించుచుండెను. భూమిపై అడుగులు వేసినపుడు డెక్కలు బలముగా నాటుకొని చప్పుడు చేయుచుండెను.

కృష్ణునికై యెదురు చూచుచు అటు నిటు డెక్కల శబ్దము చేయుచు పరుగెత్తు చుండెను. అశ్వరూపములో నున్నది కేశి యను అసురుడనియు అతడెందుకు వచ్చినదియు కృష్ణుడు గ్రహించెను. దూరముగా నిలిచియుండి కృష్ణుడు తన వద్దకు రమ్మనన్నట్లుగా అశ్వమునకు సంజ్ఞలు చేసెను. సింహము వలె కేశి పెద్దగా అరచెను. తనను రమ్మని సైగ చేయుటకు యీ బాలుని కెంత ధైర్యము అని తలచుచు గాలి వేగముతో గాలివానలో పిడుగు పడినట్లుగా కృష్ణుని పైకి దూసుకు వచ్చెను. కృష్ణుని సమీపమునకు వచ్చి, తన విశాలమైన నోరును యీ ఆకాశమంతయు త్రాగుటకా యనునట్లు తెరచెను. అటు తర్వాత వెనుక కాలితో కృష్ణుని తన్నబోయెను. కృష్ణుడు అతి నేర్పుగా తప్పించుకుని, తన్ను తన్నబోయిన కాళ్ళను గట్టిగా పట్టుకొనెను. తన చేతులతో రెండు కాళ్ళను బలముగా పట్టుకుని, చంపబోవు ముందు నాగుపామును గరుడపక్షి పైకెత్తినట్లుగా, పైకెత్తెను. తన బాహువులతో చక్రమును త్రిప్పినట్లు గిరగిర త్రిప్పి దూరముగా విసరివేసెను మూరు యోజనముల దూరములో క్రింద పడెను. కేశి అతి బలవంతుడగుటచే వెంటనే చావలేదు. నోటి నుండి రక్తము కారుచుండుటచే నోరంతయూ యెర్రగా నుండెను. తిరిగి కృష్ణుని చంపుటకు మీదకు వచ్చుచుండెను. కృష్ణుడు సంతోషముతో నవ్వుచు తన చేతిని వెడల్పుగా విప్పియున్న కేశి నోటిలోనికి పోనిచ్చెను. పాము పుట్టలోనికి దూసుకుపోయినట్లుగా, కృష్ణుని చేయి క్రమక్రమముగా పెరుగుచు విజృంభించెను కేశికి ఊపిరాడుట కష్టమయ్యెను ఉండి ఉండి గాలి పీల్చుచుండెను. కొన్ని క్షణముల తర్వాత అది కూడ అసాధ్యమయ్యెను. విపుల శరీరమును చెమట కప్పెను. కన్నులు తేలవేసెను నిస్సహాయముగా కాళ్ళను అటు నిటు కదుపుచుండెను తుది శ్వాస విడిచి కేశి మరణించెను. అతడట్లు చచ్చిపడియుండగా కేశి నోటి నుండి కృష్ణుడు తన చేతిని బయటకు తీసెను. తన్ను చంపుటకై కంసుడు పంపిన రాక్షసులలో బహుశః యితడు చివరివాడు కావచ్చునని కృష్ణుడు తనలో తాననుకొనెను.

## 196 నారదుడు కృష్ణుని వద్దకు వచ్చుట

నారదుడు కృష్ణుని వద్దకు వచ్చి ప్రణామము చేసెను. కృష్ణుని స్తుతించుచు మధురమైన పలుకులు పలికెను. ఆ తర్వాత రహస్యముగా, యీ అవతారములో నిర్వహించవలసిన పాత్రను కృష్ణునికి చెప్పెను. నారదుడు యిట్లు పలికెను. ''కృష్ణా! ఓ కృష్ణా! నిరాకారుడవైన నీవు మానవ శ్రేయస్సుకు రూపము ధరించి అవతరించినావు నీవు యోగీశ్వరుడవు, లోకమునకు ప్రభుడవు అన్నియు నీ నివాసములే అన్నియు నీ నుండి జనించి నీలో లయమగుచున్నవి కట్టెలలో అగ్ని కనిపించక దాగి యున్నట్లుగా ప్రతిఒక్కరి హృదయములో ఈశ్వరుడుగా నివాస మేర్పరచుకుని యున్నావు. నీవు అంతరాత్మవు, మహాపురుషుడవు నీ మాయచేత త్రిగుణములు యేర్పడి అవి యీ లోకమును సృష్టించునట్లు చేయుచున్నావు ఈ లోకమును సృష్టించి, పోషించి, లయము గావించుచున్నావు నీవు అనంతమైన సత్యము, పరమాత్మవు ఈ పాప భూమిపై మానవ లోకమున దుష్టత్వమును నశింపజేయుటకై జన్మించినావు దైత్యులు యిది వరలో యీ భూమిపై మహారాజులుగా, అసురులుగా, రాక్షసులుగా జన్మించినారు. భూదేవి ఓర్మిని కోల్పోవుటచేత, యీ దైత్యులను

అసురులను నాశనము చేసి, ధర్మము పునరుద్ధరించుటకు యీ రూపము ధరించినావు. మానవ లోకములో ధర్మము మరుగునపడే ప్రమాదము కలదు.

''దేవతలు సైతము కేశి సకిలింపులకు భయపడి దూరముగా పారిపోయెడివారు. అటువంటి కేశిని, ఏనుగు ఒక పురుగును తన కాలితో నలిపివేసినట్లు సంహరించినావు. చూచు వారలకిది చాల గొప్ప దృశ్యము.

''ఈ రోజు నుండి రెండు రోజుల తర్వాత నీవు చాణూర ముష్టికులను సంహరింపగలవు. అది చూచి సంతోషించుటకై వేచియున్నాను. అటు తర్వాత శంఖ, కాలయవన, ముర, నరకాసురులు నీ చేత వరుసగా మరణించగలరు.

''నీవు స్వర్గమునుండి పారిజాత వృక్షమును యీ భూమి మీదకు తేగలవు అసందర్భమున నీవు ఇంద్రునితో పోరుట చూపరుల కింపైన అద్భుత దృశ్యము

''నీవు అనేక కన్యలను వివాహమాడుట నేను చూచెదను నృగుడు ద్వారక యందు మోక్షము పొందును.

''అటు తర్వాత శ్యమంతక మణికి సంబంధించిన సంఘటన ఒకటి జరిగి, నీవు సత్యభామను వివాహ మాడుదువు

''నీవు మహాకాలపురము నుండి బాలురను ఆదుకుని రక్షించెదవు

''అటు పిమ్మట పౌండ్రక వాసుదేవుడు నీతో యుద్ధమునకు తలపడును అతనిని నీవు సంహరింపగలవు

''కాశీ నగరము నీచే భస్మమగును.

''కొంతకాలము తర్వాత నీ మేన బావలైన పాండవులు రాజసూయ యాగము చేయుదురు. ఆ సందర్భములో నీవు శిశుపాలుని సంహరించెదవు

నీ భక్తులకు, కవులకు ఆనందము చేకూర్చుటకై నీవు ద్వారకా నగరములో నివసించెదవు.

''కాలమే నీవు భూమాత బరువు తగ్గించి ఆమెను ఆదుకొనుటకు యీ భూమిపై అవతరించితివని తెలుసుకొందువు అర్జునునకు రథసారథిగా నుండి, కురు క్షేత్ర సంగ్రామములో అక్షౌహిణుల కొలది సైన్యము నాశనము చేయగలవు.

''నిరాకారుడవైన నీవు రూపము ధరించితివి స్వచ్ఛమైన బుద్ధి, జ్ఞానము నీవు సత్య స్వరూపుడవు నీకు నమస్కరించుచున్నాను నీవు ఈశ్వరుడవు. మాయతో కలిసి యీ విశ్వమును 'మహత్' 'అహం' తత్త్వములతో సృష్టించినావు. నీ వినోదము కొరకే యీ మానవ రూపము ధరించినావు నీకు నా ప్రణామములు''.

కృష్ణునకు పదే పదే ప్రణామము అర్పించి, నారదుడు తేలిక పడిన హృదయముతో నిష్క్రమించెను.

వేచియున్న కాలము అంతము కానున్నది నాటకము మొదలుకానున్నది మరి రెండు రోజులలో యీ భూమి కంసుని నుండి విముక్తి పొందనున్నది దానితో గొప్ప సన్నివేశములు ఆరంభము కానున్నవి కాల

గర్భములో అవి వేచి యున్నవి.

## 197 అసురులలో చివరివాడైన వ్యోముడు

ఆవులను మేపుచున్న గోప బాలురు ఆటలాడుట యందు ఆసక్తి కలిగి యుండిరి. 'దొంగాట' వారికి మిక్కిలి ప్రీతికరమైన ఆట. కంసుని బలగములో నున్న అసురులలో మిగిలిన వాడు వ్యోముడు. అతడు బృందావనమునకు వచ్చి, బాలురాడు ఆటలో పాల్గొనుటకు నిశ్చయించుకునెను. ఆ ఆట చాల తేలికైనది. కొంతమంది బాలురు మేకలవలె నిర్భయముగా సంచరించునట్లు నటించగా, మరికొందరు బాలురు దొంగల వలె నటించి మేకలను పట్టుకొందురు అలసిపోవునంతవరకు వారు యిట్లు ఆడుచుండిరి.

వ్యోముడు గోప బాలుని రూపము ధరించి, దొంగలుగా నటించి బాలురతో కలసి, మేకలుగా నటించుచున్న బాలుర నొకొక్కరినే వరుసగా దొంగిలించెను వారిని దగ్గరలో నున్న గుహలో బంధించి, ముఖ ద్వారము వద్ద పెద్ద రాయిని అడ్డముగా నుంచెను నలుగు రైదుగురు బాలురు మాత్రమే మిగిలిరి.

ఇట్లు చేయుచున్నదెవరో కృష్ణుడు గ్రహించి, ఆగ్రహము చెందెను. ఎవరైనను తన్నుగాని బలరాముని గాని యెదుర్కొనుటకు వచ్చినపుడు చిరునవ్వుతో యెదుటి వారిని లొంగదీసుకొనుచుండెను కాని తన స్నేహితులకు గాని భక్తులకు గాని బాధ కలిగించిన వారిపై భయంకరమైన ఆగ్రహము చెందెడివాడు. కాళియ మర్దన సందర్భమందు, శంఖచూడుడు గోపికల నపహరించినపుడు, మరికొన్ని సందర్భములందు కూడ యిట్లే ఆగ్రహావిష్టుడయ్యెను.

తన మిత్రులను వ్యోముడను అసురుడు అపహరించెనని తెలుసుకుని, సింహము ఉరికినట్లుగా, ఆ రాక్షసునిపై ఉరికెను

వ్యోముడు పేరుకు తగినట్లుగా, తన శరీరమును పెంచెను కాని కృష్ణుని బలమైన పట్టు నుండి తప్పించుకొనలేకపోయెను. కృష్ణుడు వ్యోముని మీదికెత్తి దభాలున నేలపై కూలదోసెను. ఇతరులకు హాని కలిగించే క్రూర మృగములను వధించినట్లుగా వ్యోముని సంహరించెను.

అటు తర్వాత అతి కష్టము మీద గోప బాలురను గుహ నుండి బయటకు తీసుకువచ్చి, అందరితో కలసి, కృష్ణుడు తిరిగి బృందావనమునకు వెళ్ళెను.

## 198 అక్రూరుడు బృందావనము చేరుట

అక్రూరుడు ఆరోజు రాత్రి నిద్రలేకుండ గడిపెను బలరామకృష్ణులను మరుచటి దినము దర్శించగలనను ఉత్సాహము అతనిలో ఉరకలు వేయసాగెను వారి జన్మ రహస్యము అక్రూరునికి తెలియును ఇంతవరకు ఆ వి చు, మరికొందరును రహస్యముగా నుంచిరి ఇప్పుడు నారదుడు కంసునికి ప్రత్యేకముగా చెప్పుటచేత కంసునికి వారి జన్మ రసహ్యము తెలిసెను. మధురా నగర భవిష్యత్తు యెట్లుండగలదో

వని అక్రూరుడు ఆందోళన చెందెను. కంసుని పన్నాగము ఫలించునా? లేక విఫలమగునా?

ఉదయముననే అక్రూరుడు బృందావనమునకు బయలుదేరెను. ప్రయాణములో అతని ఆలోచనలు కృష్ణునిపై నుండెను. కృష్ణుని చూడవలెనను ఆతురత అధికము కాగా, కాలము నెమ్మదిగా సాగుచున్నట్లు తోచెను. గుర్రములు శక్తికొలది వేగముగా పరుగెత్తుచున్నను, క్షణములు మెల్లమెల్లగా నడచుచున్నట్లు తోచి అక్రూరుడు తనలో తాను నవ్వుకొనెను. రథము వెళ్ళుచున్నపుడు వెనుక రేగిన ధూళి గుర్రములు వేగముగా పరుగెత్తుచున్న వనుటకు నిదర్శనము. గాలి వేగముతో గుర్రములు పరుగెత్తుచున్నను, అక్రూరుని మనస్సు అంతకన్న వేగముగా పరుగెత్తు చుండెను. మానసికముగా బృందావన ప్రదేశమును చేరుకొనెను. తన మనోనేత్రముతో అందమైన అన్నదమ్ము లిరువురను, ప్రకాశించుచున్న వారి వదనములను చూచెను అక్రూరుడు తనలో యిట్లు తలచెను

''పూర్వ జన్మలలో యెంత పుణ్యము ఆర్జించితినో నేనెరుగను భగవంతుని దర్శించు మహద్భాగ్యము నాకు లభించినది. పుణ్యమొకటే చాలదు. తీవ్రముగా నేను తపస్సు చేసి యుండవచ్చును లేదు, అది కూడ చాలదు. మహాపురుషుడెవరో నన్ననుగ్రహించి కరుణతో నాకీ అదృష్టము ప్రసాదించినాడు. నా మనస్సు, భౌతిక విషయములందు ఇంద్రియ సుఖములందు తగుల్కొని యున్నది మరియు కామ క్రోధ లోభ మోహ మద మత్సార్యములను అరిషడ్వర్గముతో నిండి యున్నాను పాపాత్ముడనైన నేను, కృష్ణ భగవానుని చూడబోవుచున్నాను.

''నీచ జాతిలో పుట్టిన వానికి వేదములను సరిగా నుచ్చరించుట అతి కష్టము మీద గాని సాధ్యము కాదు ఇందు విచిత్రమేమియు లేదు. కాలమను నదిలో గడ్డిపోచవలె, నా వంటి అధమ జాతి మానవులు తేలుచుందురు కర్మ ఫలితముగా, కోటికొక్కరు మాత్రము భగవంతుని దర్శించు భాగ్యము పొందుదురు ఒక గడ్డిపోచ నది ఒడ్డుకు కొట్టుకుని చేరినట్లుగా, అనంతముగా తేలుచు పోవుటకన్న ఆ విధముగా రక్షణ నొందుట అదృష్టమే మరి.

''నా పాపములన్నియు బహుశః క్షాళనమై యుండవచ్చును, లేకున్న యిదెట్లు సాధ్యము కాగలదు? మహర్షులు నిత్యము ధ్యానించు భగవంతుని పాద పద్మములను యీ రాత్రి నా పాపపు చేతులతో స్పృశించగలను ఒక విధముగా నాకీ అదృష్టమును కలిగించిన కంసుడు దయామయు డనవచ్చును మంచి శకునములు యెదురగుచున్నవి. నా కుడిప్రక్కగా జంతువులు పోవుచున్నవి నవ్వు మోముతో ప్రకాశించు కృష్ణుని నేను చూడగలను ఈ లోకమునకు పాప విముక్తి గావించుటకు నారాయణుడు కృష్ణుని రూపము ధరించెనని చెప్పుదురు కృష్ణుడుగా అవతరించిన నారాయణుని కన్నులార యీ రాత్రి గాంచెదను

''మహాదేవుడు, యితర దేవతలు అవిరామముగా పూజించెదరు వారికి అనంతముగా సంపదలొసగెను శ్రీదేవి యెప్పుడును అతని పాదముల వద్దనే కూర్చుని యుండును. సౌభాగ్యమంతయు యెల్లప్పుడును ఆమె సొత్తు. భక్తులు, ఋషులు అతని పవిత్ర పాదములు పూజించి బ్రహ్మత్వము పొందిరి భగవంతుని పాద పద్మములు గోపాలురతో బృందావన మంతయు సంచరించెను. అతనికి వారి యెడల అపారమైన కరుణ గలదు. అతని పవిత్ర పాదములను గోపికలు సేవించి ప్రేమించిరి నేను, నా పాపపు చేతులతో ఆ పాదములను స్పృశించెదను. అతడు నన్ననేక విధములుగా అనుగ్రహించును. నేనెంత అదృష్టవంతుడను! ఈ సాయంకాలము నకు బృందావనము చేరుకొనగలను తిన్నగా నంద గోపాలుని యింటికి వెళ్ళెదను

''అక్కడకు వెళ్ళిన వెంటనే రథము దిగి ఇంటి లోపలికి వెళ్ళెదను. అచట బలరామకృష్ణులు స్నేహితులు, తల్లిదండ్రులతో కలిసి యుండగా జూచెదను. అది చూచి ఆనందించెదను కృష్ణుని పాదములపైబడగా, అతడు తన చేయిని నా శిరస్సుపై నుంచి ఆశీర్వదించును. కృష్ణుడు నా యెడల దయ గలిగి యుండును. కంసుడు నన్ను పంపి మధురకు వారిని తీసుకురమ్మని చెప్పినప్పటికిని, నేను వచ్చిన కార్యోద్దేశ్యము తెలుసుకున్నప్పటికిని, కృష్ణుడు నన్ను ద్వేషించడు. నేను కంసుడు వదలిన బాణము వంటి వాడను. ప్రధాన కారకుడు కంసుడు. ఆ విషయము కృష్ణుడెరిగి నన్ను దయతో చూచును. నువ్వు ముఖముతో నన్ను ఆహ్వానించును మంటలో పురుగులు మసి అయినట్లుగా, నా పాపములన్నియు దగ్ధమైపోవును. నన్ను లేపి ఆలింగనము చేసుకొనును. అతని బలమైన బాహువులు స్పృశించినంతనే నా శరీరము పునీత మగును''

ఆ విధముగా కృష్ణుని గురించి తలచుచు శ్వఫల్కుని కుమారుడైన అక్రూరుడు బృందావనము చేరెను. అస్తమించుచున్న సూర్యుని కిరణములతో పశ్చిమాకాశము యెర్రగా నుండెను అక్రూరుడు, ఉత్సాహము పొంగిపొరలుటతో రథములో యిక నిలువలేకపోయెను. రథము దిగి తన చుట్టును ఒకసారి పరికించి చూచెను. ''ఇది కృష్ణుడు ఉండు ప్రదేశమన్న మాట! అతడు నిత్యము సంచరించు స్థలము యిదా!'' అట్లు ఆలోచించుచు అక్రూరుడు కనులు దించి నేలను జూచెను అతడొక అద్భుత దృశ్యము జూచెను నేలపై విచిత్రమైన గుర్తులుండెను. ఇదివరకెన్నడును తానిటువంటిది చూడలేదు. వంగి తీక్ష్ణముగా పరికించి చూచెను. అచట నేల అంతయు శంఖ చక్ర చిహ్నములతో నిండి యుండెను ఈ రెండును నారాయణుని పవిత్ర హస్తము లందుండును అక్రూరుడు కనులు తిరిగి పడిపోవనుండెను. కృష్ణుని చిన్ని పాదములకు యీ రెండు గుర్తులు కలవని, అతడు నడచి వెళ్ళినచోట యీ గుర్తులు పడెనని అక్రూరుడు గ్రహించెను అదృష్టమునకు చిహ్నములైన అబ్జరేఖ, యవరేఖ, అంకుశరేఖలను నేలపై జూచిన అక్రూరుని నేత్రములు ఆనందాశ్రువులతో నిండెను. అక్రూరుడిట్లు తలచెను ''ఇవి భగవంతుని పాదముల గుర్తులు భగవంతుడు యీ ప్రదేశమున సంచరించుట చేత బృందావనము పునీతమైనది ఎంతటి అదృష్టము! ఈ పవిత్ర స్థలమందు నేనెట్లు అడుగు మోపగలను?'' క్రింద నేలపై పడి ధూళిని తలపై జల్లుకొని కృష్ణుని యింటి వైపుగా దొరలుకొనుచు వెళ్ళెను. ''భగవంతునిచే పునీతమైన యీ నేలను నా కాళ్లతో త్రొక్కను'' అని అక్రూరుడు తలపోసెను

ఇంతలో అడవులకు ఆవులను మేపుటకై వెళ్ళిన బలరామకృష్ణులు తిరిగి వచ్చిరి. అక్రూరుడు దేనిని చూడ ఉత్సాహపడుచున్నాడో వారు తెలుసుకుని, అతనికి దర్శనమిచ్చి సంతోషము కలుగజేసిరి బృందావనమునకు ప్రయాణము చేయుచున్నంతసేపు కృష్ణ దర్శనము గురించియే అక్రూరుడు తలచుచుండెను.

అక్రూరుడు నందుని యింటికి వచ్చెను ద్వారము సమీపించి లోపల ప్రవేశించెను. అన్నదమ్ములిద్దరిని చూచి కన్నులకు విందైనట్లుగా అక్రూరుడు భావించెను ఈ క్షణము కొరకే అతడింతవరకు తహ తహ లాడుచుండెను

ఇద్దరును ఒకే మాదిరిగా నున్నను వారిలో భేదము కూడ కనుపించెను ఒకరు నీలి వర్ణపు పట్టు వస్త్రము ధరించగా, రెండవ వారు పసుపు పచ్చని సువర్ణ ఛాయలో నున్న పట్టు వస్త్రమును ధరించిరి. ఒకరు చంద్రుని వలె తెల్లని వర్ణములో నుండగా, రెండవవారు నల్లని మబ్బు రంగులో నుండిరి ఇద్దరును యువకులే. వారి నేత్రములు అప్పుడే విచ్చిన పద్మముల వలె నుండెను పొడవైన వారి చేతులు మోకాళ్ళకు తగులుచుండెను

అవి చాల అందముగా వర్ణింప నలవి కానివిగా నుండెను. వారి కనుల యందు కరుణ ఉట్టిపడుచున్నట్లుగా నుండెను. కనులలో చిరునవ్వు గోచరించుచుండెను. వారి నడక గున్న యేనుగు నడకవలె నుండెను. వారి ముఖములో ఉదారతయు, గంభీరతయు స్పష్టముగా కనపడుచుండెను. వారు మణులతో పొదిగిన బంగారు గొలుసులను, అడవి పువ్వులతో కూర్చిన దండలను మెడలో ధరించిరి. వారిని అక్రూరుడు చూచి, యీ లోకమునకు మూలకారణమైన పరమ పురుషుని రెండు రూపములని గ్రహించెను. ధర్మము ప్రతిష్ఠించి మానవులకు శ్రేయస్సు చేకూర్చుటకై రామ, కృష్ణనామములతో మానవ రూపములను భగవంతుడు ధరించెనని అక్రూరుడు తెలుసుకొనెను.

అక్రూరుడు వారిద్దరి పాదములకు ప్రణమిల్లెను. తాను యెచ్చట నుండి వచ్చెనో, తన పేరేమిటో ప్రకటించుటకు మొదలిడెను. కాని అతని కన్నులు అశ్రువులతో నిండి, గొంతు గద్గదమై ఒక విధమైన ఆవేశము ముంచుకురాగా, నోట మాట రాకుండెను.

కృష్ణుడు అక్రూరుని లేవనెత్తి, అక్రూరు డూహించినట్లుగా, గాఢముగా కౌగిలించుకొనెను. తరువాత బలరాముడు కౌగిలించుకొనెను. అక్రూరుని చేతులు తమ చేతులలోనికి తీసుకుని, లోపలి గదిలోనికి తీసుకు వెళ్ళిరి. అక్రూరుడు చేతులు కాళ్ళు కడుగుకొనుటకు నీరు తెచ్చి యిచ్చిరి. అటు తరువాత మధుపర్కము, అనగా తేనె పెరుగు నెయ్యి చక్కెర నీటితో కలిసిన ఉపాహారమును తెచ్చి యిచ్చిరి. అతిథులను యీ విధముగా ఆదరించుట సనాతనముగా వచ్చుచున్న ఆచారము. కొంచెము విశ్రాంతి తీసుకున్న తర్వాత అక్రూరునికి పాయసాన్నముతో భోజనము పెట్టిరి. వారు భోజనము చేసిన తర్వాత, బలరాముడు సుగంధపూరితమైన పువ్వుల దండలను, కర్పూర సువాసనగల తాంబూలమును అక్రూరుని కిచ్చెను. అతని చేతులకు, వక్షమునకు బలరాముడు గంధము పూయగా, అక్రూరుడు తబ్బిబ్బుచెందెను. సాక్షాత్తు భగవంతుడు తన్నొక గొప్ప అతిథిగా ఆదరించుచున్నాడు. తన్నొక గొప్ప వ్యక్తిగా పరిగణించుచున్నాడు. తనపై కురిపించుచున్న మర్యాదలకు తాను అర్హుడుకాడని అక్రూరుడు భావించెను. కాని యిదంతయు అతనికి అత్యంత ఉత్సాహము కూడ కలిగించుచుండెను. వారు విశ్రాంతిగా కూర్చుని యుండగా, నందు డిట్లడిగెను. ''నీవు దశార్హ కుటుంబమునకు చెందిన ఉత్తముడవు. కంసుని సభలో నీవు యెట్లు బ్రతికి జీవించ గలుగుచున్నావు? నిన్ను చూడగా కసాయివాడు మేకను పెంచుచున్నట్లు తోచుచున్నది. తన్ను తప్ప యితరులను ప్రేమించలేనివాడు, తన ప్రియ సోదరికి పుట్టిన శిశువులను హత్యగావించిన పాతకుడు అయిన వాని పరిపాలనలో ఉన్నావని తెలిసి, నిన్ను అందరును కుశలమేనా యని యెట్లు అడుగగలను?''

తరువాత కృష్ణుడు మధురలో నున్న సత్పురుషుల కుశలము వివరముగా అడిగి తెలుసుకొనెను. వారు కంసుని నిరంకుశత్వమును యెట్లు భరించగలుగుచున్నారని యడిగెను. తరువాత కృష్ణుడిట్లనెను. ''నీవు బృందావనము వచ్చుటకు యేదో కారణము ఉండవలెను. ఏదో ప్రయోజనమున్నగాని కంసుడు నిన్ను యిక్కడకు పంపడని యెరుగుదును. అదియేమిటో మాకు చెప్పుము''.

అక్రూరుడు చెప్పమొదలిడెను. దేవకి వివాహ వృత్తాంతము, ఆకాశవాణి పలికిన పలుకులు, అప్పటి నుండి కంసుడు యే విధముగా యాదవులను వారి బంధుబలగమును వేధించుచున్నదియు వివరించి చెప్పెను. నారదుని రాకను, తమ అష్టమ పుత్రుని దాచి మోసగించితిరని దేవకీ వసుదేవులను చంపుటకు కంసుడు చేసిన ప్రయత్నములను, అట్లు చేయుట వృథా ప్రయాసయని నారదుడు చెప్పుట, మొదట కంసుడు

బలరామకృష్ణులను పట్టి తెచ్చి వారి పీడ వదల్చుకొనుట తన కర్తవ్యమని, యితరులను ఆ తర్వాత చంపవచ్చునని కంసునికి నారదుడు బోధించుట, మున్నగున వన్నియు వివరముగా అక్రూరుడు వివరించెను.

తరువాత అక్రూరుడిట్లు పలికెను ''మీ రిరువురు దేవకి పుత్రులని కంసుని కిపుడు నిశ్చయముగా తెలిసెను. మీ యిద్దరి అంతు చూచువరకు కంసునికి మనసు నిలువదు. అతని వద్ద కువలయాపీడమను భయంకరమైన ఏనుగు కలదు. ఆ ఏనుగు చేత మీ యిద్దరిపీ మట్టు పెట్టవలెనని కంసుడు యోచించుచున్నాడు. ఆ ప్రయత్నము విఫలమైన యెడల, తన వద్ద నున్న మల్లయుద్ధవీరులు మిమ్మిరువురను మల్లయుద్ధములో తప్పక చంపగలరను నిశ్చయముతో నున్నాడు. స్నేహ పూర్వకముగా మిమ్ములను ఆహ్వానించినట్లు గోచరించుటకు ఒక యాగమును యేర్పాటు జేసెను. యాగమను మిషతో మిమ్మిరువురను మధురకు రప్పించుచున్నాడు మీరు మధురకు వచ్చి, కంసుడు యేర్పాటు చేసిన మల్లయుద్ధములో పాల్గొని ఆ వీరుల చేతులలో మీరిద్దరును చనిపోయినచో ప్రజలు తన్ను నిందించబోరని కంసుడు ఆశించుచున్నాడు.

''ధనుర్యాగమునకు రావలసినదని నా ద్వారా మీకు ఆహ్వానము పంపించినాడు. నేనొక రాయబారిని. నేను దశార్హకుటుంబమునకు చెందిన వాడనగుటచేత య్యాదవుల పక్షపాతినని తలచి, నా ద్వారా ఆహ్వానము పంపినచో, మీరు సులభముగా మోసపోగలరని కంసుడు అభిప్రాయపడినాడు.

''నందా! నిన్ను కూడ ధనుర్యాగమునకు రావలెనని కంసుడు కోరినాడు నేను వచ్చిన రథములో యీ యువకు లిద్దరను తీసుకువెళ్ళవలసి యున్నది''. బలరామకృష్ణు లిద్దరును చిరునవ్వుతో మధురముగా యిట్లు పలికిరి. ''అటులనే కానిమ్ము. మామ కోరిక ప్రకారము మేము నీతో మధురకు వచ్చెదము''.

నందుడు, పాలు తదితర వస్తువులు, తన వంటి సామంతులు అర్పించవలసిన అభినందనలు మొదలగునవి సిద్ధపరచుడని సేవకుల నాజ్ఞాపించెను. కంసుని ఆహ్వానమును పురస్కరించుకొని, కొందరు పెద్దలతో ఉదయమే బయలుదేరి మధుర వెళ్ళుటకు తగిన యేర్పాట్లు చేయవలసినదని నందుడు తన సేవకుల కాజ్ఞాపించెను. ధనుర్యాగమును గురించి బృందావనములో చాటింపు వేయించి ప్రకటించెను. మధురలో జరుగు ధనుర్యాగ ఉత్సవము చూచుటకు రాదలచిన వారు తనతో కలిసి ప్రయాణము చేయవచ్చునని నందుడు ప్రకటించెను.

## 199 క్రూరుడైన అక్రూరుడు!

ఉదయమే ఒక గోపిక తన యింటిముందు అలవాటు ప్రకారము కళ్లాపి జల్లి ముగ్గుపెట్టుటకు బయటకు వచ్చెను. నందుని యింటి ముందు ఒక చిత్రమైన రథమును ఆమె జూచెను ఆమె నీళ్ల చెంబును, ముగ్గు గిన్నెను అక్కడే వదలి పొరుగిళ్ళకు వెళ్ళి నందుని యింటికి యెవరో వచ్చిరను వార్త నందించెను ఆమె వారితో యిట్లనెను ''అటువంటి రథమును మనమెవరమును యింతకుముందు చూచియుండలేదు. ఎవరో రాజసౌధము నుండి వచ్చినట్లు తోచుచున్నది. రండి, మనము పోయి చూచెదము'' ఒకొక్కరే బయటకు వచ్చి, యేమి జరుగనున్నదోయని నందుని పొరుగింటి నుండి వేచి చూచుచుండిరి. వారిలో కొంచెము ధైర్యముగల గోపిక నందుని యింటి దగ్గరగా వెళ్ళి లోపల జరుగుచున్న విషయము చూచెను. ఆమె ఆందోళనతో వెనుకకు

అవి చాల అందముగా వర్ణింప నలవి కానివిగా నుండెను. వారి కనుల యందు కరుణ ఉట్టిపడుచున్నట్లుగా నుండెను. కనులలో చిరునవ్వు గోచరించుచుండెను. వారి నడక గున్న యేనుగు నడకవలె నుండెను. వారి ముఖములో ఉదారతయు, గంభీరతయు స్పష్టముగా కనపడుచుండెను. వారు మణులతో పొదిగిన బంగారు గొలుసులను, అడవి పువ్వులతో కూర్చిన దండలను మెడలో ధరించిరి. వారిని అక్రూరుడు చూచి, యీ లోకమునకు మూలకారణమైన పరమ పురుషుని రెండు రూపములని గ్రహించెను. ధర్మము ప్రతిష్ఠించి మానవులకు శ్రేయస్సు చేకూర్చుటకై రామ, కృష్ణనామములతో మానవ రూపములను భగవంతుడు ధరించెనని అక్రూరుడు తెలుసుకొనెను.

అక్రూరుడు వారిద్దరి పాదములకు ప్రణమిల్లెను. తాను యెచ్చట నుండి వచ్చెనో, తన పేరేమిటో ప్రకటించుటకు మొదలిడెను. కాని అతని కన్నులు అశ్రువులతో నిండి, గొంతు గద్గదమై ఒక విధమైన ఆవేశము ముంచుకురాగా, నోట మాట రాకుండెను.

కృష్ణుడు అక్రూరుని లేవనెత్తి, అక్రూరు డూహించినట్లుగా, గాఢముగా కౌగిలించుకొనెను. తరువాత బలరాముడు కౌగిలించుకొనెను. అక్రూరుని చేతులు తమ చేతులలోనికి తీసుకుని, లోపలి గదిలోనికి తీసుకు వెళ్ళిరి. అక్రూరుడు చేతులు కాళ్ళు కడుగుకొనుటకు నీరు తెచ్చి యిచ్చిరి. అటు తరువాత మధుపర్కము, అనగా తేనె పెరుగు నెయ్యి చక్కెర నీటితో కలిసిన ఉపాహారమును తెచ్చి యిచ్చిరి. అతిధులను యీ విధముగా ఆదరించుట సనాతనముగా వచ్చుచున్న ఆచారము. కొంచెము విశ్రాంతి తీసుకున్న తర్వాత అక్రూరునికి పాయసాన్నముతో భోజనము పెట్టిరి. వారు భోజనము చేసిన తర్వాత, బలరాముడు సుగంధపూరితమైన పువ్వుల దండలను, కర్పూర సువాసనగల తాంబూలమును అక్రూరుని కిచ్చెను. అతని చేతులకు, వక్షమునకు బలరాముడు గందము పూయగా, అక్రూరుడు తబ్బిబ్బుచెందెను. సాక్షాత్తు భగవంతుడు తన్నొక గొప్ప అతిథిగా ఆదరించుచున్నాడు. తన్నొక గొప్ప వ్యక్తిగా పరిగణించుచున్నాడు. తనపై కురిపించుచున్న మర్యాదలకు తాను అర్హుడుకాడని అక్రూరుడు భావించెను. కాని యిదంతయు అతనికి అత్యంత ఉత్సాహము కూడ కలిగించుచుండెను. వారు విశ్రాంతిగా కూర్చుని యుండగా, నందు డిట్లడిగెను. ''నీవు దశార్హ కుటుంబమునకు చెందిన ఉత్తముడవు. కంసుని సభలో నీవు యెట్లు బ్రతికి జీవించ గలుగుచున్నావు? నిన్ను చూడగా కసాయివాడు మేకను పెంచుచున్నట్లు తోచుచున్నది. తన్ను తప్ప యితరులను ప్రేమించలేనివాడు, తన ప్రియ సోదరికి పుట్టిన శిశువులను హత్యగావించిన పాతకుడు అయిన వాని పరిపాలనలో ఉన్నావని తెలిసి, నిన్ను అందరును కుశలమేనా యని యెట్లు అడుగగలను?''

తరువాత కృష్ణుడు మధురలో నున్న సత్పురుషుల కుశలము వివరముగా అడిగి తెలుసుకొనెను. వారు కంసుని నిరంకుశత్వమును యెట్లు భరించగలుగుచున్నారని యడిగెను. తరువాత కృష్ణుడిట్లనెను. ''నీవు బృందావనము వచ్చుటకు యేదో కారణము ఉండవలెను. ఏదో ప్రయోజనమున్నగాని కంసుడు నిన్ను యిక్కడకు పంపడని యెరుగుదును. అదియేమిటో మాకు చెప్పుము''.

అక్రూరుడు చెప్పమొదలిడెను. దేవకి వివాహ వృత్తాంతము, ఆకాశవాణి పలికిన పలుకులు, అప్పటి నుండి కంసుడు యే విధముగా యాదవులను వారి బంధుబలగమును వేధించుచున్నదియు వివరించి చెప్పెను. నారదుని రాకను, తమ అష్టమ పుత్రుని దాచి మోసగించితిరని దేవకీ వసుదేవులను చంపుటకు కంసుడు చేసిన ప్రయత్నములను, అట్లు చేయుట వృథా ప్రయాసయని నారదుడు చెప్పుట, మొదట కంసుడు

బృందావనము నిర్జీవము చెయ్యకుము, మమ్ములను చంపబోకుము. నీవు తప్ప మాకు యెవరును లేరు. మమ్ము విడిచి వెళ్ళుటకు నీ మనసు యెట్లు ఒప్పెను?''

వారు అక్రూరుని వైపు తిరిగి పరుషముగా యిట్లు పలుకసాగిరి. ''మాప్రియ కృష్ణుని తీసుకువెళ్ళుటకు నీకెంత ధైర్యము? నీకాపేరు యెవరు పెట్టిరి? నీ తీరుకు పేరుకు పొంతన లేదే! క్రూరత్వము మూర్తీభవించిన నీకు ఆ పేరెట్లు సార్థకమగును? నీవు మాప్రాణములు తీయుటకు వచ్చిన యముడవు. కృష్ణుడు మమ్ము విడచివెళ్ళిన తర్వాత మేము జీవించలేము''.

కృష్ణుడు వారిని ఓదార్చి, తాను వెళ్ళక తప్పదని వారితో చెప్పెను. తాను వెళ్ళకున్నచో తన తండ్రిని రాజు శిక్షించగలడని చెప్పెను. ఎంత దుర్మార్గుడైనప్పటికిని రాజు యెడల, తల్లిదండ్రుల యెడల తన కర్తవ్యమును నిర్వహించవలసి యున్నదని వారితో పలికెను. విచారించుచున్న గోపికలకు కృష్ణుని పలుకులు అనునయము కలిగింపలేకపోయెను

కృష్ణుడు గోపికలను వదలిపెట్టి తోటి ఆటగాండ్ర దగ్గరకు వెళ్ళెను చిన్నప్పటి నుండి తమ బాల్య స్నేహితుడు, తోటి ఆటగాడు అయిన కృష్ణుడు తమను విడిచి పట్టణమునకు వెళ్ళుచున్నాడను ఆలోచన వారిని మూగవారిని చేసెను. అయితే తాము కూడ తమ తండ్రులతో మధురా నగరము వెళ్ళగలమను ఆశ వారికి కొంత ఊరట కలిగించెను. ఏమో యెవరికి యెరుక, బహుశః కృష్ణుడు తిరిగి తమతో రావచ్చునేమో!

కృష్ణుడు వారివద్ద సెలవు తీసుకొనెను. తిరిగి తాను బృందావనమునకు, గోవర్ధనపర్వత సానువుల వద్దకు, యమునానది ఒడ్డుకు, రానని తెలిపిన కృష్ణుని కన్నులు విచారముతో నున్నట్లు గోచరించెను యమునానది యిసుక తిన్నెలపై వెన్నెల రాత్రులందు కృష్ణుని మధుర సంగీతము మరి వినిపించదు చేతిలో కర్రను పట్టుకుని ఆవులను అడవులకు కృష్ణుడు తోలుకు వెళ్ళుట యిక జరుగదు గోవులకు వీడ్కోలు చెప్పెను. మరల ఒకసారి గోశాలకువెళ్ళి విచారముతో నిలిచియున్న ఆవుల నొకసారి చూచెను వాటి కన్నీళ్ళు తుడిచి, తన కన్నీళ్ళు తుడుచుకుని, తల్లి యశోద వద్దకు వెళ్ళెను ఆమె పాదములపైబడి మరొకసారి ఆమె వద్ద సెలవు తీసుకొనెను. ఆమె కృష్ణుని అంటి పెట్టుకుని యుండగా, ఆమె చేతుల నుండి నెమ్మదిగా తప్పించుకొనెను. బలరాముడు యిదివరకే రథమువైపుకు వెళ్ళెను. అక్రూరుని సహాయముతో రథము యెక్కెను. కృష్ణుని బలరాముని ప్రక్కనే కూర్చొనబెట్టి, అక్రూరుడు రథసారథి ఆసనముపై కూర్చుండి, కొరడా ఝుళిపించెను. తనయందు విశేషమైన భక్తి కలిగి, యిప్పుడు హృదయము పగులునట్లు విలపించుచున్న గోపికలను, స్నేహితులను రెప్పవాల్చక కృష్ణుడు చూచుచుండెను.

నందుడు, యితర గోపాలురు బయలుదేరి వెళ్ళుటకు బండ్లు సిద్ధమైనవి వాటిలో మహారాజుకు యివ్వవలసిన కానుకలు, యితర సామగ్రి పేర్చిరి. మధురకు వారి ప్రయాణము కూడ నెమ్మదిగా ప్రారంభము కానున్నది.

కొద్ది క్షణములలో మధురా నగరమునకు కృష్ణుని ప్రయాణము ప్రారంభమైనదని గోపికలు గుర్తించిరి. వారిలో వారిట్లనుకొనిరి. ''కృష్ణుని చూడు! అతని హృదయమెంత కఠినమో! మనల నిట్లు వదలిపెట్టి అతడెట్లు వెళ్ళగల్గెను. భగవంతుడు మనకిపుడు వ్యతిరేకముగా నున్నట్లున్నది, లేకున్న యీ ప్రయాణము యేదో ఒక విధముగా ఆగిపోయి ఉండెడిది. అంతేకాకుండ మంచి శకునములు విజయమును సూచించుచున్నవను

చున్నారు. కాని యిది మనకు పరాజయము. రండి, అతడు వెళ్ళకుండ ఆపుదము. పెద్దలు మనలను అడ్డుపెట్టుటకు ప్రయత్నించినచో మనము లక్ష్యపెట్టవద్దు''. వారు రథము నాపుటకు ప్రయత్నించి విఫలులైరి. అక్రూరుడు కొరడా ఝుళిపించగనే గుర్రములు కదలజొచ్చెను. గోపికలు, బాలురు బిగ్గరగా యేడ్చిరి వారి దయనీయమైన యేడ్పులకు ఆకాశము ప్రతిధ్వనించుచున్నట్లుండెను రథము ముందుకు సాగెను. తన రథము వెంట రావద్దని కృష్ణుడు వారికి చేతితో సైగ చేయుచుండెను మాటిమాటికి కృష్ణుడు వెనుకకు చూడగా, వారు వెళ్ళవద్దన్నట్లుగా చేతులు జాపిరి. కృష్ణుడు గట్టిగా వారితో, ''నేను త్వరలోనే తిరిగి వచ్చెదను. మీకు వార్త పంపించెదను. మీరు విచారముగా ఉండవద్దు''.

రథము వెళ్ళిన దిక్కుగా వారట్లే చూచుచు నిలుచుండిరి. క్రమముగా రథము అదృశ్యమగుట చూచిరి. తమ కనులను తుడుచుకుని, రథము వెళ్ళగా వెనుక రేగిన ధూళి తిరిగి నేలపై స్థిరపడునంత వరకును అట్లే చూచుచుండిరి. తరువాత వారికి దూరముగా యేమియు కన్పించకుండెను వారిని విడిచి కృష్ణుడు వెళ్ళిపోయెను

## 200 అక్రూరుడు గాంచిన దృశ్యము

రథము వేగముగా సాగెను కొంతవడికి వారు యమునానదీ తీరము చేరిరి బలరామకృష్ణులు రథము దిగి నది వద్దకు వెళ్ళిరి ఉదయపు వెలుగులో యమునానది నీలమణి వర్ణములో అందముగా ఆకర్షకముగా గోచరించుచుండెను అన్నదమ్ము లిద్దరును కొంతసేపు అక్కడనే నిలబడిరి అక్కడ అనేక సంవత్సరములు గడపిన ఆలోచనలతో నిమగ్నులై యుండిపోయిరి వారిద్దరును పరమాత్మ ధరించిన రెండు రూపములు లోకములో మానవులకు కలుగు అనుభూతులతో సంబంధము అనుబంధము పరబ్రహ్మమునకు ఉండదు అయినప్పటికిని, వారు ఆ నదిలో ఆచమనము చేసి ప్రాతఃకాల విధులను నెరవేర్చునపుడు వారిని విచారము ఆవహించెను మానవరూపము ధరించుటచేత, బహుశః మానవులవలె అనుభూతులు కలిగియుండవచ్చును బాల్యములో ఆడుచు పాడుచు నిర్విచారముగ గడపిన దినముల గురించి కొంతసేపు ముచ్చటించుచు అక్కడ కొంతసేపు నిలుచుండిరి. ఆరోజులు గతించెనని, బాల్యము తిరిగి రాదని వారికి తెలియును తిరిగి వెళ్ళి రథములో కూర్చుండిరి.

ప్రాతఃకాలవిధులు జరుపుటకు అక్రూరుడు యమునానదికి వెళ్ళెను. సూర్యుడు ఉదయించిన తర్వాత యీ విధులు జరుపవలసి యున్నది స్నానము చేయుటకు నదిలో ప్రవేశించెను గాయత్రీ మంత్రము నుచ్చరించుచు నదిలో మునిగెను అంత ఒక విచిత్రము జరిగెను. ఆ నదీ జలములో అన్నదమ్ములు బలరామకృష్ణులను చూచి తత్తరపడెను వసుదేవ కుమారులిద్దరును యింతతొందరగా నీటిలోనికి యెట్లు వచ్చిరని తబ్బిబ్బుచెంది, నీటిపైకి వచ్చి దూరముగా నున్న రథమువైపు దృష్టిసారించెను వారిద్దరును ఒకరితో నొకరు సంభాషించుచు, గట్టిగా నవ్వుకొనుట జూచెను అక్రూరుడు మరల నీటిలో మునిగెను. అతడిప్పుడు వేరొక దృశ్యము గాంచెను.

వేయి శిరస్సులుగల ఆదిశేషుడు చుట్టచుట్టుకొని యుండగా ఆదిశేషునిపై నారాయణుడు పవ్వళించి

యుండుట అక్రూరుడు జూచెను. సనకసనందాది ఋషులు, స్వర్గములోని దేవతలు నారాయణుని స్తుతించుట అక్రూరుడు చూచెను. ఈదృశ్యము చూచు భాగ్యము అక్రూరునికి లభించెను.

ఇంతటి మహద్భాగ్యము కలిగిన అమితానందము చేత అక్రూరునికి నోట మాటరాకుండెను. తాను విన్నది గుర్తుకు వచ్చెను. నారాయణుడు ఆదిశేషుడు, యీ భూమిని పట్టి పీడించుచున్న విష శక్తులను నిర్మూలించుటకై వసుదేవుని కుమారులుగా జన్మించిరని వినియుండెను. పరమ పురుషుడైన నారాయణుని అక్రూరుడు ప్రార్థించెను.

అతడు ప్రార్థించుచుండగా ఆ దృశ్యము తన కనుల ముందు నుండి చెదరిపోయెను. అక్రూరుని కనులలో ఆశ్చర్యము ప్రస్ఫుటముగా గోచరించుచుండెను. అది చూచి కృష్ణు డిట్లడిగెను. ''మహానుభావా! మీ ముఖమందు యేదో విచిత్రభావము గోచరించుచున్నదేల? బహుశః యేదైనా విచిత్రమును జూచితిరా? దయచేసి మాకు తెలుపవలెను. మీ వదనములో కనుపించు సంతోషమునకు కారణము తెలుసుకొని మేము కూడ ఆ సంతోషములో కొంతభాగము పంచుకుని ఆనందించెదము''. చిలిపిగా చిరునవ్వు నవ్వెను.

అక్రూరుడిట్లనెను. ''అతి విచిత్రమైన విషయము! ఇది వరకెన్నడును నేనిటువంటిటి చూడలేదు! మీ ఊహ సరియైనది. నేను చూచిన దృశ్యము నాకనులను తెరపించెను. నేను చూచిన అద్భుత ఆశ్చర్యకర విషయము లన్నియు మీలో నున్నవి. నాకు తెలుసును. పరమాత్మ స్వరూపులైన మీరు సామాన్య మానవునివలె, సుఖదుఃఖములకు లోనగు నందరి మానవులవలె, యీభూమిపై సంచరించుచున్నారు. ఇది చూచిన తర్వాత, యింతకు మించిన అద్భుతమేదైన నుండగలదా? దైవస్వరూపునికి నా నమస్కారము''.

గాందిని కుమారుడైన అక్రూరుడు ఆ విధముగా పలికిన తరువాత, గుర్రముల కళ్లెములను పట్టుకుని, మధురానగరము దిక్కుగా రథమును తోలుచుండెను.

మధురానగరము చేరుసరికి సూర్యుడు పశ్చిమదిక్కునకు వచ్చెను. దారినిపోవు బాటసారులు, అక్రూరుని సమక్షములో నున్న ఈ యిరువురు సుందరరూపులను చూచి, కనులను ప్రక్కకు మరల్చలేకపోయిరి. అన్నదమ్ముల అందము వారినంతగా ముగ్ధులను గావించెను.

నందుడు అతని సహచరులు అంతకు మునుపే రాజ భవనము చేరుకొనిరి. వారి కుమారుల రాకకై యెదురు చూచుచుండిరి. నందుడు విడిసియున్న ప్రదేశమునకు అక్రూరుడు రథములను తోలుకుని వచ్చెను. తండ్రి పాదములకు బలరామకృష్ణులు నమస్కరించిన తర్వాత అక్రూరుని చేతులను తమ చేతులలోనికి తీసుకొనిరి. కృష్ణుడిట్లనెను. ''అక్రూరా! నీ కార్యము పూర్తి అయ్యెను. నీవు నీ గృహమునకు వెళ్ళి, తర్వాత మహారాజుతో ఆజ్ఞప్రకారము 'యువకుల' నిద్దరిని తీసుకువచ్చితినని మనవి చేయుము. మేము యిచట కొంతసేపు ఉండెదము. తర్వాత మేము నడచి యీ నగరమును తిలకించెదము. మేము పల్లెటూరి గోశాలల నుంచి వచ్చిన వారమని జ్ఞప్తియందుంచుకొనుము. ఈ నగర శోభలేవియు మాకు తెలియవు''.

కృష్ణుని కనులలోని ఒక విధమైన మెరపు వినుచున్నవారి పెదవులపై చిరునవ్వు తెప్పించెను. అక్రూరు డిట్లనెను. ''ఈ విధముగా నన్ను వదలివేయుట భావ్యము కాదు. నీవులేక నేను మధురలో ప్రవేశించను. దయచేసి మీ అన్నదమ్ము లిద్దరును నా గృహమునకు వచ్చి పావనము చేయుమని ప్రార్థించుచున్నాను. మీ

పాదధూళి చేత యీ మధురలో నా గృహము పవిత్రస్థలము అగునట్లు చేయగోరెదను మీ పాదములను అభిషేకింపనిండు ఆ పవిత్రజలము చేత నా పాపకర్మములు పటాపంచలగును. నీ పవిత్రపాదములను అభిషేకించి బలిచక్రవర్తి శాశ్వత ఖ్యాతిని పొందెను. మహాదేవుడు గంగానదిని తన జడలలో ధరించినాడు. ఆ గంగ తరువాత భూమిమీదకు వచ్చిన ప్రదేశము పవిత్రమొనర్చి, అనేక వేల సంవత్సరములు పడియున్న సగరచక్రవర్తి కుమారులను పునీతులను జేసెను. నీ పవిత్ర పాదములను కడిగిన జలమే గంగ. అదే విధముగ, నా చేతులతో నీ పాదముల నభిషేకించు భాగ్యము చేకూర్చి మా గృహములో గంగ ప్రవహించునట్లు చేయుము''.

అక్రూరుని కన్నీరు తుడిచి కృష్ణుడిట్లనెను ''నాభక్తులు నా కత్యంత ప్రియులు వారి ప్రేమ నాకు ముచ్చటగొలుపును వారి కోరికను నేనెప్పుడును నిరాకరించను కావి, అక్రూరా! నాకు ప్రధానమైన కార్యములను ముందు నెరవేర్చనిమ్ము ముందు యీభూమిపై పాపాత్ముడైన కంసుని పీడ విరగడ జేయవలసి యున్నది. నా బంధువులైన యాదవులందరికిని సంతోషము కల్గించవలసి యున్నది నా తల్లిదండ్రులను మొదటి సారిగా కలుసుకొనవలసి యున్నది. ఆ కార్యములు పూర్తి కాగానే తప్పక నీ గృహమునకు వచ్చి నీతో యెక్కువ కాలము గడపెదను కాని యిప్పుడు నీవు నాతో యెక్కువ కాలముండుట భావ్యము కాదు. నీవు నగరమునకు వెళ్ళి కంసునితో నీ కప్పగించిన కార్యమును సఫలీకృతము గావించితినని చెప్పుము''

బరువైన హృదయముతో అక్రూరుడు వెళ్ళిపోయెను బలరామకృష్ణులు తమ స్నేహితులను తిరిగి కలుసుకొనిరి నందుడు యితర పెద్దల అనుజ్ఞ తీసుకుని, వారు నగరమును తిలకించుటకు వెళ్ళిరి.

## 201 మధురానగర వీధులలో బలరామకృష్ణులు

మధుర అందమైన నగరము ప్రతి గృహము ద్వారములు అందముగా చెక్కినవి చాల యిండ్ల గోపురములు బంగారు వెండి రేకులతో అందముగా తీర్చినవి నల్లని మద్ది కర్రతో అందముగా చేసిన ద్వారములు లోపల మెరయుచున్న వెండి, బంగారము, రాగి, కంచు రేకులతో తీర్చిదిద్దినవి

నగరము చుట్టును లోతైన పెద్ద కందకము గలదు. నగరములో పెక్కు తోటలు పూలచెట్లతో, చిగురించుచున్న వృక్షములతో నిండియుండెను. పువ్వుల సువాసనలతో గాలి వీచుచుండెను. ధనవంతులు మాత్రమే ఆ గృహములలో యుండుట వారు గమనించిరి. ధనవంతుల జీవన సరళి ప్రస్ఫుటముగా గోచరించుచుండెను అనేక యిండ్లపై మిద్దెలు గలవు ఆ మిద్దెలపై నెమళ్ళు స్వేచ్ఛగా విహరించుచుండెను. పిచ్చుకల కూతలు అంతటను వినిపించుచుండెను. వీధులు చాల వెడల్పుగా నుండెను రోడ్లమీద నీరు చిలికించినట్లుండెను పణ్యవీధులలో ప్రపంచములో ఉత్పత్తి అయే అన్ని వస్తువులు గోచరించుచుండెను విక్రేతలు పట్టువస్త్రములు, వెండి వస్తువులను ఉచ్చైస్వరముతో విక్రయించుచుండిరి అన్నియు వింతగా ఆశ్చర్యముగా కన్పట్టుచుండెను. బృందావన బాలురు యిష్టము వచ్చిన రీతిగా, యిది వర కెన్నడును చేత, సంచరించసాగిరి

వారు రాజవీధిలో నడచుచుండిరి. అది అన్ని వీధులకన్న బాగుగా వెడల్పుగా నుండెను. రాజసౌధమునకు వెళ్ళుటకు అదియేదారి. నగరపౌరులు క్రొత్తగా వచ్చిన యీ వ్యక్తులను చూసి అచ్చెరువందిరి. వారివైపు తేరిపారచూచి, వారిలోవారు యీ యువకు లెవరెవరా యని ఊహించుచుండిరి. వారి మాటలను విననట్లుగా బలరామకృష్ణులు సాగిపోవుచుండిరి. అప్పటికే నందుని కుమారులైన బలరామకృష్ణులు వచ్చిరన్న వార్త ప్రాకెను. అనేక లీలలు, అద్భుతములు గావించి, అనేకులను అసురులను చంపిన ఆ యువకులు ధనుర్యాగమునకు వచ్చిరని వినుటచేత, క్రొత్తగా కనుపించు ఈ యువకులు నిశ్చయముగా బలరామకృష్ణులేయని ప్రజలు తలచిరి. స్త్రీలు కిటికీల వద్ద చేరియు, మిద్దెలపై కెక్కియు వారి అందమును కనులార గాంచుచుండిరి. ఆ విధముగా కథానాయకులైన రామకృష్ణులు, మధురాపుర వీధులలో కోలాహల సంబారముల మధ్య, సింహములవలె సంచరించుచుండిరి.

ఆ విధముగా నడచి వెళ్ళుచున్న రామకృష్ణులు, వీపుపై బట్టల మూటను మోసుకుని తమవైపుగా వచ్చుచున్న చాకలిని చూచిరి. కృష్ణుడు చాకలి వానిని ఆపి మూటలో యేమున్నదో చెప్పమని అడిగెను. అతడు కంసుని వస్త్రములను శుభ్రము చేయు చాకలి. మహారాజు ధరించు వస్త్రములను శుభ్రము చేయువాడనను గర్వము అతనిలో గలదు. ఆ చాకలి యిట్లనెను.

''నేను మహారాజు వస్త్రములను శుభ్రపరచు చాకలిని. నేను వస్త్రములను శుభ్రము చేయగా మహారాజు సంతోషించును. ఈ మూటలో మహారాజు కంసుడు ధరించు పట్టు వస్త్రము లున్నవి''.

చిరునవ్వుతో కృష్ణుడిట్లనెను. ''చూడు! నీ మూటలో చాల వస్త్రములున్నవి. మేము ధనుర్యాగము చూచుటకు వచ్చినాము. తొందరలో మేము మంచి వస్త్రములను తీసుకు రాలేకపోయినాము. నీ మూటలోని కొన్ని పట్టు వస్త్రములను మాకు యిమ్ము. అట్లు యిచ్చినందుకు నీవు చింతించనక్కరలేదు. నేను అభయమిచ్చుచున్నాను. మాకు కొన్ని వస్త్రము లిమ్ము''.

చాకలి బిగ్గరగా నవ్వి యిట్లనెను. ''మీకు చొరవ చాల యెక్కువగా నున్నట్లున్నది! రాజు ధరించు వస్త్రములను యిమ్మని అడుగుటకు యెంత ధైర్యము? చూడగా మీరు పల్లెటూరు నుంచి వచ్చినారని తెలియుచున్నది. కొండలు, పచ్చిక బయళ్లలో సంచరించుటకు అలవాటు పడినవారు. మీరు ధరించిన ముతక వస్త్రములే అందుకు నిదర్శనము. అందుచేతనే, మునుపెన్నడును చూచి యెరుగని నాజూకైన పట్టు వస్త్రములు యిమ్మని నన్ను బ్రతిమాలుచున్నారు. నా కాగ్రహము రాక ముందే మీరు యిక్కడ నుండి తప్పుకొనండి. మీ అనుచిత ప్రవర్తన చూచి రాజభటులు మిమ్ము కొట్టి శిక్షించగలరు''. తాను పలికిన గంభీరమైన పలుకులకు యితరు లెట్లు స్పందించుచున్నారోయని చాకలివాడు చుట్టును పరికించి చూచెను.

కృష్ణునికి మిక్కిలి ఆగ్రహము వచ్చెను. చెయ్యి పైకెత్తి చాకలివాని తలపై ఒక వ్రేటు వేసెను. అంతటి బలమైన వేటు వేయునని చాకలివాడు ఊహించకుండెను. ఆ వేటుకు తల శరీరము నుండి వేరై క్రిందపడెను. చాకలివాని అనుయాయులు భయభ్రాంతులై అక్కడ నుండి పారిపోయిరి.

ప్రశాంతముగా తీరికగా కృష్ణుడు బట్టల మూట విప్పి, తమకు తమ స్నేహితులకు కావలసిన మంచి వస్త్రములను యెంచెను. బలరామకృష్ణు లిద్దరు మంచి పట్టు వస్త్రములు ధరించిరి. అటులనే వారి స్నేహితులు కూడ మంచి మంచి వస్త్రములు ధరించిరి. మిగిలిన వస్త్రములను రాజమార్గముపై వదలివేసి ముందుకు

సాగిపోయిరి.

ఆ మార్గమున బట్టలు నేయు సాలీడు ఒకడుండెను. అతడు తన విక్రయ కేంద్రము నుండి, రంగురంగుల దారములతో అందముగా అంచులు కుట్టిన శాలువలను తీసుకువచ్చి యివ్వగా, బలరామకృష్ణులు సంతోషముతో స్వీకరించిరి. కృష్ణుడు అతనికి సంపదల ననుగ్రహించుటే గాక, తన నిజ స్వరూప దర్శన భాగ్యమును కలిగించెను. అక్కడ నుండి పువ్వులు విక్రయించు వాని వద్దకు వెళ్ళిరి. పువ్వుల వర్తకుడు నందుని కుమారులు వచ్చిరని అంతకు మునుపే విని యుండెను. వారు తన పేద యింటికి వచ్చి అనుగ్రహించగలరని కలలో కూడ తలచలేదు. అన్నదమ్ము లిద్దరును ప్రవేశించగనే, పాదములకు నమస్కరించి చేతులు కట్టుకుని నిలుచుండెను. ఆ వర్తకు డిట్లనెను. ''మీరు నాపై వర్షించిన అనుగ్రహమునకు నేను యేవిధముగా మీకు ప్రతిఫలము యివ్వగలను. నేనొక సామాన్యుడనైన పువ్వుల వర్తకుడను''.

తనపై విశేషమైన అభిమానము చూపిన సుదాముడను పూలవర్తకుని యింట కృష్ణుడు కొంతసేపు గడపెను. పువ్వుల దండలు ధరించి గందము పూసుకుని తాంబూలము సేవించిన కృష్ణుడు, పువ్వుల వర్తకునిచేత వానిని బలరామునకు, యితర స్నేహితులకు నిప్పించిన పిదప, సుదాముని గృహము విడచి వెళ్ళెను. వెళ్ళునపుడు సుదామునితో కృష్ణుడిట్లనెను. ''నీవు నన్ను భగవంతుడనని భావించుచుండుటచేత నీవు యేది కోరిన దానిని నీ కనుగ్రహించెదను''. సుదాముడు చిరునవ్వు నవ్వి కృష్ణునితో యిట్లనెను. ''నిన్ను నీ అందమైన వదనమును చూచితిని, ప్రేమాభిమానము లుట్టిపడు నీ పలుకులను వింటిని. ఇంతకు మించిన కోరికలు యింకేమి యుండును? ప్రభూ! నేను కోరునది మీ యెడల నిరంతర భక్తి కలిగియుండుట. అందరు మానవులు, అన్ని జీవుల యెడ కరుణాదరములతో వర్తించునట్లు అనుగ్రహింపుము. ఈ లోకములో నేను కోరున విదియే''.

కృష్ణుడు సుదామునకు అమితమైన సంపదను, కీర్తిని ప్రసాదించెను. సంతోష వదనములతో నవ్వుచు, సుదాముని గృహమును వీడి రామకృష్ణులు తమ మిత్రులతో కలిసి వెళ్ళిరి.

## 202 త్రివక్ర (కుబ్జ)

బలరామకృష్ణులు మరల తమ మిత్రులతో కలసి వీధిలో రాజసౌధమువైపు నడచుచుండిరి. ఒక స్త్రీ వారికెదురుగా వచ్చుచుండెను. ఆమె యౌవనవతి, ముఖము అందముగా నుండెను. ఆమె చేతిలో అత్తరు గందపు గిన్నెలు కలవు. అత్తరు సువాసన వీధి యంతటను వ్యాపించునంత పరిమళము గలిగియుండెను. కృష్ణు డామెను జూచెను. పాపము ఆ స్త్రీకి గూని కలదు. ఆమె శరీరము నిజముగా మూడు వంకరలతో నుండెను. కృష్ణుడు మధురమైన చిరునవ్వు నవ్వి, ఆమె నిట్లడిగెను. ''నీవు చాల అందముగా నున్నావు. నీ వెవరో చెప్పుము. నీ చేతిలో యేమున్నది? నీ చేతిలో నున్న గిన్నెలో అత్తరు ఉన్నట్లు నా కనిపించు చున్నది. ఇది ఎవరికొరకు? చెప్పుము. నీకు యిష్టమైనచో దానిని నాకు యివ్వవచ్చును. నాకది కావలెను. దానిని నా కిచ్చినట్లయిన నీకు మంచి శుభము కలుగ గలదు. నామాట నమ్ముము''.

ఆ స్త్రీ యిట్లు పలికెను. ''నేనొక సైరంధ్రిని. నేను రాజసౌధములో పనిచేయుదును. నా పేరు త్రివక్ర,

నీవు చూచుచున్నావు''. అట్లు పలుకుచున్నపుడు ఆమె ముఖమందు విచారముతో కూడిన నవ్వు గోచరించెను. ఆమె మరల యిట్లు చెప్పెను. ''అత్తరు గందము చక్కగా మిళితము చేయుట నాకు బాగుగా తెలుసును. నేను తయారుచేసిన గందమునే మహారాజు ఉపయోగించును. కాని, మీ యిద్దరిని చూడగా, నేను తయారుచేసిన యీ అత్తరు గందమును ఉపయోగించుటకు మీరు మాత్రమే అర్హులనిపించుచున్నది. మీరు అందమైన, ఆకర్షణీయులైన యువకులు. మంచి వస్తువులను గుర్తించుటలో మంచి నిపుణుల వలె నున్నారు. మీ మాటలు, చూపులు చిరునవ్వులు యెదుటివారిని ఆకట్టుకొనుచున్నవి. నీవు దయతో చక్కగా మాట్లాడుచున్నావు. ఈ అత్తరు గందములను అడిగినందుకు నాకు చాల సంతోషముగా నున్నది. ఇష్టపూర్వకముగా వాటిని మీ కిచ్చెదను''.

ఆమె బలరామకృష్ణులకు అత్తరు గందములను యిచ్చెను. వారిరువురును ఆ సుగంధమును తమ వక్షమునకును, భుజములకును, అరిచేతులకును పూసుకొనుట ఆమె నవ్వుచు గమనించుచుండెను.

ఆమెకు వెంటనే తగిన ప్రతిఫల మొసగవలెనని కృష్ణుడు నిశ్చయించుకొనెను. ఆమెకు దగ్గరగా వెళ్ళి కనులలోకి చూచి చిరునవ్వు నవ్వెను. తరువాత తన రెండు పాదములను ఆమె రెండు పాదములపై నుంచెను. కృష్ణుడు, తాను విడచు మధురశ్వాసను ఆమె అనుభవించు నంత దగ్గరగా నిలుచుండి, ఆమె గడ్డము క్రింద చేతి రెండు వ్రేళ్ళను పెట్టి నెమ్మదిగా పైకెత్తెను. ఆమె మెడను తలను మెల్లగా స్థిరముగా పైకెత్తెను. చుట్టునున్నవారు ఈ దృశ్యము చూచి ఆశ్చర్యపడిరి.

త్రివక్ర (కుబ్జ)కు వంకరలన్నియు పోయెను. ఆమె తిన్నగా పెరుగుచున్న చెట్టువలె నిలుచుండెను. ఆమె అవయవములన్నియు పొందికగా సౌష్ఠవము కలిగి యుండెను. ఆమె చాల అందమైన స్త్రీ. ఆమె మరల మరల తనను తాను చూచుకొనుచుండెను. ఆమె వంకరలు పూర్తిగా నివృత్తి చెందినవని స్పష్టముగా తెలుసుకొనుటకై ఆమె అట్లు చేసెను. కన్నీరు నిండిన కనులతో ఆమె కృష్ణుని పాదములపై బడగా, ఆమెను లేవనెత్తి యిట్లడిగెను. ''నీకు యింకేమైన కావలయునా?'' అతడట్లు అడుగుచున్నపుడు అతని కనులలో చిరునవ్వు మెరయుట ఆమె గమనించెను. ఆమె సిగ్గుతో చీర కొంగును తన వ్రేలికి చుట్టుకొనుచు, క్రిందకు దించిన కనులతో తడబడుచు, ముఖమందు ఆనందము ఉట్టిపడగా, యిట్లు పలికెను. ''నీవు తప్ప నా కింకేదియు అక్కరలేదని నీకు తెలుసును. దగ్గరలోనే యున్న నాయింటికి రావలెను. నన్ను కరుణించి నీ దానిని చేసుకొనుము''. బలరాము డిదంతయు చిలిపి చిరునవ్వుతో గమనించుచుండెను. మిత్రులందరును బలరాముని ఆనందములో పాలు పంచుకొనుచుండిరి. కృష్ణుడు సంతోషముతో నవ్వి యిట్లనెను. ''నీవు చాల అందకత్తెవు. నీవు అడిగినది తప్పక యిచ్చెదను. కాని, నీవు వేచి యుండవలెను. నేనొక ముఖ్యకార్యము నిర్వహించవలసి యున్నది. అది పూర్తియగువరకు నే నింకేదియు చేయలేను. అప్పటివరకు నా కొరకు వేచి యుండుము''.

త్రివక్రయు యితరులును వారిని తేరిపారి చూచుచుండగా, బలరామకృష్ణులు మిత్రులతో కలిసి ముందుకు కదలిపోయిరి.

# 203 ధనుర్భంగము

వారు ధనుస్సు ఉన్న ఆయుధశాల యెక్కడ నున్నదని దారిబోవువారిని అడిగి తెలిసికొనిరి. ఈ ధనుస్సును మిషగా పెట్టే బలరామకృష్ణులను మధురకు రప్పించిరి. వారు ఆయుధశాల చేరి అందులో ప్రవేశించిరి. అందు మహాగొప్ప ధనుస్సు కలదు. మరుచటి రోజు దానికి పూజ జరుపవలసి యుండును. అది ఒక అందమైన, శరీరము గగుర్పొడిచే టటువంటి దృశ్యము. గౌరవపూర్ణమైన వదనములతో అన్నదమ్ము లిద్దరును ధనుస్సు ముందు నిలుచుండిరి. విలువైన మణులతో పొదిగిన ఆ ధనుస్సు చుట్టును కావలివారు కాపు కాయుచుండిరి. అది ఒక ఇంద్రధనుస్సు వలె, రంగురంగులతో శక్తిమంతముగా గోచరించుచుండెను.

కృష్ణుడు ధనుస్సు వద్దకు వెళ్ళి దాని నెత్తుటకు ప్రయత్నించెను. కావలివారు ధనుస్సును ముట్టుకొనకుండా నిరోధించుటకు ప్రయత్నించిరి. వారి అడ్డంకులను కృష్ణుడు లక్ష్యపెట్టకుండెను. యథాలాపముగా ప్రజలు దీనిని గమనించుచుండిరి. కృష్ణుడు యెడమచేతితో ధనుస్సు నెత్తెను. తరువాత నారి బిగించుచు, ధనుస్సును వంచుచుండెను. ఇంతలో పిడుగు పడినంత శబ్దము వినవచ్చెను. ధనుస్సు విరిగిపోయి యుండుట ప్రజలందరు జూచిరి.

బ్రహ్మాండమైన శబ్దము విని, యేమి జరిగెనో తెలుసుకొని రమ్మని కంసుడు సేవకులను పంపెను. ఇంతలో కావలివారు అన్నదమ్ము లిద్దరి చుట్టును చేరిరి. ''పట్టుకొనండి! వదలి పెట్టవద్దు! కొట్టండి! పట్టుకుని కట్టివేయండి!'' అను కేకలు వినిపించెను. కావలివారు తమ చుట్టు నుండగా, రామకృష్ణులు విరిగిపడియున్న ధనుస్సు ముక్కలను తీసుకుని, తమ్ము కొట్టుచున్న కావలి వారిని కొట్టుట ప్రారంభించిరి.

జరిగిన విషయము తెలుసుకుని కంసుడు, అల్లరి నణచుటకు, తన సేనాబలమును పంపెను. రామకృష్ణులు సేనాబలమును మట్టు పెట్టిరి. ఇంత జరిగిన తర్వాత, యేమియు జరుగనట్లుగా, నగర దృశ్యములను చూచుటకై తిరిగి వీధులలో తమ నడకను కొనసాగించిరి.

మధురానగర వాసులు ఈ యువకులు గావించిన అద్భుతచర్యలు జూచి అచ్చెరువందిరి. ఈ వార్త కారుచిచ్చువలె నగరమంతటను వ్యాపించెను. ప్రజలు తమ యిండ్లనుండి, మిద్దెల నుండి వీధులలోనికి వచ్చి అన్నదమ్ము లిద్దరిని చిరునవ్వులతో అభినందించిరి. ఈ యువకు లిద్దరును కంసుని నిరంకుశ పరిపాలన నుండి తమకు విముక్తి కల్గించగలరని వారి అంతరాత్మలు చెప్పుచుండెను. కాని ప్రజలు బాహాటముగా ఆ యువకుల పక్షమున రాలేకపోయిరి. కంసుడనగా వారికంతగా భయము.

బలరామకృష్ణులు అప్పుడే నగరములో సంచలనము సృష్టించిరి. ఇంతలో సూర్యుడు పశ్చిమ దిశకేగెను. బలరామకృష్ణులు తమ సహచరులతో కలసి తిరిగి బృందావన వాసులందరును విడిసియున్న తోటవద్దకు వచ్చిరి. కాళ్ళుచేతులు కడుగుకుని, పాయసాన్నము భుజించి నిద్రపోయిరి.

అట్టు కంసునికి నిద్రరాకుండెను. రామకృష్ణులు వచ్చిరన్న వార్త తెలిసినది. చాకలి మరణ విషయము కూడ తెలిసెను. అందమైన త్రివక్ర వంకరలు పోయినవను అద్భుత విషయమును వినినప్పటికిని, కంసుని మనస్సు ఆ అద్భుత లీలను అంగీకరించ లేకుండెను. అన్నిటి కన్న భయంకరమైన విషయ మేమనగా ధనుర్భంగము, రాజసైన్యము అణగిపోవుట, తెల్లవారగనే తనకేమి కీడు వాటిల్లునో యను భయముతో

మండెను. భయంకరమైన ముప్పు సంభవించు సూచనలు గోచరించుచుండెను.

స్వప్నమందు గూడ మరణ సూచనలు కంసు డనుభవించి, మిక్కిలి భీతి చెందెను స్వప్నములో గాడిదనెక్కి వెళ్లుచున్నట్లు, విషము మ్రింగినట్లు, ఎఱ్ఱని పువ్వులదండ ధరించినట్లు, నూనె రాసుకుని స్నానము చేయుచున్నట్లు, ఎక్కడకో తెలియని గమ్యమునకు తన్ను గొనిపోవు చున్నట్లు గాంచెను ఆందోళన, ఆతురత మిళితము కాగా నిద్రనుండి హఠాత్తుగా లేచెను. మరుచటి రోజు ఉదయము గొప్ప ఘోరము జరుగ నున్నదను భావము మనసులో మెదలుచుండుటచేత ఆ రాత్రి కంసునికి సరిగా నిద్రపట్టకుండెను యువకు లిద్దరును ధనుర్భంగ మొనర్చుట కంసుని భయమును పెంచెను. ఆకాశవాణి మాటలు మనస్సునకు జ్ఞప్తికి వచ్చి, అవి నిజముకానున్న తరుణము వచ్చినదని తలపోసెను.

''కాని ..'' అని తనలో తానిట్లనుకొనెను ''మల్లయుద్ధ వీరులందు నాకు గట్టి నమ్మకమున్నది చాణూర ముష్టికులు ఆ యువకులను తెలివితక్కువ దద్దమ్మలుగా ప్రజలకు చూపగలరు. ఈ వీరుల చేతులలో వారిద్దరు మరణించుట నిశ్చయము. బహుశః అంతకు మునుపే కువలయాపీడము (ఏనుగు) చేత చావవచ్చు దాని బలమైన అడుగుల బరువునుండి యెవరును తప్పించుకొనలేరు'' ఈ ఆలోచనతో కంసుడు తిరిగి ధైర్యము తెచ్చుకుని నిద్రపోవుటకు ప్రయత్నించి విఫలుడయ్యెను.

## 204 కువలయాపీడము హతమారుట

తూర్పున ఉదయభానుని కిరణములచే ఆకాశము యెర్రగా నుండెను మధురానగిరము అందముగా అలంకృతమైయుండెను. ధనుస్సు విరిగి యుండుటచే ధనుర్యాగము కేవలమొక ఆడంబరమైన కార్యము ప్రఖ్యాతిపొందిన చాణూర ముష్టిక, సాల్వ, కోసలురు గొప్ప మల్ల యుద్ధములో పాల్గొందురని కంసుడు చాటించెను. మల్ల యుద్ధమునకు ప్రత్యేకమైన రంగస్థలము నేర్పాటు గావించెను ప్రజలు మల్ల యుద్ధపు పోటీలు తిలకించుటకు తండోపతండములుగా వచ్చిరి.

ప్రజలు ఆతురతతో వచ్చి ప్రేక్షకులకు నిర్దేశించిన స్థలమును ఆక్రమించు చుండిరి శంఖ దుందుభులు అవిరామముగా మ్రోగి శబ్దము చేయుచుండెను. ఆప్రదేశమంతయు పువ్వులదండలతో రంగురంగుల తోరణము లతో అందముగా అలంకృతమయ్యెను. అంతటను సంతోషముతోనిండిన కోలాహలము గోచరించుచుండెను. ఆ ప్రదేశమున పండుగ వేడుక వాతావరణము అలముకొని యున్నది ప్రజలు పోటీలను చూచి ఆనందించుటకు వచ్చిరి. ఎవ్వరి యందును ఆందోళన యనునది కానవచ్చుటలేదు. ఈ పోటీలు యేర్పాటు చేయుటకు వెనుక నున్న దురుద్దేశము — బృందావనము నుంచి వచ్చిన బలరామకృష్ణులను చంపుట — ప్రజలకు తెలియదు.

హోరుమను సముద్రఘోష అకస్మాత్తుగా ఆగిపోయినట్లుగా ఒక్కసారి నిశ్శబ్దము ఆవరించెను అనేకులు రక్షకభటులు వెంటరాగా కంసుడు వచ్చెను అతడు ఎత్తైన వేదిక పైకెక్కి నిలుచుండగా ప్రజలు హర్షము ప్రకటించిరి. కంసుడు దానిని స్వీకరించి, తరువాత సింహాసనముపై కూర్చుండెను సామంత ప్రభువులు

ఒకరొకరే వచ్చి తాము తెచ్చిన కానుకలను కంసుని పాదముల వద్ద నుంచిరి. వారిలో నందుడు కూడ నుండెను తాము తెచ్చిన కానుకలను సమర్పించిన తర్వాత నందుడు తిరిగి తనకు నియమించిన స్థలములో కూర్చుండెను. బృందావనము నుండి వచ్చిన నందుని స్నేహితులు నందుని కిరుప్రక్కల కూర్చుండిరి.

ఇంతలో దుందుభులు మ్రోగి, మల్ల యుద్ధవీరుల రాకను ప్రకటించగా, వారు ఒకరొక్కరే రంగము ప్రవేశించిరి వారు కంసునకు తలవంచి వినయపూర్వకముగా నమస్కరించిరి వారు చాణూర ముష్టిక, కూట, సాల్వ కోసలురు వారు మిక్కిలి బలశాలురుగ చూపరులకు గోచరించిరి

ఈలోపుగా బలరామకృష్ణులు వారి తండ్రి నందుడు బయలుదేరి వెళ్ళకమునుపే, మధురాపుర వీధులు ప్రవేశించిరి శంఖ దుందుభుల శబ్దము విని రాజసౌధమునకు చేరువగా యేమి జరుగనున్నదో చూచుటకు వెళ్ళిరి. కంసుని యాదేశము ననుసరించి గూఢచారులు రామకృష్ణుల ననుసరించి, వారు వెళ్ళిన చోటుకు వెళ్ళుచుండిరి.

ఈ విషయము రామకృష్ణులకు తెలిసినప్పటికిని తెలియనట్లుగా విచ్చలవిడి సంచరించుచుండిరి. రాజసౌధ ప్రవేశ ద్వారము వద్దకు వచ్చిరి. అచ్చట పెద్ద ఆకారములో నున్న ఏనుగును కృష్ణుడు రామునకు జూపెను వారిరువురును కనులతోనే సంభాషించుకొనిరి కృష్ణుడు మావటి వాని వద్దకు వెళ్ళి యిట్లనెను. ''నా మాటలు వినుము. ఈ ప్రవేశ ద్వారము వద్దనున్న ఏనుగు వచ్చువారికి ఆటంకముగా నున్నది ప్రవేశ ద్వారము నుండి దీనిని ప్రక్కకు తొలగింపుము వచ్చువారికి ఆటంకము కలిగింపకుము మేము లోపలికి వెళ్ళి వినోదము చూడదలచుచున్నాము''. ఆ అన్నదమ్ముల హతమార్చుట కొరకే ప్రత్యేకముగా నియమితుడైన మావటి వాడు యిట్లనెను ''నేను అడ్డు తీయనిచో యేమి చేయుదురు?''

''నీవు తీయకున్నచో,'' భయంకరమైన స్వరములో కృష్ణుడు యిట్లు చెప్పెను ''ఏనుగును తొలగింపకున్నచో నిన్ను, నీ యేనుగును యమ సదనమునకు పంపెదము ''

మావటి వాని కనులు క్రోధముతో యెర్రబడెను తన అంకుశముతో ఏనుగును ప్రోత్సహించి కృష్ణుని వైపు వడిగా నడిపించెను. కృష్ణుడు ఏనుగుతో ఢీకొనునట్లుగా అన్నదమ్ము లిద్దరూ ముందుగా నిశ్చయించుకొనిరి ఏనుగు వడిగా కృష్ణుని సమీపించి తొండముతో యెత్తి నేలకు కొట్టవలెనని తలచెను. కృష్ణుడు తన పిడికిలితో ఒక వ్రేటు వేయగా, దానివలన కలిగిన బాధకు తొండము నుండి కృష్ణుని వదలిపెట్టెను తరువాత కృష్ణుడు కువలయాపీడము నాలుగు కాళ్ళ వెనుక దాగుకొనెను. కృష్ణుడు యెక్కడ నుండెనో ఏనుగు గమనించలేకపోయెను చివరకు యెక్కడ దాగినదియు తెలుసుకుని, తిరిగి తొండముతో కృష్ణుని పట్టుకొనెను. కాని సర్పము నుండి గరుడుడు తప్పించుకున్నట్లుగా, తొండము పట్టు నుండి జారి కృష్ణుడు తప్పించుకుని, ఏనుగు తోకను అదే పనిగా మెలిపెట్టి తిప్పుచుండెను. ఏనుగు చుట్టును ప్రదక్షిణము చేయుట మొదలిడెను, కాని కృష్ణుడు దొరకక అటు నిటు తిరుగుచు తప్పించుకొనుచుండెను. ఒకసారి ముందుకు వెళ్ళి తన పిడికిలితో వ్రేటు వేసి, వెంటనే దాని కాళ్ల మధ్య తిరుగుచు, ఆ యేనుగు బొంగరము వలె తిరుగునట్లు జేసెను తరువాత ఏనుగు క్రింద పడిపోయెను దానిని మోసగించుటకు, తాను కూడ క్రింద పడినట్లు నటించెను. ఇదే చంపుటకు అదను అని తలంచి, తన దంతములతో కృష్ణుని గుచ్చుటకు ప్రయత్నించెను

కృష్ణుడు ఏనుగు దంతము నుండి తప్పించుకొనగా, ఆ దంతములు భూమిలోనికి లోతుగా చొచ్చుకు

పోయెను. అతి కష్టము మీద ఏనుగు తన దంతములను బయటకు లాగెను దానివలన బాధచేత, నిస్పృహచేత తిరిగి కృష్ణునిపైకి ఏనుగు లఘించెను. అప్పుడు అతి సులభముగా దాని తొండమును పట్టుకుని కృష్ణుడు నేలకు కొట్టెను. పడిపోయిన ఏనుగుపైకి సింహము వలె కృష్ణుడు లంఘించి, పిడికిలితో దంతము గిరగిర తిప్పి ఊడబెరికెను ఊడబెరికిన దంతముతో కృష్ణుడు మావటి వానిని కొట్టి చంపెను

అనేకులను అసురులను సునాయాసముగా చంపిన కృష్ణుడు, సామాన్యమైన యీ ఏనుగును చంపుటకు దీర్ఘకాలము తీసుకొనెను చూడవచ్చిన ప్రేక్షకులకు వినోదము, ఉత్సుకత కలిగించుట కొరకే కృష్ణుడు దీర్ఘకాలము ఏనుగుతో పోరాడి చివరకు చంపెను. అంతేకాక నిరాశ నిండిన ప్రజల హృదయములలో ఆశ చిగిర్చి కనులలో తిరిగి వెలుగు కన్పించుటకై కృష్ణుడిట్లు చేసెను కువలయాపీడమును (ఏనుగు) కేవలము తన చేతులతో చంపినట్లుగా, కంసుని కూడ చంపగలనని, తప్పక చంపుదునని ప్రేక్షకులకు తెలియజేయుటకే కృష్ణుడీ విధముగా చేసెను ప్రేక్షకులు ఆనందముతో చప్పట్లు చరిచి కృష్ణుని అభినందించిరి

చనిపోయిన ఏనుగును వదలిపెట్టి, కృష్ణుడు ఏనుగు దంతమును తన భుజముపై వేసుకొనెను దంతము చుట్టు ఉన్న రక్తము కృష్ణునిపై బొట్లు బొట్లుగా పడెను అతని దుస్తులు ధూళితో మాసిపోయెను. రేకులపైనున్న నీటి బిందువులతో పద్మము అందము యినుమడించినట్లు, స్వేద బిందువులతో కృష్ణుని వదనము అందముగా గోచరించుచుండెను.

రామకృష్ణులు రాజసౌధము ముందర ప్రాంగణమునకు, అనగా మల్లయుద్ధ ప్రదర్శన కేర్పాటు చేసిన రంగస్థలమునకు దగ్గరగా వచ్చిరి వారిని తేరిపార విశ్మబ్దముతో ప్రేక్షకులు చూచుచుండిరి

వారు వివిధ ప్రజలకు వివిధ విధములుగా గోచరించిరి. చాణూరాది మల్ల యుద్ధ వీరులకు వారిద్దరును మూర్తీభవించిన పిడుగు రాళ్ళవలె గోచరించిరి చూచుటకు వచ్చిన ప్రేక్షకులు వారు ఉత్తమ పురుషులని తలపోసిరి. స్త్రీలు, వారిరువురును మానవ రూపములో నున్న మన్మథులని తలచిరి గోపాలురు వారిలో ఒకరుగా తలచి ఉత్సాహముతో పులకించిపోయిరి. దుష్ట రాజులను, దుర్మార్గులను శిక్షించుటకై వచ్చిన వారని భావించిరి. వారి తల్లిదండ్రులకు అమాయకులైన పసి బాలురవలె కన్పించిరి వారిరువురును మృత్యువు అవతారములని కంసుడు తలచెను వారి గురించి యేమియు తెలియని అజ్ఞానులు, వారి వారి తెలివితేటల మేరకు ఒకొక్క విధముగా తలపోసిరి వారిరువురును సత్య స్వరూపులని యోగులు తలచిరి. వృష్ణులు తమను రక్షించుటకై వచ్చిన దేవతలని భావించిరి

ఆ విధముగా నవ రసములు - శృంగార, వీర, కరుణ, అద్భుత, హాస్య, భయానక, భీభత్స, రౌద్ర, శాంత రసములు - వారిని చూచువారిలో ప్రస్ఫుటమయ్యెను

## 205 కంస వధ

కంసుని బలమైన ఆయుధము కువలయాపీడమను యేనుగు ఆ ఏనుగు యీరోజు ఒక యువకుని చేతిలో మడిసినది కృష్ణుడు దగ్గరగా వచ్చి నిలుచుండెను మొదటిసారిగా కంసుడు తన శత్రువును ముఖాముఖి చూచెను ఇన్ని రోజులుగా కృష్ణుని గురించి కంసుడు తలచుచు, కలలను గాంచెను తరుచుగా అనేక

భయోత్పాతములు కలిగెను. కాని యింతవరకు కృష్ణుని చూడలేదు.

కృష్ణుని అందమైన కనులు తన్ను తేరిపార జూచుట దూరము నుండి కంసుడు గమనించెను. అతని హృదయము భయముతో నిండెను. బలరామకృష్ణు లిరువురను ప్రవేశించిన తీరు, వారి అందచందములు ప్రేక్షకులను మంత్రముగ్ధులను గావించెను

తరువాత నెమ్మదిగా ప్రేక్షకులలో గుసగుసలు ప్రారంభమయ్యెను. ఒక ప్రేక్షకుడు తన ప్రక్కనున్న వారితో యిట్లనెను. ''వీరిరువురుమ నారాయణుని అవతారములుగా వసుదేవునికి జన్మించినవారు. తన పిల్లలను గోకులములో విడిచిరాగా, నందుడు వారిని పెంచి పెద్దవారిని జేసెనని విని యున్నాము''.

మరొక ప్రేక్షకుడు మధ్యలో జోక్యము చేసుకుని యిట్లనెను ''అది యెట్లు సంభవము? వారిలో ఒకరు రెండవ వాని కన్న పెద్దగా నున్నట్లు కన్పడుచున్నది. పెద్దవాడు, చిన్నవానికన్న తెల్లగా నున్నాడు వారిరువురను ఒకేసారి గోకులమునకు యెట్లు కొనిపోయిరి. నీవు అన్నియు తెలిసిన వానివలె మాట్లాడుచున్నావు''

మొదటి ప్రేక్షకుడు యీ వాదము అంగీకరించుట కిష్టపడక యిట్లనెను ''పెద్దవాని గురించి నా అంచనా తప్పు అయితే కావచ్చు. కాని యిరువురిలో చిన్నవాడు, నల్లనివాడు, తలలో నెమలి ఫించము ధరించినవాడు, యిప్పుడు కువలయాపీడమును చంపినవాడు దేవకికి జన్మించెను. పుట్టిన వెంటనే శిశువును గోకులమునకు తీసుకుపోయిరి, లేకున్నచో మన మహారాజు చంపియుండెడివాడు''

మరొక ప్రేక్షకుడు యీ సంభాషణలో కల్పించుకుని యిట్లు పలికెను ''అది నిజము కావచ్చు ఈ కృష్ణుడు శిశువుగా నున్నపుడు పూతనను, తరువాత శకటాసురుని చంపెను అనేకమంది అసురులను చంపియున్నాడు తానొక్కడే వీరందరిని చంపినట్లు విన్నాను ఈయన చెప్పినట్లు కృష్ణుడు అవతారపురుషుడే అయి ఉండవచ్చును. బహుశః మన కష్టములు యిక సమసిపోవచ్చును చూచెదము గాక''

వారట్లు మాట్లాడుచుండగా, దుందుభు లొక్కసారిగా మ్రోగెను. అందరి దృష్టి మల్ల యుద్ధము జరుగు స్థలముపై ప్రసరించెను. చాణూరుడు కొత్తగా వచ్చిన ఇరువురు యువకులను పిలుచుచుండెను. చాణూరుడు వారితో యిట్లనెను ''మీరిద్దరు మిక్కిలి బల ధైర్య సాహసవంతులనియు, మానవాతీతమైన కృత్యములనేకములు చేసినారనియు మేము వినియున్నాము భోజులకు ప్రభువైన మా మహారాజు మిమ్ములను మీ బృందావన ప్రజలను యీ పండుగ వేడుకలలో పాల్గొనుటకు మధురకు ఆహ్వానించెను వేడుకలలో యీ మల్ల యుద్ధ మొకటి. మల్ల యుద్ధములో మీ ప్రావీణ్యము గాంచవలెనని మా మహారాజు ఉవ్విళ్లూరుచున్నాడు. మీరు మహారాజు ఆజ్ఞను పాటించవలెను మీరు మహారాజు సామంతుని కుమారులు, రాజాజ్ఞను శిరసావహించి యీ మల్ల యుద్ధమునకు రండు, మీ మల్ల యుద్ధ ప్రావీణ్యమును గురించి మేము వినిన వార్తలు యెంతవరకు నిజమో కన్నులార చూచెదము''.

వారి కోరికను తీర్చుటకు కృష్ణుడు సంతోషముతో యెదురు చూచుచుండెను. కాని అతి వినయముతో కృష్ణుడిట్లు పలికెను ''మేము పల్లెటూరు నుంచి వచ్చిన వారము మాకు నగరవాసుల లౌక్యము తెలియదు.

మీ వలెనే మాకును భోజుల ప్రభువు కోర్కెను తీర్చవలెనని యున్నది ఇట్టి అవకాశము మాకు కల్పించినందుకు ధన్యులము కాని మేము చాల చిన్నవారము, యువకులము. ఆకారములో మీ అందరికన్న అల్పులము. సమానుల మధ్య పోరు జరిగినచో నది సవ్యముగా నుండును. మా వయస్సుకు, ఆకారమునకు తగిన వారితో పోరు సలుపు యేర్పాటు చేయుడు. మీరు అతి శక్తిమంతులు. మీవంటి బలశాలురు యేదో కొద్దిపాటి బలముగల మాతో తలపడుట సవ్యము కాదు. అది మీకు అపకీర్తి తెచ్చిపెట్టును. అట్లు జరుగకూడదని మా కోరిక''.

చాణూరునకు కృష్ణుని మాటలు నచ్చకుండెను. అతడిట్లనెను. ''ఇక నీ మాటలు కట్టిపెట్టుము. ఒక క్షణము క్రిందట వేయి యేనుగుల బలము కలిగిన కువలయాపీడమును హతము గావించితివి. నీవు పసివాడవు కాదు, మీరిరువురును మాతో పోరుట అపసవ్యముగా మేము యెంచుట లేదు. నీవు నాతో పోరుము ముష్టికుడు, నీ అన్న బలరామునితో పోరగలడు''

''అటులనే కానిండు'' అని కృష్ణుడు పలికెను అన్నదమ్ము లిద్దరును రంగమందు ప్రవేశించిరి. చాణూరుడు కృష్ణుని కెదురుగా, ముష్టికుడు బలరాముని కెదరుగా వచ్చి నిలుచుండిరి మల్ల యుద్ధము ప్రారంభమయ్యెను. ఈ పోరు అపసవ్యమని చూచువారి కందరకును సులభముగా గోచరించెను. ముఖ్యముగా స్త్రీలు యువకులైన బలరామకృష్ణులపై ప్రేమ సానుభూతి కలిగి, యీ పసివా రిద్దరును భయంకర వీరులైన చాణూర ముష్టికుల చేతులలో తప్పక మరణించగలరని ఆవేదన చెందిరి. వారిలో వారిట్లనుకొనిరి. ''ఏమిటీ అన్యాయము! ఇద్దరు అసమానుల మధ్య పోరు యేమి సవ్యము! దీనిని ఆపుజేయుట మహారాజు కర్తవ్యము, కనీసము రాజ సభలోని తెలివిగల మంత్రులు దీనిని ఆపుజేయుట ఉచితముగా నుండును కాని వారు మాట్లాడక యూరకున్నారు. ఏమి దౌర్భాగ్యస్థితి!''

ఒకామె యిట్లనెను. ''మల్ల యుద్ధ వీరుల బలము చూడు! ఒక ప్రక్క ముదిరిన కఠినమైన చాణూరుని వక్షమును చూడుడు, మరొక ప్రక్క మృదువైన లేత అవయములు గల కృష్ణుని చూడుము ఒకరు పర్వతము వలె, రెండవ వారు ఆ పర్వతముపై ప్రాకు లత వలె నున్నారు ఈ మహారాజు సభలో అధర్మము స్పష్టముగా తాండవించుచున్నది''

మహారాజునకు మిక్కిలి భయపడు మధురా నగరవాసులు తమ నిరసనను వ్యక్తపరచలేకపోయిరి. వారి అభిప్రాయములను నెమ్మదిగా గుసగుసలుగా వెలిబుచ్చుచుండిరి మహారాజు గూఢ ' కిరి.

కృష్ణుడు చాణూరునితో పోరుచుండెను. కొంత సేపయిన తర్వాత యిక చంపవలెనని కృష్ణుడు నిశ్చయించుకొనెను. కృష్ణుడు చుట్టును కలయ జూచెను. స్త్రీలు తన అపజయమునకు, కాదు కలుగబోవు మరణమునకు విచారించుచున్నట్లు కనుగొనెను కంసునికి తమపైనున్న ద్వేషము నెరిగియుండుటచేత, నందుడు, తదితర గోపాలురు ఆందోళన పడుచుండుట కృష్ణుడు గమనించెను ''తండ్రీ! మీరేమియు ఆందోళన చెందవద్దు'' అనునట్లుగా వారివైపు కృష్ణుడు జూచెను

మల్లయుద్ధము కొనసాగుచుండెను. ఒక్కసారిగా పోరు తీరు మారినట్లుగా చాణూరునకు తోచెను. ముష్టికునకు కూడ అట్లే తోచెను. వరుసగా పిడికిలి దెబ్బలు చాణూరునిపై వర్షింపగా, ఆ దెబ్బల ధాటికి

చాణూరుడు భరించలేకపోయెను. శరీరము వెయ్యి ముక్కలయినట్లు అనిపించెను. చాణూరుడు కొద్ది దూరముగా వెళ్ళి, అకస్మాత్తుగా గ్రద్ద తన్నుకుపోవుటకు వచ్చినట్లుగా, కృష్ణునిపై బడి వక్ష స్థలముపై గట్టిగా కొట్టెను. కృష్ణుడు అదియేమియు పట్టనట్లుగా, తన చేతితో చాణూరుని పట్టుకుని పైకెత్తి గిరగిర త్రిప్పి నేలకు కొట్టెను. అదే సమయములో ముష్టికుడు నేలపై గూలి రక్తము కక్కుకుని పడియుండుట ప్రేక్షకులు చూచిరి. మల్ల యుద్ధ వీరు లిద్దరు చనిపోయిరని వారు తెలుసుకొనిరి.

తరువాత బలరాముడు కూటుడు అను వీరునితో పోరాడి సునాయాసముగా చంపెను. అప్పటికే కృష్ణుడు సాల్వుని చంపివేసి, కోసలుని రెండు ముక్కలుగా చీల్చి అతి తేలికగా వధించెను. తదితర మల్ల యుద్ధ వీరులు రంగస్థలము విడిచి పారిపోయిరి. బలరామకృష్ణుల మిత్రులు గోపబాలకులు పరుగు పరుగున రంగస్థలము వద్దకు వచ్చి ఆనందముతో సంగీతమున కనుగుణముగా నాట్యము చేయ మొదలిడిరి. ప్రేక్షకులు కూడ వారితో కలిసి అత్యంత ఉత్సాహముతో పాల్గొనిరి. తిరిగి పండుగ వేడుక వాతావరణము ఆ ప్రదేశము నావరించెను. కంసుడు తప్ప అందరు సంతోషముగా నుండిరి. తన పన్నాగము లన్నియు విఫలమయ్యెనని కంసుడు కనుగొనెను. తనకున్న బలమైన కువలయాపీడము (ఏనుగు) గతించినది. ఏ మల్ల యుద్ధ వీరులపై తాను ఆధారపడినాడో వారు యీ బృందావన 'ముష్కరు'ల చేత హతమారిపోయిరి.

కంసుడు లేచి నిలబడి సంగీతము నాపుజేయమని సంజ్ఞచేసెను. ఆకస్మాత్తుగా అచ్చట నిశ్శబ్ద మావరించెను. మిక్కిలి క్రోధపూరిత స్వరముతో కంసు డిట్లనెను. ''వసుదేవుని పుత్రులైన యీ దుర్మార్గులను తొందరగా తరిమివేయండి. గోపాలు రందరి సంపదను స్వాధీనము చేసుకొనండి. నందుని పట్టుకుని అతని చేతులను, కాళ్ళను యినుప గొలుసులతో బిగించండి. జీవితాంతము వరకు కారాగారములో బంధించండి. నన్ను మోసగించిన వసుదేవుని ప్రాణములు తీయుటకు అన్ని యేర్పాట్లు గావించండి. నా శత్రువులతో చేరిన నా తండ్రి ఉగ్రసేనుని ప్రాణములు కూడ తీయండి''.

కంసుడు అనుచితమైన, అపవిత్రమగు మాటలను కొనసాగించుచుండగా, కృష్ణుడు యిక భరించలేక పోయెను. కంసుడు నిలుచుండి యున్న వేదిక మీదకు వడివడిగా మెట్లెక్కి సింహాసనము సమీపించి కంసుడు నిలిచియున్న ప్రదేశమునకు దూసుకు వచ్చెను. దగ్గరగా వచ్చిన కృష్ణుని జూచి కంసుడు భయపడి, ఒకటి రెండడుగులు వెనుకకు వేసి ఒర నుండి కత్తిని దూసెను. కత్తిని ఝుళిపించుచు కంసుడు కృష్ణునిపై కెగబడెను. గరుడుడు నాగుపామును పట్టుకున్నట్లు, కృష్ణుడు కంసుని పట్టుకొనెను. కంసుని కిరీటము క్రిందపడిపోయెను. కంసుని జుట్టు పట్టుకుని అచ్చట నుండి కృష్ణుడు వానిని నేలపై త్రోసి, అతని మీదకు గెంతెను. రెండు చేతులతో కంసుని మెడ నులిమి ప్రాణములు తీసెను. కంసుని శరీరమును నేలపైకి యీడ్చెను. ఈ దృశ్యము గాంచిన ప్రేక్షకులలో విపరీతమైన కోలాహలము చెలరేగెను.

కంసుడు, కృష్ణుని వలన భయముతో యెప్పుడును కృష్ణుని తలంచు చుండెను. భోజనము చేయునపుడు, త్రాగుచున్నపుడు, మాట్లాడునపుడు, నడచుచున్నపుడు, వేయేల శ్వాస పీల్చునపుడుగూడ కృష్ణుని తలచు చుండెను. అందుచే, కంసుడు మరణించిన తర్వాత భగవంతు డతనికి సారూప్య స్థితి కలుగునట్లు జేసెను.

భగవంతుని పాదములు చేరుటకు అనేక యోగములు నిర్దిష్టమైనవి. వానిలో సంభ్రమ యోగ మనునది ఒకటి, అనగా భగవంతుని ద్వేషించుచు, నిత్యమును భగవంతుని తలచుటచేత భగవద్ద్వేషులు గూడ చివరకు

భగవంతుని చేరగలరు. హిరణ్యాకశిపుడు కూడ సంభ్రమ యోగము ద్వారా భగవంతుని చేరగల్గెను.

కంసునికి యెనిమిది మంది సోదరులు. వారు కంకుడు, న్యగ్రోధకుడు మొదలైనవారు ఆరుగురు తమ సోదరుని చంపినందుకు వారు కినుక వహించి కృష్ణునిపై కలియబడజొచ్చిరి. బలరాముడు వారి నడ్డగించెను. దగ్గరలో పడియున్న యినుప దుక్క నొకదానిని తీసుకుని, దానితో వారి నందరినీ కొన్ని క్షణములలో నాశనము చేసెను తరువాత స్వర్గము నుండి మంజుల సంగీత నాదము వినిపించెను దేవతలు బలరామకృష్ణులపై పుష్ప వర్షము కురిపించిరి. ఆశ్చర్యము, అద్భుతము మిళితమైన సంతోషముతో మధురాపురవాసులకు నోటమాట రాకుండెను. తమ కష్టములు తీరినవని, యిక కంసుని నిరంకుశ పరిపాలన వలన యిబ్బందు లేవియు నుండవని వారు నమ్మలేకపోయిరి వారు అటు నిటు తిరుగుచుండిరి. ఎక్కడ చూచినను వారికి అయోమయ స్థితి గోచరించుచుండెను. ఆ ప్రదేశమునకు రాక, యింటి వద్దనే యుండిపోయినవారు, తమ జీవితములో అతి ముఖ్యమైన సంఘటనను జూచు భాగ్యము కోల్పోయినామని విచారించిరి. బలరామకృష్ణులను చూచుటకు వారు పరుగెత్తి వచ్చిరి.

ఇప్పుడొక విచార దృశ్యము కృష్ణుని కెదురయ్యెను కంసుని భార్యలు ఆవేదనతో రోదించుచుండగా, కృష్ణుడు వారి ననునయించి, ఉపశమింపజేయవలసి వచ్చెను. కంసుడు యిన్ని సంవత్సరములుగా చేయుచున్న దుష్ట కార్యములను అరికట్టి మానవ శ్రేయస్సు కొరకు కంసుని చంపవలసి వచ్చినదని మృదువుగా సరళమైన భాషలో వారికి నచ్చజెప్పి ఓదార్చెను. అయితే కంసుని భార్యలకీ విషయము తెలిసినదే అతని నిరంకుశ చర్యలలో వారికేమాత్రము భాగము లేకపోయినప్పటికిని, అతనికి భార్యలగుటచేత యీ దుఃఖము ననుభవింపవ లసి వచ్చెను. తన మాటలు వారి దుఃఖమును నివారించి ఉపశమనమ్ము కల్గింపలేవని కృష్ణునకు తెలియును కాని యిట్లు జరుగవలసి యుండెను. కంసుని భార్యలు, విధేయులైన సేవకులు కొందరు మాత్రము దుఃఖములో యుండిరి మధురాపుర ప్రజలందరును ఆనందము, సంతోషము, స్వేచ్ఛ, నిర్భయము అనుభవించిరి. మధుర అంతయు సుఖముగా నుండెను.

## 206 బలరామకృష్ణులు తల్లిదండ్రులను కలుసుకొనుట

అనేక సంవత్సరములుగా కారాగారములో మ్రగ్గుచున్న తమ తల్లిదండ్రులను జూచుటకై బలరామకృష్ణులు కారాగారమునకు వెళ్ళిరి. అప్పుడే దేవకీ వసుదేవులు రాజసౌధములో జరిగిన అత్యద్భుత సంఘటనలను విని, తమ పుత్రుల రాకకై యెదురు చూచుచుండిరి. చివరకు, చిట్టచివరకు తమ పుత్రులను చూడబోవుచు న్నారు. ఆ బాలురెట్లుందురో వారికి తెలియదు. బృందావనవాసులు రహస్యముగా వారికి చెప్పిన విషయములు తప్ప ఆ బాలుర సంగతి వారికేమియు తెలియదు. ఇప్పుడా బాలురను ప్రత్యక్షముగా చూడబోవుచున్నారు!

బలరామకృష్ణులు తమ తల్లిదండ్రుల వద్దకు వెళ్ళిరి అశ్రువులు వర్షించుచున్న కనులతో తండ్రి కాళ్ళను బంధించిన సంకెళ్ళను తీసివేసిరి. సంకెళ్ల మూలముగా తండ్రి కాళ్ళమీద మచ్చలు యేర్పడెను. కారాగారము నుండి తల్లిదండ్రులను బయటకు తీసుకువచ్చి, వారి పాదములపై తమ తలలు మోపి నమస్కరించిరి దేవకీ వసుదేవులకు, వారి పుత్రులు నారాయణుని అవతారములని తెలియుటచేత, నారాయణుడే తమకు నమస్కరిం

చుట గమనించి యేవిధముగా ప్రతిస్పందించవలెనో తెలియక ఇరకాటపు పరిస్థితిలో నుండిరి. ఒక క్షణము సంకోచించి, తర్వాత పుత్రులను లేవనెత్తి గాఢముగా కౌగిలించుకొనిరి.

• తమ దివ్యత్వమును తల్లిదండ్రులు యెరిగి యున్నంతవరకు, అందరి తల్లిదండ్రులవలె సహజముగా తమతో వర్తించలేరని కృష్ణుడు గ్రహించెను కృష్ణుడు తనలో తానిట్లు అనుకొనెను. ''పాపము, ఈ దురదృష్టవంతు లిరువురకు తల్లిదండ్రులుగా మసలుట యెన్నడును తెలియదు. పుట్టిన ప్రతి శిశువును వారు కోల్పోయిరి. నేను జన్మించినపుడు, నా మూలముగా వారికి పుట్టిన శిశువు నారాయణుడేనని తెలిసినది. ఆ జ్ఞానము యిప్పటికీ వారి మనసులలో నిలిచి యున్నది. ఈ మధ్య నేను గావించిన కృత్యములు వారిలో నా యందుగల దివ్యత్వ భావమును బలపరచినవి నేను భగవంతుడననే విశ్వాసము వారిలో యిప్పుడు దృఢముగా స్థిరపడెను. నిత్య సత్యమును అతి తేలికగా గ్రహింపగలిగిన ఉదాత్తజీవులు. కాబట్టి వారినుండి మేము సహజమైన తల్లిదండ్రుల ప్రేమను పొందలేము. భక్తులకు భగవంతునిపై గల ప్రేమ, తల్లిదండ్రులకు తమ పిల్లలపైనున్న ప్రేమకు సాటిరాదు. బృందావనములో నుండగా యశోదా నందులు తల్లిదండ్రులుగా వాత్సల్యము చూపిరి. వీరిరువు రికి, భక్తులవలెగాక, తల్లిదండ్రులవలె ప్రేమించవలసినదని నేను బలరాముడు బోధించి, వారి మనస్సుకు ఊరట కల్గించుట సవ్యముగా నుండగలదు''

కృష్ణుడు, తన మాయను వారిపై ప్రసరింపజేసి వారు మాయకు ప్రభావితులు కాగా, వారితో నిట్లనెను. ''ఇంతకాలము మేము నిజముగా దురదృష్టవంతులము. ఈ దుర్మార్గుని (కంసుని) మూలముగా మా పసితనమందు మీరు దూరముగా నుండవలసి వచ్చెను. పసి పాపలుగా మేము చేసిన చేష్టలు, ఆడిన మాటలు చూచి విని ఆనందించు భాగ్యము మీకు కరవయ్యెను. సామాన్య స్త్రీ పురుషులకు లభించు అదృష్టము, ఎనిమిది మంది పుత్రులను కనినప్పటికిని, మీకు లభింపకుండెను. ఇది చాల విచారకరవిషయము. మా మట్టుకు మేము తల్లిదండ్రులు పెంచి పోషించు అదృష్టమునకు నోచుకోలేకపోతిమి. విధి వైపరీత్యముచేత, యింత కాలము మేము మీకు సేవ చేసి తల్లిదండ్రుల ఋణము తీర్చుకొనలేకపోతిమి తల్లిదండ్రులకు వృద్ధాప్యములో పుత్రులు సేవచేసి వారి ఋణము తీర్చుకొనవలెనని శాస్త్రములు తెలుపుచున్నవి. తల్లిదండ్రులను, భార్యాపుత్రులను, గురువును, యింకెవరినైనను కష్ట కాలములో ఆదుకోలేని పుత్రుడు జీవించియున్నను మృతునితో సమానమని చెప్పుదురు

''ఇన్ని సంవత్సరములుగామీకు సేవచేయు అవకాశము యెన్నడును కలుగలేదు. కాలమంతయు వృథా అయినది. అందుకు పరిహారముగా యిప్పుడు మీకు రాత్రింబవళ్లు సేవ చేయు గౌరవము మాకు దక్కవిండు''.

మాయ మూర్తీభవించిన కృష్ణుని మాటలు విని వృద్ధ దంపతులు, మాయచే ప్రభావితులై, వారి పుత్రులు దివ్య పురుషులన్న విషయము మరచి, సామాన్య బాలురని తలచి వారితో మాట్లాడసాగిరి. కొంత కాలము క్రిందట వారిని దివ్యపురుషులుగా భావించిన విషయము మరచిపోయిరి. పుత్రులను తమ ఒడిలో కూర్చుండ పెట్టుకుని, చెమ్మగిల్లిన కళ్ళతో ప్రేమగా వారిని నిమిరిరి.

అటు తర్వాత వృద్ధ మహారాజు ఉగ్రసేనుడు చెరనున్న కారాగారమునకు వెళ్ళిరి. కృష్ణుడు ఉగ్రసేనుని కారాగారము నుండి విడిపించి, తిరిగి మహారాజు పదవిని చేబట్టమని అర్థించెను వృద్ధుడైన ఉగ్రసేనుడు యిట్లనెను ''నేను ముసలివాడను. నాకు రాజ్యమును పాలించుట యందు ఆసక్తి లేదు నీవు యువకుడవు, శత్రువును హతమార్చిన వారు రాజ్యము చేబట్టుట ధర్మము''. కృష్ణుడు అత్యంత వినయముగా నిట్లు పలికెను.

''మన పూర్వుడైన యయాతి శాపమును నీవు మరచినట్లున్నావు. యాదవులెవరును సింహాసన మధిష్ఠించుటకు అర్హులు కారు. నేను బలరాముడు నీ పక్షమున నుండగలము. నీవు రాజ్యము పాలించుటలో మేమిద్దరమును నీకు సహాయముగా నుండెదము''.

కంసునికి భయపడి పారిపోయిన వృష్ణి, అంధక, యాదవ, మాధవ, దాశార్హాదు లందరిని తిరిగి కృష్ణుడు పిలిపించెను. వారందరును శాంతి సౌఖ్యములతో జీవించునట్లు చేసెను. మధురా నగరము మరల సుఖ సంతోషములతో, దేవకి వివాహమునకు పూర్వము, అనగా ఆకాశవాణి పలుకులు కంసుని హృదయము నుండి శాంతి సౌఖ్యములు హరించి పాపాత్మునిగా మార్చక పూర్వము, ఉన్నట్లు విలసిల్లెను.

కొన్ని రోజులు గతించెను. నందుడు తిరిగి బృందావనమునకు వెళ్ళవలసిన రోజు వచ్చెను కృష్ణుని కిది క్లిష్టమైన కార్యము. తన పెంపుడు తండ్రిని కౌగిలించుకుని కన్నీళ్లు నిండగా, గద్గద స్వరముతో యిట్లనెను. ''ప్రియమైన తండ్రీ! పరిసరములను గుర్తించుట తెలిసినప్పటి నుండి మేము నీ పుత్రులుగా మసలినాము. వేరొక తల్లిని, తండ్రిని మేము యెరుగము తల్లిదండ్రుల ప్రేమ నిస్స్వార్థమైనది. అటువంటి ప్రేమను నీవు మాపై వర్షించినావు. పుత్రుడుగా పరిగణించుటకు పుత్రుడుగా జన్మించనవసరము లేదు. అది మాకు తెలునును. తండ్రీ! నీకు వీడ్కోలు చెప్పుట తేలిక కాదు కొంత కాలము యిక్కడి ప్రజలకు సుఖ సంతోషములు చేకూర్చి, మేము రాగలమని ప్రతి ఒక్కరితో చెప్పవలెను. అందరితో చెప్పుము. తల్లులు యశోదకు, రోహిణికి, నాయందు భక్తి కలిగిన గోపికలకు చెప్పుము''

తన మిత్రుల నొకొక్కరినే కృష్ణుడు కౌగిలించుకొనెను. ఇకముందు కృష్ణుడు తమవాడు కాదని, అతని అభిమానము చూరగొనుటకు పెక్కుమంది కలరని తెలుసుకొని వారు బరువైన హృదయములతో కన్నీరు కార్చుచుండిరి. గోవులను మేపుటకై అడవికి తీసుకువెళ్ళిన రోజులు తిరిగి రావని వారు గ్రహించిరి. కృష్ణుని మురళీనాదము విని గోవులన్నియు ఒకచోట చేరిన రోజులు, తామందరును కలిసి కృష్ణుని అడవిలో ఫలములు తెచ్చి యిమ్మని కోరిన రోజులు, గతించినవని తెలుసుకొనిరి. తమతో కృష్ణుడు ఉండగా జరిగిన అనేక సంఘటనలు వారి మదిలో మెదలెను ఇప్పుడు తిరిగి బృందావనము వెళ్ళి, వెనుకటివలె గోవులను అడవికి తోలుకు వెళ్ళెదరు, కాని వారి ప్రక్కన కృష్ణుడు ఉండబోడని తెలిసి, వారికి భవిష్యత్తు శూన్యముగా చీకటిగా గోచరించెను. కృష్ణుడు వారికి నచ్చజెప్పి, పాత కథలను చెప్పి నవ్వించి సంతోషపరచెను అతి కష్టము మీద, కృష్ణుడు వారిని అనునయించి పంపగా, బృందావనమునకు మిత్రులందరును వెళ్ళిరి. కృష్ణుడు లేని బృందావనము ఒక యెడారిగా వారు భావించిరి

నందుడు, గోపాలురు, గోప బాలురు బండ్లలో నెక్కి వెళ్ళిరి. బండ్లు ఒకదాని వెనుక నొకటి మెల్లగా వెళ్ళుచుండగా, బలరామకృష్ణులు నిలుచుని గమనించుచుండిరి. ధూళి రేగి బండ్లు అదృశ్యమగువరకు వారట్లే నిలిచి చూచుచుండిరి. ఆ తర్వాత విచారముతో, విస్మృహతో తిరిగి రాజసౌధమునకు వచ్చిరి. వారి బాల్యము గడిచిపోయెను ఇప్పుడువారు రాకుమారుల హోదాకు తగినట్లుగా వర్తించవలసి యున్నది.

# 207 సాందీపుని ఆశ్రమము

తమకు పుత్రులు కలిగినపుడు వసుదేవుడు మానసికముగా వేలకొలది గోవులు, బంగారము, పట్టు వస్త్రములు బ్రాహ్మణులకు దానము చేసెను. ఇప్పుడు ఆనాటి సంకల్పములను ఆచరణలో చూపెను. తమ కుటుంబ పురోహితుడైన గర్గుని పిలిచి బలరామకృష్ణులకు పవిత్ర గాయత్రీ మంత్రోపదేశము గావించమని వసుదేవుడు కోరెను. జ్ఞానమునకు మూలమైన ఆ నారాయణ, ఆదిశేషుల అవతారములైన కృష్ణ బలరాములు గర్గుని పాదముల వద్ద కూర్చుని అత్యంత వినయముతో గాయత్రీ మంత్రమును అభ్యసించుట దివ్య మహర్షులు ఆశ్చర్యముతో గమనించిరి. ''వారి పాత్రను వారు సంపూర్ణ సమర్థతతో నిర్వహించుచున్నారు'' అని ఋషులు భావించి అవతారపురుషులను ఆశీర్వదించిరి.

బలరామకృష్ణులు విద్యాభ్యాసము గావించవలసి యున్నది. ఇంతవరకు వారు గోపాలకులుగా పెరిగిరి. ఇప్పుడు వారు క్షత్రియులుగా గుర్తింపు పొందిరి. ఆచారము ననుసరించి వారు గురుకులవాసము చేయవలసి యున్నది. సాందీపుడను పేరు గల గొప్ప పండితుడొకడు గలడు వారణాసిలో జన్మించిన సాందీపుడు అవంతిలో నివసించుచుండెను వేద శాస్త్రాధ్యయనమునకై సాందీపుని వద్దకు బలరామకృష్ణులు వెళ్ళిరి

బలరామకృష్ణులు ఆదర్శ విద్యార్థులు. గురువు సాందీపునికి సేవచేసి, ఆయన బోధించు విషయములు శ్రద్ధతో విని, సంతోషము చేకూర్చెడివారు వారి భక్తికి వినయ విధేయతలకు సంతృప్తి జెంది, సాందీపుడు వారికి వేదములు, వేదాంగములు, ఉపనిషత్తులు బోధించెను. ఉపనిషత్తుల సారమైన కృష్ణుడు, గురు పాదముల చెంత కూర్చుని మహా వాక్యములను క్షుణ్ణముగా నేర్చెను మరియు క్షత్రియులు నేర్వదగు విలువిద్య, మల్లవిద్య గూడ వారు నేర్చుకొనిరి వీటితోబాటు ధర్మశాస్త్రము, మీమాంస తర్క శాస్త్రములు, రాజ్యపాలనా పద్ధతులు గూడ అభ్యసించిరి. ఈ యిద్దరు బాలుర అఖండమైన తెలివితేటలను, సునాయాసముగా తక్కువ వ్యవధిలో గ్రహించు శక్తిని చూచి సాందీప మహర్షి మెచ్చుకొనెను. అరువది నాలుగు కళలను వారు అరువది నాలుగు దినములలో నేర్చుకొనిరి.

బలరామకృష్ణుల గురుకులవాసము అంతము కాజొచ్చెను. ఆచారము ననుసరించి గురువును సమీపించి, యే విధముగా తాము గురుదక్షిణ సమర్పించి ప్రీతి కలిగించగలమో తెలియచెప్పమని కోరిరి. మొదట సాందీపుడు గురుదక్షిణ అనవసరమని త్రోసిపుచ్చెను కాని బలరామకృష్ణులు బలవంతపెట్టిరి. సాందీపుడు భార్యతో సంప్రదించిన తర్వాత ఒక నిశ్చయమునకు వచ్చి, శిష్యులైన బలరామకృష్ణులతో యిట్లనెను. ''కృష్ణా! రామా! మాకు సంతోషము చేకూర్చుటకై మీరు యేదైన చేయగలమని నిర్బంధించుటచేత, మీకొక క్లిష్టమైన కార్యమును అప్పగించుచున్నాను మీరు బృందావనములో నున్నపుడు అనేకమైన అద్భుత లీలలు గావించినా రని వినియున్నాను. అందుచే మీరు యీ క్లిష్ట కార్యమును జయప్రదముగా నిర్వర్తించగలరని ఆశించుచున్నాను దీనికొక దీర్ఘ గాథ కలదు. అనేక సంవత్సరముల క్రితము, నేనును నా భార్యయు పుత్రునితో కలిసి ప్రభాస తీర్థమునకు వెళ్ళినాము. అక్కడ సముద్రములో స్నానము చేయుచుండగా, నా పుత్రుడు మునిగిపోయెను. అతని మృతశరీరము కూడ కన్పించకుండెను. మా పుత్రుని సజీవముగా తీసుకు రాగలిగినచో అంతకు మించిన గురుదక్షిణ మరియొకటి ఉండబోదు''

''అట్లే చేసెదము'' అని రామకృష్ణులు పలికిరి.

వృద్ధ దంపతుల వద్ద సెలవు గైకొని, రథము నెక్కి బలరామకృష్ణులు ప్రభాస తీర్థము చేరిరి.

సముద్రపు టొడ్డున వారు కొంతసేపు కూర్చుండిరి. వారిని చూచి, సముద్రుడు సమీపమునకు వచ్చి ప్రణామములు చేసెను. సముద్రునితో కృష్ణుడిట్లనెను. ''నీవు అర్పించు పూజను అంగీకరించెదము. కాని నీవు నిజముగా మాకు ప్రీతి కలిగింప దలచినచో, కొన్ని సంవత్సరముల క్రితము నీ అలలు మ్రింగిన బాలుని తిరిగి మాకు యిచ్చివేయుము. ఆ బాలుడు మా గురువు సాందీపుని కుమారుడు. వారి పుత్రుని సజీవముగా తీసుకువచ్చి అప్పగించగలమని ఆ వృద్ధ దంపతులకు మాట యిచ్చినాము. ఆ బాలుని మాకు అప్పగించుము''.

సముద్రు డిట్లనెను. ''కృష్ణా! ప్రభూ! నేను అమాయకుడను. ఆ బాలుని గొనిపోయినది నేను కాదు. ఈ సముద్రములో 'పంచజను'డను అసురుడొకడు గలడు. అతడెప్పుడును శంఖము రూపము ధరించును. అతడే మీ గురుపుత్రుని అపహరించెను''.

కృష్ణుడు వెంటనే సముద్రములోనికి దుమికి అసురుని కనుగొనెను. ఆ అసురుని చంపి శరీరము లోపలి అన్ని భాగములు వెదకెను. కాని బాలుని జాడ కన్పించలేదు. చనిపోయిన అసురుని శరీరముతో యేర్పడిన శంఖము నొకదానిని కృష్ణుడు చూచెను. అది తీసుకుని కృష్ణుడు అక్కడ నుంచి సంయమని అను యముని నగరమునకు వెళ్ళెను. మృత్యువు కధిపతియైన యమునికి ఆ నగరము ప్రీతికరమైనది. బలరామకృష్ణులు కలసి నగరములో ప్రవేశించి, నగరపు పొలిమేరలలో నిలబడి గట్టిగా పాంచజన్యమను శంఖము పూరించిరి. పంచజనుడను రాక్షసుని నుండి పుట్టుటచేత ఆ శంఖమునకు పాంచజన్యమను పేరు కలిగెను. ఆ శంఖ నాదము విని యముడు రామకృష్ణులను ఆహ్వానించుటకు త్వరితముగా వచ్చెను. వారిరువురనూ పూజించిన తర్వాత చేతులు జోడించి యిట్లనెను. ''దేవతలకు దైవమైన మీకు నేను యే విధముగా ప్రీతి కలిగించగలనో సెలవీయుడు?''

కృష్ణు డిట్లనెను. ''యమా! నీవు నాకొక సహాయము చేయవలసి యున్నది. చాల కాలము క్రిందట ప్రభాస తీర్థమున మునిగి మృత్యువు వాత పడిన మా గురు పుత్రుని బ్రతికించి తీసుకు వచ్చెదమని మా గురువుకు మాట యిచ్చినాము. ఈ విధముగా మేము గురు దక్షిణ సమర్పింపవలసి యున్నది. నీ సహాయముతో మేము తప్పక గురుదక్షిణ నొసగగలము''. సరసమైన ఆజ్ఞా పూర్వక సంభాషణకు ముగ్ధుడై, యముడిట్లనెను. ''ప్రభూ! తప్పక ఆజ్ఞ చేసెదను''.

తన సేవకులను పిలిచి, యముడు సాందీపుని పుత్రుని తీసుకురమ్మని కోరెను. గురుపుత్రుని తీసుకుని కృష్ణుడు బలరాముడు భూమి మీదకు వచ్చిరి. వారు గురు పుత్రుని, గురువు సాందీపునకు, ఆయన భార్యకు అప్పగించిరి.

వృద్ధుడైన సాందీపుడు ఆనందము పట్టలేక, మాట్లాడలేకపోయెను. కొంతసేపయిన తర్వాత తన్ను తాను నిగ్రహించుకుని యిట్లనెను. ''గురువు లందరిలో నేను మిక్కిలి అదృష్టవంతుడను. ఇటువంటి అత్యుత్తమమైన గురు దక్షిణను యే యితర గురువులు తమ శిష్యుల నుండి పొందియుండరని నా దృఢవిశ్వాసము. నాకు మీ రిద్దరు శిష్యులుగా నుండుటచేత, కోరికలచేత ఉత్పన్నమైన రోగము తొలగిపోయినది. మీరు మహాపురుషులుగా ప్రసిద్ధికెక్కగలరని ఆశీర్వదించుచున్నాను. అనంతమైన కీర్తి ప్రఖ్యాతులు మీ వశము కాగలవు''.

బలరామకృష్ణులు వృద్ధ దంపతుల వద్ద, గురుకులములోని సహాధ్యాయుల వద్ద సెలవు తీసుకుని తిరిగి

మధురా నగరమునకు చిచ్చేసిరి.

## 208 ఉద్ధవుని బృందావనమునకు పంపించుట

వృష్ణి, అంధక, భోజులలో ఒకడు కృష్ణునికి అత్యంత ప్రియమైనవాడు. అతని పేరు ఉద్ధవుడు. ఇతడు గురు బృహస్పతి శిష్యుడు. మంచి మేధాసంపన్నుడు. బాగుగా ఆలోచించిన పిదప, బృందావన ప్రజలకు తన మ సందేశమును అందివ్వగల ఉత్తముడు ఉద్ధవుడేనని, కృష్ణుడు నిశ్చయించెను. ఉద్ధవుని చేతిని తన చేతి కి తీసుకుని, యిట్లనెను. ''ప్రియ స్నేహితుడా! ఉద్ధవా! నీవు బృందావనమునకు వెళ్ళి నా తల్లిదండ్రులు యశోదానందులను చూచి రావలెను. నేను వారిని వదలి వచ్చిన తర్వాత వారు చాల విచారముతో నున్నారు. గోపికలు కూడ నేను అచట లేకుండుటచేత దుఃఖములో మునిగియున్నారు. నా ప్రేమ సందేశమును నీవు తీసుకువెళ్ళినచో వారికి కొంత ఉపశమనము కలుగును.

నా స్నేహితు లందరిలో యీ కార్యమును సమర్ధతతో నిర్వహించగలవాడవు నీవు ఒక్కడవే. ఇది అంత తేలిక కాదు, నా మాట నమ్ముము. కాని యిది వారి యెడల నా కర్తవ్యము. నేను వెళ్ళలేకుండుటచేత, నాకు బదులుగా నా సందేశమును నీవు గొనిపోవలెను''.

''గోపిక లొక్కొరి గురించి నీవు చెప్పుము. దానిని బట్టి నేను అక్కడ కలుసుకొనవలసిన వారిని గురించి మరికొంత తెలుసుకొనగలను'' అని ఉద్ధవుడు అడుగగా, కృష్ణుడు చిరునవ్వు నవ్వెను. ఆ చిరునవ్వు కృష్ణుని కనులలో వెనుకటి జ్ఞాపకములు గుర్తుకు వచ్చినట్లుండెను.

కృష్ణుడు ఉద్ధవునితో నిట్లు పలికెను ''వారి మనస్సులు యెల్లపుడును నాపై లగ్నమై యుండును. వారు నన్ను ప్రాణ సమానముగా బావించుదురు. నా కొరకై వారు యిల్లు, భర్త, పిల్లలు, సంపద లన్నియు త్యజిం రి. వారు తపించు వానిని ప్రసాదించుటకు నేను నిశ్చయించుకున్నాను. వారికి నా యెడ అమితమైన మ కలదు. వారికి నేను దూరముగా వచ్చివేసినాను. వారందరును విచారముతో నున్నారని యెరుగుదు . వారందరును నా వారమని చెప్పిరి. నేను వచ్చునపుడు, తిరిగి వారి వద్దకు రాగలనని చెప్పియున్నాను. ఏదో ఒకరోజు నేను తిరిగి రాగలనను ఆశతో వారు జీవించుచున్నారు. వారిని కృష్ణుడు మరిచిపోలేదని, అవకాశము దొరికిన వెంటనే వచ్చి వారిని చూడగలడని నీవు నా సందేశముగా చెప్పినచో వారు సంతోషించగలరు. ఉద్ధవా! వారికి నా అభయ వాక్యముల ఆవశ్యకత యెంతైన నున్నది. లేకున్నచో, వారు తపించి తపించి, చివరకు మరణించగలరు''

కృష్ణుడు చెప్పినట్లుగా చేయుటకు ఉద్ధవుడు మనఃపూర్వకముగా అంగీకరించెను. తాను యిది వరకు వినియున్న బృందావనము (భూలోక స్వర్గము) ను చూడవలెనను ఆకాంక్ష కూడ ఉద్ధవునకు కలిగెను. మరుచటి రోజు ఉదయమే ఉద్ధవుడు మధుర నుండి బృందావనమునకు రథములో బయలుదేరెను. వేగముగా పరుగెత్తు అశ్వములు, సూర్యుడు పశ్చిమాకాశము చేరు సమయమునకు రథమును బృందావనము చేర్చెను. బృందావనము చూచిన ఉద్ధవునకు అత్యంత ఉత్సాహముతో శరీరము గగుర్పొడిచెను. అనేక సంవత్సరములు కృష్ణుడు యీ బృందావనమందు సంచరించి గడపుటచేత ప్రఖ్యాతి పొందెను. అంతటను పచ్చిక మేయుచున్న

ఆవులు దూడలు, అందమైన ఆబోతులు కనుపించెను అంబా అని అరచు శబ్దముతో ఆకాశము ప్రతిధ్వనించుచుండెను. వీధులలో యెక్కువగా గోపికలు పాడుకొనుచు తమ తమ కార్యములు నిర్వర్తించుచుండిరి. వారు పాడు పాటలను జాగ్రత్తగా వినిన ఉద్ధవుడు, ఆ పాట లన్నియు కృష్ణుని స్తుతించు పాటలని గ్రహించెను. ఆ పాటలు చిన్ని కృష్ణుని చిలిపి చేష్టలు, మాటలను వర్ణించునవిగా నుండెను. గోపికలు కృష్ణుని తప్ప యింకెవ్వరినీ తలచుటలేదని ఉద్ధవుడు అనుభవపూర్వకముగా గ్రహించెను వారికి, ఆ గోపికలకు, తానే సర్వస్వము అని కృష్ణుడు చెప్పిన మాటలలోని భావము యిప్పుడు ఉద్ధవుడు అవగాహన చేసుకొనెను.

ఉద్ధవుడు వచ్చుట చూచి నందుడు ఆప్యాయముగా ఆహ్వానించెను. ఉద్ధవునకు పాలు, తేనె, యితర మధుర పదార్ధములు సమర్పించి మెత్తని పరుపుమీద కూర్చుండబెట్టిన తర్వాత నందుడు యిట్లడిగెను. ''కంసుడు విధించిన కారాగార బంధము నుండి విడుదల అయిన తర్వాత నా ప్రియ స్నేహితుడు, వసుదేవుడు యెటులున్నాడు? కంసుని మరణము యాదవులకు గొప్ప అదృష్టమని చెప్పవచ్చును. కృష్ణునికి మేము జ్ఞాపకమున్నామా? బృందావనములో విడిచిపెట్టిన తల్లిని, తండ్రిని తలచుకొనుచుండునా?'' నందుని గొంతు గద్గదమై, కనులు అశ్రువులతో నిండగా మరి మాట్లాడలేకపోయెను లోపల ద్వారము వెనుకనుండి వగచుచున్న స్వరము విని యశోద దగ్గరలోనే యున్నదని ఉద్ధవుడు గ్రహించెను దుఃఖము దిగమ్రింగుకుని, నందు డిట్లనెను ''కృష్ణుని మిత్రులు, గోపాలురకు కృష్ణుడు లేని జీవితము శూన్యమయ్యెను. వారికిపుడు ఆవులను తోలుకు వెళ్ళి మేపుట యందు ఉత్సాహము లేకున్నది. కృష్ణుని మురళీ నాదము విను భాగ్యము గోవులకు లేకపోయినది. గోవులు అటు నిటు తిరుగుచు, భూమిని, చెట్ల మొదళ్ళను వాసన చూచి దయనీయముగా అంబా యని అరుచుచుండును. వాటి అరుపులను గాని కృష్ణుడు వినియుండినట్లైన, తప్పక మధురలో అందరిని విడిచి బృందావనమునకు వచ్చెడివాడని నా దృఢ విశ్వాసము గోవర్ధన పర్వతము దిగువ, కృష్ణుడు సంచరించునపుడుండు పచ్చదనములో యిపుడు సగము కూడ లేకుండెను గోవర్ధన ప్రభువు లేకపోవుటచేత, ఆ పర్వతము మూగగా విలపించుచున్నట్లున్నది. మరొక్కసారి మేమందరమును కృష్ణుని చూడవలెనని కోరుచున్నామని చెప్పుము వచ్చి కనీసము కొంతకాలము యిక్కడ ఉన్నట్లయిన అందరి హృదయ భారము కొంత తగ్గగలదని చెప్పుము'' ఉత్తరీయముతో కనులు తుడుచుకుని బృందావనములో కృష్ణుడు చేసిన లీలలు తలచుకొనుచు నందుడు మౌనముగా కూర్చుండెను

కృష్ణుని తల్లి యశోద వగచుచుండుటచేత వెడలిన నిట్టూర్పు శబ్దము ఉద్ధవునకు వినబడుచుండెను. నందుడు పలికిన ప్రతి ఒక్కమాట ఆమె విచారమును యినుమడింపజేసెను కృష్ణుని యెడబాటు వలన కలిగిన ఆమె దుఃఖము నుపశమింపజేయుట తేలిక కాదు.

ఉద్ధవుడు సరళముగా మృదువైన భావముతో యిట్లనెను. ''ఇంతకాలము కృష్ణుడిచ్చట నుండుట మీ యిరువురి అదృష్టము, బృందావనవాసులందరి అదృష్టమనవచ్చును రామకృష్ణులు యీ భూమిపై జన్మించుట కుగల కారణము మీకు తెలియును ఈ లోకమును రక్షించుటకు, దుష్ట శక్తులను నశింపజేయుటకు వారు జన్మించిరి పరమపురుషుడే రామకృష్ణులుగా అవతరించెను వారు మార్పు చెందని, నిత్యమైన సత్య స్వరూపము వారు జీవుల శరీరములలో ప్రవేశించి, జీవులకు చైతన్యము కలిగించి, యీ లోకములో చరించునట్లు చేయుచున్నారు.

''అనేక సంవత్సరములుగా శరీరములో నుంటున్న ప్రాణము ఆ శరీరమును విడిచివెళ్ళు సమయ మేతెంచినపుడు, ఆ జీవుని ఆలోచనలు భగవంతునిపై లగ్నమైనచో బ్రహ్మస్థితిని పొందును. అటువంటపుడు,

మీ గురించి నేను వేరే చెప్పవలయునా? మీరు కృష్ణుని ప్రేమించుచున్నారు. పరమపురుషుడైన కృష్ణుని మీ హృదయములలో ప్రతిష్ఠించుకున్నారు. మీ ఆలోచనలు యెప్పుడును కృష్ణుని మీద కేంద్రీకృతమై యుంటున్నవి. మీరు చాల ధన్యులు. మీరెప్పుడును కృష్ణుని హృదయమందు ఉన్నారు.

''మిమ్ముల నందరను చూచుటకు త్వరలోనే రాగలనని కృష్ణుడు నా ద్వారా మీకు సందేశము పంపెను. అతడు మాట తప్పడు. అతడు తప్పక మీ దగ్గరకు వచ్చును. యశోదమ్మా! నీవు విచారించకు. అశ్వత్థ వృక్షపు కఱ్ఱ యందు అణగియున్న అగ్నివలె కృష్ణుడు యెల్లపుడు మీ మనస్సునందే యుంటున్నాడు. రెండు కఱ్ఱ ముక్కలను ఒక దానితోనొకటి రాపిడి చేసినగాని నిప్పు పుట్టదు. అదే విధముగా, యెడబాటు అను బాధ మీకు త్వరలోనే కృష్ణుని దర్శనము కలిగించును. ఈ బాధచేత కృష్ణుని యందు మీ భక్తియినుమడించినది. తన భక్తుల నెప్పుడును కృష్ణుడు నిరాశపరచడు. దేవకీ వసుదేవులకు కలుగని మహద్భాగ్యము మీకు లభించినది. మీరు కృష్ణుని పెంచి పోషించినారు. అతని పసితనమును బాల్యమును చూచి మీరు ఆనందించిరి. దేవకీ వసుదేవులు జన్మ నిచ్చిన తల్లిదండ్రు లయినప్పటికిని, మీరే అతనికి తల్లిదండ్రులు. వసుదేవ పుత్రుడుగా గాక నందకుమారుడుగా కృష్ణుడందరికిని తెలియును. జీవితములో బాల్యదశ గడిచిపోయినదను విషయము గుర్తించి మనస్సును సరిపెట్టుకోవలెను. బాల్యములో కృష్ణుడు తన సమయమంతయు యీ బృందావనమునకు, మీకు, అమాయకులైన గోపాలకులకు, గోపికలకు అందించెను. తన అవతార ప్రయోజనము సాధించుటకు అనేక కార్యములను కృష్ణుడు నిర్వర్తించవలసి యున్నది. మీరు ఓర్పు వహించి అతడా కార్యములు సులువుటకు సహాయపడవలెను.

''నందా! అతడు నీ పుత్రుడుగా గాక పరబ్రహ్మ స్వరూపమని భావించుము. నీవట్లు భావించినచో అతనికి సామాన్య మానవులకుండెడి భావోద్రేకములు లేవని గ్రహించగలవు. అతడు భావాతీతుడు. అతనికెవరును అత్యంత ప్రియమైన వారును లేరు, యెవరిపై ద్వేషము కూడను లేదు. అతనికి కోరికలుగాని, యిష్టానిష్టములు గాని లేవు. అతనికి ఎవరితోగాని, దేనిపైగాని అనుబంధము లేదు. అతని దృష్టిలో యెవరును అధికులు గాని అధములుగాని కారు. అతనిలో సమత్వ అసమత్వ భావములు లేవు. అతనికి తల్లి, తండ్రి, భార్య, పిల్లలు యెవ్వరును లేరు. అతనికి మిత్రులును లేరు, శత్రువులును లేరు. శరీరమునకు పరిమితుడై లేకుండుటచేత, జనన మరణములు లేవు. ఈ లోకములో అతనికి సాధించవలసిన దేమియును లేదు. కాని మానవుల రక్షణకు, మానవ శ్రేయస్సుకు, అతడీ లోకమందు సత్వ రజస్తమో గుణములను త్రిగుణములతో జన్మించెను.

''జన్మ రహితుడైన పరబ్రహ్మము కృష్ణుడుగా జన్మించెను. గుణాతీతుడైన భగవంతుడు త్రిగుణములతో విలసిల్లెను. ఇతరుల శ్రేయస్సుకై తనకు తానుగా జన్మించెను. ఈ లోకమునొక ఆట స్థలముగా జేసుకుని యిందు తన లీలలను నెరపుచుండెను. మనిషి గిర గిర తిరిగి ఆగిన తర్వాత తన చుట్టునున్న ప్రపంచము తిరుగుచున్నట్లు గోచరించును. అదే విధముగా, అహంకారముచేత కలుషితమైన బుద్ధి, జీవాత్మలకు ఆత్మ త్రిగుణములతో చేరి ప్రాపంచిక విషయములందు తగుల్కొని యున్నట్లు గోచరించును. కాని అది సత్యము కాదు. నిత్యమైన ఆత్మకు కోరికలు లేవు, కాబట్టి లోకములో వర్తించవలసిన ఆవశ్యకత లేదు.

''కృష్ణుడు మీకు మాత్రమే చెందినవాడు కాదు. అతడు అందరివాడు. అతడందరికిని తనయుడే. అతడన్ని జీవులలో అంతరాత్మగా నుండుటచేత అతడు, అందరకును తల్లి, తండ్రి, బంధువు. అతడు సర్వవ్యాపి. నేత్రములు చూచునవి, కర్ణములు వినునవి, గతములో జరిగినవి, ప్రస్తుతము జరుగుచున్నవి, ముందు జరుగబోవునవి, జడ చైతన్య పదార్థములు, ఘనమైనవి, అణువుకంటె చిన్నవి, యివన్నియూ భగవంతుని

వ్యక్త స్వరూపములు. ఆ భగవంతుడే రామకృష్ణ రూపములను ధరించెను.

''మీరిద్దరు విచారించకండి. నిజముగా మీరు చాల ధన్యులు!'', ఈ విధముగా రాత్రి అంతయూ, ఉద్ధవుడు చెప్పుచుండగా, యశోదానందులు వినుచుండిరి. రాత్రి గడచి తెల్లవారెను.

## 209 ఉద్ధవుడు గోపికలకు ఉపశమనము కలిగించుట

ఉదయమున ఒక గోపిక నందుని యింటి ముందు రథము నిలిచియుండుట గమనించెను. ఆమె అమితమైన ఉత్సాహముతో అందరి యిండ్లకును పరుగెత్తి యిట్లనెను. ''ఆనాడు బలరామకృష్ణులు వెళ్ళిన రథము వంటిది ఒకటి మన నందుని యింటి ముందు నిలిచి యున్నది. బహుశః అక్రూరుడు మరల వచ్చి యుండవచ్చును. కాని యెందుకు? ఇప్పుడతడు యెందుకు వచ్చెనో గదా?''

ఆ విధముగా ఊహించుచు గోపికలు నందుని యింటి ముందు యేమి జరుగగలదో యని నిలుచుని వేచి చూచుచుండిరి. తరువాత వారు ఉద్ధవుని జూచిరి. అతడు సౌందర్యవంతుడు. మోకాళ్ళ వరకు నున్న పొడవైన చేతులు, పద్మముల వంటి కన్నులు, బంగారు చాయతో నున్న ఉద్ధవుడు, పసుపుపచ్చని పట్టు వస్త్రములు ధరించి, కుండలములు పిల్ల గాలికి ఊగిసలాడుచుండగా, మృగరాజువలె ఠీవిగా నడచుచు గోపికల వద్దకు వచ్చెను. అతడు కృష్ణునికి దూరపు బంధువు అగుటచేత, కృష్ణుని యందు ధ్యాస, ఆలోచనలు కలిగిన గోపికలు ఒక క్షణము అయోమయస్థితిలో పడిరి. వారు కృష్ణుడు తిరిగి వచ్చెనని భావించిరి. అతనిని సమీపించిన గోపికలు, అతడు కృష్ణుడు కాడని తెలుసుకుని నిరాశ చెందిరి. కాని తరువాత సర్దుకుని, కుతూహలముతో యిట్లనుకొనిరి. ''కృష్ణుని వలె గోచరించుచున్న యితడెవరై యుండును? కృష్ణుని వలె వస్త్రములు ధరించిన యితని నేత్రములు కూడ మన బంగారు కృష్ణుని నేత్రముల వలెనే యున్నవి. ఇతడెచ్చట నుండి వచ్చెను?''

వారు ఉద్ధవుని దగ్గరకు రాగా, అతడు కృష్ణుడు పంపగా వచ్చితినని చెప్పెను. వారికి కృష్ణుని నుండి సందేశమును తీసుకువచ్చితినని గూడ అతడు చెప్పెను.

వెంటనే గోపికలు, ఉద్ధవుని మాట్లాడనీయక తామే మాట్లాడజొచ్చిరి. వారిట్లు పలికిరి. ''మేము అంతయు ఊహించగలము. నీవు కృష్ణుని అనుచరుడవు. తన తల్లిదండ్రులకు ప్రేమాభిమానములు తెలుపుటకు కృష్ణుడు నిన్ను పంపెను. లేకున్న కృష్ణునకు బృందావనము గురించిన ఆలోచన యెందులకు? తల్లిదండ్రులు తప్ప బృందావనములో కృష్ణున కెవరున్నారు? తల్లిదండ్రుల యెడల మాత్రమే చిరకాలము ప్రేమ యుండును. ఇతరులపై నున్న ప్రేమ శాశ్వతము కాదు. మరొక స్త్రీపై అతనికున్న ప్రేమ, తుమ్మెదకు పుష్పముపై తేనెను సంగ్రహించు వరకు నుండు ప్రేమ వంటిది. ఈ ప్రేమ ఒక నాటకము, తన స్వార్థము కొరకు వినియోగించుకొనెను.

ధన సంపద లేని విటుని వేశ్య పరిత్యజించినట్లుగా, ప్రేమికులు అవసరము తీరిన వెంటనే, వారు ప్రేమించిన స్త్రీలను వదలిపెట్టుదురు. దుర్మార్గుడైన రాజును ప్రజలు విసర్జించినట్లు, అన్నియు నేర్చిన తర్వాత శిష్యులు గురువును వదలినట్లు, దక్షిణ నొసంగని యజమానుని ఋత్విక్కులు వదలి వెళ్లునట్లు, పండ్లు లేని వృక్షమును విడి పక్షులు యెగిరిపోవునట్లు, భోజనమైన పిదప అతిథులు గృహము వీడునట్లు, అగ్నిచే దగ్ధమైన అరణ్యము

విడిచి లేళ్లు పారిపోవునట్లు, పురుషులు తాము ప్రేమించిన వనితలను వదలిపెట్టి వెళ్ళెదరు. విశాలమైన రాజ సౌధములో తాను సుఖ సంతోషములతో విలసిల్లుచున్నానని కృష్ణుడు తల్లిదండ్రులకు సందేశము పంపెను కాబోలు.

ఉద్ధవుని ఉద్దేశించి మొదట వారు ప్రసంగము ప్రారంభించిరి. కాని కొంతసేపయిన తర్వాత అతని ఉనికినే వారు మరచిరి. పదునైదు సంవత్సరములు తమతో కృష్ణుడు గడపిన స్మృతులు మెదలి అందు వారు లీనమైపోయిరి. ఒక గోపిక, కృష్ణుడు తనపై చూపిన ప్రేమను జ్ఞప్తికి తెచ్చుకుని అచ్చట నున్న తుమ్మెదతో ఆ స్మృతులను ముచ్చటించుచుండెను. ఆ తుమ్మెద కృష్ణుని వద్దనుండి సందేశము తెచ్చెనని భావించి యిట్లు మాట్లాడసాగెను.

''విశ్వాసహీనుడైన ఆ కృష్ణునకు నీవు తగిన వార్తాహరుడవే. నీవు కూడ పుష్పముల నుండి తేనెను గ్రహించి తరువాత వాటిని వదలివేయుటలో ఆరితేరిన వాడవు. నగరములోని నారీమణులు, నేడు కృష్ణునికి ప్రియమైన వారు, ధరించిన పుష్పములలోని తేనెను నీవు గ్రహించుచుంటివని నాకు తెలియకపోలేదు. నీ కుత్సిత బుద్ధితో నా పాదములు తాకి నన్ను మభ్యపెట్టే నచ్చజెప్పుటకు ప్రయత్నించకు. అచ్చట సుఖముగా నున్న ఆ మహానుభావుని వద్ద నుండి నీవు వచ్చినావు. అతనికిక మా ప్రేమ అవసరము లేదు. నీ స్వామి వలె నీవు కూడ నల్లగా చంచల స్వభావుడవై యున్నావు. నీవు చేసినట్లే అతడు మాకు చేసెను. మా నుండి మధుర ప్రేమను గ్రహించి, స్వర్గమువైపు నడిపించి అక్కడ నుండి నిర్దాక్షిణ్యముగా క్రిందకు త్రోసి మమ్ము విడచి వెళ్ళిపోయెను. అతడంతటి కృతఘ్నుడు. లక్ష్మీదేవి అతనినెట్లు నిత్యము కొలువ గలుగుచున్నది? పాపము అమాయకురాలు. మా వలెనే, ఆమె కూడ అతని కథలు విని, సచ్ఛీలుడని, దివ్య గుణములు కలవాడని భ్రమలోపడి యుండవచ్చును.

''దుర్మార్గుడా! నీ ఆరు పాదములతో క్షమించమని కోరుతూ మా దగ్గరకు రావద్దు. ఇతర స్త్రీలతో — స్వర్గమందలి స్త్రీలు, నగరములోని స్త్రీలు, యితర లోకములలోని స్త్రీలు — సుఖముగా నుంటున్న అతనిపై మాకు విశ్వాసము లేదు. మా అవసరము అతనికిక లేదు. 'ఉత్తమ శ్లోకు'డను పేరు అతనికి తగదని చెప్పుము. పేద భక్తుల యందు కరుణ చూపించువానికే ఆ పేరు తగి యుండును. అతడు మమ్ము, మా ప్రేమను మరచిపోయెను. మిక్కిలి నేర్పుగా అతడు కూర్చిన పదజాలమును ప్రయోగించి మమ్ము అనునయించు టకు ప్రయత్నించవద్దు. మేము అన్నియు — భర్త, పిల్లలు, ఇల్లు, సంసారము — వదలుకుని కేవలము అతనినే ప్రేమించితిమి. అటువంటి మమ్ములను వదలి వెళ్ళుట అతనికి ఉచితమనిపించెను కాబోలు! మాట్లడుటకేమియున్నది? అంతయును అయిపోయెను. అయితే నేనింకను అతని కృత్యముల గురించియే మాట్లాడుచు అతనినే స్తుతించుచు గానము చేయుట యెందులకని నీవు అడుగవచ్చు. మేము అతనిని మరువలేకపోవుచున్నాము. ఇది మానవుల యార్తి బాధల నుండి విముక్తి కలిగించునని మాకు తెలియకపోలేదు. అతనిని స్తుతించుటచేత మానవులలో కలిగే రాగ ద్వేషములు, ద్వంద్వ భావములు శమసిపోగలవు. కొందరు గృహములు వీడి సమస్తమును త్యజించి సన్యాసులై వీధులలో భిక్షమెత్తుకొందురు. ఈ పిచ్చినే సర్వసంగ పరిత్యాగమందురు. మాకు తెలుసును, కాని యీ పిచ్చిని మేము వదలలేక పోవుచున్నాము!'' వారు ఉద్ధవుని వైపు తిరిగి యిట్లు మాట్లాడిరి. ''సరే యిక కృష్ణుని గురించి అతనితో మేము సుఖముగా గడపిన దినముల గురించి మాట్లాడుట వదలివేయుదము. అతని వక్షస్థలమందు యెప్పుడును ఒక స్త్రీ యుండును. అతనికిపుడు మా అవసరము లేదు. అతడెటులున్నాడు? మధురలోనే యున్నాడా? గురుకులము నుండి తిరిగి వచ్చినాడా?

ఎప్పుడైన బృందావనము గురించి తలంచునా? ఇంటిని నందుని స్మరించునా? తోటి ఆటగాండ్రు, గోపాలురను గురించి యోచించునా? ఎప్పుడును బానిసలుగా నున్న మమ్ము యెప్పుడైన తలచుకొనునా? తిరిగి యెప్పుడైనా మరల అతనిని చూడగలమా యనిపించుచున్నది!''. మరొక గోపిక యిట్లనెను. ''మా కృష్ణు డెలాగున్నాడు? కృష్ణుడు నిన్ను పంపినాడా? నిన్ను గౌరవించెదము. మా దయనీయ స్థితి చూచి దయతో మమ్ములను కృష్ణుని వద్దకు తీసుకువెళ్ళగలవా? కాని యిప్పుడతడు నగరములోనున్నాడు. నగరములోని స్త్రీలు బహుశః యీ పాటికి వారి హావభావములతో కృష్ణుని వశపరచుకొని యుండవచ్చు. అతనినెట్లు తృప్తిపరచుటో తెలియని మా వంటి పల్లె పడుచుల వలన అతనికేమి లాభము? అసలు అతడు మా గురించి యెప్పుడైన ఆలోచించునా? చెప్పుము''.

వగచుచున్న గోపికలను జూచి, వారికి కృష్ణునిపైగల యెనలేని భక్తి ప్రేమలకు ఉద్ధవుడు అచ్చెరువొందెను. వారిని ఓదార్చి ఉపశమింపజేయు పలుకులతో నిట్లనెను. ''మీకు కృష్ణునిపై గల ప్రేమ, భక్తి నాకు అచ్చెరువు కలిగించుచున్నది. ఇటువంటి భక్తి అందరకు ఉండదు. ఎన్నియో సత్కార్మలు, పూర్వజన్మలందు వేలకొలది సంవత్సరములు తపస్సు చేసిన మానవులకు మాత్రమే, కృష్ణునిపై భక్తి కలుగు సదవకాశము ప్రాప్తించును. మీకు కృష్ణుని యందున్న భక్తి యిట్టిదే. ఈ భక్తి మీకు అప్రయత్నముగా కలిగినది. మీ భక్తిని చూడగా, పవిత్ర నదీతీరములో స్నానము చేసి పునీతుడనైనట్లుగా, నా హృదయము పరిశుద్ధమైనది.

''కృష్ణుడు మిమ్ము మరువలేదు. మీ గురించియే అతడెల్లపుడూ తలచుచుండెను. నన్ను మీకు తన సందేశము నీ విధముగా అందజేయమని చెప్పెను. 'గోపికలారా! నేను లేకుండ మీరు జీవించుట యెంత దుర్భరమో నేనెరుగుదును. కాని, యీ యెడబాటు కేవలము శరీరములకు మాత్రమే పరిమితము. నామాట నమ్ముడు. నాలోని ఆత్మ మీలోని ఆత్మ ఒక్కటే. నా గురించిన సత్యములు కొన్ని మీకు చెప్పెనిండు. నేను అందరియందు అన్నిటియందు ఉండు అంతరాత్మను. నానుండి మీరెన్నడును వేరుకాలేదు. చరాచరవస్తువులన్నియు పంచభూతములతో — ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి — చేసినవి. అదే విధముగా యీ మనస్సు, పంచప్రాణములు, పంచభూతములు, పంచేంద్రియములు, వీటికి కారణభూతమైనవి అన్నియు నా యందు మాత్రమే ఆశ్రయము కలిగియున్నవి. నేను సర్వవ్యాపిని. నా మాయాశక్తిచేత నా అంశలు వేర్వేరు రూపములుగా వ్యక్తమగుచున్నవి. నేను యీ లోకమును సృష్టించి, పోషించి, లయము గావించుచున్నాను. నిత్యమైన ఆత్మయే శుద్ధజ్ఞానము, అదియే పరమ సత్యము. ఇది భౌతిక వస్తువులకు, పంచభూతములకు, ఇంద్రియములకు భిన్నమైనది. కాని మాయచేత గుణములకు లోబడి యున్నట్లు భ్రమ కలిగించుచున్నది. జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలకు ఆధారము నేను, అనగా శాశ్వతమైన ఆత్మ. కాబట్టి మోక్షము నభిలషించు మానవుడు, జాగ్రదవస్థలో తాను గాంచిన స్వప్నము కేవలము అసత్యమని కనుగొనినట్లు, యీలోకమంతయు అసత్యమని గ్రహించవలెను. అతడు మనస్సును ఇంద్రియములను నిగ్రహించుట తెలుసుకొనవలెను. అతడు అష్టాంగ యోగమును, వేదములను, ఆత్మకు మాయాప్రపంచమునకు గల భేదమును, సన్యాసమును తెలుసుకొనవలెను.

'' 'మహర్షులు అష్టాంగయోగము, తపస్సు మున్నగు వాని ద్వారా నన్ను ధ్యానించి నాతో యేకమగుటకు ప్రయత్నించిరి. కాని నాయందు మీకు ఉన్నటువంటి భక్తి వారి ప్రయత్నముల నతిక్రమించిపోయినది. మీకు నాయందున్న ప్రేమ, మహర్షులు చేసిన తపస్సుకన్న యెన్నోరెట్లు గొప్పది. త్వరలోనే మీరు నన్ను చేరగలరు. నదులన్నియు, ఒకే ఒక ఆలోచనతో అనగా తమ ప్రభువైన సముద్రుని చేరుటకు ప్రవహించినట్లుగా, మీ

ఆలోచనలన్నియు రాత్రింబవళ్ళు నాపైనే యుంటున్నవి. మీ ప్రేమకు ప్రతిఫలము త్వరలోనే లభింపనున్నది.

'' 'మీకు నా నుండి యెడబాటు మీ మంచికొరకే. ఇది నాయెడల మీకున్న ప్రేమను తీవ్రతరము చేయును. మీకు నన్ను గురించిన ఆలోచనలు శాశ్వతముగా స్థిరపడగలవు. దూరముగా అందుబాటులో లేని వస్తువుపై నున్న ప్రేమ, సమీపములో నున్న వస్తువుపైగల ప్రేమకన్న చాల అధికముగా నుండును. నేను మిమ్ము వదలిపెట్టితినని గాని మరిపోయితిననిగాని ఒక క్షణమైనను తలంచవద్దు. అట్టి తలంపు మీకు రాకూడదు. అదియెన్నడును జరుగదు. నేను మిమ్ము యెన్నడును మరువను. బృందావనములో నున్నపుడు మీపై నాకెటువంటి ప్రేమయున్నదో యిప్పుడు కూడ అట్లేయున్నది. మీరు నన్ను త్వరలోనే చేరగలరు. నా మాటలు విని మీరు ఉపశమనము పొందుడు' ''.

అతి కష్టము మీద కృష్ణుని సందేశమును ఉద్ధవుని ద్వారా విని తమ్ము తాము తమాయించుకుని ఉపశమనము పొందిరి. ఉద్ధవుడు చెప్పిన విషయములలో సగము వారికి అవగాహన కాలేదు. కాని ఒక విషయము వారికి స్పష్టముగా అర్థమైనది. కృష్ణుడు తమ్ము మరిచిపోలేదని, తమను మునుపటివలె ప్రేమించుచున్నాననని, ముందు కూడ ప్రేమించగలనని, తాము ఉపశమనము పొందుటకు ఉద్ధవుని ద్వారా సందేశము పంపెనను విషయము వారికి బోధపడెను. ఉద్ధవుడు కొంతకాలము బృందావనములో గడపెను. కృష్ణుడు గావించిన అనేక లీలలను వినెను. భగవంతునికి అత్యంత ప్రీతిపాత్రులై పరలోకములో దైవము ప్రక్కనే స్థానము పొందగలిగిన గోపికలపై ఉద్ధవునకు విశేషమైన గౌరవము, అభిమానము, ప్రతిపత్తియు కలిగెను.

తర్వాత కొంతకాలమునకు యశోదానందుల వద్ద బృందావనవాసుల వద్ద సెలవు తీసుకుని రథము నధిరోహించెను. అశ్రుపూరితములయిన కనులతో వారందరును కృష్ణునకు తమ సందేశములను తెలుపమని ఉద్ధవుని కోరిరి.

ఉద్ధవుడు మధురకు తిరిగివచ్చి కృష్ణుని కలుసుకొనెను. బృందావనములోని సంగతులన్నియు పూసగుచ్చి నట్లు చెప్పగా కృష్ణుడు విని సంతోషించెను.

కృష్ణుడు త్రివక్రకు (సైరంధ్రి) యిచ్చిన మాటను జ్ఞప్తికి తెచ్చుకొనెను. ఒకసారి ఉద్ధవుని యింటికి వెళ్ళి, అక్కడనుండి అతనితో ఆమె యింటికి కృష్ణుడు వెళ్ళెను. ఆమె గృహము చక్కగా అలంకరించి యుండెను. ఆమె గృహమున కేతెంచిన కృష్ణుని జూచి ఆనందముతో నోటమాటరాక యుండెను.

వారిరువురుకును ఆసనము లమర్చి, విలువైన పట్టువస్త్రముల నొసగెను. ఉద్ధవుడు ఆసనము స్పృశించి నేలపై కూర్చుండెను. వారు కొంతసేపు కూర్చుండిరి. కృష్ణు డామెను తదేకముగా చూచుచుండగా, ఆమె, కృష్ణుని చూచుటకు సిగ్గుపడుచుండెను. ఆమె తన్ను యెంతగా కోరుచున్నదో గ్రహించి, ఆమె చేయి పట్టుకుని లోనికి తీసుకువెళ్ళి ఆమెకు తృప్తికలిగించెను.

## 210 అక్రూరుడు హస్తినాపురమునకు వెళ్ళుట

బలరామకృష్ణులు బృందావనములో నందుని యింట పెరుగుచున్నపుడు, మధురలో వారి కుటుంబములో జరిగిన సంఘటనలను దేవకీవసుదేవులు వివరించి చెప్పుచుండగా అత్యంతాసక్తితో బలరామకృష్ణులు వినుచుండిరి. తమ బంధువుల గురించి, వారి పేరు లేమిటో, యెవరెవరు యేమి చేయుచున్నారో, వారెక్కడవారో అన్నియు వివరముగా తెలియజెప్పమని బలరామకృష్ణులు తమ తల్లిదండ్రులను కోరిరి.

వసుదేవుడు వారితో యిట్లనెను. "కుమారులారా! మన బంధువులందరినీ, మీ మేనమామలు, మేనత్తలు అందరినీ కలుసుకొనవలెను''. తన అక్కచెల్లెండ్రు గురించి వసుదేవుడు చెప్పెను. అక్కచెల్లెండ్రలో నొకరిని తండ్రి శూరసేన మహారాజు తన స్నేహితుడైన కుంతిభోజునకు సంతానము లేకపోవుట చేత దత్తత యిచ్చెను. ఆమె పేరు ప్రీతి, దత్తత తీసుకొన్న తర్వాత ఆమెపేరు కుంతి అయినది.

కుంతి సరళ స్వభావురాలై, అందమైనది. కొంతకాలము తర్వాత కురువంశములోని రాకుమారుడైన పాండురాజును కుంతి వివాహమాడెను. కురు వంశీయులు యాదవ వంశీయులు వరుసకు అన్నదమ్ములు. యాదవుల పూర్వుడైన యదు మహారాజు, కౌరవుల పూర్వుడైన పూరుచక్రవర్తి అన్నదమ్ములు. వీరిరువురు చంద్రవంశములో ప్రఖ్యాతిగాంచిన యయాతి కుమారులు. పాండురాజు సోదరుడు ధృతరాష్ట్రుడు, అతడు పుట్టుగుడ్డి. అందుచేత పాండురాజు రాజ్యము పాలించుచుండెను. పాండురాజునకు రాజ్యపాలనలో పితామహుడైన దేవవ్రతుడు సహాయము చేయుచుండెను. దేవవ్రతుడు తన తండ్రి సంతోషము కొరకు కఠినమైన ఆజన్మ బ్రహ్మచర్య దీక్షను పూని భీష్ముడుగా ప్రసిద్ధిగాంచెను.

పాండురాజు, తన యిద్దరు భార్యలైన కుంతీ, మాద్రులతో అరణ్యములో నివసించుటకు యేన్నుకొనెను. అతడు అరణ్యములో మరణించిన తర్వాత అతని అయిదుగురు పుత్రులు చంద్రవంశరాజులకు ప్రధాన నగరమైన హస్తినాపురమునకు వచ్చిరి. పాండురాజు రెండవ భార్య మాద్రి భర్తతో సహగమనము చేయగా, కుంతీదేవి కుమారులతో హస్తినకు వచ్చెను.

ఈ గాథ యంతయు వివరించిన తర్వాత వసుదేవుడు, తన పుత్రులతో నిట్లనెను. "నా సోదరి కుంతికి, ఆమె పుత్రులకు హస్తినాపురములో పరిస్థితులు సంతోషదాయకముగా లేవని వినియున్నాను. ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనునకు తన పినతండ్రి కుమారులు హస్తినకు వచ్చుట యిష్టము లేకుండుటచేత వారిని అనేక యిబ్బందులకు గురిచేయుచుండెను. ఇన్ని సంవత్సరములుగా నాకు నేనే దుర్భర పరిస్థితులలో నుండుటచేత యితరుల దుర్భర పరిస్థితులగురించి ఆలోచించలేకపోతిని. మీరు వచ్చి కంసుని నిరంకుశత్వము నుండి యాదవ కుటుంబమును రక్షించినారు. ఇప్పుడు నా సోదరి కుంతి ఆమెపిల్లల విషయములో మీరు జోక్యము చేసుకుని వారి శ్రేయస్సుకొరకై పాటుపడవలసిన సమయము వచ్చినది. నా సోదరిని యీ వికారకర పరిస్థితినుండి తప్పించుటకై మీరు ఆమెకు సహాయపడుటకై ప్రయత్నించవలెను''

''తండ్రీ! యీ విషయము మేము పరిశీలించెదము'' అని కృష్ణుడు చెప్పెను. హస్తినలో యేమి జరుగుచున్నదో తెలుసుకొనుటకై అక్రూరుని పంపుటకు కృష్ణుడు నిశ్చయించుకొనెను. బలరాముడు, ఉద్ధవుడు వెంటరాగా కృష్ణుడు అక్రూరుని యింటికి వెళ్ళెను. అన్నదమ్ము లిద్దరును ఉద్ధవునితో కలిసి వచ్చుట దూరమునుండి చూచిన అక్రూరునకు పట్టరాని సంతోషము కలిగెను. వడిగా ద్వారము వద్దకు పరుగెత్తి

వారి నాహ్వానించెను. అక్రూరుడు హరిని స్నేహపూర్వకముగా కౌగిలించుకుని నమస్కారము చేసిన తర్వాత హరిని ఉచితాసనములపై కూర్చుండబెట్టెను. వారి పాదముల నభిషేకించి, ఆ పవిత్ర తీర్థమును తన శిరస్సుపై జల్లుకొనెను. గంధము, పుష్పములు సమర్పించి, వంగి తన చేతులతో వారి పాదముల నొత్తసాగెను. కన్నుల నుండి అశ్రువులు కారుచుండెను. నోటమాట సరిగా రాకుండెను. కొంతసేపటికి సర్దుకుని యిట్లనెను. "కంసుని అతని అనుయాయులను నాశనము చేసి అందరికిని సుఖసంతోషములను కలిగించిన నీకు నేను యే విధముగా నా ఆనందమును తెలుపగలను? కంసుని నిరంకుశపాలన అంతమొందగా యిపుడు మేము స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకొన గలుగుచున్నాము మీ యిరువురి శక్తిసామర్థ్యములచేత వృష్ణి, భోజ, యాదవ, అంధక వంశీయులకు విముక్తి లభించి నిర్భయముగా నుండ గలుగుచున్నారు. మధురానగరమునకు తిరిగి శోభ చేకూరెను నాకు, నీ నిజస్వరూపము తెలియును నీవు యీ లోకకారకుడవు, కాబట్టి యీ లోకమే నీవు. నీవు తప్ప, వేరే కార్యకారణములు లేవు సత్వరజస్తమో గుణములతో యీ లోకమందలి చరాచరవస్తువుల న్నింటిని నీవు సృష్టించినావు. నీవు యీ భూమిపై జీవించుచున్నట్లు భ్రమను కలిగించుచున్నావు. కాని అది సత్యముకాదు, యెందుకనగా నీవే యీ భూమివి. ఈ లోకమునకు సృష్టికర్తవు, పోషకుడవు, లయకారుడవు నీవు. మాయా బంధములను నీవు సృష్టించినప్పటికిని నీవు వాని కతీతుడవు. నీవు సృష్టించిన వానితో నీకు ప్రమేయము లేదు సత్యము నెరుగకపోవుటచేత, అవిద్య కారణముగా మానవులు బంధములలో చిక్కుకుని యుంటున్నారు. నీవే పరమసత్యము అగుటచేత నీకు బంధము, మాయ, అవిద్య యెట్లుండగలవు?

"నీకు యీ జన్మ యెందులకు? ఈ రూపము ఎందులకు? దేవకీ వసుదేవుల పుత్రుడవను భ్రమ యెందులకు? నీ అవతార ప్రయోజనము నేను తెలుసుకొని యుండుట నా అదృష్టము. అసుర లక్షణములు కలిగిన అనే [illegible] నము గావించి వందలకొలది అక్షౌహిణులను ధ్వంసము చేసి యీ భూమి బరువు తగ్గించుటకు వచ్చితివి. నాకొక కోరిక కలదు, దానిని నీవు ప్రసాదించవలెను, నన్ను బంధ విముక్తుని చేయుము. ఈ బంధము అనేక రూపములుగా — భార్యాపుత్రులపై ప్రేమ, బంధువులపై అనురాగము, సంపదలపై వ్యామోహము, ఆత్మను బంధించియున్న శరీరముపై అనుబంధము — ఉంటున్నది. నాకు యితర కోరిక లేవియు లేవు!

[illegible]డు చిరునవ్వు నవ్వి యిట్లనెను "నీవు నాకన్న పెద్దవాడవు. వరుసకు మామవు మేము నీకు [illegible]త్రు[illegible]ంటి వారము త[illegible]ండ్రులవలె నీ[illegible] మమ్ము ప్రే[illegible]ంచి రక్షించవలెను దేవతలను పేరుతో ను[illegible] [illegible]ర్గవాసులకు ఒకే ఒక [illegible]యము — అన్ని [illegible]యందు వా[illegible] యిష్ట ప్రకారమే జరుగునట్లు చూచుట. వా[illegible] [illegible]ల స్వార్థపరులు ఈ భూమిపై నున్న [illegible]నులు, పుణ్యపురుషులు తమ నిస్స్వార్థ బుద్ధిచేత దేవ[illegible]ల నతిక్రమించి, పూజ కర్హులగుచున్నారు. నీవంటి ఉత్తములే పూజ్యులు. పవిత్ర జలమును తీర్థమందురు. అందు స్నానమాచరించువారు పరిశుద్ధులగుచుందురని చెప్పుదురు. రాయితోను మట్టితోను చేసిన విగ్రహములందు భగవంతుడు నివసించును వానిని పూజించిన మానవులు పరిశుద్ధులగుదురు. కాని యీ రెండు విధములుగా పరిశుద్ధులగుటకు యెక్కువ కాలము పట్టును మానవుడు ఒక్కసారిగా నిర్మలుడు కాలేదు. పరిశుద్ధత [illegible] చేయవలెను [illegible]

"అయినప్పటికిని నిస్స్వార్థ పవిత్ర పురుషుల దర్శనము చేత మానవులు వెంటనే పరిశుద్ధత పొందగలరు నీవు మాకు బంధువుడవు, శ్రేయోభిలాషివి అగుట మా అదృష్టము!

అనేక విషయములు వారు ముచ్చటించిరి. చివరకు సంభాషణ హస్తినాపురము గురించి సాగినపుడు కృష్ణుడు యిట్లనెను. ''మా మేనబావలు పాండవులు, హస్తినాపురములో సుఖముగా నుండుటలేదని వినియున్నాను. అసూయతో దుర్యోధనుడు వారిని అనేక బాధలకు గురి చేయుచున్నట్లు తెలిసినది దుర్యోధనుని తండ్రి ధృతరాష్ట్రుడు, పాండవులు తన సోదరుని కుమారులే అయినప్పటికిని వారిని ఆదరముగా చూచుటలేదని వింటిని. తన కుమారుడు దుర్యోధనుడు చేయు అత్యాచారములను సమర్థించుచున్నాడని తెలిసినది. నా తండ్రి వసుదేవుడు తన సోదరి కుంతికి ఆమె పుత్రులకు సహాయము చేయమని కోరెను నేను వారిని కలుసుకొనుటకు ముందు, నీవు హస్తినాపురమునకు సామాన్య సందర్శకునివలె వెళ్ళి అచటి పరిస్థితులను తెలుసుకొని రావలెనని కోరుచున్నాను. నీవు మంచి రాయబారివి. నీకున్న విచక్షణా జ్ఞానముచేత అచటి నిజ పరిస్థితులను తెలుసుకొనగలవు. నీవు తిరిగి వచ్చిన తర్వాత, అవసరమయినచో, జోక్యము చేసుకొని వారి శ్రేయస్సు, సుఖసంతోషముల కొరకు తగిన విధముగా యేదైన చేయవచ్చును. కాని ప్రస్తుతము నీవు వెళ్ళి అచ్చటి విషయములు తెలుసుకొని రావలెనని నా అభిమతము''

''అటులనే చేసెదను'' అని అక్రూరుడు చెప్పెను.

## 211 ప్రఖ్యాతిపొందిన హస్తినాపురము

పౌరవ వంశరాజుల ప్రధాన నగరమైన హస్తినాపురమునకు అక్రూరుడు యేతెంచెను అతడెటు తిరిగి చూచినప్పటికిని హస్తినను పరిపాలించిన వేర్వేరు రాజులు సాధించిన మహత్తర కార్యముల స్మృతి ఫలకములు గానవచ్చుచుండెను హస్తినాపుర సౌందర్యమును కొంతసేపు చూచి ఆనందించి, చివరకు రాజభవన ద్వారము కడకు వచ్చెను అతనిని భీష్మ పితామహుడు, అంబికా తనయుడైన ధృతరాష్ట్రుడు సాదరముగా ఆహ్వానించి గౌరవించిరి. ధృతరాష్ట్రుని సోదరుడు, మంత్రి అయిన విదురుడు కూడ అచట నుండెను మరియు కుంతి, సోమదత్తుడు అతని కుమారుడు, రాకుమారులకు గురువులైన ద్రోణాచార్య కృపాచార్యులు, దుర్యోధనుడు, దుర్యోధనుని స్నేహితుడు రాధేయుడు, ద్రోణుని కుమారుడు అశ్వత్థామ, పాండవులు అచట నుండిరి. వీరినందరినీ అక్రూరుడు పలుకరించి మాట్లాడగా, వారు స్నేహపూర్వకముగా సంతోషముతో సంభాషణ సలిపిరి. మధురాపురము కంసుని నిరంకుశత్వము నుండి విడుదల పొందినందుకు వారందరును హర్షించిరి కుంతి తన అన్న వసుదేవుడు, వదిన దేవకి యోగక్షేమము అడిగి తెలుసుకొనెను వారు అడిగి తెలుసుకొనగోరు విషయములన్నిటిని అక్రూరుడు వివరించి చెప్పెను

భీష్ముడు, తదితరులు అక్రూరుని కొంతకాలము హస్తినలో నుండవలసినదని పట్టుపట్టగా అక్రూరుడు అంగీకరించెను. అక్రూరుడు వచ్చినది అందులకే గదా!

అక్రూరుడు స్వయముగా పాండవుల శక్తిసంపద, సద్వర్తనము, ఆకర్షించు గుణములను చూచెను. పాండవులను చూచిన ప్రతిఒక్కరు వారిని ప్రేమించక యుండలేరు ఆయుధములను ప్రయోగించుటలో వారి నైపుణ్యము, వారి ధైర్యసాహసములు, అన్నిటిని మించిన వారి వినయమును అక్రూరుడు చూచి మెచ్చుకొనెను. అక్రూరుడు, దుర్యోధనుని కనులలో అద్దములో వలె ప్రతిబింబించు అసూయను స్పష్టముగా

గాంచెను. పాండవుల యెడ, తమ సోదరులైన కౌరవులు పెక్కు చిన్నచిన్న విషయములలో యెట్లు నీచముగా ప్రవర్తించి వారికి యిబ్బందులను కలిగించుచున్నారో అక్రూరుడు ప్రత్యక్షముగా చూచెను. ముసలిరాజు ధృతరాష్ట్రుడు తన పుత్రుల చర్యలను గర్హింపక పరోక్షముగా ప్రోత్సహించుట అక్రూరుడు గమనించెను. ధృతరాష్ట్రునకు తన సోదరుని పుత్రులపైన అసూయగలదు

కుంతి, విదురుడు అక్రూరునితో పలుమార్లు దీర్ఘసంభాషణలు జరిపిరి. భీముని చంపుటకు దుర్యోధనుడు చేసిన ప్రయత్నములు అక్రూరునకు వివరించి చెప్పిరి.

కుంతి కనుల నుండి కన్నీరు ఆగక కారుచుండెను ఇంతవరకు ఆమెకు విదురుని యందు మాత్రమే నమ్మకముండెను. అక్రూరుని చూచిన తర్వాత, తన సోదరుడు వసుదేవుడు పంపగా వచ్చెనని తెలుసుకున్న తర్వాత, ఆమె దుఃఖము కొంత ఉపశమించెను. నిర్భయముగా ఆమె అక్రూరునితో యిట్లు పలికెను ''అన్నా! మధురలో అందరును కుశలమేనా? నన్ను యెప్పుడైనా వారు తలచుచుందురా? అసలు నేను వారికి జ్ఞాపకము ఉన్నానా? వారి కష్ట సమయములో వారిని ఆదుకొను అవకాశముగాని, యిప్పుడు వారి సుఖసంతోషములలో పాలుపంచుకొను అదృష్టముగాని లేని నిర్భాగ్యురాలను. వసుదేవుని పుత్రులకు నన్ను గురించి తెలియునా? చిన్నప్పటి నుండి యెటువంటి సుఖ సంతోషములు యెరుగని విధి వంచితురాలైన మేనత్త ఒకామె యున్నదని వారికి తెలియునా? ఇచ్చట నేను తోడేళ్ల మధ్య లేడివలె నున్నాను. నేను, నా పిల్లలు బ్రతికి బయట పడగలమను ఆశలేదు. కంసుని బారి నుండి నా సోదరుని రక్షించిన కృష్ణుడు, నా పుత్రులతో కలిసి నన్ను కూడ రక్షింపగలడా? రాత్రింబవళ్ళు అతనినే తలచుచున్నానని, అతడు వచ్చి మమ్మ మా శ్రేయస్సు కోరి ఉద్ధరించగలడని ఆశించుచున్నట్లు చెప్పుము. మా భవిష్యత్తు అతని చేతులలో నున్నది''.

అక్రూరుడు, విదురుడు ఆమె నోదార్చిరి. అక్రూరుడు కృష్ణుడు జన్మించిన ప్రయోజనము తెలిపెను. దుర్మార్గులైన దుర్యోధనుని వంటి వారిని శిక్షించుటకే కృష్ణుడు జన్మించెనని, అయినను కొంచెము ఓర్మి వహించవలెనని అక్రూరుడు చెప్పెను

అచ్చటి పరిస్థితులన్నియు సంపూర్ణముగా తెలుసుకున్న తర్వాత, అక్రూరుడు తిరిగి మధురకు వెళ్ళు కోరికను వ్యక్తపరిచెను భీష్ముడు, తదితరులు మరికొంత కాల ముండవలసినదని కోరిరి. ఇప్పటికే అనేక మాసములు హస్తినలో సంతోషముగా గడపితిననియు, ఉగ్రసేనుడు వసుదేవుడు తన కొరకు వేచి చూచుచుందు రనియు, కాబట్టి వెళ్ళవలసి యున్నదనియు తెలిపెను. అక్రూరుడు వెళ్ళుటకు భీష్ముడు అయిష్టముగా అంగీకరించెను.

వెళ్ళుటకు ముందు ధృతరాష్ట్రునికి హితోపదేశము చేయవలెనని అక్రూరుడు సంకల్పించెను. అతడుగాని సరియైన దృక్పథముతో హితమును స్వీకరించినచో దురభిమానము తొలగగలదనియు, అతని అంతర్నేత్రము తెరుచుకుని, తండ్రిలేని పాండవ కుమారుల యెడ ధర్మముగా ప్రవర్తించగలడనియు యోచించెను

భీష్మ విదురుల సమక్షములో అక్రూరుడు ధృతరాష్ట్రునితో మాట్లాడనెంచెను సహజముగా దుష్టస్వభావుడు. పుత్ర వ్యామోహము అతని నన్యాయముగా వర్తించునట్లు చేసినది అతని చర్యలను గర్హించి, హితముపదేశించిన తర్వాత మధుర కేగవలెనని నిశ్చయించుకొనెను.

## 212 అక్రూరుని హితబోధ

ధృతరాష్ట్రుని వద్ద భీష్ముడు, విదురుడు ఉన్న సమయములో అక్రూరుడు యిట్లు పలికెను. "ధృతరాష్ట్ర మహారాజా! నీవు విచిత్రవీర్యుని కుమారుడవు. ఉత్తమ క్షత్రియ వంశములో జన్మించిన వాడవు. నీవు జన్మించిన వంశమునకు కీర్తి ప్రఖ్యాతులు తీసుకురావలసి యున్నది. నీ సోదరుడు పాండు మహారాజు మరణించిన తర్వాత నీవు హస్తినకు మహారాజువైనావు. నీవు ధర్మముగా పరిపాలించినచో తగిన ప్రతిఫలము తప్పక పొందగలవు. నీ పుత్రులను ప్రేమతో చూచిన విధముగా యితరుల పుత్రులను కూడ ప్రేమతో చూచినచో, నీ వారిని యెంత అభిమానముతో ఆదరించెదవో యితరులపై కూడ అటువంటి అభిమానము చూపించినచో, నిన్ను చంద్ర వంశపు రాజులలో అత్యుత్తముడుగా ప్రజలు జ్ఞప్తి యందుంచుకొందురు. నీ పుత్రులపై చూపు ప్రేమాభిమానములను, నీ సోదరుని పుత్రులైన పాండవులపైకూడ చూపవలెనని నేను వేరే నీకు చెప్పనవసరము లేదు. నీవట్లు చూపకున్నచో సత్పురుషుల విరసనకు గురియై పరలోకమున దుర్భరస్థితి పొందెదవు.

''ప్రభూ! యీ లోకములో మనము యెవరితోగాని యే వస్తువుపైగాని యెక్కువ అనుబంధము పెంచుకొన రాదు. మనది అనుకున్న యీ శరీరమును యీ లోకము వదలి వెళ్లునపుడు త్యజించవలసియుండగా, యిక భార్యాపుత్రుల గురించి చెప్పవలసిన దేమున్నది? ఈ లోకములో మనము ఒంటరిగా ప్రవేశించెదము, తిరిగి ఒంటరిగానే నిష్క్రమించెదము. మానవుడు, తనకు తానే పాప పుణ్యములు సంపాదించుట జరుగును. అధర్మముగా గడించిన సంపదను, శత్రువులు పుత్రుల రూపములోగాని లేక ప్రియ బంధుజనుల రూపములో గాని వచ్చి దోచుకొనెదరు! అధర్మముగా గడించిన సంపదను దాచుటకు ప్రయత్నించు మానవుని నిజముగా మూర్ఖుడని చెప్పవచ్చును. తప్పు చేయుటచేత అతడు యెన్నడును సుఖముగా ఉండలేడు. అతడా సంపదను గూడ అనుభవించలేడు. అతడు మరణించినపుడు, పుత్రులు, యితర బంధువులు యిదివరకే వదలిపెట్టిన శరీరమును, అతని ప్రాణముకూడ ఆ శరీరమును వదలివేయును. ఎట్టువంటి సంపదయులేని వాడగును. ప్రాపంచికమైన సంపదను పోగొట్టుకొనిన వాడగును. ఇట్టి ప్రాపంచిక సంపదను గడించుటలో జీవితమంతయు వ్యర్థము గావించిన మానవుడు పరలోకమునకు కావలసిన సంపదను గడించుటకు ప్రయత్నించకుండును!

''ఓ రాజా! బుద్ధి కలిగి యుండుము. ఇది ఒక మాయా ప్రపంచమని, స్వప్న ప్రపంచమునకు భిన్నము కాదని గ్రహించుము. స్వప్న ప్రపంచమువలె నిది అసత్యము. నీ బుద్ధిని వినియోగించుము. చంచలమైన మనస్సును నిగ్రహించుము. మనస్సు నరికట్టినచో, నాది-నీది అను భేదభావములేక అందరి యెడల సమభావముతో వర్తించగలవు''.

ధృతరాష్ట్రుడు అక్రూరునితో యిట్లనెను. ''అక్రూరా! నీవు చేసిన జ్ఞానబోధకు నీకు నాపైగల అవ్యాజానురాగమునకు నేను ముగ్ధుడనైతిని. నీ పలుకులు, గొంతుక యెండిన వానికి అమృతము లభించినట్లున్నవి. ఈ జ్ఞానామృతమును సేవించగా యింకను సేవించవలెనను తపన నాలో యినుమడించుచున్నది. నీవు నన్ను హెచ్చరించుటకు చేసిన ప్రయత్నములను అవగాహన చేసుకుంటిని. నా మనసు చదునుగా ఉన్నట్లయిన, నీ పలుకులు, నీటివలె, నిలిచి మనసును ద్రవింపచేసి ఫలించునట్లు చేయగలవు. కాని నా మనస్సు అమితమైన పుత్ర వ్యామోహముతో కలుషితమై, ఎత్తు పల్లములుగా నుండుటచేత నీ వాక్కులు అచట స్థిరముగా నుండలేవు. ఆకాశమునకు మెరుపు ఒక క్షణము వెలుగు నిచ్చినట్లుగా, నీ మాటలు ఒక క్షణము నా బుద్ధిని ప్రకాశింపజేసినవి.

మరల నన్ను చీకటి అలముకొనుచున్నది.

''యాదవ కుటుంబములో కృష్ణుడు జన్మించినట్లు నా తండ్రి వ్యాసుడు చెప్పెను. అతడు భగవంతుడే యనియు, దుష్టులను నిర్మూలించి యీ భూమి బరువు తగ్గించుటకు జన్మించెననియు చెప్పగా విన్నాను. కొంతకాలము క్రిందట నేను యీ విషయము తెలుసుకున్నాను. భగవంతుని సంకల్పమునకు మానవుడు తలవంచక చేయగలిగిన దేమున్నది? అతనికి నమస్కరించుట తప్ప నేను చేయగలిగిన దేమియు లేదు. భగవంతుని సంకల్పము లెవరికి తెలియును? తన మాయచేత యీ ప్రపంచమును సృష్టించెను. అందు ప్రవేశించి, దానిలో తగుల్కొనకయుండును. మానవులు చేయు కర్మలను, కర్మ ఫలితములను భగవంతుడే నిర్ణయించును. ఈ సంసారమనునది భగవంతుని లీల. అతనిచేతిలో మనము ఆటబొమ్మలము. నీవు నాతో మాట్లాడినట్లు చెప్పి కృష్ణునకు నా నమస్కారములు తెలుపుము. ఒకసారి చూడగోరుచునాన్నని చెప్పుము''.

పెద్దలు, పిన్నలు ఒకొక్కరి వద్ద సెలవు తీసుకుని అక్రూరుడు మధురకు తిరిగి ప్రయాణమయ్యెను. బలరామకృష్ణులు వారి మేనబావల క్షేమము తెలుసుకొనుటకు ఆతురతతో యెదురు చూచుచుండిరి. మధుర చేరిన వెంటనే అక్రూరుడు వసుదేవుని గృహమునకేగి హస్తినాపుర విశేషములన్నియు — తాను వేర్వేరు వ్యక్తులతో మాట్లాడిన విషయములు, వారు ప్రతిస్పందించిన తీరు తెన్నులు, వారి దృక్పథములు, చివర తాను ధృతరాష్ట్రుని కుపదేశించిన హితము అతడు అస్తవ్యస్తముగా జవాబిచ్చిన తీరు — పూసగుచ్చినట్లు చెప్పెను. ముసలిరాజు పాండవులకు అనుకూలముగా యెన్నడును వర్తించడని అక్రూరుడు తన అభిప్రాయ ముగా వెలిబుచ్చెను.

## 213 జరాసంధుడు మధురను ముట్టడించుట

కంసునికి అస్తి, ప్రాప్తి యను యిద్దరు భార్యలు. వారు మగధ దేశమును పాలించు అతి శక్తిమంతుడైన జరాసంధుని పుత్రికలు. కంసుడు చనిపోయిన తర్వాత కంసుని రాణులిద్దరును మగధదేశము వెళ్ళి తమ తండ్రితో మధురలో జరిగిన సంఘటనలను, కృష్ణుడు కంసుని సంహరించిన విధము వివరించి చెప్పిరి. అది విని జరాసంధుడు మండిపడి, యాదవ వంశమును సమూలముగా నాశనము చేయుటకు నిశ్చయించుకొనెను. ఇరువదిమూడు అక్షౌహిణుల సేనను సమీకరించుకుని మధురానగరము చుట్టుముట్టెను.

జరుగుచున్న విషయము కృష్ణుడు గమనించెను. అనంతమైన సేనా సమూహము మధుర చుట్టూ చేరియుండుట కృష్ణుడు చూచెను. అతి చిన్నదైన మధురానగరములోని ప్రజలు, తమ నగరమును జరాసంధుని సేనలు ముట్టడించుట జూచి భయభ్రాంతులైరి. అనేక ఆలోచనలు కృష్ణునికి కలిగెను. ఏదో ఒకటి వెంటనే చేయవలసి యున్నది. తనలో తానిట్లు తలపోసెను. ''సేనాబలమును వదలి జరాసంధుని మాత్రమే సంహరింపనా? ఆ తర్వాత ఆ సేనను నా యధీనములోనికి తీసుకురానా? లేక జరాసంధుని, అతని సేనాబలమును కూడ సంహరింపవలయునా?'' కొంచెము సేపయిన తర్వాత తిరిగి తనలో తానిట్లనుకొనెను. ''నేను యీ కృష్ణుని రూపము ధరించి వచ్చినది భూభారము తగ్గించుటకు, కాబట్టి సేనాబలమును సంహరించి, జరాసంధుని వదలిపెట్టెదను. అతడు మరల మరల వచ్చును. వచ్చినపుడు యింతకు రెండింతలు సేనతో

రాగలడు అతడు వచ్చినపుడెల్లా అతని సేనను నాశనము గావించెదను''. బలరామకృష్ణులు యుద్ధము చేసి సైన్యమును నశింపజేసి జరాసంధుడు తిరిగి రాజ్యమునకు వెళ్లునట్లు చేయుటకు నిశ్చయించుకొనిరి.

బలరామకృష్ణు లిద్దరును అట్లు మాట్లడుకొనుచుండగా, స్వర్గమునుండి రెండు రథములు దిగి వచ్చి వారి యెదుట నిలిచెను. అవి సూర్యునివలె అత్యంత వైభవముతో ప్రకాశించుచుండెను. రథసారథులు స్వర్గలోకము నుండి వచ్చినవారివలె నుండిరి యుద్ధసామాగ్రి రథములో అమరియుండెను. రథసారథు లిద్దరును బలరామకృష్ణులకు నమస్కరించి నిలుచుండిరి. కృష్ణుడిట్లనెను ''అన్నా, రామా! మనకు పంపిన రథములందు అవసరమైన ఆయుధములు గలవు. ఈ ఆయుధములతో యీ సేనా సమూహమును జయప్రదముగా నిర్జించుదము. మనము యెందుకొరకు జన్మించినదియు నీకు తెలుసును. ఈ అపార సేనావాహినిని నిర్మూలించెదము రమ్ము''.

యుద్ధవీరుల నవరణలు ధరించి, రథములనెక్కి యుద్ధము చేయుటకు బయలుదేరిరి. జరాసంధుని సేనావాహినితో పోల్చిచూచిన వీరి బలగము బహు చిన్నది. కృష్ణుని రథసారథి పేరు దారుకుడు. కృష్ణుడు పాంచజన్యమను శంఖమును పూరించెను. ఆ శంఖారావము శత్రుసేనల మనస్సులలో విపరీతమైన భయము కలిగించెను.

మొదటిసారిగా జరాసంధుడు కృష్ణుని చూచెను దగ్గరకు వచ్చి జరాసంధు డిట్లనెను ''ఓ! నీవా కృష్ణుడవు! నీ మేనమామనే చంపిన అధమాధముడవు నీ వంటి పాపాత్మునితో నేను యుద్ధము చేయను అది నా ప్రతిష్ఠకే భంగము. నీ వంటి పిరికిపందతో యుద్ధము చేయుట నాకు సిగ్గుచేటు నీవు నగరమునకు తిరిగి వెళ్ళిపో బలరామా! నీవు నాతో యుద్ధము చేయుటకు ధైర్యమున్నచో నేను సిద్ధమే నా వాడి తూపులకు నీ శరీరము ముక్కలు ముక్కలైనపుడు నీవు తప్పక వీరస్వర్గము నలంకరించగలవు అట్లుగాక, నీవు నన్ను చంపుట కూడ సంభవించవచ్చు''.

కృష్ణుడు మధ్యలో అడ్డువచ్చి యిట్లనెను ''నీవు మహారాజువు. నిజముగా శక్తిగలవారు ప్రగల్భములు పలుకక ఆచరణలో వారి శక్తిని చూపించెదరని నీకు తెలిసి యుండవలసినది అయినప్పటికిని నిన్ను క్షమించి వదలుచున్నాను. నీ అంతము త్వరలోనే సమీపించనున్నది. అంతము సమీపించువారి మాటలు పొందిక లేక అర్థరహితముగా నుండును''.

యుద్ధము ప్రారంభమయ్యెను రణరంగమంతయు ధూళితో నిండెను. ఆకాశము ధూళితో నిండియుండుటచే మిద్దెలపై కెక్కి చూచుచున్న మధురానగర వాసుల కేమియు కనుపించకుండెను. వారికి బలరామకృష్ణులు గాని, వారి రథములు, ఆ రథములపై నున్న కేతనములు — కృష్ణుని రథముపై గరుడుడు, బలరాముని రథముపై తాటిచెట్టు — కూడ కనుపించకుండెను ఈలోపుగా బలరామకృష్ణులు, జరాసంధుని సేనలను ఒక క్రమ పద్ధతిలో సంహరించుచుండిరి. ఆ సేనావాహినిలో జొరబడి నిర్దాక్షిణ్యముగా వారిని నిర్మూలించుచుండిరి అప్పటికి జరాసంధుని సేన చాలవరకు నాశనమయ్యెను అతడు రథమును రథసారథిని పోగొట్టుకొనెను బలరాముడు తన భుజములతో జరాసంధుని నొక్కిపట్టుకొనెను. జరాసంధుని యిప్పుడే చంపుటకు కృష్ణుడు యిష్టపడక, వదలిపెట్టమని బలరామునికి నచ్చజెప్పి జరాసంధుని విడిపించెను

జరాసంధునికి దుఃఖము, ఆగ్రహము ముంచుకువచ్చెను. తాను తలపెట్టిన ముట్టడి విఫలమైనందుకు

దుఃఖము కలిగెను ఈ యువకు లిద్దరును అతి సునాయాసముగా తన సేనను నిర్మూలించినందుకు ఆగ్రహము కలిగెను. మరియు బలరాముని చేతిలో సుమారుగా చనిపోవలసి యుండగా, కృష్ణుడు వదలిపెట్టమని చెప్పుటచేత, తాను తిరిగి బ్రతికి బయటపడితినని తెలుసుకొని క్రోధావిష్టుడయ్యెను. ఎవరినైతే తాను పిరికిపందయని, పాపియని నిందించెనో, ఆ కృష్ణుడే తనకు ప్రాణభిక్ష పెట్టినాడు. కాని జరాసంధుడు కృష్ణుని ఔదార్యమును మెచ్చుకొనలేక పోయెను. తన్ను అవమానించిరని భావించి, బలరామకృష్ణు లిద్దరిని తేలికగా క్షమించలేకపోయెను. అవమానము గూడుకట్టుకొనిన హృదయముతో జరాసంధుడు మగధదేశమునకు తిరిగి వచ్చెను.

జరాసంధుని మిత్రులు అనునయించుచు నిట్లు పలికిరి. ''నీవు ఆ యిద్దరు యువకుల చేతులలో ఓడిపోవుట నీకు ధైర్యము లేకపోవుట చేతగాదు. కాకపోయిన విధి నీకు యెదురు తిరుగుటచే నీకు ఓటమి సంభవించినది ఈ ఓటమి కారణముగా నీవు నిరాశా నిస్పృహలను చెందవలసిన పనిలేదు''.

మిత్రుల పలుకులు జరాసంధునికి ఉపశమనము కలిగించలేకపోయెను. తపస్సు చేసి తిరిగి యుద్ధము చేయుటకు నిశ్చయించుకొనెను

ఈలోపుగా కృష్ణుడు మధురకు తిరిగి వచ్చెను. కంసుని చంపిన తర్వాత అన్నదమ్ము లిద్దరును జరాసంధుని సేనాబలమును సంహరించి, జరాసంధుని వెనుకకు పంపివేసిరి ప్రతిఒక్కరి హృదయము ఆనందముతో నిండెను. నగరములో పండుగ వాతావరణము నెలకొనెను అందరును సుఖముగా నుండిరి. అయితే, జరాసంధుడు వారిని శాంతియుతముగా నుండనివ్వక, పదిహేడు పర్యాయములు తన అక్షౌహిణీ సైన్యములతో మధురపై దండెత్తెను. పదిహేడు పర్యాయములు అతని సేనలు సమూలముగా నాశనమయ్యెను. అతడు మాత్రము ప్రాణములతో బయట పడుచుండెను

ప్రతి పర్యాయము అపజయము పొందుటచేత అతని అవమానము మరింత తీవ్రమయ్యెను. తిరిగి దండెత్తు ప్రయత్నము విరమించలేదు. యాదవులతో యుద్ధము చేయుటకై మరొకరు తనకు సహాయము చేయుటకు వచ్చువరకు ఆగియుండెను

## 214 కాలయవనుడు

పద్దెనిమిదవ పర్యాయము జరాసంధుడు తిరిగి కొత్తగా సేనాబలము సమీకరించుకుని మధురను ముట్టడించు టకు బయలుదేరెను. మార్గ మధ్యములో కాలయవనుడను అతి శక్తిమంతుడైన రాజును కలుసుకొనెను. తాను చాల ధైర్యసాహసములు కలవాడనని కాలయవనుడు తలచుచుండెను. యాదవ సోదరులైన బలరామకృష్ణుల చేతులలో అనేక పర్యాయయములు జరాసంధుడు ఓడిపోయి తీరని అవమానమునకు గురి అయినాడని విని, జరాసంధునకు సహాయము చేయ నిశ్చయించుకొనెను తనకున్న మూడు కోట్ల మ్లేచ్ఛసేనను జరాసంధుని సేనాబలమునకు తోడుగా పంపగలనని కాలయవనుడు జరాసంధునికి వాగ్దానము చేసెను.

కాలయవనుని మ్లేచ్ఛసేనలు మధురానగరమును చుట్టుముట్టెను మొదటిసారిగా, యా దాదులలో బలరామకృష్ణులు నిదానముగా చేయవలసిన కర్తవ్యము గురించి యోచించిరి. కృష్ణుడిట్లనెను. ''చూడన్నా!

యాదవులు గొప్ప సంకటస్థితిలో పడినారు. అన్నివైపులను శత్రువులు ముట్టడించియున్నారు కాలయవనుడు యుద్ధము చేయుటలో మంచి శక్తిమంతుడని పేరు పొందినాడు. అటువంటివాడు యిప్పుడు జరాసంధునితో చేతులు కలిపినాడు. వీరిద్దరును కలిసి యాదవులను బందీలుగా తీసుకొనవచ్చు, లేక మన బంధువులందరినీ చంపివేయవచ్చు. సముద్రమధ్యములో ఒక నగరమును నిర్మించి అక్కడకు యాదవుల నందరినీ పంపివేసినచో అక్కడ వారు సురక్షితముగా నుండగలరు ఆ తర్వాత మనము కాలయవనుని చంపవచ్చు'' కృష్ణుని సూచన బాగున్నదని బలరాముడు బలపరిచెను.

దివ్య నిర్మాణకర్త అయిన విశ్వకర్మను కృష్ణుడు పిలిపించి, అతనితో సముద్రము మధ్య కట్టవలసిన నగరము గురించి చర్చించెను ''అట్లే చేసెద''నని విశ్వకర్మ చెప్పెను

సముద్రమధ్యములో బంగారు నగరమొకటి వెలసెను. అందు ప్రవేశించుట సులభము కాదు. స్వర్గలోకము లోని అమరావతీ నగరమువలె దీనిని నిర్మించెను. అందముగా విశాలమైన వీధుల కిరుప్రక్కల బారులు తీరియున్న గృహములపై బంగారు గోపురములు, మిద్దెల లోపల విలువైన మణులు పొదిగియున్నవి. నగరమునకు అందమైన ఉద్యానవనములు శోభ చేకూర్చుచుండెను ఊహా ప్రపంచములో కవుల మనోభావ ములు యెరిగినట్లుగా ఆ గులాబిరంగు నగరము నందు — ద్వారకలో — బంగారు గోపురములు ఆకాశము నంటుచున్నట్లుండెను.

ఆ నగరమునకు దేవతలు కానుకలు పంపిరి. ఇంద్రుడు సమావేశ మందిరమును కానుకగా నొసగెను. ఆ మందిరము పేరు సుధర్మ గాలి వేగముతో ప్రయాణించు అశ్వములను వరుణుడు కానుకగా పంపెను. కుబేరుడు ధనాగారమునకు సరిపోవునంత సంపద నిచ్చెను. దే క్తి
డిచ్చెనని గుర్తుకు తెచ్చుకుని, తమకు తోచిన మేరకు ద్వారకానగర వైభవమును యినుమడింపజేయుటకు శాయశక్తుల సహాయపడిరి

తన యోగ శక్తిచేత కృష్ణుడు మధురలోని ప్రజలందరినీ కొత్తగా నిర్మించిన ద్వారకా నగరమునకు తరలించెను. రాత్రికి రాత్రి మధురానగరము శూన్యమయ్యెను. తరువాత చేయవలసిన కార్యము గురించి కృష్ణుడు బలరామునితో చర్చించెను.

కాలయవనుని సేనలు మధుర చుట్టు నుండెను రాత్రియగుట చేత వారు నిద్రించుచుండిరి. ఉదయముననే వారందరూ నిద్రనుండి లేచిరి యాదృచ్ఛికముగా వారు ఆరోజు ముట్టడించవలసిన నగర ద్వారముల వైపు చూచిరి. ఆ సైనికులు ఒక యువకుడు మెల్లమెల్లగా అడుగులు వేయుచూ నగర ద్వారము దాటి వెళ్లుచుండుట చూచిరి. ఆ యువకుడు అటునిటు చూచుచున్న తీరునుబట్టి, అతడు పారిపోవుచున్నాడని సిపాయిలు తలచిరి వెంటనే వారు కాలయవనుని వద్దకు వెళ్ళి యిట్లనిరి ''ప్రభూ! మధురానగర ద్వారము వద్ద ఒక యువకుడు తప్పించుకుని పారిపోవుటకు ప్రయత్నించుచున్నట్లున్నాడు అతనిని మీరే స్వయముగా చూచి మేమేమి చేయవలెనో చెప్పుట భావ్యముగా నుండగలదు కాలయవనుడు తన గుడారము నుండి బయటకు వచ్చి సైనికులు సూచించిన ప్రదేశము వైపు నడచి వెళ్ళెను. కొంచెముసేపు ఆ స్థలమునందే స్తంభించిపోయి నిలుచుని పోయెను కృష్ణుని ముఖ వర్చస్సు అంత అందముగా గోచరించుచుండెను

ఉదయించుచున్న పూర్ణిమా చంద్రునివలె కృష్ణుడచట నిలుచుండెను స్వర్గమునుండి దిగి వచ్చిన గంధర్వ

కుమారునివలె అపురూప సౌందర్యము కలిగి యుండెను. అతని నల్లని శరీరము తన కిష్టమైన బంగారుఛాయ పట్టు వస్త్రములను ధరించెను అతని వక్షమందు శ్రీవత్సమను పుట్టుమచ్చగలదు మెడలో కౌస్తుభమణి ప్రకాశించుచుండెను అంచున కొద్దిపాటి యెరుపు ఉండిన అతని నేత్రములు అప్పుడే విచ్చిన పద్మమువలె నుండెను. పెదవులమీద చిరునవ్వు నాట్యము చేయుచుండగా, మకరకుండలములు ఊగుచుండెను.

కృష్ణుని రూపము నారదుడు వర్ణించగా యిదివరలో కాలయవనుడు వినియుండెను. అతడు తనలో నిట్లు తలపోసెను. ''ఇతడే కృష్ణుడు — వాసుదేవుడు అయిఉండవచ్చు. అతడి అద్భుతశక్తిని గురించి యిదివరకు విన్నాను. నా అదృష్టము కొద్దీ అతడిప్పుడు యేకాకిగా, తన్ను తాను రక్షించుకొనుటకు యే ఆయుధములేక, యిక్కడ నాకు చిక్కినాడు అతనిని పట్టుకుని చంపుటకు యిదే మంచి తరుణము ఇక్కడకు రాబోవుచున్న నా మిత్రుడు జరాసంధుడు, కృష్ణుని యెడ శత్రుభావము కల్గిన కంసుని యితర మిత్రులు మిక్కిలి సంతోషించెదరు''

తన ఉనికిని గుర్తించునట్లు చేయుటకు, అంతకంటె ముఖ్యముగా తనను బాగా గుర్తించుటకు వీలుగా కృష్ణుడు అచ్చటనే చాలసేపు నిలుచుండెను తరువాత, తాను గుర్తు తెలియకుండ తప్పించుకు పారిపోవుటకు ప్రయత్నించువానివలె, చుట్టును పరికించి చూచుచు, బయటకు తొందరగా నడువసాగెను. నగరమునకు దూరముగా సాధ్యమైనంత వేగముతో పారిపోవుచున్నట్లు పోవుచుండెను

కాలయవనుని చేతిలో ఆయుధమేదియు లేదు. అతడు కృష్ణుని వెంబడించెను కృష్ణుడు వెనుకకు తిరిగి చూచి, ప్రాణములు రక్షించుకొనుటకు పారిపోవుచున్నట్లుగా పరుగెత్తుచుండెను కాలయవనుడు కూడ వేగముగా కృష్ణుని వెంట పరుగెత్తి యిట్లనెను ''ఆగు! పిరికిపందా! నీవు చాల ధైర్యముగల యువకుడవని అందురు. ఎట్టి ఆయుధములేక కేవలము నీ చేతులతో కంసుని చంపినావని చెప్పుదురు జరాసంధుడు అనేక పర్యాయములు యుద్ధముచేసి ఓడిపోయిన సంగతి నాకు తెలియును. అయితే, నీవు యిప్పుడు నా ఊహలో చిత్రించుకున్న వ్యక్తికి భిన్నముగా నున్నావు! నీ గురించి తప్పుడు కథలు నాకు చెప్పినారని స్పష్టముగా తోచుచున్నది. నా నుండి నీవు యెందుకు పరుగెత్తి పారిపోవుచున్నావు? నీకు ధైర్యసాహసములున్నచో వచ్చి నాతో తలపడుము. నావద్ద కూడ యెట్టి ఆయుధములు లేవు వచ్చి నాతో మల్ల యుద్ధము చేయుము. చాణూర ముష్టికుల కోవకు చెందినవాడనని యెంచకుము నాది ఉక్కు శరీరము. నన్ను చంపుట తేలికకాదు. బహుశః అందుచేతనే నీవు పారిపోవుచున్నావు కాబోలు!''

మరింత వేగముగా కాలయవునుడు పరుగెత్తుచుండెను. కృష్ణుడు తనకు అందుబాటులో నున్నట్లు తోచెను మహామహాయోగులకు సైతము చిక్కనటువంటి పరబ్రహ్మ స్వరూపుడైన కృష్ణుడు, కాలయవనునికి అందుబాటులో నున్నట్లుగా నటించుచుండెను!

ఉన్నట్లుండి, పెద్దపులి ప్రమాదమునుండి తప్పించుకు పారిపోవు లేడి వలె, భయమును సూచించు నేత్రములతో, కురులు యెగురుచుండగా, కృష్ణుడు వడిగా పరుగెత్తుచుండెను. బిగ్గరగా నవ్వి, కృష్ణు ననుసరించి పరుగెత్తుచు కాలయవను డిట్లనెను. ''నీవు నవయువకుడవు. నా దేవి ఉద్యానవనములోని లేత మొక్కవలె నాకు గోచరించుచున్నావు నిన్ను చంపవలసిన ఆవసరము రాకూడదని అనిపించుచున్నది నిన్ను చూడగా నీవెంత మాయగాడవో తెలియుచున్నది నా ప్రయత్నము ఫలించు సమయము చేరువలో నున్నది కొద్ది క్షణములలో నీవు నా గుప్పెటిలో నుండగలవు నన్ను తప్పించుకొని పారిపోలేవు''

వారిద్దరిమధ్య పరుగుపందెము సాగుచుండెను. కృష్ణుడు అతి సమీపములోనే ఉండి చేతికి చిక్కినట్లనిపించి దూరమగుచుండుట కాలయవనునికి నిరుత్సాహము కలిగించెను. ఇప్పటికే వారు చాల దూరము ప్రయాణించిరి. వారు ప్రయాణించుచున్న మార్గము అంతమునకు వచ్చెను. ఎదురుగా పెద్దకొండ యుండెను నిస్సహాయముగా చుట్టూ పరికించి చూచుచున్న కృష్ణుని గమనించి కాలయవనునకు సంతోషము కలిగెను. కృష్ణుడొక గుహను కనుగొని దానివైపు పరుగెత్తుచున్నట్లు కాలయవనునకు తెలిసెను. ''ఇదియా నీ పన్నాగము'' అని కాలయవను డనెను. ''ఆ గుహలో దాగుకుని నా నుండి తప్పించుకొనవలెనని యోచించుచున్నావా?'' కృష్ణుడు పరుగెత్తి ఒక్కసారిగా గుహలో అదృశ్యుడయ్యెను

కొన్ని క్షణముల తర్వాత కాలయవనుడు గుహలో ప్రవేశించెను గుహలోపల చీకటిగా నుండుటచే కాలయవనునకు యేమియు కనుపించకుండెను. వెలుగులో నుండి చీకటిలోనికి వచ్చుటచేత అంతయు చిమ్మచీకటిగా గోచరించెను. కొంచెము సేపటికి కాలయవనుని నేత్రములు చీకటికి అలవాటుపడగా, అతడు కృష్ణుని కొరకు చుట్టును చూచెను. కాని కృష్ణుడు కన్పించలేదు. కొన్ని నిమిషములు కృష్ణుని వెదుకసాగెను. కొన్ని అడుగుల దూరములో అతడొక రూపమును గాంచెను. అతడు పడుకుని నిద్రపోవుచున్నట్లుండెను. అతని ముఖము కనబడకుండెను.

కాలయవనుడిట్లనెను ''నీ గురించి అందరును గొప్పగా యేల చెప్పుదురో నాకు తెలియదు కృష్ణా! అసలు నీవొక మూర్ఖుడవు. నిద్రపోవుచున్నట్లు నీవు నటించినచో నేను నిన్ను వదలిపెట్టెద ననుకొనుచు న్నావా? లేచి రమ్ము, నాతో యుద్ధము చేయుము''

నిద్రపోవుచున్న స్వరూపము కదలక అట్లే యుండెను కాలయవనునకు ఓరిమి నశించి చికాకు కలిగెను కొంతసేపు వేచి చూచెను. తన పలుకులను అతడు లక్ష్యపెట్టనందుకు ఓర్పు కోల్పోయి, నిద్రించుచున్న వ్యక్తిని సమీపించి యిట్లనెను ''మృదువైన మాటలతో నీవు లేచివచ్చుట లేదు నిన్ను లేపుట కిదియే మార్గము'' అనుచు, మాటలకు తగినట్లుగా నిద్రించుచున్న రూపమును (కృష్ణుడని తలచి) కాలితో తన్నెను. నిద్రించుచున్న రూపము మెల్లగా కదలి నెమ్మదిగా కనులు విప్పి తనకు యెవరు నిద్రాభంగము కలిగించిరాయని చుట్టుమ చూసెను అతడు కృష్ణుడుకాదు. అతని నేత్రములు తన్నే తదేక దీక్షగా చూచుచున్నవని కాలయవనుడు గ్రహించెను అతని కనులు యెర్రగా నుండి నిప్పులు గ్రక్కుచుండెను మరుక్షణములో కాలయవనుడు భస్మమైపోయెను

## 215 ముచుకుంద మహారాజు

తన సహజధోరణిలో పరీక్షిన్మహారాజు శుకునకు అడ్డుపడి యిట్లడిగెను. ''నిద్రించుచున్న ఒక వ్యక్తి లేచి మహాశక్తిమంతుడైన కాలయవనుని భస్మము చేయగల శక్తి గలిగి యుండుట ఆశ్చర్యజనకముగా నున్నది. మునీంద్రా! అతడెవరు? మహాదేవుడు తన నేత్రములతో మన్మథుని భస్మముగావించినట్లు, తన కనులతో భస్మము చేయగలశక్తి అతనికెట్లు సమకూరెను? అతని పూర్వులెవరు? అతడు గుహలో యేల నిద్రించుచుం డెను?''

శుకమహర్షి యిట్లు చెప్పదొడగెను. ''కృతయుగమందు మాంధాత అను గొప్ప చక్రవర్తి గలడు. నిద్రించుచున్న వ్యక్తి మాంధాత కుమారుడు అతని సూర్యవంశపు రాజులలో అతడు మణిపూస అతడు చాల గొప్పవ్యక్తి, గొప్ప పరిపాలనా దక్షుడు, గొప్పవీరుడు. గొప్పధర్మప్రభువు. దేవతలకు అందరకును అతడు మిక్కిలి ప్రీతిపాత్రుడయ్యెను. దేవతల కతనిపై అమితమైన ప్రేమాభిమానములు గలవు.

దేవతలతో కలిసి రాక్షసులతో యుద్ధము చేయుచు దేవతలను రక్షించుచుండెను. తర్వాత మహాదేవుని కుమారుడైన కుమారస్వామి స్వర్గములో దేవతల సైన్యమునకు సేనాధిపతిగా నియమితుడయ్యెను. దేవతలకు ప్రభునైన ఇంద్రుడు ముచుకుంద మహారాజు వద్దకు వచ్చి యిట్లనెను. ''ప్రియ స్నేహితుడా! ఇన్ని సంవత్సరములుగా నీవు మమ్ములను రక్షించుచున్నందుకు నీకేమి ప్రతిఫలము యివ్వవలెనో తెలియకున్నది ఇప్పుడు కుమారస్వామి సేనాధిపతిగా నియమితుడగుటచేత ఇకముందు అతడు అసురులతో పోరాడి జయము చేకూర్చగలడు కాబట్టి నీకున్న బాధ్యతలనుండి నీకు విముక్తి కలిగించుచున్నాము. కాని మేము నీకు గొప్ప అన్యాయము చేసినాము. నీవు మా కొరకు శ్రమించి సహాయము చేసిన యిన్ని సంవత్సరములలో యీ భూమిపై పెక్కు మార్పులు జరిగెను నీ నగరమేదో నీవు గుర్తుపట్టలేనంత మార్పు జరిగెను నీవు లేనపుడు నాలుగు దిక్కులను రక్షించుటకు నియమితులైన నీ పుత్రులు మరణించినారు. నీ బంధువులు, మంత్రులు, శ్రేయోభిలాషులు, గురువులు, చివరకు ప్రజలు అందరును గతించినారు. కాలవాహినిలో వారందరును కొట్టుకుపోయినారు. కాలస్వరూపుడైన భగవంతుడు అన్నింటిని లయము చేయునని విజ్ఞుడవైన నీకు మేము చెప్పవలసిన పని లేదు. మా కారణముగా నీవు అన్నింటిని పోగొట్టుకొనుట చేత, నీవు యే వరమడిగిననూ — మోక్షము తప్ప — ప్రసాదించగలను. నారాయణుడొక్కడు మాత్రమే మోక్షము ప్రసాదించగలడు''

ఒక క్షణములో ముచుకుందునకు విషయమంతయు నవగాహన కాలేదు. అతడు రెండు విషయములు మాత్రము గ్రహించెను. ఒకటి భూమిపై తనకేదియు మిగులకుండుటచే తిరిగి రాజ్యమువైపు దృష్టి మరల్చక ఎటువంటి బంధము, కోరిక లేక యుండెను. రెండవది అతడు నమ్మలేనంతగా విపరీతమైన అలసట పొందుట. ఇదియే అతని మనసులో మెదలుచుండుటచేత అతడిట్లనెను. ''నాకు యిప్పుడు నిద్రకావలసియున్నది. నేను చాలకాలము నిద్రాభంగము కలుగకుండ నిద్రపోవునట్లు వరము ప్రసాదింపుడు మరియు మరొకటి ప్రసాదింపుము నన్ను లేపి నాకు నిద్రాభంగము కల్గించు వ్యక్తి వెంటనే భస్మము అగునట్లు వరము ప్రసాదించవలెను''.

''అటులనే జరుగగలదు'' అని ఇంద్రుడు చెప్పి, మరియు నిట్లనెను. ''నిన్ను నిద్ర నుండి మేలుకొల్పు మూర్ఖుడు నీ నిద్ర కళ్ళ నుండి వెలువడు అగ్నిచేత భస్మమగునని నీకు మాట యిచ్చుచున్నాను''.

ముచుకుందుడు గుహలో ప్రవేశించి కృతయుగమందు త్రేతాయుగము నందు నిద్రించుచుండెను. ద్వాపర యుగము చివరలో కృష్ణుడు ముచుకుందునకు మోక్షము ప్రసాదించ నిశ్చయించుకొనెను. చాల కాలము క్రిందటనే అతడు మోక్షము కోరెను, అందులకతడు అర్హుడు కూడ. ముచుకుందుని క్రోధపూరిత నేత్రముల ద్వారా మాత్రమే కాలయవనుని చంపుట సాధ్యమని కృష్ణుడు తెలుసుకొనెను. ముచుకుందుడు పూర్తిగా మెలకువ స్థితిలోనికి వచ్చెను అతడు కనులెత్తి దివ్యమైన రూపమును జూచెను. మేఘ వర్ణములో నున్న శరీరము, సువర్ణచ్ఛాయ వస్త్రములు, వక్షస్థలముపై శ్రీవత్సమను పుట్టుమచ్చ, కౌస్తుభ మణి, మెడలో వైజయంతి యను విలువైన మణులతో పొదిగిన హారము, నాలుగు చేతులందు శంఖ చక్ర గదా పద్మములు, అనంతమైన

అనుగ్రహము నొలికించు ప్రసన్న వదనము, మకర కుండలములు, పెదవులపై మందహాసముతో విలసిల్లుచున్న దివ్య మనోహర రూపమును ముచుకుందుడు చూచెను. ఇంతటి మనోహర రూపమును అత డిదివర కెన్నడును చూచి యుండలేదు. పరిసరము అంతటను ప్రసరించుచున్న ఆ దివ్య రూప వైభవమును గాంచి, ముచుకుందుడు చేతులు జోడించి యిట్లు పలికెను. "నీవెవరు? చూడగా దివ్యపురుషునివలె నున్నావు. చిన్న చిన్న ముళ్లులు కూడ వాడియైన శూలపులవలె నున్న యీ నిర్జన స్థలమునకు, పద్మముల వంటి మృదువైన నీ పాదములు యీ గుహలో యెట్లు నడచి రాగలిగెను? నీవు వెలుగునకు వెలుగును ప్రసాదించు వాని వలె గోచరించుచున్నావు. నీవు అగ్ని దేవుడవా? లేక సూర్యుడవా? కాదు, నేను పొరబడితిని. స్వయం ప్రకాశమాను డవైన నీవు త్రిమూర్తులలో - బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు - ఒకడవై యుండవచ్చును. కాదు కాదు, నేనింకను పొరబడుచున్నాను. ఇప్పుడు నాకు తెలిసినది నీవు సాక్షాత్తు నారాయణమూర్తివి నేనొక సామాన్య మానవుడను. సూర్య వంశమునకు చెందిన రాజును ప్రఖ్యాతి గాంచిన యువనాశ్వునికి మనుమడను నా తండ్రి మాంధాత చక్రవర్తి. నన్ను ముచుకుందు డందురు పూర్వము, చాల రోజుల క్రిందట, ఇంద్రునకు నేను కొద్దిపాటి సహాయము చేసితిని. నేను బాగుగా అలసట చెంది యుండుటచే నేను కోరినంత కాలము నిద్రపోవునట్లు వరము ప్రసాదించెను. ఎవరో ఒక వ్యక్తి నన్ను బలంతముగా లేపి నిద్రాభంగము కలిగించెను. అతని నిదివరకెన్నడును నేను చూచి యుండలేదు. బహుశః అతడు చేసిన పాపముల వలన కాబోలు అతడు భస్మమైపోయినాడు ఆ తర్వాత నా నేత్రములు నీ దివ్యమంగళ రూపమును దర్శించినవి నీకు నా నమస్కారము".

సాష్టాంగ ప్రణామము చేసిన ముచుకుందుని లేవనెత్తి, భగవంతుడు మేఘ గర్జనను పోలిన స్వరముతో యిట్లనెను "నేనెవరో, నా నామమేమిటో నీవు తెలుసుకొన గోరుచున్నావు! నాకు వేలకొలది నామములున్నవి అనేక జన్మలలో అనేక కృత్యములు గావించినాను వానికి ఆద్యంతములు లేవు బహుశః యీ భూమిపై నున్న యిసుక రేణువులను లెక్కింపవచ్చునేమోగాని, నా నామములు, జన్మలు, కావించిన కృత్యములు లెక్కించుటకు వీలుకాదు నేను భూత భవిష్య ద్వర్తమానములకు చెందినవాడను. కాలమే నేను నేను అనంతుడను.

"ప్రస్తుతము నేనిక్కడకు యెట్టి పరిస్థితులలో వచ్చితినో వివరించెదను

"ఈ భూమి అనేక మంది పాపాత్ములైన అసుర రాజులతో భారముగా నున్నది ఈ భూమిపై అధర్మము విచ్చలవిడిగా నాట్యము చేయుచున్నది.

"అందుచే భూదేవి సృష్టికర్తయైన బ్రహ్మ వద్దకు వెళ్ళగా అతడు నా దగ్గరకు వచ్చెను ఆమెకు నేను సహాయము చేసెదనని మాట యిచ్చితిని. చంద్రవంశమందు అనేక శాఖలు గలవు అందు యాదవకులము ఒకటి. వసుదేవుడు యాదవుడు, అతని కుమారుడుగా జన్మించితిని. నన్ను కృష్ణుడని, వాసుదేవుడని యందురు. నేను కంసుని, అనేకమంది పాపాత్ములైన అసురులను సంహరించినాను నీ క్రోధ నేత్రములకు భస్మమైన వాడు కాలయవనుడు. అతడు అతి భయంకరమైన పాపాత్ముడు నీవు యీ గుహలో నున్నావని తెలుసుకుని యిందులో ప్రవేశించితిని నీవు యెప్పుడును నాకు భక్తుడవు నీవు చాల కాలముగా కోరుకొనుచున్న దానిని నీకు ప్రసాదించుటకు తగిన సమయము వచ్చినది. నీవు నన్ను అడుగుటకై వేచియున్నాను నీవు యేది అడిగిన దానిని ప్రసాదించుటకు సిద్ధముగా నున్నాను నా భక్తులెవరును దుఃఖముతోగాని, విచారముతో

గాని యుండరు నీ కోరికలను తెలిపినచో, నేను వానిని నీకు ప్రసాదించగలను''.

## 216 ముచుకుందునకు మోక్షము ప్రసాదించుట

చాలసేపటి వరకు ముచుకుందునకు నోట మాట రాకుండెను కనుల నుండి అశ్రువులు కారెను. రెండు పర్యాయములు మాట్లాడుటకు యత్నించెను. రెండు మార్లు ఉద్వేగము చేత గొంతు గద్గదమయ్యెను. చివరకు అతడిట్లనెను. ''మిక్కిలి తేలికగా లభించని దానిని భగవంతుడు నాకు ప్రసాదించవలెను భౌతికమైన సుఖ సంతోషములు తేలికగా లభింపగలవు వానిని అనుభవింపవలెనను కోరిక నాకు లేదు.

''ప్రభూ! నీ మాయచేత యీ లోకమంతయు భ్రమలో మునిగియున్నది స్త్రీ పురుషులందరును కోరికల ఊబిలో చిక్కుకుని సత్యము తెలియలేకపోవుచున్నారు ఇదంతయు అశాశ్వతమని వారు గ్రహించలేకపోవుచున్నారు. వారు తమ చిత్తమును నీపై లగ్నము చేయుటలేదు. పదే పదే యిల్లు, కుటుంబము, సంపదలతో అనుబంధము పెంచుకుని దుఃఖమునకు గురియగుచున్నారు మానవుడుగా జన్మించుట కడు దుర్లభము. కాని ప్రజలు యీ విషయము గుర్తించలేకపోవుచున్నారు. మానవులుగా జన్మించినందుకు దానిని సార్థకపరచుకొనుట కెట్టి ప్రయత్నము గావించుటలేదు మరియు ఇంద్రియముల ప్రలోభములకు గురియగుచున్నారు. పచ్చగడ్డిని మేయు గోవు గడ్డి కొరకు సంచరించుచు, గడ్డి కప్పిన బావిని చూచి, అది బావి అని, రానున్న ప్రమాదము నెరుగక, గడ్డిని చూచి ఆకర్షణకు లోనయి బావిలో పడుచున్నది. అదే విధముగా మానవుడు ఇంద్రియములచే మోసపోయి పదే పదే పతనము చెందుచున్నాడు. అతని చిత్తము నీ యందు లేకపోవుటయే దీనికి కారణము. అతని ఆలోచనలు భవగంతునిపై లగ్నమగుటలేదు

''నేను వేరే ఉదాహరణకొరకు వెదుకుట యెందులకు? నా విషయము తీసుకొందము. రాజ్యలక్ష్మి నాపై అనుగ్రహ వర్షము కురిపించినది. నాకు సరి సమానులెవరును లేరని తలపోసితిని. నేను భార్య పిల్లలు, రాజ్యముపై అనుబంధము పెంచుకొంటిని. ఈ మాయలో చిక్కుకుని జీవితమంతయు వ్యర్థము గావించితిని భౌతిక సుఖ సంతోషముల ననుభవించుటలో తీరిక లేక, నిన్నెన్నడును తలంచకుంటిని కాలమంతయు అసంఖ్యాకమైన ప్రణాళికలు వేయుచు వెళ్ళబుచ్చితిని. కాలము అన్నింటినీ హరించునని, నీవు కాల స్వరూపుడవని గ్రహించలేకపోతిని

''ఇంటి పైకప్పుకు వెన్నగిన్నె వ్రేలాడుచుండును దానిని ఒక ఎలుక తినవలెనని యెదురు చూచుచుండును. ఎలుక యింటి పైకప్పుకు వెళ్ళి త్రాడు మీదుగా జారి వెన్న గిన్నెను చేరుకొనవలెనని ప్రయత్నించుచుండును. దీనినంతయు ఒక సర్పము గమనించుచుండును సమయము చూచి ఎలుకను పట్టుకొనవలెనని వేచి యుండును కాని ఎలుక రాబోవు ప్రమాదము నెరుగదు. అదే విధముగా భౌతిక సుఖానందమునకై పాటుపడు మానవుడు కాలము పొంచియున్నదని తన్ను తన కోరికలను అంతము చేయగలదని యెరుగడు

''పట్టు వస్త్రములు, బంగారు ఆభరణములు ధరించి యీ లోకములో రాజుగా పేరొందిన యీ శరీరము కాలముచేత నశించుచున్నది తర్వాత దుర్గంధ పూరితమైన అనేక క్రి [illegible] లేక భస్మమగుట జరుగుచున్నది.

''కొన్ని సమయములందు యెప్పుడో ఒకప్పుడు తాను మరణించుట తథ్యమను సత్యము జ్ఞప్తికి వచ్చినపుడు తపస్సు గావించుటకు సంకల్పించును. ''స్వర్గాధిపత్యము చేకూరుగాక'' అను ప్రయోజన మాశించి తపస్సు ఆచరించును. తదుపరి ఏమి జరుగును? సంపాదించిన పుణ్యము హరించిన తర్వాత తిరిగి యీ లోకమునకు వచ్చును. ఈ చక్రభ్రమణము అనంతముగా సాగుచుండును. ఈ జనన మరణము లను చక్రభ్రమణము సాధు పురుషుల సాంగత్యము, అనుగ్రహము లభించిన మానవునకు అంతమగును. బంధ విముక్తి కలుగుటకు యిదియే మార్గమని జ్ఞానులు చెప్పుదురు. వారు యీ పాఠమును బోధింతురు, యిదియే అందరును నేర్వదగిన పాఠము. భౌతిక వ్యామోహము విడనాడి నీ పాదముల యందు మాత్రమే చిత్తము లగ్నము చేయవలెనన్నది యీ పాఠము యొక్క సారాంశము.

''నా మట్టుకు నేను ఒక విషయములో అదృష్టవంతుడను. అనేక సంవత్సరములు కుటుంబమునకు రాజ్యమునకు దూరముగా నుండుటచే వానిని నేను పూర్తిగా మరచిపోతిని. నాకు తెలియకనే వారు నన్ను విడిచి గతించిపోయిరి. ఆ విధముగా నేను బంధ విముక్తుడనైతిని. ఇది తప్పక నీ అనుగ్రహ ప్రభావమని తలంతును. నిన్ను నేను ఒకే ఒక వర మడిగెదను. నీ పాదముల చెంత నాకు స్థానమిచ్చి నీకు సేవ చేయు భాగ్యము ప్రసాదింపుము. నాకు వేరేదియు అక్కరలేదు. సంపద రజోగుణ స్వరూపము, శత్రువులు, శత్రువులతో పోరుట తమోగుణ స్వరూపము. ఇతరులకు మంచి చేయుట, పేరు ప్రఖ్యాతులు సంపాదించుట యనునవి సత్త్వగుణ స్వరూపములు. ఈ మూడు గుణముల నుండి విముక్తి పొందవలెనని నా కోరిక. నీవు గుణాతీతుడవగుటచే నీ పాదముల శరణు జొచ్చుచున్నాను. నీవు జ్ఞాన స్వరూపుడవు, పరమపురుషుడవు, ఏకైక వ్యక్తివి.

''బాధాపూరితమైన యీ లోకములో అనేక జన్మలెత్తి నేను అలసిపోతిని. ఎంతో బాధ ననుభవించినప్పటికిని, మనస్సు ఇంద్రియములను విడిచిపెట్టుట కంగీకరించదు. అరిషడ్వర్గమును విడనాడకుండుటచేత మానవుడు ప్రశాంతత గోల్పోవుచున్నాడు. నీ పాదముల చెంత నాకు చోటు యిచ్చినచో నాకు యిక యెటువంటి భయము, బాధ ఉండవు''.

కృష్ణుడు ముచుకుందునితో యిట్లనెను. ''నీ భక్తికి నేను మెచ్చుకొనుచున్నాను. నిన్ను నేను వరమడుగమని బలవంతపెట్టినప్పటికి నీవు యేదియు కోరుట లేదు. ఈ మానవ ప్రపంచమునకు తిరిగి రాగోరు యిచ్ఛ లేదనుటకు అదియే నిదర్శనము. సంపూర్ణ వైరాగ్యముతో నీవు యీ లోకములో సంచరించగలవు. నన్ను గురించిన ఆలోచనతో నీ మనస్సు నిండి యుండును. నీవు క్షత్రియుడ వగుటచేత క్షత్రియ ధర్మము ననుసరించి వేటాడి కొన్ని మృగములను చంపినావు. ఆ పాపము పరిహారమగువరకు నీవు యీ లోకములో మరికొన్ని సంవత్సరములు జీవించవలసి యున్నది. నీవు మరణించిన తర్వాత మరియొక జన్మ మాత్రము గలదు. ఆ జన్మలో నీవు నన్ను మరువక యుందువు. అటు తర్వాత నీవు నన్ను చేరుదువు''.

పిమ్మట ముచుకుందుడు కృష్ణునితో కలసి గుహ వెలుపలికి వచ్చెను. కృష్ణుడు సెలవు తీసుకుని వెళ్ళిపోయెను. ముచుకుందుడు తన చుట్టును పరికించి చూచి, లోకము గుర్తుపట్టలేనంతగా మారెనని తెలుసుకొనెను. వృక్షములు, జంతువులు కూడ పరిమాణములో తగ్గెనని గ్రహించెను. కలియుగము త్వరలో వచ్చుచున్నదని భావించెను. ఉత్తర దిశవైపు అడుగులు వేసి తపస్సు చేయ సంకల్పించెను. అతడు సమబుద్ధిని సాధించి, స్వచ్ఛమైన మనస్సుతో నడచి పవిత్రమైన గంధమాదన పర్వతము చేరెను. అచట బదరికాశ్రమమను

పేరు గల ఆశ్రమము ప్రవేశించెను. అచట చాలకాలము క్రిందట నరనారాయణులు తపస్సు ఆచరించిరి.

ముచుకుందుడు ఆ ఆశ్రమములో స్థిరపడి ద్వంద్వముల కతీతుడై మిగిలిన జీవిత కాలమంతయు నారాయణుని చింతించుచు గడపెను.

## 217 జరాసంధుని మోసగించుట

ఈలోపుగా కృష్ణుడు సంతోషముగా మధురకు తిరిగి వచ్చెను. కృష్ణుడు బలరామునితో కలసి కాలయవనుని మ్లేచ్ఛ సైన్యముతో పోరాడుచుండిరి. వారి ప్రభువు కాలయవనుడు భస్మమయ్యెనని వారెరుగరు. అతడు వచ్చునని వేచి చూచుచుండగా వారు బలరామకృష్ణులచే నాశనమైరి. వారి సంపదను కృష్ణుడు స్వాధీనము చేసుకుని దానిని కొత్తగా నిర్మించిన ద్వారకా నగరమునకు తరలించెను.

మధురను ముట్టడించుటలో కాలయవనుడు తనకు సహాయపడునని తలచి జరాసంధుడు సంతోషముతో యిరువది మూడు అక్షౌహిణుల సైన్యము వెంటబెట్టుకుని మధురాపుర సమీపమునకు వచ్చెను. నగర ద్వారము వద్ద బలరామకృష్ణులు కనుపించిరి. జరాసంధుని సేనా బలము చూచి, బలరామకృష్ణులు తమ ప్రాణములను రక్షించుకొనుటకు పరుగెత్తెదున్నట్లుగా పరుగెత్తజొచ్చిరి. అన్నదమ్ముల ప్రవర్తన జరాసంధునకు వింతగా తోచెను. ఇది వారి స్వభావమునకు విరుద్ధముగా నుండెను. ఇంతకు ముందు జరిగిన యుద్ధములలో వారు హోరాహోరిగా పోరిన విషయము జ్ఞప్తికి వచ్చి, ప్రస్తుతము వారు పారిపోవుచుండుట వారి స్వభావమునకు భిన్నముగా నున్నదని జరాసంధుడు భావించెను. వారు పిరికిపందలుగా పారిపోవుట జరాసంధుడు ఊహించకుం డెను. అన్నదమ్ముల ప్రవర్తనలో యీ మార్పు కలుగుటకు కారణమేమిటో ఊహించుటకు జరాసంధునికి వ్యవధి లేకపోయెను. ఆయుధము లేవియు వారి వద్ద లేవని, తన నుండి సాధ్యమైనంత వేగముగా పరుగెత్తుచుం డుట జరాసంధుడు చూచెను. రథము నందు ఆసీనుడై, సైన్యము వెంటరాగా, బలరామకృష్ణులను వెంబడిం చెను. చాలసేపు జరాసంధుడు వెంబడించెను. పరుగెత్తుచున్న బలరామకృష్ణులు జరాసంధునికి కన్పించుచుం డిరి. చివరకు వారు ప్రవర్షణ మను పర్వతము దగ్గరకు వచ్చిరి. ఆ పర్వతము యెడల ఇంద్రునికి పక్షపాతము గలదు. అందుచేత వర్షము వలన యెల్లప్పుడు ఆ పర్వతము తేమగా నుండును. బలరామకృష్ణులు వడివడిగా అడుగులు వేసి పర్వత శిఖరము చేరుకొనిరి. అకస్మాత్తుగా వారిద్దరును జరాసంధునికి కన్పించక అదృశ్యులైరి. వారిని వెదకుటకు కొందరు నియమితులైరి. మగధ రాజు స్వయముగా అన్నదమ్ములిద్దరును దాగియున్న ప్రదేశమును కనుగొనుటకు శాయశక్తులా ప్రయత్నించెను. కాని కనుగొనలేకపోయెను. అతడిట్లనెను. ''వారు నా నుండి తప్పించుకొనలేరు. పర్వతమునకు నలువైపులా చుట్టు ముట్టి కాపలా కాయుడు. ఎండు కట్టెలను పేర్చి పర్వత శిఖరముపై నున్న అరణ్యమును దహింపజేయుడు. ఆ మంటలలో నా శత్రువులు భస్మము కాగలరు. వారి మూలముగా వైధవ్యము ప్రాప్తించిన నా కుమార్తెల కన్నీటిని తుడిచెదను''.

అగ్ని జ్వాలలు అన్నివైపులను వ్యాపించెను. సముద్రమునకు చేరువగానున్న వైపు బలరామకృష్ణులు క్రిందకు గెంతి, శత్రు సేనలకు గుర్తు తెలియకుండ సురక్షితముగా ద్వారకా నగరము చేరుకొనిరి.

# 218 కాలయవనుని చరిత్ర

శుక మహర్షి చెప్పుచున్న కథనమున కడ్డుపడి పరీక్షిత్తు యిట్లడిగెను. ''మునివర్యా! ముచుకుందుడు నిద్రించుచున్న గుహకు కాలయవనుడు వచ్చునట్లు కృష్ణుడెందులకు జేసెను? కాలయవనుని సూర్యవంశపు రాజైన ముచుకుందునిచే యెందుకు భస్మము గావించెను? తానే స్వయముగా చంపవచ్చును కదా? బాల్యములోనే అనేకులను అసురులను సంహరించిన కృష్ణుడు సులభముగా కాలయవనుని చంపగలడు కృష్ణుడిట్లు యెందుకు చేసెనో వివరించి చెప్పుడు ఇందులకేదో కారణముండగలదు''

శుక బ్రహ్మ యిట్లు బదులిచ్చెను ''నీ ఊహ సరియైనది దీనికొక దీర్ఘ గాథ గలదు. ఒకసారి-యాదవులందరును సమావేశమైరి. ఇద్దరు గొప్ప ఋషులు ఆ సమావేశమునకు వచ్చిరి. వారు కుల పురోహితుడైన గార్గ్యుడు, మరొక ఋషి శ్యాలుడు సంభాషణ జరుగుచుండగా, ఆ ఋషులిద్దరి మధ్య వాగ్వివాదము చెలరేగెను వాగ్వాదము తీవ్రతరమయ్యెను మరొకరు జోక్యము చేసుకొను లోపుగా, శ్యాలుడు తన నవమానించెనని గార్గ్యుడు చెప్పెను అతడు ఆడిన పలుకులను స్పష్టముగా వివరించమని యాదవులడిగిరి ''నేను నపుంసకుడ'' నని శ్యాలుడు పలికినాడు. అనాలోచితముగా యాదవులందరును పగలబడి నవ్విరి దీనితో గార్గ్యముని ఆగ్రహము ద్విగుణీకృతమయ్యెను అతడు సమావేశము నుండి వెళ్ళిపోయెను. గార్గ్యుడు తిన్నగా ఒకపర్వతము శిఖరముపై కెక్కి అచట తీవ్రముగా మహాదేవుని ధ్యానించుచు తపస్సు చేసెను పన్నెండు సంవత్సరములు గడచెను. అతని భక్తికి మెచ్చి మహాదేవుడు ప్రత్యక్షమై వరము కోరుకొనుమని యడిగెను. గార్గ్యుడు యీ విధముగా వరము కోరెను. ''యాదవులందరను శిక్షింపవలెనని కోరుచున్నాను వారికి భయమును కలిగించు పుత్రుని ప్రసాదించుము ఇందుకొరకు నేను నిత్యము యినుపపొడిని ఆహారముగా గ్రహించుచున్నాను నేను నపుంసకుడనని శ్యాలుడు పలికి అవమానించినాడు నపుంసకుడను కానని ఋజువుపర చుటకు నాకు పుత్రుని ప్రసాదింపుము''

''గార్గ్యుడు తన తపస్సును ఒక అల్పమైన ప్రయోజనము కొరకు వ్యర్థము చేసెనని మహాదేవుడు విచారించెను కాని అతడు కోరిన దానిని ప్రసాదించుటకు మహాదేవుడు మాట యిచ్చెను. అందుచే 'అటులనే కాగల'దని గార్గ్యునకు చెప్పి మహాదేవుడు అదృశ్యమయ్యెను. గార్గ్యుడు మహదానందముతో తిరిగి వచ్చెను

''యవనేశుడను రాజు కలడు అతనికి సంతానము కలుగలేదు. అతడు సింహాసనము నధిరోహించుటకు వారసుడు కావలెనని ప్రార్థించెను అతని ప్రార్థనలు ఫలించకుండెను అతడు గార్గ్య మహర్షి వద్దకు వెళ్ళి, ఆ కాలము నాటి సాంప్రదాయము ప్రకారము, తన భార్యను గైకొని పుత్రుని ప్రసాదించమని ప్రార్థించెను. మహర్షి అంగీకరించి అతడి భార్యను స్వీకరించెను మరికొంత కాలమునకు యవనేశుని భార్యకు పుత్రుడు కలిగెను. కొత్తగా జన్మించిన శిశువు నల్లగా నుండెను ఆ శిశువుకు కాలయవనుడని నామ మిడిరి

''కృష్ణుడు కాలయవనుని సులభముగా సంహరించగలడు కాని గార్గ్యుని పుత్రుడు యాదవులకు భయము కల్గించునని మహాదేవుడు ప్రసాదించిన వరమును మన్నించవలసి యుండెను అందుచేత ద్వారక యను నగరము నిర్మించి యాదవులందరిని అక్కడకు పంపివేసెను మరియు కాలయవ నిద్రించుచున్న గుహలో ప్రవేశించి, అతడిచే భస్మమగునట్లు చేసెను. చాల కాలముగా నిద్రించుచున్న ముచుకుందునకు మోక్షము ప్రసాదించుటకు కృష్ణుడు నిశ్చయించుకొనెను

''దుర్మార్గులైన రాజులను నాశనము గావించుటకై అవతరించిన భగవంతుడు ఒకొక్కరినే సంహరింపవలసి వచ్చెను. వీరిలో మొదట కంసుని సంహరించెను. ఆ తరువాత కాలయవనుడు భస్మమయ్యెను. తన సహజ వైభవ స్థితిని పొందుటకు ముందుగా, భూమాత కిచ్చిన వాగ్దానము ప్రకారము పాపాత్ములైన రాజులను ఒకరి తర్వాత నొకరిని కృష్ణుడు యమ సదనమునకు పంపుచుండెను. కొందరిని తానే స్వయముగా సంహరించెను. మరికొందరిని యితరులచేత సంహరింపజేసెను. తాను అవతరించుటకు ప్రధాన ప్రయోజనమైన కురుక్షేత్ర సంగ్రామములో కృష్ణుడు అర్జునునకు రథసారథిగా నుండినపుడు ఆయుధమేదియు ముట్టనని వాగ్దానము చేసెను. ఆ సంగ్రామమున సుమారుగా దుర్మార్గులైన క్షత్రియ వంశముల రాజుల నందరినీ సంహరింపజేసెను. భగవంతుని తీరు తెన్నులు అనూహ్యములు. భగవంతుని లీలలను విని ఆనందించుటే మన కర్తవ్యము. భగవంతుని లీలల ప్రయోజనము భవిష్యత్తులో లీలా మాత్రముగా గోచరించును.కాని చాలవరకు అతని లీలల వెనుక నున్న 'కారణము' మనకు తెలియక అంధకారకములో నుందుము''.

## 219 విదర్భ రాజపుత్రి రుక్మిణి

భీష్మకుడను రాజు విదర్భను పరిపాలించుచుండెను. అతడు ఉత్తముడు, పరమ సాధువు. దైవ భక్తి కలిగి యితరులకు మంచి చేయుట యందు ఆసక్తి చూపుచుండెను. అతనికి అయిదుగురు పుత్రులు, ఒక పుత్రిక గలరు. జ్యేష్ఠ పుత్రుని పేరు రుక్మి. రుక్మరథుడు, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మమాలి అను వారు మిగిలిన నలుగురు పుత్రులు. పుత్రిక పేరు రుక్మిణి. అన్నదమ్ముల కందరికిని సోదరి రుక్మిణిపై అమితమైన అభిమానము గలదు. తండ్రికి ఆమెపై ప్రత్యేకమైన ప్రేమ గలదు. తండ్రి రాజ్య వ్యవహారములు చూచుచున్నపుడు గూడ కుమార్తె రుక్మిణి అతని ప్రక్కనే యుండెడిది. తండ్రి కూర్చుండు ఆసనము ప్రక్కనే కూర్చుండి అందరిని, అన్ని విషయములను విశాలమైన నేత్రములతో రుక్మిణి గమనించు చుండెడిది. రాజ ప్రాసాదములో అందరకు ఆమె అభిమానపాత్రురాలయ్యెను. ఆమె మాటను యెవరును అతిక్రమించెడివారు కాదు. ఆమె అందరకును ముద్దుబిడ్డ యగుటచే సేవకులవలె ఆమె వద్ద వేచి యుండెడివారు.

సాధు పురుషుల ప్రవచనములను వినుటలో రాజు భీష్మకుడు తన్మయముతో ఆనందించెడివాడు. తరచుగా తన్ను సందర్శించుటకు వచ్చే ఋషులు, యితర పవిత్రాత్ములతో రోజులు నెలలు గడుపుచుండెడివాడు. వారి వేదాంతోపన్యాసములను పురాణములను గంటల తరబడి వినుచుండెడివాడు. అతని ప్రక్కనే రుక్మిణి కూర్చుండి వారు చెప్పిన దంతయు వినుచుండెడిది.

తరుచుగా సందర్శించు వారిలో బ్రహ్మ కుమారుడైన నారదుడు ఒకడు. అతడు వచ్చినపుడెల్ల కృష్ణుని గురించి ముచ్చటించుచుండెను. భీష్మక మహారాజు కృష్ణుని సామర్థ్యములు, అందచందములు, మధుర స్వభావము, భక్తుల యెడ ప్రేమ, దివ్యత్వము గురించి పలు పర్యాయములు వినియుండెను. కృష్ణుని గుణములు యెన్ని మారులు వినినప్పటికిని అతనికి గాని వాటిని వివరించి చెప్పు నారదునికి గాని విసుగు కలుగకుండెను. రుక్మిణి తండ్రితోబాటు నారదుడు చెప్పిన వాటిని వినుచుండెడిది.

రుక్మిణి బాల్యము దాటి యౌవనవతి అయ్యెను. అసమాన సౌందర్యముతో అలరారు రుక్మిణి వివాహము

గురించి తండ్రి భీష్మకుడు ఆలోచించుట మొదలిడెను. అతడు రుక్మిణికి తగిన వరుడు కృష్ణుడని తలంచెను. తన ప్రియ పుత్రికకు కృష్ణుడు ఆదర్శ పతి యని భీష్మకుడు తలపోసెను. జ్యేష్ఠ కుమారుడైన రుక్మితో భీష్మకుడు రుక్మిణి వివాహ విషయమై ప్రస్తావించెను. భీష్మకుడు యిట్లనెను. ''త్వరలోనే రుక్మిణి వివాహము జరుపవలసి యున్నది. ఆమె యౌవనవతి అయ్యెను. కుమారా! ఆమెకొక మంచి వరుని యెంచినాను''.

''అయితే ఆమెకు వరుని వెదకు బాధ్యత నుండి నన్ను తప్పించినావు'' అని నవ్వుచూ రుక్మి పలికెను. ''తండ్రీ! ఎవరా వరుడు?''

''వసుదేవుని కుమారుడైన కృష్ణుడు'' అని రాజు పలికెను.

రాజు వాక్యము పూర్తిచేయక మునుపే రుక్మి కూర్చున్న చోటు నుండి ఒక్కసారిగా లేచి హెచ్చు స్వరముతో యిట్లు పలికెను. ''ఏమిటీ! నీకేమైన పిచ్చి పట్టినదా తండ్రీ? కృష్ణుడా వరుడు! నేను అది జరుగ నివ్వను''.

జరాసంధ కాలయవనులు రుక్మికి మంచి స్నేహితులు. మధురను ముట్టడించుటకు వెళ్ళిన కాలయవనుడు ముచుకుందునిచే భస్మమయ్యెను. రుక్మి యితర స్నేహితులు — పౌండ్రక, విదురథ, సాళ్వ, దంతవక్త్ర శిశుపాలురు — కూడ జరాసంధ కాలయవనుల వంటి వారే. శిశుపాలుడు దామఘోషుని కుమారుడు. రుక్మి స్నేహితులందరును బలరామకృష్ణ ద్వేషులు. తండ్రి భీష్మకుని పలుకులు రుక్మికి ఆగ్రహము కలిగించగా యిట్లనెను. ''తండ్రీ! నా సోదరి రుక్మిణి విదర్భ రాజపుత్రి. నీవు యెంచిన వరుడు కనీసము సామంత రాజైనను కాడు. బాల్యములో అతడు గొల్లకాపరి, మరియు కంసుని అన్యాయ మార్గమున సంహరించెను. అయినను సింహాసన మధిష్ఠించుటకు ధైర్యము లేకపోయెను. గోవు చర్మము కప్పుకొనిన పెద్దపులి వలె, వినయము నటించి ఉగ్రసేనుని మహారాజుగా నియమించెను. పెద్దలయెడ గౌరవము ప్రదర్శించినట్లు నటించి యెవరిని మోసగించ వలె ననుకొనుచున్నాడు? నీచ జన్మనెత్తి తనకు తగని రీతిలో వ్యవహరించుచున్నాడు. అతడు మనకు అన్ని విధముల — ప్రతిష్ఠలో, ప్రతిపత్తిలో, సంపదలో — తక్కువవాడు. రుక్మిణిని అతనికిచ్చి వివాహము చేయుటకు నేనంగీకరించను. అది నాకు సమ్మతము కాదు''.

తన కుమారుడు పలికిన పలుకులు విని భీష్మకుడు చాల దుఃఖించెను. అతడు మాట్లాడుటకు ప్రయత్నిం చెను. కాని రుక్మి మాట్లాడనివ్వలేదు. ముసలి భీష్మకుడు తప్పని సరిగా కుమారుని మాటలు వినవలసివచ్చెను. భీష్మకుడు కొడుకుతో నిట్లనెను. ''నేను యెంచిన వరుడు నీ కంగీకారము కానిచో, మరి నీ చెల్లిలికి అర్హుడైన వరుడెవ్వరు?'' రుక్మి జవాబుగా ''ఇదివరకే దామఘోషుని కుమారుడైన శిశుపాలుడు రుక్మిణికి తగిన వరుడని నిశ్చయించితిని''.

భీష్మకుడు రుక్మి సూచన నంగీకరింపకుండెను. అతనికి శిశుపాలుని అహంభావము, డంబము బాగుగా తెలియును. కాని భీష్మకుడేమియు చేయలేకపోయెను. గత్యంతరము లేక శిశుపాలునితో రుక్మిణి వివాహము జరుపుట కంగీకరించెను. తండ్రిని తేలికగా ఒప్పించ గలిగితినను సంతోషముతో, తన సోదరిని మిత్రుడు శిశుపాలునికిచ్చి వివాహము జరిపించుటకు చురుకుగా సన్నాహములు చేయ నారంభించెను.

# 220 రుక్మిణి దూతను పంపుట

రుక్మిణి హృదయము బ్రద్దలయ్యెను అనేక దినములు, మాసములు, సంవత్సరములుగా రుక్మిణి కృష్ణుని గాథలను వినుచు, తన హృదయము కృష్ణుని కర్పించెను. కృష్ణుని ఆమె భర్తగా యెంచుకొనెను. కృష్ణుని కిచ్చి తన వివాహము జరుపుటకు తన తండ్రి నిశ్చయించినట్లు చెలికత్తెలు చెప్పగా విని రుక్మిణి అమితానందము పొందెను. కాని యిప్పుడామె తాను గాంచిన కలలు కలలుగానే నిలిచిపోనున్నట్లు గ్రహించెను. నారదుడు కృష్ణుని వర్ణించిన మాటలు — అతని సౌందర్యము, బాల్యమందే అతడు ప్రదర్శించిన ధైర్య సాహసములు, అందరిని తనకు బానిసలుగా చేసుకునే ఆకర్షణ శక్తి యింకా యెన్నో యితర సద్గుణములు — జ్ఞప్తికి తెచ్చుకునెను ఇట్టి గుణములు కలవాడగుటచేతనే కృష్ణునికి తన హృదయము నర్పించి అతనికి బానిస అయ్యెను

రుక్మి నిర్ణయము తిరుగులేనిదిగా గోచరించెను. ఇంటి యందు అతని మాటలను తు చ తప్పక పాటించుట ఆనవాయితీ అయ్యెను. రుక్మిణి తనలో తానిట్లు తలపోసెను ''నా అన్న తనకెవరు బావమరదిగా నుండదగునో నిశ్చయించుకొనెను. కనీసము నాకు అంగీకారము అవునా కాదా యని కూడ అత డడుగలేదు. నేను యెంచుకున్న వరుడు, భగవంతునకు నన్ను గురించి అంతయు తెలిసియే యుండును అతనికి సర్వమును తెలుసును చాలకాలము క్రిందటనే రుక్మిణి తన్ను పతిగా యెన్నుకున్నదని అతనికి తెలియకుండ యెట్లుండ గలదు? తెలిసి కూడ అతడు నన్ను తీసుకువెళ్ళుటకు యెట్టి ప్రయత్నము చేయలేదు. దీనిని బట్టి అతడు నన్ను ప్రేమించుటలేదని, నాకన్న అదృష్టవంతురాలైన మరొక వనితను ప్రేమించుచున్నాడని స్పష్టమగుచు ది. బృందావనములో నున్నపుడు అనేక స్త్రీలు అతనిని ప్రేమించిరని చెప్పగా విన్నాను. ఇప్పుడు నేనేమి యవలెను? కృష్ణుని కర్పించిన హృదయమందు వేరొక పురుషునికి స్థానము లేదు. నేను కృష్ణుని తప్ప రొకరిని వివాహమాడను. లేకున్నచో ప్రాణము విడిచెదను ఈ విషయము నా తల్లికి గాని యితరులకు గాని చెప్పలేకపోవుచున్నాను. చెప్పినచో నా ప్రవర్తన అనుచితమని వారు పరిగణింతురు. ఏది యేమైనప్పటికిని నేనొకటి నిశ్చయించుకున్నాను నాకు ఒకే ఒక మార్గము గలదు. నేను అతనిని ప్రేమించుచున్నానని చెప్పి నన్ను రక్షించమని అడిగెదను. అతడు తనకు సంపూర్ణముగా శరణాగతులైన వారిని యెన్నడును వదలిపెట్టలే దని చెప్పగా విన్నాను. ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో సిగ్గుపడుటకు తావు లేదు. ఈ ఆపద నుండి రక్షింపుమని సందేశము పంపెదను అతడు నన్ను రక్షించకున్నచో ఆత్మహత్య చేసుకొందును. అంతేకాని నా అన్న కోరికను మన్నించి తల ఒగ్గలేను'' అని చాలసేపు ఆమె తలపోసి చివరకు యీ నిశ్చయమునకు వచ్చెను

రాజ సౌధమునకు ఒక వృద్ధ బ్రాహ్మణుడు వచ్చుచుండెడివాడు. రుక్మిణికి అతనిని చాల కాలముగా, జ్ఞాపకశక్తి కలిగి నప్పటినుండి, తెలియును అతడామెతో చాలసేపు ముచ్చటించుచుండెడివాడు ఆ వృద్ధ బ్రాహ్మణుని ద్వారా కృష్ణునికి సందేశము పంపుటకు రుక్మిణి నిశ్చయించుకొనెను. అతడు తన విషయము రహస్యముగా నుంచగలడని, తనకు సహాయము చేయుటకు సర్వ విధముల తోడ్పడగలడని రుక్మిణి భావించెను.

ఆమె అట్లు ఆలోచించుచుండగా, అదృష్టవశాత్తు ఆ వృద్ధ బ్రాహ్మణుడు రాజసౌధము లోపలి ప్రాంగణవ నకు వచ్చి రుక్మిణిని పలుకరించెను. ఆమె విచార వదనము చూచి ఆ బ్రాహ్మణు డిట్లనెను. ''చిట్టితల్లి! నీవెందుకు విచారముగా నున్నావు? నాతో చెప్పుము''. రుక్మిణి అతనితో యిట్లనెను. ''నా భవిష్యత్తు

నా అన్న నిర్ణయించిన విషయము నీవు వినియే యుందువు. ఈ యింటిలో జరుగుచున్న సన్నాహములు నీకు తెలిసియే యుండును. ఇన్ని సంవత్సరములుగా నన్నెరిగిన నీవు నా హృదయమెవరికి అర్పితమైనదో గ్రహించియే యుందువు మరి నేనెట్లు సంతోషముగా నుండగలను?'' ఆమె కంటి నుండి కన్నీరు కారుట చూచి అత డిట్లనెను. ''కృష్ణుడు నిన్ను యీ భయంకర విధికి వదలిపెట్టడు భక్తుల యోగ క్షేమముల నతడు స్వీకరించును''.

రుక్మిణి బ్రాహ్మణునితో నిట్లనెను. ''ఈ సమయములో అనునయ వాక్యములు మాత్రమే చాలవు. నీవు ప్రత్యేకముగా యేదైన చేయవలెనని నా కోరిక''.

''నేనేమి చేయవలెనో చెప్పుము అది నేను తప్పక చేసి నీ కన్నీరు తుడిచెదను'' అని వృద్ధ బ్రాహ్మణుడు చెప్పెను తానేమి చేయవలెనో రుక్మిణి ఆ బ్రాహ్మణునకు చెప్పి తన సందేశమును కృష్ణుని కందజేయమని కోరెను. ఆమె యిట్లనెను. ''కృష్ణుడు బ్రాహ్మణ ప్రియుడని, వారి నెంతగానో గౌరవించునని చెప్పెదురు. అందుచేత నీవు నిర్భయముగా కృష్ణుని ప్రాసాదమునకు వెళ్ళవచ్చును''.

వృద్ధ బ్రాహ్మణుడు రుక్మిణి వద్ద సెలవు తీసుకుని ద్వారకా నగరము దిక్కుగా వేగముగా కదలి వెళ్ళెను.

## 221 గులాబి వర్ణములో నున్న ద్వారకా నగరము

తాను చేపట్టిన కార్యము తొందరగా జరుగవలెనను తపన చేతగాని, లేక కృష్ణుని మాయచేత గాని, వృద్ధ బ్రాహ్మణుడు త్వరలోనే ద్వారకా నగరము చేరుకోగలిగి నందుకు ఆశ్చర్యపడెను. కృష్ణుని గృహము యెక్కడ మన్నదో, అతడెక్కడ నివసించుచుండునో పసిగట్టి తొందరగా వెళ్ళెను ద్వారపాలురు గౌరవ పూర్వకముగా ఆహ్వానించి లోపలి ప్రాంగణమునకు తీసుకువెళ్ళిరి. వృద్ధ బ్రాహ్మణుడు తల పైకెత్తి చూడగా, అచ్చట ఒక బంగారు కుర్చీపై దేవాది దేవుడు కృష్ణుడు కూర్చుని యుండుట చూచెను. అతనికి సంతోషము ఉద్వేగము ముంచుకురాగా నోట మాటరాక అక్కడనే నిలుచుండి కృష్ణుని అందము తనివితీర గాంచుచుండెను. కృష్ణుడు తాను కూర్చున్న ఆసనము నుండి ఆత్రముగా లేచి బ్రాహ్మణున కెదురేగి పాదములపైబడి ఆశీర్వదింపుమని కోరెను. బ్రాహ్మణుని తోడ్కొని తాను కూర్చున్న ఆసనము వద్దకు తీసుకువెళ్ళెను బ్రాహ్మణుని ప్రయాణపు బడలిక తీరునంత వరకు కృష్ణుడు వేచియుండి, భోజనము యేర్పాటుచేసి, తర్వాత విశ్రాంతి తీసుకొమ్మని బ్రాహ్మణుని కోరెను.

బ్రాహ్మణుడు కొంతసేపు విశ్రాంతి తీసుకున్న పిదప, మృదువైన కమలము వంటి హస్తములతో కృష్ణుడు అతని పాదములొత్తియిట్లనెను ''బ్రాహ్మణోత్తమా! మీ దేశములో అందరూ ధర్మపరులేనా? నీవు నీవంటివారు మీ విధులను యెటువంటి ఆటంకములు లేక నిర్వర్తించగలుగుచున్నారా? మీ దేశ ప్రజలు సంతృప్తితో జీవించుచున్నారా? 'నాకున్నది చాలును' అనే సంతృప్తి బ్రాహ్మణులకుండి, యితర వస్తువులయందు కాంక్ష లేకున్నచో, వారు నిర్విచారముగా నుండగిలరు. హృదయమందు సంతృప్తి లేకున్నచో, ఇంద్ర పదవి యిచ్చినప్పటికిని అతడు సంతోషముగా నుండలేడు వారికున్న దానితో సంతృప్తి చెంది, ఆత్మ జ్ఞానముపై ఆసక్తితో, ధర్మ మార్గము నెన్నడును విడువక, అన్ని పరిస్థితులందు ప్రశాంతతతో, స్వచ్ఛమైన మనను

కలిగి, అహంభావము లేని బ్రాహ్మణులే గౌరవమునకు అర్హులని నా అభిప్రాయము.

''ధర్మపరులైన ప్రభువులు పాలించు దేశమునందే అటువంటి బ్రాహ్మణులు కానవత్తురు. మీ ప్రభువు సద్వర్తనుడేనా? అతడు ధర్మమార్గము ననుసరించునా? అట్లయినచో, ఆ ప్రభువు నాకు ప్రీతిపాత్రుడు.

''నీవు నన్ను చూచుటకు వచ్చినావు. నీ ప్రయాణపు బడలిక సూచనల బట్టి చాల దూరము నుండి వచ్చినట్లున్నది. అనేక నదులు, అరణ్యములు, యీ నగరము చుట్టునున్న పెద్ద కందకము దాటి నీవు నన్ను చూచుటకై వచ్చినావు. నేనేమి చేయవలెనో నీవు చెప్పినచో దానిని సంతోషముగా చేసెదను. రహస్యము కానిచో, యీ వృద్ధాప్యములో యింత దీర్ఘ ప్రయాణము యెందుకు తలపెట్టితివో చెప్పుము. అలసట చెందక విశ్రాంతి తీసుకోవలసిన వయస్సు యిది. నీపై నుంచిన నమ్మకము వమ్ము కానిచో నీవు వచ్చిన కారణము నాకు తెలుపుము''.

కృష్ణుని మాటలకు ఆ వృద్ధ బ్రాహ్మణుడు ముగ్ధుడయ్యెను. అతడు కృష్ణునితో యిట్లనెను. ''నీవు యీ లోకమునకే ప్రభుడవని యందురు. నీవు యెరుగనిది యేదియు లేదు. అయినప్పటికిని, నీవు నన్ను యెంతగానో ఆదరించి నేను యెందుకు వచ్చితినని అడుగుచుండుటచేత, నేను సంతోషముగా యే కార్యముపై వచ్చితినో వివరించెదను.

''నేను విదర్భ దేశము నుండి వచ్చినాను. ఆ దేశములో కుండినపురము ప్రధాన నగరము. ఆ దేశమును భీష్మకుడు పాలించుచున్నాడు. అతడు చాల ధర్మపరుడు. అతనికి రుక్మిణి యను పుత్రిక గలదు''. అని పలికి బ్రాహ్మణుడు ఆగి కృష్ణుని వైపు ''ఆమె గురించి వినియున్నావా?'' అనునట్లుగా చూచెను. కృష్ణుడు మాట్లాడక చిన్నగా నవ్వెను. బ్రాహ్మణుడు మరల చెప్పసాగెను. ''ఆ రాజునకు అయిదుగురు పుత్రులు కలరు. వారిలో జ్యేష్ఠుని పేరు రుక్మి. కుమార్తెకు వివాహ వయస్సురాగా, నీవు తగిన వరుడవని తలచి తన కుమార్తెను నీ కిచ్చి వివాహము చేయుటకు రాజు నిశ్చయించెను''.

మరల బ్రాహ్మణుడు చెప్పుట ఆపెను. కనులలో వెలుగు ప్రకాశించుచుండగా కృష్ణుడు యిట్లనెను. ''నేనా? తన కుమార్తెను నాకు యివ్వదలచెనా? కాని నా వద్దకు యెవ్వరును యింతవరకూ రాలేదు. నా తండ్రికి కూడ విదర్భ నుండి యెటువంటి సందేశము రాలేదు. నీవు రాజు పంపగా వచ్చిన మధ్యవర్తివా?''

బ్రాహ్మణుడిట్లు చెప్పెను. ''లేదు. అచ్చట పరిస్థితులు సానుకూలముగా లేవు. రాజు తన కుమార్తెను నీకివ్వ వలెనని తలచినాడు. కాని అతని జ్యేష్ఠ పుత్రుడు అందు కంగీకరించుట లేదు. అతడు తన సోదరిని దామఘోషుని పుత్రుడైన శిశుపాలునికి యివ్వవలెనని నిశ్చయించినాడు. అతడు చేది దేశమునకు రాజు''. కృష్ణుని వదనము గంభీరమయ్యెను. కృష్ణు డిట్లనెను ''శిశుపాలుని దుర్మార్గము గురించిన వార్తలు విన్నాను. భీష్మకుడు యీ అననుకూల వివాహమునకు అంగీకరించెనా?'' ''అంగీకరించక తప్పలేదు'' అని బ్రాహ్మణుడు చెప్పెను. ''రుక్మి చాల శక్తిమంతుడైన రాకుమారుడు. అతని మాట శాసనము''.

''అయితే మరి యిందులో నా ప్రమేయ మేమున్నది?'' అని చిలిపిగా కృష్ణుడు అడిగెను. బ్రాహ్మణుడు యిట్లనెను. ''ప్రభూ! ఎప్పటి నుండియో నీపై రుక్మిణికి ప్రేమ యున్నది. బాల్యము నుండియు ఆమెను నేనెరుగుదును. నాకు తెలిసినప్పటి నుండి ఆమె నిన్ను యెంతగా ప్రేమించుచున్నదో నే నెరుగుదును.

అటువంటి పతివ్రతకు యీ వార్త విష తుల్యము. ఆమె హృదయము బ్రద్దలయ్యెను. ఆమె నిస్సహాయ స్థితిలో యీ సందేశమును నీకు నా ద్వారా పంపినది. నన్ను సాధ్యమైనంత త్వరగా వెళ్ళి యీ సందేశమును నీకు అందజేయమని ఆమె పంపెను. అది నేను నీకు వివరించెదను. ఆ పైన అంతయు నీ చేతులలో నున్నది.

## 222 రుక్మిణీ సందేశము

వృద్ధ బ్రాహ్మణుడు నిటారుగా కూర్చొనెను. కృష్ణుడు కూర్చుని విశాల నేత్రములతో బ్రాహ్మణుని జూచుచు రుక్మిణి సందేశమును వినజొచ్చెను.

''అచ్యుతా, కృష్ణా! ఈ లోకములో నికెల్ల మిక్కిలి సౌందర్యవంతుడవని చెప్పగా విన్నాను. నీకున్న అనేక ఉదాత్త గుణముల గురించియు నీ భక్తులపై నీకు అపారమైన కరుణ గలదనియు వినియుంటిని. నారదుని వంటి గొప్ప మహర్షులు నీ గొప్పదనము, అందచందములు వర్ణించగా నేను తెలుసుకున్నాను. అనేక సంవత్సరములుగా నా చెవులు నీ వర్ణనలను విందులుగా వినుచున్నవి. నా మనస్సు యెన్నడో నీ కంకితమై పోయెను. నీపై నాకున్న ప్రేమను తెలియజెప్పుటకు నేను సిగ్గుపడుటలేదు.

''ఇన్ని గుణములు కల నిన్ను యే స్త్రీ యైనను ప్రేమించుటలో ఆశ్చర్యమేమున్నది! ఉత్తమ కుటుంబ ములో జన్మించిన నా వంటి కన్య యీ విధముగా ప్రేమను తెలుపుట అమర్యాదయని బహుశః నీవు భావింపవచ్చును. ముకుందా! వేరేదియు యెట్లు సాధ్యము? నేనేమి చేయగలను? నిన్ను ప్రేమించకుండ నుండుటెట్లు? కృష్ణా! నీవు పురుషులలో సింహము వంటి వాడవు. నేను ధైర్యము తెలినితేటలు గలదానను. నేను ఉత్తమ కుటుంబములో జన్మించినాను. నేను అన్ని విధముల నీకు తగిన పత్నిని. నన్ను పొందదగిన వాడవు నీవొక్కడవే. నీవు ఉత్తమ వంశములో జన్మించిన ఉదార పురుషుడవు, అతి సమర్థుడవు. కళలందు, ముఖ్యముగా స్త్రీలకు ప్రీతి కలిగించు కళలందు ప్రవీణుడవు. నీవు యువకుడవు, ధనవంతుడవు. నీ ఓరిమి, మధుర స్వభావము లోకములో అందరకును తెలియును. నీకు అందరి యెడల అభిమానము కలదనుటకు, నిన్ను అసంఖ్యాక ప్రజలు స్తుతించుటయే నిదర్శనము. అటువంటపుడు నావంటి స్త్రీ నిన్ను ప్రేమించి భర్తగా యెన్నుకొనక యెట్లుండగలదు? నీవు నన్ను తీసుకువెళ్ళి నీ దానిని చేసుకొనవలెను. సింహమునకు చెందవలసిన దానిని ఒక గుంట నక్కకు వదలివేయవద్దు. నా సోదరుడు నిశ్చయించిన చేది దేశ రాజపుత్రుడు నన్ను తలంచనైన తలంచకుండునట్లు చేయవలెను. అతడు నన్ను చూడక మునుపే నన్ను తీసుకొని పొమ్ము.

''నీవు నన్ను తీసుకువెళ్ళునదియు లేనిదియు నీ వద్దకు పంపిన బ్రాహ్మణుని ద్వారా నాకు తెలియగలదు. కాని ఒక విషయము జ్ఞాపక ముంచుకొనుము. నీవు నన్ను అంగీకరించుటకై నా పద్ధతిలో నేను తీవ్ర తపస్సు చేసినాను. అనేక దానములు చేసినాను. అగ్నిదేవుని అర్చించినాను. అర్హులైన వారికి సువర్ణ దానము, యితర కానుకలు యిచ్చితిని. ఎన్నో నోములు, వ్రతములు ఆచరించితిని. పెద్దలను బ్రాహ్మణులను యెప్పుడును గౌరవభావముతో చూచుచుందును. నేను గావించిన యీ కృత్యములన్నియు నా కోరికను, అనగా నీ దాననగుట, తీర్చవలెను. నీవు మాత్రమే నా చేయి నందుకొనవలెను, కాని దామఘోషుని కుమారుడు కాదు. నీవు నా ప్రేమ నంగీకరించగలవను నమ్మకములో నేను జీవించి యుంటున్నాను. కర్మవశాత్తు, నీవు రాకపోయి,

ఆ నీచుడు నన్ను ముట్టినచో, నీతో యెడబాటు వలన కలిగిన విరహాగ్నిచేత దగ్ధమై మరణించెదను. పద్మములవంటి నీ నేత్రములు నేను మరణించునపుడు నా మనస్సులో స్థిరముగా నిలిచియుండుటచేత నేను మరణించుచున్నందుకు విచారించను. కాని నీకు సర్వము సమర్పించిన భక్తురాలిని రక్షించలేదను కళంకము అంటగా నీవు బాధపడెదవు.

''బహుశః నన్ను యే విధముగా తీసుకువెళ్ళగలనని యోచించుచున్నావు కాబోలు. నీవు యీ విధముగా అనుకొనుచుండవచ్చును. 'రుక్మిణీ! నీ తండ్రి, సోదరుడు యిది వరకే నీకు వరుని నిశ్చయించినారు. మరి నీవు కోరిన విధముగా నేనెట్లు చేయగలను?' నీ శక్తి అసమానమైనదని నిన్ను జయించగలవారెవరును యీ లోకములో లేరని నేనెరుగుదును. వివాహమున కొక రోజు ముందుగా మా నగరమునకు దయచేయుము. నీ సేనలతో శిశుపాలుని, జరాసంధుని నాశనము చేసి నన్ను బలవంతముగా రాక్షస పద్ధతిలో తీసుకుపొమ్ము. క్షత్రియులలో కన్య బంధువులు ఆమె యెన్నుకున్న వాని నంగీకరించనిచో, యీ పద్ధతిలో వివాహము జరుగుట సవ్యమేయని నీకు నేను వేరుగా చెప్పనవసరము లేదు.

''నీకు మరొక సందేహము కలుగవచ్చు. నీవు యిట్లు అనవచ్చు. 'నిన్ను బలంతముగా తీసుకొనిపోవుటకు అంతఃపుర స్త్రీ లుండెడి ప్రాంగణములో ప్రవేశించునపుడు అమాయకులైన స్త్రీలను, రక్షక భటులను బాధించవలసి వచ్చును. అది సరి యగునా?' ఈ సమస్యకు నేనొక పరిష్కారము సూచించెదను. వివాహమునకు ముందురోజు పెండ్లి కూతురు అంతఃపురము నుండి బయటకు వచ్చు ఆచారము గలదు. మంగళవాద్యములు మ్రోగుచుండగా వధువు గౌరీ పూజ చేయుటకు పార్వతీ దేవి గుడికి నడచి వెళ్ళును. గుడి రాజ సౌధమునకు కొంత దూరములో నున్నది. నేను రాజసౌధము నుండి బయటకు వచ్చినపుడు, అందరును చూచుచుండగా నీవు నన్ను తీసుకుపోవుట సులభము. గొప్ప గొప్ప సాధువులు వారి తమో గుణము నివృత్తి యగుటకు నీ పాద ధూళిని కోరుదురు. ఆ పాద ధూళియే నేను జీవించి యుండునట్లు చేయగలదు. నా హృదయములోని కోరిక యే కారణము చేతనైన తీరకున్నచో, యిప్పటికే ఉపవాసములతో, వ్రతములతో శుష్కించిన యీ శరీరమును వదలిపెట్టుదును. రాబోవు జన్మలోగాని, లేక ఆపై జన్మలోగాని నీవు నన్ను స్వీకరించగలవను ఆశతో కన్నుమూసెదను. వందలకొలది జన్మలు యెత్తినప్పటికిని, చివరకు నీవే నా భర్తవు కాగలవు. అప్పటి వరకు నీ అనుగ్రహము కొరకు ప్రార్థించుచు వేచియుండెదను''.

సందేశము పూర్తి అయ్యెను. బ్రాహ్మణుడు ఒక క్షణమాగి యిట్లనెను. ''ప్రభూ! రుక్మిణి యీ సందేశమును అందజేయమని కోరినది. విషయము లన్నియు మీ ముందుంచినాను. ఇక యేమి చేయుదురో మీరే నిర్ణయించు కొనవలెను''.

కృష్ణుడు లేచి నిలుచుండెను. బ్రాహ్మణుని చేతులు తన చేతిలోనికి తీసుకుని చిరునవ్వు నవ్వి కృష్ణుడిట్లనెను. ''అనేక సంవత్సరములుగా నాకు కూడ రుక్మిణిపై ప్రేమ యున్నదని నీతో చెప్పుటకు నేను సిగ్గుపడను. నన్ను గురించి నా గుణముల గురించి విని ఆమె యెట్లు నన్ను ప్రేమించుచున్నదో నేనును అట్లే ప్రేమించుచున్నాను. నారదుడు ఆమె గుణగణములను వర్ణించి నాకు చెప్పెను. అతడు నాకిట్లు చెప్పెను. 'ఆమె సువర్ణచ్ఛాయతో ప్రకాశించుచుండును. నల్లని కేశములు, చంద్రబింబము వంటి వదనము, భీతి చెందిన లేడి కన్నులవంటి నేత్రములు ఆమెకు అందము చేకూర్చుచున్నవి. చిన్నదైన తిన్నని నాసిక, మల్లెపువ్వులవంటి ఆమె పలువరుస, అందరిని ఆకట్టుకొను చిరునవ్వు, కోయిల కంఠ స్వరము, ఆలిచిప్పల వంటి చెవులు

ఆమె శోభను యినుమడింపజేయు చున్నవి ఆమె పెదవులు బింబఫలము కన్న యెరుపు ఆమె యెఱ్ఱని పాదములు అతి కోమలమైనవి మృదువైన ఆమె చేతులందు శంఖ చక్ర చిహ్నములు గలవు. అరటి బోదెలవలె ఆమె తొడలు మిక్కిలి నునుపారినవి. ఆమె పిరుదులు అందముగా నుండును ఎప్పుడును చిరునవ్వుతో ప్రశాంతముగా హంసవలె నడచుచుండును'

''నారదుడు ఆమె గురించి చెప్పినప్పటి నుండి ఆమెను చేబట్టవలెనని నిశ్చయించుకుంటిని. ఆమెను నాకిచ్చి వివాహము చేయునట్లు ఆమె తండ్రి యోచించుచున్నాడని నారదుడు చెప్పెను ఆమె నాకీ సందేశము పంపకమునుపే, ఆమె సోదరుడు నన్ను ద్వేషించుచున్న కారణముగా తండ్రి సంకల్పమునకు విఘ్నము కలిగెనని విన్నాను. అప్పటి నుండి నాకు రాత్రులందు సరిగా నిద్ర రాకుండెను.నా కనులు చూడుము! అవి యెఱ్ఱగా లేవా? అవి అలసినట్లు నీకగుపించుచున్నవా?''

ఒక క్షణమాగి కృష్ణుడు తిరిగి యిట్లనెను. ''ఈ క్షణమే క్షత్రియ కులమునకు అపకీర్తిని తెచ్చు ఆ పాపాత్ములను నాశనము చేసెదను వారి కనులముందే అందమైన రాకుమారి రుక్మిణిని యెత్తుకువచ్చి నాతో యీ ద్వారకా నగరమునకు తీసుకు వచ్చెదను తన హృదయమును నా కర్పించిన రుక్మిణిని నేను వదలిపెట్టను''.

ఇక రెండు రోజులలో వివాహము జరుగిబోవుటచేత యెక్కువ వ్యవధి లేదని కృష్ణుడు గ్రహించెను. కృష్ణుడు రథసారథి దారుకుని పిలిచి యిట్లనెను. ''రథము సిద్ధము చేయుము, నేను వెంటనే వెళ్ళవలెను''.

కృష్ణునికి అభిమానమైన శైబ్య, సుగ్రీవక, మేఘ పుష్ప, వలాహకములను అశ్వములను పూన్చి రథమును దారుకుడు ద్వారము వద్దకు తీసుకువచ్చి కృష్ణుని కెదురుగా ''రథము సిద్ధముగా నున్నది'' అని తెల్పునట్లుగా నిలుచుండెను

కృష్ణుడు బ్రాహ్మణుని రథ మెక్కించి తర్వాత తాను రథము నధిరోహించెను గాలి కంటె వేగముగా అశ్వములు పరుగెత్తుచుండెను రాత్రి అంతయు ప్రయాణము చేసెను. మరునాటి ఉదయము విదర్భ చేరిరి.

ఈలోపుగా బలరాముడు, కృష్ణుడు హుటాహుటిగా విదర్భకు వెళ్ళెనని తనతో రుక్మిణిని తీసుకు రాగిలడని వినియుండెను విదర్భలో యితరులు అల్లకల్లోలము సృష్టించగలరని ఊహించి బలరాముడు యాదవ సైన్యమును తోడ్కొని త్వరగా విదర్భకు బయలుదేరెను

## 223 రుక్మిణి నిస్పృహ చెందుట

భీష్మకుడు పెళ్ళి యేర్పాటు లన్నియు గావించెను. కుండిన నగరము పండుగ కళతో శోభిల్లుచుండెను. వీధులలో పన్నీరు జల్లిరి ప్రతి గృహమును పువ్వుల తోరణములతో అలంకరించిరి. స్తంభములకు రంగు రంగుల కాగితములు చుట్టి పలుచోట్ల పతాకముల నెగురవేసిరి. రాకుమారి వివాహము జరుగనున్నదన్న సంతోషముతో ప్రజలందరును మంచి మంచి పట్టు వస్త్రములు ధరించి ఉత్సాహముగా నుండిరి. రాజసౌధ ములో హడావిడిగా నుండెను సన్నాహములు అంతులేక కొనసాగుచుండెను పేదలకు అన్నదానము జరిగెను

బ్రాహ్మణులకు విందుచేసి గౌరవించి పట్టు వస్త్రములు, బంగారము కానుకలుగా నొసగిరి. మరుచటి రోజు పెండ్లి కుమార్తె కాబోవుచున్న రాకుమారిని ఆశీర్వదించమని బ్రాహ్మణులను కోరిరి వేద మంత్ర పఠనముతో రాజసౌధము ప్రతిధ్వనించుచుండెను. పుర స్త్రీలు రుక్మిణి చుట్టును చేరి పెండ్లి పాటలు పాడుచుండిరి. ఆమెకు నూతన వస్త్రములు ధరింపజేసి ఆభరణములు తొడిగిరి. దుష్టుల దృక్కులు ఆమెపై ప్రసరించకుండుటకు ఆమె ముంజేతికి పసుపు త్రాడు కట్టిరి

చేది దేశపు రాజు దామఘోషుడు తన కుమారుడైన శిశుపాలునకు అర్హమైన విధముగా అలంకారము జేసి విదర్భకు తీసుకువచ్చెను అతడు పెద్ద సైన్యమును వెంటబెట్టుకుని ముందుగానే నగరమునకు వచ్చెను. భీష్మకుడు వారిని గౌరవ పురస్సరముగా ఆహ్వానించి, ప్రత్యేకముగా వారికేర్పాటు చేసిన విడిదికి తీసుకువెళ్ళెను. శిశుపాలునితో జరాసంధ, సాళ్వ, దంతవక్త్ర విదురథ, పౌండ్రకులు కూడ వచ్చిరి వారందరును బలరామకృష్ణులకు బద్ధశత్రువులు వారు కూడ తమ సైన్యముతో వచ్చిరి భీష్మకుడు రుక్మిణిని కృష్ణుని కివ్వవలెనని సంకల్పించినట్లును, కాని రుక్మి అందుకడ్డుపడి యీ 'గండము' తప్పించిన విషయమును వారందరును బాగుగా యెరుగుదురు అందుచేత యే కారణము చేతనైన క్లిష్ట పరిస్థితులు యెదురైనచో శిశుపాలునికి సహాయపడవచ్చునన్న తలంపుతో వారు సేనాబలముతో తరలివచ్చిరి.

రుక్మిణికి పరిసరములందు ఆసక్తి లేక యుండెను. అందరిలోనున్న ఉత్సాహము, సంతోషము ఆమెలో కన్పించకుండెను సన్నాహములు చురుకుగా సాగుచుండగా, ఆమె కేవలము బొమ్మవలె కూర్చుని యుండెను. ఆమె హృదయము కృష్ణునిపై నుండెను ఆమె పంపిన దూత, వృద్ధ బ్రాహ్మణుడు ద్వారక నుంచి రాకుండుటచేత ఆమె మనస్సు అల్లకల్లోలముగా నుండెను. ఆమె యిట్లు తలంచెను. ''ఇంక ఒక్క రాత్రి మాత్రమే మిగిలియున్నది. తర్వాత రోజే పెళ్ళి రోజు. కృష్ణుడు గాని వృద్ధ బ్రాహ్మణుడు గాని యింతవరకు రాలేదు. నన్ను పెళ్లి చేసుకొనుట యందాసక్తియున్న కృష్ణుడు, నేను లజ్జారహితముగా అతనిని ప్రేమించుచున్నానని కబురు పంపినందుకు బహుశః మనస్సు మార్చుకొని రాకపోవచ్చును. నామీద అమితమైన అభిమానముగల బ్రాహ్మణుడు యీ విషయము నాతో చెప్పలేక యిక్కడకు రాకపోయి యుండవచ్చును. తప్పక అదియే జరిగియుండును. లేక బహుశః నా దురదృష్టము కొలది దారిలో యేదైన ఆటంకము సంభవించి వచ్చుట ఆలస్యమయి ఉండవచ్చును లేక దేవతలకు ఆగ్రహము కలిగి, వారి ఆగ్రహము నాకీ దుర్భర పరిస్థితి కలిగించెనా? నేను గాని నిర్లక్ష్యముగా దేవుని పూజించితినా? అట్లు జరుగుటకు వీలులేదు. పరమ దైవమైన మహాదేవుడు నావంటివారు చేయు తప్పులను మన్నించగల కరుణామయుడు. నేను యేదైన నేరము చేసి అతనికి ఆగ్రహము కలిగించినచో, నిత్యము నేను ఉపాసించు పార్వతీదేవి ఏల ఉదాసీనముగా నున్నది? స్వతస్సిద్ధముగా ఆమె కరుణామయి. రుద్రుని సాహచర్యముచేత ఆమెకూడ అతనివలె ఆగ్రహము చెంది యుండవచ్చును నేను ఆత్మహత్య చేసుకొందునని ఆమెకు తెలిసినప్పటికిని, ఆమె నన్ననుగ్రహించుటలేదు. పర్వత రాజ పుత్రిక యగుటచే ఆమె హృదయము పాషాణముగా నుండుట సహజమే మరి!''

ఈ విధముగా రుక్మిణి మనస్సు అల్లకల్లోలమై యుండగా కన్నులు మూసుకుని నిశ్శబ్దముగా కూర్చుండెను. కృష్ణుడు వచ్చుటకు యింకా సమయము కలదను ఆలోచన రాగా ఆమె కొంచెము ఊరట జెందెను. ఆమె కన్నీరు నెవరును చూడరాదని ఆమె తలచెను కనులు మూసుకుని తనలో తానీ విధముగా అనుకొనెను ''నిస్పృహ రానీయను సమయము మించిపోలేదు. అతడు వచ్చుటకు యింకను అవకాశము గలదు. నేను యిప్పుడే మరణించరాదు. అతడు వచ్చి, ప్రాణములు వదలిన నన్ను చూసి అతడేమగును? అతని యందు

నా విశ్వాసము గురించి యేమనుకొనును?''

అకస్మాత్తుగా రుక్మిణికి యెడమ కన్ను అదిరినట్లు తోచెను. ఎడమ తొడ, యెడమ భుజము కూడ అదిరెను. ఇవి కలుగబోవు మంచికి చిహ్నములని తలచెను. ఆమె హృదయము తేలికపడెను. ఆశ అంతరించలే దని ఆమె భావించెను.

ఈలోపుగా కృష్ణుడు నగరపు పొలిమేరలలో నున్న తోటను చేరెను. వృద్ధ బ్రాహ్మణుని రాజసౌధమునకు వెళ్ళి రుక్మిణి కష్టములు తీరెననియు తాను వచ్చినట్లు రుక్మిణితో చెప్పమనియు కృష్ణుడు పంపెను. కన్నీరు నిండిన కనులు తెరిచిన రుక్మిణికి దూరముగా పరిచయమున్న రూపము కన్పడెను. కన్నులు తుడుచుకుని మరల అతని వైపు చూచి ఊహ కాదని స్పష్టముగా తెలుసుకొనెను. వృద్ధ బ్రాహ్మణుడు చివరకు వచ్చెను! అతడామెను వడివడిగా సమీపించుచుండెను. అతని ముఖమందు చిరునవ్వు చూచి అతడు మంచి వార్తను తెచ్చుచున్నాడని తెలుసుకొనెను. ఆమె అటు నిటు తిరిగి నిస్పృహ నిండిన వదనముతో కూర్చున్నదని ఆ బ్రాహ్మణుడు చూచెను. అత డామె వద్దకు తొందర తొందరగా వచ్చెను. అతనిని చూచి ఆమె కన్నులతో ప్రశ్నించెను. కృష్ణుడు నగరమునకు వచ్చెనన్న సందేశమును ఆమె కతడు అందజేసెను. యథాలాపముగా ఆమె బ్రాహ్మణుని ప్రక్కకు తీసుకువెళ్ళి యేమి జరిగెనో వివరించమని యడిగెను. అతడు ద్వారకను సందర్శించిన వృత్తాంత మంతయు వివరముగా చెప్పి, ఆమె యందు కృష్ణునకు గూడ ప్రేమ యున్నదని, తనతో చెప్పిన విషయము తెలిపెను. ఆమె కనుల నుండి కన్నీరు కారుచుండెను. ఆమె ఆ బ్రాహ్మణునితో యిట్లనెను ''నీ అభిమానమునకు నేను యేమి ప్రతిఫలము యివ్వవలెనో తెలియకున్నది. నేను చేయగలిగినది ఒక్కటే'' యని అతని పాదములపైబడి కన్నీటితో అభిషేకము చేసెను.

బలరామకృష్ణులు నగరమునకు వచ్చిరన్న వార్త భీష్మకునకు తెలిసెను. వివాహ మహోత్సవములో పాల్గొను టకు వారు వచ్చిరని అతడు భావించెను. అతడు వారి వద్దకు వెళ్ళి, పాలు తేనె, విలువైన వస్త్రములు, మణులు సమర్పించెను. భీష్మకుడు తన మనస్సులో కృష్ణుని వరునిగా నెంచెను. ఆ స్థానము మరి యొకరు తీసుకొనిరన్న ఆలోచన అతనికి మిక్కిలి విచారము కలిగించెను. కృష్ణుని ఆదరముతో కాబోయే అల్లుడను భావముతో ఆదరించి గౌరవించెను. వారికి ప్రత్యేకముగా యేర్పాటుచేసిన నివాసమునకు తీసుకువెళ్ళి, వివాహమునకు వచ్చి ఆనందము కలిగించమని వారిని ప్రార్థించెను. కృష్ణుడు నవ్వి యిట్లనెను ''నీకేమియు భయము వద్దు. నేను అందుకే - నీ కుమార్తె వివాహము కొరకే - వచ్చినాను''. బలరాముని వదనము గంభీరముగా గోచరించెను. భీష్మకుడు వెళ్ళిపోయిన తర్వాత అన్నదమ్ము లిద్దరును చాలసేపు ముచ్చటించుకొనిరి.

బలరామకృష్ణులు వచ్చినారని విన్న ప్రజలు, వారిని చూచుటకై రాజసౌధములో వారు నివసించుచున్న ప్రదేశమునకు వెళ్ళిరి. వారు యిట్లనుకొనిరి. ''రుక్మిణిని కృష్ణుడు వివాహమాడినచో బాగుండెడిది. చిలుకా గోరింకల వలె వారు ఒకరికొకరు సరిపోవుదురు! మనమే గనుక యింతకు ముందు జన్మలలోను యీ జన్మలోను పుణ్యము ఆర్జించి యున్నచో ఆ పుణ్యమును, కృష్ణుడు రుక్మిణిని వివాహమాడునట్లు భగవంతుడేర్పాటు జేసినచో, పణముగా నర్పించుదము''. వారు ఆ విధముగా గుసగుసలాడిరి. కృష్ణునిపై ద్వేషముగల రుక్మి తమ మాటలను వినినచో శిక్షించునని భయపడి, తమ భావములను వ్యక్తీకరించుటకు ధైర్యము లేక యూరకుండిరి.

# 224 రాకుమారి దేవాలయమునకు నడచివెళ్ళుట

రాకుమారి లోపలి ప్రాంగణము నుండి బయటకు వచ్చి పార్వతీదేవి గుడికి వెళ్ళవలసిన తరుణము వచ్చినది. అన్నివైపుల ఖడ్గములు ధరించిన రక్షకభటుల మధ్య రుక్మిణి మెల్లమెల్లగా అడుగులు వేయుచు నడచుచుండెను. ఆమెతో తల్లి, చెలికత్తెలు, రక్షక భటులు వెళ్ళిరి. ఆమె మనస్సు కృష్ణుని యందే యున్నది. సగము మూతబడిన కనులతో ఆమె మైకములో నడచుచున్నట్లుండెను. ఆమె వెనుక గౌరీదేవి పూజకు అవసరమగు వస్తువులను తీసుకుని అనేకమంది స్త్రీలు పెద్ద ఊరేగింపుగా వెళ్ళిరి.

సంగీతము వేద మంత్రోచ్చారణల మధ్య రాకుమారి గుడిని చేరెను. ఆమె పాదములు, చేతులు కడుగుకొని కనులు తుడుచుకొనెను. వృద్ధ బ్రాహ్మణ సువాసినులు ఆమె చేయి పట్టుకుని దేవి మందిరములోనికి తీసుకువెళ్ళిరి. రుక్మిణి యిట్లు ప్రార్థించెను. ''దేవీ మాతా! కృష్ణుని నా భర్తగా చేయుము. నాకున్న ఒకే ఒక కోరికను ప్రసాదింపుము. నన్ను కృష్ణుని దానిగా చేయుము''. ఆమె దేవిని అర్చించి వృద్ధ వనితలు సూచించినట్లుగా పూజ చేసెను. వారి పాదములకు నమస్కరించిన తర్వాత వారిచ్చిన ప్రసాదము గైకొనెను. ఆమె చేసిన ప్రార్థనతో యింతవరకు పాటించిన మౌనవ్రతము సమాప్తమయ్యెను. తన చెలికత్తె భుజముపై విలువైన రాళ్ళు పొదిగిన ఉంగరములు ధరించిన వ్రేళ్ళునుంచి, రాకుమారి రుక్మిణి దేవి మందిరము నుండి బయటకు వచ్చెను.

వివాహమునకు వచ్చిన రాకుమారులందరును అచట సమావేశమై ఆమె అందమును కనులార గాంచుచుండిరి. మిక్కిలి చిన్నదైన ఆమె సన్నని నడుము, చుట్టును బంగారు వడ్డాణము ఉండుటచేత, గోచరించుచుండెను. ఆ వడ్డాణమునకు అమర్చిన మణులు చూపరుల దృష్టిని ఆకర్షించి, ఆమె నడుమును మెచ్చుకొనునట్లు చేసెను. చెవులకున్న తాటంకములు గాలికి ఊగుచుండెను. లేడి కనుల వంటి నేత్రములతో, వెన్నెలవంటి చిరునగవుతో, హంసవలె వయ్యారముగా మెల్లమెల్లగా నడుచుచున్న ఆమె అసమాన సౌందర్యమును చూచి వారికి మూర్ఛ వచ్చినట్లయ్యెను. కొందరు నిజముగానే మూర్ఛిల్లిరి.

అచ్చటనే యెక్కడనో కృష్ణుడు ఉండగలడని అక్కడ నుండి తనను తీసుకువెళ్ళగలడని రుక్మిణికి తెలియును. ఆమె యెర్రని పెదవులపై సన్నని దరహాసము చిందగా, ఆమె వేయు అడుగులలో ఆతురత గోచరించెను. అయినప్పటికిని త్వరగా నడిచి వెళ్ళుటకు ధైర్యము చాలకుండెను. ఆమె అట్లు చేయలేకపోయెను. తిరిగి గుడి నుండి రాజసౌధమునకు నడిచి చేరిన పిదప తాను బయటకు వచ్చు అవకాశమును కోల్పోవును. కృష్ణుని చూడవలెనను ఆతురత ఆమెను ముంచెత్తుచుండెను. గాలికి ఆమె నల్లని కేశములు యెగిరి ముఖము మీద పడుచుండెను. ఎడమ చేతితో కురులను వెనుకకు త్రోయుచు ఆ నెపముతో కనులెత్తి తన హృదయనాథుడు కనుపించునేమోయని కలయజూచెను.

అదే సమయములో అతని ఉనికిని గుర్తించి రుక్మిణి పైకి చూచెను. దివ్య మనోహర రూపముతో రథముపై నిలుచుని చెయ్యి చాపుచున్న కృష్ణుని ఆమె గాంచెను. కృష్ణుడు రథము నుండి బయటకు వంగి ఆమె కుడి చేతిని గట్టిగా పట్టుకుని అమాంతముగా ఆమె నెత్తి రథములో కూర్చుండబెట్టెను. అందరును యేమి జరిగెనోయని చూచునంతలోపుగా అశ్వముల నదలించి రథసారథి వేగముగా రథమును తోలుకుని వెళ్ళెను. బలరాముడు, మిగిలిన యాదవ బలము అతని వెంట మెల్లగా వెళ్ళిరి. గుంట నక్కల మధ్య నుండి తన

ఆహారము గైకొని తీవిగా నడచివెళ్ళు సింహము వలె కృష్ణుడు రుక్మిణిని తీసుకు వెళ్ళిపోయెను

ఒక క్షణము విశ్శబ్దము ఆవరించెను. ఆ తర్వాత వివాహమునకు వచ్చిన రాజుల మధ్య అల్లకల్లోలము చెలరేగెను సాళ్వ జరాసంధులు, తదితరులు తమ మిత్రునకు జరిగిన అవమానము సహించలేక యిట్లనిరి ''క్షత్రియునకు చెందవలసిన రాకుమారిని ఒక గొల్లవాడు తీసుకుపోవుచుండగా చేతకాని దద్దమ్మల వలె మనము నిలుచుండుట సిగ్గుచేటు''.

వెంటనే వారు రథముల నెక్కి సేనా బలముతో తరలి వెళ్ళి, కృష్ణుని రథము దాటి తమ మిత్రుని వధువును తిరిగి తీసుకువచ్చుటకు తీవ్రముగా ప్రయత్నించిరి· బలరాముని దూరదృష్టి వారి ప్రయత్నములను వమ్ము చేసెను. యాదవ సేనలు వారి కడ్డు నిలిచి ముందుకు సాగనివ్వకుండజేసెను రథముపై నుండి రుక్మిణి జరుగుచున్న యుద్ధము చూచి భీతిల్లెను. ఆమె అందమును తనివితీర గ్రోలుచున్న కృష్ణుడు యిట్లనెను ''భయ పడకుము శత్రుసేనలు పూర్తిగా నీ సేనచేత హతమగును'' సిగ్గుచేత ఆమె ముఖము యెర్రబడి, పైకెత్తి కృష్ణుని చూడకుండెను కాని చిరునవ్వు చిందు కనులతో తన్ను తదేకముగా కృష్ణుడు చూచుచున్నాడని ఆమెకు తెలుసును

# దశమ స్కంధము - ఉత్తర భాగము

## 225 రుక్మి నిరాశ చెందుట

రాజులందరును అపజయము నంగీకరించి తలలు వాల్చుకుని తిరిగి వచ్చిరి. జరాసంధునితో కలసి వారందరు శిశుపాలుని వద్దకు వెళ్ళిరి. ఆకస్మాత్తుగా తన సంపదను కోల్పోయిన ధనవంతునివలె శిశుపాలుడు గోచరించుచుండెను. అతడు చాల విచారముగా నుండెను. మరియు క్రోధముతో, నైరాశ్యముతో అతని ముఖము నల్లబడెను. వచ్చిన మిత్రులను ప్రశ్నార్థకముగా చూచెను. వారు నిస్పృహ వెలిబుచ్చిరి. జరాసంధుడు శిశుపాలునితో నిట్లనెను. ''మిత్రమా! జరిగిన దానిని మరచిపొమ్ము. ఆ విషయమై ఆందోళన చెందవద్దు. ఈ లోకములో సుఖముగాని దుఃఖముగాని యేదియు శాశ్వతము కాదు. విధి ఆడించినట్లుగా ఆయా పరిస్థితులలో మానవుడు వర్తించక తప్పదు. వానిని లెక్కచేయక తన పనులను తాను కొనసాగించుచుండవలెను. విధి చేతిలో మానవుడు ఒక ఆటబొమ్మ. దారములాగి తన యిచ్ఛవచ్చిన రీతిగా కొయ్యబొమ్మలను బొమ్మలాటవాడు ఆడించినట్లుగా, మానవుడు సృష్టికర్త యిష్ట ప్రకారము నడచుకొనవలసి యున్నది. నా విషయము చూడుము. ఎన్ని పర్యాయములు యీ కృష్ణుని చేతిలో పరాజయము పొంది వెనుకకు తిరిగి నా రాజ్యమునకు వచ్చితినో యోచింపుము. కృష్ణుని మాయ అందరకును తెలిసినదే. నేను ఒక విషయము తెలుసుకున్నాను. ఈ లోకము కాలముతో కూడిన విధిచేత నడుచుచున్నది. అందుచేత అన్నిటిని సమబుద్ధితో తీసుకొనుట నేర్చితిని. విధి ప్రాబల్యము కాకపోయినచో మన అందరి సైన్యము చిన్నదైన బలరాముని సైన్యము చేత యెట్లు ఓడిపోయెను? కొంతకాలము వేచి యుండుము. త్వరలో పరిస్థితులు మారి అనుకూలించగలవు. ఏదో ఒక రోజు విధి మన కనుకూలముగా నుండగలదు. అప్పుడు మనము జయించెదము, వారు ఓడిపోదురు''.

జరాసంధుడు పలికిన పలుకులలో ఒక్క పలుకైనను శిశుపాలుని ఉపశమింప జేయలేకపోయెను. చేయవలసిన కార్యమేదియు లేకుండుటచేత శిశుపాలుడు స్వదేశమునకు తిరిగి వెళ్ళెను. జరిగిన సంఘటనలు భీష్మకునికి మిక్కిలి సంతోషము కలిగించెను. రుక్మి ఆగ్రహముతో మండిపడెను. ఒక అక్షౌహిణి సైన్యము సమకూర్చుకుని కృష్ణుడు వెళ్ళిన దిక్కువైపుగా వెళ్ళెను. అతడు కృష్ణుని సంహరింప సమకట్టెను. బయలుదేరు ముందు చేతిలోనికి ధనుస్సు తీసుకొని యీ విధముగా ప్రతిజ్ఞ గైకొనెను. ''కృష్ణుని సంహరించి రుక్మిణిని విడిపించునంత వరకు నేనీ నగరము నందు అడుగుపెట్టను''.

వేగముగా నడిపి కృష్ణుని రథమును దాటి వెళ్ళుమని సారథికి చెప్పెను. బహుశః రుక్మి తన్ను వెంబడించి రావచ్చునని కృష్ణుడు ఊహించి కాబోలు తన రథమును మెల్లగా పోనిచ్చుచుండెను. మెల్లగా పోవుచున్న రథమును, అందు తన సోదరిని ఆమెను గొనిపోవుచున్న కృష్ణుని రుక్మి గుర్తు పట్టెను. దగ్గరకు వచ్చి ''ఆగు! ఆగు! దొంగా! నా సోదరిపై చెయ్యి వేయుటకు నీకెంత ధైర్యము?''

రుక్మి మూడు అమ్ములను తన వింట నుండి కృష్ణుని పై వదలెను. మరియు అమ్ములకన్న పదునైన వాడి మాటలతో కృష్ణుని అవమానపరచి బాధించెను. కృష్ణుడు నవ్వుచునే యుండెను. కృష్ణుడు విల్లెక్కుపెట్టి ఆరు అమ్ములను వదలగా అవి రుక్మికి అతని నాలుగు గుర్రములకు తగిలెను. తరువాత ప్రయోగించిన రెండు అమ్ములు రథసారథిని గాయపరచెను. తరువాత వదలిన మూడు అమ్ములకు రథముపైనున్న పతాకము విరిగి

క్రిందపడెను. అయినప్పటికిని రుక్మి యుద్ధము కొనసాగించుచుండెను కృష్ణుడు ఆగ్రహము చెందక యెప్పటివలెనే యుండెను. రుక్మి ఒకదాని తర్వాత నొక బాణము వరుసగా వదలుచుండెను. కృష్ణుని వద్దకు వచ్చుసరికి అవి విరిగి రెండు ముక్కలగుచుండెను తరువాత రుక్మి యితర ఆయుధములు ప్రయోగించెను. కృష్ణుడు వదలిపెట్టిన అమ్ములు వానిని ఛిన్నాభిన్నము గావించెను రుక్మి రథము నుండి గెంతి ఒర నుండి కత్తి తీసి కృష్ణుని చంపుటకు, దీపము చెంతకు వచ్చు పురుగువలె, దూసుకు వచ్చుచుండెను. కృష్ణుడు అతని కత్తిని ముక్కలు ముక్కలు చేసి, తన కత్తిని తీసి రుక్మిని చంపబోయెను

రుక్మిణి సోదరుని కొరకు భయముతో వణకెను. కృష్ణుని పాదములపైబడి ఆమె యిట్లనెను. ''దయచేసి నా సోదరుని చంపవద్దు. అతనిని సంహరింపకుండ వదలి పెట్టమని నిన్ను ప్రార్థించుచున్నాను''. ఆమె భయముతో వణకు చుండెను. వదనము తెల్లగా పాలిపోయెను. ఆమె సోదరుని కొరకు ప్రార్థించునపుడు తత్తరపడుచున్న మాటలతో ఆమె స్వరము నీరసముగా నుండెను. కృష్ణుడు రుక్మిని చంపక వదలివేసెను. రుక్మి వెంట్రుకలు, మీసము గొరిగి విరూపిని జేసి అవమానపరచెను

ఆ సమయమునకు యాదవ సైన్యము బలరామునితో అక్కడకు చేరెను రుక్మి పరిస్థితి చూచి జాలిపడి బలరాము డిట్లనెను.

''కృష్ణా! నీవు రుక్మిని యిట్లు విరూపిని చేయకుండ వలసినది''. అటు తర్వాత రుక్మిణికి ఉపశమనము కల్గించుటకై యిట్లు పలికెను ''సోదరునిపై నీకున్న ప్రేమ చేత నీవు బాధపడుచున్నవు. కాని నీవు బాధపడవలసిన అవసరము లేదు నా మాట నమ్ముము పరిస్థితుల ప్రోద్బలముచేత కృష్ణుడు నీ సోదరుని అవమానించెను ఈ విషయము తలపున నుంచక తేలికపడిన హృదయముతో హాయిగా కృష్ణుని వెంట వెళ్ళుము. నీ ప్రార్థనలు విని కృష్ణుడు రుక్మిని ప్రాణములతో వదలిపెట్టినాడు''

యాదవ సైన్యము ద్వారకవైపు కదిలివెళ్ళెను గరుడ పతాకము యెగురుచుండగా కృష్ణుని రథము సాగిపోయెను. కొంతసేపటికి దూరముగా ఒక రేణువు వలె గోచరించి మరికొంత సేపటికి అదికూడ అదృశ్యమయ్యెను రథము అదృశ్యమైన పిదప దాని వెనుక రేగిన ధూళిని చాలసేపటి వరకు రుక్మి గమనించుచు నిలుచుండెను తిరిగి తన నగరమునకు వెళ్ళక అక్కడే యుండెను. ఆ తర్వాత అక్కడ నొక నగరము నిర్మించి, అందు రుక్మి నివసించుచుండెను

## 226 ప్రద్యుమ్నుడు

దక్ష యజ్ఞమందు సతీదేవిని కోల్పోయిన తర్వాత మహాదేవుడు హిమవత్పర్వతముపై ధ్యానములో మునిగి తపస్సు చేయుచుండెను సతీదేవి పర్వత రాజైన హిమవంతునకు పుత్రికగా జన్మించి పార్వతి (పర్వతరాజు కుమార్తె)గా ప్రసిద్ధికెక్కెను. ఆమె మహాదేవునికి భార్య యగుటకు నిశ్చయించుకుని తపస్సు చేయుచున్న మహాదేవునికి సేవలు చేయుచుండెను. తపస్సులో మునిగిన మహాదేవుడు ఆమెను పట్టించుకొనలేదు

పార్వతీ మహాదేవులకు జన్మించు పుత్రుడు, కుమారస్వామి దేవతలకు సేనాధిపతి కాగలడని దేవతలకు

తెలిసెను. ఇది తొందరగా జరుగవలెనని ఇంద్రుడు సంకల్పించెను. ప్రేమకు అధిపతియైన దైవము మన్మథుడు. ఇంద్రుడు మన్మథుని, తపస్సు చేయుచున్న మహాదేవుని వద్దకు పంపెను. మన్మథుని వెంట వసంతుడు వెళ్ళెను. వసంతము నందు స్వచ్ఛమైన శుభ్రత, నూతనముగా విరియబూయు అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అను పుష్పములు గోచరించును. సువాసనలు విరజిమ్ము యీ పుష్పములు కాముని బాణములు. మన్మథుడు, వసంతుడు హిమవత్పర్వతము చేరుసరికి వాతావరణము ఉల్లాసముగా నుండుటచే, వచ్చిన కార్యము సాధించగలమను ఆశ వారికి కలిగెను.

పార్వతి మహాదేవునికి సేవచేయుచున్న సమయములో మన్మథుడు పుష్ప బాణములను మహాదేవునిపై గురిపెట్టి వదలెను. మహాదేవుడు కనులు తెరచెను. ఎదురుగా పార్వతి గోచరించెను. తపస్సుకు భంగము కలిగినందుకు మహాదేవునికి ఆగ్రహము కలిగెను. అతడు చుట్టును పరికించి చూచెను. అతని క్రోధపూరిత దృక్కులు వణకుచున్న మన్మథునిపై పడెను. మహాదేవుడు మూడవ నేత్రము తెరవగా అందుండి ప్రజ్వలించి వచ్చిన అగ్ని మన్మథుని దహించివేసెను.

మన్మథుని భార్య రతీదేవి మహాదేవుని వద్దకు వెళ్ళి మొరపెట్టుకొనెను. ఆమె దుఃఖము హృదయ విదారకముగా నుండెను. భగవంతుడు ఆమెపై జాలిపడి, పార్వతితో తన వివాహము జరిగిన తర్వాత మన్మథుని తిరిగి ఆమెకు యివ్వగలనని చెప్పి ఓదార్చెను. కాని మన్మథుడు రతికి మాత్రమే గోచరించునని చెప్పెను. ఆమె యిట్లడిగెను. ''మహాదేవా! నా భర్తకు యికముందు రూపము ఉండదా?'' ఒక క్షణము యోచించి మహాదేవు డిట్లనెను. ''ద్వాపర యుగమందు నారాయణుడు కృష్ణుడుగా జన్మించును. నీ భర్త మన్మథుడు కృష్ణునికి కుమారుడుగా జన్మించును. శంబరుడను అసురుని యింటిలో నీవు కన్యగా నున్నపుడు, మీరిద్దరు తిరిగి భార్యాభర్తలు కాగలరు''.

మహాదేవుని మాట ప్రకారము రుక్మిణీ కృష్ణులకు కుమారుడు జన్మించెను. అతడే మన్మథుడు. పుట్టిన శిశువుకు ప్రద్యుమ్నుడని పేరు పెట్టి ద్వారకా నగరమున ఘనమైన వేడుకలు జరిపిరి.

రుక్మిణీ కృష్ణులకు కలిగిన కుమారుడు తన మరణమునకు కారకుడు కాగలడని శంబరాసురుడు తెలుసుకొనెను. అతడు ద్వారకకు వచ్చి, కుమారుడు జన్మించెనని వినినంతనే ఆలస్యము చేయుట తగదని నిర్ణయించుకొనెను. అప్పటికి శిశువు పుట్టి పదిరోజులైనను పూర్తికాలేదు.

అందరును యెవరి పనులలో వారు నిమగ్నమై యున్నపుడు, అవకాశము కొరకు యెదురు చూచుచున్న శంబరుడు, పిల్లవాడు ఒంటరిగా నుండుట చూచెను. అది మంచి అదనని తలంచి, పిల్లవాని నెత్తుకుని పారిపోయి ద్వారకా నగరము నుండి అదృశ్యుడయ్యెను. ద్వారకా నగరమునకు చాల దూరముగా వెళ్ళిపోయెను. శిశువును చంపుటకు అనేక మార్గములు ఆలోచించెను. కొత్తగా పుట్టిన శిశువు అందమునకు ముగ్ధుడై తాను స్వయముగా చంపుటకు యిష్టపడక, సముద్రములో పడవేయుటకు నిశ్చయించుకొనెను. ఈ విధముగానైన బాలుని తన చేతులతో చంపుట తప్పుననని, సముద్రములో పడిన తర్వాత బాలుడు తప్పక మరణించగలడని శంబరాసురుడు తలపోసెను. బాలుని సముద్రములో పడవేసి తేలికపడిన మనస్సుతో తన నగరమునకు తిరిగి వచ్చెను.

ద్వారకా నగర మంతయు దుఃఖములో మునిగెను. రుక్మిణి శోకము నెవ్వరును ఆపలేకుండిరి. కాలము అన్ని సమస్యలను పరిష్కరించును. కాలక్రమేణా ప్రజలు యీ విషయము — రుక్మిణీ కృష్ణులకు కుమారుడు

పుట్టి పోయెనని — మరచిపోయిరి.

సముద్రములోనికి విసరివేసిన శిశువు మరణించలేదు ఒక పెద్ద చేప ఆ శిశువును ఆహారముగా గ్రహించి మ్రింగివేసెను తరువాత జాలరులు ఆ చేపను పట్టిరి ఆ చేప చాల పెద్దదిగా అసాధారణమైనదిగా గోచరించుటచేత రాజుకు కానుకగా నిచ్చుటకు తీసుకువెళ్ళిరి. రాజా శంబరుడు ఆ కానుక నంగీకరించి, వండుటకొరకు వంట యింటిలోనికి ఆ చేపను పంపెను వంట యింటిని మాయావతి అను ఒక అందమైన స్త్రీ నిర్వహించుచుండెను ఆ చేపను కోసి చూడగా అందులో శిశువు ఉన్న విషయము మాయావతికి తెలిసిరి ఆ శిశువు అందము చూసి మాయావతి ముగ్ధురాలయ్యెను ఆమె హృదయము శిశువుపై కరుణతో నిండెను ఆ శిశువును ఆమె తీసుకుని పెంచుచుండెను. కొంత కాలమునకు అందమైన బాలుడుగా పెరిగి పెద్దవాడయ్యెను

ఒకరోజు ఆమెను చూచుటకు నారదుడు వచ్చెను. ఆ బాలుని చూచి యెవరీ బాలుడని మాయావతిని ప్రశ్నించెను ఆమె వృత్తాంతమంతయు — అసాధారణమైన చేపను సముద్రములో పట్టి జాలరులు రాజుకు కానుకగా నిచ్చుటయు, దానిని కోసి చూడగా అందు అందమైన శిశువును కనుగొనుటయు — వివరించి చెప్పెను నారదుడు అంతయు విని మాయావతిని చూచి యిట్లడిగెను పూర్వజన్మ విషయములు నీకేమైన జ్ఞప్తియందున్నవా?''

''లేదు మునీంద్రా!'' అని మాయావతి బదులు చెప్పెను ''నాకేమియు జ్ఞాపకము లేదు. అయినప్పటికిని ఒకొక్కపుడు కలలు కందును కలలో నేను ఒక దేవత నైనట్లు నా చుట్టు యెల్లపుడు అనేక పుష్పము లున్నట్లు కలను గాంచెదను. నేను సంచరించుచున్నట్లు నా ప్రక్కనే అతి మనోహరుడు, అసమాన సౌందర్యముగల పురుషుడున్నట్లు కలను గంటిని కాని యిదంతయు యెట్లు జరిగెనని ఆలోచించులోపల, నా ప్రక్కనున్న పురుషుడు అదృశ్యుడై పోగుపడిన భస్మమును చూచుచుందును తరుచుగా నిద్రలో నాకీ స్వప్నము వచ్చుచుండును. ఇట్లెందుకు వచ్చునో నీవు చెప్పగలవా?''

''కుమారీ!'' అని నారదుడు యిట్లనెను ''అది కల కాదు. నీ పూర్వ జన్మలోని కొన్ని సంఘటనలు. నీ జీవితములో యిది విచారకరమైన సంఘటన అందుచే అది నీ మనస్సునందే యుండి, యీ జీవితములో కూడ అది నిన్ను వెంటాడుచున్నది''

''అది యేమిటో చెప్పుము'' అని ఆమె అడిగెను ''అంతయు వివరముగా చెప్పుము''

''నీవు రతీదేవివి'' అని నారదుడు చెప్పెను ''మన్మధుని భార్యవు, రతీదేవివి''

నమ్మలేనట్లుగా మాయావతి నారదునివైపు జూచెను నారదుడు పూర్వజన్మ వృ[illegible] వి, మరియు నిట్లనెను. ''నీవు పెంచుచున్న యీ బాలుడు నీ భర్త మన్మధుడే ఈ బాలుడు శంబరాసురుని చంపి, తిరిగి నీతో కలియునని ఆనాడు మహాదేవుడు నీకు చెప్పెను''

నారదుడు ఆమెను వదలి వెళ్ళిపోయెను మాయావతి దీర్ఘ ఆలోచనలో మునిగెను మహర్షుల వాక్యములు వ్యర్థము కావని ఆమె బాగుగా యెరుగును ఆ బాలుడు పెరిగి పెద్దవాడగు వరకు ఆమె వేచి యుండెను. అప్పుడతడేమి చేయవలెనో ఆమె చెప్పదలచెను

# 227 మాయావతి

మాయావతికి కాలము మెల్లగా గడచుచుండెను. ఆమె వేచి యుండు కాలము చివరకు అంతము కానుండెను బాలుడు పెరిగి ప్రౌఢ యువకుడయ్యెను. అతని సౌందర్యము లోకులను ముగ్ధులను గావించి ఆకట్టుకొనుచుండెను కలువ రేకులవంటి విశాల నేత్రములు తండ్రి నుండి సంక్రమించెను పొడవైన బాహువులు కలిగిన ఆ యువకుని చిరునవ్వు కృష్ణుని చిరునవ్వును పోలి యుండెను. మాయావతి అతనిని ప్రేమించెను ఆమె చేయు ప్రతి కార్యము, ఆమె చిరునవ్వు, ఆమె యెగురవేయు కనురెప్పలు అతనిపై ఆమెకున్న ప్రేమను ప్రకటించుచు, తన ప్రేమను అంగీకరించగలవా యని ఆమె మౌనముగా ప్రశ్నించుచున్నట్లు అతనికి స్పష్టముగా గోచరించెను.

ఒకరోజు అతడామె వద్దకు వచ్చి యిట్లనెను. ''నీ ప్రవర్తన నన్ను అయోమయము గావించుచున్నది. నన్ను పసితనము నుండి తల్లివలె పెంచి పెద్దవానిని చేసినావు. ఇన్ని సంవత్సరములు యీ విధముగా జరిగెను. ఇప్పుడు, నీవు ఒక్కసారిగా నన్ను కుమారుని వలె చూచుట లేదనిపించుచున్నది నీ అంతరంగములోని భావములను నీ కన్నులు స్పష్టముగా తెలుపుచున్నవి. ఇటువంటి ఆలోచనలు నీకు తగవు వానిని మరచిపొమ్ము''

మాయావతి తన్ను గురించి అతనిని గురించి ప్రద్యుమ్నునకు చెప్పెను ఆమె యిట్లనెను ''నీవు యాదవ వంశములో కృష్ణునికి జన్మించితివి.

''రుక్మిణి నీ తల్లి. నీ తల్లి వద్ద నుండి శంబరాసురుడు నిన్ను దొంగిలించి నిన్ను చంపు నుద్దేశముతో సముద్రములో త్రోసివేసెను ఒక చేప నిన్ను మ్రింగివేసెను విధి వశము చేత నిన్ను మ్రింగిన చేపను శంబరుని వద్దకు తీసుకువచ్చిరి ఇన్ని సంవత్సరములుగా నిన్ను పోషించి పెంచితిని బ్రహ్మ కుమారుడైన నారదుడు నాకీ విషయము చెప్పెను మాయ సహాయముతో పోరుట యందు ప్రవీణుడైన శంబరాసురుని నీవు సంహరించవలెను నీ తల్లి తన శిశువును మరువలేదు. శిశువుకు యేడు దినములు వయస్సు ఉన్నపుడు ఆమె పోగొట్టుకొనెను శంబరాసురుని యెట్లు చంపవలెనను విషయము గురించి నీవు ఆందోళన చెందనవసరము లేదు. నాకు మాయా విద్య బాగుగా తెలుసును. దానిని నీకు నేర్పెదను''

ఆమె 'మహామాయ' అను మంత్రమును ప్రద్యుమ్నునికి ఉపదేశించెను.

ప్రద్యుమ్నుడు శంబరాసురుని పిలిచి తనతో పోరమని సవాలు చేసెను. ఈ యువకుని ధైర్యమునకు శంబరుడాశ్చర్యపోయెను శంబరుని అవమానించి పిలుచుచున్న ప్రద్యుమ్నునితో యుద్ధము చేయుటకు గదను తీసుకుని శంబరుడు వచ్చెను వారిరువురి మధ్య చాలసేపు పోరాటము భయంకరముగా సాగెను ఆ యువకుని ధైర్య సాహసములకు శక్తికి ఆశ్చర్యపడి, తనకున్న 'మాయ' శక్తులను ఉపయోగించుటకు శంబరుడు నిశ్చయించెను. పోరాటము మరింత తీవ్రమయ్యెను శంబరుని 'మాయ'లు ఆ యువకుని శక్తి సాహసముల ముందు నిరర్థక మయ్యెను. తనకన్న అన్నివిధముల ప్రద్యుమ్నుడు అధికుడని ఋజువయ్యెను చివరకు ప్రద్యుమ్నుడు తన కత్తితో శంబరుని శిరస్సు ఛేదించెను

గాలిలో ఎగుర గలిగిన మాయావతి ప్రద్యుమ్నుని తీసుకుని ద్వారకా నగరము వెళ్ళెను. కృష్ణుని సౌధమునకు ఆమె ప్రద్యుమ్నుని తోడ్కొని వెళ్ళెను. అచట నిత్యకృత్యములలో మునిగియున్న సేవకులు, పరిచారికలు, చెలికత్తెలు, తదితరులు అపురూప సౌందర్యముతో నున్న యువకుడు ఒక అందమైన యువతితో ప్రవేశించుట తిలకించిరి అన్ని విధముల కృష్ణుని పోలికలు గల ఆ యువకుని జూచి, కృష్ణుడేయని కొంతసేపు భ్రమ చెంది అతనితో నున్న ఆ యువతి యెవరాయని విస్తుపోయిరి. అతడు కృష్ణుడు కాడని తెలుసుకొనుటకు కొంతసేపు పట్టెను. వారు ఒకరి నొకరు ''ఈ యువకుడెవరు?'' అని అడుగుచుండిరి

యువతీ యువకు లిద్దరు వచ్చిరని రుక్మిణి విని వారెవరైయుందురా యని చూచుటకు వచ్చెను. ఆ యువకుని చూచిన తర్వాత రుక్మిణి కనులు అశ్రువులతో నిండెను రుక్మిణి తనలో తానిట్లనుకొనెను. ''నా పుత్రుడే కనుక బ్రదికి యున్నచో ఈ యువకుని వలె నుండెడివాడు ఈ యువకుడు యెవరైయుండునని ఆమె విస్మయము చెందుచుండెను నా భర్తను పోలి యుండుట మరీ చిత్రముగా నున్నది. బహుశః

పు

ఆమె కృష్ణుని పోలిన ఆ యువకుని గురించి చింతించుచు, అతడెవరైనది యెందుకు వచ్చినదీ ఆలోచించుచుండగా, దేవకీ వసుదేవులతో కలసి కృష్ణు డచటకు వచ్చెను సర్వము తెలిసినప్పటికిని యేమియు నెరుగని వాని వలె కృష్ణుడు నిలుచుండెను. మాయావతి మాట్లాడబోవగా, నారదుడచటికి వచ్చి అందరి సందేహములు తీర్చెను.

అందరును ప్రద్యుమ్నుని కౌగిలించుకుని ఆనందించిరి మాయావతి రుక్మిణి కౌగిలిలో ఓలలాడెను. తాను పోగొట్టుకొనిన కుమారుడు తిరిగి దొరికెనని, చనిపోయి తిరిగి బ్రతికివచ్చినట్లుగా, రుక్మిణి ప్రకటించెను.

ఆ వెంటనే యువరాకుమారుని చూచుటకు నగరములోని ప్రజలు వచ్చుచుండిరి వారి హృదయములు ఆనందముతో నిండెను. అప్పుడే ఆ క్షణమునందే కొత్తగా కుమారుడు జన్మించినట్లు అందరును భావించిరి. ద్వారకలో ఆనందోత్సా

## 228 కృష్ణుడు దొంగిలించి యుండవచ్చు

కృష్ణుని బంధువులలో సత్రాజిత్తు అను రాజు కలడు. అతడు సూర్యోపాసకుడు సత్రాజిత్తును కేవలము ఉపాసకుడుగా మాత్రమేకాక స్నేహితులలో ఒకడుగా సూర్యుడు పరిగణించుచుండెను ఒకసారి సూర్యుడు సంతుష్టమనస్కుడై యున్నపుడు యిట్లనెను ''సత్రాజిత్తు మిత్రమా! నేను నీకొక విలువలైన మణిని కానుకగా నిచ్చెదను. దానిని నీవు తీసుకువెళ్ళుము. దానివలన నీకు విశేషమైన భాగ్యము కలుగును'' అని చెప్పి సూర్యుడు సత్రాజిత్తునకు శ్యమంతకమణిని కానుకగా నిచ్చెను.

ఆ శ్యమంతకమణి సూర్యుని వలె జాజ్జ్వల్యమానముగా ప్రకాశించుచుండెను. ఆ మణిని మెడలో ధరించి సత్రాజిత్తు తన నగిరమునకు తిరిగి రాగా, పురప్రజలు ఆ మణిని గాంచి సూర్యుడు భూమికి దిగివచ్చెనని భావించిరి తరువాత సత్రాజిత్తు ఆ మణిని గర్వముగా ప్రదర్శించి అందరకును చూపెను ఆ మణికి ఒక

ప్రత్యేకత కలదు ఆ మణి యెవరి వద్ద నుండునో వారికి ప్రతిరోజును పన్నెండు మణుగుల బంగారము నిచ్చుచుండును

ఆ మణిని దాని ప్రకాశమును చూచిన ప్రజలు కృష్ణుని వద్దకు వెళ్ళి యిట్లనిరి ''కృష్ణా! నీవు వచ్చి యీ అద్భుతమైన వార్తను వినవలెను. సూర్యుడే భూమి మీదకు వచ్చి, నడచి నీ సౌధమునకు నిన్ను చూచుటకు వచ్చుచున్నాడు. ఆ సూర్యుని ప్రకాశము కనులు మిరుమిట్లు గొల్పుచున్నది'' వారి అమాయకత్వమును చూచి కృష్ణుడు నవ్వి యిట్లనెను ''అతడు సూర్యుడు కాడు. అతడు సత్రాజిత్తు. సూర్యుడు కానుకగా నొసగిన మణిని సత్రాజిత్తు ధరించెను''. తన బంధువులందరికీ మణిని చూపించిన తర్వాత సత్రాజిత్తు ఆ మణిని తన పూజా మందిరములో ఒక పవిత్ర స్థలము నందుంచెను

ఆ మణి ప్రఖ్యాతి నలుదిక్కులా వ్యాపించెను ఆ మణిని అర్చించి పూజించు దేశమునందు దారిద్ర్యము, కరువుకాటకములు నుండవని చెప్పుదురు ప్రతిరోజు పన్నెండు మణుగుల బంగారము ఆ మణి ప్రక్కన ప్రోగవుచుండెను ఆ విధముగా సత్రాజిత్తు గొప్ప ధనవంతుడయ్యెను ధనముతోబాటు అతనిలో అహంకారము కూడ పెరిగెను

ఒకరోజు కృష్ణుడు సత్రాజిత్తు గృహమునకు వచ్చెను సంభాషణలో కృష్ణుడిట్లనెను ''మణి యుండిన ప్రదేశములో దారిద్ర్యముకాని కరువుకాటకములు గాని యుండవని చెప్పుదురు. అది ఆకస్మిక ప్రమాదములు, రోగములచే కలుగు మరణములను నివారించునని కూడ చెప్పుదురు మనస్సు ప్రశాంతముగా నుండి శారీరకమైన బాధలు కూడ నుండవని చెప్పగా విన్నాను దుశ్శకునములు గాని మోసము, చౌర్యము మున్నగువనిగాని యుండవని అనుచుందురు. ఇవన్నియు దృష్టిలో నుంచుకుని చూడగా, యీ శ్యమంతక మణి ఉగ్రసేన మహారాజు వద్ద నుండినచో, నీకు నీ కుటుంబమునకేకాక, దేశమునకంతకు సూర్యుని అనుగ్రహము చేత లాభము చేకూరగలదని నాకు తోచుచున్నది''

సత్రాజిత్తుకు అహంకారము పెరుగుటచేత కృష్ణుని మాటలు అతనిపై యెట్టి ప్రభావము కలిగించ లేకపోయెను మరియు అతనికి ధనముపై వ్యామోహము అధికమయ్యెను. అతడు నవ్వి కృష్ణునితో యిట్లనెను ''ఈ మణిని సూర్యుడు, మా స్నేహమునకు చిహ్నముగా, కానుకగా నిచ్చెను నీకు అటువంటి మణి కావలసినచో సూర్యుని ప్రార్థింపుము, ఎవరికెరుక అతడు దానిని నీకు ప్రసాదించవచ్చు!'' తర్వాత కృష్ణుడు ఆ విషయమై మరి [illegible] డెను.

తరువాత మరికొన్ని రోజులకు సత్రాజిత్తు సోదరుడు ప్రసేనజిత్తు ఒకరోజు ఆ మణిని ధరించుటకు అనుమతి కోరెను సత్రాజిత్తు అందుకంగీకరించగా ప్రసేనజిత్తు మణిని మెడలో ధరించి వేటకేగెను సూర్యుడస్తమించినప్పటికిని ప్రసేనజిత్తు యింటికి రాకపోయెను సత్రాజిత్తు, సోదరుడు రానందుకు అంత కంటె ముఖ్యముగా మణి పోయినందుకు ఆందోళన చెంది ఆ రాత్రి యెట్లో గడిపెను మరుచటి రోజు తెల్లవారెను ప్రసేనుడు వచ్చుజాడ లేకుండెను సత్రాజిత్తు ఆందోళనతో కంపరము చెంది, బలగముతో తమ్ముని వెదకుటకై అడవికేగెను దట్టమైన అడవి మధ్యలో ప్రసేనుని గుర్రము మృత కళేబరము కనుపించెను మరికొంత దూరములో వారికి ప్రసేనుని మృత దేహము గోచరించెను మృతదేహమును యింటికి తీసుకు వచ్చిరి. మృత శరీరముపై మణి కన్పించలేదు

సోదరుని మరణమునకు దుఃఖము క్రోధముతో సత్రాజిత్తు తన్ను చూడవచ్చిన వారిలో నొకరితో యిట్లనెను "నా సోదరుడు హతుడైనాడు ఎవరో శ్యమంతకమణి కొరకు అట్లుచేసిరి ఆ మణిని యెవరో పొందదలచిరి కొన్ని రోజుల క్రితము కృష్ణుడిచటకు వచ్చెను తన మాతామహుడైన ఉగ్రసేనునకు మణి నిమ్మని కోరగా నేను నిరాకరించితిని ఆ కారణము చేత కృష్ణుడు ఆగ్రహించి యిట్లు చేసెనని నా నమ్మకము. నా సోదరుని చంపి శ్యమంతకమణిని తీసుకొనెను. ఇందుకు సందేహము లేదు కృష్ణుడే మణిని తప్పక అపహరించి యుండును".

సత్రాజిత్తు కృష్ణునిపై మోపిన నింద ఒకరినుంచి మరొకరికి వారి నుంచి మరొకరికి, యీవిధముగా చివరకు కృష్ణుని చెవులను సోకెను మొదట కృష్ణుడు హాస్యాస్పదముగా తీసుకొనెను కాని ప్రజలు ఒకరిపై చెడును, అతడు తమకు ఆప్తుడైన కృష్ణుడైనప్పటికిని, నమ్మగలరని గ్రహించెను తాను దోషియని ప్రజలు నమ్ముచున్నారని తెలుసుకుని, తన ఆత్మగౌరవము నిలబెట్టుకొనుటకు ఆతురతగా నుండెను కృష్ణుడు తన స్నేహితులను పిలిపించి వారందరితో కలసి ప్రసేనుని మరణ కారణమునకు సూచనలు యేమైన కన్పించునేమోయని అరణ్యమునకు వెళ్ళెను ప్రసేనుడు మరణించిన స్థలమునకు వెళ్ళెను తన సోదరుని మృతదేహమును యింటికి తీసుకువచ్చు తొందరలో సత్రాజిత్తు తదితరులు యేమి జరిగెనో తెలుసుకొనుటకు పరి కుండిరి. కృష్ణుడు చుట్టును కలియజూచెను. ప్రసేనుని మృతదేహమును కనుగొన్న స్థలము నుండి సింహము పాదపుగుర్తులు కనిపించెను.

కొంతదూరము వరకు సింహము పాదపుగుర్తులు కనుపించెను. ఆ మార్గములో కొన్ని చోట్ల రక్తపు మరకలను గూడ కృష్ణుడు చూచెను అట్లు అదే మార్గములో కొంత దూరము వెళ్ళగా వారికి రక్తపు మరకలు మరి కనుపించకుండెను అచ్చట కృష్ణుడు అతని స్నేహితులు చచ్చిపడియున్న సింహమును చూచిరి. సింహము మృతకళేబరమంతయూ వెదకి చూచిరి కాని వారికి మణి యెచ్చటను కన్పించలేదు. వారికి సింహము ఎలుగుబంటి పోట్లాడిన గుర్తులు గోచరించెను ఆ పోట్లాటలో సింహమును ఎలుగుబంటి చంపెనని వారు గ్రహించిరి.

అక్కడ నుండి ఎలుగుబంటి నడచిన కాలి గుర్తులను అనుసరించి కృష్ణుడు వెళ్ళెను. అట్లు వెళ్ళగా అతడు ఒక పెద్ద గుహ ముఖద్వారము వద్దకు వచ్చెను తన స్నేహితులను అక్కడ వేచి యుండమని చెప్పి తానొక్కడే ఎలుగుబంటి, అంతకన్న ముఖ్యమైన శ్యమంతకమణి దొరకునేమోయని కృష్ణుడు ఆ గుహలో ప్రవేశించెను

## 229 ఎలుగుబంటి గుహ

కృష్ణుడు గుహ ప్రవేశద్వారము వద్ద నిలబడి చూచెను మణి అక్కడ ఉన్నదో లేదో పదేపదే చూడ నవసరము లేకుండెను. అక్కడ నేలపై ఒకపిల్ల యెలుగుబంటి ప్రాకుచుండెను ఆ శిశువు చేతిలో శ్యమంతకమణి గలదు ఒక క్షణము నిశ్చేష్టుడై నిలుచుండి, తర్వాత శిశువు చేతులలో నుండి మణిని తీసుకొనుటకు దగ్గిరకు వెళ్ళెను దగ్గరలోనే తల్లి యెలుగుబంటి ఉండెను. తన శిశువును సమీపించుచున్న మానవుని చూచి తల్లి యెలుగుబంటి భయంకరముగా అరచెను మరొక క్షణములో కాలమెంత ప్రాచీనమో అంతటి ప్రాచీనమైన

ముసలి ఎలుగుబంటి కృష్ణుని వద్దకు వచ్చెను. కృష్ణుడు పిల్ల యెలుగుబంటి నుండి మణిని తీసుకుపోవనున్నాడని తలచి, ఆ యెలుగుబంటి కృష్ణుని మీదకు ఉరికెను. ఆ ముసలి యెలుగుబంటి జాంబవంతుడు. త్రేతాయుగములో రావణునితో యుద్ధము చేసిన శ్రీరామునికి యెంతో సహాయము చేసెను. జాంబవంతుడు చిరంజీవి. గుహ జాంబవంతుని నివాసము. జాంబవంతుని గురించి కృష్ణునికి పూర్తిగా తెలియును.

జాంబవంతుడు కృష్ణునితో పోరాడెను. ఇరువది యెనిమిదిరోజులు పగలు రాత్రి విరామము లేక యుద్ధము కొనసాగెను

శత్రువు చాల శక్తిమంతుడని తెలుసుకుని ఆశ్చర్యముతో యిట్లనెను ''యుద్ధము చేయుటలో నీకున్నటువంటి నైపుణ్యము, శక్తి గల వ్యక్తిని యింతవరకు ఒకరినే చూచితిని''

''అతడెవరు?'' అని కృష్ణుడడిగెను.

జాంబవంతుడిట్లు జవాబిచ్చెను ''బహుశః నీవు అతడి గురించి వినియుండకపోవచ్చు. నీకన్న అనేక తరములకు ముందుండెడివాడు. అతని పేరు రాముడు, సూర్యవంశమునకు చెందిన రాకుమారుడు. అతడు గొప్పవీరుడు, రాక్షసరాజైన రావణుని అతడు వధించెను''

''తన భార్యను రావణుడు అపహరించిన తర్వాత పదినెలలు విలపించిన రాముడేనా? తన సవతి తల్లి అరణ్యమునకు పంపగా భార్యతో, సోదరునితో అరణ్యములో చాలకాలము సంచరించెనని చెప్పగా విన్నాను అతని గురించి గొప్ప అభిప్రాయము నాకు లేదు'' అని నిరసన సూచించుచు కృష్ణుడు పలికెను.

జాంబవంతుని ఆగ్రహము హద్దులు దాటగా యిట్లనెను. ''నా దైవమైన రాముని గురించి చులకనగా మాట్లాడుటకు నీకెంత ధైర్యము? సాక్షాత్తు నారాయణుడే రాముడుగా యీ భూమిపై అధర్మము నణచుటకు అవతరించెను లటువంటి రాముని గొప్పగా భావించుట లేదని చెప్పుటకు నీకెంత అహంకారము! నీకు నీవే చాల గొప్పవాడనని భావించుచున్నట్లు స్పష్టమగుచున్నది''. జాంబవంతుడు తిరిగి కృష్ణునిపై కురికెను. జాంబవంతుడు క్రిందపడి మూర్ఛిల్లెను జాంబవంతునికంటె కృష్ణుడు శక్తిమంతుడని మరొకసారి ఋజువయ్యెను తెలివివచ్చి జాంబవంతుడు కళ్లు తెరచి చూచెను. అతడు కోదండముతో నున్న శ్రీరాముని దర్శించెను. చిరునవ్వుతో రాముడు ''జాంబవంతుడా!'' అనెను.

జాంబవంతుడు అతని పాదములపై బడి యిట్లనెను ''ప్రభూ! మీ దర్శనము కొరకు నా కన్నులు యిన్నిరోజులుగా కాయలు కాచినవి ఈరోజు నన్ననుగ్రహించి దర్శనమిచ్చినారు. ద్వాపరయుగములో నన్ను చూడగలవని యిచ్చిన మాట మరచిపోయినారనుకున్నాను. అనంత కృపాసముద్రులైన మీరు దర్శనమిచ్చి నా కన్నులకు విందు చేసినారు''. జాంబవంతుడు కనులు తుడుచుకుని తిరిగి చూచెను. అతనికి తిరిగి రాముడు కనుపించలేదు అతని స్థానములో యిన్నిరోజులుగా తనతో యుద్ధము చేయుచున్న శత్రువు, కృష్ణుడు కనిపించెను ''నా రాముడెక్కడ?'' అని అడుగుచు ఆ గుహ అమూలాగ్రము వెదకి తిరిగి కృష్ణుడున్న స్థలమునకు వచ్చెను. కృష్ణుడు రాముడుగా కనుపించెను ఒక క్షణము కృష్ణుడుగా మరొక క్షణము రాముడుగా కనుపించుచుండెను చివరకు జాంబవంతుడిట్లనెను. ''రామా! ఏమి జరుగుచున్నదో నాకు తెలియకున్నది. నాకెందుకీ కలవర పరిస్థితి కలిగించుచున్నావో దయచేసి చెప్పుము? ఇతడు నిన్ను చులకనగా అహంకారముతో

నిరసనగా మాట్లాడుచున్నాడు''. జాంబవంతునకు రాముడుగా గోచరించి మరల కృష్ణుడుగా మరల రాముడుగా మారుచు గోచరించుచుండెను.

రాముడిట్లనెను. ''నేను కృష్ణుడను. ధర్మము నుద్ధరించుటకు ద్వాపరయుగములో ఈ అవతారము ధరించితిని. ఆనాడు నీదగ్గర సెలవు తీసుకుని వెళ్ళునపుడు తిరిగి నీకు దర్శన మివ్వగలనని వాగ్దానము చేసినాను. నేనే యిప్పుడు యాదవ వంశములో అవతరించితినని నీవు తెలుసుకొనగోరుచున్నాను. నేను వసుదేవుని కుమారుడను. ఈ మణిని తీసుకుని దాని స్వామికి అందజేయుటకై నేనిక్కడకు వచ్చితిని''. ఆ మణిని తీసుకు వెళ్ళవలసిన ఆవశ్యకతను జాంబవంతునకు తెలిపెను. జాంబవంతుడు కృష్ణునికి గౌరవాదరములు చూపి శ్యమంతకమణి యిచ్చివేసెను. మణితోబాటు తన కుమార్తె జాంబవతి నంగీకరించమని కోరగా కృష్ణుడందు కంగీకరించెను.

కృష్ణుడు జాంబవంతుని వద్ద సెలవు తీసుకుని, శ్యమంతకమణిని, జాంబవతిని వెంటబెట్టుకుని ద్వారకానగరమునకు తిరిగి వచ్చెను.

## 230 గౌరవము దక్కించుకొనుట

కృష్ణుని స్నేహితులు గుహబయట పన్నెండు రోజులు వేచియుండిరి. గుహలోపల ఎలుగుబంటితో యుద్ధము జరిగినట్లు వినిరి. యుద్ధములో కృష్ణుడు మరణించి యుండునని తలచి నగరమునకు తిరిగి వచ్చి, ఒక ఎలుగుబంటితో యుద్ధము చేసి దానిచేత మడిసి యుండవచ్చునను వార్త ప్రసారము చేసిరి.

కృష్ణుడు మరణించి యుండవచ్చునన్న వార్త విని ద్వారకానగరము దుఃఖములో మునిగెను. అనవసరముగా కృష్ణుని నిందించి అతని మరణమునకు కారణమైన సత్రాజిత్తును అందరును నిందింపజొచ్చిరి. వారందరును దుర్గాదేవి గుడికి వెళ్ళి కృష్ణుడు యేదోఒక విధముగా బ్రతికి యుండునట్లు చేయమని దేవిని ప్రార్థించిరి, పూజానంతరము వారికి దేవి యా విధముగా పలికినట్లు తోచెను. ''త్వరలోనే మీరు కృష్ణుని చూడగలరు''. ప్రార్థన పూర్తియయి గుడిబయటకు వచ్చిన ప్రజలు, తమ ప్రార్థనలను విని దేవి అనుగ్రహించెనని తెలుసుకొనిరి.

వారు కృష్ణుడు మెడలో మణిని ధరించి వచ్చుట చూచిరి. అతని ప్రక్క ఒక అందమైన యువతి యుండెను. కృష్ణుడు తన్ను చూచిన ప్రజలతో యిట్లనెను. ''అందరును మహారాజు సమావేశమందిరమునకు దయచేసి రావలెను. సత్రాజిత్తును కూడ రమ్మని చెప్పవలెను. నేను త్వరలోనే అక్కడకు వచ్చెదను''.

సుధర్మయను సమావేశమందిరములో ప్రజలందరును సమావేశమైరి. కృష్ణుడు లేచి ప్రసేనజిత్తు యెట్టి పరిస్థితులలో మరణించెనో, అటు తర్వాత జరిగిన విషయములను వివరించెను. తదుపరి వివాదాస్పదమైన శ్యమంతకమణిని సత్రాజిత్తు మెడలో వేసి యిట్లనెను. ''ఇప్పుడు నా గౌరవము నిలబెట్టుకున్నాను. నాపై మోపిన నింద యిప్పుడు తొలగినది''.

సత్రాజిత్తు సిగ్గుతో తల యెత్తుకొనలేకపోయెను. తలదించుకుని సమావేశ మందిరము వీడి వెళ్ళిపోయెను.

జరిగిన స                    క్కిలి విచారించెను అతని అహంకారము, దురాశ పూర్తిగా నివృత్తియయ్యెను. అమితముగా బాధించిన కృష్ణునితో తిరిగి యెట్లు సఖ్యము సాధించవలెనో తెలియకుండెను. ''నా పాపములెట్లు నిర్మూలమగును?'' అని తనలో తాను తలపోసెను. ఏ విధముగా కృష్ణునికి ప్రీతి కలిగించి జరిగినది మరచిపోవునట్లు చేయగలను? అనాలోచితముగా ఆడిన మాటలు చేసిన కార్యముల మూలముగా కలిగిన అపకీర్తిని యే విధముగా రూపుమాపుకోగలను?''

గడచిన కొద్ది నెలలలో కృష్ణునికి యేర్పడిన దురభిప్రాయము పోగొట్టుటకు, కృష్ణునికి ప్రీతి కలిగించుటకు, తన కుమార్తె సత్యభామను కృష్ణునకిచ్చి వివాహము చేయవలెనని సత్రాజిత్తు నిశ్చయించుకొనెను

వివాహ సందర్భములో సత్రాజిత్తు శ్యమంతకమణిని కృష్ణునకిచ్చెను కాని కృష్ణుడు తీసుకొనుటకు నిరాకరించెను. సత్రాజిత్తుతో కృష్ణుడిట్లనెను. ''సూర్యుడు కానుకగా యీ మణిని నీ కొసగినాడు కాబట్టి అది నీ వద్దనే యుండుట సవ్యముగా నుండగలదు. నీ యందు అయిష్టము చేత నేనిట్లనుట లేదు నా మాట నమ్ముము. నీ వద్దనున్న రెండు మణులలో ఉత్తమమైన దానిని నా కొసగితివి'' కృష్ణుడు సత్యభామను చూచి చిలిపిగా నవ్వగా, ఆమె సిగ్గుతో ముఖము దించుకొనెను.

సత్యభామ చాల అందమైనది వృష్ణి, అంధక, యాదవ కులములలోని యువకులు ఆమెపై కొద్దిగా ప్రేమను పెంచుకొనిరి. హృదికుని కుమారుడైన కృతవర్మ వారిలో ముఖ్యుడు. ఒకప్పుడు ఆమెను తనకిచ్చి వివాహము చేయమని సత్రాజిత్తు నడిగెను కాని సత్రాజిత్తు మౌనము వహించి యూరకుండెను. కృతవర్మ ఆశతో జీవించుచుండెను సత్రాజిత్తు విశాల హృదయముతో, కృష్ణునితో శాంతి చేసుకొనుటకు, తన పుత్రిక నిచ్చి వివాహము చేసెను కృష్ణుడు ఆమెను స్వీకరించుటకు మిక్కిలి సంతోషించెను. కృష్ణుడు తనకు భర్త అయినందుకు సత్యభామ అమితముగా ఆనందించెను

## 231 సత్రాజిత్తు వధ

పాండవుల మంచి చెడ్డలు కృష్ణుడు తెలుసుకొనుచుండెను. ముసలిరాజు ధృతరాష్ట్రుడు అతని కుమారులను పాండవులను సమముగా చూచుటలేదని కృష్ణునికి తెలియును. కాని వారిని గురించిన భయంకరమైన వార్త వినుటకు సిద్ధముగా లేకుండెను. ధృతరాష్ట్రుని కోరికపై పాండవులు తల్లి కుంతీదేవితో కలసి ఒక సంవత్సర కాలము వారణావతమను పట్టణములో గడపుచున్నారను వార్త ద్వారక చేరెను సంవత్సరకాలము పూర్తియగు సమయమునకు వారు నివసించుచున్న సౌధమునకు నిప్పు అంటుకొనగా ఆ మంటలలో వారు దగ్ధమై నాశనమైనారనియు పాండవుల కొరకు ప్రత్యేకముగా ఆ సౌధము నిర్మించిరనియు ప్రజలు చెప్పుచుందురు ధృతరాష్ట్రుని కుమారుల ప్రియమైన స్నేహితుడు పురోచనుడు ఆ సౌధమును నిర్మించెను అగ్నిచేత సులువుగా దగ్ధమగుటకు లక్క, మైనము మున్నగు పదార్థములతో పురోచనుడు ఆ సౌధమును వారణావతములో నిర్మించెను.

భీష్ముని, ధృతరాష్ట్రుని, విదురుని, తదితరులను పరామర్శించుటకు బలరామకృష్ణులు హస్తినాపురము

వెళ్ళిరి. ముసలిరాజు ధృతరాష్ట్రుడు మిక్కిలి విచారముతో నున్నట్లు బలరామకృష్ణులకు నమ్మకము కలిగింప నెంచి నటించెను. భీష్ముడు హృదయ విదారకముగ దుఃఖించెను. ద్రోణుడు కూడ అట్లే దుఃఖించెను. తనకు అత్యంత ప్రియమైన అర్జునుడు, పాండవ మధ్యముడు మరణించినందుకు ద్రోణుడు చాల విచారించెను. ఎక్కువగా విచారించవలసిన విదురుడు విచారించుచున్నట్లు గోచరించక పోవుటచేత, పాండవులు తప్పించుకుని పారిపోయి యెచ్చటనో దాగి యున్నారని కృష్ణుడు ఊహించెను. కాని విదురుడు తనకు తెలియనట్లు ప్రవర్తించవలసి వచ్చెను. అందుచేత ఆ విచార సన్నివేశము మరికొంతసేపు కొనసాగెను. ధృతరాష్ట్రుడు ఏకధాటిగా కన్నీరు కార్చుచు యిట్లనుచుండెను. ''నాయనలారా! ఓ యుధిష్ఠిరా! ఈ దుఃఖము నేనెట్లు భరించగలను?'' దుర్యోధనుడు మౌనముగా కూర్చుని యుండెను. అతడు విచారించుచున్నట్లుగా నటింప లేదు. పాండవులపై అతనికున్న ద్వేషము అందరకును తెలిసినదే. కాబట్టి అతడు విచారముగానున్నట్లు కన్పించినచో యెబ్బెట్టుగా నుండునని కృష్ణుడు భావించెను!

బలరామకృష్ణులు హస్తినాపురములో నుండగా ద్వారకా నగరములో భయంకరమైన రహస్య వ్యూహములు జరుగుచుండెను. సత్యభామను కృష్ణునికిచ్చి వివాహము చేసినందుకు కృతవర్మ సత్రాజిత్తును క్షమించకుండెను. మాటలతో కాకపోయినప్పటికిని, సత్రాజిత్తు తన కుమార్తెను కృతవర్మకు యిచ్చెదనని ఆశలు కల్పించెను. కాని యిప్పుడు కృష్ణునితో శాంతి చేసుకొనుటకు సత్యభామను కృష్ణునికిచ్చి పెండ్లిచేసెను. సత్యభామను పెండ్లాడ నెంచిన వారిలో శతధన్వుడను మరొక యాదవుడు గలడు. మరియొక విచిత్రమేమనగా, ఒకప్పుడు కృష్ణుని పరమ భక్తుడైన అక్రూరుడు కృతవర్మకు మద్దతు నిచ్చెను. ఎట్టి వారినైనను మార్చివేయగల శక్తి ధన సంపదల కున్నది! శ్యమంతక మణిని పొందవలెనను కోరిక, ఒకప్పుడు కృష్ణబలరాములను చూచి వారు సాక్షాత్తు నారాయణ ఆదిశేషుల అవతారములని భావించిన సాధువు అక్రూరుని కూడ గుడ్డివానిని జేసెను. అక్రూరుని వంటి సాధుపురుషులు సైతము బంగారముపై వ్యామోహము పెంచుకొనుట విచారకరము.

సత్యభామను పెండ్లాడ దలచిన వారిలో అక్రూరుడు కూడ గలడు. కృతవర్మ, అక్రూరుడు ఒక పన్నాగము పన్ని శతధన్వుని వద్దకు వచ్చిరి. వారు శతధన్వునితో యిట్లనిరి. ''సత్రాజిత్తు మనల నందరిని మోసగించెను. మనలో ఒకరికి తన కుమార్తెనిచ్చి పెండ్లి చేసెదనని చెప్పి, చివరకు కృష్ణునకిచ్చి పెండ్లి జరిపించెను. కాబట్టి మనము అతనిని శిక్షింపవలెను. బలరామకృష్ణులు హస్తినాపురములో నుండుటచే, అతనిని శిక్షించుట కిది తగిన సమయము. అతనిని మనము చంపి తమ్ముడు ప్రసేనజిత్తు వద్దకు యెందుకు పంపగూడదు?'' పాప చింతనగల శతధన్వుడు, చాల తేలికగా పాప మార్గముల ననుసరించ గలుగుటచే వెంటనే వారి సూచనకు తన అంగీకారము తెల్పెను. రాత్రి నిద్రపోవుచున్నపుడు శతధన్వుడు సత్రాజిత్తును హత్యచేసి శ్యమంతక మణిని అపహరించి దొంగవలె పారిపోయెను.

హతుడైన సత్రాజిత్తును జూచి యింటిలోని స్త్రీలు రోదించిరి. వారి రోదనము స్వర్గములో కూడ వినిపించెను. తండ్రిపై మిక్కిలి ప్రేమాభిమానములు గల సత్యభామ దుఃఖమును యెవ్వరును ఉపశమింపజేయలే కపోయిరి. తన తండ్రి శరీరమును తైలములో భద్రపరచవలెనని పట్టుపట్టి, కృష్ణునకీ విషయము తెలుపుటకు హస్తినాపురము వెళ్ళెను.

ద్వారకలో కొందరు అసూయాపరులు యిట్టి ఘోరపాతకమును గావించిరని విని కృష్ణుడు దిగ్భ్రాంతి చెందెను. తన శాయశక్తుల సత్యభామ కుపశమనము గలిగించుటకు ప్రయత్నించెను. ఆమె తండ్రిని చంపిన

వారిపై పగ తీర్చుకొనగలనని చెప్పి, శతధన్వుని సంహరించు నుద్దేశ్యముతో త్వరితముగా ద్వారకా నగరమునకు కృష్ణుడు వచ్చెను.

## 232 శతధన్వుడు

కృష్ణుడు క్రోధమును కనులలో చిందించుచు ద్వారకకు తిరిగి వచ్చుచున్నాడని తెలుసుకుని శతధన్వుడు కృతవర్మ వద్దకు వెళ్ళి యిట్లనెను.''ఈ దారుణ చర్య గావించుటకు నీవు నన్ను పురికొల్పినావు. కృష్ణుని ఆగ్రహము నుండి నీవే నన్ను రక్షించవలసి యున్నది''. కృతవర్మ శతధన్వుని కోరికను మన్నించుటకు యిష్టపడకుండెను. అతడిట్లనెను. ''అన్నదమ్ము లిద్దరినీ వ్యతిరేకించి జీవించగల ధైర్యము నాకు లేదు. వారు భగవంతుని అవతారములని విన్నాను. వారికి అసంతృప్తి కల్గించు కార్యమేదియు నేను చేయజాలను. వారు శక్తిమంతులు. కృష్ణుడు చిన్న కుర్రవాడుగా నున్నపుడే అతని చేతులలో కంసుడు ప్రాణములు పోగొట్టుకొనెను. మరియు అన్నదమ్ము లిద్దరును అనేక పర్యాయములు జరాసంధుని సేనాబలమును నాశనము గావించిన విషయము నీవు వినలేదా? నీకు యే విధముగాను సహాయము చేయలేను. ఈ దారుణ కృత్యమును తనచేత గావించిన కృతవర్మ ప్రవర్తన తీరును చూచిన శతధన్వునకు దిగ్భ్రమ కలిగెను. కాని అతనితో వాదించి దెబ్బలాడుటకు సమయము లేదు. ఈ అత్యవసర సమయములో తనకు సహాయము చేయుమని అక్రూరుని కోరెను. అతడు కూడ నమ్మకద్రోహి అయ్యెను. ఒక్కసారిగా అక్రూరుడు దైవభీతి, మత విశ్వాసము కల వానివలె ప్రవర్తించెను. బహుశః యిది బాహ్యప్రదర్శన కావచ్చును, లేక దిగజారి పాపకార్యము చేసినందుకు పశ్చాత్తాపముతో యిట్లు ప్రవర్తించి యుండవచ్చును. అక్రూరు డావిధముగా యెందుకు మాట్లాడుచుండెనో శతధన్వునకు అర్థము కాలేదు. అక్రూరుడు శతధన్వునితో నిట్లనెను. ''చూడు మిత్రమా! తెలివిగల వారెవరైనను అన్నదమ్ముల క్రోధావేశమునకు గురియగుదురా? కృష్ణుడు పరమ దైవము. అతడు పరబ్రహ్మ స్వరూపుడు. అతడు యీ లోకమునకు సృష్టికర్త , పోషకుడు, లయకారకుడు. అతడెవరో నాకు తెలుసును. అతనికి నేను నమస్కరించుచున్నాను''. అక్రూరుడు కనులు మూసుకుని ధ్యానములో నిమగ్నమైనట్లుగా గోచరించెను. పాపమా శతధన్వునకేమి చేయవలెనో తోచలేదు. అతడేమియు పలుకలేదు. శ్యమంతక మణిని అక్రూరుని ఒడిలో వదలిపెట్టి, శతధన్వుడు దినమునకు నూరు యోజనములు పయనించగల తన అశ్వము నెక్కి ఆ ప్రదేశము విడిచి సాధ్యమైనంత వేగముగా పారిపోయెను.

దారుకుడు రథము నడుపుచుండగా బలరామకృష్ణులు శతధన్వుని వెంబడించిరి. మిధిలాపురి పొలిమేరల వద్ద నున్న తోటను సమీపించునరికి శతధన్వుని గుర్రము క్రిందపడి మరణించెను. దానినచట వదలి, శతధన్వుడు గత్యంతరము లేక పరుగెత్తసాగెను. కృష్ణుడు రథము నుండి గెంతి శతధన్వుని వెంట పరుగెత్తెను. శతధన్వుని పట్టుకుని తన చక్రముతో శతధన్వుని శిరస్సు ఖండించెను. అతడు మరణించిన తర్వాత కృష్ణుడు మణి కొరకు శతధన్వుడు ధరించిన వస్త్రములు వెదకెను. కాని మణి దొరకలేదు. వెనుకకు వెళ్ళి బలరామునితో యిట్లనెను. ''శతధన్వుని సంహరించుట వృథా అయ్యెను. అతని వద్ద మణి కన్పించలేదు''.

బలరాము డిట్లనెను. ''కృష్ణా! అతనినంత తేలికగా క్షమింపకుము. సత్రాజిత్తును సంహరించినందుకు అతనికీ శిక్ష తగినదే. నీవు యే తప్పు చేయలేదు. మణి కొరకు సత్యభామ తండ్రిని సంహరించిన యీ పాపాత్ముడు

ద్వారకలో యెవరి వద్దనో మణిని వదలి యుండవచ్చు. ద్వారకకు తిరిగి వెళ్ళి అక్కడ మణి కొరకు వెదక వచ్చును. ఇంత దూరము వచ్చిన నేను, నా మిత్రుడైన విదేహ రాజును చూచి తిరిగి ద్వారకకు వచ్చెదను''.

బలరాముడు విదేహలో ప్రవేశించి తిన్నగా రాజ సౌధమునకు వెళ్ళెను. కృష్ణుడు ద్వారకా నగరమునకు వచ్చి సత్యభామ వద్దకు వెళ్ళెను. ఆమె తండ్రిని చంపిన శతధన్వుని సంహరించి పగ తీర్చుకున్నానని కృష్ణుడు భామతో చెప్పెను. మణి మాత్రము దొరకలేదు. సత్రాజిత్తుకు పుత్రులు లేకపోవుటచే అతని అంత్యక్రియలను కృష్ణుడు జరిపెను.

అంత్యక్రియలన్నియు సమాప్తమైన తర్వాత కృష్ణుడు పోయిన శ్యమంతకమణిని గురించి విచారణ ప్రారంభించెను. సత్రాజిత్తు హత్యకు ప్రోద్బలము నిచ్చిన అక్రూరుడు, కృతవర్మ ద్వారక నుండి పారిపోయిరని కృష్ణుడు తెలుసుకొనెను.

కొంత కాలమునకు సత్రాజిత్తు, శ్యమంతక మణి ( యెవరి వద్దనున్న వారికి కలిగిన వినాశము గురించిన) వృత్తాంతము ఒక పూర్వ గాథ అయ్యెను. ఆ విషయము ప్రజలు క్రమ క్రమముగా ప్రస్తావించుట మానివేసిరి, చివరకు ఆ విషయము మరుగున పడెను. శ్యమంకమణి సత్రాజిత్తుకు లభించినప్పటి నుండి, అది యెవరి వద్ద నున్న వారికి వినాశము తప్ప శుభము కలుగలేదు.

## 233 అక్రూరుని ఔదార్యము

అక్రూరుడు యజ్ఞము తర్వాత యజ్ఞము వరుసగా చేయుచున్నాడను వార్త ద్వారకా నగరములో వ్యాపించెను. కాశీ పట్టణములో ఒక యజ్ఞము కన్న మరో యజ్ఞము ఘనముగా జరుపుచుండెననియును, మంచినీటివలె ధనమును వ్యయము చేయుచున్నాడనియును, ప్రతి దినమును వేలకు వేలు పేద ప్రజలకు అన్నదానము చేయుచుండెననియును ప్రజలు చెప్పుకొనుచుండిరి. అదే సమయములో ద్వారకయందు దుశ్శకునములు కనిపించుచుండెను. ప్రజల కనేక కష్టములు సంభవించెను. అందరును ప్రజల కష్టములనే ముచ్చటించుకొనుచుండిరి. వారిలో వారిట్లనుకొనుచుండిరి. ''చాల సంవత్సరముల క్రిందట కాశీ పట్టణ ములో వర్షము లేనిచేత కరువు కాటకములు ప్రబలి ప్రజలు యిబ్బందికి గురైనందుకు కాశీరాజు మిక్కిలి వ్యాకులత చెందెను. తరువాత కాశీరాజు వద్దకు శ్వఫల్కుడను ఋషి వచ్చెను. రాజు తన కుమార్తె గాందినిని ఋషికిచ్చి వివాహము చేసెను. ఆ తర్వాత వర్షములు కురిసి దేశము సుభిక్షము కాగా ప్రజలు మరల సుఖముగా నుండిరి. గాందినీ శ్వఫల్కులకు కలిగిన పుత్రుడే యీ అక్రూరుడు. అక్రూరునిపై వర్షాధిపతి ఇంద్రునకు మిక్కిలి అభిమానము కలదు. అందుచే అక్రూరుడున్న ప్రదేశమునందు వర్షములు విరివిగా కురియుచుండెడివి. మరియు అక్రూరుడున్న చోట రోగములు, యీతి బాధలు లేకుండెను. ఇదంతయును సత్యమే. కాని ద్వారకలో గోచరించుచున్న దుశ్శకునములు, కాశీ నగరములో అక్రూరుడు జరుపుచున్న యాగములు, అచ్చట కలుగుచున్న శుభప్రదమైన సంఘటనలు చూడగా, శ్యమంతకమణి అక్రూరుని వద్ద నున్నదేమోయను అనుమానము కలుగుచున్నది. అక్రూరుడు 'మహాదాత' గా పేరొందినాడు. చూడగా మన కృష్ణుడు ఆ మణిని అక్రూరుని కిచ్చి యిక్కడ నుండి దూరముగా పంపివేసినట్లు తోచుచున్నది. అసలు జరుగుచున్న

విషయములు మనబోటి వారికి బోధపడుట లేదు''.

వదంతులు బయలుదేరినచో, వానికి చిలవలు పలవలు చేర్చి అనేకులు అనేక విధములుగా ప్రచారము గావింతురు అదే రీతిగా కృష్ణుడు మణిని అక్రూరుని కిచ్చినాడన్న పుకారు బాగుగా వ్యాపించెను. అన్నిటికన్న విచిత్రమేమనగా బలరాముడు, సత్యభామ యీ పుకారును నమ్మి కృష్ణునిపై విశ్వాసము గోల్పోయిరి బలరాముడు, సత్యభామ తమకు తాము యీ విధముగా ననుకొనిరి. ''బహుశః యిది నిజమే కావచ్చు అక్రూరుడు కృష్ణునికి చాల ఆప్తమిత్రుడు ఏమో యెవరి కెరుక?''

మరల కృష్ణుడు ద్వారక ప్రజల దృష్టిలో తన నిర్దోషిత్వమును నిలబెట్టుకొనవలసి వచ్చెను. ముఖ్యముగా
రికి, సత్యభామకు నమ్మకము కలిగించుట ఆవశ్యకమయ్యెను.

కృష్ణుడు తన మనుష్యులను కాశీ నగరమునకు పంపి అక్రూరుని ద్వారకకు తీసుకురమ్మని చెప్పెను అక్రూరుడు అయిష్టముగా గొప్ప భయముతో ద్వారకకు వచ్చెను ప్రజలను, తండ్రిని, సోదరుని కృష్ణుడు సమావేశపరచెను. అక్రూరుని సమావేశమునకు పిలిపించెను. అక్రూరుడు వచ్చిన వెంటనే కృష్ణుడు అతని వద్దకు నడచివెళ్ళి చిరునవ్వు మోముతో అతని చేతులను తన చేతులలోనికి తీసుకొనెను. అక్రూరుని గౌరవ పూర్వకముగా కూర్చుండబెట్టి, అతనిని ప్రత్యేక అతిధిగా పరిగణించెను. అందరును ఆతురతతో యేమి జరుగునోయని గమనించుచుండిరి కృష్ణుడు అక్రూరుని క్షేమ సమాచారము అడిగి తెలుసుకుని కాశీ నగరములో అతని కొత్త జీవితము గురించి విచారించెను తరువాత కృష్ణు డిట్లనెను ''నీవు అనేక దాన ధర్మములు, యజ్ఞ యాగములు జరిపి చాల పుణ్యము సంపాదించితివని చెప్పగా విన్నాను. నిన్ను అందరు 'మహాదాత' యని పిలుచుచున్నందుకు నాకు చాల గర్వముగా నున్నది. అట్లు జరుగుటయే అందరును కోరునది.

''కాని యీ ప్రజల మనస్సునందును, నా బంధువులకును ఒక సందేహము గలదు. దానిని నీవు తీర్చవలెను. శతధన్వుడు నీకు శ్యమంతకమణిని యిచ్చినట్లు అందరి ముందు అంగీకరింపుము నాకీ విషయము చాల కాలము క్రిందటనే తెలుసును. నీవు దానిని వినియోగించి సత్కార్యములు చేయుచుండుటచేత నేను నీ దగ్గర నుండి తిరిగి ఆ మణిని తీసుకొనలేదు. అనేక మంది ప్రజలు దాని మూలముగా లాభము పొందుచున్నారు. అందుకు నీవు కారణము కాని అక్రూరా! నీవు మరియొక దానికి కూడ కారకుడవు. ఈ దొంగతనములో నేను నీతో సహకరించినట్లు ప్రజల దృష్టిలో నన్ను పడవేసినావు! నేను నీకు యీ మణిని యిచ్చితినని ద్వారకా వాసులు అభిప్రాయపడుచున్నారు నాకు దానితో ప్రమేయము లేదని యీ ప్రజలకు చెప్పి నమ్మించుము సత్రాజిత్తు మరణించిన తర్వాత అతని అంత్యక్రియలు జరుపుటకు పుత్రులు లేనందు వలన, యీ మణి సహజముగా అతని కుమార్తెకు, ఆ తర్వాత అతనికి బియ్యముతో తిలలతో తర్పణము వదిలే ఆమె కుమారులకు చెందవలసి యున్నది కాని మేము ఆ మణిని కోరుట లేదు. నీవు నియమ నిబంధనలను అతి జాగ్రత్తగా స్వచ్ఛమైన మనస్సుతో పాటించెదవు, మరియు నీవు సత్పురుషుడవు. మణి నీ వద్దనే యుండనిమ్ము. మాకు నిజముగా అది అక్కరలేదు నీవు ఆ మణిని తీసుకొని పారిపోవుటతో నాకెట్టి సంబధము లేదని, ఒక్కమాట, నా భార్య, సోదరుడు నమ్మునట్లుగా దయచేసి చెప్పుము. నా కోరికపై గాక, నీకు నీవే స్వయముగా ఆ మణిని తీసుకు వెళ్ళితినని చెప్పుము''

సిగ్గు అవమానముతో అక్రూరుని కళ్ళు అశ్రువులతో నిండగా, తాను ధరించిన ఉత్తరీయము తీసి కట్టిన

ముడి విప్పి అందుండి శ్యమంకమణి తీసి కృష్ణుని చేతిలో పెట్టెను. కృష్ణుడు కొంచెముసేపు తన చేతిలో మణి నుంచుకొనెను విచారముతో దుఃఖముతో నిండిన కృష్ణుని వదనముపై ఒక క్షణము తర్వాత యిదివరకటి చిరునవ్వు తిరిగి కనిపించెను అక్కడ చేరిన అందరకును ఆ మణిని చూపించి మరల దానిని అక్రూరుని కిచ్చివేసెను.

కృష్ణుడు నిశ్శబ్దముగా సభావేశ మందిరము నుండి వెళ్ళిపోయెను. ఎవరును ఒక మాట యైనను పలుకలేదు

## 234 ద్రౌపదీ స్వయంవరము

ఒక సంవత్సరము గడచెను పాంచాల దేశ వార్తాహరులు వచ్చి ద్రుపదుని కుమార్తె ద్రౌపది స్వయంవరము ప్రకటించిరి కృష్ణయను పేరు గల ద్రౌపది, సోదరుడు దుష్టద్యుమ్నునితో కలసి యజ్ఞాగ్ని నుండి జన్మించెను దీనికొక పూర్వ గాధ గలదు. ద్రుపదుడు, తన శత్రువైన ద్రోణాచార్యుని చంపగల కుమారుని కొరకు, అర్జునునకు భార్య కాగల పుత్రిక కొరకు, ఒక యజ్ఞము జరిపెను. అతడు అర్జునుని చాల మెచ్చుకొనుచుండెను

కాని దురదృష్టవశాత్తు ద్రుపదుని కోరిక నెరవేరకుండెను వారణావతములో జరిగిన అగ్ని ప్రమాదములో పాండవులు నశించుటచేత, ద్రుపదుడు ద్రౌపదీ స్వయంవరము నేర్పాటు చేయవలసి వచ్చెను విలువిద్యలో ప్రవీణులై పరీక్షలో నెగ్గినవారే ద్రౌపదిని వివాహమాడుటకు అర్హులని ద్రుపదుడు స్వయంవరము యేర్పాటు చేసెను అర్జునునితో సరితూగగల ధనుర్విద్యా ప్రవీణుడు ద్రౌపదికి భర్త కావలెనని ద్రుపదుని ఆశయము

పాండవులు లాక్షా గృహ దహనమునకు మునుపే అక్కడ నుండి పారిపోయిరని కృష్ణుడు తెలుసుకొనెను. ఏమియు తెలియనట్లు ద్రౌపదీ స్వయంవరమునకు పంపిన ఆహ్వానము నంగీకరించెను యాదవులందరును కుటుంబ సమేతముగా పాంచాలమునకు వెళ్ళిరి చివరి క్షణములో తన కుమారుడైన ప్రద్యుమ్నునితోను, సోదరునితో సమానుడైన సాత్యకితోను, స్వయంవరమునకు పెట్టిన మత్స్య యంత్ర పరీక్షలో పాల్గొనవద్దని కృష్ణుడు చెప్పెను. మత్స్యయంత్ర పరీక్షలో అర్జునుడు నెగ్గవలెనని కృష్ణుడు సంకల్పించెను. పాండవులయిదుగురు యేదో ఒక విధముగా స్వయంవర సమయమునకు వచ్చెదరని కృష్ణునికి తెలియును

కృష్ణుడు ఊహించినట్లుగానే జరిగెను బ్రాహ్మణ వేషములో నున్న అర్జునుడు మత్స్య యంత్ర పరీక్షయందు విజయుడై ద్రౌపది చేయి నందు కొనెను. తర్వాత పాండవులు సజీవులుగా నున్నారని, మత్స్య యంత్ర పరీక్షలో విజయము సాధించినది అర్జునుడేయని ద్రుపదుడు తెలుసుకొని మిక్కిలి ఆనందించెను

పాండవులు తల్లి కుంతితో నివసించుచున్న కుమ్మరి యింటికి బలరామకృష్ణులు వెళ్ళిరి. మొదటిసారిగా మేనబావలు ఒకరి నొకరు కలుసుకొనిరి బలరామకృష్ణులు యుధిష్ఠిర, భీములకు ప్రణమిల్లిరి. కృష్ణుడు అర్జునుని కౌగిలించుకొనెను. నకుల సహదేవులు బలరామకృష్ణులకు పాద నమస్కారము చేసిరి. ఆ క్షణమునందే కృష్ణార్జునుల మధ్య స్నేహమేర్పడి, పాండవులకు కలుగబోవు కష్టములలో తోడుగా నుండుటకు కృష్ణుడు నిశ్చయించుకొనెను.

కొన్ని నెలల తర్వాత కృష్ణుడు సాత్యకితో కలసి ఇంద్రప్రస్థమునకు వెళ్ళెను కొద్ది మాసములు యుధిష్ఠిరు

నితో, అతని సోదరులంతో కలసి గడపుటకు, వెళ్ళెను తమతో కృష్ణుడు కొంతకాలము ఉండగలడని తెలిసి అత్యంత ఆనందభరితులై మిక్కిలి అపేక్షతో వారిద్దరికిని స్వాగతము చెప్పిరి కృష్ణుడు కుంతీదేవి పాదములకు నమస్కరించి ఆమె పాద ధూళిని శిరస్సుపై ధరించెను. కృష్ణుడు ఆమెతో యిట్లనెను ''ఎట్లున్నావు? నీకు కుశలమేనా? గ్రహణము విడిచిన తర్వాత చంద్రుడు బయటికి వచ్చినట్లు, నీ కుమారులు అజ్ఞాత స్థితి నుండి బయటకు వచ్చుట చేత నీ కష్టములు తీరిన వనుకొందును''. కుంతీదేవి కృష్ణుని చిరునవ్వులు చిందించు ముఖము చూచెను. ఆమె గొంతు బాధతో గద్గద మయ్యెను. వెనుక అనుభవించిన బాధలను గురించిన ఆలోచనలు ఆమెకు అసలు బాధకన్న భయంకరముగా గోచరించెను. అజ్ఞాతముగా గడపిన రోజులు, అర్ధరాత్రి లక్క యింటి నుండి సొరంగము ద్వారా తప్పించుకొనుట, వారణావతము నుండి గంగానదీ తీరము వరకు నడిచివెళ్ళుట, అచ్చట నుండి అరణ్యమునకు వెళ్ళుట, అరణ్యములో నిద్రరాక సతమతమగుట, హిడింబుని మరణము మున్నగు జ్ఞాపకము లన్నియు వరుసగా ఆమె మనస్సునందు మెదలెను. ఆమె వానిని కృష్ణునకు వివరించి చెప్పెను. అన్నిటికన్నా ముఖ్యముగా ఏకచక్రపురములో నున్నపుడు తన కుమారులు భిక్షమెత్తవలసిన అవమానకర పరిస్థితులను మిక్కిలి బాధతో కృష్ణునకు వివరించెను. ''కృష్ణా! ఇప్పుడు నీవు మాతో నున్నావు అదే చాలును. నీవు మాతోనుండి రక్షించగలవన్న ధైర్యములో యిక ముందు యెంతటి బాధనైనను సహించగలను కంసుని చంపిన తర్వాత నీవు అక్రూరుని హస్తినకు పంపిన రోజే నేనీ విషయము తెలుసుకు న్నాను. మాయందు నీకున్న ప్రేమ చేతనే మేము యింతకాలము ఆశతో జీవించగలిగినాము. నీవు పరమాత్మవని, నీకు 'నేను - నాది' అను భ్రమ లేదని నాకు తెలుసును అయినప్పటికిని నీ ప్రేమ నెల్లప్పుడును మాకు అందిచ్చుచున్నావు. అదియే మేము నశించకుండ కాపాడుకొనుచున్నది'' తరువాత యుధిష్ఠిరు డిట్లనెను. ''ప్రభూ! అనేక సంవత్సరములుగా మహర్షులు గొప్ప తపస్సు చేసినప్పటికిని వారికి లభ్యము కాని నీవు, మాతో కొంత కాలముండుటకు వచ్చుట మా అదృష్టము ఇటువంటి సదవకాశమును మాకు కల్పించినావు. మా వంటి వారి కొరకే యీ మానవ రూప, నామములు ధరించినావని తలంచెదము ఈ అర్హత పొందుటకు మేమ యేమి పుణ్య కార్యములు చేసితిమో తెలియదు'' వారితో వర్ష కాలమంతయు కృష్ణుడు గడపెను. కృష్ణుడు వారితో గడపిన నాలుగు మాసములు పాండవులకు అతి సుఖప్రదమైనవి తరువాత రాజసూయాగము జరిగెను దానితో వారి మనశ్శాంతి అంతమై అటు పిమ్మట వారి అరణ్యవాసము, కష్టములు ప్రారంభమయ్యెను. ప్రస్తుతము మాత్రము వారు సుఖముగా నుండిరి

## 235 కాళింది, మిత్రవింద, సత్య

కృష్ణుడు పాండవులతో కలిసియున్న రోజులలో ఒకనాడు కృష్ణార్జునులు అడవి మృగములు నివసించుచున్న అరణ్యమునకు వేటకు వెళ్ళుటకు నిశ్చయించుకొనిరి పెద్దపులులు, అడవి పందులు, అపాయక మృగములు అరణ్యము నందు మిక్కుటముగా గలవు అడవి మృగములను వేటాడి చంపిరి భయపడి పారిపోవుచున్న లేళ్ళ కళ్ళను చూచి స్నేహితులిద్దరూ ఆనందించిరి

చాలసేపు వేటాడుటచేత వారు బాగా అలసిపోయిరి అర్జునునకు మిక్కిలి దాహము వేయుటలో వారిరువురును యమునానదీ తీరమునకు వెళ్ళిరి దాహము తీర్చుకున్న పిదప అచట పచ్చగడ్డిపై మేను

వాల్చి అలసట తీర్చుకొనుచుండిరి.

వారక్కడ కూర్చుని యుండగా, ఒక యువతి వారి వైపు నడచి వచ్చుచుండుట జూచిరి. ఆమె నల్లగా అందముగా నుండెను. వారికి కొంత దూరములో ఆమె ఆగెను. ఆమెకు దగ్గరకు రావలెనని యున్నదని, కాని ఆమె ధైర్యము లేక రాలేకపోవుచున్నదని, వారు గ్రహించిరి. ఆమె కేమి కావలెనో తెలుసుకుని రమ్మని కృష్ణుడు అర్జునుని పంపెను. అర్జునుడు ఆమెను సమీపించి యిట్లడిగెను. ''నీ వంటి అందమైన యువతి క్రూర మృగములు సంచరించు యీ ప్రదేశమందు ఒంటరిగా సంచరించుట క్షేమము కాదు నీవెవరు? ఎవరి కుమార్తెవు? ఎక్కడ నుండి వచ్చుచున్నావు? నీకేమైన సహాయము కావలెనా? నీకేదైన యిక్కట్టు కలిగెనా? చెప్పుము''.

ఆమె అర్జునుని జూచి యిట్లనెను. ''నేను సూర్యుని పుత్రికను నాపేరు కాళింది. నేను నారాయణునికి భార్య కాగోరి తపస్సు చేయుచున్నాను. అతనిని వివాహమాడవలెననియు, లేకున్నచో మరణించెదననియు ప్రతిజ్ఞ పట్టితిని యమున ఒడ్డున ఒక చిన్న కుటీరము నిర్మించుకుని అందు జీవించుచు నారాయణుని రాక కొరకు యెదురు చూచుచున్నాను నా ప్రార్థనలు యిప్పటికి ఫలించినవి నేనతనిని చూచినాను''.

కృష్ణుడు తనవైపు చిరునవ్వు చిందించుట జూచి, ఆమె కనులు క్రిందకు దించుకొనెను అర్జునుడు కృష్ణునితో కాళింది చెప్పిన విషయము వివరించెను కృష్ణుడు కాళింది వద్దకు వెళ్ళగా, ఆమె అతనికి పాదాభివందనము చేసెను. కృష్ణుడు ఆమెను లేవనెత్తెను ఆమెను రథములోని కెక్కించుకుని యుధిష్ఠిరుని వద్దకు వెళ్ళెను. కాళింది, ద్రౌపదితో యితర అంతఃపుర స్త్రీలతో ఆనందముగా గడిపెను

వారు యమునా నది ఒడ్డున నివసించుచున్న రోజులలో ఒకనాడు అగ్నిదేవుడు కృష్ణార్జునుల వద్దకు వచ్చి ఖాండవ వనమును దహించుటలో తనకు సహాయము చేయమని కోరెను స్నేహితులిరువురూ అగ్నికి సహాయపడిరి. ఆ వనము దహనమగుట ఇంద్రుని కిష్టము లేకపోవుటచే ఖాండవ దహనము నాపుటకు ఇంద్రుడు ప్రయత్నించెను. తన కుమారుడైన అర్జునుని శక్తిసామర్థ్యముల ముందు నిలువలేనని ఇంద్రుడు తెలుసుకొనెను.

ఖాండవ వనము దహించుటకు సహాయపడమని అగ్ని అడిగినపుడు అర్జును డిట్లు చెప్పెను. ''నాకు ఒక శక్తిమంతమైన ధనుస్సు, తరిగిపోని అమ్ముల పొదులు, వేగముగా పరుగెత్తు అశ్వములతో కూడిన రథము ఉండినట్లయితే నేను సహాయము చేయగలను. లేకున్నచో సులభ సాధ్యము గాదు'' అగ్ని వరుణుని సహాయము కోరెను వరుణదేవుడు కృష్ణార్జునులకు ప్రత్యక్షమై, అర్జునకు ప్రఖ్యాతి గాంచిన గాండీవ మను ధనువును, తరగని అమ్ముల పొదులును, నాలుగు తెల్లని అశ్వములతో కూడిన రథమును ప్రసాదించెను శ్వేత వర్ణము గల అశ్వములతో కూడిన రథము నధిరోహించుటచే అర్జునునకు శ్వేతవాహనుడను పేరు కలిగెను వరుణుడు కృష్ణునునకు చక్రము నివ్వగా కృష్ణార్జునులు రథము నెక్కి అరణ్య మంతయు సంచరించిరి మంటల నుండి యే జీవులు తప్పించుకు పారిపోకుండ నిలువరించిరి అయినప్పటికిని తక్కువమంది మాత్రము మంటల నుండి తప్పించుకొనిరి. వారిలో 'మయుడు' అనువాడు అర్జునుని పాదములపైబడి ప్రాణబిక్ష పెట్టమని కోరెను. శరణుజొచ్చి ప్రాణ భిక్ష పెట్టుమని కోరిన వారిని సంహరించుట క్షత్రియ ధర్మము కాదు. అందుచేత 'మయుడు' ప్రాణములతో తప్పించుకొనెను అందుకు కృతజ్ఞతగా ఇంద్రప్రస్థపురములో ఒక సభను నిర్మించెను అది మయసభగా పేరు గాంచెను

ద్వారకకు తిరిగి వచ్చిన పిదప కృష్ణుడు కాళిందిని వైదిక సాంప్రదాయము ననుసరించి వివాహము చేసుకొనెను.



వసుదేవునికి రాజాధిదేవి యను సోదరి కలదు. ఆమె అవంతి రాజును వివాహమాడెను. ఆమెకు ముగ్గురు సంతానము - ఇద్దరు పుత్రులు, ఒక పుత్రిక విందుడు, అనువిందుడు అను వారిద్దరు పుత్రులు; కుమార్తె పేరు మిత్రవింద. ఆమెకు వివాహ వయస్సు వచ్చిన తర్వాత స్వయంవరము యేర్పాటుచేయగా ఆ స్వయంవరమునకు కృష్ణుడు వెళ్ళెను. మిత్రవింద కృష్ణుని వివాహమాడ నెంచుకొనెను. కాని దుర్యోధనుని స్నేహితులైన ఆమె అన్న లిద్దరును ఆమె కోరికను చెల్లనివ్వలేదు ఆమె తన్ను యెంచుకొనెనని కృష్ణుడు తెలుసుకొని, ఆమెను పెండ్లాడుటకు వచ్చిన యితరులు, ఆమె అన్నలు నిస్సహాయులై చూచుచుండగా, కృష్ణుడు ఆమె చేయి పట్టుకుని ద్వారకకు తీసుకుపోయి ఆమెను వివాహమాడెను



కోసల దేశమును నగ్నజిత్తు అను రాజు పరిపాలించుచుండెను. అతడు పరమసాధువు అతనికి సత్య అను అందమైన కుమార్తె గిలదు. కాని ఆమెను అందరును నాగ్నజితి అని పిలిచెడివారు ఆమెను వివాహమాడ గోరు రాకుమారులకు నగ్నజితు డొక పరీక్ష యేర్పాటు చేసెను అతని వద్ద యేడు ఆబోతులుండెను వాని నణచి నిగ్రహించుట అసాధ్యముగా నుండెడిది వాడియైన కొమ్ములు గిల ఆబోతులు మహా క్రూరముగా నుండెడివి. వాటి నెవరును లొంగదీసుకొనలేకపోయిరి. ఆ యేడు ఆబోతులను లొంగిదీయగల రాకుమారునికి తన కుమార్తెనిచ్చి వివాహము చేయుగిలనని ప్రకటించెను అనేకులు రాకుమారులు ఆబోతులను లొంగిదీసి నగ్నజిత్తు కుమార్తె సత్యను పరిణయ మాడదలచి కోసల దేశమునకు వచ్చిరి. ఆమె అందము లోకములో ప్రఖ్యాతి పొందిన దగుటచే కోసలకు వచ్చిన రాజకుమారుల కందరికిని ఆమెను పరిణయ మాడవలెనన్న తీవ్రమైన కోరిక కలిగెను కాని వారిలో యే ఒక్కరును యేడు ఆబోతులనూ లొంగిదీసుకొనలేకపోయిరి. కృష్ణుడు కూడ కోసలకు వెళ్ళిన వారిలో ఒకడు. యువకుడైన కృష్ణుడు తన యెడల చూపిన గౌరవ మర్యాదలకు సంతోషించి నగ్నజితుడు కృష్ణుని సాదరముగా ఆహ్వానించెను. రాజుతో కృష్ణుడు మాట్లాడుచున్నపుడు సత్య కృష్ణుని జూచెను రుక్మిణి వలెనే సత్య కృష్ణుని గురించి విని అతనినే భర్తగా యెంచుకొనెను ఆమె హృదయము కృష్ణుని కర్పించెను వేరొకరు ఆబోతులను లొంగిదీసుకుని తనను చేపట్టుదురేమోనని ఆమె భయపడుచుండెను ఆమె యిట్లు ప్రార్థించెను. ''నేను హృదయము నర్పించిన కృష్ణుని వివాహమాడుటకు శ్రద్ధగా చేసిన వ్రతములు పూజలు వృథా పోకుండుగాక! కృష్ణుని భర్తగా పొందు మహద్భాగ్యము నాకు కలిగింపుము కాని యిట్టి అర్హత సంపాదించుటకు నేనేమి చేసితిని? స్వర్గములోని దేవతలు కిరీటము ధరించిన తమ శిరస్సులను అతని పాద పద్మముల వద్ద నుంచెదరు సంవత్సరముల కొలది తపస్సు చేసినప్పటికిని మహర్షులకు అతని దర్శన భాగ్యము లభ్యము కాలేదు. మానవ శ్రేయస్సు కోరి అతడీ మానవ రూపము ధరించినాడు చొరవ తీసుకుని అతడు నాకు దక్కవలెనని కోరుచున్నాను అతడు నాకు యీ సహాయము చేయవలెనని మాత్రము ప్రార్థించగలను''.

తర్వాత రాజు కృష్ణు నిట్లడిగెను ''ఎందువలన నాకీ గౌరవము కలిగెను? నీకు ప్రీతి కలిగించుటకు నేనే చేయవలెను?'' కృష్ణుడు రాజును చూచి చిరునవ్వు నవ్వి, మేఘ గర్జన వంటి స్వరముతో యిట్లనెను '':

క్షత్రియుడు మరొక క్షత్రియుని యాచించరాదని అందురు. కాని నేనిందుకు కొంచెం మార్పు చేయుచున్నాను నీతో స్నేహమేర్పరచు కొనుటకు నీ పుత్రికను స్వీకరించ గోరుచున్నాను'' రాజు ఆనంద బాష్పములతో యిట్లనెను. ''నా కుమార్తె సత్యను వివాహమాడదలచి నాకు గొప్ప గౌరవము చేకూర్చినావు. లక్ష్మీదేవి యెల్లప్పుడును నీ హృదయమందు నివసించుచున్నది. నీ కన్న ఉత్తముని నా కుమార్తెకు యెంచగలనా?'' ఒక క్షణమాగి తిరిగి యిట్లనెను. ''కాని చాల కాలము క్రిందట, యేడు ఆబోతులను లొంగదీయువానికి నా కుమార్తెనిచ్చి వివాహము చేయుదునని ప్రకటించితిని. ఆ విషయము నీవు విని యుండవచ్చు ఆబోతులతో పోరి యెంతమంది యువకులు ప్రాణములు కోల్పోయిరో నీకు తెలిసి యుండవచ్చును నన్ను గురించిగాని, నిన్ను గురించిగాని లోకులు చెడుగా భావించరాదని నా అభిమతము. నీవు ఆబోతులతో పోరి విజయము పొందక, నీకు నా కుమార్తె నిచ్చి వివాహము చేసినచో నేను మాట తప్పితినని లోకులు నిందించగలరు. నీవు యెనుబోతులతో పోరలేని అసమర్థుడవని లోకువగా తలంతురు పసితనమునందే శకటాసురుని చంపిన కృష్ణుడు, తృణావర్తుని ఆకాశములో పైకెత్తగల్గిన కృష్ణుడు, గోవర్ధన పర్వతమును చిటికెన వ్రేలితో నెత్తగలిగిన కృష్ణుడు ఈ ఆబోతులను తేలికగా లొంగదీయగలడని తెలియును ఈ పరీక్షలో విజయము సాధించినావని లోకమునకు నమ్మకము కలిగించి సత్యను స్వీకరింపుము ఈ సులభ కార్యము జరుపమని నిన్నడుగుచున్నాను''.

కృష్ణుడు బిగ్గరగా నవ్వి యిట్లనెను. ''అటులనే జరుగగలదు. నీవు నన్నడిగినట్లే చేసెదను'' ఆబోతులు కట్టియున్న ప్రదేశమునకు తన్ను తీసుకువెళ్ళమని కృష్ణు డడిగెను ఆబోతులను లొంగదీసుకొనుట కృష్ణునికి బాలక్రీడగా నుండెను. కృష్ణుడు యేడు రూపములు ధరించి వానిని స్పృశించగా కొద్ది క్షణములలో యేడు ఆబోతులు దూడలవలె కృష్ణుని వెంట నడచెను వాని దురుసుతనము, బలము తొలగిపోయెను వాని మెడలో త్రాడును గట్టి, పిల్లలు కర్ర బొమ్మలను లాగుకొని వెళ్ళునట్లుగా, లాగుకుని వచ్చెను

దీనినంతయు గమనించుచున్న రాజు, తదితరులు సంతోషముతో చప్పట్లు చరిచిరి సత్య కృష్ణునికి భార్య అయ్యెను. రాకుమార్తె సత్య యాదవ నాయకుడు కృష్ణుని వివాహ మాడుచుండుటచేత నగరమంతయు అందముగా నలంకరించిరి వివాహమైన తర్వాత కొన్ని దినములు రాజుతో గడిపి, తర్వాత పెండ్లి కూతురును రథములో కూర్చుండబెట్టుకుని, నగ్నజితు డిచ్చిన సైన్యము వెంటరాగా కృష్ణుడు ద్వారకా నగరమునకు తిరిగి వచ్చెను

సత్యను వివాహ మాడుటకు ప్రయత్నించి విఫలులైన రాకుమారులు సహజముగా కృష్ణునిపై కోపము వహించి, ద్వారక వెళ్ళుచున్న కృష్ణునితో మార్గమందు యుద్ధము చేయ యత్నించిరి వారందరిని ఓడించి కృష్ణుడు ద్వారకా నగరము ప్రవేశించెను అతి ప్రమాదకరమైన కార్యమును సాధించి క్ష
తిరిగి వచ్చినందుకు ఆనందోత్సాహములతో ప్రజలు స్వాగతము పలికిరి చాల కొద్ది మందికి మాత్రమే కృష్ణు డెవరైనది తెలుసును సాధారణ ప్రజలకు, ఆబోతులను లొంగదీయుట చాల కష్టమైన కార్యము ముఖ్యముగా రాకుమార్తెను వివాహమాడ దలచిన యువకు లనేకులు ఆ ఆబోతులచేత హతమగుటచేత కృష్ణుడు సాధించిన విజయము అద్వితీయమైనదిగా పలువురు భావించిరి

# 236 భద్ర, లక్షణ

శ్రుతకీర్తి వసుదేవుని సోదరి ఆమె కుమార్తె భద్ర కేకయ దేశపు రాకుమారి. భద్ర కృష్ణుని వివాహమాడెను.

లక్షణ, మద్ర దేశపు రాకుమారి. రుక్మిణి వలె ఆమె కృష్ణుని గురించి పలుగురు చెప్పుకొను విషయములను విని, అతనికి భార్య కాగోరెను. ఆమె తండ్రి బృహత్సేనునకు కుమార్తె కోరిక తెలియును. అనేకులు రాకుమారులు తన కుమార్తెను వివాహ మాడదలచిరని కూడ బృహత్సేనునకు తెలియును అతడు యెక్కువ శక్తిమంతుడు కాడు. అందుచేత బాహాటముగా కృష్ణునిపై యిష్టత చూపి, యితర రాజులతో శత్రుత్వము పెంచుకొనుట కిష్టము లేకుండెను. కాబట్టి తన కుమార్తె వివాహమునకు ఒక పరీక్ష పెట్టి పరీక్షలో నెగ్గిన వారికి తన కుమార్తె లక్షణ నిచ్చి వివాహము చేసెదనని ప్రకటించెను

ద్రుపదుడు యేర్పాటుచేసిన మత్స్యయంత్రమును పోలిన పరీక్షను బృహత్సేను డేర్పాటు గావించెను. అయిదు బాణములతో అర్జునుడు విజయము సాధించెను మత్స్య యంత్రమునకు బృహత్సేనుడు యేర్పాటు గావించిన పరీక్షకు ఒక చిన్న భేదమున్నది. అర్జునుడు గురిపెట్టినది ఎత్తున చుట్టును తిరుగుచున్న మత్స్యాకారము గల వస్తువు దాని క్రింద ఒక నూనె పాత్రలో, పైన గుండ్రముగా తిరుగుచున్న మత్స్యాకారపు వస్తువు ప్రతిబింబమును చూచి పైకి గురిచేసి అది క్రింద పడునట్లు కొట్టవలెను. ఈ పరీక్షలో పాల్గొన్నవారు పాత్రలో మత్స్యాకారములో నున్న వస్తువు ప్రతిబింబము స్పష్టముగా చూడగలిగిరి.

కాని యిప్పుడు బృహత్సేను డేర్పాటు గావించిన పరీక్ష మత్స్య యంత్రముకన్న జటిలమైనది. పరీక్షలో పాల్గొను వారికి పాత్రలో మత్స్యము తప్ప, యంత్రము ప్రతిబింబము మాత్రమే కన్పించెను. అందుచే పరీక్షలో పాల్గొనువారు, మత్స్యము ప్రతిబింబము కన్పించనందున, ఊహించి గురిపెట్టి కొట్టవలసి యుండెను.

అనేకమంది రాజులు యీ పరీక్షలో పాల్గొనుటకు వచ్చిరి. యంత్రము నమర్చిన స్థలమునకు ఒకరి తర్వాత మరొకరు వెళ్ళి గురిపెట్టుటలో విఫలులై తిరిగి వచ్చిరి. కౌరవులు, పాండవులు కూడ పాల్గొనిరి. రాకుమారిని చేబట్టుటకు కృష్ణుడు వచ్చుట చూచి, పరీక్షలో పాల్గొనకూడదని అర్జునుడు నిశ్చయించుకొనెను. ద్రౌపది స్వయంవరమందు కృష్ణుడు పాల్గొనక కేవలము చూచుటకు వచ్చినాడన్న విషయము అర్జునునికి జ్ఞాపక ముండెను

చివరకు అందరును పరీక్షలో విఫలులైన తర్వాత కృష్ణుడు యంత్రము వద్దకు వెళ్ళెను. అతడు ధనుస్సు వంచి సునాయాసముగా నారి బిగించెను. క్రింద నీటితో నిండియున్న పాత్రవైపు చూచుచు గురిపెట్టి ప్రయోగించెను. మొదటి ప్రయత్నములోనే మత్స్యమునకు తగిలి అది క్రిందపడెను ఈ సంఘటన జరిగినపుడు అభిజిత్తు నక్షత్రము సూర్యునితో కలిసి యుండెను. కృష్ణుడు గురిపెట్టి మత్స్యమును పడదోసిన వెంటనే స్వర్గములో సంగీత ధ్వనులు మ్రోగి పుష్ప వర్షము కురిసెను.

తెల్లని పట్టు వస్త్రములు ధరించి లక్షణ కృష్ణుని వద్దకు నడచి వచ్చెను. సిగ్గుచేత తలవంచుకొనెను. సిగ్గుతో నిండిన ఆమె వదనమందు సన్నని చిరునవ్వు చిందెను. ఆమె నడక మిక్కిలి మెల్లగా హంస నడక వలె నుండెను ఆమె కాలి గజ్జెల ఘల్లు ఘల్లుమను శబ్దము తప్ప యింకే శబ్దము వినిపించకుండెను. పెదవులపై చిరునవ్వు చిందించుచున్న కృష్ణుని ఓరకంట చూచి అతని మెడలో మణులతో పొదిగిన హారమును వైచెను.

తరువాత వివాహ మహోత్సవము బ్రహ్మాండముగా జరిగెను.

కృష్ణుడు ఆమెను రథముపై కూర్చుండబెట్టి బయలుదేరనున్న సమయములో, స్వయంవరములో విఫలులైన యితర రాజులు అడ్డగించి యుద్ధమునకు తలపడిరి

కృష్ణుని దగ్గర నున్న అతి శక్తిమంతమైన శార్ఙమను ధనువును చూచి, వారందరును వెనుకకు మరలిరి క్రొత్త పెళ్ళికూతురితో కృష్ణుడు, దారుకుడు నడిపిన రథములో ద్వారక తిరిగి చేరెను

కృష్ణుని అష్ట మహిషులు సుఖ సంతోషములతో విలసిల్లుచుండిరి వారందరిలో రుక్మిణి కృష్ణునికి అత్యంత ప్రీతిపాత్రురాలు

## 237 నరకాసురుడు

నరకాసురుడు ఇంద్రునకు కాలిలోని ముల్లువలె నుండెను గొప్ప శక్తిమంతుడైన నరకాసురుడు తేలికగా ఇంద్రుని ఓడించెను. ఇంద్రుని తల్లి అదితి చెవుల నలంకరించిన విలువైన కుండలములను నరకాసురుడు తీసుకొనెను అతడు ప్రసిద్ధి కెక్కిన వరుణుని ఛత్రమును బలవంతముగా తీసుకు వెళ్ళెను ఇంద్రునికి యిష్టమైన మణి పర్వతము యిప్పుడు నరకుని వశమయ్యెను దేవతల నమితముగా నరకుడు వేధించుచుండుటచేత దేవతలు భరించలేకపోయిరి దేవతలు నిస్సహాయులు కాగా, ఇంద్రుడు కృష్ణుని దగ్గరకు వెళ్ళి తనకు సహాయము చేయుమని అర్థించెను.

కృష్ణుడందు కంగీకరించి, తనతో సత్యభామను తీసుకువెళ్ళెను. ప్రాగ్జ్యోతిష పురమునందు నరకాసురుడు నివసించుచుండెను. ఆ నగరము అన్ని పక్కల నుండి సురక్షితమగు విధముగా నిర్మించినది. నగరము చుట్టును అధిరోహించుటకు అసాధ్యమైన యెత్తైన కొండలు కలవు భయంకరమైన ఆయుధములను ధరించిన అసురులు నగరమును రక్షించుచుండిరి ఆయుధములు అసామాన్యమైనవి. వానిని ఛేదించుటకు వీలుగాక గొప్ప అడ్డంకిగా నుండెను వాయువు, అగ్ని, జల దేవతలు నగరమును రక్షించుటకు నియమితులైరి మురుడను అసురుడు యిచ్చిన వేలకొలది పాశములు కూడ నగర రక్షణను యినుమడింపజేసెను కృష్ణుడు ప్రాగ్జ్యోతిషపురము సమీపించెను. తన గద తీసుకుని మొదటి అడ్డంకిని — పర్వత పంక్తులు — తొలగించెను. అడ్డముగా నిలిచిన ఆయుధములను తన బాణములతో కృష్ణుడు ధ్వంసము చేసెను. తన చక్రమును ప్రయోగించి వాయువుతో, జలముతో యేర్పడిన అడ్డంకులను నిర్మూలించెను. తన కత్తితో మురుడు బిగించిన పాశములను కోసివేసెను

కృష్ణుడు విజయ శంఖము పాంచజన్యమును పూరించెను ఆ శంఖనాదము ప్రజల మనస్సులో భయము పుట్టించెను కృష్ణుడు తన గదను తీసుకొని కోటను కూల్చివేసెను. పాంచజన్యము పూరించిన శబ్దము విని మురాసురుడు నిద్ర నుండి లేచెను అతడు నీటి యందు నిద్రపోవుచుండెను నీటి అడుగు నుండి మురుడు పైకి వచ్చెను. అయిదు తలలు కలిగిన మురుడు శత్రువుల గుండెలలో భయమును పుట్టించుచుండెడివాడు అతని రూపము యుగాంతమందు సూర్యుడు, అగ్ని ప్రకాశించునట్లుగా నుండెను. అతడు త్రిశూలము

గాలిలో పైకెత్తి కృష్ణునిపైకి దూసుకు వచ్చెను. అతని అయిదు శిరస్సులు, పది భుజములు కృష్ణుని కబళించివేయు నట్లుండెను. మురునితో యుద్ధము చేయుటకు కృష్ణుడు గరుడునిపై అధిరోహించి వచ్చెను. మురుడు త్రిశూలమును కృష్ణుని వాహనమైన గరుడునిపైకి విసరెను. గరుడుడు తన అయిదు గొంతుకలతో గట్టిగా కేకపెట్టెను. తాను కోరుకున్నది సాధించితినని మురుడు భావించెను. గరుడుడు పెట్టిన కేకకు ముల్లోకములందు గాలి స్తంభించి ప్రతిధ్వనించెను.

కృష్ణుడు విల్లు నెక్కుపెట్టి మూడు బాణములతో గరుడునిపైకి విసరిన త్రిశూలమును విరిచివేసెను. ముఖములకు బాణములను గురిపెట్టి కృష్ణుడు మురునికి బాధ కలిగించెను. మురుడు బాధతో, కోపముతో మండిపడి గదను కృష్ణునిపైకి విసరెను. కృష్ణుడు తన గదతో మురుని గదను ముక్కలు ముక్కలు చేసెను. తన పది భుజములు పైకెత్తి కృష్ణుని మీదకు దూకెను. కృష్ణుడు తన చక్రమును ప్రయోగించి మురుని అయిదు శిరస్సులు ఖండించగా, ఇంద్రుని వజ్రాయుధము నరకిన పెద్ద పర్వతము రెక్కలవలె, మురుడు నీటిలో పడెను.

మురునికి యేడుగురు పుత్రులు కలరు. వారు తామ్ర, అంతరిక్ష, శ్రవణ, విభావసు, వసు, నభస్వ, అరుణులు. ఒక సామాన్య మానవుని చేతిలో తమ తండ్రి తేలికగా నిహతుడయ్యెనని వారు విచారించిరి. వారి దుఃఖము క్రోధముగా రూపొంది, కృష్ణునితో యుద్ధము చేయుటకై నగరము వెలుపలికి వచ్చిరి. నరకాసురుడు పంపిన 'పీఠుడు' అను సేనాధిపతి వారికి నాయకత్వము వహించెను. కొద్ది క్షణములలో కృష్ణుడు వారందరినీ నాశనము చేసెను.

భూమి పుత్రుడైన నరకాసురుడు, మురుడు, అతని పుత్రులు కృష్ణునిచే హతమైనారని తెలుసుకొని ఆశ్చర్య పడెను. అతడు నగరము దాటి బయటకు వచ్చెను. అతని వెంట ఏనుగుల సేనాబలము బయలుదేరెను. అవి ఐరావత వంశమునకు చెందిన ఉత్తమ జంతువులు; పాల సముద్రము నుండి జన్మించిన వాని గండ స్థలముల నుండి స్రవించుచున్న మదగంధముతో గాలి నిండి గుబాళించుచుండెను. ఏనుగుల సేనాబలము చూచుటకు చాల అద్భుతముగా గోచరించెను.

నరకుడు బయటకు వచ్చి నిలుచుండెను. అతడు చుట్టును పరికించి, గరుడ వాహనముపై కృష్ణుడు సత్యభామతో నుండుట జూచెను. వర్ష మేఘమును ప్రకాశింపజేయు మెరుపువలె, కృష్ణుడు నరకాసురునకు కన్పించెను. నరకాసురుడు శతఘ్ని అను అస్త్రమును ప్రయోగించెను గరుడుని, కృష్ణుని ఎదుర్కొన్న సేనాబలము కృష్ణుని బాణములచేత హతమయ్యెను. ఏనుగులు చాలవరకు కృష్ణుని చేతను, గరుడుని చేతను హతమయ్యెను. మిగిలినవి దెబ్బలతినెను. కృష్ణునిపై ప్రయోగించిన అస్త్రము విఫల మయ్యెనని నరకునకు కోపము వచ్చెను. అత డతి భయంకరముగా పోరాడెను. కాని గరుడుడు యే మాత్రము చెక్కు చెదరకుండెను, చిన్న పర్వతము వలె స్థిరముగా నిలుచుండెను. నరకుడు తన 'శక్తి'ని ప్రయోగించి గరుడునికి బాధ కలిగింప యత్నించెను. అది కూడ వృథా అయ్యెను. తర్వాత కృష్ణుని సంహరించుటకు నిశ్చయించుకుని త్రిశూలము తీసుకొనెను. అతడు త్రిశూలమును విసరక మునుపే కృష్ణుడు తన చక్రముతో నరకాసురుని శిరస్సు ఖండిం శరీరము నుండి వేరు చేసెను.

నరకుని శిరస్సు నేలపై పడగానే స్వర్గములో ఆనందోత్సాహములు వెల్లివిరిసెను. నరకుని తల్లి భూమ కృష్ణుని వద్దకు వచ్చి వైభవముగా నున్న అదితి కుండలముల నతని పాదముల వద్ద నుంచెను. వరుణ

చిహ్నమైన ఛత్రమును, చివరకు మణి వంటి మేరు పర్వత శిఖరమను మందారమును ఆమె కృష్ణునికి సమర్పించెను. ఆమె చేతులు జోడించి కృష్ణుని ముందు విలబడి స్తుతించి యిట్లనెను ''ప్రభూ! అనేక సంవత్సరముల క్రిందట హిరణ్యాక్షుడు నన్ను రసాతలమునకు తీసుకువెళ్ళినపుడు, నీవు వరాహ రూపము ధరించి సముద్ర గర్భము నుండి నన్ను పైకి తీసుకు వచ్చినావు. అపుడు నీవు నన్ను ఆలింగనము చేసిన ఫలితముగా యీ నరకుడు నాకు జన్మించినాడు. ఆనాడు నీవు అతనిని నాకిచ్చినావు, యీనాడు తిరిగి నీవే తీసుకున్నావు దయతలచి నా పుత్రుడు నరకుని బ్రతికించి పుత్ర భిక్ష పెట్టుము''

భూమాత కృష్ణుని పాదముల వద్ద నరకు నుంచి ప్రార్థింపగా, కృష్ణుడు నరకుని పునరుజ్జీవింపజేసి లేవనెత్తెను. అతని చేయి పట్టుకుని కృష్ణుడు ప్రాగ్జ్యోతిష పురములో ప్రవేశించెను. అచట చాలమంది అందమైన స్త్రీలను కృష్ణుడు చూచెను. అనేకులు రాజులను, దేవతలను, నాగులను జయించి వారి వారి పురములలో నున్న స్త్రీల నందరిని జరాసంధుడు ప్రాగ్జ్యోతిష పురమునకు తీసుకు వచ్చెనని కృష్ణుడు తెలుసుకొనెను వారు పదునారు వేల నూర్గురు కన్యలు అతడు వారందరినీ ద్వారకా నగరమునకు పంపెను ప్రాగ్జ్యోతిష పురమునకు గర్వకారణమైన అరువది నాలుగు శ్వేత మాతంగములను కూడ ద్వారకా

అదితి కుండలములు తన చేతులోనికి తీసుకుని స్వర్గమునకు వెళ్ళి స్వయముగా ఇంద్రునకు తిరిగి యిచ్చివేయవలెనని సంకల్పించి, సత్యభామతో కలసి గరుడ వాహనముపై స్వర్గమునకు వెళ్ళెను అత్యంత ఉత్సాహముతో ఇంద్రుడు వారికి స్వాగత మొసగి, తమకు రక్షకుడైన కృష్ణుని గౌరవించెను. ఇంద్రాణి సత్యభామకు ఆదరపూర్వకముగా స్వాగతము పలికెను. భూలోకము నుండి వచ్చిన దంపతులు స్వర్గలోకము లోని దంపతులతో కొంత కాలము గడపిరి.

ఒకరోజు స్వర్గములోని అపురూప దృశ్యములు చూచుచున్న సత్యభామ పారిజాత వృక్షము జూచెను పారిజాత పుష్పముల సుగంధము భూలోకవాసులు యెరుగరు. సత్యభామకు పారిజాత వృక్షముపై ప్రీతి కలిగి, కృష్ణుని ఆ వృక్షమును తనకు తెచ్చిపెట్టమని అడిగెను

భామ కోరుటచేత పారిజాత వృక్షమును తనతో తీసుకు వెళ్ళెదనని కృష్ణుడు ఇంద్రునితో చెప్పెను స్వర్గములోని వస్తువులను భూలోకవాసులు చూడరాదని ఇంద్రుడు పారిజాత వృక్షము నిచ్చుటకు నిరాకరించెను.

మొదట కృష్ణున కిది వింతగా తోచెను తరువాత ఇంద్రుని ప్రవర్తనకు ఆగ్రహము కలిగెను తోటలో నుండి పారిజాత వృక్షము పెరికి గరుడునిపై పెట్టి భామతో కలసి భూలోకమునకు తిరిగి వచ్చెను ఇంద్రుడిది సహించలేకపోయెను. అతడు ఆకాశములో కృష్ణునితో యుద్ధము చేసెను. దేవగణములు చెల్లాచెదురయ్యెను. ఇంద్రుడు ఓడిపోయెను కృష్ణుడు పారిజాత వృక్షమును సత్యభామ తోటలో నాటెను. నరకునిచే బాధపడుచున్నపుడు ఇంద్రుడు వచ్చి కృష్ణుని పాదములపైబడి సహాయము చేయుమని కోరగా అతని కోరికను కృష్ణుడు మన్నించెను. అతని కోరిక తీరిన తర్వాత, తిరిగి ఇంద్రుని మనస్సు అహంకారముచేత కలుషితమై, సంపద అధికార గర్వముతో పారిజాత వృక్షమును కృష్ణుని కివ్వ నిరాకరించెను ధన ప్రభావ మతి విచిత్రము! కొంతసేపు కృష్ణుడీ విషయమై తలపోసి, తర్వాత ఆ విషయమును పూర్తిగా మరచిపోయెను

★ ★ ★

## రుక్మి కుమార్తె

రుక్మి, తన సోదరితో తప్ప, కుండిన పురము ప్రవేశించనని చేసిన ప్రతిజ్ఞకు కట్టుబడియుండెను. అతడు భోజకటకమను నగరము నిర్మించి అందు నివసించుచుండెను. అతనికి రుక్మావతి యను కుమార్తె గలదు. ఆమె కేర్పరచిన స్వయంవరమునకు కృష్ణుని కుమారుడు ప్రద్యుమ్నుడు వెళ్ళెను. తన కుమార్తె శత్రువు కుమారునిపై మక్కువ కలిగి యున్నదని రుక్మి తెలుసుకుని ఆశ్చర్యపడెను! ఆమె మనస్సును మళ్ళించుటకు ప్రయత్నించెను. ఆమె తన్ను యెంచుకున్నదని ప్రద్యుమ్నుడు గ్రహించి, బలాత్కారముగా ఆమెను తోడ్కొనిపోయెను.

రుక్మి, అతని నడ్డగించుటగాని అతనితో యుద్ధముగాని చేయకుండెను. తన సోదరిపై విశేషమైన ప్రేమాభిమానము లుండుటచే అమె కుమారునితో యుద్ధము చేయుట కిష్టపడకుండెను.

రుక్మావతి ప్రద్యుమ్నులకు అనిరుద్ధుడను కుమారుడు కలిగెను. తండ్రి తాతల వలె అనిరుద్ధుడు కూడ అపురూప సౌందర్యవంతుడు.

## 238 బాణాసురుడు

వామనావతారమందు బలిచక్రవర్తిని మూడడుగుల భూమిని వామనుడు కోరెను. బలిచక్రవర్తి ప్రదర్శించిన భక్తికి సంతసించి, పాతాళ లోకమున బలి చక్రవర్తి ద్వార పాలకుడుగా నుండగలనని నారాయణుడు మాట యిచ్చెను. మరియు బలి నారాయణునికి పరమ భక్తుడైన ప్రహ్లాదుని మనుమడు.

బలి చక్రవర్తికి నూర్గురు పుత్రులు. వారిలో జ్యేష్ఠుడు బాణాసురుడు. అతడు మహాదేవునికి పరమ భక్తుడు. అతడు సత్పురుషుడగుటచేత ముల్లోకములలోని ప్రజల గౌరవ మర్యాదలందుకొనెను. అతడు గొప్ప దానశీలి, సత్యవంతుడు, మరియు విశేషమైన తెలివితేటలు గలవాడు. అతడు నియమ నిబంధనల నతిక్రమించకుండ శోణిత పురమును పాలించుచుండెను. అతనికి మహాదేవునిపైగల ప్రేమచేతను, మహాదేవునికి పరమభక్తుడగుట చేతను, దేవతలందరును బాణాసురుని సేవకులవలె సేవచేయుచుండిరి.

ఒకసారి మహాదేవుడు తాండవ నృత్యము చేయుచున్నపుడు, బాణాసురుడు తన వెయ్యి చేతులతో మహాదేవుని నాట్యమున కనుగుణముగా మృదంగమును వాయించెను. అందుకు మహాదేవుడు సంతసించి యేదైన వరమును కోరుకొమ్మని బాణాసురు నడిగెను. ఇంతలో బాణాసురునిలో కొద్దిగా అహంభావము అంకురించెను. మహాదేవునికి తనపై ప్రేమ కలదని గ్రహించెను. దానితో అతని అహంభావము మరికొంత పెరిగెను. తన శిరస్సును మహాదేవుని పాదములపై పెట్టి యిట్లనెను. ''మహాప్రభూ! నాకు విసుగు కలుగుచున్నది''.

''ఈ లోకములో నా శక్తితో సరితూగగలవారు నీవు తప్ప యింకొకరు లేరు నీవు ప్రసాదించిన యీ వెయ్యి చేతులకు తగినంత పనిలేకపోవుటచేత అవి బరువు చేటు. నేను వెళ్ళి పర్వతము లన్నిటిని శిథిలము చేసినాను. అష్టదిక్కులను రక్షించు దిగ్గజములను కవ్వించగా అవి భయపడి నాకు దూరముగా తొలగిపోయెను.

''నాతో యుద్ధము చేయువాడొకడు కావలెను. బలవంతు డెవడైనను గలడా? అదియే నేను కోరు వరము''

బాణాసురునికి అంత్యకాలము సమీపించుచున్నదని గ్రహించి, మహాదేవు డిట్లనెను ''ఓరి మూర్ఖుడా! నీవు యితరులకన్న భిన్నమైనవాడవని తలచినాను. నీవు బుద్ధి నెరిగి వర్తించగలవనుకున్నాను. నీవు కూడ అహంకారమునకు వశమైపోయినావు నీ కోరిక నెరవేరగలదు నా మాట నమ్ముము నీ ధ్వజము విరిగి నేలమీదపడినపుడు, నీవు నాతో సరిసమాన శక్తిగల వానితో పోరాడెదవు. నీ అహంకారమునకు తగిన శిక్షను పొందెదవు''

## 239 ఉషా పరిణయము

బాణాసురుని కుమార్తె ఉష చాల అందగిత్తె ఒకరోజు ఆమె స్వప్నము గాంచెను స్వప్నములో ఆమె అదివరకెన్నడును చూడనటువంటి అపురూప సౌందర్యవంతుని జూచెను. ఆమెతో అతడా రాత్రి గడపెను. ఆమెకు తెలివి వచ్చిన తర్వాత అదియొక స్వప్నమని ఆమె తెలుసుకొనెను ఆమె సఖి, మంత్రి కుమార్తె చిత్రలేఖ ఉష కంట తడిపెట్టుట చూచెను

''ఎందుకు నీవు బాధపడుచున్నావు, మిత్రురాలా?'' అని ఆందోళనా పూరిత స్వరముతో చిత్రలేఖ ఉష నడిగెను. ''ఇదివరకెన్నడును నేను నిన్ను యిట్లు చూడలేదు. ఏమి జరిగెనో చెప్పుము'' ఉష యిట్లనెను. ''జరిగినది చెప్పుటకు నీవు తప్ప నాకు యింకెవ్వరును లేరు గితరాత్రి ఒక అపురూప సౌందర్యవంతుని కలలో చూచితిని అతడు యువకుడు. అతని నేత్రములు కలువ పువ్వు రేకులను పోలియున్నవి అతడు పసుపుపచ్చని పట్టు వస్త్రము ధరించెను అతని చేతులు పొడవుగా అందముగా నుండెను. అతడు నన్ను విడిచిపెట్టి వెళ్ళుటచేత దుఃఖములో మునిగియున్నాను'' చిత్రలేఖ రెండు చేతులలో ఉష తన తల నుంచి విపరీతముగా దుఃఖించసాగెను చిత్రలేఖ యిట్లనెను ''వినుము! బహుశః యిది సరకు ఒక యువకుని చూచి యుండవచ్చును. నీ ఆలోచనలు అతనికి నీ స్వప్న ప్రపంచములో ప్రవేశము కల్పించి స్వప్నములో నీకు అతడే సమస్తముగా తోచునట్లు చేసినవి. నీ మనస్సే యీ స్వప్న దృశ్యమును సృష్టించెను ఇది వరకెన్నడును చూడని వ్యక్తిని స్వప్నములో నీవు చూచుట అసంభవము. ఉషా! ఆలోచించుము. నీవు అతడిని చూచితివా?''

ఉష యిట్లనెను ''కాని నేను చెప్పుచున్నది వినుము. ఈ పురుషుని నేనిదివర కెన్నడును చూడలేదు నేను చూచినట్లయిన అతనిని నేను మరువగలనా? చిత్రా! నేనేమి చేయవలెనో తెలియుట లేదు. ఈ రోజు రాత్రి కూడ అతనిని స్వప్నములో చూడగలనందువా? అతని చూడవలెనని నా ఆశ''. చిత్రలేఖ యోచించి యిట్లనెను ''చూడు! నేను చిత్రకళ నేర్చితిని. నారద మహర్షి నాకు యీ చిత్రకళను నేర్పెను నేను దేవతల, భూలోకములో నున్న రాజుల, సౌందర్యవంతులుగా ప్రసిద్ధికెక్కిన పురుషుల చిత్రములు వేసెదను. అందులో నీ ప్రియుడెవరో చెప్పుము''

చిత్రలేఖ చిత్రములు వేయుట మొదలుపెట్టెను. మొదట యే కార్యము నైనను ప్రారంభించునపుడు విఘ్నములు కలుగకుండుటకు గణేశుని చిత్రము వేసెను. తరువాత దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు, పన్నగులు, దైత్యులు, విద్యాధరులు, యక్షుల చిత్రములను గీసెను. ప్రతి ఒక్క చిత్రమును చూచి ఉష తల అడ్డముగా త్రిప్పి యిట్లనెను. ''ఇతడు కాదు. నా ప్రియు డింతకన్న సౌందర్యవంతుడు''. ఈ విధముగా చిత్రలేఖ చిత్రములు వేయుట, ఉషవారెవరును కాదనుట కొనసాగెను చిత్రలేఖ భూలోకములోని రాజుల చిత్రములు వేయుట మొదలుపెట్టెను. ఉష ఒకొక్క చిత్రమును చూచి కాదని తిరస్కరించుచుండెను యాదవ కుటుంబములోని వారి చిత్రములను చూచి ఉష యిట్లనెను. ''నీవు చిత్రీకరించిన యీ పురుషునకు నా ప్రియుని పోలికలు కొంతవరకు కన్పించుచున్నవి. ఎవరీతడు?''

అతడు వసుదేవుడు తరువాత చిత్రలేఖ బలరామకృష్ణుల చిత్రములను వేసెను ఉషకు యీ చిత్రములందు, ముఖ్యముగా కృష్ణుని చిత్రములో తన ప్రియుని పోలికలు చాల వరకు స్పష్టముగా కనుపించెను తరువాత చిత్రలేఖ ప్రద్యుమ్నుని చిత్రము వేసెను ఆ చిత్రము చూచి, ''ఈ చిత్రములో నా ప్రియుని పోలికలు బాగుగా గోచరించుచున్నవి. కాని నా ప్రియుడు యింతకన్న యువకుడు'' చివరకు చిత్రలేఖ అనిరుద్ధుని చిత్రము వేయగా దానిని ఉష చూచెను. సిగ్గుతో ముంచుకున్న ఉష వదనము చూచి తప్పక అతడే ఉష ప్రియుడని చిత్రలేఖ భావించెను ఆమె ఉషను చూచి నవ్వి యిట్లనెను ''నీ హృదయమును దొంగిలించిన దెవరో యిప్పుడు నాకు తెలిసెను. నేను అతనిని దొంగిలించి నీ వద్దకు తీసుకు వచ్చెదను''.

''ఎట్లు?'' కనులు బాగా వెడల్పు చేసి ఉష అడిగెను.

''వేచి చూడుము'' అని చిత్రలేఖ సమాధానమిచ్చెను

చీకటి పడెను. చిత్రలేఖ యోగ విద్యలో నిష్ణాతురాలు. ఆమె గాలిలో యెగిరి ద్వారకా నగరము చేరుకొనెను ఆమె రాజ సౌధము లోపలి ప్రాంగణములో ప్రవేశించి కొంచెముసేపు వెదకిన తర్వాత మంచముపై నిద్రించుచున్న అనిరుద్ధుని కనుగొనెను అతని శరీరమును పైకెత్తి పట్టుకుని శోణితపురమునకు తీసుకువచ్చి ఉష ప్రక్కనే విడిచి పెట్టెను

కోమల పుష్పముల వంటి చేతులు అతనిని మృదువుగా తట్టి లేపగా అతడు నిద్ర నుండి లేచి కళ్ళు తెరచెను. కాని ఒక అందమైన యువతి తన్ను ప్రేమించుచున్నట్లు కల గాంచితినని అతడు భావించెను జరిగిన విషయము అతడు తెలుసుకొను సరికి కొంత సమయము పట్టెను

చిత్రలేఖ, ఉష , అనిరుద్ధుని అంతఃపురములో దాచివేసిరి. ఈ విషయ మెవరును గమనించలేదు కాలము గడచుచుండెను ప్రియులైన ఉషా అనిరుద్ధులకు కాలము తెలియకుండెను వారిద్దరిని మంచి కట్టు దిట్టముగా చిత్రలేఖ కావలి కాయుచు రక్షించుచుండెను కాని, యెట్లో సేవకులకు యీ విషయము తెలిసెను ఉష వదనమందు యెన్నడును లేని ఉత్సాహానందములు వెల్లివిరియుట ఒకొక్కరే చూచిరి పురుష ప్రేమ వల్లనే అటువంటి ఆనందమును స్త్రీ కన్నులలో చూడగలమని వారికి తెలియును ఉష ప్రేమలో పడెనని, ఆమె ప్రియుడు కూడ అక్కడనే యుండెనని సేవకులు గ్రహించిరి

వెంటనే వారు బాణాసురునితో యిట్లనిరి ''ప్రభూ! తమ కుమార్తె అంతఃపురములో జరుగుచున్న

విషయములు కొన్నిటిని తమకు విన్నవించ దలచితిమి. మేము ఆమెకు జాగ్రత్తగా కావలి కాయుచు రక్షించుచున్నాము. కాని యెట్లో ఒక పురుషుడు ఆమె అంతఃపురములో ప్రవేశించి, కొంత కాలముగా ఉంటున్నాడని తోచుచున్నది. ఇప్పటి వరకు మాకు నిశ్చయముగా తెలియలేదు. కాని యిప్పుడు అంతఃపురములో ఒక పురుషు డున్నట్లు స్పష్టముగా తెలియుటచేత మీకు ఆ విషయము తెలుపుట మా కర్తవ్యము ఏమి చేయవలెనో అది మీ యిష్టముపై ఆధారపడియున్నది''.

బాణాసురుడు ఉష అంతఃపురమునకు వచ్చెను అకస్మాత్తుగా వచ్చిన బాణాసురుడు యేమి జరుగుచున్నదో కనుగొనెను. కృష్ణుని మనుమడు అనిరుద్ధుడు, ఉష మంచముపై కూర్చుని జూదము ఆడుచుండిరి. ఒక క్షణము అతని అందమునకు బాణాసురుడు అచ్చెరువొందెను

అనిరుద్ధుని చుట్టును కావలివారు మూగిరి. బాణాసురునితో కావలివారితో అనిరుద్ధుడు పోరాడుటకు ప్రయత్నించెను యువకుని పట్టుకొనుట అతి కష్టసాధ్యమని తలచి, నాగపాశముతో ఉష ప్రియుడైన అనిరుద్ధుని బంధించెను ఉష యేడ్చుచు, దుఃఖించుచున్నప్పటికిని ఆమె తండ్రి లెక్కచేయకుండెను

ఈలోపుగా ద్వారకలో విచారము అలముకొనెను. యువరాజు సౌధములో కనుపించకుండెను ఎంత గాలించి నప్పటికిని అతని జాడ వారికి తెలియకుండెను అతడు యెక్కడకు వెళ్ళెనో యేమి జరిగెనో తెలుసుకొనుటకు యెటువంటి గుర్తులు గాని చిహ్నములుగాని వారికి గోచరించలేదు. నాలుగు మాసములు గడచెను

నారదుడు కృష్ణుని వద్దకు వచ్చెను అన్నదమ్ము లిద్దరును ఆతురతతో నారదుని ఆహ్వానించి ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి గౌరవ మర్యాదలు సలిపిరి నారదుడు వారిని చూచి యిట్లడిగెను ''మీరేదో కార్యములో నిమగ్నమైనట్లున్నారు. మీలో ఆందోళన గోచరించుచున్నది. ఏమి జరిగినది?''

కృష్ణు డిట్లనెను. ''మేము యెందుకు ఆందోళన చెందుచున్నామో నీకు తెలియకపోలేదు అయితే నీవు అట్లు అడుగవలసి యుండుటచే అడుగుచున్నావు''. నారదుడు చిరునవ్వుతో కృష్ణుని చూచుచుండగా, కృష్ణుడు మరల నిట్లు కొనసాగించెను. ''నా మనుమడు అనిరుద్ధుని గురించి ఆందోళన చెందుచున్నాము ఒకరోజు రాత్రి అకస్మాత్తుగా అత డదృశ్యమయ్యెను ఇప్పటికి చాల రోజులు గడచెను కాని అతడు యెక్కడ నున్నదియు వివరములు తెలియుటలేదు. నీవే మాకు సహాయము చేయగలవు. అతడెక్కడ మన్నాడో దయచేసి చెప్పుము''.

''అతడెక్కడున్నదియు నాకు తెలుసును'' అని నారదుడనెను

''ఎక్కడ'' అని బలరామకృష్ణులు ఆత్రముతో నడిగిరి. ''ఎక్కడ ఉన్నాడు?''

''అతడిప్పుడు బందీగా నున్నాడు'' అని నారద మహర్షి చెప్పెను ''బాణాసురుడు నాగపాశముతో బంధించి అనిరుద్ధుని బందీగా తీసుకొనెను''

''మునీంద్రా! అది యెట్లు జరిగెను?'' అని ఆశ్చర్యముతో అన్నదమ్ములు నారదుని అడిగిరి. ''అతనికి బాణాసురునితో శత్రుత్వము లేదు అసలు బాణాసురు డనువాడు ఉన్న విషయ మత డెరుగడు''

''మీరన్నది నిజమే'' అని నారదుడు పలికెను. ''అనిరుద్ధునికి బాణాసురునితో శత్రుత్వము లేదు కాని

అనిరుద్ధునిపై బాణాసురునికి తీవ్రమైన దురభిప్రాయ మేర్పడనది '' ఒక్క నిముషము అన్నదమ్ము లిద్దరును మౌనముగా నుండిరి. తరువాత కృష్ణు డిట్లనెను ''అనిరుద్ధుని బందీగా తీసుకొనుటకు వెనుక యేదో కథ యున్నట్లు స్పష్టముగా గోచరించుచున్నది మునీంద్రా! ఏమి జరిగెనో దయచేసి చెప్పవలెను''.

''నేను అందుకొరకే వచ్చితిని. మీరు కథ విని తప్పక ఆనందించగలరు'' అని నారదుడు, ఉషస్వప్నములో అనిరుద్ధుని గాంచిన వృత్తాంతము, ఆమె విచారము, ఆమె ప్రేమించిన యువకుడెవరో తెలుసుకొనుటకు చిత్రలేఖ చేసిన ప్రయత్నములు, ఆమె వేసిన చిత్రపటములు మొదలైన వన్నియు వివరముగా తెలిపెను. మరియు చిలిపిగా నవ్వి నారదు డిట్లనెను ''కృష్ణా! చిత్రలేఖ వేసిన వీ చిత్ర పటమును ఉష చూచి యిట్లనెను. 'నా ప్రియుడు సుమారుగా యిట్లే యున్నాడు కాని యింతకన్న అందముగా, యువకుడుగా నున్నాడు' ''

''కృష్ణా!'' అని బలరాముడు, ''నీవు అందముగా నుండిన రోజులు గతించినవి. నీ మనుమడు, ఒక అసుర కుటుంబములోని కన్యామణికి నీకంటె అందముగా కన్పించెను!'' బలరాముని మాటలకు కృష్ణుడు నవ్వి, నారదుని వైపు కథను కొనసాగించుమన్నట్లుగా చూచెను తన స్నేహితురాలిని సంతృప్తి పరచుటకు చిత్రలేఖ అనిరుద్ధుని తీసుకువెళ్ళిన తీరు నారదుడు వివరించెను. ఈ విషయము బాణాసురున కెట్లు తెలిసెనో, అతడు అంతఃపురమునకు వచ్చి మంచముపై కూర్చుని ఉషా అనిరుద్ధులు జూద మాడుట చూచిన విషయము విపులముగా నారదుడు చెప్పెను.

బలరాముడు బిగ్గరగా నవ్వెను తన మనుమని కృత్యములను విని ఆనందించెను

కొంతసేపటికి అన్నదమ్ము లిద్దరును గంభీర వదనములతో యిట్లనిరి. ''మనము వెళ్ళి యిప్పుడు యువకుడైన అనిరుద్ధుని తప్పించవలసి యున్నది''.

## 240 బాణాసురుని నగరముపై దాడి

కృష్ణుడు పెద్ద సేనతో శోణితపురము వైపు వెళ్ళెను. బలరాముడు, సాత్యకి, ప్రద్యుమ్నుడు, యితర యాదవ ప్రముఖులు కృష్ణుని వెంట వెళ్ళిరి. వారు బాణుని నగరమును అన్నివైపుల నుండి ముట్టడించిరి. యాదవ సైన్యము పన్నెండు అక్షౌహిణులు దానికి సరిసమానమైన బలగముతో బాణాసురుడు యుద్ధము చేయుటకు వచ్చెను. ఈ యుద్ధములోని ప్రత్యేకత యేమనగా కృష్ణునకు మహాదేవునికి మధ్య జరిగిన పోరాటము. మహాదేవుడు తన భక్తుని పక్షమున పోరాడుటకు పుత్రుడు కుమారస్వామిని వెంటబెట్టుకుని వచ్చెను. కృష్ణుడు మహాదేవునితో, ప్రద్యుమ్నుడు కుమారస్వామితో యుద్ధము చేసిరి బలరాముడు బాణుని మంత్రుల నెదుర్కొనెను

కృష్ణుడు శార్ఙ్గమును, మహాదేవుడు పినాకమును విరివిగా ఉపయోగించి పోరాడిరి వీరిద్దరి మధ్య జరుగుచున్న యుద్ధమును చూచుటకు స్వర్గములో దేవతలు సమావేశమైరి, జృంభణాస్త్రము ప్రయోగించగా అది మహాదేవుని నిద్రపోవునట్లు చేసెను అప్పుడు కృష్ణుడు యితర సైన్యముతో పోరాడ మొదలిడెను.

తన సైన్యమునకు కలుగుచున్న హానిని గుర్తించి, బాణాసురుడు మొదట సాత్యకితో యుద్ధము చేసి, తర్వాత అతనిని విడిచిపెట్టి కృష్ణునితో యుద్ధము చేయుటకు తలపడెను. బాణుడు తన వద్దనున్న అనేక బాణములను ప్రయోగించెను కృష్ణుడు వాటి నన్నిటిని విరిచివేసెను. యుద్ధ విరామ సమయములో బాణాసురుడు కోట లోపలికి వెళ్ళి కొంత విశ్రాంతి తీసుకున్న తర్వాత శక్తిని పుంజుకుని తిరిగి యుద్ధము చేయుటకు వచ్చెను అతడు విరంతరముగా యుద్ధము చేయుటకు సంకల్పించినట్లు కన్పించెను కృష్ణుడు తన చక్రముతో అతని భుజములను ఖండించెను

చాలమంది సైనికులు నేలగూలిరి. అప్పుడు మహాదేవుడు కల్పించుకుని యిట్లనెను ''కృష్ణా! బాణాసురుడు నాకు పరమ భక్తుడు అతడు హతుడు కారాదని నా కోరిక ఇంతవరకు అతనిని నేను రక్షించితిని. ప్రాణ రక్షణకు అతడు నాపై ఆధారపడి యున్నాడు. అతనిని సంహరించకుము'' కృష్ణు డిట్లనెను ''మహాదేవా! నీ ఆజ్ఞను నేను తప్పక మన్నించెదను ఈ బాణాసురుడు నాకు భక్తుడైన బలి చక్రవర్తి కుమారుడు అంతేకాక, ప్రహ్లాదుని వారసు లెవరును నాచేత నిహతులు కారు

''నేను ప్రహ్లాదునికి ఆ విధముగా వాగ్దానము చేసితిని. తన బలమును చూచుకుని విర్రవీగుచున్న బాణుని గర్వము నణచుటకు అతని భుజములను ఖండించితిని ఈ బాణుడు యెల్లప్పుడును నీకు సేవకులలో నొకడుగా నుండగలడు అతడెవరికిని భయపడనక్కరలేదు'' మాటలకందని విధముగా బాణాసురుడు, గర్వమణగిపోవు టతో, బలరామకృష్ణులకు ప్రణమిల్లెను. అతడు లోపలకు వెళ్ళి ఉష అనిరుద్ధులను రథముపై కూర్చుండబెట్టి కృష్ణుని వద్దకు తీసుకు వచ్చెను వేడుకలు ఆనందోత్సాహముల మధ్య యువ దంపతులు ఉషా అనిరుద్ధులు ద్వారకకు ప్రయాణమైరి

## 241 నృగ మహారాజు

ఒకసారి యాదవ ప్రముఖుల పుత్రులు సాంబ, ప్రద్యుమ్నాదులు నగరపు పొలి మేరలోని తోటలో ఆడుచుండిరి. వారు చాలసేపు ఆడుటచేత అలసిపోయిరి దాహము వేసెను దాహము తీర్చుకొనుటకు బావి, చెరువు లేక నది యేదైన నున్నదేమోనని వెదకుచుండగా వారికొక బావి కన్పించెను వారు బావిలోనికి తొంగిచూచిరి ఆ బావిలో ఒక చుక్క నీరైనను లేక యెండిపోయెను వారు ఆ తోటలో నున్న బావిలో ఒక పెద్ద బల్లిని చూచిరి. చాల పెద్ద పరిమాణములో నున్న బల్లి వారికి వింతగా కన్పించెను ఆ బల్లిని చూచుటతో వారు తమ దాహము గురించి మరచిపోయిరి. ఆ బల్లిని చూచి జాలితో బావిలో ప్రమాదవశాత్తు పడినదని భావించి వారు దానిని పైకి తీయుటకు ప్రయత్నించిరి

ముందు సన్నని దారమును, తరువాత బలమైన దారమును, అటుపిమ్మట బలమైన ... లాగుటకు ప్రయత్నించిరి. కాని వారు బయటకు తీయలేకపోయిరి. అసాధారణమైన ఆ బల్లిని చూచి వారు ఆశ్చర్యపోయి, కృష్ణుని దగ్గరకు వెళ్ళి యీ విషయము చెప్పిరి. తమతో వచ్చి ఆ బల్లిని చూడవలసినదని వారు కృష్ణుని బలవంతము చేసిరి

కృష్ణుడు వెళ్ళి ఆ బల్లిని చూచి, తన యెడమ చేతితో దానిని బయటకు తీసెను ఆశ్చర్యముతో యాదవ

కుమారులు చూచుచుండగా బల్లి రూపము మారెను ఒక దివ్యరూపము వారి ముందు నిలిచి యుండుట చూచిరి అతని బంగారు ఛాయ, ధరించిన వస్త్రములు, మెడలోని పుష్పహారములు చూడగా అతడు స్వర్గలోకము నుంచి వచ్చినవాడని తోచును అతడు కృష్ణునికి ప్రణమిల్లి రెండు చేతులు జోడించి నిలుచుండెను అతని నేత్రములు ఆనంద బాష్పములతో నిండియుండెను

కృష్ణుడు అతని విట్లడిగెను. ''నీవు స్వర్గవాసులలో ఒకడవై యుండవచ్చును నీవు పూర్వ జన్మలో యే పాపకర్మము గావించినందువల్ల నీకీ బల్లి రూపము సంప్రాప్తించెనో, నీకభ్యంతరము లేకపోయినచో మాకు తెలియచెప్పుము నీ కథ వినుటకు మేము కుతూహలముతో ఆతురతతో నున్నాము. దయచేసి దానిని వివరింపుము''

అతడు తలవంచి మరొకసారి కృష్ణునికి పాదాభివందనము చేసి యిట్లనెను

''మహాప్రభూ! నేను సూర్యవంశములోని ఇక్ష్వాకు రాజు పుత్రుడను. నా పేరు నృగుడు ఆ రోజులలో పేరు ప్రఖ్యాతులు పొందినవాడను. విరివిగా దాన ధర్మములు గావించిన వారిలో నన్ను కూడ చేర్చి చెప్పెదరు నీవు నా గురించి విని యుందువు నీవు సమస్త దైవములకు దైవము. అందరి మనస్సులలో యేమి యున్నదో నీవు గమనించుచుందువు నీవు కాల స్వరూపుడ వగుటచేత నీకు భూత భవిష్య ద్వర్తమానము లన్నియు తెలియును నీకు తెలియని దేదియులేదు. అయినప్పటికిని నీవు ఆజ్ఞాపించుటచేత నా జీవిత కథను నీకు చెప్పెదను ఈ యువకులు వినవచ్చును.

''మొదట నన్ను గురించి గొప్పలు చెప్పుట లేదని మనవి చేయుచున్నాను. నేను సత్యము చెప్పుచున్నాను. నీవు బహుశః యీ భూమిపై నున్న యిసుక రేణువులను, ఆకాశమందు ప్రకాశించుచున్న నక్షత్రములను, వర్షాకాలమందు యీ భూమిపైబడిన వర్ష బిందువులను లెక్కపెట్టగలవు కాని నేను బ్రాహ్మణులకు యిచ్చిన గోదానములను యెవరును లెక్కపెట్టజాలరు

''పది భిన్న జాతులకు చెందిన ఉత్తమ కపిల గోవులను దానము చేసినాను దాన గ్రహీతలందరును పేద అమాయక బ్రాహ్మణులు, ధర్మపరులు, దైవభీతి కలవారు, సత్పురుషులు, గోవులను అభిమానముగా చూచి సద్వినియోగము చేయువారు నేను యింకను యితర విధములైన గోవులను, భూమిని, బంగారమును, అశ్వములను, గజములను, యింకను యెన్నో వస్తువులను దానము చేసితిని. అనేక యజ్ఞ యాగములు కూడ చేసితిని బాటసారులు దప్పిక తీర్చుకొనుటకు ప్రజలకు నీటి సౌకర్యము కలిగించుటకు వీలుగా అనేక చెరువులు త్రవ్వించినాను

''ఒకసారి ఒక బ్రాహ్మణునకు గోవును దాన మొసగితిని. సేవకుని పొరపాటుచేతనో అలక్ష్యము చేతనో ఆ గోవు తిరిగి నా గోశాలకు తిరిగి వచ్చెను నాకీ విషయము తెలియదు తరువాత కొద్ది రోజులలో ఆ గోవును మరియొక బ్రాహ్మణునకు దానము చేయుట జరిగెను ఈ బ్రాహ్మణుడు గోవును తనతో తీసుకు వెళ్ళుచుండగా, అంతకు ముందు దానము స్వీకరించిన బ్రాహ్మణుడు యెదురుపడి 'ఈ గోవు నాది' అనెను

'' 'కాదు, ఇది నాది నృగ మహారాజు నాకు యీ గోవును దానమిచ్చెను' అని రెండవ బ్రాహ్మణుడు చెప్పెను

'' 'ఇదే గోవును నృగ మహారాజే నాకు దానముగా నిచ్చెను' అని మొదటి బ్రాహ్మణుడనగా యిద్దరును వాదోపవాదములకు దిగిరి చివరకు వారిద్దరను నా వద్దకు వచ్చి, నన్ను నిందించుట మొదలుపెట్టిరి. 'నీవు నాకు గోవును దానముచేసి అదే చేతితో దానిని వెనుకకు తీసుకున్నావు'.

''వారి నిందలు నేను భరించలేకపోతిని. నాకు యేమి చేయుటకు తోచలేదు. వారి పాదములకు నమస్కరించి యిట్లంటిని 'ఈ గోవును మరచిపొండి మీలో చెరి ఒక్కరికి ఇంతకన్న ఉత్తమ జాతికి చెందిన లక్ష గోవుల నిచ్చెదను. ఈ గోవును దయచేసి విడిచిపెట్టుడు. మీ పాదములకు నమస్కరించి క్షమించమని వేడుచున్నాను. దానము చేసి వెనుకకు తీసుకునే పాపాత్ములకు లభించే నరకము నుండి నన్ను తప్పింపుడు'.

''వారిద్దరూ నానుండి యేదియు గ్రహించుటకు నిరాకరించి, ఆగ్రహముతో వెళ్ళిపోయిరి. అదే క్షణములో నన్ను తీసుకువెళ్ళుటకు యమభటులు వచ్చిరి.

''యముని సమక్షములో నుండగా అతడిట్లనెను. 'ఓ రాజా! నీవు లోకమున కెంతో మంచి చేసి పుణ్యము నార్జించుట చేత నీవు సుఖము ననుభవించెదవు. అయితే తెలియకచేసిన ఆ ఒక్క పాపమునకు నీవు బాధ ననుభవించెదవు. ముందు సుఖము ననుభవించెదవా, లేక పాప కర్మ ఫలితము ననుభవించెదవా?' 'మొదట పాపకర్మ ఫలితము ననుభవించెదను' అని చెప్పితిని.

'' 'అయితే క్రింద పడు' అని యముడనెను. మరు క్షణములో నేను భయంకరమైన బల్లిగా ఆ బావిలో పడితిని. నా పూర్వజన్మను గుర్తించుకొనగలుగుట నా మహద్భాగ్యము

''నీ కరుణాపూరిత దృష్టి నాపై పడెను నీ చేతి స్పర్శ కలిగెను దేవతలు త్రాగే అమృత స్పర్శ అది. నా పుణ్య కార్యములే నన్ను యీ బావిలోనికి త్రోసి నీ దర్శన స్పర్శన భాగ్యములు కలిగించినవి. లేకున్న నీ రక్షపడయ గల్గుదునా? ఎల్లప్పుడును నిన్ను, నీ పాద పద్మములను చింతించునట్లుగా వరము ప్రసాదింపుము''

తిరిగి కృష్ణునకు ప్రణామము చేసి, ఆకాశములోని కెగిరి కొద్ది క్షణములలో అదృశ్యమై స్వర్గము చేరుకొనెను.

## 242 బలరాముని ఆగ్రహము

ఒకసారి బలరామునికి వెనుక బృందావనములో గడపిన దినములు గుర్తుకు రాగా, అక్కడకు వెళ్ళి తన పాత స్నేహితులను చూచి వచ్చుటకు నిశ్చయించుకొనెను. ఆలోచన వచ్చినంతనే ఆచరణలో పెట్టుట బలరామునికి అలవాటు. వెంటనే రథము తెప్పించి బృందావనమునకు పయనమయ్యెను.

బలరాముని చూచినంతనే బృందావన ప్రజలలో ఉత్సాహము పొంగి పొరలెను. ప్రతి ఒక్కరును సంతోషముతో ఉప్పొంగిరి యశోదా నందులకు బలరాముడు నమస్కరించెను. వారితో కొంతసేపు ముచ్చటించి సంతోషముగా గడపిన పిదప, పాత స్నేహితులను చూచుటకు వెళ్ళెను పాత రోజులు గుర్తుకు తెచ్చుకుని బలరాముడు స్నేహితులతో ఆనందించెను. బలరాముని స్నేహితులందరును పెద్దవారు కాగా,

వారి పుత్రులిపుడు గోవులను దూడలను గడ్డి మేపుటకు తీసుకువెళ్ళుచుండిరి ఆ దినములలో తాము చేసిన పెక్కు కాని పనులను, ఆడిన ఆటలను స్మరణకు తెచ్చుకుని ఆనందించిరి. వారు కృష్ణుని గురించి ముచ్చటించి, కంసుని మరణానంతరము అన్నదమ్ము లిద్దరును మధురను విడిచిపెట్టిన తర్వాత జరిగిన విశేషములు వివరముగా తెలుసుకొన గోరిరి. చాలకాలము క్రిందట జరిగిన సంగతి! బలరామకృష్ణులు అప్పుడు బాలురు, ఇప్పుడు యిద్దరును వివాహితులై పిల్లలు కలిగియున్నారు! వారు ప్రశ్నపై ప్రశ్న
వారి ప్రశ్నలన్నిటికిని విపులముగా సమాధానమిచ్చెను. జరాసంధుడు మధురపై అనేక దండయాత్రలు చేసి ఓడిన విషయము, మధురా నగరము విడిచిపెట్టి యాదవులందరును సముద్రము మధ్యలో నూతనముగా నిర్మించిన ద్వారకా నగరమునకు తరలి వెళ్ళిన విషయము ఆశ్చర్యోత్సాహములతో విని ఆనందించిరి

వారి సంభాషణలో గోపికలు కూడ పాల్గొనిరి. వారు బలరాము నిట్లడిగిరి ''రామా! కృష్ణుడు తన భార్యలతో సుఖముగా నున్నాడు కదా! మమ్ము యెప్పుడైన తలచునా? ఇక్కడ మాతో గడిపిన దినములు గుర్తున్నవా? చిన్ననాటి దినములు జ్ఞప్తికి తెచ్చుకొనుచుండునా? ఒకసారియైన బృందావనమునకు రాగలడా? మా కోసము కాకపోయినను, తల్లిదండ్రుల కొరకైనను వచ్చునా! అతనికొరకు మేము సర్వము త్యజించినాము. తల్లిదండ్రుల మాటలను లక్ష్యము చేయకుంటిమి. సోదర సోదరీ బాంధవ్యము పూర్తిగా మరచిపోయితిమి ఎందుచేత? మా మనస్సులు కృష్ణుని చింతతో నిండియున్నపుడు, మా పిల్లల గురించి గాని భర్తల గురించి గాని ఆలోచించకుంటిమి.

''అతడు మమ్ములను విడిచిపెట్టి నీతో అక్రూరునితో కలసి నగరమునకు వెళ్ళెను. అతనిని వెళ్ళవద్దని ప్రార్థించి అడిగినపుడు, 'నేనిపుడు వెళ్ళవలెను కాని మీ వద్దకు తిరిగి తప్పక వచ్చెదను' అని చెప్పెను

''చాల కాలము వరకు ఆశతో అతడు తిరిగి వచ్చునని యెదురు చూచితిమి అతడు తిరిగి వచ్చి మాతో నుండగలడని భావించితిమి అతడు ఉద్ధవుని పంపెను మాలో తిరిగి ఉత్సాహము పుంజుకొనెను. కాని అతడెన్నడును రాలేదు అతడు కృతఘ్నుడు. చంచల స్వభావము కలవాడు. తుమ్మెద పుష్పముల మకరందము గ్రోలిన తర్వాత వాటిని విడిచివెళ్ళి తిరిగి రాకుండును అతని చాకచక్యమునకు, తేనెపూసిన మాటలు విని పట్టణములోని స్త్రీలు మాకువలె మోసపోయెదరేమోనని మా విచారము ఆనాడు అబద్ధములు చెప్పిన, అతని ముఖము, చిరునవ్వు, స్వరము తలచుకున్నపుడు మా కతనిపై కోపమెట్లు కలుగ గలదు? ఈ నాటికి కూడ అతని మాటలు నమ్మదగినవని భావించుచున్నాము. అతని ఆకర్షణ శక్తి అట్టిది సరే ఆ విషయము యిక మరచి వేరే విషయములు మాట్లాడుదము. అతని గురించి మాట్లాడుట నిష్ఫలము. అతనికి మనము అక్కరలేనపుడు, మనకు కూడ అతడక్కర లేదు''.

గోపికలు యేడ్చుచుండగా, ప్రేమ పూర్వకమైన మాటలతో వారి నుపశమింప జేసెను. సూర్యోదయమైన తర్వాత చంద్రుని ప్రకాశ వైభవమును గుర్తించినట్లు, కృష్ణుడున్నపుడు వారు బలరాముని గురించి యెక్కువగా భావించలేదు ఇప్పుడు వారిపై బలరాముని కున్న ప్రేమాదరములు, అతని కున్న ఆకర్షణ శక్తిని గ్రహించిరి రెండు మాసములు — చైత్ర వైశాఖములు — బలరాముడు గోపికలతో గడిపెను యమునా నది ఒడ్డున వారితో బలరాముడు కొంత సమయము గడిపెను.

వారుణి అను పానీయము బలరామునికి మిక్కిలి ప్రీతి అది మిక్కిలి మత్తు కలిగించు ద్రవము. దానిని సేవించి బృందావన పరిసరములలోని అరణ్యమందు, యిది వరలో తాను ఆవులను దూడలను మేపుచు

తిరిగిన ప్రదేశములందు సంచరించుచుండెను. అప్పటి దినములు తలచుకొని ఆనాటి సుఖ దినములు తిరిగి రావని బాధపడుచు విచారములో మునిగి, ఆ విచారము మరచిపోవుటకు మరికొంత వారుణి సేవించుచుండెను.

ఈ విధముగా అతడు మదపుటేనుగు వలె సంచరించుచుండెను ఒకరోజు తనకేమి జరుగుచుండెనో తెలియ నంతగా మత్తులో నుండెను. ఒక కుండలమును పోగొట్టుకొనెను. ధరించిన నీలి పట్టు వస్త్రము జారిపోవుచుండెను. పద్మమునకు నీటి బొట్టు అంటుకున్నట్లుగా చెమట బిందువులతో అతని ముఖము నిండియుండెను.

మత్తులో యమునా నది, చల్లని నీలి నదీ జలములో స్నానమాచరించుటకు వీలుగా తానున్న స్థలమునకు రావలెనని కోరెను. మత్తులో నుండుట చేత అతడేమి మాట్లాడుచుండెనో తనకే తెలియదని యమున తలపోసి, అతని ఆజ్ఞను ఉపేక్షించెను. బలరాముడు కోపావేశముతో యిట్లనెను. ''నీ అహంకారమునకు తగిన శిక్షను పొందవలసియున్నది నిన్ను వెయ్యి పాయల క్రింద చీల్చి, నీ మనుగడకే ముప్పు కలిగించెద''నని తన ఆయుధము నాగలి నెత్తెను. అతడు చాల ఆగ్రహముతో నున్నాడని యమున గ్రహించెను. యమున త్వరగా బలరాముని వద్దకు వచ్చి, అతని పాదములపైబడి, తనను విడిచిపెట్టమని ప్రార్థించెను

విశాల హృదయుడైన బలరాముడు నాగలిని క్రిందకు దించి, ఆమె యెడల కలిగిన ఆగ్రహమును ఒక్కసారిగా మరచిపోయెను

అతడు గోపికలతో నదిలో ప్రవేశించి, చాలసేపు వారితో జలక్రీడ సలిపెను. నది బయటకు వచ్చిన పిదప లక్ష్మీదేవి అతనికి రెండు నీలి పట్టు వస్త్రములు, బంగారు గొలుసులు, అనేక ఆభరణములు యిచ్చెను. వానిని ధరించిన బలరాముడు ఇంద్రుని ఐరావతము వలె గోచరించెను ఇప్పటికిని యమునా నదీ ప్రవాహ మార్గమును మార్చుటకు బలరాముడు నాగలితో యేర్పరచిన గండిని చూడగలము

## 243 పౌండ్రక వాసుదేవుడు

కరూశ దేశమును పౌండ్రకుడను రాజు పాలించుచుండెను జరాసంధుని స్నేహితులలో పౌండ్రకు డొకడు. కైసిదర్భకు వెళ్ళినపుడు పౌండ్రకుడు కూడ అతనితో వెళ్ళెను అయితే శిశుపాలుని వివాహము జరుగలేదు! పౌండ్రకుడు యెప్పుడును కృష్ణుని ద్వేషించుచుండెను అతనికి ఒక ప్రక్క అసూయ, మరొక ప్రక్క తన స్నేహితుల యెడల విశ్వాసము.

బలరాముడు బృందావనమునకు వెళ్ళినపుడు, పౌండ్రకుడు కృష్ణునితో యుద్ధము చేయ తలపెట్టెను. అతడొక దూతను ద్వారకకు పంపెను. ఆ సమయమున కృష్ణుడు సభా మందిరములో తండ్రి వసుదేవునితో, తాత ఉగ్రసేసునితో నుండెను పౌండ్రకుని దూత వచ్చి యిట్లనెను ''కరూశ దేశము రాజు పౌండ్రకుని వద్ద నుండి మీకొక సందేశము తెచ్చినాను ఇది రాజు పంపిన సందేశము ఇందలి అభిప్రాయములు నావి కావని మనవి'' తన ప్రాణమున కేమియు భయము లేదని కృష్ణుడు అభయ మొసగిన తర్వాత దూత యిట్లు చెప్ప నారంభించెను

''నీవు నారాయణుని అవతారముగా వాసుదేవుడవని చెప్పుకొనుచున్నావు. ఈ ఆలోచనను వెంటనే విడిచిపెట్టుము. నేను నిజమైన వాసుదేవుడను. పిల్లలు ఆటలాడుకొనునపుడు, ఒకరు రాజు, మరొకరు రాణి, వేరొకరు మంత్రి అని పిలుచుకొని ఆడుచుందురు. అదే విధముగా యెవరో నిన్ను వాసుదేవుడని, నారాయణుని అవతారమని పిలిచి యుండవచ్చు. నీవు బుద్ధి తక్కువగా దానిని నమ్మినావు. అసలు నిజమైన అవతారము నాది. మానవుల నుద్ధరించుటకు నేను జన్మించినాను. నీవు 'వాసుదేవుడ'ను నామమును విడిచిపెట్టవలెను. నీవు ధరించుచున్న ఆయుధములు, తదితర వస్తువులు నిజముగా నాకు చెందినవి. నాకు మాత్రమే చెందినవి. నీవు ఆ వస్తువులన్నిటితో నాకు వశమై శరణు జొచ్చినచో నిన్ను భగవంతునివలె, అతని అవతారమైన నేను దయతలచి వదలి పెట్టెదను. లేకున్న నాతో నీకు యుద్ధము తప్పదు''.

పౌండ్రకుని దూత ఆ సందేశము మరల మరల చదువగా అందరును పగలబడి యెగతాళిగా నవ్విరి. వారి హాస్యోక్తులు యెగతాళిలో కృష్ణుడు కూడ పాలుసంచుకొనెను. తరువాత కృష్ణుడు దూతతో యిట్లు పలికెను. ''నీ రాజు సందేశములో వాడిన తెలివి తక్కువ మాటలకు నేను నీపై కోపగించెదనని భావించి, నీకు యెట్టి అపాయము కలుగకూడదని అభయము కోరినావు. నీవు ఆశించినట్లు కాకుండా, లేక భయపడిన ట్లుగా యీ కార్యములో నీవు నిర్వహించిన పాత్రకు నా కృతజ్ఞత తెలుపుచున్నాను. ఈరోజు ఆనందించి నవ్వినట్లుగా యిది వరకెన్నడును నవ్వి ఆనందించలేదు''.

తర్వాత కృష్ణు డిట్లనెను. ''నేనొక సందేశము నిచ్చెదను. దానిని నీ రాజు కిమ్ము''. ఆ సందేశము యిట్లున్నది. ''ఓరి మూర్ఖుడా! నీవు యేదో ఒక చక్రము మరికొన్ని వస్తువులు సంపాదించి నారాయణుడవని ప్రకటించు కొనుటకు నీకెంత ధైర్యము. త్వరలోనే నీవు వాటిని పోగొట్టుకొనునట్లు చేసెదను. గొప్పలు చెప్పుకునే నీ జాడ్యమును నివారించెదను. త్వరలోనే నీవు చచ్చిపడి యుందువు. నీ మృత దేహము చుట్టును కాకులు, గ్రద్దలు, కుక్కలు చేరి విందారగించును. ఈవిధముగా నీవు వాని నుద్ధరించగలవు!''

కృష్ణుని సందేశము గైకొని దూత తన దేశమునకు వెళ్ళి రాజు కందజేసెను.

కృష్ణుడు రథము తెప్పించి కరూశ దేశమునకు బయలుదేరెను. కృష్ణుడు వచ్చుచున్నాడని పౌండ్రకుడు విని, మూడు అక్షౌహిణుల సైన్యముతో నగరము బయటకు వచ్చెను. పౌండ్రకుని స్నేహితుడు కాశీ రాజు మూడు అక్షౌహిణుల సైన్యముతో యుద్ధమందు ప్రవేశించెను.

కృష్ణుడు పౌండ్రకుని జూచెను. అతని వద్ద శంఖము, చక్రము, గద యుండెను. భగవంతుని వక్షముపై శ్రీవత్సమనే మచ్చ యున్నట్లుగా, పౌండ్రకుని వక్షముపై గూడ మచ్చ గోచరించెను. కౌస్తుభము వంటి మణిని కూడ అతడు ధరించెను. అతని మెడలో వనమాల వంటి హారము, నారాయణుని మెడలో నున్నట్లే, యుండెను. రెండు పసుపుపచ్చని పట్టు వస్త్రములను ధరించెను. కృష్ణుడు, తన వలెనే అన్నిటిని ధరించియున్న పౌండ్రకుని చూచి, ఆనందాశ్చర్యములతో నవ్వు చుండెను. నాటకములో వేషము వేయునపుడు, యెవరి పాత్రను నటుడు ధరించునో అతని వేషము వేసుకుని ఆ పాత్రలో జీవించుటకు ప్రయత్నించి విఫలమైనట్లుండెను!

యుద్ధము ప్రారంభమై తీవ్రరూపము దాల్చెను. తనతో పోరుచున్న సైన్యమును చాలవరకు కృష్ణుడు నాశనము చేసెను. తరువాత పౌండ్రకుని సమీపించి కృష్ణుడిట్లనెను. ''పౌండ్రకా! నా వద్ద నున్న ఆయుధములు

నీకు చెందినవని, అందుచే వాటిని నన్ను వదలి పెట్టమని నీ దూత చేత సందేశము పంపినావు. ఆ ఆయుధములను నేనిపుడు నీపై ప్రయోగించుచున్నాను.

''నేను యెవరితోను యెప్పుడును యుద్ధము చేయుట కోరను. నీవు నన్ను నా పేరు వదలుకొనమని యుద్ధమునకు పురిగొల్పినావు. నీతో యుద్ధము చేయమని కవ్వించినావు. నీ తెలివి తక్కువ తనముచేత, నీ నాశనము నీవు కోరుచున్నావు''. వాడియైన బాణములు వదలి పౌండ్రకుని తీవ్రముగా బాధించునట్లు చేసెను. తీవ్రముగా గాయపడినప్పటికిని పౌండ్రకుడు యింకను పోరుచుండెను. చివరకు కృష్ణుడు తన చక్రముతో పౌండ్రకుని శిరస్సు ఛేదించి శరీరము నుండి వేరుచేసెను.

మరికొన్ని క్షణములలో కాశీరాజు కూడ నేలగూలెను. కృష్ణుని బాణము చేత తల తెగి, నగరములోనికి విసురుగా పడెను. అనవసరముగా జరిగిన ఈ యుద్ధము అంతమయ్యెను. మిక్కిలి విచారముతో కృష్ణుడు ద్వారకకు తిరిగి వచ్చెను.

కాశీరాజు కుమారుడు సుదక్షిణుడు తండ్రి అంత్యక్రియలు జరిపి, యిట్లు ప్రతిజ్ఞ జేసెను. ''నా తండ్రి మరణమునకు పగతీర్చుకొందును''. అతడు తన గురువులను పిలిపించి, మహాదేవునికి ప్రీతి కల్గించుటకై తపస్సు యెట్లు జరుపవలెనో బోధింపమని వారి సహాయము కోరెను.

అతని తపస్సు సమాప్తి కాగా, మహాదేవుడు ప్రత్యక్షమై అతని కోరిక విని యిట్లనెను. ''నీకు అభిచారమును తంత్రమును బోధించెదను. ఎవరి మరణము కోరుచున్నావో వారిని మనసు నందు చింతించి ప్రత్యేక హోమము చేయవలెను''. మహాదేవుడు బోధించిన ప్రకారము సుదక్షిణుడు ప్రత్యేక హోమము జరిపెను. హోమాగ్ని నుండి ఒక భయంకరమైన జీవి ఆవిర్భవించెను. అగ్నికి మారు రూపముగా నున్న జీవి అగ్నివలె ప్రకాశించుచుండెను. దాని తల వెంట్రుకలు రాగి తీగెలవలె నుండెను. నేత్రముల నుండి నిప్పులు వెలువడుచుండెను. పొడవైన చేతియందు త్రిశూలము గలదు. అది వేయు ప్రతి అడుగుకు భూమి కంపించుచుండెను. అతి బిగ్గరగా అరచుచు, కొత్తగా నావిర్భవించిన జీవి ద్వారకవైపు వెళ్ళెను.

ద్వారకాపుర వాసులు యీ భయంకర జీవిని చూచి, తమ కనువైన ప్రదేశములలో దాగుకొనిరి. కృష్ణుడు తన గృహమందు జూదమాడుచు ఆనందించుచుండెను. ప్రజలు భయముతో రోదించుచున్న శబ్దము కృష్ణుని చెవులకు సోకెను. అతడు బయటకు వచ్చి ప్రజలు ఆతురతగా తన వద్దకు పరుగెత్తి వచ్చుచుండుట చూచెను. వారు కృష్ణుని చూచి యిట్లనిరి. ''కృష్ణా! కృష్ణా! భయంకరమైన జీవి యీ నగరములో ప్రవేశించి అన్నిటినీ దహించి వేయుచున్నది. అది నీ సౌధమువైపు వడివడిగా వచ్చుచున్నది. నీవు మమ్ములను కాపాడి రక్షింపుము''. కృష్ణుడు తన అభయ హస్తము నెత్తి యిట్లనెను. ''భయపడవద్దు. మిమ్ములను నేను కాపాడెదను''. జూదమాడుచున్న గవ్వ యింకను కృష్ణుని చేతిలో నుండెను. రెండవ చేతితో తన చక్రము తీసి, తన సౌధము వైపుగా వచ్చుచున్న విచిత్ర జీవి పైకి విసరెను. ఈ విచిత్ర జీవి మహాదేవుడు సుదక్షిణున కొసగిన కానుకయని గ్రహించెను. అది ఒక రాక్షసి, దుష్టదేవత. ఆ క్షుద్రదేవత నణచుటకు అంతకన్న శక్తిమంతమైన ఆయుధము నుపయోగింపవలెను. యుగాంతమున ద్వాదశ సూర్యులకాంతితో ప్రకాశించు చక్రము ఆ విచిత్ర జీవిని సమీపించెను. చక్రము తీవ్ర తాపము భరించలేక వెనుకకు తిరిగి పలాయనము చేసెను. చక్రము దానిని వెంట తరిమి సుదక్షిణుడుండు నగరములో ప్రవేశించి అతడా విచిత్ర జీవిని పంపుటచేత, సుదక్షిణుని సమీపించి అతనిని దహించివేసెను. తరువాత అతడి నగరమును సమూలముగా దహించి చక్రము తిరిగి కృష్ణుని చేరెను.

# 244 బలరాముడు ద్వివిదుని వధించుట

ఈ లోపుగా బలరాముడు మరొక సాహస కృత్యము గావించెను. ఆనర్త దేశమునకు చేరువలో నున్న రైవతక పర్వతముపై నున్న అరణ్యములో సంచరించుట బలరామునికి మహాప్రీతి. ఒకరోజు బలరాముడు తన స్త్రీలందరితో ఉండగా, ద్వివిదుడను పేరుగల మర్కటము నెదుర్కొనెను. ద్వివిదుడను మర్కటము కృష్ణుడు సంహరించిన నరకాసురునికి గొప్ప స్నేహితుడు. ద్వివిదు డతి పురాతన మర్కటము. ఇతడు మైందుని సోదరుడు. త్రేతాయుగమందు మైందుడు సుగ్రీవుని మంత్రిగా నుండెను కాలక్రమములో బహుశః సత్పురుషులు సైతము మార్పుచెంది దుశ్చర్యలకు పాల్పడుదురు. అట్లు కాకున్నచో శ్రీరాముని సమక్షములో చాల కాలము జీవించిన ద్వివిదుడు యీనాడు దుశ్చింతల కేల తావిచ్చును?

మైందుని సోదరుడు ద్వివిదుడు, తన ప్రియ స్నేహితుడైన నరకుని సంహరించిన కృష్ణునిపై పగతీర్చుకొనద లచెను. అతడు ఒక పద్ధతిలో పల్లెలను పట్టణములను, గోకులములను వరుసగా నాశనము చేయుటకు దృఢముగా నిశ్చయించుకొనెను అతడు చిన్నచిన్న గుట్టలను పెకలించి వాటి నాయుధములుగా జేసుకుని పల్లెలను నాశనము గావించుచుండెను. కృష్ణునిపై ప్రధానముగా ద్వేషము కలిగియుండుటచేత, వీలయినంతవ రకు ఆనర్త దేశమును నాశనము చేయుట అతని ధ్యేయము. అతనికి పదివేల యేనుగుల బలము కలదు ఒకసారి ద్వివిదుడు సముద్రములో దిగి తన బాహువులతో మధింపసాగెను దాని ఫలితముగా సముద్ర జలముప్పొంగి దగ్గరలో నున్న దేశమును పూర్తిగా ముంచివేసెను ఈ దుష్ట మర్కటము ఋషుల ఆశ్రమములలోని ఫలవృక్షములను విరిచి ధ్వంసము చేయుచుండెను ఋషులు మిక్కిలి శ్రద్ధతో నిర్వహించు పవిత్రమైన హోమాగ్నిని ఆర్పివేయుచుండెను. పురుగులను మట్టి గూడులో బంధించు కీటకములవలె ద్వివిదుడు స్త్రీపురుషులను అపహరించి పర్వతమందలి గుహలలో దాచివేసి గుహ ముఖద్వారము మూసివేయు చుండెను

ఒకసారి బలరాముడు రైవతక పర్వతముపై నున్న అరణ్యములో తన స్త్రీలతో విహరించుచుండగా, అక్కడ నుండి వచ్చు మధుర సంగీతము విని ద్వివిదుడు ఆ అరణ్యమునకు వెళ్ళెను. అక్కడ అనేక మంది స్త్రీలు ఒక అందమైన పురుషునితో నుండుట జూచెను బలరాముని మెడలో కమలములతో కట్టిన దండ కలదు అతని నేత్రములు మత్తుగా నున్నట్లుండెను. అతడు స్త్రీలందరితో కలసి పాడుచుండెను

ద్వివిదుడు ఒక చెట్టు చివరికెక్కి కోతిచేష్టలు — చెట్టుకొమ్మల నూపుట, స్త్రీలవైపు చూచి పళ్లు యికిలించి కిచకిచమని శబ్దము చేయుట — గావించుచుండెను విచిత్రముగా అతి పెద్దగా ఆ మర్కటము చేయు కోతి చేష్టలు జూచి స్త్రీలు నవ్వుచుండిరి వారు ఆ విధముగా నవ్వుట ద్వివిదుడు సహించలేకపోయెను బలరాముడు అక్కడ ఉన్న విషయము విస్మరించి, ద్వివిదుడు స్త్రీలను వెక్కిరించి వేధించుచుండెను బలరాముడు కోపావిష్టుడై ఒక రాయి తీసుకుని మర్కటముపైకి విసరెను అతడు ఆ రాయిని తప్పించుకుని, బలరామునికి ప్రీతికరమైన వారుణీయున్న పాత్రను లాగుకొనెను. ద్వివిదుడు పాత్రను పగులగొట్టెను. అదే సమయములో స్త్రీల వస్త్రములు లాగుకొని, వాటిని చింపి స్త్రీల నగౌరవపరచుట మొదలుపెట్టెను

పాత్రను పగులగొట్టుటకు ముందు అందులో చాల భాగము ద్వివిదుడు త్రాగెను. ఈ చర్య మరింత అభ్యంతరకరముగా బలరామునికి తోచెను ఈ మర్కటము ప్రవర్తన సాధారణ మర్కటముల తీరుకు భిన్నముగా నుండుటచే బలరాముని ఆగ్రహము అవధులు దాటెను. అతడు తన ఆయుధము నాగలిని తీసుకొనెను. ఇంతలో ద్వివిదుడు చెట్టుకొమ్మ విరిచి దానితో బలరాముని తలపై గొట్టెను అందుకు ప్రతీకార చర్యగా నాగలి కర్రుతోను, సునందమను ముసలముతోను మర్కటమును గాయపరచెను. రక్తము ధారగా కారుచున్నప్పటికిని ద్వివిదుడు లక్ష్యపెట్టకుండెను. వృక్షముల నొకదాని తర్వాత నొకటి పెకలించి వాటిని బలరామునివైపు విసరుచుండెను. వానినన్నిటిని బలరాముడు విరిచివేసెను. తర్వాత ద్వివిదుడు బలరామునిపై రాళ్ళ వర్షము కురిపించెను బలరామునికి వర్షపు బిందువులు పడినట్లుండెను ద్వివిదుడు బలరామునికి దగ్గరగా వచ్చి బలమైన పిడికిలితో బలరాముని గుండెపై కొట్టెను తన ఆయుధము క్రిందపడవేసి బలరాముడు ద్వివిదుని గడ్డముపై బలముగా కొట్టెను. ఆ ఒక్క దెబ్బకు ద్వివిదుడు క్రిందపడెను. అతడిని నోటి నుండి రక్తము నదివలె ప్రవహించెను ఆనర్త దేశమునకు అమితముగా నష్టము కలిగించుచున్న ద్వివిదుడను భయంకర మర్కటము జీవితము అంతమయ్యెను

## 245 దుర్యోధనుని పుత్రిక లక్షణ

హస్తినాపురములో స్వయంవరము జరిగెను. దుర్యోధనుని కుమార్తె లక్షణ రాకుమారి కృష్ణుని కుమారుడు సాంబుడు, జాంబవతితో స్వయంవరమునకు వెళ్ళి బలవంతముగా రాకుమార్తెను యెత్తుకుపోయెను. కౌరవుల కిది సమ్మతము కాకుండెను వారిట్లనిరి ''ఈ యువకుడు మనకంటె అన్ని విధముల అల్పుడు. రాకుమారి నతడు పెండ్లాడకుండ చూడవలెను అతని ప్రవర్తన మంచిదికాదు. పద్ధతి ప్రకారము ఆమెను పెండ్లాడగలనని అడుగక, బలవంతముగా అతని అభిప్రాయమును మన లక్షణపై రుద్దెను అతనిని పట్టి బంధించుదము. యాదవులేమి చేయగలరు? ఇంతకును వారు మనకు సామంతులు; వారు మనల నేమియు చేయలేరు. వారి కుమారుడు మన చెరలో నున్నాడని తెలుసుకుని, మన శక్తి సామర్థ్యము లెంతటివో గ్రహించగలరు. ప్రాణాయామము చేసిన మానవుని ఇంద్రియములు అదుపులో నున్నట్లు, వారి అహంకారము అణగారును.

కర్ణ , భూరిశ్రవశ్శల, దుర్యోధనులు నాయకత్వము వహించిరి భీష్ముని వంటి పెద్దలు వారికెట్టి అభ్యంతరము చెప్పలేదు.

కౌరవులు తన్ను వెంబడించి వచ్చుచుండుట సాంబుడు చూచెను. అతడు యేకాకిగా కౌరవులతో పోరాడెను అతని ధైర్యసాహసములను వారు యెదుర్కొనలేకపోయిరి. అతడు వారితో చాలసేపు యుద్ధము చేసెను కౌరవులు అతడినేమియు చేయలేకపోయిరి. చివరకు కౌరవులు అతనిని చుట్టుముట్టి అతనిని ఓడించి బంధించిరి

ఎప్పటివలె, నారదుడు, యీ వార్తను — సాంబుని కౌరవులు ఓడించి బంధించినారని — బలరామకృష్ణు లకు చెప్పెను యాదవులు హస్తినను ముట్టడించి కౌరవులకు గుణపాఠము చెప్పవలెనని, యుద్ధమునకు సన్నద్ధులగుచుండిరి. బలరాముడు యెప్పుడును శాంతిప్రియుడు. అతడు యుద్ధము నివారింప ప్రయత్నించెను.

బలరాముడు ఆగ్రహావిష్టులైన తన బంధుమిత్రులను శాంతింపజేసి, కొందరు పెద్దలతో, బ్రాహ్మణులతో కలసి రథములలో హస్తినాపురమునకు బయలుదేరెను. చుట్టును గ్రహములతో కూడియున్న సూర్యునివలె, హస్తినాపురము వెలుపల బలరాముడు నిలుచుండెను. నగరపు పొలిమేరలలోని తోటలో రథములు నిలిపెను.

బలరాముడు, ధృతరాష్ట్రుని వద్దకు దూతగా ఉద్ధవుని పంపి, భీష్మద్రోణులను, యితర పెద్దలను కలుసుకొనెదనని ప్రకటించమని చెప్పెను. ఉద్ధవుడు బలరాముని సందేశము తీసుకుని ధృతరాష్ట్రుని కొలువుకు వెళ్ళెను. ధృతరాష్ట్రునివద్ద భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు, ఉండిరి. దుర్యోధనుడు, నిత్యము అతనివెంట నుండు కర్ణుడు, శకుని గూడ అక్కడ నుండిరి. వారు ఉద్ధవుని సందేశము స్వీకరించి, బలరాముని ఆహ్వానించుటకు కట్నములతో కానుకలతో నగరము బయటకు విచ్చేసిరి. గౌరవనీయులైన అతిథి వచ్చినపుడు కట్నములతో కానుకలతో ఆహ్వానించుట ఒక నియమముగా నుండెడిది.

వారు బలరాముని కలుసుకొని తగిన గౌరవమర్యాదలు సలిపిరి. పరస్పరము యోగక్షేమము లొకరినొకరు అడిగి తెలుసుకొనిరి.

కుశల ప్రశ్నలయిన పిమ్మట బలరాముడిట్లనెను. ''నా తాత ఉగ్రసేన మహారాజు పంపిన సందేశమును మీరు జాగ్రత్తగా వినగోరెదను. 'మా యాదవ కుమారుడైన సాంబుని అధర్మయుద్ధములో పట్టుకుని బంధించిన విషయము మాకు తెలిసినది. ఇన్ని సంవత్సరములుగా మన కుటుంబముల మధ్య నున్న స్నేహబంధము కొన్ని దురభిప్రాయముల చేత చెడకూడదని మా అభిమతము. మన బంధుమిత్రుల మధ్య మైత్రి యుండవలెను. అందుచేత ఆలస్యము చేయక, అవమానకరమైన బంధమునుండి సాంబుని విడుదలచేసి అతనిని మాకు అప్పగించవలెను' ''.

అతి సరళము, మృదువైన పదములతో బలరాము డందించిన యీ సందేశము కౌరవ కుమారులు స్వీకరించుట కిచ్చగింపరైరి. వారు నవ్వి యిట్లనిరి. ''మీరు చాల గొప్పవారమని భావించెదరు. మీ కుటుంబములోని కుంతి మా పినతండ్రి పాండురాజును వివాహమాడిన కారణముగా మాకు బంధువులని చెప్పుకొనుచున్నారు. లేకున్నచో మాతో మీకు బంధుత్వమెట్లు కలుగును? గొప్ప కౌరవ కుటుంబముతో బంధుత్వమా? నిజముగా మాకు చెందినటువంటి రాజ్యమును మీరు పరిపాలించుట కంగీకరించినాము. ఇది మా ఔదార్యమునకు చిహ్నము. మరియు, మీరు మాతో సమానులుగా వర్తించుచుండుట చూచి పట్టించుకొనక యూరకున్నాము. ఇదివరకే, రాజరికమునకు చిహ్నములైన సింహాసనము, తెల్లని ఛత్రమును వినియోగించు టకు అభ్యంతరము తెలుపవలసినది. వీనిని చూచి చూడనట్లు ఊరకుండుటచే మీకు తల బిరుసు యెక్కువై, మీరు చెప్పినట్లు మేము ఆడగలమను అభిప్రాయము మీకున్నట్లు స్పష్టమగుచున్నది. మేము బందీగా తీసుకున్నవానిని తిరిగి మీకు అప్పగించగలమని ఆశించుటకెంత ధైర్యము?''

బలరాముని నుండి యెటువంటి సమాధానముకొరకు వేచియుండక కౌరవులు నగరమువైపు తిరిగిరి. కౌరవుల ప్రవర్తన బలరాముని కాశ్చర్యము కలిగించి నిశ్చేష్టుని జేసెను. ఒక క్షణము యేమి మాట్లాడవలెనో బలరామునికి తెలియకుండెను. బలరాముడు తనతో వచ్చిన అనుయాయులతో నిట్లనెను. ''నేను పొరపాటు చేసితిని. యాదవులందరును కౌరవులతో యుద్ధము చేయుటకు ఆత్రముతో నుండిరి. తన కుమారుని బందీగా తీసుకొనుటచే కృష్ణుడు ఉగ్రుడై యాదవులతో కలసి కౌరవులతో యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. సైన్యమును సమకూర్చుచుండిరి. నేనే వారిని నిలిపి, బంధువులతో యుద్ధము తగదని దానిని నివారింపవలెనని చెప్పితిని.

కాని యిప్పుడు నాకనిపించుచున్నది కృష్ణుడు తదితరులు చేయదలచినది సరిగానున్నది నేనే తప్పుగా నూహించితిని. బాగుగా క్రొవ్వెక్కిన జంతువులను కొట్టి శిక్షింపవలయును. అహంకార పూరితులు నరళమైన మాటలు అర్థము చేసుకొనలేరు అటువంటి వారితో సరసమైన పద్ధతిలో సమస్యలను పరిష్కరించజాలము

''కౌరవులకు గ్రహణశక్తి తక్కువ, మరియు గర్వముతో బలిసియున్నారు వారు యుద్ధమును కోరుచున్నట్లు స్పష్టముగా తెలియుచున్నది. లేకున్న నాతో ధైర్యముగా యీ విధముగా మాట్లాడగలుగుదురా! అధికారము ధనగర్వము మాత్రమే మానవుల వివేక శక్తిని గోల్పోవునట్లు చేయును. నేను వారికి గుణపాఠము చెప్పెదను ఈ లోకములో కౌరవులు లేకుండ జేసెదను''. బలరాముడు తన ఆయుధమైన నాగలిని తీసుకుని యిట్లనెను ''ఈ హస్తినాపురమును నాశనము చేసి యమునా నదిలో మునుగునట్లు చేసెదను''.

బలరాముడు తన నాగలితో భూమిని బలముగా కొట్టి హస్తినాపురము యమునానదివైపు జరుగునట్లు చేసెను.

హస్తినాపురములోని ప్రజలకు భూమి కంపించినట్లయ్యెను. ఒక క్షణము తర్వాత కంపము తీవ్రమై, భూమి దద్దరిల్లుచుండెను నెమ్మదిగా హస్తినాపురము యమునా నదిలోనికి చొచ్చుకొని పోవుచుండెను. ప్రజలు భయముతో యిండ్లలోనుండి బయటకు వచ్చిరి. జరుగుచున్న బీభత్సము కౌరవులు చూచిరి. సమయము మించిపోయినదని వారు గ్రహించిరి ఏ విధముగానైనను బలరాముని శాంతింప జేయవలెనని భావించిరి వారు తొందరగా సాంబుని బంధించిన కారాగృహమునకు వెళ్ళి, అతనిని రాకుమార్తె లక్షణను రథములో కూర్చుండ బెట్టి, బలరాముడున్న ప్రదేశమునకు త్వరగా చేరుకొనిరి హస్తినాపురము నిదానముగా మెల్లగా యమున వైపు కదలుచుండెను.

ప్రజలు తమ రాజు వెంట వెళ్ళి, బలరామునితో నిట్లనిరి. ''అమాయక ప్రజలు నాశనము కాకుండునట్లు చూడుము. నీకు అపచారము గావించిన మమ్ము క్షమించమని వేడుకొనుచున్నాము అహంభావముతో గుడ్డివారమై, నీ శక్తిగానక నిన్ను అవమానపరచితిమి. మమ్ము దయతో కరుణింపుము మమ్ము రక్షింపుము, క్షమించుము''

బలరాముడు ముక్కోపిగా ప్రసిద్ధికెక్కెను ఎంత త్వరగా అతడు క్రోధావిష్టుడగునో అంత త్వరగా అతడు శాంతించును. వారి తప్పిదము వారు గ్రహించి తెలుసుకున్నందుకు బలరాముడు సంతృప్తుడై భూమి నుండి నాగలిని పైకి తీసి యిట్లనెను ''మీరు భయపడవలదు. మీ నగరమునకు యెట్టి కీడును యికముందు తలపెట్టను''

అశ్రువులు నిండిన కనులతో దుర్యోధనుడు బలరాముని పాదములపై బడెను సత్రాజిత్తు నిహతుడై అతనిని సంహరించిన శతధన్వుని వెంటాడుచున్నపుడు, బలరాముడు మిధిలలో నుండెను ఆ సమయములో దుర్యోధనుడు కూడ మిథిలలో నుండెను దుర్యోధనుడు బలరామునితో చాల కాలము మిథిలలో గడపెను. దుర్యోధనుడు బలరామునికి శిష్యుడై గదతో యుద్ధము చేయు కౌశలము నేర్చుకొనెను శిష్యుడైన దుర్యోధనుడు తన యెడల యీ విధముగా ప్రవర్తించినందుకు బలరాముని కాగ్రహము కలిగెను కాని యిప్పుడు దుర్యోధనుడు పశ్చాత్తప్తుడై, విలువగల మణులు, పట్టుపీతాంబరములు, గజతురగములు సాంబునికి కానుకగా నిచ్చి బలరాముని శాంతింపజేసెను

ఆ విధముగా గౌరవమొందిన తర్వాత, బలరాముడు యువదంపతులను తోడ్కొని ద్వారకకు బయలుదేరెను.

సోదరుడు కృష్ణునికి, తదితరులకు హస్తినలో జరిగిన విషయములు, తనకు ఆగ్రహము కలిగి తరువాత అది ఉపశమించిన తీరు వివరించెను

ఇప్పటికిని హస్తినాపురము దక్షిణ దిశయందు యమునా నదివైపు ఒరిగియుండుట బలరాముని ఆగ్రహమునకు చిహ్నముగా భావింతురు

## 246 కృష్ణునికి విన్నపములు

ఒకసారి కృష్ణుడు 'సుధర్మ'యను సభామందిరములో సోదరుడు బలరామునితో తదితరులతో కూర్చుని యున్నపుడు ఒక అపరిచిత వ్యక్తి కృష్ణుని చూచుటకు వచ్చెను. అతనిని లోపలకు రావలసినదని కృష్ణుడు పిలువనంపెను ఆ వ్యక్తి లోపల ప్రవేశించి, సభలో నున్నవారందరికి నమస్కరించెను. అతడు రెండు చేతులు శిరస్సుపై నుంచి కొంతసేపు నిలుచుండెను. తరువాత అతడు కృష్ణుని పాదములపైబడి యిట్లనెను. ''జరాసంధుని ముఖ్యపట్టణమైన గిరివ్రజము నుండి వచ్చినాను''.

శ్రోతలలో సంపూర్ణ నిశ్శబ్దము ఆవరించెను పురాతన శత్రువు పేరు వినుసరికి అందరును ఒక్కసారిగా సావధానులైరి. ఒక్కసారిగా ఆవరించిన నిశ్శబ్దమునకు కారణమేమై యుండునా యని పరిశీలనముగా చూచుచుండెను అందరును కృష్ణునివైపు చూచుచుండగా, కృష్ణుడిట్లనెను. ''మా శత్రువు జరాసంధుడు పంపిన సందేశమేమి?''

ఆ అపరిచిత వ్యక్తి తల అడ్డముగా ఊపి యిట్లనెను ''జరాసంధుని వద్ద నుండి కాదు. మొదట నేను స్పష్టముగా వివరించనందుకు చింతించుచున్నాను. అతడు పర్వతమందున్న కోటలో బంధించిన అనేక రాజుల ప్రతినిధిగా నేను యిక్కడకు వచ్చితిని. జరాసంధుడు మహాదేవుని భక్తుడని నీకు తెలిసిన విషయమే. చెరనున్న రాజుల శిరస్సులతో కట్టిన రుండమాల అను హారమును మహాదేవునికి సమర్పించెదనని జరాసంధుడు ప్రతిజ్ఞపూనెను. ఇట్టి సంకల్పముతో జరాసంధుడు పెక్కుమంది రాజులను ఓడించెను నూరు సంఖ్య దాటకుండుటచేత ఆ రాజులు యింకను సజీవులై యున్నారు. చెరనున్న రాజులు నా ద్వారా నీ కొక సందేశము పంపినారు వారి సందేశ మీవిధముగా నున్నది. 'కృష్ణా! నీ శక్తి అసమానమైనదనియు, ఆపదలో నున్న వారిని తప్పక రక్షించెదవనియు విని యున్నాము. మేము పూర్తిగా నీ శరణుజొచ్చుచున్నాము నీవు తప్ప మమ్ము రక్షించువారెవరును లేరు

'' 'జీవితముపై వ్యామోహముతో సత్కార్యములు చేయుట మరచిన వారు, దుష్టకార్యములనే చేయువారు, భగవంతుని సందర్శించక పుణ్యము సంపాదించనివారు, యెక్కువకాలము జీవించరనియు మరుచటి జన్మలో కూడ భగవదనుగ్రహము పొందజాలరనియు చెప్పుదురు

'' 'మేము జీవించవలెనను ఆశను చాల కాలము క్రిందనే వదలుకున్నాము. నిన్ను, నీ వైభవమునే మేము చింతించుచున్నాము. నిన్ను నిత్యము ధ్యానించుటచేత భౌతిక వాంఛలపై నాశలేదు. కాల స్వరూపుడవైన నీకు మా నమస్కారము. ఈ భూమిపై మరల ధర్మము నుద్ధరించి దుష్టత్వము నాశనము చేయుటకై నీవు యీ మానవ రూపము ధరించినావని చెప్పుచుందురు. అటువంటపుడు, సాధారణ మానవుడైన జరాసంధుడు, మావంటి వారి ననేకులను నిర్బంధించి బాధించుట యెట్లు సాధ్యమయ్యెను? నారాయణుడు, ఆదిశేషుడు మానవాకారములతో యీ భూమిపై సంచరించుచుండగా, దుఃఖము, బాధ విచారము తాండవించుట మిక్కిలి విచారకరము. ప్రభూ! ఇటువంటిది జరుగనేకూడదు.

'' 'మహారాజులకు జన్మతో సంక్రమించు అనేక భౌతిక సుఖములు మాకుగొప్ప స్వప్నములవలె కన్పించి అదృశ్యమయ్యెను. ఇది తాత్కాలికమని తెలుసుకుని గ్రహించినప్పటికిని, నీ మాయా ప్రభావముచేత మేము దుఃఖించుచున్నాము. జరాసంధుని కారణముగా బలవంతముగా వదలిపెట్టిన ప్రజలగురించి, మా పిల్లల గురించి ఆందోళన చెందుచున్నాము. సామాన్య పరిస్థితులలో, వీని నన్నిటిని మరచిపోయి, అన్ని బంధములు త్రెంచుకుని, ప్రశాంతత పొందుటకు నీ పాదపద్మములనే చింతించుచుండవలసినది. కాని మేము అట్లు చేయలేక పోవుచున్నాము. మాకీ అగచాట్లు కలిగినందుకు దుఃఖముతో బాధపడుచున్నాము. నీవే మాకు సహాయము చేయవలెను. పదివేల యేనుగుల బలము కలిగిన జరాసంధుడు పశువుల మందను బంధించినట్లుగా మమ్ము బంధించెను. ఈ బంధము, కర్మబంధమువలెనే, బాధాకరముగా నున్నది. ప్రభూ! యీ బాధ నుండి మాకు విముక్తి కలిగింపుము' ''.

అపరిచిత వ్యక్తియిట్లనెను. ''చెరనున్న రాజులు రహస్యముగా నాచేత నీకీ సందేశము పంపిరి. నీ సహాయము కొరకు వారు ఆశతో యెదురు చూచుచున్నారు. నీవు వారికి విముక్తి కలిగించవలెను''.

ఆ వ్యక్తి తన విన్నపము పూర్తి గావించు తరుణములో నారదమహర్షి, బంగారమువలె ప్రకాశించుచు, అచ్చటకు వచ్చెను. అందరును ఒక్కసారిగా లేచి నిలబడి, బ్రహ్మపుత్రుడైన నారదుని ఆహ్వానించి గౌరవించిరి. నారదుడు ఉన్నతాసనముపై కూర్చున్న పిదప, కృష్ణుడిట్లనెను. ''మునీంద్రా! లోకసంచారులైన మీరు లోకములో జరుగుచున్న విషయములను తెలుపగలరని యెప్పటివలె ఆతురతతో యెదురు చూచుచున్నాము! మీకు తెలియని విషయమేదియు నుండదు. కాబట్టి మీరు యిచ్చటకు వచ్చిన కారణము, నేను చేయదగు తక్షణ కర్తవ్యము వివరించి చెప్పుడు''. ఇట్లు పలికి కృష్ణుడు చిలిపిగా చిరునవ్వు నవ్వగా నారదుడు చిరునవ్వుతో బదులిచ్చెను.

నారదుడిట్లనెను. ''కృష్ణా! నీవు యింకెవరితోనైనను యీ విధముగా మాట్లాడి యున్నచో ఉచితముగా నుండెడిది. కాని నాతో యిట్లు మాట్లాడుట తగదు, ఎందుకనగా నీవెవరో నాకు తెలుసును. నీవు శుద్ధ సత్యస్వరూపుడవు. నీ మాయను బాగుగా తెలిసిన వాడనగుటచేత నీ మాటలకు మోసపోను. లోకములో యేమి జరుగుచున్నదో యేమియు తెలియనట్లుగా నీవు నటించుట చిత్రముగా నున్నది.

''అయినను, నీ సంతృప్తి కొరకు నీ వడిగిన వానికి బదులిచ్చునట్లు నేను నటించెదను. చెప్పుకోదగిన వేవియును జరుగటలేదు. కాకున్న, నీ మేనబావ యుధిష్ఠిరుని మదిలో ఒక విషయము మెదలుచున్నది. అతడు రాజసూయ యాగము చేయవలెనని కోరుచున్నాడు. యాగానంతరము నిన్ను గౌరవించి సన్మానించ వలెనని తలంచుచున్నాడు. నీవు యీ గౌరవము నందుకొనుటకు అంగీకరించవలెనని నేను కోరుచున్నాను.

''యుధిష్ఠిరుడు రాజసూయ యాగము చేయునపుడు గొప్ప సభామందిరము పరమోత్కృష్టులైన పురుషులతో విలసిల్లును

''పూర్వ జన్మలో చేసిన పాపకర్మల ఫలితముగా మానవులకు నీచ జన్మము సంభవించునని చెప్పుదురు అటువంటి నీచ జన్మలకుసైతము ఒక్కసారి నీ దర్శనము పొందు అవకాశము కలిగిన వెంటనే వారి పాపములు పరిహారమై పరిశుద్ధులగుదురని వినియున్నాను నీ కథలు వినుట, నిన్ను స్తుతించి గానముచేయుట, నిన్ను ధ్యానించుట మోక్షము చేరుటకు మార్గములు ఇక నీ మూర్తిని దర్శించి మానవులు అతి సులభముగా మోక్షము పొందగలరని వేరే చెప్పవలసిన పనిలేదు నీవు సభా గృహములో ప్రవేశించగనే, అది నీ పాదముల నుండి ప్రవహించు గంగానదివలె పరిశుద్ధముగ నుండును. స్వర్గము నందు మందాకినియని, పాతాళమునందు భోగవతి యని గంగానది పేరొందినది నీవు వచ్చి నీ ఉనికిచేత రాజసూయ యాగమునకు దివ్యత్వము కలిగింపుము''

భగవంతుని వైభవము పలుకుచున్నపుడు నారదుని కనులలో కన్నీరు ఉబికెను

కృష్ణుడు చుట్టును పరికించి చూచెను తన బంధువులు ఎప్పుడో జరుపబోయే
వెళ్ళి అనుమానాస్పదమైన ఆనందోత్సాహము పొందుటకన్న, ప్రస్తుతము సహాయము నర్థించుచున్న రాజుల కోరికను మన్నించి, జరాసంధునితో యుద్ధము చేయుట నభిలషించుచున్నట్లు కృష్ణుడు గ్రహించెను. కృష్ణుడు తన విశాల దృక్కులను ఉద్ధవునిపై ప్రసరింపజేసి యిట్లనెను ''ఉద్ధవా! మంత్రులందరిలో నీవు మిక్కిలి వివేకవంతుడవు నీవు యెప్పుడును మా క్షేమమును కోరుచుందువు. సమస్యలను నిశితముగా పరిశీలించి యేది సాధ్యమో యేది అసాధ్యమో చెప్పగల సమర్థత నీకు గలదు ప్రస్తుత పరిస్థితులలో, అన్ని విషయములు కూలంకషముగా యోచించి యేమి చేయవలెనో దయచేసి చెప్పుము''

సర్వజ్ఞుడైన కృష్ణుడు తనకేమియు తెలియనట్లుగా నటించి, ఒక క్లిష్టసమస్యను ముందుపెట్టి, ప్రస్తుత పరిస్థితులలో యేది చేయుట ఉచితమో హితవు చెప్పవలసినదని కోరగా, ఉద్ధవుడు లేచి నిలుచుండి మాట్లాడెను గిరివ్రజమునుండి వచ్చిన అపరిచిత వ్యక్తి పలుకులు, నారదుడాడిన మాటలు అక్కడ చేరిన వివిధ ప్రజలను వివిధ విధములుగా ప్రభావితము జేసెనని ఉద్ధవుడు గ్రహించి తెలుసుకొనెను. రాకుమారులు, మరికొందరు యాదవులు జరాసంధునితో యుద్ధము చేయగోరుచున్నారనియు, కృష్ణుడు మాత్రము ఇంద్రప్రస్థము వెళ్ళి యుధిష్ఠిరుని కలుసుకొన గోరుచున్నాడనియు ఉద్ధవుడు భావించెను కొద్ది క్షణములు ఆలోచించిన తర్వాత ఉద్ధవుడిట్లనెను ''కృష్ణా! రెండు కార్యములు కూడ ముఖ్యమనియు, రెండునూ కూడ అత్యవసరముగి పరిష్కరించవలసినవిగాను నాకు తోచుచున్నది నీ మేనబావ యుధిష్ఠిరునకు తాను తలపెట్టిన మహోత్కృష్ట కార్యమునకు నీ సహాయము అత్యవసరము జరాసంధుని చెరనున్న రాజులను సాధ్యమైనంత వేగముగా విడిపించవలసి యున్నది ఎంత తొందరగా విడిపించగలిగిన అంత మంచిది ప్రతి ఒకరోజు ఆలస్యమును వారికి దుర్భరమే.

''నేను విన్నది సరియైనచో, లోకములో అందరు రాజులను జయించిన రాజు మాత్రమే రాజసూయము చేయదగును. జరాసంధుని జయించువరకు యుధిష్ఠిరుడు రాజసూయము చేయజాలడు నీవు రాజసూయమునకు వెళ్లుట ద్వారా యీ రెండు కార్యములును నెరవేరును యుధిష్ఠిరునికి నీ సహాయ మత్యవసరము. నీవు సహాయపడుచున్నందుకు అతడు మిక్కిలి సంతోషించును. మరియు నీ సహాయము నర్థించిన రాజులను విడిపించుట కూడ తొందరలో జరుగును చెరనున్న రాజులను విడిపించుటలో నీవు సహాయము చేసిన

కీర్తి దక్కును.

''జరాసంధుని హతమార్చుటకు నేను కూడ ఒక మార్గము యోచించుచున్నాను. అతనికి పదివేల యేనుగుల బలము కలదని మనము వినియున్నాము. ద్వంద్వయుద్ధము చేయుట ద్వారా మాత్రమే అతనిని సంహరించుట సాధ్యమగును. అతనితో సరిసమానమైన శక్తిగలవాడు మాత్రమే ద్వంద్వయుద్ధము చేయగలడు. యుధిష్ఠిరుని సోదరుడు భీముడు మంచి బలవంతుడుగా ఖ్యాతిగాంచినాడు. భీముడు జరాసంధుని ద్వంద్వయుద్ధమునకు ఆహ్వానించినచో, క్షత్రియడగుటచేత జరాసంధుడు నిరాకరించలేక భీమునితో పోరగలడు. భీముడు తప్పక విజయము సాధించగలడు.

''నీవు నా అభిప్రాయము నడుగుటచేత, సమస్యను బాగుగా ఆలోచించిన మీదట ముందు సూచించిన పరిష్కారమార్గము ఆచరింపదగినదని నాకు తోచుచున్నది''.

అతిక్లిష్టమైన సమస్యను కూలంకషముగా పరిశీలించి తగిన పరిష్కారమును సూచించినందుకు అందరును ఉద్ధవుని అభినందించిరి.

నారదుడు, యితర పెద్దలు, జరాసంధునితో యుద్ధమున కువ్విళ్ళూరుచున్న యువకులు ఉద్ధవుని పరిష్కారము విజ్ఞతతో కూడినదని భావించి అంగీకరించిరి. తన అభిప్రాయమునే ఉద్ధవుడు వెలిబుచ్చినందుకు కృష్ణుడు సంతోషించెను. గిరివ్రజము నుండి వచ్చిన అపరిచిత వ్యక్తితో కృష్ణుడిట్లనెను. ''చెరనున్న రాజుల కష్టములను మనసులోనుంచుకుని, అతి త్వరలోనే వారిని కారాగార బంధమునుండి విడిపించగలమని తెలుపుము. కొద్ది కాలము ఓర్పు వహించమని చెప్పుము. త్వరలోనే వారికి సుఖసంతోషములు కలుగగలవు''.

ఆ వ్యక్తి అందరికి నమస్కరించి, గిరివ్రజమునకు వెళ్ళి చెరనున్న రాజులతో, త్వరలోనే సహాయము లభించనున్నదనియు కష్టములు అంతము కాగలవనియు మనవి చేసెను.

ద్వారకా ప్రయాణము ఫలవంతమగుటచే నారదుడు నారాయణుని స్తుతించి గానము చేయుచు వెళ్ళెను. మనోనేత్రము ద్వారా నారదుడు, రాజసూయమును, దాని సమాప్తిని, శిశుపాలుని మరణమును చూచెను. ఇంద్రప్రస్థమునకు వెళ్ళుటకు కృష్ణుడు సన్నాహములు మొదలుపెట్టెను. దారుకుని రథము సిద్ధము చేయుమని ఆదేశించగా, వెంటనే ద్వారము వద్ద రథమును తెచ్చి నిలిపెను.

కృష్ణుడు అనేక దేశములను — ఆనర్త, సౌవీర, మరు, కురుక్షేత్రములను — దాటెను. నదులు, పర్వతములు, పట్టణములు, పల్లెలు, గోకులములు, పచ్చని పంట భూములు దాటి వెళ్ళెను. తరువాత పవిత్రమైన దృషద్వతీ, సరస్వతీ నదులను దాటెను. పాంచాల దేశము చేరిన పిదప మత్స్యదేశము, అటుతర్వాత ప్రఖ్యాతి గాంచిన ఇంద్రప్రస్థపురము చేరెను.

కృష్ణుడు నగరపు పొలిమేరలు సమీపించకమునుపే యుధిష్ఠిరునకు కృష్ణుడు వచ్చి చేరెనని తెలియజేసిరి. తన సోదరులు, బ్రాహ్మణులు, స్నేహితులు వెంటరాగా పాండవాగ్రజుడు నగరద్వారము వద్దకు వెళ్ళెను. దుందుభులు మ్రోగెను. మధుర సంగీతము చెవుల కింపును చేకూర్చుచుండెను. యుధిష్ఠిరుని చేయి అందుకుని రథము నుండి కృష్ణుడు దిగెను. యుధిష్ఠిరుడు పాతమిత్రుని తిరిగి కలుసుకొనినట్లుగా పదేపదే కృష్ణుని కౌగిలించుకొనెను. పాండవసోదరుల కనులు ఆనందబాష్పములతో నిండెను. కృష్ణునికి కూడ కనులయందు

ఆనందబాష్పము లూరెను. పాండుపుత్రులుగా పొందవలసిన అదృష్టమునకు నోచుకొనని ఆ సోదరుల యెడ కృష్ణునికి విశేషమైన ఆప్యాయత కలదు. వారికి సంభవించిన అనేక కష్టములు గట్టెక్కి-దాటగలుగుట వారి అదృష్టమని చెప్పవచ్చును. ఇప్పుడు, చివరకు వారు స్థిరపడి, వారి భద్రతకు యెట్టి భంగము కలుగబో దనునట్లుగా గోచరించుచుండెను.

యుధిష్ఠిరుడు రాజసూయము చేయవలెనను దృఢసంకల్పముతో నుండెను అనగా లోకమంతయు అతనిని చక్రవర్తిగా అంగీకరించవలసి యున్నది.

కృష్ణుని కౌగిలించుకొనునపుడు భీముడు సంతోషముతో నవ్వగా, కృష్ణుడు భీముని వీపుపై మృదువుగా చరిచి తానుకూడ ఆహ్లాదముతో నవ్వెను కృష్ణుడు యుధిష్ఠిర భీముల పాదములకు నమస్కరించెను సమవయస్కుడగుటచే అర్జునుని కౌగిలించుకొనెను. నకుల సహదేవులు కృష్ణుని పాదములకు నమస్కరించిరి వారిని లేవనెత్తి అందరితో మృదుమధురముగా సంభాషించెను

కృష్ణుడు వచ్చుచున్నాడని వీధుల నలంకరించిరి. కృష్ణుడు రాజసౌధమునకు నడచి వచ్చు మార్గమంతయు పన్నీరు జల్లిరి.

కృష్ణుడు మొదట కుంతి అంతఃపురమునకు వెళ్ళి ఆమెకు పాదాభివందనము చేసెను అశ్రువులు నిండిన కనులతో ఆమె ఆశీర్వదించెను. ఆమె ప్రేమపూరితముగా కృష్ణుని కౌగిలించుకొనెను అతి కష్టము మీద ఆమె కౌగిలి నుండి కృష్ణుడు విడిపించుకొనెను ఆమెకు కృష్ణునిపై అంతటి ఆప్యాయత, ప్రేమగలవు. తర్వాత పాండవుల భార్య ద్రౌపదిని పలుకరించెను. ద్రౌపది కుంతి ప్రక్కనే నిలుచుండి కృష్ణుని చూచుచుండెను. కృష్ణుడు వచ్చినాడన్న సంతోషముతో యుధిష్ఠిరుడు తన నిత్యవిధులను జరుపుట మరచెను

ద్రౌపది కృష్ణుని భార్యలను ఆదరముతో పలుకరించి, తన అంతఃపురము లోనికి వారిని తీసుకువెళ్ళెను

కృష్ణునికి పాండవులకు అనేక దినములు ఆనందముగా గడచిపోయెను వారు ఉద్యానవనములలో సంచరించుచు ఆనందించిరి. మయసభను దాని నిర్మాణ కౌశలమును చూచి మెచ్చుకొనుచుండిరి. తరుచుగా వేటకు వెళ్ళుచు, జూదమాడుచు, కాలము వెళ్ళబుచ్చుచుండిరి

## 247 చర్చలు

ఒకరోజు సభామందిరము మంత్రులతో, శ్రేయోభిలాషులతో తదితర పెద్దలతో నిండి యున్నప్పుడు యుధిష్ఠిరుడు గంభీరస్వరముతో కృష్ణుని జూచి యిట్లు పలికెను ''కృష్ణా! మహాప్రభూ! నా మనస్సులోని ఆలోచనలను బహుశః నీకు నారదుడు తెలిపి యుండవచ్చును. గడచిన కొన్ని మాసములుగా నేను రాజసూయము జరిపినచో నుచితముగా నుండునాయని యోచించుచున్నాను కాని నీవు నా కోరికను మన్నించి అంగీకరించువరకు ఆ కార్యము గురించి తదుపరి ఆలోచించదలచుకోలేదు''. యుధిష్ఠిరుడు ఆగి కృష్ణునివైపు చూచెను. కృష్ణుడు గంభీరవదనముతో యుధిష్ఠిరుడు తరువాత పలుకు మాటల కెదురు చూచుచుండెను.

గొంతు సవరించుకుని యుధిష్ఠిరుడు మరల నిట్లనెను. ''నీవు మౌనముగా యెందుకుంటివో నేనెరుగుదును. ఈలోకమునకంతకు ఏకచ్ఛత్రాదిపత్యము వహించవలెనను నా కోరిక బహుశః అనుచితమని నీవు భావించుచుండవచ్చును! నీ ఊహ సరియైనదే. నా కెన్నడును అత్యాశలేదు. అయితే రాజసూయము జరుపకపోవుట వల్ల నా తండ్రి ఇంద్రుని సభలో స్థానము పొందలేకపోయెనని నాకు చెప్పిరి. అది జరుగకమునుపే అతడు మరణించినందువలన, అతనికొరకు నన్ను రాజసూయము జరుపమని వార్తపంపెను. నా సంకల్పమున కిదియే ముఖ్య కారణము.

''సాధ్యమైనచో రాజసూయము జరుపవలెనని నా కోరిక. ఇది సాధ్యమేయని నీవు తలంచినచో నేను చేసెదను. ఈ విషయమై కూలంకషముగా ఆలోచించెదను. లేనిచో యీ విషయమై ఆలోచనను యిక విరమించెదను. అన్ని విషయములు పరిగణనలోనికి తీసుకుని, నా సంకల్పము అత్యాశతో కూడినదో కాదో చెప్పగల సమర్థుడవు నీవొక్కడవేనని నాకు తెలుసును''.

కొంచెము సేపు సభలో నిశ్శబ్దము తాండవించెను. కొంచెము సేపు ఆగి బాగుగా యోచించిన మీదట కృష్ణుడు యిట్లనెను. ''లేదు. యుధిష్ఠిరా! నీవు అత్యాశతో నున్నావని నేను అనుకొనుటలేదు. నీవు తలపెట్టిన కార్యమును ఋషులు, పితృదేవతలు, దేవతలు, నీ స్నేహితులు అభినందించి మెచ్చుకొందురు. భారత వర్షములోని రాజులందరిని నీవు ఓడించగల సమర్థుడవు. నీ వేమీ సామాన్య వీరుడవు కావు. మరియు మహత్తర శక్తిసామర్థ్యములుగల నీ సోదరులు, యీలోకము నంతను జయించి నీకు అప్పగించగలరని నాకు తెలుసు. మీరు దిక్పాలకుల పుత్రులు. నీ సోదరులచేత యీ భూమిమీద జన్మించిన రాజులు చాల తేలికగా ఓడిపోదురు. కాని.......?

వెంటనే యుధిష్ఠిరుడు యిట్లనెను. ''కాని? కృష్ణా! మరి యే ఆటంకము కలుగగలదని యోచించుచున్నావు?''

కృష్ణుడు అందరివైపుజూచి ''నాకు పరమశత్రువు, జరాసంధుడు'' అని నవ్వెను.

యుధిష్ఠిరుని వదనము వివర్ణమయ్యెను. అతడిట్లనెను. ''కృష్ణా! రాజసూయము జరుపవలెనను సంకల్పమును విరమించుకొందును. జరాసంధుని ఓడించుట అసాధ్యము. నీవు చెప్పినది సరిగానున్నది. మీ అన్నదమ్ము లిరువురకే అతనితో పలుసార్లు యుద్ధము చేయవలసి వచ్చెను. నీవే అతనిని సంహరించలేకున్నపుడు యింకెవరు సంహరించగలరు? మాపై కూడ అతనికి ప్రేమాభిమానములు లేవు. కౌరవులకతడు గొప్ప స్నేహితుడు, అతడు నా స్నేహితుడు కాడు. నీవే నాకున్న ఉత్తమ స్నేహితుడవు. నా సంకల్పము యెంత తెలివి తక్కువైనదో నీవు స్పష్టముగా చూపించినావు''

కృష్ణుడిట్లనెను. ''ఒక శక్తిమంతుని కారణముగా నీవు సంకల్పించిన మహత్కార్యమును విడనాడరాదు. అతనిని నీవు లొంగదీసుకోవలెను. దీనికేదో మార్గము ఉండకపోదు''.

యుధిష్ఠిరుడు విషయము మరొక దిక్కుగా మళ్ళించి కృష్ణుని యిట్లడిగెను. ''కృష్ణా! నిన్ను, నీ శక్తిని తట్టుకొనగలిగిన జరాసంధునికి యెట్టి మహత్తర శక్తులున్నవో వివరించి చెప్పుము? నీవు అతనిని హతము గావించలేకపోవుటచేత, వేరెవరును అతనిని హతము గావించలేరని భావించుచున్నాను''.

కృష్ణుడిట్లనెను. ''అతని పుట్టుక ఒక కారణము. రెండవది అతడు మహాదేవునికి పరమభక్తుడు. ఈ

కారణములచేత అతని నోడించుట అసాధ్యమగుచున్నది. దీనిని ఛేదించుట అతికష్టము. అతడు అసాధారణ పురుషుడు. సామాన్య పద్ధతులలో అతని నణచుట సాధ్యముకాదు.

''అతడు మహాదేవునికి రుండమాలను ఒసగవలెనని తలంచుట నీవెరుగుదువా?''

''రుండమాల? నాకేమియు బోధపడుటలేదు'' అని యుధిష్ఠిరుడనెను. ''అత డనేకమంది రాజుల నోడించి వారినందరిని బంధించెను. సుమారు తొంబదిఅయిదుగురు యిపుడు అతని చెరలో నున్నారు. మరొక అయిదుగురు, అనగా నూరు సంఖ్య చేరగానే, వారి తలలు నరికి ఆ తలలతో హారము కట్టి దానిని మహాదేవునికి కానుకగా నొసగవలెనని జరాసంధుడు తలచుచున్నాడు''.

ఇది విని సభలో అందరును భయకంపితులైరి. యుధిష్ఠిరుడిట్లనెను. ''అతని పుట్టుక అసాధారణమైనదని యింతకుముందు చెప్పినావు. దాని గురించి చెప్పుము. అతడెట్లు మహత్తరశక్తిసంపన్నుడయ్యెనో తెలుపుము''.

## 248 జరాసంధుడు

''మగధ దేశ ప్రభువు బృహద్రథునకు సంతానము లేకుండెను. అతడు నిరాశ చెంది సన్యాస జీవితము గడపుటకు నిశ్చయించుకుని అడవికి వెళ్ళెను. అచట అతడొక ఋషిని చూచెను. అతని విచారమునకు కారణము తెలుసుకుని ఆ ఋషి బృహద్రథునకు ఒక ఫలము నిచ్చెను. ఆ ఫలమును భుజించిన పిదప అతని భార్య కుమారుని ప్రసవించుననియు, అతడు మహాశక్తిమంతుడుగా లోకములో ప్రఖ్యాతి గాంచుననియు, మహాదేవునికి పరమభక్తుడగుననియు ఋషి బృహద్రథునితో చెప్పెను. రాజు ఋషి యిచ్చిన ఫలమును స్వీకరించి, యిద్దరు భార్యలుండుటచేత ఆ ఫలమును రెండుముక్కలుగా కోసి యిద్దరకు చెరిసగము నిచ్చెను.

''కొంతకాలమునకు యిద్దరును గర్భవతులైరి. ఇద్దరికిని ప్రసవ సమయము సమీపించుసరికి నగరమంతయు ఉత్సాహముతో నిండెను, రాజు ఆత్రముతో పుత్రుల జననమున కెదురు చూచుచుండెను.

''కాని భార్యలు ప్రసవించిన తర్వాత రాజుకు సంతోషములేక, మనస్సు బాధతో నిండెను. అతడూహించిన ట్లుగా కుమారులు కలుగలేదు! రాణులిద్దరును అర్ధశరీరముతో నున్న శిశువులను ప్రసవించిరి. అర్ధశరీరములలో జీవము లేక ఒకదాని ప్రక్కనొకటి పడి యుండెను. జీవములేని అర్ధశరీరములు, సగము తల, ఒక కన్ను, ఒక నాసికారంధ్రము, ఒక కనుబొమ్మ, ఒక చెయ్యి, ఒక కాలుతో చూచుటకు భయంకరముగ నుండెను. నిస్పృహ చెంది రాజు, ఆ రెండు అర్ధ శరీరములను బయట విసరివేయమని ఆజ్ఞాపించెను. ఆ రాత్రి నగరమంతయు విచారము దుఃఖము తాండవించెను.

''జర అను రాక్షసి రాత్రివేళ నగరములో ప్రవేశించి దొరికిన దానిని తినుచుండెను. ఆ రాత్రి కొత్తగా జన్మించిన రెండు అర్ధశరీరములు పారవైచియుండగా వానిని ఆమె చూచి, భుజించుటకు దొరకెనని సంతోషించెను. ఆ రెండు అర్ధశరీరములను తీసుకుని ఒక యేకాంత ప్రదేశమునకు వెళ్ళెను. అచట తన్నెవరును చూడరని భుజించునపుడు యెటువంటి అంతరాయము కలుగకుండునని జర భావించెను. ఆమె కూర్చుని,

ఆ విధముగా గౌరవమొందిన తర్వాత, బలరాముడు యువదంపతులను తోడ్కొని ద్వారకకు బయలుదేరెను.

సోదరుడు కృష్ణునికి, తదితరులకు హస్తినలో జరిగిన విషయములు, తనకు ఆగ్రహము కలిగి తరువాత అది ఉపశమించిన తీరు వివరించెను.

ఇప్పటికిని హస్తినాపురము దక్షిణ దిశయందు యమునా నదివైపు ఒరిగియుండుట బలరాముని ఆగ్రహమునకు చిహ్నముగా భావింతురు.

## 246 కృష్ణునికి విన్నపములు

ఒకసారి కృష్ణుడు 'సుధర్మ'యను సభామందిరములో సోదరుడు బలరామునితో తదితరులతో కూర్చుని యున్నపుడు ఒక అపరిచిత వ్యక్తి కృష్ణుని చూచుటకు వచ్చెను. అతనిని లోపలకు రావలసినదని కృష్ణుడు పిలువనంపెను. ఆ వ్యక్తి లోపల ప్రవేశించి, సభలో నున్నవారందరికి నమస్కరించెను. అతడు రెండు చేతులు శిరస్సుపై నుంచి కొంతసేపు నిలుచుండెను. తరువాత అతడు కృష్ణుని పాదములపైబడి యిట్లనెను. ''జరాసంధుని ముఖ్యపట్టణమైన గిరివ్రజము నుండి వచ్చినాను''.

శ్రోతలలో సంపూర్ణ నిశ్శబ్దము ఆవరించెను. పురాతన శత్రువు పేరు వినుసరికి అందరును ఒక్కసారిగా సావధానులైరి. ఒక్కసారిగా ఆవరించిన నిశ్శబ్దమునకు కారణమేమై యుండునా యని పరిశీలనముగా చూచుచుండెను. అందరును కృష్ణునివైపు చూచుచుండగా, కృష్ణుడిట్లనెను. ''మా శత్రువు జరాసంధుడు పంపిన సందేశమేమి?''

ఆ అపరిచిత వ్యక్తి తల అడ్డముగా ఊపి యిట్లనెను. ''జరాసంధుని వద్ద నుండి కాదు. మొదట నేను స్పష్టముగా వివరించనందుకు చింతించుచున్నాను. అతడు పర్వతమందున్న కోటలో బంధించిన అనేక రాజుల ప్రతినిధిగా నేను యిక్కడకు వచ్చితిని. జరాసంధుడు మహాదేవుని భక్తుడని నీకు తెలిసిన విషయమే. చెరనున్న రాజుల శిరస్సులతో కట్టిన రుండమాల అను హారమును మహాదేవునికి సమర్పించెదనని జరాసంధుడు ప్రతిజ్ఞపూనెను. ఇట్టి సంకల్పముతో జరాసంధుడు పెక్కుమంది రాజులను ఓడించెను. నూరు సంఖ్య దాటకుండుటచేత ఆ రాజులు యింకను సజీవులై యున్నారు. చెరనున్న రాజులు నా ద్వారా నీ కొక సందేశము పంపినారు. వారి సందేశ మీవిధముగా నున్నది. 'కృష్ణా! నీ శక్తి అసమానమైనదనియు, ఆపదలో నున్న వారిని తప్పక రక్షించెదవనియు విని యున్నాము. మేము పూర్తిగా నీ శరణుజొచ్చుచున్నాము. నీవు తప్ప మమ్ము రక్షించువారెవరును లేరు.

'' 'జీవితముపై వ్యామోహముతో సత్కార్యములు చేయుట మరచిన వారు, దుష్టకార్యములనే చేయువారు, భగవంతుని సందర్శించక పుణ్యము సంపాదించనివారు, యెక్కువకాలము జీవించరనియు మరుచటి జన్మలో కూడ భగవదనుగ్రహము పొందజాలరనియు చెప్పుదురు.

దాని విషయమై అడుగక యూరకుండెను''.

## 249 జరాసంధుడు ద్వంద్వ యుద్ధము చేయుట

కృష్ణుడు, అర్జునుడు, భీముడు గిరివ్రజము వెళ్ళిరి. స్నాతక బ్రాహ్మణ వేషములు ధరించి, గోడ గెంతి కోటలో ప్రవేశించిరి అది మట్టమధ్యాహ్న సమయము మహాదేవుని భక్తుడైన జరాసంధుడు పూజముగించి, తమ కోరికలను తీర్చవలసినదని వచ్చి అడిగే యాచకులను గౌరవించు సమయమది ఇంద్రప్రస్థము నుంచి వీరు ముగ్గురు యాచకులు అందరును సమావేశమై యున్న ప్రాంగణమునకు వెళ్ళిరి

జరాసంధుడు ముందు ప్రాంగణమునకు వచ్చెన ి వద్దకు వెళ్ళి యిట్లనిరి. ''మేము చాల దూరము నుండి వచ్చితిమి. మా కోరికలను నీవు తీర్చగలవని ఆశించుచున్నాము దయచేసి మా కోరిక ప్రసాదింపుము''. జరాసంధుడు వారిని తేరిపార చూచుచు ఒక్కమాటయైనను మాట్లాడకుండెను. వారు తిరిగి యిట్లు కొనసాగించిరి. ''ఓర్పుగలవారికి సహించరాని దేదియును లేదు, దుష్టులకు అసాధ్యమైనది యేదియునులేదు, దానశీలురకు యివ్వదగని దేదియును లేదు. అందరిని సమానముగా చూచు వరము పొందిన వానికి అపరిచిత వ్యక్తియెవరైన నుండునా?

''దానము చేయగల శక్తియుండియు, అడిగినదానిని యివ్వక చిరకాలము నిలుచు కీర్తిప్రతిష్ఠలను పోగొట్టు కొనువారు అందరి యేవగింపునకు గురియై నిందనొందుదురు ప్రాచీనరాజులు హరిశ్చంద్రుడు, రంతిదేవుడు, బలి, శిబిచక్రవర్తి, వేటగానిని ఆనందపరచిన పిచ్చిక, ముద్గలుడను బ్రాహ్మణుడు, గతించినప్పటికిని, దానగుణము చేత వారి కీర్తి యీనాటికిని చిరస్థాయిగా నిలిచియున్నది''

వీరి ముగ్గురి ప్రవర్తన తీరు జరాసంధునికి వింతగాతోచెను. వారు ధరించిన దుస్తులు చూడగా స్నాతక బ్రాహ్మణులవలె నున్నారు కాని వారి కంఠస్వరము, వారి రూపము, ధనుర్విద్యాభ్యాసము చేత ధనువులు దాల్చుటచేత, కాయలుకాచిన కరములను చూడగా స్నాతక బ్రాహ్మణు లనిపించుటలేదు. జరాసంధుడు తనలో తానిట్లు తలచెను ''వీరు తప్పక బ్రాహ్మణులయి యుండరు. వీరు క్షత్రియులై యుందురు. వీరు యేదో కానిపనిని తలపెట్టనున్నట్లు తోచుచున్నది. కాని బ్రాహ్మణులడిగిన దానిని నిరాకరించకుండుట నా నియమముగా నున్నది. కాని క్షత్రియులుగా గోచరించుచు స్నాతకుల వయస్సు కన్న వయసు ముదిరిన వారుగా కనిపించుచున్నప్పటికిని, బ్రాహ్మణ వేషము ధరించి బ్రాహ్మణులవలె వచ్చుట చేత వారేది అడిగినను, నా జీవితమైనను సరే, యివ్వక తప్పదు బలిచక్రవర్తి కథను వినలేదా? వామనుడు నారాయణుడే యని తెలుసును ఇంద్రుని వద్ద నుంచి సంపాదించిన సంపదనంతయు తన కిమ్మని యాచించెను కాని బలి సంకోచించలేదు. దాన గ్రహీతయైన వామనుని కీర్తి కన్న బలిచక్రవర్తి కీర్తి యీనాటికిని చిరస్థాయిగా నిలిచియున్నది. అడిగిన దానిని యిచ్చి బ్రాహ్మణులకు సహాయపడకున్న, యేక్షణములోనైనను ప్రాణములు వీడు శరీరముతో జీవించి యేమి ప్రయోజనము?''

ఆ విధముగా గొప్ప దానశీలియైన జరాసంధుడు తలపోయుచుండెను వారు ముగ్గురను చూచి నవ్వి

మిక్కిలి ఔదార్యముతో నిట్లనెను. ''మీరేది అడిగినను తప్పక యిచ్చెదననియు, నిరాశ కలిగించననియు వాగ్దానము చేయుచున్నాను. నా శిరస్సు నిమ్మని అడిగినను, సంకోచించక యిచ్చెదను''.

కృష్ణుడు ఒక అడుగు ముందుకువేసి యిట్లనెను. ''నీవు యిష్టపడినట్లయితే నీతో మేము ద్వంద్వ యుద్ధము చేయగోరుచున్నాము. మేము బ్రాహ్మణులము కాదు. మేము ముగ్గురము క్షత్రియులము. మాకు భోజనము అక్కరలేదు. మాకు కావలసినది నీతో పోరు''. జరాసంధుడిట్లనెను. ''నేను మిమ్ములను చూచిన వెంటనే మీరు బ్రాహ్మణులు కారని తెలుసుకున్నాను. మీరు ముగ్గురు ధరించిన బ్రాహ్మణ వేషమును నేను గౌరవించినాను. ఆ కారణము చేతనే మీ రేది అడిగిన దాని నిచ్చెదనని చెప్పినాను''. అతడు కృష్ణుని వైపు మరల మరల చూచెను. జరాసంధుడు బిగ్గరగా నవ్వి యిట్లనెను. ''నీ ముఖము పరిచయ మున్నట్లుగా గోచరించుచున్నది. చాల కాలముక్రిందట నిన్ను చూచితిని. అందుచే వెంటనే గుర్తు రాకున్నది. నీవు మేనమామను చంపిన గోపాలుడవు కావా?'' మిగిలిన యిద్దరినీ చూచి యిట్లనెను. '' ఈ యువకులిద్దరు యెవరు? వారు కూడ గోపాలురేనా?''

కృష్ణుడు జరాసంధునితో నిట్లనెను. ''నీ ఊహసరియైనదే. ఆ రోజులలో నీతో అనేక పర్యాయములు పోరాడిన గోపాలుడను నేనే. ఈ యువకుడు కుంతి కుమారుడైన భీముడు. రెండవ యువకుడు అతని సోదరుడు''. జరాసంధుడు విని యిట్లనెను. ''మీరు అడుగుచుండుటచేత మీతో యుద్ధము చేయగలను. కాని యుద్ధములో నన్నెదుర్కొనుటకు ధైర్యము లేక పిరికిపందవలె పారిపోయి, నాకు భయపడి సముద్రమధ్యములో జీవించువానితో నేను పోరను. ఈ అర్జునుడు కడు పిన్నవయసువాడు. ఇతని శరీరము, అతి మృదువుగా నున్నది. ఇతనితో నేను పోరుట సవ్యముగా నుండదు. భీముడు నాతో పోరుటకు తగి యున్నాడు. విపుల శరీరము గల యీ భీముడు బలవంతునివలె నున్నాడు. ఇతడు బహుశః నాతో కొంతవరకు పోరగలడు''.

తర్వాత జరాసంధుడు రెండు గదలను తెప్పించి, ఒకదానిని భీమునికిచ్చి, రెండవదానిని తాను తీసుకొనెను. వారిరువురు బయటకు వచ్చి ద్వంద్వ యుద్ధము ప్రారంభించిరి. ఇద్దరును సరిసమానముగా నుండిరి. పోరుచున్నప్పుడు యిరువురును సంతృప్తితో ఆనందించుచుండిరి.

వారిరువురు ఒకరినొకరు ఢీకొనినప్పుడు ఉత్పన్నమైన శబ్దము రెండు బలమైన మదపుటేనుగులు ఢీకొనినట్లుగా, లేక రెండు పిడుగులు ఒకదానికొకటి అడ్డముగా తగిలి శబ్దము చేసినట్లుండెను. ఇద్దరిలో యెవరును ఒకరికొకరు తీసిపోకుండ, అనంతముగా యీ పోరు సాగునా యనునట్లు ద్వంద్వ యుద్ధము చేయుచుండిరి. వారిద్దరి మధ్య ఇరువది యెనిమిది రోజులు ద్వంద్వ యుద్ధము సాగెను. వారిరువురి సంబంధము చాల విచిత్రముగా నుండెను. రాత్రిళ్లు స్నేహితులవలె ఒకరితోనొకరు ముచ్చటించుకొనుచుండెడి వారు. పగటిపూట తీవ్రముగా యిరువురును పోరెడు వారు.

ఒకరోజు రాత్రి భీముడు కృష్ణునితో యిట్లనెను. ''కృష్ణా! ఈ జరాసంధుని సంహరించుట నాకు సాధ్యమగునట్లు లేదు. ఇతడు నాకు అన్ని విధముల సరిసమానముగా నున్నాడు. ఈ పోరునకు అంతము కన్పించుటలేదు. రోజు రోజునకు నేను అలసిపోవుచున్నాను''.

కృష్ణుడు భీమునితో ''రేపు నీవు జరాసంధుని చంపగలవు'', అని చెప్పెను.

మరునాడు తిరిగి యిరువురి మధ్య ద్వంద్వ యుద్ధము ప్రారంభమయ్యెను భీముడు జరాసంధుని నేలపై పడవైచెను ఆ సమయములో కృష్ణుడు భీముని వైపు చూచెను. భీముడు చూచుచుండగా, కృష్ణుడు తన చేతిలో నున్న ఆకును రెండుగా చీల్చెను. అది చూచిన భీమునకు తానేమి చేయవలెనో అర్ధమయ్యెను. క్రిందపడిన జరాసంధుని ఒక కాలిపై నిలుచుని రెండవ కాలును చేతితో పట్టుకుని రెండు భాగములుగా చీల్చెను.

మగధ దేశ రాజు జరాసంధుడు మరణించుట చూచిన ప్రజలు, కట్టలు త్రెగిన సముద్రము వలె, హర్ష ధ్వానములు చేసిరి అసాధ్యమని భావించిన కార్యమును సాధించినందుకు కృష్ణుడు, అర్జునుడు భీముని గాఢముగా కౌగిలించుకొనిరి. కృష్ణుడు జరాసంధుని కుమారునకు మగధ దేశపు రాజుగా పట్టాభిషేకము చేసెను. తరువాత అనేకులు రాజులు చెరనున్న గిరివ్రజమను పట్టణమునకు ముగ్గురును వెళ్ళిరి బంధ విముక్తులైన రాజులకు ఆనందముతో నోట మాటరాక, కృతజ్ఞతాపూర్వక దృక్కులు బరపిరి ఏకధారగా కనుల వెంట కారుచున్న అశ్రువులతో కృష్ణుని పాదము లభిషేకించిరి తడబడుచున్న మాటలతో వారు కృతజ్ఞత తెలుపగా, కృష్ణుడు వారితో నిట్లనెను ''జరాసంధుని చెరబడిన మిమ్ములను, నేను యిచ్చిన మాట ప్రకారము, విడిపించి మాట నిలబెట్టుకొంటిని. దీనికి ప్రతి ఫలముగా మీరు మీ రాజ్యములకు తిరిగి వెళ్ళి, అహంకార గర్వముతో ధర్మము విస్మరించక చక్కగ పరిపాలించమని కోరుచున్నాను తరువాత యుధిష్ఠిరుడు జరుపు రాజసూయమునకు మీరందరును వచ్చి అతనికి సహాయము నందించవలసినదిగా నేను మిమ్ము కోరుచున్నాను''

భీమార్జునులతో కలిసి కృష్ణుడు గిరివ్రజ పట్టణము వదలి వెళ్ళెను పట్టాభిషిక్తుడైన యువరాజు సహదేవుడు వారికి వీడ్కోలు చెప్పెను. ఇంద్రప్రస్థపు పొలిమేరలకు వచ్చిన తర్వాత వారు పూరించిన విజయ శంఖారావము వినిన యుధిష్ఠిరునకు ఆనంద ముప్పొంగెను అతడు తన పరివారముతో త్వరగా వారి కెదురేగి ఆహ్వానించి యింటికి తీసుకువచ్చి గౌరవించెను

## 250 రాజసూయ యాగము

యుధిష్ఠిరుని సార్వభౌమత్వము చాటుటకై యుధిష్ఠిరుని నలుగురు సోదరులు నాలుగు దిక్కులకు వెళ్ళిరి వారు ఆయా దిశలందు పాలించుచున్న రాజుల నుండి యెటువంటి ప్రతిబంధకము యెదుర్కొనక విశేషమైన ధన సంపదతో తిరిగి వచ్చిరి. యుధిష్ఠిరుడు ధర్మ ప్రభువని, అనేక కష్టనష్టములు చవి చూచిన ఉదాత్తుడని అందరకును తెలియును యుధిష్ఠిరుని సార్వభౌమాధికారము పలువురు రాజులు అంగీ
ప్రధాన కారణము ఈనాటికి చక్రవర్తి పదవిని సాధించిన యుధిష్ఠిరుడు రాజసూయ యాగము తలపెట్టినందుకు తదితర రాజుల కెవరికిని అభ్యంతరము లేకుండెను వారు రాజసూయ యాగములో పాల్గొనుటకు ఉత్సాహ ముతో తమ అంగీకారము తెలిపిరి. ఒకరిద్దరు రాజులు మాత్రము యుధిష్ఠిరుని సోదరులకు ప్రతిబంధకము కల్పింపనెంచిరి కాని వారు పాండవ సోదరులచేత పరాజితులైరి. పరాజితులైన రాజులు విజేతలకు నివాళులర్పిం చిరి. రాజసూయమునకు పాండవ సోదరులు ఆ రాజుల నాహ్వానించిరి.

యుధిష్ఠిరుడు రాజసూయమునకు సన్నాహములు ప్రారంభించెను యాగ క్రతువులలో నిష్ణాతులైన

ఋషులను యాగము చేయుటకు అనువైన స్థలమును, అనుసరించదగు క్రతువులను వివరించమని యుధిష్ఠిరుడు స్వయముగా కోరెను. సర్వసామాన్యముగా వసంత కాలములో యాగము జరుపుట ఆచారము. వ్యాసుడు, భారద్వాజుడు, సుమంతుడు, క్రతువు, జైమిని, పైలుడు, పరాశరుడు, పరశురాముడు, వీతిహోత్రుడు, యింకను అనేకులు పవిత్ర ఋషివర్యులు యాగమునకు వచ్చుట కంగీకరించిరి. భీష్ముడు, ధృతరాష్ట్రుడు, ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు, విదురుడు, దుర్యోధనుడు అతని సోదరులు, శకుని, కర్ణుడు, ద్రోణాచార్యుని పుత్రుడు అశ్వత్థామ — వీరిని ఆహ్వానించుటకై యుధిష్ఠిరుడు సహదేవుని పంపెను.

భారత వర్షములోని రాజులందరును రాజసూయమునకు ఆహూతులైరి. వసంత ఋతువు ప్రారంభమయ్యెను. పవిత్ర ముహూర్త సమయమందు యుధిష్ఠిరుడు స్వయముగా యాగ భూమిని దున్ని, యజ్ఞారంభమునకు ముందుగా నిర్వర్తించవలసిన విధులను ప్రారంభించెను.

యాగము ప్రారంభమై యెటువంటి అడ్డంకులు లేక కొనసాగుచుండెను. నారద పురస్సరముగా స్వర్గము నుండి ఋషులు యాగము తిలకించుటకు వచ్చిరి. యుధిష్ఠిరుడు జరుపుచున్న రాజసూయ యాగ వైభవము గూర్చి ఇంద్రుని సభలో కూడ ముచ్చటించుచుండిరి. వెనుక వరుణుడు జరిపిన రాజసూయ యాగ వైభవమును పోలియున్నదని అందరును మెచ్చుకొనుచుండిరి.

యాగాంతమున జరుపవలసిన మర్యాద ఒకటి కలదు అది యేమనగా ఆహూతులైన అతిథులలో అత్యుత్తముడైన వానిని గౌరవించి సత్కరించుట. యుధిష్ఠిరుడు అతిథుల నందరిని సరిసమానముగా గౌరవించెను. కాని ప్రత్యేకముగా ఒకరిని గౌరవించి సత్కరించుట యుధిష్ఠిరునికే కాక, సత్కృతునకు, ఆహూతులైన గౌరవనీయు లందరికిని కూడ ఒక విధముగా యిబ్బంది కలిగించు కార్యమిది. ఒకరిని ప్రత్యేకముగా గౌరవించి సత్కరించుటచేత యితరులను చిన్నచూపు చూచినట్లు కాగలదు. అతి చాకచక్యముతో యీ సమస్యను పరిష్కరించుటకు యుధిష్ఠిరుడు ప్రయత్నించుచుండగా, తెలివితేటలలో అసామాన్యుడని ప్రఖ్యాతి గాంచిన సహదేవుడు నిలుచుని యిట్లనెను. ''ఇచ్చటకు వచ్చిన అతిథులలో గౌరవించి సత్కరింపదగిన వ్యక్తి ఒకే ఒకరు కలరు. అతడు కృష్ణుడు అతడు మానవమాత్రుడు కాడు సాక్షాత్తు భగవంతుడే రూప నామములు ధరించి, మనవంటి వారి శ్రేయస్సుకై యీ భూమిపై సంచరించుచున్నాడు. ఈ లోకమునకు అతడే పునాది. అన్ని యాగములకు అతడే మూల పురుషుడు. యాగములలో సమర్పించు వానిని గ్రహించునది అతడే. ఉపనిషత్తులు వర్ణించునది, అందరి పూజల నందుకొనునది అతడొక్కడే. సృష్టించునది, పోషించునది అతడు మాత్రమే చివరకు యీ లోకమును లయింప జేయునది కూడ అతడే అతని అనంత తత్త్వమును అనంత వైభవమును యెవరు తెలియగలరు? కృష్ణుని గౌరవించినచో యీ లోకములోని అన్ని జీవులను జడ పదార్థములను గౌరవించినట్లగును. ఎందులకనగా యీ లోకమంతయు వ్యాపించిన బ్రహ్మమే అతడు. అందుచే మనమందరమును కృష్ణుని గౌరవించి సత్కరించుట ఉచితముగా నుండగలదు''.

అక్కడ చేరిన విజ్ఞులందరును సహదేవుని పలుకులకు సంతసించి హర్షము వెలిబుచ్చిరి. అతని పలుకులలోని సత్యము వారు గ్రహించిరి. కృష్ణుడు పరమపురుషుడని, గౌరవింపదగువాడు అతడొక్కడేయని వారికి తెలియును సహదేవుని సూచన అందరకును ఆమోద యోగ్యముగా నున్నదని తెలుసుకుని యుధిష్ఠిరుడు సంతోషించెను. యుధిష్ఠిరుని మనస్సులో కూడ అదే కోరిక కలిగెను. తన సంకల్పమును మాటల ద్వారా తెలియచెప్పు లోపల సహదేవుడు అదే అభిప్రాయమును స్పష్టముగా వివరించి చెప్పెను.

అమితమైన ఆనందముతో యుధిష్ఠిరుడు కృష్ణుని పూజింప మొదలు పెట్టెను. ద్రౌపది సువర్ణపాత్ర నుండి నీరు పోయుచుండగా, యుధిష్ఠిరుడు కృష్ణుని పాదము లభిషేకించెను. కృష్ణుని పాదముల నభిషేకించిన తీర్థమును తన తలపై జల్లుకొని, తర్వాత భార్య, సోదరుల తలలపై జల్లెను. అనేక సంవత్సరముల క్రితము యా తీర్థమును మందాకిని పేరుతో పిలుచుచుండిరి. భగీరథుడు మందాకినిని భూలోకమునకు తీసుకువచ్చిన తర్వాత గంగ యను పేరుతో ప్రసిద్ధికెక్కెను. యుధిష్ఠిరుని నేత్రములు అశ్రువులతో నిండియుండుటచేత, కృష్ణుని ముందు చేతులు జోడించి నిలుచుండియున్న యుధిష్ఠిరుడు కృష్ణుని సరిగా చూడలేకపోయెను. యుధిష్ఠిరుని మనస్సు కృష్ణుని గురించిన ఆలోచనలతో నిండి యుండెను.

## 251 చేది రాజు శిశుపాలుడు

''ఈ తెలివి తక్కువతనమును యిక చాలింపుడు'' అను స్వరము అకస్మాత్తుగా వినిపించెను. అది వినిన అందరును ఆశ్చర్యముతో నిస్తబ్ధులైరి. భగవంతుని పూజించుటలో నిమగ్నులైన అందరకును ఊహించని విధముగా యా అపస్వరము వినిపించుట ఆశ్చర్యము కలిగించెను. అందరి కనులును స్వరము వచ్చిన దిక్కువైపు మళ్ళెను. దామఘోషుని కుమారుడైన శిశుపాలుడు లేచి నిలుచుండుట అందరును చూచిరి. అతడు దోషారోపణము చేయు వానివలె చేయి పైకెత్తెను. అతని కనులు క్రోధముతో యెర్రబడెను. తన అనంగీకారమును సూచించుటకుగాను యెత్తిన చేయి తీవ్రముగా వణకుచుండెను. కృష్ణుని గురించి నిందా పూర్వకముగా మాట్లాడ మొదలుబెట్టెను. యుధిష్ఠిరుని క్రూరమైన మాటలతో నిందింపదొడగెను.

''కాలగతిని యెవరును మార్చలేరు. అది సత్యమే'' అని శిశుపాలుడు పలికి, తన ప్రసంగము నిట్లు కొనసాగించెను. ''అనుభవజ్ఞులైన వృద్ధులు యీ వాక్యము పలికి యున్నచో అది సత్యమని నమ్మవచ్చును. ప్రపంచానుభవము లేని పసివాడైన సహదేవుని పలుకులను క్షమించవచ్చును. అతడు కృష్ణుని సహవాసములో నుండుటచేత కృష్ణుడు మాత్రమే గౌరవ మొందుటకు సత్కారమునకు అర్హుడని అతని అభిప్రాయము కావచ్చు.

''కాని యిక్కడ చేరిన వయోవృద్ధులు, అనుభవజ్ఞులు కూడ విజ్ఞత చూపించుటకు బదులుగా సహదేవుని పలుకులను విని మెచ్చుకొనుట నా కాశ్చర్యము కలిగించుచున్నది. ఈ సభలో నున్న విజ్ఞులందరిని అభ్యర్థించుచున్నాను. యుధిష్ఠిరుని తెలివిమాలిన యీ పనికి మీ అంగీకారము నీయవలదు. మీ వివేక శక్తిని వినియోగింపుడు. యదు వంశమునకే మచ్చతెచ్చిన యితడు, యీ గొల్లడు యే విధముగా యీ గౌరవమునకు తగునో తెలియజెప్పుడు! ఇచ్చట అనేకులు గొప్ప వ్యక్తులు కలరు. తపస్సంపద, జ్ఞానసంపద కలిగిన ఋషులెందరో యున్నారు. వీరు స్వర్గవాసులచేత ప్రశంసలు పడసినారు. వీరు పాపరహితులు; యెల్లపుడును బ్రహ్మ ధ్యానములో నిమగ్నులై యుందురు. వీరి నందరిని విస్మరించి, యుధిష్ఠిరుడు తెలివితక్కువగా యీ మనుజుని (కృష్ణుని) గౌరవింపదలచుట సిగ్గుచేటు.

''కృష్ణుడు దీని నంగీకరించుట యెట్లున్నదనగా, దేవతలకు చెందవలసిన హవిస్సును కాకి తన్నుకుపోయి నట్లున్నది.

''అతడు యే ఉన్నత కుటుంబమునకును చెందినవాడు కాడు. కారాగారములో జన్మించి, గోపాలకుని

వద్ద పెరిగిన యితనికి రాజుల సమక్షములో సంచరించు సంస్కారము యెట్లు కలుగును? అతనికి సంఘ మర్యాదలు తెలియవు, సామాన్య సూత్రములను కూడ పాటించడు తాను చేయబోవు కార్యములకు పెద్దల యాదేశమును తీసుకొనక తనకు తానే నిశ్చయించుకొనును. గొప్పగా చెప్పుకోదగిన గుణ మొక్కటియు అతనిలో లేదు. అతని కుటుంబ మెటువంటిదో యోచింపుడు. యయాతి కుమారుడైన యదువు యితని పూర్వుడు తండ్రి కోరికను మన్నించక పెడచెవిని పెట్టి నిరాకరించిన వాడు యదువు. తన జ్యేష్ఠ పుత్రుని ప్రవర్తనకు అసంతృప్తుడై యయాతి యదువును నిరాకరించుట మీరెరుగని విషయము కాదు

''యదువు కుటుంబములోని వారందరును దొంగ బుద్ధులకు, త్రాగుబోతు తనమునకు ప్రసిద్ధికెక్కిరి బ్రహ్మర్షులు సంచరించు దేశములకు దూరముగా సముద్రము మధ్యలో నున్న నగరములో వారుందురు. వారికిని యితరులకును గల భేదము ఆ ఒక్క విషయమే స్పష్టము చేయుచున్నది ఇతడొక గోవులకాపరి, దొంగ. ఇటువంటి వారు రాజులు కాలేరని లోకములో అందరికిని తెలిసినప్పటికిని, యితడు రాజు కావలెనని ఉవ్విళ్ళూరుచున్నాడు అటువంటి వాడు యిటువంటి సభలో గౌరవమందరాదు సర్వ సామాన్యమైన సభలలో కూడ అతనిని గౌరవించుట తగదు అటువంటపుడు యీ సభలో అందరిలో నుత్తమ వ్యక్తిగా అతనిని గౌరవించుటెట్లు? అది యెంత మాత్రము తగదు. ఈ విధముగా అతనిని పూజించుట పెద్ద తప్పు''

శిశుపాలుని నిందాపూర్వక ప్రసంగము ముగిసిన వెంటనే సభలో నిశ్శబ్ద మావరించెను నక్క కూతలకు చెక్కుచెదరని మృగరాజువలె, ముఖములో యెటువంటి భావము ప్రదర్శింపక కృష్ణుడు కూర్చుండెను భగవంతుని యెడల యెనలేని ప్రేమ భక్తికలవారు చెవులు మూసుకొని సభ నుండి నిష్క్రమించిరి భగవంతునిపై గాని, అతని భక్తులపై గాని నిందలను వినినచో, వారి పుణ్యము హరించి నరకము పాలగుదురని పెద్దలు చెప్పుచుందురు. భగవంతుని నిందించుటకు మించిన పాపము వేరొకటి లేదు

శిశుపాలుని నిందాపూర్వక ప్రసంగము వినిన పాండవులు విభ్రాంతి చెందిరి వారు కేకయ, మత్స్య, సృంజయులతోపాటు చేతులను జాపి ఆయుధములు గైకొని, అగౌరవకరమైన నిందా ప్రసంగము చేసిన శిశుపాలుని శిక్షింప దలచిరి. భీముడు శిశుపాలుని మాటలు విని సహించలేకపోయెను తన గద నెత్తి శిశుపాలునివైపు వడివడిగా వచ్చుటకు ప్రయత్నించెను వారందరిని ఊరకుండమని కృష్ణుడు సంజ్ఞచేసి, చిరునవ్వు చిందించుచు కూర్చుండెను.

భీష్ముడు భీమునితో యిట్లనెను. ''శిశుపాలుడు కృష్ణుని చేతిలో మాత్రమే మరణించునట్లుగా నిర్ణయమై యున్నది. అతడు జన్మించినపుడు ఆకాశము నుండి ఆ విధముగా స్వరము వినిపించెను శిశుపాలుని తల్లి, అనగా నీ పెదతల్లి, ఆకాశము నుండి విన్పించిన స్వరము నిజము కాకూడదని, తన పుత్రుని దక్కించమని కృష్ణుని ప్రార్థించెను. శిశుపాలుడు తనకు దక్కునని ఆమె భావించెను ఆమె పుత్రుని నూరు అవమానములు సహించి క్షమించి విడిచి పుచ్చెదనని కృష్ణుడు శిశుపాలుని తల్లికి మాట యిచ్చెను. తన పుత్రుడు నూరు సంఖ్య చేరడను విశ్వాసముతో శిశుపాలుని కెటువంటి హాని జరుగబోదని ఆమె ధైర్యముగా నుండెను కాని యేమి జరిగెనో చూడు! కృష్ణుని ప్రక్కనే పువ్వులు గుట్టగా పడియున్నవి నీ అన్న యుధిష్ఠిరుడు కృష్ణుని పూజించిన పూవులవి. వానిని ఒకొక్కటే కృష్ణుడు క్రింద వేయుచుండెను. అవి యిపుడు నూరుకు మించి యున్నవి ఇపుడు కృష్ణుడు శిశుపాలుని చంపనున్నాడు''.

భీష్ముడు ఆ విధముగా మాట్లాడుచుండగా, కృష్ణుడు ఒక్కసారిగా లేచి నిలుచుండెను కృష్ణుని వదనములో

సరళత్వము, ప్రసన్నత అంతరించెను కనురెప్పలు క్రోధమును సూచించుచుండెను. శిశుపాలుడు చేతిలో కత్తిని ధరించి తన అనుయాయులతో కృష్ణునివైపు వడివడిగా వచ్చుచుండుట జూచి, కృష్ణుడు వేచి చూచుచుండెను.

ప్రతి ఒక్కరు నిస్సహాయముగా చూచుచుండిరి కృష్ణుడు తన చక్రముతో శిశుపాలుని తల నరికి శరీరము నుండి వేరుచేసెను. ఈ దృశ్యమును అందరు నోట మాట రాక ఊపిరి బిగబట్టి చూచుచుండిరి

కట్టలు తెగిన సముద్రపు హోరు వంటి శబ్దము వినిపించెను. మహాజ్ఞానులైన నారద, వ్యాస, యుధిష్ఠిరులకు శిశుపాలుని మృత దేహము నుండి ఒక విధమైన వెలుగు కృష్ణునివైపు పయనించి, కృష్ణుని పాదములు సమీపించినంతనే ఆ వెలుగు అదృశ్యమగుట కన్పించెను.

వైకుంఠములోని ద్వారపాలకులలో ఒకడైన జయుడు, సనకాది మహర్షుల శాప ఫలితముగా అనేక వేల సంవత్సరముల తదుపరి, తన స్వస్థానము చేరుకొనెను అనంత కృపా సముద్రుడైన భగవంతుడు, పాపభూయిష్ఠము, దుఃఖము బాధలతో నిండిన యీ మానవ లోకము నుండి మూడవ జన్మ అనంతరము జయునకు విముక్తికలిగించెను జయునకు భగవంతుని నుండి దీర్ఘకాలపు యెడబాటు అంతమయ్యెను తిరిగి నారాయణుని విడిచి యుండవలసిన అవసరము జయునకు లేకుండెను

రాజసూయ యాగము సమాప్తమయ్యెను యుధిష్ఠిరుడు వచ్చిన అతిథులందరిని తగిన రీతిగా గౌరవించి సత్కరించెను చేయవలసిన విధులను సంపూర్ణముగా నెరవేర్చి యుధిష్ఠిరుడు యాగము ముగించెను.

రము విడిచి వెళ్ళిన తర్వాత, యుధిష్ఠిరుని కోరికపై కృష్ణుడు మరికొన్ని దినములు అచట గడపెను మరికొన్ని వారముల తర్వాత, పాండవ సోదరులు అభ్యర్థించుచున్నప్పటికిని, కృష్ణుడు వారిని విడిచి తిరిగి ద్వారకా నగరమునకు బయలుదేరెను.

## 252 సాళ్వుడు ద్వారకను ముట్టడించుట

సాళ్వుడు శిశుపాలునికి అత్యంత ప్రియ స్నేహితుడు. రుక్మి శిశుపాలుని ఆహ్వానించినపుడు, సాళ్వుడు కూడ విదర్భ వెళ్ళెను రుక్మిణిని శిశుపాలుడు వివాహమాడ దలచిన కాలమది కాని కృష్ణుడు రుక్మిణి నెత్తుకుపోయి వివాహమాడెను. అప్పటి నుండి శిశుపాలుడు, అతని స్నేహితులు కృష్ణునిపై ద్వేషము కలిగియుండిరి. రాజసూయ యాగాంతమున తన ప్రియమిత్రుడైన శిశుపాలుడు కృష్ణునిచే నిహతుడైనప్పటి నుండి, సాళ్వునకు కృష్ణునిపై ఆగ్రహము యినుమడించెను. కృష్ణుని కారణముగా యిద్దరు ముఖ్య స్నేహితులను — జరాసంధుడు, శిశుపాలుడు — పోగొట్టుకొనెను. తీవ్రమైన క్రోధముతో ''ఈ భూమిపై యాదవులు లేకుండ చేసెదనని'' సాళ్వుడు ప్రతిజ్ఞ పూనెను

సాళ్వుడు పర్వతములకు వెళ్ళి అక్కడ మహాదేవునికి ప్రీతి కలిగించుటకై తీవ్రముగా తపస్సు చేసెను అతడు ప్రతి దినము పిడికెడు మట్టిని మాత్రము ఆహారముగా గ్రహించుచుండెను. అందరు దైవములలో, మహాదేవుని మెప్పించుట అతి సులభము. సాళ్వుని తపస్సుకు సంతోషించి, మహాదేవుడు వరమును

కోరుకొమ్మని సాళ్వునితో పలికెను. దేవతలచేగాని, అసురులచేగాని, మానవులచేగాని, గంధర్వులచేగాని, నాగులచేగాని, రాక్షసులచేగాని నాశనము చెందని విమానమును ప్రసాదించమని సాళ్వుడు వరమడిగెను. తాను కోరిన ప్రదేశమునకు — భూమిపైగాని, జలముపైగాని, ఆకాశముపైగాని — అది వెళ్ళునట్లు, యాదవులకు భయము కలిగించునట్లుగా నుండవలెనని సాళ్వుడు మహాదేవుని కోరగా, మహాదేవుడు సాళ్వుని కోరిక మన్నించి వరమును ప్రసాదించెను. ఆ విమానమును మయుడు నిర్మించెను

సౌభ యను పేరుగల ఆ విమానము (రథము) సాళ్వునికి లభించెను. అది కేవలము రథమే కాదు అది ఒక చిన్న పట్టణము. అందులో కూర్చున్న సాళ్వుడు, తాను కోరుకున్న ప్రదేశమునకు వెళ్ళగలుగుచుండెను. ద్వారకా నగరమును నాశనము గావించుటకు తగిన సమయము ఆసన్నమైనదని సాళ్వుడు నిశ్చయించుకొనెను.

తన వద్దనున్న ఆయుధములతో, పెద్ద సేనాబలము సమకూర్చుకుని, ద్వారకా నగరమును నాలుగు వైపుల చుట్టుముట్టెను. ద్వారకా నగరమును సంపూర్ణముగా నాశనము చేయుటకు దృఢ నిశ్చయుడయ్యెను తోటలు, అందముగా అలంకరించిన నగర ద్వారములు, గృహములు, విశ్వకర్మ తీర్చిదిద్దిన గోపురములు, నగరమును రక్షించుటకు నిర్మించిన ప్రాకారపు గోడలు అన్నింటిని సాళ్వుడు ధ్వంసము చేసెను. తన విమానములో కూర్చుని సాళ్వుడు, బాణములను ప్రయోగించుచుండెను. రాళ్ళ వర్షము కురిపించుచుండెను. పర్వతములపై నున్న పెద్ద పెద్ద రాళ్ళను, క్రూర సర్పములు మొదలైన వానిని ద్వారకా నగరముపై విసరుచుండెను. ద్వారక యందు గాలివాన సృష్టించెను విపరీతమైన గాలి వలన ధూళి చెలరేగి యేమియు కనుపించకుండెను కృష్ణుని ద్వారకా నగరము, ఆనాడు త్రిపురాసురుడు యీ భూమిపై సృష్టించిన చిచ్చును పోలి యున్నది.

కృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడు సాళ్వునితో యుద్ధము చేయుటకు బయలుదేరెను సాత్యకి, సాంబ, అక్రూర, కృతవర్మాది యాదవులు ప్రద్యుమ్ను ననుసరించి వెళ్ళిరి. సాత్యకి మున్నగువారు ఘోర యుద్ధము సలిపిరి. ప్రద్యుమ్నుడు తీవ్రముగా పోరాడెను. శంబరునితో నున్నపుడు మహామాయ యందు నిష్ణాతుడైన ప్రద్యుమ్నుడు, సాళ్వుని వక్కజిత్తులను తేలికగా యెదుర్కొన గలిగెను. కాని సౌభ యను విమానము, ప్రద్యుమ్నుని బాణముల ధాటికి నిలువ గలిగెను. విమానము ఒక క్షణము ఆకసముపై కెగురుచు, మరుక్షణము భూమిపై వాలుచు, యెవరైన వెంబడించినచో తిరిగి ఆకాశమున కెగిసి తప్పించుకొనుచుండెను ఒకొక్కపుడు ఘనముగా రూపొందుచు, మరొక తడవ అతి కురుచగా మారుచుండెను. సాళ్వుడు త్వరత్వరగా పాదరసము వలె కదలిపోవుచుండుటచేత, యెవరును సరిగా గురిపెట్టి బాణము ప్రయోగించ లేకపోవుచుండిరి యాదవ నాయకులకు అతడతి శక్తిమంతుడుగా తోచెను. అతని నెవరును యెదుర్కొనలేకపోయిరి.

సాళ్వుని మంత్రి ద్యుమనుడు ప్రద్యుమ్నుని సమీపించి తన గదతో తీవ్రముగా కొట్టెను. ఆ దెబ్బకు ప్రద్యుమ్నుడు మూర్ఛపోయెను. ప్రద్యుమ్నుని రథసారథి ప్రద్యుమ్నుని దూరముగా తీసుకుపోయెను ప్రద్యుమ్నునకు తెలివి వచ్చిన తర్వాత రథసారథి చర్యకు ఆగ్రహించెను ప్రద్యుమ్నుడు రథసారథితో యిట్లనెను. ''నీవెందుకిట్లు చేసితివి? శత్రు సేనలు నేను భయపడి పారిపోయినట్లుగా భావింతురు ఇది యాదవ వంశమునకే కళంకము నీ చర్య నాకు మిక్కిలి అసంతృప్తి కల్గించినది'' దారుకుని కుమారుడైన రథసారథి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. ''ఓ రాకుమారా! మీరు భయపడినట్లుగా యెట్టి సూచనలు లేవు

యుద్ధ నియమ నిబంధనల ప్రకారము, రథములోని వీరునకు ఆపద సంభవించినపుడు రథసారథి అతనిని రక్షింపవలసి యున్నది. అదే విధముగా రథసారథికి ఆపద సంభవించినపుడు రథములోని వీరుడు రథసారథికి రక్షణ కల్పించవవలసి యున్నది. నేను మీ పేరు ప్రతిష్ఠలకు యెటువంటి అవమానము కలిగించలేదు. మీరు చింతించవద్దు. మిమ్ములను తిరిగి యుద్ధభూమికి తీసుకు వెళ్ళెదను''. ప్రద్యుమ్నుడు తిరిగి ద్యుమను నెదుర్కొని సునాయాసముగా సంహరించెను. యాదవ నాయకులు సాళ్వుని సేనాబలమును ఒక క్రమ పద్ధతిలో నాశనము గావించుచుండిరి. ఈ యుద్ధము యిరువది యేడు దినములు కొనసాగెను. అయినప్పటికిని సాళ్వుడు మాత్రము చావకుండెను.

రాజసూయ యాగానంతరము కృష్ణుడు ఇంద్రప్రస్థములో నున్నపుడు, ద్వారకా నగరములో ఈ యుద్ధము జరుగుచుండెను. దుశ్శకునములు గోచరించుట గమనించి, ద్వారకా నగరములో యేదో కీడు జరుగుచున్న దని కృష్ణుడు భావించెను. ఆ కారణముచేత కృష్ణుడు త్వరగా ద్వారకకు బయలుదేరెను.

## 253 యుద్ధరంగములో కృష్ణుడు

కృష్ణుడు తనలో తానిట్లు తలచెను. ''శిశుపాలుని సంహరించుటచేత అతని మిత్రులు కొందరు ద్వారకలోని ప్రజలను వేధించుచున్నారు. ఇందుకు సందేహము లేదు''. ద్వారక చేరిన కృష్ణుడు సాళ్వుని దురాగతము లన్నియు వినెను. ద్వారకను అందలి ప్రజలను రక్షించుటకు బలరాముని నియోగించి, కృష్ణుడు యుద్ధ రంగమునకు బయలుదేరెను.

యాదవ సేనలు దూరములో గరుడుని పతాకము యెగురుచుండుట గమనించిరి. సాళ్వుడు కూడ కృష్ణుని రాకను గమనించెను. ఇరు సేనలు కృష్ణుని రాకకు సంతోషించిరి. కృష్ణుని సంహరింపవలెనని సాళ్వుని ధ్యేయము. కృష్ణుని చేత సాళ్వుడు నిహతుడగునని యాదవులకు తెలియును.

కృష్ణుని రథసారథిని చంపుటకు సాళ్వుడు, తన వద్ద నున్న భయంకరమైన 'శక్తి' అనే ఆయుధమును విసరెను. శక్తియొక్క ప్రచండమైన వెలుగు భూమ్యాకాశములందు ప్రసరించెను. శక్తి రథసారథిని సమీపించున పుడు కలిగిన శబ్దము వేయి పిడుగులు ఒక్కమారుగా పడినంత శబ్దము చేసెను. కృష్ణుడు తన పదునైన బాణములతో 'శక్తి'ని తునకలు తునకలు చేసెను. కృష్ణుడు తన ధనుస్సు నుండి విడిచిన బాణములు ఒక దాని వెనుక మరొకటి అతి వేగముతో సాళ్వుని సౌభమను రథమును ఆవరించి, ఆ రథము కన్పించకుండునట్లు చేసెను. సాళ్వుడు బాణము ప్రయోగించి, కృష్ణుని ఎడమ భుజమునకు తీవ్రమైన బాధ కలిగించెను. ఆ బాధకు కృష్ణుని చేయి నుండి శార్ఙ్గము జారి క్రిందపడెను. సాళ్వుడు, తను పలికిన మాటలకు కృష్ణుడు భయపడునని తలచెను. అతడు కృష్ణునితో యిట్లనెను. ''ఓరీ మూర్ఖుడా! నీవు చేసిన అక్రమ కార్యములకు నిన్ను శిక్షించెదను. నీవొక సామాన్యమైన దొంగవు. అంతకు మించి, నీవు వట్టి పిరికిపందవు. మేము గమనించుచుండగా శిశుపాలుని భార్య నెత్తుకుపోయి నీ దానిని చేసుకున్నావు. యుద్ధము చేసి ఆమెను గెలుచుకొనుటకు బదులుగా, నీవు పారిపోయినావు. ఇప్పుడు నీవు యేమి చేసినావు? రాజసూయ సభలో, యుద్ధమునకు సిద్ధముగా లేనట్టి శిశుపాలుని సంహరించినావు. నా స్నేహితుని సంహరించినందుకు, నా బాణములతో నిన్ను వధించి కసి

తీర్చుకొందును''.

కృష్ణుని కనులు నిప్పులు గ్రక్కుచుండెను. అతడు సాళ్వునితో యిట్లనెను. ''నీవు మిక్కిలి వదరుచున్నావు. నిజమైన వీరులు మాటలలోకాక చేతలలో చూపించెదరు'' అ విధముగా మాట్లాడుచు కృష్ణుడు తన గదతో సాళ్వుని గడ్డముపై కొట్టెను. ఆ దెబ్బకు సాళ్వుడు రక్తము కక్కుకొనెను. కృష్ణుని గద తిరిగి వెనుకకు రాగానే, మాయ సహాయముతో సాళ్వుడు అదృశ్యుడయ్యెను.

కృష్ణుడు శత్రువు కొరకు వెదకుచుండగా, ద్వారక నుంచి వార్తాహరుడొకడు వచ్చి, కృష్ణుని వెంట పరుగెత్తుచు యిట్లనెను. ''కృష్ణా! కృష్ణా! నీ తల్లి నన్ను నీ వద్దకు త్వరగా పంపినది. నీ తండ్రి వసుదేవుని, కసాయివాడు గొర్రెలను బంధించినట్లు, బంధించినాడు''.

ఈ వార్త విని కృష్ణుడు మిక్కిలి నిరుత్సాహముతో నిస్పృహ చెందెను. సామాన్య మానవులు దుఃఖములకు బాధలకు తాళలేక వర్తించినట్లుగా కృష్ణుడు ప్రవర్తించెను. కృష్ణు డిట్లు తలచెను. ''నా సోదరుడు బలరాముని యీ పిరికిపంద సాళ్వుడు యెట్లు జయించ గలిగెను? ఇది చూడగా నా తండ్రి సోదరుని వంటి వారు కూడ విధి చేతిలో ఆట బొమ్మలని స్పష్టమగుచున్నది. అన్నిటికన్న అతిశక్తిమంతమైన శత్రువు విధి! ఎట్టి వారైనను విధి చేత బాధలకు లోనుకాక తప్పదు''.

అకస్మాత్తుగా కృష్ణుని యెదుట సాళ్వుడు వసుదేవుని బందీగా పట్టుకుని ప్రత్యక్షమయ్యెను. సాళ్వుడు కృష్ణునితో యిట్లనెను. ''కృష్ణా! ఇటు చూడుము. నీవు మిక్కిలి గౌరవము చూపించు యీ వ్యక్తి నీ తండ్రి. నీవు చూచుచుండగనే నీ తండ్రిని సంహరించెదను. నీ తండ్రిని రక్షించుటకు నీకు శక్తియున్నచో రక్షింపుము. నీవు యే మాత్రము వీరుడవో చూచెదను''.

కృష్ణుడు తన బాణము తీయునంతలో, సాళ్వుడు వసుదేవుని తల నరికి గాలిలో యెగిరి తన విమానము సౌభకములో ప్రవేశించెను. కృష్ణుడు తీవ్ర విచారములో మునిగెను; కొద్ది క్షణములు మాత్రమే విచార మావరించెను. మబ్బుల మాటున కొంచెము సేపు దాగిన చంద్రుడు మబ్బు విడిచిన తర్వాత బయటకి వచ్చినట్లు, మాయ కమ్మిన కృష్ణుని మనస్సు మాయ వీడినంతనే యిది సాళ్వుని కుతంత్రమని గ్రహించెను. మెలకువ కలిగిన తర్వాత స్వప్న ప్రపంచమును కాంచనట్లు, ద్వారక నుండి వచ్చిన వార్తాహరుని గాని, కొద్దిసేపు క్రితము క్రింద పడిన తండ్రి దేహమును గాని కృష్ణుడు చూడలేదు. తనపై తనకు కోపము వచ్చి కృష్ణుడు మండిపడెను. సాళ్వుని మాయచేత తాను మోసపోయినందుకు కృష్ణుడు సహించలేకపోయెను.

సౌభ అను విమానములో ఆశ్రయము పొందిన సాళ్వుని కృష్ణుడు సంహరించుటకు ప్రయత్నించెను. కొంతసేపయిన తర్వాత, యీ ఆటను ముగించుటకు సమయ మాసన్నమైదని కృష్ణుడు గ్రహించెను. కృష్ణుడు తన బాణములతో సాళ్వుని ఆయుధాగారమును ఛేదించి బ్రద్దలు చేసెను. తరువాత సాళ్వుని ధనుస్సును, తలపై ధరించిన మణిని ముక్కలు చేసెను. తన గదతో సౌభ యను విమానమును కొట్టి ముక్కలు ముక్కలు చేసెను. విరగ నటువంటి విమానము అతి తేలికగా ముక్కలు ముక్కలగుట ఆశ్చర్యము గొలిపెను.

సాళ్వుడు గదనెత్తి నేలపై నిలుచుండెను. కృష్ణుడు తన చక్రము త్రిప్పి సాళ్వునిపై ప్రయోగించెను. సాళ్వుని శిరస్సు, శిరస్సుపై ధరించిన మణితో సహా నేలపై పడెను. అచట అనేక దినములుగా రణ రంగము నందు

యుద్ధము చేయుచున్న ప్రతి ఒక్కరి హృదయములో ఆనంద ముప్పొంగెను.

శిశుపాలుని మిత్రులలో దంతవక్త్రుడు మిగిలెను. ఇపుడతడు కృష్ణునితో యుద్ధమునకు తలపడెను. శిశుపాలుని వలె దంతవక్త్రుడు కూడ కృష్ణునికి మేనబావ.

తన సోదరుడు శిశుపాలుడు, స్నేహితులు పౌండ్రకుడు, సాళ్వుడు కృష్ణునిచే నిహతులైనందుకు కృష్ణునిపై పగ తీర్చుకొనదలచెను. వారందరును విడదీయరాని స్నేహితులు

యుద్ధము నందు గదను విరివిగా ఉపయోగించుటలో దంతవక్త్రునికి మక్కువ యెక్కువ.. నరాసరి కృష్ణుని సమీపించి యుద్ధము మొదలుపెట్టెను. తన గదతో కృష్ణుని గొట్టెను. అకస్మాత్తుగా తన మీద కెగబడినందుకు చెక్కు చెదరక, కృష్ణుడు కౌమోదకి యను గదను తీసుకుని, దంతవక్త్రుని వక్షముపై గొట్టెను ఆ దెబ్బకు ఎండిన యాత చెట్టువలె, విర్ణమైన దంతవక్త్రుని దేహము నేలగూలెను. మృతదేహము నుండి ఒక విధమైన వెలుగు వెలువడి కృష్ణుని పాదముల దిక్కుగా పయనించి అదృశ్యమయ్యెను

నారాయణుని ద్వారపాలకుల మూడు జన్మలు అంతమయ్యెను. వారు వైకుంఠములో నారాయణుని ప్రక్కనే పూర్వ స్థానము పొందిరి.

దంతవక్త్రుని సోదరుడు విదూరథుడు రణరంగమునకు వచ్చెను కొద్ది నిముషములలో అతని తల తెగి యుద్ధ భూమిపై పడెను

దీర్ఘకాలము జరిగిన యుద్ధము చివరకు అంతమొందెను. యాదవులు విజయోత్సాహముతో ద్వారకలో తిరిగి ప్రవేశించిరి.

## 254 సుధాముడు

కృష్ణునిపై విశేషమైన భక్తికలిగిన బ్రాహ్మణుడొకడు గలడు. అతనికి బాల్యములో సాందీపముని ఆశ్రమములో గురుకులవాసము చేసినపుడు కృష్ణుని చెలిమి కలిగెను అనేక సంవత్సరములు గడచెను. కాలమతనిని చిన్న చూపు చూచెను. అతని అభిరుచులు చాల సామాన్యమైనవి అతనికి కోరికలేమియు లేవు. అతడు ఇంద్రియము లను నిగ్రహించి, భౌతిక విషయములపై అనుబంధము లేక మెలగుచుండెను. అతడు చాల పేదవాడు. తనకు లభించిన దానితో తృప్తిచెంది, తన పేదరికమునకు విధిని గాని, భగవంతునిగాని నిందించకుండెడివాడు. అతని భార్య అన్ని విధముల అతనికి తగినది ఆమె సన్నముగా నీరసముగా నుండెడిది పతి భక్తితో మెలగుచు, అతడు భుజించగా మిగిలిన దానినే తాను భుజించుచుండెడిది. పేదరికము వలన సహజముగానే ఆమెకు తినుటకేమియు మిగిలెడిది కాదు. తరచు ఉపవాసము చేయుట వలన ఆమె నీరసముగా నుండెడిది. కాని ఆమె భర్త ముఖములో నున్న ప్రసన్నత, ప్రశాంతత ఆమె ముఖములో కూడ గోచరించుచుండెను. అతని పేరు సుధాముడు. ఆమె పేరు కల్యాణి.

ఒకసారి తన భర్త దారిద్ర్య బాధ చూచి ఆమె తాళలేకపోయెను. బాగా యోచించిన పిదప భర్తతో తన

అభిప్రాయము తెలుపుటకు సంకల్పించుకొనెను. అతని ముందు నిలిచి సంకోచముతో మాట్లాడ ప్రారంభించెను. తడబడుచున్న ఆమె మాటలు మంద్ర స్వరములో అతి మృదువుగా నుండుటచే అతడు సరిగా వినలేకపోయెను. ఆమె యిట్లు పలికెను. ''నాథా! ద్వారకానాథుడైన కృష్ణుడు నీ స్నేహితుడని బాల్యములో తోటి ఆటగాడని పలుమార్లు మీరు చెప్పియున్నారు. అతడిపుడు గొప్ప మహారాజు. బ్రాహ్మణుల నాదరముతో చూచునని ప్రసిద్ధిగాంచెను. పూర్తిగా తన్ను శరణుజొచ్చిన భక్తులను ఉద్ధరించునని ప్రఖ్యాతి పొందెను. సాక్షాత్తు లక్ష్మీదేవి అతని భార్య కాగా, అతని సంపద కేమి కొదువ?''

సుధాముడు భార్యను జూచి ఆమె స్థితికి విచారించెను. ఆమె సామాన్య వస్త్రములు ధరించియున్నది ఆమె ధరించిన వస్త్రములు తాను ధరించిన వస్త్రమువలె అనేక చోట్ల చినుగులు పడియున్నవి. తన్ను వివాహమాడి నప్పటి నుండి ఆమె యెన్నడును పట్టుమని విస్తరి నిండా భోజనము చేయలేదు. అయినప్పటికిని ఆమె యెన్నడును దోషారోపణము చేయలేదు. ఇపుడామె యేదో అడుగుటకు ప్రయత్నించుచున్నదని అతనికి స్పష్టమయ్యెను. ఆమె కొనసాగించుటకు అతడు వేచియుండెను సంకోచముతో ఆమె యిట్లనెను. ''నాథా! మీరు వెళ్ళి కృష్ణునొక పర్యాయ యెందుకు చూడకూడదు? మిమ్ములను చూచినంతనే తప్పక సంపద నీయగలడు. అతడిపుడు బంధువులతో కలిసి ద్వారకలో నుంటున్నాడు. మిమ్ములను చూచి సంతోషించి, మీ దారిద్ర్యమును తొలగించగలడు''. అతిగా మాట్లాడుచున్నానేమోనను భయముతో మరి మాట్లాడక మౌనముగా నిలుచుండెను ఆమె కన్నులెత్తి భర్తను చూచుటకు ధైర్యము లేకపోయెను ఆమె స్థితికి సుధాముడు విచారించెను. మొట్టమొదటిసారిగా ఆమె అడుగుచున్నది. అది కూడ తన సంతోష సౌకర్యముల కొరకే అతడు తనలో యిట్లు తలపోసెను ''ఆమెను సంతృప్తి పరచి, వెళ్ళెదను ఒక విధముగా అనేక సంవత్సరముల తర్వాత బాల్య స్నేహితుని చూచుచున్నందుకు సంతోషముగా నుండును ఇరువురము కూర్చొని బాల్యము లోని దినములు గుర్తుకు తెచ్చుకుని ముచ్చటించుకుని ఆనందించవచ్చును''

సుధాముడు కృష్ణుని వద్దకు వెళ్ళెదనని భార్యతో చెప్పెను. మరియు భార్యతో అతడిట్లనెను. ''కల్యాణీ! కానుకగా నిచ్చుటకు యింట నేమైన నున్నదా? రిక్త హస్తములతో వెళ్ళుట పాడికాదు''.

సుధాముని భార్య పొరుగింటికి వెళ్ళెను పొరుగింటి యిల్లాలిని తనకేదైన యిమ్మని కోరెను. ఆమె వద్ద యేమియు లేకుండుటచే నిరాకరించవలసి వచ్చెను. నిరాశతో కల్యాణి తిరిగి వచ్చుచుండగా ఆ యింటి యజమాని బయట నుండి యింటిలోనికి ప్రవేశించుచుండెను. యజమాని తన భార్యను, సుధాముని భార్య విచారములో వెళ్లిపోవుచుండుటకు కారణమడిగి తెలుసుకొనెను

ఆ గృహస్థుడు సుధాముని భార్యతో ''అమ్మా! ఒక నిమిష మాగుము'' అని పలికి, తన ఉత్తరీయములో మూటకట్టి తెచ్చిన ధాన్యములో పిడికెడు ధాన్యము ఆమె కిచ్చెను. సుధాముని భార్య కృతజ్ఞతతో దానిని స్వీకరించెను అది చాలదని ఆమె గ్రహించి, మరొక మూడు నాలుగు పొరుగిళ్లకు వెళ్ళి ఒకొక్క యింటి నుండి పిడికెడు ధాన్యమడిగి తీసుకు వచ్చెను. అది చాలునని ఆమె భావించి, యింతకన్న వేరేమీ చేయలేనని తలంచెను. తీసుకు వచ్చిన ధాన్యమును శ్రద్ధగా వేయించి అటుకులు తయారుచేసి వాటిని ఒక గుడ్డలో మూటకట్టి భర్త కందించెను

అటుకుల మూటను చేతిలో పట్టుకుని, పేద బ్రాహ్మణుడు సుధాముడు, బాల్య స్నేహితుని చూడబోవుచున్నానను ఆనందముతో యింటి నుండి బయలుదేరెను ఆనందముతోపాటు, కృష్ణుని దర్శనము యే విధముగా

లభ్యమగునో యని ఆందోళన చెందెను ఇప్పుడు తాను చూడబోవచున్న కృష్ణుడు చిన్ననాటి ఆటగాడు కాదు కృష్ణుడిపుడు రాజ కుటుంబములోని వాడు. అనేక సంవత్సరముల వెనుకటి చెలికాడు మాత్రమే కాదు! బహుశః ద్వారము వద్ద నున్న రక్షకభటులు తన్ను వెళ్ళ నివ్వకపోవచ్చు తాను వచ్చినట్లు తెలుపుటెట్లు? తాను కృష్ణునికి స్నేహితుడనని, చాల ప్రియస్నేహితుడనని చెప్పిన వారు నవ్వి హాస్యాస్పదముగా భావించ వచ్చు కాని అది మాత్రము సత్యము. వెనుకటి రోజులలో కృష్ణునితో గడపిన రోజులు గుర్తుకు తెచ్చుకుని చిరునవ్వు నవ్వుకొనెను

ఆ విధముగా కృష్ణుని గురించి ఆలోచించుచున్న సుధాముడు ద్వారకలో ప్రవేశించినట్లు తెలుసుకొనెను. తన్ను చూచుటకు వచ్చుచున్నాడని తెలిసి, తన మాయచేత అతి స్వల్ప కాలములోనే సుధాముడు ద్వారక చేరునట్లు గావించెను

చుట్టును పరికించి చూచి సుధాముడు ద్వారకా నగరము అందచందములను మెచ్చుకొనుచుండెను సేనా బలమున్న చోటు సమీపించి, తర్వాత మూడు వెడల్పైన రోడ్లను దాటి వెళ్ళెను అచ్చట సుధాముడు పెద్ద పెద్ద సౌధములను చూచెను వానిలో అన్నిటికన్న అత్యంత రమణీయముగా నున్న సౌధములో ప్రవేశించెను. అతని నెవరును అడ్డగించలేదు ద్వారము దాటి లోపలి ప్రాంగణములో ప్రవేశించెను అచ్చట కదలక సుధాముడు నిలుచుండెను తనివితీర అతడు ఆ దృశ్యము చూచి ఆనందించుచుండెను కృష్ణుడు అతి సుందరమైన ఆసనముపై రుక్మిణీదేవి ప్రక్కనే కూర్చుని యున్న దృశ్యమును సుధాముడు గాంచెను.

సుధాముడు ప్రవేశించగనే, కృష్ణుడు తన ఆసనము నుండి దిగి మిక్కిలి ఉత్సాహముతో సుధాముని వైపు వడివడిగా వచ్చెను. కృష్ణుడు సుధాముని గాఢముగా కౌగిలించుకొనెను కృష్ణుని నేత్రముల నుండి కురిసిన అశ్రువులు, పద్మము నుండి నీటి బొట్లు రాలినట్లుగా బొట్లు బొట్లుగా పడుచుండెను సుధాముడు, కృష్ణుని తిరిగి కలుసుకోగలిగినందుకు మిక్కిలి ఆనందించి, ఆనందాశ్రువులు రాల్చుచుండెను సుధాముని రెండు చేతులు పట్టుకుని కృష్ణుడు, అంతవరకు తాను కూర్చుని యున్న ఆసనము వద్దకు తీసుకువెళ్ళెను. కృష్ణుడు సుధాముని పాదములు కడిగి, ఆ జలమును తన తలపై జల్లుకొని, రుక్మిణి తలపై జల్లెను కృష్ణుడు నెమలి ఈకలతో తయారుచేసిన విసనకర్రను రుక్మిణి కందించెను ఆమె ఆ విసనకర్రతో వీచుచుండగా, కృష్ణుడు అత్తరు గంధములను సుధాముని శరీరమునకు పూయుచుండెను

ఆ సౌధములో నివసించుచున్న వారందరును కృష్ణుని, బక్కపలచగా నున్న పేద బ్రాహ్మణుని, అతడు ధరించిన మాసిపోయి చినుగులతో నున్న వస్త్రములను చూచుచుండిరి సుధాముని ముఖము విచారముతో నిండియుండెను అతని శరీరముపై నున్న చర్మము యెండిపోయి ముష్టివానివలె గోచరించుచుండెను సాక్షాత్తు భగవత్స్వరూపుడైన కృష్ణుడు, ఆ పేద బ్రాహ్మణుని పాదము అభిషేకించి, ఆ జలమును తీర్థముగా యెంచి తలపై జల్లుకొనెను! ఆ విధముగా కృష్ణునిచే గౌరవ మర్యాద లందుకున్న ఆ పేద బ్రాహ్మణుడు యెంత ధన్యుడో కదా! వీరిద్దరిని గమనించి చూచుచున్న వారిలో, యీ విధమైన ఆలోచనలు మెదలుచుండెను.

## 255 జ్ఞాపకమున్నదా?

సుధాముని ప్రక్కనే కూర్చుండి, కృష్ణుడు అతని చేతిని తన చేతిలోకి తీసుకుని, సాందీపుని ఆశ్రమములో గురుకుల వాసము నాటి అనుభవములు గుర్తుకు తెచ్చుకొని ఆనందముతో ముచ్చటించుచుండెను. అవి మిక్కిలి సంతోషకరమైన రోజులు.

పదే పదే ''నీకు జ్ఞాపకమున్నదా?'' ''నీకు జ్ఞాపకమున్నదా?'' అని యిరువురును తాము మాట్లాడుటకు ముందు అనుచుండిరి. ఆ విధముగా ముచ్చటించుచు చాల సమయము గడిపిరి. తరువాత కృష్ణు డిట్లనెను. ''సుధామా! నీకు రోజు లెట్లు గడచుచున్నవి? గురుకులము నుండి నీవు నీ గృహమునకు వెళ్ళిన తర్వాత నీకు వివాహమయినదా? నీ వలెనె నీ భార్య కూడ సరళ స్వభావురాలేనా? నీకు భౌతిక విషయములపై యెన్నడును అనురాగముండెడిది కాదు. ఇతర మానవులు అభిలషించు సామాన్య సుఖములు కూడ నీవు పరిత్యజించినావు. నీ గురించి అన్ని విషయములు సమగ్రముగా నాకు చెప్పుము''. కృష్ణుడు, తన స్నేహితుని వదనమందు గోచరించుచున్న విచారమును గమనించి, గుర్తించనట్లుగా నటించి అతడు మాట్లాడుట కవకాశ మివ్వక తానిట్లు పలికెను. ''మనము గురువు సాందీపుని వద్ద గడపిన దినములను తరచుగా గుర్తుకు తెచ్చుకొందువా? జన్మ నిచ్చునటువంటి తండ్రి మొదటి గురువు. జ్ఞానబోధ చేసి యీ ప్రపంచములోనికి తీసుకు వచ్చువాడు రెండవ గురువు. ఈ రెండవ గురువును యెక్కువగా గౌరవించవలసి యున్నది. మనము బ్రహ్మత్వము పొందుటకై బ్రహ్మవిద్యను బోధించు గురువు మూడవ గురువు.

''మిత్రమా! మనము గురుకులములో నున్నపుడు జరిగిన ఒక సంఘటన నీకు జ్ఞాపకమున్నదా? గురుపత్ని మనలను అడవికి వెళ్ళి అగ్నిహోత్రమునకై సమిధలు తీసుకురమ్మని పంపినది. మనము అడవిలో సంచరించు చుండగా అకస్మాత్తుగా ప్రబల వర్షము కురిసినది. పెనుగాలులు వీచి ఉరుములు మెరుపులు, పిడుగులు పడి విపరీతమైన భయము కలిగించినవి. సూర్యుడస్తమించి నలుదిక్కుల చీకటి క్రమ్మినది. చీకటి, వర్షముల చేత మనము దారి తెలుసుకొనలేకపోయితిమి. దారి తప్పుటచే ఒకరి నొకరము పట్టుకుని అడవి యంతయు సంచరించితిమి. ఆ విధముగా ఆ రాత్రి గడచినది''.

తరువాత సుధాముడు ఆనాటి వృత్తాంతము కొనసాగించెను. ''అవును. తెల్లవారి సూర్యోదయము కాగానే, మనలను గురించి ఆదుర్దా పడుచు గురువుగారు మనకొరకై వెదకుచు అడవికి వచ్చి, చివరకు అతికష్టము మీద మనలను కనుగొనిరి''.

కృష్ణుడు యిట్లనెను. ''మనపై కరుణతో గురువు గారిట్లనిరి. 'పుత్రులారా! నా గురించి మీరు చాల బాధకు గురియైనారు! తమ శరీర సౌకర్యములను లక్ష్యపెట్టక గురుసేవ చేయుటయే అత్యుత్తమమైది. మీరు ఆ విధముగా గురుసేవ చేసినారు. మీ కోరికలు పరిపూర్తికాగలవని ఆశీర్వదించుచున్నాను. నా వద్ద మీరు నేర్చుకున్న విద్య యీ లోకమందు పరలోకమందు కూడ ఉపయోగపడును'. సుధామా! ఆ రోజు రాత్రి నేనెన్నటికిని మరువలేను''. ఇటువంటి సంఘటనలను మిత్రులిరువురూ నెమరువేసుకుని ముచ్చటించుకొనగా కాలము ఆనందముగా గడచిపోయెను.

అందరి మనస్సులలో యేమున్నదో కృష్ణునకు బాగా తెలియును. తన బంధువులకన్న బ్రాహ్మణులను యెక్కువగా ప్రేమించే కృష్ణునకు శాంతి సౌఖ్యముల కొరకు ఆరాటపడు వారిని సేద దేర్చి ప్రశాంతత కలిగించే

కృష్ణునకు దైవములలో కెల్ల పరమ దైవము అయిన కృష్ణునకు, సుధాముడు ద్వారకా నగరమున కెందుకు వచ్చెనో బాగుగా తెలుసును. అయినను మిత్రుని ఆటపట్టించ దలచి యిట్లనెను. ''ప్రియ మిత్రమా! ఇంటి నుండి నాకేమి తెచ్చితివి?'' సుధాముడు మౌనముగా నూరకుండెను. తాను తెచ్చిన చిన్న అటుకుల మూటను చూసి సుధాముడు సిగ్గుపడుచుండెను. సుధాముని విషయము మూర్ఛనివ్వక అడ్డుపడి, ''బహుశః నీవు యేదో సామాన్యమైన దానిని తీసుకువచ్చి యుండవచ్చు. ఈ పరిసరములకు తగిన గొప్పది కాదని బహుశః నీవు భావించుచుండవచ్చు. కాని సుధామా! ఎంత స్వల్పమైనదే అయినను భక్తి ప్రేమలతో నాకిచ్చినట్లయితే అది నాకత్యంత ప్రియమైనదని నీవు యెరుగవా? భక్తి లేని కానుక యేదయినను నాకు సంతృప్తి నివ్వదు. కాని, ఒక పుష్పము, లేక పత్రము, లేక ఫలము, లేక కేవలము ఉద్ధరిణెడు నీరు భక్తితో, యెవరు పరిశుద్ధమైన మనస్సుతో నాకు సమర్పించెదరో దానిని నేను ప్రేమతో స్వీకరించెదను. నీవు తెచ్చిన దానిని నాకిమ్ము''.

సుధాముడు యిచ్చుటకు సిగ్గుపడుచుండెను. కృష్ణుడు తనలో తానిట్లనుకొనెను. ''నా స్నేహితుడు యిన్ని సంవత్సరములుగా పేదరికము అనుభవించుచున్నను, ఒకసారియైనను తనకు సహాయము చేయమని నన్ను అడుగలేదు. అతని భార్య ప్రోద్బలముచేత అతడు నా వద్దకు వచ్చినాడు. నన్ను అత డడుగకపోయినను, నేను అతనికి ప్రసాదించెదను''. తల్లి యిచ్చు కానుక కొరకు యెదురు చూచు పిల్లవానివలె, కృష్ణుడు తన మిత్రుడు యిచ్చు వస్తువు కొరకు వేచి యుండెను. సుధాముని ఉత్తరీయము పట్టుకుని కృష్ణు డిట్లనెను. ''చూడు, చెల్లెలు నాకు పంపిన దానిని నీవు యివ్వకున్నావు''. కృష్ణుడు ఉత్తరీయములో కట్టిన అటుకుల మూటను విప్పి చూచెను. అందులో కొద్దిగా యిసుక రేణువులు కలిసియున్నవి. సుధాముడు త్వరగా ద్వారకకు బయలుదేరుటచే, సుధాముని భార్యకు అటుకులను బాగుచేసి యిసుక రేణువులను తీసివేయుటకు సమయము లేకపోయెను. సంతోషముతో చప్పట్లు చరిచి, కృష్ణు డిట్లనెను. ''సుధామా! నాకు అటుకులు బాగా ప్రీతియని నీకు జ్ఞాపకమున్నదన్నమాట! ఆ రోజులలో నీవు తెచ్చు అటుకులను పంచుకుని తినువాడనని జ్ఞాపకమున్నదా?''

ఆ విషయము గుర్తుకు వచ్చి సుధాముడు చిరునవ్వు నవ్వెను. ఈలోపుగా కృష్ణుడు గుప్పెెడ అటుకులు నోటిలో వేసుకుని ఆనందముతో నములుచుండెను. గుప్పెడు అటుకులు నమిలి మ్రింగిన తర్వాత మరొక గుప్పెడు తీసుకుని నోటిలో వేసుకొనబోవుచుండగా, సాక్షాత్తు లక్ష్మీదేవి యైన రుక్మిణి కృష్ణుని చేయి పట్టుకుని ఆపి, చాలు అనునట్లుగా చిరునవ్వు నవ్వెను. ఆమె కనులు కృష్ణునితో యీ విధముగా చెప్పచున్నట్లుండెను. ''ప్రభూ! మీరు భుజించిన ఒక పిడికెడు మీ భక్తుని గృహము యీ ప్రపంచములోని సంపదతో నిండుటకు సరిపోవును. మరొక పిడికెడు తీసుకున్నచో, నేను కూడ వెళ్ళిపోయి అతని యింట నుండవలసి వచ్చును!''

సుధాముని కిదేమియు తెలియదు. మిత్రుని సమక్షములో హాయి ననుభవించుచు ఆ రాత్రి అచట గడపెను. మరునా డుదయము లేచి సుధాముడు తన కాతిథ్య మొసగిన కృష్ణునకు విశేష శ్రమ నొసగుట అనుచితమని తలచి, యిట్లనెను. ''కృష్ణా! నిన్ను చూడవలెనని చాల దినములుగా అనుకున్నాను. నీవు యెన్నో గొప్ప గొప్ప లీలలు జరిపినావని, నీవు యిపుడొక గౌరవనీయుడగు రాజువని, ఉత్తములైన పాండవులకు నీవు మేనబావ వని వినియున్నాను. నీ గురించి నేను వినుచున్నాను. రాత్రి పగలు నిన్నే తలచుచుందునని నేను వేరే చెప్పనవసరము లేదు. ఇక నేను వెళ్ళెదను. నా శరీరము మాత్రమే యిక్కడ నుండి కదలును. నా హృదయము నిక్కడ నీవద్ద విడిచిపెట్టుచున్నాను''.

కృష్ణుడు, అతని భార్యలు సుధామునికి నమస్కరించిరి. తర్వాత సుధాముడు తన గృహమునకు బయలుదేరెను. కృష్ణుడు కొంతదూరము సుధామునితో నడచి, బరువైన హృదయముతో వీడ్కోలు చెప్పి వెనుకకు మరలెను.

## 256 పిడికెడు అటుకులు

ద్వారకకు తాను వచ్చిన ప్రయోజనము నూహించుకుని సుధాముడు సిగ్గుపడెను. అయితే కృష్ణుని యేదైన అడుగ వలెనను బుద్ధి కలుగనందుకు సుధాముడు తనలో తాను సంతోషించెను. కృష్ణునితో ఒకరోజు ఆనందముగా గడిపిన అనుభవము స్వప్నానుభవమువలె భావించుచు సుధాముడు తన ఊరు చేరెను. కృష్ణుడు తన్ను ఆప్యాయముగా కౌగిలించుకొనిన అనుభవము తలచుకొని యిప్పటికిని సుధాముని శరీరము సంతోషముతో గగుర్పాటు చెందుచుండెను. చిరిగిపోయిన మురికి బట్టలు ధరించి నప్పటికిని తన్ను ఆప్యాయతతో దగ్గరకు తీసుకున్న విషయము తలచుకుని సుధాముడు మిక్కిలి ఆనందించుచుండెను. ''నేను అధమాధముడను, అతడు అత్యుత్తమ దైవము. అయినను నన్ను కౌగిలించుకొనుట యెంత అద్భుతము?'' అనుకుని సుధాముడు మరల తనలో తానిట్లు తలపోసెను.''లక్ష్మికి నివాసమైన అతని వక్షము, బక్కచిక్కిన యీ యెముకల గూడు వంటి శరీరమును కౌగిలించుకొనెను. మరియు కౌగిలించుకొనుచున్నపుడు అతని నేత్రములు ప్రేమతో అశ్రుపూరితములయ్యెను. అతను కూర్చున్న మంచముపై నన్ను కూర్చుండబెట్టుకునెను. మరియు అతని భార్య తన మృదువైన చేతులతో విసనకర్ర తీసుకుని వీచుచుండెను. అతడు నా పాదములు స్పృశించెను! నేలపై నడచి నడచి ధూళితో నిండిన యీ మొద్దుబారిన పాదములను తన చేతులతో కడిగి, ఆ జలమును తన తలపై జల్లుకొనెను! నా స్నేహితుడు గావించిన యీ మర్యాదకు మించిన దింకేమియుండును?

''భగవంతుని పాదములను శరణుజొచ్చినవారి కేదియు అసాధ్యము కాదు. అతడు తన ప్రేమను తప్ప యింకేమియు నా కెందు కివ్వలేదో తెలుసును. సంపద గలిగిన వారు బహు తేలికగా భగవంతుని మరచిపోయెదరు. నేను తన్ను మరచిపోవుట యిష్టము లేనంతగా అతడు నన్ను ప్రేమించుచుండెను. నాయందు అతడు చూపిన మంచితనము అనంతము!''

సుధాముడు తన గృహము సమీపించుచుండెను. దూరము నుండి ఒక అందమైన భవనము చూచి ఆకర్షితుడయ్యెను. అతడు తనలో తానిట్లనుకొనెను. ''ఎంత అందమైన దృశ్యము! ఇంతకు ముందెన్నడును నేను చూడలేదు. వెలుగు చేత నిర్మితమైనంత అందముగా గోచరించుచున్నది. నా యింటి ప్రక్కనే యున్నట్లు తోచుచున్నది. కాని యిన్ని సంవత్సరముగా నేనెందుకు గమనించలేదు? నేనంత పరధ్యానముగా నుంటినా? నాకు తెలిసినంతవరకు యిరుగు పొరుగు వారందరును నా వంటి వారే. ఇటువంటి భవనము కలిగియుండు సంపద యెవరికిని లేదు''.

ఈ విధముగా ఆలోచించుచు నడుచుచున్న సుధాముని, దివ్య పురుషులవల గోచరించుచున్న అనేకులు ఆహ్వానించి ఆ భవన ద్వారము వద్దకు తీసుకు వచ్చిరి. ''నేను తిరిగి ద్వారకకు వచ్చితినా?'' అని సుధాముడు తనలో తాను ప్రశ్నించుకొనెను. తలెత్తి క్రిందికి పైకి చూడగా, సాక్షాత్తు లక్ష్మీదేవి వలె గోచరించుచున్న

తన భార్య అశ్రువులు నిండిన కనులతో కాళ్ళ మీద పడి తన్ను లోపలకు ఆహ్వానించెను. దివి నుండి దిగి వచ్చిన అందమైన అప్సరస వలె గోచరించుచున్న తన భార్యను చూచి ఆశ్చర్యపడెను. ఇంద్రుని భవనము వలె నున్న తన గృహములో సుధాముడు ప్రవేశించెను. గృహము లోపల అతని నేత్రములు అన్నిటిని పరికించి మౌనముగా చూచుచుండెను అతని మనసు కలగాపులగమైన ఆలోచనలతో నిండెను సుధాముడు తనలో తానిట్లనుకొనెను. ''భగవంతుని దర్శన భాగ్యము చేత నాకీ సంపద లభించినది బాల్య స్నేహితుడు, తోటి ఆటగాడు అయిన కృష్ణుని అతని భవనములో దర్శించితిని. అడుగకపోయినను అతడు సంపదను ప్రసాదించగ లడు వర్ష మేఘములు వర్షించినంత విశేషముగా, అతడు సంపద నిచ్చును మేఘములు సముద్రము నంతను నింపగలవు. అయినప్పటికిని మానవులకు శ్రేయస్సు చేకూర్చుటకై నిరాడంబరముగా పంట భూములపై వర్షించి వ్యవసాయదారులకు లాభము చేకూర్చుచున్నవి వ్యవసాయదారులు నిద్రించునపుడు వారికి తెలియకనే వర్షించి పోవుచున్నవి కృష్ణుడు తాను యివ్వగలిగిన సంపద గురించి మాట్లాడడు అతని దృష్టిలో యిది చాల స్వల్ప విషయము సంపదకన్న ప్రేమ, భక్తి యెంతో గొప్పవని పరిగణించును అందుచేతనే సంపద గురించి నాతో కృష్ణుడు ప్రసంగించ దలచలేదు. 'నీకు సంపద నిచ్చెద' నని చెప్పి నాకు యిబ్బంది కలిగించలేదు సంపద భక్తికి సరిసమానము కాదని భావించు నతని దృష్టిలో నేను చూపించిన ప్రేమకు సంతృప్తిచెందినట్లున్నది నేను తీసుకువెళ్లిన పిడికెడు అటుకులు, అక్కడ సమృద్ధిగా నుండెడి తేనె అమృతముకన్న మిన్నగా అతనికి తోచినవి''

ఇట్టి ఆలోచనలతో సుధాముడు భగవంతుడిచ్చిన కానుకను స్వీకరించి, భార్యతో కలిసి భగవంతుడు ప్రసాదించిన సంపద ననుభవించుచుండెను

నిత్యము సుధాముడు అతని భార్య కృష్ణుని యందు భక్తి కలిగి, తమ హృదయములో భగవంతుని పాద పద్మములను స్థిరముగా ప్రతిష్ఠించుకొనిరి క్రమ క్రమముగా భౌతిక విషయములపై విరక్తిని పెంచుకొను నేర్పు సంపాదించిరి వెనుకటి పేదరికమునకుగాని, యిప్పటి సంపదకుగాని యే విధముగాను చెక్కుచెదరక, కృష్ణ చింతనతో ఆ బ్రాహ్మణ దంపతులిరువురును సుఖముగా జీవితము వెళ్ళబుచ్చుచుండిరి

## 257 భవిష్యద్దర్శనము

ఒకసారి సూర్యగ్రహణము సంభవించెను గ్రహణము సంభవించినపుడు పవిత్ర తీర్థమునకేగి అచట గ్రహణమునకు ముందు గ్రహణము తర్వాత స్నానము చేయుట సంప్రదాయము. భార్గవ రాముడుగా ప్రసిద్ధికెక్కిన పరశురాముడు, తల్లిదండ్రులకు క్షత్రియుల రక్తముతో తర్పణ మొసగెను ఆ ప్రదేశమున అయిదు సరస్సులు రక్తముతో నిండియుండెను ఈ ప్రదేశము దేవతలచే పునీతమై, శమంతపంచకమను పేరు పొందెను సూర్యగ్రహణము సంభవించునని తెలిసి, భారత వర్షములోని రాజు లందరును శమంతపంచకమునకు ప్రయాణమైరి. ద్వారకను రక్షించుటకై అనిరుద్ధుడు, కృతవర్మ ద్వారకలోనే యుండవలసిదని యాదవులు నిశ్చయించుకొనిరి మిగిలిన యాదవులందరును పవిత్రమైన శమంతపంచకమునకు బయిలుదేరిరి ప్రయాణము చాల ఆనందదాయకముగా రూపొందెను స్త్రీలు, పిల్లలు కూడ ప్రయాణముగుటచేత, అనేకులు ద్వారక నుండి శమంతపంచకమువైపు గుంపుగా కదలివెళ్ళిరి ఆ పవిత్ర తీర్థమునకు, మత్స్య, కోసల, విదర్భ, కేకయ,

కాంభోజ దేశ రాజులు గూడ విచ్చేసిరి కౌరవులు కూడ వచ్చి దుర్యోధనుని చుట్టును చేరిరి. అతని స్నేహితులు, బంధువులు కూడ వచ్చిరి

నంద గోపాలుడు, భార్య యశోద యితర గోపాలురు, గోపికలలో కూడ వచ్చుటచేత కృష్ణునికి మిక్కిలి ఆనందము కలిగెను

అచటకు కుంతి కూడ వచ్చెను తన సోదరుడైన వసుదేవుని దోషారోపణము చేయుచున్నట్లుగా పలకరించి యిట్లనెను ''నీవు నాకు జ్యేష్ఠ సోదరుడవు నీవు నన్ను, నా దుర్భరస్థితులను పట్టించుకొనకపోవుట నా దౌర్భాగ్యము భగవంతుని చిన్నచూపు పడినవారు, దగ్గర బంధువుల — అన్నలు, చెల్లెండ్రు, చివరకు పుత్రులు — అభిమానమునకు గౌరవమునకు కూడ దూరమగుదురు''

తన సోదరి కుంతి నిందాపూర్వక వాక్యములకు మిక్కిలి బాధపడి వసుదేవు డిట్లనెను ''ప్రియ సోదరీ! విధి చేతిలో కీలుబొమ్మలమైన మమ్ము నిందించకుము ఈ లోకము దాని శ్రేయస్సు భగవంతుని అధీనములో నున్నవి. మానవులు నిస్సహాయులు మానవులు తమ తమ కర్మల నాచరించుటకు భగవంతుడు ప్రేరేపించి, సంతృప్తి కలిగిన పిమ్మట తన లీలలను ఆపుచేయును చిన్నతనము నందే నిన్ను కుంతిభోజున కిచ్చి తరువాత పాండురాజుతో వివాహము చేయగా, నీవు సుఖముగా సర్వసౌఖ్యములతో జీవించుచుండెడిదానవు అపుడు మేము — భోజులు, అంధకులు, యాదవులు — కంసుని నిరంకుశత్వము నుండి తప్పించుకొనుటకు ఒకచోటు నుండి మరొక చోటునకు పారిపోవుచుంటిమి నా యౌవన కాలమంతయు కంసుని కారాగారములో గడచిపోయినది నా పుత్రులను యీ చేతులతో యెత్తుకుని ఆనందించు భాగ్యము నాకెన్నడును కలుగలేదు నీకు అటువంటి దుర్భర స్థితి కలుగలేదు'' వసుదేవుడు మౌనముగా కొంతసేపు కూర్చుని తర్వాత అక్కడ నుండి లేచి వెళ్ళిపోయెను కుంతీదేవి తొందరపాటులో నిందా వాక్యములచేత వసుదేవుని మనసు నొప్పించినందుకు విచారించెను

శమంతపంచకమను పవిత్ర స్థలము వద్ద క్షత్రియ వంశములోని వారందరును సమావేశమైరి వైశంపాయన మను సరస్సు తీరమున కురుక్షేత్రముండెను భీష్ముడు, ద్రోణుడు, గుడ్డి రాజు ధృతరాష్ట్రుడు, అతని భార్య గాంధారి, వారి పుత్రులు, పుత్రుల స్నేహితులు అందరను విచ్చేసిరి కుంతీదేవి తన అయిదుగురు పుత్రులు, వారి భార్యలతో విచ్చేసెను. మరియు విదురుడు, కృపాచార్యుడు, కుంతిభోజుడు, విరాటుడు, భీష్మకుడు నగ్నజితుడు, పురుజితుడు, ద్రుపదుడు, శల్యుడు, దృష్టకేతుడు మున్నగు రాజులు, మద్ర, కేకయ, మిథిల దేశముల రాజులు యుధామన్యుడు, సుశర్మ ఆ పవిత్ర ప్రదేశమందు సమావేశమైన వారిలో గలరు

కృష్ణుడు వారి నందరను తేరిపార జూచెను తమ తమ శక్తులను ప్రదర్శించువారి రూపములను, అహంకార పూరితమైన వారి నవ్వును, వారి గర్వమును గమనించెను మరికొన్ని సంవత్సరములలో వారికందరకును అంతిమ విశ్రాంతి కాబోయే ఆ నేల తగియున్నదో లేదోనని పరీక్షించుటకై అందరును అక్కడ చేరినట్లుగా గోచరించెను కేవలము కృష్ణునకు, ఋషులకు మాత్రమే, కురుక్షేత్ర సంగ్రామములో వారందరకును యేమి జరుగనున్నదో తెలియును

అందుకొరకే కృష్ణుడు యీ భూమిపై అవతరించెను. ఆ విషయము అతనికి తెలుసును వారందరిని సంహరించి, ధర్మమును తిరిగి ప్రతిష్ఠించుటకు అతడు యీ భూమిపై జన్మించెను ప్రతిసారి రక్తపాతము

జరుగు ఆ పవిత్ర స్థలములో ధర్మబీజము నాటుట కొరకే కృష్ణు డవతరించెను ఒకప్పుడు పరశురాముడు క్షత్రియుల రక్తముతో అయిదు సరస్సులు నింపెను కురుక్షేత్ర మంతయు క్షత్రియుల రక్తము ప్రవహించనుండగా, యెఱ్ఱని మట్టిలో ధర్మ బీజమును కృష్ణుడు నాటబోవుచున్నాడు.

చాలసేపు కృష్ణుడు మౌనముగా నుండెను. తన మనోనేత్రము ద్వారా జరుగబోవు సంఘటనలను చూచిన కృష్ణునకు మిక్కిలి విచారము కలిగెను. స్థితప్రజ్ఞుడు, ద్వంద్వాతీతుడు అయినప్పటికిని, ముమ్ముందు తాను నిర్వహించబోవు కార్యము తలచుకొని విచారించెను ఈనాటి వేడుక, ముమ్ముందు జరుగబోవు రక్తపాతము తలచుకొనుటకు చాల బాధకరముగా నుండెను.

ఎవరును తన్ను గుర్తించక పూర్వమే తన ఆలోచనా ప్రపంచము నుండి తేరుకునెను. కాని బలరాముడు కృష్ణుని గమనించు చుండెను అతడు కృష్ణునికి దగ్గరగా వచ్చి యిట్లనెను ''కృష్ణా! నిన్నేదో నిరాశ అధైర్యము ఆవరించినట్లున్నవి. వానిని వదలిపెట్టుము నీవు దేనిని గురించి ఆలోచించుచున్నావో నేనెరుగుదును ఇట్లు విచారించుట వలన ప్రయోజనము లేదు జరుగబోవునది జరుగక మానదు నీవు ఊహించు భవిష్యత్తు విధి నిర్ణయము నీవు నేను మాత్రమే భవిష్యత్తును చూడగలుగుట దురదృష్టకరము ఇంతకన్న అజ్ఞానమే ఒక విధముగా మేలు సోదరా! ఈ విషయము మరచిపోయి నాతో రమ్ము మనతో సంభాషించుటకు యెవరు వచ్చిరో చూడుము ''

కృష్ణుడు విచారముతో చిరునవ్వు నవ్వి, సోదరుడు బలరాముడు చేతి నందివ్వగా పట్టుకుని లేచి నిలుచుండెను. దగ్గరలోనే నంద గోపాలుడుండుట చూచెను. అన్నదమ్ము లిద్దరును నందగోపాలునికి, ప్రక్కనే నిలుచున్న యశోదకు పాద నమస్కారము చేసిరి తల్లి దండ్రులు తమ్ము కౌగిలించుకొనగా ఆనంద బాష్పములు రాల్చిరి దేవకి యశోదతో యిట్లనెను ''సోదరీ! వీరికి నేను జన్మనిచ్చిన తల్లిని. కాని వారు నీ పుత్రులు, యెప్పటికిని వారు నీ పుత్రులే. నా పుత్రులను నీవు పెంచి పెద్దజేసిన విషయము నేనెట్లు మరువగలను? కంటికి రెప్పలవలె వారిద్దరిని కాపాడినావు కంసుని ద్వేషము నెరిగినప్పటికిని లక్ష్యపెట్టక వీరిని పెంచి కాపాడితివి నేను నీకు యే విధముగా ధన్యవాదము తెలుపగలను?''

యశోద యిట్లు జవాబిచ్చెను ''నీవు నాకు ధన్యవాదములు చెప్పుటయా! నీవు యీ విధముగా మాట్లాడుట విచిత్రముగా నున్నది! మేము నీకు కృతజ్ఞత చెప్పవలసియున్నది నేను, నా భర్తయే కాదు, బృందావన వాసులందరును కృతజ్ఞులే. దినమంతయు వీరితో మేము గడపిన అతి దివ్యమైన ఆనాటి రోజులు మరువగలమా? ఆనాడు నేననుభవించిన సంతోషము మరువగలనా? కృష్ణుని తల్లిగా నేను పొందిన సంతోషము? ఆనాటి మధుర స్మృతులే మేమింకను జీవించియుండునట్లు చేయుచున్నవి లేకున్నచో, బలరామకృష్ణులను విడిచి యెవరు జీవించగలరు?''

# 258 భూతకాలపు ప్రతిధ్వనులు

కృష్ణుడు తల్లి భుజమున కావల చూచుచుండెను. కొంత దూరములో గోపిక లందరును గుమిగూడి యుండిరి. చాల కాలము నుండి కృష్ణుని చూడవలెనని తహతహతో నున్న గోపికలు, తనివితీర చూచి ఆనందించుచుండిరి. తమకు తెలిసిన చిన్ననాటి కృష్ణుడు, యమునా నది గట్టున తమ్ము ఆట పట్టించి యేడిపించిన కృష్ణుడు, తమ నీటి కుండలను దాచివేసి తానడిగిన దానిని తాము యిచ్చిన తర్వాత తిరిగి తమ నీటి కుండలను యిచ్చిన కృష్ణుడు, పౌర్ణమినాటి వెన్నెల రాత్రిలో యమునా నది ఒడ్డున నున్న తెల్లని యిసుక తిన్నెలపై తమతో రాత్రి అంతయు రాసక్రీడ జరిపిన కృష్ణుడు, మార్గశిర మాసములో ఒకనాటి వేకువ జామున చల్లని నదీ జలములో తాము స్నానము చేయుచుండగా తమ వలువల నపహరించిన కృష్ణుడు, యిప్పుడు యెదిగి మధ్య వయస్కుడుగా నున్న కృష్ణుని జూచి గోపికలు కొంత ఆశ్చర్యము చెందిరి. ఇప్పటికిని, ఆనాడు కృష్ణుడు బృందావనములో నున్నపుడు జరిగిన సంఘటనలను తలచుకున్నపుడు ఆ గోపికల వదనములు యెర్రగా మారుచుండెను.

అనేక సంవత్సరముల తర్వాత వారిపుడు కృష్ణుని చూడగలిగిరి. వారందరును సంకోచించుచుండిరి. పెక్కుమంది రాజులు, రాణులు అచట గలరు. వారు గోపికలకు భిన్నముగా నుండుటచే యెవరైన తమ్ము వేలెత్తి చూపి, ''ఆ స్త్రీలను చూడుడు. వారు గోపికలట. వారందరికి కృష్ణునిపై మక్కువని యనెడివారు'' అని అది యేదో నవ్వులాట విషయమైనట్లు వారు తలచెదరని ఆందోళన చెందిరి. కృష్ణుడు తమ వాడైనప్పటికిని దూరముగా అందరాని వాడుగా నున్నట్లు వారికి గోచరించెను.

కృష్ణుడు వారివైపు జూచి, వారి అమాయక మనస్సులలో యేమి మెదలుచుండెనో గ్రహించెను. గోపిక లందరను గుమిగూడి యున్న ప్రదేశమునకు కృష్ణుడు వెళ్ళి వారందరికి పరిచితమైన చిరునవ్వు ప్రదర్శించెను. తన అందమును గ్రోలుచున్నట్లుగా వారు తన్ను అదే పనిగా చూచుచుండిరి! వారిని దాటి ముందుకు కృష్ణుడు వెళ్ళగా గోపికలు కృష్ణుని వెనక వెళ్ళిరి. వారితో తాను ఒక్కడే యున్నపుడు, ప్రతి ఒక్కరినీ ఆలింగనము చేసుకుని వారికి హాయి కలిగించెను. వారు తమ కోపమును, నిందలను పూర్తిగా మరచిపోయిరి. తమకు బాగుగా పరిచయమున్న కృష్ణునిలో యేమియు మార్పులేదని గ్రహించి వారు సంతోషించిరి. సంపద, రాజరికము, నగరవాసము కృష్ణునిలో యెట్టి మార్పు కలిగించలేదని తెలుసుకుని ఆనందించిరి.

వారు ఆనంద బాష్పములు రాల్చుచు, చిరునవ్వు చిందించుచు, కృష్ణుడు ప్రేమతో సంభాషించుచున్నపుడు, వింటూ నిలుచుండిరి. కృష్ణుడు మాట్లాడుచున్నపుడు స్వరములో ఒక విధమైన సరళత ప్రస్ఫుటముగా గోచరించెను. గోపికలతో కృష్ణు డిట్లనెను. ''చెలులారా! పురాతన మిత్రులారా! మిమ్ములను చూచి యెంత కాలమైనది! నేను అబద్ధాలకోరునని మీరందరు భావించి యుండవచ్చు. మీరు 'కృష్ణునికి విశ్వాసము లేదు. మా ప్రేమను పూర్తిగా మరచిపోయినాడు' అని అనుకొనవచ్చు. 'తిరిగి వచ్చెదనని అబద్ధము చెప్పినాడు కృష్ణుడు. మమ్ము మోసగించి నాడు', అని కూడ మీరు అనవచ్చు''. తమ మనస్సులోని ఆలోచనలను కృష్ణుడు సరిగా ఊహించెనని వారు సిగ్గుతో తలలు వంచుకొనగా, కృష్ణుడు వారిని చూచి చిరునవ్వు చిందించెను. కృష్ణుడు తన సంభాషణ నిట్లు కొనసాగించెను. ''మీ ఆలోచనలు నాకు పూర్తిగా తెలుసు. ఆ విధముగా మీరు ఆలోచించినంతుకు నేను మిమ్ములను తప్పుపట్టుట లేదు. కాని నేను నిస్సహాయుడనైనాను. మోసము, దగా కుతంత్రముల వలలో చిక్కుకు పోవుటచేత ఆనందమయమైన గోపాలకుల స్వేచ్ఛా జీవితమునకు

భిన్నమైన పాత్రను నేను నిర్వహించవలసి వచ్చెను. తరువాత నేను మిమ్ములను కలియుటకు మధ్యవర్తులను యే విధముగా నియోగించి యేర్పాటు చేయవలెనను యోచన తప్ప, యింక యితర ఆందోళన లేమియు లేకుండెను

''ఇప్పుడు నాపై ఆధారపడియున్న బంధు బలగము శ్రేయస్సు కొరకు వారి భారము వహించవలసి వచ్చెను ఎన్ని పర్యాయములు నేను బృందావనములో గడపిన దినములు తలచుకుని, తిరిగి బృందావనము వెళ్ళి మీ అందరితో హాయిగా రోజులు గడపవలెనని యెంతగా నువ్విళ్లూరితినో మీకు తెలియదు ఈ మాట నమ్మండి ఇదంతయు గతించిపోయినది'' కృష్ణుడొక క్షణ కాలము మౌనముగా నుండెను అతని వదనములో పెంకె చూపులు కనిపించకుండెను ముఖమునందు, నేత్రములందు కూడ చిరునవ్వు అదృశ్యమయ్యెను. ఒక్కసారిగా శరీరము విదలించెను

తిరిగి పాత స్వరూపము తెచ్చుకుని గోపికలతో కృష్ణు డిట్లనెను. ''చెలులారా! ఒకటి మాత్రము సత్యము భగవంతుడు తన వారిని కలియును వారందరును ఒకరినొకరు కలుసుకుని కొంతకాలము కలిసి యుండునట్లు చేయును ఒకరితో నొకరు భావోద్రేకము చేత సంపర్కము పెంచుకొనినపుడు, ఆ భగవంతుడే వారిని వేరు చేయును. శాశ్వతముగా వారు విడిపోదురు గాలి వీచి మబ్బులను చెల్లా చెదరు చేయును. అదే గాలి తిరిగి వానిని కలుపుచుండును. గడ్డిపోచలు గాలికెగిరి యెవరి దారి నవి పోవును ఒక దూది పోగు లేక ధూళి రేణువు, యేదైన గాని, ఒక క్షణము అవి యన్నియు ఒకచోట చేరును మరుక్షణము అవి చెల్లాచెదరైపోవును అదే విధముగా నేను మీ అందరితో కొంతకాలము గడపినాను, యిప్పుడు మీకు దూరమై యుంటున్నాను అయితే మీ నుండి గాని, నా నుండిగాని వేరు చేయలేనిది యొకటున్నది అది నాకు మీపై నున్న ప్రేమ, మీకు నా యందున్న భక్తి. నేను దూరముగా నున్నాననను ఆలోచన మీకు కలుగకూడదు 'నేనే మీరు — మీరే నేను' అను ఆలోచన కలిగియున్నచో, నేను మీకు దూరముగా నున్నానను విచారము తొలగిపోగలదు

## 259 ఋషులు గౌరవము తెలుపుట

బలరామకృష్ణులతో కొంతకాలము గడపవలెనని మహర్షులందరును శమంతపంచకమునకు వచ్చిరి స్వర్గము నుండి నారద, చ్యవన, అసిత, దేవల, విశ్వామిత్ర, సదానంద, భరద్వాజ, గౌతమ, వసిష్ఠ, గాలవ, భృగు, పులస్త్య, కశ్యప, అత్రి, బృహస్పతి, అంగిరస, అగస్త్య, యాజ్ఞవల్క్య, వామదేవాది ఋషులు వచ్చిరి

రాజులందరు ఒక్కసారిగా లేచి నిలుచుండిరి ఇటువంటి అరుదైన గౌరవము భగవత్ప్రసాదమని వారు భావించిరి. బలరామకృష్ణులు తాము కూర్చున్న చోటు నుండి లేచి నిలబడి, మిక్కిలి ఉత్సాహముతో వచ్చి మహర్షులను రాజులతో గూడి గౌరవించిరి వారికి అర్ఘ్యపాద్య ఆచనములు సమర్పించి గౌరవించిన పిదప, మహా ఋషులందరు తమతమ ఆసనములపై కూర్చుండిరి. పరిశుద్ధాత్ములైన బ్రహ్మజ్ఞానులతో నిండిన ఆ సభ సత్య లోకము వలె ప్రకాశించుచుండెను దీనితో పోల్చి చూడగా రాజుల సమావేశములు అల్పమైనవి అక్కడ చేరిన మహా ఋషులందరును తపస్సంపన్నులు ఈ లోకమును లయింపజేయుటకు గాని, నూతన

లోకమును సృష్టించుటకు గాని తగిన తపస్సంపద వారిలో ప్రతి ఒక్కరికిని గలదు నారాయణావతారములైన బలరామకృష్ణులు, యాదవ కుటుంబములో జన్మించి సాధారణ మానవులవలె జీవించుచున్న ఆ సోదరులకు తమ గౌరవాభి వందనములు తెలుపుటకై గొప్ప గొప్ప మహర్షు లందరును అక్కడకు విచ్చేసిరి

కృష్ణుడు యిట్లు ప్రసంగించెను ''ఒకేసారి అనేక మహర్షుల దర్శన భాగ్యము పొందుటచేత, యీ జీవితములో మనము గొప్ప పుణ్యము సాధించితిమని చెప్పుటలో సందేహము యెంత మాత్రము లేదు ఒక్కసారిగా మన పాపములన్నియు తొలగిపోయి వారి ఆశీస్సులు పొందుటకు అర్హత సంపాదించినాము.

''పాపములను క్షాళనము చేసుకొనుటకు అనేక పద్ధతులను పెద్దలు మనకు బోధించినారు పవిత్ర తీర్థములలో స్నానము చేయుట ఒక పద్ధతి. రాతి విగ్రహములో భగవంతుని ప్రతిష్ఠజేసి పూజించుట మరియొక పద్ధతి. మీ వంటి ఉత్తమ పురుషుల దర్శన భాగ్యము వలన కలుగు పుణ్యమునకు యివి సాటి రాగలవా? మిమ్ము మేము స్పృశించవచ్చు మీతో సంభాషించవచ్చు. మీ పాద ధూళిని స్వీకరించవచ్చు. మీ పాదముల నభిషేకించి ఆ తీర్థమును తలపై జల్లుకొనినచో జనన మరణములనే వ్యాధి నివృత్తి యగును

''తీర్థ స్నానములు, విగ్రహ పూజలు పునీతము చేయవని గాదు కాని అవి దీర్ఘకాలము తీసుకొనును. అయితే సాధు పుంగవుల పవిత్ర దృక్కులు ప్రసరించిన మరుక్షణమే పాపములు పటాపంచలు కాగలవు అగ్నిని చూచినంత మాత్రమున పాపములు హరించవు. సూర్యుని దృష్టి పడినను పాపములు నిర్మూలము కావు చంద్రుని నక్షత్రములను దర్శించినంత మాత్రమున పాపములు సమసిపోవు పంచ మహాభూతములు పాపములను పరిహరింపజాలవు 'బ్రహ్మ' అను పదమును అర్చించినప్పటికిని వెంటనే పాపము అంతము కావు ఇవి అన్నియు, భక్తులు శ్రద్ధతో పూజించినపుడు, వారి పాపముల నంతరింపజేయగలవు కాని పాపములకు మూలకారణమైన అజ్ఞానము — సత్యము నెరుగకుండుట — పైన చెప్పిన పద్ధతులచేత తొలగిపోదు. అయితే మహా గొప్ప జ్ఞానులు ఒకరి పాపములను అజ్ఞానమును ఒక్కసారిగా నిర్మూలింపగలరు దీనికి వారిని దీర్ఘకాలము పూజింప నవసరము లేదు వారి ప్రశాంత దృక్కులు మనపై ప్రసరించినచో, యీ విచిత్రము జరుగును

''ఈ శరీరము ఎముకలు, క్రొవ్వు, రక్తము, చర్మముతో నిర్మితమైనదని తెలిసినప్పటికిని, 'నేను' అను అహంకారముతో నిండిన మానవునకు, యీ భార్య, పిల్లలు, సంపద 'నావారు' 'నాది' అనుకునే మానవునకు, భగవంతుని అనుగ్రహము కలుగవలెనన్న తీర్థ స్నానము విగ్రహపూజ సులభమైన పద్ధతులని చెప్పినారు నిజముగా వివేకవంతులైనవారు మీ వంటి సాధు పురుషులను పూజించి వెంటనే మోక్ష ప్రాప్తి నందుకొనగలరు''

కృష్ణుడు యీ విధముగా స్తుతి వాక్యములు పలికినపుడు ఋషులకు అతని భావమేమిటో అర్థము కాలేదు. కృష్ణుడు పరబ్రహ్మ స్వరూపుడు, అతడు వారిని స్తుతించుచు పలికెను! అందుకు కారణము వారు తెలుసుకొనగోరిరి వారి గొప్పదనమునకు గీటురాయి అనదగిన యీ గుణమును కృష్ణుడెంతో మెచ్చుకొనెను అది వారి వినయమునకు చిహ్నము కృష్ణుని దృష్టిలో వారెంత ఉన్నతులో వారికి తెలియదు వారు గ్రహించలేకపోయిరి

వారికి సంబంధించినంత వరకు అసలు సత్యము యిందుకు వ్యతిరేకమని తలచి వారిలో వారు చిరునవ్వు నవ్వుకొనిరి. వారు కృష్ణుని దర్శించుటకై వచ్చిరి అతని దర్శనముచేత లౌకిక బంధముల నుండి విముక్తులై సంచరించగలమని వారు భావించగా, కృష్ణుడు తాను సాధారణ మానవుని వలె మాట్లాడెను

ఋషులు తమ తమ మనస్సులలో కృష్ణుని పూజించి గౌరవము ప్రకటించిరి. వారి పూజలను గౌరవమును అంగీకరించినట్లుగా తన నేత్రములు మనస్సు ద్వారా వారికి తెలియజేసెను. అతడెందు కవతరించి నదియు వారికి తెలుసును కాని ఆ విషయమై వారు మాట్లాడలేకపోయిరి కృష్ణుడది గ్రహించి, వారివైపు చూచి ''నేనీ విధముగా నటించుటలో మీరందించిన సహాయమునకు నా ధన్యవాదములు నేను కేవల మొక యాదవుడను బలరాముడు నా సోదరుడు. అంతమాత్రమే వారికి తెలుసును వారు తెలుసుకొనదగినది కూడ అంత మాత్రమే'' అని యనుచున్నట్లుగా చిరునవ్వు నవ్వెను. ఋషులు తమ తమ మనస్సుల ద్వారా యిట్లు తెలియజేసిరి ''ప్రభూ! నీ చర్యలు సాధారణ మానవులకు అంతుపట్టనివి. ఒకే మట్టి నుండి వివిధ రకములైన ఆకారములలో పాత్రలు చేయుచున్నారు ఒకొక్క పాత్ర ప్రత్యేకముగా నుండినప్పటికిని వానిలోని మట్టి మాత్రము ఒకటే అదే రీతిగా, నీవు వివిధ రూపములు, ఆకారములతో యీ లోకమును సృష్టించి, పోషించి, నశింపజేయుచున్నావు ఎట్టి బంధములకును లోబడని నీవు, ఆయా రూపములలో నీకై నీవు ఆపాదించుకొనిన బంధములను చూచి, లోకులు నీవు సామాన్య మానవుడవనియు, సుఖ దుఃఖములను చక్రగతి నీకు కూడ వర్తించుచున్నదనియు భావించి భ్రాంతి పొందుచున్నారు

''అంతరించిపోనున్న ధర్మమును పునః ప్రతిష్ఠించుటకు నీవు మరల మరల అవతరించుచున్నావు నీవు పరబ్రహ్మ స్వరూపుడవని యెంచి పూజించుచున్నాము గంగకు పరిశుద్ధతను ప్రసాదించిన నీ దివ్య పాదములను మేము తలచుకుని వాటిని మేము దర్శించి మౌనముగా పూజించుటకై మేము యిక్కడకు వచ్చితిమి మా ధన్యవాదములను స్వీకరించి ఆశీర్వదింపుము''

ఎవరికి వారు వెళ్ళిపోవనున్నట్లుగా, అందరి వద్ద వారు సెలవు తీసుకొనిరి వసుదేవుడు వారి ననుసరించి యిట్లడిగెను. ' కొనవలెను నేను మిమ్ముల నొక కోరిక కోరదలచినాను పాపభూయిష్ఠ మైన యీ జీవితము నుండి విముక్తి కలిగించు మార్గము నాకు బోధించవలెను '' అతని మాటలు నారదున కబ్బురము కలిగించెను తగ్గు స్వరములో తన సహచరులతో నారదుడిట్లనెను ''ఇతడెంత తెలివి తక్కువ వాడు! కాని ఇతడు అజ్ఞాని. పరమ దైవము తనకు పుత్రుడుగా నిత్య సహచరుడుగా నున్నాడు అయినప్పటికిని, కృష్ణుడు యింకను పసివాడని, తనకున్న మహద్భాగ్యము నెరుగక, పాప విముక్తికి మార్గము తెలుపమని మనలను కోరుచున్నాడు! ఎవరితోనైనను నిత్య సంబంధమున్న యెడల వారిపై ఉపేక్షా భావము కలుగుట సహజము. వసుదేవుని పరిస్థితి అట్లున్నది. కృష్ణుడు జన్మించినపుడు, నారాయణుడు తన నిజ స్వరూపముతో యీ వసుదేవునికి దర్శనమిచ్చెను అయినప్పటికిని, యీనాడు కృష్ణుడు తనతో నిత్యము నుండుటచేత, తనకున్న అపూర్వ భాగ్యమును మరచి, అందరి మానవులవలె వర్తించుచున్నాడు నిత్యము గంగానది ఒడ్డున జీవించువారు, తమ్ము తాము పునీతులు గావించుకొనుటకు వేరు తీర్థముల నన్వేషింతురు అదే విధముగా, కృష్ణుడు తనతో నున్నప్పటికిని, వసుదేవుడు తన పాపముల నుండి విముక్తి పొందుటకు మార్గములు తెలుసుకొనగోరుచున్నాడు! దైవలీల లతి విచిత్రము గదా!''

ఋషు లిట్లు సమాధానమిచ్చిరి ''నారాయణుని పూజించుటే నీవు అనుసరించదగు ఉత్తమ మార్గము అతి సులభమైనది, ఉత్తమమైనది, తొందరగా ముక్తిని చేకూర్చునది మహారాజు, తన జీవితములో ఒకసారి యైనను యాగము చేసి దాన ధర్మములు సలిపినచో సులభముగా మోక్షము నందుకొనగలడు''.

పరమ పవిత్రమైన శమంతపంచక తీర్థము వద్ద తాను జరుపబోవు యజ్ఞమును నిర్వహించుటలో

సహాయపడవలసినదిగా వసుదేవుడు ఋషులను కోరెను.

ఋషులందు కంగీకరించిరి. వెంటనే యజ్ఞమునకు సన్నాహములు ప్రారంభమయ్యెను.

సంపద; భార్యా పిల్లలు, భౌతిక వాంఛలపై మమకారము వీడుటకు, విజ్ఞులైన వారు యజ్ఞము చేయుదురని ఋషులు పలికిరి. స్వర్గ జీవితము, స్వర్గ సౌఖ్యములు పొందవలెనను వాంఛ కూడ నుండరాదు. ఆత్మ జ్ఞానము కలుగుటకు యిది గొప్ప అవరోధము. అందుచేతనే పూర్వకాలములో మహారాజులు, మోక్ష ప్రాప్తికొరకు రాజ్యమును, సంపదను, అన్ని బంధములను త్రెంచుకొనెడివారు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు ముఖ్యముగా చేయవలసిన కర్తవ్యములు మూడు. ఒకటి భగవంతుని యెడల చేయవలసినది - అదే యాగము. రెండవది ఋషుల యెడ చేయదగినది — అది అధ్యయనము. మూడవది తల్లిదండ్రుల యెడ చేయవలసినది — అది పుత్రులకు జన్మనిచ్చి వంశము కొనసాగునట్లు చేయుట. ఈ మూడు కర్తవ్యములు నిర్వహించుట వలన వారు పైన చెప్పిన ముగ్గురి ఋణములను తీర్చుకొనగలుగుదురు.

వసుదేవుడు, ఒక ఋణము మాత్రము తీర్చవలసి యున్నదని ఋషులు పలికిరి. యాగము జరుపుటచే దైవ ఋణము తీరగలదని ఋషులు తెలిపిరి.

వసుదేవుడు జరిపిన యాగమునకు ఋషులు ఋత్విక్కులుగా వ్యవహరించిరి. అందు మూలముగా కృష్ణునితో మరికొంత కాలము గడుపుటకు అవకాశము కలిగెను! ఋషులు శమంతపంచకమునకు వచ్చుటచే అనేక గొప్ప సంఘటనలకు — యితర దేశములను పాలించుచున్న పాత మిత్రులను కలుసుకొనుటకు, యశోదానందులతో తిరిగి సమాగమము, తాను నిర్వహించిన యాగమునకు ఋషులు సహాయము చేయుట — దారితీసినవని వసుదేవుడు భావించి మిక్కిలి సంతోషించెను. సంతృప్తి చెందిన వసుదేవుడు సంతోషించి ఆనందించెను.

## 260 దేవకి కోరిక

దేవకి బలరామకృష్ణులను పిలిచి వారితో నిట్లనెను. ''మీరు నారాయణుని అవతారములని ఋషులు నాకు చెప్పిరి. వారు చెప్పిన దానిని నేను విశ్వసించుచున్నాను. కాని, నాకు మీరిద్దరును పుత్రులు. నేను మీకు తల్లి నను తలంపు నాకు సంతోషము నిచ్చుచున్నది. కొన్ని సంవత్సరముల క్రితము మీ గురువు సాందీపుడు గురుదక్షిణగా తన పుత్రుని పునర్జీవింపజేయమని కోరినపుడు, మీరు యమపురికి వెళ్ళి అసాధ్యమైన కార్యమును నిర్వహించిన విషయము నేనెరుగుదును. మీరిరువురకు ముందు నాకు జన్మించిన పుత్రులను కంసుడు సంహరించెను. అది తలచుకొని నేను చాల కాలము విచారముగా నుంటిని. నేను వారి నొక పర్యాయము చూచుటకు మీరు సహాయపడగలరేమోనని యోచించుచున్నాను''.

బలరామకృష్ణులు తమ యోగశక్తిచేత సుతల లోకము ప్రవేశించిరి. ఆ లోకమునకు బలి అధిపతి. అతడు బలరామకృష్ణులను సంతోషముగా ఆహ్వానించెను. వారిని బలి బాగుగా యెరిగిన వాడగుటచే వారిని గౌరవించి, జ్ఞానవంతులు మాట్లాడదగు మాటలతో బలి వారిరువురను స్తుతించెను. తనకు అతి ప్రియ భక్తుడైన బలి స్తుతి వాక్యములను స్వీకరించి, కృష్ణు డిట్లనెను. ''నిన్ను ఒక సహాయము కోరి వచ్చినాము. స్వాయంభువ

మన్వంతరమందు మరీచి వర్షలకు ఆరుగురుపుత్రులు కలిగిరి. ఒకప్పుడు బ్రహ్మదేవుడు తన కుమార్తె సరస్వతితో రతికేళి చేయ యత్నించెను అది చూచి మరీచి ఆరుగురు పుత్రులు నవ్విరి ఆ కారణముచే వారు అసురులుగా జన్మించునట్లు శాపమొందిరి వారు హిరణ్యకశిపుని పుత్రులుగా పుట్టిరి. ఆ తర్వాత వారు దేవకీదేవికి జన్మించిరి జన్మించిన వెంటనే వారిని కంసుడు సంహరించెను వారిప్పుడు నీ వద్ద నున్నారు. చనిపోయిన తన పుత్రులను చూడవలెనని మా తల్లి దేవకి తపించుచున్నది. వారిని నేను తీసుకు వెళ్ళెదను ఆ తరువాత వారు శాప విముక్తులై స్వర్గలోకము చేరగలరు''.

బలరామకృష్ణులు దేవకి ఆరుగురు పుత్రులను తమతో తీసుకు వెళ్ళిరి. వారి నామములు స్మర, ఉద్గత, పరిష్వంగ, పతంగ, క్షుద్రభృత్, ఘృణి ద్వారక చేరిన తర్వాత బలరామకృష్ణులు ఆ ఆరుగురిని దేవకి సమక్షమునకు తీసుకువెళ్ళిరి. మరణించిన తన పుత్రులను చూచి ఆమె అమితముగా సంతోషించెను. వారిని తన తొడపై కూర్చుండ బెట్టుకుని కన్నీటితో అభిషేకించెను వారు శాప విముక్తులై, దేవకీ వసుదేవులకు ప్రణామము అర్పించి స్వర్గలోకమున కేగిరి ఇన్ని సంవత్సరములుగా వారి కొరకై ఆమె పొందిన తపన అంతరించి అదృశ్యమయ్యెను తన పుత్రులను తిరిగి కలుసుకున్న వెంటనే వారు స్వర్గలోకము వెళ్ళినందుకు ఆమె విచారించకుండెను.

## 261 సుభద్రాపహరణము

తన పితామహి సుభద్రను అర్జునుడు వివాహమాడిన తీరును పరీక్షిత్తు మహారాజు తెలుసుకొనగోరెను. అతని కోరికను మన్నించి శుక మహర్షి సుభద్రాపరిణయ వృత్తాంతమును వివరించి చెప్పెను

ఒకసారి అర్జునుడు సంవత్సర కాలము భారత వర్ష మంతయు సంచరింపవలసి వచ్చెను అతడీ తీర్థ యాత్రను తప్పని సరిగా నెరవేర్చవలసి వచ్చెను అతడా విధముగా సంచరించుచున్నపుడు, బలరాముడు తన అందమైన సోదరి సుభద్రను దుర్యోధనునకిచ్చి వివాహము చేయ తలపెట్టినట్లు వార్త అందినది అంతకు మునుపు కృష్ణుని మేనబావలు, యాదవ యువకులు కలిసి ఇంద్రప్రస్థపురములో రోజులు గడిపినపుడు, వారి మాటలను బట్టి, కృష్ణుని అనుంగు సోదరి సుభద్ర చాల అందమైనదని సుగుణాలరాశియని అర్జునుడు గ్రహించెను. ఆమెను గురించి వినిన అర్జునునకు ఆమెపై ప్రేమ ఉదయించెను అదే విధముగా సుభద్ర అర్జునుని ధైర్య సాహసములను వీరత్వమును, అందచందములను విని, ఆమె అర్జునుని భర్తగా యెంచుకొనెను అయితే బలరాముని యత్నములు తన సంకల్పమునకు విఘ్నము కలిగించునని భావించి, అర్జునుడు కాషాయ వస్త్రములు ధరించి, సన్యాసి రూపము దాల్చి ద్వారకా నగరము ప్రవేశించెను.

అమాయకులైన ద్వారకా నగరవాసులును, బలరాముడు మారువేషములో నున్న అర్జునుని గుర్తించకుండిరి వర్షకాలములో చాతుర్మాస్య సమయమందు అర్జునుడు ప్రవేశించెను యతులు చాతుర్మాస్యమందు (నాలుగు నెలలు) ఒకేచోట ఉండి రాజు ఆతిథ్యము స్వీకరించుచుందురు ఆ ప్రకారము, రైవతకమను కొండపై నున్న దేవాలయ ప్రాంగణములో యతి వేషములో నున్న అర్జునుని చూచి బలరాముడు యాదవుల ఆతిథ్యము స్వీకరించమని కోరెను ప్రేమ వలలో పడి సన్యాసి వేషములో నున్న అర్జునుడు ''అటులనే కానిమ్మ''ని

బలరాముని కోరిక నంగీకరించెను.

రాజు ఆతిథ్యములో నున్న ఋషుల పరిచర్యలు పెండ్లికానున్న పడతులు చేయుట ఆనాటి సంప్రదాయము ఆ పడతుల పరిచర్యలకు ఋషులు మెచ్చి మంచి వరుడు వారికి లభించునట్లు ఆశీర్వదించెడివారు ఆ సంప్రదాయము ననుసరించి, బలరాముడు యతి వేషములో నున్న అర్జునునికి పరిచర్యలు చేయమని సుభద్రను కోరెను. అందుకు కృష్ణుడు బలరాముని మందలించి యిట్లనెను. ''అన్నా! మన సోదరి సుభద్రను ఈ సన్యాసి పరిచర్యలకు నియోగించుట సమంజసముగా లేదు'' కృష్ణుని అభ్యంతరమునకు బలరాముడు కారణము తెలుసుకొనగోరెను. కృష్ణుడు యిట్లు చెప్పెను ''ఈ సన్యాసి చాల యువకుడు పైగా భౌతిక వాంఛలను జయించలేనంత అందగాడు. అటువంటి వానిని, సుభద్రయే కాదు, యితర పడతుల మధ్య గూడ నుంచుట క్షేమము కాదు చూడగా దొంగసన్యాసి వలె గోచరించుచున్నాడు''. బలరాముడు కోపముతో యిట్లనెను. ''కృష్ణా! గొప్పవారిని గురించి చులకనగా మాట్లాడుటకు నీకెంత ధైర్యము! యువకుడైనంత మాత్రమువ అతడు కపట సన్యాసి యని యెట్లు ఊహించగలవు? నీ ఊహ తప్పు మహాతేజస్సుతో నిండిన అతని ముఖము చూడుము! అతనికి క్షమాపణ చెప్పుము'' బలరాముడు సుభద్రను పిలిపించి యతి పరిచర్యలు చేయమని చెప్పుచుండగా, కృష్ణుడు చేతగాని వానివలె నిలుచుండెను సగము కనులు మూసుకుని తన కోరికను మరుగుపరచుటకు యత్నించుచున్న యతిని చూచి కృష్ణుడు చిరునవ్వు నవ్వెను! బలరామునిచేత యేదైన కార్యమును చేయించవలెనన్న దానిని వలదని చెప్పుటయే మార్గమని కృష్ణునికి బాగుగా తెలియును తన సోదరి సుభద్ర దుర్యోధనుని గాక, అర్జునుని వివాహమాడవలెనని కృష్ణుని సంకల్పము

రాజసౌధమున కానుకొని యున్న తోటలో యతి వేషములో నున్న అర్జునుడు, ప్రియురాలు సుభద్ర తనకు పరిచర్యలు చేయుచుండగా హాయిగా కాలము గడపుచుండెను కొంత కాలమునకు యతి వేషములో నున్నది అర్జునుడని సుభద్ర తెలుసుకొనెను పరిస్థితులను గమనించిన కృష్ణుడు, ద్వారకా నగరమునకు వెలుపల ఒక పెద్ద ఉత్సవము నేర్పాటు చేసెను ఆ సందర్భములో సుభద్ర నగరము బయటకు వచ్చినపుడు, అర్జునుడామెను ఇంద్రప్రస్థమునకు తీసుకుపోయెను

ఈ విషయము తెలిసి బలరాముడు మండిపడెను అర్జునుని వెంబడించి, సుభద్రను వెనుకకు తీసుకు రావలెనని అతడు తలచెను. అట్లు చేయుట తెలివితక్కువ పని యని కృష్ణుడు చెప్పెను ''మొదట నుండి యీ తోటలో ఆ యతి యుండుట అతనికి సుభద్ర పరిచర్యలు చేయుట నాకు సమ్మతము కాదని చెప్పితిని'' అని కృష్ణుడు నెమ్మదిగా పలుకగా, బలరాముడు కోపముతో యిట్లు అరచెను ''కృష్ణా! నన్ను యీ మాయ మాటలతో మోసగించకు. అతడు అర్జునుడని మొదట నుండి నీకు తెలిసి యుండవచ్చు'' సోదరుని సముదాయించి కృష్ణు డిట్లనెను ''గొప్ప ప్రమాదమేమియు జరుగలేదు, సోదరా! ఒక గొప్ప వీరుని ఆమె వివాహమాడినది. అతడు నీ ప్రపంచములోకెల్ల మిక్కిలి గొప్పవిలుకాడు ఒక మహావీరుని సోదరి మరొక మహావీరునికి భార్య కావలెను బలరాముని చెల్లెలు తన మేనబావను భర్తగా యెంచుకొనుటలో అనౌచిత్యమేమియు లేదు'' కృష్ణుని మాటలకు బలరాముడు క్రమముగా మెత్తబడి, తరువాత కృష్ణునితో యితర యాదవులతో కలసి వధూవరులకు కట్నకానుకలు తీసుకుని ఇంద్రప్రస్థమునకు వెడలెను

# 262 శ్రుతదేవుడు, బహుళాశ్వుడు

విదేహ రాజ్యములో మిథిలా నగరమను పట్టణములో శ్రుతదేవుడను బ్రాహ్మణుడు నివసించుచుండెను. అతడు కృష్ణభక్తుడుగా పేరుగాంచెను అతడు జ్ఞానవంతుడు అతడు నిత్య సంతృప్తుడై గృహస్థ జీవితము సాగించుచుండెను. ఉన్నదానితో సంతృప్తిచెందెడి అపురూప గుణము అతనిలో కలదు. ప్రతిరోజు జీవించుటకు తగిన ఆహారము మాత్రము లభ్యమగుచుండెడిది. అంతకుమించి అతని కెన్నడును లభించలేదు. అంతకుమించి సంపాదించవలెనన్న కోరిక కూడ అతనికి లేకుండెను తనకు లభించిన దానితో అవసరములు తీర్చుకొనుచుండె డివాడు భార్య పిల్లలు కూడ అతని అడుగుజాడలలో నడచుచుండిరి

అదే పట్టణమందు విదేహరాజు బహుళాశ్వుడు నివసించుచుండెను. అతడు రాజర్షి జనక మహారాజు సంతతిలోని వారసుడు బహుళాశ్వుడు కూడ జనకుని వలె గొప్పవాడు 'నేను — నాది' అను భ్రాంతి యుండెడిదికాదు అతడు గొప్పఉదాత్త పురుషుడు, కృష్ణ భక్తుడు కూడ

తన భక్తుల నిద్దరినీ చూడగోరి కృష్ణుడు మిథిలాపురికి బయలుదేరెను. అతనిని నారద, వామదేవ, అత్రి, వ్యాస, పరశురామ, అసిత, అరుణి, శుక, బృహస్పతి, మైత్రేయ, చ్యవన మహర్షులు అనుసరించిరి.

మిథిలాపురికి వెళ్ళుచున్నపుడు కృష్ణుని రథము దారిలో మాటిమాటికి ఆగుచుండెను. ఆయా ప్రదేశముల ప్రజలు, వానిని పాలించురాజుల పూజల నందుకొని వారి నాశీర్వదించుటకు కృష్ణుని రథము ఆగుచుండెను. రథము ఆనర్త, ధన్వ, కురు, కంక, మత్స్య, పాంచాల, మధు, కేకయ, కోసల రాజ్యములు దాటెను. వారందరి పూజలందుకొని కృష్ణుడు మిథిలానగరమునకు ప్రయాణము సాగించెను కృష్ణుడు మిథిలకు వచ్చెనని వినిన ప్రజలు తమ గృహముల నుండి బయటకు వచ్చి నగరపు పొలిమేరలకు తరలి వెళ్ళి అత్తరు పన్నీరు జల్లి రాజలాంఛనములతో స్వాగతము పలికి కృష్ణుని పూజించిరి. కృష్ణునితో వచ్చిన మహర్షులను కూడ గౌరవించి సాదరముగా ఆహ్వానించిరి

శ్రుతదేవుడు, బహుళాశ్వుడు కూడ నగరమునుండి వచ్చిరి వారి నేత్రముల నుండి అశ్రువులు కారుట అందరును గాంచిరి వారు తమ చేతులెత్తి తలపై నిడుకొనిరి వారు కృష్ణుని పాదములపైబడి, తమ ఆతిథ్యము స్వీకరించమని వేడుకొనిరి వారిద్దరును వేర్వేరుగా కోరిన కోరికలను కృష్ణుడు అంగీకరించెను

రెండు రూపములు ధరించి, కృష్ణుడు వారిరువురి గృహములకు వెళ్ళి వారి ఆతిథ్యము పొంది ఆనందించెను. అనేక సంవత్సరములుగా తన పూజలందుచున్న కృష్ణుడు చివరకు తన గృహమునకు వచ్చి ఆతిథ్యము స్వీకరించి ఆశీర్వదించినందులకు బహుళాశ్వుడు మిక్కిలి ఆనందించెను

కృష్ణుని పాదములవద్ద కూర్చుని బహుళాశ్వుడు గౌరవపురస్సరముగా పాదముల నొత్తుచుండెను బహుళాశ్వుడు మహర్షులను కూడ తగిన రీతిగా గౌరవించెను తరువాత బహుళాశ్వుడిట్లు పలికెను ''ప్రభూ! నన్ను చూచుటకు వచ్చి నాకు పరమానందము చేకూర్చిరి. ఒక పర్యాయము నీవు 'ఆదిశేషుడు నాకు బంధువు కావచ్చు, లక్ష్మి నాప్రియపత్ని కావచ్చు, సృష్టికర్త బ్రహ్మ నాప్రియపుత్రుడు కావచ్చు అయినను, నిత్యము నన్నే చింతించు భక్తుల కన్న వీరెవరును నాకు ప్రియులు కారు' అని పలికినావు నీ మాటలు నిరూపించుటకై నన్ను యీ ప్రజలను ఆశీర్వదించుటకు యీ దేశము వచ్చినావు యాదవుల వైభవము చాటుటకు ఆ

కుటుంబములో జన్మించినావు. నీవు పరబ్రహ్మ స్వరూపుడవను సత్యము నెరిగిన వారెవరైనను, నీ పాదపద్మములనెట్లు మరువగలరు? నీవు కొన్ని దినములు యిచట నావద్దనుండి, నా గృహము భూలోక స్వర్గమగునట్లు గావింపుము''. ''అటులనే కానిమ్ము'' అని కృష్ణుడు పలికి కొన్ని దినములు రాజసౌధములో గడపెను.

అటు బహుళాశ్వుడు కృష్ణు నాహ్వానించి గౌరవింపగా, యిటు శ్రుతదేవుడు, కృష్ణుడు మహర్షులతో గూడి తన ఆతిథ్యము స్వీకరించినందుకు అమితముగా ఆనందించెను. ఇరుగు పొరుగువారి నుండి కొన్ని చాపలు, ఆసనములు తెచ్చెను. ఒకమూల పేరుకొనిన దర్భలు కూడ ఆసనముగా వినియోగపడెను.

దర్భాసనముపై కృష్ణుని కూర్చుండబెట్టి, అతని పాదములు కడిగెను. ప్రక్కనే భార్య, పిల్లలు నిలుచుండిరి. కృష్ణుని పాదముల నభిషేకించిన జలమును తన తలపై జల్లుకొని, భార్య పిల్లల తలలపై జల్లెను. అత్తరు గంధములను, ఆమ్రఫలమును సమర్పించెను. తులసీదళములు, కుశఘాసములు, సరస్సులో వికసించిన పద్మములతో కృష్ణుని పూజించెను. అతని పాదముల వద్ద కూర్చుని పదేపదే కృష్ణుని పాదపద్మములకు ప్రణమిల్లుచుండెను. కృష్ణుని పాదధూళిని శిరస్సుపై ధరించెను.

కొన్నిరోజులు శ్రుతదేవుని గృహములో గడిపిన తర్వాత కృష్ణుడు ద్వారకానగరమునకు తిరిగి వచ్చెను.

## 263 పరీక్షిత్తు సందేహము

పరీక్షిత్తునకొక సందేహము కలిగెను. తన సందేహమును తీర్చుమని శుకమహర్షిని కోరెను. పరీక్షిత్తు శుకునితో యిట్లనెను. ''మునివర్యా! భగవంతుని అనుగ్రహము, ఆయన అపారకృప, విరివిగానొసగు సంపద గురించి నీవు చెప్పినప్పటి నుండి నేనొక విషయము గమనించుచున్నాను. అసురులు, దేవతలు, మానవులు, ఒకే ఒక బ్రహ్మము అనేక రూపములను పూజించుట అందరును యెరిగినదే. ఇందు ఒక విషయము స్పష్టముగా తేటతెల్లమగుచున్నది. మహాదేవుడు, అనగా ఈశ్వరుడు, భౌతిక సంపదలను చివరకు స్వర్గమును కూడ వదలిపెట్టినట్లు వర్ణింతురు. అతడెట్టి ఆభరణములు ధరింపడు. స్మశానములో తరచుగా సంచరించు మహాదేవుడు పుర్రెల దండను మాత్రము ధరించును. మరియు పులి చర్మముగాని ఏనుగు చర్మముగాని ధరించునట్లు చెప్పుదురు. సర్పము అతని ఆభరణములు, స్మశానములో లభించు భస్మమును శరీరమంతటను పూసుకొనును. నిత్యము మంచుతో నిండిన కడుచల్లని యెత్తైన కఠినమగు కొండపై నివసించును. అతని సేవకులు ప్రమథగణములు. ఐశ్వర్యమును సూచించు చిహ్నము లేవియు అతనివద్ద లేవనుట స్పష్టము.

''నారాయణుడు అన్ని విధముల మహాదేవునికి వ్యతిరేకముగా నున్నట్లు వర్ణింతురు. ఐశ్వర్యదేవత లక్ష్మీదేవి నారాయణుని భార్య. పసుపువచ్చని పట్టువస్త్రములు ధరించును. అతని చెవులకు బంగారు కుండలములు, వక్షస్థలమున కౌస్తుభమణి గలవు. శరీరమునకు గంధము పూసుకుని, విలువైన వజ్రములతో పొదిగిన కిరీటము ధరించును. చివరకు అతని చేతి యందుండే ఖడ్గమున ధనుస్సున కూడ బంగారము, విలువైన మణులు పొదిగి యున్నవి.

''అయినప్పటికిని, మునివర్యా! మహాదేవుని యిష్టదైవముగా యెంచి పూజించువారు సకలైశ్వర్యములు

పొందుచున్నారు. స్వప్నములో నైన ఊహించలేని భౌతిక సంపదలను పొంది అనుభవించుచున్నారు. కాగా, నారాయణుని యిష్టదైవముగా యె రాజించువారు యెప్పుడును దరిద్రులుగా నుంటున్నారు. ఇతరులవలె వారికి ఐశ్వర్యము లభించుటలేదు. పైగా వారి జీవితము యెప్పుడును దుఃఖముతో, బాధతో నిండియుండును దీనికి కారణమేమిటో తెలియచెప్పుము. మహాదేవుడు, నారాయణుడు వారి భక్తులకు ప్రసాదించునవి, వారికున్నవని వర్ణించిన వానికి భిన్నముగా నుంటున్నవి. నాయీ సందేహమును దయచేసి తీర్చవలెను''

శుకమహర్షి యిట్లు సమాధాన మొసగెను. ''నీవు అడిగిన ప్రశ్న సందర్భోచితముగా నున్నది నాకు చేతనైనంతవరకు నీ సందేహము తీర్చుటకు యత్నించెదను మానవుడు తాను భగవంతుని పూజించినదానికి పొందే ఫలితము అతనికున్న బ్రహ్మ జ్ఞానముపై ఆధారపడియుండును. సత్యము సంపూర్ణముగా నెరుగకుండిన పుడు, అతడు యిష్టదైవము నెంచుకొనును. బ్రహ్మము నిరాకారము నిర్గుణము అనునది పరమసత్యము అయినప్పటికిని బ్రహ్మము త్రిగుణములతో చేరినపుడు, ఆయా గుణములను బట్టి వేర్వేరు నామములతో తెలియవచ్చుచున్నది. ఏదో ఒక గుణముతో చేరి రూపనామములు కలిగిన బ్రహ్మమును మానవుడు తన యిష్టదైవముగా యెంచి దానిని పూజించి కోరికలు తీర్చుకొనుచున్నాడు

త్రిగుణములు త్రిమూర్తుల స్వరూపముగా చెప్పుదురు సృష్టికర్త బ్రహ్మ రజో గుణమునకును, మహాదే వుడు తమోగుణమునకును, నారాయణుడు సత్త్వగుణమునకును ప్రతిరూపములు త్రిగుణములే యీ విశ్వమునకు మూలాధారము. అయితే పరబ్రహ్మమును వర్ణించుటకు సరియైన పదములు లేనందున, ముందు చెప్పిన నిర్వచనములు వ్యవహారములోనికి వచ్చినవి

''ఏదో ఒక గుణముతో కూడి బ్రహ్మము రూపము దాల్చినపుడు, అందుకు సరిపోవు నామముతో పిలుచుచున్నారు మహాదేవుడు, శివుడు, లేక శంకరుడు అను నామములు అహంతత్త్వమునకు, అనగా మాయతో కూడిన అహంకు చిహ్నము అతడు మూడు రూపములు ధరించునని చెప్పుదురు మొదటి రూపము శుద్ధతమోగుణముతో కూడినది. రెండవరూపము రజోగుణముతోకూడిన తమోగుణము, మూడ వవది సత్త్వగుణముతో కూడిన తమోగుణము. అనగా, మహాదేవుడు యెప్పుడును గుణములు కలిగినవాడు.

''అహం తత్త్వమందు మూడు శక్తులున్నవి ఒకటి వైకారికము, అనగా రాజసము, రెండవది తైజసము, అనగా సాత్వికము. మూడవది శుద్ధ తామసము. అహంతత్త్వము యొక్క యీ మూడు రూపముల నుండి పదహారు వికారము లేర్పడుచున్నవి ఇవి · అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు పంచభూతములు, మనస్సు తక్కువ జ్ఞానము కలిగిన మానవుడు, యేదేని గుణముతో కూడిన బ్రహ్మము రూపమును పూజించిన అతనికోరికలు త్వరలోనే ఫలించును

''నారాయణుడు త్రిగుణరహితుడని చెప్పుదురు. అతనికెట్టి ఉపాధులు లేవు. అతడు పరమపురుషుడు. ప్రకృతికి భిన్నమైనవాడు. పురుషుడే ప్రకృతిగా ప్రకటించుచుందురు. అన్నింటిని ప్రకాశింపజేయు ప్రకాశమే నారాయణుడు. అతని ప్రతిరూపమైన యీ విశ్వమునకు అతడే సాక్షి

''ఈ విధముగా నారాయణుని తెలుసుకొని నారాయణునిపై భక్తికుదుర్చుకొనిన మానవుడు గుణరహితుడ గును అనగా అటువంటి మానవునకు కోరిక లుండవు. ఐశ్వర్యమున్నను, లేకపోయినను ఒకటే వారికి సమబుద్ధి, ప్రశాంతత లభించును

''అశ్వమేధ యాగానంతరము, నీ పూర్వుడైన యుధిష్ఠిరుడు యిదే ప్రశ్నను కృష్ణునడిగెను. అతనికి కృష్ణుడిట్లు సమాధానమిచ్చెను. 'ఎవరికైనను నేను మెచ్చుకొని వారికి తగిన ప్రతిఫలము నివ్వదలచినపుడు వారి ఐశ్వర్యమును తీసుకొందును ఐశ్వర్యము అనిత్యము, తాత్కాలికమని యెంచి అతడు దానిని వదలిపెట్టి, నన్ను చేరుట కువ్విళ్లూరును అయితే, కర్మలలో చిక్కుకుని, శక్తిమంతమైన కర్మ బంధములను త్రెంచుకొన లేక, లౌకిక విషయానుబంధములలో తగుల్కొని నిస్పృహ చెందును. అటువంటి మానవునకు నా అనుగ్రహము పేదరికము రూపము దాల్చును. అతని భౌతిక సంపదలను నేను హరింతును ఒకసారి పేదవాడైనచో, అతడు విశేషముగా బాధచెందును పేదవానిని బంధువులు, స్నేహితులు కూడ వదలివేయుదురు. తనపై ఆధారపడిన వారిని సంతృప్తి పరచుటకు అతడు ధనము ఐశ్వర్యము సంపాదించుటకు ప్రయత్నించి నప్పటికివి, నా అనుగ్రహముచేత అతని ప్రయత్నములు నిష్ఫలము కాగా, అట్టి ఆలోచనలను అతడు మనసు నుండి పారద్రోలును అతని అనుబంధము అంతరించగా, భౌతిక వస్తువులను సంపాదించవలెనను కోరికను వదలిపెట్టును ఆ విధముగా విరక్తి పెంచుకొనిన అతని మనస్సు పరిశుద్ధమై, నాయందు భక్తి పెంచుకొనిన సత్పురుషులవైపు మరలును

'' 'యుధిష్ఠిరా! అయినప్పటికిని కొందరు, వారి ఐశ్వర్యమును హరించినప్పటికిని గుణములతో కూడిన దేవతలను పూజించుటచేత తిరిగి అట్టివారు తాము కోరిన వానిని పొందెదరు దేవతలు వారికి సంపదను ప్రసాదించుటచేత వారిలో గర్వము అహంకారము పెరిగి, ఐశ్వర్య సంపదలను ప్రసాదించిన దేవతలను విస్మరించుటేగాక, వారి కవమానము గూడ కలిగింతురు

'' 'బ్రహ్మ, మహాదేవుడు, నారాయణుడు భక్తులు కోరిన దానిని ప్రసాదించుటలో దిట్టలు వారు మానవుని నాశముకూడ చేయగలరు బ్రహ్మ, మహాదేవుడు మానవుల కోరికలను త్వరితముగా తీర్చెదరు వారిని సులభముగా మెప్పించవచ్చు కాని నారాయణుని మెప్పించుట సులభముకాదు

'' 'నీకు వృకుడనే అసురుని వృత్తాంతము చెప్పెదను. ఒకసారి దుష్టబుద్ధి కలిగిన వృకుడు నారదుని సమీపించి యిట్లడిగెను ''త్రిమూర్తులలో యెవరిని సులభముగా మెప్పించవచ్చును సులభముగా మెచ్చుకొను వారిని మాత్రమే నేను ప్రార్థింపదలచినాను''

'' 'నారదుడిట్లు జవాబిచ్చెను ''నీవంటి వారి పూజలను మహాదేవుడు అతిసులభముగా మెచ్చుకొనును. అతడు తరుచుగా యిట్లు మెచ్చుకొనును రావణుడు మహాదేవుని భక్తులలో ఒకడు, బాణాసురుడు మరొక భక్తుడు మహాదేవునియందు అత్యంత భక్తి కలవారగుటచేత వారు అధిక సంపదను శక్తిని సంపాదించిరి. నీవు కూడ సులభముగా మెప్పించగలవు''.

'' 'మహాదేవుని నుండి వరములు పొందిన, యీ భక్తులు తర్వాత అనుభవించిన బాధలను ఉద్దేశ్యపూర్వకముగానే నారదుడు వృకునికి వివరించకుండెను' ''

# 264 వృకుని వృత్తాంతము

''పవిత్రమైన కేదార క్షేత్రమునకు వెళ్ళి అచట కేదారేశ్వరుడను నామముతో మహాదేవుని వృకుడు పూజించుచుండెను వృకుడు తన శరీరములోని మాంసము నర్పించి, తన యిష్టదైవమును ప్రార్థించెను. ఒక అగ్నిగుండ మేర్పరచి, అందు తన శరీరము నుండి ముక్కలుగా కోసిన మాంసమును వేసి మహాదేవుని కర్పణము గావించెను ఈ విధముగా యేడు దినములు తన శరీరములోని మాంసము త్యాగము చేసి మహాదేవుని పూజించెను ఎనిమిదవ దినమున మహాదేవుడు యింకను ప్రత్యక్షము కానందుకు, విస్పృహ చెందెను మహాదేవు నభిషేకించిన జలమును తన తలపై పెట్టుకుని, కత్తితీసి, మునుపు రావణుడు చేసినట్లుగా, తన తలను నరకివేయుట కుద్యమించెను

''అగ్నిగుండము నుండి మహాదేవు డావిర్భవించి, వృకుని రెండుచేతులు పట్టుకొనెను మహాదేవుని దివ్య స్పర్శచేత వృకుని శరీరము తిరిగి పరిపూర్ణముగా యేర్పడెను ఏమి కావలెనో కోరుకొమ్మని మహాదేవుడు వృకునడిగెను వృకుడు తన కోరికనిట్లు తెలియజేసెను -'చాల కాలము నుండి నాకు ఒకే ఒక కోరిక గలదు నేను యెవరి తలపై చేయి పెట్టిన అతడు తక్షణమే మరణించవలెను'

''మహాదేవుడు, అతని తెలివితక్కువ కోరికను ఆమోదించి ప్రసాదించెను''

''తరువాత వృకు డిట్లనెను. 'నీవు నాకు ప్రసాదించిన వరము శక్తిని పరీక్షింపదలచినాను. ఇపుడు నీ తలను నేను స్పృశించెదను'

''మహాదేవుడు ఆ స్థలము విడిచి కైలాస పర్వతములోని తన స్వగృహమువైపు పరుగెత్తి పోవలసి వచ్చెను వృకాసురుడు మహాదేవుని తరుముచుండెను అతడు అన్ని లోకములను — నాగ, గంధర్వ, దేవలోకములు — దాటి పోవుచుండెను చివరకు నారాయణుని నివాసమైన వైకుంఠలోకము చేరుకొనెను

''అసురుడు వచ్చుచుండుట నారాయణుడు గమనించెను. అతడు మహాదేవుని వెంబడించుచున్నాడని గ్రహించెను తన యోగమాయచేత నారాయణుడు ఒక యువ బ్రహ్మచారి రూపము ధరించెను నడుము చుట్టును మౌంజి, కృష్ణాజినము కట్టిన పవిత్ర యజ్ఞోపవీతమును ధరించెను. మరియు మెడలో జపమాల, చేతిలో అశ్వత్థవృక్షపు కర్ర యున్నవి. ఇదివరలో వామనుని చూడనివారికి ప్రీతి గలిగించునట్లు తిరిగి అట్టి రూపము దాల్చెను.

''అతడు వృకుని యెదుర్కొని యిట్లనెను. 'వృకా! నీవు బాగుగా అలసిపోయినట్లున్నావు నిన్ను వేధించుచున్న సమస్య యేమిటి? కొంచెము సేపు విశ్రాంతి తీసుకుని, నీవు యేమి చేయుటవలన యింతగా అలసిపోయినావో, నీ ముఖము విచారముగా నుండుటకు కారణమేమిటో తెలియజెప్పుము నేను నీకు సహాయపడగలనని భావించినచో, నీకు తగిన సహాయము చేసెదను. నీ అమాయకత్వము, తేలికగా మోసపోయే స్వభావము చూచి నాకు జాలి కలుగుచున్నది ఈ లోకములో, తన శక్తిమేరకు తోటివారికి సహాయము చేయుటకు మించినదిలేదు'

''అత్యంత తేజస్సుతో ప్రకాశించుచున్న యువ బ్రహ్మచారి మధుర వాక్కులకు వృకుడు ముగ్ధుడయ్యెను

వృకుడు ఆ బాలునితో తాను చేసిన త్యాగము, మహాదేవుడు తనకు ప్రసాదించిన వరము వివరించి చెప్పెను అతడిట్లనెను. 'ప్రసాదించిన వరము పనిచేయుచున్నదో లేదోయని పరీక్షింప దలచినాను కాని మహాదేవుడు తప్పించుకుని పారిపోయెను అతనిని వెదకుచున్నాను'.

''బ్రహ్మచారి రూపములో నున్న నారాయణుడు నవ్వి యిట్లనెను 'నిజముగా నీవు చాల తెలివితక్కువ వాడవు. నిన్ను చూచిన క్షణము నుండి, అతి తేలికగా నమ్మేవాడవని గ్రహించినాను మహాదేవుని మాటలను యెన్నడును నమ్మకూడదని నీకు తెలియదా?''

''వృకుడు నిర్ఘాంతపోయెను. వృకు డిట్లడిగెను. 'నీవు చెప్పునదేమి? రావణునకు, బాణునకు వరములను ప్రసాదించినది మహాదేవుడు కాదా? నారదుడు నాకా విధముగా చెప్పెను అతడు అబద్ధము చెప్పలేదు'

''నారాయణ డిట్లనెను 'ఆ విషయము నాకు తెలియదు కాని, దక్షప్రజాపతి మహాదేవుని గౌరవించి ఆదరించలేదు అతని యందు యెక్కువ నమ్మకము లేదు. అతడు నిన్ను తప్పించుకుని యెందుకు పారిపోయెనో తెలుసునా? అతడు నీకు భయపడికాదు. అతడు ప్రసాదించిన వరము అసత్యమని నీవు తెలుసుకొనుట అతనికి యిష్టము లేకపోవుటచేత అట్లు పారిపోయినాడు'

''వృకుడు కంగారుపడిన ముఖముతో మాట్లాడక నిలుచుండెను నారాయణుడిట్లనెను 'సరే, నా మాట వినుము అతని మాటలు సత్యమగునో కాదో చూచుటకు నీ చేతిని నీ తలపై పెట్టుము. నీ కేమియు ప్రమాదము కలుగుబోదు. నా మాట నమ్ము. తర్వాత మన మిద్దరము కలసి మహాదేవుని వెదకి పట్టుకుని, యెందుకీ విధముగా చేసితివని నిలదీసి అడుగుదము'

''యువ బ్రహ్మచారి సరళమైన స్వరముతో పలికిన మృదుమధుర వాక్కులకు వృకుడు ముగ్ధుడై ఆలోచనాశక్తిని కోల్పోయెను తాను యేమి చేయుచున్నాడో గ్రహించక మునుపే తన చేతిని తన తలపై పెట్టుకొనెను. మరు క్షణమే తల రెండు ముక్కలై నిర్జీవముగా నేలపై బడెను ఆకాశము దేవతల హర్షధ్వానము లతో దద్దరిల్లెను తరువాత నారాయణుడు మహాదేవుని వద్దకువెళ్ళి యిట్లనెను 'అనేక పాపములు చేసిన యీ పాపాత్ముడు నశించినాడు సత్పురుషుల నవమానించిన వానికెన్నడును మంచి కలుగబోదు అటువంట పుడు, నిన్ను అవమానించిన వాని గురించి నేను వేరే చెప్పవలయునా?'' ''

## 265 ముగ్గురిలో ఉత్తముడు

ఒకసారి సరస్వతీ నది ఒడ్డున భృగుమహర్షి అధ్వర్యములో చేయుచుండిరి. నారదు డచటకు వచ్చి వారినిట్లడిగెను ''మీరు యిపుడు యెవరిని అర్చించుచున్నారు?''

''ఎవరి కొరకు మీరు సమర్పణము చేయుచున్నారు? త్రిమూర్తులలో యెవరికొరకు?''

''వారిలో ఉత్తమునికి'' అని భృగుమహర్షి పలికెను

వారి మనస్సులలో సందేహ బీజము నాటి నారదు డచటినుండి వెడలిపోయెను.; త్రిమూర్తుల గుణములను ఋషులు చర్చించి, చివరకు త్రిమూర్తులను స్వయముగా భృగుడు కలుసుకొన్న పిదప వారిలో ఉత్తముని నిర్ణయించుటకు నిశ్చయించిరి

భృగుమహర్షి మొదట సత్యలోకమునకు వెళ్ళెను అచట నుండు బ్రహ్మదేవుని నిజతత్త్వమును పరీక్షించుటకు వెళ్ళుటచేత, భృగుమహర్షి బ్రహ్మకు ప్రణమిల్లుటగాని స్తుతించుటగాని చేయకుండెను. తనకు తగిన గౌరవ మర్యాదలు చూపలేదని బ్రహ్మ భృగుమహర్షిపై ఆగ్రహము చెందెను. భృగుమహర్షి తన కుమారుడగుట చేత, పెల్లుబికి వచ్చుచున్న ఆగ్రహమును అతి కష్టము మీద నిగ్రహించుకొనెను. జరిగినది గమనించి, మారుమాటాడక భృగుమహర్షి ఆ ప్రదేశము వదలి మహాదేవుని నివాసస్థానమైన కైలాసమునకు వెళ్ళెను

మహాదేవుడు తన ఆసనము నుండి లేచి భృగుమహర్షి నాహ్వానించి యిట్లు పలికెను ''నీవు నాకు సోదరుడవు. నీకు స్వాగతము''. మహాదేవుని నిజతత్త్వమును పరీక్షించుటకు వచ్చుటచేత, మహాదేవుడు తన్ను ఆదరపూర్వకముగా కౌగిలించుకొనుటకు చేయు యత్నముల నుండి తప్పించుకుని యిట్లు పలికెను ''నీవు తప్పు మార్గము ననుసరించుచున్నావు'' ఆ మాటలకు మహాదేవుడు క్రోధావిష్టుడై, త్రిశూలమునెత్తి భృగుమహర్షిని సంహరించుటకు తలపడెను. ఇంతలో పార్వతీదేవి అడ్డుపడి మహాదేవుని సముదాయించెను

అటు తర్వాత భృగుమహర్షి కైలాసము నుండి వైకుంఠమునకు వెళ్ళెను అచట లక్ష్మీదేవి ఒడిలో నారాయణుడు విశ్రమించుచున్న దృశ్యమును భృగుమహర్షి చూచెను భృగుమహర్షి తన పాదముతో నారాయణుని వక్షస్థలముపై తన్నెను నారాయణుడు వెంటనే లేచి భృగుమహర్షి పాదములపై బడి యిట్లనెను ''నీకు స్వాగతము ఈ ఆసనము స్వీకరించి నన్నను గ్రహించుము నిన్ను ద్వారము వద్ద ఆహ్వానించలేకపోయినందుకు క్షమించవలెను ప్రభూ! కఠినమైన నా వక్షస్థలము తాకిన నీ పాదమునకు బాధ కలిగియుండవచ్చు పాదముల నభిషేకించి ఆ తీర్థమును తలపై జల్లుకుని పునీతుడ నగుటకు అనుజ్ఞ నిమ్ము''. నారాయణుని మాటలను విన్న భృగుమహర్షి అతని ఉదాత్త గుణమును గ్రహించెను ఆనందముతో అతని శరీరము పులకరించెను త్రిమూర్తులలో ఉత్తముడెవరో యిప్పుడు తెలుసుకొనెను

## 266 అర్జునుడు ప్రమాణము చేయుట

ద్వారకలో ఒకప్పుడు దురదృష్టవంతుడైన బ్రాహ్మణు డొకడు గలడు అతని పుత్రుడు పుట్టిన వెంటనే మరణించెను ఆ బ్రాహ్మణుడు మిక్కిలి దుఃఖించెను ఇట్టి దౌర్భాగ్య సంఘటనకు గురియైన ఆ బ్రాహ్మణుని మనస్సు అల్లకల్లోలముగా నుండెను తన దౌర్భాగ్యస్థితికి, ఆ దేశపు రాజును నిందింపజొచ్చెను మరణించిన తన కుమారుని శరీరమును రాజ సౌధమునకు తీసుకుపోయి ద్వారము వద్ద వదలిపెట్టి యిట్లనెను ''ఈ దేశపురాజు పాపాత్ముడగుటచేత నా పుత్రుడు మరణించెను అతడు నావంటి బ్రాహ్మణులను ద్వేషించు చుండవచ్చు ఇతరులను మోసపుచ్చు స్వభావము కలిగియుండవచ్చు భౌతిక సుఖములలో ఓలలాడుచుండ వచ్చు అట్లు కళంకితుడైన క్షత్రియుడు యీ దేశమును పాలించుటచేత, నావంటి వానికీ దౌర్భాగ్యస్థితి కల్గినది'' అంతటితో ఆ బ్రాహ్మణుడు ఆగలేదు అతడు మరల యిట్లనెను ''ఇతరులకు బాధ కలిగించు

రాజు పరిపాలనలో మున్న ప్రజలము మేము. ఈ రాజు ఇంద్రియములను నిగ్రహించుకొనలేని అసమర్థుడు, మరియు దుశ్శీలుడు''.

ఆ బ్రాహ్మణునకు రెండవ కుమారుడు జన్మించెను. జన్మించిన మరుక్షణమే అతడు మరణించెను. తిరిగి బ్రాహ్మణుడు రాజును దూషించి నిందించసాగెను. ఇట్లు తొమ్మిది పర్యాయములు జరిగెను తొమ్మిది మంది పుత్రులు పుట్టిన వెంటనే మరణించిరి. ఇది అందరకును బాధగా నుండెను

తొమ్మిదవ శిశువు మరణించినపుడు ఆ శిశువు మృతదేహమును తన చేతులలో తీసుకుని రాజసౌధ ద్వారము వద్ద నిలబడి రాజును నిందించుచున్న సమయములో అర్జునుడు ద్వారకలో నుండుట తటస్థించెను. బ్రాహ్మణుని నిందా వాక్యములు విని, అర్జును డిట్లనెను. ''ఓ బ్రాహ్మణోత్తమా! నీవు నివసించుచున్న ప్రదేశములో విలుకాడు యెవరును లేరా! నిన్ను రక్షించు క్షత్రియు డెవడును లేడా? నీవు యేల అవిరామముగ అనవసరముగా దుఃఖించుచున్నావు? యాదవు లందరును యిచటగలరు. యజ్ఞయాగములు జరిపించుటకు బ్రాహ్మణులు యెక్కువ అర్హత గలవారు. భార్యను, బిడ్డలను, సంపదను పోగొట్టుకుని విచారించు బ్రాహ్మణు లున్న దేశము క్షత్రియుల పాలనలో లేదని తెలియుచున్నది. పరిపాలించు ప్రభువు, నటునివలె, రాజువేషము ధరించుచున్నాడు తప్ప నిజమైన క్షత్రియుడు కాడు. క్షత్రియుడనగా బాధితులను రక్షించువాడని యర్థము క్షత్రియులు తమ పేరుకు తగినట్టుగా నడచుకొనవలెను నీ పుత్రుని నేను రక్షించెదను నేను మాట యిచ్చుచున్నాను నేను మాట నిలబెట్టుకొనకపోయినచో, అగ్నిలో ప్రవేశించి నా పాపములన్నియు క్షాళనము గావించుకొందును''

కొంతవరకు బ్రాహ్మణుడు తన దుఃఖము దిగమ్రింగుకుని యిట్లనెను. ''ఇది గొప్ప మహా పురుషులు నివసించు ద్వారక. బలరాముడు, కృష్ణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడేగాక సాత్యకి, కృతవర్మ మున్నగు వారెందరో గొప్పవారు గలరు. వారెవరును నాకు యేమియు చేయలేకపోయిరి. వారికి సాధ్యము కానిది నీకెట్లు సాధ్యమగును నీవు తెలివితక్కువగా మాట్లాడుచున్నావు నీ మాటలు నేను విశ్వసించలేను''.

అర్జునుడిట్లనెను. ''నేను బలరాముడనుకాను, ఒప్పుకొంటాను. కృష్ణుడ నంతకంటెను కాను, అతని కుమారుడైన ప్రద్యుమ్నుడను గాను, అతని పుత్రుడైన అనిరుద్ధుడను గాను నేను అర్జునుడను, పాండవ మధ్యముడను. లోక ప్రఖ్యాతిపొందిన యీ గాండీవము నావద్ద కలదు నేను పేరుపొందిన విలుకాడను మహాదేవుని సైతము మెప్పించిన నా శక్తిని చులకనగా చూడకుము నేను యమధర్మరాజుతో పోరాడి నీ పుత్రుని తీసుకువచ్చెదను దీనిని నేను సాధించగలనని మాట యిచ్చుచున్నాను''

అర్జునుని దీర్ఘ సంభాషణ తర్వాత, అర్జునుని మాటలు విశ్వసింపదగినవని బ్రాహ్మణుడు భావించెను అతడు తేలికపడిన హృదయముతో యింటికి వెళ్ళెను తన భార్య శిశువును ప్రసవించు సమయము వచ్చుసరికి బ్రాహ్మణుడు ఆందోళన చెంది అర్జునుని వద్దకు వెళ్ళి యిట్లనెను ''దయచేసి నా శిశువును రక్షింపుము నీవు మాట యిచ్చినట్లుగా మృత్యువునుండి నా శిశువును కాపాడి రక్షింపుము''. అర్జునుడు శుద్ధ జలమును తీసుకుని ఆచమనము చేసి అత్యంత వినయముతో మహాదేవుని పూజించెను తరువాత తన గాండీవము తీసుకుని బ్రాహ్మణునితో వెళ్ళెను

ప్రసవవేదన పడుచున్న బ్రాహ్మణుని భార్య యున్న గదికివెళ్ళి, తన అస్త్రములతో ఆ గదిచుట్టు బోను

నౌకదానిని నిర్మించెను.

కొన్ని నిముషముల తర్వాత నూతనముగా జన్మించిన శిశువు రోదనము వినిపించెను. మరుక్షణమే ఆ శిశువు ఆకాశములోని కెగిరి అదృశ్యమయ్యెను. బ్రాహ్మణునికి అర్జునునిపై విపరీతమైన క్రోధము కలిగెను. ఆ క్రోధములో తన విచారమును కూడ మరిచి, అర్జునునితో యిట్లనెను. ''ఒక పిరికిపంద వదరుబోతు మాటలను నేను విశ్వసించక యుండవలసినది. ప్రద్యుమ్న అనిరుద్ధులు విఫలము కాగా, చివరకు బలరామకృష్ణులు కూడ యేమియు చేయలేని నిస్సహాయస్థితిలో నుండగా, యీ అర్జునునకెట్లు సాధ్యమగును? నేను తెలివితక్కువగా మూర్ఖుడనై, అసత్యమాడిన యీ అర్జునుని మాటలను యింతగా విశ్వసించితిని''.

బ్రాహ్మణుడు తన్ను తాను నిందించుకొనుచుండగా అర్జునుడు తన ఆయుధములను తీసుకుని, యోగమాయశక్తిచేత యముని నివాసమగు 'సంయమని'కి వెళ్ళెను. అక్కడ అర్జునునికి శిశువు కన్పించలేదు. అష్టదిక్కులను కాపాడే దేవతల గృహములకు వెళ్ళెను. అక్కడ కూడను శిశువు కన్పించలేదు. శిశువును తిరిగి ప్రాణములతో తీసుకు వచ్చుట అసాధ్యమని అర్జునునకు స్పష్టమయ్యెను. అతడు ద్వారకకు వచ్చి అగ్నితో చితి యేర్పరచెను. బ్రాహ్మణున కిచ్చిన మాటను నిలబెట్టుకొనలేక పోయినందుకు ఆ అగ్నిలో దూకి ఆత్మార్పణము గావింప నిశ్చయించుకొనెను.

కృష్ణుడు అడ్డుపడి ఆత్మాహుతి యెట్లు నిరర్థకమో సకారణముగా వివరించి నచ్చచెప్పెను. రహస్యముగా అర్జునునితో యిట్లనెను. ''ఈ బ్రాహ్మణుని పుత్రులను నీకు చూపెదను. నిన్ను నీవు అవమానించుకొనుట గాని, నిందించుకొనుటగాని, యెన్నడును చేయతగదు. ఇంతకాలముగా నన్ను నిందించుచున్న యీ బ్రాహ్మణుడు త్వరలో మనలను విశేషముగా పొగడగలడు''.

అర్జునుని తన రథములో కూర్చుండబెట్టుకుని కృష్ణుడు పశ్చిమదిక్కుగా వెళ్ళెను. వారు సప్తద్వీపములు, సప్తసముద్రములు దాటిరి. దీర్ఘ ప్రయాణానంతరము ఒక చీకటి ప్రదేశము వారు చేరుకొనిరి. కృష్ణుని నాలుగు అశ్వములు ముందు దారి కానలేక రథమును లాగలేక పోయెను. కృష్ణుడు తన చక్రమును చీకటిలోనికి విసిరెను. అపుడు సూర్యుని వెలుగుతో ఆ ప్రదేశము ప్రకాశించగా, అశ్వములు తిరిగి ముందుకు సాగిపోయెను. సుదర్శనచక్రము వెలుగును చూడలేక అర్జునుడు కనులు మూసుకొనెను.

అర్జునుడు కనులు విప్పిచూచుసరికి, తాము సముద్రములోని నీటిలో ప్రవేశించుచున్నామని గ్రహించెను. అలల మధ్యగా వారు ప్రయాణించి, సముద్రము అడుగు భాగమున అర్జునుడు ఒక నగరమును చూచెను. ఆ నగరమందు పెద్ద భవన మొకటి కలదు. ఆ నగరము పేరు మహాకాలపురము. అచట కృష్ణుడు అర్జునునకు అనంత సర్పము ఆదిశేషుని చూపించెను. మిక్కిలి పెద్దదైన ఆ సర్పమునకు వేయి తలలు కలవు. ఆ సర్పము తలలపై నున్న మణులు అనేక సూర్యుల ప్రకాశమును చిమ్ముచుండెను. ఆ సర్పము నేత్రములు యెర్రగా అన్నివైపుల మంటలు రేగుచున్నట్లుండెను. వెండికొండ యంత పెద్దగా నున్న సర్పము మెడ నాలుక నల్లగా నుండెను. ఆ దృశ్యము దిగ్భ్రాంతి కలిగించగా అర్జునుడు నిశ్చేష్టుడై చూచుచుండెను.

అతడు కనులెత్తి చూచెను. ఆదిశేషు డేర్పరచిన మెత్తని పరుపుపై నారాయణుడు విశ్రమించి యుండుట అర్జునుడు చూచెను. ఒక ప్రక్క శరీరము వణకుచుండగా, అర్జును డత్యంత ఆశ్చర్యముతో కృష్ణుడు నారాయణునికి నమస్కరించుట గమనించెను. తన వివేకశక్తిని తిరిగి పుంజుకున్న తర్వాత సంభ్రమముతో

అర్జునుడు నారాయణునికి నమస్కరించెను. ఆ విధముగా వారిరువురును పరమాత్ముని సమక్షములో నిలుచుండిరి. నారాయణుడు చిరునవ్వు నవ్వి వారితో యిట్లనెను. ''కృష్ణా! అర్జునా! మీరు యీ లోకములో ధర్మమును రక్షించుటకు జన్మించినారు. మీ యిరువురిలో నా అంశగలదు. మీరిరువురును నావద్దకు రావలెనని సంకల్పించితిని. అందుచేతనే ఆ బ్రాహ్మణుని పుత్రులను యిక్కడకు తెచ్చితిని. వారిని ఆ బ్రాహ్మణునకు అప్పజెప్పవచ్చును.

''మీరు త్వరలోనే యీ భూభారమును తగ్గించవలసి యున్నది. భూదేవి అనేకులు అసురరాజుల భారముతో సతమతమగుచున్నది. తరువాత మీరిరువును నావద్దకు రాగలరు. మీరు నర నారాయణులు. మీరు భౌతికమైన వాంఛలకు మాయకు అతీతులు, అయినను మానవ శ్రేయస్సుకొరకై మానవులుగా జన్మించినారు''.

మరొకసారి కృష్ణార్జునులు నారాయణునకు ప్రణామము చేసి బ్రాహ్మణుని పుత్రులను తోడ్కొని భూలోకమునకు తిరిగి వచ్చిరి.

తిరిగి వచ్చిన అర్జునుడు అనుభవముచే బాగా పరిణతి చెందెను. గాండీవము, అస్త్రములు మున్నగువాని శక్తులన్నియు కృష్ణుని అనుగ్రహము చేతనే లభించినవనియు, కృష్ణుడు లేకున్న అవి నిరర్ధకమనియు అర్జునుడు గ్రహించెను.

కృష్ణుడు యీ మానవ లోకములో సామాన్య మానవుని వలె సంచరించుచు, తన శక్తిసామర్ధ్యములను అపుడపుడు చూపుచు, తాను యీ భూమిపై అవతరించిన ప్రయోజనము సాధించుటకై వేచి యుండెను. ఇతరులవలె క్షత్రియ ధర్మములు నిర్వర్తించుచుండెను. దేవతలను పూజించుట, యజ్ఞయాగాదులు చేసి దేవతలను మెప్పించుట మున్నగు కర్మల నాచరించుచుండెను. యజ్ఞయాగాదుల చేత మెప్పుపొందిన నారాయణుడు తానేనని తెలిసినప్పటికిని కృష్ణుడు అందరు క్షత్రియులవలె యజ్ఞయాగాది క్రతువు లాచరించు చుండెను!

ఈ లోకములో మానవుడెట్లు సంచరించవలెనో, యే విధముగా ప్రవర్తించవలెనో, యెట్టి కర్మలు చేసిన మంచి కలుగునో బోధించుటకై తాను సాధారణ మానవుడుగా ఆచరించి చూపు చుండెను. కృష్ణుని కెట్టి కోరికలు లేనప్పటికిని, కర్మను విస్మరించలేదు. అతడు విస్మరించినట్లయిన, యితర మానవులు తామస ప్రవృత్తులై కర్తవ్యములను నిర్వర్తించక కర్మలకు దూరులగుదురు.

ఆ విధముగా కాలము గడచుచుండెను.

# ఏకాదశ స్కంధము

## 267 ఋషుల శాపము

ఈ భూమిపై జన్మించిన అసురులు ఒకరితర్వాత ఒకరు నిహతులగుచుండిరి. వారిలో చాల మంది అసురులను బృందావనములో నున్నపుడు కృష్ణుడు సంహరించగా, మరికొందరిని బలరాముడు సంహరించెను. మిగిలిన అసురులు హతము కావలసి యున్నది.

అయితే అంతకు ముందుగా వేరొకటి జరుగుటకు యేర్పాటు గావించవలసి యున్నది. భూదేవి, బ్రహ్మదేవుల విన్నపము మేరకు నారాయణుడు కృష్ణుడుగా అవతరించినపుడు, దేవతలను యాదవ కుటుంబములో తనకు బంధువులుగా జన్మించ వలసినదని అడిగెను. కృష్ణావతారము అంతముగులోపున, యాదవ వంశము పూర్తిగా నిర్మూలమగునట్లు చేయవలసి యున్నది. కాని వారు దేవతలగుటచేత, నిత్యము కృష్ణుని సహవాసములో చరించు మహద్భాగ్యము పొందిన వారగుటచేత, వారు యెవరిచేతను నిహతులగుటకు వీలు లేకుండెను. కృష్ణుడిట్లు తలచెను. ''జరుగనున్న యుద్ధము తర్వాత కూడ, అధికముగా నుండు యాదవ, అంధక, భోజ, వృష్ణి, దశార్హజనముచేత భూభారము యెక్కువగా నుండగలదు. వారు అజేయులు. మరియు, కలియుగ ప్రవేశముతో వారు ధర్మమును విడనాడి భూమికి బరువుగా నుందురు. అడవిలో వెదురుతోటలో, వెదురుచెట్ల రాపిడివలన ఉద్భవించు నగ్నిచేత దగ్ధమైనట్లు, నేనే వారి నాశనమునకు కారకుడను కావలెను. ఈ అవతారము చాలించుటకు ముందు అది నా తుది కర్తవ్యము''. దీనిని సాధించుటకు బ్రాహ్మణ శాపము ఉత్తమ మార్గమని కృష్ణుడు నిశ్చయించెను.

కృష్ణుడు కాలస్వరూపుడు. అతని సంకల్పము చేత, అనేక మంది ఋషులు పిండారకమను పవిత్ర స్థలమును సందర్శించుటకు నిశ్చయించిరి. వారిలో విశ్వామిత్రుడు, అసితుడు, కణ్వుడు, దుర్వాసుడు, భృగు, అంగిరసుడు, కశ్యపుడు, వామదేవుడు, అత్రి, వసిష్ఠుడు, నారదుడు గలరు. పిండారకక్షేత్రమునకు వెళ్లునపుడు, ద్వారకలో బలరామకృష్ణులను సందర్శించి, గమ్యమునకు ప్రయాణము కొనసాగించవలెనని తలంచిరి. ఆ ఋషులను కృష్ణుడు, యితర పెద్దలు ఆహ్వానించి గౌరవించిరి. కొంతకాలము అచట నుండవలసినదని ప్రార్థించగా ఋషులందు కంగీకరించిరి. రాజసౌధ ప్రాంగణములోని ఉద్యానవనము వారి వినియోగార్థము యేర్పాటుచేసిరి.

రాజసౌధములో అల్లరి చిల్లరిగా తిరుగు యువకులు బాలురు, ఋషులను ఆటపట్టించవలెనని తలచిరి. జాంబవతీ కృష్ణుల పుత్రుడైన సాంబునిచేత స్త్రీ వేషము ధరింపజేసిరి. స్త్రీ వేషములో నున్న సాంబుని ఋషులచెంతకు తీసుకువెళ్ళి, ఆ యువకులు వినయము నటించుచు వారి పాదములకు నమస్కరించి యిట్లడిగిరి. ''మీరు మాకొక సహాయము చేయగోరుచున్నాము. నల్లని నేత్రములతో నున్న యీమె గర్భవతి. తనకు కొడుకు లేక కూతురు జన్మించునాయని తెలుసుకొనుట కీమె కుతూహలముగా నున్నది. స్త్రీ సహజమైన సిగ్గుచేత ఆమె స్వయముగా మిమ్ము అడుగలేక, మమ్ముల నడుగుమని కోరినది''.

ఋషులు ఆ యువకులను సాంబుని చూచిరి వారు ఆగ్రహావిష్టులై యిట్లనిరి. ''ఈమెకు ఒక ముసలము పుట్టును అది మీ యాదవ వంశ నాశనమునకు కారణమగును''

ఋషుల మాటలను వినిన యాదవ యువకులు భయభ్రాంతులై యేమి చేయవలెనో తెలియకుండిరి. వారు ఆ తోట విడిచి పారిపోయి సాంబునికి కట్టిన చీరను తీసివేయగా, అందు ఒక ముసలము (యినుపదుక్క) వారికి కన్పడెను. ఏదో ఒకటి చేయవలసి యుండెను. ఆందోళన చెందిన మనస్సులతో నెమ్మదిగా అడుగులు వేయుచు పెద్దలందరు నున్న సభామందిరములో ప్రవేశించిరి సింహాసనము క్రింద ఆ ముసలము (యినుప దుక్క) నుంచి మౌనముగా వారు నిలుచుండిరి. భయాందోళనలతో నిండిన వారి ముఖములను జూచి కృష్ణుడు, మృదు స్వరముతో వారి ఉత్సాహము దిగజారుటకు కారణమేమని యడిగెను ఏదో తీవ్రమైన సంఘటన జరిగి యుండవచ్చు, లేకున్న వారా సమావేశమునకు వచ్చెడివారు కారు

కృష్ణుని మృదుస్వరము విని, కోల్పోయిన ఉత్సాహమును తిరిగి కొంత పుంజుకుని జరిగిన దంతయు విన్నవించిరి వారిపై బలరాముడు మండిపడెను. ముసలమును అరగదీసి పొడిగాచేసి సముద్రములో విసరివేయ మని వృద్ధరాజు ఉగ్రసేనుడు, బలరాముడు ఆజ్ఞాపించిరి ఆ విధముగా ఋషుల శాప ఫలమును నివారించవచ్చు నని భావించిరి

ముసలము నరగదీసి పొడిచేసి సముద్రములోనికి విసరివేసిరి. అందు ఒక పదునైన చిన్నముక్క మిగిలెను. దానిని చిన్నచిన్న ముక్కలుగా చేయుట అసాధ్యమయ్యెను ఆ చిన్నముక్కను కూడ సముద్రములో విసరివేసిరి ఆ తర్వాత యాదవు లందరును తేలికైన హృదయములతో నిశ్చింతగా నుండిరి హృదయము తేలికపడి ఊపిరిపీల్చుకున్న పిదప యువకుల చిలిపి చేష్టలను క్షమించగలిగిరి చిలిపి చేష్టలు బాలురకు సహజము గదా!

## 268 మహా సంగ్రామము

కాలము నిరవధికముగా సాగిపోవుచుండెను దురాశ, పుత్రవ్యామోహముతో నిండిన అంధరాజు ధృతరాష్ట్రుడు, జూదములో ఓడిరను నెపముతో పాండవులను అరణ్యావాసమునకు పంపెను. వారు అరణ్యములో పండ్రెండు సంవత్సరములు గడిపిరి తరువాత మరియొక సంవత్సరము అజ్ఞాతవాసము చేసిరి మత్స్యదేశపు రాజు విరాటుని కొలువులో అజ్ఞాతముగా ఒక సంవత్సరముండిరి నియమము ప్రకారము అరణ్య అజ్ఞాతవాస ములు పూర్తిచేసిన తరువాత, తమ రాజ్యమును తమకు తిరిగి యివ్వవలసినదని కౌరవ సోదరుల నడిగిరి.

యుధిష్ఠిరుని విన్నపమును దుర్యోధనుడు తిరస్కరించెను పెద్దలు పలువురు, పాండవుల రాజ్యమును వారికిచ్చివేయమని దుర్యోధనున కనేక విధములుగా నచ్చజెప్పజూచిరి. కాని దుర్యోధనుడు పెద్దల మాటలను లక్ష్యపెట్టలేదు. యుద్ధము ద్వారా సమస్య పరిష్కరించుటకు యుధిష్ఠిరునకు యిష్టము లేకుండెను అందుచే శాంతియుతముగా సమస్యను పరిష్కరించవలసినదని యుధిష్ఠిరుడు కృష్ణు నర్థించెను కృష్ణుని శక్తికి మించిన దేదియు లేదనియు, అతడు తలచుకొన్నచో యుద్ధమును నివారింపగలడనియు యుధిష్ఠిరుడు గాఢముగా విశ్వసించెను

ఏ యుద్ధమునైతే యుధిష్ఠిరుడు తప్పింప యత్నించుచున్నాడో, ఆ యుద్ధము ద్వారా భూభారమును తగ్గించుటకే కృష్ణుడవతరించిన విషయము యుధిష్ఠిరునకు తెలియదు. కృష్ణుడు రాయబారిగా శాంతిని సాధించుటకు హస్తినాపురము వెళ్ళెను. కాని ప్రయోజనము లేకపోయెను. యుద్ధము తప్పనందుకు యుధిష్ఠిరుడు మిక్కిలి విచారించెను.

కురుక్షేత్రమునందు సంగ్రామము జరుగుటకు నిర్ణయమయ్యెను. కౌరవుల ప్రతినిధిగా దుర్యోధనుడు, పాండవ ప్రతినిధిగా అర్జునుడు, యాదవుల — ముఖ్యముగా బలరామకృష్ణుల — సహాయము నర్థించుటకై ద్వారకకు వచ్చిరి. కృష్ణుడు వారికి రెండుమార్గములు సూచించెను. ఒక ప్రక్క యాదవసేన, మరొక ప్రక్క నిరాయుధుడుగా ఏకాకిగా తాను. ఈరెండింటిలో యేదో ఒకదానిని యెంచుకొనవచ్చునని వారితో కృష్ణుడు చెప్పెను. ఇద్దరిలో చిన్నవాడైన అర్జునుని ముందుగా యెంచుకొనమని కృష్ణుడు కోరెను. అర్జునుడు కృష్ణుని సహాయమును కోరెను. కృష్ణుడు అర్జునునకు రథసారథిగా నుండి సహాయము చేయుట కంగీకరించెను. యాదవ సేనా బలము కౌరవపక్షములో చేరుటకు నిర్ణయమయ్యెను.

బలరాముని ప్రియశిష్యుడైన దుర్యోధనుడు బలరాముని వద్దకు వెళ్ళి తన పక్షము వహించి సహాయము చేయమని కోరెను. బలరాముడు దుర్యోధనుని అభ్యర్థన విని యిట్లనెను. ''పాండవులు, నాకు మేనబావలు. మీలో యెవరో ఒకరి పక్షమున నుండుట నా కిష్టములేదు. కృష్ణుడు తెలివితక్కువగా పాండవ పక్షము వహించినాడు. నేనట్లు చేయను. అదియుకాక, కృష్ణుడు పాండవ పక్షమున నుండుటచే, నేను నీ పక్షము చేరి నా సోదరునితో యుద్ధము చేయుట నాకిష్టములేదు. అందుచే యుద్ధములో జోక్యము చేసుకొనక యుందును. నాకు నీపైనున్న అభిమానము నీకు బాగుగా తెలియును. దుర్యోధనా! ఇక వెళ్ళుము. నిజమైన క్షత్రియుని వలె వర్తింపుము''. దుర్యోధనునకు కొంత నిరాశ కలిగినప్పటికిని, యాదవసేన యంతయూ తన పక్షమున నుండగలదను సంతోషముతో ద్వారక నుండి బయలుదేరి వెళ్ళెను.

యుద్ధము జరుగుచున్నపుడు తాను ద్వారకలో నున్నయెడల తనకు మనశ్శాంతి యుండదని బలరాముడు భావించెను. అందుచే తీర్థయాత్రలకు వెళ్ళుచున్నానని అందరితో చెప్పెను.



పవిత్రమైన కురుక్షేత్రములో పదునెనిమిది రోజులు మహా సంగ్రామము జరిగెను. యుద్ధానంతరము చాల కొద్దిమంది మాత్రమే మిగిలిరి. గొప్పగొప్పరాజులు, సేనాధిపతులు, అతిరథులు, మహారథులు, విలుకాండ్రు, మహావీరులు, అందరును రక్తము ధారపోసిరి. ఉత్తమ రాజకుమారుల రక్తము ఆ ప్రదేశమున పార్లుచుండెను. ఉత్తమ వంశములలో జన్మించి గర్వోన్నతితో సంచరించిన రాజులందరును యిపుడు నేలపై ప్రాణములు గోల్పోయి పడియుండిరి. వారి భార్యలు వారి ప్రక్క రోదించుచుండిరి.



పాండవులు యీ లోకమునకు పరిపాలకులైరి. ఆ విధముగా తిరిగి యీ భూమిపై ధర్మమును ప్రతిష్ఠించిన తర్వాత చేయవలసిన కార్యమేదియు కృష్ణునకు మిగులలేదు. తన స్వస్థానమైన వైకుంఠమునకు తిరిగి చేరుకొను

సమయము కొరకు కృష్ణుడు యెదురు చూచుచుండెను.

## 269 బలరాముని తీర్థయాత్ర

బలరాముడు మొదట ప్రభాస తీర్థమునకు వెళ్ళెను. అచ్చటనుండి ఉత్తరదిశగా సరస్వతీ తీర్థమునకు వెళ్ళెను. తరువాత బిందుసరస్సు, సుదర్శన, శక్ర తీర్థములను సందర్శించెను. తూర్పుదిక్కుగా ప్రవహించు చున్న సరస్వతిలో మరియొకసారి స్నానము చేసెను. యమునను గంగ ఉపనదులను సందర్శించి అందు స్నానమాచరించెను. అటుపిమ్మట ఋషులు యజ్ఞము సలుపుచున్న పవిత్ర నైమిశము చేరుకొనెను.

ఆదిశేషుని అవతారమని గ్రహించిన ఋషులు బలరాముని గౌరవాభిమానములతో సాదరముగా ఆహ్వానించిరి. వారి అభినందనలను స్వీకరించి ఆసీనుడయ్యెను. వ్యాసుని శిష్యుడగు రోమహర్షణుని జూచెను. బలరాముడు ఆశ్రమములో ప్రవేశించినపుడు, అతడొకడే తగిన గౌరవాదరములు చూపించక యుండెను. రోమహర్షణుడు సూతుడగుటచేత, అతని అర్హతకు మించిన స్థానములో కూర్చుని యుండుట జూచిన బలరామునకు ఆగ్రహము కలిగెను. బలరాముడు తనలో తానిట్లు తలపోసెను. ''ఇచట బ్రాహ్మణులందరును సమావేశమై అతిథులుగా వచ్చిన క్షత్రియులకు గౌరవము చూపుదురు. కాని జన్మచేత బ్రాహ్మణ క్షత్రియుల కన్న అధముడైన యీ సూతుడు నన్ను అవమానించినాడు. ఇతడు వ్యాసుని శిష్యుడు, కావున ధర్మశాస్త్రము లందు నిష్ణాతుడని తలచవచ్చు. అయినప్పటికిని, ప్రాథమిక మర్యాదలు కూడ తెలియని వానివలె గోచరించుచు న్నాడు. ఇతడు జీవించుటకు అనర్హుడు'' అని తలచిన బలరాముడు కుశఘాసముతో రోమహర్షణుని సంహరించెను.

ఊహించని బలరాముని చర్యకు ఋషులు దిగ్భ్రాంతి చెందిరి. జరుగరానిది జరిగినందుకు వారు చాల విచారించి యిట్లనిరి. ''బలరామా! నీవు చేసినది తప్పు. ఈ రోమహర్షణునకు మేము బ్రహ్మ పీఠము ప్రసాదించినాము. ఈ యజ్ఞాంతము వరకు అతనికి దీర్ఘాయువు, మంచి ఆరోగ్యము నుండవలసినది. వేదేతిహాస పురాణములను క్షుణ్ణముగా నభ్యసించి పఠించువాడు బ్రాహ్మణునితో సరిసమానుడని చెప్పుదురు. అతడు గురు పీఠము నధిష్ఠించి యుండుటచేత నీవు ప్రవేశించినపుడు అతడు లేచి నిలబడలేదు. నీవు గావించిన యీ అకృత్యమునకు బ్రహ్మహత్యాపాతకము చుట్టుకొనును.

''నీవు, నీ సోదరుడు కృష్ణుడు యే ప్రయోజనము కొరకు యీ భూమిపై జన్మించితిరో మాకు తెలుసును. కాని మానవాళికి సరియైన ప్రవర్తనా మార్గము చూపుటకై పాప పరిహారమునకు తగిన చర్య గావించవలసి యున్నది''. బలరాముడు మిక్కిలి పశ్చాత్తాపముతో ఋషులతో నిట్లు పలికెను. ''అట్లే చేసెదను. ఏమి చేయవలెనో సెలవీయుడు. ఆ విధముగా చేసెదను. రోమహర్షణుడు యింకెంత కాలము జీవించవలసి యున్నదో తెలుపుడు. నా యోగశక్తిచేత అతడు పునరుజ్జీవితుడగునట్లు చేయగలను''.

ఋషులు బలరామునితో నిట్లనిరి. ''నీ అస్త్రము, నీ ధైర్య సాహసములు వృధా కారాదు. మరణించిన వారు పునరుజ్జీవితులగుట లోక న్యాయము కాదు. ఈ న్యాయమును నీవు కూడ పాటించవలసి యున్నది. అయితే మేము అతనికి ప్రసాదించిన దీర్ఘాయువు, మంచి ఆరోగ్యము కూడ అసత్యము కారాదు. ఈ రెండింటిని

సమన్వయపరచు మార్గము నీవే కనుగొనవలసి యున్నది''. బలరాముడు ఒక క్షణ మాలోచించి యిట్లనెను. ''తండ్రి శరీరము పుత్రుని రూపములో జన్మించునని వేదములు చెప్పుచున్నవి. కాబట్టి అతని కుమారుడైన ఉగ్రశ్రవునకు తండ్రి గుణములన్నియు అలవడుగాక

''ఇపుడు నేనేమి చేయవలెనో అనతీయుడు ఒక బ్రాహ్మణుని హత్య గావించినందుకు, అందుకు తగిన పాప పరిహారమును మీ వంటివారు సూచించవలెను''. అందుకు ఋషులిట్లు పలికిరి. ''ప్రాచీన కాలములో ప్రఖ్యాతి పొందిన ఇల్వలునకు పల్వలుడను కుమారుడు గలడు. ఈ అసురుడు మాకు గొప్ప అవరోధముగా నుండెడివాడు ప్రతి పౌర్ణమి అమావాస్య దినములు వచ్చి మా యజ్ఞములను కలుషపరచు చుండెడివాడు. అతడు దుర్గంధభూయిష్ఠుడు అతనిని సంహరించి మాకు సేవ చేసినట్లయిన నీ బ్రహ్మహత్యా పాపము నివృత్తి యగును. తరువాత నీ తీర్థయాత్రను పన్నెండు మాసములు నిరాటంకముగా కొనసాగించవచ్చును''

పల్వలుని రాక కొరకు బలరాముడు వేచి యుండెను. అతని నాసిక నుండి వెలువడు దుర్గంధమును బట్టి అతడు వచ్చుచున్నాడని బలరాముడు గ్రహించెను. అంతకు ముందెన్నడును అటువంటి దుర్గంధము లేకుండెను కొంతసేపు బలరామునికి ఊపిరాడకుండెను. తర్వాత దుర్గంధపూరితమైన వస్తువులను యజ్ఞశాలపై అతి భయంకరముగా వర్షింపజేసెను. మరికొంతసేపటికి త్రిశూలము ధరించిన పల్వలుడనే అసురుడు గోచరించెను అతడు ఊహించలేనంత అనాకారిగా నుండెను. త్రిశూలము నెత్తి పల్వలుడు బలరామునిపైకి దూకెను బలరాముడు వెంటనే హలమును, ముసలమును తలచుకొనగా అవి చేతిలోనికి వచ్చెను. నాగలితో అసురుని భూమి మీదకు పట్టి లాగి, రోకలితో అతని తలపై కొట్టెను. అతని తల పగిలి రక్తము చిందగా, ఇంద్రుని వజ్రాయుధము చేత వ్రేటుబడిన పర్వతము వలె, నేల గూలెను

పల్వలుని బలరాముడు వధించిన దృశ్యము చూచి ఋషులు నిశ్చింతగా తేలికపడిన హృదయములతో సంతోషించిరి వృత్రాసురుని ఇంద్రుడు సంహరించినపుడు ఇంద్రుని మెచ్చుకున్నట్లుగా, ఋషులు బలరాముని మెచ్చుకొనిరి

ఋషుల వద్ద సెలవు తీసుకుని బలరాముడు దక్షిణ దిశగా వెళ్ళెను తీర్థములన్నియు సందర్శించిన తర్వాత అగస్త్యుని వద్దకు వెళ్ళి గౌరవపూర్వకముగా నమస్కారము లందజేసెను. అటు తర్వాత, మహా సంగ్రామము ముగిసి యుండునని తలచి, తిరిగి ఉత్తర దిశవైపు అడుగులు వేసి ప్రయాణము సాగించెను. మార్గము నందు భారత వర్షములోని రాజులందరును నిహతులైరని విని యుండుటచేత యుద్ధము ముగిసి యుండునని భావించెను

దుర్యోధనుడు, భీముడు గదా యుద్ధము చేయు సమయమునకు బలరాముడు అచట కేతెంచెను.

బలరాముడు వారిని సమీపించి యిట్లనెను. ''ప్రియ శిష్యులారా! ఈ గదా యుద్ధము మీరిరువురును నా వద్ద నేర్చుకొనిరి. మీరు, మీ యుద్ధ ప్రక్రియలు నాకు బాగుగా తెలుసును అన్ని విధముల మీరిరువురును సరిసమానులు భీమా! నీవు దుర్యోధనుని కన్న బలవంతుడవు దుర్యోధనా! నీవు బాగుగా శిక్షణ పొందినవాడవు కడు చురుకుగా నేర్పుగా కదలుటలో దిట్టవు మీలో యే ఒక్కరును రెండవ వారిని ఓడించలేరు ఈ యుద్ధమును యిక ఆపివేయండి''

దుర్యోధనుడు, భీముడు అనేక సంవత్సరముల నుండి ఒకరితో నొకరు పోరుట కెదురు చూచుచుండిరి. వారికున్న పరస్పర ద్వేషముచేత బలరాముని మాటలను వారు లక్ష్యపెట్టకుండిరి.

మానవుల యత్నము అన్నిటికన్న విధి బలవత్తరమైనదని బలరాముడు గ్రహించి, ద్వారకకు తిరిగి వచ్చెను

తిరిగి నైమిశారణ్యమునకు వెళ్ళి ఋషుల సహాయముతో అనేక యజ్ఞము లాచరించెను అచట శాంతి లభించుటచేత అనేక దినములు ఋషులతో గడపి తిరిగి ద్వారకా నగరము చేరెను.

## 270 దేవతలు ద్వారకను సందర్శించుట

బ్రహ్మదేవుడు తన పుత్రులైన సనక సనందాది ఋషులతోను, దేవతలు, ఇంద్రుడు, ప్రజాపతులు, మహాదేవునితోను కలసి ద్వారకను సందర్శించుటకు వచ్చెను వారందరును కృష్ణుని, కృష్ణమాయను చూచుటకు వచ్చిరి సాధారణ మానవమాత్రుడుగా బంధుమిత్రుల మధ్య సంచరించుచున్న కృష్ణుని దర్శించుటకు బ్రహ్మ, ఇంద్రుడు, ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, అశ్వినీ కుమారులు, ఏకాదశ రుద్రులు, విశ్వే దేవతలు, గంధర్వులు, అప్సరసలు, ఋషులు, యితర స్వర్గవాసులు ద్వారకా నగరమున కేతెంచిరి త్వరలోనే కృష్ణుడు మానవ రూపము విడువ నున్నాడని తెలుసుకుని దర్శించుటకు వచ్చిరి.

స్వర్గములోని పూలతోటల యందు పూసిన పుష్పములతో గట్టిన దండలు కృష్ణునికి వేసిరి పరమ దేవతా స్వరూపుడైన నారాయణుడుగా కృష్ణుని సంభోధించి స్తుతించిరి. అత్యుత్తమమైన పురుష సూక్తము పఠించి బ్రహ్మ కృష్ణుని స్తుతించెను తరువాత బ్రహ్మ యిట్లనెను ''ప్రభూ! ఒకసారి నీ వద్దకు వచ్చి భూదేవి భరించరానిదిగానున్న యీ భూ భారమును తగ్గించమని కోరినాము మా ప్రార్ధన మన్నించి, నీవు ముగ్ధమోహన రూపము ధరించి భూ భారము తగ్గించుటకు అవతరించినావు. తిరిగి యీ భూమిపై ధర్మమును నిలబెట్టిన నీ కీర్తి అష్ట దిక్కుల వ్యాపించెను నీ వంటి మణిపూసను పొందినందుకు యీ యదు వంశము గొప్ప అదృష్టము చేసుకున్నది.

''రాబోవు కలియుగమందు కృష్ణావతార గాథలు విని అతి సులభముగా తరించి మోక్షము నందుకొనగలరు. మానవాళిని రక్షించుట కవతరించిన కృష్ణుని తలచుకొన్నచో, యీ సంసారమను సముద్రమును అవలీలగా దాటగలరు

''నీవు యీ భూమిపై యెందుకవతరించితివో మేము నీకు చెప్పవలసిన పని లేదు. ఈ భూమిపై జన్మించి నూట యిరువది సంవత్సరములు గడచినది. నీవు అవతరించిన ప్రయోజనము నెరవేరినది. నీవు చేయదగు కార్యమేదియు మిగిలి యుండలేదు. బ్రాహ్మణ శాపముచేత యాదవ కులము కూడ నాశనమగుచు ఋషుల మాటలు సత్యమగుటకు సమయము రావలసి యున్నది. నీవు నీ నివాస స్థానమైన వైకుంఠమునకు వెళ్ళుము నీ సేవకులమైన మమ్ము రక్షింపుము''.

కృష్ణుడు వారందరివైపు చూచి యిట్లనెను ''మీరు నాకు చెప్పిన విషయము యిదివరకే నాకు తెలుసును నేను అపుడే నిశ్చయించుకున్నాను ఆనాడు మీరు నన్ను కోరిన కార్యమును నిర్వర్తించినాను భూ భారము

యిపుడు తగ్గినది. యాదవ కుటుంబము మద గర్వములతో పెచ్చు పెరిగి యున్నది సముద్రపు టలలను తీరము నిగ్రహించునట్లుగా, నేను వారిని అణచి నిగ్రహించుచున్నాను. రోజు రోజుకు వారి అహంకారము పెచ్చుపెరుగుచున్నది ఇపుడు నేను వారిని విడిచిపెట్టి వచ్చినట్లయిన వారి నదుపులో పెట్టువారెవరును ఉండరు. ఈ లోకమంతయు వారిచే నాశనమగును.

''బ్రాహ్మణ శాపము ఫలించు తరుణము త్వరలోనే రానున్నది కాలము పుటలలో ఆ అధ్యాయము కూడ చేరిన తర్వాత, నేను తిరిగి మీ వద్దకు వచ్చెదను''

బ్రహ్మ, మున్నగువారు మరొకసారి నమస్కరించి త్వరలోనే తమ వద్దకు రాగలడను తలంపుతో సంతోషముగా అక్కడ నుండి బయలుదేరి వెళ్ళిపోయిరి

అటు తర్వాత ద్వారకలో దుశ్శకునములు గోచరించెను స్వర్గ భూలోకములందు రాబోవు ముప్పును సూచించు సూచనలను జూచి ప్రజలు ఆందోళన చెందుచుండిరి

కృష్ణుడు ప్రజలను సమీకరించి వారితో యిట్లనెను ''ఈ దుశ్శకునములు భయంకరముగా గోచరించుచున్నవి. అన్నివైపుల అవి నాకు కనుపించుచున్నవి
నా వరకు నేను ఈ విషయములో యేదో ఒకటి చేయక యుండలేను ప్రాణములతో తప్పించుకొనవలెనన్నచో, మనము కొంతకాలము యీ ప్రదేశము విడిచి వెళ్ళవలెను ఇది పరలో వినిన కథ ఒకటి జ్ఞప్తికి వచ్చుచున్నది

''దక్షుడు తన కుమార్తెలు చంద్రుని కిచ్చి వివాహము జరిపిన దినములలో, చంద్రుడు రోహిణిపై పక్షపాతము చూపుచున్నాడని తన కుమార్తెలు ఫిర్యాదు చేయగా దక్ష ప్రజాపతి ఆగ్రహించెను ఆ ఆగ్రహములో చంద్రుని క్షయరోగ పీడితుడై క్షీణించునట్లుగా శాప మొసగెను. చంద్రుడు పవిత్ర ప్రభాస తీర్థమునకు వెళ్ళి తపస్సు చేసి ఈశ్వరుని మెప్పించెను. ఈశ్వరుడు మెచ్చుకుని దక్ష ప్రజాపతి శాపమును సవరించెను. అందు మూలముగా చంద్రుడు కొన్ని రోజులు వృద్ధి పొందుచు, కొన్ని రోజులు క్షీణించుచు, యెన్నడును సంపూర్ణత్వము లేక యుండును

''ఈ ప్రభాస తీర్థము ద్వారకకు చేరువలో నున్నది ఆలస్యము చేయక మనము అక్కడకు వెళ్లుదము ఆ పవిత్ర తీర్థములో స్నానము చేసి పునీతులమై, పితృ దేవతలకు తర్పణ మొసగుదము బ్రాహ్మణులను గౌరవించి కానుకల నిచ్చెదము పడవ సహాయముతో సముద్రమును దాటినట్లు, మనము యీ పాప సముద్రమును దాటుదము''

కృష్ణుని మాట శాసనము. వెంటనే యాదవులందరును ఊరేగింపుగా ఒకరి వెనుక నొకరు ప్రభాస తీర్థమునకు వెళ్లుటకు సన్నద్ధులైరి.

## 271 కృష్ణుడు, ఉద్ధవుడు

యాదవులందరిలో ఉద్ధవుడు యెప్పుడును కృష్ణునితో నుండుచు చేరువగా నుండెడివాడు. అతడు దుశ్శకునములు గాంచెను కృష్ణుని మాటలు వినెను. కృష్ణుని యేకాకిగా కలుసుకొను సమయము కొరకు వేచియుండెను తనతో మాత్రమే కృష్ణుడుండునట్లు కోరెను. ఒకసారి కృష్ణుడు యేకాకిగా నుండుట జూచి, కృష్ణుని పాదములపైబడి దృఢముగా పాద పద్మములను పట్టుకుని యిట్లనెను. ''కృష్ణా! యోగీశా! నీవు పరమ దైవస్వరూపుడవు. నీవు ఒక నిర్ణయమునకు వచ్చినావు నీవు యాదవ వంశమును నిర్మూలించి, తరువాత నీవు అవతారము చాలించనున్నావు. బ్రాహ్మణుల శాపమును నివారింపకుండుట జూచి నేను అప్పుడు ఊహించినాను నీవు సంకల్పించుకొన్నచో తప్పక నివారించి యుండెడివాడవు. నీవు నారాయణుడవు తలచుకొన్నచో మమ్ము రక్షింపలేకుండెడి వాడవా?

''నీవు యీ నిర్ణయమునకు వచ్చుటలో ఒక ప్రయోజనము ఉండి యుండవచ్చును ఇట్లు యెందుకు జరుగుచున్నదని నేను అడుగుట లేదు నిన్ను ఒక సహాయము — వరము, కోరదలచి వచ్చినాను''

''నీవు నన్ను యేమి అడుగదలచినావు''? అని ఉద్ధవుని చేతిని తన చేతిలోనికి తీసుకుని ప్రశ్నించెను ఉద్ధవుడు కృష్ణునికి మిక్కిలి ప్రియమైనవాడు

ఉద్ధవు డిట్లు పలికెను ''కృష్ణా! నిన్నును నీ సాన్నిహిత్యమును నేను కోరుచున్నాను ఇన్ని సంవత్సరము లుగా నేను నీతో నుండుచు వచ్చినాను. నిన్ను చూడని క్షణముగాని, నీతో సంభాషించని క్షణముగాని లేదు. నీవు నన్ను విడిచి వెళ్ళినట్లయిన, నేనేమి కావలెను? నీ పవిత్ర పాద పద్మములు విడిచి ఒక అరక్షణమైనను నుండలేను ఎల్లప్పుడును నీతో నుండు నేను, నీవు వెళ్ళిన తర్వాత ఒంటరిగా ఉండలేను. నీతో నన్ను తీసుకువెళ్ళుము ఆశీర్వదింపుము''

ఉద్ధవుడు హృదయావేగముతో కన్నీరు కార్చుచుండెను. ప్రేమపూరిత దృక్కులతో కృష్ణుడు ఉద్ధవుని జూచుచుండెను తన భక్తులు బాధపడుచుండుట జూచి కృష్ణుడు సహింపలేకపోయెడివాడు. భక్తులపై భగవంతునికున్న ప్రేమ, భార్య లక్ష్మిపై నున్న ప్రేమ కన్న మిన్న

అపారమైన కరుణతో ఉద్ధవుని చేతులను తన చేతులలోనికి తీసుకుని కృష్ణు డిట్లు పలికెను. ''యాదవ కుటుంబమును నాశనము గావించుటయే నా ప్రయోజనమని నీవు చెప్పిన విషయము సత్య దూరము కాదు. వారు తమ్ము తాము చంపుకొందురు. బ్రహ్మ, మహాదేవుడు, దేవతలు వచ్చి నా స్వస్థానమునకు తిరిగి వెళ్ళమని కోరిరి. చాల యేండ్ల క్రిందట, ఒకసారి బ్రహ్మ వచ్చి ప్రార్థించగా, ఆదిశేషునితో కలిసి నేను మానవ రూపము ధరించి, యీ భూమిపై తిరిగి ధర్మమును ప్రతిష్ఠించెదనని మాట యిచ్చితిని. నా మాటను నెరవేర్చితిని. ఇపుడిక నేను చేయవలసిన దేదియు లేదు నేను చేయవలసిన చివరి కార్యములు — యాదవ వంశ సంపూర్ణ నాశనము, సముద్రము పొంగి పొరలి ద్వారకలో ప్రవేశించుట — పూర్తి యగుటకు ఒక వారము దినములున్నది

''ఉద్ధవా! నేను యీ భూమిని విడచి వెళ్ళగనే దాని వైభవ మంతరించును కలి ప్రవేశించి అంతటను కలి ప్రభావము విస్తృతి జెందును

''నేను విడిచిపెట్టిన యీ లోకములో నీవు జీవించవలదు. కలియుగమునందు మానవులు పాప కార్యము లందు ఆనందము పొందెదరు. మిగిలిన నీ శేష జీవితమును యీ లోకమందు సంపూర్ణ వైరాగ్యముతో — బంధువులతో, నీకు దగ్గరగా నుండిన అతి ప్రియమైన ప్రతి ఒక్కరితో అనుబంధము విడిచిపెట్టి — గడపవలసియున్నది. నీ మనస్సును నాయందు, నాయందు మాత్రమే లగ్నము చేసి స్థిరముగా నుంచుము. జీవితము అంతమగు వరకు సమబుద్ధితో యీ మానవ లోకమందు మెలగుము.

''ఉద్ధవా! నీకొక విషయము చెప్పనిమ్ము. మాయను వర్ణించి చెప్పెదను. అపుడు నీవు మాయాజాలములో చిక్కుకొనక యెట్లు తప్పించుకొనవలెనో తెలుసుకొనగలవు. ఇంద్రియములు పనిచేయుచున్నంత కాలము బాహ్యలోక విషయములను గ్రహించుచుండును. కనులు దృశ్యములను చూచుచుండును, చెవులు శబ్దములను వినుచుండును, నాలుక రుచులను చవిచూచుచుండును. ఇదే విధముగా యితర యింద్రియములు కూడ వర్తించుచుండును. ఈ అనుభవములను 'మనోమయ' మందురు. ఇవి మనస్సునందు పుట్టుటచే అవి తాత్కాలికము. ఇదియే మాయ. భౌతిక విషయముల వెంట పరుగెత్తు మనస్సు ఇంద్రియములను ప్రేరేపించు చుండును. అపుడు భ్రమ అనునది కలుగును. ఈ భ్రమ నుండి 'గుణదోషము' పుట్టుచున్నది. ఆత్మ గుణములతో చేరి కలుషితమైన స్థితినే గుణదోషమందురు. ఈ గుణదోషముచేత సంసారమను సముద్రములో పడుచున్నాడు. సంసారమను ఊబి నుండి బయటపడుట అంత సులభము కాదు.

''కాబట్టి నీవు మనస్సును ఇంద్రియములను నిగ్రహించి ప్రమాదకర పరిస్థితులలో పడకుండ అరికట్టవలెను. నావద్ద యింతకాలముగా ఉంటున్న కారణముచేత, నిత్య బ్రహ్మచింతన మార్గమును తప్పి చరించవు''.

ఉద్ధవుడు విచారముతో తలనాడించి యిట్లనెను. ''లేదు, కృష్ణా! ఇది అంత సులభము కాదు. భౌతిక విషయముల నుండి ఇంద్రియముల నరికట్టి మనస్సు నిగ్రహించుట అసాధ్యము. ఎల్లప్పుడును నీయందు భక్తితో సంచరించిన 'నేను' యీ విధముగా భావించుచున్నపుడు, నీ యందు భక్తిలేని వారిమాట యేమి? ఇంద్రియముల నరికట్టి నిగ్రహించవలెనని నీవు చెప్పు పాఠము నేర్చుకొనుట చాల కష్టము, దాని నాచరించుట అంతకన్న కష్టము. 'నేను', 'నాది' అను ఘోర జాలములో చిక్కుకున్న నాకు, యీ బురదలో నుండి బయటపడి గట్టి నేలపై మానుకొని స్థిరముగా నిలుచుండుటకు, నీ సహాయము నా కత్యవసరము. దానిని నాకు తెలుపుము''
కృష్ణు డిట్లనెను. ''భౌతికానందములను చవిచూచి చివరకు సత్యమును గ్రహించిన చాలమంది, వారంతట వారే యింద్రియముల నరికట్టుకొనిరి. అందుకు వారు పదే పదే ప్రయత్నించి, చివరకు ఇంద్రియములను నిగ్రహించుటలో కృతకృత్యులైరి. మొదట ఇంద్రియములను, తరువాత మనసును నిగ్రహించుకొనగలిగిరి. వాసనా ప్రభావమును స్వప్రయత్నము చేతనే తుడిచివేసుకొనవచ్చును. వైరాగ్యమును సాధించుటకు యెవరి మనస్సును వారే నియంత్రించుకొనవలెను. మానవునికి విచక్షణా శక్తిలభించినది. దాని సహాయముతో సత్యము గ్రహించవలెను.

''సత్యాన్వేషకుడు రెండు విషయముల నెదుర్కొనును. అవి ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములు. ఇంద్రియముల ద్వారా గ్రహించునది ప్రత్యక్షము. మనస్సు ద్వారా గ్రహించునది అనుమానము. ఎటువంటి భయ సంకోచములు లేక చివరి వరకు అన్వేషణ సాగించు భయరహితులు సాంఖ్యము, యోగము, యీ రెండింటి యందు మహా నిష్ణాతులైన వారు కూడ నన్ను మాత్రమే దర్శించుటకు యత్నించెదరు. ఇంద్రియములచే గ్రహించు భౌతిక విషయములకు నేను భిన్నమను నిర్ణయమునకు మానవ మనస్సు రాగలదు.

మనస్సు ప్రకాశవంతమైనపుడు, ఇంద్రియములకు చైతన్యము కలుగును. కనులు చూడగలుగుట, చర్మము స్పర్శానుభవము పొందుట, చెవులు వినుట మున్నగునవి వాని యంతట నవియే జరుగట లేదు. వేరొక శక్తియుండుట వలన జరుగుచున్నవి. ఇది యెరుగుటయే 'అనుమాన' మని చెప్పుదురు. మనస్సు గ్రహించున దిదియే. అయితే 'ప్రత్యక్ష' మనునది మన చుట్టు నున్న బాహ్య ప్రపంచమందు సత్యముగా గోచరించుచున్నది. ఈ సత్యము నాధారముగా జేసుకుని ఊహను పెంపొందించు మనస్సు వలన 'అనుమాన'ము ఉద్భవించుచున్నది. కాని అనుమానము ప్రత్యక్షము యొక్క నిజ స్వభావమును తరచి గ్రహించును. ప్రత్యక్ష అనుమానములనే రెండింటితో విజ్ఞులు నన్ను గురించిన సత్యము తెలుసుకొందురు. దీనిని మరికొంత విపులముగా, కథా రూపముగా నీకు చెప్పెదను, సావధానముగా వినుము.

## 272 అవధూత గీత – 1

ఒకప్పుడు మా పూర్వుడైన యదువునకు దత్తాత్రేయ అవధూతకు మధ్య సంభాషణ జరిగెను. ఈ భూమిపై యదువు సంచరించుచున్నపుడు, శరీరముపై యెట్టి ఆచ్ఛాదన లేక నిర్భయముగా నడచుచున్న యువకుని కలుసుకొనెను. అతడు అవధూత యని యదువు గ్రహించెను. యదువు యువకుడైన అవధూతను పలకరించి యిట్లనెను.

''నీవు నిర్విచారముగా నున్నవానివలె గోచరించుచున్నావు. నీ ముఖము ప్రశాంతముగా నున్నది. ఆంతరంగిక శాంతి కలిగిన వారిలోనే యిటువంటి ప్రశాంతత గోచరించును. లోకములో మానవులు తాత్కాలికమైన ఇంద్రియ సుఖములు, సంపదలకొరకు పరుగులెత్తుదురు. అటువంటి మానవులకు భిన్నముగా నీవు కనపడుచున్నావు. అగ్నికి ఆహుతియైన అరణ్యమునుండి తప్పించుకొనిన ఏనుగు గంగానదిలో మునిగి యెటువంటి హాయి ననుభవించునో అట్టి హాయి నీ ముఖము నందు ప్రస్ఫుటమగుచున్నది. సామాన్య మానవులు ఆశించు భౌతిక విషయముల నభిలషించక, కోరికల అగ్ని నుండి తప్పించుకున్నావు. అంతరంగ మందు అనుభవించుచున్న ఆనందము నీ ప్రశాంత వదన మందు ప్రతిబింబించుచున్నది. ఈ స్థితిని నీవెట్లు చేరుకుంటివో, నీ కభ్యంతరము లేకున్నచో విశదీకరించి చెప్పగోరెదను?''

దత్తాత్రేయుడు యిట్లనెను. ''ఓ రాజా! అనేకములైన మూలముల నుండి నేను దీనిని సమకూర్చితిని. శాంతికై అన్వేషించుచు సంచరించుచున్నపుడు, సత్యమును తెలుసుకొనగోరి అనేకమంది గురువులను సందర్శించి, చివరకు గమ్యము చేరితిని. వాంఛలందు తగుల్కొనక యెట్లు జీవించవలెనో అభ్యసించిన విషయములు, ఏయే గురువులు ఆ విషయములను బోధించితిరో నీకు తెలిపెదను.

''నా గురువులు : భూమి, వాయువు, ఆకాశము, జలము, అగ్ని, చంద్రుడు, సూర్యుడు, పిచ్చుక, కొండచిలువ, సముద్రము, కీటకము, తుమ్మెద, గజము, హరిణము, మత్స్యము, పింగళ యను స్త్రీ, కురరమను ఉడుత, ఒక శిశువు, ఒక బాలిక, విలుకాడు, సర్పము, సాలెపురుగు, తన గూడును తానే నిర్మించుకొను మట్టిపురుగు. ఈ యిరువది నలుగురిని నా మనస్సు గురువులుగా యెన్నుకున్నది. వారి ప్రవర్తనను బట్టి నాకై నేను నా సత్యాన్వేషణ పురోగమించుటకు, అవసరమైన పాఠములను యెంచుకొన్నాను.

# 284 హంస అవతారము

కృష్ణుడు బోధించిన విషయముల నవగాహన చేసుకుని ఉద్ధవుడు సంతృప్తి చెందెను. తరువాత అతడు మరొక ప్రశ్నకు సమాధానము కోరెను. ఉద్ధవు డిట్లడిగెను. ''కృష్ణా! సామాన్య వివేకము గలిగిన మానవునకు ఇంద్రియముల కాసక్తి కలిగించే వస్తువులు ప్రమాదకరమని తెలిసినప్పటికిని వాని వెంట పరుగెత్తుచుండును. ఎందుచేత?'' కృష్ణు డిట్లనెను. ''ఉద్ధవా! నీ ప్రశ్న చాల సముచితముగా నున్నది. మానవునకు వివేక మున్నప్పటికిని, మమకార మను భయంకర రోగము అతనిని పీడించుచున్నది. అహంకారము అతనిలోని మంచి లక్షణములను మట్టుపెట్టును. ఈ అహంకారము మానవుని జీవితమును నడిపించునపుడు, అహంకారము అతని ప్రవర్తన తీరును నియమించునపుడు, ఒకప్పుడు సత్త్వ గుణముతో నిండిన అతని మనస్సు యిపుడు రజో గుణముచేత కలుషితమగుచున్నది. ఇది జరిగినపుడు మానవుడు తనకు తానిట్లు చెప్పుకొనును: 'ఈ సౌఖ్యమును నేననుభవించి తీరవలెను. దీనివలన నాకు సంతోషము, సుఖము కలుగును', అని అనేక విధములుగా భావించును. త్వరలోనే అతని కోరికలు ద్విగుణీకృతమగును. ఇంద్రియములను నిగ్రహించలేని అశక్తుడగును. అతనిలోని రజోగుణము తాను చేయు కర్మల పర్యవసానము తెలుసుకొనలేనంత గుడ్డి వానిని చేయును. హృదయాంతరాళములో తాను చేయునది తప్పు అని యెరుగును. అయినప్పటికిని అతి శక్తిమంతమైన ఇంద్రియముల ప్రభావమునకు లొంగిపోయి అశక్తుడగును.

అటువంటి దుర్భర పరిస్థితులలో నున్న మానవుని నేను రక్షించగలను, కాని అతడు నన్ను తలచవలెను. అటువంటి మానవుడు ప్రాణాయామము నేర్చుకొనుట మంచిది. మానవుడు అలసత్వము అనగా బద్ధకము విదిలించుకుని త్రికాల సంధ్యా సమయములందు, అనగా దినమునకు ముమ్మారు మనస్సును నాపై లగ్నము గావించవలెను. కొంత కాలమునకు మనసును నిగ్రహించగలిగి, పతనము చెందక, రక్షణ పొందును. ఈ పాఠమునే అనేక సంవత్సరములకు పూర్వము సనకాది సోదరులకు హంస రూపములో బోధించితిని''.

ఉద్ధవునిలో కుతూహలము యినుమడించెను. భగవంతుడు యే ప్రయోజనము కొరకు హంస రూపము ధరించి అవతరించెనో అతడు తెలుసుకొనగోరెను. అతని మనో భావమును గ్రహించిన కృష్ణు డిట్లు చెప్పసాగెను. ''బ్రహ్మకు మనస్సు నుండి నలుగురు పుత్రులు జన్మించిరి. వారే సనక సనంద నాదులు — మొత్తము నలుగురు. ఒకసారి వారు తండ్రి వద్దకు వెళ్ళి యేది అత్యుత్తమ యోగమని అడిగిరి. వారిట్లడిగిరి : 'తండ్రీ! సహజముగా మానవుని మనస్సు ఇంద్రియ ప్రేరణల ననుసరించును. కామక్రోధములను అరిషడ్వర్గము మానవుని వివేకమును వశము చేసుకుని దానిని మరుగు పరచుచున్నది. వస్తు ప్రపంచము నందు కలిగిన ఇంద్రియాను భవములు 'వాసనా' రూపములో మనస్సునందు ప్రవేశించుచున్నవి. ముముక్షువు, అనగా మోక్షము నపేక్షించువాడు యీ రెండింటి నెట్లు విడదీయగలడు? వస్తు ప్రపంచము నుండి ఇంద్రియముల నెట్లు ఉపసంహరించవలెను?' నా కోరికపై సృష్టికార్యమును నిర్వహించుచున్నప్పటికిని, నాకు జన్మించినప్పటికిని, బ్రహ్మ వారి ప్రశ్నకు సమాధానము చెప్పలేకపోయెను. దీనికి కారణము బ్రహ్మ కూడ కొంతవరకు కర్మ, దాని పర్యవసానమందు తగుల్కొని యుండుటయే. బ్రహ్మ నన్ను తలచుకొనగా, హంస రూపములో నేను అతని ముందు ప్రత్యక్షమయినాను. సనక సనందాది సోదరులును, బ్రహ్మయు నాకు సాష్టాంగ ప్రణామము చేసి యిట్లడిగిరి. 'నీవెవరై యుండవచ్చును?' నేనిట్లంటిని : 'విశ్వ వ్యాపకమైన శక్తి పరమాత్మ అఖండమైనదని యెరిగి యున్నపుడు మీరడిగిన ప్రశ్న యెట్లు ఉదయించగలదు? ఒకే ఒక బ్రహ్మము అందరిలో నివసించు

గమనించినచో, ఆకాశమందు యేమియు కనుపించని అమావాస్య రోజు మొదలు, సన్నని వెండిరేకువలె గోచరించు తృతీయ దినము వరకు చంద్రుడు మనకు కన్పించు తీరులో మార్పు గోచరించును. అప్పటి నుండి, ప్రతిదినము క్రమక్రమముగా వృద్ధి పొందుచు, చివరకు పౌర్ణమి దినమునాడు సంపూర్ణ వైభవముతో వెలుగొంది ప్రకాశించును. మరుచటి రోజునుండి, వైభవము క్రమక్రమేణ తగ్గి, చివరకు మనకు యేమాత్రము చంద్రుడు కన్పింపకుండును. ఈ విషయమును సరిగా గుర్తించినట్లయిన, చంద్రుని కళలని పేర్కొను యీ దశలు మార్పు చెందును. ఈ మార్పులను బట్టి చంద్రుడు వృద్ధి పొందుచున్నాడనియు, వృద్ధి ఆగినదనియు, తరువాత క్రమముగా క్షీణించి చివరకు అదృశ్యుడగుచున్నాడనియు భావించుచున్నాము. అదే రీతిగా శరీరము పుట్టుట, పెరుగుట, క్షీణించుట అనే దశలు పొందుచున్నది. ఈ దశలతో ఆత్మకు యెట్టి సంబంధము లేదు. మానవుడు పుట్టి, యువకుడుగా పెరిగి, నడివయస్సు, వార్ధక్య దశలు పొంది క్షీణించి చివరకు మరణించుచున్నాడు. ఈదశలన్నియు నిత్యమైన అనశ్వరమైన ఆత్మకు అన్వయించవు. బాలుడైన తర్వాత శైశవము, యుకుడైన తర్వాత బాల్యము, వృద్ధాప్యము తర్వాత యౌవనము, మరణించుచున్నవి. ఈ మార్పు లన్నియు శరీరము పొందుచున్నది. మార్పు చెందని ఆత్మ, శరీరము పొందు యీ దశలన్నిటి యందు మార్పులేక, వృద్ధి — క్షయము — వృద్ధి అను కళల ద్వారా చంద్రు డుంటున్నట్లుగా నున్నది.

''అగ్ని నుండి మంటలు నిర్విరామముగా పైకెగసినపుడు, వాని ప్రారంభము, అంతము యెవరికీ తెలియదు. రేణువులు అగ్నిలో దగ్ధమై మంటలను పుట్టించి ఆ మంటలలో కొంతసేపు మండి తుదకు నశించుచున్నవి. కాని నిశ్చలముగా కొనసాగు మంటలందు ఒకొక్క రేణువు పుట్టుక చావులను యెవరును గుర్తించలేరు. అనేక బిందువులు చేరి నదిగా ప్రవహించుచున్నవి. నదీ ప్రవాహము నిరంతరము. అన్నిటినీ గమ్యమువైపు నడిపించు కాలము, ఒకొక్క బిందువు కాలగతిని ప్రకటించుటలేదు. నదీ ప్రవాహము మాత్రమే గుర్తించుటకు వీలగును. అదే విధముగా, అనంతమైన యీ కాల ప్రవాహములో ఆత్మ అనేక శరీరములు ధరించును. ఒకొక్క శరీరము పుట్టి కొంత కాలమునకు నశించును. కాని ఆత్మ తన ప్రయాణమును యెట్టి అవాంతరములు లేక నిరంతరముగా సాగించుచుండును.

''సూర్యుడు తన కిరణములచేత నీటిని గ్రహించుచున్నాడు. తగిన సమయములో అవసరమై కోరినవారికి తిరిగి ఆ నీటిని అందజేయుచున్నాడు. ఒకరికి మంచి కలుగజేయవలెనను ఆకాంక్ష తప్ప, యెటువంటి స్వార్థమును లేదు. జ్ఞానవంతుడు, సూర్యుని వలె, నిస్స్వార్థుడు. ఇంద్రియములకు సంతోషము కలిగించు వస్తు ప్రపంచము నెడల విముఖత కలిగి యెట్టి అనుబంధము లేక యుండును. కాని జ్ఞానవంతులు సస్యసంపద మున్నగు వస్తువులను సమకూర్చి, యితరులకిచ్చి దాని వలన వారు లాభము పొందునట్లు చూచెదరు. సూర్యుని నుండి యీ పాఠమును నేను నేర్చితిని. మరియొక పాఠమును కూడ సూర్యుడు బోధించినాడు. వివిధ రకములైన ఆకారము గల పాత్రలందు లేక నేలపై పడిన నీటియందు, లేక నడచుచున్న గోవుల మూపురములపై సూర్యుని ప్రతిబింబమును చూచుచుందుము. అయితే ప్రతిబింబించు ఉపరితలములపై మనము చూచునది సూర్యుని ప్రతిబింబము మాత్రమే, సూర్యుడు కాదు. ఈ ప్రతిబింబములు వేర్వేరుగా నున్నప్పటికిని, ఒకే ఒక సూర్యుని నుండి యీ ప్రతిబింబము లేర్పడుచున్నవి. అదే రీతిగా, వేర్వేరు శరీరములందున్న ఆత్మ ఒకొక్కరిలో ఒకొక్క రీతిగా నున్నట్లు గోచరించును. కాని అందరిలో నున్న ఆత్మ ఒకటే యనునది సత్యము.

''ఏ వస్తువుపైగాని లేక యే వ్యక్తిపైగాని విశేషమైన అనురాగము బాధకు, దుఃఖమునకు దారితీయును.

పావురము నుండి నేను యీ పాఠమును గ్రహించితిని. ఒక మగ పావురము, ఆడ పావురము కలిసి ఒక చెట్టు చివర గూడు నిర్మించినవి. అవి రెండు పరస్పరానురాగముతో నుండెడివి. ఏ పనియైనను— ఆకాశములో యెగురునపుడు, మరియొక కొమ్మపై వ్రాలునపుడు, గూటిలో నున్నపుడు, ఆహారము నన్వేషించునపుడు, లేక భుజించునపుడు — ఆ పావురములు రెండును కలిసి చేయుచుండెడివి. ఎప్పుడైనను ఆడ పావురము యేదైన కోరినపుడు, దానిని తెచ్చి యిచ్చుటకు మగ పావురము శాయశక్తుల ప్రయత్నించుచుండెడిది. ఆ విధముగా చెట్టుపై గూటిలో హాయిగా జీవించుచుండెడివి.

''కొంత కాలమునకు గూటిలో ఆడ పావురము గుడ్లు పెట్టెను. గుడ్లు పొదగగా వాని నుండి చిన్న పావురములు ఆవిర్భవించెను. అవి చాల మృదువుగా లేతగా నుండెను. వాటిని పెంచి పోషించుటకు పెద్ద పావురములు రెండును తమ సమయము నంతను వెచ్చించుచు, అమితమైన ఆనందమును పొందుచుండెను. చిన్న పావురములు ఆటలు నేర్చి, కొంత కాలమునకు రెక్కలు రాగా, యెగురుటకు ప్రయత్నించుచు, పెద్ద పావురములకు సంతోషము చేకూర్చుచుండెను.

''ఒకసారి పెద్ద పావురములు రెండును పిల్లల కాహారము తెచ్చుటకై బయటకు వెళ్ళెను. అవి తిరిగి వచ్చిన తర్వాత, తమ పిల్లలు వేటగాని వలలో చిక్కుకొని పడియుండుట జూచెను. తల్లి పావురము దుఃఖములో మునిగిపోయెను. ఆ దుఃఖములో, తన పిల్లలతో కలిసి యుండవలెనను కోరికతో వేటగాని వలలోనికి దూకి అందులో చిక్కుకుపోయెను.

''మగ పావురము జరిగిన దంతయు గమనించి తన దౌర్భాగ్య స్థితికి బిగ్గరగా యేడ్వసాగెను. మగ పావురము యిట్లనెను. 'నాకు సర్వస్వము అయిన నా భార్య నన్ను విడిచిపోవుచున్నది. నా భార్యతో పిల్లలు గూడ పోవుచున్నారు. నేను వారికొరకే జీవించితిని. వారు లేని జీవితము నాకేల?' తన ప్రియ భార్య, పిల్లలు వేటగాని వల నుండి తప్పించుకొనుటకు చేసిన ప్రయత్నములు నిష్ఫల మగుట జూచి, తండ్రి పావురము కూడ దూకి వేటగాని వలలో చిక్కుకుపోయెను. వేటగాడు వచ్చి వలలో చిక్కిన పావురములతో హాయిగా తన యింటికి వెళ్ళెను.

''ఈ పావురమువలె, యెవరు తమకున్న ఆస్తిపాస్తులపై మనసు లగ్నము చేయుదురో, తనకు ప్రియమైన వారికి ప్రీతి కలిగించుటకు వస్తు ప్రపంచము నుండి నిర్విరామముగా సంపాదించుటకు కృషి సలుపుచుందురో, అట్టివారు యీ పావురమువలె, తమపై ఆధారపడిన వారితో కలిసి నాశనమగుదురు. ఈ మానవ జన్మ మోక్ష మార్గమునకు ద్వారము. ఈ విషయము గ్రహించక, భౌతిక వాంఛలందు మునిగినచో, పైకెక్కుటకు ప్రయత్నించి క్రిందపడిన వాని వలె అధోగతిపాలగుదురు.

## 273 అవధూత గీత - 2

''నిజముగా విరక్తి చెందిన మానవుడు ఇంద్రియ సుఖముల నన్వేషింపడు. అతడు అన్నిటి యందు ఉపేక్షా భావముతో నుండును. రుచిగా నున్నను లేకున్నను, చిన్నదైనను పెద్దదైనను, తన దగ్గరకు వచ్చిన దానిని భుజించే కొండచిలువ మాదిరిగా నుండును. కొండచిలువ యెన్నడును ఆహారము కొరకు తన దారిని విడిచి

పోదు. తన ఆకలిని తీర్చుకొనుటకు యెటువంటి ప్రత్యేకమైన ప్రయత్నము కూడ చేయదు. ఈ పాఠమును కొండచిలువ నేర్పినది. అదే మాదిరిగా, తనకు లభించిన దానితో సంతృప్తి జెంది, భౌతిక సుఖములవెంట పరుగిడకుండ నుండవలెను. ప్రతి దినమును తనకు ఆహారము లభించనిచో కొండచిలువ విచారించదు, ఓర్పుతో వేచి యుండును. ఆకలితో అనేక దినములు ఉండుట తన దౌర్భాగ్యమని కూడ తలంపదు. మానవుడు కూడ జీవితములో అనేకమైన సుఖానుభవములు తనకు ప్రాప్తించకుండినప్పటికిని ధైర్యముతో ఓర్పు వహించియుండవలెను. జ్ఞానవంతుడు తన వాంఛలను ఇంద్రియములను నిగ్రహించి అదుపులో నుంచుకొనుట నేర్వవలెను. అసలు వానిపై ధ్యాస లేకుండునంతగా నిగ్రహించవలెను! ఇంద్రియములు నిత్యము మెళకువగా నున్నప్పటికిని, మనస్సు చురుకుగా పనిచేయుచున్నప్పటికిని, శరీరము దృఢముగా నున్నప్పటికిని, మానవుడు తన నిగ్రహశక్తిచేత అవి నిద్రాణముగా నుండునట్లు చేయవలెను. నిద్రాణముగా నుండునట్లేగాక జడముగా నుండునట్లును అదుపు చేయవలెను. మోక్షము ప్రధాన ధ్యేయముగా నుండవలెను. అది తప్ప వేరు కోరిక లుండరాదు.

''జ్ఞానవంతుడు సముద్రము వలె గోచరించవలెను. బయటకు ప్రశాంతతను కనబరచుచు యెవరును గమనించలేని లోతైన హృదయము కలిగియుండవలెను. అనగా యెటువంటి దర్పము ప్రదర్శించక వినయము నమ్రత కలిగి యుండవలెను. ఇతరుల వలె హావ భావములు లేక వర్తించుటచేత, బుద్ధిమంతులు ప్రజానీకమునకు అతి సామాన్యులుగా కన్పించెదరు.

''కాని వారి ఆలోచనలు బాగుగా లోతైన వగుటచేత యెవరును అవగాహన చేసుకొనలేరు. ఆధ్యాత్మికముగా ఉన్నతులగుటచేత వారికెవరును అడ్డు తగులలేరు. స్థిర మనస్కులగుటచేత వారి మనస్సుల నెవరును చెరచలేరు. వారి సంకల్పములకు యెట్టివారు ఆఘాతము కల్పింపలేరు. అనగా ఇంద్రియములు, ఇంద్రియముల కాసక్తికరమైన విషయములు శక్తిని కోల్పోవుటచేత వారి మనస్సులను కలుషితపరచలేవు. వర్షకాలమందు పర్వతములపై కురిసిన వర్షపు నీరు హోరుమని శబ్దము చేయుచు క్రిందకు ప్రవహించును. కాని అదే వర్షపు నీరు సముద్రములో పడినపుడు యెటువంటి శబ్దము లేక యుండును. మరియు వేసవి కాలమందు, సముద్రములోనికి ప్రవహించు నదులలో నీరు యెండినపుడు, సముద్రము నీటి మట్టము యేమాత్రము తరగదు. అదే రీతిగా, వ్యామోహముల పట్టులో నున్నపుడు వాటిని పట్టించుకొనక, వాంఛలు తీరనపుడు కృంగక సంచరించవలెను.

''భగవంతుని మాయ మానవ రూపములో స్త్రీగా నిర్మితమైనది. అందుచే ఆమె యితరులను మోహావేశములను గావించును. వివేకము విచక్షణాశక్తి కోల్పోయిన మానవుడు ఆమె ఆకర్షణలకు లొంగి, దీపముతో ఆటలాడు కీటకము నాశనమైనట్లు నశించిపోవును. ఈ పాఠమును కీటకము నుండి గ్రహించితిని. అయిదు జ్ఞానేంద్రియములు చూచుట, ఆఘ్రాణించుట, స్పృశించుట, వినుట, రుచి చూచుట చేయుచున్నవి. జ్ఞానేంద్రియము కన్ను చేత కీటకము మోసపోయి నశించుచున్నది. మానవుడు కూడ అదే రీతిగా, తెలివితక్కువగా తన కన్నులచేత మోసపోవుచున్నాడు.

''ఈ శరీరమును పోషించుటకు అవసరమైన ఆహారమును మాత్రమే భుజింపవలెను. మరియు నెమ్మదిగా నమిలి మ్రింగవలెను. ఒకేసారి నోటి నిండుగా భుజించరాదు. తుమ్మెద పుష్పముల నుండి తేనెను సంగ్రహించును. అయితే పుష్పములలోని మకరందమునంతను ఒకేసారి అత్యాశతో గ్రహించదు. తనకు

అవసరమైనంత వరకే మకరందమును గ్రోలును. పుష్పము నుండి మకరందమును గ్రోలునపుడు పుష్పమున కెటువంటి హాని కలుగనీయక జాగ్రత్త వహించును అదే విధముగా నిజమైన సన్యాసి, గృహస్థులు యిచ్చిన దానిని తనకు సరిపడునంత వరకు మాత్రమే స్వీకరించవలెను గృహస్థులకు యెట్టి యిబ్బందియు కలుగనీయ రాదు. తుమ్మెద చిన్న పెద్ద అన్ని పుష్పముల నుండి మకరందమును గ్రహించునట్లుగా, మానవుడు అందరి నుండి, చిన్నవారు, పెద్దవారు అను భేదము లేక జ్ఞానమును సమకూర్చుకొనవలెను సకల శాస్త్రములు అధ్యయనము చేసి వాని సారమును గ్రహించవలెను.

''రేపటి కొరకు దాచుకొను మానవుడు నాశనము చెందగలడు. ఆహారమును సంపాదించిన సన్యాసి, అందుకొంత భాగమును వేరుగా అట్టిపెట్టరాదు. 'ఇది రాత్రి భుజించెదను', లేక 'రేపు భుజించెదను' అని తలచరాదు మానవుని చేతులు భిక్షాపాత్రయని, కడుపు ఆహారమును నిలువచేయు పాత్ర యని యెంచవలెను అట్లు చేయనిచో, తేనెటీగవలె దుఃఖమునకు గురియగును మానవుడు సంపాదించిన ధనమును తానమభవిం చక, యితరులకు దానము చేయక యుండినచో తేనెటీగవలె పతనము చెందును. తెలివి తక్కువ మానవుడు తనకంటె బలమైన వాడు మరొకడు, తాను సంపాదించిన ధనమును తీసుకొనునని గ్రహించడు తేనెపట్టును పెంచువాడు, తేనెటీగల శ్రమ ఫలితముగా తాను లాభము పొందినట్లు, తెలివితేటలు గల మానవుడు యితరులచేత పనిచేయించుకొని లాభము పొందు నేర్పు గలిగి యుండును.

''సన్యాసి కాలి బొటన వ్రేలుతో నైనను స్త్రీని — అది కర్రతో చేసిన బొమ్మ అయినను — తాకరాదు. అట్లు చేసినచో, ఆడ యేనుగును చూసి మగ యేనుగు గోతిలో పడినట్లు పడును

''ఇంద్రియముల కుద్రేకము కలిగించు సంగీతమును, అది కర్ణములకు శ్రావ్యముగా నున్నప్పటికిని సన్యాసులు వినరాదు. తనకు తెలియకనే, అతని మనస్సు అనేక ప్రలోభములకు వశమై, వలలో చిక్కుకున్న లేడివలె, భ్రాంతుల వలలో చిక్కుకొనును ఎవ్వరును దీని నుండి తప్పించుకొనలేరు. విభాండకుడను గొప్ప ఋషికి ఋష్యశృంగుడను కుమారుడు గలడు. పుత్రుడు, లేడివలె, అమాయకుడుగా పెరుగునట్లు పెంచి పోషించెను అంతటి అమాయకుడు కూడ సంగీత నాట్యముల ప్రలోభమునకు లొంగి తండ్రికి దూరమయ్యెను.

''ఎరగా చూపించు మాంసపుముక్క ప్రలోభములో పడిన చేప సునాయాసముగా పట్టుబడుచున్నది. మానవుడు జిహ్వాచాపల్యము నరికట్టుకొనవలెను చాల తక్కువగా భుజింపవలెనను పాఠమును మొదట నేర్వవలెను అన్ని యింద్రియములను నిగ్రహించగలుగు జ్ఞానవంతులకు కూడ జిహ్వ నరికట్టుట కష్టసాధ్యము ఆకలి లేనపుడు కూడ అన్నము గురించి ఆలోచించుట జిహ్వాచాపల్య లక్షణము ఆత్మ నిగ్రహముతో పూర్తిగా జిహ్వాచాపల్యమును నశింపజేసినవాడే నిజమైన జితేంద్రియుడని చెప్పవచ్చును.

''ఇంద్రియముల పైశాచిక తత్త్వమును, తుమ్మెద, ఏనుగు, చేప, కీటకము అనాది కాలము నుండి స్పష్టపరచుచున్నవి పుష్పముల సువాసనలకు మరులుగొని కీటకము నశించుచున్నది అనగా పుష్ప సువాసనలను గ్రహించు నాసిక దాని పతనమునకు కారణమగుచున్నది ఆడ యేనుగు స్పర్శ మాత్రము చేత మగ యేనుగు గోతిలోనికి కూలుచున్నది. శబ్దమును విను కర్ణములకు లేడి బలి యగుచున్నది నేలపై నోటి నానించి సింహము చేయు గర్జన విని, ఆ శబ్దము యే దిక్కునుండి వచ్చుచున్నదో తెలియక, లేడి సింహమున్న దిక్కువైపు వెళ్ళి సింహముచేత చచ్చుచున్నది. చేప రుచి ప్రలోభమునకు వశమగుచున్నది ఎరగా అందించిన మాంసపుముక్క రుచి చూసి జాలరి వలలో పడుచున్నది. కన్ను ద్వారా మంటను చూచి,

కీటకము మంటలో ఆహుతి యగుచున్నది. ఏదో ఒక ఇంద్రియ శక్తికి మాత్రమే వశమై పోయినవారు సంపూర్ణముగా నాశనమగుచున్నపుడు, పంచేంద్రియ శక్తులకు అన్నివైపుల నుండి వశమై, నిగ్రహించుకొను శక్తి లేని మానవుని సంగతి యేమని చెప్పగలము? ఎల్లపుడును — విశ్రించు స్థితిలోగాని జాగ్రత్ స్థితిలోగాని — మెలకువలేని మానవుడు పతనము చెంది నాశనమగును.

''ఒకప్పుడు విదేహ దేశములో పింగళ యను నర్తకి గలదు. పురుషులకు సంతోషము చేకూర్చి వారిచ్చిన ధనముతో జీవించుట ఆమె వృత్తి.

''ఒకరాత్రి,తన వృత్తికి ప్రధానమైన వస్త్రాలంకరణను కడు జాగ్రత్తతో చేసుకొనెను. అంతేకాక అలవాటు ప్రకారము పురుషుల నాకర్షించి యింటికి ఆహ్వానించుటకై వీధి ద్వారము వద్ద వీధిలో వచ్చుపోవు వారిని చూచుచు నిలుచుండెను ఆమెకు ధనము కావలసి యున్నది. అందుచేత తన యింటికి వచ్చి సంతృప్తిచెంది, తన్ను ధనికురాలిని చేయు ధనికుని కొరకు వెదకుచుండెను చాలసేపు ఆమె వేచి యుండెను కాని యెవరును రాలేదు. ఆమె యింటి లోపలకు వెళ్లుచు, మరికొంత సేపటికి తిరిగి ద్వారము వద్దకు వచ్చుచుండెను ఎవరైనను ఆమెను చూచి యింటిలోనికి వచ్చెదరేమోయని యెదురు చూచుచుండెను ఆ విధముగా సగము రాత్రి గడచిపోయెను పింగళ చాల విచారముగా నుండెను ఆమె నిరాశ చెందెను క్రోధము నిస్పృహ మిళితమైన ఆమె నేత్రములు అశ్రువులతో నిండెను

''అకస్మాత్తుగా తనపై తనకు విసుగు గలిగెను. ఆమెలో ఉత్తమ ఆలోచనలు కలుగుట మొదలుపెట్టెను ఆమె యిట్లనుకొనెను. 'ఆత్మ యేకాకి తత్త్వమును గుర్తించని మానవుడు యెందుకును పనికిరాడు భార్య, పిల్లలు, గృహము, సంపద మున్నగు వానిపై నున్న ప్రేమను వదలిపెట్టలేడు స్వశరీరముపై నున్న ప్రేమను కూడ అతడు త్యజించలేడు. నన్నేచూడు! దుష్ట మార్గములందు సంచరించు మనస్సును యెన్నడును అరికట్టలేకపోతిని. పురుష సంపర్క సౌఖ్యము నభిలషించి, తెలివితక్కువగా మొండిదాననై భగవంతుని విడనాడితిని నేనెంత తెలివితక్కువ దానను. నా యందున్న భగవంతుడు, యెప్పుడును నావాడే. అతడు మోక్షము ప్రసాదించగలడు నాయందే యున్న భగవంతుని ఉపేక్షించి గుడ్డిదానిగా, చెవిటిదానిగా మెలగితిని ఇంత కాలమూ నేను తాత్కాలిక శారీరక సౌఖ్యము నందించు మానవుల నన్వేషించుచుంటిని క్షణకాలము నిలుచు సందేహాస్పదమైన యీ సౌఖ్యము కొరకు, బాధ విచారములతో కూడిన దుర్భర పరిస్థితికి లోనై, అనంతమైన అవమానములు భరించి, భగవంతుని మరచి సంచరించితిని. వెదురు బద్దలతో వదులుగా నిర్మించిన గృహము వలె, పలుచని చర్మముతో కప్పిన రక్తము నీరు యెముకలతో కూడిన యీ దేహమును సంతృప్తి పరచుటకు భగవంతు నుపేక్షించితిని అయినప్పటికిని అసహ్యకరమైన యీ శరీరమను గూడులో భగవంతు డుండుట అతని అపార కరుణకు నిదర్శనము

''ఇకముందు తెలివితక్కువగా వ్యవహరించను కొంత కాలమునకు నశించు ప్రాపంచిక విషయములను యికముందు తలంచను. నేనిపుడు కనులు తెరచుట, నేను భగవంతుని యింతకాలము మరచినప్పటికిని అతడు నన్ను మరువలేదనుటకు నిదర్శనము నాకు కలిగిన కష్టములు భగవంతుని అనుగ్రహము ఆశీస్సులు తప్ప వేరు కాదు లేకున్నచో నేను తిరిగి సరియైన మార్గమునకు యెన్నడును వచ్చి యుండెడిదానను కాను'

''ఆ విధముగా గత కాలములో తాను తెలివి తక్కువగా వ్యవహరించిన విషయము గ్రహించిన పింగళ, కోరిక లన్నిటిని విసర్జించి, భగవంతునిపై తప్ప యింకే విషయముపై మనసు లగ్నము చేయకూడదని

నిశ్చయించుకుని ప్రక్క మీద వాలెను.

''ఆమె వలెనే, భౌతిక విషయములను వదలిపెట్టి భగవంతునిపై మనసు లగ్నము చేయవలెను. శాంతిని పొందుట కిదియే మార్గము. మానవుడు తనకు లభించిన వస్తువుపై అనురాగము పెంచుకొనినపుడు, ఆ వస్తువు అతని దుఃఖమునకు కారణమగును. దానిని వదలిపెట్టినపుడు సుఖము పొందును. 'కురరము' అను ఉడుత నాకీ పాఠము బోధించినది. ఈ అల్ప జీవి వద్ద, ఒక మాంసపు ముక్క గలదు. తనకంటె పెద్దవి బలమైన పక్షులు చుట్టు చేరి 'కురరము'ను పొడుచుచుండెను. మాంసపు ముక్కను పట్టుకున్న 'కురరము' చుట్టును చేరిన పక్షులు తన్ను వేధించుచుండగా కొంతసేపు భరించెను. కాని యిక యేమాత్రము భరించలేని స్థితి కలిగినపుడు మాంసపు ముక్కను విడిచిపెట్టెను. వెంటనే మరుక్షణమందు, యింతవరకు తనను వేధించుచు చుట్టును చేరిన పక్షులు 'కురరము'ను వదలిపెట్టిపోయెను. శాంతి లభించిన కురరము నిశ్చింతగా తన దారిన తాను పోయెను.

''నాకు ఆస్తిపాస్తులు లేవు. ఒకరి పొగడ్తలకు పొంగను, దూషణలకు క్రుంగను. నా అనురాగము నాశించే భార్య గాని పిల్లలుగాని లేరు. లౌకిక బంధము లేవియు లేవను ఆలోచనతో నేను హాయిగా ఉండగలుగుచున్నాను. అందుచేతనే నేను సంతోషముగా, ప్రశాంతతతో నున్నట్లు గోచరించుచున్నాను.

## 274 అవధూత గీత – 3

''ఒక బాలిక నాకు నేర్పిన పాఠమును నీకిపుడు చెప్పెదను. ఒక బాలిక తన యింట యేకాకిగా నుండెను. ఆమె తల్లితండ్రులు పొరుగూరికి వెళ్ళి మరుచటి రోజు రావలసి యుండెను. ఆమె యేకాకిగా నున్న సమయములో అకస్మాత్తుగా ఆ యింటికి అతిథులు రాగా, వారి నామె ఆదరించి గౌరవించవలసి వచ్చెను. ఇంటిలో దంపిన బియ్యము సిద్ధముగా లేకపోయెను. ఆ బాలిక పెరటిలోనికి వెళ్ళి వడ్లుదినుసులను దంపి పిండి చేయుటకు ఉపక్రమించెను. అతిథులకు తెలియకుండ రహస్యముగా చేయుటకు యత్నించుచుండెను. కాని ఆమె చేతికున్న గాజులు దంపునపుడు ముందుకు జారి గలగలమని శబ్దము చేయుచు, ఆమె రహస్యముగా చేయతలపెట్టిన కార్యము బహిర్గతము చేసి వారి పేదరికము ప్రకటించు నట్లుండెను.

''ఆమె చాలవరకు వడ్లుదినుసులను దంపి పిండి చేయజొచ్చెను. చెరి ఒక చేతికి రెండే రెండు గాజులతో ఆమె దంపుట కొనసాగించెను. అయినప్పటికిని అవి కొద్దిగా శబ్దము చేయుచుండెను. అపుడామె చేతికున్న రెండు గాజులలో ఒక గాజు తీసి బ్రద్దలు చేసెను. ఒకే ఒక గాజు యెటువంటి శబ్దము చేయకపోవుటతో, ఆమె నిశ్శబ్దముగా తన కార్యమును పూర్తిచేయగలిగెను.

''ఆ బాలిక వద్ద నేను నేర్చిన పాఠము అమూల్యమైనది. అనేక మనుష్యులతో కలసి జీవించుట కలహములకు అసంతృప్తికి కారణమగుచున్నది. సంభాషణ సాగించుటకు యిద్దరు చాలును, అది క్రమముగా భిన్నాభిప్రాయ ములకును దాని మూలముగా మనో వైకల్యమునకును దారితీయును. కాబట్టి, బాలిక చేతికున్న ఒకేఒక గాజువలె,మానవుడీలోకమందు యేకాకిగా నుండవలెను. పరమాత్మతో ఐక్యము కాగోరువారికి ధారణ శక్తి అత్యవసరము.

''బ్రహ్మస్థితిని పొంద దలచినవారు ఆత్మ యేకమని గ్రహించవలెను. మరియు సమాధి స్థితి చేరుటకు ధారణ ముఖ్యము. ప్రాణాయామము ద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసములను నిగ్రహించవలెను. మనస్సు నరికట్టుటకు ప్రాణాయామము సహాయపడును. వస్తు ప్రపంచమును త్యజించుటచేత మనశ్చాంచల్యము, అనగా విక్షేపము తొలగిపోవును. ఇది అభ్యాసము ద్వారా సమకూరును. జాగ్రదవస్థలో నున్నపుడు మనస్సు స్థిరముగా నుండదు. ఒక వస్తువు నుండి మరొక వస్తువునకు, ఒక ఆలోచన నుండి మరొక ఆలోచనకు, ఒక విషయము నుండి మరొక విషయమునకు మనస్సు మరలుచుండును. అది యెప్పుడును అలజడిగా నుండును. స్వప్నావస్థ యందు మనస్సు అలజడి కొంత తక్కువగా నుండును. అయినప్పటికిని తాను సృష్టించుకున్న స్వప్న ప్రపంచములోని విషయములతో నిమగ్నమై యుండును. సుషుప్తి స్థితిలో మనస్సు యెటువంటి అలజడి లేక నిద్రాణముగా నుండును. ఆ స్థితిలో నున్నంత కాలము మనస్సు స్తబ్ధముగా నుండును. ఇది మానవుని మనస్సు పరిస్థితి.

''కాని, అభ్యాసము చేత మనసును నిగ్రహించి అదుపుచేయవచ్చును. అయితే యెంతవరకు అదుపు చేయవచ్చును? కర్మల ఫలితముగా ఒక జన్మ నుండి మరొక జన్మకు సంక్రమించు వాసనలు పూర్తిగా తొలగి, దానంతట అది వాంఛలు పరిత్యజించు వరకు మనసు నదుపు చేయవచ్చును. అపుడు మనస్సు రజస్తమో గుణముల బారి నుండి తప్పించుకుని కేవలము శుద్ధ సత్త్వముగా మారును. అనగా ధ్యేయమునకు (పరమాత్మను చేరుట) ఒక మెట్టు దూరములో నుండును. ఈ పాఠమును విలుకాని వద్ద నేర్చినాను. విలుకాడు గురిచూచి యెక్కుపెట్టినపుడు, తన చుట్టును యేమి జరుగుచున్నదో అతనికి తెలియదు. ప్రక్కవైపుగా మహారాజు వెళ్లుచున్నను. అతనికి తెలియదు. అతని మనస్సు గురిపైన కేంద్రీకృతమై యుండును. గురిపెట్టిన వస్తువు, గురి, అమ్ము తప్ప యితర ఆలోచనలు అతని కుండవు.

''మానవుల ఉద్దేశ్యములను అమితముగా అనుమానించుటచేత సర్పము మానవులకు దూరముగా సంచరించును. తనదియను నివాస గృహము లేక యేకాకిగా నుండును. నిబంధనలను యెన్నడును అతిక్రమించక తనకు తానుగా జీవించును. అదే రీతిగా సన్యాసి జీవించవలెను. మరొక వ్యక్తితో సంపర్కము లేక యేకాకిగా తనకు తాను జీవితము గడపవలెను. స్వగృహమనునది యుండరాదు, యెందుకనగా అన్ని బంధములకు అది నాంది. మానవ లోకమునకు వీలయినంత దూరముగా గుహలు, ఆశ్రమముల వంటి వానిలో జీవించవలెను.

''దేహములో నివసించు దేహి, యే విషయముపై తీవ్రముగా మనస్సును కేంద్రీకరించి ఆలోచించుచుండునో, కొంత కాలమునకు తాను అటులు మారును. మట్టి పురుగు, ఈగ తన్ను కుట్టునను భయముతో నిత్యము ఈగనే తలంచుటచేత, కొంత కాలమునకు మట్టిపురుగు ఈగగా మారుచున్నది. అదే రీతిగా మనస్సు పరమాత్మపై కేంద్రీకరించి నిత్యము చింతించినచో కొంత కాలమునకు పరమాత్మతో ఐక్యము కాగలదు.

''ఆఖరి పాఠమును సాలెపురుగు నేర్పెను. ఒక చెట్టు కొమ్మపై ప్రశాంతముగా కూర్చుని యున్న సాలెపురుగును గమనించితిని. అకస్మాత్తుగా చల్లని పిల్లగాలి వీచినపుడు తన నుండి సన్నని దారము వంటి పదార్థమును బహిర్గతము చేసెను. ఆ పిల్ల గాలికి ఊగుచు మరొక కొమ్మను చేరెను. తరువాత రెండు కొమ్మల మధ్య అటునిటు తిరుగుచు, కొద్ది సేపటిలో గూడు నిర్మించెను.

''మరికొన్ని రోజుల తర్వాత, అదే సాలె పురుగు తాను నిర్మించిన గూడు దారపు పొరలను మ్రింగివేసెను. అందముగా నిర్మించిన సాలెగూడు అదృశ్యమై శూన్యము మిగిలెను.

''అదే మాదిరిగా పరమాత్మ యుండును. అతనికి వాంఛలనునవి లేవు. మరియు కార్యకారణముల కతీతుడు. కల్పాంతమున యేమియు మిగులదు. అంతయు శూన్యము. కాలముచేత గుణముల మధ్య సమత్వము తప్పినపుడు మాయ పుట్టుచున్నది. పరమాత్మ, తనకు తానే మహత్తత్త్వముగాను, అహంతత్త్వము గాను, పంచ భూతములతో కూడి విశ్వముగాను ఆవిర్భవించుచున్నాడు. కల్పాంతమున యీ విశ్వమును తనలోనికి ఉపసంహరింప జేసుకొనుచున్నాడు''.

అవధూత తన వివరణను యిట్లు కొనసాగించెను. ''ఓ రాజా! నేను యింతకు ముందు చెప్పిన యిరువది నలుగురు గురువుల నుండి యీ పాఠములను నేర్చితిని. నేర్చిన దానిని నేను ఆచరించుచున్నాను. నా యీ శరీరము కూడ నాకొక పాఠమును బోధించుచున్నది. అతి జాగ్రత్తగా యీ పాఠమును అధ్యయనము చేసినాను. ఇది మూలము, యీ పునాదిపై మానవ జీవితము నిలిచియున్నది. అయినప్పటికిని ఆత్మ వీడిన శరీరము జంతువులకు, పురుగులకు ఆహారమగుచున్నది, లేక భస్మమగుచున్నది. అందుచేత నేను దేహముపై మమకారము విడిచి పెట్టితిని.

''ఈ దేహమును సంతృప్తి పరచుటకు, మానవుడు అనంతమైన కాలమును శక్తిని వినియోగించుచున్నాడు. అతడు భార్య, పిల్లలు, ధనము, గోవులు, సేవకులు, గృహములు, స్నేహితులతో జీవించుచున్నాడు. అనేక కష్టనష్టములకోర్చి వీని నన్నిటినీ ప్రోగుచేసి వానికై ప్రత్యేకమైన శ్రద్ధ, జాగ్రత్త తీసుకొనుచున్నాడు. మరి యీ దేహము యేమి చేయుచున్నది? పూర్వ జన్మలో చేసిన కర్మల ఫలితముగా యేర్పడిన యీ దేహము వలన మానవుడు మరుచటి జన్మలో మరొక దేహముతో ముడిపెట్టుకొనుచున్నాడు. ఈ దేహమును పెంచిపోషించిన వానిని విస్మరించి, అది క్షీణించి నశించుచున్నది.

''శరీరముపై వ్యామోహము గల మానవుని చూడుము. నాలుకను తృప్తిపరచుటకు ఒకవైపు, దప్పికతో అలమటించు గొంతుకకు దప్పి తీర్చుటకై జలము నన్వేషించుచు మరొకవైపు పరుగిడును. స్త్రీసంగమము కొరకు ఒకవైపు లాగగా, కడుపులోని ఆకలిని తీర్చుకొనుటకు మరొకవంక తాపత్రాయపడును. మధుర సంగీతము వినవలెనని చెవులు ఒకవైపు, మంచి సువాసనలను ఆఘ్రాణించవలెనని నాసిక మరొకవైపు లాగుచుండును. అందమైన వస్తువులను చూడగోరి కన్నులు మరొకవైపుకు నడిపించును. వివిధ జ్ఞానేంద్రియ ముల చాపల్యములను మానవుడు సంతృప్తి పరచవలసియున్నది. బహు భార్యలుగల పురుషునివలె, మానవుడు ఒకేసారి అనేకమైన వాంఛలను తీర్చి సంతృప్తి పరచవలసి వచ్చుచున్నది.

''మానవుని సృష్టించినపుడు అతనికి మంచి బుద్ధి, విచక్షణాశక్తి లభించినవి. బ్రహ్మముపై మనసు లగ్నము చేయుటకు యివి ఉపకరించగలవు. అనేకమైన అధమ జన్మల — కీటకము, తొండ, జంతువు — తరువాత ఉత్తమ మానవ జన్మ కలుగుచున్నది. మానవ రూపము, మనస్సు, బుద్ధి, ప్రత్యేకముగా మానవునకు ప్రసాదించినది ఎందుకొరకు? వానిని సద్వినియోగము చేయుటకు యిచ్చినవి. ఒకే ఒక ప్రయోజనము కొరకు యీ శరీరమును కడు జాగ్రత్తగా పెంచి పోషించవలెను. మోక్షము పొందుట కొరకు మాత్రమే యీ శరీర మానవునకు లభించినది. నేను మోక్షము పొందినాను.

''నేను సంపూర్ణ వైరాగ్యమును నేర్చినాను. నేను యీ భూమిపై సంచరించి అనేక గురువుల యింతకుముందు వివరించిన పాఠములను నేర్చి జ్ఞానము నార్జింతిని. ఆ జ్ఞానము నా మనస్సును ప్రకాశిం నది. 'నేను' అను భావము నా మనస్సు నందు లేదు. 'నాది' అను రోగము చేత నేనెప్పుడును బాధపడ

ఈ లోకమందు యెట్టి కోరికలు, అనుబంధములు లేక సంచరించుచున్నాను అందుచేతనే నా ముఖము ప్రశాంతముగా నున్నది''.

యదువు గౌరవ పురస్సరముగా నమస్కరించి వీడ్కోలు చెప్పిన పిమ్మట, అచ్చట నుండి అవధూత నిష్క్రమించెను

కృష్ణుడు ఉద్ధవునితో నిట్లనెను ''ఉద్ధవా! ఎటువంటి అనుబంధము పెంచుకొనక యీ మానవలోకమందు శేష జీవితము గడపుము. నీ మనస్సును నాయందు లగ్నము చేయుము. నిన్ను నీవు సంతోషపెట్టుకొనుటకు యెట్టి కోరికలు లేకుండ యీ లోకమందు వ్యవహరించుము. చర్యలు కోరికలతో కూడినపుడు, అవి ఉత్పాదకములుకాగా కర్మ జన్మించుచున్నది. కర్మ బంధములకు కారణము కర్మ చేతనే ఒక జన్మ తర్వాత మరొక జన్మ సంప్రాప్తించుచున్నది నీవు నిత్య విధుల నాచరించవలెను ఏ ప్రయోజనము నాశించక నీవు కర్మల నాచరించిన యెడల, అవి నిన్ను బంధించలేవు. ఎల్లపుడు ఉత్తమ ఆలోచనలు కలిగి యుండుము అష్టాంగ యోగమునకు అవసరమైన వానినే నీవు చింతించవలెను అనగా అహింస — యితరులకు హాని కలిగించకుండుట; సత్యము — నిజము పలుకుట, అస్తేయము — అపహరించకుండుట, అసంగము — అనురాగము లేకయుండుట; లజ్జ — తప్పు పనులు చేసినందుకు సిగ్గుచెందుట; అసంచయము — ధన ధాన్యములు సేకరించకుండుట, బ్రహ్మచర్యము — ఇంద్రియములను నిగ్రహించుట, మౌనము — విశ్వబ్దము; స్థైర్యము — స్థిర బుద్ధి కలిగియుండుట; క్షమ — ఓర్పు వహించుట, అభయము — నిర్భయముగా నుండుట; యీ గుణములను మాత్రమే అలవరచుకుని పెంపొందించుకొనవలెను

''ఆత్మ స్వభావమును చింతించుచు కాలము గడుపుము కట్టెలోని అగ్ని దృష్టాంతము జ్ఞప్తియందుంచు కొనుము. కట్టెలో అగ్ని కలదు రాపిడిచేత అగ్ని ఆవిర్భవించి, అంతవరకు యెందు దాగి యున్నదో దానిని దహించును. అదే రీతిగా, నీలో నున్న ఆత్మ, శరీరములో నున్నప్పటికిని అది శరీరమునకు భిన్నమని భావించినపుడు అహంకారము అనగా దేహభావము పోయి ఆత్మతో ఏకము కాగలవు

''నన్ను చేరుటకు వివిధ మార్గముల గురించి పెక్కుమారులు వివరించగా నీవు వినియున్నావు. అన్ని మార్గములలోను భక్తిమార్గము అతి సులభమైనది. అది సులభమేగాక తొందరగా నిన్ను నాదరికి చేర్చగలదు. భక్తియోగము నభ్యసించినచో నీవు జీవన్ముక్తుడవగుదువు''. కృష్ణుడు తన ప్రసంగము నాపి చిరునవ్వు నవ్వి తిరిగి కొనసాగించెను ''ఇది నీకేమియు క్రొత్త కాదు ఇంత కాలముగా నీవు దీనిని అభ్యసించుచున్నావు! నా యెడల నీకున్న అనంతమైన ప్రేమను నేనెరుగుదును ఈ మానవ లోకములో నీకు బోధించిన ఆత్మ విద్యను వారికి బోధించుటకై నీవు ఉండవలసినదిగా కోరుతున్నాను''.

ఎంతకాలము యీ మానవ లోకములో జీవించవలెనో ఉద్ధవుడు తెలుసుకొనగోరెను ''కృష్ణా! ఇది యెట్లు సాధ్యమో నాకు తెలియుట లేదు''. అని విచారముతో కనులలో నీరు నింపుకుని పలుకగా, కృష్ణుడు అనుబంధముల నెట్లు వేర్పుగా త్రెంచుకొనవలెనో వివరించి మరికొంతసేపు బోధించెను. నిత్యమును భగవంతుని ధ్యానించి చింతించుట ద్వారా, కర్మబద్ధుడు యెట్లు విముక్తి పొంది ముక్తుడు కాగలడో బోధపరచెను.

ఇద్దరును విడిపోవు సమయము యేతెంచెను ఉద్ధవుడు చేతులు జోడించి కృష్ణుని పాదములపై బడి

అతని కన్నుల నుండి యేకధారగా అశ్రువులు కురియుచుండెను. తరువాత ఉద్వేగపూరిత స్వరముతో అతడిట్లులనెను. ''కృష్ణా! నన్నుయింతవరకు ఆవరించిన భ్రాంతి యను చీకటిని నీవు తొలగించి, యీ మాయా ప్రపంచము నుండి బయటపడుటకు సరియైన త్రోవను చూపినావు. నీవు జ్ఞాన దీపమును వెలిగించి నా కందించినావు. ఇందు మూలముగా, యింతవరకు నా బంధువులు, మిత్రులు, తదితరులతోనున్న బంధములు తెగిపోయి స్వేచ్ఛగా నున్నట్లు భావించుచున్నాను. నా జీవితాంతము వరకు యీ స్వేచ్ఛను అనుభవించున ట్లుగా అనుగ్రహించి ఆశీర్వదింపుము''. కృష్ణుడు యిట్లనెను. ''ఉద్ధవా! నేను ఒకప్పుడు తపస్సు గావించిన బదరికాశ్రమమునకు వెళ్ళుము. అక్కడ నుండి గంగను దర్శించి, నిత్యము శుద్ధ గంగా జలమందు స్నాన మాచరించి పరిశుద్ధుడవగుము. నా పాదముల నుండి ప్రవహించుటచేత గంగా జలము నిర్మలమైనది. అడవిలో జీవించుము. మితముగా ఆహారము భుజించుచు దేనితోను అనుబంధము లేక అవధూతగా సంచరించుము. త్వరలోనే నీవు నన్ను చేరగలవు''.

మరొకసారి ఉద్ధవుడు కృష్ణునకు ప్రణమిల్లి సెలవు తీసుకొనెను. కృష్ణునితో యెడబాటు అతికష్టముగా తోచెను. కృష్ణునికి కూడ ఉద్ధవుడు విడిచిపోవుట విచారము కల్గించెను.

వెనుకకు తిరిగి చూడక, ఒకప్పుడు నరనారాయణులు తపస్సు గావించిన బదరికాశ్రమమువైపు అడుగులు వేయుచు సాగిపోయెను.

## 275 యాదవ కుటుంబము అంతమొందుట

సుధర్మ యను పెద్ద సభా ప్రాంగణములో సమావేశము కావలసినదని కృష్ణుడు యాదవులందరిని కోరెను. ఆ సమావేశమున కృష్ణుడు యాదవుల నుద్దేశించి యిట్లు ఉపన్యసించెను. ''నేను మీకు చెప్పినట్లుగా దుశ్శకునము లనేకములు గోచరించుచున్నవి. ఇవి మన యాదవ వంశమునకు శుభదాయకము కాదు. ఈ ద్వారకలో యింకొక క్షణమైన నుండుట క్షేమము గాదని తలచుచున్నాను. మనము తీర్థయాత్ర చేయుదము. దగ్గరలో సంగోత్రమను తీర్థము గలదు. స్త్రీలు, పిల్లలు యీ తీర్థమునకు వెళ్ళనిండు. అచట మన మందరమును స్నానముచేసి పరిశుద్ధమైన తర్వాత, మగ వారందరను యింకను ముందుకుసాగి ప్రభాస తీర్థము చేరుదురు. అచట స్నాన మాచరించిన తర్వాత ఉపవాసములు, వ్రతములు చేసి దేవతలకు తర్పణము లొసగి, బ్రాహ్మణులకు పేదలకు విరివిగా దానము లొసగెదము. ఈ విధముగా సంభవింపనున్న ప్రమాదమును నివారించవచ్చును''.

కృష్ణుని కోరిక మేరకు స్త్రీలు, పిల్లలు, వృద్ధులు సంగోత్ర తీర్థమునకు వెళ్ళిరి. పురుషు లందరను సంగోత్ర తీర్థమునుండి ప్రభాస తీర్థమునకు వెళ్ళిరి.

ప్రభాస తీర్థమందు ముందు నిర్ణయించుకున్న ప్రకారము అన్ని యాగములు జరిపిరి. దేవతలకు సంతృప్తి కలిగించితిమని, ఆకాశవాణి సూచించిన కీడు అసత్యమగునని వారు దృఢముగా నమ్మిరి. చాల కాలము క్రిందట ఋషులొసగిన శాపమును వారు మరచిపోయిరి. ఆ శాపము జ్ఞాపకమున్న కొద్దిమంది దానినొక పరిహాసముగా పరిగణించిరి. ముసలము ఆనాడే నశించినది. అందుచే వారు క్షేమమే.

ఈ లోకమందు యెట్టి కోరికలు, అనుబంధములు లేక సంచరించుచున్నాను. అందుచేతనే నా ముఖము ప్రశాంతముగా నున్నది''.

యదువు గౌరవ పురస్సరముగా నమస్కరించి వీడ్కోలు చెప్పిన పిమ్మట, అచ్చట నుండి అవధూత నిష్క్రమించెను.

కృష్ణుడు ఉద్ధవునితో నిట్లనెను ''ఉద్ధవా! ఎటువంటి అనుబంధము పెంచుకొనక యీ మానవలోకమందు శేష జీవితము గడపుము. నీ మనస్సును నాయందు లగ్నము చేయుము. నిన్ను నీవు సంతోషపెట్టుకొనుటకు యెట్టి కోరికలు లేకుండ యీ లోకమందు వ్యవహరించుము. చర్యలు కోరికలతో కూడినపుడు, అవి ఉత్పాదకములుకాగా కర్మ జన్మించుచున్నది కర్మ బంధములకు కారణము. కర్మ చేతనే ఒక జన్మ తర్వాత మరొక జన్మ సంప్రాప్తించుచున్నది నీవు నిత్య విధుల నాచరించవలెను ఏ ప్రయోజనము నాశించక నీవు కర్మల నాచరించిన యెడల, అవి నిన్ను బంధించలేవు ఎల్లపుడు ఉత్తమ ఆలోచనలు కలిగి యుండుము. అష్టాంగ యోగమునకు అవసరమైన వానినే నీవు చింతించవలెను అనగా అహింస — యితరులకు హాని కలిగించకుండుట; సత్యము — నిజము పలుకుట; అస్తేయము — అపహరించకుండుట, అసంగము — అనురాగము లేకయుండుట; లజ్జ — తప్పు పనులు చేసినందుకు సిగ్గుచెందుట; అసంచయము — ధన ధాన్యములు సేకరించకుండుట; బ్రహ్మచర్యము — ఇంద్రియములను నిగ్రహించుట; మౌనము — నిశ్శబ్దము, స్థైర్యము — స్థిర బుద్ధి కలిగియుండుట, క్షమ — ఓర్పు వహించుట, అభయము — నిర్భయముగా నుండుట; యీ గుణములను మాత్రమే అలవరచుకుని పెంపొందించుకొనవలెను.

''ఆత్మ స్వభావమును చింతించుచు కాలము గడుపుము కట్టెలోని అగ్ని దృష్టాంతము జ్ఞప్తి యందుంచుకొనుము కట్టెలో అగ్ని కలదు. రాపిడిచేత అగ్ని ఆవిర్భవించి, అంతవరకు యెందు దాగి యున్నదో దానిని దహించును అదే రీతిగా, నీలో నున్న ఆత్మ, శరీరములో నున్నప్పటికిని అది శరీరమునకు భిన్నమని భావించినపుడు అహంకారము అనగా దేహభావము పోయి ఆత్మతో ఏకము కాగిలవు.

''నన్ను చేరుటకు వివిధ మార్గముల గురించి పెక్కుమారులు వివరించగా నీవు వినియున్నావు అన్ని మార్గములలోను భక్తిమార్గము అతి సులభమైనది. అది సులభమేగాక తొందరగా నిన్ను నాదరికి చేర్చగలదు. భక్తి యోగము నభ్యసించినచో నీవు జీవన్ముక్తుడవగుదువు'' కృష్ణుడు తన ప్రసంగము నాపి చిరునవ్వు నవ్వి తిరిగి కొనసాగించెను. ''ఇది నీకేమియు కొత్త కాదు. ఇంత కాలముగా నీవు దీనిని అభ్యసించుచున్నావు! నా యెడల నీకున్న అనంతమైన ప్రేమను నేనెరుగుదును. ఈ మానవ లోకములో నీకు బోధించిన ఆత్మ విద్యను వారికి బోధించుటకై నీవు ఉండవలసినదిగా కోరుతున్నాను''

ఎంతకాలము యీ మానవ లోకములో జీవించవలెనో ఉద్ధవుడు తెలుసుకొనగోరెను ''కృష్ణా! ఇది యెట్లు సాధ్యమో నాకు తెలియుట లేదు'' అని విచారముతో కనులలో నీరు నింపుకుని పలుకగా, కృష్ణుడు అనుబంధముల నెట్లు నేర్పుగా త్రెంచుకొనవలెనో వివరించి మరికొంతసేపు బోధించెను నిత్యమును భగవంతుని ధ్యానించి చింతించుట ద్వారా, కర్మబద్ధుడు యెట్లు విముక్తి పొంది ముక్తుడు కాగలడో బోధపరచెను

ఇద్దరును విడిపోవు సమయము యేతెంచెను ఉద్ధవుడు చేతులు జోడించి కృష్ణుని పాదములపై బడెను.

అతని కన్నుల నుండి యేకధారగా అశ్రువులు కురియుచుండెను. తరువాత ఉద్వేగపూరిత స్వరముతో అతడిట్లులనెను. ''కృష్ణా! నన్నుయింతవరకు ఆవరించిన భ్రాంతి యను చీకటిని నీవు తొలగించి, యీ మాయా ప్రపంచము నుండి బయటపడుటకు సరియైన త్రోవను చూపినావు. నీవు జ్ఞాన దీపమును వెలిగించి నా కందించినావు. ఇందు మూలముగా, యింతవరకు నా బంధువులు, మిత్రులు, తదితరులతోనున్న బంధములు తెగిపోయి స్వేచ్ఛగా నున్నట్లు భావించుచున్నాను. నా జీవితాంతము వరకు యీ స్వేచ్ఛను అనుభవించున ట్లుగా అనుగ్రహించి ఆశీర్వదింపుము''. కృష్ణుడు యిట్లనెను. ''ఉద్ధవా! నేను ఒకప్పుడు తపస్సు గావించిన బదరికాశ్రమమునకు వెళ్ళుము. అక్కడ నుండి గంగను దర్శించి, నిత్యము శుద్ధ గంగా జలమందు స్నాన మాచరించి పరిశుద్ధుడవగుము. నా పాదముల నుండి ప్రవహించుటచేత గంగా జలము నిర్మలమైనది. అడవిలో జీవించుము. మితముగా ఆహారము భుజించుచు దేనితోను అనుబంధము లేక అవధూతగా సంచరించుము. త్వరలోనే నీవు నన్ను చేరగలవు''.

మరొకసారి ఉద్ధవుడు కృష్ణునకు ప్రణమిల్లి సెలవు తీసుకొనెను. కృష్ణునితో యెడబాటు అతికష్టముగా తోచెను. కృష్ణునికి కూడ ఉద్ధవుడు విడిచిపోవుట విచారము కల్గించెను.

వెనుకకు తిరిగి చూడక, ఒకప్పుడు నరనారాయణులు తపస్సు గావించిన బదరికాశ్రమమువైపు అడుగులు వేయుచు సాగిపోయెను.

## 275 యాదవ కుటుంబము అంతమొందుట

సుధర్మ యను పెద్ద సభా ప్రాంగణములో సమావేశము కావలసినదని కృష్ణుడు యాదవులందరిని కోరెను. ఆ సమావేశమున కృష్ణుడు యాదవుల నుద్దేశించి యిట్లు ఉపన్యసించెను. ''నేను మీకు చెప్పినట్లుగా దుశ్శకునము లనేకములు గోచరించుచున్నవి. ఇవి మన యాదవ వంశమునకు శుభదాయకము కాదు. ఈ ద్వారకలో యింకొక క్షణమైన నుండుట క్షేమము గాదని తలచుచున్నాను. మనము తీర్థయాత్ర చేయుదము. దగ్గరలో సంగోత్రమను తీర్థము గలదు. స్త్రీలు, పిల్లలు యీ తీర్థమునకు వెళ్ళనిందు. అచట మన మందరమును స్నానముచేసి పరిశుద్ధమైన తర్వాత, మగ వారందరను యింకను ముందుకుసాగి ప్రభాస తీర్థము చేరుదురు. అచట స్నాన మాచరించిన తర్వాత ఉపవాసములు, వ్రతములు చేసి దేవతలకు తర్పణము లొసగి, బ్రాహ్మణులకు పేదలకు విరివిగా దానము లొసగెదము. ఈ విధముగా సంభవింపనున్న ప్రమాదమును నివారించవచ్చును''.

కృష్ణుని కోరిక మేరకు స్త్రీలు, పిల్లలు, వృద్ధులు సంగోత్ర తీర్థమునకు వెళ్ళిరి. పురుషు లందరను సంగోత్ర తీర్థమునుండి ప్రభాస తీర్థమునకు వెళ్ళిరి.

ప్రభాస తీర్థమందు ముందు నిర్ణయించుకున్న ప్రకారము అన్ని యాగములు జరిపిరి. దేవతలకు సంతృప్తి కలిగించితిమని, ఆకాశవాణి సూచించిన కీడు అసత్యమగునని వారు దృఢముగా నమ్మిరి. చాల కాలము క్రిందట ఋషులొసగిన శాపమును వారు మరచిపోయిరి. ఆ శాపము జ్ఞాపకమున్న కొద్దిమంది దానినొక పరిహాసముగా పరిగణించిరి. ముసలము ఆనాడే నశించినది. అందుచే వారు క్షేమమే.

గడచిన కొన్ని దినములుగా వ్రతములు చేసి అలసిపోయి, ఒకనాటి రాత్రి యాదవులందరును విశ్రాంతి తీసుకొనుచుండిరి వారందరును 'మైరేయ'మను మద్యమును సేవించిరి అది చాల రుచిరకమైనది దానిని వారు అమితముగా సేవించిరి తమ యింద్రియములపైగాని, నాలుకపైగాని యే ఒక్కరికి నిగ్రహము లేకపోయెను

బాగుగా మత్తెక్కిన వారి సంభాషణ వాదోపవాదములకు, తరువాత దెబ్బలాటలకు దారితీసెను. కొన్ని క్షణములలో అది తీవ్రమై, బాణములు, గదలు, కత్తులు తీసుకుని ఒకరితో నొకరు పోరుట మొదలిడిరి ఆ దృశ్యము చాల భయంకరముగా నుండెను. సముద్రపుటొడ్డున గుడారములలో నున్నవారు బయటకు వచ్చి పోరాటము సాగించుచుండిరి

చాల తీవ్రముగా ఒకరితో నొకరు అతి భయంకరముగా, నమ్మ శక్యము కాని రీతిగా, పోరాడుచుండిరి కృష్ణుడు మౌనముగా నిలుచుండెను. దూరముగా నుండి యాదవులొకరి నొకరు చంపుకొనుట చూచుచుండెను. అతడు కదలక స్థిరముగా నిలుచుండి అంతయు గమనించుచుండెను కృష్ణుని నేత్రములు ఓర్మి కోల్పోయినట్లు స్పష్టముగా గోచరించెను

వారి మధ్య పోరాటము ప్రారంభమైన వెంటనే జరుగబోవు దానిని బలరాముడు తెలుసుకొనెను మద్యము సేవించి మత్తెక్కిన వారు పోరాడు దృశ్యము చూచి విసుగుచెంది, దూర ప్రదేశమునకు వెళ్ళిపోయెను. అతడు వెళ్ళుచున్నపుడు కృష్ణుని నేత్రములు పరికించి చూచెను. బలరాముడు తన యోగశక్తిచేత శరీరము విడచి వెళ్ళునని కృష్ణు డెరుగును

పోరాటము సాగించుచున్న యాదవ వీరుల వైపు కృష్ణుడు తన దృష్టిని ప్రసరింపజేసెను త్వరలోనే వారి ఆయుధములు విరిగిపోయెను పోరాడుట కేదైన దొరకునేమోయని చుట్టును చూచిరి అది సముద్రము ఒడ్డు అగుట చేత పెల్లగించుటకు వృక్షము లేవియు లేకుండెను.

సముద్రపు టొడ్డున ఒక ప్రక్క దుబ్బుగా పెరిగిన గడ్డిని వారు జూచిరి ఆ దుబ్బు నుండి గడ్డిని పెరికి దానితో ఒకరినొకరు కొట్టుకొనుచుండిరి వారు ఊహించని విధముగా వారు ప్రయోగించిన గడ్డి పరకలు బాగుగా ఉపకరించెను ఒకొక్క గడ్డి పరకకు ఇంద్రుని వజ్రాయుధమున కున్నంత శక్తి యుండెను బాగుగా మత్తెక్కి యుండుటచేత యిదెట్లు సాధ్యమా యని వారు తలచకుండిరి ఇది వరలో సముద్రములోనికి విసరివేసిన ముసలము పొడి నుండి 'యీ గడ్డి దుబ్బు పెరిగెనని కృష్ణునకు మాత్రము తెలియును

యాదవులొకరి నొకరు చంపుకొనుచుండగా కృష్ణుడు గమనించు చుండెను సాత్యకి, కృతవర్మ, అనిరుద్ధుడు, ప్రద్యుమ్నుడు, గదుడు, సాంబుడు, సారణుడు, ఒకొక్కరే మరణించుట కృష్ణుడు చూచెను తొణకక, చెక్కుచెదరక అతడట్లే నిలుచుండెను బహుశః అతని హృదయమందు ఉద్వేగము ఉండి యుండవచ్చును కాని యెవరికిని తెలియదు తరువాత మరికొన్ని క్షణములలో ఆసముద్రపు టొడ్డు యాదవుల మృత కళేబరములతో నిండి యుండెను ప్రతి ఒక్కరును చివరకు మరణించిరి వారందరివైపు ఒకసారి దీర్ఘ దృక్కు పరపి చూచెను.

ఇదంతయు తాను సంకల్పించినది కాదా? తన స్వస్థానమునకు తిరిగి వెళ్ళుటకు ముందు సాక్షిగా నిలచి

చూడవలసిన దృశ్యము యిది కాదా?

ఆనందములో నుండి తేరుకున్నట్లుగా తల నొకసారి ఆడించెను. కృష్ణుడు త్వరగా అడుగులు వేసి నడచెను. ఆ ప్రదేశము నుండి సాధ్యమైనంత దూర దేశమునకు వెళ్ళుటకు నిశ్చయించుకొనెను.

## 276 చివరి గడియ

సముద్రమందలి అలలు, నీలి ఆకాశము, ఆకాశమందు అక్కడక్కడ యెగురుచున్న ఒకటి రెండు పక్షులు యీ భూమిపై చివరి గడియలో కృష్ణుని వైభవమును గాంచినవి. పొగలేక మండు అగ్ని జ్వాల వలె కృష్ణుడు ప్రకాశించుచుండెను. నల్లని వర్షమేఘము వలె నున్న అతని రూపము యెప్పటివలెనే తన కిష్టమైన పట్టు పీతాంబరము ధరించి యుండెను. అతని విశాల వక్షస్థలమందు శ్రీవత్సమను పుట్టుమచ్చ అందముగా అమరియున్నది. కౌస్తుభమను మణి కృష్ణుని వక్షమునకు శోభ చేకూర్చుచున్నది. అతని ముఖమందు కనిపించు చిరునవ్వు యెన్నో ఉద్వేగములతో కూడి యున్నట్లున్నది. ఒకవంక తనకు స్వేచ్ఛ లభించినదను తలంపుతోకూడిన నిర్విచారము, మరొకవంక యీ మానవలోకము తాను విడిచిన తర్వాత తిరిగి అధర్మము పాలగునని విచారము. కొన్ని క్షణముల క్రితము వరకు తనకు బంధువులుగా నుండి, యిపుడు మరణించిన వారిపై సగము విచారము, సగము అనురాగము నున్నగు భావములు అతని చిరునవ్వు నందు గోచరించుచుం డెను.

ఇంతకు పూర్వము అతని ముఖములో గోచరించిన అప్రసన్నత అదృశ్యమయ్యెను. ఒక క్షణము ఉద్ధవుని గురించిన తలంపు మనసులో మెదలెను. వెంటనే ముఖములో చిరునవ్వు గోచరించి మాయమయ్యెను.

ఒక అశ్వత్థ వృక్షము వద్దకు వచ్చి ఆ చెట్టు నీడలో అతడు కూర్చుండెను. పద్మాసనము వేసి ధ్యానములో మునిగెను. పరిష్కారము గావించవలసిన సమస్య యొకటి మిగిలి యుండెను. అతడు మానవ రూపము ధరించెను. అందుచేత మానవుడుగా మరణించవలసి యుండెను. ఇది యెట్లు సాధ్యము? తనలో తాను నవ్వుకొనెను. యాదవులందరిలో తాను చివరకు మిగిలెను. జరుగనున్నది అతడు యెరుగును.

వనమాల గాలికి యెగురు చుండెను. కుడిచేయి చిన్ముద్రను సూచించు చుండెను. ఎడమచేయి తన ఒడిలో నుండెను. కాళ్ళు యెదురెదురుగా మడచి, యెడమ పాదమును కుడి తొడపై పెట్టుకొనెను. అట్లు కొన్ని గడియల సేపు కూర్చుని ధ్యానములో మునిగి యుండెను.

జరుడను వేటగాడు ఆ దారిన బోవుచుండెను. ఒక క్షణమాగి అతడు చుట్టును చూచెను. దూరము నుండి కృష్ణుని గాంచెను. పచ్చని పట్టు వస్త్రము అతని అవయవములను కప్పియుండగా, చివర యెడమ పాదము కన్పించుచుండెను. పాదము అడుగుభాగము పద్మదళమువలె యెర్రగా లేతగా నుండెను. దూరము నుండి చూచుచున్న వేటగానికి అది ఒక లేడి నిలిచియున్నట్లుగా తోచెను. వెంటనే అతడు విల్లమ్ములు తీసెను. నిశ్చలముగా లేడి నిలుచున్నదని, యీ అదను తప్పిపోకూడదని, తనకు లాభకరము గావలెనని వేటగాడు తలచెను. కడు శ్రద్ధతో బాణము యెక్కుపెట్టి, గురిచూసి కొట్టెను. బాధతో మూలిగిన మానవ

స్వరము వేటగానికి వినిపించెను. వెంటనే ఆ ప్రదేశమునకు వేటగాడు వచ్చి, నేలపై పడియున్న కృష్ణుని జూచెను. బాధకు గురియైన యెడమ పాదమును కృష్ణుడు తన రెండు చేతులతో పట్టుకొనెను. అతని ముఖమందు తీవ్ర బాధ గోచరించుచుండెను. అతని కనుబొమలు చెమటతో తడిసి యుండెను. తాను గావించిన దారుణ కృత్యమునకు వేటగాడు భయభ్రాంతుడయ్యెను. అతడు కృష్ణుని పాదములపైబడి యిట్లనెను. ''ప్రభూ! నేనిపుడేమి చేతును? తెలియకుండ నేనొక ఘోరమైన క్షమించరాని నేరము చేసితిని. నేనేమి చేయవలెనో దయచేసి చెప్పుము''.

కృష్ణుడు వేటగానితో నిట్లనెను. ''నాకు నీపై కోపము లేదు. పైగా నీవు నాకొక మహోపకారము చేసినావు. అందుకు నాకు సంతోషముగా నున్నది. కాని, యిపుడు నన్ను విడిచిపెట్టి వెళ్ళుము. నన్ను ఒంటరిగా నుండనిమ్ము. నీవు నాకు చేసిన యీ సేవకు నీకు స్వర్గ ప్రాప్తి కలుగగలదని మాట యిచ్చుచున్నాను. ఆందోళన చెందక నిశ్చింతగా వెళ్ళుము''.

కృష్ణుడు చెప్పిన విషయము వేటగానికి అవగాహన కాలేదు. కాని తన్ను క్షమించినాడని మాత్రము తెలుసుకొనెను. బరువెక్కిన హృదయముతో అతడచట నుండి వెడలిపోయెను. ఒక ఉదాత్త పురుషుని చంపినానను బాధతో క్రుంగి కుమిలిపోయెను.

కృష్ణుని రథసారథి దారుకుడు, తన స్వామి కొరకు చాలసేపటి నుండి అన్వేషించుచుండెను. కొంతసేపటి క్రితము దారుణ యుద్ధము జరిగిన ప్రదేశము వదలి కృష్ణుడు వెళ్ళెనని దారుకునకు తెలియును. కృష్ణుడు వెళ్ళిన మార్గము తెలుసుకొనుటకు ప్రయత్నించెను. కృష్ణుని అడుగు జాడలనుబట్టి, నిత్యము కృష్ణుని మెడలో నుండు తులసి గాలిలో వదలిన సువాసనలను బట్టి దారుకుడు కృష్ణుడున్న ప్రదేశమును చేరుకొనగలిగెను. బాణము పాదములో లోతుగా గ్రుచ్చుకొనిపోయి క్రిందపడియున్న కృష్ణుని దారుకుడు చూచెను. క్రిందపడి యున్న కృష్ణుడు గొప్ప బాధతో సతమతమగుచున్నాడని స్పష్టముగా తెలియుచున్నది. దారుకుడు త్వరగా కృష్ణుని సమీపించి, అతని పాదములపైబడి యిట్లనెను. ''ప్రభూ! ఏమి జరిగినది? నా స్వామికీ బాధ నెవరు కల్పించిరి?''

కృష్ణుడు దారుకునితో నిట్లనెను. ''దారుకా! అవన్నియు చర్చించుట కిపుడు సమయము లేదు. నీవు తక్షణమే ద్వారకకు వెళ్ళుము. నీవు ఒక క్లిష్ట కార్యమును నెరవేర్చవలసియున్నది. యాదవులందరును మరణించినారనియు, బలరాముడు తన యోగశక్తిచేత యీ మానవ రూపమును విడనాడుటకు నిశ్చయించెన నియు, నా తల్లిదండ్రులతో చెప్పుము. ఆ తరువాత, యెవరును కూడ ద్వారకలో లేకుండునట్లుగా చూడుము. నేను నిష్క్రమించిన తర్వాత సముద్రము ద్వారకలో ప్రవేశించి ముంచివేయును.

''స్త్రీలను, పిల్లలను, వృద్ధులను ఇంద్రప్రస్థమునకు తీసుకువెళ్ళమని అర్జునునితో చెప్పుము.

''నీ మనస్సును స్థిరముగా యెల్లపుడును నాయందు లగ్నము చేయుము. త్వరలోనే నీవు నన్ను చేరగలవు''. కృష్ణుడు ఒక క్షణమాగెను. మిక్కిలి బాధతో తిరిగి యిట్లు చెప్పసాగెను. ''దారుకా! మరొక పని నీవు చేయవలసి యున్నది. దీనిని నా కొరకు చేయుము. నాకు గ్రుచ్చుకుని బాధించుచున్న యీ బాణమును లాగివేయుము''.

దారుకుడు గట్టిగా యేడ్చుచు వణకుచున్న చేతులతో బాణము తీసివేసెను. బాధతో భగవంతుడు గట్టిగా

మూలిగి, బాణమును చేతితో పట్టుకొనెను దారుకుడు కృష్ణుని చుట్టును మూడు పర్యాయములు ప్రదక్షిణము చేసి సాష్టాంగ ప్రణామము చేసెను

''దారుకా! నీవు త్వరగా వెళ్ళుము. నా నుండి ప్రాణము త్వరగా పోవనున్నది'' అని కృష్ణుడు పలికెను దారుకుడు కృష్ణు నచట వదలి వెళ్ళిపోయెను

దారుకుడు వెళ్ళునపుడు వెనుకకు తిరిగి చూచెను. బాణము చేతులో పట్టుకుని నేలపై కూర్చున్న కృష్ణుని వదనమందు అనంతమైన శాంతితో విండిన చిరునవ్వును గాంచెను.

ఆ బాణమును కృష్ణుడు చాలసేపు తిలకించెను ఆనాడు ఋషులు శపించిన సంఘటన అతనికి జ్ఞప్తికి వచ్చెను. ముసలమును పొడిచేసి సముద్రములోనికి విసరివేసిరి. ఆనాడు ముసలమును పొడిచేయగా, చివరకు ఒక ముక్క బ్రద్దలుకాని విషయము సేవకులు బలరామునితో చెప్పుట గుర్తుకు వచ్చెను ''ఇబ్బంది లేదు దానిని కూడ సముద్రములో పారవేయుము'' అని బలరాముడు చెప్పిన విషయము జ్ఞప్తికి వచ్చెను. మిగిలిన ఆ యినుపముక్కను ఒక చేప మ్రింగినదని కృష్ణునకు తెలియును కొంత కాలమునకు ఆచేపను పట్టి దానిని శుద్ధి చేయుచుండగా చేప శరీరములో నున్న యినుపముక్కను వేటగాడు చూచి, తన బాణమునకు చక్కగా సరిపోవునని తలచి బాణమునకు చివర దాని నమర్చెను ఆ బాణమునే వేటగాడు యీనాడు తనపై ప్రయోగించెను ఋషుల వాక్కులు అసత్యము కారాదని కృష్ణుడు వాంఛించెను అట్లు జరిగినందుకు నిర్విచారముగా నుండెను అతడు యెల్లపుడును బ్రాహ్మణుల యందు గౌరవ మర్యాదలు కలిగి యుండెను తన జీవితపు చివరి ఘడియలలో కూడ బ్రాహ్మణుల వాక్కులు సత్యమగునట్లు గావించెను

బ్రహ్మ, స్వర్గాధిపతితో కలిసి కృష్ణుడున్న ప్రదేశమునకు వచ్చెను. తమతో కృష్ణుని తీసుకువెళ్లుటకు అందరును అచటకు వచ్చిరి ఇంద్రుడు, యితర దేవతలు, ప్రజాపతులు, పితృదేవతలు, సిద్ధులు, గంధర్వులు, మైత్రేయాది ఋషులు అచట చేరిరి దేవతలందరి రథములకు ఆకాశమున చోటు చాలకుండెను. స్వర్గము నుండి నిర్విరామముగా పుష్ప వర్షము కురియుచుండెను

కృష్ణుడు వారందరిని ఒకసారి పరికించి చూచి, పద్మముల వంటి నేత్రములను మూసుకొనెను. యోగ నిద్రలో ప్రవేశించి తన సహజ రూపములో స్వస్థానమైన వైకుంతము చేరుకొనెను

# ద్వాదశ స్కంధము

## 277 శ్రీకృష్ణ నిర్యాణానంతరము

స్వర్గవాసులు, భగవంతుడు తన నివాసమున కెపుడు వెళ్ళినదియు గాంచలేకపోయిరి. మేఘమును విడిచిన మెరుపు తిరిగి ఆకాశములో కలిసిపోయినపుడు, మానవులు దాని జాడను కనుగొనలేరు. అదే రీతిగా, స్వర్గవాసులైన దేవతలు కృష్ణుడు అదృశ్యమగుట చూడలేకుండిరి వారు తమ తమ స్థానములకు చేరుకుని, భూదేవికి మాట యిచ్చిన ప్రకారము అనేక వైభవోపేత కార్యములు సలిపి తిరిగి వైకుంఠమునకు భగవంతుడు వచ్చినాడను తలంపుతో హాయిగా నుండిరి

కృష్ణుడు నిష్క్రమించుటతో సత్యము, ధర్మము, కీర్తి , శ్రీ, ఐశ్వర్యము, మున్నగు శుభప్రదమైన వన్నియును యీ భూమిపై అంతరించిపోయెను. ఇంతవరకు నున్న వైభవమును భూమి ఒక్కసారిగా కోల్పోయెను.

దారుకుడు ద్వారక చేరుకొనెను అతడు వృద్ధులైన ఉగ్రసేనుడు, వసుదేవుడు, దేవకి సమక్షమునకు వచ్చి, యాదవ వంశ నాశనము, బలరామకృష్ణుల అంతము తెలిపెను అది విన్న వెంటనే దేవకీ వసుదేవులు తెలివితప్పి పడిపోయిరి వారు తిరిగి లేవలేదు తమ భర్తలను కోల్పోయిన స్త్రీలు హృదయ విదారకముగా రోదించిరి. సర్వమును పోగొట్టుకున్నట్లుగా ప్రజలు భావించిరి బలరామకృష్ణులు లేని ద్వారకలో జీవించి ప్రయోజనమేమని వారు తలంచిరి దారుకుడు అర్జునుని వద్దకు వెళ్ళెను. మిక్కిలి బాధతో కూడిన కార్యములను నిర్వహించవలసిన బాధ్యత అర్జునునిపై పడెను.

అనేకులు రాకుమార్తెలు చితిలో ప్రవేశించి ప్రాణ త్యాగము చేసిరి. అర్జునుడు గతించిన వారందరికిని తర్పణము అర్పించి, అంత్యక్రియలను సక్రమముగా నిర్వర్తించెను మిగిలిన స్త్రీలను, పిల్లలను, ప్రజలను తోడ్కొని అర్జునుడు ఇంద్రప్రస్థమునకు వెళ్ళెను

అకస్మాత్తుగా బ్రహ్మాండమైన శబ్దముతో సముద్రము పొంగి ద్వారకలో ప్రవేశించెను ద్వారకా నగర మంతయు జలమయమయ్యెను. కృష్ణుడు నివసించిన సౌధ గోపురము తప్ప యింకేదియు కన్పించకుండెను అర్జునుడు ఇంద్రప్రస్థము చేరుకొనెను. ప్రభాస తీర్థములో జరిగిన దారుణ సంఘటనలు అర్జునుని ద్వారా వినిన యుధిష్ఠిరుడు, యితర పాండవులు, తమ రాణి ద్రౌపదితో సహా రాజ్యము విడిచిపెట్టి ఉత్తర దిక్కుగా హిమాలయమువైపు సాగిపోయిరి.

# 278 పరీక్షిత్తు అంతము

శుక మహర్షి వివరించి చెప్పుచున్న భగవద్వృత్తాంతము చివరి ఘట్టమునకు వచ్చెను పరీక్షిన్మహారాజు మరణ సమయము కూడ దగ్గరపడెను.

తరువాత శుకబ్రహ్మ యిట్లు చెప్పెను. ''ఇన్ని రోజులుగా నీకు భగవంతుని అవతారముల గురించి చెప్పుచు వచ్చినాను ఈ కథలను వినినవారు యే విధమైన బాధలకును లోను కారు వారికి మరణ భయము ఉండదు కాబట్టి రానున్న మరణము గురించి యెట్టి దిగులును పెట్టుకొనక నిశ్చింతగా నుండుము.

''ఈ శరీరము మొదట లేదు ఇది మధ్యలో వచ్చినది. చివరలో తిరిగి ఉండబోదు ఆత్మ యిందుకు పూర్తిగా వ్యతిరేకము

''ఆత్మ లేకుండుట యింతకు ముందెన్నడును లేదు ఇక ముందెన్నడును ఆత్మ లేకుండ నుండదు విత్తనము నుండి చెట్టు మొలకెత్తినట్లుగా నీవు తిరిగి జన్మించబోవుటలేదు. ఇది నాశనమగు శరీరమునకు మాత్రమే వర్తించును కట్టెలో దాగియున్నటువంటి అగ్ని కట్టెలో భాగము కాదు. కాని కట్టెలో నుండుటచేత అట్లు గోచరించును కట్టెలోని అగ్ని యే విధముగా నశించకుండునో అదే విధముగా నీలోని ఆత్మకు మరణ మనునది లేదు

''నిద్రలో నున్న మానవుడు తల నరికినట్లుగా స్వప్నములో భావించ వచ్చును మెలకువ వచ్చువరకు అది సత్యమని విశ్వసించును తరువాత అది స్వప్నములో కలిగిన అనుభూతి మాత్రమేననియు, సత్యము కాదనియు గ్రహించును. తల్లిగాని, తండ్రిగాని, దగ్గర బంధువు యెవరైనగాని మరణించుట చూచిన మానవుడు, యేదో ఒకరోజు తాను కూడ వారివలెనే మరణింతునని తెలుసుకొనును కాని యిది స్వప్నానుభవము వలె ఒక భ్రాంతి మాత్రమే బ్రహ్మ స్థితిని పొందినపుడు, తరచుగా నీవు చూచు మరణములు పాంచ భౌతికమైన శరీరములకేగాని, ఆ శరీరములందుండు ఆత్మకు కాదని గ్రహించగలవు

''ఒక మట్టి పాత్రలో గాలి యున్నది. పాత్ర స్వరూప మున్నంత వరకు, దానికి ప్రత్యేకమైన అస్తిత్వము, నామము నుండును కాని మట్టి పాత్ర విరిగిపోయి స్వరూపము కోల్పోయినపుడు, అందులోనున్న గాలి బయట నున్న గాలిలో కలసిపోవును. అదే రీతిగా దేహములో నివసించిన ఆత్మ, దేహము విడిచిపెట్టినపుడు, బ్రహ్మము అనగా పరమాత్మలో కలసిపోవును

''మాయ మనస్సును సృష్టించుచున్నది. మనస్సు దేహమును, దేహములో ప్రాణమున్నంతవరకు దాని ప్రవర్తనను తీర్చిదిద్దు గుణములను సృష్టించుచున్నది మాయచే కల్పితమైన యా శరీరము ఉపాధులకు లోబడి యుండుటచేత ఆత్మ సంసార వలయములో చిక్కుకుపోవుచున్నది

''అయితే ఒకసారి యా మాయాబంధము నుండి తప్పించుకున్నచో, ఆత్మ తన సహజ స్థితికి, అనగా శరీరము, మనస్సు, గుణములు మొదలైన ఉపాధులందు చిక్కుకొనక ముందున్న స్థితికి తిరిగి రాగలదు

''ఉదాహరణకు అగ్ని జ్వాలను తీసుకుందము, దానికా రూపము యెట్లు వచ్చినది? దీపపు వత్తి, నూనె, అగ్ని — యా మూడును కలిసి దీపములోని జ్వాలను పుట్టించుచున్నవి ఈ మూడు నున్నంత వరకును,

ఉన్నంతవరకు మాత్రమే మంటను చూడగలము. ఈ సంసారము కూడ అట్లే యున్నది.

''మంటకు అతి ప్రధాన వస్తువైన నూనెను, యీ లోకమందు మానవుని జన్మకు కారణమైన కర్మతో పోల్చవచ్చును. భావములు, ఉద్రేకములు, గుణములతో నిండిన మనస్సును వత్తితోను, దేహమును దీపముతోను పోల్చదగును. వత్తి లేనిదే మిగిలిన రెండును పనిచేయలేవు. దీపపు మంటను రగుల్చు అగ్నిని చైతన్యము అనగా జీవము లేక ప్రాణముతో పోల్చవచ్చును. ఈ మూడును కలిసినపుడు మంటతో పోల్చదగు సంసారము యేర్పడుచున్నది.

''ఓ రాజా! భ్రాంతి కల్గించు యీ శరీరమును, శాశ్వతమైన ఆత్మను గురించి చింతించుము. ఇపుడు అవి కలసియున్నవి. నీవు గడచిన కొన్ని రోజులుగా భగవంతుని గురించి మాత్రమే యోచించుచున్నావు. బ్రాహ్మణుని శాపముగాని తక్షకుని కాటుగాని నీలోని ఆత్మను చంపలేవు. నీవు బ్రహ్మము కాబట్టి మరణము చేత బాధ నొందజాలవు.

''నీవు యింకేదైన నన్ను అడుగ దలచినచో అడుగవచ్చును''. పరీక్షిత్తు యిట్లనెను. ''నేను మరణ భయము నుండి విముక్తుడ నయినాను. భగవంతుని గాథలను వినిన గడచిన వారము దినములు నా జీవితములోనికెల్ల అత్యంత సంతోషకరమైనవి. నేను రెండు విధములుగా అదృష్టవంతుడను. ఒకటి భగవత్కథలను వినగలుగుట. రెండవది ఆ కథలను మీ నోటి మీదుగా వినగలుగుట. సంసార బంధములో చిక్కుకున్న నావంటి వారి యెడల మీకున్న అపారమైన దయచేత యీ విధముగా నా వద్దకు వచ్చి అనుగ్రహించి ఆశీర్వదించినారు.

''బ్రహ్మమును గురించి మీరు బోధించిన పాఠము నేర్చిన తర్వాత, భయంకర తక్షక సర్పము కాటువేయునను కొద్దిపాటి భయము కూడ లేక విముక్తుడనైతిని. నా అజ్ఞానము సంపూర్ణముగా నశించినది. నేను స్వేచ్ఛగా సంతోషముగా నున్నాను.

''నేను యిక పోయి వచ్చుటకు అనుజ్ఞ వేడెదను. నేను యీ భౌతిక శరీరము విడచి, యింతకాలము హృదయములో పొందుపరచుకున్న భగవంతుని పాదసన్నిధిని చేరుటకు సంసిద్ధుడనై యున్నాను. ఈ జ్ఞానేంద్రియముల నుపసంహరించి, భగవంతుని ధ్యానించెదను''.

తరువాత పరీక్షిత్తు శుక మహర్షిని 'ఉచిత రీతిగా గౌరవించి పూజించెను. తనకు శాంతి సౌఖ్యము లందిచ్చుటకు వచ్చిన అనేకమంది ఋషులను కూడ పూజించెను.

పరీక్షిత్తును ఆశీర్వదించిన పిదప యితర ఋషులతో కలిసి శుక మహర్షి అచట నుండి వెడలిపోయెను.

పరీక్షిత్తు యేకాకిగా నుండెను. దర్భాసనముపై గూర్చుండి ధ్యానములో నిమగ్నుడయ్యెను. ఎటువంటి భావోద్రేకములు లేకుండ, కేవలమొక కట్టె మాదిరిగా నున్నంత తీవ్రముగా ధారణ చేయుచుండెను. అట్లు కూర్చొని నారాయణుని ధ్యానించుచుండెను.

తక్షకుడు బ్రాహ్మణ రూపము దాల్చి, ధ్యానములో మునిగి యీ ప్రపంచమును మరచిన పరీక్షిత్తు మహారాజు సమీపమునకు వచ్చెను. పరీక్షిత్తు చుట్టును ఉన్నవారెవరును ఆ బ్రాహ్మణుడు తక్షకుడని గుర్తించలేకపోయిరి. దగ్గరకు వచ్చిన తర్వాత సర్ప రూపము దాల్చి పరీక్షిత్తు మహారాజును కాటువేసెను.

అందరును చూచుచుండగా, విషము ద్రవ రూపములో నున్న అగ్నివలె పరీక్షిత్తు మహారాజు శరీరమును దహించెను. కొద్ది క్షణములలో కురు వంశములో ఒక మణి, భస్మ రాశిగా పడియుండెను.

## 279 ఉద్ధవుని విచారము

భగవంతుడు కృష్ణుడుగా అవతరించిన ప్రయోజనము నెరవేరినది. భూదేవి భారము తగ్గెను. పదునెనిమిది రోజులు కురుక్షేత్రమందు జరిగిన ఘోర సంగ్రామములో కామపూరితులైన రాజులందరును నేల కూలగా, వారి రక్తము యీ భూమిపై పొంగి ప్రవహించెను. అట్టి భూమిపై భగవంతుడు ధర్మ బీజమును నాటెను.

స్వర్గవాసులందరును బ్రహ్మ ననుసరించి భూమి మీదకు దిగి కృష్ణుని సమక్షమున కేతెంచి యిట్లనిరి. ''ప్రభూ! నీ సహజ స్థానమునకు తిరిగి రావలెను. మా వద్దకు వచ్చి సంచరించవలెను. నూట యిరువదియైదు సంవత్సరములు యీ భూమి మీద నుంటివి. నీవు చేపట్టిన పవిత్ర కార్యములో మొదట పూతన నాందిగా ఉపకరించెను. ఆ కార్యము లన్నియు పూర్తిగా నెరవేరుటచేత, నీవు మరల వైకుంఠము చేరవలెను'' కృష్ణుడు వారు చెప్పినది విని సరళముగా మృదు స్వరముతో మాట్లాడిన తీరులో దాని వెనుక నున్న దృఢత్వమును వారు గమనించిరి. అతడు మాట్లాడుచున్నపుడు నేత్రములు దూరముగా నున్నదానిని దేనినో చూచుచున్న ట్లుండెను. అతడు భవిష్యత్తులోనికి చూచుచున్నాడని, గతములో అతడు సాధించిన ఘన కార్యములు తాము వివరించుచుండుట గమనించుటలేదని వారు గుర్తించిరి. అతని చూపులలో విచారము బాధ కనిపించెను. కాని స్వరము దృఢముగా నుండెను. అతడిట్టులనెను. ''అప్పులారా! నేను వచ్చిన పని యింకను పూర్తి కాలేదు. అనేక సంవత్సరముల క్రితము ఒకనాడు మీరందరును నా వద్దకు వచ్చి, యీ లోకమును వేధించుచున్న విషమ సమస్యల నుండి ఉద్ధరించవలెనని కోరిరి. దాని పర్యవసానముగా యీ భూమిపై అవతరించి, చాలవరకు మీరు నాకు అప్పగించిన కార్యమును పూర్తి గావించితిని''.

తన ప్రసంగమును దీర్ఘకాలము ఆపి తిరిగి కొనసాగించెను. ''కాని యింకను సంపూర్ణము కాలేదు. మీ చుట్టును మీరు చూచుచున్నదేమి? గొప్ప యాదవ కుటుంబము యింకను మిగిలియున్నదని మీరు గుర్తించలేదా? గర్వము, అహంభావము, శక్తి దురాశలతో నిండిన యాదవులు, నేను అదుపులో నుంచిన మహా సముద్రమును పోలి యున్నారు. నేను మాత్రమే వారి నణచి యుంచగలను. నేను నిష్క్రమించిన తర్వాత, యీ మానవ జాతి అరాచకమునకు వారు కారకులగుదురు. వారి పాపకృత్యములు మితిమీరి అవధులు దాటును. ఇన్ని సంవత్సరములుగా నేను గావించిన మంచి పనులు నిష్ప్రయోజనము లగును. శక్తిమంతులైన యాదవులు, యీ లోకమును అరాచకము పాలుచేయుదురు. ఈ భూమిపై ధర్మ చ్యుతిని నివారించుటకు నేనుండి తీరవలెను. అయితే, యాదవులు త్వరలోనే అంతమొందెదరు. బ్రాహ్మణుల శాపము త్వరలో నిజము కాగలదు. యాదవులందరును గతించిన తర్వాత, నేను యీ మానవలోకము విడిచి వచ్చెదను''.

కృష్ణు డావిధముగా మాట్లాడుచున్నపుడు నారదుడొక్కడు మాత్రమే కృష్ణుని స్వరములో ఒక విధమైన అలసటను గుర్తించెను. స్వర్గవాసులు తమ స్వస్థానములకు వెళ్ళగా, కృష్ణుడు మౌనముగా కూర్చుని తనలో తాను ఆనందించుచుండెను.

ఆకాశమందు భయంకర శకునములు గోచరించెను. ఏదో ఉపద్రవము త్వరలోనే సంభవించనున్నదని ప్రజలు భయాందోళనలు చెందిరి. కృష్ణుడు సుధర్మ యను సభా గృహమందు ప్రజలను సమావేశపరచి, వారికి నచ్చజెప్పు ధోరణిలో మాట్లాడసాగెను. శకునములు చూచి తాను యెంతగా భయపడుచున్నదియు చెప్పెను. చాల కాలము క్రిందట బ్రాహ్మణు లిచ్చిన శాపమును వారికి జ్ఞప్తికి దెచ్చెను. తరువాత కృష్ణు డిట్లు మాట్లాడెను. ''మన మందరము శంకరుని పవిత్రమైన ప్రభాస తీర్థమునకు వెళ్లుదము. చాల రోజుల క్రితము శంకరుడు, తన మామగారైన దక్ష ప్రజాపతి శాప ఫలితమైన చంద్రుని క్షయ వ్యాధిని నివారించెను. అక్కడకు వెళ్ళి శంకరునికి పూజలు, పవిత్ర తీర్థములో స్నానములు, పేదలకు అన్నదానము మున్నగు సత్కార్యము లాచరించి, పాప పరిహారము చేసుకుని, ఆ విధముగా మన జాతి కంతకును సంభవింపబోవు ఉపద్రవమును అరికట్టుదము. ఇక సమయము వృథా చేయవద్దు''.

ప్రభాస తీర్థమునకు వెళ్ళుటకు సన్నాహములు జరుగుచున్న సమయములో, కృష్ణునికి తోడు నీడగా నుండు ఉద్ధవుడు కృష్ణుని వద్దకు వచ్చి అతని పాదములపై బడెను. అతని కన్నుల నుండి కన్నీరు స్రవించుచుండగా, కృష్ణుడు ఉద్ధవుని లేవనెత్తెను. తన స్నేహితుని కన్నీరు తుడిచి యిట్లడిగెను. ''ఉద్ధవా! ఇపుడు నీవు యెందుకు ఆందోళన చెందుచున్నావు? ఎందుకు నీకీ విచారము?''

ఉద్ధవుడిట్లు సమాధానమిచ్చెను. ''కృష్ణ ప్రభూ! నాకు అంతయు తెలుసును. నీవు యాదవ వంశమును నాశనము చేయుటకు నిశ్చయించుకున్నావు. ఇది త్వరలోనే జరుగనున్నది, సంపూర్ణముగా నాశనము కాగలదు. నాకు తెలుసును. దాని గురించి నేను ఆందోళన చెందుట లేదు. ఆ తరువాత నీవు నిష్క్రమింతువని ఆందోళన చెందుచున్నాను. నీవు నన్ను విడిచి వెళ్ళుచున్నావు. కృష్ణా! దయచేసి నన్ను నీతో తీసుకువెళ్ళుము. నీవు లేకుండ నేను జీవించలేను. నీవు మధుర వచ్చి కంసుని సంహరించిన నాటి నుండి నిన్ను విడచి ఒక క్షణమైన నుండలేదు. ఎల్లప్పుడును నీతో నుండవలెనని కోరుచున్నాను. దయచేసి నన్ను నీతో గొనిపొమ్ము''.

కృష్ణుడు గంభీరమైన చిరునవ్వుతో ''నీవు చెప్పినది సరి అయినదే'' అని పలికెను. ''నీవు ఆడిన ప్రతి మాటయు సత్యమే. వారము దినములలో యాదవులందరును నాశనమయ్యెదరు. ఏడవ దినమున అందమైన యీ ద్వారకా నగరము సముద్రమావరింపగా యేమియు మిగలకుండపోవును. ఒకప్పుడు ద్వారకా నగరము కలదను స్మృతి మాత్రము మిగిలిపోవును. కాని ఉద్ధవా! నీవు నాతో రాలేవు. ఈ మానవ లోకములో నీవు కొంత కాలము జీవించవలెను. ఈ లోకమునకు నీ అవసరమున్నది. అన్ని కోరికలు విడనాడి, బ్రహ్మవిద్యలో నిష్ణాతుడవై ప్రజలకు దీనిని బోధించుచు యీ లోకమందు సంచరించవలెను''. తరువాత కృష్ణుడు, యదు మహారాజుకు అవధూత తన బోధలు వినిపించిన గాథను చెప్పి, బ్రహ్మసత్యమును వివరించి తెలిపెను.

తాను ఉద్ధవునకు చెప్పినది సరిపోదని కృష్ణుడు గ్రహించెను. మరింత విపులముగా, స్పష్టముగా, గాఢముగా బోధించవలెనని కృష్ణుడు సంకల్పించెను. అవధూత యదు మహారాజుకు తెలిపిన దృష్టాంతములు, వాటి నుండి సంగ్రహించిన బోధలు ఉద్ధవుడు సత్యము తెలుసుకొనుటకు చాలవని భావించి, ఆత్మ విద్యను విపులముగా బోధించుటకై కృష్ణుడు నిశ్చయించుకొనెను.

కృష్ణుడు ఉద్ధవునితో యిట్లనెను. ''ఉద్ధవా! నాయందు భక్తి కలిగి యుండుము. నీవు నాకు పూర్తిగా శరణాగతుడవై, ఆ శరణాగత భావముతో నీ దైనందిన విధులను, యితర విధులను నెరవేర్చుము. నీ మనస్సునందు ఒకే ఒక ఆలోచన యుండవలెను. నీవు చేయు కర్మల ఫలితములను గురించి యోచించరాదు.

నిస్స్వార్థమైన కర్మల ద్వారా మనస్సు పరిశుద్ధి గావించుకొని, ప్రశాంత మనస్సు నలవరచుకొనుము. శారీరక సౌఖ్యముల కొరకు చేయు కర్మల మూలముగా దుఃఖము కలుగునని తెలుసుకొనుట ద్వారా నీ మనస్సుకు ప్రశాంతత కలుగును''. ఉద్ధవుడు తబ్బిబ్బు పడుచున్నాడని గ్రహించి, కృష్ణుడు ఒక క్షణము ఊరకుండెను. ''నాకేమియు బోధపడుట లేదు. కొంచెము విశదీకరించి చెప్పుము'' అని ఉద్ధవు డడిగెను.

## 280 ఉండదగు లక్షణములు

''స్వప్న ప్రపంచమును చూడుము'' అని కృష్ణుడు మొదలుపెట్టెను. ''మానవుడు స్వప్నము గాంచునపుడు అందు అనేక సంఘటనలు జరుగును. అందు కొన్ని దుఃఖ సంఘటనలు గాని లేక అమితానందము పొందు అనుభవములు కాని జరుగవచ్చు. సుఖము, దుఃఖము, లేక రెండును అత డనుభవించును. కాని అతనికి మెలకువ కలిగిన తర్వాత స్వప్న ప్రపంచమంతయు కరగిపోవును. స్వప్నములో అనుభవించిన దంతయు తన ఊహయేనని, నిజముగా దుఃఖము గాని సుఖము గాని లేవని గ్రహించును. అదే మాదిరిగా యీ లోకము మానవుడు స్వప్నములో గాంచు స్వప్న ప్రపంచమును పోలి యున్నది.

''ఊహాలోకములో విహరించు మానవుని గురించి యోచించుము. తీరని కోరికలకు రెక్కలు వచ్చి అవి సత్యమను భావన అతనికి అప్పటి మనస్థితిలో కలిగించును. ఈ విధమైన ఆలోచనా పద్ధతిని మనోరథ మందురు. నిజముగా పరిశీలించిన, ఊహాలోకములోని యే ఒక్క అనుభవము కూడ నిజము కాదు. అవి కేవలము మనఃకల్పితములు. అదే విధముగా యీ లోకము సుఖ దుఃఖములతో గాని, సంతోష బాధలతో గాని యేర్పడుట లేదు. ఈ విధముగా ఆలోచించునట్లు నీ మనసుకు శిక్షణ నిచ్చినట్లైన, నీవు సత్యమును గ్రహించి కర్మ బంధము నుండి విముక్తుడ వగుదువు. ఈ బహుళ ప్రపంచమనునది ఇంద్రియముల మూలముగా యేర్పడుచు న్నది. ఇంద్రియములు భౌతిక వస్తు ప్రపంచాకర్షణకు లోనై, ద్వంద్వ భావములకు గురియగుటచేత మానవుడు విచక్షణా శక్తిని కోల్పోవుచున్నాడు.

''ఎల్లప్పుడును యీ సూత్రమునకు కట్టుబడి యుండుము : అది యేమనగా ఫలితముల నాశించి కర్మలను యెపుడును చేయవలదు. అన్ని జీవుల వలెనే యీ లోకములో జీవించి వాటి వలెనే వర్తించుము. నీ అంతరంగమును బ్రహ్మ మార్గమువైపు మరల్చుటకు శిక్షణ నిమ్ము. బ్రహ్మ స్థితిని పొందుటకు తగిన అర్హతలను అలవరచుకొనుము.

''అహింస — యితరుకు హాని తలపెట్టకుండుట. సత్యము — యెల్లపుడును నిజము పలుకుట. అస్తేయము — యితరులకు చెందిన దానిని దొంగిలింపకుండుట. అసంగము — యెవరితోగాని, యే వస్తువుపై గాని విశేషమైన అనుబంధము పెంచుకొనకుండుట. అనుబంధము యెంత యెక్కువగా నుండిన, విడిపోవలసి వచ్చినపుడు, అంత యెక్కువ బాధ కలుగును. కాబట్టి యెవరితోను అనుబంధము పెంచుకొన వద్దు. లజ్జ - లజ్జ అనగా చేయదగని కార్యములు చేయుటకు సిగ్గుపడుట. అట్టి ఆలోచనలు కలిగినందుకే సిగ్గు చెందవలసి యున్నది.

అసంచయమనునది మరొక ప్రధాన లక్షణము. ఏదియును కూడబెట్టవలెనని తలంచరాదు. ధన కనక

వస్తు వాహనములను కూడబెట్టినచో, అవి నీ దృష్టిని ఉత్తమ మార్గము నుంచి మరల్చును రాత్రింబగళ్ళు యింకను యింకను కూడబెట్టవలెనని తలచెదవు దానిని వర్జింపుము. ఆస్తికత అను గుణమును పెంచుకొనవ లెను. ఆస్తికత అనగా ఒక మహోన్నతశక్తి కలదని విశ్వసించుట. ఈ విశ్వాసము లేకున్నట్లయిన మిగిలిన బోధలన్నియు వ్యర్థమే బ్రహ్మచర్యము నభ్యసించవలెను ఈ పదమునకు అనేక అర్థములు గలవు సామాన్య అర్థమేమనగా శారీరక సౌఖ్యములనిచ్చు సంసార జీవితమును త్యజించుట తరువాతది మౌనము. మౌనము అనగా ''అనవసరమైన ప్రసంగములు చేయకుండుట మరియు అధములతో వాదమునకు దిగి కాలము వ్యర్థపుచ్చక యుండవలెను. అధముల దృష్టి భౌతిక సుఖము లందుండుటచేత, నీవు వారి మార్గము ననుసరించునట్లు చేయుదురు ఇట్టి వారితో మాట్లాడక మౌనము వహించుట ఉత్తమము స్థైర్యమనునది అత్యవసరము స్థైర్యమనగా అన్నిటి యందు — చేతలు, మాటలు, విశ్వాసము, అభిప్రాయములు — స్థిరత్వము కలిగియుండుట క్షమ — యితరుల దోషములను క్షమించుట అనేక విధములగా బాధపెట్టిన వారిని క్షమించ గలిగిన విశాల హృదయము, ఉదాత్తత కలిగియుండవలెను అభయమనునది స్థైర్యమునకు పర్యాయ పదమని చెప్పవచ్చును స్థైర్యము మనస్స్థితికి సంబంధించినది అట్టి మనస్స్థితితో తన నమ్మకమును వమ్ము చేయు క్లిష్ట పరిస్థితులను గాని వ్యతిరేక భావములను గాని ధైర్యముగా యెదుర్కొనుటయే అభయము

''నన్ను చేరదలచినవారు అన్నింటినీ సమముగా చూచుశక్తికలిగి యుండవలెను సమత్వ మనగా శత్రువును మిత్రుని ఒకే విధముగా పరిగణించుట; గడ్డి పరకను మహా వృక్షమును ఒకే రీతిగా చూచుట దేనిని 'సొంతము' చేసుకొను కోరిక లేక యుండవలెను భార్య, పిల్లలు, యిల్లు, భూమి, ధనము, బంధువులు — వీరెవరికిని ప్రత్యేకమైన ప్రాముఖ్య ముండరాదు. ఒకే ఒక బ్రహ్మము అందరి యందు ఉంటున్నదని గ్రహించినపుడు, 'ఇవి నాకు చెందినవి' అను మమకారముతో అలమటించవలసిన అవసర మేల కలుగును? నన్ను చేరిన వాని మనస్సు నందు 'నేను — నాది' అను భావములు అంతరించిపోవును అనగా వారిని విడిచిపెట్టి పారిపోవలెనని కాదు. వారితో కలిసి యుండవచ్చు కానిచో, ఉన్నత భావములు పెంపొందించుకుని మమకారము వీడి సంచరించవలెను. మానసికముగా, ఆధ్యాత్మికముగా వారికంటె ఉన్నతుడుగా నుండవలెను

''అగ్ని, దాని స్వభావము గూర్చి యోచించుము అది కట్టె ముక్కలో అంతర్గతముగా నుంటున్నది కట్టెలో నున్నంత సేపు కట్టె లక్షణములు — పొడవు, దళసరి, రంగు, మున్నగు స్వభావములు — అగ్నికి కూడ అన్వయించును. కాని నిజముగా పరిశీలించినచో అగ్ని కట్టెలో భాగము కాదు ఇది కట్టె నుండి వేరుగా ఉన్నది అయితే అగ్ని కట్టె ఒకటే యను సామ్యము మాయ చేత కలుగుచున్నది

''ఈ దేహములో నివసించుచున్న ఆత్మ వేరు, దేహము వేరు అయితే ఆత్మ దేహము నుండి వేరుగా నుంటున్నప్పటికిని, ఆత్మ దేహము ఒకటే యను భావము మానవుని మనస్సులో యేర్పడుచున్నది దీనికి కారణము మానవుని అజ్ఞానము అవిద్య పొర — అనగా సత్యమును తెలియలేకుండుట — ఆలోచనా శక్తిని కప్పివేయుటచేత సత్యము నెరుగలేకపోవుచున్నాడు చీకటి యను వస్త్రమును యెట్లు విప్పివేయవలెనో తెలుసుకొనగలిగినపుడు అతనిలో అవిద్య అంతరించి తెలుసుకొనును కట్టెలో నున్న అగ్ని ప్రకటితమై తన శక్తిచేత కట్టెను దహించి జాజ్వల్యమానముగా ప్రకాశించినట్లు, మాయా ప్రపంచము అదృశ్యమై ఆత్మ ప్రకాశించగలదు కట్టె పూర్తిగా దగ్ధమై యేమియు మిగలకున్న తర్వాత, అగ్ని తానంతటదే అణగారి, తన జాడ లేవియు మిగల్చక పూర్తిగా అదృశ్యమగును

''అదే మాదిరిగా శరీర మనోబుద్ధులనే ఉపకరణము లందు చిక్కుకున్న ఆత్మ తిరిగి యెన్నడును దేహములో నివసించక, పరబ్రహ్మముతో ఐక్యమగును ఆత్మ సత్యమనే యెరుక కలిగిన తరువాత జీవాత్మకు అస్తిత్వ ముండదు

''ఆత్మ స్వయం ప్రకాశము అది పరిపూర్ణ శుద్ధ జ్ఞానము అది నిత్యము కాని యీ జీవిత మనునది — మానవుల ప్రవర్తనా పద్ధతి, కర్మాచరణలు, మున్నగు వానితో కూడినది — ఆత్మ నావరించి యున్న శరీర మనోబుద్ధులచేత యేర్పడుచున్నది. ఉద్ధవా! ఆత్మ ఒక్కటే సత్యము, మిగిలిన వన్నియు అసత్యములు. ఈ విషయము జ్ఞాపక ముంచుకొనుము. ఈ దృఢ నమ్మకమును మనస్సు నందుంచుకుని, యీ లోకములో అన్నిటినీ విడనాడుము. నాయందు నీకు గల అభిమానము కూడ విడిచి పెట్టుము ఆ అభిమానముచేతనే, నన్ను విడిచి యుండలేనను తలంపు కలిగి అది నీ దుఃఖమునకు కారణమగుచున్నది నేను ధరించిన యీ 'కృష్ణ' రూపమునకు ప్రత్యేకముగా నున్న 'నన్ను' గుర్తించుము నేను పరబ్రహ్మమును అది గ్రహించి, వైరాగ్యము నలవరచుకొనుము అపుడు నీవు సులభముగా సత్యమును చూడగలవు

''ఈ మానవ లోకములో, యే మానవుడు కూడ తాను కోరిన వన్నియు పొందలేడు కర్మలకు, ఆలోచనలకు బానిసయైన మానవుడు సుఖ దుఃఖములతో సతమతమగుచు స్వేచ్ఛ లేక యుంటున్నాడు మాయా ప్రపంచము యొక్క సహజ స్వభావమును యెరిగినవారే నిత్యము ఆనంద మనుభవించెదరు ఒక చిన్న విషయము యీ సత్యమును నిరూపించగలదు ఎవరైనను అన్ని బాధల నివారణకు పరిష్కార మార్గమును, నిత్యము ఆనందముగా నుండుటకు ఔషధము కనుగొంటినని ప్రకటించినచో, అట్టివాడు నిజముగా నిస్సహాయుడని చెప్పవచ్చును ఎందుకనగా అన్ని బాధల కంటె మిక్కిలి బాధాకరమైన మృత్యువును నివారించుటకు మార్గమును యింతవరకెవరును కనుగొనలేకుండిరి ఈ లోకములో జన్మించిన మానవుని వెంట మృత్యువు యెల్లపుడు నుండగా, వస్తు ప్రపంచము అతనికి సుఖము నెట్లు ప్రసాదించగలదు? ఉరికంబమునకు తీసుకుని పోవువానికి మంచి సుగంధము, అందమైన పుష్పహారములు యిచ్చిన చందముగా నుండును

''యజ్ఞ యాగములు చేసిన వారున్నారు యజ్ఞములు చేసి ఇంద్రునికి ప్రీతి కలిగించుటచేత మానవుడు దేవతలుండు స్వర్గము చేరుచున్నాడు తాను సంపాదించి మూటకట్టుకున్న పుణ్యముచేత, అతడు స్వర్గములో దేవతల మధ్య సంచరించును అందమైన పట్టు వస్త్రములు ధరించి వెండి బంగారు రథములలో తిరుగుచు, ఇంద్రుని సభలో నున్న అప్సరసల సాహచర్యమును పొందును గంధర్వుల స్తుతులకు, తన చుట్టును సంచరించు అప్సరసల కాలి గజ్జెల గలగల మను సంగీత నాదమునకు అతని చెవులు అలవాటుపడి, యిదంతయును అసత్యమేనని పలుకు అంతర్వాణి స్వరమును వినలేకపోవును కాల గమనములో తాను భూమిపై ఆర్జించిన పుణ్యము క్రమముగా తగ్గిపోవును పూర్తిగా హరించిపోయిన తర్వాత, అతడు తిరిగి భూమిపై జన్మించును. తిరిగి జీవిత చక్ర మారంభమగును.

''ఈ శరీరము నిజతత్త్వము నెరుగకపోవుటచేత, మానవుని కర్మలు, మరల మరల అతని నదే మార్గములో తీసుకుపోవును అతనికి యెన్నడును నిజమైన ఆనందము లభించదు కర్మ ప్రపంచములో మునిగిన మానవుని స్వభావమును 'ప్రవృత్తి' యందురు ఈ ప్రవృత్తిలో నిమగ్నమైన మానవుడు నన్ను యెన్నడును చేరలేడు ఈ ప్రవృత్తి గుణమును నివారింపగలిగినది 'నివృత్తి'

''సుఖమను భ్రమను కలిగించు యీ సుఖమయ ప్రపంచమునకు దూరముగా నుండుటే నివృత్తి కర్మేంద్రియములు మాత్రమే కర్మల నాచరించు చున్నవి. వానికి అధిష్ఠానమైన ఆత్మ కాదు తనలోనున్న గుణములను — సత్త్వ రజస్తమో గుణములు — పురస్కరించుకుని అతడు యీ లోకములో వర్తించుచు న్నాడు. అతడు, సంతోషము — విచారము, సుఖము — దుఃఖము అను ద్వంద్వ ప్రకృతుల చక్రగతికి లోబడుచున్నాడు. ఈ ద్వంద్వములు గుణములు, ఇంద్రియములు, వస్తు ప్రపంచముతో కలియుటచేత యేర్పడుచున్నవి.

''అహంకారము ఉన్నంత వరకు, మానవునిలోని ఆత్మ (జీవాత్మ) బహుళ ప్రపంచపు భ్రాంతిలో పడును. అటువంటపుడు, మానవుడు యితరులకు బానిసగా నుండుటలో ఆశ్చర్యము గలదా? నేను—నాది అను ద్వంద్వ భావములు మానవుని మనస్సులో నున్నంతవరకు, అతడు నాకు దూరమై, యీ బాధాపూరిత లోకములో మరింతగా తగుల్కొని యుండును ఉద్ధవా! నీవు నన్ను చేరదలచినచో, మొదట యీ పాఠమును నేర్చుకొనుము ఒకే ఒక 'సత్యము' గలదు. అదియే బ్రహ్మము ఈ లోకము, యిందలి అందమైన, ఆకర్షణీయమైన, ఆకట్టుకొను వస్తువులు ఆత్మను మభ్యపెట్టి తమవైపు లాగుకొనుటచేత, వానిచేత బంధమున పడినట్లుగా ఆత్మ భ్రాంతి పొందుచున్నది''

## 281 స్వేచ్ఛా మానవుడు

ఉద్ధవుడు మధ్యలో కల్పించుకొని ఒక ప్రశ్న యడిగెను ''ప్రభూ! ఆత్మ నిర్గుణమని, శరీరేంద్రియములు చేయు కర్మలచే బద్ధము కాక స్వేచ్ఛగా నుండునని తెలిపినారు. నేను దీని నవగాహన చేసుకొనలేకపోవుచు న్నాను. తన్ను గురించిన సత్యము తెలుసుకొనుట ద్వారా మానవుడు బంధ విముక్తుడు కాగలడను పాఠమును మీరు నాకు బోధించుచున్నట్లు తెలుసుకుంటిని ఈ బంధము నుండి మానవుడు విముక్తుడగునని మీరు తెలియజేయుటచేత, వేరే మరియొకటి బంధించుచున్నదనే అర్థము స్ఫురించుచున్నది ఈ బంధ విముక్తి గురించి విపులముగా తెలియజెప్పగోరెదను గుణాతీతుడైన-మానవుడు మోక్షము నందుకొనగలడా? లేక గుణము లున్నప్పటికివి మోక్షము లభించ గలదా? మానవ స్వభావములో గుణములు లేకుండిన అతడెట్లు జీవించగలడు? మిమ్ములను చేరు మార్గము నెట్లు కనుగొంలడు? గుణములు కలిగియున్నప్పటికిని స్వేచ్ఛను పొంద గలిగినచో, మానవు డేవిధముగా బద్ధుడగుచున్నాడు? దీనిని దయచేసి విశదీకరింపవలెను మానవునిలో గుణము లెప్పుడు నుండునని నేను అర్థము చేసుకొంటిని కాని మానవుడు నిర్గుణ భావముతో, గుణములచేత కలుషితముగాక యుండినపుడు బంధ విముక్త డగుననియు, తాను గుణము నుండి 'వేరు' అను విషయము విస్మరించినపుడు బద్ధుడగుననియు తెలియుచున్నది విముక్తి పొందిన జీవిని గుర్తించుటెట్లు? విముక్తుడు లేక స్వేచ్ఛా జీవి యీ మానవ లోకములో యెట్లు సంచరించును? సామాన్య మానవుడు, గుణములచే బద్ధుడు, యెట్లు వర్తించును? దీనిని వివరించి చెప్పగోరెదను''

కృష్ణుడు యిట్లు పలికెను ''ఉద్ధవా! నీ ప్రశ్నకు సమాధానము కొరకు యెంతో దూరము పోనవసరము లేదు· నన్ను చూడుము మాయ కలుగుచున్నవి ఈ మాయ అను వలను, గుణములను లోకమందు నేను విస్తరింపజేయుచున్నాను కాని నాకెటువంటి బంధములును లేవు. నేను

బంధముల నుండి విముక్తి పొందవలసిన ఆవశ్యకతయును లేదు! శరీర మనుభవించు సుఖ దుఃఖములు మాయచేత కలుగుచున్నవి ఇదివరకు నేను చెప్పినట్లుగా, నిద్ర నుండి లేచిన తర్వాత నిద్రలో గాంచిన స్వప్నమంతయు అసత్యమే ఉద్ధవా! జ్ఞానము లేక యెరుక, అజ్ఞానము లేక అవిద్య — యీ రెండును నా శక్తిచేతనే ప్రకటితమగుచున్నవి అవి నిత్యము, బంధమునకు విముక్తికి అవియే కారణము

''ఆకాశములోని చంద్రుని చూడుము అనేక సరస్సులు, చెరువులు, నీటితో నిండిన చిన్న గోతులు — వీటన్నిటి యందును చంద్రుని ప్రతిబింబమును గాంచవచ్చును. చల్లని గాలి వీచినప్పుడు, ఆ గాలికి నీటి ఉపరితలముపై కదలిక కలుగును అప్పుడు చంద్రుని ప్రతిబింబము ఊగుచున్నట్లు గోచరించును. ఇది ప్రతిబింబము నందు మాత్రమే కన్పడును ఆకాశము నందున్న చంద్రుడు యెట్టి కదలిక లేక ప్రశాంతముగా ప్రకాశించుచుండును. అదే తీరులో, గుణములు ఇంద్రియములు నీలోని ఆత్మను ఆడించుచున్నట్లు గోచరించును మరల వివరించెదను వివిధ ఆకార పరిమాణములు గలిగిన అనేక మట్టి పాత్రలలో సూర్యుడు ప్రతిబింబించును

''నీటితో నిండిన ఆయా పాత్రలందు ఒకే ఒక సూర్యుడు ప్రతిబింబించుచున్నాడు. ఏదైన ఒక పాత్ర పగిలి బ్రద్దలైనపుడు, ఆ పాత్రలోని ప్రతిబింబము తన ప్రత్యేకతను — పెద్దది, చిన్నది, వెడల్పైనది, యిత్యాది — కోల్పోయి, ఆకాశము నందున్న సూర్యునితో కలసి పోవును పాత్ర పగిలినప్పుడు మాత్రమే యీ ఏకత్వ మనునది సంభవించును అదే పూదిరిగా, 'నేను' అను భావము అసత్యమని తెలుసుకొనినపుడు, అతనిలో వెంటనే జ్ఞానోదయము కలుగును అట్టి వానికిక యెటువంటి బంధము నుండదు.

''నీకు మరొక దృష్టాంతము నిచ్చెదను. ఒ మఱ్ఱి చెట్టుపై రెండు పక్షులున్నవి. అవి చెట్టుపై గూడులను నిర్మించుకుని జీవించుచుండెను ఒక పక్షి గూడు చెట్టు చివరి కొమ్మపై యున్నది. ఆనందముగా తన చుట్టునున్న ఆకాశమును చూచుచున్నది చల్లని గాలిలో హాయి ననుభవించుచున్న ఆ పక్షికి ఆహార మవసరము లేకపోయెను రెండవ పక్షి దిగువన గూడు నిర్మించుకొనెను దినమంతయు ఆహారము
ఆ పక్షి , చుట్టును క్రిందను చూడగా చెట్టు నీడ తప్ప యింకేమియు కన్పించకుండెను. రెండు పక్షులు ఒక దానితో నొకటి యెక్కువ అనుబంధము పెంచుకొనెను. అవి రెండును కవల వలె నుండెడివి. అయితే వాటి పరిసర ప్రభావముచేత ఆ రెండింటి యందు భేదము ఉత్పన్నమయ్యెను. చివరి కొమ్మపై స్వేచ్ఛగా నున్న పక్షిని విముక్తి పొందిన జీవునితోను రెండువ పక్షిని మాయ అనే వలలో కూరుకున్న మనిషితోను వేదాంతులు పోల్చెదరు చివరి కొమ్మపైనున్న పక్షి, తనకు యితర పక్షులకు భేదమున్నట్లు భావించదు. కాని రెండవ పక్షి తన పాత మిత్రుడైన మొదటి పక్షితో సరిపోల్చుకుని తాను భిన్నమని భావించి యెపుడును విచారముతో నుండును

''ఆత్మయే బ్రహ్మమని గుర్తించని అవిద్యాపరుడు యెప్పుడును బద్ధుడై బాధ చెందుచుండును. సత్యమును గుర్తించి బంధ విముక్తుడైన మానవుని స్వేచ్ఛా జీవిగా పరిగణింతురు నిద్ర నుండి లేచిన మానవునకు స్వప్నము జ్ఞాపకముండును కాని అది అంతయు అసత్యమనియును, నిద్రలో మనస్సు సృష్టించిన భ్రాంతులనియును జ్ఞానము కలిగియుండును స్వప్నములో తాను బీదవాడుగా నుండుటచేత ఆకలి బాధ అతనిని వెంటాడదు లేక స్వప్నములో మహారాజుగా నుంటినని అతడు దర్పము అహంకారముతో చరించబోడు బంధములచేత బాధ చెందుచున్న అవిద్యాపరుని, స్వప్నమును గాంచుచున్న మానవునితో పోల్చవచ్చును స్వప్నములోనున్న

ప్పుడు స్వప్నము సత్యమని తోచును. అది స్వప్నమని గ్రహించుటకు, అతడు మెలకువలో నుండవలెను. అదే విధముగా మానవుడు బ్రహ్మము సత్యమను మెలకువ కలిగియుండవలెను. అపుడు అతడీ వస్తు ప్రపంచములో సంచరించినప్పటికిని అతని కెట్టి బంధములు నుండవు. తాను బ్రహ్మమనియును యీ వస్తు ప్రపంచ మంతయు భ్రాంతి యనియును తెలుసుకొనుటచేత, అది అతనిని బంధించలేదు.

వైరాగ్యము నలవరచుకొనిన మానవుడు యీ వస్తు ప్రపంచము నందు స్వేచ్ఛగా విహరించగలడు. వాని ప్రభావము అతనిపై యేమాత్రము ఉండదు. గుణ సహిత కర్మల చేతనే మానవుడు బానిస యగుచున్నాడని అతడు గ్రహించును. సంపూర్ణ వైరాగ్యము కలిగిన మానవునకు సామాన్య విషయములైన ఆహారము, వస్త్రములు, స్నానపానాదులు మున్నగు వానిపై అనురక్తి యుండదు. అతడు లౌకిక విషయములందు నిరాసక్తుడై యుండును. జీవితము, ఇంద్రియములు, మనస్సు వీనికి సంబంధించినంత వరకు. అతనికి ప్రత్యేకముగా సాధించవలసిన ధ్యేయము యేదియు లేక యుండును. కాబట్టి యీ మానవ లోకములో జీవించుచు యితరులతో సంచరించుచున్నప్పటికిని, అతడు స్వేచ్ఛగా తామరాకుపై నీటిబొట్టువలె నుండును. శారీరక ముగా యేదైన బాధ కలిగిన అతడు దానిని లక్ష్యపెట్టకుండును. ఎవరైన తన్ను పొగడినను ఉబ్బిపోక మెలగుచుండును. తనకు మంచి చేసిన వారిని శ్లాఘించి పొగడుట గాని, కీడు చేసిన వారిని నిందించుట గాని చేయకుండును. అతనికి మంచి చేయుటయందు గాని, చెడు చేయుటయందు గాని యెటువంటి ఆసక్తియు లేక యుండును. అతని దృష్టిలో అన్నియు ఒకటే, అనగా సమభావము ప్రదర్శించును. అతని మాటలలో యీ సమత్వ దృష్టి గోచరించుటచేత అతనిని మూర్ఖుడుగా కొందరు భావింతురు. కాని దానివలన అతడు ప్రభావితుడు గాక యుండును.

''ఉపనిషత్తులందు బ్రహ్మమును శబ్ద బ్రహ్మముగా నిర్వచించిరి. ఉపనిషత్తులను సంపూర్ణముగా చదివి తెలుసుకున్న వారిని నేనెరుగుదును. ఉపనిషత్తులను కంఠస్థము చేసి వల్లించగల వారెందరో యున్నారు. కాని అందులో వర్ణించిన పరమాత్మను వారు గ్రహించలేకపోవుచున్నారు. అట్టివారు క్షీరము నొసగలేని గోవుల వంటివారు.

''ఉద్ధవా! క్షీరము నొసగని గోవు, ప్రేమించలేని భార్య, దుఃఖములకు బాధలకు ఆలవాలమైన దేహము, అప్రయోజకుడైన కుమారుడు, అర్హులైన వారికి యివ్వని ధనము, మానవునకు యితోధికముగా దుఃఖమునే కలిగించును. ఈ సత్యమును విశ్వసింపుము.

''మానవుడు విశేషమైన విద్యా ధనము గలిగి యుండవచ్చును. కేవలము వేదములు, శాస్త్రములు నేర్చి పాండిత్యము సంపాదించుట వలన ప్రయోజనము లేదు. నా అవతారములను గురించిన కథలు వినకుండినచో వైదిక విద్యా ధనము నిష్ఫలమగును. ఉద్ధవా! నాపై పూర్తిగా మనస్సు లగ్నము చేసి నన్ను గురించి మాత్రమే యోచించుట యెవరికైనను సులభము కాదు. అటువంటి మానవుడు కర్మ యోగము చేయవచ్చును. ఈ లోకములో కర్మల నాచరించనిమ్ము. కాని, యెట్టి పరిస్థితి యందైనను కర్మ ఫలితముల నాశించి కర్మలు చేయుట మాత్రము తగదు. తాను చేయు ప్రయత్నములకు ప్రతిఫలము నాశించరాదు. ఈ విధముగా ప్రతిఫలాపేక్ష లేక కర్మ లాచరించుచు, నన్ను తరుచుగా తలచుచుండిన యెడల, అతడు త్వరలో నాకు భక్తుడై నన్ను చేరగలడు''.

# 282 భక్తి — నిర్వచనము

ఉద్ధవుడు కృష్ణుని యీ విధముగా అడిగెను. ''కృష్ణా! భక్తి అనగా యేమిటి? ఎటువంటి సాధువు నీకు ప్రియమైనవాడు? నారదుని వంటి మహర్షులు నీకు అత్యంత ప్రియులని నేనెరుగుదును. ఎటువంటి గుణములు భక్తునిలో అధికముగా నుండవలెను?''

కొద్దిగా చిరునవ్వు నవ్వి కృష్ణు డిట్లనెను. ''నాకు ప్రియమైన వానిలో తప్పక అనేక గుణము లుండును. అన్నింటిలో అతి ప్రధానమైన గుణము కరుణ కలిగి యుండుట. ఇతరుల బాధలను చూచిన మానవునిలో కరుణ ఉప్పొంగవలెను. ఇతరులకు తన యందున్న నమ్మకమును వమ్ము చేయరాదు. ఓర్మి కలవాడై యుండవలెను. ఎవ్వరిపైనను అసూయ లేక యెట్టి పరిస్థితులలోను సత్యము వీడక చరించవలెను. సుఖ సంతోషములు కలిగినపుడు ఉబ్బి తబ్బిబ్బు కారాదు. బాధ, దుఃఖము కలిగినపుడు క్రుంగి కృశించిపోరాదు. ఇతరులకు సాధ్యమైనంతవరకు సహాయము చేయుచుండవలెను. తానేర్పరచుకున్న సరియైన మార్గము వీడి ఇంద్రియ లోలుడు కారాదు. ఇతరుల బాధలను చూచి హృదయము ద్రవించవలెను. తనకు యిక్కట్లు సంభవించినపుడు, స్థిరముగా నుండి ధైర్యముతో వాని నెదుర్కొనవలెను.

''అతడు పరిశుద్ధుడుగా, అనగా నిష్కళంకముగా జీవించవలెను. కోరిక లుండరాదు, కాబట్టి ప్రతిఫలము నాశించి యే కార్యము చేయరాదు. మితిమీరి భుజించరాదు. మనస్సు నెల్లపుడును ప్రశాంతముగా నుంచుకొనవలెను. భక్తునికి సమదృష్టి అత్యంత ప్రధానము. దైనందిన కార్యములను నిత్య విధులను యెట్టి కొరతయు లేక సలుపవలెను. కాని యెప్పుడును నన్ను తలచునట్లు మనస్సుకు శిక్షణ నీయవలెను. ఎట్టి పరిస్థితులలోను ఉద్రేకము చెందరాదు. మనస్సులో చెలరేగు అలజడులు, ఆపత్కార సంఘటనలు, మానసిక ప్రశాంతతకు భంగము కలిగించకుండ మెలగవలెను. ఆకలి — దాహము, విచారము — సంతోషము, వృద్ధాప్యము — మరణము, యీ ఆరింటికి భయపడరాదు.

''ఇతరుల నుండి స్తుతి గౌరవముల నాశించరాదు. కాని యితరులకు గౌరవాదరములు చూపుటలో తన కర్తవ్యమును విస్మరించరాదు. ఎవరైనను కడు శ్రద్ధ కనపరచి తన నుండి నేర్చుకొనవలెనను కుతూహలము చూపినపుడు, వారికి జ్ఞాన బోధ చేయుటకు వెనుకాడరాదు. ఇతరులను మోసపుచ్చరాదు. ఇతరులకు మంచి చేయు కార్యములు తప్ప యింకెట్టి కార్యములు తలపెట్టరాదు. ఇక్కట్టులలోనున్న వారిపై కరుణ జూపి వారి బాధను తొలగించవలెను. పైన వివరించిన యీ గుణములు కలిగినవాడు నన్ను పూజించినచో అతడు కొంత కాలమునకు నారదాది మహర్షుల వలె నాకు అత్యంత ప్రీతి పాత్రుడగును. అప్పుడతడు నిత్య విధులను చేయనవసరము లేదు. నిరంతరము నన్ను ధ్యానించుచుండవచ్చును.

''అటువంటి వాడు పవిత్ర మానవుని వలె గోచరించుటకు ప్రయత్నించడు. మరియు యితరులకు తాను చేసిన మంచి కార్యములను గురించి చెప్పుకొనడు.

''ఉద్ధవా! నీవు నా భక్తుడవు, ప్రీతి పాత్రుడవు. అందుచేతనే రహస్యములలో కెల్ల అతి రహస్యమైన యీ భక్తి యోగమును, అనగా నా ప్రేమను పొందు పరమ రహస్యమును నీకు వివరించెదను.

''హఠ యోగము, ప్రాణాయామముచేత నా ప్రేమను పొందలేరు. సత్పురుష సాంగత్యముచేత నా ప్రేమను

పొందవచ్చును. సాంఖ్య శాస్త్ర జ్ఞానము పొందినవారుగాని, సాంఖ్య శాస్త్ర బోధలను నేర్చి గ్రహించిన వారుగాని, భక్తులు నన్ను మెప్పించినట్లు, మెప్పించలేరు. నిరంతర వేద పఠనము, తపస్సు, సన్యాసము, అనగా భౌతికమైన వస్తు ప్రపంచమును త్యజించుట — యివి యేవియు నాకు ప్రీతిని కలిగించవు జ్ఞానులు సూచించిన అనేక వ్రత పూజాదులు కూడ నాకు యెక్కువ ప్రీతికరములు కావు ప్రేమకు, కేవలము ప్రేమకు మాత్రమే, నేను స్పందించెదను నన్ను చేరిన వారందరుమ శుద్ధ ప్రేమ అనగా భక్తి చేతనే చేరగలిగిరి భక్తికి కుల మత భేదములు లేవు. నా భక్తులైన కొందరి నామములు నీకు సూచించెదను వృత్ర, ప్రహ్లాద, బలి, బాణాసుర, మయ, విభీషణ, సుగ్రీవ, హనుమాన్, జాంబవాన్, గజేంద్ర, జటాయు, తులాధర, ధర్మవ్యాధ, త్రివక్ర యనువారు, బృందావన గోపికలు, యజ్ఞ పత్నులు, మరింకెందరో, తమ భక్తిచేత నన్ను చేరగలిగిరి. వారు వేదము లెరుగరు వారు జ్ఞానార్జనకై యే గురుకులము నందును గురువు వద్ద విద్య నభ్యసించలేదు వారు వ్రతము లాచరించలేదు. తపస్సు చేయలేదు. సాధు సాంగత్యము చేత వారు నన్నే తలచుచు నన్ను చేరి నా వారైరి. నదీ జలము సముద్రములో కలియునపుడు దాని ప్రత్యేకతను కోల్పోవును. మునులు సమాధి స్థితి పొందినపుడు, వారికి తమ నామములు గృహములు జ్ఞాపకముండవు. అదే విధముగా, గోపికలకు నేను వారి మధ్య నున్నపుడు నాతో గడిపిన కాలము తప్ప యింకేదియు వారికి జ్ఞాపకము లేదు వారు తప్పక నన్ను చేరుదురు. నన్ను భౌతికముగా పొందవలెనను కోరిక గలిగి యుండుటే వారు నన్ను పూజించు విధానము. వారికి తమ భర్తల యెడ విశ్వాసము లేనట్లు గోచరించినంత మాత్రమున వారికున్న భక్తియితరులకు నాపైగల భక్తికి యేమాత్రము భిన్నము కాదు ఉద్ధవా! కాబట్టి నీవు తపస్సు చేయవలెనను సంకల్పమును విరమించుకొనుము. నీ గృహస్థ జీవిత విధులను చేయుటయందు, సన్యాసము స్వీకరించి దానికి సంబంధించిన విధులను చేయుట యందు, వేదములు సూచించు యితర చిల్లర విధులు చేయుట యందు కాలము వృథా చేయకుము వాని గురించి నీవు ఆందోళన చెందకుము నన్ను ప్రార్థింపుము నీ మనస్సును నాపై లగ్నము చేసి నా పాదముల వద్ద ఆశ్రయమునకు యత్నించుము. నీవు నన్ను చేరగలవు''

## 283 కర్మయోగ భక్తియోగములు

ఉద్ధవుడు కృష్ణునితో నిట్లనెను. ''కృష్ణా! నా కంతయు అయోమయముగా నున్నది కొన్ని క్షణముల క్రితము నీవు 'కర్మలను చేయుట మానవలసిన అవసరము లేదు పైగా నిత్య విధులను యితర కర్మలను చేయుము', అని చెప్పినావు. ఇపుడు అన్నియు వదలివేయమని చెప్పుచున్నావు ఈ రెండు పరస్పర విరుద్ధములైన మార్గములను కొంచెము విశదీకరించి బోధపరుచుము''

''నీవు కోరినట్లుగా విశదీకరించి చెప్పెదను'' అని కృష్ణుడనెను. ''నీకు తేలికగా అర్థమగునట్లు చెప్పుటకు నేను యీ సృష్టి ప్రారంభము నుండి చెప్పవలెను ఈశ్వరుడు మాయను సృష్టించినపుడు యీ విశ్వము ఉద్భవించినది. ఆ తరువాత పంచ భూతములు, ఇంద్రియములు, తన్మాత్రలు తదుపరి అనేక లోకములు ప్రావిర్భవించినవి ఈశ్వరుడు విశ్వమంతటను వ్యాపించి యున్నాడు కాని మాయచేత మానవుని మనస్సును అవిద్య ఆవరించి యున్నది ఆ కారణముగా ఈశ్వరుని విశ్వ వ్యాపకత్వము మరుగునపడి యున్నది 'నేను కర్తను, కర్మ ఫలితములను నేను అనుభవించుచున్నాను' అను భ్రాంతిలో మానవుడు చిక్కుకుపోవుచున్నాడు

ఈ భ్రాంతి కొనసాగి 'నీవు యిది చేయవచ్చును, యిది చేయరాదు' మొదలైన అనేక స్వల్ప విషయములకు దారి తీయుచున్నది. క్రమముగా సాత్త్విక గుణమును పెంపొందించుకొనుటకు మానవుడు కొన్ని కర్మలను చేయవలసి యున్నదని చెప్పవలసి వచ్చెను. సాత్త్విక గుణము పెంపొందినపుడు మనస్సు పరిశుద్ధముగా నుండును. ఒకసారి మనస్సు పరిశుద్ధమైన తర్వాత మానవుడు 'కర్మ' బంధము నుండి విముక్తిపొందగలడు.

''కర్మల తోడి అనుబంధము త్రెంచుకొనుటకు మనస్సుకు శిక్షణ నీయవలెను. అనగా కర్మ స్థానములో భక్తిచోటు చేసుకొనవలెను. సమస్తమును త్యజించి ఈశ్వరుని పాదముల నాశ్రయించవలెను. బ్రహ్మమును చేరుటకు చేయు ప్రయాణములో మార్గము నందు యెదురైన అనేక అవాంతరములను దాటుటకు నిత్యము భక్తినభ్యసించవలెను. బ్రహ్మ స్థితిని చేరిన తర్వాత కర్మ చేయవలసిన ఆవశ్యకత లేదు. దానికి ప్రాముఖ్యము కూడ లేదు. జీవుడు, అనగా ఈశ్వరుడే ద్రష్ట. చూడదగిన దింకేదియూ లేదు. పంచభూతములతో కూడిన యీ లోకము తరువాత యేర్పడినది. ఈశ్వరుడే గుణములుగా రూపొంది, ఆ గుణముల మూలముగా యేర్పడు లీలలు కూడ తానే అగుచున్నాడు. దారములతో వస్త్రము నేసినట్లుగా, ఈ లోకమంతయు ఈశ్వరుని ప్రదర్శనమే.

''రెండు వెదురు కర్రలు ఒకదానితో నొకటి రాపిడి చేసినపుడు, అగ్ని పుట్టుచున్నది. ఈ అగ్ని అరణ్యము నంతను దహించిన తర్వాత, తాను అదృశ్యమగుచున్నది. అదే రీతిగా, పంచభూతములు, గుణములతో యేర్పడిన దేహము అవిద్య తొలగినంతనే నశించును. అవిద్య అను పొరను ఉపసంహరించినపుడు, జీవాత్మ పరమాత్మతో యేకమగును. 'నేను' అను అహంకార భావము నశించును. అపుడు ప్రత్యేకమైన ఉనికి యుండదు.

''సంసారమను వృక్షమునకు పాప పుణ్యములను రెండు విత్తనములు గలవు. వందల కొలది వాసనలు యీ సంసార వృక్షమునకు వేరులుగా నున్నవి. ఈ వృక్షము ప్రాను త్రిగుణములతో యేర్పడినది. ఈ వృక్షము కొమ్మలు పంచభూతములు. ఈ వృక్షమునకు జీవము నిచ్చునవి తన్మాత్రలు — శబ్ద స్పర్శ రూపరస గంధములు. దశేంద్రియములు వృక్షము కొమ్మల ఉపశాఖలు.

''జీవాత్మ పరమాత్మ అనునవి యీ వృక్షముపై గూడులు నిర్మించుకొన్న రెండు పక్షులు. సుఖ దుఃఖము లనునవి యీ వృక్షము అందించు రెండు ఫలములు. ఈ మాయా ప్రపంచపు సౌఖ్యములలో నిమగ్నులైన గృహస్థులు రెండు ఫలములలో ఒకటైన దుఃఖమను ఫలమును రుచి చూతురు. అసత్యమైన యీ భౌతిక వస్తు ప్రపంచమును విడిచి పెట్టిన సన్యాసులు, జ్ఞానులు నిత్యసుఖమను ఫలమును రుచి చూతురు.

''కాబట్టి, ఉద్ధవా! నీ వివేక శక్తిచేత యీ సంసారమను వృక్షమును ఛేదించుము. దీనిని నాశనము చేయుము. అపుడు నన్ను చేరుటకు నీకు స్వేచ్ఛ లభించును. ఈ నిత్య సుఖమను ఫలమును ఒకసారి రుచి చూచిన తర్వాత, యింకేదియు నిన్ను ఆకర్షించదు. మానవ లోకములో నీవు స్వేచ్ఛగా సంచరించగలవు. నీవు జీవించునంత వరకు చేయు కర్మలలో తగులుకొనక యుందువు. నీ మనస్సు నాయందు లగ్నము చేయుము నీవు విముక్తుడ వగుట నిశ్చయము''.

# 284 హంస అవతారము

కృష్ణుడు బోధించిన విషయముల నవగాహన చేసుకుని ఉద్ధవుడు సంతృప్తి చెందెను తరువాత అతడు మరొక ప్రశ్నకు సమాధానము కోరెను ఉద్ధవు డిట్లడిగెను ''కృష్ణా! సామాన్య వివేకము గలిగిన మానవునకు ఇంద్రియముల కాసక్తి కలిగించే వస్తువులు ప్రమాదకరమని తెలిసినప్పటికిని వాని వెంట పరుగెత్తుచుండును ఎందుచేత?'' కృష్ణు డిట్లనెను. ''ఉద్ధవా! నీ ప్రశ్న చాల సముచితముగా నున్నది మానవునకు వివేక మున్నప్పటికిని, మమకార మను భయంకర రోగము అతనిని పీడించుచున్నది అహంకారము అతనిలోని మంచి లక్షణములను మట్టుపెట్టును. ఈ అహంకారము మానవుని జీవితమును నడిపించునపుడు, అహంకారము అతని ప్రవర్తన తీరును నియమించునపుడు, ఒకప్పుడు సత్త్వ గుణముతో నిండిన అతని మనస్సు యిపుడు రజో గుణముచేత కలుషితమగుచున్నది ఇది జరిగినపుడు మానవుడు తనకు తానిట్లు చెప్పుకొనును. 'ఈ సౌఖ్యమును నేననుభవించి తీరవలెను దీనివలన నాకు సంతోషము, సుఖము కలుగును', అని అనేక విధములుగా భావించును. త్వరలోనే అతని కోరికలు ద్విగుణీకృతమగును ఇంద్రియములను నిగ్రహించలేని అశక్తుడగును అతనిలోని రజోగుణము తాను చేయు కర్మల పర్యవసానము తెలుసుకొనలేనంత గుడ్డి వానిని చేయును హృదయాంతరాళములో తాను చేయునది తప్పు అని యెరుగును. అయినప్పటికిని అతి శక్తిమంతమైన ఇంద్రియముల ప్రభావమునకు లొంగిపోయి అశక్తుడగును

అటువంటి దుర్భర పరిస్థితులలో నున్న మానవుని నేను రక్షించగలను, కాని అతడు నన్ను తలచవలెను అటువంటి మానవుడు ప్రాణాయామము నేర్చుకొనుట మంచిది. మానవుడు అలసత్వము అనగా బద్ధకము విదిలించుకుని త్రికాల సంధ్యా సమయములందు, అనగా దినమునకు ముమ్మారు మనస్సును నాపై లగ్నము గావించవలెను. కొంత కాలమునకు మనసును నిగ్రహించగలిగి, పతనము చెందక, రక్షణ పొందును ఈ పాఠమునే అనేక సంవత్సరములకు పూర్వము సనకాది సోదరులకు హంస రూపములో బోధించితిని''.

ఉద్ధవునిలో కుతూహలము యినుమడించెను భగవంతుడు యే ప్రయోజనము కొరకు హంస రూపము ధరించి అవతరించెనో అతడు తెలుసుకొనగోరెను. అతని మనో భావమును గ్రహించిన కృష్ణు డిట్లు చెప్పసాగెను ''బ్రహ్మకు మనస్సు నుండి నలుగురు పుత్రులు జన్మించిరి వారే సనక సనంద నాదులు — మొత్తము నలుగురు ఒకసారి వారు తండ్రి వద్దకు వెళ్ళి యేది అత్యుత్తమ యోగమని అడిగిరి వారిట్లడిగిరి 'తండ్రీ! సహజముగా మానవుని మనస్సు ఇంద్రియ ప్రేరణల ననుసరించును కామక్రోధములను అరిషడ్వర్గము మానవుని వివేకమును వశము చేసుకుని దానిని మరుగు పరచుచున్నది వస్తు ప్రపంచము నందు కలిగిన ఇంద్రియాను భవములు 'వాసనా' రూపములో మనస్సునందు ప్రవేశించుచున్నవి ముముక్షువు, అనగా మోక్షము నపేక్షించువాడు యీ రెండింటి నెట్లు విడదీయగలడు? వస్తు ప్రపంచము నుండి ఇంద్రియముల నెట్లు ఉపసంహరించవలెను?' నా కోరికపై సృష్టి కార్యమును నిర్వహించుచున్నప్పటికిని, నాకు జన్మించినప్పటి కిని, బ్రహ్మ వారి ప్రశ్నకు సమాధానము చెప్పలేకపోయెను. దీనికి కారణము బ్రహ్మ కూడ కొంతవరకు కర్మ, దాని పర్యవసానమందు తగుల్కొని యుండుటయే బ్రహ్మ నన్ను తలచుకొనగా, హంస రూపములో నేను అతని ముందు ప్రత్యక్షమయినాను సనక సనందాది సోదరులును, బ్రహ్మయు నాకు సాష్టాంగ ప్రణామము చేసి యిట్లడిగిరి 'నీవెవరైయుండవచ్చును?' నేనిట్లంటిని 'విశ్వ వ్యాపకమైన శక్తి పరమాత్మ అఖండమైనదని యెరిగి యున్నపుడు మీరడిగిన ప్రశ్న యెట్లు ఉదయించగలదు? ఒకే ఒక బ్రహ్మము అందరిలో నివసించు

చున్నప్పుడు ప్రత్యేకించి నేను యెవరని యెట్లు చెప్పగలను? అయినను మీ ప్రశ్నకు సమాధాన మిచ్చెదను.

'' 'నేను బ్రహ్మము అను సత్యమును మనస్సు, ఇంద్రియములు, వాక్కు, దృక్కులు ద్వారా గ్రహించవలెను. నేను కానిది యింకేదియును లేదు. మీరు మీ తండ్రిని విశదీకరించమని అడిగిన సమస్య నాకు తెలుసును.

'' 'మనస్సు ఇంద్రియములకు లోబడి యుంటున్నది. ఇంద్రియములకు మనస్సుపై విశేషమైన ప్రభావము గలదు. కాని మనస్సు, గుణములు, ఇంద్రియములు, నా అంశములే యని గుర్తించినపుడు మీ ప్రశ్నకు తావు లేదు. ఇంద్రియముల నుండి, వాసనల నుండి మనస్సు నెట్లు ఉపసంహరించ వలెనని మీరు మీ తండ్రి నడుగుచున్నారు. నేను మీకు చెప్పెదను. ఇది చాల సులభము. మనస్సు, ఇంద్రియములు, వాసనలు నాకు భిన్నమైన వను భావమును వదలిపెట్టుడు. ఈ సత్యము గ్రహించి, ఇంద్రియము లపేక్షించు వస్తువులపై కోరికలను విడనాడుటయే అత్యుత్తమమైన అవలంబింపదగిన యోగము.

'' 'జాగ్రత్ స్వప్న సుషుప్తులు ఒకే ఒక మనస్సు యొక్క మూడు ప్రత్యేక స్థితులు, లేక అవస్థలు. కాని యీ మూడింటి యందు ఒకటి యుంటున్నది. ''నేను మెలకువగా నున్నాను'', ''నేను కలగన్నాను'', ''నాకు మంచి నిద్ర పట్టినది'' అని మానవులందురు. ఈ మూడు స్థితులందున్న ఒకే ఒక వస్తువు ఆయా స్థితులను దర్శించుచున్నది. అదియే సత్యము. మెలకువ స్థితిలో కలిగే దుఃఖములతో గాని, స్వప్న స్థితిలో విహరించునపుడు పొందు ఉద్రేకముతోగాని, యెటువంటి భావములు, ఆలోచనలు లేక గాఢ సుషుప్తి స్థితిలో సంతోష విచారములు లేనట్టి స్థితిలో గాని ప్రమేయము లేక యుండునదే సత్యము.

'' 'నీలో ఉంటూ ఆ మూడు స్థితులను యెటువంటి ప్రమేయము పెట్టుకొనక దర్శించునది నేనే. ఈ మాయా లోకములో నిత్య సత్యమైనది 'నేను' మాత్రమే యని మానవుడు గ్రహించి, మనస్సును ఆత్మలో లీనము గావించి, ఇంద్రియములకు వస్తు ప్రపంచముతోనున్న అనుబంధమును విడనాడవలెను. అపుడు మానవుని యెదుగుదలకు వాసనలు యే విధముగాను ఆటంకపరచలేవు. బుద్ధిని, విచక్షణాశక్తిని వినియోగించవలెను. మానవుని అధోగతికి తీసుకుపోవు మాయా శృంఖలములను పదునైన బుద్ధితో ఛేదించవలెను.

'' 'అహంకారము చేత లోకముతో అనుబంధము యేర్పడుచున్నది. అహంకారము వణగద్రొక్కి మానవుడు నాకు శరణాగతుడైనచో మీరు అభిలషించు బ్రహ్మస్థితిని మానవుడందుకొనగలడు. ఈ లోకమంతయు పరబ్రహ్మ స్వరూపమేనని గ్రహించవలెను.

'' 'ఈ యెరుక మానవునకు కలుగనంత వరకును, కర్మకాండ నిర్దేశించిన నిత్య విధులను అతడు చేయుచున్నప్పటికిని, తమస్సులో నున్నట్లుగా చెప్పవలెను. కర్మకాండ చేయుట మూలముగా లభించు ఫలితములు — స్వర్గలోకవాసము, స్వర్గ సుఖములు మున్నగునవి — కూడ భ్రాంతితో కూడుకొని యున్నవి. ఏలననగా అవి నేను సృష్టించిన మాయలో భాగమే.

'' 'జాగ్రదవస్థలో మానవుడు ఇంద్రియము లన్నిటి ద్వారా అనుభవించు వస్తు ప్రపంచము నశించునది, అశాశ్వతమైనది. అదే మానవుడు స్వప్న ప్రపంచములో మనస్సు వాసనలు సృష్టించు వస్తు సముదాయము ననుభవించుచున్నాడు. సుషుప్తి స్థితిలో, మేలకువ కలిగేవరకు, అన్నింటినీ మరిచి యుంటున్నాడు. జాగ్రదవస్థలో మెలకువగా నున్నది, స్వప్నావస్థలో స్వప్నమును గాంచునది, సుషుప్తిలో గాఢ నిద్ర చెందునది

తానేనని గ్రహించిన మానవుడు బ్రహ్మము గురించి సత్యము తెలుసుకొను మార్గము ననుసరించగలడు. అటువంటి మానవుడు తాను చేయు కర్మలకు తాను సాక్షిగా నుండును

'' 'అవస్థా త్రయమను నీ మూడు స్థితులకు మూలము అవిద్య అనగా అజ్ఞానమను చీకటి. ఈ అవిద్య కూడ నా అంశమే. ఈ విషయమును మానవుడు అవగాహన చేసుకొనగలిగినచో బంధ విముక్తుడగును శ్రుతులు యీ విషయమును నీకు బోధించినవి. జ్ఞానులు యీ సత్యమునే తెలిపిరి. నీ మట్టుకు నీవు, వివేక శక్తిని వినియోగించి యీ విషయములపై తీసుకొను అంతిమ నిర్ణయముల ద్వారా అహంకారమును వీడి సత్యమును గ్రహించగలవు

'' 'ఈ లోకము మాయ సృష్టించిన దగుటచేత 'మాయిక' అని పేరొందినది ఇది నిన్ను దిగ్భ్రాంతుని చేయగలదు. చేతిలో కొరవినిగాని, దీపమునుగాని పట్టుకుని వడి వడిగా చెయ్యిని చక్రాకారములో త్రిప్పినచో ఒక అగ్ని చక్రము వలె గోచరించును అగ్ని చక్రము కేవలము భ్రాంతి, కొరవి లేక దీపము మాత్రము సత్యము. అదే మాదిరిగా యీ లోకమందలి వస్తువులు మాయా ప్రభావముచేత భ్రాంతిని పుట్టించుచున్నవి. ఎరగని మనస్సు యీ భ్రాంతికి లోబడుచున్నది. ఒకే ఒకటి బహుళముగా చూపట్టుచున్నది ఆ ఒకటి 'నేను'. ఈ ప్రాథమిక సత్యము నర్థము చేసుకున్నచో, నీవు మాయా ప్రభావమునకు లోబడక భ్రాంతి చెందకుండ నుండెదవు ఈ లోకములోని భౌతిక సుఖములన్నియు లభింపబోవు స్వర్గ సుఖములు సైతము, అసత్యములని తెలుసుకొందువు ఈ శరీరము ఆయుః ప్రమాణమున్నంత వరకు లోకములో జీవించక తప్పదు. అయితే విచక్షణాశక్తి కలిగిన బుద్ధి ఆత్మ సహజ స్వభావమును గ్రహించిన వెంటనే ఆత్మ విముక్తి పొందగలదు. ఇట్టి అవగాహన కలిగిన జీవన్ముక్తునకు, యీ లోకమందు మరొక క్షణము జీవించినను లేక మరి వంద సంవత్సరములు జీవించినను, ఒకటిగానే యుండును.

'' 'పరమ యోగులు తమ హృదయ గహ్వరములందు అన్వేషించు అంతిమ సత్యము అనగా బ్రహ్మము 'నేనే'. ఈ నిత్య సత్యమును నీకు బోధించుటకు వచ్చితిని నీవు దీనిని మానవలోకమందు ప్రచారము గావించు నుద్దేశ్యముతో బోధించితిని నన్ను గురించిన సత్యము తెలుసుకొనిన వారెవరును త్రిగుణముల కలయికచేత యెట్టి యిక్కట్టులకు గురికారు వారికి కోరికలు ఉండవు అన్ని జీవులందు ఉండునది ఒకే బ్రహ్మమని తెలుసుకుని, సమస్త జీవులపై ప్రేమ, కరుణ కలిగి యుందురు' ''.

కృష్ణుడు తన ప్రసంగమును కొనసాగించి యిట్లనెను. ''ఈ సత్యమును సనక సనందనాది సోదరులకు బోధించి అదృశ్యమైతిని''

## 285 భక్తి— మరొకసారి

భక్తియోగ విశిష్టతను గురించి ఉద్ధవుడు తెలుసుకొనగోరెను. అతడిట్లనెను ''కృష్ణా! మోక్షమునకు అనేకులు అనేక మార్గములు చెప్పెదరు అవి ఒకే గమ్యమునకు చేర్చగలవా? ఎవరికి వారు వారికి యిష్టమైన మార్గము నెంచుకొని వారి పద్ధతిలో వారు గమ్యము చేరుదురా? ఇంతకు ముందు నీవు చెప్పిన భక్తియోగము అన్నింటికన్న ఉత్తమమైనదా? అన్ని అనుబంధములను తెంచుకుని, మనసు రాత్రింబవళ్ళు నిన్నే చింతించుటకు భక్తియోగము

ఉత్తమ సాధనమా?''

భగవంతుడిట్లు సమాధాన మొసగెను. ''నేనింతవరకు చెప్పినది నీకు బాగుగా బోధపడినచో, భక్తియోగము ఉత్తమ సాధనమను దృఢ విశ్వాసము నీకు కలిగి యుండవలెను. అయినను మరియొకసారి దీనిని గురించి విశదముగా చెప్పెదను.

.''మహా ప్రళయము సంభవించినపుడు, ధర్మమునకు కీలకమైన వేదములు జలమందు మునిగిపోయినవి. సృష్ట్యాదిలో సృష్టికర్త బ్రహ్మకు వేదములు బోధించితిని. అతడు తన కుమారుడైన మనువుకు బోధించెను. క్రమముగా అవి భృగు, మరీచి, మున్నగు వారు నభ్యసించిరి. వారు వారి కుమారులకు బోధించిరి. ఆ విధముగా వేద ప్రబోధములు లోకమందు ప్రచారమై వ్యాప్తి గాంచెను.

సృష్టి జరిగి ప్రకృతి ఆవిర్భవించినపుడు గుణములు కూడ ఆవిర్భవించెను. అవి కామమునకు, తదుపరి వాసనలకు కారణభూతము లయ్యెను. ఎవరికి వారు వారి వారి వాసనలను పురస్కరించుకుని వేదములకు భాష్యములు చెప్ప దొడగిరి. దీనికొక కథ గలదు.

''దేవతలు, అసురులు, మానవులు, సరియైన జీవితము జీవించుటకు మార్గమును సూచించమని ప్రజాపతిని కోరిరి. ప్రతి ఒక్కరికి ప్రజాపతి ''ద'' అని సమాధాన మిచ్చెను.

''ద — అనగా 'దమయత' యని దేవతలు అర్థము చేసుకొనిరి. దమయత యనగా ఇంద్రియముల నిగ్రహించుట. అసురులు 'దయధ్వం' అనగా యితరులపై కరుణ కలిగియుండుట అని గ్రహించిరి. మానవులు 'దత్త' అనగా దాన గుణము కలిగియుండుట అని తెలుసుకొనిరి. చేతనైనంతవరకు దానము చేయుము. ఉద్ధవా! ఈ మూడు తరగతులకు చెందిన వారిని వారి వాసన లేవిధముగా ప్రభావితము చేసెనో చూడగలవు. దేవతలు ఇంద్రియ లోలత్వమునకు, అసురులు క్రూరత్వమునకు, మానవులు లోభత్వమునకు ప్రసిద్ధి చెందిరి. అందుచే వారు 'ద' అను ఒకే అక్షరమును వారి వాసనల కనుగుణముగా అర్థము చెప్పుకొనిరి.

''మోక్షమను పదమునకు పలువురు పలు విధములుగా నిర్వచనములు చెప్పిరి. కర్మకాండను నలుపువారు ధర్మము మోక్షము అను రెండింటిని పర్యాయ పదములుగా పరిగణించిరి. కావ్యాలంకారముల నభ్యసించి అధ్యయనము చేసినవారు కీర్తిని పొందుటే మోక్షముగా తలంచిరి. వారి దృష్టిలో మానవుడు స్వర్గ సౌఖ్యములను కొంత కాలమనుభవించును. ఇది, భూమిపై మానవుని కీర్తి వెలసిన కాలమునకు వెయ్యింతలు. కొంతమంది కోరికల నీడేర్చుకొనుటయే మోక్షమని భావింతురు! మనో నియమనము, ఇంద్రియ నిగ్రహము, సత్య వచనము మోక్షమని సత్య సంధులు తలచెదరు. యజ్ఞము, తపస్సు, దానము, వ్రతము — యివి అన్నియు మోక్షమని పలువురు తలచెదరు.

''వీని మూలముగా ప్రతిఫలము పొందినవారు లేకపోలేదు. స్వర్గసౌఖ్యములు మున్నగు వాని కొరకై ప్రయత్నించి సాధన చేసినవారు స్వర్గవాసము కొంత కాలము అనుభవించిరి. కాని ఉద్ధవా! వీనికన్నింటికి ఆది — అంతము గలవు. ఆదిలో నుండు సౌఖ్యము అంతమున దుఃఖముగా మారును.

''నా యందు భక్తి కలిగి యుండిన యెడల ఫలితములు వేరొక రీతిగా నుండును. ఒక వంక యిటువంటి స్వర్గ సౌఖ్యములు, మరొకవంక నాకు శరణాగతు డైనందువలన నిత్య సుఖము లభించగలదు. నా భక్తుని

కెటువంటి వాంఛలు, కోరికలు నుండవు. నన్ను తలచవలెనను కోరిక తప్ప యింకే కోరికయు నుండదు. అల్పమైన స్వర్గ సుఖములు అనంతమైన చిదానందముతో యెట్లు సరిపోలును? నా భక్తునికి తనది యనున దేదియు నుండదు, దేనిని పొందుట కిచ్ఛగింపడు. అతడు యిది వరకే ఇంద్రియములను జయించి యున్నాడు. అతడు మనసా వాచా కర్మణా నన్ను మాత్రమే తలచుచుండును. నా భక్తుడు సమదృష్టి కలిగి యుండుటలో అత్యుత్తమ స్థాయి చేరుకొనుటచేత అతనికి స్వర్గ పాతాళ భూలోకములు ఒకే రీతిగా గోచరించును. నన్ను తలచునపుడు అతడు సుఖము ననుభవించును. అట్టి భక్తుడు బ్రహ్మ నివాసమైన సత్య లోకమును కోరడు. స్వర్గాధిపతియైన ఇంద్రుని పదవిని కూడ అతడు కోరడు. లోకచక్రాధిపత్యమును కూడ కోరడు. అష్ట సిద్ధులను సాధించవలెనని అభిలషించడు. సూక్ష్మముగా చెప్పవలెనన్న, అతడు మోక్షమును గూడ కోరడు. నిత్యము అతని మనస్సు నాపై నిలిచి యుండునట్లు మాత్రమే అతడు కోరును. తదితర ఆలోచనలు లేకుండుటయే మోక్షమని అతని నిర్వచనము.

''ఉద్ధవా! నీవు నాకు భక్తుడ వగుటచేత నేను నిన్నెంతగా ప్రేమించుచున్నానో నీవెరుగవు. నా పుత్రుడైన బ్రహ్మపై కూడ నాకు అంత ప్రీతి లేదు. నా అంశమైన మహాదేవునిపై గూడ ప్రీతి లేదు. నా సోదరుడైన బలరామునిపైగాని, నా భార్య లక్ష్మిపైగాని నాకున్న ప్రేమ నీపై నున్న ప్రేమకన్న మిక్కిలి తక్కువ. నా యీ శరీరమున కెట్టి ప్రాముఖ్యమును లేదు. కోరికలు లేక, నిశ్చల మనసు గలిగి, యెవ్వరిని ద్వేషించక, స్వర్గ నరకములను సమదృష్టితో చూచు మునులను గురించి నా మనస్సు ఆలోచించుచుండును. నా యందుండే యీ విశ్వమును పునీతము చేయుటకు వారి పాదధూళి చాలును.

''కర్మకాండ నాచరించి సామాన్యముగా అందరును పొందు సుఖ సంతోషములు చాల అధమమైనవి. నా భక్తుల మనస్సులలో నుండు ఆనందము అత్యుత్తమమైనది. ప్రారంభములో భక్తులు సాధన చేయునపుడు ఇంద్రియములను నిగ్రహించుట కష్టముగా తోచును. అయినను నా యందున్న భక్తి చేత త్వరలోనే దాని నతిక్రమించగలరు. మండుచున్న అగ్నిలో వంటచెరకు భస్మముగా మారినట్లు, మానవుని పాపములు భక్తి అను అగ్నిలో దగ్ధమగును. భక్తి నన్ను ముగ్ధుని చేసి వశపరచుకొనినట్లు, యోగాభ్యాసము, సాంఖ్య జ్ఞానము, ధర్మ పరాయణత, వేద శాస్త్ర జ్ఞానము, తపస్సు, సన్యాసము మున్నగునవి నన్ను వశపరచుకొనలేవు.

''భక్తుని హృదయము కోమలము. కరుణా భరితము. నా పేరు విన్నను నన్ను తలచినను, అతని కనుల నుండి ఆనందాశ్రువులు స్రవించును. అత్యుత్తమ ఆనందము ననుభవించు స్థితిలో అతడు పాడుచు గంతులు వేయును. ఇట్టి లక్షణములు కలవానిని నా భక్తుడుగా గుర్తించవచ్చును. హృదయమునందు భక్తిలేనిచో మనస్సు పరిశుద్ధముగా నుండలేదు. మండుచున్న అగ్నిలో వేసిన బంగారము పరిశుద్ధమైనట్లు, పరమ పాపాత్ములు కూడ భక్తిచేత పరిశుద్ధులగుదురు. వస్తు ప్రపంచముపై ఆలోచనలు వానిని గురించి మానవుడు ప్రాకులాడునట్లు చేయును. అదే రీతిగా నిత్యము నన్ను చింతించు వారి మనస్సు నన్ను మాత్రమే పొందుటకు ఉవ్విళ్లూరును.

''కాబట్టి, ఉద్ధవా! స్వప్నములో అనుభవించు వస్తువుల వలె యీ వస్తు ప్రపంచము అసత్యముగా భావించి విడనాడవలెను. నన్ను మాత్రమే చింతించుము.

''మంచి బుద్ధి గలిగిన మానవుడు ఇంద్రియముల నిగ్రహించుట యందు ఆరితేరి యుండును. ఈ దేహము ఒక రథ మనియును, నీవు అనగా ఆత్మ రథమునకు స్వామి యనియు భావించవలెను. నీ బుద్ధిని రథసారథిగా చేసినచో అతని చేతులు యిచ్చ వచ్చినట్లు సంచరించు ఇంద్రియములను గుర్రములను కళ్లెముతో నిగ్రహించి

సరియైన మార్గమందు నడిపించును. నీవు నన్ను చేరి నిత్యానంద మనుభవించగలవు ఇది సత్యమని నమ్ముము''.

## 286 భగవంతుని విభూతులు

ఉద్ధవుడు కృష్ణునిట్లడిగెను. ''నీవు పరబ్రహ్మము. సృష్టిస్థితి లయలకు నీవే కారకుడవు. నీకు ఆద్యంతములు లేవు. నీకెటువంటి ఆవరణలును లేవు. నీ విభూతులను వినగోరుచున్నాను నీ భక్తులు పూజించదగు వస్తువులను గురించి వివరముగా చెప్పుము పవిత్ర గంగానదికి మూలమైన నీ పాదముల యొక్క ధూళిని గ్రహించి నీకు నమస్కరించుచున్నాను''.

పాత జ్ఞాపకములు నిండిన చిరునవ్వుతో కృష్ణుడిట్లనెను ''ఉద్ధవా! కురుక్షేత్ర సంగ్రామ సమయములో యుద్ధభూమిపై అర్జును డిదే ప్రశ్నవేసెను అతడు విషాద భరితుడయ్యెను తన సోదరులైన కౌరవులను సంహరించుట కిష్టపడకుండెను యుద్ధము చేయుట పాపమని భావించి చెప్పెను యుద్ధము అన్ని ధర్మసూత్రములకు విరుద్ధమని యుద్ధభూమినుండి పారిపోదలిచెను యుద్ధమున చచ్చువారు తనకు భిన్నమైన వారనియు, తాను సంహారకర్తననియు, వారిని చంపుట మహాపాపమనియు భావించుచు భ్రాంతిలోపడిన అర్జునుని భ్రాంతిని పోగొట్టుటకు అతనికి బ్రహ్మవిద్యను బోధించవలసి వచ్చెను యుద్ధము చేయవలసినదని అతనికి నచ్చజెప్పిన పిదప అతడు నేను పరబ్రహ్మస్వరూపమని గ్రహించెను అప్పుడతడు నీవు యిపుడడిగిన ప్రశ్ననడిగెను. ఆనాడు అర్జునునకు చెప్పిన విషయమే మరల నీకిపుడు చెప్పెదను.

''ఈ లోకమందు ఉన్నటువంటి అన్ని ప్రాణులలో నున్న జీవిని నేనే. నేను నీకు మేనబావను, మరియు నీకు ప్రభువును అన్ని జీవుల జనన మరణములకు నేనే కారణము నా కారణముగా యేర్పడిన యీ సృష్టికి ముందు త్రిగుణములయందు సమత్వము ఉండునట్లు యేర్పరచితిని నేను పరబ్రహ్మము ప్రకృతి యీ పరబ్రహ్మము నుండి ఆవిర్భవించినది మహత్తత్త్వము నేను. సులభముగా జయింపరాని మనస్సును నేను వేదబోధకులలో బ్రహ్మదేవుడను నేను మంత్రములలో ప్రణవ మంత్రము ''ఓం'' నేను అక్షరములలో అకారము నేను ఛందస్సులలో గాయత్రి నేను దేవతలలో ఇంద్రుడను, అష్టవసువులలో అగ్ని, ద్వాదశాదిత్యులలో విష్ణువు, ఏకాదశరుద్రులలో మహాదేవుడు నేను బ్రహ్మర్షులలో నేను భృగువును. దేవర్షులలో నారదుడను నేను. గోవులలో కామధేనువు నేను సిద్ధులలో కపిలుడు, ప్రజాపతులలో దక్షుడు, పక్షులలో గరుడుడు నేను. పితృదేవతలలో అర్యముడను, దైత్యులలో ప్రహ్లాదుడను, స్వర్గవాసులలో చంద్రుడను, యక్షులలో కుబేరుడను, గజములలో ఐరావతమును, సముద్రమునందు వసించువారిలో వరుణుడను నేను ప్రకాశించు వానిలో సూర్యుడను. అశ్వములలో ఉచ్చైశ్రవము నేను మానవులలో మహారాజు నేను లోహములలో నేను స్వర్ణము. శిక్షకులలో నేను యముడను సర్పములలో నేను వాసుకి, నాగులలో నేను ఆదిశేషుడను మృగములలో నేను సింహము, ఆశ్రమములలోకెల్ల ఉత్తమమైన సన్యాసాశ్రమము నేను. ప్రవహించు నదులలో నేను గంగను. జల నిక్షేపములలో నేను సముద్రుడను అస్త్రములలో ధనుస్సు నేను ధనుర్విద్యా ప్రవీణులలో త్రిపురాసురుల సంహరించిన మహాదేవుడను పర్వతములలో హిమవత్పర్వతము నేను, శిఖరములలో ఉన్నతమైన మేరు శిఖరము నేను. వృక్షములలో అశ్వత్థ వృక్షము నేను పురోహితులలో వసిష్ఠుడను,

పండితులలో బృహస్పతిని. వీరులలో స్కందుడను బ్రహ్మ యజ్ఞము నేను. మనస్సును విగ్రహించు చిత్త నిరోధము అనగా సమాధిస్థితి నేను వివిధ జ్ఞానశాఖలలో బ్రహ్మవిద్యయే నేను

''ఋతువులలో వసంత ఋతువు నేను, మాసములలో మార్గశిరము నేను, నక్షత్రములలో అభిజిత్తును (ఉత్తరాషాఢ ఆఖరి రెండు పాదములు శ్రవణం మొదటి రెండు పాదములను అభిజిత్తు అందురు). యుగములందు నేను కృతయుగము. జ్ఞానులలో బృహస్పతిని భక్తులలో ఉద్ధవుడు, అనగా నీవు, నేనే దర్భలలో నేను కుశఘాసము. హవిస్సులలో గోఘృతము నేను.

''స్త్రీలలో నేను శతరూపను, పురుషులలో స్వాయంభువ మనువు నేను మునులలో నేను నారాయణుడను. బ్రహ్మచారులలో సనత్కుమారుడను సాధనచే పొందదగు వస్తువులలో సంపద నేను, మోసము చేయదగువా విలో జూదము నేను. ఓర్మిగల వారిలో ఓర్పును నేనే. సాత్త్వికులలోని సత్త్వగుణమే నేను తొమ్మండుగురు భాగవతులలో వాసుదేవుడను నేను. (వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, నారాయణ, హయగ్రీవ, వరాహ, నృసింహ, బ్రహ్మదేవ)

''పర్వతముల స్థిరత్వమే నేను పృథివి గంధము నేను జలములోని మధురత్వము నేను సద్వర్తనులలో నేను బలిని, వీరులలో అర్జునుడను. నా వలననే కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు పని చేయుచున్నవి. పంచభూతముల తన్మాత్రలు నేను, వానికి కారణమైన అహంతత్వము నేను పంచభూతములు, దశేంద్రియ ములు, మనస్సు అహంతత్వము చేతనే పని చేయుచున్నవి ప్రకృతి పురుషులు, త్రిగుణములు పరబ్రహ్మము ప్రకటిత స్వరూపములు. నేను కాని దేదియు లేదు నేను అంతటను వ్యాపించి యున్నాను అన్నియు నేనే

''ఉద్ధవా! నా విభూతులను కొన్నింటిని నీకు చెప్పినాను ఇసుకలోని రేణువులను లెక్కపెట్టవచ్చునుగాని, నా విభూతులను లెక్కపెట్టుట సాధ్యముకాదు దీనిని జ్ఞప్తి యందుంచుకొనుము అఖండ వైభవము, ధనసంపదలు, కీర్తి , శక్తి , మంచితనము, ఉదారత, అందము, వీటిని నీవు యెచట గాంచుదువో అచట నీకు మానసికానందము కలుగును. అదృష్టము, సాహసము, నీలో నున్న అరిషడ్వర్గము అను శత్రువులను నిగ్రహించు ధైర్యము, ప్రజ్ఞానము, ప్రశాంతతయు నున్నచోట నేను యెల్లప్పుడును ఉండెదను

''కాని ఉద్ధవా! ఈ విభూతులు నాకు సహజమైనవి వీని గురించి తలచుచు కాలమును వ్యర్థపుచ్చకుము. నీవు నన్ను చేరదలచినచో, వాక్కును, మనస్సును, శ్వాసను, ఇంద్రియములను నిగ్రహించుము ఆ విధముగా సత్త్వగుణము పెంపొందించుకుని నన్ను చేరగలవు. ఒకసారి నీవు వీటిని నీ అధీనములోనికి తెచ్చుకొనినచో, తిరిగి నీవు సంసారమను మురికి కూపములో పడవు

''ఇవి లేకుండ వ్రతములు, తపస్సు చేయుట నిరర్థకము బాగుగా కాల్చని మట్టిపాత్రలో నీరు పోసినచో, ఆ నీటిని మట్టి పీల్చివేయును నీరు వృథాయగును ఆశ్రయించుటకు నన్ను యెన్నుకొనిన వారు వాక్కు, మనస్సునే గాక తమ జీవితమునే నాకు సమర్పించెదరు అటువంటివారు నాలో ఐక్యము కాగలరనుటకు యెట్టి సందేహము లేదు''

# 287 వివిధ మార్గములు

''ఉద్ధవా!'' అని సంబోధించి కృష్ణుడు తన బోధను కొనసాగించెను. ''మానవుడు యీ లోకమందు జీవించి యున్నంతవరకు మూడు విధములైన తాపత్రయములు అతనిని వేధించును. ఈ తాపత్రయముల నుండి తప్పించుకొనలేడు. ఈ తాపత్రయములు మూడు అధ్యాత్మికము, ఆధిదైవికము, ఆధిభౌతికము. ఈ మూడును మొదట లేవు, చివర నుండవు ఈ మూడును, మాయా ప్రపంచములో ఆత్మ యున్నంతవరకు నుండుటచేత, యివి మాయా జనితములుగా పరిగణించవచ్చును. ఈ మూడు వికారములకు పుట్టుక, కొంతకాలముండుట, తరువాత నశించుట సంభవించును అశాశ్వతములగుటచేత నిజమైన జ్ఞానవంతులను అవి యేమియు చేయలేవు నీవు శుద్ధ చైతన్యమూర్తివను యెరుక గలిగినపుడు, నీవు యీ మూడు తాపత్రయముల గురించి భయపడనవసరము లేదు నీ సత్యాన్వేషణ మార్గమునకు అడ్డు తగలవు.

''మానవుడు, అజ్ఞానముచేత, త్రాడును చూచి సర్పమని భ్రాంతి చెందుచున్నాడు ఈ భ్రాంతిచేత భయము పుట్టుచున్నది సర్పమని ఊహించుట తప్పు అని గ్రహించిన తరువాత అతని కెట్టి భయము ఉండదు. మానవుని బుద్ధి మసకబారిన సమయమందు త్రాడు సర్పముగా గోచరించి అతని మనసులో నిలిచినది తన పొరపాటును గ్రహించిన తర్వాత సర్పము అదృశ్యమైనది మానవుడు చూడక మునుపు త్రాడు ఉన్నది చూచి సర్పమని భ్రాంతి చెందినపుడు త్రాడు ఉన్నది. తన ఊహ పొరపాటని అది త్రాడని తెలుసుకున్న తర్వాత కూడ త్రాడు ఉన్నది అదే విధముగా, అధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతికములనే తాపత్రయములు, మాయలో ఒక భాగమగుటచేత, ఆత్మ యీ మానవలోకములో నున్నకాలమందు సంభవించును

''కాబట్టి, ఉద్ధవా! నిజమైన జ్ఞానము పొందుటకు కృషి చేయుము ఈ జ్ఞానము పొందినట్లయితే, నీలోని ప్రత్యగాత్మ బ్రహ్మమని గుర్తించెదవు నీవు చేయవలసిన యజ్ఞము జ్ఞానయజ్ఞము బ్రహ్మస్థితి నందుకొనుటకు యీ యజ్ఞమును చేయవలెను ఈ జ్ఞాన యజ్ఞము భక్తిచేత పునీతమగును నీకు నాయందున్న పరిపూర్ణమైన భక్తిచేత నీ ఆలోచనలు, మనస్సు పరిశుద్ధమగును. ఆ విధముగా పరిశుద్ధమైన మనస్సుతో జ్ఞాన మార్గమందు పయనించిన, నీవు గమ్యము చేరగలవు''

కృష్ణుడు వాడిన పదజాలము ఉద్ధవుని తికమక బెట్టెను అతడిట్లడిగెను ''కృష్ణా! వైరాగ్య విజ్ఞానముల గురించి కొంత వివరించుము. నీ దృష్టిలో అత్యుత్తమమైన భక్తిమార్గమునకు వానికి యెట్టి సంబంధము గలదు? కేవలము భక్తి నభ్యసించుట చేత నిన్ను చేరగలిగినచో, జ్ఞాన విజ్ఞాన వైరాగ్యముల గురించి ఆలోచించు టెందులకు? నీవు ప్రయోగించు పదజాలము నన్ను కలవరపెట్టుచున్నది''

కృష్ణు డీవిధముగా ఉద్ధవునితో పలికెను ''కౌరవ వంశములో వృద్ధుడైన భీష్మపితామహుడు, భౌతిక దేహమును వదలిపెట్టుటకు అంపశయ్యపై పరుండి ఉత్తరాయణ పుణ్యకాలముకొరకు యెదురుచూచుచున్న సమయములో పాండవాగ్రజుడైన యుధిష్ఠిరుడు యిదే ప్రశ్నను భీష్మునడిగెను. భీష్ముడు యుధిష్ఠిరునకు జ్ఞాన, వైరాగ్య, విజ్ఞాన, శ్రద్ధ, భక్తి యను మోక్షధర్మమును బోధించెను వానిని నీకిపుడు నేను చెప్పెదను

''ప్రకృతి, పురుషుడు, మహత్తత్వము, అహంతత్వము, అయిదు తన్మాత్రలు కలసి మొత్తము తొమ్మిది అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, మనస్సు కలిసి మొత్తం పదునొకండు అయిదు

పంచమహాభూతములు, సత్వరజస్తమో గుణములు కలిసి మొత్తం యెనిమిది. ఇవి అన్నియూ కలిసి యిరువది యెనిమిది వీనిచేత యీ మాయాలోకము ప్రకటిత మగుచున్నది. ప్రకటితమైన యీ మాయా ప్రపంచమునకు ఆవలనున్న సత్యమును బుద్ధి గ్రహించినపుడు, ఒకే ఒక పరమాత్మ వీనన్నిటియందు వ్యాపించియున్నాడని తెలుసుకొనినపుడు, ఈ వస్తుప్రపంచము నందలి కార్యకారణములకు మూలము బ్రహ్మమని గుర్తించినపుడు, అదియే జ్ఞానమని తెలియదగును.

''ఈ లోకములో జరుగు కార్యములు ఒకదానితో నొకటి గొలుసువలె ముడిపడియున్నవని, వీటన్నిటికిని మూలకారణము పరబ్రహ్మమని, త్రిగుణములతో యేర్పడిన సంసారము అనగా మన చుట్టును నున్న ప్రపంచమునకు పుట్టుక, మనుగడ, మరణము గలవని గుర్తించి గ్రహించవలెను దీని పర్యవసాన మేమనగా, యీ లోకము అశాశ్వతము, అనిత్యము మూలకారణము మార్పులు చెందుచున్నట్లు గోచరించును. ప్రారంభములో ఒక రూపము కలిగి తరువాత కాలచక్రములో వివిధ పరిణామములు పొంది, చివరలో మొట్టమొదటి రూపమునకు భిన్నముగా రూపొందుచున్నది మహాప్రళయ కాలమందు మూలకారణము మాత్రమే మిగిలియుండును. అదియే శాశ్వతమైనది అది ఒక్కటియే సత్యము ఆ సత్యాన్వేషణమే, అనగా మాయకు మూలకారణమేదో తెలుసుకొనుటే విజ్ఞానము

'మరియు బుద్ధిచేత యీ విశ్వమునకు మూలము గలదని, యీ విశ్వమునకు అంతము గలదని నీవు తెలుసుకొనగలవు సర్వమును బ్రహ్మమయమనియు, బ్రహ్మము కానిది మాయ అను పాఠము కూడ నీవు నేర్చుకొని యుండవచ్చును. సత్యమును బుద్ధిచేత అర్థము చేసుకొనుట ఒకయెత్తు, అనుభవముచేత గ్రహించుట మరియొక యెత్తు. ఈ వస్తుప్రపంచము మాయతో కూడినది అను జ్ఞానము 'పరోక్ష జ్ఞానము' ఈ విశ్వము ఆవిర్భవించుటకు మూలకారణ మున్నదను సత్యము నీవెరుగుదువు నీవు దీని వెనుకనున్న సత్యమును అనుభవపూర్వకముగా గ్రహించిన తర్వాత యీ జ్ఞానము కలుగును దీనిని 'అపరోక్ష జ్ఞాన'మం దురు దీనికొరకు చేయు సాధన దాని విజయమును జ్ఞాన విజ్ఞానము అందురు

''ఇపుడు నీకు వైరాగ్యము గురించి చెప్పెదను శ్రుతి, ప్రత్యక్ష, అనుమాన ప్రమాణములను మూడును మానవుని వైరాగ్యమార్గమున తీసుకువెళ్ళును. పవిత్ర శాస్త్ర గ్రంధములు బ్రహ్మయే సత్యమని వచించుచున్నవి. ఇదియే శ్రుతి. వేదములు ఉపనిషత్తులు యీ సత్యమును బోధించినవి మనము వస్త్రమును చూచినపుడు అది అనేక దారములతో నేసినదని తెలుసుకొందుము పలు దారముల కలయిక చేత వస్త్రముగా గోచరించుచు న్నది. నిజముగా యెంచి చూచినచో వస్త్రము దారముల సముదాయము తప్ప యితరమేదియు గాదు అయితే ఉన్నటువంటి దారములు ఒకదానితో నొకటి చేరి యున్నపుడు దానిని వస్త్ర మనుచున్నాము. ఇందు ముఖ్యమైన దానిని అవగాహన చేసుకున్నచో దారములు నిత్యమని, వస్త్రములు అనిత్యమని తెలియును వస్త్రమును చింపి దారములను దేనికి దానిని విడదీసినపుడు వస్త్రము తన స్వరూపమును గోల్పోవును. దీనిని 'ప్రత్యక్ష' ప్రమాణమందురు.

''గొప్ప గొప్ప ఋషులు అనుభవపూర్వకముగా సత్యము తెలుసుకుని, యీ బాహ్య ప్రపంచము మిధ్యయని చెప్పుచు వచ్చిరి సముద్రపుటొడ్డున యిసుకలో నున్న ఆలిచిప్పలో వెండి ఉండీ ఉండని రీతిగా, యీలోకము ఉండీ ఉండనట్లుగా తోచును. సూర్యుని వెలుగు ఆలిచిప్పపై ప్రసరించినపుడు, ఆలిచిప్పకు వెండిపూత పూసినట్లు గోచరించును. కన్ను వెండిపూతను చూచును, కాని మానవుడు బుద్ధిచేత అది వెండి కాదని,

వెండివలె గోచరించుచున్నదని తెలుసుకొనును

''మహామేధావులు చెప్పిన విషయములు వినుటచేతను, తాను స్వయముగా యోచించుటచేతను, విజ్ఞాని యీ వస్తుప్రపంచమంతయు మాయ యని గ్రహించును ఈ మాయా ప్రపంచము త్రిగుణములతో పంచమహాభూతములతో అనేక విధములుగా మిళితమై యుండుటచేత యేర్పడుచున్నదనియు నిజముగా బ్రహ్మము తప్ప యింకేదియు శాశ్వతము కాదనియు గ్రహించును. ఈ విధముగా గ్రహించుట చేత మానవుడు వైరాగ్యము నలవరచుకొనును అనగా వస్తుప్రపంచము అశాశ్వతమను విశ్వాసముతో దానిపై అనుబంధము పెంచుకొనక యుండును. విధి నిర్ణీతమైన కర్మలు చేసి అందుమూలముగా స్వర్గసౌఖ్యములు పొందినప్పటికిని, అది అంతయు మిధ్యయని విరాగి తెలుసుకొనును

''భక్తి గురించి యింతకుముందు నీకు చెప్పినాను నేను విశదముగా వివరించి యున్నాను. సాధారణ మానవుడు కూడ నాయందు భక్తిని పెంపొందించుకొన వచ్చును నన్ను గురించిన కథలు వినవలెనను కోరిక గలిగియుండుట, ఆ కథలను యితరులకు వివరించుట, శ్రద్ధతో నన్ను పూజించుట, నా భక్తులయెడ గౌరవాదరములు కలిగి యుండుట, అన్ని జీవులపై ప్రేమ కరుణ జూపుట, ప్రాపంచిక కర్మలలో మునిగి యున్నప్పటికిని నన్ను స్మరించి నా గురించి మాట్లాడుచుండుట, చిత్తమును నాకర్పించి కోరిక లన్నిటిని విడనాడుట — ఇవి అన్నియు మానవుడు తనకు తానుగా నాకు భక్తుడగునట్లు చేయగలవు అప్పుడతడు నా భక్తుడగును. ప్రారంభములో అతడు పూర్తిగా తన మనస్సును నాపై లగ్నము చేయుటలో విజయము సాధించలేకున్నను, కొంతకాలమునకు అభ్యాసముచేత సాధించి కృతకృత్యుడు కాగలడు ఈ సిద్ధిని పొందుటకు మించిన సంపదలేదు. బ్రహ్మము ఒక్కటేయను యెరుక జ్ఞానము, వస్తుప్రపంచముతో అనుబంధము లేకయుండుట వైరాగ్యము''

## 288 మూడు మార్గములు

''మానవుడు మోక్షము నందుకొనుటకు మూడు మార్గములు. ఇవి జ్ఞాన, కర్మ, భక్తి మార్గములు ముక్తికి నాలుగవ మార్గమేదియు లేదు కొందరు జీవన్ముక్తులు కర్మలు దుఃఖమునకు దారితీయుననియు, వేరేదియు కలుగబోదను నిర్ణయమునకు వచ్చిరి. కర్మలు ఒకటి వెనుక మరొకటి సంసారమను ఊబిలో పడవేయును. అవి యెన్నడును సుఖ దుఃఖముల నుండి స్వేచ్ఛను కలిగించలేవు. దీనిని గ్రహించినవారు తమకు తామే కర్మలను త్యజించి సన్యాసము చేబట్టుదురు అట్టివారికి జ్ఞానయోగము సులభముగా స్వేచ్ఛను ప్రసాదించ గలదు. సత్యాన్వేషణ మార్గములో చాల దూరము పయనించుటచేత వారికి జ్ఞానయోగము సులభముగా నుండును

''మరికొందరు యింకను కర్మఫలితములను త్యజించుట నేర్వక యుందురు వారి హృదయములు యింకను కోరికలతో నిండి వాని సాఫల్యమునకై కాబట్టి వారు వైరాగ్యము నభిలషించరు అటువంటివారికి కర్మయోగము ఉత్తమమైన మార్గము

''మరికొందరు అదృష్టవంతులు, పూర్వసుకృతము చేత నాయందు ప్రేమకలిగి నా కథలను వినుటకు కుతూహలపడుచుందురు. అటువంటివారు కోరికలను విడిచిపుచ్చిన జ్ఞానులవలె నుండరు. అనుబంధము త్రెంచుకొను నేర్పు కలిగియుండరు. అనగా పూర్తిగా వైరాగ్యభావము వారిలో కానరాదు. వస్తుప్రపంచములో పూర్తిగా మునిగియుండక పోయినప్పటికిని, దానితో పూర్తిగా బంధములు తెంచుకొనక యుందురు. అట్టివారు వైరాగ్యభావ మలవడు వరకు కర్మయోగ మనుసరించవలెను. వారు గృహస్థ ధర్మములను నిర్వహించుచు ఫలితములపై ఆసక్తిని పెంచుకొనక కర్మల నాచరించవలెను. కొంతకాలమునకు వైరాగ్యమలవడును. వైరాగ్యము తోబాటు, అతడు నన్ను తన మనస్సు నందు చింతించినచో నాకు భక్తుడు కాగలడు.

''భక్తియోగ మభ్యసించుటకు మానవ శరీరము అతిప్రధానము! స్వర్గవాసులు కూడ మానవ రూపము ధరించుటకు పరితపించెదరు. జ్ఞాన భక్తియోగములు కోరు కఠిన నిబంధనలకు దేవతా శరీరము అనువు గావు. భగవదనుగ్రహము, సత్పురుష సాంగత్యము, భగవంతునిపై ప్రేమ, భగవత్కథలు కీర్తనలు యెచట గానము చేయుదురో అచట నిత్యము నుండుట — వీని కన్నింటికిని మానవ శరీరము అనువైనది. మానవులకు మాత్రమే యిది సాధ్యము. ఆ కారణము చేతనే వ్యాసునివంటి గొప్ప మహర్షులు, తమ తపస్సంపద వలన స్వర్గములో స్థానము లభించినప్పటికిని, యీ భూమిపై మానవ రూపములో సంచరించుటకు యిష్టము చూపిరి. సృష్టిలోని అన్నిజీవుల కన్న మానవజన్మ పరమోత్కృష్టమైనది. అయినను మానవుడు తిరిగి మానవుడుగా జన్మించుట కోరరాదు. పరమ సత్యమును గ్రహించుటకు యీ శరీరము ఒక సాధనము. ఈ శరీరము కొంతకాలమునకు నశించును. ఏదో ఒకనాడు యీ శరీరము మృతిచెందును. మృత్యువు శరీరమును గైకొనకముందే మానవుడు తన ధ్యేయము సాధించవలెను. ఈ శరీరము ఒక వృక్షము వంటిది.

''ఒక పక్షి గూడుకట్టుకుని అందు చాలకాలము నివసించుచుండెను. ఒకసారి అకస్మాత్తుగా కట్టెలు కొట్టువాడు గొడ్డలి తీసుకువచ్చి, చెట్టుపై నున్న గూడులలో నివసించుచున్న పక్షులను గురించి పట్టించుకొనక, చెట్టును, నరికివేయును. చెట్టు, ఆ చెట్టున నున్న పక్షి గూడులు నేలవాలును. నిజముగా జ్ఞానము కలిగిన పక్షి కూర్చుని విచారించదు. నేలపై వ్రాలిపోయిన చెట్టు మీదకు తిరిగి రావలెనని కోరదు.

''మానవుడు అలసత్వము వీడి, మోక్షమార్గమును కుతూహలముతో అనుసరించవలెను. వైరాగ్యము నేర్చిన మానవుడు మాత్రమే దీనిని సాధించగలడు. అనేక దినములు — పగలు, రాత్రులు — గడచిపోవును. రోజు రోజుకు నెమ్మదిగా జీవితము హరించిపోవును. ఈ విషయము గ్రహించి మానవుడు యోగాభ్యాసము కొరకు తొందరపడవలెను. భక్తి వైరాగ్యములను నేర్చినచో బంధ విముక్తుడై ముక్తిని పొందగలడు.

''ఈ భూమిపై మానవుని జీవితమును సంసారమను సముద్రముపై పయనించు నావతో పోల్చవచ్చును. పడవ క్షేమముగా సముద్రము దాటి ఒడ్డు చేరుటకు నావికుని గురువుగా యెంచుకొనవలెను. మానవునికి యెట్లు సహాయపడవలెనో గురువుకు మాత్రమే తెలుసును 'గురువు లభ్యమగుట తేలికకాదు. కాని గురువు దొరికినచో, అతడు నీ జీవితమను నావను క్షేమముగా ఒడ్డుకు చేర్చగలడు. పడవ క్షేమముగా చేరుటకు గాలి అనుకూలముగా నుండవలెను. ఆ గాలిని నేను. ఈ రెండు లేనిచో, పడవ మునిగిపోవును, అనగా మానవుడు సంసారమను ఊబిలో దిగబడిపోయి, అందుండి స్వేచ్ఛను మరిపొందలేడు.

''మానవుడు తనకు తానుగా కర్మలాచరించుట యందు విసుగుచెందవలెను. అతడు ఇంద్రియములను విగ్రహించవలెను. అపుడు మనస్సు వస్తుప్రపంచముపై ప్రసరించదు. మనస్సు నిత్యసత్యమైన బ్రహ్మమును

ధ్యానించునట్లు మనస్సుకు శిక్షణ నిచ్చి, మనస్సు స్థిరముగా నుండునట్లు అభ్యాసము చేయవలెను. ధ్యానము నిరంతరముగా సాగవలెను. దీనిని ధారణ యందురు. ధారణ చేయుచున్నపుడు మనస్సుకు ధారణాశక్తి తగ్గి భౌతిక ప్రపంచములో సంచరించుట జరుగుచుండును. ఇట్లు జరిగినపుడు, క్రమక్రమముగా తిరిగి మనస్సును విగ్రహించవలెను. ధ్యానములో నున్నపుడు చంచలమైన మనస్సు వలన యిబ్బంది కలుగుచుండును అటువంటపుడు మనస్సు కోరువానిని అందివ్వక మనస్సుకు అసంతృప్తి కలిగించరాదు. మనస్సు కోరుదానిని ప్రసాదించి మనస్సును సంతృప్తి పరచవలెను వాసనలను అణచరాదు అవి హరించి పోవునట్లు చేయవలెను ఇట్లు జరిగినచో, మనస్సు యెదురు తిరగక అణకువతో చెప్పినట్లు వినగలదు. ప్రాణాయామము భౌతిక దేహమును విగ్రహించును. ధ్యానము మనస్సును నియమములో నుంచును గుర్రపురౌతు కొంచెము సేపు గుర్రమును దాని యిష్టము వచ్చినట్లు తిరగనిచ్చి, నేర్పుతో గుర్రము వదిమిపట్టినట్లుగా మానవుని బుద్ధి చంచలమైన మనస్సును అదుపులో నుండునట్లు చేయవలెను

''భక్తియోగము నభ్యసించు మానవుడు, తన మనస్సునందు నన్ను అనగా నా రూపమును నిత్యము నిల్పుకొనవలెను. అందుచేత మిగిలిన కోరికలు వానియంతట నవియే నమసిపోవును మానవు డెట్టి కఠిన సాధనయు చేయనక్కరలేదు నన్ను తలంచుచుండుట చేత మానవునిలో అహంకారము నశించును. అహంకారముతోబాటు దాని నంటిపెట్టుకొని యున్న భావావేశములన్నియు నశించును భక్తిచేత పూర్వజ న్మల నుండి కూడబెట్టిన కర్మలన్నియు కూడ నశించగలవు

''నిజమైన భక్తుడు జ్ఞాన వైరాగ్యములు గొప్పవని పరిగణించడు. అతడు యీ జన్మయందే మోక్షము నందుకొనగలడు. కర్మయోగము, తపస్సు, జ్ఞానము, వైరాగ్యము, యోగము, దానము ధర్మము మున్నగువాని చేత దేనిని సాధించవచ్చునో దానిని భక్తిచేత సాధించవచ్చును పవిత్ర పుణ్యతీర్థములకు వెళ్ళి పాపపరిహారము గావించుకొందురు ఇదికూడ భక్తిచేత సమకూరును నా భక్తులైన సాధువులు నాయందు భక్తిని మాత్రము కోరుదురు. ఎల్లపుడును వారి మనస్సు నందు భక్తినిలిచి యుండునట్లు అభిలషింతురు. వారు సత్యలోకముగాని కైవల్యముగాని కోరరు.

''ప్రాపంచిక వస్తువులపై ఆకర్షణలేనివారి హృయదములందు మాత్రమే నాయందు భక్తిని కనుగొనవచ్చునను విషయము స్పష్టముగా తెలియగలదు. ఇంద్రియములకు సంతృప్తినిచ్చు వస్తువులు వారి నాకర్షించలేవు ఇదే భక్తి విశిష్టత, ఘనత''

## 289 ప్రారంభము — సృష్టి

కృష్ణభగవాను డిట్లు చెప్పెను ''పురాతన కాలములో కపిలవాసుదేవుడు సాంఖ్యయోగమును తన తల్లి దేవహూతికి బోధించెను అది విని ఆమె 'నేను — నాది' అను మమకారముతో కూడిన భ్రాంతిని పోగొట్టుకుని విముక్తి పొందెను. ఆత్మ సత్యము అనగా జీవాత్మ — పరమాత్మల గురించి తెలుసుకుని, సుఖముగాని దుఃఖముగాని లేవని గ్రహించినపుడు, సుఖదుఃఖ పరంపరలలో మానవుడు తగులు కొనక యుండును. మహా ప్రళయము సంభవించినపుడు, అనగా కృతయుగమునకు పూర్వము, బ్రహ్మము ఒక్కటే యుండెను

ఇంకేదియు లేదు. ద్రష్ట, ద్రష్టవ్యము ఒకటిగా నుండెను. ఆ రెండింటికి భేదము లేకుండెను. అనగా బ్రహ్మము తప్ప యింకేదియు లేదు.

''మాయ శక్తిచేత బ్రహ్మము రెండుగా గోచరించెను, ద్రష్ట, ద్రష్టవ్యము. ద్రష్ట పురుషుడు, ద్రష్టవ్యము ప్రకృతి. కార్యకారణముల చేత ప్రకృతి యేర్పడినది. పురుషుడు శుద్ధ జ్ఞానము. ప్రకృతి నుండి త్రిగుణములు — సత్వరజస్తమో గుణములు — ఆవిర్భవించినవి. త్రిగుణముల నుండి సూక్ష్మాత్మ, అతి సూక్ష్మశక్తి ఉద్భవించెను. దీని మూలముగా కర్మలు చేయుట జరుగుచున్నది. క్రియాశక్తికి మూలము సూక్ష్మాత్మ.

''మహత్తత్త్వము యేర్పడుటకు జ్ఞానశక్తిమూలకారణము. మహత్తత్త్వము నుండి అహంతత్త్వము ఉద్భవించినది. మానవుని మనస్సులో భ్రాంతి కలుగుటకు అహంతత్త్వము ప్రధాన కారణము. అహం మూడు రకములు — సాత్వికము. రాజసికము, తామసికము. తన్మాత్రలకు, పంచభూతములకు, ఇంద్రియములకు, మనస్సుకు అహంకారము కూడ ఒక కారణము. మొదట పంచమహాభూతము లేర్పడినవి. వాటి నుండి లింగశరీరము ఉద్భవించినది. తరువాత బ్రహ్మాండము యేర్పడినది. దాని లోపల వైరజ పురుషునకు ఆధిపత్య మేర్పడినది. తమోగుణము ప్రధాన లక్షణముగా గల అహంతత్త్వము, శబ్ద స్పర్శరూపరస గంధములను తన్మాత్రలకు, పంచభూతములకు కారణమగుచున్నది. రజోగుణ ప్రధానమైన తత్త్వము నుండి దశేంద్రియములు పుట్టినవి. సత్వగుణము ప్రధాన లక్షణముగాగల తత్త్వము నుండి దిక్కులు, వట, అర్క, ప్రాచేతస, అశ్విని, వహ్ని, ఇంద్ర, ఉపేంద్ర, మిత్ర, ప్రజాపతి, చంద్ర అను పదునొకండు దేవతలతోబాటు మనస్సు కూడ జన్మించెను.

''పైన చెప్పిన వన్నియు వైరజపురుషుడున్న బ్రహ్మాండము నందు ప్రవేశించెను. తరువాత నారాయణ రూపములో నేను బ్రహ్మాండము నందు ప్రవేశించినాను. నా నుండి నేను పద్మముగా ఆవిర్భవించితిని. ఆ పద్మము నుండి చతుర్ముఖ బ్రహ్మ జన్మించెను. వైరజ పురుషుడను నేనే, బ్రహ్మయు నేనే. నేను తప్ప యింకేదియు లేదు. ఇవన్నియు నా వివిధ అంశములు.

''మరియు ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి క్రియాశక్తి కూడ నా అంశములే. రజోగుణము మూర్తీభవించిన బ్రహ్మ, భూః, భువః, సువః అను మూడు లోకములను సృష్టించెను. ఈ మూడు లోకములకు ప్రభువులను కూడ సృష్టించెను. సువర్లోకము దేవతల నివాసస్థలము. భువర్లోకము భూతములకు, భూలోకము మానవులకు నివాస స్థలములు. ఈ మూడు లోకములకు పైన మహర్లోక, జన, తపోలోక, సత్య లోకములు సృష్టియైనవి. భూ లోకమునకు దిగువ అతల వితల, రసాతల, పాతాళ లోకములు సృష్టియయ్యెను. ఈ లోకములందు నాగులు, అసురులు, మున్నగువారు నివసింతురు.

''ఈ సృష్టికి వెనుక నున్న మూల సత్యమును నీకు విశదీకరించెదను. ఏది ఒక వస్తువునకును దాని అంతమునకును కారణమో, దాని మనుగడకు కూడ అదియే కారణమగుట సహజము. ఉదాహరణకు మన్ను, లేక బంగారమును తీసుకొనుము. బంగారముతో చెవులకు కుండలములు, చేతికి గాజులు, కంఠములో హారములుగా చేయవచ్చును. నగరూపము యేర్పడక పూర్వము అది బంగారము. నగను అగ్నిలో కరగించినచో తిరిగి అది స్వచ్ఛమైన బంగారముగా రూపొందును. అనగా, నగ యెట్టి రూపములో నున్నను, నగలో నున్నది బంగారమే యనుట స్పష్టమగుచున్నది. కుమ్మరివాని చేతిలో మట్టిముద్ద పాత్రగా లేక పళ్లెముగా యేర్పడుచున్నది. అవి పగిలినపుడు తిరిగి మట్టియగు చున్నవి. అది పాత్రగా లేక పళ్లెముగా నున్నపుడు కూడ మట్టియేయని నిస్సందేహముగా చెప్పవచ్చును. అదే విధముగా, అనేక విధములుగా ప్రకటమైనప్పటికిని,

సత్యము మాత్రము ఒక్కటే. అదియే బ్రహ్మము. కర్మలు చేయుటకొరకు అహంతత్త్వము మహత్తత్త్వము సృష్టియైనవి. సత్యము లేక బ్రహ్మము నుండి మొదట ఆవిర్భవించిన ప్రకృతి, యీ రెండు తత్త్వములకు ఆలవాలమైనది. ప్రకృతి కర్మలకు నిలయము. పురుషుడు ప్రకృతికి అధిష్ఠానము. త్రిగుణముల మధ్య సమన్వయము తప్పించి ఆడించునది కాలము. ఈ మూడు — పురుషుడు, ప్రకృతి, కాలము — బ్రహ్మము అంశములు. ఆ బ్రహ్మము నేను''.

## 290 భక్తియోగము — పునరవలోకనము

అనేక యోగముల గురించి విశదీకరించి బోధించుచున్న కృష్ణుని మాటలను అతిశ్రద్ధతో ఉద్ధవుడు వినుచుండెను. బ్రహ్మస్థితిని చేరుటకు వివిధ మార్గములు, పద్ధతులను గూడ కృష్ణుడు బోధించుచుండెను. సాంఖ్యము, దాని సృష్టి గురించి యింతవరకు కృష్ణుడు చెప్పెను. ఇప్పుడు కృష్ణుడు సృష్టి అంతము గురించి యిట్లు చెప్పసాగెను. ''ప్రకృతి నుండి మహత్తత్త్వము పుట్టి, అది అహం తత్త్వముగా మారునని నీకు చెప్పినాను. వీని నుండి తన్మాత్రలు, తర్వాత మహాభూతములు, తదుపరి మిగిలిన సృష్టి జరుగుచున్నదని చెప్పితివి. అంత్యకాలమందు అన్నిటికన్న ఘనమైన యీ భూమి జలమందు అదృశ్యమగుచున్నది, తరువాత జలము అగ్నియందు, అగ్ని వాయువునందు, వాయువు ఆకాశమునందు, ఆకాశము తన్మాత్రలందు, తన్మాత్రలు అహంతత్త్వమునందు, అహంతత్త్వము మహత్తత్త్వము నందు లీనమగుచున్నవి. మహత్తత్త్వము ప్రకృతితో యేకము కాగా, ప్రకృతి పురుషునిలో కలిసిపోయి, బ్రహ్మము తప్ప యింకేదియు మిగులకుండును.

''సూక్ష్మముగా సృష్టి ఆద్యంతములు యీ విధముగా నున్నవి'' అని కృష్ణుడు మౌనము వహించెను. ఇంకను తెలుసుకొనవలెనను కుతూహలముతో నిండిన ఉద్ధవుడు యిట్లడిగెను. ''కృష్ణా! అనేక యోగముల గురించి నీవు విశదముగా చెప్పినది వినియున్నాను. నీవు చెప్పినది శ్రద్ధగా విన్న తర్వాత, మానవుడు మనస్సును సంపూర్ణముగా నిగ్రహించగలిగిన తప్ప జ్ఞాన యోగము నభ్యసించుట సులభము కాదను నిర్ణయమునకు వచ్చినాను. నేను యెప్పటికైనను జ్ఞానయోగము నభ్యసించలేను. మహా యోగులు సైతము చంచలమైన మనస్సు నరికట్టుట అసాధ్యమని, అతి కష్టమైనదని తెలుసుకొనిరి.

''నిన్ను చేరుటకు అతి సులభమైన మార్గముండగా, కష్టతరమైన మార్గమును అనుసరించు టెందులకు? నీ పవిత్రపాదములను పూజించినవారు సత్యాసత్యజ్ఞాన విచక్షణాశక్తి సంపాదింతురని జ్ఞానవేత్తలు గ్రహించిరి. నీ భక్తులు అహంకారపూరితులు కారు, కాబట్టే వారు నశించరు. వారు యేమి సాధించినను అది నీ కృపచేతనేనని భావించి గర్వము చెందక యుందురు. ఇతరులు మాయచే భ్రాంతిచేత గొప్ప యోగులమని తలంచెదరు. తాము చేయుపనులందు చాల నిపుణత గలవారమని భావించుటచేత వారి హృదయములలో గర్వము చోటుచేసుకొనును. అటువంటివారు నిన్ను చేరలేరు.

''నీ భక్తులకు నీవు బానిసవు. అసుర చక్రవర్తి బలి, గోపాలకుల నాయకుడు నందుడు, లోకపు రీతులు తెలియని అమాయక గోపికలు నీకు అత్యంత ప్రియమైన వారు. నిరంతరము వారు నిన్ను మాత్రమే తలచుచు, బ్రహ్మేంద్రాదులు సాధించలేని దానిని సాధించిరి. నీవు రాముడుగా అవతరించినపుడు, దేవత లందరికన్న

వానరులు నీకు అత్యంత ప్రీతిపాత్రులైరి. భక్తిచేత నిన్ను సులభముగా సంతృప్తి పరచగలిగినపుడు, యెవరైనను అతికష్టతరమైన జ్ఞానయోగమను యోగమును యెందుకు సాధించవలెను? నేను యెల్లపుడు నిన్ను తప్ప యింకేదియు చింతింపను. నిన్ను గురించిన ఆలోచనలు తప్ప యితర ఆలోచనలు నాకు లేవు. కాబట్టి నేను నీ భక్తుడనని భావించుచున్నాను. ధన సంపదలు గాని, స్వర్గసౌఖ్యములుగాని, ముక్తిగాని పొందవలెనను కుతూహలము నాకు లేదు. నీవు నాకు గురువువు, నా హృదయ నివాసివి''.

కృష్ణుడు తనకు స్వాభావికమైన అందమైన చిరునవ్వును ప్రదర్శించి యిట్లనెను: ''ఉద్ధవా! నిజముగా నీవు నాకు ప్రియుడవు. మరొకసారి మానవు డేవిధముగా మృత్యువును, మృత్యుభయమును జయించ వచ్చునో ఆ రహస్యమును చెప్పెదను. నన్ను సంతృప్తిపరచవలెనని అభిలషించువారు నన్ను మాత్రమే చింతించుచుండవలెను. అతని మనస్సు, ఆలోచనలు నన్ను గురించినవై యుండవలెను. నా యెడల అతని ప్రేమ నిత్యముగా నుండవలెను. అతడు ప్రేమతో నేను బోధించు మార్గము ననుసరించి నేను సంతృప్తి చెందునట్లుగా చరించవలెను. నా భక్తుల — నారదుడు, ప్రహ్లాదుడు, ధ్రువుడు — ప్రవర్తనను గమనించి అనుసరించవలెను. ఒకడు దివ్యపురుషుడు, రెండవవాడు అసుర కుమారుడు, మూడవవాడు మానవ బాలుడు.

''నా భక్తులు నన్ను సదా భజించుచుండవలెను. భజించుట యనగా నలుగురితోచేరి భజనలు పాడుటగాదు. అట్టిచర్యలు తమ భక్తిని యితరులకు ప్రదర్శించుటే యగునుగాని, వారిలో నిజముగా భక్తి కానరాదు. ఛత్రచామరములు, సింహాసనము మున్నగు ఆడంబరములతో కూడిన పూజను నేను కోరను. ఏకాదశీ వ్రతము వంటి కఠిన వ్రతములు ఆచరించ నవసరము లేదు. నన్ను పూజించుటకై పవిత్రస్థలములకు వెళ్ళి తీర్థయాత్రలు చేయ నవసరము లేదు. పరిశుద్ధమైన మనస్సుతో మానవుడు అన్నింటియందు అందరిలో నన్ను దర్శించుటకు యత్నించినచో — నేను సంతృప్తి చెందెదను. సర్వత్ర నేను వ్యాపించియున్నానని గ్రహించినచో, అతడు యిక జపతపములు చేయనక్కరలేదు. అట్టివాడు జీవన్ముక్తుడు. అతనికెట్టి ఆవరణములు లేక, గాలి, ఆకాశమువలె స్వేచ్ఛగా నుండును. నన్ను తెలుసుకొనినవాడు, అన్నియు సమముగా యెవనికి గోచరించునో అట్టివాడు జ్ఞాని. అన్ని వస్తువులు నా ప్రతిరూపములుగా గోచరించును. అట్టివాని దృష్టిలో ఉత్తమ జన్మపొందిన వాడు, అధమ జన్మపొందినవాడు సమానమే. ఇద్దరిని ఒకే రీతిగా ప్రేమించును. అతడు, సూర్యునియందు నిప్పురవ్వయందు, సద్బుద్ధి కలవానియందు దుర్బుద్ధి గలవాని యందు నన్ను, నన్నుమాత్రమే, చూచును. వీరందరి యందు ఒకే ఒక బ్రహ్మము గలదనియు, ఆవరణములచేత వారు గ్రహింపలేకున్నారనియు అతడు యెరుగును.

''ఇటువంటి ఆలోచనలు గల మానవుడు అహంకారము, అసూయ, అహంభావము, ద్వేషము లేకుండ నుండగలడు.

''తనచుట్టునున్న ప్రపంచమునందు అంతటను బ్రహ్మమునే దర్శించగలవారు, కోరికలను సంపూర్ణముగా త్యజించినవారు, ద్వంద్వముల ప్రలోభములకు గురికానివారు, సుఖదుఃఖములకు చలించనివారు, బ్రహ్మస్థితిని పొందగలరనునది నమ్మశక్యము కాకున్నను సత్యమని జ్ఞాను లెరుగుదురు. నేను కూడ అభయ మొసగుచున్నాను. నశించు దేహమను బోనులో బద్ధమైన అతని ఆత్మ, నిత్యసత్యమైన నన్ను చేరగలదు. దేవతలకు కూడ తెలియని యీ రహస్యమును, నీవు నాకు పరమభక్తుడ వగుటచేత, నీకు బోధించినాను. నీకు జ్ఞాన యోగముకూడ బోధించినాను. భక్తి జ్ఞానములను మేళవించిన మానవుడు తప్పక మోక్షము నందుకొనగలడు.

నీకు బోధించిన యీ పాఠమును యెవరు అనుసరింతురో వారు బ్రహ్మము చేరుదురు వేదముల సారమే బ్రహ్మము నీకు నేను బోధించిన యీ పాఠమును యెవరు నిత్యము పఠించెదరో వారు జ్ఞానదీపమును దర్శించి నానాటికి నాకు చేరువై వారి ఆలోచనలు చేతలు పరిశుద్ధమగును ఈ నాబోధను వినినవారు కర్మలతోకూడిన సంసారమను ఊబిలో పడకయుందురు

''ఉద్ధవా! నేను చెప్పిన పాఠమును బాగుగా నేర్చితివా? నీ సందేహము లన్నియు తీరినవా? ఇక్కడకు వచ్చుటకు ముందు నీకున్న దుఃఖమును విడనాడినావా? నీకున్న భ్రాంతులన్నియు పోయినవా?

''నీకొక హెచ్చరిక చేయవలసియున్నది అనర్హులకు యీ పాఠము నీవు యెట్టి పరిస్థితులలోను బోధించరాదు. నటించువారు, నాస్తికులు, మోసగాళ్లు, భక్తియోగమునందు నమ్మకము లేనివారు, వినయము లేనివారు — వీరు నేను నీకు చెప్పిన పాఠమును బోధించుట కనర్హులు ఈ గుణములు లేనివారికి మాత్రమే నేను నీకు చెప్పిన గొప్ప పాఠము బోధించి ప్రచారము గావించవలెను

''నేను అవతారము చాలించి నిష్క్రమించిన తరువాత నీవు విచారముతో క్రుంగక మానవలోకములో సంచరించుచు ధర్మప్రబోధము గావింపుము నేను యీ భూమిని విడచిన తర్వాత ధర్మము అడుగంటును అపుడు నీవు, నీవంటివారు ధర్మము యీభూమిపై నిలిచియుండునట్లు కృషి సలుపవలెను ఈ భూమిపై ధర్మమును స్థాపించుటకు నేను యెంతగానో కృషి చేసితిని నా తర్వాత దీనిని నీవు పోషించి పెంచవలెను''

ఉద్ధవుడు రెండుచేతులు జోడించి నిలుచుండెను కన్నులు అశ్రువులు కార్చుచుండుటచే యెర్రబడెను ఏకధారగా అశ్రువులు కారుచుండగా, భావోద్రేకము చేత గొంతు గద్గదమయ్యెను మనస్సంతయు విచారము ఆవరింపబోగా, కొంతసేపటికి వేసుకుని, కృష్ణుని పాదములపై శిరస్సునుంచి ఉద్ధవుడిట్ల నెను. ''కృష్ణా! నీ మూలముగా నా భ్రాంతులన్నియు తొలగిపోయినవి సూర్యుని యెదుట నిలుచున్నవానికి చీకటివలన భయము కలుగునా? నీవు మిక్కిలి కరుణతో నా హృదయమందు జ్ఞాన జ్యోతిని వెలిగించితివి నాయందు నీకున్న విశేషమైన అభిమానముచేత, యాదవకులమందు నాకు గల మోహబంధములనెట్లు త్రెంచుకొనవలెనో బోధించితివి కాని నాదొక మనవి. నీ యందు నాకున్న ప్రేమ, భక్తి నన్ను విడువక స్థిరముగా కొండవలె నా యీ చంచల హృదయమందు నిలుచునట్లు వరము ప్రసాదింపుము''.

అనంతమైన ప్రేమను కనులు వెలిబుచ్చుచుండగా చిరునవ్వు నవ్వి కృష్ణు డిట్లు పలికెను. ''ఉద్ధవా! బదరికాశ్రమమునకు వెళ్ళుము అచట గంగానది ప్రవహించును గంగానదిని దర్శించినంత మాత్రముచేత పాపములనుండి విముక్తుడ వగుదువు అక్కడ ఉండి, గంగలో స్నానము చేయుచు నన్ను తలచుచు సన్యాసివలె జీవించుము నేను నిన్ను కోరిన కార్యము ఆచరించిన తర్వాత నీవు నన్ను చేరగిలవు''

అయిష్టతతో ఉద్ధవుడు కృష్ణుని సమక్షము నుండి కదలివెళ్ళెను జ్ఞానబోధ నవగాహన చేసుకున్నప్పటికిని, కృష్ణుని విడిచి యుండలేక పోయెను. కృష్ణునితో ప్రభాస తీర్థమునకేగి, కృష్ణుని చివరి క్షణములందు ఉద్ధవుడు అతని ప్రక్కనే యుండెను అదే సమయమున మైత్రేయుడు కూడ అక్కడకు వచ్చెను కృష్ణుడు వారితో మరొకసారి సంభాషించి, తన సహజ వైభవ స్థితికి తిరిగి వచ్చెను

కృష్ణభగవానుడు విశ్రమించుటతో ధర్మము, శౌచము, సౌందర్యము, మున్నగున వన్నియు అంతరించెను భూమాత దుఃఖముతో కుమిలిపోయెను

# 291 సాంఖ్యము

ఆదిలో బ్రహ్మము తప్ప యింకేదియు లేకుండెను బ్రహ్మము అనగా ఆత్మలలోకెల్ల ఉత్కృష్టమైన పరమాత్మ, ప్రకృతికి ప్రభువు, కార్యకారణములు కలిసి ఏకముగా నుండెను అతడే ద్రష్ట అనగా చూచువాడు మొదట ద్రష్టవ్యము యేదియు లేకుండెను బ్రహ్మము స్వయం ప్రకాశము ప్రకృతి బ్రహ్మములో యిమిడి యున్నది ప్రకటిత శక్తి కూడ బ్రహ్మమునందే యుండెను

ప్రారంభములో సత్త్వరజస్తమో గుణములను త్రిగుణముల మధ్య సంపూర్ణమైన సమన్వయిఋుండెను బ్రహ్మ క్రమేణ యిపుడు త్రిగుణముల మధ్య సమన్వయము తప్పినది దీని మూలముగా అశాంతి చెలరేగినది. ఈ అశాంతియే సృష్టికి బీజమైనది.

ఏ శక్తివలన పురుషుడు యీ విశ్వమును సృష్టించగల్గెనో దానిని ప్రకృతి యందురు ఇది బ్రహ్మము యొక్క చైతన్యాంశము, దీనినే 'చిత్' అనగా 'యెరుక' అందురు

ఈ చిత్ శక్తి తనకు తానే విశ్వముగా రూపొంది త్రిగుణముల పాలనలో నున్నది మూలశక్తి పరమాత్మ మారినట్లు కన్పించెను. అనగా పరమాత్మయే కారణభూతుడుగను కార్యముగను రూపొందెను. ద్రష్ట , ద్రష్టవ్యము రెండూ అతడే కర్త కర్మలు కూడ అతడే

త్రిగుణముల మధ్య సమన్వయము లేకపోవుటయే ప్రకృతి ఆవిర్భవించుటకు కారణము ప్రకృతి నుండి మహత్తత్త్వము ఉత్పన్నమైనది మహత్ అనగా వెలుగు పూర్వకల్పాంతమున సంభవించిన మహాప్రళయములో చీకటి అంతటను ఆవరించెను మహత్తత్త్వము చీకటిని తొలగించి వెలుగు నింపెను మహత్తత్త్వమే అహంతత్త్వముగా మారి రూపొందెను

అహం తత్త్వమనగా క్రియాశక్తి, కర్మలు చేయుశక్తినిచ్చునది అహంతత్త్వము మూడు అంశలు గలదిగా గోచరించుచున్నది

సాత్త్విక అహంతత్త్వము. దీనిని వైకారిక మందురు.
రాజస అహంతత్త్వము. దీనిని తైజసమందురు
తామస అహంతత్త్వము. దీనిని తామసమందురు.

సాత్విక అహంతత్త్వము నుండి మనస్సు పుట్టినది
రాజసిక అహంతత్త్వము నుండి ఇంద్రియములు అనగా జ్ఞానేంద్రియములు పుట్టినవి
తామసిక అహంతత్త్వము నుండి మహాభూతములు జన్మించినవి

అహంతత్త్వము ప్రధాన లక్షణములు మూడు.

కార్యము — కర్మ, తామసిక సంబంధమైనది

కర్తృత్వము — కర్మను చేయు శక్తిగలిగి యుండుట. సాత్వికాంశ సంబంధమైనది

కారణత్వము — కర్మను చేయించు కారణము, రాజసికాంశ సంబంధమైనది.

శాంతి, రౌద్రము, అవిద్య — యీ మూడును వరుసగా సాత్త్విక రాజస, తామస అహంతత్త్వము యొక్క లక్షణములు. సాత్త్విక అహంతత్త్వము చేత మనస్సు పనిచేయుచున్నది దీనికి ఆలోచించు శక్తి యున్నది దీని నుండి అవగాహన, కోరిక యనునవి పుట్టుచున్నవి

కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు రాజసిక అహంత్తత్త్వము నుండి పుట్టుచున్నవి. తామసిక అహంతత్త్వము నుండి మహాభూతములు తన్మాత్రలు పుట్టుచున్నవి

మొదటి తన్మాత్ర శబ్దము ఇది అయిదింటిలో అతి సూక్ష్మతరము. దీనితొ చెరిన మహాభూతము ఆకాశము శబ్దము ఆకాశమందు వ్యాపించును. కాబట్టి శబ్దమువలె ఆకాశము సర్వవ్యాపకము.

రెండవ తన్మాత్ర స్పర్శ. స్పర్శ జ్ఞానముతో కూడిన మహాభూతము వాయువు వాయువు కూడ సర్వవ్యాపకము స్పర్శ యందు శబ్ద లక్షణము గలదు. వాయువు శబ్దమును, స్పర్శను కూడ వ్యాపింపజేయును ఆకాశము కన్న వాయువు స్థూలమైనది

మూడవ తన్మాత్ర రూపము. ఇది రూపము ద్వారా గ్రహణశక్తి కలిగించును ఈ తన్మాత్ర (అనగా రూపము)తో కూడిన మహాభూతము అగ్ని. ఈ రూప తన్మాత్రకు మూడు లక్షణములున్నవి ఇవి శబ్ద స్పర్శ రూపములు. స్పర్శ తన్మాత్ర వాయువు కంటె అగ్ని స్థూలమైనది

నాలుగవది రసతన్మాత్ర మహాభూతమైన వారి నుండి యీ తన్మాత్ర జనించినది ఈ తన్మాత్రకు శబ్ద స్పర్శ రూపరసములను నాలుగు గుణములు కలవు. ఇది అగ్నికంటెను స్థూలము

అయిదవది, చివరి తన్మాత్ర గంధము, అనగా వాసనాశక్తి గలది ఇది మహాభూతము భూమి నుండి పుట్టినది భూమికి శబ్దస్పర్శ రూప రసగంధములను అయిదు గుణములు కలవు అన్ని తన్మాత్రల కన్న మిక్కిలి స్థూలము.

ప్రకృతిని సగుణ బ్రహ్మము అందురు శుద్ధ సత్య స్వరూపమును నిర్గుణ బ్రహ్మము అందురు పంచమహాభూతముల శక్తిని ద్రవ్యశక్తి అనియు, ఇంద్రియములకున్న శక్తిని క్రియాశక్తి అనియు, ఈశ్వరుడు అధిష్ఠానముగా నున్న ప్రకృతిశక్తిని జ్ఞానశక్తి అనియు అందురు

ప్రకృతి యీ క్రింద వివరించిన వానితో కలిసి ఆవిర్భవించినది

పంచ మహాభూతములు ·

| | | |
|---|---|---|
| పృథివి | — | భూమి |
| అప్ | — | జలము |
| తేజస్సు | — | అగ్ని, వెలుగు |
| వాయు | — | గాలి |
| ఆకాశము | — | ఆకాశము |

పంచ తన్మాత్రలు

| | | |
|---|---|---|
| గంధము | — | వాసన |
| రసము | — | రుచి |
| రూపము | — | దృష్టి |
| స్పర్శ | — | చర్మజ్ఞానము |
| శబ్దము | — | ధ్వని |

జ్ఞానేంద్రియములు

| | | |
|---|---|---|
| శ్రోత్రము | — | చెవులు |
| త్వక్కు | — | చర్మము |
| చక్షువు | — | కన్నులు |
| రసన | — | నాలుక |
| ఘ్రాణము | — | ముక్కు |

కర్మేంద్రియములు

| | | |
|---|---|---|
| వాక్కు | — | నోరు |
| పాణి | — | హస్తములు |
| పాద | — | పాదములు |
| ఉపస్థ | — | జననావయవము |
| పాయు | — | విసర్జనావయవము |

అంతఃకరణ నాలుగు రకములు. మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము

అయిదు పంచ మహాభూతములు, అయిదు తన్మాత్రలు, అయిదు కర్మేంద్రియములు, యీ ఇరువది నాలుగు కలిసి సగుణ బ్రహ్మమగును

కాలము యిరువదియైదవది కొందరు కాలమును జీవితమునకు అంతముగా పరిగణింతురు ఈశ్వర వైభవ మెరుగని అజ్ఞానులు, ప్రకృతిలో అనగా యీ భౌతిక ప్రపంచములో సతమతమగువారు, అహంకారము చేత భ్రాంతిలో పడువారు కాలమునకు భయపడెదరు కాలము మహాశక్తిమంతమైనది కాలస్వరూపమే

ఈశ్వరుడు

నిర్గుణ పరబ్రహ్మము, ప్రకృతి సృష్టికి కారకుడు అయిన ఈశ్వరుడు (కాలస్వరూపుడు) ఇరువది అయిదవది తన మాయచేత కాలుని సహాయముతో ఈశ్వరుడు సృష్టియైన ప్రతిజీవియందు ప్రతి వస్తువునందు వసించుచున్నాడు జీవులలో పురుషుడుగను, బయట కాలముగను వ్యవహరించుచున్నాడు ప్రతిజీవికి, ప్రతి వస్తువుకు ఆది అంతములు కాలము నిర్ణయించుచున్నది

అంతఃకరణ పరమోత్కృష్టమైన అంశమే మహత్తత్త్వము అనగా ప్రకాశము (వెలుగు). మహత్ నందు యెల్లపుడును పురుషుడుండును దీనిని పరమ పురుషుడుగా అనగా వాసుదేవుడుగా పూజింపవలెను భూతములన్నిటిలో వ్యాపించి యున్న వేయి శిరస్సులు గల అనంతుడు, మనస్సు, ఇంద్రియములను ష ...్వము నందు పూజింపవలెను సంకర్షణుడు అహం శుద్ధ స్వరూపమగుటచేత అతనిని పూజింపవలెను అనగా అహంకారముగా మారకముందున్న స్వరూపము

మనస్తత్త్వమనగా ఆలోచనాశక్తి భావోద్రేకములు, కోరికలు, యిష్టానిష్టములు, మానసికమైన బంధములు మున్నగువానిని ఆలోచన లందురు ఈ అంశములతో కూడిన అహంతత్త్వము అని న్నది నల్లని మేఘములు ఆవరింపక స్వచ్ఛమైన నీలి ఆకాశము వెల్లివిరియు శరదృతువు నందు పుష్పించు నీలోత్పలము వలె నల్లగా ఆకర్షణీయముగా నుండు అనిరుద్ధు నర్చించవలెను

చిత్త మనగా బుద్ధి సృష్టియైన జీవుల మేధస్సు ద్వారా యిది పనిచేయును ఇది వివేకము గలది ప్రద్యుమ్న రూపములో చిత్తము పూజలందుచున్నది మహత్తత్వ శక్తి వాసుదేవుని రూపములో పూజలందుచున్నది ఈ వాసుదేవుడే క్షేత్రజ్ఞుడు సంకర్షణుడుగా పూజలందు అహంకారమునకు అధిష్ఠానము రుద్రుడు. అనిరుద్ధుడుగా పూజలందు మనస్సుకు అధిష్ఠానము చంద్రుడు ప్రద్యుమ్నుడుగా కొలువైన చిత్తము లేక బుద్ధికి అధిష్ఠాన దేవత బ్రహ్మ

వాసుదేవుడు యీ విశ్వమునకు ప్రతినిధి యని కూడ చెప్పుదురు సంకర్షణుడు తైజసమునకు, ప్రద్యుమ్నుడు ప్రాజ్ఞతకు, ప్రతినిధులు

## 292 ఆది అవతారము — పురుషుడు

ప్రారంభమున అనేక పదార్థములతో యేర్పడిన ప్రకృతి సంపూర్ణముగా రూపొందలేకపోయెను నశింపజేయు కాలము, జనన మరణములకు కారణమైన కర్మ, సృష్టి కార్యమునకు అత్యవసరము సహజము అయిన త్రిగుణములు — ఇవి అన్నియు నుండినప్పటికిని, అవి వేర్వేరుగా నుండెను కాలము, కర్మ, త్రిగుణముల సముదాయము జడముగా యేర్పడి బ్రహ్మాండమను పేరుతో నుండెను

అనేక వేల సంవత్సరములు యీ బ్రహ్మాండము జలమందుండెను ఈ అండము పొదుగు సమయము యేతెంచునప్పటికి, ఒకదాని తర్వాత మరొకటిగా అండమునందు రంధ్రము లేర్పడెను

మొదట నోరు తెరచుకొనెను అందు వాక్కు ప్రవేశించెను వాక్కుతోబాటు దానికి అధినేత అగ్ని కూడ

ప్రవేశించెను.

తరువాత నాసికా రంధ్రములు తెరచుకొనెను అందు వాసన, వాసనా జ్ఞానమునకు అధినేత వాయువు ప్రవేశించినవి

అటు పిమ్మట నేత్రములు విప్పారెను దృశ్య జ్ఞానము, దానితోబాటు సూర్యుడు అందు ప్రవేశించెను.

తదుపరి చెవులు తెరచుకొనగా అందు శబ్ద జ్ఞానము, దిక్కులు ప్రవేశించెను

చిట్టచివర చర్మము చైతన్యవంతమై ఓషధులచే స్పర్శ జ్ఞానము కలిగి యుండెను

హస్తములు ఆవిర్భవించగా వాటికి ఇంద్రుడు బలము నందించెను

ఆవిర్భవించిన పాదములకు చలన శక్తి కలుగగా విష్ణువు అందు ప్రవేశించెను

ఏర్పడిన నరములందు నదులు ప్రవేశించెను

తరువాత ఉదరము యేర్పడినది దానితోబాటు ఆకలి దప్పిక కూడ యేర్పడినవి. అందు సముద్రము ప్రవేశించెను

హృదయ మేర్పడి అందుండి మనస్సు ఆవిర్భవించెను. చంద్రుడు మనస్సునకు అధిష్ఠాన దేవత అయ్యెను

తరువాత బుద్ధి, బుద్ధితోబాటు బ్రహ్మ ఆవిర్భవించెను

అటు పిమ్మట అహంకారము, అహంకారముతోబాటు రుద్రుడు గోచరించెను

అయినప్పటికిని, యీ దేవతా శక్తులేవియు బ్రహ్మాండమునకు జీవము పోయలేకపోయినవి. బ్రహ్మాండమంతయు ఆవరించియున్న వైరజ పురుషుడు దీర్ఘ సుషుప్తిలో నుండెను. అతనికి మెలకువ కలిగించుట సాధ్యము కాకపోయెను దేవతలందరు బ్రహ్మమును ప్రార్థించిరి.

క్షేత్రజ్ఞుడు, అనగా పురుషుడు వైరజ పురుషుని హృదయము నందు ప్రవేశించెను ఆ హృదయము నందే చిత్తము చోటు చేసుకున్నది అపుడు చైతన్యము యేర్పడగా, జలము నుండి వైరజ పురుషుడు బయటకు వచ్చెను.

## 293 వేదములు వర్ణించిన విరాట్ పురుషుడు

జలములో నిక్షిప్తముగా నున్న బ్రహ్మాండ పదార్థములలో పురుషుడు ప్రవేశించి, వేయి శిరస్సులు గల ఆదిశేషునిపై పవ్వళించి నారాయణుడుగా ప్రకాశించుచుండెను నారాయణుని నాభి నుండి ఘనమైన పద్మము ఉద్భవించెను సృష్టి కార్యమును ప్రారంభించమని ఆజ్ఞ పడసిన బ్రహ్మకు యిది స్థానమయ్యెను

విరాట్ పురుషుడు, అనగా సృష్టి గర్భములో నున్న హిరణ్యగర్భుడు, అంతటను వ్యాపించి యుండు పురుషుడు, అష్టాంగ యోగమందు ధారణ చేయు మూర్తులుగా నుండవలెను

భగవంతుని సర్వ సంపూర్ణమైన స్వరూపము విరాట్ పురుషుడు పృథివి, అప్, తేజస్సు, వాయువు, ఆకాశము, అహంతత్త్వము, మహత్తత్త్వము అనునవి యేడు కోశములు. బ్రహ్మాండము నందుండే వైరజ

పురుషుని యీ యేడు కోశములు ఆవరించి యున్నవి హిరణ్య గర్భమున వ్యాపించిన ఆత్మ అతడే పురుషుని యొక్క విశ్వరూపమును ధ్యానింపవలెను

విరాట్ పురుషుని పాదముల అడుగు భాగము పాతాళ లోకముగా యేర్పడెను.

విరాట్ పురుషుడు వేయు అడుగులు రసాతలముగను, కాలి మడమలు మహాతలముగను యేర్పడెను.

పాదములకు పైనున్న చీలమండలము (ankles) తలాతలమని వేదములు వర్ణించుచున్నవి

మోకాళ్ళు రెండును సుతలముగను, రెండు తొడలు వితల అతలములుగను యేర్పడెను.

నడుము వెనుక భాగము భూతల మనియు, విరాట్ పురుషుని నాభి ఆకాశమనియు వేదములు వర్ణించుచున్నవి

విరాట్ పురుషుని వక్ష స్థలము దేవతా హోమములకు నిలయుమైన స్వర్గము మహర్లోకము విరాట్ పురుషుని హృదయము, జనలోకము అతని వదనము

విరాట్ పురుషుని ఫాల భాగము తపోలోకమనియు, సత్యలోకము అతని అనేక శిరస్సులనియు, వేదములు చెప్పుచున్నవి. ఇంద్రుని నాయకత్వములోని దేవతలు విరాట్ పురుషుని భుజములు, దిక్కులు అతని చెవులు, అశ్వినీ దేవతలు అతని నాసికా రంధ్రములు, అగ్ని అతని నోరు అని వేదములు వర్ణించుచున్నవి

సూర్యచంద్రులతో కూడిన అంతరిక్షము విరాట్ పురుషుని నేత్రములు రాత్రి పగలు అతని కను పాపలు. కనుబొమ్మల నెత్తగా అది బ్రహ్మలోకమని చెప్పుదురు. జలము విరాట్ పురుషుని నోటిలోని అనగా అంగుడి పైభాగముగా యేర్పడెను.

పై పెదవి సిగ్గునకు, క్రింది పెదవి దురాశకు ప్రతి రూపములు

అతని వక్షస్థలమునందు ధర్మము చోటు చేసుకున్నది అతని ఉదరము సముద్రము, యెముకలు పర్వతములు.

నరములే నదులు, వృక్షములు, కేశములని వేదములు వర్ణించుచున్నవి

విరాట్ పురుషుని వేగము కాలము, శ్వాసయే వాయువు

సంసారమను యీ విశ్వము భగవంతునికి ఆట స్థలము మేఘములే విరాట్ పురుషుని జుట్టు ముడులు. సాయంకాలము అతని వస్త్రములు అతని హృదయము అవ్యక్తము, అతని మనస్సు చంద్రుడు. చిత్తము మహత్ అతని అహంకారము రుద్రుడు.

యజ్ఞము విరాట్ పురుషుని కార్యము.

సూక్ష్మముగా చెప్పవలెనన్న, మానవుని చైతన్యశక్తి స్వప్న లోకమును సృష్టించి, అందు తానే అన్ని పదార్థములుగా యేర్పడిన రీతిగా, పరమ పురుషుడైన నారాయణుడు, యీ పురుషుడు, పరమాత్మ

# ఫలశ్రుతి

''ఓం నమో భగవతే వాసుదేవాయ'' — మానవు డెదుర్కొను దుష్ట శక్తులన్నియు నశించుటకు యీ మంత్రము పఠించిన చాలును. సూర్యుని వెలుగు చీకటిని పటాపంచలు గావించునట్లు, స్వచ్ఛమైన నీలి ఆకాశమందు చేరిన దట్టమైన నల్లని మేఘములు చల్లని గాలికి చెల్లాచెదరైనట్లు, మానవుని మనస్సు నుండి అజ్ఞానము, దుఃఖము యీ మంత్ర పఠనము వలన తొలగిపోవును.

ఒక క్షణ కాలమైనను యెవరు భగవంతుని కథలను చింతింతురో, యెవరు భగవత్కథలను యితరులకు వివరించి చెప్పుచుందురో, యెవరు తరుచుగా భగవత్కథలను వినుచుందురో, అట్టివారి ఆత్మ పరిశుద్ధమగును.

ఏకాదశి నాడు గాని ద్వాదశి నాడు గాని భాగవత పురాణమును పఠించినవారు సకల పాపముల నుండి విముక్తులగుదురు.

భాగవతమును స్వయముగా భగవంతుడు, కమలోద్భవుడైన బ్రహ్మదేవునకు బోధించెను. వైరాగ్యము, భక్తి భాగవతమందలి ప్రధాన విషయములు. వేదముల సారము భాగవతము. ఇది బ్రహ్మమును చేరుటకు మార్గము. పవిత్రమైన శాస్త్ర గ్రంథములలో దీనికి సరిసమానమైనది వేరొకటి లేదు. నదులలో గంగానది వలె, దేవతలలో విష్ణువువలె, పుణ్య క్షేత్రములందు వారణాసి వలె, పవిత్ర గ్రంథము లన్నింటిలో భాగవతము పరమోత్కృష్టమైనది.

మానవుని పాప విముక్తుని గావించి పరిశుద్ధము చేయుటచేత ఇది మహా గొప్ప గ్రంథము. భక్తితో దీని నధ్యయనము చేసినవారు బాధాకరమైన సంసారమను బంధము నుండి స్వేచ్ఛను పొందగలరు.

భాగవతము మానవునికి భగవంతునిపై భక్తిని పుట్టించును. భక్తిమూలముగా వైరాగ్యముఁబడును. వైరాగ్యము జ్ఞానమునకు అనగా ఆత్మ జ్ఞానమునకు దారితీయును.

సత్యము బ్రహ్మమని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. సత్యము పరమాత్మ లేక ఈశ్వరుడని సాంఖ్యులు అందురు. సత్యమే భగవంతుడని భక్తులు భావింతురు. భాగవత పురాణమును అధ్యయనము చేసినచో సత్యము తెలుసుకొనవచ్చును. అవిద్య యను చీకటిని తొలగించి వెలుగు నిచ్చునదే సత్యము.

ఎవరిని బ్రహ్మ, వరుణ, ఇంద్ర, రుద్ర, మరుత్ దేవతలు పవిత్ర మంత్రములతో స్తుతించెదరో; వేదములు, వేదముల శాఖలు, ఉపనిషత్తుల ద్వారా యెవరిని వారు స్తుతించుచున్నారో; సామవేదులు తమ గానముతో యెవరిని కీర్తింతురో; దేవాసురులకు అలవికాని అతని నిజ స్వరూపమును, యోగులు తీవ్రమైన ధ్యానము ద్వారా మనసు నతనిపై స్థిరముగా లగ్నము చేసి గ్రహించ గలుగుచున్నారో; అట్టి మహనీయునకు నమస్కారము.

ఓం శ్రీకృష్ణార్పణమస్తు



ఖరిడేహాల్ వేంకటరావు - జన్మస్థలము విజయనగరము; విద్యాభ్యాసము మహారాజ కళాశాల, విజయనగరము; ఆంధ్ర విశ్వ విద్యాలయము, వాల్తేరు; బొంబాయి విశ్వ విద్యాలయము, బొంబాయి. మహారాజ కళాశాలలో ఉపన్యాసకునిగా ప్రారంభించి, భిలై, టాటా ఉక్కు కర్మాగారములలోను, ఎడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజి ఆఫ్ ఇండియా, హైదరాబాదులోను మధ్యమ శ్రేణి అధికార పదవులు నిర్వహించిన పిదప, సింగపూర్ జాతీయ విశ్వవిద్యాలయములో పన్నెండున్నర సంవత్సరములు, శ్రీ సత్యసాయి ఉన్నత విద్యా సంస్థ (విశ్వవిద్యాలయము)లో మూడు సంవత్సరములు ఆచార్య పదవులు నిర్వహించిరి. ప్రస్తుతం విజ్ఞాన జ్యోతి సంస్థలోని మేనేజిమెంటు ఇన్‌స్టిట్యూట్‌లో ఆచార్యునిగా పనిచేయుచున్నారు.

ఇతర రచనలు : భీష్మ గీత (విష్ణు సహస్రనామము); Sri Satya Sai Baba — The Omni All; ఆత్మబోధ.